## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా

గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్ధం మహానుభావులైన శ్రీ సప్తగిరి వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) సప్తగిరి వెబ్ సైట్: https://www.scribd.com/search?query=sapthagiri
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

సప్తగిరి వారి వెబ్ సైట్

https://www.scribd.com/search?query=sapthagiri



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014



శరణాగత త్రాణ బిరుదు నీదై యుండ
నన్యుల శరణని యనఁగనేల?
భక్తులపాలి కల్ప ద్రుమం బీవయై
విహరింప నన్యుల వేఁడనేల?
పాపఘ్ని గంగ మీపాద పద్మంబున
విలసిల్ల తీర్థముల్ వెదకనేల?
పరగ లోకములకుఁ బ్రభువ వీవై యుండ
నిల మానవులఁ జేరి కొలువనేల?

నిన్నె నెఱనమ్మి యున్నట్టి నేర్పులకు
కొదవ లేమైనఁగలవె సంపదలెకాక
శేష శైలాగ్రవాస లక్ష్మినివాస
పంకజాత భవాండేశః వేంకటేశః

# మీ మాట

## ముఖచిత్రం

ఎన్నిమార్లు చూసినా తనివితీరని ఏడు కొండలస్వామి దివ్యరూపంతో ప్రతినెలా ముఖచిత్రం వెలువడితేనే సప్తగిరి పత్రిక పేరు సార్థకమవుతుంది. ఇకమీదట ఇది వరలోవలె శ్రీ నివాసుడి ముఖచిత్రంతోనే సప్తగిరి వెలువడుతుందని ఆశిస్తాను.

వి. ఆర్. వసంత, — హైదరాబాదు.

## శ్రీవారి మాహాత్మ్యాలు

సప్తగిరి పత్రికను బాగా తీర్చి దిద్దుతున్నారు. శ్రీ వేంకటేశ్వరస్వామి మాహాత్మ్యాలు పత్రికలో ప్రకటించవలసిందిగా కోరుతున్నాను.

డి. శ్యామ్‌సుందర్‌రెడ్డి, — హైదరాబాదు.

శ్రీ వేంకటేశ్వరస్వామివారి మహిమలు తెలిపే చిన్నచిన్న అనుభవాలు పాఠకుల నుండి ఆహ్వానించి ప్రచురించండి.

ఎల్. పి. చంద్ర, — ధర్మవరం.

[భక్తులు తమ యదార్థ అనుభవాలను క్లుప్తంగా వ్రాసి పంపవలసిందిగా కోరుతున్నాము. సం॥]

## శుభాకాంక్షలు

నవంబరు సప్తగిరి సంచికలో ప్రచురితమైన మహావిష్ణుప్రతిమలు, భక్తి ప్రేమ స్వరూపిణి అరుణాచలక్షేత్రము మున్నగు రచనలు చదువుతుంటే భక్తిపారవశ్యంలో మమ్ములేమే మరచిపోయాము. ముఖ్యంగా శ్రీ ఎం. లక్ష్మణాచార్యులవారి "ఆత్మోద్ధరణ" మమ్మెంతో ఆకర్షించింది. ఇంతమంచి విజ్ఞానదాయకమైన విషయాలను అందిస్తున్న మీకు మా నూతన సంవత్సర శుభాకాంక్షలు'

ఏ. రామగోపాల్‌రావు, బి. సత్తయ్య, — కొడిమ్యాల.

* మీ అభిమానానికి కృతజ్ఞులం. సం॥

## సంపాదకీయం

నవంబర్ సంపాదకీయంలో తాము వ్రాసిన 'నిజానికి ఉనికిమనికి జ్ఞప్తికి వచ్చేది మరణం తర్వాతనే' అనే వాక్యానికి ప్రశాంతంగా కూచుని తనకుతానే ఏకాంతంగా భాష్యం చెప్పుకొంటూపోతే ఎన్నో గంటలు ఇట్టే దొర్లిపోతాయి. ఈ వాక్యాన్ని ఎన్నో పురాణాలు, ఉపనిత్తులు ముఖ్యంగా భగవద్గీతతో బేరీజు వేసుకొంటూపోతే వేదాంత జిజ్ఞాసువులైనవారు తమ ఓపిక కొద్ది జ్ఞానాన్ని మథించుకొని తమను తాము పునీతం చేసుకోవచ్చు వేదాంతపరమైన తమ సంపాదకీయం ఎందరినో ప్రభావితం చేస్తుందనడంలో ఆశ్చర్యంలేదు.

బి. శ్రీనివాసులుశ్రేష్ఠి, — సికింద్రాబాదు.

## నూతన సంవత్సర కానుక !

శ్రీ వేంకటేశ్వరస్వామివారి భక్తులకు అత్యంత ప్రియమైన ప్రసాదం - శ్రీవారి లడ్డు ధరను రు. 3-50 నుండి రు. 3-00 లకు తగ్గించారు. 1982 డిసెంబర్ 31వ తేది అర్ధరాత్రి నుండి ఈ తగ్గింపు అమలులోకి వచ్చింది. దీనితోబాటు రు. 15-00 లకు అమ్ముతుండిన పెద్దలడ్డు ధర కూడా రు. 12-00 లకు తగ్గించారు. ఇకమీదట రు. 2-50 లకు, రు. 4-50 లకు విక్రయించే రెండురకాల వడలకు బదులుగా ఒకేరకం వడను రు. 3-00 లకు విక్రయిస్తారు. శ్రీవారి భక్తులకు నూతన సంవత్సర కానుకగా దేవస్థానం ఈ చర్య తీసుకొంది.

## షిర్డీసాయిబాబా

నవంబర్ 1982 సప్తగిరిలో ప్రచురించిన 'మహావిష్ణువుకు మంగళాశాసనం' నాకెంతగానో నచ్చింది. భగవంతుడు తన భక్తులపై చూపే కరుణ అపారముకదా! రచయిత శ్రీ సి. ఎన్. కృష్ణమూర్తికి నా అభినందనలు. సప్తగిరిలో శ్రీ షిరిడీసాయిబాబా గురించిన రచన ఎప్పుడూ ప్రచురించినట్లులేదు. దయచేసి ప్రచురింప ప్రార్థన

కురుగంటి హైమవతీదేవి, — గుంటూరు.

* అలాగే. త్వరలో ప్రచురిస్తాము. సం॥

సప్తగిరి పాఠకులకు, రచయితలకు, ఏజెంట్లకు అందరికీ

**మా సంక్రాంతి శుభాకాంక్షలు**

## సుప్రభాతం

అనాదిగా వస్తున్న సంస్కృత సుప్రభాతానికి బదులుగా తమిళ భక్తురాలు ఆండాళ్ గానంచేసిన తిరుప్పావైని శ్రీవారి ఆలయంలో ఇకపై వినిపిస్తారని పత్రికలలో చదివి చాలా బాధపడినాము. ఈ విధంగా చేయటం పూర్వం ఎన్నడూ జరగలేదు. ఇలా చేయటం శ్రీవారి భక్తులందరికీ బాధాకరమే. కనుక సుప్రభాతాన్ని సంస్కృతంలోనే వినిపించప్రార్థన.

ఏలూరి శ్రీకృష్ణమూర్తి, — చీరాల.

* ధనుర్మాసంలో సంస్కృత సుప్రభాతానికి బదులుగా ఆండాళ్ తిరుప్పావైని గానం చేయటం అనాదిగావస్తున్న ఆలయాచారం. మిగతా మాసాలలో సంస్కృత సుప్రభాతమే గానం చేయబడుతుంది. సం॥

## ఎదురుచూపులు

సప్తగిరి మాసపత్రికకు నెలనెలా ప్రజాదరణ పెరుగుతోంది. కానీ పత్రిక చాలా ఆలస్యంగా అందటంవల్ల మాలాంటి పత్రికా ఏజెంట్లు పాఠకులకు నచ్చచెప్పటానికి చాలా శ్రమపడవలసివస్తున్నది. కనుక పత్రిక ప్రతినెలా 10వ తేదీనాటికి ఏజెంట్లకు అందేలా చూస్తారని ఆశిస్తున్నాను.

నల్లవెల్లి అంజయ్య, సప్తగిరి ఏజంట్, — ఇరుకోడు.

*

---

**రెండవ అట్ట దృశ్యం :**

జనవరి 24 నుండి 28 వరకు జరుగనున్న తిరుపతి శ్రీ గోవిందరాజస్వామివారి తెప్పోత్సవం.

**మూడవ అట్ట చిత్రాలు :**

ఫిబ్రవరి 4 నుండి 12 వరకు శ్రీనివాస మంగాపురంలో జరిగే బ్రహ్మోత్సవం.




గౌరవసంపాదకులు :

**శ్రీ జి. కుమారస్వామిరెడ్డి,**
ఐ. ఏ. ఎస్.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

ప్రచురణకర్త - సంపాదకుడు :

**కాట్రపాటి సుబ్బారావు,**
ఎమ్. ఎ.

ఉపసంపాదకుడు :

**తిరుమూరు సుధాకర్ రెడ్డి,**
ఎమ్. ఎ. బి. ఇడి.

ముద్రాపకుడు :

**ఎమ్. విజయకుమార్ రెడ్డి.**

**విడిప్రతి-రు. 1-00**

**సం॥ చందా-రు. 12-00**

ప్రతులకు :

**వెల్ ఫేర్ ఆఫీసర్,**
టి. టి. డి., తిరుపతి.

# ఈ సంచికలో....

**జనవరి 1983**

సంపుటి 13 సంచిక 8





ముఖచిత్రం: సంక్రాంతి సుందరి    చిత్రకారుడు: శ్రీ మారేమండ శ్రీనివాసరావు, శ్రీశైలం.

# సంపాదకీయము

మకరసంక్రమణం వచ్చింది. మనుషులలో మనసులలో సందడి హెచ్చింది. పర్వం పరమార్థం ఎలావున్నా సంక్రాంతి అంటే కనపడేది చలిమంటలు, [illegible], వీధి గొబ్బెమ్మలు, కొత్తఅల్లుళ్ళకు కొలువులు, కోడిపందాలు, ఇంటింటముగ్గులు, ఇంపైన భోజనాలు, ఒకటేమిటి అనేక ప్రత్యేకం.

నిజానికి పండుగ ఏమిటా అని ఆలోచిస్తే ఆలోచనల వేలల్లో కొత్తపంట కావాల్సినంత లభిస్తుంది. సంక్రమణం అంటే ఒకస్థితిని దాటి మరొకస్థితికి ముందుకు పోవటం. గతివేగం, కాలభేదం తప్ప రాశిచక్రంలో నవగ్రహాలన్నిటికీ ఈ సంక్రమణం వున్నది. మరి ఈ రవి సంక్రమణానికే ఎందుకింత కోలాహలం? పోనీ సూర్యుడు ప్రతినెలా ఒకరాశి మారుతూవున్నాడు గదా? కేవలం ఈ మకర, కర్కాటక సంక్రమణాలే ఎందుకు మన్నన వచ్చినట్లు?

మనం కొలిచే దేవుళ్ళందరూ కనరానివాళ్ళు. కనపడకుండా తమబలం చూపించేవాళ్ళు. కాని సూర్యచంద్రులు మాత్రం కంటికి కావల్సినంత విందుగా కన్పిస్తూ తమ గతుల భేదాలవల్ల మన 'గతు' లలో మార్పు తీసుకవస్తుంటారు. ఖగోళశాస్త్ర రీత్యా చంద్రగ్రహం స్వయంప్రకాశం కాదన్నమాటవున్నా, సూర్యునికావాదులేదు. ఆతడు పగలు స్వయంప్రకాశకుడు, రాత్రులలో కిరణపరావర్తన ద్వారా పరోక్షరక్షపడౌతున్నాడు. అతని కిరణాలవల్లనే దేహులకు ఆరోగ్యం కలుగుతున్నది. జీవులలో చైతన్యం వెల్లివిరుస్తున్నది. సూర్యగతులవల్లనే ఋతుధర్మాలేర్పడుతున్నవి. రవిరశ్మిలేని ప్రాంతంలో పెరుగుదల తక్కువగానే వుంటుంది. అందువల్లనే జ్యోతిశ్శాస్త్రం కూడా రవిని ఆత్మకారకుడుగా, శనిని ఆయుష్కారకుడుగా పేర్కొంటున్నది. జాతక బలాలకు ఎక్కువగా రవిచారమే ఆధారం. అందువల్ల రవి జగత్స్రష్ట, జగద్భర్తకూడా.

నిజానికి మనం చాంద్రమానాన్నే అనుసరిస్తున్నా, ఆధ్యాత్మికంగా మకరంనుండి మకరందాకా జరిగే సూర్యసంక్రమణాన్ని ఒకసంవత్సరంగా, కర్కాటకసంక్రమణం తదర్ధభాగంగా ఏనాడన్నా పరిగణించివుంటారేమో అనిపిస్తున్నది. ఈ భావన నిజమైతే అది ఈనాటి ఆంగ్ల పరిగణనానికి చాలా సన్నిహితమని తోస్తున్నది. నిజానికి ధనురంతం చలిమలికి, మంటలవేడికి నడిమి మలి వెచ్చనికాలం. వసంతశోభ తెలిసినా, తెలియకపోయినా, గ్రీష్మారంభంమాత్రం వసంతమధ్యంలోనే అనుభవానికి వస్తుంది. సిరి నట్టింట చిందులువేసే కాలంకూడా ఇదే. ఇది ఏనాడన్నా సంవత్సరాదిగా వుందేమో అనుకున్నా ఆశ్చర్యం లేదు.

ఇక వైదిక వాఙ్మయం సూర్యుణ్ణి నారాయణుని నేత్రరూపంగానూ, చంద్రుణ్ణి చంద్రమా మనసో జాతః అని వర్ణించింది. ఈ రెండూకూడా ఆ యా వస్తువుల ధర్మాలకు అనుగుణంగానే వున్నవనవచ్చు. ఉపనిషత్తులు, పునస్సృష్టి సంకల్పించిన ప్రజాపతి మొట్టమొదటగా ఆదిత్య, రయులను దివారాత్రభావనగా సృష్టించాడని, ఆదిత్యరూపమే పురుషరూపమని. 'రయి' స్త్రీరూపమనీ అంటున్నవి. ఈ రూపంగా చూచినా పదునాల్గు భువనాలకు కర్త శ్రీమన్నారాయణుడైనప్పుడు ఈ విశాల పురుషస్వరూపుడు సూర్యుడు కావటంలో సందేహంలేదు. పైగా పురాణ వాఙ్మయమంతా

'సవితృమండల మధ్యవర్తీ'

ధ్యేయో నారాయణస్సదా' అని ఆదిత్య మండలాంతస్థిత నారాయణోపాసనను వ్యక్తంచేస్తున్నది. అందుకేనేమో బహుశః సూర్యునకు నారాయణత్వంకలిగి సూర్యనారాయణుడుకావటం. కనుక రవికి నరలోకంచేసే నమస్కారం నారాయణునకే చెందుతుంది. అందువల్లనే మకరసంక్రమణంనుండి ఉత్తరాయణకాలమంతా పారమార్థిక ప్రయోజనాలకు ముఖ్యమనీ, ఐహిక ప్రయోజనాలకు దక్షిణాయనం శ్రేష్ఠమనీ పెద్దలవాక్కు. అసలువిషయం మరచి మనం పండుగచేసుకుంటున్నా అంతరార్థంమాత్రం అంతే.

తార్కికంగా గొప్పసందేశం మనపండుగలలోవుంది. సూర్యయానానికి సంబంధించిన కర్కాటక మకరాలు రెండూ ఉభయ చరాలకు సంబంధించినవి, పంచనాశీలం కలవి కావటం గమనించదగ్గది. రవిమకరగతుడైనా, ఋతుశాసకుడు గనుక ప్రమాదంలేదు

కాని, పంచభూతాలు సార్వజనీనాలనీ, సార్వకాలికాలనీ తెలిసికూడా, ధన, బల, అధికారగర్వాలు వర్గ, వర్ణ వ్యత్యాసాలనే మకర బలానికిలోనై తనమతాముద్ధరించుకొనక, సంసారకాసారంలో నరుడు చిక్కునడినంతకాలం, జ్ఞానభాస్కరునకు నిత్య మకరసంక్రమణమే. దానిని దాటగలిగినవానికే ఇంపైన ఇహం, పరమపదము సిద్ధిస్తాయి.

**తేజస్వినావధీతమస్తు మా విద్విషావహై.**

# రథసప్తమి

శ్రీ జి. సుందర్

హైందవులకున్న ముఖ్యమైన పండుగలలో "రథసప్తమి" కూడా ఒకటి. ఇది మాఘ శుద్ధ సప్తమినాడు వస్తుంది. ఆనాడు సూర్యోదయ సమయంలో ఆకాశంలో గ్రహ నక్షత్రాల సన్నివేశం రథం ఆకారంలో వుంటుందిట. అందువల్లనే దీనికి "రథ సప్తమి" అనే పేరు వచ్చింది. సూర్యుణ్ణి ఆరాధించే పండుగగా ప్రసిద్ధి పొందినది. సూర్యగ్రహణముతో సమానమైనదనికూడా అంటారు.

"సూర్యగ్రహణ తుల్యాసా
శుక్లా మాఘస్య సప్తమీ
అరుణోదయ వేళాయాం
స్నానం తత్ర మహాఫలమ్."

అని చెప్పడం వలన మనకు ఈ విషయం తెలియుచున్నది.

భారతీయులకు సూర్యభగవానుడు ప్రత్యక్షదైవం. ఆదిత్యుడు ఉదయించే తూర్పు దిక్కు మనకు పరమపవిత్రమైనది. దేవాలయాలలో కూడా మూలవిగ్రహాలు తూర్పువైపు చూచేటట్లు ప్రతిష్ఠింపబడి వుండటం తూర్పుదిశకుగల ప్రాముఖ్యతను చాటి చెపుతుంది. ఉదయం స్నానానంతరం సూర్యునికి అర్ఘ్య ప్రదానం చేయడం మన భారతీయుల సంప్రదాయం. సూర్యునికి చేయెత్తి నమస్కరించనిదే కొందరు పచ్చి గంగయినా ముట్టరు.

పూర్వకాలం నుండి సూర్యోపాసన ఒక గొప్ప ఆచారముగా వున్నది. పరబ్రహ్మ స్వరూపుడైన సూర్యుని నిత్యం పూజిస్తే సకల రోగాలు నివారింపబడి, ఆయురారోగ్యైశ్వర్యాలు సిద్ధించునని మన పూర్వీకుల నుండి ఇప్పటివరకు ఒక దృఢ విశ్వాసం మన ప్రజలలో వున్నది. పైగా ఉదయిస్తున్న సూర్యుని కిరణాలు శరీరంపై పడితే ఆరోగ్యానికి మంచిదనే విషయాన్ని నవీనులుకూడ అంగీకరించారు. అసలు సూర్యరశ్మిలోనే రోగనిరోధకత, శరీరావసర పదార్థ సంధాయకత వున్నాయని శాస్త్రజ్ఞులు ప్రయోగపూర్వకముగా కనుగొన్న విషయము. బహుశా ఈ కారణాలవలననే సూర్యారాధన అనేది వేదకాలంనుంచి మన పూర్వీకులు ఏర్పాటుచేసి ఆచరించి వుండవచ్చును. అందుకే సూర్యుడు మనకు ఇష్టవేలుపు.

అయితే మనకు ఇంతమంది దేవతలుండగా సూర్యునికి మనం ప్రత్యేకస్థానం ఇవ్వడానికి అనేక కారణాలు చెప్పుకోవచ్చును. పూర్వం మనిషికి ప్రపంచం అంతా కొత్తగా వింతగా వుండేది. మనుషులు పుట్టటం, పెరగటం, మొక్కలు మొలకెత్తటము చిగురించడము, వెలుతురు రావటము, సాయంత్రమయ్యేసరికి చీకటి ఆవరించటము, సూర్యుడు మాయం కావడము మున్నగునవి ఆదిలో మానవునికి వింతగా తోచేవి. కాలక్రమేణా సృష్టిలో రహస్యాలను, ప్రకృతి ఒసగిన వరాలనుగూర్చి తెలుసుకున్నాడు. సూర్యునివలననే వెలుతురు వస్తోందనీ, వర్షాలు పడుతున్నాయనీ అందు మూలంగానే పంటలు పండుతున్నాయనీ గ్రహించారు. కాబట్టి మానవుని మనుగడకు ఆధారం సూర్యదేవుడేనని తెలుసుకున్నారు. అప్పట్నుంచి సూర్యుణ్ణి దేవుడుగా భావించి, ఆరాధించడం ప్రారంభించారు. తక్కిన దేవుళ్లు కనిపించక పోయినా సూర్యుడు దూరంగా వుండి కనిపిస్తాడు కనుక సూర్యుడే ప్రత్యక్షదైవం అని భావించారు. తత్కారణంగా సూర్యారాధన, సూర్యోపాసన ప్రారంభమైనవి.



అప్పటినుంచి [illegible] అదొక ఆచారంగా సంక్రమించింది.

ఉత్తరాయణం మకర సంక్రాంతినుండి ప్రారంభమైనప్పటికీ సూర్యుడు ఉత్తర దిక్కుగా పయనం రథసప్తమి నుండే కనిపిస్తుంది. సూర్యుని రథం ఉత్తరదిశగా ఆనాడే బయలుదేరుతుందనికూడా కొందరి అభిప్రాయం. ఒకప్పుడు ఉత్తరాయణం రథసప్తమినుండే ప్రారంభమై వుండవచ్చునని చెప్పటానికి ఆధారాలు లేకపోలేదు.

"ఏకే విశ్వమిదం చక్రం
కృత్వా సంవత్సరాత్మకమ్
ఛందాంస్యశ్వాః సప్తయుక్తాః
[illegible] సప్తైవ [illegible]"

అని సూర్యసిద్ధాంతంలో చెప్పబడి వున్నది. దీనినిబట్టి సమస్త ప్రపంచమూ ఒక రథమని వర్ణించినట్లు, ఆ రథానికి ఒకటే చక్రం వుంటుందని అర్థం. ఆ చక్రానికి ఆరు ఆకులు వుంటాయని, ఆ రథమునకు ఏడు గుర్రాలు వుంటాయంటారు. దీనిని పెద్దలు ఇలా ఊహించారు — ప్రపంచమనే రథానికి కట్టబడిన ఒకే చక్రం అంటే ఒక సంవత్సరమనీ, ఆ చక్రానికి ఆరు ఆకులు అంటే సంవత్సరం ఆరు ఋతువుల సముదాయం గనుక, అవే ఆ ఆరుఆకులనీ, సూర్యకిరణంలో ఏడు రంగులుంటాయి గనుక ఏడు గుర్రాలూ ఆ రంగులకు చిహ్నాలనీ పెద్దలు ఒక రూపం కల్పించారు. ఏడురంగులున్నవి కనుకనే సప్తమినాడు సూర్యారాధన చేయాలన్న నియమం ఏర్పడింది. అందుచేత సప్తమి తిథి సూర్యుడి పరంగా పర్వదినంగా లెక్కింపబడింది. వీటిలో "రథసప్తమి"కి ప్రాధాన్యత ఎక్కువ. ఈ రథసప్తమి మాఘమాసంలో వస్తుంది. మాఘమాసం అంతా కూడా సూర్యుడికి విశేషమైన మాసమే. మాఘమాసంలో వచ్చే ఆదివారములలో విధిగా మనం సూర్యుడికి పూజలు చేస్తాము. ఆదివారం సూర్యుని దినం. అందుకే ఆ రోజును "భానువారం" అని కూడా వ్యవహరిస్తుంటారు.

ఈ రథసప్తమినాడు సూర్యకాంతి ఎక్కువవుతుంది. చలి, చీకటి తగ్గిపోతుంది. రథసప్తమినుండి సూర్యుడి గమనం మారుతుంది.

"చలి ప్రవేశించు నాగుల చవితినాడు
మెరయు వేసవి రథసప్తమి దినమున

అని కవి సార్వభౌముడు శ్రీనాథుడు చెప్పి నట్లుగా నాగులచవితినాడు చలివస్తుంది, రథసప్తమి నుండి వేసవి ప్రారంభమౌతుంది రథసప్తమినాడు సూర్యోదయంతో స్నానం చేస్తే గొప్ప ఫలదాయకమనీ పురాణాలలో చెప్పబడివున్నది. కొందరు షష్ఠినాడు పూర్తిగా ఉపవాసం చేసి సూర్యుడిని ఆరాధిస్తారు. అలా చేస్తే రోగనాశనం జరుగుతుంది.

రథసప్తమి ఒక ఉత్తమమైన వ్రతం. దీనికి ఒక పద్ధతి ఉంది. షష్ఠినాడు తెల్ల నువ్వుల పిండితో నలుగు పెట్టుకుని స్నానం చేసి సూర్యుణ్ణి ఆరాధించాలి. అతిథులకూ, బంధుమిత్రులకూ భోజనం పెట్టి తాను తైల రహితంగా భోజనం చేయాలి. ఆ రాత్రికి ఉపవాసం వుండాలి. సప్తమినాడు చీకటితోనే లేచి కాలకృత్యాలు తీర్చుకుని లోహ ప్రమిదలో దీపంపెట్టి దాన్ని తలపై వుంచుకుని నది దగ్గరకుగానీ చెరువు దగ్గరకుగానీ వెళ్లాలి. తర్వాత ఆ దీపపు ప్రమిదను నీటిలో విడిచిపెట్టి ప్రభాతానికి ముందుగానే స్నానం చెయ్యాలి. ఇంటికివచ్చి సూర్యవిగ్రహాన్ని రథములోవుంచి పూజించి నానావిధఫలాలను నైవేద్యం పెట్టాలి. ఆ నాటి రాత్రి జాగరణ చేసి, మరునాడు అంటే అష్టమినాడు స్నానానంతరం బ్రాహ్మణులకు దానధర్మాలు చేసి సూర్యరథాన్ని రక్తవస్త్రాలతో సహా గురువులకు దానమివ్వాలి. ఇలా, చేస్తే సూర్యదేవుని అనుగ్రహంవల్ల కుమారుడు మహాతేజస్వియై, సమస్త భోగాలను అనుభవించి ఉత్తమగతిని పొందుతాడు.

ప్రస్తుతపు రోజుల్లో రథసప్తమినాడు తలపైన జిల్లేడాకు, దానిపై బియ్యము, రేగుపండ్లు పెట్టుకుని స్నానం చేస్తారు. తులసికోట దగ్గర పిడకల తంపిలో పాలలోనే బియ్యాన్ని వుడికించి పాయసం చేస్తారు. పుల్లలతో రథాన్ని తయారుచేసి అందులో సూర్యుణ్ణి పూజించి ఆ పాయసం నైవేద్యం పెట్టి ఆరగిస్తారు. దక్షుని యజ్ఞ సమయంలో సూర్యుడికి దంతాలు ఊడిపోయినందువలన పాయసం, పండ్లు తప్ప నైవేద్యానికి ఇంకేమీ పనికిరావంటారు. ఏది ఏమైనా మన పండుగలలో ఒక ప్రత్యేకతను సంతరించుకున్న పండుగ–"రథసప్తమి".

*

# చింతన

* * *

దుష్టునికి దూరంగా ఉండాలన్నారు పెద్దలు. అంతకంటే మార్గంలేదనే అని వుంటారు. వారితో సఖ్యం చేసినా కష్టమే. విరోధం పెట్టుకున్నా గొడవే.

ఏవో కొన్ని నీతులకూ, నియమాలకూ కట్టుబడివున్నప్పుడే సహజీవనం సుఖప్రదంగా వుంటుంది.

కేవలం స్వైరవిహారం చేసేవారికి ఏ సంస్కారం వుండదు. ఉండాలనివారు కోరనూకోరరు

ఎదిరి మనసును నొప్పించడం ఎందుకూ అనికూడా వారికి తోచదు. పైగా ఒకరిని బాధించడంలోనే వారు సంతృప్తి చెందుతారు. వారివల్ల లాభం లేదు. వారి మనస్తత్వమే అంత. ఎప్పుడూ ఎవరిని వేధించడమా అని చూచేవారికి మీరు చెప్పేహితవు కేవలం నవ్వులాటగా వుంటుంది. వారికోసం వృథా కంఠశోషకు పాల్పడడంకన్నా పెదవి మెదపకుండా ఉండడమే మంచిది.

ఇది తెలిమంచి సజ్జనులు అనుసరిస్తున్న పద్ధతి. ఎందుకూ అంటే అనుభవ పూర్వకంగానే వారు ఆ బాటనే ఎన్నుకున్నారు.

మరి ఇలా ప్రతివారూ అనుకుంటే ఇక దుర్మార్గాన్ని నిరోధించడ మెలాగా? ఎప్పుడో ఒకచోట ఎవరో ఒకరు ఎదిరిస్తేతప్ప, ఇలాటివారి ఆటకట్టడం ఎలా సంభవం?

ఇదంతా ఆలోచించే ఓపికలేక, దారినిపోయే పీడను తమ మీదకు మళ్ళించుకోవడం ఎందుకనీ చాలామంది తమ్మతాము దుర్మార్గం బారినుంచి తప్పించుకోవాలని మాత్రమే చూస్తారు.

ఇదేదో మారాలి!

చెడును ఎదుర్కొనడం మన విధి! అది నలుగురూ అనుకుంటే తప్ప, దానిని ఆపడానికి మరొకమార్గం లేదు.

తప్పును తప్పంటే కొన్ని కష్టాలు తప్పవు. ఆ మాట నిజమే. కానీ ఎవరో ఒకరు ఆ మాట అనకపోతే అది కొన్నాళ్ళకు ఒప్పై కూర్చుంటుంది.

సమాజంలో మన బాధ్యత దుష్టనివారణలో ఉన్నదని భావిస్తేతప్ప, ప్రయోజనం లేదు.

— విశ్వం

# శ్రీనివాసకల్యాణము

నమోస్తు శ్రీనివాసాయ శేషశైల విహారిణే
వందారు సురబృందాయ భక్తాభీష్టప్రదాయినే

(నాటరాగం రూపక తాళం)

నాలుకపై నిలువరావె నలువరాణీ శుకపాణీ
ఏలికపై నిగమాగమ జాలములకు ప్రణవపీఠి
నోలగముండేటి తల్లిపాలింపవె కృపావల్లి ॥ నాలుక ॥

అని యిష్టదేవతా ప్రార్థనం బొనర్చి............

సూత్రధారుడు: ఎవరయ్యా భాగవతులు! ఏమిటి విశేషం?

కథకుడు: భాగవతులంటూ పెద్దపేరు పెట్టకండి బాబయ్యా, మాది విజయవాడ, ఆకాశవాణి సామాజికులం. శ్రీ వేంకటేశ్వరస్వామికి కైంకర్యంగా శ్రీనివాసకల్యాణం అనే యక్షగానం వినికి చేస్తున్నాం.

సూత్ర: బాగుంది కాని, గ్రంథకర్త పేరు చెప్పావుకావు.

కథక: కాటూరి వేంకటేశ్వరరావు గారని........

సూత్ర: అలాగా! వేంకటేశ్వర కల్యాణమూ, వేంకటేశ్వర రచనమూనా! సరే, కానీండి. విందాము.

కథక: అని యిష్టదేవతా ప్రార్థనం బొనర్చి, సాక్షాద్వైకుంఠుడైన కేశవదేవుండు శేషాచలమ్ముపై నవతరించిన కథాక్రమంబెటువలెను....

(ద్విపద)

అజుడాది కల్పమ్మునందు విశ్వమ్ము
సృజియించి, ఒక పవల్ చెల్లిన యంత
నిదురగూరిన వేళ నీరధుల్ పొంగె
చదల పన్నిద్దరై సవిత వెలింగె
ప్రళయ మేఘములంబరమ్మున దోచె
చలపట్టి ఏడుగాడ్పులు వెసవీచె
ఏ కార్ణవమ్ములో నీధాత్రి యపుడు
తేకువసెడి మున్గి దెసమాలియున్న;
కనకాక్షుడనెడి రక్కసుడు భూదేవి
గొనిపోయి పాతాళమున విహరింప,
హరి వరాహాకృతి ధరియించి, దనుజు
హరియించి, కోరకొన ధరణిగొనితెచ్చె,
భూకాంతపై ప్రీతిబూని శ్రీశుండు
వైకుంఠమున కేగువాంఛ విడనాడి,
అటనున్న క్రీడాద్రి నవనికి దేర
పటు సత్త్వుడగు ఖగపతి కాజ్ఞయిచ్చె.

సూత్ర: ఎలాగూ! వైకుంఠంలో ఉన్న పర్వతాన్నే పెకలించి తెమ్మన్నారా భూవరాహస్వామి వారు?

కథక: అహా!

(కందార్థం)

అంతట గరుడాళ్వారు ల
నంతజవమ్మున వికుంఠమందలి గిరి వి
క్రాంతి బెకలించి నిజబా
హాంతరమున దాల్చితెచ్చె నంబరవీథి.



ఆదిగని అమరు లిక్కజమందీ
పదువులై బళిబళిర బంగరు
నగముపై నీలాద్రియని వెను
దగిలి కనుగొన తాల్చి తెచ్చె నంబరవీధి!

సూత్ర: ఏమిచిత్రమంటేనూ!

కథక: పుష్కరిణితోకూడా క్రీడాద్రిని గరుడాళ్వారులు ఇలా
పెకలించేసరికి—



సీ. చెలులతో జలకేళి సలుపు రమాదేవి
తత్తరమ్మున సరస్తటము జేరి
బంగారు వలువల చెంగులు జీరాడ
నంబరమ్మున కలహంస లట్టు
లెగురగా, గతివేగవిగళత్సరోజషం
డముజాసి అళిసమూహములు సలుపు
నులివు పక్షక్షేపముల తాళగతిగూడి
సంగీత వీణలు సవదరింప
కనకకమలపరాగ సంక్రాంతి భూన
భోంతరమ్ములు పటికార్చినట్టి పైడి
నిగ్గుల వెలుంగ, బుష్కరిణీ సమేత
మైన క్రీడాద్రి తెచ్చె విహంగపతియు.

ఇట్లు తెచ్చిన క్రీడాద్రి నా భూవరాహదేవుండు శేషాచలమ్ముపై విడియంజేసి, అందున్న పుష్కరిణికి పశ్చిమ తటంబున విశాలమంటపోపేతంబైన దివ్యాలయంబు వసతిగా, తన్ను జేరవచ్చిన శ్రీ నీళాదేవులంగూడి, దంష్ట్రాగ్ర ధృత వసుంధరాసమేతుండై, సుఖంబుండె. ఆ గిరి వారాహగిరి యనియు, గరుడుండు కొనితెచ్చిన కారణంబున గరుడాద్రి యనియు ఇట్లనేక కారణంబుల ననేక నామంబులు ధరించియుండు--

సూత్ర: ఇకనేం-వరాహదేవుని కోనేరు గనుక వారాహపుష్కరిణి అనే పేరువచ్చింది.

కథక: ఆ వారాహపుష్కరిణి కలికలుషహరంబై విరజానదీ తుల్యంబైయుండు—

సూత్ర: బాగుంది కాని-శ్రీనివాస వృత్తాంతం చెపుతానని మొదలుపెట్టి భూవరాహస్వామి కథ చెప్పేవు. అంతేనా!

కథక: ఇదిగో, అదీ మనవిచేస్తాను కాదూ! ఆ భూవరాహదేవుండు—

సీ. వారాహ పుష్కరిణీ తీరకా
ననభూములన్ ధరావనజనేత్ర
గవ గూడికొని, యిష్ట కామోపభోగకే
ళీ వినోదమ్ములతో విహార
పరవశుడై పెక్కువత్సరమ్ములు పెను
మక్కువం గడుపుచు నక్కుధరము
విడలేక యందుండి, విధి ముఖామరగణ
పూజలందుచు, దానవులను వెదకి

వేటలాడి, తున్మితూటాడి, జగము ని
ష్కంటకమ్ము సలుపు సమయమందు
వృషభ దనుజు సంహరించెడి పనిబూని
అరిగె నెటకొ భూమి ధరము దొరగి.

(41 వ పేజిలో)




# ప్రశ్నోపనిషత్తు

## ప్రథమ ప్రశ్నము

సుకేశా చ భారద్వాజః శైబ్యశ్చ సత్యకామః
సౌర్యాయణీ చ గార్గ్యః కౌసల్యశ్చాశ్వలాయనో
భార్గవో వైదర్భిః కబంధీకాత్యాయనః
తే హైతే బ్రహ్మపరా బ్రహ్మనిష్ఠాః
పరంబ్రహ్మాన్వేషమాణా ఏష హ వై తత్సర్వం
వక్ష్యతీతి తే హ సమిత్పాణయో భగవంతం
పిప్పలాద ముపసన్నాః.

భరద్వాజుని కొడుకు సుకేశుడు, శిబి కొడుకు సత్యకాముడు, సౌర్యుని సుతుడు గార్గ్యుడు, అశ్వలుని కుమారుడు కౌశల్యుడు, భృగునందనుడు వైదర్భి, కవ్యపుత్రుడు కబంధి - ఈ ఆరుగురున్నూ పరతత్త్వం తెలుసుకోవాలనే సంకల్పముతో పిప్పలాదుడనే బ్రహ్మవేత్త వద్దకు వెళ్లారు. గురువు వద్దకు ఉత్తచేతులతో వెళ్లకూడదనే ఆచారం తెలిసిన తాపసులు కనుక అగ్నికార్యానికి ఆవశ్యకమైన సమిధలను పట్టుకు వెళ్లారు.

(ఈ ఆర్గురున్నూ నియమనిష్ఠలుగల మునులు. బ్రహ్మజ్ఞానం కలవారేకాని వారికీ కొన్ని సందేహాలున్నాయి. అవి తీర్చడానికి సమర్థుడు పిప్పలాదుడని నిశ్చయించుకున్నారు. పిప్పలాదుడు పరబ్రహ్మతత్త్వాన్ని క్షుణ్ణంగా తెలిసినవాడు. 'భగవంతుడు' అని అతనికి వేసిన విశేషణంవల్ల అతని ఆత్మశక్తి వెల్లడి అవుతూందని గ్రాహ్యం.)

2

తాన్ హ స ఋషిరువాచ 'భూయ ఏవ తపసా
బ్రహ్మచర్యేణ శ్రద్ధయా సంవత్సరం
సంవత్స్యథ! యథాకామంప్రశ్నాన్ పృచ్ఛథ!
యది విజ్ఞాస్యామః సర్వం హ వో వక్ష్యామ' ఇతి.

సంప్రదాయం ప్రకారం సమిత్పాణులై వచ్చిన సుకేశాదులకు స్వాగతం చెప్పి వారి అభిప్రాయం తెలుసుకుని పిప్పలాదుడు- 'మంచిది. కానీ మీరు తిరిగి ఒక ఏడాదిపాటు బ్రహ్మచర్యం పాటిస్తూ శ్రద్ధతో తపస్సుచేసి ఆపైన అడగండి. బ్రహ్మతత్త్వం గురించి నాకు తెలిసినది మీకు చెప్తాను' - అని అన్నాడు.

(నిత్యజీవితములో కంటికి కనిపించే వస్తువును గురించి ఎవరూ చెప్పనక్కర లేదు. కనిపించని వస్తువును గురించి చెప్పడమూ కష్టమే. తెలుసుకోవడమూ కష్టమే. బ్రహ్మపదార్థం గురించి చెప్పడం, తెలుసుకోవడం గచ్ఛపొదలో ప్రవేశించి సురక్షితంగా వెలుపలకు వచ్చినట్టే. పిప్పలాదుడు సునిశితమైన బ్రహ్మజ్ఞానం కల ఆత్మద్రష్ట. దానిని గురించి చెప్పగల దిట్ట. కానీ సుకేశాదులు దానిని తెలుసుకోవలెననే కోర్కెఉన్నా తెలుసుకోదగిన నిశితబుద్ధి కలవారుకారని పిప్పలాదుడు గ్రహించి బ్రహ్మచర్యం పాటించి తపస్సు శ్రద్ధగా చెయ్యాలన్నాడు.

ఇంద్రియనిగ్రహశక్తి విషయగ్రహణానికి ప్రధానం. శ్రద్ధ ఏకాగ్రతను కలిగిస్తుంది. ఈ రెంటిలో ఏదిలేకపోయినా తత్త్వవిషయం తలకెక్కదు.)

3

అథ కబంధీ కాత్యాయన ఉపేత్య పప్రచ్ఛ.
'భగవన్! కుతో హ వా ఇమాః ప్రజాః
ప్రజాయంత' ఇతి.

బ్రహ్మవేత్తయైన గురువు పిప్పలాదుడు చెప్పినట్టు సుకేశాదులు బ్రహ్మచర్యం పాటించి శ్రద్ధగా ఒక సంవత్సరం తపస్సు చేశారు. తరువాత వారంతా గురువును చేరారు. వారిలో ముందుగా కత్యుని కొడుకు కబంధి ఇలా ప్రశ్నించాడు.

భగవన్! కంటికి కనిపిస్తున్న యీ ప్రాణులు ఎవరివల్లపుట్టుతున్నవి?(ఈ జనం, జంతువులు, పక్షులు, వగైరా సృష్టికి ఎవరు కర్త? అని అడగడంలోనే ఉంది. మూల పదార్థం ఏది అనే ప్రశ్న. గుంభనగా అడిగాడన్నమాట.)

4

తస్మై స హోవాచ 'ప్రజాకామో వై ప్రజాపతిః
స తపోఽతప్యత స తపస్తప్త్వా స మిథున
ముత్పాదయతే రయిం చ ప్రాణం చేత్యేతౌ మే
బహుధా ప్రజాః కరిష్యత' ఇతి.

కబంధి ప్రశ్నకి పిప్పలాదుడు ఇలాగు ప్రత్యుత్తర మిచ్చాడు.

ఈశ్వరుడు ప్రజలను సృష్టించాలి- అని సంకల్పించి గొప్ప తపస్సు చేశాడు. తరువాత రయి, ప్రాణము అనే రెండు దినుసుల్ని సంకల్ప సృష్టిగా పుట్టించాడు. ఆ రెంటివల్ల తాననుకున్న ప్రజాసృష్టి జరుగుతుందని ఆయన అనుకున్నాడు.

(కనిపిస్తూన్న యీ సృష్టి కంతకూ 'రయి, ప్రాణము' అనే యీ రెండున్నూ నిధానం అని భావం.)

(రయి, ప్రాణం - అనే యీ రెంటినీ తరువాత చెప్తున్నాడు.)

5

ఆదిత్యో హ వై ప్రాణో, రయిరేవ చంద్రమాః
రయిర్వా ఏతత్సర్వం యన్మూర్తం చామూర్తం చ
తస్మాన్మూర్తిరేవ రయిః.

ఆదిత్యుడు (సూర్యుడు) ప్రాణం. చంద్రుడు రయి.

సృష్టిలో రెండు రకాల పదార్థాలు ఉంటాయి. మూర్తములు, అమూర్తములూ అని.

స్థూలపదార్థాలు మూర్తములు. సూక్ష్మపదార్థాలు అమూర్తములు. ఒక మూర్తి అంటే ఆకారం కలవి మూర్తములు. మూర్తి (ఆకారం)లేనివి అమూర్తములు. ఈ రెండు విధాల వస్తుసముదాయానికి మూలం 'రయి'- కాబట్టి 'రయి' మూర్తి అవుతూంది. అంటే అనుభవించదగిన పదార్థాలకు రూపకల్పన చేసే మూలపదార్థం అవుతూంది అని భావం.

(లౌకిక సంస్కృతంలో 'రై' - అంటే ధనం.... ధనం, ధాన్యం వగైరా పదార్థాలు జీవరాశిని పోషించేవి. వాటికి ఆధారం

చంద్రుడు. చంద్రకిరణాలనుంచి ప్రసవించే అమృతమయమైన తేజఃపూరం ధాన్యానికి పోషకం అవుతూంది. ఆ ధాన్యాదులవల్ల వృద్ధిని పొందే భూతకోటికి జీవనదాత - అంటే ప్రాణశక్తిని ఇచ్చేవాడు సూర్యుడు. ఈ విధంగా సూర్యచంద్రులు ఈశ్వర సంకల్పసృష్టికి ఆదిమూర్తులౌతున్నారు. 'సూర్యుడు పితృకారకుడు, చంద్రుడు మాతృకారకుడు'- అని జ్యోతిశ్శాస్త్రం ఈ మూలరహస్యాన్ని బట్టే చెప్పిందని గ్రహించాలి.)

6

'అథాదిత్య ఉదయన్ యత్ప్రాచీం దిశం ప్రవిశతి తేన ప్రాచ్యాన్ ప్రాణాన్ రశ్మిషు సన్నిధత్తే, యద్దక్షిణాం, యత్ప్రతీచీం, యదుదీచీం, యదధో, యదూర్ధ్వం, యదంతరా దిశో, యత్సర్వం ప్రకాశయతి తేన సర్వాన్ ప్రాణాన్ రశ్మిషు సన్నిధత్తే'-

సూర్యుడు తూర్పున ఉదయించి ఆ దిక్కున ఉన్న ప్రాణాలను తన కిరణాలతో పెంపొందిస్తూ ఉంటాడు. అలాగే దక్షిణ దిక్కున, పడమటను, ఉత్తరదిశను, క్రిందను, పైన, భూమ్యాకాశాల మధ్యను, అంతటా తన కిరణాలను ప్రసరింపచేసి ప్రాణశక్తిని క్రమక్రమంగా వృద్ధిచేస్తాడు.

(చంద్రునివల్ల వచ్చే పోషకపదార్థాలను శరీరం లోపల సుకరంగా జీర్ణింపజేసి జీవచైతన్యశక్తిని పెంపొందించేది సూర్యకాంతి. సూర్యుడు జఠరాగ్ని రూపములో లోపల ఉండి జీవకోటి ఆరగించే భోజ్య పదార్థాలను జీర్ణింపచేసి ఆరోగ్యప్రదాత అవుతున్నాడని గ్రహించేది.)

7

స ఏష వైశ్వానరో విశ్వరూపః, ప్రాణోఽగ్నిరుదయతే, తదేతత్ ఋచాభ్యుక్తమ్.

ఆ యీ సూర్యుడు జీవలోకాన్ని తన తేజస్సుచే చైతన్యం కలదిగాచేసి బ్రతుకు తెరువున నడిపే వైశ్వానరుడు, తన తేజస్సుతో విశ్వమునంతనూ ఆవరించేవాడు. జీవనశక్తి కలిగించే ప్రాణము, పచనంచేసే అగ్ని అయి వెలుగుతున్నాడు. ఋగ్వేదం ఈ విధంగానే సూర్యుని గూర్చి వివరించింది.

(వైశ్వానరతత్త్వం యీ ప్రశ్న అయిన తరువాత చెప్తాను.)

8

విశ్వరూపం హరిణం జాతవేదసం పరాయణం, జ్యోతిరేకం తపంతం, సహస్రరశ్మిః, శతధా వర్తమానః, ప్రాణః ప్రజానామ్, ఉదయత్యేష సూర్యః.

వేయికిరణాలు కలవాడు, పలువిధములుగా ప్రవర్తించేవాడు, ప్రజలకు ప్రాణమైనవాడున్నూ అయి యీ సూర్యుడు ఉదయిస్తున్నాడు. విశ్వరూపుడు, తేజశ్శాలి, ప్రాణికోటికి ఆధారభూతుడు, తపించేవాడు, జ్యోతిర్గణములో ప్రధానజ్యోతి అయిన యీ సూర్యుని తత్త్వాన్ని ఆత్మద్రష్టలే తెలుసుకోగలరు.

(ప్రజాపతి జీవుల చైతన్యజ్యోతిగ సూర్యుణ్ణి సృష్టించినట్టు ముందు చెప్పడమయింది. ఆ సూర్యునిస్వరూప స్వభావాలను దీనియందు చెప్తున్నాడు.)

9

సంవత్సరో వై ప్రజాపతిః తస్యాయనే దక్షిణం చోత్తరంచ తద్యేహ వై తదిష్టాపూర్తే కృతమిత్యుపాసతే. తే చాంద్రమస మేవలోకమభిజయంతే. తఏవ పున రావర్తంతే. తస్మాదేతే ఋషయః ప్రజాకామా దక్షిణం ప్రతిపద్యంతే. ఏష హ వై రయిర్యః పితృయాణః.

కాలమును తెలిపే సంవత్సరమే ప్రజలను పాలించే ప్రభువు వంటిది. దక్షిణం, ఉత్తరం అని ఆ సంవత్సరానికి రెండు భాగాలు. ఆ రెంటిలో వైదికకర్మలను, లౌకికకర్మలను చేసేవారు తమ కర్మలకు తగిన ఫలంపొందుతారు. వారు తిరిగి తిరిగి యీ లోకానికి వస్తూవుంటారు. సంతతికోరేవారు దక్షిణాయనాన్ని ఆశ్రయిస్తారు. దక్షిణాయనమే పితృయానం - అదే మానవుడు అనుభవించదగిన భోగ్యపదార్థం.

వైదికకర్మలు (యజ్ఞయాగాలు) చేసేవారు ఉత్తరాయణ గతులౌతారు. చెరువులు త్రవ్వించడం, నూతులు తీయించడం, తోటలు వేయించడం యీలాటివి లౌకికకర్మలు. వీటిని మాత్రమే చేసేవారు పుణ్యం సంపాదిస్తారేగాని అది అయిపోగానే తిరిగి యీ లోకములో పుట్టడం, పెరగడం, మరణించడం అనే వాటితోనే ముడిపడి ఉంటారు.

ఉత్తరాయణం స్థిరపుణ్యప్రదం
దక్షిణాయనం అస్థిరపుణ్యప్రదం.

10

అథోత్తరేణ తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా విద్యయాత్మాన మన్విష్యాదిత్య మభిజయంతే. ఏతద్వై ప్రాణానాం ఆయతనమ్ ఏతదమృత మభయమేతత్, పరాయణమేతస్మాత్ నపున రావర్తంతే-ఇత్యేష నిరోధ స్తదేష శ్లోకః.

ఉత్తరాయణములో తపస్సుచే శ్రద్ధతో వృద్ధి అయ్యే విద్యచే బ్రహ్మచర్యముచే ఆత్మను పరిశోధించి ఆదిత్యుణ్ణి (సూర్యుణ్ణి) తమకు అనుకూలునిగ చేసుకునేవారు అదృష్టవంతులు. వారు ప్రాణాలకు కుదురు, మరణస్థితి తెలియని నిత్యస్వరూపుడు, భయం ఎరుగనివాడు. భయమును పోగొట్టేవాడున్ను, ప్రకృతికి పరమపదమున్ను అయిన ఆ ఆదిత్య సాన్నిధ్యమునుంచి తిరిగి యిక్కడకు రారు.

ఆదిత్యోపాసన భౌతిక సహజమైన రాకపోకలను (జననమరణాలను) పోగొట్టుతుందని యీ ఉత్తమ శ్లోకం చెప్తూంది.

(సశేషం)




సామాన్యలోకంలో శరీరపోషణకు మాంసాహారంకన్నా శాకాహారం మేలైన దన్న అభిప్రాయం ఒకటి ఉంది. మాంసాహారం హింస అనీ, శాకాహారం అహింస అనీ భావించేవారు కూడా ఉన్నారు. నిజానికి అంతో ఇంతో హింస రెండింటిలోనూ ఉంది. కోళ్ళు మొదలైన వాటిని కోసి తిన్నా, కందమూలాదులను పెళ్లగించితిన్నా ఆయా ప్రాణులకు బాధ కలగడం, వాటి అస్తిత్వానికి భంగం కలగడం, వాటి నుంచి ఉద్భవించబోయే సంతానానికి స్వస్తి పలకడం తప్పనిసరి అవుతోంది. ఇలా పరిశీలిస్తూపోతే ఈ సృష్టిలోనే ఒక జీవికి మరొక జీవి ఆహారంగా ఏర్పాటు చేయబడినట్లు కనిపిస్తుంది. చీమను చూస్తే కప్పకు మ్రింగబుద్ధి అవుతోంది. ఆ కప్పను పాము పడుతోంది. ఆ పామును నెమలి తింటోంది. ఆ నెమలిని వేటగాడు కొడుతున్నాడు. ఈ విధంగా సృష్టిలో ఒక జీవికి మరొక జీవి ఆహారంగా అమరుతోంది. స్థూలదృష్టికి ఒక జీవిని మరొక జీవి హింసించి బ్రతుకుతోంది. 'జీవో జీవస్య జీవనమ్' ఇది లోక రీతి. సూక్ష్మదృష్టితో చూసినపుడు ఒకే అంతర్యామి ఇన్ని తరహాల దేహాలను ధరిస్తూ ఒక దేహాన్ని మరొక దేహానికి ఆహారంగా సమర్పిస్తున్నాడు. ఇది తప్పనిసరయి సృష్టియజ్ఞంలో జరుగుతున్న ధర్మమైన జీవహింస.

ఈ సత్యాన్ని తెలియచెబుతూ ధర్మవ్యాధుడు కౌశికుడితో ఇలా అంటున్నాడు. 'రైతు నాగటితో భూమిని దున్నుతున్నప్పుడు ఆ నాగటికర్రు తగిలి ప్రాణులెన్నో చనిపోతున్నాయి. అది హింస అవుతుందా? కాదా? మనుషులు అటూ ఇటూ తిరుగుతున్నప్పుడు వారి పాదాల క్రిందపడి వారికి తెలియకుండా జీవులనేకం ప్రాణాలు విడుస్తున్నాయి. మరి దాన్ని హింస కాదనవచ్చా?

నీరూ, భూమి, ఆకాశం సర్వమూ జంతుమయం. కాబట్టి ఏ కర్మను మొదలు పెట్టినా ఎంతో కొంత హింస జరక్క తప్పదు. హింస జరక్కుండా దేహయాత్ర నడపటం సాధ్యం కాదు. ఇవేమీ గమనించకుండానే కొందరు తాము అహింసాపరులమని అనుకుంటారు.

పనికట్టుకుని అరణ్యంలో మునులై చరిస్తున్న వారికి కూడా కందమూలాదులను పీడించడం తప్పడంలేదు కదా!

హింస చేయనివాడు ఈ లోకంలోలేడు. ఎవరికివారు తమకు సాధ్యమైనంతవరకూ హింసకు దూరంగా ఉండటమే అహింస అవుతుంది.'

శరీరపోషణకు ఆహారస్వీకరణ ఆవశ్యకం కనుక ఆహారస్వీకరణకోసం చేసే హింస ధర్మం. ఆహారోత్పత్తికిగాను నెల కొన్న వ్యవసాయాది వృత్తి నిర్వహణలో అప్రయత్నంగా జరిగే ప్రాణిహింస ధర్మం. ఈ విధంగా మానవుడి ఉనికికీ, ఆహార విహారాలకూ అవశ్యకమైన హింస ధర్మం అవుతోంది. ఇంతకుమించి అనగా తన శరీరపోషణకు మించి తోటిజీవులకు ఇబ్బంది కలిగించనంతవరకూ అతడిది ధర్మమార్గమే అవుతుంది. తన నిత్యావసరాలకు మించి ఏ వేట పేరిటో, వేడుక పేరిటో తోటి ప్రాణుల్ని హింసించడం వ్యసనం, అధర్మం అవుతుంది. ప్రకృతిలోని క్రమాన్ని గమనించి ఆ క్రమానికి బద్ధుడై మానవుడు తన దేహయాత్రను నడపటం నేర్చుకోవలసి ఉంది.

ఇక శాకాహారం మేలా? మాంసాహారం మేలా? అన్న ప్రశ్న ఒకటివుంది. ఇది ఎవరి శరీరతత్త్వాన్నిబట్టి వారు నిర్ణయించుకోవలసినది. ఒక్కొక్కరి శరీరం శాకాహారాన్ని కోరుతుంది. మరొక తత్త్వం గల శరీరం మాంసాహారాన్ని అపేక్షిస్తుంది. ఎవరి శరీరతత్త్వాలకు తగిన ఆహారం వారు స్వీకరించడం ధర్మం అవుతుంది. ఈ శాకాహార, మాంసాహార భేదం ఒక్క మానవుల్లోనే కాదు. మిగిలిన జంతువుల్లో కూడా ఉంది. జంతువుల్లో ఆవు గేదె, గుర్రం, గాడిద, ఏనుగు మొదలైనవి శాకాహారులు. బల్లి, పిల్లి, పులి, సింహం మొదలైనవి మాంసాహారులు. ఆయా జంతువులు ఈ శాకాహార మాంసాహార విభాగాన్ని కోరి అభ్యాసం చేయడంలేదు గదా! వాటికి కావాలనిపించిన ఆహారాన్ని అవి స్వీకరిస్తున్నాయి. అలాగే మానవుల్లో కూడా ఎవరి ప్రవృత్తికి తగిన ఆహారం వారి మనస్సు అపేక్షిస్తుంది. శరీరం తన అస్తిత్వానికి కోరుకున్న ఆహారాన్ని అందించడం మానవుడి కర్తవ్యం. కాబట్టి ఈ విషయంలో ఏ ఆహారం మంచిదని ఇతరుల్ని సలహా అడిగే బదులు ఎవరి శరీరప్రవృత్తుల్ని వారు గమనించుకొని నిర్ణయించుకోవడం మంచిది. ఈ అంశాన్ని గమనించి ఆచరణలో పెట్టుకున్నవాడు ధర్మవ్యాధుడు. అతడు జంతు

(40 వ పేజీలో)

తిండికొద్దీ మనిషి - అన్నారు. మనిషినిబట్టి ఆహారం మారటం ఎంత సహజమో ఆహారాన్నిబట్టి మనిషి ప్రవృత్తి మారటమూ అంతే సహజం. ఇంతకీ శాకాహారమా మాంసాహారమా ఏది మేలు అంటే అది ఎవరికివారే నిర్ణయించుకోవాలంటున్నారీ వ్యాసకర్త. సం॥



# సంక్రాంతిశోభ

భానభోంతరపు సమ్యక్రాంతి! సంక్రాంతి!
ధ్యానామృతానంద రత! దివ్యసంక్రాంతి!
మౌని హృత్కమల సౌరథయుక్త సంక్రాంతి!
గాన పీయూష వర్షిణీ! దివ్యసంక్రాంతి!

కారుణ్యమయి! కనకవల్లియో సంక్రాంతి!
కవిజనాశ్రయ కల్పవల్లియో సంక్రాంతి!
స్వాగతము! స్వాగతము! స్వాగతము సంక్రాంతి!

శాంతి కొఱకు జగతి క్రాంతియారాధ్యము
క్రాంతి క్రాంతి కొఱక? కానెకాదు.
క్రాంతియొసగు దివ్యకాంతి సంక్రాంతియౌ
స్వాగతింప రండు! సకలజనులు!

గిరులొనర్చు తపము తరులనానందము
పరవశించువిరులు పరిమళమున
ధరణిమాత తాను "ధన్యోస్మి" యనుకొను
దివ్యదీప్తి సర్వ దిశల జగతి.

చిత్తమౌను దివ్యచిత్తము లోకాన
విత్తమౌను జ్ఞాన విత్తమవని
విప్రులౌదురటులె విబుధులందరు భువి
వినయమనునయమ్ము ధనముకాగ.

పల్లెటూరివారి సల్లలితమ్మగు
జీవనమ్ము పరమ పావనమ్ము
భారతమ్ము దివ్య భారతమదికాగ
పల్లెలెల్ల పాలవెల్లులౌను.

భువియె తోచు మదికి దివియౌచు సంక్రాంతి
దివిచెలంగునపుడు దివ్యవనిగ
నణువునణువునందు నానంద విస్ఫూర్తి
కణకణమ్ము చిందు కరుణరసము.

వేదవిదులు శాస్త్రవాద కోవిదులును
మోదమతులు దివ్యవాదరతులు
"హరిలో రంగ హరి హరి హరి" యటంచు
పాటలనుపాడు హరిదాసు పాటలు విన
సమ్ముదమ్ము విజృంభింప సకలమందు
దివ్యతయె కానవచ్చెను దివిని భువిని

సూర్యచంద్రులందు చుక్కలయందున
నిక్కమైనదొక్క నిరుపమాన
సత్యమనుచు దివ్య సత్యము చాటె సం
క్రాంతి శాంతి దాంతి కాంతిదమ్ము.

ఇంతులందరు ధర పూల బంతులైరి
చెలుల చేమంతి పూవుల చెలువ మమరె
కాంతలెల్లరు భువి దివ్యకాంతలైరి
దివి భువికి భువియు దివికి సందీప్తిగూర్ప.

విశ్వవిపంచి నినాదము
విశ్రుతముగ సంక్రాంతిని
ప్రాణికోటిహృత్తంత్రుల
ప్రణవనాదముగ జెలంగె.

గంగిరెద్దుల తోడ గంతులువేయించి
గంగిరెద్దులవారు కాన్కలంద
పగటివేషమ్ముల ప్రథితులౌ వారికి
కాన్కల నిడి ప్రజ గారవింప
వేదశాస్త్రజ్ఞుల వేవిధమ్ముల ప్రజ
సత్కారములొనర్చి సంస్తుతింప
సుకవి పండితకోటి సుఖసముద్రమ్ముగా
కాన్కల ప్రజలు కాంక్షలనుదీర్ప.

వేవిధమ్ముల జగతికి వెలుగునిచ్చి
భావ బంధుర కల్యాణ పథము జూపి
నరుని నరసఖునొనరింప నరుగుదెంచె
శాంతిపథదర్శి దివ్య సంక్రాంతిలక్ష్మి,

పేద సాదలందు మేదురానందము
ధనికులందు దయయు కనికరమ్ము
దైవభావనమ్ము దైవార సంక్రాంతి
లక్ష్మివెలిగె భువి సలక్షణముగ.

— మల్లాది రామచంద్రశాస్త్రి

# విష్ణుసహస్రనామ స్తోత్రం

శ్రీ కె.వి.ఎల్. నరసింహారావు

హిందూమతమునకు పునాదివేసినవాడు శ్రీకృష్ణుడు. ఆయన అపరావతారము బాదరాయణుడు. ఆయన మన మతమునకు ప్రధాన గ్రంథములైన వేదములను పరిష్కరించి యిచ్చుటయేగాక బ్రహ్మసూత్రములు, భగవద్గీత శ్రీ విష్ణుసహస్ర నామములతో గూడిన భారతేతిహాసమును రచించి మనకిచ్చియున్నారు. అట్టి వ్యాసభగవానుడు రచించిన శ్రీవిష్ణు సహస్ర నామముతో మరియేది సరితూగగలదు?

శ్రీవిష్ణు సహస్రనామ పారాయణమును అన్ని జాతులవారును చేసుకొనవచ్చును. భగవదనుగ్రహము పొందుటకు అనేక ఉపాయములు గలవు. అన్నిటిలోనూ సులభమైనది శ్రేష్ఠమైనది నామసంకీర్తనమే. అందుచేతనే భీష్మాచార్యులవారు 'ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః' అని సెలవిచ్చియున్నారు.

సర్వవ్యాప్తియగు నారాయణుడే కృష్ణ ద్వైపాయనుడు. ఆయనగాక మరి ఎవ్వరీ మహాభారతమును రచింపగలుగుదురు? వేదవ్యాసుల వచనములు అను మహాజల ప్రవాహము భూమియందలి పంకిలములను మానవుల హృదయములయందలి మలినములను తుడిచివేయ గలవు. వేదములు పురాణములు ధర్మశాస్త్రములలో చెప్పబడిన ధర్మరహస్యములన్నియు మహాభారతమున చెప్పబడి యున్నవి.

కలికాలమందలి ప్రజలకు వేదార్థములను గ్రహించుట, వాని ననుష్ఠించుట సాధ్యము లగు పనులుకావు. అని చింతించి వారి కర్థమగునట్లు వ్యాసుడీభారతమును రచించెను. దానికి నాయకమణిగా నుండునట్లు వారి విష్ణు సహస్రనామములను చెప్పియుండిరి.

శరతల్పగతుడై తన్ను స్మరించుచుండిన భీష్ముని శ్రీకృష్ణుడనుగ్రహించెను.

మానవులు భగవత్కటాక్షమును పొందుటకు దేవతలకు మ్రొక్కుచున్నారు. అనేక విధములయిన జపములు చేయుచున్నారు. పూజలు చేయుచున్నారు. వ్రతములు చేయుచున్నారు. భగవంతుని నామములను జపించుచున్నారు. అట్టివాటన్నిటిలో విష్ణుసహస్రనామ పారాయణము సర్వోత్తమమైనది. అది సర్వోత్తమమైనదని ఎట్లు చెప్పగలము? 'సత్యం సత్యం పునస్సత్యం ఉద్ధృత్య భుజముచ్యతే-వేద శాస్త్రాత్ పరం నాస్తి, న దైవం కేశవాత్పరమ్' వేదమునకు మించిన శాస్త్రములేదు. కేశవునకు మించిన దేవుడులేడు. అన్నారు పెద్దలు. పెద్దలెవరో చెప్పుటయేగాదు మన ఆచారములు సైతము దీనిని ఋజువుచేయుచున్నవి.

హైందవులలో ఏ గృహస్థు ఏ పూజచేసినను దానిని కేశవనామములతోడనే మొదలు పెట్టును. ఇల్లు కట్టిన వెంటనే ఈశాన్య భాగమున తిరుమణి తిరుచూర్ణముల బొట్టును దానిచెంత లక్ష్మీఅమ్మవారిబొట్టును పెట్టుచున్నారు. బ్రాహ్మణులు ప్రతి దినమును చేయు సంధ్యావందనమును కేశవ నామములతో మొదలిడి కృష్ణార్పణమస్తు అని ముగించుచున్నారు. అటు తర్వాత చేయు దేవతార్చనమును సైతము కేశవ నామములతోడనే మొదలుపెట్టి శ్రీ కృష్ణార్పణమస్తు అని ముగించి 'శ్రీ కృష్ణ పాదోదకం పావనం శుభం' అని తీర్థము గైకొనుచున్నారు. అయితే యిందులోగూడా కొందరు పరమేశ్వరార్పణమస్తు అని ముగించి రుద్రపాదోదకం పావనం శుభం అని తీర్థము గైకొనుచున్నారు.

మహాఋషులు భృగుమహాఋషి ద్వారా త్రిమూర్తుల తత్త్వములను పరిశీలించి బ్రహ్మఅర్చనకు అర్హుడుగాడు, రుద్రుడర్చనకు తగినవాడేగాని తీర్థప్రసాదములు గొనుటకర్హుడుగాడు, శ్రీమహావిష్ణువు ఒక్కడే యీ గౌరవము అన్నిటికి తగినవాడు అని నిర్ణయించిరి గదా? మానవుడు పుట్టిన వెంటనే చేయు శుద్ధిపుణ్యాహవాచనము కేశవ నామములతో ఆరంభమగును. అతడు జీవితకాలమునచేయు పూజలన్నియును కేశవనామములతోడనే ఆరంభమగును, హైందవులందరు ఆయనకు ప్రీతిపాత్రము లైన తులసిమొక్కల నిండ్లలో పెంచుచు లక్ష్మీనారాయణ రూపములు దాల్చిన వేప, రావివృక్షములకు ప్రదక్షిణములు చేయుచు తమ భక్తిని ప్రదర్శించుచున్నారు. జీవితము ముగించు సమయమున చెవిలో నారాయణ నామస్మరణముచేసి తన్నామస్మరణమున గొంతులో తీర్థము పోసి జీవితయాత్రకు కట్టకడపటిమజిలీయైన దింపుడుకళ్ళమున సైతము నారాయణ నామస్మరణముచేసి మానవజీవ యాత్ర ముగింపు చేయుచున్నాము గదా.

కాలప్రభావమున సంఘమున ఆచారములు మారుచుండును. కాని అవి మూలమును ఛేదింపలేవు.

భగవంతునికి అనేక నామములు గలవు. సనకాదులానామములచే దేవుని స్తుతించుచుండిరి. తుమ్మెద పుష్పములన్నిటియందును సంచరించి తేనెబొట్లను సమకూర్చినట్లు వ్యాసుడు వారు స్మరించిన నామములలో శ్రేష్ఠమగువాని నెన్నికచేసి ఈ సహస్రనామములను కూర్చియున్నారు.

పాలను చిలికి వెన్ననుజేసినట్లు లోక హితమునుగోరి వ్యాసుడు వేదములను మథించి సారభూతములయిన వాని ధర్మములను గ్రహించి ఆ ధర్మములతో మహాభారతమును రచించెను.

కృష్ణద్వైపాయనం వ్యాసం
విద్ధి నారాయణం ప్రభుమ్.
కో హ్యన్యో భువి మైత్రేయ
మహాభారతకృత్ భవేత్.

ఆయన యనుగ్రహమున భీష్ముడు ధర్మరహస్యములనన్నింటిని గ్రహింపగలిగెను. ఆ ధర్మములను ధర్మజుడు గ్రహింపవలెనని నిశ్చయించి శ్రీకృష్ణుడాయనను భీష్ముని చెంతకు గొని పోయెను. వారువచ్చిన కార్యమును గుర్తించి భీష్ముడు చెప్పుచున్నాడు.

యచ్చ భూతం భవిష్యచ్చ
భవచ్చ పరమచ్యుత,
తత్సర్వమనుపశ్యామి
పాణౌ ఫలమివాహితమ్.

.....................

యుష్మే వ చాస్మి సంవృత్తః
త్వదనుధ్యాన బృంహితః,
వక్తుం శ్రేయః సమర్థోఽస్మి
త్వత్ప్రసాదాత్ జనార్దన.

'గోవిందా! ఆశ మోహము గ్లాని మొదలగునవన్నియు నీ యనుగ్రహమున నన్నువదలి పోయినవి. అరచేతిలోని ఉసిరిక పండువలె భూతభవిష్యద్వర్తమానములు, వేదవేదాంగములయందలి ధర్మములు నాకు స్పష్టముగా దెలియుచున్నవి. నేను సదా మిమ్ము ధ్యానముచేయుటవలన మానవులకేది శ్రేయమో దానిని చెప్పగల శక్తి నాకు లభించినది.' అని పలికి ధర్మము లన్నింటిలో శ్రీవిష్ణు సహస్రనామ పారాయణము గావించుటయే శ్రేష్ఠమగు ధర్మమని ప్రతిజ్ఞజేసి ఆయన యీ స్తోత్రమును ధర్మజున కుపదేశించెను.

భీష్మాచార్యుల వారిచే ఉపదేశింపబడిన ఈ సహస్రనామస్తోత్రమును సకల పురాణములును, సమస్త ధర్మశాస్త్రములును ప్రశంసించియున్నవి. ఆయుర్వేదశాస్త్రమున అత్యుత్తమ గ్రంథమగు చరక సంహితసైతము వ్యాధుల నివారణమునకు ఈ సహస్రనామ పారాయణము అత్యుత్తమ సాధనమని చెప్పియున్నది.

విషయపిశాచ బాధలను, వ్యాధులను, దుస్స్వప్న దుర్నిమిత్తాది సమస్త అమంగళములను యిది నివారింపగలదు. మానవులకు శుభము చేకూర్చుటయందిది వేదములకన్నను ఎక్కుడు శక్తిని కలిగియున్నది.

ధర్మజుడు భీష్ముని సమీపించినప్పుడు మొట్టమొదట యీ ప్రశ్న వేసెను.

'కో ధర్మః సర్వధర్మాణాం
భవతః పరమో మతః.
కిం జపన్ ముచ్యతే జంతుః
జన్మసంసార బంధనాత్.

ఏ దేవుని పూజించి, మానవులు భోగ భాగ్యములు పొందవచ్చును? ఆ ప్రశ్నకు భీష్ముడిట్లు ప్రత్యుత్తరమిచ్చెను.

'జగత్ప్రభుం దేవదేవం
అనన్తం పురుషోత్తమమ్,
స్తువ న్నామసహస్రేణ
పురుషః సతతోత్థితః

చేతనాచేతనములకు ప్రభువు, అపరిచ్ఛిన్నమైన మహిమగలవాడునైన, పురుషోత్తముని సహస్రనామముల జపించుటయే భోగమోక్షములను పొందుటకు సాధనము. సంసారచక్రమునుండి మానవుడు విముక్తుడగుటకు చూచుటకు శక్యముకానివాడు భావించుటకు అలవికానివాడునైన పరమాత్మను ధ్యానించుటకు మించిన శ్రేష్ఠమైన మార్గము వేరొకటిలేదు.

శ్రీ మహావిష్ణువు అనంతకళ్యాణగుణ పరిపూర్ణుడు. ఆ మహనీయుని గూర్చి సల్పు ధ్యానము అమృతధారయై తాపత్రయ దవాగ్నులను నిశ్శేషముగా నిర్మూలించునట్టి శక్తిని కలిగియున్నది. భక్తియోగమును మోక్షసాధనకు రాజమార్గముగా నెరుగుము.

'యే త్వాం దేవం ధ్రువం భక్తాః
పురాణం పురుషోత్తమమ్,
ప్రాప్నువంతి సదాకామాః
స్నేహలోకే పరత్ర చ
అమోఘాశ్చ భవిష్యన్తి
భక్తిమన్తశ్చ యే నరాః'

పురాణపురుషుడవైన నిన్ను ఎవరు భక్తితో స్మరించుచున్నారో వారు ఇహపర లోకములయందు సర్వాభీష్టములను పొంది అమోఘులై ప్రకాశింతురు, అని శ్రీమద్రామాయణమున చెప్పబడియున్నది.

'అనాది నిధనం విష్ణుం
సర్వలోకమహేశ్వరమ్,
లోకాధ్యక్షం స్తువన్ నిత్యం
సర్వదుఃఖాతిగో భవేత్.
బ్రహ్మణ్యం సర్వధర్మజ్ఞం
లోకానాం కీర్తి వర్ధనమ్,
లోకనాథం మహద్భూతమ్
సర్వభూత భవోద్భవమ్.'

ఆద్యంతరహితుడు, సర్వవ్యాపకుడు సమస్త లోకములకు ప్రభువు, వేదప్రతిపాదితుడునై లోకములనన్నిటిని ఉద్ధరించగలిగిన శ్రీ మహావిష్ణువును ధ్యానించుటవలన సమస్త దుఃఖములు నశించును.

మానవులు కష్టము వచ్చినప్పుడు మాత్రమే దేవుని స్మరింతురు. ఇది నిజమైన భక్తికాదు. దైవభక్తికి వాంఛలుండరాదు. అది నిష్కామముగా నుండవలెను. హృదయము నర్పించి స్మరించిన వారికే దేవుడు ప్రసన్నుడగును. ఆయన ధన ధాన్యముల నపేక్షింపడు. రత్నరాసులను కోరడు. ఎవరు ధర్మమార్గమును విస్మరింపక దేవునియందు నిజమైన భక్తికలిగి ఆయనను స్మరింతురో వారినే ఆయన అనుగ్రహించును. తాపత్రయ దవాగ్నులనార్పుటకు జనార్దన నామస్మరణమునకు మించిన సాధనములేదు.

అజ్ఞానతో వా జ్ఞానతో వా
వాసుదేవస్య కీర్తనాత్,
తత్సర్వం విలయం యాతి
తోయస్థం లవణం యథా.

తెలిసిగాని తెలియకగాని వాసుదేవనామము స్మరించినంత మాత్రమున మానవులు కావించిన పాపములు నీట గలిసిన ఉప్పువలె నశించిపోవును.

శాంతిః కలేరహ్యేషస్య
నామసంకీర్తనం హరేః.

కలియుగమున హరినామస్మరణ మాత్రమునసే మానవుల పాపములన్నియు నశించి పోవుచున్నవి.



మొగల్ చక్రవర్తి అక్బర్ కొలువులోని నవరత్నాలలో రహీం ఒకడు. అతడు 1556 లో జన్మించి తన 72 వ ఏట 1628 లో పరమపదించాడు. అతని పూర్తి పేరు అబ్దుల్ రహీంఖాన్ ఖానా. అతడు గొప్పకవి; కళా రాధకుడు. పరోపకారబుద్ధి, దూరదృష్టి, శౌర్యపరాక్రమాదులు అతనికి ఉగ్గుపాలతో వచ్చిన విద్యలు. కలంపట్టిన చేతితో కత్తి పట్టి శత్రువుల మదమణచగల మహా యోధుడు.

పుట్టుకతో మహమ్మదీయుడైననూ హిందూమత, సంస్కృతుల యెడ అతనికి ఎక్కువమక్కువ. అతడు గొప్ప కృష్ణ భక్తుడుకూడ. పవిత్ర దైవభక్తి జాతి, మతాలకు, వర్ణవర్గభేదాలకతీతమైనది. అనంతమైన ఆ దివ్యసుధారసవాహినీ పవిత్రసలిలాలలో కులమత విచక్షణా రహితంగా ఎల్లరూ జలకాలాడి తరించవచ్చు భగవంతుడు నామ, జాతి, కుల, కర్మ, భావసంబంధాదులకతీతుడు. ఏ భావముతో తనను చేరిననూ ఆదరించి అండజేర్చి అశాంతిని తీర్చి అమందానందమునందించును.

ఒకప్పుడు అక్బర్ ఆదేశాన్ని పురస్కరించుకొని రహీం దక్షిణప్రాంతపు ఒక హిందూరాజ్యంపై దండెత్తి ఆరాజును ఓడించి కూడా ఖైదుచేయక, గౌరవించి తన ఔదార్యాన్ని వెలిబుచ్చగా ఆరాజు, "స్వామీ! మీరు కడు ఉదార హృదయులు పరాజితుడైన నన్ను ఖైదుచేసి అవమానించక ఆదరించినందుకు కృతజ్ఞత తెలుపుకొంటూ మీరు నన్ను ఆప్తమిత్రునిగా స్వీకరిస్తారని ఆశిస్తున్నాను'', అంటూ రహీం వద్దకు ప్రశంసాపత్రం పంపాడు. అది అందుకున్న రహీం "తథాస్తు" అన్నాడు. కాని సేనాధిపతులందుకు తమ అసమ్మతి వ్యక్తపరచి, అతనిని శత్రువుగా భావించి ఖైదు చేయవలసినదిగా రహీంకు సలహాయిచ్చారు. ఆడినమాటతప్ప నేర్వని రహీం పరాజితుడైన రాజుకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ప్రసాదించాడు.

సమః శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః.
శీతోష్ణసుఖదుఃఖేషు సమః సంగవివర్జితః.

శత్రువుయెడల మిత్రభావసంపన్నుడు, దయాళువు, ఏ ప్రాణియెడల ద్వేషమెరుగని రహీం క్షమాశీలుడు. శత్రుమిత్రులు, పూజాపరాభవాలు, నిందాస్తుతులయెడ సమదృష్టిని గల్గిన రహీం, కృష్ణభక్తిని వేనోళ్ళ పొగడుతూ మరోరోజు ఆరాజు తాను కృతజ్ఞతా పూర్వకంగా ఏర్పాటుచేసిన విందుకు రహీంని ఆహ్వానించాడు. అందుకు రహీం సమ్మతించి మసక చీకటిపడుతుండగా అంగరక్షకునితో విందుకు బయలుదేరాడు. మార్గమధ్యంలో విచిత్రబాలకుడొకడు దారి నడ్డగించి పరిచిత వ్యక్తివలె, "ఖాన్‌ఖానా సాహెబ్! ఎక్కడికి ప్రయాణం?" అని ప్రశ్నించాడు.




"నువ్వెవరవుబాబూ!'' ఎంతో ఆప్యాయంగా అడిగాడు రహీం.

"నేనెవరినైతేనేంగాని, మీ ప్రయాణ మెక్కడికో చెప్పండి".

అతని పట్టుదలకు నవ్వుతూ, రాజాగారింటికి విందుకు అన్నాడు రహీం, ఎంతో వుత్సాహంగా. "ఖాన్‌ఖానాసాహెబ్! నామాట విని అక్కడికి వెళ్ళకండి'' పట్టుదలగా పలికాడాబాలుడు.

"అంటే నీ వుద్దేశ్యం?'' కుతూహలంగా ప్రశ్నించాడు రహీం.

"అతనిది కలుషపూరిత హృదయం. విందుకాహ్వానించి మిమ్ముల హతమార్చాలని అతని సంకల్పం''.

క్షణకాలం దీర్ఘాలోచనాపరుడై ఆవేదనా ఆశ్చర్యములతో విషయమును పూర్తిగా

హిందూధర్మాన్నీ. హిందూ దేవతల్ని అభిమానించి ఆరాధించి తరించిన అన్య మతస్థుల చరిత్రలు మనకు కలిగించే స్ఫూర్తి అమోఘం. అలాంటి వాటిలో ఒక ముస్లిమ్ భక్తుని కథ ఇది. సం॥

తెలుసుకొనగోరి రహీం అన్నాడు. 'విందుకు వస్తానని మాట యిచ్చాను. ఆడిన మాట తప్పటం యీ జన్మలో నేనెరుగనిది.'

"ప్రాణ, మానభంగములందు అసత్యము పలుక వచ్చునని మీకు తెలియదా: ప్రాణ రక్షణార్థమై మీరు నిశ్చింతగా వెనుతిరిగి పోవచ్చు''. వినయంగా విన్నవించాడాబాలుడు.

"నా అంతరాత్మ....'' అంటూ ఏదో బాధగా చెప్పబోయాడు రహీం. అంతలో, "ఖాన్‌ఖానా సాహెబ్! విషాహారం పెట్టి మిమ్ముల హతమార్చాలని రాజా సంకల్పమని మరి మరీ చెప్పుతున్నాను. సర్వజ్ఞులయిన మీరే యిటుల తటపటాయించిన యిక నేనేమి చెప్పగలను'' అన్నాడు బాలుడు.

"భక్తిరహితంగా యిచ్చిన అమృతం సేవించి ఆ చంద్రార్కం చిరంజీవిగా జీవించే బదులు భక్తిశ్రద్ధలతో ఆప్యాయంగా ఆహ్వానించి అందించిన విషం త్రాగి కన్నుమూయడం నా అదృష్టంగా భావిస్తున్నాను. నా యిష్ట దైవం కృష్ణపరమాత్మ ఆజ్ఞలేక యే ఒక్కటియూ జరుగనేరదు. ఆయన ఆజ్ఞను ఉల్లంఘించి పోవతెనన్ననూ అది ఎవరికీ సాధ్యముకాదు ఈ ప్రకృతి రంగమున అతను చెప్పినట్లాడక తప్పదు, చేయకతప్పదు కదా! అన్నింటికీ ఆ పరమాత్మ సంకల్పము మూలకారణమై కార్యమును జరిపించును." అంటూ రహీం ముందుకు కదిలాడు.

రహీం ఎంతగా నచ్చజెప్పచూసిననూ వినక, మిక్కిలి ప్రేమపూర్వకమైన హిత



వచ్చె సంక్రాంతి పర్వము. పిచ్చెసంబ
రమ్ము వాడ వాడలయందు ముమ్మరమ్ము
కల్లకాదుసుమా! నేడు పల్లె సీమ
నందనోద్యాన వనసీమ చందముండు

ఎటులఁ జూచిన నవధాన్య మెటులఁజూడ
దండిగా ఫలపుష్పాలు నిండియుండ
కాంతు నీపూటయనుచు హేమంత వీధి
కాంతు లీనుచు వచ్చె సంక్రాంతి లక్ష్మి.

తీగలనుఁబోలె ముగ్గిళ్ళు బాగుగాను
పిందెలను బోలె గొబ్బిళ్ళు సుందరముగ
మువ్వల గలగలల గానములను పోలి
పువ్వుల పగిది బాలల నవ్వులాయె
అవియె సంక్రాంతి లక్ష్మికి స్వాగతాలు.

గోమయమ్ముల నలికిరి గీములెల్ల
కలికి సంక్రాంతిఁ బారాణీ నలదినట్లు
పచ్చతోరణాల్ కట్టిరి హెచ్చుగాను
యోష సంక్రాంతి కయ్యవి భూషణాలు

తుహిన బిందులు మొలచెను మహిని నేడు
ముత్యపు సరాలు సంక్రాంతి ముగ్ధ కవియు
బంతి, చేమంతి, సిగకు మేల్బంతులాయె
గుమ్మడియు, రేగుపండ్లును, కొత్తధాన్య
మామె వంతున కవి ఫలహారమయ్యె.

— తేల్కర్ శంకర్ రావ్

మును విడువక ఆ బాలుడు రహీం అంగ రఖా గట్టిగా పట్టిముందుకు సాగనీయలేదు. రహీం, అతని అంగరక్షకుడు ఎంత గట్టిగా లాగి ప్రయత్నించినా ఆ పసివాని పట్టు నుండి అంగరఖో విడిపించలేక పోయారు. అతని మొండిపట్టుదలకు విసిగిన రహీం ప్రశ్నించాడు, "నువ్వేమీ నా ప్రభువైన శ్రీకృష్ణపరమాత్మవా నన్ను అడ్డగించ డానికి"? పసివాడు నవ్వుకుననవ్వి, "నేను భక్తవశుడైన నీ కృష్ణపరమాత్మనే నమకో," అంటూ బదులు పలికాడు. మరుక్షణమే రహీం తన జన్మాంతర పుణ్యఫలమా అన్నట్లు బాలుని స్థానమున నీలనీరదవిగ్రహుడైన మదనమోహనుని దర్శించాడు. కోటి సూర్య కాంతి కలిగి శ్యామసుందరుడై దర్శన మిచ్చిన ఆ దివ్య సుందర విగ్రహమునే స్మరించుతూ ఆనందబాష్పముల రాల్చుతూ తన్మయాత్ముడై కృష్ణరూపమున ఉన్మత్త చిత్తుడై లీనమయ్యాడు. అంగరక్షకునికి మాత్రం ఆ బాలునిలో మార్పేమీ కన్పించ లేదు. రహీం భక్తిపారవశ్యం అతనికి అయోమయంగా గోచరించించి. అతని బుద్ధి మొద్దుబారింది.

రహీం కళ్ళుతెరిచాడు మానవాకారంలో దర్శనమిచ్చిన మాధవుడు అంతర్ధానమ వడంగమనించి భగవత్సాక్షాత్కారమైనందుకు అఖండానందాబ్ధి నోలలాడుతూ, "నా మాటను నిలబెట్టుటయూలేక ఆవల నెట్టు టయు నీ యిష్టముపై నుంచితిని. యెట్లు చేసిననూ ఆనందమే, అంతయూ నీ ప్రసా దమేఅనుకున్నాడు తనలోతాను. మధురాతి మధురమగు శ్రీకృష్ణుని దివ్యలీల స్మరిస్తూ విగత సందేహుడై ఆ నందనందనుని ఆజ్ఞను మీరకూడదను స్థిరసంకల్పముతో రహీం యింటికి మరలిపోయాడు, మహాపురుషుల చేష్టలకు అంతరార్థము లుండకపోవు.

"అనన్యా శ్చింతయంతోమాం
యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం
యోగక్షేమం వహామ్యహమ్."

( 35 వ పేజీలో )

# కోణార్క

## డా॥ టి. ఆర్. కృష్ణన్

13వ శతాబ్దంలో గంగవంశమునకు చెందిన మొదటి నరసింహ అన్నరాజు దైవము, సౌందర్యము, శాస్త్రము అను మూడు వస్తువులను కలిపి "కోణార్క దేవాలయము" అనే స్వప్నసీమను తయారు చేశాడని చరిత్ర చెప్పుచున్నది. దీని రథ నిర్మాణమునకు, పన్నెండు వందల మంది శిల్పులు కళాచక్రవర్తులు పన్నెండు పూర్తి సంవత్సరములు శ్రమించినారని చరిత్ర చెబుతున్నది.

శ్రీకృష్ణభగవానుడి కొడుకు సాంబుడు శాంతిదూత అయిన నారదుడి వ్యూహం ఫలితంగా గోపికలతో అసభ్యంగా ప్రవర్తించబోగా, తండ్రిచేత శాపం పొందినాడు. తత్ఫలితంగా కుష్టురోగి అయినాడు. శాప విమోచనార్థం మైతరేయవనంలో ద్వాదశ వర్షములు తపస్సుచేసి, చంద్రభాగానదిలో స్నానమాడుతుండగా సూర్యవిగ్రహం దర్శనమయింది. ఆ దర్శనమాత్రంతోనే అతను శాపవిముక్తుడు కాగా - ఆ విగ్రహమును వెలికితీసి ప్రతిష్ఠించి సూర్యదేవాలయమును నిర్మించాడని సాంబపురాణ కథనం.

మరొక కథనం. ఈ దేవాలయ ప్రధాన శిల్పి కుమారుడు చిన్న వయసుననే ఇల్లు విడిచి పారిపోయినాడు. కొన్ని వత్సరములు శ్రమించి ఆలయమునంతయు నిర్మించిన ప్రధానశిల్పి ప్రత్యేకముగా రాతితోచేసిన విమానభాగమును పైకెక్కించడమెలాగాయని యోచించగ అంతు దొరకలేదట! మనోవేదనతో యేమిచేయాలని ఒకచోట కూర్చుండిపోయాడు. ఆసరికి పెద్దవాడయి తిరిగివచ్చిన శిల్పితనయుడు బలమయిన వెదురుకర్రలతో ఏటవాలుతలం లాంటి దానిని నిర్మించి దానిమీదుగా గొలుసులతో విమానభాగాన్ని లాగించి పైన నిలిపినాడు. తనకు క్లిష్టమయిన ఈ కార్యమును ఇంత సులభముగా పూర్తిచేసినవాడు తన కుమారుడేనని తెలియక శిల్పి అవమాన భారంతో ఆత్మహత్య చేసికొన్నాడు.

కోణార్క అంటే సూర్యుడిస్థలం లేక సూర్యుడి ఆలయం.

అనంత నీలాకాశం క్రింద నిలుచుకొని గుసగుసలాడుకునే చెట్లమీదుగా, వేయి వెండిచేతులతో ఆహ్వానిస్తున్న సాగరుడిని తిలకిస్తూ, పట్టరాని ఆనందంతో ప్రతిమలయి నిలచిపోయిన సుందరమూర్తుల నందన వనం కోణార్క.

వాత్స్యాయనుడికి ఓనమాలు నేర్పగల శృంగార రూపముల పన్నీటిజల్లు-కోణార్క.

"రాగమయజగత్తు నుండి చైతన్య సోపానాలువేసి మూలశక్తి దరికి ప్రస్థానములు చేయించగల రాగ విరాగస్వర సమ్మేళనం" కోణార్క.

నిజం, అబద్ధం, చరిత్ర, పురాణం, అన్నీ కలసిపోయిన రంగురంగుల కథాకలయికే కోణార్క.

ఎంతవిన్నా, ఎంతచదివినా ప్రత్యక్షంగా ఎదుట నిలబడేసరికి సౌందర్యం యొక్క విశ్వరూపం మన ఊహల కతీతంగా, అపురూపంగా మనమీద వర్షిస్తుందన్నది నగ్నసత్యం.





విశాలాంధ్రకు ఉత్తరదిశలో పొరుగు రాష్ట్రమయిన ఒరిస్సాలో, ఆ రాష్ట్రరాజధానియైన భువనేశ్వర్‌కు సుమారు నలుబది మైళ్ళదూరంలో సముద్రపు ఒడ్డునవున్నది కోణార్క. అక్కడవున్నదల్లా ఈ సూర్య దేవాలయమూ, ఒక యాత్రికుల బంగళా, యాత్రికులకు కావలసిన ఆహారపానీయాదులు సరఫరా చేసెడి దుకాణాలు. ఇంతే.

రథరూపమున వున్న ఈ దేవాలయం నృత్యమందిరం, జగమోహన ఆలయం అని మూడు భాగాలుగా ఉన్నది. సముద్ర తీరానికి వందగజములివతలిగా, రోడ్డుకు ఏడడుగులు క్రిందుగా, యాభైవేల చదరపు గజముల ఇసుక వైశాల్యపు మధ్యన నిలచి ప్రతివారిని పిలిచే మహోత్కృష్ట సృష్టి ఈ కోణార్క.

కోణార్క ఇక రెండుమైళ్ళుందనగానే నిట్టనిడివిగా పండుగ్గా ఉండే సరుగుడు చెట్లమధ్యను పరుగుపెట్టడం మొదలు పెడ్తుంది తారురోడ్డు. క్రమంగా రోడ్డుకు రెండువైపులా ఇసుకతిన్నెలు ఎత్తుపెరుగుతుంటాయి.

హఠాత్తుగా మన దృష్టిని ఆకట్టుకొంటుంది కోణార్క మహాదేవాలయం.

ద్వారములమీద, గోడలమీద, సోపానాల మీద, స్తంభములమీద, ఇది అది అనకుండ ప్రతి అంగుళము మీదను మహాశిల్పుల మధురదృష్టి వెల్లివిరిసింది. నృత్యమందిర శిల్పమంతా ప్రధానంగా నర్తకీ నర్తకుల లాస్యమే! సంగీతకారుల స్వరూపాలే! జగన్‌మోహన్ అని పిలువబడే ప్రేక్షక మందిరం భాగములోని శిల్పము మొత్తమూ ఒకశిల్ప సముద్రం! శృంగార వర్షం. మొదట చూడగానే కొద్దిగ "బెరుకు" అనిపిస్తుంది. కాని అంతలోనే అల్పభావము పోయి, అలనాడు బృందావనములో ప్రేమే

ప్రాణముగా మోహన జగతిని సృష్టించిన రాసలీలారమణుడైన శ్రీకృష్ణుడి కేళీవిలాసపు శతకోటి రూపములలోని లీలామానుషత్వము కళ్ళకు కడుతుంది. ఏమి స్వేచ్ఛ! ఏమిరసజ్ఞత!!

దీని తర్వాతే అసలు ఆలయం వుండేది. ఇది సూర్యభగవానుడి రథానికి యథార్థపు ప్రతిబింబము. ఇరువదినాలుగు చక్రముల (సంవత్సరములో ఇరవైనాలుగు పక్షములు) మీద నేలనుండి సుమారు నాలుగు వందల అడుగుల ఎత్తు వుండే ఈ దివ్య రథమును నురుగులు కక్కుతున్న ఏడు గుర్రములు (వారములోని ఏడు రోజులు; సూర్యకిరణంలోని ఏడురంగులు) లాగుతుంటాయి. ద్వాదశాంగుళముల వ్యాసం మేరకు అత్యంత సూక్ష్మమయిన శిల్పకళా వైదగ్ధ్యంతో విరాజిల్లెడి ఒక్కొక్క చక్రమునకు ఎనిమిదేసి ఆకులు (రోజులోని ఎనిమిదిభాగములు) వుంటాయి.

ఏడు శతాబ్దముల క్రింద ఇంతటి బరువైన రాతితో నిర్మించబడిన విమానమును శిఖరముమీదికి ఎట్లా ఎక్కించిందీ ఇదివరకు గమనించితిరి. ఎవరు, ఎప్పుడు, ఏరీతిగ కట్టించినప్పటికీ గర్భగుడిమీద వుండిన ప్రధాన శిఖరంగాని, లోపల మూలవిరాట్టుగాని కనపడవు. ఈనాడు చుట్టూవున్న శిల్పములచూచి ఎంతో ఆశతో ఇటుతిరిగేటప్పటికి శిఖరమూ, ఆదిత్యమూర్తి కని పించకపోయేటప్పటికి ఎవరో మనలను మోసంచేసారేమోననేటువంటి భావము కలుగకమానదు.

రాతిలో బలంలేకపోయినా, గాలికి వానకూ దెబ్బతినేదే అయినా నృత్యమందిరం,జగమోహన్‌వంటి భాగములు బాగుగా వుండగా, ప్రధానాలయం మాత్రమే శిథిలమయిన దెందుకు?

విగ్రహవిద్వేషి అయిన "కాలాపహార్" అనే పేరుగల రాక్షసుడు ఇక్కడికి దండెత్తి వచ్చి ఆలయములోని ప్రధానమైన భాగమును ధ్వంసంచేసి వెళ్ళాడని చరిత్ర చెబుతున్నది. అయితే ఈ ఆలయ ప్రధాన శిఖరమునకు వాడిన నల్లరాతిలో ఇనుము ఎక్కువ శాతముండేదట. ఆ రాతిలోని ఇనుము అయస్కాంతగుణము వహించింది. ఆ సమీప సముద్రంలో ప్రయాణం చేసే ఓడలను ఆకర్షించి, దారి తప్పించి, వాటి నాశనమునకు దారితీయించిందని నమ్మికొందరు నావికులు ఆగ్రహంతో ఈ శిఖరమును నేలమట్టంచేసి నాశనమొనర్చారని మరొకగాథ!

కోణార్కలోని శిల్పమూర్తులూ, కొన్ని ద్వారములూ, క్లోరైట్ అనబడే నల్లరాతితో చెక్కబడినవి. గోడలు, రథం వగైరాలన్నీ శాండ్‌స్టోన్ అనబడే గరుకుగావుండే లేత పసుపు రంగులో వుండే రాతితో కట్టబడినవి. గాలికీ, వానకూ తట్టుకుని నిలువగల స్తోమత అంతగా ఈ రాతికి లేకపోవడమువలన కేవలము శతాబ్దప్రక్రమములోనే ఈమహాశిల్ప సముదాయం బీటలు వారడమేకాక, అక్కడక్కడ కూలిపోయింది. ఈ రీతిగ నిలువలేక కూలిపోయిన కొన్ని శిల్పఖండములను ఒక మ్యూజియంలో భద్రపరచియున్నారు.



ఫెర్గూసన్ అనే పాశ్చాత్యుడు కోణార్కను నిశితంగా పరిశీలించి చెప్పిన వాక్యాలను గమనించండి. "అత్యున్నత ప్రమాణాలలో జీవితమును, ప్రేమను, భక్తిని, సృష్టిని, తెలుసుకున్న జాతియొక్క కళాత్మకహృదయానికి, సాహసోపేతకల్పనకూ చిరంజీవియైన ఉదహరణ "కోణార్క" ఒక్కటే అని చెప్పవచ్చును.

కోణార్కకు పూరీనుండి (అనగా జగన్నాథం) ఇరువది మైళ్ళు. ప్రభుత్వ, ప్రైవేటుబస్సులు తిరుగుతుంటాయి. అరవై మైళ్ళ వలయములో వుండే పూరీ, కటక్, భువనేశ్వర్, కోణార్కలను చూచిరావడము అంత కష్టముకాదు.

ఇంతకూ కోణార్కమన ఉజ్జ్వల సంస్కృతిలో ఒక మెరుపు తీగ.

జీవితంలో ఒకమారుతప్పకచూడవలసిన ప్రాంతం కోణార్క. పూరీలోవలెనే ఇక్కడ కూడ పండా పురోహితుల బృందంవుంది.

*

# వెలుగొండరాయడు

శ్రీ.కె.రామానుజాచార్యులు

కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ వేంకటేశ్వరుడు యుగయుగాల నుండి జగజ్జాలను సంరక్షించుచు ధర్మగ్లానికలుగనీయక అటనట వెలయుచున్నాడని సర్వులకును తెలియును. అట్టి స్థలము లందు కొన్ని ముఖ్యప్రదేశములు కలవు. వానియందు శ్రీ వెలుగొండ ఒకటి. శ్రీ శేషాచలము మొదటనియు - తుది - వెలుగొండ యనియు మధ్య మధ్య అనేకములు ప్రసిద్ధ శ్రీ వేంకటేశ్వర క్షేత్రములు కలవనియు ప్రతీతి.

ఈ వెలుగొండ - శేషాచలము నుండి క్రమక్రమముగ ప్రత్యంత పర్వతములతో కలసి పొదిలి తాలూకా వరకు వ్యాపించి



యున్నదని పరిశీలకులనుచున్నారు. వెలుగొండ అను పదమును సంస్కృతీకరించిన శ్వేతాచలము కాగలదు. అటు శేషాచలము ఇటు శ్వేతాచలము శ్రీ వేంకటేశ్వర నిలయములు.

ప్రకాశంజిల్లా పొదిలి తాలూకా యందలి వెలుగొండలు చాల ప్రశస్తి వహించినవి. ఇందలి ప్రకృతి వైభవము వర్ణనాతీతము. ఈ జిల్లాలో ప్రవహించునదులకు జన్మస్థానము వెలుగొండ యనియే చెప్పవచ్చును.

ఆ వెలుగొండ దూరమునుండి చూచుటకు ఆదిశేషుని ఆకారము గలిగి విశాలమైన పడగ క్రింద ఈ తిరువేంగళనాథుడు వెలసి యున్నాడు. ఇది తిరుమల తిరుపతి వలెనే శ్రీ శేషశైలముగ కనుపడును. అదియు నింతియే కదా!

ఇతడు స్వయం ఆవిర్భావమూర్తియని జనశ్రుతి.

సుమారు నాల్గున్నర అడుగు ప్రమాణము కలిగి నయనానందకరముగ నుండి శ్రీ భూనీళా సహితుడై పద్మావతీ యుక్తుడై గుహలో వేంచేసియుండి, వెలుగొండ తిరువేంగడనాథుడన్న తిరునామముతో కోరి కొలచినవారికి కొంగు బంగారమై కొండంబుట్టిన కొండతేడగుటచే కోరమీసాలు, నెమలి యీకలు ధరించి భక్తుల ప్రార్థనాదికముల స్వీకరించుచు ఆపన్న జనరక్షకుడై విజయము చేసి యున్నాడు.

తిరుమల తిరుపతి యందు వలెనే ఇటను ముడుపులు చెల్లించికొనుట తలనీలాలర్పించుట అంతయునదే క్రమమున ఏనాటినుండో ఈనాటివరకు జరుగుచున్నది.

పూర్వగాథ ఇట్లు తెలియుచున్నది. దేవతల కోరిక నెరవేర్చిన ముచికుందుడు దేవతలిచ్చిన వరములుపొంది, ఇటనున్న గుహలో బడలికదీర నిద్రించుచుండెను. కాలయవనుని పాలబడ్డ శ్రీకృష్ణ పరమాత్మ వురుకులు పెట్టుచు నీగుహలో ప్రవేశించెను. శ్రీకృష్ణుడే తనను కన్నుగప్పి నిద్రించుచున్నాడని భావించిన కాలయవనుడు వికటాట్టహాసము చేయుచు ఉరమున కరము బిట్టుగ తన్నెను. అంతనా దెబ్బకు మేల్కొనిన ముచికుందుడు కనులు విప్పినంతనే కాలయవనుడు దేవతల వరప్రభావమున నీరై పోయెను. లోకపు పీడ విరుగడాయెను. శ్రీకృష్ణుడు ప్రత్యక్షము కాగా వరములను కోరి నీవు ఇటనే వెలుగొండ తిరువేంగళనాథుండన్న పేరున నుండి భక్తాభీష్ట వరప్రదాయకుడవై వెలుగొందుమని ప్రార్థించినాడట. అందువల్ల శ్రీకృష్ణుడు ముచికుందునకు దర్శనమిచ్చుచు అట గుహవద్దనున్నాడు. వేయి నామములవాడు వేంకటేశ్వరుడు కాన ఈ పేరున ఇటనుండి భక్తులకు దర్శనమిచ్చుచున్నాడు.

శ్రీ ముచికుందులవారుండి తపస్సుచేసిన గుహయున్నది కాని మూసివేయబడి యున్నది. అట కృష్ణవిగ్రహమున్నది. ఇది మూసి అర్థశతాబ్దమైనదని వినికిడి కారణము తెలియదు.

సూర్యవంశ సంజాతుడగు శ్రీ ముచికుందుడు సూర్యునకు త్రికాలములందు వదలబడిన అర్ఘ్యమే ముచికుందానదిగ ప్రవహించి అది నేటి జన వ్యవహారమున 'ముసి' యని పిలువబడుచున్నది. ఇది దేవాలయమున కించుక పై భాగమున మూడు పాయలుగ బయలుదేరి దేవాలయమును ఆనుకొని పిల్లకాలువగా కొనసాగి రాను రాను మహానదిగ మారి సాగర సంగమము చేయుచున్నది. దీని ప్రభావాదికములను గూర్చి శ్రీ నాయని సుబ్బారావుగారి జన్మభూమి కావ్యము పరిశీలించునది.

శ్రీ కృష్ణదేవరాయ మహీజాని మహామంత్రి మండలిలో నొకరగు శ్రీరాయసం కొండమరుసయ్యగారు ఈ దేవాలయమును 1484 (శ.క.) న సందర్శించి రాయలవారి ఆనతి మేరకు అంగరంగ వైభవములకు, అర్చక పరిచారకాధ్యాపకాది వివిధ వృత్తులవారికి 900 ఎకరముల భూమిని, కొంత పర్వతమును సమర్పించినట్లు శాసనము చెప్పుచున్నది. దీనిని దివ్యదేశము చేయుంచినట్లు మరియొక శాసనము తెలుపుచున్నది. ఆ శాసనములను పరిశీలించిన ఒకనాడు చక్కని గ్రామం వుండియుండవలయునని తెలియు

చున్నది. కాని నేడు దేవాలయపు అర్చకుడు మాత్రమే యున్నాడు.

తరువాత - కనిగిరి పొదిలి సీమలకు ప్రభువులైన శ్రీ వేంకటగిరి రాజావారల పరిపాలనలో నాల్గు శతాబ్దములుండి యున్నట్లు వారు కొంత భూవసతి కల్పించినట్లును, అర్చకునకు నెలకు రు. 20-00 జీతము ఇచ్చునట్లును, వివిధాభరణముల సమర్పించినట్లును, తెలియుచున్నది. తరువాత కలుజుల పాటి కరణంగారి పర్యవేక్షణలో కొంత మార్పు రాగా దేవాదాయ ధర్మాదాయ శాఖ స్వాధీనమొనర్చుకొని ప్రకృతము సర్వశ్రీ - మూర్తి, వేంకటేశ్వర్లు, సత్యానారాయణ మున్నగువారు ధర్మకర్తలై అభివృద్ధికి తెచ్చు యత్నం చేయుచున్నారు వీరలేగాక కనిగిరి డా. ఎస్.వి. సుబ్బారెడ్డి, శ్రీ దేవకి బాలకృష్ణమూర్తి, శ్రీ హనుమారెడ్డి వగైరాలు ప్రకృతము దేవాలయ పాలకవర్గ సభ్యులై కరెంటు వేయించుట రాకపోకల సౌకర్య మునకై రోడ్లు వేయించుట సత్రముల నిర్మాణము నీటి సౌకర్యము మున్నగు పనులు చేయుచున్నారు.

పూర్వము రాజులు సమర్పించిన సర్వాంగము వగైరాలు 250 తులముల వెండి పట్టువస్త్రములన్నియు కమిటీసభ్యుల వద్ద నున్నవి. పూర్వపు ఔన్నత్యము తేవలయు నన్న భావముతో దేవాలయ పాలకవర్గము అహర్నిశలు ప్రయత్నము చేయుచున్నది. వారి యత్నము సఫలమగు గాక! దేవాలయ నిర్మాణ కాలము నిర్ణయింప మనయూహాపోహలకు శక్తి చాలదు. ముఖమంటప ప్రాకారములు మాత్రము నవీనములని మాత్రము చెప్పవచ్చును. కాని చాలకాల మైనదగుట మూలాన కొంత శైథిల్యము నొంది జీర్ణోద్ధారణమపేక్షించుచున్నది.

ఈ దేవాలయముననే తాయార్ల శ్రీ సన్నిధి కలదు. విశేషించి కొండకొమ్మున మరొక దేవాలయము కలదు. ఒక గుహలో శివలింగ ప్రతిష్ఠయు గలదు. నాటి ప్రభువుల హరిహరాద్వైత భావమునకు ఇదొక ప్రబల సాక్ష్యము. నాగప్రతిష్ఠ గరుత్మంతుని ప్రతిష్ఠ శ్రీ వీరాంజనేయ భగవానుడు మున్నగు వారలేగాక పన్నిద్దరు ఆళ్వార్లు గోదాదేవియు ప్రతిష్ఠింపబడియున్నారు. ఇంకను పలువురున్నారు.

గ్రామ పరిరక్షకురాలుగ గంగాదేవి ప్రసన్న గంభీరయయి యున్నది. చతుర్భుజములలో త్రిశూలము, ఢమరుకము, ఖడ్గము, కుంకుమ బరిణెయు కలవు. ఇదే ఆకారముకల విగ్రహము ఈ మధ్య పాలేటి తీరమున బయటపడినది.

ప్రతి సంవత్సరము బ్రహ్మోత్సవము ఫాల్గుణశుద్ధ ౧౫ పూర్ణిమ నుండి నవాహ్నిక దీక్షతో పాంచరాత్రాగమ రీతిగ జరుగుచున్నది. ఆ తిరునాళ్ళ సమయమున జన సందోహము విపరీతముగ వచ్చును. వచ్చినవారలకు బ్రాహ్మణ, ఆర్యవైశ్య, రెడ్డి, నాయీబ్రాహ్మణ, కుమ్మర, రజక, హరిదాస, హరిజన, మున్నగు వారలకు ప్రత్యేకముగ సత్రములున్నవి. లేదనక భోజనము పెట్టుదురు. స్వామి ప్రభావాదికమునకు చిహ్నముగ ఎందరు వచ్చినను భోజన పదార్థములు తృప్తికి కొరతయే యుండదు.

అది నిర్జనారణ్యప్రదేశమయ్యు పూజారి మాత్రమటనేయుండి నిత్యనైవేద్యాదికముల నడుపుచున్నారు. ఈ ఆచార్యుని ధైర్యసాహసములేగాక భక్తియు ప్రశంసనీయము. ఇట్టి అంధకారమందు విష క్రూర జంతువుల భయము నాతడెరుగడు. చక్కని ప్రకృతి రామణీయకతతో కనుల విందొనరించుచుండును.

ప్రకృతము తిరునాళ్ళనాటికి కరెంటు సౌకర్య మేర్పడనున్నది. అట్లే రాకపోకల సౌకర్యమేర్పడుచున్నది. ఇంకను కొరవ సరవలు త్వరలో పూర్తికాగలవు. ఇట్టి ప్రదేశములందు తిరుమల తిరుపతి దేవాలయము వారు ఒక సత్రమును నిర్మించు టెంతైన అవసరము. అట్లే ప్రభుత్వమువారు ఒక పరిశ్రమను, కాలనీని, పాఠశాలను నిర్మించవలయును.

పొదిలి నుండి మార్కాపురం పోవు ప్రభుత్వ రహదారిలో గార్లదిన్నె నుండి దక్షిణముగ రెండు మైళ్ళుండును. రోడ్డున్నది. బస్సులు బండ్లు అన్ని రకములైన వాహనములు వెళ్ళగల గట్టిరస్తా. కావున శ్రీశైలము నుండి బయలుదేరిన తిరుపతి బస్సు ఇక్కడనుండి వెలుగొండకువచ్చి అటనుండి తిరుమలకు వెళ్ళవచ్చును. యాత్రలో మధ్యన మరొక దివ్యదేశమున శ్రీ తిరువేంగళనాథుని సేవించుకొనవచ్చును. అట్టి యత్నంచేయుదురుగాక! *

---

# యువ వాణి

## ఆదర్శాల ఆవశ్యకత

శ్రీమన్నవ గిరిధరరావు.

పురుషులందు పుణ్యపురుషులు వేరయా- అన్నాడు వేమన; వాళ్లూ మామూలు మనుషులుగానే జన్మిస్తారు. పెరిగి పెద్ద వారవుతారు. కాని అందరిలాంటి వారుకారు. పుణ్యపురుషులు పురుషోత్తములు అవుతారు. ఎలా అవుతారనేది ప్రశ్న.

"గౌతమబుద్ధుని అనంతరం భారత దేశంలో ఇంతటి మహావ్యక్తి జన్మించలేదు. జీసస్‌క్రీస్తు తర్వాత ప్రపంచం ఇంతటి మహనీయుని చూడలేదు" అని గాంధీ మహాత్ముని గురించి డాక్టర్ జె. హెచ్. హోమ్స్ అను అమెరికన్ మిషనరీ వ్యాఖ్యానించారు.

"ఈ భూమిమీద అట్టి మహాత్ముడొకడు రక్తమాంసాలుగల శరీరంతో మనుగడ సాగించాడంటే ముందు తరాలవారు బహుశా నమ్మలేక పోవచ్చుగూడ" అని ప్రఖ్యాత శాస్త్రవేత్త ఆల్‌బర్ట్‌ఐన్‌స్టీన్ గాంధీజీ మరణించినపుడు అభిప్రాయం వెలిబుచ్చాడు.

తనదేశీయులనే గాక దేశదేశాలలోని ఆలోచనావరులను, స్వేచ్ఛాపిపాసులను ఆకర్షించి ఆశ్చర్యచకితుల నొనర్చగల మహనీయుడుగా గాంధీజీ ఎలారూపొందాడు? ఆయనకుగల ప్రత్యేకతలు ఏమిటి?

నిజంచెప్పాలంటే మోహన్‌దాస్ కరం-చంద్ గాంధీ అతి సామాన్యవ్యక్తి. చదువుకొనే రోజుల్లో మరీమంచి మార్కులు తెచ్చుకొన్న ధీమంతుడుకాడు. దస్తూరి బాగుండేది కాదు. చూపరులను ఆకర్షించే రూపవంతుడు కాడు. గొప్పవక్త అసలేకాదు. సాహసవంతుడుకాడు. బారిష్టరు పట్టాపుచ్చుకుని రాజ్‌కోటలో న్యాయవాదిగా పనిచేస్తుంటే ప్రాక్టీసు సామాన్యంగావుండేది. అలాంటి వాణ్ణి దక్షిణాఫ్రికాలో భారతీయులు తమ తరపున వాదించడానికి రమ్మని తీసుకుపోయారు. ఆయన అచ్చటి భారతీయులపై తెల్లవారు జరిపే అత్యాచారాలకు చలించిపోయాడు. వాటిని ఎదుర్కొనడానికై 'సత్యాగ్రహ' మనే శాంతియుత మార్గాన్ని అనుసరించాడు. ప్రజలమీద ప్రేమ, వారి కష్టాలలో పాలువంచుకోవడం అనే ఆదర్శం ఆయనను ఒక నాయకునిగా తీర్చిదిద్దింది.

21 సంవత్సరాలు దక్షిణాఫ్రికాలో ఉండి, అచటి భారతీయులకు పౌరహక్కులను సాధించి, 1915లో స్వదేశానికి తిరిగివచ్చాడు. తిలక్, గోఖలేలతో పోల్చితే గాంధీ లెక్కింపదగిన నాయకుడుకాడు. అలాంటివాడు 1919 నాటికల్లా భారత రాజకీయాకాశంలో సూర్య తేజస్సుతో వెలుగొందనారంభించాడు. భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని సాధించడమనే ఆదర్శాన్ని గాంధీ తన ఎదుట పెట్టుకున్నాడు. ఆ బృహత్కార్యసాధనకొరకు తనకు తాను మార్పుచెంది, వ్యక్తిగత వాంఛలను అవతలకునెట్టి, తన లోటుపాట్లు సరిదిద్దుకొని, ప్రజలముందు నిలబడ్డాడు.

'స్వరాజ్యం సాధించాలి' అనే ఆదర్శం ఎంతోమందిని పురుషోత్తములుగా తీర్చిదిద్దింది. పలువురు యువకులు బ్రహ్మచర్యమవలంబించి జీవితాంతం దేశసేవలో నిమగ్నులైనారు. కొందరు రచయితలుగా రూపొంది తమ కలాలతో ప్రజలను మేల్కొల్పారు. బిపిన్‌చంద్రపాల్, సురేంద్రనాధ్ బెనర్జీ లాంటి వారు తమ వాగ్ధాటితో దేశ ప్రజలనుర్రూతలూగించారు. ఆంగ్లేయులకు అన్నిరంగాలలో సమఉజ్జీలుగా నిలవాలనీ, వారిని మించిపోవాలనీ ఆ నాడు భారతయువకులు ఎంతో శ్రమించారు. ఎవరికివారు ఎదగటం కోసం, అభివృద్ధిచెందటంకోసం కృషిచేశారు. ప్రతివ్యక్తీ ఒకవైపు తన గుణసంపదను పెంచుకుంటూ మరొకవైపు తనకు చేతనైన రీతిలో దేశానికీ సమాజానికీ ఉపయోగపడాలని ప్రయత్నించాడు. ఒక ఆదర్శం ఎదురుగా వున్నపుడు మనుషులనడవడి అలా వుంటుంది.

స్వరాజ్యం వచ్చిన పిదప ఈ ఆదర్శంతో పని తీరిపోయింది. దాని స్థానంలో మరొక ఆదర్శమేదీ ప్రజల ముందులేదు. వెంటనే ఎవరి స్వార్థం వారికి గుర్తువచ్చింది. తన సౌఖ్యంకొరకు, తన ఉన్నతికొరకు, తన గొప్పకొరకు చదువును, పదవిని, ధనమును వెచ్చించాలనే వాంఛ యావన్మందిలో పెల్లుబికింది; దేశంలో విశ్వవిద్యాలయాలసంఖ్య పెరిగింది; మనుషులలో వివేకం క్షీణించింది; సౌశీల్యం సన్నగిల్లింది; సంస్కారం కొరవడింది, ఇందుకుకారణం 'ఆదర్శం' కొరవడటం.

దేశంలో డాక్టర్లుగా, ఇంజనీర్లుగా, ఆడిటర్లుగా అగ్రశ్రేణిలో ఉత్తీర్ణులైన యువకులు పలువురున్నారు. వాళ్లు ఆయా వృత్తులలో పైకిపోయి కీర్తిప్రతిష్ఠలార్జిస్తారని తల్లిదండ్రులు ఆశపడతారు. కాని అనతి కాలంలోనే వాళ్లు త్రాగుడు, గుర్రపు పందాలు, దుర్వ్యసనాలకులోనై గడ్డిపోచల కంటే కనాకష్టంగా తయారవుతున్నారు. అంత చదువులు చదివిన వాళ్లకు వీసమెత్తు వివేకం ఎందుకులేదూ అని ప్రశ్న! ఆ చదువు వెనుక 'ఆదర్శం' లేకపోవడమే అందుకు కారణం.

దేశంలో విద్యావంతులు, ఉద్యోగులు, వ్యాపారవేత్తలు, రాజకీయవేత్తలు, అంతా ఒకేగాట నడుస్తున్నారు: తమకు చెందనట్టి సమాజానికి ఇతరులకు చెందినట్టి సంపదను స్వంతం చేసుకోవడంలో చిత్రవిచిత్ర మార్గాలను కనిపెడుతున్నారు. మోసం అనేది ఒక వృత్తిగా రూపొందింది.

మనిషి ఎవరిని మోసగించడు? తాను ప్రేమించిన వారిని మోసగించడు. ప్రేమ అనేది మహత్తరశక్తి. ప్రేమవున్నచోట



వేదవిద్యల జ్ఞానము వెల్లివిరియ
రంగవల్లి కలన్ని యు రాణయొసగ
వలపుతలపులు విరివిగ ఒలకబోయ
సరస సంక్రాంతి సుందరీ స్వాగతమ్ము !

ఉత్తరాయణ పుణ్యమ్ము ఉర్వజనుల
కొసగ మకరాన భానుజ ఉదయమాయె
పాడిపంటల దేవత భాగ్యలక్ష్మి !
సరస సంక్రాంతి సుందరీ ! స్వాగతమ్ము !

బంతిచేమంతి కుసుమాలు ప్రభలుజిమ్మ
పౌష్య హేమంత సంక్రాంతి భాగ్యలక్ష్మి
ప్రజలు శాంతిసౌఖ్యాలతో వరలునట్లు
తరలిరావమ్మ సంక్రాంతి భాగ్యలక్ష్మి !

వాడవాడల గొబ్బిళ్ళు పాడుచుండ
మేడమేడల తోరణాల్ మెరుపులీన
మధుర కళ్యాణ మేళాలు మారుమ్రోగ
సరస సంక్రాంతి సుందరీ ! స్వాగతమ్ము !

ముద్దు ముత్యాల ముగ్గులు ముంగిటింట
వారిజాక్షులు దిద్దిరి వన్నెతోడ
కలుము లీయగ రావమ్మ కొలువు తీర్ప

— దిట్టకవి వెంకటరామానుజాచార్యులు

తప్పులు కనిపించవు. ప్రేమ త్యాగం చేయిస్తుంది. ప్రేమవుంటే ఎక్కువ తక్కువ లుండవు. ప్రేమ ఇస్తుందేగాని ఇవ్వమని కోరదు. అది అనేక ఇతర సద్గుణములకు నెలవు.

పూర్వం 'దైవభక్తి' అనేది ఒక ఆదర్శంగా మన ప్రజల ఎదుట వుండేది. భక్తి అంటే మూఢవిశ్వాసంకాదు; భక్తి అంటే ప్రేమ. దైవభక్తి అనగా దైవాన్ని ప్రేమించడం. కనబడని దేవుని ప్రేమించడం ఎలా? అందుచేత దేవుని ప్రేమించడమంటే దేవుడి సృష్టిని ప్రేమించడం, ఈ సృష్టిలో వున్న మానవులతోసహా అన్ని ప్రాణులనీ ప్రేమించడం.

"ఈశ్వర స్సర్వభూతానాం
హృద్దేశేఽర్జున తిష్ఠతి"

ఈశ్వరుడు సర్వప్రాణుల హృదయములలోను నివసిస్తున్నాడని భగవద్గీత 18వ అధ్యాయంలో వుంది. అందుచేత భగవంతుని ప్రేమింపదలచినవాడు సృష్టిలోని అన్ని ప్రాణులను ప్రేమిస్తాడు, ఆ ప్రాణులలోకెల్ల ముఖ్యులైన మానవులను తప్పనిసరిగా ప్రేమిస్తాడు. తనవలన ఏ మానవునికీ కష్టంగాని, నష్టంగాని వాటిల్లకూడదని భావిస్తాడు. వారినుండి ఏమి తీసుకుంటాను అని గాక వారికి ఎలా ఉపయోగపడగలను అని ఆలోచిస్తాడు. ఈ భావన ఒక ఆదర్శం. ఈ ఆదర్శం గలవాడు తప్పులుచేయడు. నేరాలు చేయడు. సమాజమే దైవస్వరూపమని, సంఘశ్రేయస్సులోనే దైవచింతన ఇమిడి వున్నదని గుర్తిస్తాడు.

మరొక ఆదర్శం దేశభక్తి, అనగా దేశాన్ని ప్రేమించడం, అందులో నివసించే ప్రజలను ప్రేమించడం. ఆ ప్రజలకు హాని కలిగించే పనులు తలపెట్టకపోవడం. వాళ్లకు అపకారంగాని విపత్తుగాని కలిగితే తనకు కలిగినట్లుగా భావించడం. ఈ రకమైన దేశభక్తి వ్యక్తిలో వున్నపుడు తాను సమాజానికి ఏమి ఇవ్వగలనని ఆలోచిస్తాడు గాని, తీసుకోడానికి ప్రక్కవాణ్ణి దోచుకోడానికి ప్రయత్నించడు. ◆

## అప్రియసత్యం

"సత్యంబ్రూయాత్ ప్రియంబ్రూయాత్
న బ్రూయాత్ సత్యమప్రియమ్,
ప్రియం చ నానృతం బ్రూయాత్
ఏష ధర్మ స్సనాతనః."

సత్యం పలుకవలె! ప్రియంపలుకవలె! అప్రియమైన సత్యం పలుకరాదు. ప్రియమని అసత్యం పలుకరాదు. ఇది సనాతనమైన ధర్మం. ఇది పై శ్లోకానికి తాత్పర్యం.

"సత్యమేవ జయతే" - సనాతన భారతీయ సంస్కృతికిది అంతరాత్మ. నేడు ఈ సుభాషితాన్నే స్వతంత్ర భారతదేశం మకుటంగా స్వీకరించింది. గాంధీమహాత్ముడు సత్యమే పరబ్రహ్మస్వరూపం అన్నాడు. అయితే పై శ్లోకం సత్యానికి ప్రియభాషణంతో ముడిపెట్టింది. సత్యం చెప్పాలి; అయితే ఆ సత్యాన్ని ప్రియంగా చెప్పాలి. ఒకనేళ కఠోరసత్యం చెప్పవలసివస్తే! అప్రియమైన సత్యాన్ని చెప్పవద్దని పై శ్లోకం చెప్పేసలహా!! అయితే-ప్రియమైనదని అసత్యం మాత్రం ఎన్నడూ చెప్పగూడదు. అని ఈ శ్లోకం అనుశాసిస్తోంది. ఈ శ్లోకం తెచ్చిపెట్టిన చిక్కు 'అప్రియసత్యం చెప్పరాదు' అనే ఆదేశం. ఈ అనుశాసనంతో ఏకీభవించని ఆదర్శప్రేరితులు "సత్యం ప్రియమైనా అప్రియమైనా సరే శంకాసంకోచాలు లేకుండా చెప్పవలసిందే" అంటారు. ఆ వాదాన్ని అంగీకరించేవారు "న బ్రూయాత్ సత్యమప్రియం" అనే పాదానికి వారివాదానికి అనుకూలంగావ్యాఖ్యానం చేస్తున్నారు. "సత్యమును అప్రియంగా చెప్పకు" అని వారు ఆ పాదానికి అర్థం చెప్తారు. అయితే సత్యం ప్రియభాషణం కలిస్తే ఇక అది అందరకు ఆమోదదాయకమే గదా.

ఒక కవీంద్రుడు ఈ వివాదానికి సుకుమార సుందరమైన అవృత్తి కల్పించారు.

పురుషా బహవో రాజన్
సతతం ప్రియవాదినః,
అప్రియస్య తు పథ్యస్య
వక్తా శ్రోతా చ దుర్లభః.

ఓరాజా,

ప్రియము పలుకువారు పృథివిలో కొల్లలు!
వినెడివాడుగలరు వేలకొలది!
అరుదు పథ్యమప్రియమ్ము పల్కెడువాడు
వినెడువాడుగూడ విశ్వమందు!

అని పై శ్లోకాన్ని తెలుగుపద్యంలోకి అనువదించవచ్చు. సనాతన ధర్మం 'సత్యమేవ జయతే' అని ప్రతిపాదించి లోకసంగ్రహార్థం అప్రియ సత్యాన్ని చెప్పవద్దనటానికి "వక్తా శ్రోతా చ దుర్లభః" కారణం కావచ్చు. మానవుడు సంఘజీవి. అప్రియసత్యం పలుకటం సామాజికజీవితంలో ఏటికి ఎదురీత. అయితే, మానవమాత్రుడు అప్రియ సత్యం చెప్పే సాహసం లేకపోవటం సహజం అని పై శ్లోకాలు సానుభూతి చూపిస్తున్నాయి గాని,'నిరయంబైన నిబద్ధమైన ధరణీనిర్మూలనంబైన .... తిరుగన్ నేరదు నాదుజిహ్వ వినుమా ధీవర్య వేయేటికిన్' అనే మహోదారులు అతిలోకతేజస్వులు ఆధ్యాత్మిక తపస్సంపన్నులు అని పై శ్లోక కర్తలు అంగీకరిస్తారని సూక్ష్మదృష్టికి తట్టుతుంది. ఎందు చేతనంటే ఈ శ్లోకధ్యేయం సత్యపారమ్యనిరూపణమే.

## వెలుగుబాట

డా॥ నండూరి రామకృష్ణమాచార్య

అయితే యీ భూలోకంలో దేశకాలపాత్రానుబద్ధమైన వ్యావహారిక కర్మజగత్తులో "సత్యం" అనే మాటకు సుస్థిర నిర్వచనం చేయటం సాధ్యమా? సంభావ్యమా? మహాభారతంలో-ధర్మవ్యాధుడు

భూతహితంబుగా పలుకు బొంకును
సత్యఫలంబునిచ్చు; తద్
భూతభయాస్పదంబగు ప్రభూతపు
సత్యముబొంకునట్లు; ప్రా
ణాతురుడైనచో పరిణయంబున
యందును ఆడు బొంకు స
త్యాతిశయంబ యండ్రు మహితాత్మక
ఇట్టివి "ధర్మసూక్ష్మముల్"

అని - బ్రాహ్మణ తపస్వి కౌశికునకు వివరిస్తాడు.

భాగవతంలో బలిచక్రవర్తి సత్యవ్రతానికి కట్టుబడి వామనునికి మూడు అడుగులు దానం చేసే సందర్భంలో రాక్షసగురువు శుక్రాచార్యుడు సత్యభాషణానికి కొన్ని అపవాదాలు ప్రతిపాదించాడు.

వారి జాతిలందు వైవాహికములందు
ప్రాణవిత్తమానభంగమందు
చకితగోకులాగ్ర జన్మరక్షణమందు
బొంకవచ్చు! అఘము పొందదధిప!!

శుక్రనీతిలోని సత్యనిర్వచనభాండంలో పాల పాలుకంటె నీటిపాలు అధికంగా కన్పిస్తోంది. అయితే బలిచక్రవర్తి తన సత్యనిష్ఠ వదలుకోలేదు. అట్లాగే కేవలం సత్యనిష్ఠకు అంకితమైనవాడు హరిశ్చంద్రుడు. ఎట్టి ఇక్కట్టులు దాపురించినా అతడు తన సత్యనీతి నిష్ఠకుభంగం రానీయలేదు.

ఇక ఈ సందర్భంలో అనుశీలించవలసింది నిరత సత్యవ్రత నిష్ఠాగరిష్ఠుడైన ధర్మరాజుమాట. మహాభారత సంగ్రామంలో సేనాధిపతియైన ద్రోణుని ధాటికి తట్టుకోలేక పాండవసైన్యం చెల్లాచెదరై వెనుదిరిగి పారిపోతోంది. ధనువుచేతనుండగా ద్రోణుని విజృంభణ అరికట్టటం అసాధ్యం. శ్రీకృష్ణుడు చెప్పిన సలహా 'అశ్వత్థామ చచ్చె' నని ధర్మరాజు వెళ్లి ద్రోణునితో చెప్పితే, పుత్రశోకార్తుడైన ద్రోణుడు తన చేతివిల్లు దించగలడు అని. ఇక ధర్మరాజు సత్యవ్రతం ఏంకావాలి! దానికి ధర్మరాజు సమ్మతించడు. ఇంతలో భీముడు ముందుకు వచ్చి, తాను అంతకుముందే 'అశ్వత్థామ' అనే ఏనుగును చంపినాననిచెప్పి ద్రోణుని దగ్గరకు వెళ్ళి "అశ్వత్థామా హతః" అని బిగ్గరగా అరచివచ్చాడు. ద్రోణుడు, భీముని మాటలు నమ్మలేకపోయాడు. అతడు ధర్మరాజు దగ్గరకు వచ్చి నిజం చెప్పమని అర్థించాడు. ధర్మరాజు శ్రీకృష్ణుని ప్రేరణవల్ల జయాశవల్ల బిగ్గరగా అశ్వత్థామా హతః అని మెల్లగా "కుంజరః" అని మేలి ముసుగు వేసిన అసత్యం చెప్పాడు.

ఇది ధర్మరాజు శీలానికి కళంకం కాదా? కాదని ఎవరనగలరు? అందుకనే ధర్మరాజు మొదట నరకసందర్శనం చేసి ఆటు పిమ్మటే స్వర్గానికి వెళ్ళినట్లు మహాభారత కథనం! అంతేగాక ధర్మరాజును అసత్యమాడమని ఆదేశించింది శ్రీకృష్ణపరమాత్మ. ధర్మరాజు, 'సర్వధర్మముల్ పరిత్యజించి' శ్రీకృష్ణపరమాత్మకు శరణాగతుడైన భక్తుడు. మానవమాత్రుడెవడు అసత్యదోషానికి బాధ్యత వహించి నిష్కృతి కల్పింపగలడు? కేవలం పరమాత్మ తప్ప అని సరిపెట్టుకోవాలి అని పండితులు దీనికి సమన్వయం కల్పిస్తారు!



"సప్తాశ్వరథమారూఢం
ప్రచండం కశ్యపాత్మజమ్,
శ్వేతపద్మధరం దేవం
తం సూర్యం ప్రణమామ్యహమ్."

సూర్యోపాసన వేదకాలం నుండి ఆచారంగా వస్తున్నది. సంధ్యావందనాలలో జపించే అనేక మంత్రములలో సైతము ఆదిత్యుని స్తుతించటం జరుగుతున్నది. సూర్యభగవానుడు ఉదయించే తూర్పుదిశ మనకు పరమపవిత్రమైనది. వైజ్ఞానిక పురోభివృద్ధితో పరుగువందెం వేస్తున్న పాశ్చాత్య దేశాలదృష్టిలో సూర్యచంద్రులు కేవలం గ్రహాలే అయినా మనదృష్టిలో మాత్రం ఎన్నటికీ ప్రత్యక్షదైవాలే. ఆంధ్ర దేశమంతా ఆనందడోలికలలో నూగించే 'సంక్రాంతి' పర్వం సప్తాశ్వుని గమనానికి సంబంధించిన పర్వదినం.

"సంక్రాంతి" లేక "సంక్రమణం" అనగా నడచుట, మారుట, అవస్థాంతరం పొందుట అని అర్థం. మార్తాండుడు క్రమంగా ప్రతి నెలా మేష, వృషభాది ద్వాదశరాసులలో ప్రవేశిస్తూ ఉంటాడు.

"తత్ర మేషాదిషు ద్వాదశరాశిషు క్రమేణ
సంచరతః
సూర్యస్య పూర్వస్మాద్రాశే రుత్తరరాశౌ
సంక్రమణ ప్రవేశః సంక్రాంతిః"

సూర్యుడు పూర్వరాశి నుండి తరువాతి రాశిలోకి ప్రవేశించుట "సంక్రాంతి" అని "జయసింహ కల్పద్రుమము"న చెప్పబడి యున్నది. జ్యోతిశ్శాస్త్రరీత్యా నక్షత్రములు 27. వాటికి ఒక్కొక్కదానికి నాలుగు పాద ముల వంతున మొత్తం 108 పాదములు. పాదాలలో తొమ్మిదేసి పాదాలు వాటి ఆకారాలనుబట్టి 12 రాశులుగా యేర్పడినవి. మేష, వృషభ, మిథున, కర్కట, సింహ, కన్య, తుల, వృశ్చిక, ధనుస్సు, మకరం, కుంభం, మీనం మొదలగునవి. సూర్యుడు ఒకరాశినుంచి వేరొకరాశిని చేరుటను 'సంక్రాంతి' అంటారు.

సూర్యుడు ఈ విధముగా సంవత్సరము నందలి పన్నెండునెలలు పన్నెండురాశు లలో ప్రవేశించుతాడు. కనుక సంవత్సరానికి 12 సంక్రాంతులు వస్తాయి. ఈ సంక్రాంతులను నాలుగు భాగములుగా విభజించ వచ్చును. 1. ఆయనసంక్రాంతులు 2. విషువసంక్రాంతులు 3. షడశీతిసంక్రాంతులు 4. విష్ణుపదీసంక్రాంతులు.

ఉత్తరాయణారంభకాలంలో వచ్చే 'మకరసంక్రాంతి' దక్షిణాయనారంభంలో వచ్చే 'కర్కటసంక్రాంతి-రెంటినీ ఆయన సంక్రాంతులు అంటారు. మేష, తులా సంక్రాంతులు "విషువసంక్రాంతు" లని వ్యవహరించబడుతాయి. అనగా ఈ కాలములో రాత్రింబవళ్ళు సమానంగా వుంటాయి. కనుక వాటికాపేరు కలిగింది. మిథునసంక్రాంతి, కన్యాసంక్రాంతి, ధనుర్మాస సంక్రాంతి- "షడశీతిసంక్రాంతు" లనీ, వృషభ, సింహ, వృశ్చిక, కుంభ సంక్రాంతులు "విష్ణుపదీసంక్రాంతు" లని వ్యవహరించబడుచున్నవి.

దివాకరుని దివ్యయాత్రలో మజిలీ లయిన ఈ పన్నెండు సంక్రాంతులేగాక సంక్రమణ సమయాన వచ్చే వారాలనుబట్టి నక్షత్రాలనుబట్టికూడ మరో 7 సంక్రాంతులు గలవు. అవి 1. మందా 2. మందాకినీ 3. ధ్వాంక్షి 4. హోరా 5. మహోదరీ 6. రాక్షసీ 7. విశ్రితా సంక్రాంతులని జ్యోతిశ్శాస్త్ర విదితం.

'సంక్రమణ' కాలం అనగా సూర్యుడు ఒకరాశి నుండి వేరొక రాశిలోనికి మారుటకు పట్టుకాలం అతి సూక్ష్మమైనది. సంతుష్టితో సుఖాసీనుడైయున్న మానవుడు నేత్ర స్పందనము చేయుటకు పట్టుకాలములో 30వ భాగానికి 'తత్పర' అనియు, తత్పరలో నూరవవంతు 'త్రుటి' అనియు అంటారు. ఆ త్రుటిలో నూరవవంతు సంక్రమణకాలం. ఈ కాలవిభాగాన్ని కొలవటం అసాధ్యం. కనుక ఆ కాలానికి అటు, ఇటూ



## ంక్రాంతి
### టి భోగీశవరం

కొన్ని ఘడియలకాలం పుణ్యకాలంగా పరిగణించబడుతున్నది.

ఈ విధంగా ద్వాదశ సంక్రాంతులున్నా, "మకరసంక్రాంతి" యే మేటి పర్వదినంగా వాసికెక్కుటకు ముఖ్యకారణం మకరసంక్రమణంలో ఉత్తరాయణకాలం ఆరంభం కావటమే.

### 'ఉత్తరాయణ' వైశిష్ట్యం

'మకరసంక్రాంతి' తో మార్తాండుని ఉత్తరాభిముఖప్రయాణం ఆరంభమౌతుంది. ఈ ఆరుమాసాలకాలం దేవతలకత్యంత ప్రీతిపాత్రమైదని, ఈ పుణ్యకాలంలో స్వర్గద్వారాలు తెరచియుంటాయని, ఈ కాలంలో గతించినవారికి ఉత్తమగతులు ప్రాప్తిస్తాయని మన విశ్వాసం.

ఆగ్నిః జ్యోతిః అహః శుక్లః
షణ్మాసా ఉత్తరాయణమ్,
తత్ర ప్రయాతా గచ్ఛంతి
బ్రహ్మ బ్రహ్మవిదో జనాః.
... ... ... ...
ధూమో రాత్రిః తథా కృష్ణః
షణ్మాసా దక్షిణాయనమ్,
తత్ర చాంద్రమసం జ్యోతిః
యోగీ ప్రాప్య నివర్తతే.

— "భగవద్గీత"

ఉత్తరాయణంలో మరణించినవారు ముక్తులవుతారని దక్షిణాయనంలో మరణించినవారికి పునర్జన్మ కలుగునని శ్లోకభావం. ఉత్తరాయణంమోక్షంకోసం, దక్షిణాయనం జననమరణాదిసంసారములకోసం ఏర్పడినదని భగవద్గీత చెప్పుచున్నది.

సూర్యుడు మకరరాశిలో ప్రవేశించు సమయంలో మకరరాశి అధిపతి అయిన శనైశ్చరునకు అత్యంత ప్రీతిపాత్రము అయిన నువ్వులు, కూష్మాండము, కంబళ్ళు, సజ్జలు మున్నగు ఉష్ణప్రకృతులైన వస్తువులను దానమొసంగవలెనని పురాణగ్రంథాలు ఆదేశించుచున్నవి. ధనుర్మాసకాలంలో విష్ణ్వాలయాలలో దీపారాధన చేయుటవలన విష్ణుమూర్తి అనుగ్రహానికి పాత్రులు కాగలుగుటయేగాక సకలరోగశాంతి చేకూరి సుఖశాంతులు సిద్ధించునని ఈ క్రింది శ్లోకం నుడువు చున్నది.

"దీపదానం ప్రశస్తం హి
ధనుర్మాసస్య పూజనే.
గోఘృతేన చ వైదీప
మథవా తిలతైలతః.
అఖండదీపాన్ శక్త్యా చ
విష్ణవే పరమాత్మనే.
అర్పయేద్యది పుణ్యాత్మా
సర్వరోగాత్ప్రముచ్యతే".

మకరసంక్రాంతినాడు అభ్యంగనస్నానం చేయనివారు ఏడుజన్మల పర్యంతము రోగులుగానూ దరిద్రులుగానూ వుంటారని, ఆనాడు దేవతలకు, పితృదేవతలకు పూజలు చేయనివారు జన్మజన్మలకూ సూర్యుని అనుగ్రహమునకు పాత్రులుకాజాలరని శాస్త్రగ్రంథములు తెలుపుచున్నవి.

### మూడుదివాల పండుగ

సంక్రాంతి సాధారణంగా భోగి, మకర సంక్రాంతి, కనుము అని మూడురోజులు జరుపబడుతుంది. ఇలా ఈపర్వం మూడు దినాలు జరుపుటకు గల కారణాన్ని బలిచక్రవర్తి వృత్తాంతంతో సమన్వయించి చెబుతారు. తొంభైతొమ్మిది యజ్ఞాలుచేసి నూరవయజ్ఞం చేయడానికి ఉపక్రమించి ఇంద్రపదవిని బలిచక్రవర్తి అందుకోబోవు తరుణంలో విష్ణువు వామనావతారధారియై మూడడుగుల దానము కోరి బలిని పాతాళానికి త్రొక్కిన గాథ యెల్లరికీ విదితమే. ఈ విధంగా 'బలి' పాతాళానికి అణచివేయబడిన రోజు మకరసంక్రాంతేనని పురాణవిదితము. త్రివిక్రముని త్రిపాద సంకేతములుగా ఈ సంక్రమణోత్సవం మూడురోజులపండుగ (భోగి, సంక్రాంతి, కనుము) గా జరుపుట కారణమైనదని భావించబడుచున్నది.

### భోగిపండుగ

మకరసంక్రమణమునకు ముందటిరోజున భోగి పండుగ జరుపబడుచున్నది. 'భోగి'





# కర్మసాక్షి

ఓ పండితులారా! ఓ సర్వజీవులారా!
ఓ భూతములారా! ఓ శక్తులారా!
మీరందఱూ యిలారండి!
'కర్మసాక్షి' ని పూజిద్దాం, రారండి!
అతఁడే మన రక్షకుడు.

అతఁడు వర్షప్రదాత
వర్షం మన వరప్రదాత!
"పవలుఱేడు' మాంత్రికుడు!
అతడు జలాన్ని ఆవిరిగా మారుస్తాడు.
పై పైకి గొంపోతాడు!
దాన్ని మళ్ళీజలంగామార్చమని
వాయువును ఆజ్ఞాపిస్తాడు!
మళ్ళీ మధురంగా వర్షం కురుస్తుంది!
వర్షం సంగీతం పాడుతుంది.

వర్షాలు జంత్ర వాద్యాల తీగలు
మెరిసే వజ్రాలతో చేసిన కోలలు
అంబర సీమనుండి క్రిందపడతాయి!
భూవనిత దాహం తీర్చుకుంటుంది
ఉష్ణం శీతలాన్ని - శీతలం ఉష్ణాన్ని
యిస్తాయి.

అంతా అద్వైతం అయిపోతుంటే
ఉష్ణం తపస్సు-శీతలం యోగం-
ఉష్ణం పురుషుడూ-శీతలం స్త్రీ
ఉష్ణం గంభీరం-శీతలం మధురం-
స్త్రీమూర్తి పురుషుని మించి
గౌరవించబడటం లేదూ?
ఈ 'ఉష్ణ ప్రభువును' పూజిద్దాం
అతడ్ని వర్ధిల్లనీయండి!

తమిళమూలం: సుబ్రహ్మణ్యభారతి
ఆంగ్లానువాదం: ఆర్. సుదర్శన్
ఆంధ్రానువాదం: పి. మోహన్

అనేపదం 'భుజ్' అనే సంస్కృతధాతువు నుంచి ఉత్పన్నమైనదనీ, సస్యసమృద్ధికి, దేవేంద్రుని అనుగ్రహార్థం ఈ పండుగ జరుపబడుచున్నదని కొందరి భావన. "భూదేవి" అంశంగా జనించిన "గోదాదేవి" ఈ ధనుర్మాసకాలంలో ధనుర్మాసవ్రతము గావించి విష్ణుమూర్తిని ఆరాధించి మకర సంక్రమణ సమయానికి ముందునాడు విష్ణువును పరిణయమాడినదనీ విష్ణుమూర్తి భూదేవిల పరిణయానికి సూచకంగా ఈ భోగిపండుగ (గోదాదేవీ విష్ణుమూర్తుల భోగజీవితానికి చిహ్నం) నిర్వర్తించబడుచున్నదనీ పురాణప్రతీతి.

భోగిపండుగనాటి తెల్లవారుజామున పూర్వము పరిహరించి యుంచిన నిరుపయోగమగువస్తువులు మంటలోవేసి కాల్చివైతురు. ఉత్తరభారతమున ఈ మంటలను 'లోడి' యందురు. ఆ మంటల్లో కాగిన ఉష్ణోదకముతో అభ్యంగనమంగళస్నానముచేసి దీనితో అశుభము పీడ విరుగడయినదని భావిస్తుంటారు. భోగిమంటలకు సంబంధించి పై పురాణగాథలెంతవరకు విశ్వసనీయమోగాని శీతాకాలస్తబ్ధతను పారద్రోలి నూతనచైతన్యము నుసిగొల్పుటకే ఈ భోగిమంటలు పూర్వులచే నిర్దేశితములేమోననే భావనమాత్రం స్ఫుటంగా తోచుచున్నది.

రెండవనాడు మకరసంక్రాంతి. ఆనాడు మంగళస్నానానంతరం పితరుల పుణ్యలోకప్రాప్తి నిమిత్తం తర్పణశ్రాద్ధాదులనొనరించుట ముఖ్యాచారము. సంక్రమణ సమయమున చేసిన ధర్మకార్యము గాని అధర్మకార్యముగాని కోటిరెట్లు ఫలితము నీయగలదని దేవీపురాణం నుడివియున్నది. కనుకనే సంక్రాంతినాడు తమకున్నంతలో దానధర్మాలు చేయుట నేటికినీ అనేకచోట్ల జరుగుచునే యున్నది.

## కనుము పండుగ

'కనుము' పశువులపట్ల కృతజ్ఞతా సూచకంగా కర్షకులు జరిపే పండుగ. దీనినే తమిళులు 'మాట్టు పొంగల్' అంటారు. ఈ పండుగకు సంబంధించి ఒకకథ వాడుకలోనున్నది. ఇంద్రపూజను మాన్పించి గోపూజలను శ్రీకృష్ణుడు జరిపించగా అవమానాన్ని సహించలేని ఇంద్రుడు క్రోధంతో ప్రళయాన్ని సృష్టించగా కృష్ణుడు గోవర్ధన గిరినెత్తి గోవులను గోపాలకులను రక్షించెననీ, నాటినుండి ఇంద్రపూజస్థానంలో 'గోపూజ' ఆచారమైనదనీ అదే కనుము పండుగగా రూపొందెనని చెప్పబడుచున్నది.

"కనుము" పండుగనే పక్షులపండుగ అని కూడ వ్యవహరిస్తారు. "కనుమునాడు



కాకైనా మునుగుతుంది" అనే సామెత కూడ వుంది. కనుమునాడు ఇంటిల్లి పాదీ మంగళస్నానాలాచరించి విశాల మైదానాలలో ధాన్యమును గారెలను వెదజల్లి పక్షులను ఆహ్వానిస్తుంటారు. కనుమునాడు కాకైనా కదలదన్నట్లు ఆరోజు ప్రయాణాల వంటివి నిషేధిస్తారు. గ్రామదేవతల ఆలయాలవద్ద పశువులను చేర్చి హారతులనిచ్చి గ్రామదేవతలకు పొంగళ్ళు నివేదిస్తారు.

## గొబ్బిళ్ళ వృత్తాంతం

'గొబ్బి' అనేమాట "గర్భ" అనే పదము నుండి వచ్చిందని కొందరూ 'గోపి' యనే పదమునుండి వచ్చినదని మరికొందరు భావించుచున్నారు. 'గర్భ' అనే పదము కన్నా 'గోపి' అనే పదమే సమంజసమైనదిగా తోస్తుంది. ఆండాళ్ రచించిన తిరుప్పావై అనే గ్రంథంలో గోపాలకృష్ణుని గోపికలు 'గోపియలో' అంటూ గానంచేస్తూ స్తుతించినట్లు చెప్పబడుటవలన గొబ్బి నృత్యాలు గోపికానృత్యాలుగా భావించబడినవి. అంతేగాక ధనుర్మాసానికి, వైష్ణవమతానికిగల సాన్నిహిత్యాన్ని బట్టి కూడ ఈ గొబ్బి నాట్యాలు వైష్ణవమతప్రాబల్యంతో గోపికల నృత్యంగా ఊహించబడినవి.

ధనుర్మాసారంభమునుండి మకరసంక్రమణం వరకూ గృహప్రాంగణమున రమ్యమైన రంగవల్లులు దిద్ది, ఆ ముగ్గులమధ్యలో వసుపు కుంకుమ, గుమ్మడిపూలతో నలంకరించిన మూడు గోమయపు ముద్దలు (గొబ్బిళ్ళు) నుంచుదురు. ధనుర్మాసనియమము లందు ఈ గొబ్బిళ్ళను గురించి:

"గోమయేన చ గాం కృత్వా తథా గోవర్ధనం శుభమ్
గోపాలం పూజయేన్నిత్యం శ్రద్ధయా కురునందన"

అని ఉల్లేఖింపబడినది. మూడు గోమయపు ముద్దలలో నొకటి గోపాలకృష్ణునకు, రెండవది గోమాతకు, మూడవది గోవర్ధన గిరికి సంకేతములని భావము. ఈ విధంగా అలంకరించిన గొబ్బిళ్ళచుట్టూ బాలికలు ప్రదక్షిణంచేస్తూ

'తామర పువ్వంటి తమ్ముణ్ణీయ్యావే
చేమంతి పువ్వంటి చెల్లెల్నీయ్యావే
మొగలి పువ్వంటి మొగుణ్ణీయ్యావే'

అంటూ పాడుతూ నృత్యంచేయటం చూస్తూవుంటాము. దీనినిబట్టి కన్యలు తమకోర్కెలు ఫలించేందుకు గొబ్బిళ్ళను పూజిస్తుంటారని తెలియుచున్నది.

## పలుప్రాంతాలలో పలురీతులు

సంక్రాంతి కేవలం ఆంధ్రదేశంలోనేగాక మహారాష్ట్రంలో "తిల్‌సంక్రాంతి" గానూ, తమిళనాడులో "పొంగల్" గానూ, రకరకాల పేర్లతో జరుపబడుటేగాక 'గ్రీకు' దేశంలో 'బేకస్' అనే జలదేవత స్మృత్యర్థంగా, 'ఈజిప్టు'లో 'నమ్' అనే మకరరాశి సంబంధ దేవత అనుగ్రహార్థంగా, 'రోమ్'లో బ్యాకస్ ఫెస్టివల్ (మన్మథమహోత్సవం) గా సూర్యుడు మకరరాశి ప్రవేశించే సమయంలో పలుప్రాంతాలలో పలురీతులుగా ఈ సంక్రమణ మహోత్సవాలు జరుపబడుచున్నవి.

శిరమున అక్షయపాత్ర, కరమున చిడతలు మ్రోగిస్తూ గానంచేసే హరిదాసులు, డూడూ బసవన్న అనే గంగిరెద్దులవారి పాటలూ మంగళవాద్యాలూ ఒకవంక, వేరొకవంక అంబాపలుకు జగదంబాపలుకు అంటూ బుడబుక్కలవారు, జంగందేవర శంఖునాదాలతో ప్రతిపల్లె మనోహరంగా భాసిల్లుతుంది. మహిళా కళావైదుష్యానికి నిగ్గులుగాతోచే సంక్రాంతి ముగ్గులు చూపరులనాకర్షించి సురుచిర స్వాంతులను చేయక మానవు. అందుకే హైందవ సంస్కృతీ సంస్కారాలకు రూపకల్పనగా నిలిచిన విజయపతాక మకరసంక్రాంతి!

నిఖిలప్రజాళి యొక్క డెందమనే నందనవనంలో ఆనందపు పూబంతులను విరబూయించగ హేమంతపువీధిలో పయనించి వచ్చే "సంక్రాంతిలక్ష్మికి" పింగళి - కాటూరు" లతో బాటు

"ముద్దచేమంతి పూవులు ముడిచినట్టి
జడలతో క్రొత్తవల్లెతో అడుగులిడి
చిందులం ద్రొక్కు పరికిణీ చెలువుతోడ
గాళ్ళపారణి కాటుక గన్నుగవను
దిద్దుకొని...కన్యకలు నర్చలొసగ నిలిచిరి
నీవరుగునపుడు వచ్చిపోవమ్మ మాఇంటిపజ్జకీవు"

—అంటూ స్వాగతం పలుకుదాం, తథాస్తు!



## గ్రంథసమీక్ష

### శ్రీమద్రామాయణము సుందర కాండము : పారాయణప్రతి

సంపాదకుడు: శ్రీమాన్ చలమచర్ల వేంకటశేషాచార్యులు. ప్రకాశకులు: శ్రీ జయలక్ష్మీ పబ్లికేషన్స్ హైదరాబాదు. మూల్యము రు. 20/– పుటలు 572. సరామహనుమచ్చిత్రము.

వేదవేద్యుడగు పరమేశ్వరుడు శ్రీరామచంద్రుడుగా అవతరింప ఆతని దెలుపు వేదము రామాయణరూపమున వెలసినదని ఋషివచనము. కావుననే శ్రీరాముడు తన భక్తులను ఆపదలనుండి తరింపజేసి తాను తారకుడగుచున్నాడు. ఆతని మంత్రము తారకము. ఉపాసనమున మంత్రము, అర్చనము, కీర్తనము అను మూడుభాగములుండును. మంత్రమును జపించుచు, దేవతామూర్తిని ధ్యానించి యర్చించుచు ఆతని చరిత్రమును కీర్తింపవలయును. భగవచ్చరిత్ర బోధకమగు వేదము జనసామాన్యమునకు అందకపోవుటచే, సర్వజనోపయోగిగా వాల్మీకి మహర్షిచే శ్రీమద్రామాయణము అనుగ్రహింపబడినది.

ఇట్టి రామాయణమునకు హృదయమైనది సుందరకాండము. నామమాత్రముననే యిద్దాని ప్రాశస్త్యము సూచితము. రాముని హృదయమునందు ఎల్లప్పుడు మెలగుచు, రాముని దన హృదయమునందు ఎల్లప్పుడు మెలగించుకొన్న శ్రీహనుమానుడు ఇందు ప్రధాన పురుషుడు. ఈ సుందరకాండము అఱువది యెనిమిది సర్గలతో గూడినది.

ఇది పురుషునికి సంసారసాగర తరణంబును బోధించి, అశోకస్థానమున నుండి, సకల వ్యవహారహేతువు నీవారశూకమువలె అణురూపమును అగు పరమాత్మశక్తిని అగపరచును. అట్టిశక్తి దర్శనమువలన ఉపాసకునికి సర్వార్థములును సమకూరుచున్నవి.

ఉపాసనావ్యవహారమున భక్తులనను గ్రహించు పారాయణగ్రంథములు 1. శ్రీమద్రామాయణ సుందరకాండము 2. శ్రీదుర్గాసప్తశతి యును. భక్తులుసద్గురువుల సన్నిధిని తత్తద్దేవతా మంత్రముల నుపదేశమునంది, తన్మంత్రజపమును, తద్దేవతార్చనమును, తద్గ్రంథపారాయణమును గావింతురు. దీనివలన తమ యభీష్టములనొందుదురు. ఇది ఆస్తికలోకమునకు విదితము.

ఈ గ్రంథములు బాహ్యమునకుఏదో కథనుబోధించుచున్నట్లు అగుపడుచున్నను, అందలి శ్లోకములన్నియు మంత్రరూపములే. కావుననే అవ్వానిని నిర్దుష్టముగ పారాయణము చేయవలయును. పారాయణమునకు అర్థజ్ఞానముకూడ చాల అవసరము. తెలిసి పారాయణము గావించు ఉపాసకుడు సంపూర్ణఫలమునందునని శాస్త్రము తెలుపుచున్నది.

ఇట్లు సుందరకాండము భక్తాభీష్టప్రదమగుటచే నేటివఱకు మన భారతదేశమున అనేక సమయములందు అనేక ముద్రణముల నందినది. ప్రతిదానియందుగూడ ఆద్యంతముల యందు పారాయణమునకు ఆవశ్యకములగు పెక్కువిషయములు నిబంధింపబడినవి. సుందరకాండము ద్వైతాద్వైత విశిష్టాద్వైతులగు మతత్రయమువారిచేగూడ పూజ్యతమముగా భావింపబడుటచే వారివారి సంప్రదాయానుసారముగ పారాయణము చేయువిధానములు ప్రతి ముద్రణమునందును నిరూపింపబడుచునే యున్నవి.

ప్రకృత గ్రంథమునగూడ పారాయణోపయోగములగు 1.రామాయణమాహాత్మ్యము 2. శ్రీ సుందరకాండ మాహాత్మ్యము 3. శ్రీవైష్ణవ, స్మార్త, మధ్వసంప్రదాయములవారు పారాయణ ప్రారంభమున పఠింపవలసిన శ్లోకములను, అట్లే తుదియందు పఠింపవలసిన శ్లోకములనుగూడ సుస్పష్టముగా నిరూపించిరి. పూజాక్రమముకూడ దెలుపబడినది. పారాయణారంభమున పఠనీయ సర్గములుగా, సంగ్రహ రామాయణము, రామావతరణ సర్గము, శ్రీ సీతారామ కళ్యాణఘట్టముగూడ నిరూపింపబడినవి. అట్లే తుదిని పఠింపవలసిన ఆదిత్య హృదయము, శ్రీ రామస్తుతి సర్గము, శ్రీరామపట్టాభిషేక సర్గము తెలుపబడినవి. ఇందు గాయత్రీ రామాయణముగూడ గలదు.

అన్నింటికంటే విశేషమేమనగా - పారాయణము గావించునపుడు ఎన్ని ఆవృత్తులు ఎన్ని దినములలో చేయవలసి యుండునో, వారివారి శక్తిననుసరించి చేయుటకు తగు విధానములను, కామ్యముతో గావించు పారాయణ విధానముగూడ తుదిని తెలుపబడినది. వీనిని గాంచుటవలన పారాయణము గావించు భక్తునికి ఆయావిధమున పారాయణము గావించి ఆయా ఫలమును పొందుటకుఉత్సాహముతో తన కష్టనివృత్తికిని తన యభ్యుదయమునకును ప్రయత్నించుట మంచిదేయగునుగాని, పరవశీకరణమునకును పరనాశమునకును దీనినుపయోగించినచో దానివలన పరులేగాక తానుగూడ అనర్థము పొందవలసివచ్చుననుట విస్మరింపగూడని సత్యము. కావున దుష్ఫలాశతో దీని నెన్నడును వినియోగింపగూడదు.

పారాయణ గ్రంథమున ఎచటనుగూడ తప్పులు దొరలగూడదు. ఇన్ని విషయములను ఈ గ్రంథమునందు సమకూర్చిన సంపాదకులు తప్పులులేకుండ చూచుటలో విఫలులైనారు. తుదకు మంత్రజపమును గావించు విధానమును దెలుపుటలో "కరతలకర పృష్ఠాభ్యాం నమః, హృదయాయ నమః" అనునవిగూడ లోపించినవి. జపవిధానమున ఇట్టి దోషములెన్నడును ఉండగూడదు. ముద్రణమున, అందునను తెలుగు ముద్రణమున, తప్పులు నేడు గ్రంథాలంకారములే అగుటచే వానిని మనము ఎన్నుట మన దోషమే యగునేమో ! ఇట్టివానిని తెలుపుటకు సంపాదకులు తుదిని 'తప్పొప్పుల' పట్టికను వేసిన బాగుండును. కాని అదిలేదు. మఱియు భక్తుడు పవిత్రమగు పారాయణమును ఈర్ష్యాద్వేషములతో కలు

# తిరుమల యాత్రికులకు సదుపాయములు

* * *

* అన్నివర్గాలవారికి అందుబాటులో ఉండేటట్లు ఉచిత, పరిశుభ్రమైన సత్రాలు, లేదా సరసమైన రేట్లకు కాటేజీలలో ఆవాస సౌకర్యం.
* శ్రీవారిని దర్శించు యాత్రికుల క్యూషెడ్లలో గాలి, వెలుతురుగల విశాలమైన ఏర్పాటులు.
* క్యూ షెడ్లలోనే కాఫీబోర్డువారి అల్పాహార సదుపాయం.
* సరసమైన ధరలకు అన్నపుపొట్లాల అమ్మకం.
* యాత్రికులు వెలుపలకు రానక్కరలేకుండా క్యూలదగ్గరే మరుగుదొడ్డి సౌకర్యం.
* ఆంధ్రప్రదేశ్ పాలసరఫరా సంస్థచే స్వచ్ఛమైన పాలవిక్రయం.
* యాత్రికులు చదువుకునేందుకు దేవస్థానం ముద్రిత గ్రంథాలు. స్వామివారి, అమ్మవారి చిత్రపటాల అమ్మకం.
* క్యూలోని యాత్రికులకు విసుగులేకుండా ఉండేందుకు టెలివిజన్ ప్రదర్శనం, భక్తిసంగీత ప్రసారం.
* క్యూషెడ్లలోను, తిరుమలకుపోవు కాలిబాట 7 వ మైలువద్ద వైద్యసదుపాయం.
* సామానులు, పాదరక్షలు భద్రపరచుకొనేందుకు ప్రత్యేక సౌకర్యం.
* తిరుమలలో సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసునుండి వివిధప్రాంతాలకు ఆటో సౌకర్యం.

## ఉచిత బస్సుసదుపాయం

* దళారీలనుండి వంచకులనుండి తప్పించేందుకు ముఖద్వారంలో పేష్కారుస్థాయి అధికారి సిబ్బంది.
* క్యూషెడ్లలోని యాత్రికుల ఫిర్యాదులు విచారించేందుకు కావలసిన సౌకర్యములకుగాను పేష్కారు స్థాయిలో మరొక అధికారి, సిబ్బంది.
* యాత్రికుల సామానులను భద్రంగా తిరుమలకుచేర్చే సౌకర్యం ఏర్పాటైంది. తిరుపతిలో ఏ సత్రములోనైనా గాని, టోల్ గేట్ వద్దగాని తమసామాగ్రి అప్పగించి రసీదుపొంది ఆ రసీదు తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీస్ దగ్గర కౌంటర్ లో ఇచ్చి సామాగ్రి పొందవచ్చును.
* దుండగులనుండి యాత్రికులను కాపాడేందుకు, తిరుమలకు వెళ్ళే దోవపొడుగునా రాత్రింబవళ్ళూ పోలీసు గస్తీ ఏర్పాటుచేయబడింది.
* దారిపొడుగునా మంచినీటి సదుపాయం ఉన్నది.
* రాత్రిపూటగాని, తెల్లవారుఝామునగాని కొండకు వెళ్ళదల్చుకొన్నవారికి వీలుగా మంచికాంతి శక్తిగల దీపాలు ఏర్పాటైనవి.
* వివిధప్రాంతాలనుండి వచ్చేయాత్రికులకు బోధపడేందుకుగాను తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసులో, దేశంలోని ముఖ్యశాఖలలో విచారణ కార్యాలయాలు.
* ప్రత్యేక కాటేజీలలోని అదనపు సౌకర్యాలు అంజనాద్రినగర్, శేషాద్రి, గరుడాద్రి, శంఖుమిట్ట కాటేజీలలో కూడ ఏర్పాటైనవి.

షితముకాని హృదయముతో గావింపవలయును. మనదేశమున మతత్రయము వారలలో కొందఱు ఒకరినొకరు దూషించుకొని హృదయనైర్మల్యమును చెఱచుకొనుట అటనట అగపడును. దానివలన చిత్తపరిశుద్ధి భంగపడును. అట్టిస్థితి కలుగజేయకుండుట ఉత్తమము. సంపాదకులు మధ్వసంప్రదాయమునందలి గురుధ్యానమునందు దెల్పిన "మిథ్యాసిద్ధాన్త దుర్ధ్వాన్త విధ్వంసన విచక్షణః" అను శ్లోకము అట్టిదియే. అట్టి ఇతర సిద్ధాన్త దూషణమును పరిత్యజించిన బాగుండెడిది. పూర్వము ఎవ్వరో దీనిని వ్రాసినను, దోషములుండుటచే దీనిని త్యజించుట మంచిది గదా! "బాధేదృఢే అన్యసామ్యాత్కిం? దృఢే అన్యదపి బాధ్యతాం" అని గదా పెద్దల నీతి.

పారాయణమున అర్థజ్ఞానము అవశ్యకమగుటచే పూర్వము కొందఱు వేసినట్లు ప్రతి శ్లోక తాత్పర్యమును ఆ శ్లోకమునకు ఎదురుగా ప్రదర్శించుట చాలమంచిది. కాని ఇందు అధ్యాయమునకు ముందు మాత్రమే అధ్యాయతాత్పర్య సంగ్రహము తెలుపబడినది. అది సంపూర్ణప్రయోజనకారి కాజాలదు.

ఏది ఎట్లున్నను గ్రంథమునందు పెక్కు విషయములు తెలుపబడుటచే జిజ్ఞాసువులకు ఉపయోగించుననుట సత్యము.

— నీలకంఠశాస్త్రి (కౌండిన్య)

### శ్రీ రామాయణ కథాసుధ

రచన: శ్రీ అన్నంరాజు సత్యనారాయణరావు. పుటలు: 20+216. వెల: రూ. 12-50. ప్రాప్తి స్థానం: రచయిత, 5వ లైను, పండరీపురం, గుంటూరు-522002.

సీతారాముల పవిత్ర చరిత్ర లోకానికి ఎప్పుడూ ఆదరణీయమే, ఆదర్శప్రాయమే. ఈ కథకు కొత్తపాతలులేవు. మానవీయమైన విలువలున్నంతవరకు శాశ్వతత్వాన్ని సముపార్జించుకొన్న కథల్లో రామాయణ కథ ఒకటి. ప్రతి అక్షరంలో ఆదర్శప్రాయమైన కుటుంబ జీవనాన్ని ప్రోదిచేసుకొని సమాజానికి ఉదాత్తమైన నీతిని బోధిస్తుంది రామాయణం.

వాల్మీకి రచితమైన రసవత్తరదివ్య చరిత్రను నాటినుండి నేటివరకు ఎందరో ఎన్నో ప్రక్రియల రూపంగా అందిస్తూనే వున్నారు. "మరల నిదేల రామాయణం బన్నచో" 'మధ్యతరగతి చదువరులును, స్త్రీలును చదువుకొనుటకనుకూలముగ' సులభశైలిలో వ్రాసితిని, అన్నారు రచయిత సత్యనారాయణరావుగారు. పద్యాలు కాని, కఠినమైన వచనంగాని అందరికీ సులభంగా అర్థంకావు. అది రామాయణ ప్రచారానికి ఆటంకం. సులభభావబోధ దృష్టితో వ్రాయబడింది 'శ్రీ రామాయణ కథాసుధ'.

ఈ గ్రంథరచనకు సత్యనారాయణరావు గారు వాల్మీకి రామాయణంతోపాటు తెలుగులో ప్రసిద్ధాలయిన తిక్కన నిర్వచనోత్తర రామాయణం, భాస్కర రామాయణం, పావరాజు ఉత్తర రామాయణం, మొల్లరామాయణం, గోపీనాథ రామాయణం, ఆంధ్ర వాల్మీకిరామాయణాలను ఆధారంగా తీసుకున్నారు. అంతేకాదు అవసరమైనచోట్ల వాటిలోని పద్యాలను మధ్యమధ్య ఉటంకించినారు. పద్యాల వివరణ వచనంలో క్రిందనే వుండడం మరొక సుగుణం. ఇలా పద్యాలను ఏర్చికూర్చటంవల్ల "గులాబీలతో కూడిన కుందమాలవలె ఈ గ్రంథం సుగంధబంధురమై సుమనోమనోజ్ఞతను సపార్జించుకొన్నది" అన్న జంధ్యాలవారి మాటలు సత్యం.

ఈ గ్రంథంలోని మరొక సుగుణం, సౌలభ్యం గమనించాలి. ఉపశీర్షికలతో కథను చెబుతూ పోవడం ఒక మంచిపద్ధతి. ఉపశీర్షికక్రింద వివరణ వుంటుంది. ఉదాహరణకు జటాయువు, పర్ణశాల, శూర్పణఖ అక్షకుమారుడు, మేఘనాథుడు మొదలైనవి. మనకు కావలసిన విషయాన్ని గ్రహించడానికి ఆధారగ్రంథంగా అంటే పూర్వగాథాలహరిలాగా ఉపయోగించుకోడానికి కూడా ఈ గ్రంథం పనికొస్తుంది. అంటే వివరణాత్మక నిఘంటువులాగా ఉపకరిస్తుందని అర్థం.

శ్రీరామపట్టాభిషేకంతో ఆపకుండా ఉత్తర రామాయణకథకూడా ఇందులోచేర్చి ఈ గ్రంథానికి సమగ్రత చేకూర్చారు సత్యనారాయణరావుగారు. పూర్వోత్తర రామాయణాన్ని మొత్తాన్ని రెండువందల పుటల్లో చెప్పగలగడం రచయిత సమర్థతను చాటుతుంది.

ఎక్కువగా సమయాన్ని వెచ్చించలేని ఆధునికునికి సైతం రామాయణాన్ని అందుబాటులోకితెచ్చి రావుగారు చాలమేలు చేసినారు. సులభమైన శైలిలో సమగ్రంగానూ, సంగ్రహంగాను రామాయణంవలె, సుధామయంగా భాగవతాది కథల్ని సైతం ఈ మార్గంలోనే అందించాలని ఆశిస్తాను.

— డా॥ ఎం. సుబ్బారెడ్డి



## స్వీకారం

### శ్రీ ఏకాదశీమహాత్మ్యము

(ప్రథమ భాగము)

ఆంధ్రానువాదము:

**శ్రీ మేడవరం మురళీకృష్ణమూర్తి**

వెల: రు. 15-00

ప్రతులకు:

**రచయిత,**

18-1-63 బి, కపిలతీర్థం రోడ్డు,

తిరుపతి.




తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# ఉదయాస్తమాన సర్వసేవాపథకం

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి వారిని సంపూర్ణంగా అర్చించడానికి భక్తులకొక సదవకాశం!

తలుపులు తెరచినప్పటి నుండి తిరిగి తలుపులు మూసేవరకు ఒక దినంలో తిరుమల శ్రీవారి ఆలయంలో జరిగే సమస్త పూజావిధులను అనగా సుప్రభాతం, తోమాల, అర్చన (మూడు పర్యాయాలు) నైవేద్యం ఇంకా ఇతర ప్రత్యేక సేవలను ఉదయాస్తమాన సర్వసేవావిధి పథకం క్రింద భక్తులు తమ పేరిట స్వంత ఖర్చులతో స్వామివారికి జరిపించవచ్చును.

పథకంలోని ముఖ్యాంశాలు :

* కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం పేరిట ఒక లక్షరూపాయల విరాళాన్ని క్రాస్ చేసిన డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా చెల్లించాలి. శుక్రవారం సేవలకు మాత్రం మూడులక్షల విరాళం (అభిషేక నిమిత్తం) ఇవ్వవలసి వుంటుంది.
* భక్తులు తమ కైంకర్యములు జరిపే రోజున ఆరుమంది సభ్యులకు శ్రీవారి దర్శనం వుంటుంది. అనివార్య కారణాలవల్ల కొన్ని సేవలు రద్దుకాని పక్షంలో సుప్రభాతం, తోమాలసేవ, సహస్రనామార్చన, ఏకాంతసేవల వంటి అన్ని పూజావేళలలో శ్రీవారిని దర్శించవచ్చును. (శుక్రవారం తప్పించి)
* కైంకర్యదినాన ఆలయంలోపల దాతపేరు ప్రదర్శింపబడుతుంది. గోత్రాదులతో సహా దాతపేరును శ్రీవారి కొలువులో ప్రకటిస్తారు.
* ఆ దినాన జరిగే ఆర్జితసేవలన్నింటిని కైంకర్యదాత తనవారితోసహా తిలకించవచ్చును.
* కల్యాణోత్సవంలో శ్రీవారి ఉత్సవమూర్తులకు సమర్పించే శేషవస్త్రాలు మూడింటిలో ఒకదానిని గృహస్థుకు బహూకరిస్తారు. ఉచితప్రసాదంగా 25 లడ్డులను, 5 వడలను ఇస్తారు.
* వస్తువుల ధరలు గణనీయంగా పెరిగిపోయిన పక్షంలో పూజాకార్యక్రమాల అదనపు వ్యయాన్ని దాతలే భరించవలసి వుంటుంది. అందుకు సిద్ధంకానపుడు ఆనాటి అదనపు వ్యయం భర్తీ చేసేందుకు దేవస్థానం మరొకరి విరాళాన్ని స్వీకరించవలసి వస్తుంది. అటువంటి సందర్భాలలో ఒకరు లేదా అంతకు మించిన దాతల పేర్లతో ఆనాటి పూజలు జరుపబడుతవి,
* కైంకర్యములు జరిగే తేదిని గురించిన వివరాలను దేవస్థానం ఆయా దాతలకు తెలియజేయగలదు.

ఈ పథకం గురించిన ఇతర వివరాలకు - వివరణలకు కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి అనే చిరునామాకు వ్రాయండి.




# భక్తజనాబాయి

డా॥ మల్లెప్రియ నాగరాజు

చంద్రభాగాతీర నివాసియై, భక్తుల పాలిటి కల్పవృక్షమై, ఊహకందని దివ్య విభూతులతో విరాజిల్లే పాండురంగని పవిత్ర నామం నమ్మినవారినందరినీ ధన్యజీవులుగా మార్చింది. దివ్యనామస్మరణచేత భగవంతునితో భాషించిన భక్తులు, క్రీడించిన భాగవతోత్తములు, పరమాత్మచే గృహకృత్యాలు చేయించుకొన్న భక్తశిరోమణులు, భగవానుని శక్తిని నిరూపించిన సంతపురుషులు ఈ పవిత్ర భారతదేశంలో ఎందరో ఉన్నారు. అట్టి వారిలో పరాకాష్ఠ నందిన ఆదర్శజీవి భక్తజనాబాయి. పాండురంగని చరణదాసియై తరించిన ఆ పుణ్యజీవి చరిత్ర ప్రాతః స్మరణీయమైనది.

పరమ పవిత్రమైన కార్తీకశుద్ధ ఏకాదశి నాడు నాలుగేండ్ల బాలికతో పాండురంగ దర్శనానికి వచ్చారు ఆమె తల్లిదండ్రులు. చంద్రభాగానదిలో స్నానంచేసి, విఠలనాథుని దర్శనానికి వెళ్ళారు. నాలుగేండ్ల జనాబాయి ప్రప్రథమంగా పాండురంగని దర్శించింది. ఆ ప్రథమ దర్శనంలోనే ఆ చిన్నారి బాలిక తన జీవితాన్ని రంగని పాదాలకు అంకితం చేసింది. దర్శనానంతరం ఇంటికి రానని, అక్కడే ఉంటానని పట్టుపట్టింది. ఎంత బ్రతిమలాడినా వినకపోవటంతో, ఆ బాలికను దేవాలయంలోనే వదలి తల్లిదండ్రులు వెళ్ళిపోయారు.

నాలుగు రోజులు జనా ఆలయంలోనే ఉంది. మహాభక్తుడైన నామదేవుడు సంకీర్తనంచేసి, తిరిగివెళ్తూ ఆమెను పలకరించాడు. "నా పేరు జనా, పాండురంగడే నా తండ్రి, రుక్మిణి నా తల్లి. ఇక మీరే నాకు గురువులు" అంది ఆమె. నామదేవుడు జనాను తన ఇంటికి తీసుకొనిపోయి తన తల్లి గుణాబాయికి అప్పగించాడు.

ఒకనాటి రాత్రి పెద్ద గాలివాన వచ్చింది. నామదేవుని ఇంట్లో అందరూ నిద్రపోతున్నారు. ఆ గాలివానకు వారి ఇంటి పై కప్పు ఎగిరిపోయింది. అది గ్రహించిన పాండురంగడు తన సుదర్శనచక్రాన్ని గొడుగులాగా నిలిపి, ఇంటికప్పును బాగుచేయసాగాడు. ఆ దృశ్యాన్ని జనా మేల్కొంచి చూసి ముగ్ధురాలైంది.

ఒకసారి నామదేవుని ఇంటికి జ్ఞానదేవుడు, నివృత్తినాథుడు, సోపాన్, ముక్తాబాయి, కబీర్ వచ్చారు. ఆ సమయంలో నామదేవుడు ఇంట్లోలేడు. జనాబాయి తన పిడకలు దొంగిలించిన ప్రక్కింటి స్త్రీతో పోట్లాడుతోంది. "అవి నీ పిడకలే అని ఎలా చెప్పగలవు?" అన్నాడు కబీర్. "మహాత్మా! మీరే పరీక్షించండి. నేను నామ జపంచేస్తూ పిడకలు చేస్తాను. ఆ పిడకలను చెవి దగ్గర పెట్టుకుంటే నామసంకీర్తనం వినిపిస్తుంది" అన్నది జనాబాయి. వారందరూ పిడకలను పరీక్షించారు. చెవివద్ద పెట్టుకొంటే పిడకలలో పాండురంగ నామం వినిపించింది.

నామదేవుని తల్లి గుణాబాయి ఒకనాడు జనాను పిలిచి, తొందరగా జొన్నలను పిండి చేయమని చెప్పింది. తిరగలిలో జొన్నలు పిండిగా మారుతుంటే, భగవన్నామమనే తిరగలిలో సంచితం కర్మలనే జొన్నలువేసి త్రిప్పుతుంటే, నామరూపాత్మకమైన ప్రపంచం అదృశ్యమై, వాసుదేవుడొక్కడే మిగిలాడు. పాండురంగడు స్వయంగావచ్చి జొన్నలు విసరటంలో ఆమెకు సహాయం చేసాడు. ఆమెతో మధురభాషణంచేసి, ఆమెకు ఆధ్యాత్మికరహస్యాలు తెలియజెప్పాడు.



తెల్లవారుజామున, సుప్రభాత సమయంలో వెళ్ళిపోయాడు పరమాత్మ. ఆ తొందరలో తిరగలి ప్రక్కన ఉంచిన తన ఆభరణాలను పీతాంబరాన్ని అక్కడేమరచిపోయి, చినిగిపోయిన జనాబాయి దుప్పటికప్పుకొని వెళ్ళిపోయాడు.

దర్శనార్థం తలుపులు తీయగానే పూజారికి స్వామివారి ఆభరణాలు, పీతాంబరం కనుపించలేదు. అందరూ దిగ్భ్రాంతి చెందారు. దేవుని విగ్రహంపై చినిగిన దుప్పటి ఉండటంచూసి, అది జనాబాయిదని గ్రహించారు.

వెంటనే రాజోద్యోగులు జనా ఇంటికి వెళ్ళారు. అక్కడ తిరగలి ప్రక్కనే స్వామివారి ఆభరణాలు, పీతాంబరం దొరికాయి. ఆమెకు ఉరిశిక్ష విధించారు.

జనాబాయికి ఎఱ్ఱటివస్త్రాలు కట్టి, నడుముకు త్రాడును బిగించి, వీథిలో ఆమెను లాగసాగారు. ఆమె శరీరం పగిలి, రక్తం కారసాగింది. ఉరికంబమెక్కి జనాచేతులు జోడించి ప్రార్థించింది. "హే విఠలా! నేను దొంగనా? నీవు సత్య స్వరూపుడివి, చేయని నేరానికి శిక్ష విధిస్తారా?" అంటూ!

అంతే! ఉరికంబం అదృశ్యమై దాని స్థానంలో పరిమళాలు వెదజల్లే పుష్ప పంక్తితోకూడిన లతలు అవతరించాయి. భక్తులు జయజయ ధ్వానాలు చేసారు. పాండురంగని అపారకృపామహిమకు ప్రేమాతిశయంతో పరవశించిన జనాబాయి కళ్ళవెంట ఆనందబాష్పాలు కట్టలు త్రెంచుకొని ప్రవహించాయి.

ఆరునెలల అనంతరం, కృష్ణాష్టమినాడు పెద్దగా సంకీర్తనం చేస్తూ, రంగని ఆలయంలో ప్రవేశిస్తూనే జనాబాయి పాండురంగనిలో కలిసిపోయింది.

*




ఈ సంఘటన చాల పురాతనమైంది, అప్పుడు దక్షిణ భారతదేశాన్ని ముసల్మాను శాసకులు పాలించేవారు. ముస్లిములు అప్పుడు హిందువులను అనేక విధాల బాధించేవారు. పైఠన్ నగరంలో ఒక పఠాను ఒక సత్రం పైఅంతస్తులో నివసిస్తుండేవాడు. హిందువులను పీడించడమంటే అతనికి ఒక వినోదం. హిందూ భక్తులు నిత్యం గోదావరికి పోయే దారిలో ఆ సత్రం ఉంది. భక్తులమీద పఠాను ఎంగిలి విస్తరైనా గిరవాటు వేసేవాడు లేదా పుక్కిలించి నీళ్ళైనా ఉమ్మేవాడు. జడిసి, అతన్ని ఎవరూ ఏమీ అనేవారు కారు. ఆనాటి ఒక మహాత్ముడు ఏకనాథుడు. అతడుకూడా అదే దారిని రోజూ గోదావరి స్నానానికి వెళ్ళేవాడు. ఆ దుర్మార్గుడు ఆయననుకూడవిడిచి పెట్టలేదు. అతడు నీళ్ళు పుక్కిలించి ఉమ్మితే ఏకనాథుడు కిమ్మనకుండా వెళ్ళిపోయి మరల స్నానంచేసి వచ్చేవాడు. కాని రెండవసారి అతను స్నానం చేసి వస్తే మరలా అతని మీద ఉమ్మేసేవాడు. ఇలా ఒక్కోనాడు ఏకనాథునికి ఐదారు సార్లు స్నానం చెయ్యవలసి వచ్చేది.

మిగతా వాళ్ళంతా ఆ దుష్టునికి భయపడి తమదారిమార్చుకొన్నారు. కానిఏకనాథుడు మాత్రం అదే దారిని వస్తూ పోతూ వుండేవాడు. మారుమాటాడకుండా ఆ నీచుని దుండగాన్ని సహించేవాడు.

"మిగతా హిందువులంతా హడలిపోయి ఈ దారిని రావడం మానుకొన్నారు. కాని ఈ సాధు మొండిఘటంలా ఉన్నాడు" అని పఠాను మనసులో అనుకొన్నాడు. ఒకనాడు మొండికేసి కూర్చున్నాడు. ఏకనాథుడు స్నానంచేసి రాగానే అతనిమీద తుబుక్కున ఉమ్మేవాడు. ఆ వేళ మొత్తం 108 సార్లు అతడు పుక్కిలించి ఊశాడు. ప్రతిఘటించకుండ, ఇసుమంత చిరాకు పడకుండ ప్రతిసారి గోదావరిలో స్నానం చేసి వచ్చేవాడు ఏకనాథుడు.

సాధు ఏకనాథుని సహనానికి పఠాను అబ్బురపోయాడు. అతడు సిగ్గుపడి ఏకనాథుని ముందు మోకరిల్లాడు: "నిజంగా మీరే అసలైన భక్తులు. నాకు బుద్ధివచ్చింది. ఇకనుండి ఎవర్నీ హింసించను. మీరు క్షమించానంటేగాని మీ పాదాలు వదలను", అన్నాడు.

ఏకనాథుడు చిరునవ్వు నవ్వుతూ:

"ఇందులో క్షమించవలసింది ఏముంది? గోదావరీ స్నానం పుణ్యప్రదం. నీవు నాకు నూటఎనిమిదిసార్లు స్నానంచేసే అవకాశం కల్పించావు. దీనివల్ల నా పుణ్యమే పెరిగింది. నీవు నా పట్ల ఏ అపరాధమూ చేయలేదు" అన్నాడు.

ఈ సంఘటన జరిగిన తర్వాత హిందువులు నిశ్చింతగా, నిర్భయంగా ఆ మార్గాన వస్తూపోతూవుండేవారు.

— శ్రీ. ఎం. వెంకటరావు

(16 వ పేజీ తరువాయి)

అంటూ మరొకసారి రహీం శ్రీకృష్ణపర మాత్ముని స్మరించి స్తుతించాడు.

రహీం ఆజ్ఞానుసారం సైనికులు రాజును బందీగాపట్టి తెచ్చారు. సిగ్గుతో తలవంచి అవమానభారంతో క్రుంగిపోతూ ఎదుట నిలబడిన రాజును, "ఏమి రాజా! దుష్ట తలంపుతో మిత్రుని విందుకాహ్వానించి విష మిచ్చి హతమార్చ యత్నించడం రాజ ధర్మమా?" అని ప్రశ్నించాడు రహీం, ద్వేషభావరహితంగా. ఇంతలో పగ్గములు తెంపుకొన్న సింహమువలె యిద్దరు సైని కులు రాజుపై విరుచుకుపడబోగా క్షమా శీలుడైన రహీం వారిని వలదనివారించాడు.

రహీం మాటలు విన్న కపటచిత్తుడైన రాజునిలువున నీరయిపోయాడు. ముఖం తెల్లబోయింది. గుండెలు ఝల్లుమన్నయి. కొంతసేపు నోటమాటరాలేదు. ఈ కుట్ర విషయం తనకుతప్పయితరులెవరికీ తెలి యదనుకున్న అతడు ఆశ్చర్య ఆవేదనలతో, "స్వామీ! నేను కృతఘ్నుణ్ణి. మహాపాపిని నాపై వ్యక్తి పూర్ణకరుడగునా శాడన విధించ్రమ తెలుపుచున్నది. "గృహాణిపిన వారైణీ హీనం అరణ్యసదృశం మతా?" అని జీలేని యిల్లు అడవితో సమానయు కపాదముయొక్క అర్థము. కాడైన యమహిళ ఇల్లాలుగా (ఇంటిని, ండన విధించది), అర్ధాంగిగా (భర్తను పూదు" అయియునది), సహధర్మచారిణిగా ( అప సరండి వ్రతయజ్ఞాదులు చేయు తోపలి కాడుచునది), సఖిగా ( స్నేహితురా ము చెప్పునది), భార్యగా ( తో [illegible] ," మీరు నాకు మరణదండన విధించినా శిరసావహి స్తాను. కాని నన్ను అన్యథా భావించక దండన విధించేముందు ఆ రహస్యాన్ని దాచక వెల్లడించి నా కడసారి కోరిక మన్నిం చాలని వేడుకొంటున్నాను." అంటూ రహీం కాళ్ళుపట్టి ప్రార్థించాడు "భక్తవత్సలుడు, ఆర్తత్రాణ పరాయణుడు, సర్వజ్ఞుడు, నా దైవమైన ఆ శ్రీకృష్ణపరమాత్మయే నాకా రహస్యం తెలిపాడు. రాజా! జగన్మోహ నుడు, జగదీశుడు, లోకాలకే శ్రీకరుడైన శ్రీకృష్ణపరమాత్మను తెలుసుకొనుట జడ బుద్ధులయినవారికి సాధ్యముకాదు. చిత్త శుద్ధిగల వారికే ఆయన లీలలు అర్థమగును. అంటూండగా రహీం నేత్రాలు ఆనంద బాష్పాలతో తొణికిసలాడినయి. ఆయన హృదయం మదనమోహనుని మాధుర్యరస మున మునిగి అద్వైతానందమును అను భవించినది.

సభాసదులిదివిని ఆశ్చర్యచకితుల య్యారు. రహీం పలుకులు వారికి గగుర్పాటు గలిగించినవి. రాజుకు దుఃఖం ఉబికి వచ్చింది. సత్య, ధర్మాలకు విజయం తథ్య మనే తలంపును అతని నేత్రాలనుండి కారే కన్నీటిధారలు ఋజువుచేసినయి. కడకు రహీం ముఖంచూడలేక స్వయంకృతా పరా ధానికి పశ్చాత్తప్తుడై ఘోరదుఃఖంతో బోరున ఏడుస్తూ కంటినీరు కాలువలై పార రహీం పాదముల చెంత మోకరిల్లి మన్నించ మని అనేక విధముల గద్గదకంఠంతో దీనుడై ప్రార్థించాడు. అతని దీనాలాపనకు వెన్నలాంటి రహీం హృదయం కరిగింది. రాజుకు క్షమాభిక్ష పెట్టి వదలివేశాడు.

'మిగతా హిందువులంతా వదలి
వారిని రావడం మానుకొన్నారు
సాధు మొండిఘటంలా ఉనా
వరాను మనసులో అనుకొన
వాడు మొండికేసి కూర్చునా
నాథుడు స్నానంచేసి రాగానే అత
క్కున ఉమ్మేవాడు. ఆ వేళ వె
సార్లు అతడు పుక్కిలించి ఉ
పుటించకుండ, ఇసుమంత
ండ ప్రతిసారి గోదావరిలో స
వచ్చేవాడు ఏకనాథుడు.

★ ★

# శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం, తిరుచానూరు

## నిత్యపూజా నివేదనలు

సుప్రభాతం — ఉ. 5-00 గం॥ నుండి 5-30 గం॥ వరకు

సహస్రనామార్చన — ఉ. 5-30 గం॥ నుండి 6-00 గం॥ వరకు

(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు.)

నిత్యఅర్చన — ఉ. 6-00 గంటలకు

(ఏడాదికి రు 150/- లు చెల్లించిన గృహస్థులకు మాత్రమే.)

శుద్ధి, మొదటి గంట — ఉ. 6-15 గం॥ నుండి 6-45 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 6-45 గం॥ నుండి మధ్యాహ్నం 1-00 గం॥ వరకు

శుద్ధి, రెండవగంట — మ. 1-00 గం॥ నుండి 1-30 గం॥ వరకు

సర్వదర్శనం — మ. 1-30 గం॥ నుండి రాత్రి 7-00 గం॥ వరకు

శుద్ధి, రాత్రికైంకర్యము — రా. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు

సర్వదర్శనం — రా. 7-30 గం॥ నుండి 8-30 గం॥ వరకు

ఏకాంతసేవ — రా. 8-30 గం॥ నుండి 9-00 గం॥ వరకు

## శుక్రవారాలలో....

సుప్రభాతం — ఉ. 4-00 గం॥ నుండి 4-30 గం॥ వరకు

సహస్రనామార్చన — ఉ. 4-30 గం॥ నుండి 5-00 గం॥ వరకు

(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు)

నిత్యఅర్చన — ఉ. 5-00 గం॥ నుండి 5-15 గం॥ వరకు

శుద్ధి, మొదటిగంట — ఉ. 5-15 గం॥ నుండి 5-45 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 5-45 గం॥ నుండి 7-00 గం॥ వరకు

సళ్ళింపు — ఉ. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు

మూలవర్లకు అభిషేకం — ఉ. 7-30 గం॥ నుండి 9-00 గం॥ వరకు

(100 రూ. టిక్కెట్‌తో ఇద్దరు వ్యక్తులకు మాత్రమే.)

అలంకారము, రెండవగంట — ఉ 9-00 గం॥ నుండి 10-00 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 10-00గం॥ నుండి రాత్రి 8-00గం॥ వరకు

ఊంజల్ సేవ — రా. 7-00 గం॥ నుండి 8-00 గం॥ వరకు

(అద్దాలమండపంలో రు. 150 టిక్కెట్‌తో జరుపుకొనవచ్చును. గృహస్థుకు 5 గ్రాముల వెండి డాలర్ బహూకరిస్తారు.)

రాత్రిగంట — రా. 8-00 గం॥ నుండి 8-30 గం॥ వరకు

ఏకాంతసేవ — రా. 8-30 గం॥ నుండి 9-00 గం॥ వరకు

## ఆర్జితం వివరాలు :

ప్రత్యేక దర్శనం: రూ. 2_00
సహస్రనామార్చన: రూ. 6_50
నిత్యఅర్చన: రూ. 150_00 (ఏడాదికి)
అర్చన: రూ. 1_00
హారతి: రూ. 0_50

పూరాభిషేకం (శుక్రవారాలలో) రూ. 100_00
ఊంజల్ సేవ (శుక్రవారాలలో) రూ. 150_00
తిరుచ్చి ఉత్సవం: రూ. 63_00
గజవాహనం: రూ. 32_00.

# గృహలక్ష్మి

## మాంగల్యం తంతునా

శ్రీరేబల్లె వెంకటేశ్వర్లు

సాంఘిక ఆధ్యాత్మికౌన్నత్యములకు హిందూవివాహపద్ధతి ఉద్దేశింపబడినది. హిందువులు ఒక పవిత్ర సంస్కారముగ వివాహమును నిర్వహింతురు. సంస్కారముచే వ్యక్తి దోషరహితుడై ప్రత్యేక కార్యము చేయుటకు యోగ్యుడగును. ఉదా:- ఉపనయనము విద్యార్జనకు, వివాహము గృహస్థాశ్రమ స్వీకారమునకు యోగ్యత కల్పించును. మన ఋషులు వ్యక్తి పూర్ణవికాసమునకు ప్రథమ సోపానముగ సంస్కారములు, ద్వితీయ సోపానముగ విధులేర్పరచిరి. పై రెండు సోపానములు మానవుని పరమావధియై మోక్ష ప్రాప్తికి సహకరించును.

కళ్యాణము (శుభము గూర్చునది) వేర్వేరు గృహములలో పెరిగిన సగోత్రీకులు కాని యిరువురు స్త్రీ పురుషులను, వారి స్వీయాభివృద్ధికై ఒకటిగా చేయును. పాణిగ్రహణముతో వారిరువురు భార్యాభర్తలై గృహస్థాశ్రమమును స్వీకరించి శారీరకముగనేగాక ఆత్మికముగగూడ ఒకటగుదురు.

యజ్ఞవ్రతాదులచే దేవతలను తృప్తిపరచుట, సత్సంతానము పొంది పితౄణము నుండి విముక్తుడగుట, అర్థకామాదులను బడయుట పెండ్లికి లక్ష్యముగా పెద్దలు చెప్పుచున్నారు. పెండ్లి కేవలము శరీర వాంఛలు తీర్చు సాధనమని కొందరు తలచుట తప్పు.

"ధర్మసాధన కుపకరణంబు గృహనీతి" అని హైందవ నీతిసారమెరిగిన నన్నయ, "కామిగానివాడు మోక్షగామికాడు" అని యోగివేమన గృహస్థాశ్రమమును వివరించినారు. వివాహమాడి భార్యాపుత్రులను బడసినపుడే వ్యక్తి పూర్ణశరీరుడగునని మను ధర్మశాస్త్రము తెలుపుచున్నది. "గృహం చ గృహిణీ హీనం అరణ్యసదృశం మమ" గృహిణిలేని యిల్లు అడవితో సమానమని పై శ్లోకపాదముయొక్క అర్థము. కావున భారతీయ మహిళ ఇల్లాలుగా (ఇంటినిచక్క బెట్టునది), అర్ధాంగిగా (భర్తను పూర్ణశరీరుని చేయునది), సహధర్మచారిణిగా (తోడుగానుండి వ్రతయజ్ఞాదులు చేయు అర్హత కల్పించునది), సఖిగా (స్నేహితురాలుగా హితము చెప్పునది), భార్యగా (తోడుగా కష్టసుఖములను భరించునది) హిందూ సమాజమునకు తలమానికమై కుటుంబమును తీర్చిదిద్దుచున్నది. సహధర్మచారిణి తోడులేకెట్టి పుణ్యకార్యము నిర్వహించుటకు హైందవుడు అర్హుడుకాడని ధర్మశాస్త్రములు తెలుపుచున్నవి. కావున హిందూ సమాజమున స్త్రీ ప్రత్యేక గౌరవస్థానము సంతరించుకొన్నదనుట నిర్వివాదాంశము.

వివాహవ్యవస్థ ఎప్పుడు, ఎందుకు అమలులోనికి వచ్చినది? అను ప్రశ్నకు విజ్ఞాన సర్వస్వము క్రింది విధముగా తెలుపుచున్నది. క్రొత్త రాతియుగమున (క్రీ. పూ. 10,000) ఆదిమానవుడు పశువులను పెంచుట, పంటలు పండించుట నేర్చినంతనే సహధర్మచారిణి (తోడుగా పనులు చేయునది) కై చూచుకోవలసివచ్చినది. (విజ్ఞానసర్వస్వం. సంపు. 1. పేజి. 8.) పై విధమైన అభిప్రాయమునే సామాజిక పరిణామ సిద్ధాంతవేత్త శ్రీ విల్ డ్యూరాంట్, శ్రీమతి అనీబిసెంటు కూడా వెలిబుచ్చినారు. "వివాహం కొన్ని ఆర్థిక బాధ్యతలను హక్కులను సృష్టించే సాధనం. కేవలం బాంధవ్యంకాదు." అని



విల్ డ్యురాంట్ తన గ్రంథమైన Story of Civilization లో తెలిపినాడు.

కాని భారతీయులు వేదకాలమునుండి (క్రీ.పూ. 2500) పరిణయాన్ని ధర్మార్థ కామ మోక్షసాధనముగ, అగ్నిసాక్షిగ, బంధు హితజన సమక్షమున, పురోహితుని మంత్రోచ్చారణతో నిర్వహించుచున్నట్లు మన సాహిత్యగ్రంథములందు పలు నిదర్శనము లున్నవి.

ఆటవిక తెగలు కొన్ని విందువినోదము లతో, మరికొన్ని తెగలు నామమాత్రపు కన్యాశుల్కముతో పెండ్లిళ్లు జరుపుచుండ నాగరిక ప్రపంచము వరకట్న పిశాచమును ఎదుర్కొనలేక పోవుట విచారకరము. పాశ్చాత్య దేశములలో జరిపిన సర్వేలో తలిదండ్రులు నిర్ణయించిన పెండ్లి సంబంధములు ప్రేమ వివాహములకన్న ఎక్కువకాలము కొనసాగి, సుఖమైన దాంపత్యజీవితమున కుపకరించినట్లు తేలినది. పాశ్చాత్యనాగరికతా వ్యామోహమునను్న యువతరము ఈ విషయమును గుర్తించుటవసరము.

ఈ వ్యాసమున "వివాహమంత్రములు" విదితవరచు వివాహ పవిత్రత, విశిష్టత వివరింపబడును. వివాహారంభమున పఠించు "మహాసంకల్పము"ను పరిశీలించిన మన దేశ చిత్రపటమును కనులార గాంచ వచ్చును. నేపాల్, సింహళములుగూడ మనదేశ అంతర్భాగములని యిందు తెలుపబడుట గమనార్హము. దేశమునగల నదులు, పర్వతములు, పుణ్యక్షేత్రములు, మన ఖండము, దేశమునకుగల పేర్లు, ప్రస్తుత యుగాది విషయములు వర్ణింపబడినవి. పెండ్లివందిరిలో సమావేశమై తిలకిగా నున్న జనులకు దేశసమైక్యతను, వైశాల్యమును తెలియజేయుట అదనుగా భావించినట్లు తోచును.

## మహాసంకల్పమును పఠించండి:

అథానంతరవీర్యస్య శ్రీమదాదినారాయణస్య .... అంగవంగ కళింగ కాశ్మీర .... సౌరాష్ట్ర .... నేపాళ .... సింహళ .... పాండ్య పుళిందాంధ్ర....అనేక దేశభాషా భూపాల విచిత్రితే .... మలయ సహ్యవింధ్యాది సప్తకుల పర్వతే....గంగా గోదావరీ భాగీరథీ నర్మదా కృష్ణవేణ్యాద్యనేక పుణ్యనదీ విరచితే అయోధ్యా మధురా .... కాశీ.... వేంకటాచలధర్మపుర్యాది .... క్షేత్రపవిత్రితే పంచాశత్కోటి యోజన విస్తీర్ణ భూమండలే లక్షయోజన విస్తీర్ణజంబుద్వీపే (ఆసియా ఖండము) భరతవర్షే, భరతఖండే....కృత త్రేతా ద్వాపరయుగాది గతానిమి, దానీం కలియుగం వర్తతే.

## కన్యాదానము :

"సర్వేషాం పితౄణాం నరకాదుత్తీర్య శాశ్వత బ్రహ్మలోక నిత్యనివాస సిద్ధ్యర్థం.... సాలంకృత కన్యాదాన మహం కరిష్యే" "కన్యాం సాలంకృతాం సాధ్వీం సుశీలాయ సుధీమతే ప్రియతోఽహం ప్రయచ్ఛామి ధర్మకామార్థ సిద్ధయే"

వధువుతండ్రి పెండ్లి సమయమున వధువును దానము చేయుట హైందవ సంప్రదాయములోని ప్రత్యేకత. శిశుప్రాయమునుండి పెంచి పోషించిన తన ప్రేమమయ మూర్తిని, అల్లునకు పితౄణమునుండి విముక్తికొరకు, ధర్మార్థకామాదులు సిద్ధించుటకు, మోక్షప్రాప్తిని కోరి ధారవోయును. ఈ త్యాగములోని ధర్మనిర్వహణను అర్థము చేసుకొనవలసి యున్నది. గోదానాదులను దానము చేయునపుడు దాత "నమమ", ఇకనుండి యిది "నాదికాదు" అనును. కాని కన్యాదాన సమయమున పై పదమును చేర్చకుండుట గుర్తింపవలసి యున్నది.

## ధర్మనిర్వహణ :

హిందూధర్మ వ్యవస్థలో గృహస్థాశ్రమము లేనియెడల మిగిలిన ఆశ్రమ ధర్మములు వికసించలేవు. చతుర్విధ పురుషార్థములలో ధర్మనిర్వహణ మిక్కిలి కష్టమైనది. తదాచరణకై భార్యాపుత్రుల సహాయమర్థించి పురుషుడు వివాహమాడుచున్నట్లు వేదవిధిని తెలిసినవారు తెలుపుచున్నారు. వ్రత యజ్ఞాదులాచరించి దేవతలను, శ్రాద్ధములచే పితరులను, దానధర్మములతో బీద సాదలను గృహస్థుడు తృప్తిపరచును. శుభకార్యములన్నియు భార్యాసహితుడై యాచరించుట హిందూధర్మములోని ప్రత్యేకత. అందుకే భార్య "సహధర్మచారిణి" మానసికముగనేకాక శారీరకముగ గూడ ఏకత్వమును నిరూపించుటకు ఈశ్వరుడు "అర్ధనారీశ్వరుడు" అయినాడనిపించును.

ఇట పెండ్లి సమయమున చేయు శపథము గమనింపతగినది. "ధర్మేచ, అర్థేచ కామేచ నాతి చరితవ్యాః" (నీవు అతిక్రమించి నడువరాదు) అని వధువు తండ్రి వధువు పక్షమున అనును. పూర్వకాలమున చిన్నపిల్లలకు (6, 7 సంII) వివాహం జరిగెడిది. అందుకే పై శపథము వధువు పక్షమున తండ్రిచే పలికించి యుండురు. "ధర్మేచ, అర్థే చ, కామేచ నాతిచరామీతి"- నిన్ను అతిక్రమించి నడచుకొనను అని వరుడు వధువునుద్దేశించి శపథము చేయును.

## సప్తపది :

"సఖా సప్తపదా భవ సఖాయౌ" కలిసి ఏడడుగులు నడుచుటచే స్నేహము గలవారమైతిమి. ఆ సప్తపది వలన విష్ణుమూర్తి ప్రసాదించు సౌభాగ్యములను తిలకించండి.

మూII ఏకమిషే విష్ణుస్త్వాన్వేతు। ద్వే ఊర్జే...।
త్రీవ్రతాయ...। చత్వారి మాయో భవాయ...।
పంచ పశుభ్యో...। షడృతుభ్యో...।
సప్త సప్తభ్యో హోతృభ్యో...। (ప్రతి ఖాళీ స్థలమున విష్ణుస్త్వాన్వేతు అని చదివేది)

ఏడడుగులలో వరుసగా అన్నమును, బలమును, కర్మమును, కర్మసుఖమును, పశుసమృద్ధి, ఋతుసంపత్తి, యజ్ఞముచేయుటకు ఋత్విక్కులను కలుగజేయుగాక అని అర్థము. అందుకే ఇల్లాలు "ఇయం గేహే లక్ష్మీః".

## సంతానేచ్ఛ :

"గృహ్ణామి తే సుప్రజాస్త్వాయ హస్తం" (సుప్రజాస్త్వాయ) యోగ్యమైన సంతానము కొరకు (హస్తం గృహ్ణామి) పాణిగ్రహణము చేయుచున్నాను.

"ధర్మప్రజాసంపత్త్యర్థం ప్రియాముద్వహే" పై శ్లోకపాదములనుబట్టి పాణిగ్రహణము సత్సంతానముకోరి జరుగునని స్పష్టమగుచున్నది.

## మాంగల్యధారణము :

"మాంగల్యం తంతునానేన మమ జీవన హేతునా కంఠేబధ్నామి సుభగే త్వం జీవ శరదశ్శతమ్."

నా గృహస్థధర్మమునకు మూలకారణమైన మంగళ సూత్రము (శుభముగూర్చు పుస్తెలతో గూడిన దారము) ను నీ మెడలో కట్టుచున్నాను అని పై శ్లోకార్థము. జీవితమున శుభముల బడయుటకు, శుభ పరిణామములు పొందుటకు పరిణయము జరుపబడుచున్నదనుట తేటతెల్లమగుచున్నది.

### సుముహూర్తము :

సుముహూర్తమున (పెండ్లికి నిర్ణయించిన శుభగడియ) జీలకర్ర, బెల్లమును మొదట వధువుచేత వరుని శిరస్సుపై తర్వాత వరునిచే వధువు తలపైన పెట్టించబడును. జీలకర్ర, బెల్లము అన్యోన్యతకు, ప్రీతికి నిదర్శనము.

సుముహూర్త సమయమున చేయు మంగళాశాసనము (ఆశీస్సులు) వినండి. "తదేవ లగ్నం సుదినం తదేవ। తారాబలం చంద్రబలం తదేవ। విద్యాబలం దైవబలం తదేవ। లక్ష్మీపతేరంఘ్రి యుగం స్మరామి। సావధానాభవంతు.

జాతక, గణ కూటాదులను చూచి అనుకూలించిననే పురోహితుడు (పురము యొక్క మేలు కోరువాడు) సుముహూర్తమును నిర్ణయించుట సంప్రదాయముగా నున్నది. ఐనను పరిణయము దైవానుకూలముగ భావించబడును. "ఋణానుబంధ రూపేణ పతి పత్ని సుతాలయాః, సవితా పురంధిర్మహ్యం త్వాదుర్గార్హపత్యాయ దేవాః" పూర్వజన్మ సుకృత విశేషమునుబట్టి పతి, పత్ని, సుతాదులను భగవంతుడొసగూర్చునని పై శ్లోక పాదములు తెలుపుచున్నవి. పెండ్లిలో వధూవరులను లక్ష్మీనారాయణులుగ, సీతారాములుగ, పార్వతీపరమేశ్వరులుగ భావించుటబట్టి వివాహపవిత్రతను అర్థము చేసుకొనవచ్చును.

ప్రతి వివాహమంత్రములో ఎంతో నిగూఢమైన అర్థమున్నది. కాని కాలగర్భమున వాటికి గల అర్థప్రాధాన్యము మృగ్యమై, వానిని సంప్రదాయముగ ఉచ్చరించుచు ఆచరించుచున్నారు. గృహిణి ప్రాధాన్యము వీనినర్థము చేసుకొనిన తెలిసివచ్చును. కావున హిందూ వివాహ సంస్కారములోని విశిష్టతను గ్రహించిన నేటి సమాజమున మహిళలపట్ల ఆదరాభిమానములు ప్రదర్శించుటకు వీలేర్పడును.




## ప్రకటన రేట్లు

**మామూలు పేజీలకు :**

| | |
|---|---|
| పూర్తి పేజీ : | 500 రూ |
| అర్ధ పేజీ : | 300 రూ |
| పావు పేజీ : | 150 రూ |
| ఒక కాలమ్ : | 200 రూ |

## సాంకేతిక సమాచారం

| | |
|---|---|
| పేజీవైశాల్యం; | 275 సెం మీ × 21.5 సెం. మీ |
| ముద్రణస్థలం : | 24" × 19 సెం. మీ |
| కాలమ్‌లు : | 3 |
| స్క్రీన్ కవరు | 100 |
| లోపల : | 65 |

**గమనిక :**

1. ప్రకటన సమాచారం, బ్లాకులు ప్రకటన దారులే ఇవ్వాలి.
2. ఆరు నెలలకు ముందుగా ప్రకటనస్థలం కేటాయించు కొనదలచిన వారికి 10 శాతం, సంవత్సరానికి ప్రకటనస్థలం కేటాయించుకొనే వారికి 15 శాతం. పై రేట్లపై తగ్గింపు ఇవ్వబడుతుంది.
3. ఏవిధమైన నోటీసుగాని లేదా ఏకారణంగాని తెలుపకనే ప్రకటనలను తిరస్కరించే హక్కు సంపాదకుడికి వుంటుంది.
4. కవరు పేజీలకు ప్రకటనలు స్వీకరింపబడవు.

ఇతర వివరాలకు :

సంపాదకుడు.

(11 వ పేజీ తరువాయి)

వుల్ని చంపేవాడుకాదు. చంపబడిన జంతువుల్ని కొనితెచ్చేవాడు. తన ప్రవృత్తిని బట్టి తనకు మాంసాహారం అవసరం లేకపోయింది. కాబట్టి మాంసాహారాన్ని స్వీకరించకపోవడం తనకు ధర్మం. తానా ధర్మాన్ని పాటించాడు. మాంసాహారాన్ని స్వీకరించే ప్రవృత్తి కలవారికి మాంసాహారం స్వీకరించడం ధర్మం. ఆ ధర్మం కలవారికి అతడు మాంసాహారాన్ని విక్రయించాడు. మానవుడు తనకు ధర్మమయిందే అందరికీ ధర్మమై తీరాలని అనుకోకూడదు. అలా అనుకోవడం ప్రకృతికి విరుద్ధం. దేశకాలపాత్రాలనుబట్టి ఆచరణీయమైన ధర్మం రూపుకట్టుకుంటుందని గ్రహించాలి.

వ్యక్తితత్త్వంపైన అతడు అపేక్షించే ఆహారం ఆధారపడి ఉంటుందని చెప్పుకున్నాం. ఆ తత్త్వం అతడిలో పనిచేసే త్రిగుణాల కలయికవల్ల వ్యక్తమవుతోంది. ఆ త్రిగుణాలలో దేని ప్రభావం ఎక్కువగా ఉంటుందో ఆ గుణం ఆ వ్యక్తి స్వభావాన్ని రూపొందించడంలో ప్రధానపాత్ర వహిస్తుంది. ఈ మూడు గుణాల ప్రభావాలను అనుసరించి మూడు రకాల ఆహారాలను అపేక్షించేవారు లోకంలో ఉంటూ ఉంటారని కృష్ణుడు గీతలో వివరించాడు.

సత్త్వగుణం ప్రధానంగా కలవాడికి సాత్త్వికాహారం అంటే ఇష్టంగా ఉంటుంది. ఆయువు, సత్త్వం, బలం, ఆరోగ్యం, సుఖం, ప్రీతి, అనేవాటిని పెంచే ఆహారం. సాత్త్వికం. రసవంతాలు, చమురుకలవీ, స్థిరత్వంకలవీ, హృదయానికి ఇంపైనవి అయిన ఆహారాలు ఇలాంటివి. రసవంతాలు రస్యాలు. అంటే రసం గల కాయలు, పండ్లు పువ్వులు, ఆకులు. చమురు కలవి స్నిగ్ధాలు అంటే నువ్వులు మొదలైన చమురు పదార్థాలు. స్థిరాలు అంటే దేహధాతువులకు స్థిరత్వాన్ని ఇచ్చే పప్పులు, దుంపలు మొదలైనవి. హృద్యాలు అంటే తేనె, నేయి మొదలైన గుండెకు బలమిచ్చే పదార్థాలు. సాత్త్వికస్వభావం కలవాడికి ఇవన్నీ ప్రియంగా ఉంటాయి. ఆహారం స్వీకరించడం అంటే ఈ చెప్పబడినవాటిలో లభ్యమైన వాటిని స్వీకరించడమని సాత్త్వికుని భావన.

రజోగుణప్రవృత్తి కలవారికి కారం, పులుపూ, ఉప్పు, వేడివేడిగా ఉండేవీ, జిహ్వకు తీక్ష్ణమైన రుచిని అందించేవీ, ఎండబెట్టినవీ, కాల్చినవీ అయిన ఆహారాలు ఇష్టంగా ఉంటాయి. ఇవి దుఃఖాన్ని, శోకాన్నీ, రోగాలనూ కలిగిస్తాయి.

ఎండబెట్టినవి అంటే ఒరుగులు, వడియాలు మొదలైనవి. కాల్చినవి అంటే వేపుళ్ళు, కాల్చినకూరలు, మాంసం మొదలైనవి. దుఃఖాన్ని కలిగించేవి అంటే మనస్సుకు దిగులూ, శోకభావం పెంచేవి. ఉప్పు, పులుపూ, కారాలూ, హెచ్చుగా వాడటంవల్ల ఇవి కలుగుతాయి.

తామసప్రవృత్తి కలవారికి వండిన వెనుక మూడుగంటలు దాటినవీ, రుచితప్పి వరకూ నిలవఉన్నవీ, దుర్వాసనవేసేవి, చద్దిపోయిన పదార్థాలు, అంటే ఒకపూట దాటిన చద్దన్నం మొదలైనవి, తిని మిగిల్చినవి లేక ఎంగిలి పదార్థాలూ, మేధస్సుకు పనికిరానివీ రుచిస్తాయి. మేధస్సుకు పనికిరానివి అమేధ్యం: అంటే తెలివినీ, చురుకుదనాన్నీ హరించగల ఆహారం.

ఇది భగవద్గీతలో శ్రీకృష్ణుడు చేసిన ఆహార విభజన. దీన్నిబట్టి మనలో ఏ గుణం ప్రాధాన్యం వహిస్తుంటే ఆగుణానికి సంబంధించిన ఆహారం మనకి నచ్చుతుంది. మనకు నచ్చే ఆహారాన్నిబట్టి మనలో ప్రాతినిధ్యం వహిస్తున్న గుణాన్ని మనం గమనించుకోవచ్చు. ఈ సందర్భంలో గమనించవలసిన సూక్ష్మం మరొకటి ఉంది. ఒక గుణానికి సంబంధించిన ఆహారాభిలాష గల వ్యక్తి కావాలని కోరి మరో గుణానికి సంబంధించిన ఆహారాన్ని స్వీకరించడం ప్రారంభిస్తే క్రమంగా అతడిలో ప్రాతినిధ్యం వహించే గుణం కూడా మారుతుంది. ఉదాహరణకు రజోగుణప్రవృత్తి కలవాడు తమోగుణానికి సంబంధించిన చద్దిపోయిన పదార్థాలూ, రుచితప్పిన పదార్థాలూ మొదలైనవి తినడం ప్రారంభిస్తే, క్రమంగా అతడి ప్రవృత్తిలో రజోగుణం వెనక్కు తగ్గి, తమోగుణం ప్రాతినిధ్యం వహించడం ప్రారంభిస్తుంది. అలాగే ఏ తమోగుణప్రవృత్తి కలవాడో కావాలని కోరి సాత్త్వికమైన ఆహారాన్ని అలవాటు చేసుకోసాగితే క్రమంగా అతడి ప్రవృత్తి సత్త్వోన్ముఖం అవుతుంది. ఈ సత్యాన్ని గమనించే పెద్దలు ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః, అని చెప్పారు.

సత్త్వగుణసంపన్నులైన పెద్దలు ఆధ్యాత్మిక సాధనకు సాత్త్వికాహారం మంచిదని చెప్పడంలోకూడా ఒక ధర్మసూక్ష్మం ఉంది. చెట్లకు మూలచ్ఛేదం కలగకుండా అవి ఇచ్చే ఆకులు, కాయలు, పళ్ళూ, జంతువులకు మూలచ్ఛేదం కలగకుండా అవి ఇచ్చే పాలూ, పాలనుంచి వచ్చే పెరుగూ నెయ్యీ స్వీకరించడంవల్ల ప్రాణుల ఉనికికి ముప్పురాకుండా అవి అందించే ఫలాలను మాత్రమే స్వీకరించి తృప్తిపడటం జరుగుతుంది. తోటి జీవులకు తమవల్ల ఎక్కువ బాధ కలగకుండా జీవించగలిగే సాధన ఈ ఆహార స్వీకరణలో ఇమిడి ఉంది.

వానప్రస్థాన్ని స్వీకరించిన పెద్దలు మరో అడుగు ముందుకు వేసి ఆకుల్ని కొయ్యకుండా రాలిన ఆకుల్నీ, కాయల్ని కొయ్యకుండా రాలిన పళ్ళనీ, మొలకెత్తడానికి అవకాశం లేకుండా రాతిబండలమీద పడ్డ గింజల్నీ ఏరుకుని తిని తమవల్ల జీవులకు బాధ కలగటంలేదనీ, తాము మరొక జీవికి జన్మనెత్తే అవకాశం లేకుండా చేయడంలేదనీ తృప్తితో ముందుకు సాగేవారు. ఈ సాధన భూతదయ పెరగడానికీ, తద్ద్వారా ఆత్మసాక్షాత్కారానికి దారితీస్తుంది. వారు ఆశించిన గమ్యానికి అనువుగా ఉండేటందుకు తుదకు ఆహార స్వీకరణను కూడా ఒక సాధన మార్గంగా వారు మలచుకున్నారు.

మనిషి ప్రవృత్తి తనకు తగిన ఆహారాన్ని అపేక్షిస్తుంది. మనిషి తన కార్యసాధనను, గమ్యాన్ని, దృష్టిలో పెట్టుకొని ప్రవృత్తికి తగిన ఆహారాన్ని అందించడమో లేదా అవశ్యకమైనపుడు తన గమ్యానికి తగినట్లుగా ప్రవృత్తిని మలచుకోవడమో చేయాలి. శారీరకంగా శ్రమించడం కర్తవ్యంగా కలవారికి ఒకరకమైన ఆహారం కావాలి. ఆధ్యాత్మికసాధనలో ముందుకు సాగి సత్త్వసిద్ధిని పొందగోరేవారికి ఒక రకమైన ఆహారం కావాలి. ఈ సత్యాన్ని గ్రహించి మానవుడు తన ప్రవృత్తినీ, కర్తవ్యాన్ని గమనించుకొని సమన్వయపరచుకొని తనకు తగిన ఆహారాన్ని నిర్ణయించుకొని స్వీకరించాలి.

(8వ పేజీ తరువాయి)

భగవంతుండగు హరి యిట్లు శేషభూధరమ్ము విడచి చనినంత చతుర్ముఖుండా వృత్తాంతం బెరింగి, హరి లేమింజేసి భూలోకంబింక అధర్మవాదులకు, బరహింసారతులకు నెలవై చెడుంగదేయని భయమంది, సకలలోక సంచారి యైన నారదురావించి, శ్రీహరి మరల భూమినవతరించు నుపాయంబు గావింపు మనినంత-ఆ యాజ్ఞ తలందాల్చి-

సూత్ర: అలా చెప్పు! ఇంకా నారదుడు రాలేదేమా అని చూస్తున్నాను—

(శంకరాభరణ రాగం-ఝంపె తాళం)

వేలుపుల జడదారి వెడలె మినుదారి
మేళవించిన మహతి గాలి తాకుల పరిగ
మాలావనము సలువ హరి రమారమణయని
వేలుపుల జడదారి వెడలె మినుదారి.

ఉ. పావనగాంగతీర వనవాటికలన్ మునికోటి యజ్ఞదీ
క్షా విధి మన్న చో దరియగాజని, ఓ మునివర్యులార! మీ
రీ వివిధాధ్వరమ్ముల యజించెదరెవ్వని? తత్ఫలంబు గౌ
రీ వరుడో, రమేశుడొ, విరించియొ. ఇంద్రుడొ ఎవ్వ
డందెడిన్?

తెలుపరే యనినంత, కశ్యపాత్రి భరద్వాజముఖ్యులగుమౌనులు తమలో గొంతవడి గుజగుజలువోయి, తుదకు త్రిమూర్తులలో యజ్ఞఫలార్హుడెవ్వడో యెరింగి రమ్మని భృగుమౌనిం బ్రార్థింప అతండు తొలుత సత్యలోకమ్మునకేగి-

ద్వి. ఏకాంతమున శారదాకాంత గూడి నా
ళీక భవుడున్న చో, రాక యెరిగింప కా
జటి వరుడు నికటమున తటుకుమని నిలువగా
కుటిల భ్రుకుటి మొగము లటు ద్రిప్పికొనె సలువ-

భృగుమౌనియు నీతండు రజోవశుండై, నన్ను మన్నింపడాయె, యజ్ఞఫలార్హుండు కాదగడనియు, నీతనికి భూమియందాలయంబు లేకుండుగాక యనియు నిశ్చయించి-

ద్వి. భృగుమౌని కైలాస నగమునకు నేగి,
అగజతో నేకాంత మందున్న శివుని
దరికేగ, తరిగానితరి నంతిపురికి
జొరబారిన త్రిదండి నరసి గిరిపుత్రి
నానమై వంచికొనె నానన; మ్మంత
మౌని నీశానుడెంతేని కోపాన
రుసరుస జూచుటారసి నంత తలిసి
ఇసిరొ, యీతండు తామసుడనియెంచి.

యజ్ఞఫలంబునకితడు పాత్రుండుగాడు. ఈ యీశ్వరునకు శరీరపూజ లేకుండుగాకయని-

ద్వి. కుతుకమ్ముమీర వికుంఠపురి కరిగి
అతులితైకాంతమ్మునందు కేశవుడు
నీలనీరదకాంతి నిర్నిద్ర శాంతి
దేలుచు గడలిరాచూలి నెదదాల్చి
కనుమోడ్చి తనదెస కనుగొనకున్న;
గనలుచు మౌని శ్రీకాంతు వక్షమును
దన పాదతలమున దన్నగా; శౌరి
వనజాత పత్రలోచనములు విచ్చి
ఆదిత్య సమతేజు నా మౌని గాంచి
పాదాంబుజమ్ముల బ్రణతుడై వ్రాలి
"కటికి నా యెదదాకి కందినదేమొ
జటినాథ! మృదుపాద సరసిజం" బనుచు
పాదముల్ కడిగి, తత్పాద తీర్థమ్ము
మోదమున తన శిరమ్మున జల్లుకొనియె
"సెలవిండు మీరు వచ్చిన పనియేమొ
తలదాల్చి మీయాన ధన్యుండ నగుదు"

చం. అని హరిపల్కు టారసి మహాముని లజ్జితుడై ముకుంద! వి
శ్వనికరతుంద! సత్వగుణశాలికి, ఈ భువనప్రపంచ పా
లన శుభశీలికిన్ దగు బళా! యిటువంటిదితాల్మి, సైపవే
నను విధిశంకరార్చిత! సనాతన! నిత్య! నిరంజనా
హరీ!''

అని హరికల్యాణ గుణగానంబు సల్పుచు వీడ్కొని చనినంతట,

ద్వి. మునినాథ పదఘాతమున సొమ్మసిలిన
వనజాలయ యొకింతవడి దెప్పరిల్లి,-
అతిధూర్తుడగు మౌనికంజలి యొగ్గి
నత శిరస్కుండైన నాథుని గాంచి,
కనుదోయి బాష్పముల్ గ్రమ్మనిట్టూర్చి
కినుక పెంపున కేశవునకిట్టులనియె-

లక్ష్మి: దేవరా! యీదాసి సేవించుకోకుండానే వెళ్ళిపోయారా అయ్యవారు? నాదికదా యీ అపచారమంతా, మీ వక్షమందుండే నా కరకుశరీరం కదా పూవువంటి వారి పాదానికి సోకింది. పోయి తోడుకరండి, వారి పాద సంవాహనంచేసి ధన్యనౌతాను.

సూత్ర:- ఓహోహో! ఏమి గడుసుదనం! అమ్మవారికి యెంత అభిమానం!

కథక:- అనుచు, ఈసుమై బల్కుచు, అంతకంతకు వెక్కసంబైన అవమానక్రోధము నాపలేక, మానహీనుండని మాధవునిపొత్తు మనంబునరోసి రమాదేవి ఏమనుచున్నది....

(ముఖారిరాగం-ఝంపెతాళం)

చెల్లెబోదేవ! మీసేవ యీనాటితో
చెల్లరే! దాసి కిక సెలవిండు దయజూచి ॥చెల్లె॥
ఒల్లనీయవమాన భల్ల మెదగాడగా
కొల్లబోయెను సిగ్గువల్లమాలిన యెగ్గు ॥చెల్లె॥
కేశవునిసతి కంబుధీశు కూరిమిసుతకు
వాసియౌనే తుదకు బైసిమాలిన బ్రతుకు ॥చెల్లె॥

సూత్ర:- అమ్మవారు గట్టిపట్టే పట్టింది. యెలా శాంతిస్తుందో మరి?

(సశేషం)

# తిరిగిదొరకనిది



*

అనగనగా ఒక మహారాజు. వారు ఒక రోజు వేటకు వెళ్ళారు. ఒక క్రూరమృగాన్ని వేటాడుతూ, తన పరివారానికి దూరమై పోయారు. చివరకు ఒక చిట్టడవిలో చిమ్మ చీకటిలో చిక్కుపడిపోయారు.

ఆశ్రయం కొరకు వెతుకుతూవుంటే ఎక్కడో దూరాన ఒక దీపంవెలుగు కనిపించింది. బ్రతుకుజీవుడా అని అటువైపే నడుచుకుంటూపోయిన రాజుగారు చివరకు ఒక పూరిగుడిశె ముందుకు చేరారు.

గుడిశె తలుపుతట్టేసరికి, ఎవరో విసుక్కుంటూవచ్చి తలుపు తెరిచారు. ఆ రాత్రి తనకు పిడికెడు మెతుకులూ, పడుకొనేందుకు పడకా ఇప్పించమని అడిగాడు మహారాజు. ఆ గుడిశెలో వుంటున్నవాడు కటిక పేదరికంలో ఉంటున్నవాడు. ఆ రాత్రికి వాడు వాడిభార్య చెరికాస్త్రాతిని పడుకొన్నారు- ఇక ఆ వేళప్పుడు అతిథులకు వాళ్ళు ఏం మర్యాదచెయ్యగలరు? పైగా ఆ వచ్చినవాడు మహారాజన్నది వాడికి తెలియకపోయె.

అందుకే సణుక్కొంటూ, గొణుక్కొంటూ చప్పగాచల్లారిపోయిన ఒక జొన్నరొట్టెను రాజుముందుపడేసి తినమన్నాడు. తర్వాత ఓ చిరిగిపోయిన బొంతను తెచ్చియిచ్చి ఆరుబయట పడుకోమన్నాడు. ఆకలి రుచి ఎరుగదు, నిద్ర సుఖమెరుగదు అన్న సామెత, ఆ రోజు ఆ రాజు పట్ల అక్షరాలా నిజమైంది.

ఆ జొన్నరొట్టెనే పంచభక్ష్యపరమాన్నంగా ఆరగించి చిరుగులబొంతే హంసతూలికా తల్పంగా సుఖనిద్రలో జారుకొన్నాడు రాజుగారు. వేకువజామున్నే లేచి గుడిశెలో వాళ్ళకు మాటమాత్రమైనా చెప్పకుండా కాలిబాటన నడచి తన పరివారాన్ని చేరుకొన్నారు.

కొంతకాలం గడచిపోయింది. రాజుగారు చల్లగా రాజ్యం ఏలుతూవున్నారు - ఉన్నట్లుండి ఓరోజు చిట్టడివిలోని కట్టెలుకొట్టుకునేవాడు వారికి గుర్తువచ్చాడు. ఆ రాత్రి

అతడు తనకు ఆశ్రయమివ్వటం తలచు కొంటే రాజుగారికి, అతడిపట్ల ఎంతో అభి మానం ముంచుకొచ్చింది.

అతడిపట్ల కృతజ్ఞత చూపకపోవడం పాపమనిపించింది. వెంటనే పరివారాన్ని పురమాయించారు, ఆవ్యక్తిని రాచనగరుకు తీసుకురమ్మని. రాజభటులు తన గుడిశె ముందు నిలవటంతో, కట్టెలు కొట్టేవాడికి విషయమంతా తెలిసి విలవిలలాడి పోయేడు. రాత్రి తన గుడిశెలో పడుకొన్న వారు మహా రాజుగారా? అమ్మో! ఎంత ఘోరం జరిగి పోయింది! మహారాజుగార్ని ఎంత అమ ర్యాదగా చూశాడు! తాను ఎంత తప్పు చేశాడు- రాజుగారు తనను శిక్షించడం తథ్యమనుకొన్నాడు, ఆ అడవిమనిషి. అయినా తనకు ఈ శాస్తి జరగవలసినదే ననుకొంటూ రాచభటులవెంట నడిచాడు-

అక్కడ రాజుగారు నిండుకొలువులో వున్నారు. అడవి మనిషికి అగ్రాసనం ఇప్పించారు. ఆతడు తనకు ఇచ్చిన ఆతి థ్యాన్ని గురించి సభాసదులకు గొప్పగా చెప్పాడు. చివరన ఏదైనా బహుమానం కోరుకొమ్మని అడవి మనిషిని అడిగాడు.

మహాప్రభూ! నా తప్పును క్షమించి విడచి పెట్టడమే నాకు పెద్ద బహుమానం, ఇంకేమి అక్కరలేదన్నాడు, కట్టెలుకొట్టుకునేవాడు. రాజుగారు ఎంతవొత్తిడి చేసినా నోరెత్తనే లేదు. ఇలాకాదని చెప్పి రాజుగారే అతనికి ఒక పెద్ద చందనవనాన్ని అందులోవున్న అందాల భవనంతో సహా దానంగా ఇస్తు న్నట్లు ప్రకటించారు.

అదివిని ఆ అడవిమనిషి ఆనందంతో రాజుగారివద్ద శెలవు తీసుకొని వెళ్ళి పోయాడు.

కొన్నినెలలు గడచిపోయాయి. రాజు గారికి మళ్ళీ ఆ అడవిమనిషి గుర్తుకొచ్చాడు. అతడెలావున్నాడో చూడాలనిపించింది వెంటనే పరివారంతో – చందనవనానికి బయలుదేరాడు. ఆ వనాన్ని సమీపిస్తుంటే పొగలుసెగలు దట్టంగా కనిపించిన రాజు గారు చకితులయ్యారు. చందనవనంలో అడుగు పెట్టిచూస్తే ఒక్క చెట్టయినా కని పించలేదు – చెట్లు ఉండవలసిన చోట్ల బొగ్గులు గుట్టలుగా వున్నాయి. ఆ వన మంతా, వల్లకాడులా కనిపించింది. రాజు గారిలో కోపం రాజుకొంది. వెంటనే అడవి మనిషిని భటులచేత పిలిపించాడు. వాడు వచ్చి రాజుకు మొక్కాడు.

రాజుగారు ఎలావున్నావని కుశల మడి గాడు. తమ దయవల్ల క్షేమంగానే వున్నా నన్నాడు అడవిమనిషి. "ఏం చేస్తున్నా" వన్నాడు రాజుగారు "బొగ్గుల వ్యాపారం" అని సమాధానం వచ్చింది. అడవిమనిషి అజ్ఞానానికి నవ్వాలో ఏడ్వాలో తెలియలేదు రాజుగారికి – అతడికి తెలివిగలిగించాలని పించింది. చందనం చెట్టునుంచి ఒక కొయ్యను నరుక్కురమ్మన్నాడు. అడవిమనిషి ఆలాగే చేసాడు. ఆ చందనం కొయ్యను తీసుకెళ్ళి బజారులో విక్రయించిరమ్మని ఆజ్ఞాపించాడు అడవిమనిషిని.

ఈ రాజుగారికేమీ తెలియదు! ఈకొయ్య ముక్కకు ఏంవస్తుంది? అదే దీన్ని కాల్చితే ఎన్ని బొగ్గులవుతాయని? అనుకొంటూ బజారుకు వెళ్ళాడు. అక్కడ ఓ వర్తకుడికి దాన్ని బేరంపెట్టాడు. ఆ వర్తకుడు పది వరహాలు అడవిమనిషి చేతికిచ్చాడు. అది చూసి అతడి కళ్ళుతిరిగాయి.

ఆశ్చర్యంతో "ఇంతడబ్బా" అన్నాడు. అది చాలక ఎక్కువ అడుగుతున్నాడేమో అనుకొని వర్తకుడు ఇంకో పదివరహాలు ఎక్కువ ఇచ్చాడు. దాంతో మారుమాట్లాడ కుండా ఆ వర్తకుడు పిచ్చివాడనుకుంటూ రాజుగారివద్దకు పరుగుపరుగునవచ్చి జరి గినదాన్ని ఒక వింతగా చెప్పాడు.

రాజుగారు చిరునవ్వునవ్వి అన్నారు "పిచ్చివాడివి నువ్వేనోయ్! నువ్వు పట్టు కెళ్ళిన చందనంముక్క ఏభైవరహాలు చేస్తుంది. నీకు ఆవర్తకుడు అందులో సగం కూడా ఇవ్వలేదు"

రాజుగారి మాటలతో అడవిమనిషికి జ్ఞానో దయమైంది. ఒక్క ముక్క విలువ ఏభై వర హాలయితే అలాంటి ముక్కలు వేలకొద్దీతాను మాడ్చి మసిచేశాడే? తాను ఎంతగా నష్ట పోయాడు? తనకు జరిగిన అన్యాయానికి అడివిమనిషి భోరునఏడ్చాడు.

"మహాప్రభూ నన్ను కనికరించి మళ్ళీ నాకో చందనవనం ఇప్పించండి. తమరు చెపితేగాని చందనం విలువ తెలియలేదు. ఈ సారి మీరిచ్చేవనాన్ని సద్వినియోగం చేసుకొంటాను'' అంటూ రాజుగారి కాళ్ళపై బడి బ్రతిమాలేడు. కాని రాజుగారు తల అడ్డంగా వూపేరు.

"పిచ్చివాడా! నీకు ఇచ్చిన అవకాశం జారవిడుచుకొన్నావు 'అది తిరిగి దొరకనిది' అంటూ ఆయన అడవిమనిషిని విడచిపెట్టి వెళ్ళిపోయారు.

ఇది శ్రీప్రభుదత్త బ్రహ్మచారి తమ ప్రవచనాలలో చెప్తూవుండే కథ-మన జీవితం ఒక చందనవనం లాంటిది. మన పూర్వజన్మ సుకృతంవల్ల అది దేవుడు మనకు ప్రసా దించినవరం. ఆ చందన వనాన్ని వల్లకాడు చేసుకొంటే మనకు మళ్ళీ అలాంటిది దొర కదు. మన జీవితం విలువ మనం తెలుసు కోవాలి. మన జీవితాన్ని దైవ చింతనలో సార్థకం చెయ్యాలి అన్నది పై కథలో సాక్షాత్కరించే సత్యం.

– టి. వారసింహారెడ్డి






తిరుమల తిరుపతి దేవస్థానములు

# ఒక పర్యావలోకనము



శ్రీ వేంకటేశ్వరస్వామి పేరు, తిరుమల తిరుపతి దేవస్థానం పేరు కాశ్మీరమునుండి కన్యాకుమారి వరకు మాత్రమే గాక ఖండ ఖండాంతరాలకూ వ్యాప్తి చెందుతూవుంది. ఐతే దేవస్థానం రూపురేఖలు పరిపాలనావ్యవస్థ అందరికీ అర్థమయ్యే అవకాశంలేదు. శ్రీ వేంకటేశ్వరుని ఏలుబడిలో ఎన్ని సంస్థలు ఎలా అభివృద్ధి చెందుతున్నాయో తెలియడానికి ఈ క్రింది వివరాలు స్థూలంగా తోడ్పడుతాయి.

1. దేవాలయములు : 42
2. వసతి సౌకర్యం
   - ఎ) ధర్మశాలలు : 10
   - బి) అద్దెకు ఇచ్చుగదులు : 903
   - సి) అతిథి గృహాలు : 9
3. భోజన, ఉపాహారశాలలు : 9
4. వైద్యశాలలు, ఆసుపత్రులు : 9
5. విద్యాసంస్థలు
   - ఎ) సంస్కృత, ధార్మికవిద్యాలయాలు : 5
   - బి) ఆర్ట్సు మరియు సైన్సు కళాశాలలు : 6
   - సి) సాంస్కృతిక,సాంకేతిక విద్యాలయాలు: 4
   - డి) పాఠశాలలు : 8
6. సంక్షేమ సంస్థలు : 3
7. పూలతోటలు, ఉద్యానవనాలు : 32
8. పశుగణాభివృద్ధిశాఖ
   - ఎ) పాడిపశువుల సంఖ్య : 389
   - బి) వ్యవసాయ భూములు : 260 ఎకరములు.
9. అరణ్యప్రాంతాలు : 7160 ఎకరములు.
10. పుణ్యతీర్థములు : 16 ( కావి, పురాణోక్తము 1191.)
11. ఆనకట్టలు : 2 ( ఒకటి నిర్మాణంలోవున్నది )
12. పురావస్తుశాలలు : 2
13. పరిపాలనా విభాగాలు : 108
14. ఉద్యోగులు ( అన్నిశాఖలతో కలుపుకొని ) 5772.
15. ముద్రణాలయములు : 1
16. వాహనాలు : 179
17. దేవస్థానప్రచురణలు :
   - ఎ) మాసపత్రికలు : సప్తగిరి ( ఐదుభాషలలో )
   - బి) వార్షికము : పంచాంగము, కేలండర్లు
18. హిందూధర్మరక్షణసంస్థశాఖలు : 13
19. దేవస్థాన సమాచార కేంద్రాలు : 21
20. కళ్యాణమండపములు : 12
21. తిరుపతి సందర్శించిన యాత్రికులు.
    1981-82 సం॥లో 77 లక్షలు
22. దేవస్థానము రాబడి 1980-81 సం॥లో కానుకల ద్వారా: రూ. 7.94 కోట్లు. మొత్తం ఆదాయం: రూ. 22.61 కోట్లు. 1981-82 సం॥లో కానుకల ద్వారా: రూ. 9.33 కోట్లు. మొత్తం ఆదాయం: రూ. 26 కోట్లు.

# ధర్మరక్షణ కార్యక్రమాలు

## సుందరమందారము

భీమవరంలో డిసెంబరు 5న "శ్రీనివాస భారతి" సాంస్కృతిక - ఆధ్యాత్మికసంస్థ ఆధ్వర్యంలో శాంతిశ్రీ జంధ్యాల వేంక టేశ్వరశాస్త్రి రచించిన 'సుందరమందా రము' కావ్యాన్ని 'కళాప్రపూర్ణ' మధునా పంతుల సత్యనారాయణశాస్త్రి ఆవిష్క రించారు. శ్రీరామడుగు వేంకటేశ్వరశర్మ కావ్యపరిచయం చేస్తూ తిరుమల వేంకటేశు నకు అంకితం చేయబడిన ఈ కావ్యం ఉదాత్తమైనదని, భక్తిరస ప్రధానంగా సుందరకాండను గేయరూపంలో సర్వాంగ సుందరంగా శ్రీ వేంకటేశ్వరశాస్త్రి రచించా రని పేర్కొన్నారు. ముఖ్యఅతిథిగా విచ్చే సిన 'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్యశాస్త్రి కావ్యనామధేయం మధురంగా ఉందని, కావ్యంలోని విషయం ఇంకా మధురంగా ఉందని ప్రసంగించారు. రచయిత్ర శాంతిశ్రీ సమాధానం చెబుతూ తన కావ్యంలో ఇన్ని రహస్యార్థాలున్నాయని ఇది ఇంత ఉదాత్త మైనదని తనకే తెలియదని, పలికించిన వాడు వేంకటేశ్వరుడని, కృతికర్త కృతి భర్త ఆయనయే అని పేర్కొన్నారు. అనంతరం శ్రీ మధునాపంతుల, కరుణశ్రీ, శాంతిశ్రీలను శ్రీనివాసభారతి దుశ్శాలు వాలతో ఘనంగా సన్మానించింది. అనేక మంది పురప్రముఖులు, కవిపండితులు పాల్గొన్న ఈ మహాసభకు సంస్థ వ్యవస్థా పకులు శ్రీ ఎస్.టి.వి. రాజగోపాలాచార్యులు అధ్యక్షత వహించారు. శ్రీ నారాయణం శేషుబాబు వందనసమర్పణ చేశారు.

## మెదక్ జిల్లా

ఈ మాసమున ప్రధానముగ నరకచతు ర్థశి, దీపావళి, బలిపాడ్యమి, చిలుక ద్వాదశి, వైకుంఠచతుర్దశి, కార్తికపూర్ణిమ మరియు చతుర్యమాసవ్రత సమాసోత్సవము మొదలగు పండుగలు వచ్చినవి. ఈ మాస మున 4 భజనలు, 6 ఉపన్యాస కార్యక్రమ ములు జరిగినవి.

17-11-82న 12వ జిల్లా జాతీయ గ్రంథా లయ దినోత్సవములను పురస్కరించుకొని డా॥ అంబేద్కర్‌వారి చిత్రపట ఆవిష్కరణ సందర్భమున "అంబేద్కర్ చరిత్ర కుల తత్త్వ నిర్మూలన" మను అంశముపై హిందూధర్మ రక్షసంస్థ మెదక్ జిల్లాశాఖ పక్షమున పాల్గొని ధర్మకర్మలవలన, సత్ గుణములవలన ద్విజుడు కాగలడనియు, అంటరానితనము ఎచ్చటను లేదనియు, "ఆత్మవత్ర సర్వభూతాని" "అద్వేష్టా సర్వ భూతాని" అను సూక్తులు హైందవ ధర్మ మూల సూత్రములని వక్కాణింపబడెను.

18-11-82 న జాతీయ గ్రంథాలయ దినోత్సవసందర్భమున కవిసమ్మేళనమున పాల్గొని హైందవమత విశిష్టత, ప్రాముఖ్యత వివరింపబడెను.

ఈ మాసమున జరిగిన హైందవధర్మ ప్రచార సమాచార సమావేశములలో ప్రతి హిందువు ఆచరించదగిన సప్తగిరిశుని సప్త ధర్మసూత్రాలు [సప్తగిరిలో ప్రచురించు నవి] హైందవులందరు సమైక్యతతో భక్తి ప్రపత్తులతో మండవలయునని ప్రబోధింప బడినది.

29-11-82, 30-11-82 న శ్రీ వేంక టేశ్వర భక్తసంఘము, సంగారెడ్డి తాలుక కేంద్రము వారు, డిడ్డిగేని హనుమాన్ మందిర ప్రాంగణమున కార్తికపున్నమి పురస్కరించుకొని, ప్రత్యేక దీపాలంకృతు లతో శ్రీకృష్ణ-తులసిపూజ, పురాణ, హరి కథాకాలక్షేప కార్యక్రమములు మహావైభవో పేతముగ నిర్వర్తించిరి. అందు హిందూ ధర్మ రక్షణసంస్థ పక్షమున తులసీవ్రతకథ మహత్మ్యము మరియు తులసిమహిమ గురించి తులసిచెట్టు యొక్క లౌకిక ప్రయో జనములు, ఔషధముగాగల గుణములు వివరింపబడినవి.

## గ్రంథావిష్కరణ

మచిలీపట్నం శ్రీ వేంకటేశ్వర భక్త సంఘం ఆధ్వర్యంలో తే. 2-12-82 దిన బందరు బచ్చుపేట శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయ ప్రాంగణమున "ధ్యానచంద్రిక" ఆవిష్కరణ మహోత్సవ సభ కృష్ణాజిల్లా జడ్జి శ్రీయుతులు నాయని కృష్ణమూర్తి అధ్యక్ష తన జరిగింది. కృష్ణాజిల్లా కలెక్టరుగారు పుస్తకావిష్కరణ గావించారు.

బందరు బాలాజీ శాఖాధ్యక్షులు శ్రీధూళి పాళ నరసయ్య కూచిభోట్ల చంద్రశేఖర శర్మగారు శ్రీ దుంధాశ్రీధరరావు శ్రీభాగవ తుల కుటుంబరావు హిందూధర్మంలోని కొన్ని అంశములనుగూర్చి వివరణగా చెప్పారు. దైవభక్తి విద్యార్థి దశనుండి అలవడుట చాల అవసరమని చెప్పారు. శ్రీ భాగవతుల కుటుంబరావు "ధ్యానచంద్రిక లోని విషయములను వివరించారు. కృష్ణా జిల్లా అదనపు జడ్జి శ్రీ యస్. జయరామ రెడ్డి వందన సమర్పణతో సభ విజయవంత ముగా ముగిసింది.

## సామూహిక అంజనేయపూజ

ప్రకాశంజిల్లా ఈతముక్కల గ్రామములో శ్రీ వేంకటేశ్వర భక్తసంఘం అనుబంధశాఖ వారిచే 27-11-82 న చిలుక ఏకాదశి సంద ర్భమున స్థానిక శ్రీ అనంత కోదండస్వామి దేవాలయములో "సామూహిక ఆంజనేయ" పూజ జరిగినది. ఈ పూజకు గ్రామం లోని అనేక మంది స్త్రీలు పాల్గొన్నారు. పూజలో పాల్గొన్న స్త్రీలకు కమిటీవారిచే శ్రీ బోధానంద ఆశ్రమము, శ్రీ మారుతీ సేవాధ్యాన మందిరము, రాజమండ్రి" వారి సౌజన్యంతో భక్తిజ్ఞాన పుస్తకములు ఉచితముగా పంచబడినవి. తదుపరి 30 తేది రాత్రి నుండి శ్రీ వేంకటేశ్వర భక్త బృందముచే భజనకాలక్షేపము జరిగినవి.

# వార్తాలహరి



గ్రామప్రాంతాలలో ముమ్మర ధార్మికప్రచార నిమిత్తం తిరుమల తిరుపతి దేవస్థానముల హిందూధర్మ రక్షణ సంస్థ చిత్తూరు జిల్లాలోని శ్రీ బొమ్మరాజపురం గ్రామాన్ని దత్తతకు స్వీకరించింది. డిసెంబర్ 12వ తేదిన ఆ గ్రామంలో జరిగిన ధార్మిక సదస్సులో శ్రీ డి సుబ్బరాయులు స్థానికగీతా సమాజానికి దేవస్థాన ప్రచురణలను అందజేస్తున్న దృశ్యం-ఫోటోలో గీతాసమాజస్థాపకులు, శ్రీ తోట రామచంద్రయ్య, గ్రామసర్పంచ్ శ్రీ ఏ. ఆర్. వెంకట్రాజు, శ్రీ సముద్రాల లక్ష్మణయ్యలను కూడా చూడవచ్చును.

## గీతాజయంతి సప్తాహం

తిరుమల తిరుపతి దేవస్థానముల హిందూ ధర్మరక్షణ సంస్థ ఆధ్వర్యంలో డిసెంబర్ 20వ తేది నుండి 26తేది వరకు తిరుపతిలో గీతాజయంతి సప్తాహం నిర్వహించబడింది. స్థానిక అన్నమాచార్య కళామందిరంలో జరిగిన ఈకార్యక్రమంలో ఏర్పేడు శ్రీవ్యాసాశ్రమ పీఠాధిపతి శ్రీ విద్యానందగిరిస్వామి వారు ప్రతిదినం సాయంత్రం 6 గం॥ నుండి 8 గం॥ వరకు ప్రత్యేక గీతాప్రవచనంచేసారు. ఉదయవేళలలో శ్రీ ముదివర్తి కొండమాచార్యుల వారిచే గీతాపారాయణ, ప్రవచనాలు నిర్వహించబడినవి. డిసెంబర్ 26వ తేదిన జరిగిన ముగింపు సమావేశంలో శ్రీ డి. సుబ్బరాయులు (టి. టి. డి. సంయుక్త కార్యనిర్వహణాధికారి) పాల్గొని మూడు అధ్యాయాలుగల ఒక లఘుగీతను ఆవిష్కరించారు. భగవద్గీతా బోధ అంతా మానవుని సత్ప్రవర్తన సదాచరణ గురించేనని శ్రీ సుబ్బరాయులు ఈ సందర్భంగాచెప్పారు. గీతం ఒక ఉపదేశ గ్రంథం మాత్రమే కాదనీ అది ఒక సదాచరణ సూత్రావళి అనీ ఆయన నొక్కిచెప్పారు. గీతాసప్తాహం నిర్వహించినందుకు ఆయన శ్రీ విద్యానంద గిరి స్వాములవారిని దేవస్థానం పక్షాన సముచితంగా సత్కరించారు. భగవద్గీతా సందేశాన్ని సామాన్యులకు అందుబాటులోకి తీసుకువచ్చేందుకు దేవస్థానం వారు చేస్తున్న ప్రయత్నాలను శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి (దేవస్థాన ప్రజాసంబంధ శాఖాధికారి) వివరించారు. హిందూధర్మ రక్షణ సంస్థ కార్యదర్శి శ్రీ సముద్రాల లక్ష్మణయ్య తొలుత నివేదికను సమర్పిస్తూ గీతా సప్తాహం సందర్భంగా స్థానిక శ్రీమలయాళ సద్గురు సేవాసమాజంవారు టి. టి. డి. సహకారంతో పాఠశాల విద్యార్థులకు గీత పారాయణ పోటీలు నిర్వహించినట్లు వాటిలో 420 మంది పాల్గొన్నట్లు తెలియజేశారు. ఈ పోటీలలో విజేతలయిన విద్యార్థులు సభాంతంలో గంభీరంగా గీతాశ్లోకాలు వల్లించి ప్రేక్షకుల్ని ముగ్ధుల్ని చేశారు.



గీతాజయంతి ప్రారంభోత్సవ వేదికపై – శ్రీయుతులు కె. వీరారెడ్డి, (టి. టి. డి. బోర్డు సభ్యులు) డి. సుబ్బరాయులు, విద్యానందగిరిస్వామి, రావుల సూర్యనారాయణమూర్తి, సముద్రాల లక్ష్మణయ్య (కుడినుంచి)

## శ్రీ వేంకటేశ్వర నాట్యకళాపరిషత్ నాటక పోటీలు

తిరుపతి శ్రీ వేంకటేశ్వర నాట్యకళాపరిషత్ (స్థానిక సాంస్కృతిక సంఘాల సమాఖ్య) తిరుమల, తిరుపతి దేవస్థానముల సహకారంతో సంస్థ 28వ వార్షికోత్సవ కార్యక్రమాలు స్థానిక శ్రీ వేంకటేశ్వర నృత్యకళాశాలలో డిసెంబరు 10 నుండి 16 వరకూ జరిగాయి. సాంఘిక నాటకాలతోబాటు ఈ ఏడు అధిక సంఖ్యలో పౌరాణిక నాటకాలు ప్రదర్శింపబడినవి.

పౌరాణిక నాటకాలలో కడప సవేరాఆర్ట్సు ప్రదర్శించిన 'సతీఅహల్య' ఉత్తమ బహుమతిని, రేపల్లె దుర్గాకళా నికేతన్ ప్రదర్శించిన 'ఆండాళ్ కల్యాణం' ద్వితీయ బహుమతిని గెలుచుకొన్నాయి.

ఉత్తమ నటుడు (సతీఅహల్య) శ్రీ గువ్వల సుబ్బరాయుడు; ఉత్తమ

ద్వితీయ నటుడు (ఆండాళ్ కల్యాణం) శ్రీ ఆర్. ఎస్. భార్గవ, ఉత్తమనటి (సతీ అహల్య) శ్రీమతి గూడూరు సావిత్రి; ఉత్తమ ద్వితీయనటి (సతీసక్కుబాయి) శ్రీమతి జయానిర్మల్; ఉత్తమ దర్శకుడు (సతీఅహల్య) శ్రీ వల్లూరి బహుమతులను గెల్చుకొన్నారు.

చివరిరోజు జరిగిన బహుమతి ప్రదానోత్సవం సభకు జిల్లా అదనపు పోలీసుసూపరింటెండెంట్ శ్రీ ఆర్. సీతారామారావు అధ్యక్షత వహించారు. సినీనటుడు శ్రీ చిరంజీవి బహుమతులను ఆయానటీనటులకు అందజేశారు. సినీదర్శకుడు శ్రీ కోడిరామకృష్ణ ఉపన్యసించారు.

తొలుత శ్రీ వి. ఎస్. రాఘవాచారి అతిథులకు స్వాగతం చెప్పారు. సంస్థ కార్యదర్శి శ్రీ సి. మునిరత్నంరెడ్డి అతిథులను సభకు పరిచయం చేశారు. మరో కార్యదర్శి శ్రీ పి. బాలసుబ్రమణ్యం నివేదికను సమర్పించారు. సభాంతంలో శ్రీ ధర్మయ్య వందన సమర్పణ గావించారు.

## వరదాచారి మరణం

ప్రసిద్ధ పుణ్యక్షేత్రమూ విద్యాకేంద్రమూ అయిన తిరుపతి పట్టణంలో చిరకాలంగా ఉన్నతశ్రేణి పత్రికారచయితగా సమాజాభ్యుదయానికి పాటుపడిన శ్రీ ఎన్. వరదాచారి డిసెంబర్ 5వ తేది మద్రాసులో ఆకస్మికంగా మరణించడంవల్ల 'సప్తగిరి' తన విచారం ప్రకటిస్తోంది.

తిరుపతిలో ఇండియన్ ఎక్స్‌ప్రెస్, ఆంధ్ర ప్రభల ప్రతినిధిగా శ్రీ వరదాచారి జగమెరిగిన పాత్రికేయుడు. నాలుగు దశాబ్దాల నిర్విరామసేవ తరువాత ఇటీవలే ఆయన ఉద్యోగ విరమణ కావించారు. మరణించేనాటికి ఆకాశవాణి, పి. టి. ఐ. విలేఖరిగా వుంటున్నారు. వారి వయసు 63 సంవత్సరాలు.

శ్రీ వరదాచారికి తిరుమల తిరుపతి దేవస్థాన కార్యకలాపాలతో అత్యంత సన్నిహితత్వం వుంటూ వచ్చింది. అనేక విషయాలపై వారి నిర్మాణాత్మక సూచనలు దేవస్థానానికి ఎంతగానో ఉపకరించాయి. తిరుమల ఆలయ చరిత్రకు సంబంధించి వారు కొన్ని రచనలుకూడా చేశారు. వారికుటుంబానికి సానుభూతి ప్రకటిస్తూవారిఆత్మకు పరమాత్మ సాయుజ్యం కలగాలని ప్రార్థిస్తున్నాము. *



తిరుమల నీటిసరఫరా విభాగంవారు గోగర్భం ఆనకట్టవద్ద గంగపూజ జరిపిన సందర్భంలో పూజావిధిని నిర్వహిస్తున్న దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి.



తిరుపతిలో ఆరునెలలకు పైగా ఉచిత ఆయుర్వేద శిబిరాలను నిర్వహించి లక్షలాది రోగులకు చికిత్సలు చేసిన శ్రీ బాలరాజ్‌మహర్షిని శిబిరసమాపనోత్సవ సందర్భంగా దేవస్థాన పక్షాన సన్మానిస్తున్న శ్రీ డి. సుబ్బరాయలు (టి. టి. డి. సంయుక్త కార్యనిర్వహణాధికారి.)

# నిర్వాహకమండలి నిర్ణయాలు

* తిరుపతి కపిలేశ్వరస్వామివారి ఆలయ ప్రాంగణంలోగల శ్రీవేణుగోపాలస్వామి ఆలయానికి రు. 33,500/ల వ్యయంతో జీర్ణోద్ధరణ జరిపేందుకు అంగీకరించట మైనది.

* రంగారెడ్డిజిల్లా మేడ్చల్‌తాలూకాకేశవరం గ్రామంలోగల శ్రీ బాలాజీ వేంకటేశ్వర స్వామి ఆలయానికి శ్రీ వేంకటేశ్వర స్వామి, శ్రీ పద్మావతిఅమ్మవారు, ద్వార పాలకులు,గరుడ విగ్రహాలను బలిపీఠం తయారుచేయించి ఉచితంగా సరఫరా చేసేందుకు నిర్ణయించటమైనది.

* కీసరగుట్టలోని శ్రీ రామలింగేశ్వర స్వామి ఆలయంవద్ద రూ. 2లక్షల వ్యయంతో పుష్కరిణిని నిర్మించేందుకు తీర్మానించటమైనది.

* తిరుమల తిరుపతి దేవస్థానము: రిటీ ఆఫీసర్‌గా శ్రీ మేజర్ ఎం. స్వామిని ఎన్నికచేయుటమైనది

* కడపలో నిర్మించనున్న తిరు: పతి దేవస్థానముల కల్యాణమ మరియు సమాచార కేంద్రా కీర్తిశేషులు ముత్యాల చలమ ధర్మసంస్థవారు విరాళంగా స్థలాన్ని ఎన్నిక చేయుటమై: స్థలంలో లక్షరూపాయల వ్యయ బైరాగి సత్రాన్ని కూడా నిర్మిం తీర్మానించటమైనది. *

# నవశక్తినిలయం నుండి భక్తులకు విశిష్టకానుక !

జగద్గురువులు శ్రీ కంచికామకోటి శ్రీ జయేంద్రసరస్వతి, శ్రీ శృంగేరి శారదాపీఠ మహాసన్నిధానం, శ్రీ ఆ: శ్రీ శరణతీర్థ మహరాజ్ (గొండాల్) మరియు ఇతర సాధువుల ఆశీస్సులు శ్రీముఖాలు గలిగిన దివ్యయంత్రాలు !

1. శ్రీ మహామేరు (పంచలోహం) 1 1/2"x1 1/2" — రు. 30(
2. శ్రీచక్రం, ఇతర చక్రాలు ఒక్కొక్కటి 8 సెం.x8 సెం. — రు. 115
3. శ్రీమహాలక్ష్మి యంత్రం 16 సెం.x16 సెం. — రు. 500
4. వెండిపూత గలిగిన స్టాండులతో ఈ క్రింది బంగారు పూజా ప్రతిమలు
   1. శ్రీ అష్టలక్ష్మి ఒక్కొక్కటి 5.8 గ్రాములు
   2. శ్రీ అంబాజీ ,,
   3. శ్రీ బద్రినాథ్ ,,
   } ఒక్కొక్కటి — రు. 75
5. దృష్టి నివృత్తి యంత్రం (ఫ్రేముతో) (దృష్టిదోషాల నివారణకు, వాహన ప్రమాదాల నివారణకు పిశాచాలు పారద్రోలేందుకు, ఇంటిలో, ప్యాక్టరీలో, వ్యాపారంలో, ఐశ్వర్యసిద్ధికి) — రు. 50.
   దృష్టి నివృత్తి డాలరు — రు. 50.
6. వివాహప్రాప్తి డాలరు (మౌలికమైనది) (శీఘ్రంగా వివాహం జరిగేందుకు) — రు. 50.
7. వెండికవచంతో రుద్రాక్షమాల (54 పూసలతో) (పూజజరిపి పంపబడుతుంది. మధుమేహ, రక్త పోటు వ్యాధులనివారిణి) — రు. 250.
8. స్ఫటికమాల (మౌలికమైనది, 54 పూసలతో) — రు. 250.
9. వెండికవచంతో పద్మమాల (54 పూసలతో) — రు. 100.
10. ఎలక్ట్రానిక్ రాగికడియము (12 రాశులకు) ఒక్కొక్కరాశికి — రు. 20.



50% శాతం సొమ్ముముందుగా పంపి ఆర్డరు ఇవ్వండి.
వస్తువులు వి. పి. పి. ద్వారా పంపబడుతవి.

విశ్వకర్మజ్ఞ, శ్రీవిద్యోపాసక
స్వామీజి శ్రీ ఎస్. టి. మురుగభూషణ
నవశక్తినిలయం,
153-లాయడ్స్ రోడ్డు, గోపాలపురం, మద్రాసు-600086, ఫోన్: 8120

Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press, by M. Vijayakumar Reddy, L.P.T., Manager, T.T.D. Press, Tirupati.

Regd. No. H/TRP/13.

## మీరు హిందువులు – అందుకు గర్వించండి!

అతి శ్రేష్ఠపరంపరకు వారసులు - మరువవద్దు!

సుదృఢమైన ఆధ్యాత్మికపు పునాదులపైన నిర్మితమైన ఈ హిందూధర్మము - అన్నిటికి మూ
ధర్మము. నిజమైన హిందువులు కండి - క్రింది సలహాలు పాటించండి!

* మీ మీ సంప్రదాయానుగుణమైన బొట్టు [తిలకం, గంధం, విభూతి] నుదుట ధరించ అలవర్చుకొనండి.

* ప్రతిదినం ఒక్కప్పూటైనా స్నానానంతరం ఈ క్రింది నామజపం లేదా మీకిష్టమైన దైవధ్యా అలవర్చుకొనండి.

ఓం శ్రీ వేంకటేశాయ నమః
ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో నారాయణాయ
నమశ్శివాయ
హరేరామ హరేరామ
రామరామ హరే హరే
హరేకృష్ణ హరేకృష్ణ
కృష్ణకృష్ణ హరేహరే

* ప్రతి దినమూ శ్రీ వేంకటేశ్వర సుప్రభాతంలోని కనీసం పది శ్లోకాలను పఠించటం అలవా చేసుకోండి.

* మీ ఇంటి ముందు ఓంకారమును అతికించండి.

* భగవద్గీత నుండి రోజుకొక్క శ్లోకం పఠించండి.

* వారానికొకసారి ముఖ్యమైన పండుగలలో సకుటుంబంగా దగ్గరి దేవాలయాన్ని సందర్శి సేవించండి.

* హిందువుల సామాజిక ఉత్సవాలలో పాల్గొనండి, చేతనైనంత సహాయం చెయ్యండి!

* దేవునిపై విశ్వాసం - మన రక్షణకదే మూలం *

తి. తి. దేవస్థానములు, తిరుపతి.





SRI KODANDA RAMA SWAMY TEMPLE, TIRUPATI
BRAHMOTSAVAM. FROM 13.3.83





సప్త

పతి దేవస్థాన సచిత్ర మా

## ఈ సంచికలో....

నీయంతటి వారెవ్వరు నీకు నెదురేది యెందు
చాయల నీసుద్ది విని శరణంటి నేను॥

కావలనంటేఁ దొల్లి కంభము చించుక వెళ్ళి
కైవసమై ప్రహ్లాదుఁ గావవానీవు?
తేవలనంటే బ్రహ్మదేవునికి వేదములు
సోవల సముద్రమయినా చొచ్చి తేవా నీవు?॥

పట్టి యెత్తవలెనంటేఁ బాతాళానఁ బడ్డకొండ
తట్టి యెత్తి పాలవెల్లి దచ్చవానీవు?
మట్టు పెట్టవలెనంటే మరి భూమి చాపగాఁగ
చుట్టకపోతేఁ దెచ్చి సొంపుగ నిలుపవా?॥

పక్షపాత మయ్యేనంటేఁ బాండవుల గెలుపించి
యీక్షితి యేలించి చనవియ్యవానీవు?
రక్షించేనంటేఁ గాతరాన శ్రీ వేంకటాద్రిఁ బ్ర
త్యక్షమై మావంటివారిఁ దగఁ గరుణించవా॥

— తాళ్ళపాక అన్నమాచార్యులవారి ఆధ్యాత్మ సంకీర్తన.

# మీ మాట

## అభినందనలు

ఈ సంవత్సరం తిరుమల తిరుపతి స్థానములవారు ప్రచురించిన తెలుగు క్యా డరు తేదులు మాత్రమేగాక తిథి నక్షత్ర వివరములతో ప్రతిపుటలోనూ దేవ మూర్తుల చిత్రాలతో మంచిగెటప్‌తో పం గానికి ప్రతిగా నిత్యోపయోగకరమై శోభి తోంది. ఇందుకు తిరుమల తిరుపతి స్థానమువారిని అభినందిస్తున్నాను.

బియ్యెడ్డి సుబ్రహ్మణ్యం — తిరు

## పంచాంగము

సప్తగిరి పత్రికలో ప్రతినెలా ఆ తెలుగు మాసాల పంచాంగము తిథి, వా నక్షత్ర, వర్జ్యాదులతో వేస్తే పత్రిక యోగం ఇతోధికమగునని విన్న న్నాను.

మూరి సీతారామాంజనేయులు — మాజీవీడు

## గురుదక్షిణ

డిసెంబర్ సంచిక బాలప్రబోధంలోని 'గురుదక్షిణ' అనే కథ మాకెంతో నచ్చింది. లౌకికార్థంతో చూచినా వేదాంతపరంగా చదివినా ఎంతో విలువైనకథ ఇది. కథాంతంలో ఆత్మానందంతో ఆనందబాష్పాలు రాలాయి.

మమ్మల్ని ఏదో తెలియని అనుభూతి అవహించింది. ఈ కథను వ్రాసిన శ్రీ పురాణ





వారంలోనో పత్రిక మాకు చేరేటట్లుగా కృషిచేస్తారని ఆశిస్తున్నాను.

కె. రాధాకృష్ణశర్మ — బైరెడ్డిపల్లె

## అప్రస్తుత విమర్శ

డిసెంబర్ సంచికలో 'భగవంతుడు-నాస్తికులు' అనే వ్యాసాన్ని ఎంతో ఆసక్తితో చదివిన నాకు నిరాశే మిగిలింది.

ఆ వ్యాసంలో శ్రీ కొడాలి గోపాలరావు గారు హేతువాదుల సభలను విమర్శిస్తూ అహింసపైకి అసలు విషయాన్ని దారి మళ్ళించారు. నాస్తికులు, హేతువాదులు జంతుహింసకే పుట్టినట్లుగా చిత్రించారు. హేతువాదుల్లోనూ అనేకమంది అహింసావాదులున్నారు. అలాగే భగవంతుని నమ్మే వారిలో పరమ కర్కోటకులను నేనెరుగుదును. ఇంతకూ అహింస అనేది విషయాంతరం. దాని ప్రస్తావన ఆ వ్యాసంలో అప్రస్తుతం. ఇకపోతే హేతువాదం విదేశాల్లో పుట్టి మనదేశంలోకి వ్యాపించింది అన్నది మరో వ్యాఖ్యానం. విదేశీయమైనంత మాత్రాన పనికిరాదా? మనదేశంలో పుట్టి ఉద్భవిల్లిన బౌద్ధం విదేశాలలో వ్యాపించలేదా? మంచి అన్నది ఎక్కడున్నా స్వీకరించవచ్చును గదా!

మ్మడి లక్ష్మీనారాయణ — వరంగల్

## వకుళాదేవి

ద్వాపరయుగంలోని యశోదాదేవి కలియుగంలో వకుళాదేవిగా జన్మించి శ్రీనివాసుడికి మాతృమూర్తి అయి ఆయన కళ్యాణం జరిపించినట్లు చెబుతారు. వకుళాదేవి జననమెక్కడ? ఆమెకు వివాహమైనదా? తిరుపతి శ్రీ వరాహస్వామి సన్నిధిలో ఆమె నివసించేదా? వకుళాదేవి జీవిత గాథను సప్తగిరిలో ప్రచురింప ప్రార్థన.

గద్దె ధర్మారావు — గుంటూరు.

*

## తిరుపతి శ్రీ కోదండరామస్వామివారి బ్రహ్మోత్సవం

| తేది | వారం | పగలు ఉత్సవములు | రాత్రి ఉత్సవములు |
|---|---|---|---|
| 12-3-83 | శనివారం | — | సేనాధిపతి ఉత్సవము, అంకురార్పణము |
| 13-3-83 | ఆదివారం | తిరుచ్చి, ధ్వజారోహణము | పెద్దశేషవాహనము |
| 14-3-83 | సోమవారం | చిన్నశేషవాహనము | హంసవాహనము |
| 15-3-83 | మంగళవారం | సింహవాహనము | ముత్యపుపందిరివాహనము |
| 16-3-83 | బుధవారం | కల్పవృక్షవాహనము | సర్వభూపాలవాహనము |
| 17-3-83 | గురువారం | పల్లకిలో మోహినీ అవతారోత్సవము | గరుడవాహనము |
| 18-3-83 | శుక్రవారం | హనుమద్వాహనము (సాయంకాలం వసంతోత్సవము) | గజవాహనము |
| 19-3-83 | శనివారం | సూర్యప్రభవాహనము | చంద్రప్రభవాహనము |
| 20-3-83 | ఆదివారం | రథోత్సవము | అశ్వవాహనము |
| 21-3-83 | సోమవారం | పల్లకి, తీర్థవారి అవభృథోత్సవం | తిరుచ్చిలో ధ్వజావరోహణోత్సవము |



# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాస పత్రిక...

గౌరవసంపాదకులు :

**శ్రీ జి. కుమారస్వామిరెడ్డి,**
ఐ. ఏ. ఎస్.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

ప్రచురణకర్త - సంపాదకుడు :

**కాట్రపాటి సుబ్బారావు,**
ఎమ్. ఎ.

ఉపసంపాదకుడు :

**తిరుమూరు సుధాకర్‌రెడ్డి,**
ఎమ్. ఎ. బి. ఇడి.

ముద్రాపకుడు :

**ఎమ్. విజయకుమార్‌రెడ్డి.**

**విడిప్రతి-రు. 1-00**

**సం॥ చందా-రు. 12-00**

ప్రతులకు :

**వెల్ ఫేర్ ఆఫీసర్,**
టి. టి. డి., తిరుపతి.

ఫిబ్రవరి 1983

సంపుటి 13 సంచిక 9

## ఈ సంచికలో....



ముఖచిత్రం: శివపార్వతులు. చిత్రకారుడు: జగదీష్.

# సంపాదకీయము

ఈ విశాలవిశ్వమంతా ప్రాకృతికం. అంటే ప్రకృతిసంబంధమైనదన్నమాట. మరి ఇది ఎక్కడి నుంచి ఉద్భవిస్తున్నది అంటే పురుషోత్తముడైన శ్రీమన్నారాయణుడు పురుషరూపమని, ప్రకృతి స్త్రీ రూపంగాను, బహుమోహకమైన ఈ మాయారూపిణి ఆధారంగా, ఈ విశ్వసృజన కార్యక్రమాన్ని ఆయన రచించాడనీ పురాణాలు చెప్తున్నాయి. పరమపురుషత్వాన్ని గూర్చి శైవ, వైష్ణవాలు తమ తమ అధిష్ఠాన దైవాలపక్షంగా చెప్తూవుంటే, శాక్తం ఇదంతా తన సంకల్ప మహిమ అని, తన అనుగ్రహబలం వల్లనే త్రిమూర్తులు విశ్వధర్మ నిర్వహణచణులైనారని అంటున్నది. ఏది ఎలావున్నా సృజన శోభాయమానం కావాలంటే ప్రకృతిరూప మహాశక్తి సంసర్గం చాలా అవసరం. శ్రీమన్నారాయణుడు యోగనిద్రనుండి లేచి, సృష్టిసంకల్పించాడనీ, తత్ఫలితంగా 'హృదయాదధి జాయసే' అన్నట్లుగా నాభికమలం నుండి బ్రహ్మ ఆవిర్భవించాడనీ, ఆయన సరస్వతి ఆలంబనంగా వాచిక సంకల్పంతో నవనవోన్మేషమైన ఈ విశాల విశ్వాన్ని సృష్టిచేశాడని విన్నాం. గీతలో చెప్పినట్లు క్షేత్రము, బీజము, క్షేత్రజ్ఞుడు తానే అయిన ఆ అఖండ చైతన్యం ఏ నామరూపాలలోవున్నా వైవిధ్యాన్ని పొంద సంకల్పించినప్పుడు దానికి ఒక మాయావరణం, మనోహరకల్పన ఆలంబనం కాకతప్పదని. అదిలేనిదే సృష్టికి పరిపూర్ణత, ప్రగతి వుండదని అనుకోవచ్చు నిజానికి మానవజీవితంకూడా అంతే. మనస్సు కమనీయము, జీవితం రమణీయమూ కావాలంటే పురుషాంశమైన నరునికి ప్రకృతిరూపమైన నారి అండగా వుండాలి. అదే జీవితానికి ఇహమూ, పరమూ. శ్రీమన్నారాయణుడు లక్ష్మికి తనవక్షంపై ఆవాసం కల్పించాడన్నా, బ్రహ్మ వాక్పతి ఐనాడన్నా అర్థం ఇదే. ఈ పరిపూర్ణతను స్ఫురింపజేసేదే పరమేశ్వరుని అర్ధనారీస్వరూపం. ఈ రసమయజగత్తుకు ఆ పరస్పరాశ్లిష్టవపువులే కారణమనటంలో దృష్టి ఇదే.

జ్ఞానమనేది బ్రహ్మస్వరూపం, ఏకరూపం, అఖండ జ్యోతిర్మయం. ఆద్యంతరహితం, త్రికాలాతీతం. అది స్థాణువువలె నిశ్చలం. నిరంజనం. కాలానికే సరైన కొలమానం లేదంటే కాలాతీత జ్ఞానపు ఆద్యంతాలు తెలుసుకోవాలనుకోవటం అర్థరహితం. లింగరూపాన్ని కొలవాలనుకున్న బ్రహ్మ విష్ణువులకథ ఈ అంశాన్నే తెలియజేస్తుంది. సాక్షాత్ కాలాతీతుడు, పరంజ్యోతి, శివుడూ తానే కావటంవల్ల ఈ సత్యాన్ని బోధిస్తున్నట్లు, నారాయణుడు తన ప్రయత్నాన్ని విరమించుకోగా, జగత్స్రష్టనన్న అహం అణగని బ్రహ్మ విఫలయత్నంచేసి ఎలా అవమానం, పూజారాహిత్యం పొందిందీ మనకు తెలుసు. శివతత్త్వం మనకు స్థూలంగా బోధించేది ఇది: అఖండ జ్ఞానరూపక బ్రహ్మం నుంచి పారమాత్మిక వికృతుల కారణంగా, రసమయసృష్టి రూపొందింది. ఆ మహాచైతన్యంలో భాగమే ఈ స్థూల సాంసారికరూపం. పూర్ణకాముడైన (ఇంద్రియావధులను గ్రహించి నిగ్రహించిన వాడు) మానవుడే పరమేశ్వరునకు ప్రీతిపాత్రుడు.

ఇలా ఎన్నో అర్థాలు ఎందరో దేవతల గూర్చి ఆలోచించినకొద్దీ చెప్పుకోవచ్చు. అసలు మహర్షుల హృదయం ఒక అగాధ క్షీరసముద్రం. సమస్యామందరాలను వేసి, ఆలోచనారజ్జువులతో మథించాలేగాని, ఆఖరికి అమృతం పుట్టక తప్పదు. శివరాత్రి మహాపర్వదినాన ఆ ఆదిదంపతులను స్మరించుకు తరిద్దాం!

నమశ్శివాభ్యాం నవయౌవనాభ్యాం
పరస్పరాశ్లిష్టవపుర్ధరాభ్యామ్।
నగేంద్ర కన్యా వృషకేతనాభ్యాం
నమో నమశ్శంకర పార్వతీభ్యాం।

# చావు పుట్టుకలు

— శ్రీ కుంటిమద్ది శేషశర్మ

పుట్టిన ప్రతిప్రాణికీ తప్పనిది చావు. ఎన్నో ప్రాణులను చూస్తూ వున్నాము రోగరౌజనాలతో కన్నుమూస్తూ వున్నాయి. "జాతస్య ధ్రువో మృత్యుః" (గీత) పుట్టినది చావక తప్పదు. ఒక్కొక ఊపిరి పీల్చి వదులుటతో అంతంత దగ్గరౌతూ వుంటుంది చావు.

"ఈ చావేమిటి? దేనికి చావు" అనేది తెలిసికోవలిసివుంది. "అంతో నాశో (ద్వయోః) మృత్యుర్మరణం" (అమరం) అంతము, నాశము, మృత్యువు, మరణము అని దీనికి మారుపేర్లు. అంతము=ముగింపు, నాశము=కనిపించక పోవుట, పంచత్వమనీ మరొక్క పేరు. ఇట్లా అంతమయ్యేది ఏది?

మనకు కనిపించే పంది, కుక్క, చీమ, దోమ, పశువు, పక్షి, నరుడూ, వానరమూ మొదలైన శరీరాలు, పృథివ్యప్తేజోవాయ్వాకాశాలనే పంచభూతాల కలయికతో నేర్పడినాయి. ఈ శరీరాలను చీల్చిచెండాడిన డాక్టర్లు లోపలంతా పరిశోధించినారు. పంచభూత వికారాలు తప్పవారికి మరేది గోచరించ లేదు. ఉంటే ఏదైనా కనిపిస్తుంది.

"ఋణం కృత్వా ఘృతం పిబేత్। భస్మీభూతస్య దేహస్య పునరాగమనం కుతః। అప్పుచేసి పప్పుకూడు తిందాం, బూడిదైనాక మరలా వచ్చేదేముంది? నీతి నియమాలు ధర్మాధర్మాలు లెక్కించకుండా, అబ్బిన సుఖాల ననుభవింతాము. పాపం నరకం, ఎక్కడో ఏదో వుంది. అని చేతికి దొరికిన ఇంద్రియ సుఖాలను వదలుకోవడం, ఏమి వివేకం?" అంటారు ప్రత్యక్ష ప్రమాణ వాదులు.

కానిరా యిటువంటి నీతములనేకంబుల్ నినున్ బోలె వి
న్నా నేనుః; నినువంటి నీతిపరులన్ నారీ కుచా భోగ భో
గానందైక రసంబె బ్రహ్మమని మోహాయత్తతన్ మౌనముల్
ధ్యానంబుల్ దపముల్ జపంబుడిగి యుండన్ జూడమే యిద్ధరన్,

జడమైన ఈ శరీరమెట్లా నడుస్తుంది? డ్రైవరు లేకపోతే మోటారు కదలదే. అట్లే జడమైన శరీరాన్ని పనిలో పెట్టేందుకు లోపల చోదకుడొక్కడుండవలె. కనిపించనంత మాత్రంతో లేడనరాదుగదా అంటారు అనుమాన ప్రమాణవాదులు.

ప్రతివాదులందుకు ఒప్పుకోరు. పంచభూతాల నియమిత భాగముల కలయికతో కొత్త చలన శక్తి యేర్పడుతుంది. చల్లటి సున్నపురాయి, చల్లటి నీరు కలిస్తే వేడి పుడుతూవుంది. తెల్లటి సున్నం పచ్చని పసుపు కలిస్తే ఎర్రని రంగేర్పడుతూవుంది. అట్లే పంచభూతాల నియమితభాగ సంపర్కము నూతనశక్తికి కారణం. అందునుంచి ఈ శక్తి ఉడుగక ముందే సుఖమనుభవింతాం. బతికిందే సత్యం. నీతులూ ధర్మవన్నాలూ చేతగాని దద్దమ్మల మాటలు.

లోకములోన కొందరబలల్ పతులన్ దనియింప లేక_తా
టాకులలోన వ్రాసిరి వరాంగన సంటుల పాప మంచు—"
(శశాంక విజయము)

"జాతస్యహి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ ॥ అన్న గీతా వాక్యానికదే అర్థము.

ఇంతకూ చావంటే ఉన్న శరీరాన్ని వదలడం. పుట్టక అంటే, కొత్త శరీరాన్ని ధరించడం. అదె ఛాందోగ్యోపనిషత్తు అంటుంది.

"జీవాపేతం వావకిలేదం మ్రియతఇతి న జీవో మ్రియతే".

జీవాపేతం=జీవుడు వదలిన, ఇదం=ఈ శరీరము, మ్రియత ఇతిచచ్చునని (అందురు). న జీవో మ్రియతే=జీవుడు చావడు అని. బాల్య యౌవనాది దశలు శరీరానికి వచ్చినట్టు పంచత్వమూ శరీరానికేర్పడుతుంది. జీవుడు వెడలిపోగానే నీరు నిప్పు గాలి మట్టి వేర్వేరై మట్టిభాగం నిలిచి, అది మట్టిగా బూదిగా పార్థివ భాగమైపోతుంది.

అన్నట్లు, అబ్బినంత వరకు అనుభవింతాము. అంటారు. పాపపుణ్యాలు స్వర్గ నరకాలూ బూటకాలు. పుట్టేది చచ్చేది శరీరమే అంటారు.

కానీ, "నిన్న రాత్రి వరకూ బాగావుండినాడు తెల్లవారితే లేడు. ఎంత హటాత్తుగా చనిపోయినాడు" అంటారు మృతుని జూచి.

రాత్రి పడుకొన్నప్పుడున్న శరీరమె తెల్లవారీ కన్పిస్తూవుంది. మరిపోయిందెవరు? ఎవరో శరీరం కంటే వేరైన వ్యక్తి వుండవలె. ఆ వ్యక్తి శరీరం వదలుకోగానే, ఇది చలనంలేని దయ్యింది. ఇదిజ్ఞానం లేనిది. దీనికి సుఖం దుఃఖం ఏమీ లేదు. దీనిలో నుండే ఇంద్రియాలద్వారా సుఖ దుఃఖాల ననుభవిస్తూ ఆనందభేదములనుభవించేది లోనిజీవుడే. ఆ జీవుడిట్లాటి శరీరాలనెన్నో ధరించుతూ వదులుతూ వుంటాడు.

లోని జీవుడు అతి సూక్ష్మమైన వాడు, బాహ్యదృష్టికి కనిపించే వాడుగాదు. ఇటువంటి జీవుని స్వరూప స్వభావాలు తెలుసుకోవాలంటే అపౌరుషేయాలైన వేదాలు, ఆ వేదాలను విమర్శించి వాదోపవాదాలతో ఆక్షేప సమాధానాలతో నిర్ణయం తేల్చిన శారీరక మీమాంస అనబడే బ్రహ్మసూత్రాలూ సారభూతమైన భగవద్గీతయే మనకాధారం.

సామాన్యజనానికి వాదోపవాదాలతో పని లేదు. ఫలితార్థంగావలె. దానినే బోధించే గీత జీవస్వరూపాన్ని ఇట్లా తెలుపుతూవుంది.

నజాయతే మ్రియతే వా కదాచి న్నాయం భూత్వా భవితావాన భూయః ।
అజోనిత్య శ్శాశ్వతోఽయం పురాణో నహన్యతే హన్యమానే శరీరే ॥

ఈ జీవికి పుట్టుకా చావూ లేవు. ఎల్లప్పుడూ వుండే నిత్యుడు. శరీరం తెగనరికినా జీవికి నాశం లేదు.

# చింతన

* * *

ఏదయినా చెప్పినంత సులభం కాదు చేయడం. చెప్పడం బహుతేలిక. చేయడం బహుకష్టం అందువల్లనే ప్రతివారూ సులభమైన దానినే ఆరంభిస్తారు. కష్టమైనపని జోలికి పోయి, అబద్ధమాడకూడదూ అని చెప్పడం ఎంత సులువో ప్రతివారికీ తెలుసు. కాని అలా నిత్యసత్యవచనుడు కావడం సాధ్యంకాదే! అక్కడికీ మనవారు ప్రతినీతిలో బోలెడన్ని మినహాయింపులూ చెప్పారు.

అందఱూ ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా శుక్రాచార్యులు మాత్రం "వారిజాక్షులందు, వైవాహికములందు, ప్రాణవిత్తమానభంగమందు, చకితగోకులాగ్రజన్మ రక్షణమందు బొంకవచ్చు" అన్నారు.

అన్ని మినహాయింపులున్నా వాటిని దాటి అనేక సమయాలలో అబద్ధం ఆడడానికి మనిషి సంకోచించడంలేదు.

అవసరమైనప్పుడేకాదు, అనవసరంగా సునాయసంగా బొంకడం అదో అలవాటు కొందఱకు.

అసలు సత్యం చెప్పవలెనన్న పట్టుదల ఉంటే అదెలాగో సాధించవచ్చునేమోగానీ అసలా ఆస్థ ఎందఱకుంటున్నది!

అదో కళగా సాధించి అందులో పారంగతులైనవారు పలువురు.

నిజమే! కొన్నిసార్లు అబద్ధం అప్రయత్నంగా ఆడివేయవలసివస్తుంది. ఆ అసత్యాన్ని నమ్మించడంకోసం మఱొకటి, ఇంకొకటి ఇలా అబద్ధాలాడుతూ పోవలసి వస్తుంది.

కొందఱు అదో గొప్ప విషయంలాగా ఏం ఆ మాత్రం అబద్ధం ఆడితే అనుకుంటారు, అంటారు.

కొన్నిసార్లు సత్యం అయినా అప్రియమైనప్పుడు చెప్పడానికి సంకోచించవలసి వస్తుంది.

ఒక్కొక్కసారి ఏదో ప్రియంగా ఉంటుంది కదా అని ఎదిరిని సంతోష పెట్టడం కోసం అసత్యం చెప్పవలసి వస్తుంది.

నిజం కదా అని ఎవరిలోని లోపాన్నో ఎత్తిచూపడంవల్ల లేనిపోని తగాదాలు తెచ్చుకోవలసి వస్తుంది.

ఒకరికి నష్టమైతే పరవాలేదనుకొని సత్యవాదినని చెప్పుకోవడానికి ఉన్నదున్నట్లు చెప్పవచ్చు.

కానీ అదే తనకు నష్టమో కష్టమో తెచ్చే విషయంలోమటుకు ఈ చిన్నవిషయంలో ఓ చిన్న అబద్ధం ఆడితే ఏం పోయింది. అంతలోనే అదో పెద్ద దోషమవుతుందా అనుకుంటాం.

ఇంతకూ మనకు సంబంధంలేని విషయాలలో ఏమయినా సరేకానీ అసలు మన విషయంలోనే సత్యం చెప్పాలి.

— విశ్వం

"అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య
ఏవచ।
నిత్యస్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః॥
(గీత)

జీవి కత్తికి తెగేది, అగ్గికి కాలేది, ఎండ కెండేది, నీటికి నానేది కాదు. అన్నింటిలోనూ ప్రవేశించేంత సూక్ష్మతమమైనది. స్థిరమైనది, సనాతనమైనది. కత్తిధారకంటే సూక్ష్మముగాన కత్తి నరుకలేదు. అట్లే ఏ భూతము దీనికి వికారము గల్గించలేదు. ఇట్లాటి జీవికి పుట్టుకేమి? చావేమి?

వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి
నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి
నవాని దేహీ॥"

మనిషి పాత వుడుపులు తీసివేసి కొత్త వుడుపులు ధరించినట్లు, బడలి సడలి పనికి తరంగాని శరీరాలను విడచి కొత్త శరీరాలు ధరిస్తూవుంటాడు జీవి.

ఒక్క శరీరం వదలి వేరు దేహాన్ని చేర బోయేటప్పుడు, తన వెంట కొన్నింటిని తీసుకొని పోతూవుంటాడు. గాలి ఆయా చోట్ల నుండి పోయేటప్పుడు అచ్చటి వాసనలు దాని వెంట పోయినట్లు జీవి ననుసరించి పోయేవివి.

చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణత్వగింద్రియములను మనస్సును వెంట తీసికొని పోతున్నాడీ జీవి. అట్లే చేసిన పుణ్య పాపాలూ జీవి వెంటనంటి పోతూవుంటాయి.

కన్ను ముక్కు నాల్క చెవి చర్మము ఈ శరీరంలోనే వుంటాయే. మనంచూస్తూనే వున్నాము గదా! వెళ్ళి పోయే జీవి ఎక్కడ తీసుకొనిపోతున్నాడు? అని అడగవచ్చు. మనకుకనిపించే చనిపోయినవాని శరీరంలో వుండేవి పై యింద్రియాల కాశ్రయస్థానాలే గాని, ఇంద్రియాలుగావు. ఇంద్రియాలు కంటికి కనిపించేవిగావు.

ఇట్లా పోయేవాని వెంటనుండే పాపపుణ్య రూప కర్మలను అనుభవించేందుకు అనుకూలమైన దేహంలో ప్రవేశించ పోతాడీ జీవి.

అందుకే "ధ్రువం జన్మ మృతస్య" చచ్చిన వానికి పుట్టక తప్పదు అంటుంది గీత.

ఇక క్రైస్తవముస్లిమ్ మతాలున్నాయి. వారికి బైబిల్, ఖురాన్ ప్రమాణగ్రంథాలు. వారూ దేవుడున్నాడనే ఆస్తికులే.

వారి మతం ప్రకారం చచ్చిన వాడు మరలా పుట్టడు. క్రైస్తవ మతం ప్రకారం చనిపోయిన జీవులు గోరిలోనే పడుకొని యుంటారు. ప్రళయకాలంలోనో మరే అనంతకాలంలోనో, తీర్పుదినంనాడు ఈ జీవులను లేపి పుణ్య పాపం విచారం చేసి ఏసును నమ్మిన పుణ్యాత్ములను స్వర్గానికీ, పాపులను నరకానికీ పంపుతారట.

ముస్లిమ్‌లకు కర్మ లేదు. అందువల్ల స్థితిసమాధిలోనేనట. అట్లు శరీరము విడచి పోయిన జీవికి మరుజన్మ లేకున్న, కొందరు ధనవంతులు కొందరు దరిద్రులు, కొందరా రోగ్యవంతులు కొందరు రోగులు, కొందరాడ కొందరు మగ, కొందరు జంతువులు కొందరు మానవులుగా జన్మించనేల?

సేచ్ఛతోనే వికలాంగులుగా దరిద్రులుగా రోగులుగా పుట్టుతున్నారా? ప్రతి వ్యక్తి ఆరోగ్యవంతుడు ధనవంతుడు పూర్ణావయవుడుగా నుండగోరుతాడుగదా! క్రిమికీటాది జన్మలనెవ్వడు కోరుతాడు? వారట్లా జన్మించడానికి బలీయమైన కారణం ఒక్కటుండవలె. ఆ కారణంతో సర్వనియామకుడై దైవము, వారి నాయాశరీరాలలో చేర్చియుండవలె.

కారణంలేకనే స్వేచ్ఛానుసారం, ఆ దైవము కొందరి నొకవిధంగా మరి కొందరిని మరొక్క విధంగా సృష్టించాడంటే, ఆ దైవమనేవాడు పక్షపాతి, క్రూర హృదయుడు కావలసివుంటుంది. ఉత్తమ మానవునికే అట్టి దుర్గుణాలుండవంటే, దైవానికట్టి గుణాలుంటాయా? ఉంటేవాడు దైవమౌతాడా?

భగవానుడు దయామయుడు. అందరినీ ఆనంద తుందిలులను చేయవలెననే ఆతని వుబలాట. కాని జీవులు చేసుకొన్న కర్మలు వారి పుట్టుకలకు కారణమౌతాయి. కర్మానుసారము ఫలమందజేస్తాడు భగవంతుడు. అంతేగాని స్వాతంత్రించి పాపంపెంచడు పుణ్యం తగ్గించడు.

"నాదత్తే కస్యచిత్పాపం
నచైవ సుకృతం విభుః,
అజ్ఞానేనావృతం జ్ఞానం
తేనముహ్యంతి జంతవః" (గీత)

తెలివిలేక అకార్యాలు చేసి, అవి పక్వములై ఫలమిచ్చేకాలం దాపురించినప్పుడు, "దైవం నాకీ కష్టములు గల్గించినా" దని నిందిస్తారు. అది తెలివిలేనితనం. చేసిన కర్మానుసారం ఫలమిస్తాడు గాని, స్వతంత్రించి స్వర్గనరకాదుల బడవేయడు, హీన జన్మల గూర్పడు.

"తానహం ద్విషతః క్రూరాన్
సంసారేషు నరాధమాన్
క్షిపామ్యజస్ర మశుభా
నాసురీష్వేవ యోనిషు" (గీత)

భగవంతుని, సాధువును ద్వేషించుచూ, ఇంద్రియ సుఖాలకై ఘోరకృత్యము లాచరించే పాపాత్ములను హీనజన్మలకు గురి చేస్తావుంటాను అన్నాడు. అందువల్ల ఉత్తమాధములైన జననమరణాలు కలిగించే నియంత భగవంతుడే ఐనా, అందుకు నిమిత్తము జీవులొనరించిన కర్మలే. అవే ప్రాధాన్యము వహిస్తున్నాయి. జన్మల నైచ్యాధిక్యములకు శరీరం వదలి తరలిపోయే జీవుడు చర్మ చక్షువులకు అగోచరుడైనా, జ్ఞానచక్షువులకు గోచరుడేనట.

"ఉత్క్రామంతం స్థితంవాపి
భుంజానంవా గుణాన్వితం
విమూఢానాను పశ్యంతి,
పశ్యంతి జ్ఞాన చక్షుషః" (గీత)

శరీరంలోవుండి విషయాల ననుభవించేటప్పుడూ, శరీరం వదలి పోయేటప్పుడు జీవుని జ్ఞాననేత్రులు చూడగల్గుతున్నారు. దేహాత్మభ్రాంతిగల మూఢులకు తెలియని విషయమది.

ఇట్లా శరీర వియోగ సంయోగాలనే చావుపుట్టుకలంచు జీవులనుభవిస్తూనే వున్నారు. అందుకే "పునరపిజననం పునరపి మరణం పునరపిజననీ జఠరే శయనం" అని అన్నారు శంకరాచార్యులు. ఇంద్రియాలతో పాపపుణ్యాలతో శరీరాన్ని వదలిని జీవుడు మరలా జననీగర్భం నుండి బయట పడినప్పుడు పుట్టినాడని అంటారు. కాని ముందులేని శిశు వమాంత మూడిపడలేదు. తొమ్మిది నెలలు గర్భవాసం చేసి నంతనే బైటపడింది. జననీగర్భం చేరక ముందు తండ్రి వీర్యంలోవుండి స్త్రీ సంపర్కంతో స్త్రీ గర్భంలో ప్రవేశించింది. అచ్చట మాసక్రమేణ జీవి శరీరం శుక్లశోణితవికారమైన బుద్బుదంగా కబలంగా ఘనంగా మారుతూవచ్చింది. ఈ మార్పంతా శారీరికమేగాని జీవానికి సంబంధించింది గాదు.

పురుషునిలోనికి చేరకముందు, మింటి నుండి వర్షముద్వారా నేలకు పడి ఆహార పానీయ పదార్థాలలో చేరి వుండినది. దానిని పురుషజాతి భుజించినప్పుడు పురుషునిలో ప్రవేశించింది. అట్టి జీవకణం, క్రమంతప్పక స్త్రీ గర్భంలో ప్రవేశిస్తే, శరీర సంబంధం లేకున్నా మరలా పైకిపోవడం నేలపడడం సాగుతూవుంటుంది. ఇట్లా క్రమపద్ధతిలో శరీరధారణం పుట్టుక. తద్వియోగం చావు. ఇదే జననమరణ రూపమైన సంసారం.

ఇది జీవికెప్పుడు ప్రారంభమైందో మనకు తెలీని విషయం. అందుకే, "కర్మావిద్యాది చక్రే ప్రతిపురుష మిహానాదిచిత్ర ప్రవాహే" (వేదాంతదేశికుల రహస్యత్రయ సారం) అన్నారు. జన్మకు కారణం కర్మ. సుఖాభాసాలను అజ్ఞానంతో సుఖాలని భ్రమించి, వాటిని పొందేందుకు జీవి ప్రయత్నం చేస్తూవున్నాడు. అందులో నీతి నియమాలూ ధర్మాధర్మాలూ గమనించక, అక్రమ మార్గాల ననుసరించిందానివలన పాపము, సన్మార్గానుసరణమున పున్నెము సంపాదించు కొంటున్నాడు, దానీని అనుభవించేందుకు జననమరణాలూ తాపత్రయాలూ అనుభవిస్తూవున్నాడు. ఇది, అది లేని, ఒక తెలియని వర్తుళం. ఇందు దగుల్కొని సతతమతమవుతున్నారు జీవులు.

# రుద్రాక్షలు

శ్రీ సత్రం వెంకటరమణయ్య

రుద్రాక్షలను గురించి వ్యాసులవారు దేవీభాగవతములో విపులముగా వర్ణించి యున్నారు. రుద్రాక్షలు శివస్వరూపము.

పూర్వం త్రిపురాసుడు అనే రాక్షసుడు దేవతలను బాధింపగా దేవతలందరు కైలాసమునకుపోయి శివుణ్ణి ప్రార్థించారు. అప్పుడు శివుడు, మనోహరము, అఘోర మను పేరుగల అస్త్రమును ఉత్పాదన చేయదలచి, ధ్యానంలోకి వెళ్ళాడు. ఆ అస్త్రము ఘోరరూపము కలది. అగ్ని జ్వాలలతో కూడినది. సర్వదేవతల శక్తుల కూడలి. అట్టిదానిని దేవతల రక్షణకు, త్రిపుర దానవ సంహారమునకు కల్పించి ధ్యానించుచూ కనులు మూసికొన్నాడు. అనంతరము కనులు విప్పగా ఆయన కనుల నుండి అశ్రుకణములు రాలాయి. ఆ అశ్రుకణములే అంకురములుగా మహారుద్రాక్ష తరువులుత్పన్నములైనవి.

ఈ రుద్రాక్షలు 38 విధములు.

1. సూర్యనేత్రము నుండి ఉదయించినవి. కపిలవర్ణముగలవి. ఇవి పన్రెండు విధములు.

2. చంద్రనేత్రము నుండి జన్మించినవి. తెలుపుగలవి. ఇవి పదహారు విధములు.

3. అగ్నినేత్రము నుండి ఉదయించినవి. నలుపువర్ణము కలవి. ఇవి పది విధములు.

| | | |
|---|---|---|
| శ్వేతవర్ణము | — | బ్రహ్మజాతి |
| రక్తవర్ణము | — | క్షత్రియజాతి |
| మిశ్రమవర్ణము | — | వైశ్యజాతి |
| కృష్ణవర్ణము | — | శూద్రజాతి |

రుద్రాక్షలకు ముఖములుంటవి. ఏకముఖము శివాంశము. బ్రహ్మహత్యా దోషము నశింపజేయును. రెండు ముఖములుకలది అర్ధనారీశ్వరము.పాపఘ్నము. మూడు ముఖముల రుద్రాక్ష అగ్నియే. స్త్రీ హత్యాపాతకము పోగొట్టుతుంది. నాలుగు ముఖములు కలది బ్రహ్మాంశము. నరహత్యాది దోషములను పోగొట్టుతుంది. పంచముఖముల రుద్రాక్ష కాలాగ్ని. రుద్రుడను పేరుగల రుద్రాంశము. ఈ రుద్రాక్ష సర్వ పాపములను తొలగిస్తుంది. ఆరు ముఖములు కలది కార్తికేయాంశము. దీనిని దక్షిణకరమున దాల్చిన బ్రహ్మహత్యాది దోషములు నశిస్తాయి. ఏడు ముఖములు గల దానికి అనంగమని పేరు. సువర్ణహరణ పాపము తొలగుతుంది. ఎనిమిది ముఖముల గల దానికి వినాయకమని పేరు. సంకల్పసిద్ధి కలుగుతుంది. తొమ్మిది ముఖములు గల దానికి భైరవమని పేరు. పంచ మహా పాతకములు నశించి పోతవి. పది ముఖములు గల దానికి జనార్దనమని ఖ్యాతి. సకల పీడలను తొలగిస్తుంది. పదునొకండు ముఖములు కలది ఏకాదశ రుద్రుల స్వరూపము. దీని వలన అశ్వమేధ యాగఫలము కలుగుతుంది. పన్రెండు ముఖములు గల దానిని ఆదిత్యమందురు. దీనిని ధరించిన ద్వాదశాదిత్యులు ప్రీతి చెంది సకల సుఖములను ప్రసాదిస్తారు. పదమూడు ముఖములు గలదానిని షణ్ముఖమని అందురు. సమస్త సంపదలు కలుగుతవి. పదునాలుగు ముఖముల రుద్రాక్ష సాక్షాత్ శివ స్వరూపమే.

ఏడు ముఖములు మొదలు పదునాలుగు ముఖముల వరకు వ్యాఘ్రాది జంతు భయము పారద్రోలుతవి. రోగములు అంటవు. రసరసాయనములై యొప్పును. రుద్రాక్ష ధారణమున సర్వ శుభములు పొందగలరు. నూటయెనిమిది రుద్రాక్ష మాల ధరించిన అశ్వమేధ ఫలముతో ఇరువది యొక్క తరముల వారుద్ధరింపబడి శివలోకమును జేరగలరు. అన్యథా యాభై నాలుగు రుద్రాక్షలు గల మాలనైన ధరించవచ్చును. ఈ మాలకు మధ్యలో మేరువు అను పేరుతో పెద్ద రుద్రాక్ష వుంటుంది. ఈ మేరువును దాటరాదు. జపము చేసేటప్పుడు దాని దగ్గరికి వచ్చినప్పుడు, మరల వెనుకకు త్రిప్పి జపము ప్రారంభించవలెను. రుద్రాక్షమాలచే జపము చేసిన బహుఫలము కలుగుతుంది. త్రివేళలయందు సన్ధ్యావన్దనములో గాయత్రీ జపమునకు రుద్రాక్ష జపమాల ముఖ్యము. జపమాల ముందునకు త్రిప్పరాదు. జపము చేయునప్పుడు ప్రాతఃకాలమున జపమాలిక నాభి సమముగా నుంచుకొనవలెను. మధ్యాహ్నమున వక్షస్థలమునకు సమముగాను, సాయంకాలము నాసికాసమముగా నుంచుకొనవలెను ఇందుకు:

"ప్రాతర్నాభి సమం కుర్యాన్మధ్యాహ్నే హృదయే తథా। సాయాహ్నే నాసికా మూలే జపలక్షణ మీరితమ్.

పురుషులలో పురుషోత్తముడు, గ్రహములలో రవి, నదులలో గంగ, మునులలో కశ్యపుడు, దేవతలలో ఈశ్వరుడు, దేవీ మూర్తులలో గౌరి, ఎట్లుత్తములో అట్లే రుద్రాక్షమాల మాలికలలో ఉత్తమోత్తమము. సర్వ ధర్మము లొనరించిన పుణ్యం రుద్రాక్ష ధారణమున కలుగును.

రుద్రాక్షలు కాశీలో శ్రేష్ఠములైనవి లభించును. వాటిని శుద్ధి చేయవలెను. మొదట మంచి గంధపునీటితో ఆ మాలను క్షాళనము చేసి తర్వాత పంచ ద్రవ్యములచే శుద్ధిచేసి, తర్వాత శుద్ధ జలములతో కడగవలెను. అటుపిమ్మట జపమునకు ఉపయోగింపవలెను. ఏ మంత్రము జపింతురో ఆ మంత్రముచే జపమాలను పూజించవలెను. రుద్రాక్ష ధారణ త్రిమూర్తుల విభూతుల లభింపజేస్తుంది.



# ప్రశ్నోపనిషత్

## ప్రథమ ప్రశ్నము

(గతసంచిక తరువాయి)

11

పంచపాదం పితరం
ద్వాదశాకృతిం దివ ఆహుః
పరేఅర్ధేపురీషిణం
అథమే అన్యఉ పరే
విచక్షణం సప్తచక్రే
షడర ఆహు రర్పితమితి.

(ముందు సూర్యుణ్ణి, చంద్రుణ్ణి ప్రజాపతి సృష్టించి వారి స్వరూప స్వభావాలు చెప్పాడు. సంవత్సరంకూడ ప్రజాపతే- అని చెప్పడమయింది. ఇక్కడ సంవత్సర స్వరూపంచెప్తూ ఇదే సూర్యుడని చెప్పడం విపరీతంకాదు.

కాలనిర్ణయానికి ముఖ్యసూత్రం సూర్యుడు. ఇది ప్రజాపతి నిర్ణయమేకదా? సాముదాయికంగా సమైక్యదృష్టితో చూచినప్పుడు వస్తుతత్వం ఒక్కటీ అవుతుంది).

అయిదుపాదాలు, పన్నెండు ఆకృతులు గలవాడై నీటికి కారణమై ద్యులోకానికిఉత్తరార్థమునందు ఉండే జగజ్జనకుడుగ ఆదిత్యుణ్ణి కొందరు చెప్తున్నారు.

కొందరు ఆరురేకులు, ఏడుచక్రాలుగల సంవత్సర పరిమిత కాలరథముగ లోక ప్రకాశకుడైన భాస్కరుణ్ణి చెప్తున్నారు.

(సంవత్సరానికి ఋతువులు ఆరు. హేమంతశిశిర ఋతువులను రెండింటినీ ఒకటిగా చెప్పవలసిందని ఋషి ఉద్దేశం. ఆ రెండుఋతువుల ధర్మాలు ఇంచుమించు ఒక్కలాగే ఉంటాయి. కాబట్టి 'అయిదు' అని చెప్పవచ్చు, పన్నెండు ఆకృతులంటే పన్నెండుమాసాలు. కాలమానములో సంవత్సరానికి ఈ లెక్కసరిపోతుంది. ద్వాదశాదిత్యుల పరిగణనలో సూర్యుడు 'ద్వాదశాత్ముడు' గా నిర్ణీతుడు.)

కర్మేంద్రియాలు అయిదు. జ్ఞానేంద్రియాలు ఐదు. మనస్సు, జీవం-వెరసి పన్నెండు. విశ్వసృష్టికొరకు పన్నెండు విధాలుగా చరిస్తూఉండే ద్వాదశమూర్తి సూర్యుడు. ఈ వివరణకి ఈ క్రింది శ్లోకం ఆధారం.

'కర్మజ్ఞానఖ దశకం
మనశ్చజీవఇతి విశ్వసర్గాయ
ద్వాదశధా యో విచరతి
సద్వాదశమూర్తిరస్తు మోదాయ'-

('ఆర్యాద్వాదశకమ్'-అని సూర్యుణ్ణి వర్ణించి స్తుతించే స్తోత్రం లోనిది ఇది.

పురీషం-అనే పదానికి అర్థం నీరు. సూర్యుని వల్లనే జలం లభిస్తుంది కనుక సూర్యుడు 'పురీషి' పదవాచ్యుడౌతున్నాడు.




ఇక రెండోభాగమునకు వివరణ:-

ఆరురేకులు-ఆరు ఋతువులు. ఏడు చక్రాలంటే భూరాది సప్తలోకాలు. ఇవి చక్రాలు తిరుగుతున్నట్టు తిరుగుతూ ఉంటాయి. ఈ తిరగడానికి హేతువు సూర్యుడే. ఈ విధంగా పైనాక్రిందా తన తేజస్సుచే చైతన్యం కలిగించి సూర్యుడు జగజ్జనకుడవుతున్నాడు.)

12

మాసోవై ప్రజాపతిః
తస్య కృష్ణపక్షఏవరయిః
శుక్లం ప్రాణః
తస్మాదేతేఋషయః శుక్ల ఇష్టిం
కుర్వం తీతర
ఇతరస్మిన్

సంవత్సరానికి అవయవములు మాసాలు అని అన్నాము. ఆ మాసంకూడా ప్రజాపతే అని తెలుసుకో. ఆ మాసానికి శుక్లపక్షమని, కృష్ణపక్షమని రెండు భాగాలు. శుక్లపక్షమందు ప్రాణశక్తి సమృద్ధిగ ఉంటుంది. కనుకనే తత్వజ్ఞానం కల ఋషులు ఆ పక్షములో పరమపదఫలంకోరుతూ యజ్ఞాలు చేస్తారు.

కృష్ణపక్షం కేవలం భోగప్రదం. నిర్మలమైన ఆత్మప్రభదీనియందు పొరక్రమ్మినట్టయి ఇంద్రియ సుఖాలకోసం జీవిని ఆరాటపెట్టుతుంది. దానికి లొంగిన సామాన్యులు-అంటే ఆత్మతత్వజ్ఞులైన ఋషులు కాని వారు-ఐహికభోగాలకోసం ఏవేవో కర్మలు చేస్తారు.

కృష్ణపక్ష రాత్రులయందు చీకటి-అదే తమస్సు-అంటే అర్థం అజ్ఞానం అన్నమాట. దాని బలం ఎక్కువ. సూర్యకాంతి ఉండక పోదు. అయినా ఆత్మచైతన్యం ఆ పక్షంలో తక్కువ. కనుకనే ప్రాణి భోగాసక్తుడవడం సహజం.

13

అహోరాత్రోవై ప్రజాపతిః
తస్యాహరేవ ప్రాణః
రాత్రిరేవరయిః
ప్రాణం వా ఏతే ప్రస్కందంతి
యే దివారత్యా
సంయుజ్యంతే.
బ్రహ్మచర్యమేవ తద్యద్
రాత్రౌరత్యా సంయుజ్యంతే.

పగలు, రాత్రి-అనే యీ రెండున్ను ప్రజాపతే. ఈ అహోరాత్ర రూపమైన కాలపురుషునకు పగలు ప్రాణం. రాత్రిరయి. పగలు సంగమం చేసేవారు ప్రాణమును చెరిచే వారవుతారు. రాత్రియందు శారీర సంగమం యుక్తం. అది బ్రహ్మచర్యమును పాటించినట్టే అవుతుంది.

14

అన్నంవై ప్రజాపతిః తతోహవై
తద్రేతస్తస్మాదిమాః ప్రజాః ప్రజాయంతఇతి.

అన్నమే ప్రజాపతి. ప్రజాపోషకమని భావం. అన్నము వల్లనే పుట్టువునిచ్చే

వీర్యం కలుగుతూంది. ఆ వీర్యమువల్లనే యీ ప్రజలు జన్మిస్తున్నారు.

15

తద్యేహ ప్రజాపతివ్రతం చరంతి
తే మిథున ముత్పాదయంతే.
తేషామేవైష బ్రహ్మలోకో
యేషాంతపో బ్రహ్మచర్యం
యేషుసత్యం ప్రతిష్ఠితమ్.

ప్రజాపతికి సంబంధించిన వ్రతం సంప్రదాయానుసారంగా జరిపేవారే ఉత్తమ లక్షణాలుగల స్త్రీ పురుష సంతతికి కారణం (ఆధారం) అవుతారు.

తపస్సు, బ్రహ్మచర్యం సక్రమంగా పాటించేవారున్ను, సత్యమును ఏ అవస్థలోనూ జారనీక పాలించేవారున్ను బ్రహ్మను దర్శించే వారవుతారు.

(శ్రద్ధ, బ్రహ్మచర్యం, సత్యపాలన-అనేవి బ్రహ్మసాక్షాత్కారానికి తగిన సాధనాలు.)

16

తేషామసౌ విరజో బ్రహ్మలోకో
న యేషు జిహ్మమనృతం
న మాయా చేతి.

వక్రబుద్ధి, అసత్యము మోసము-ఈ మూడు లేనివారు ప్రసిద్ధమూ పరిశుద్ధమూ అయిన బ్రహ్మపదాన్ని చూడగలరు.

ఇది

ప్రథమ ప్రశ్నము

*

## ద్వితీయ ప్రశ్నము

అథహైనం భార్గవో వైదర్భిః పప్రచ్ఛ
భగవన్ కత్యేవ దేవాః ప్రజాం విధారయంతే
కతర ఏతత్ప్రకాశయంతే,
కః పున రేషాంవరిష్ఠ ఇతి,

తరువాత భృగువంశీయుడైన వైదర్భి అనే ముని పిప్పలాద మహామునిని ఇలాగు ప్రశ్నించాడు.

భగవన్, ప్రజను (సృష్టిని) ఎందరు దేవతలు ధరించి ఉన్నారు? వారిలో యీ సృష్టని ప్రకాశింపచేసే వారెవరు? వారిలో శ్రేష్ఠదేవత ఎవరు?

(శరీర రూపంగా ఉన్న సృష్టిలో జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు అని రెండు తెగల ఇంద్రియాలు ఉన్నాయి. వాటిలో సృష్టి వ్యాపారాన్ని విశేషించి నడిపేవి ఏవి? వాటిలో ఉత్కృష్టం ఏది?)

2

తస్మై సహోవాచాకాశో హవా ఏష దేవో
వాయురగ్నిరాపః పృథివీ వాఙ్మనశ్చక్షు
శ్రోత్రంచ. తే ప్రకాశ్యాభివదంతి
వయమేతద్బాణమవష్టభ్య విధారయామః

వైదర్భి ప్రశ్నకు పిప్పలాదుడు ఇలాగు బదులిచ్చాడు.

ఆకాశము, వాయువు, అగ్ని, నీరు, భూమి, వాక్కు మనస్సు, కన్నులు, చెవులు - అనే యీ పదార్థాలు స్వయం ప్రకాశమానములై యీ అస్థిరమైన శరీరాన్ని మేమే నిలిపి ఉంచుతున్నాము. అని చెప్తూఉండేవి.

3

తాన్ వరిష్ఠః ప్రాణ ఉవాచ.
'మా మోహ మాపద్యథావ-
మేవైతత్పంచధాత్మానం
విభజ్యైతద్బాణమవ
ష్టభ్య విధారయామీతి

ఆ యింద్రియాల ఆర్భాటం గ్రహించి అన్నిటిలో మేలైన ప్రాణం ఇలాగన్నది.

భ్రాంతి పడకండి. నన్ను నేనే అయిదు విధాలుగా విభజించి అస్థిరమైన యీ శరీరాన్ని నిలుపుతున్నాను. ఇది మీ గొప్పతనం అని అనుకోకండి.

4

తేఽశ్రద్దధానా బభూవుః
సోఽభిమానా దూర్ధ్వముత్క్రమత ఇవ
తస్మిన్నుత్క్రామత్యథేతరే సర్వ ఏవోత్క్రామంతే
తస్మింశ్చ ప్రతిష్ఠమానే సర్వఏవ ప్రాతిష్ఠంతే.
తద్యథా మక్షికా మధుకరరాజాన ముత్క్రామంతం
సర్వా ఏవోత్క్రామంతే. తస్మింశ్చ ప్రతిష్ఠమానే
సర్వాఏవ ప్రాతిష్ఠంతే
ఏవం వాఙ్మనశ్చక్షుశ్శ్రోత్రంచ తే ప్రీతాః
ప్రాణం స్తున్వంతి.

ప్రాణమన్నమాట ఇంద్రియాలకు పని చెయ్యలేదు. ఏమిటో దీనిగొప్ప! అన్నట్టు కాస్త చులకనగా చూశాయి. వాటి భావం గ్రహించింది ప్రాణం. మీ పనిపడతానుండండంది. చప్పున శరీరంలోంచి పైకెగిరినట్టనిపించింది. ఇంకేముంది? ఇంద్రియాల ఆటకట్టు. తేనెటీగలరాజు తేనెపట్టుని వదిలి ఎగిరిపోతే చుట్టూఉన్న తేనెటీగలు చప్పున ఎగిరిపోయినట్టు ఇంద్రియాలు కూడా చప్పున ఎగిరిపోయాయి. ప్రాణం తిరిగి కనికరించినట్టు శరీరములో చేరగానే ఇంద్రియాలుకూడా పట్టుకిచేరిన తమరాజు వెంట ఈగలు చేరినట్టు గూటిని చేరాయి. మనకంటె ప్రాణమే బలిష్ఠమూ వరిష్ఠమూ అని వాక్కు, మనస్సు, కన్ను, చెవి సంప్రీతిగా ప్రాణాన్ని స్తుతించాయి.

5

ఏషోఽగ్నిస్తపత్యేషసూర్య ఏషపర్జన్యో
మఘవానేషవాయుః
ఏష పృథివీరయిర్దేవః
సదసచ్చామృతం చ యత్.

ఈ ప్రాణమే అగ్నిరూపముతో ప్రజ్వరిల్లుతూంది. సూర్యుడు, పర్జన్యుడు, ఇంద్రుడు, వాయువు, భూమి, ధనము, సత్తు, అసత్తు, శాశ్వతమైన బ్రహ్మపదార్థమూ యీ ప్రాణమే.

6

అరాఇవ రథనాభౌ ప్రాణే సర్వం ప్రతిష్ఠితం
ఋచోయజూంషి సామాని
యజ్ఞంక్షత్రం బ్రహ్మచ

బండిచక్రములో రేకులున్నట్టు ప్రాణమునందే ఋగ్యజుస్సామసూక్తాలూ యజ్ఞయాగాది వైదికకర్మకాండ, పరిపాలనరూపమైన క్షత్రియధర్మం, ఆత్మజ్ఞానం ఇమిడిఉన్నాయి.

(ఇవన్నీ ప్రాణాన్నిబట్టి ఉన్నాయి. ప్రాణం లేనప్పుడు ఇవేవీలేవు. కనుక అన్నిటికన్నా ప్రాణం మిన్న).

(సశేషము)

# శివకామి

వేదప్రవక్తలు మనకందించిన సాహిత్యం చారిత్రకులు భావించినట్లుగా జానపద సాహిత్యం కాదు. వీరు సదవగాహన కలిగిన పరిశోధనా తత్పరులు. అంతేగాక ప్రకృతి మూలరహస్యాలను ఛేదించకలిగిన మేధాశక్తి సంపన్నులు. ఈ పరిశోధన నిమిత్తం వారు తమ మేధస్సును పరిపూర్ణంగా వినియోగించారు. వీరు ప్రాపంచిక జ్ఞానంలో అలౌకికమైన పారలౌకిక విజ్ఞానాన్ని క్షుణ్ణంగా సముపార్జించిన మేధావంతులు. ఈ విషయంలో వీరి ఆత్మావలోకనాశక్తి వర్ణనాతీతం. ఈ ఆత్మపరిజ్ఞానాన్ని వెల్లడించేందుకు వారు అనేక ప్రత్యక్ష ప్రమాణాలను ఎన్నుకున్నారు.

ప్రతి వేదమంత్రం ఒక ప్రత్యేకమైన ఋషిని, ఛందస్సు, దేవత, వినియోగాలను కలిగివుంది. ఋషి వేదప్రవక్తకుని నామాన్ని సూచిస్తుంది. అతడు అలౌకికమైన జ్ఞానాన్ని పొందిన మహర్షి, మూలపురుషుడు. వేదసారం ఒక శ్రుతిగా, ఒక మంత్రంగా ప్రబోధింపబడింది. అది వినికిడి చేతనే అవగతమవుతుంది. పారమార్థక చింతన సముపార్జించిన వ్యక్తికి మాత్రమే భావగర్భితంగా, స్వచ్ఛంగా పలికే శక్తి వుంటుంది. ఛందస్సు మంత్రోచ్చారణకు అనుగుణ్యమైన శబ్దము లేక లయ. కొన్ని వేదమంత్రాలు నియమితమైన సంగీతంచే నిబద్ధమైనాయి. (అనుష్టుప్, త్రిష్టుప్, జగతి, గాయత్రి మొదలైనవి). అవి ప్రపంచ యంత్రాంగాన్ని సూచించే సాంకేతిక మంత్రాలు. 'దేవత' ఆయా మూలవిరాట్టు స్వరూపాన్ని సూచిస్తుంది. 'వినియోగ' మంత్రం యొక్క ప్రధానోద్దేశ్యాన్ని తెలుపుతుంది. అంతేగాక ఆ మంత్రోచ్చారణ ఫలితాన్ని కూడ విశదపరుస్తుంది.

ఛందస్సును, దేవతను సమగ్రంగా పరిశీలిద్దాం. వేదప్రవక్తకులకు ప్రపంచం లయబద్ధంగా, నిరంతరంగా సాగిపోతుంది. ఈ గమనం వర్ణనకు అందనిది. వారు లయబద్ధమైన చలనాలను సృష్టింపవచ్చునని భావించారు. ఆంతరంగికమైన లయకు, బహిర్గతమైన చలనాలకు పొత్తుకుదరదు. దీనిని సాధించేందుకు ఆంతరంగికమైన తరంగదైర్ఘ్యాలను, బహిర్గతమైన ప్రాపంచిక చలనాల దైర్ఘ్యాలను క్రోడీకరించుట మిక్కిలి ఆవశ్యకం. సూక్తులను ఛందోబద్ధంగా ప్రవచించేందుకు ఈ విధానం తోడ్పడుతుంది. ఈ సూక్తుల ప్రవచనంవల్ల ఏర్పడే కదలికలు నాడీవ్యవస్థపై పనిచేసి మనసును, శరీరాన్ని లయపూర్వకంగా, ఒకదానికొకటి అనుగుణ్యంగా చేయబడుతుంది. వేదమంత్రాలను ఛందోబద్ధంగా ఉచ్చరించే వ్యక్తి అట్టి అభ్యాసంచే సర్వశక్తి సంపన్నుడవుతాడు.

స్థితిశక్తి గతిశక్తిగా మారటమే
నటరాజనాట్యం
ఆ నటరాజ రూపమే శివకామి

॥ వం ॥

'దేవత', 'దేవ' అను పదజాలముల మధ్యవిభేదాన్ని గమనిస్తాము. 'దేవత' స్త్రీ లింగం, 'దేవ' పుంలింగం. 'దేవత' వేదపరంగా పులింగాన్ని సూచిస్తుంది.



ఇచ్చట 'దేవత' అను పదాన్ని ప్రత్యేకమైన భావనతో ఉపయోగించారు. సూక్ష్మంగా పరిశీలిస్తే వేదప్రవక్తలు ఈ ప్రయోగాలను దేవతలయొక్క శక్తిని అవగాహన చేసుకునేందుకు తృష్ణగా ఉపయోగించుకున్నారని తెలుస్తోంది. వారు అవగాహన గావించుకొన్న లౌకికశక్తి అపరిమితం మరియు అభేద్యమైంది. సమయానుగుణంగా అనేకరూపాలు ప్రమాణాలలో కేంద్రీకృతమై ప్రకాశితమైంది. ఆ శక్తి రూపం లెక్కింపనలవికానిది. ఐనప్పటికి వేదప్రవక్తలు తమ దృష్టినంతా ఈ అతీతమైన శక్తి మీదనే కేంద్రీకరించి దానినే 'దేవతలు' అని కీర్తించారు. 'దేవత' అని పేర్కొనబడుతున్న ఈ ప్రత్యేకమైన స్త్రీలింగ పదం శక్తివంతమైందిగా, మిక్కిలి కదలింపగల మహోన్నతమైన శక్తిగా పేర్కొనుట ఎంతేని సమంజసం.

గొప్ప వేదసంప్రదాయ కుటుంబానికి చెందినటువంటి చిదంబర ఆలయ దీక్షితులు 'నటరాజ' ను ఈ విధమైన వేద సంబంధిత భావాలలో కనుగొన్నారు. తమిళంలో ఆలయాన్ని 'కోవిల్' అంటారు. 'కోవిల్' ఆలయానికంటే భిన్నమైన అర్థంలో వాడబడింది. ఆలయాలకే ఆలయం వంటి దానిని 'కోవిల్' అంటున్నారు.

చిదంబరం ఆలయంలో ముఖ్యంగా నెలకొని వుండే దైవమైన 'నటరాజు' చలించే లౌకికసంబంధమైన శక్తియైన మాతృదేవతకు ప్రతీక. 'శివా' శివునియొక్క శక్తి రూపం. 'నటరాజ' శివశక్తుల రూపం. అతడు 'అచల' (చలన రహితం) మరియు 'చల' (చలన సహితం). శివ 'అచల' రూపం. 'చలశక్తి' రూపం. నటరాజుని యొక్కశక్తి 'శివకామి' గా వెల్లడవుతోంది.

శివుడు కోరినపుడెల్లా 'శివకామి' ఉద్భవిస్తుంది. 'కామం' అనేది కోరికకు ప్రతినిధి. శివుని నృత్యం యొక్క ప్రాముఖ్యత యేమనగా పంచకృత్యములను అభినయించుటయే! సృష్టి, సంరక్షణ, వినాశ




## ప్రకటన రేట్లు

**మామూలు పేజీలకు:**

| | |
|---|---|
| పూర్తి పేజీ: | 500 రూ |
| అర్ధ పేజీ: | 800 రూ |
| పావు పేజీ: | 150 రూ |
| ఒక కాలమ్: | 200 రూ |

## సాంకేతిక సమాచారం

| | |
|---|---|
| పేజీ వైశాల్యం; | 275 సెం మీ × 21.5 సెం. మీ |
| ముద్రణస్థలం: | 24" × 19 సెం. మీ |
| కాలమ్‌లు: | 8 |
| స్క్రీన్ కవరు | 100 |
| లోపల: | 65 |

**గమనిక:**

1. ప్రకటన సమాచారం, బ్లాకులు ప్రకటన దారులే ఇవ్వాలి.
2. ఆరు నెలలకు ముందుగా ప్రకటనస్థలం కేటాయించు కొనదలచిన వారికి 10 శాతం, సంవత్సరానికి ప్రకటనస్థలం కేటాయించుకొనే వారికి 15 శాతం. పై రేట్ల పై తగ్గింపు ఇవ్వబడుతుంది.
3. ఏవిధమైన నోటీసుగాని లేదా ఏకారణంగాని తెలుపకనే ప్రకటనలను తిరస్కరించే హక్కు సంపాదకునికి వుంటుంది.
4. కవరు పేజీలకు ప్రకటనలు స్వీకరించబడవు.

ఇతర వివరాలకు:

సంపాదకుడు.

నము, అనుగ్రహం మరియు భక్తుల శ్రేయస్సు కొరకై తన రూపును దాచుట అనునవి పంచకృత్య విభాగములు. స్థితి శక్తికి నిలయమైన శివుడు, గతిశక్తికి నిలయమైన మాతృదేవతతోడి ప్రత్యక్షమౌతాడు. నటరాజ స్వరూపుడైన ఆ శివుడు తన అభినయశక్తితో వూహించినపుడెల్లా ఆమె రూపును ధరించేవాడు. అందుచేతనే ఆ రూపుదాల్చిన దేవతకు 'శివకామి' అనే పేరు వచ్చింది.

శివకామియొక్క ప్రతిరూపం నటరాజగుటచే శివకామికి వేరొక భౌతిక కాయంలేదు. అందుచేతనే శివుని అర్ధనారీశ్వరుడని అంటారు. ఈ ఆచారాన్ని ఆధారంగా తీసుకొని అర్ధనారీశ్వరుని దేవాలయం రెండవ కులోత్తుంగుని కాలంలోనే నిర్మించారు (క్రీ.శ. 1132-1150).

'భాగవతపురాణము' నందు హృదయ భాగమందున్న రంధ్రాన్ని 'దహ్ర' అనియు, అంతకన్న చిన్నది, బహు సున్నితమైన భాగమందే పరమాత్ముడు వెలసియుంటాడని తెలుపబడివుంది. ఈ ప్రదేశాన్ని 'శిటకాశం' అంటారు.

ఎవరికైనా కోపోద్రేకంలో వున్నప్పుడు గుండె వేగంగా కొట్టుకుంటుంది. బాధలెక్కువైతే రక్తపీడన అధికమౌతుంది. శివతాండవ నిజస్వరూపం అర్థంచేసుకోగల ఎవరికైనా అది, అంతములందు విశేషమైన మనశ్శాంతి లభిస్తుంది. ఫలితంగా 'శివకామి' అందరి హృదయాల్లో తేజోవంతంగా వెలుస్తుంది.

— డా॥ ఏ. వి. జయచంద్రన్,
శ్రీ ఏ. కె. వి. ఎస్. రెడ్డి.



# సంగమేశ్వరుడు

సంగం జాగర్లమూడి గుంటూరు జిల్లా, తెనాలి తాలూకాలో తెనాలి - గుంటూరు రోడ్డుమీద, తెనాలికి 8 కి. మీ. దూరంలో వుంది. ఇక్కడవున్న సంగమేశ్వర దేవాలయం మనదేశంలో వున్న ప్రాచీనశైవ క్షేత్రాలలో ఒకటి.

సంగమేశ్వర స్థలాలు, దేవాలయాలు మన రాష్ట్రంలో చాలాచోట్ల వున్నాయి. కాకతీయుల కాలం నాటికి ఆంధ్రదేశంలో బౌద్ధ, జైన మతాలు క్షీణించి వాటి స్థానంలో భక్తి ఉద్యమ ప్రేరితమైన శైవ, వైష్ణవ మతాలు బహుళ ప్రచారంలోకి వచ్చాయి. కాకతీయులు వీరశైవమతస్థులు. వీరు అనేక శైవాలయాలకు దానధర్మాలు చేసి పోషించారు. అలా పోషించిన వాటిలో ఈ ఆలయం ఒకటై వుండవచ్చు. ఈ ఆలయ ప్రాంగణంలో క్రీ.శ. 1600 సంవత్సరాలనాటి గోల్కొండనవాబు అయిన మహమ్మద్ కులీకుతుబ్‌షా పాలనాకాలంనాటి ఒక శిలా శాసనం వుంది. దేవాలయానికి ఒకప్రక్క వెంకటేశ్వరస్వామి ఆలయం వుంది. మన రాష్ట్రంలోవున్న 108 తిరుపతులలో ఇది ఒకటి అని చెబుతారు. ఇక్కడ క్రీ.శ. 1532వ సంవత్సరంనాటి విజయనగర ప్రభువైన అచ్యుతరాయల కాలంనాటి ఒక శాసనం వుంది. ఈ హరిహర క్షేత్రాల మధ్యగా కొమ్మమూరుకాల్వ పారుతున్నది.

సంగమేశ్వర దేవాలయం ఆవరణలోనే పాపవినాశన స్వామి, పార్వతి, గంగ, కాల భైరవ దేవాలయాలున్నాయి. ఇంకా స్వామివారి కళ్యాణమండపం, పవళింపు మేడ, సమారాధనశాల, సంగమేశ్వరుని కెదురుగావున్న ఎత్తైన ఇత్తడి ధ్వజస్తంభం చూడదగినవి. దేవాలయాల సముదాయం చుట్టూ ఎత్తైన ప్రాకారంవుంది.

స్థలపురాణాన్ని బట్టి ఇక్కడ వెలిసిన సంగమేశ్వరుడికి పొన్నూరులోవున్న భావ నారాయణస్వామికి కొంత సంబంధ మున్నట్లు తెలుస్తుంది. గూనిగోవిందుడనే ఒక భక్తుడు తన మామ తనకే పిల్లనిచ్చే టట్లుగా కాశీలోని విశ్వేశ్వరస్వామి సన్నిధిలో ప్రమాణం చేయించుకున్నాడట. కాని అతని మామ తర్వాత అతనికి పిల్లనివ్వనని మాట తప్పాడు. అప్పుడు గోవిందుడు విశ్వేశ్వరుని, భావనారాయణుని తన భక్తితో కాశీ నుంచి రప్పించి గ్రామపెద్దల ముందు వారి చేత సాక్ష్యం చెప్పించాడట. అప్పుడు అతని మామ తన తప్పును ఒప్పుకొని దేవతల ముందు గోవిందుడికి తన కూతురునిచ్చి వివాహం చేశాడు. అప్పుడు విశ్వేశ్వరుడు సంగమేశ్వరుడు అనే పేరుతో ఇక్కడనే నిలిచిపోయాడని, భావనారాయణస్వామి పొన్నూరులో వెలిశాడని చెబుతారు. ఇట్లాంటి కథలు అనేకం వున్నాయి.

శివరాత్రినాడిక్కడ కళ్యాణమహోత్సవం, రథోత్సవం, పంచాహ్నిక సేవ, ప్రభల వూరేగింపులు జరుగుతాయి. ఈ సందర్భంగా చుట్టుపక్కల ప్రాంతాల నుంచి వేలాది జనం వచ్చి, స్వామి దర్శనం చేసుకొని అభిషేకాలు చేయించి వెళ్ళుతుంటారు.

ఈ దేవాలయ ప్రాంగణంలో వివాహ మహోత్సవాలు కూడా ఎక్కువ సంఖ్యలో జరుగుతుంటాయి. •

— వి. వి. సుబ్బారెడ్డి



# కపిల తీర్థం

శ్రీ పాయసం సుబ్రహ్మణ్యం



తిరుపతినుంచి తిరుమలకు వెళ్ళే బస్సు మార్గంలో, శేషాద్రి పర్వతపాదంలో సుప్రసిద్ధ పుణ్యక్షేత్రం 'కపిలతీర్థం' నెలకొని వుంది. కొండకోనలతో, నీలగిరి వృక్షాల సముదాయంతో, పచ్చని ప్రకృతి ఒడిలోని అందమైన పసిపాపలా అనిపిస్తుందీ పుణ్య క్షేత్రం.

## మనోహర జలపాతదృశ్యం!

సుదూరం నుంచే కపిలతీర్థం 'జలపాత' దృశ్యం నయనానందకరంగా కనిపిస్తుంది. జలపాతపు హోరు వినిపిస్తుంది. జలపాతం సవ్వడితో శ్రుతికలిపి గోపురాలపై నివసించే శుక, పిక, శారికలుచేసే మధుర స్వనాలు యాత్రికులను ఆకట్టుకోవడమే గాకుండా ఆనందసాగరంలో ఓలలాడిస్తాయి.

## క్షేత్రదర్శనం

కపిలతీర్థాన్ని సమీపించినపుడు మొట్ట మొదట ప్రవేశ ద్వారానికభిముఖంగా సర్వాంగ సుందరుడైన 'నందీశ్వరుడు' కనులవిందొనరిస్తాడు. ఆ తర్వాత ప్రవేశ ద్వారం, దానిని దాటిపోయిన తర్వాత పశ్చిమదిశాభిముఖంగా శిథిలావస్థలోవున్న ఆళ్వార్ ఆలయం కనిపిస్తాయి గతచరిత్ర స్మృతులను నెమరువేసుకుంటూ దిగులుగా.

## ఆళ్వార్ ఆలయం

ఈ ఆలయంలోని గోపురం, గోపుర ద్వారం, ముఖమండపం, ప్రాకారం, గర్భ గుడి శిథిలావస్థలో కనిపిస్తాయి. ప్రాకారం లోపల ఆలయానికి ఉత్తరంవైపున పుట్టలు పెరిగి సర్పాలకు వాసయోగ్యమయ్యాయి. ప్రాకారపు రాతిగోడలపై అనేక శాసనాలు కనిపిస్తాయి.

## కపిలమహర్షి

పూర్వం కపిలమహర్షి ఈ ప్రాంతంలో నివసిస్తూ ఇక్కడి ఈశ్వరుడ్ని పూజించడం వలన శివుడు కపిలేశ్వరుడైనాడని జనశ్రుతి. ప్రతిరోజూ శివుడ్ని అభిషేకించడానికి కామ ధేనువు పాలను ఉపయోగించేవారట.

## కపిలతీర్థం

కపిలమహర్షి పేరుమీద ఈ తీర్థం కపిల తీర్థంగా వినుతికెక్కింది. కపిలతీర్థాన్ని ఆళ్వార్ తీర్థమనికూడా వ్యవహరిస్తారు. దీని ప్రస్తావన వరాహ, వామన, భవిష్యోత్తర పురాణాలలో కనిపిస్తుంది.

తిరుపతి పరిసర ప్రాంతాలలో సుప్రసిద్ధ శైవ క్షేత్రాలు రెండేవున్నాయి. తక్కినవి మామూలైనవి. జోగిమల్లవరం (యోగి మల్లవరం) పరాశరేశ్వరాలయం, కపిల తీర్థం (ఆళ్వార్‌తీర్థం) సుప్రసిద్ధ శైవ క్షేత్రాలు.

శ్రీ వేంకటేశ్వర అష్టోత్తర శతనామా వళిలో 'కపిలేశ్వరస్వామి' ప్రస్తావనవుంది. కార్తీకమాసంలో ఇక్కడ విశేషమైన పూజలు జరుగుతాయి. పౌర్ణమి వెన్నెలలో ఈ క్షేత్రం దివ్యంగా, శోభాయమానంగా కని పిస్తుంది. యాత్రికులీసమయంలో తండోప తండాలుగా ఈ క్షేత్రాన్ని సందర్శించి జల పాతంలో స్నానమాచరిస్తారు. జలపాతం ప్రాంతంలో స్నానంచేస్తున్న యాత్రికుల జాగ్రత్తకై పైనుంచి పట్టువిడుపుకు గొలుసు అమర్చారు. జలపాతం లేని రోజుల్లో ఇక్కడి కోనేరులో యాత్రికులు స్నానాలు చేస్తారు.

## ఆలయప్రాంగణం

ఇక్కడి ప్రధానాలయం కపిలేశ్వరా లయం. ప్రారంభంలో మండపం, దాని కెదురుగా జలపాతదృశ్యం, ఇరువైపులా అంతస్థులమండపాలు, పశ్చిమాభిముఖంగా ఆలయంలోకి వెళ్ళడానికి మెట్లు, తర్వాత విశాలమైన హాలు విజయనగర, చోళ సంప్రదాయాలను ప్రతిబింబించే స్తంభాలు, శిల్పాలు దర్శనమిస్తాయి. ప్రధానాలయం గాక సుబ్రహ్మణ్యస్వామి, సూర్యనారాయణ ఉమామహేశ్వర, చండికేశ్వర, నవగ్రహా లయాలు, నాగులరాళ్ళువున్నాయి.

ఆలయం ఆగమశాస్త్రరీత్యా నిర్మించ బడింది. అన్ని ఆలయాలలాగే ప్రదక్షిణం, అంతరాళం, గర్భగృహంవున్నాయి. ఆలిం గన చంద్రశేఖరమూర్తి, సూర్యదేవ ఉత్సవవిగ్రహాలు ఆలయంలో భద్రపరుచ బడివున్నాయి.

పరమపావన తీర్థరాజం కపిలతీర్థంలో ఫిబ్రవరి 11 వ 'మహాశివరాత్రి' సందర్భంగా విశేష పూజాకార్యక్రమాలు, వందివాహన ఉత్సవ వేడుకలు జరుగుతాయి.

కుమారస్వామి: ఆరుశిరస్సులు, పన్నెండు హస్తాలువున్న కుమారస్వామి నెమలితోసహా దర్శనమిస్తాడు.

దక్షిణామూర్తి: ఈ మూర్తికి చతుర్భుజాలున్నాయి. పై కుడిచేతిలో నాగుపాము ఎడమచేతిలో త్రిశూలంమలచబడివున్నాయి.

సూర్యుడు: ఈ మూర్తి హస్తాలలో పద్మాలున్నాయి.

కామాక్షి: దేవికి చతుర్భుజాలున్నాయి. పై హస్తాలలో అంకుశము, పాశము, మిగతా రెండు హస్తాలు దక్షిణం అభయ ముద్ర, వామం వరదముద్రలో నూ వున్నాయి. శిల్పాలు చోళుల పరిపాలనా కాలానికి చెందినవిగా పరిశోధకులు భావిస్తున్నారు.

## క్షేత్రనిర్మాణం

కపిలేశ్వరస్వామి ఆలయంలో చోళ, విజయనగర వాస్తు, శిల్పశైలులు విరివిగా కనిపిస్తాయి. ముఖమండపంపై మలచబడిన ఒకశాసనం ప్రకారం (1012-1044 ఏ.సి.) లో రాయన్ రాజేంద్రచోళన్ అన బడేరాజు క్షేత్ర నిర్మాణానికి పూనుకొన్నట్లు తెలుస్తున్నది. ఇతడు కొత్తూరు ప్రతినిధి.

విజయనగర చక్రవర్తి అచ్యుతదేవ రాయల పరిపాలనా కాలంలో (క్రీ. శ. 1530-42) క్రీ.శ. 1531 ఇక్కడి కోనేటిమెట్లు సంధ్యావందన మండపం, కోనేటికి మూడు వైపులా అంతస్థుల మంటపాలు నిర్మించ బడినట్లు తెలుస్తోంది.

## ఇతర శాసనాలు

విజయనగర ప్రభువు సదాశివదేవ మహా రాయలు పరిపాలిస్తున్న సమయంలో క్రీ. శ. 1544 కు చెందిన శాసనం తాళ్ళ పాకం పెరియ తిరుమలయ్యంగార్ ఉదారంగా ఆలయానికి చేసిన సేవల్ని గుర్తుకు తెస్తుంది. సదాశివరాయల పరిపాలనా కాలంలోనే క్రీ.శ. 1563 లో రాచవీటి నాయకర్ కపిలేశ్వరాలయంలోని ప్రాకారం, గోడలు, వంటశాల తదితరభాగాలను పునర్నిర్మించినట్లు మరొక శాసనం తెలియజేస్తోంది. ప్రాకారం, గోడలు, వంటశాల అంతకు క్రితం పిడుగుపాటుకు శిధిలమైనట్లు తెలుస్తోంది. రాజులు, సామంతులు, ధనవంతులే గాక ఇక్కడి శాసనాలలో దేవదాసీలు సైతం కనిపిస్తున్నారు. 'సెవ్వసాని' శాసనం ఒకటివుంది. ఈ శాసన ప్రకారం నృత్య మండపంలో ఆవిడ గణపతి విగ్రహాన్ని అమర్చింది. క్రీ. శ. 1865 లో మహంత్ ధర్మదాసు కోనేరు మెట్లు, మండపం పునరుద్ధరించినట్లు మరొక శాసనంలోవుంది.

## సవాల్_ఇ_జవాబ్ పట్టి

క్రీ.శ. 1801 లో అప్పుడు కలెక్టరుగా వున్న మిస్టర్‌స్ట్రాటన్ తిరుమల, పరిసర ప్రాంతాల చరిత్రను స్థానికులనుంచి రాబట్ట డానికి కొన్ని ప్రశ్నలను తయారుచేశాడు. అందులో కపిలేశ్వరస్వామి ఆలయ ఆదాయాన్ని గురించిన ప్రస్తావనవుంది. 50 పులివరహాలు, 11 మైలులు, 10 కాసులు లేక ఇప్పటి లెక్కల ప్రకారం 200 రూ॥లు ఈ ఆలయానికి ఆదాయం వస్తుండేది. ఆలయానికి ధర్మకర్తలులేరు. కరకంబాడి పాళేగారు ఆలయ రక్షణ బాధ్యతలు చూసే వాడని అందులో వ్రాయబడివుంది.

ఆలయ గర్భగృహం 6 3/4x7 1/4x7 ఘనపు అడుగుల వైశాల్యం కలిగివుండేదనీ కపిలేశ్వరలింగం 'స్వయంభులింగం' అనీ అందులో పేర్కొనడం జరిగింది.

ప్రకృతి సౌందర్యానికి పునికిపట్టయి, చారిత్రక ప్రాభవంతో విరాజిల్లుతున్న 'కపిలతీర్థం' పుణ్యక్షేత్రాన్ని హిందువయిన ప్రతి ఒక్కరూ దర్శించవలసిన అవసరం ఎంతయినా వుంది.



# శివరాత్రి

శ్రీ వి. యస్. వెంకటనారాయణ

"విశ్వేశ విశ్వభవనాశక విశ్వరూప విశ్వాత్మక త్రిభువనైక గుణాభివేశ, హే విశ్వబంధు కరుణామయ దీనబంధో, సంసారదుఃఖ గహనాజ్జగదీశరక్ష॥"

పరమేశ్వరుడైన పరమశివుడు సంసార గహనములో మనకు సంభవించు దుఃఖాదులను పోగొట్టు మహాదేవుడు కరుణాసింధువు. విశ్వనేత, జన్మమృత్యుజరావ్యాధి దుఃఖాదులను రూపుమాపు త్రిభువనైక ప్రభువు. విశ్వరూపుడై విశ్వాత్ముడై దీనబంధువై వఱలుచున్న జగదీశుడు: ఆయన యొక్క స్మరణ భవబంధములను పటాపంచలు చేయును. ఇట్లని పరమేశ్వరుడైన శివుని అపరావతారమైన శ్రీ శంకరభగవత్పాదాచార్యులవారు తాము కీర్తించిన "శివనామావళ్యష్టకము" న స్తుతించి యున్నారు.

"సమేధయతి యన్నిత్యం
సర్వార్థా నాముపక్రమం
శివ మిచ్ఛ న్మనుష్యాణాం
తస్మా దేషశివస్మృతిః॥"

మనుష్యులెల్లరూ తమ ప్రయోజనముల పరిపూర్ణమునకుగాను శివపరమాత్మ ప్రాపును కోరెదరు. ఇదెల్లప్పుడునూ వారు అవలంభించు మార్గము.

"శంసుఖం, పరమానందమికారః పురుషః స్మృతః" 'శం' అనగా సుఖము; పరమానందము. 'ఇ' కారముపరమ పురుషత్వమును సూచించునది. కాగా,

"వకార శ్శక్తిరమృతం శివఇత్యోచ్యతే బుధైరితి" 'వ' కారము అమృతశక్తిగలది. కావున సుఖమును, పరమశ్రేష్ఠమైన ఆనందమును, అమృతత్వశక్తిని కల్గించు మహాపురుషస్వరూపమే శివపరమాత్మ స్వరూపము మరియు,

"శివం కళ్యాణం తత్యో గాద్వాః"

'శివము' అనగా శుభము. దానితో కూడినవాడు కావున కళ్యాణకారకుడు. "శివ ప్రదాత్వాద్వా"శుభములనిచ్చువాడుశివుడు. "శివా ఋతయస్సంతు, శివావనస్పతయ స్సంతు, అహోరాత్రే శివేస్యాతాః" శివునిచే ఋతువులునూ, పుష్పములవలన పుట్టిన ఫలములతోకూడి చెట్లు అహోరాత్రములు కాపాడబడి వర్ధిల్లు చున్నవి. "స్వస్తి శివం కర్మాస్త్వితి" కర్మములు శివునిచే కాపాడబడి భద్రముగ నుండును.

శివశబ్దము 'కాపాడునది' అభ్యుదయమును కాంక్షించు ప్రతివారు మా/నామ



కీర్తన మాత్రము చేతనే ప్రతిఫలమును బొందగలరు. కావుననే శ్రీ ఆదిశంకరాచార్యులవారు 'సంసారగహనతారకమూర్తి' అని పరమశివుని కీర్తించిరి.

పరమశివుని పూజ శివరాత్రినాడు విశేష ఫలప్రదమగుచున్నది. తత్తుల్యమేదియు నూలేదు. చావు పుట్టుకలనుండి కాపాడి కైవల్యము నొసగును.

శివకేశవుల కెట్టి భేదమునూలేదు. వారు ఏకస్వరూపులు. శివత్వములేకవిష్ణువుండడు. విష్ణుత్వములేక శివుడుండడు.

విష్ణువుయొక్క అవతారమైన శ్రీకృష్ణుడు 'గోకులాష్టమి' నాడు నడిరాత్రి ఉద్భవించి యున్నాడు. సరిగా నూటఎనభై దినముల తరువాత 'శివరాత్రి' వచ్చుచున్నది. ఆ శివరాత్రినాడు 'లింగోద్భవమూర్తి' గా శివపరమాత్మ నడిరాత్రి సమయములో ఉద్భవించు చున్నాడు. ఇట్లు సంవత్సరము, ఈ రెండు పుణ్యదినములచే రెండర్ధ భాగములుగ విభజింపబడి పరమేశ్వరుని అవినాభావ స్వరూపములైన శివ విష్ణుశక్తులలో ఒకటి ఒక భాగమునను మరియొకటి మరొక భాగమునను మనలను రక్షించుచున్నదని విదితమగుచున్నది. ఈ విషయము పూజ్యపాదులు జగద్గురువులైన శ్రీ కంచి కామకోటి పీఠాధిపతులైన శ్రీ చంద్రశేఖర భారతీంద్ర స్వాములవారిచే వెల్లడింపబడినది.

ఈశ్వరునికిగల లింగ స్వరూపము ఆయన స్వరూపరహితత్వమునూ, స్వరూపసహితత్వమునూ సూచించుచున్నది. ఇతర రూపములవలె లింగమునకు శిరస్సు, చేతులు, కాళ్ళు మొదలగు అంగములులేవు. ఆద్యంతములులేవు. ఆదిమధ్యాంతరహితమైనది.

శివరాత్రినాడు శివుడు లింగోద్భవమూర్తిగా అర్ధరాత్రి సమయమున ఆవిర్భవించును. కావున రాత్రియంతయూ భక్తులు మేల్కొనియుండి ఆ సమయమునకై వేచియుండి ఆయనను సేవింతురు. ఆయన లింగోద్భవమూర్తిగా ఏలఆవిర్భవింపవలసి వచ్చినది? అనిన, దానికి ఐతిహ్యముకలదు.

ఒకప్పుడు విష్ణువును, బ్రహ్మయూ తామిరువురిలో ఎవరధికులన్న వాదనకు దొడంగిరి. ఆ సమయమున వారి ఎదుట దేదీప్యమాన ప్రభలతో వెలుంగు లింగమావిర్భవించి దిగంతరాళములను నింపెను. దానిమూలమునూ, శిఖరమునూ తెలిసికొనవలెనని బ్రహ్మ విష్ణువులు సంకల్పించిరి. బ్రహ్మహంస స్వరూపియై లింగ శిఖరమును కనుగొనుటకై వెళ్ళెను. విష్ణువు వరాహరూపియై భూమిని చొచ్చుకొని పై లింగ పాదమునన్వేషించుటకు పోయెను. కానీ వారికది అసాధ్యమాయెను.

(33 వ పేజీలో)

# పురందరదాసు

శ్రీ వి. సూర్యనారాయణరావు

పురందరదాసులపేరు కర్ణాటక సంగీత ప్రియులందరికీ సుపరిచితం. 'కర్ణాటక హరిదాసు'గా, 'కర్ణాటక సంగీత పితామహుడుగా' సుస్థిరమైన యశస్సును ఆర్జించి, స్వామిభక్తులకీ, సంగీతజ్ఞులకీ ఆదర్శమూర్తిగా వెలుగొందిన మహాపురుషుడాయన.

కన్నడ వాగ్గేయకారుల్ని 'హరిదాసులు'గా వ్యవహరించే ఆచారం కర్ణాటక దేశంలోవుంది. సంకీర్తనల్ని రచించి, ఒక చోట కూర్చోకుండా, వాటిని శ్రావ్యంగా గానంచేస్తూ వీధివీధి, వాడవాడా సంచరిస్తూ మానవజాతిని అజ్ఞానసుషుప్తినుండి మేల్కొలిపి, వాళ్ళహృదయాలను పరమగమ్యమైన పరమాత్ముని పదపద్మాలవైపు మళ్ళించి, మానవజీవితానికి ఒక పరమావధిని చూపించారు, ఈ హరిదాసులు. భక్తివేదాంతాలనే కాకుండా, నీతినీ, ధర్మాలనూ ఈ హరిదాసులు ప్రచారంచేశారు. వీరు స్వీకరించిన యాయవారవృత్తి, వీరు తలపెట్టిన సత్యధర్మ ప్రచారానికీ, భక్తివేదాంత ప్రబోధానికీ అత్యద్భుతంగా దోహదంచేసింది.

సంస్కృతభాషలోని శ్రుతిస్మృతి పురాణాలలో దాగిన రహస్యాల్నీ, నిగూఢ ఉపనిషత్ రహస్యాల్నీ సులభకన్నడభాషలో, సామాన్యప్రజలకి అర్థమయ్యే రీతిలో ప్రచారంచేసిన ఈ హరిదాసపథాన్ని అభివృద్ధిచేసిన వ్యక్తి పురందరదాసులు అని నిస్సంకోచంగా చెప్పుకోవచ్చు.

పురందరదాసుల పూర్వాశ్రమ జీవితానికీ తరువాత ఆయన స్వీకరించిన హరిదాస జీవితానికీ ఎంతో వ్యత్యాసం వుంది.

మహారాష్ట్రంలోని పురందరగఢమనే ఊళ్ళో వరదప్పనాయకుడు అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయన వజ్రాల వ్యాపారం చేసేవాడు. వివాహం అయిన చాలాకాలం తరువాత క్రీ.శ. 1480 లో ఆయనకి కొడుకుపుట్టాడు. శ్రీనివాసనాయకుడన్న పేరుతో అతను పెరిగి పెద్దవాడయ్యాడు. విద్యాభ్యాసం పూర్తయ్యాక, యుక్తవయస్కుడైన శ్రీనివాస నాయకుడిని, అతని తండ్రి తన వ్యాపారంలో ప్రవేశపెట్టాడు.

శ్రీనివాసనాయకుడు నవరత్నాల వ్యాపారంలోనూ, బంగారం వ్యాపారంలోనూ ఆరితేరాడు. అతని వ్యాపారం మూడుపువ్వులూ ఆరుకాయలుగా అభివృద్ధిచెందింది. కాలక్రమాన సరస్వతీబాయి అన్న యువతితో శ్రీనివాసనాయకుడికి వివాహం జరిగింది.

వ్యాపారంలో అతను అద్వితీయమైన విజయం సాధించి కోట్లకి పడగలెత్తాడు. ఐశ్వర్యాధిదేవత అయిన లక్ష్మీదేవిని అతను తన గృహంలో బంధించి వేశాడని ప్రజలు చెప్పుకునేవారు.

లౌకికమైన అర్థాన్ని పరమార్థంగా భావించి, ధర్మాన్నీ, జీవితధ్యేయాన్ని విస్మరించిన శ్రీనివాసనాయకుడిని, సన్మార్గంలో నడిపించడానికి భగవంతుడు నిర్ణయించుకుని, వృద్ధుడి రూపంలో అతన్ని యాచించడానికి వచ్చాడు. అతని భార్య నుండి ముక్కెరను దానంగా స్వీకరించి, తద్వారా శ్రీనివాస నాయకుడికి కనువిప్పు కలిగించాడు. ఆ సంఘటన దైవం ఉనికిని శ్రీనివాసనాయకుడికి తెలియజేసింది.

**శ్రీ పురందరదాస వర్ధంతికి (ఫిబ్రవరి 12వ తేది) ప్రత్యేక వ్యాసం**



శ్రీనివాసనాయకుడి తలతిరిగిపోయింది. వృద్ధ బ్రాహ్మణ రూపంలో తమను యాచించిన వ్యక్తి ఆ దేవదేవుడే అని అతనికి అర్థమైపోయింది. అతనిలో ఏదో సాగర మథనం ప్రారంభమయ్యింది. సకలచరాచర సృష్టికర్తా, సర్వజగద్రక్షకుడూ అయిన భగవంతుడు తనను మేలుకొలపడానికే తనని యాచించాడు! ఆ క్షణంలో అతనికి జ్ఞానోదయమయ్యింది. అతని హృదయంలోకి ఏదో వెల్తురు ప్రవహించినట్టయ్యింది. అతని కళ్ళు కాలువలుకట్టాయి. ఇంతకాలం తనను అజ్ఞానంలో, అంధకారంలో ముంచి, పరమాత్ముడిని విస్మరించేలాచేసిన ఐశ్వర్యంపట్ల అతనికి విరక్తి పుట్టింది. శాశ్వతమైన ఆనందాన్ని తనకి దక్కకుండా అడ్డుకునే సంపదల్ని త్యజించడానికి అతను ఆక్షణంలో నిశ్చయించుకున్నాడు.

కోట్లకు పడగలెత్తి, మహారాజులావున్న శ్రీనివాసనాయకుడి జీవితం ఆ క్షణంనుండీ మారిపోయింది. తన సకలసంపదల్నీ అతను దానంచేసేశాడు. అతని ఆలోచనా సరళి మారిపోయింది. అతని జీవిత దృక్పథం మారిపోయింది. శ్రీనివాస నాయకుడు చీకటిలోంచి వెల్తురులోకి అడుగు పెట్టాడు. కారణం లేకుండానే తనపట్ల అంత కరుణని ప్రదర్శించిన భగవంతుడిపట్ల అతని హృదయం ఆయత్తమైంది. అన్వేషణ ప్రారంభమయ్యింది.

శ్రీమంతులకు శ్రీమంతుడైన శ్రీనివాస నాయకుడు తన అఖండసంపదనీ, గృహాన్నీ పరిత్యజించి, భార్యాబిడ్డలతో బయలుదేరాడు. ఉదర పోషణార్థం యాయవార వృత్తిని స్వీకరించాడు. తనజన్మ సార్థకం కావడానికి తనకి సన్మార్గాన్ని నిర్దేశించే సద్గురువుకోసం అన్వేషిస్తూ అతను దేశాటనం ప్రారంభించాడు.



ప్రకటన

## గొడుగుల పంపిణీ

మైకుసెట్లవలెనే ఏభై శాతం సబ్సిడీతో గొడుగుల జతను కూడా ఆలయాలకు విరాళంగా ఇవ్వాలని తే 6-3-82 దిన తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహక మండలిలో తీర్మానించటం జరిగింది. కనుక గొడుగులు అవసరమైన ఆలయాల అధికారులు తమ అభ్యర్థనలు పంపుకొనవలసిందిగా కోరటమైనది. గొడుగుల జత సగం వెల రూ. 600/- అవుతుందికనుక టి. టి. డి. కార్యనిర్వహణాధికారి పేరిట ఆ మొత్తానికి డిమాండ్ డ్రాఫ్టు తీసుకొని ఆయా జిల్లాల అసిస్టెంట్ దేవాదాయ కమీషనర్ ల ద్వారా తమ దరఖాస్తులను పంపిన పక్షంలో, అలాంటి వారికి గొడుగులు మంజూరు చేయబడుతవి.

**కార్యనిర్వహణాధికారి,**
**తిరుమల తిరుపతి దేవస్థానములు,**
**తిరుపతి.**

విజయనగర సామ్రాజ్యం శ్రీకృష్ణదేవరాయల పరిపాలనలో ఉచ్ఛదశలోవున్న సమయమది. అపరోక్షజ్ఞాని అయిన వ్యాసరాయలవారు విజయనగరంలోవుండేవారు. ఆయన ఘనతనీ, మహత్వాన్నీ విన్న శ్రీనివాసనాయకుడు విజయనగరం చేరుకుని (క్రీ.శ. 1510-1515 మధ్యకాలంలో) వ్యాసరాయలవారి దర్శనంచేసుకున్నాడు. తనను శిష్యుడిగాస్వీకరించి, అనుగ్రహించి, ఉపదేశం కరుణించమని వేడుకున్నాడు.

వ్యాసరాయలు శ్రీనివాసనాయకుడిని తమ శిష్యుడిగా అంగీకరించారు. ఒక్క క్షణంలో జరిగిన అద్భుతమైన సంఘటన మూలంగా ప్రవృత్తి జీవితంనుండీ, నివృత్తి జీవితంలోకి ప్రవేశించిన శ్రీనివాసనాయకుడి అర్హతని గుర్తించిన వ్యాసరాయలవారు అతనికి 'పురందరవిఠల' అన్న ఆశ్రమ నామాన్ని (అంకితనామం) ప్రసాదించారు. శ్రీనివాసనాయకుడు 'పురందరదాసు' అయ్యాడు.

పశ్చాత్తాపంతో, పరివర్తనం చెందిన ఆయన హృదయం సూర్యరశ్మికి మంచులా కరిగి, పొంగులువారి ప్రవహించింది. ఆ ధార్మిక వైతాళికుడి కంఠం నిర్విరామంగా గానం సాగించింది. ఆ సరస కవితామూర్తి ఘంటం నిరాఘాటంగా పద, పద్య, సుళాదుల్నీ, ఉగాభోగాల్నీ లిఖించసాగింది. కర్నాటకరాజ్యంలో ఆయన కవితావాహిని కూలంకషంగా ప్రవహించింది. సహృదయ క్షేత్రాల్ని తన అమృతజలంలో తడిపి, ధార్మిక సస్యాల్ని పండించింది.

పురందరదాసుల ఆవిర్భావంతో అంతవరకూ నామమాత్రంగావున్న సంకీర్తనా సంప్రదాయం నవోద్వేగంతో నూతన పథాల్ని తొక్కింది. సంగీతానికి కొత్త ఒరవడి సంతరించబడింది. వందలకొద్దీ, వేలకొద్దీ, లక్షలకొద్దీ కీర్తనల్ని రచిస్తూ, గానం చేస్తూ పురందరదాసులు మానవజాతి పునరుద్ధరణకోసం నిర్విరామంగా కృషిచేయసాగేరు. ప్రజల హృదయాల్లో భక్తిజ్యోతిని ఆయన వెలిగించారు. శ్రీహరి మహిమను, ఆదిశేషుడిలాగా వేనోళ్ళ కీర్తించారాయన. పరమాత్ముని అవతార మహత్వాన్ని వర్ణిస్తూ ఎన్నోకీర్తనల్ని రచించారు. శ్రుతిస్మృతి పురాణాలలో నిక్షిప్తాలైన వేదాంత రహస్యాలని కమనీయమైన కన్నడ భాషలో, పామరులకిసైతం అర్థమయ్యేవిధంగా రచించి, నాలుగు చెరగులా తిరిగి, గానం చేసి, అద్వితీయంగా ప్రచారంచేశారు.

సాహిత్యవేత్తగా, సంఘసంస్కర్తగా, భగవద్భక్తాగ్రగణ్యుడుగానే కాకుండా గొప్ప లాక్షణికుడుగా పురందరదాసులకి సుస్థిరమైన పేరుంది. కర్నాటక సంగీత సంప్రదాయానికి నాంది ప్రస్తావకుడై, దానికొక విశిష్టమైన విధానాన్నీ స్థానాన్నీ కల్పించిన పురందరదాసు 'కర్నాటక సంగీత పితామహుడుగా' వాసికెక్కారు.

ఆయన సంకీర్తనా భాండాగారం ఆయన్ని సరససాహిత్యవేత్తగా, మానవతావాదిగా, స్వచ్ఛంద ధార్మికుడుగా, పరమ భాగవతోత్తముడుగా, సంఘసంస్కర్తగా, లాక్షణికుడిగా ఆయనని మనకు చూపిస్తుంది. ఆ నాటి సాంఘిక పరిస్థితికీ, ఆచారవ్యవహారాలకూ, ప్రజల ఆలోచనా సరళికీ ఆయన సాహిత్యం చరిత్రలాగా అద్దంపట్టుతోంది.

కన్నడభాషలో సాగిన ఆయన సాహిత్యం కర్నాటక రాజ్యానికే పరిమితంకాలేదు. ఆయన సంకీర్తనాస్రవంతి తెలుగుగడ్డపైన కూడా ప్రవహించింది. ఆయన సృష్టించిన ప్రజాసాహిత్యం తెలుగుప్రజల ఆదరాభిమానాలను చూరగొంది. ఆంధ్ర సంగీత పితామహుడైన త్యాగరాజస్వామిలాంటి వాగ్గేయకారులను ఆయన సాహిత్యం ప్రభావితుల్ని చేసింది. స్వయంగా త్యాగరాజ స్వామివారే తమ 'ప్రహ్లాద భక్తవిజయ' మన్న గ్రంథారంభంలో పురందరదాసుల ప్రతిభావ్యుత్పత్తుల్ని ప్రస్తుతించారు.

క. దురితవ్రాతములెల్లను
పరిమార్చెడి హరిగుణములఁ బాడుచునెపుడున్
పరవశుడై వెలుగు పురం
దరదాసుని మహిమను నేఁదలచెదనెపుడున్.

తెలుగువారి ఇలవేలుపు తిరుపతి వేంకటేశ్వరస్వామి పురందరదాసుల ఆరాధ్య దైవం. శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించి, ఆ స్వామిని కీర్తిస్తూ ఆయన ఎన్నో కీర్తనల్ని రచించారు. సుప్రభాతమూ, వివిధ

సేవలూ ఉపచారాలూ మొదలు లాలిసేవ దాకా వినూత్నమైన పద్ధతిలో పురందర దాసులు శ్రీనివాసుడిని తమ సంకీర్తనా పుష్పాలతో సేవించారు. 'తిరుపతి తిమ్మప్ప' తో ఆయన పెంచుకున్న అనుబంధాన్ని ఆయన రచించిన వందలాది కీర్తనలు తేట తెల్లం చేస్తున్నాయి.

పురందరదాసులవారి సమకాలికులలో ముఖ్యులు కనకదాసులు. అదే కాలంలో కనకదాసులుకూడా వ్యాసరాయల శిష్యుడుగా వున్నాడు. తొలి తెలుగు వాగ్గేయకారుడూ, పదకవితాపితామహుడూ అయిన తాళ్ళపాక అన్నమాచార్యులూ, పురందర దాసులు తిరుమలపై కలుసుకున్నట్టు, అన్నమాచార్యుల మనుమడైన తాళ్ళపాక చిన్నన్న తన 'అన్నమాచార్య జీవిత చరిత్ర' ద్విపదకావ్యంలో పేర్కొన్నాడు.

పురందరదాసు నారదమహర్షి అవతార మన్న అభిప్రాయం ప్రచారంలోవుంది. పురందరదాసు కర్నాటక సంగీతానికి ఒక రూపాన్ని ప్రసాదించారు. ఆయన సాహిత్యం అందరికీ అందుబాటులో వుండి, అర్థమై, ఒంటబట్టిన సాహిత్యం. మామూలు భక్తులలాగా ఆయన కీర్తనలు రాసుకుంటూ, ఒక మూల కూర్చోలేదు. తాము స్వీకరించిన యాయవారవృత్తి నెపంతో ప్రజలకోసం, ప్రజల భాషలో రచించిన భక్తి వైరాగ్యనీతి ధర్మప్రబోధకాలైన కీర్తనలను గానంచేస్తూ వీధివీధి వాడవాడా తిరుగుతూ ప్రజల్లోకి చొచ్చుకువెళ్ళారు. వాళ్ళ అనాచారాల్నీ, మూఢవిశ్వాసాల్నీ ఖండిస్తూ వాళ్ళకి జీవిత పరమార్థాన్ని బోధించారు. కోరికలతో, కష్టాలతో సతమతమవుతూ, అసలు పురుషార్థాన్నీ, జీవితలక్ష్యాన్నీ విస్మరించి, కుక్షింభరత్వం కోసం తాపత్రయపడుతు, నిత్యదుఃఖంతో అలమటిస్తున్న పీడిత ప్రజల వాడలలో సంఘం బహిష్కరించిన ప్రదేశాలలో, మురికివాడలలో ఆయన సంచరించారు. ఆ అమాయక ప్రజల జీవితదృక్పథాన్ని మార్చి, వాళ్ళనిసన్మార్గవర్తనులుగా చేయడానికి ఆయన నిర్విరామంగా కృషి చేశారు. ప్రజల ఆచారవ్యవహారాలను చక్కగా గమనించిన పురందదాసులవారు వారిదైనందిన జీవితంలోని సంఘటనల్ని ఎంతో చాకచక్యంగా తమ కీర్తనలలో వుపయోగించారు. తమ భిక్షాపాత్రలో వేయడానికి ఎవరో గృహిణి తెచ్చిన రాగుల్ని చూచి.

"రాగి తందిరా! భిక్షకె రాగితందిరా!
యోగ్యరాగి, భోగ్యరాగి, భాగ్యవంతరాగి వీడు
పరమపుణ్య రమమాడువరాగి
పురందర విఠలన సేవిపరాగి"

అన్న సంకీర్తనని ఆశువుగా గానం చేశారు. ధాన్య విశేషమైన 'రాగి'ని ఆయన ఎంతో సమర్థవంతంగా తమ కవితలో వాడుకుని ప్రజలకి చాల దగ్గరగా వెళ్ళిపోయారు.

క్షుద్రదేవతోపాసనతో తమకు మేలు జరుగుతుందని విశ్వసించి, హింసాప్రవృత్తితో అజ్ఞానంలో జీవితాల్ని సాగిస్తున్న సోదరమానవుడిని సన్మార్గంలో పెట్టడానికి ఆయన ప్రయత్నించారు. వాళ్ళని అజ్ఞాన సుషుప్తి నుండీ మేలుకొలపడానికి ఎన్నో ప్రబోధగీతాల్ని రచించారు; గానంచేశారు. "ఊరదేవర మాడబేకణ్ణ" అన్న కీర్తన ఈ సత్యాన్ని చాటి చెప్తోంది. నోరులేని ప్రాణులైన దున్నపోతుల్నీ, మేకల్నీ, కోళ్ళనీ క్షుద్రదేవతలకి బలిఇవ్వడం కాదనీ, మానవుడిలోవున్న కామక్రోధలోభమోహ మదమాత్సర్యాలూ, అహంకారము అన్న దున్నల్నీ, మేకల్నీ, కోళ్ళనీ, గోవుల్నీ బలి ఇచ్చివేయాలని ఈ పాటలో పురందర దాసులవారు చక్కగా ప్రబోధించారు.

పురందరదాసుల సాహిత్యం కన్నడ సాహిత్యచరిత్రలో ఒక నూతన యుగాన్ని ప్రారంభించింది. నిరక్షరాస్యులకు కూడా సులభంగా అర్థమయ్యే సులభశైలిలో గీత రచన చేసి,ప్రజల మధ్యలో తిరుగాడుతూ, భక్తినీ, వేదాంతాన్నీ, ధర్మాన్నీ, నీతినీ ప్రచారంచేసే 'హరిదాస' సంప్రదాయానికి చక్కటి బాట సిద్ధం చేయబడింది.

ఆయన సాహిత్య ప్రభావం ఆ తరువాతి హరిదాసులకి మార్గదర్శకం అయ్యింది. ఆయన సంకీర్తనా సరళి తరువాతి సంగీతానికి ఒరవడి అయ్యింది. ఆయన రచనలతో అనేకమంది కర్నాటక హరిదాసులేకాకుండా త్యాగరాజస్వామి, ముత్తుస్వామి దీక్షితులు మొదలైన మహామహులు ప్రభావితులయ్యారు. అమలభక్తి పరిపూర్ణాలైన ఆయన భక్తి గేయాలలో భగవంతుడు తన వివిధరూపాలతో మనకి సాక్షాత్కరిస్తాడు. తన్మయత్వంతో ఆయన గానం చేసినప్పుడు స్వామి ఆయనముందు తన మనోహర రూపంతో, ఆ మహనీయుడి కీర్తనలో వర్ణించబడిన రూపంతో సాక్షాత్కరించాడేమో అనిపిస్తుంది.



**పూనాపండితుల వేదపఠనం:**
**ప్రక్కనున్నవారు: శ్రీ ఎం. డి. బాలసుబ్రహ్మణ్యం**
(ప్రధానాచార్యులు, కేంద్రీయ సంస్కృత విద్యాపీఠం, తిరుపతి.)

## వేదాల పరిరక్షణ

వేదపఠనాన్ని ప్రోత్సహించి పరిరక్షించి ప్రచారం చేసేందుకు కంకణం కట్టుకుంది, తిరుమల తిరుపతి దేవస్థానం. ఋగ్వేద సంహిత, ఐతరేయ బ్రాహ్మణ వేదాల పఠనాన్ని ప్రస్తుతం టి. టి. డి. స్టూడియోలో రికార్డు చేస్తున్నారు. పూనేకు చెందిన ఇద్దరు ప్రముఖ ఋగ్వేద పండితులు శ్రీ డి.పి. భింజవాడికర్, శ్రీ డి.ఎం. ఫాడ్కేలు ఈ వేదపఠనం చేస్తున్నారు. ఇప్పటిదాకా 50 గంటల వేదపఠనం జరిగింది.

వేదపఠనాలు పూర్తిగా అంతరించిపోయే ప్రమాదాన్ని నివారించేందుకు టి. టి. డి. ఒక బృహత్తర కార్యక్రమాన్ని చేపట్టి వేదాలనన్నింటిని టేపురికార్డు చేయిస్తోంది.

**తిరుపతి శ్రీ వేంకటేశ్వర సంగీతనృత్య కళాశాల రికార్డింగ్ స్టూడియోలో వేదాల ధ్వని ముద్రీకరణను పర్యవేక్షిస్తున్న టి. టి. డి. కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి.**



## యువ వాణి

# వేదాంత గురువులు

శ్రీ రాణి హయగ్రీవశర్మ

గర్భస్థ శిశుదశనుండి మరణము పర్యంతము మానవునకు సంస్కారములు జరుగుచునే యుండును. వీనినే షోడశ సంస్కారములను పేరుతో వ్యవహరింతురు. ఈ సంస్కారములలో ముఖ్యమైనది మానవుని యున్నతికి దోహదకారియయినట్టిది, అక్షరాభ్యాస సంస్కారము. లేక విద్యాభ్యాస సంస్కారము. ఈ సంస్కారమే మానవుని పాశవికప్రవృత్తి నుండి మానవత్వమునకు, అనాగరికావస్థనుండి నాగరికావస్థకు చీకటినుండి వెలుగునకు, అజ్ఞానమునుండి, జ్ఞానదశకు, అపవిత్ర దశనుండి పవిత్రత్వ దశకు, మానవత్వమునుండి దివ్యత్వమునకు తీసికొనిపోయెడి సంస్కారము. ఇంతటి మహత్తర ప్రయోజనములు నమకూర్చెడి యీ సంస్కారము సద్గురుసేవవలన, తత్కటాక్షమున, తప్ప వేరొక విధముగా లభ్యముకాదు.

సద్గురు విచారముచేయుటకు ముందుగా శిష్యులలో గల భేదములను విచారింపవలసి యున్నది. ప్రాథమికముగ శిష్యజాతిని మూడు రకములుగ వర్గీకరింపవచ్చును. 1 కుశాగ్రబుద్ధిమంతులు. 2 ముసలాగ్ర బుద్ధిమంతులు, 3 మృత్పిండ బుద్ధులు.

దర్భపోచ అగ్రమువలె సూక్ష్మగ్రహణ శక్తికలవారు కుశాగ్రబుద్ధిమంతులు. వీరుపదేశమాత్రమున సర్వము గ్రహించి తమ బుద్ధిబలముచే విద్యలకు మెఱుగు పెట్టుదురు. రోకటిపొన్నువలె మందమగు బుద్ధిగలవారు ముసలాగ్ర బుద్ధిమంతులు. ఇట్టి వారికి గురూపదేశమెన్నిమార్లు జరిగినను సంపూర్ణముగ గ్రహింపలేని కారణముగా గురువుచెప్పినది మరచిపోవు నవకాశములు తఱచుగ కలుగుచుండును. ఒక్కచో విపరీతార్థములకు గూడ నవకాశము లేకపోలేదు. మట్టిముద్ద నీరుతగులగనే మెత్తపడును. ఆరిపోయినచో గట్టిపడును. అట్లే మృత్పిండబుద్ధులు గురూపదేశ మున్నంత కాలము పండితులుగానుండి గురూపదేశము సమాప్తమైన పిమ్మట మూర్ఖులకోవకు చెందుదురు.

వెనుక వివరింపబడిన రెండువర్గములకు చెందిన శిష్యులు సద్గురువు గనక లభించినచో ఆసద్గురు కటాక్షలేశముచే వారు మేధావంతులగు నవకాశములు పెక్కుగలవు. ఇట్టి సందర్భముననే సద్గురు కటాక్షమాహాత్మ్యము మన కవగతమగును. శంకరాచార్యునొద్ద శిష్యరికముచేసినట్టి వారిలో "పద్మపాదుడు" గురుకటాక్షమునకు పాత్రుడయ్యెనని చరిత్ర చెప్పుచున్నది.

ఇంకను నిట్టి శిష్యులేకాక, మేషజాతి శిష్యులనియు, మహిషజాతి శిష్యులనియు రెండువర్గములవారున్నారు. మహిషము సరస్సులోదిగి నీటిని కలుషితముచేయుచు, తాను త్రాగక, యితరులకుపయోగింపకుండునట్లు నీటిని వ్యర్థముచేయుచున్నది. అట్లే శిష్యుడుకూడ గురువుల యొద్దచేరి తాను చదువక, క్రమశిక్షణతో మెలగక, ఇతరుల చదువనీయక, కాలము నంతటిని వ్యర్థముచేయువాడు మహిషజాతి శిష్యుడుగా పిలువబడుచున్నాడు. మేషము ఎంతస్వల్పముగ జలమున్నను జలమునకు కాళ్లు తగులనీయక, జలమును తాను త్రావియితరులకు గూడ నుపయోగించునట్లు క్రమశిక్షణతో మెలగి సంచరించుచున్నది. అట్లే కొందరు శిష్యులు వినయవిధేయతలతో క్రమశిక్షణతో మెలగి, గురుశుశ్రూష ద్వారా విద్యార్జనముచేయువారు మేష జాతి శిష్యులుగా వన్నెకెక్కుచున్నారు.

కనుకనే శంకరభగవత్పాదులు "వివేక చూడామణి" యను గ్రంథములో "బ్రహ్మ విద్యకధికారి" యెట్టివాడుగా నుండవలయునో నిర్ణయించినాడు. అతడు మేధావి, విద్వాంసుడు, మంచి యూహాపోహల యందు విచక్షణుడుగా నుండవలయునట.

"మేధావీపురుషోవిద్వానూహాపోహవిచక్షణః
అధికార్యాత్మవిద్యాయాముక్తలక్షణ లక్షితః"

ఇట్టి లక్షణములుగలవాడే ఆత్మవిద్యను పొందుటకు అధికారియగును.

### గురువర్గీకరణము :

సద్గురువెన్నుకొనుట చాల క్లేశముతో కూడినపని. వీరిలోకూడ చాల వర్గములు కలవు. సామాన్య గురువులు లేక సాధారణ గురువులు, సద్గురువులు. వీరిలో సామాన్య గురువులు అక్షరదాతలుగా మాత్రమే యుందురు. గురువులు మేధావంతులైన శిష్యులకు విద్యాదానముచేతురు మృత్పిండబుద్ధులు ముసలాగ్రబుద్ధులు ఐన శిష్యులను అనుగ్రహించుశక్తి ఒక్క సద్గురువులకు మాత్రమే యుండును. వీరు నిగ్రహానుగ్రహ సమర్థులు. తమ కటాక్షవీక్షణపరంపరచే నెట్టి మహత్కార్యము నైనను సాధింపగలరు. ఇట్టివారు మనకు చరిత్రలో చాల తక్కువగ కనిపింతురు. శంకర భగవత్పాదులు. గౌడపాదయతీంద్రులు. వేదవ్యాసమహర్షి రామకృష్ణ పరమహంస మున్నగువారు ఈ కోవకు చెందుదురు. ఈ సద్గురువులే వేదాంత గురువులుగాకూడ ప్రసిద్ధి చెందిరి. సకల విద్యాదానముకంటె, వేదాంత విద్యోపదేశము, లేక బ్రహ్మవిద్యోపదేశము, లేక ఆత్మవిద్యోపదేశము కడుంగడు గణనీయము, శ్లాఘనీయము. అట్టి బ్రహ్మవిద్యా గురువును ఎన్నుకొనుట, (తెలిసికొనుట) మిక్కిలి కష్టతరము వీరిలో దాంభికులెవ్వరో సద్గురువు లెవ్వరో నిర్ణయించి కొని గురుస్వీకారము చేయవలసియున్నది.

ఇట్టివారుకూడ తరతమభేదముచే ఆరు విధములుగనుందురు.

### 1. యోగపాషండులు :

మరణ దుఃఖము లేకుండగ చిరంజీవు లుగా నుండవలెనని యోగాభ్యాసము చేయువారు. దీర్ఘకాలము జీవించుటను యోగము ద్వారా సాధింపవచ్చునుగాని, మరణము లేకుండగ జీవించుట యసంభవము. ఎంతటి బ్రహ్మజ్ఞానియైనను జాతస్య మరణం ధ్రువమ్ అన్నట్లు మరణించక యుండుట యసంభవము. గావున యోగ పాషండులను సద్గురువులుగా నంగీకరింప లేము.

### 2. కర్మపాషండులు :

కర్మ జన్మహేతువని, కర్మలు చేయ కున్నచో జన్మముండదని నమ్మి విహిత కర్మలగూడ నాచరింపకుండువారు. కర్మ సిద్ధాంతము జన్మకారణమైనను విహిత కర్మల విడనాడుట బ్రహ్మజ్ఞానులకైనను తగదు. అందుచేత కర్మపాషండులను సద్గురువులుగా స్వీకరింపరాదు.

### 3. వైరాగ్యపాషండులు :

ఆత్మాభిమానమును విడచి శీతోష్ణాది ప్రకృతి ద్వంద్వములను సహించుచు, దిగంబరులుగా నుండువారు. సద్గురువులు, బ్రహ్మజ్ఞానులు ఆత్మాభిమానమును విడచి యుండరు. ఇతరులకసహ్యకరములు అసభ్యములగు చేతలతోవారి ప్రవర్తన ముండరాదు. అందుచే వైరాగ్యపాషండు లను సద్గురువులుగా నంగీకరింపరాదు.

### 4. జ్ఞానపాషండులు :

ఆత్మానాత్మజ్ఞానమును తెలిసియు, ఆచ రణలో దానిని నిలుపుకొనక స్వేచ్ఛగా సంచరించువారు. ఎంతటి జ్ఞానులైనను తాము తెలిసికొనిన విషయమును, ఇతరుల కాదర్శప్రాయముగా నుండుటకై ఆచరణలో దానిని ప్రవేశపెట్టవలయును. ఆచరణ విరహితమైన జ్ఞానముత్తమఫలితమునీయ జాలదు. అందుచే జ్ఞానపాషండులు గురు స్వీకారార్హులుగారు.

### 5. మిథ్యాపాషండులు :

ఈ ప్రపంచమున సత్పదార్థమేమియు లేదు. అంతా మిథ్యయని నమ్మి దానిని తెలిసికొనుటయే జ్ఞానమని నమ్మి సుషుప్త్యా నందముతప్ప వేరేమియు లేదని భ్రాంతిని చెందువారు. ఇట్టివారిని గురువులుగా స్వీక రించిన భ్రాంతితప్ప మరేమియుమిగులదు. ఇట్టివారు సంఘ వ్యతిరేక చేతలుచేయు నవకాశములు కలవు.

### 6. మాయాతత్త్వపాషండులు :

సర్వము మాయయనినమ్మి అట్టిమాయ అసత్యము కాబట్టి యేదిచేసినను చేయనట్టే గదా యని స్వేచ్ఛావర్తనులగువారు. ఇట్టి వారిని సంఘ విద్రోహులుగా పరిగణింప వచ్చును. ఇట్టి వారిని సద్గురువులుగా స్వీక రించిన యీ మానవసమాజము నాశనమగు టకు ఎంతయో కాలమవసరములేదు. ఇట్టి వారే సాటి మానవులను హత్యచేసియు, చేయనట్టే కదాయని వాదించునవకాశములు కలవు. గాన ఇట్టివారిని సంఘమునుండి ఏరివేయవలయును.

### 7. గురువేషపాషండులు :

వీరు వేషభాషలలో గురుత్వమును ప్రదర్శించి ప్రజలను మోసగించునట్టివారు. వీరుకూడ సమాజమునకు ప్రమాదకారులు గనేయుందురు. ఇట్టివారిని గమనించి ప్రవ ర్తిల్లవలయును. పాషండుడు-అనగా నాస్తి కుడు, మూర్ఖుడు, అసచ్ఛాస్త్రములను వల్లె వేయువాడు అనిఅర్థము. ఇట్టి పాషండ సప్తకమును గమనించి, పరిశీలించి, పరి శోధించి, అట్టివారిని సమాజమునకు దూర ముగా నుంచవలెను.

### సద్గురు లక్షణము.

అక్షర విద్యాదాతలు సమాజమున సంఖ్యలో నెక్కుడుగా నున్నారు. వీరందరు శిష్యులయొక్క విత్తము నపహరించు వారలేకాని, శిష్యులయొక్క హృదయ తాప మును చల్లార్చెడివారు బహుతక్కువ. ఈ క్రింది శ్లోకము ప్రమాణము.

గురవో బహవస్సంతి శిష్యవిత్తాపహారకాః
గురవో విరళాలోకే శిష్యహృత్తాపహారకాః

కాగా ఒక్క వేదాంత గురువే శిష్య హృత్తాపమును తన బోధనలద్వారా హరించువాడనితెలిసికొనవలయును. అంతే కాక బ్రహ్మవిద్యా గురువు తన యుపదేశ మును మౌనముగానే చేయును. అందు వలననే యొకానొక శిష్యుడు వేదాంత గురువుయొక్క యుపదేశమాహాత్త్యమును దర్శించి యాశ్చర్యచకితుడగుచున్నాడు.

సర్వేప్యక్షర దాతారోవాగ్మినం మామకుర్వత
భవానక్షర దానేనమూకంమామకరోదహో

లోకమున గురువులు విద్యాహీను లయిన శిష్యులకు విద్యాదానముచేసివారిని వాగ్మిలుగ చేయుచున్నారు. కాని వేదాంత గురువు బ్రహ్మవిద్యోపదేశముచేసి మూగ వానినిగాచేయుచున్నాడు. ఆశ్చర్యమే కదా! వేదాంతవిద్యనుపదేశముపొంది ఆచరణలోనున్నవానికి మాటలుకరువగును. అతనికిమాటాడుటకేమియు నుండదు. గాన మౌనము నాశ్రయించియే యుండును. అందుచేత బ్రహ్మవిద్యోపదేశమునకు మౌన వ్యాఖ్యానమే మూలము. తత్కారణముగనే శంకర భగవత్పాదులు మౌనవ్యాఖ్యానము ద్వారా శిష్యుల కుపదేశముచేసినవాడు. అందులకీక్రింది శ్లోకము ప్రమాణము.

ఉపవిశ్యవటతరోర్మూలే వృద్ధాశ్శిష్యాఃగురుర్యువా
మౌనస్తువ్యాఖ్యానం శిష్యాస్తుచ్ఛిన్నసంశయాః

గురువు యువకుడు. శిష్యులు వృద్ధులు. మర్రిచెట్టు మూలము ఆసనము. మౌనమే వ్యాఖ్యానము. శిష్యుల సందేహములు పటాపంచలయ్యెనట. ఇట పశ్యంత రూప వాక్కుద్వారా విద్యాబోధనము జరుగు చుండెనని తెలియవలయును.

### ఉపసంహారము :

ఇట వివరింపబడిన మేషజాతి విద్వాంసు డైన శిష్యుడు మౌనవ్యాఖ్యానముద్వారా విద్యోపదేశముచేసెడి గురువు లోకమున నేడు దుర్లభులు.

అట్టి సచ్ఛిష్యునకు అట్టి గురూపదేశము లభ్యమైననాడు ఈ చరాచర జగత్తంతయు నాతని కనుసన్నలలో మెలగగలదు.

ఏది ఏమైనను సద్గురు కటాక్షము "అసతోమా సద్గమయ, తమసోమాజ్యోతి ర్గమయ" మృత్యోర్మా అమృతంగమయ" అనెడి స్థితిని కల్పింపగలదనుట నిర్వి వాదాంశము.

# ప్రకృతి - పురుషుడు

— శ్రీమతి ఓరుగంటి పార్వతీదేవి

ప్రకృతి రెండురకాలు. ఒకటి అంతః ప్రకృతి. రెండు బాహ్యప్రకృతి. వ్యక్తమగునది ప్రకృతి. అంటే కేవలం భూమ్యాకాశాలే కాదు. వాని అంతర్లీనమైన హావభావాలు, సృష్టిక్రమాలు అన్నీ ప్రకృతి క్రిందేలెక్క.

పురుషుడు అంటే మగవాడు అని బాహ్యార్థం. నిజానికి, పరిపూర్ణుడని అంతరార్థం. పురుషుడు సృష్టిరీత్యా శారీరకంగా పరిపూర్ణుడే. స్త్రీ అపరిపూర్ణురాలు.

మానసిక పరిపూర్ణత చేకూరాలంటే స్త్రీ సాహచర్యం పురుషునికి, పురుషుని సాహచర్యం స్త్రీకి అనివార్యం. ఆధ్యాత్మిక భూమికలో అయితే ప్రతిఆత్మ పరిపూర్ణమైనదే! ఈ దృష్టితో చూచినవారికి స్త్రీ పురుషులందరూ స్త్రీలే! భగవంతుడొక్కడే పురుషుడు.

ప్రకృతినుండి త్రిగుణాలైన సత్త్వరజస్తమోగుణాలు, వాటినుండి వికారాలు. రాగద్వేషాలు ఉద్భవిస్తాయి. ఇవే ప్రకృతి లక్షణాలు. ప్రకృతిలోని అతి సహజమైనగుణం కామ క్రోధ లోభ మద మోహ మాత్సర్య భూయిష్ఠమై ఉంటుంది.

ప్రకృతి క్షేత్రసంబంధమైనది. క్షేత్రమంటే శరీరం, పొలం, స్థలం అని అర్థాలు. వంటపొలాన్ని సిద్ధం చేసుకోడానికి రాళ్ళు రప్పలు ఏరిపారేయాలి. కట్టే కంపా కొట్టిపడేయాలి. చదునుచేసి దుక్కిదున్నాలి. అప్పుడు అందులోపడ్డ విత్తనాలు ఎదిగి ఫలభరితాలౌతాయి.

శరీరంకూడా ఓ రకమైన క్షేత్రమే. ముళ్ళపొదల్ని పెరికేయాలి. ప్రకృతి సిద్ధమైన భూమిని పంటపొలంగా మార్చడానికి పడవలసిన శ్రమకంటే శతాధికమైన బాధ పడితేగాని తనూక్షేత్రంలో ద్వేషాదికంటకాలు కాలిపోవు.

ప్రకృతినుండి ఆవిర్భవించిన క్షేత్రలక్షణాన్ని భగవద్గీతలోని 13వ అధ్యాయంలో భగవానుడు అర్జునకిలా వివరిస్తాడు.

"మహాభూతాన్యహం కారో.
బుద్ధిరవ్యక్త మేవచ
ఇన్ద్రియాణి దశైకం చ.
పంచ చేంద్రియ గోచరాః,
ఇచ్ఛాద్వేషస్సుఖం దుఃఖం
సంఘాత శ్చేతనా ధృతిః
ఏతత్ క్షేత్రం సమాసేన,
సవికార ముదాహృతమ్."

బాహ్యప్రకృతే కాకుండా అవ్యక్తమైన మూలప్రకృతి. మహద్బుద్ధి, అహంకారం, పంచభూతాలు, వాటి గుణాలు, శబ్దాలు, ఇంద్రియాలు, రాగద్వేషాలు, సుఖదుఃఖాలు వీటన్నిటి కలయికే వికార సహితమగు క్షేత్రం. ప్రకృతిని ప్రతిబింబిస్తుంది.

ముఖాలు, శిరస్సులు, చెవులు ఇత్యాదిగా వ్యాపించిఉన్నవి.

అన్ని ఆత్మలకూ మూలమైన ఆ పరమాత్మమే పురుషస్వరూపం. అన్ని క్షేత్రాలలోనూ ప్రతిఫలిస్తున్నది ఆ స్వరూపమే. దీనినే జ్ఞేయ వస్తువని కూడా అంటారు. తెలుసుకోదగ్గదదే!

"అవిభక్తంచ భూతేషు.
విభక్తమివ చ స్థితమ్
భూత భర్తృచ తజ్జేయం.
గ్రసిష్ణు ప్రభవిష్ణు చ"

ఈ జ్ఞేయవస్తువైన పురుష స్వరూపం అవిభక్తమైనదే కానీ అది వివిధ క్షేత్రాలలో

స్త్రీ పురుషుల శృంగారం ప్రకృతితత్త్వం. ఆత్మపరమాత్మల సంయోగం పరతత్త్వం — ఈ రెంటి కలయికే జగన్నాటకమని రచయిత్రి భావన.

॥సం॥

పురుషులు దాదాపు అందరూ భర్తలే. సంసారభారాన్ని భరించేవాడు భర్త. భూలోకమనే సంసారభారాన్నే కాక విశ్వాన్ని భరించే విశ్వంభరుడైన ఆపురుషోత్తముడే నిజమైన పురుషుడు. అందరికీ భర్త అనదగిన వాడని, మతగ్రంథాలు ఘోషిస్తున్నాయి.

ప్రకృతిజనితమైన శరీరక్షేత్రంలోని జీవుడే క్షేత్రజ్ఞుడు. అతడే పరబ్రహ్మస్వరూపుడు.

"సర్వతః పాణి పాదంతత్,
సర్వతోక్షి శిరోముఖమ్
సర్వతశ్శ్రుతిమల్లోకే,
సర్వమావృత్య తిష్ఠతి."

ఆ పరబ్రహ్మ విశ్వాంతరాళమంతా వ్యాపించి ఉన్నది, దానికి ఎల్లెడలా సర్వాంగాలైన కాళ్ళుచేతులు, కండ్లు,

(ప్రాణులలో) తానుండి సృష్టిలో పాల్గొనుట చేత అది విభక్తమగు దానివలె కన్పిస్తూంటుంది. ఈ పురుషాకారమే అన్ని భూతాలను (జీవులను) సృష్టిస్తోంది. భరిస్తోంది, లయింపజేస్తోంది. సృష్టి స్థితి లయ కారణభూతమౌతోంది.

చరాచరజగత్తు నందు నిండియుండు ఆ పురుషుడే ప్రాణులన్నిటిలోనూ ఉంటూ సుఖదుఃఖాల ఎరుక కలిగి ఉంటాడు. అతడే సాక్షి, భోక్త, భర్త. అతడేపరమాత్మ, పరబ్రహ్మ, అవినాశీ అతనే.

అసలు త్రిమూర్తులలోని లయకారుడు ఈశ్వరుడు. అతనిని శివుడనడం సమంజసంకాదు. ఆత్మలకన్నిటికీ మూలమైనదే పరమాత్మ, అతనే శివపరమాత్మ.

(26 వ పేజీలో)

# చిరకారి కథ

ఏదైనా ఒకపనిని తొందరగా చెయ్యడం మంచిదా? లేక నిదానంగా చెయ్యడం మంచిదా?

మహాభారతంలో ధర్మరాజుకు ఈ సందేహం కలిగింది. సమాధానం చెప్పవలసిందిగా భీష్మాచార్యులను కోరాడు.

ఏపనైన తొందరపడి చెయ్యరాదనే చెప్పాడు భీష్ముడు. ఆలోచించి పనిచేసే వాడికి అపజయమన్నదే వుండదు. ప్రతిదీ ఆలస్యంగా చేస్తుంటాడు. వీడి కదొకజబ్బు అని అలాంటివాణ్ణి కొందరు తప్పుపట్టడం కద్దు. కాని అది సరికాదు అని వివరించాడు. ఆ కురువంశ పితామహుడు.

ఆ సందర్భంలో యుధిష్ఠిరుడికి చిరకారి అనే మునికుమారుడి కథను ఆయన ఉదరించాడు.

మేధాతిథి అనే మునికి చిరకారి అనే కొడుకు వున్నాడు. ఏ పనైనా చిరకాలానికి చేస్తూవుండటంచేత ఆ అబ్బాయికి చిరకారి అని పేరు వచ్చింది.

ఒకరోజు చిరకారి తల్లిదండ్రుల మధ్య పెద్ద కలహం చెలరేగింది. తల్లిని చంపవలసిందిగా ఆగ్రహావేశంతో కొడుకును ఆదేశించి ఇల్లువిడచి వెళ్ళిపోయాడు చిరకారి తండ్రి.

తండ్రి ఆజ్ఞ ప్రకారం తల్లిని చంపడానికి కత్తి చేతికెత్తుకొన్నాడు. కాని మంచిచెడ్డలు ఎంచకుండా ఏ పని చెయ్యడు కాబట్టి చిరకారి ఆలోచనలో పడ్డాడు.

“తండ్రి ఆజ్ఞను ధిక్కరించరాదు. అలాగని తల్లిని నరికితే నరకానికి పోవడం తథ్యం; పోనీ ఊరుకొందామా అంటే తండ్రిని అవమానించిన పాపానికి ఎలాగూ నరకం తప్పేటట్లు లేదు. నేను ఎంత అస్వతంత్రుణ్ణి అయిపోయాను”.

అంటూ వాపోయాడు చిరకారి. ఆ తరుణంలో ఎవరుగొప్ప అనే మీమాంస వచ్చింది చిరకారికి.

తన పుట్టుకకు తల్లి క్షేత్రం: తండ్రేమో బీజం. తల్లితండ్రీ లేకుంటే తాను లేడు. మరి ఇప్పుడు ఎవరిని కాదనడం? కాసేపు తండ్రి పక్షాన ఆలోచించాడు చిరకారి.

తాను తండ్రికి ప్రతిరూపంగా పుట్టిన వాడు. తండ్రేతాను తానేతండ్రి. తండ్రి మాటవింటే, తండ్రి చెప్పిన పనిచేస్తే కొడుకు పాపాలన్నీ పోతాయని పెద్దలంటారు గదా? మరింక సందేహమెందుకు? మా నాన్నగారు చాలా గొప్పవారు, తపస్వి, ధర్మమూర్తి. మహాపండితుడు, సాక్షాత్తు దైవ స్వరూపుడు. చెప్పినపనిచేసి ఆయన మెప్పు సంపాదిస్తే దేవతలందరినీ తృప్తి పరచినట్లే.

అలా అనుకొని తల్లిని చంపాలనుకొన్నాడు చిరకారి.

కాని తల్లివైపు చూసేసరికి చేతులాడలేదు. ఒకసారి తన్నుతాను పరిశీలించి చూసుకొన్నాడు.

“ఈ కాళ్ళు ఈ చేతులు అసలు నాకీ శరీరం ఎలావచ్చింది? అరణిలో అగ్ని పుట్టినట్లు తల్లి కడుపులోనుంచి వచ్చినదేగదా! తానేమవుతుందో అన్న చింతలేక నవమాసాలు మోసి దుర్భరమైన ప్రసవవేదనను తల్లి అనుభవిస్తేగద తనకీ దేహం వచ్చింది?

బిడ్డకోసం తల్లి పడ్డంతగా తండ్రి బాధలు పడతాడా? ఏదో అలావస్తూ ఇలా పోతూ చూస్తూవుంటాడు. అంతే! అందుకే ధర్మశాస్త్రాలు. ‘మాతృదేవోభవ’ అని తండ్రి కంటే ముందుగా తల్లికే గౌరవమిచ్చాయి. అల్ప జంతువులకైనా అధిక జాతులకైనా అమ్మ ఎవరికైనా అమ్మే! తల్లి పోయిన మరుక్షణంలో బిడ్డ అసమర్థుడై పోతాడు. దుఃఖం ముంచుకొస్తుంది; లోకం శూన్యంగా తోస్తుంది.

ఉన్నవాడికీ, లేనివాడికీ, బలవంతుడికీ, బలహీనుడికీ, తెలివిగలవాడికీ, తెలివి తక్కువవారికీ ఇలా ఎవరికైనాసరే తల్లి కల్పవల్లి వంటిది ఆమె అందరికీ సుఖదాయిని ఇటువంటి తల్లిని చంపుకొంటారా ఎవరైనా? అంతకంటే పాపం వేరేవుంటుందా? పశువులకైనా ఈ సత్యం తెలుసునే? తెలిసి తెలిసీ తనవంటివాడు, తల్లినెలా చంపగలడు?

ఇలా ఆలోచిస్తూ చిరకారి చింతాక్రాంతుడై వుండగా ఎంతో సమయం గడిచిపోయింది. ఈ లోగా చిరకారి తండ్రికి ఆవేశం చల్లారి వివేకం కలిగింది. అయ్యో! ఎంత దుర్మార్గానికి ఒడిగట్టాను? అర్ధాంగిని చంపమని ఆజ్ఞ యిచ్చివచ్చేనే! నా కుమారుడు తొందరపడి ఆ ఆజ్ఞ పాటిస్తే అంతకన్నా క్రూరత్వం వేరే వుంటుందా! అనుకొంటూ దుఃఖం పొంగివస్తుండగా ఇంటివైపు పరుగులు తీశాడు.

ఇంతలో కొడుకు ఆలస్యస్వభావం గుర్తుకొచ్చి, ‘అమ్మయ్య!’ అని కొంత స్థిమితపడ్డాడు.

“చిరకారి మామూలుపనులకే తొందరపడడే! ఇటువంటి ఘోర కర్మకు వేగిరపడతాడా” అనుకొన్నాడు.

ఆయన మనసులోనే కొడుకునుగూర్చి ఇలా ప్రార్థించాడు. ‘నాయనా! చిరకారీ! చిరకాలం నువ్వు తల్లిగర్భంలో వుండినావు, చిరకాలంగా నీ తల్లి నిన్ను పెంచుతూ ఉంది. అలాంటి తల్లిని తొందరపడి చంపమన్నాను నేను. ఈ తరుణంలో నువ్వు తొందరపాటు చూపించక చిరకారి అన్న నీ పేరును సార్థకం చేసుకోవా తండ్రీ! నా తపస్సుకు మచ్చరాకుండా, నీకు పాపం రాకుండా చూడవా బిడ్డా!’

ఇంటికి వచ్చేసరికి చేతిలో కత్తితో బొమ్మలావున్న కొడుకు కనిపించాడు మునికి! తండ్రిని చూడగానే కత్తి పారేసి పరుగునవచ్చి సాష్టాంగ పడ్డాడు చిరకారి! కొడుకుతోపాటు మునిపత్ని కూడా వచ్చి భర్త చరణాలపై వాలింది. ఇద్దరినీ పైకెత్తి వారి శిరస్సులపై ఆనందాశ్రులురాల్చేరు మేధాతిథి. గుడ్డిగా చెప్పిన పనిచేయక మంచిచెడ్డల్ని విచారించినందుకు కొడుకును ఆ తండ్రి పెద్దగా అభినందించాడు.

— జితేంద్ర

# వెలుగుబాట

**డా॥ పండూరి రామకృష్ణమాచార్య**

## దానం

శతేషు జాయతే శూరః
సహస్రేషు చ పండితః
వక్తాదశ సహస్రేషు
దాతాభవతి వా నవా॥

"వందమందిలో ఒకడు శూరుడు ఉద్భవించవచ్చు: వేయిమందిలో ఒకడు పండితుడు కావచ్చు. పదివేల మందిలో ఒకడు వక్త కావచ్చు. "దాత" ఒక్కడు ఎక్కడా కన్పించటం అరుదు" ఇది పై శ్లోక తాత్పర్యం.

పౌరాణిక వాఙ్మయంలోగూడ దాతలు అరుదుగానే కన్పిస్తారు. "దాత" అనగానే జ్ఞాపకం వచ్చేది మహాభారతంలోని కర్ణ పాత్ర. ధనవంతులు అందరూ దాతలు కాలేరు. దుర్యోధన సార్వభౌముని కంటే గొప్ప ధనవంతుడు కాడుగదా! కర్ణుడు. అయితే ఆ త్యాగం ఉండాలి. ఎవరైన దాత అవాలంటే దాత కావటానికి ఉండవలసింది కరుణార్ద్రహృదయమేగాని కేవలం సంపన్నత మాత్రమేకాదు. త్యాగమే దానానికి "ఆత్మ." ఇంద్రుడు, పుత్రమమకారంతో అర్జునునకు మేలు చేయగోరి కర్ణుని దగ్గరకు మాయాబ్రాహ్మణుడై వచ్చి అర్థించినప్పుడు కర్ణుడు తన సహజ కవచకుండలాలు దానం చేశాడు. తన్ను అర్థించింది బ్రాహ్మణుడు కాడనీ ఇంద్రుడనీ కర్ణునికి తెలుసు.

భాగవతంలోని పాత్ర బలిచక్రవర్తిగూడ తనకు రాబోయే విపత్తును తన గురువు శుక్రాచార్యుడు హెచ్చరించి చెప్పినాసరే వామనవటువుకు "మూడు అడుగులు" దానం చేసి తాను పదభ్రష్టుడైనాడు.

ప్రపంచంలో అన్నిమతాలు దానధర్మాలు ఆధ్యాత్మికోన్నతకి విధ్యుక్తసూత్రాలుగా అనుశాసించాయి. సనాతన హిందూమతం దానధర్మాలకు కల్పించిన ప్రాముఖ్యం అందరకు తెలిసినట్టిదే! గోదానం, భూదానం హిరణ్యదానం, సాలగ్రామదానం, కన్యాదానం, అన్నదానం, విద్యాదానం దానాల పట్టిక హిందూమతంలో ఒక అంతులేని ఆకృతిగణం.

పండుగలలో పబ్బాలలో శుభకార్యాలలో శ్రాద్ధకర్మలలో అన్ని మతప్రక్రియలలో హిందూమతం దానకృత్యాల్ని విధ్యుక్త ధర్మాలుగా అనుశాసించింది.

సాహిత్యంలో సర్వమత సంప్రదాయాలలో ఇంతగా శ్లాఘింపబడిన దానంచేసేవాడు దాత మహనీయుడే అని అంగీరింపక తప్పదు. అయితే అది పాత్రదానమైనపుడు దాతకంటే, ఆలోచిస్తే దానగ్రహీతయే గొప్పవాడు అని చెప్పవలసివస్తుంది. ఏ మహారాజో ఒక వేదవేదాంగ పారంగతునికి లేదా ఒక షట్ఛాస్త్ర పండితునికి ఒక అగ్రహారం దానంచేస్తే, నిశ్చయంగా ఆ విద్వాంసుడే ఆ మహారాజుకంటే గొప్పవాడు ప్రాయికముగా, దానధర్మాలు పాత్రులకు ఇచ్చేవి బహుమతులే!

ఇంతేగాదు, ఐహికదృష్టితో చూస్తే, ఎంత ఎక్కువ ధనం వ్యయంచేస్తే అది అంత గొప్పదానం కావచ్చు. కాని పారమార్థిక దృష్టిలో చూస్తే దానంయొక్క విలువ దాతచేసిన త్యాగంపై ఆధారపడి ఉంటుంది.

అశ్వమేధయాగం చేసినప్పుడు, మహాభారతకథలో ధర్మరాజు తన కోశాగారంలో ఏమీమిగుల్చకుండా దానధర్మాలు చేశాడట! అతని తమ్ములు అందరు తమ అన్నగారి దాతృత్వానికి గర్వించారుకూడా! అయినప్పటికి అతనికి సమకాలీన సమాజంలో దాతగా కర్ణుడు ఆర్జించిన కీర్తి దక్కలేదు. ఒక ముంగిస ఆ మహాయజ్ఞ స్నాతకోత్సవానికి వచ్చి, ఋత్విజులు విద్వాంసుల ముందర ధర్మరాజు చేసిన దానాలుగాని అంతకుముందు షోడశమహారాజులు చేసిన దానాలుగాని ఒక పేదవిప్రుడు సక్తుప్రస్థుని దానానికి సరితూగవని అధిక్షేపించింది! ఆ సక్తుప్రస్థుడు కరువు కాటకం దేశాన్ని అలముకొన్నప్పుడు తాను ఉంఛవృత్తిచే సేకరించిన ధాన్యం తెచ్చి, పిండి చేసి తయారుచేసిన గంజిని ఆకలిగొనియున్న అతిథికి సమర్పించాడు. అతని కుటుంబసభ్యులు ఆ విధంగానే చేశారు. వారికి బ్రహ్మలోక ప్రాప్తికలిగింది. ఆ దానజలంలో పొరలాడిన ఆ ముంగిస దేహం సగం బంగారంగామారింది. అప్పటినుండి ఆ ముంగిస ఎన్నో యజ్ఞయాగాలకు వెళ్లిందట మిగిలిన సగందేహం బంగారం చేసుకోవాలని! షోడశమహారాజుల యజ్ఞాలలో చివరకు ధర్మరాజు అశ్వమేధ యాగంలోగూడ ఆ ముంగిస కోరిక ఫలించలేదు!

అనగా ఒక మహారాజుగారు నవరత్న కాంచనరాశులతో నిండిన కోశాగారం అంతా ఖాళీచేసి చేసిన దానధర్మాల కంటే, తనకే తినటానికి తిండిలేని ఒక నిరుపేద హృదయపూర్వకంగా చేసిన దానం అది పేలపిండి గంజి అయినప్పటికీ ఆధ్యాత్మికంగా గొప్పది అనేది మహాభారత సందేశం.

అందుచేత దాతకు ఉండవలసిన లక్షణాలు 1. ఔదార్యం 2. త్యాగం. ఔదార్యం లేని దానం లంచంతో సమానం. త్యాగం లేని దానం దర్పం అవుతుంది. నిజమైన దానం పేరు ప్రతిష్ఠలు ఆశించి చేసేదికాదు. అందుచేతనే అభిజ్ఞులు "గుప్తదానం" గొప్పది అని అంటారు.



(23 వ పేజీ తరువాయి)

భూమిమీద అత్యల్పప్రాణి ప్రాదుర్భా వానికీ ప్రకృతి పురుషుల కలయిక అని వార్యం. ఎంత స్వల్పజీవి కూడా భగవంతుని అంగీకార ఐక్యతలేక జీవంపోసుకోదు. ఈ విషయాన్ని కృష్ణుడు పార్థునితో.

"యావత్సంజాయతే కించిత్,
సత్వం స్థావర జంగమమ్
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్,
తద్విద్ధి భరతర్షభ:"

భరతశ్రేష్ఠా! చలించనివి, చలించునవి అయిన జీవరాశి ప్రకృతి పురుషుల సంయోగ యోగం వల్లనే జన్మనెత్తు చున్నదని తెలుసుకో-అంటున్నాడు.

ఈ విధంగా ప్రకృతి తత్త్వం, పర తత్త్వంతో కలిసి జగన్నాటక చక్రభ్రమ ణానికి ఆధారమౌతోంది. ఈ జీవవలయాన్ని త్రిప్పుచున్నదెవరో! తిరుగుచున్నదేదో! వీటి తత్త్వాలను తెలుసుకోవడమే బ్రహ్మ జ్ఞానం.

"ప్రకృత్యైవ చ కర్మాణి,
క్రియమాణాని సర్వశః
యః పశ్యతి తథాఽఽత్మానం,
అకర్తారం స పశ్యతి"

సృష్టిలో అన్ని వ్యాపారాలు ప్రకృతి చేత అంటే ప్రకృతి వికారాలకు హేతు భూత మైన దేహేంద్రియాలచేత కొనసాగు తున్నాయి. కానీ పరమ పురుషుడగు పర మాత్ముడు తానేమి చేయక సాక్షీభూతుడుగా ఉన్నాడన్న రహస్యాన్ని తెలుసుకున్న వాడే సక్రమమైన దృష్టిగలవాడని భగ వానుడు ఉద్ఘాటిస్తున్నాడు.

"ఒక్క సూర్యుండు సమస్తజీవులకు తానొక్కొక్కడై తోచుపోలిక" అన్నట్టు సర్వాంతర్యామి అయిన ఆ పురుషతత్త్వాన్ని తెలుసుకోవడం చాలా కష్టం.

"బహిరంతశ్చ భూతానాం,
అచరం చరమేవ చ
సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం,
దూరస్థం చాంతికే చ తత్"

ఈ పరతత్త్వమైన పురుషోత్తమ తత్త్వం ప్రాణుల లోపల వెలుపలా ఉంటుంది. అది చలించదు. చలిస్తుందికూడా. లోపల ఉండ డంవల్ల అతి సూక్ష్మం. బయటాఉంది కాబట్టి అది బహుదూరం. ఇది తెలుసుకున్న వాడే జ్ఞాని.

సాధారణంగా స్త్రీ పురుషుల ఐక్యతను శృంగారం, ప్రణయం అంటారు. ఈ శృంగారం అన్ని ప్రాణులకు అనుభవంలోకి వచ్చే అనుభూతే. ఈ భూతలం మీద లౌకి కంగా ఉన్న అన్ని సుఖానుభూతులకంటే శృంగారం అత్యున్నతమైనదన్న భావం తోనే ఆ ప్రణయాన్ని 'శృంగారం' అని అని పిలుస్తున్నాం. శృంగం అంటే కొండ శిఖరం, కొమ్ము అని అర్థం. అంటే అన్ని లౌకికానందాల్లోకి ప్రణయం శిఖరాగ్ర సన్నిభమైనదన్న మాట.

మరి అలౌకికానందంలో ఎంత అనుభూతి ఉండాలోమరి! ఇక్కడ ఆత్మపరమాత్మల కలయికే సంయోగం. ఈ విధమైన ప్రకృతి పురుషుల సంయోగంలోని అనుభూతి వ్యక్తీ కరణకు అందనిది.

వ్యక్తీకరించగలవాడే వ్యక్తి అయినప్ప టికీ ఆ ఆత్మపరమాత్మల, ప్రకృతి, పురు షుల ప్రణయంలోని అలౌకిక దివ్యానుభూతి స్వానుభవైక వేద్యమే కానీ వ్యక్తీకరణకు అందీఅందనిదే మరి!



## శ్రీ సారంగధరేశ్వరాలయ చరిత్ర

రచయిత: సాహిత్య విద్యాప్రవీణ, రాష్ట్ర భాషా ప్రవీణ, కొల్లూరు అవతారశర్మ. పుటలు: 60. ప్రతులకు: శ్రీ సారంగధరేశ్వరాలయ ధర్మకర్తల సంఘం. రాజమహేంద్రవరము.

రాజమహేంద్రవరమునందలి శ్రీ సారంగధరేశ్వరస్వామి దేవాలయ స్థలపురాణము దేవాలయ చరిత్రను తెలిపెడి పుస్తకమిది. సారంగధరుని వృత్తాంతము ఎల్లరెరిగినదే! ఈ గ్రంథములో రాజరాజనరేంద్రుని ఆజ్ఞ మేరకు తలవరులు సారంగధరుని కాలు చేతులు నరకుట, మీననాథుడను జంగము ప్రోత్సాహంతో రాజకుమారుడు శివుని ధ్యానించుట, శివుడు సారంగధరునకు మరల కాలుచేతులు ప్రసాదించుట మొదలగు వివరాలు కలవు. సారంగధరునకు శివసాయుజ్యము ప్రసాదించిన ఇచ్చటి శివలింగము సారంగధరేశ్వరుడుగా ప్రసిద్ధి చెందినది.

ఈ ఆలయం కొంతకాలం పూజాపునస్కారములను కోల్పోయి శిథిలావస్థలో వుండేది. రచయిత వాక్యాలలో చెప్పాలంటే "ఆ దేవళము పగటివేళ జూదరులకు, రాత్రివేళ దొంగలకు తావలమై యుండెను." పుర ప్రముఖులు, అధికారులు కొందరి కృషి ఫలితంగా ఇటీవల ఈ ఆలయం పునరుద్ధరించబడినది. ఆలయం దినదినాభివృద్ధి చెందిన తీరు, దేవాలయము బోర్డువారు తలపెట్టిన ఇతర కార్యక్రమములు భక్తులకు తెలియపరచు నిమిత్తం ఈ గ్రంథము ముద్రించబడినది. సారంగధరేశ్వరాలయ ప్రాంగణమునగల సారంగధరుడు తలారుల శిల్పములు, పునరుద్ధరణకు పూర్వము దేవాలయ స్వరూపము, అమ్మవారి ఆభరణములు, పునరుద్ధరించబడిన పిదప ఆలయ స్వరూపము మొదలగు ఛాయాచిత్రాలను గ్రంథములో ప్రచురించుట జరిగింది.

రాజమహేంద్రవరము మిక్కిలి చరిత్ర ప్రసిద్ధి వహించిన నగరము. రాజరాజ నరేంద్రుడు వేంగీ దేశాన్ని పాలించే రోజులలో ఈ నగరము ఆంధ్ర సంస్కృతికి నెలవుగా వర్ధిల్లినది. ఇతని ఆదరణలో నన్నయభట్టు వ్యాసభారతాన్ని ఆంధ్రీకరించడం మొదలుపెట్టి తెలుగులో "ఆదికవి" అయినాడు. నారాయణభట్టు అనే గొప్ప విద్వాంసుడు నన్నయకు "కుడిభుజం" గా ఉండినాడు. ఈ నగర సౌభాగ్య విధాత శ్రీ సారంగధరేశ్వరస్వామిని గురించి భక్తజనులకు చక్కని తెలుగులో తెలియజెప్ప ప్రయత్నముగా ఈ గ్రంథాన్ని రచించిన రామచంద్రపురం ప్రభుత్వ జూనియర్ కళాశాల సంస్కృతోపన్యాసకులు కొల్లూరు అవతారశర్మగారి కృషి అభినందనీయము. గ్రంథాలయాలు సేకరింపదగిన పుస్తకం.

— డా॥ వేమూరు కామేశ్వరరావు

## శ్రీ హనుమచ్చరిత్ర

మూలం: ప్రభుదత్త బ్రహ్మచారి. అనువాదం: కె. శివసత్యనారాయణ, పుటలు: 214. వెల: అయిదు రూపాయలు. దొరుకుచోటు: కె. లక్ష్మి. C/o డా॥ కె. ఎస్. సత్యనారాయణ, వై. ఎన్. కాలేజీ. నరసాపురం, ప.గోదావరిజిల్లా.

# గ్రంథసమీక్ష

దేవుడు స్వామి, భక్తుడు సేవకుడు. స్వామికి సేవచేయడం భక్తుని ధర్మం. భక్తి మార్గంలో ఇది ఒక పద్ధతి. దీనినే సేవ్య-సేవకభావం అంటారు. హైందవ భక్తి సాధనలో ఈ పద్ధతి ప్రశస్తమైనది. పురాతనమైంది కూడ. ఈ సేవ్యసేవక భావానికి తార్కాణంగా శ్రీరాముడు హనుమంతుని సంబంధాన్ని పేర్కొనడం పరిపాటి.

శ్రీరాముడు స్వామి. ఆంజనేయుడు సేవకుడు. ఈ స్వామి-సేవకుల అనుబంధం అనన్యమైంది. హనుమంతుడు వినా రాముడు నిస్సహాయుడు. రాముడు వినా హనుమంతుడు నిరాధారుడు. ఆంజనేయుడు లేనిదే రామకథ లేదు. రాముడు లేనిదే ఆంజనేయ చరిత్రకు ఆధిక్యతలేదు. ఈ రామాంజనేయమే పవిత్ర రామాయణ కావ్యం!

రామభక్తులందరూ హనుమద్భక్తులే. హరి కంటె హరిదాసుమిన్న అన్నభావం రామునికంటె ఆంజనేయునిపట్ల అధికంగా భక్తి ఇనుమడించడానికి ఒక కారణం.

భక్తికీ - బలానికీ - సేవకు - సమర్పణకు-విశ్వాసానికి ఆంజనేయుడు ప్రతీక. భక్తాంజనేయుడుగా, ప్రసన్నాంజనేయుడుగా, వీరాంజనేయుడుగా, యోగాంజనేయుడుగా అనేక రూపాల్లో ఆయనకు గుళ్ళు వెలిశాయి. లక్షలాది భక్తులు నిత్యం ఆ స్వామికి అర్చనలు, ఆరాధనలు చేస్తున్నారు. చిత్తూరు వరకవి నరసింహదాసు రచించిన 'ఆంజనేయ దండకం,' గోస్వామి తులసీదాసు 'హనుమాన్‌చాలీసా' ఆంధ్రదేశంలో హనుమంతుని భక్తులు విరివిగా పఠించడంకద్దు. కష్టాల్లో గట్టెక్కడానికి 'సుందరకాండ' పారాయణం అందరెరిగినదే. అయినా మన భారతీయవాఙ్మయంలో ఆ స్వామికి సంబంధించిన ప్రసిద్ధ గ్రంథాలు కానీ, కావ్యాలు కానీ పెద్దగా లేవనే చెప్పవచ్చు. ప్రభుదత్త బ్రహ్మచారి వ్రాసిన ఈ "శ్రీ హనుమచ్చరిత్ర" కొంతకుకొంత ఈలోటును తీర్చగలదని చెప్పవచ్చు.

బాలకుడు - బ్రహ్మచారి - రామభక్తుడు-రామదూత - లంకాదాహకుడు - తత్త్వవేత్త మున్నగు హనుమంతుని వివిధరూపాలకు చెందిన ఘట్టాలు, మహిమలు, అద్భుతాలు కథలుకథలుగా ఇరవై ప్రకరణాల్లో ఆసక్తి కరంగా వివరించిన తీరు మెచ్చుకోతగింది. ముఖ్యంగా పామరులైన భక్తులను బాగా అలరించగల రచన ఇది.

శ్రీ కె. శివసత్యనారాయణ తెలుగు అనువాదం చిన్న వాక్యాల్లో సులభంగా సరళంగా సామాన్య పాఠకుల స్థాయికి తగినట్లుగా వుంది. కానీ (205 పుట) 'ప్రేతా'నికి బదులు 'ప్రేతాత్మ' అని వ్రాయడం; 'మూర్తి', 'పరివారం', 'మహారాజ్' 'సంసారం' మొదలగు హిందీపదాలను తెలుగులో వాడేటపుడు కొంచెం జాగ్రత్త వహించివుంటే బాగుండేది. ఉదాహరణకు 'సాధూమహా

రాక్ !' అనడం తెలుగులో ఎబ్బెట్టుగా వుంటుంది.

భక్తిప్రేరకమైన అంజనేయుని వర్ణ చిత్రంతో 214 పుటలుగలిగిన ఈ పుస్తకం వెల కేవలం అయిదురూపాయలకే లభింప జేయడం ముఖ్యంగా అభినందించదగిన విషయం. ఆంజనేయభక్తులు తప్పక ఆద రించదగిన గ్రంథం ఈ శ్రీ హనుమచ్చరిత్ర.

— ముంగర శంకరరాజు

### శ్రీ లలితా సహస్రనామ స్తోత్రం

1/8 డెమ్మీసైజు, 308 పుటలు, ఆంధ్రవ్యాఖ్యాత. ''పురాణవాచస్పతి", ''ఉపన్యాస సార్వభౌమ" బ్రహ్మశ్రీ పురాణపండ రామమూర్తిగారు, ప్రకాశకు: భాగవత ప్రచారసంఘము, ఆర్యాపురం, రాజమండ్రి. వెల: రు. 10-00.

శ్రీ లలితా సహస్రనామావళికి ఆంధ్ర వివ రణగల ఈ గ్రంథములో శ్రీ రాజరాజేశ్వరీ పూజావిధానమ్, శ్రీ లలితా సహస్రనామ స్తోత్రమాహాత్మ్యమ్, శ్రీ లలితా సహస్ర నామస్తోత్రమ్, ఉత్తర పీఠిక, ఫలశృతి, శ్రీ లలితా సహస్రనామావళి, శ్రీ లలితా త్రిశతీస్తోత్రమ్, శ్రీ లలితా త్రిశతీనామావళి, శ్రీ లలితాష్టోత్తర శతనామస్తోత్రం, శ్రీ దేవీ ఖడ్గమాలాస్తోత్రమ్, శ్రీ దేవీ ఖడ్గమాలా నామావళిః, శ్రీ దేవీ మానసికపూజా, శ్రీ శ్యామలాదండకమ్, అంబాష్టకమ్ బాలా స్తుతిః, శ్రీ దేవ్యపరాధ క్షమాపణ స్తోత్రమ్, సహస్రనామ వివరణ, త్రిశతీనామ వివరణ, అష్టోత్తర శతనామ వివరణ, ఖడ్గమాలా వివరణ అనేవి శీర్షికలు.

శాక్తసంప్రదాయ పద్ధతిలో గృహస్థులు ప్రాణాయామ, జప, తపాదుల ద్వారా శ్రీదేవీ సాధన చేస్తారు. అట్టివారికి గ్రంథము అత్యంతోపయుక్తమైనది. మొదటగా మూలంలో సంస్కృత స్తోత్రాదులను ప్రక టించి- ఆ తరువాత సహస్రనామ వివరణ, త్రిశతీనామ వివరణ, అష్టోత్తర శతనామ వివరణ, ఖడ్గమాలా వివరణములను ఆంధ్ర మున రచించిన శ్రీ పురాణపండ రామ మూర్తిగారు బహుధా ప్రశంసనీయులు. ధన్యవాదార్హులు.

శ్రీ లలితాసహస్ర నామావళికి వ్రాయ బడిన ఆంధ్ర వివరణం ఇంకా కొంత సమ గ్రంగా ఉంటే బాగుండేది. అర్థ వివరణం స్వప్రమాణికంగా ఉన్నది. శ్లోకాలు పాద క్రమంలో ఉంటే సంస్కృతం రానివారికి కొంత సౌకర్యంగా ఉండేది. సంస్కృత భాషాజ్ఞానం లేనివారు శ్రీదేవి మానసిక పూజావిధానాన్ని (పుటలు 118 నుండి 125 వరకు) చదువుకోలేరు. ప్రస్తుత అచ్చు ధరల వలన ప్రచురణకర్తలు శ్లోకపాద క్రమాన్ని పాటించలేదనిపిస్తుంది. ఏది ఏమైనా అమ్మవారి నిత్యపూజ చేసుకొంటూ, అవసరాన్నిబట్టి పదిపుస్తకాలలో అక్కడా ఇక్కడా వెతికి స్తోత్రాలకోసం తిప్పలు పడ కుండా ఒకే గ్రంథంలో కావలసిన విషయా లను సక్రమంగా కూర్చి ప్రకటింపబడిన ఈ గ్రంథం దేవీ ఉపాసకులందరికీ ఆదర పాత్రంకాగలదు. ఆంధ్రవివరణ కర్తను, ముద్రణా నిర్వాహకులను, భాగవతప్రచార సంఘం రాజమండ్రి వారినీ, అభినందిస్తు న్నాను. గ్రంథం వెల అందరికీ అందు బాటులో ఉండటం ప్రశంసనీయం.

— తలపటపు భాస్కరరావు

---




# ఉత్తమ ఇల్లాలు

అది ఒక గ్రామం. ఆ గ్రామం చివర చల్లని నీడనిస్తూ ఒకచెట్టుంది. ఆ చెట్టుకింద కూచొని వేదపాఠంలో లీనమైపోయున్నాడు ఒక బ్రాహ్మణ కుమారుడు–

అతనిపేరు కౌశికుడు. ఇంతలో చెట్టు పైనున్న కొంగ ఒకటి రెట్టవేసింది. అది సరిగ్గావచ్చి కౌశికుడి నెత్తినపడింది. పట్టరాని కోపంతో కౌశికుడు చెట్టుపైకి చూసే సరికి ఆ చూపుతాకిడికి గిలగిల తన్నుకొంటూ నేలకూలింది కొక్కెర.

క్షణకాలంలో తనకోపాగ్నిలో భస్మమై పోయిన ఆ కొక్కెరను చూసేసరికి కౌశికుడికి పశ్చాత్తాపం కలిగింది.

"అయ్యో! నేనెంత కఠినాత్ముణ్ణి! నిష్కారణంగా ఈ కొంగను చంపివేసేనే! జీవహింస చేసిన ఇక నా కెక్కడిశాంతి?" అంటూ వికల హృదయంతో చింతించసాగేడు. ఇంతలో మధ్యాహ్నంకాగా సంధ్యవార్చి భిక్షాటనార్థం గ్రామంలోకి అడుగుపెట్టేడు.

భిక్షను యాచిస్తూ అతడొక ఇంటివద్దకు వచ్చాడు "భిక్షాందేహి", అనికేక వేశాడు. ఆ ఆ ఇంటి ఇల్లాలు భిక్షను తెచ్చేందుకు పాత్రను తోమసాగింది. ఇంతలో ఆకలితో తూలిపోతూ పొలం నుంచి ఆమె భర్త వచ్చాడు. భర్తను చూడగానే ఆమె అతిథి మాటమరచిపోయి, హడావిడిగా పరిచర్యలో మునిగిపోయింది. ప్రేమతో భర్త కాళ్ళు కడుక్కోటానికి నీళ్ళిచ్చి పీటవేసి కూచోబెట్టింది. విస్తరివేసి ఇష్టమైనకూరలతో కొసరి కొసరి అన్నం తినిపించి, భోజనం కాగానే మెత్తనిపరుపు, దిండ్లు సిద్ధంచేసింది. శయనించగానే పళ్ళెంలో తాంబూలంతో వచ్చింది. తాంబూలసేవనం అయ్యాక పతి దేవుడి కాళ్ళొత్తుతూ కబుర్లు చెప్పసాగింది ఆ ఇల్లాలు. కాసేపటికి నిద్రాపరవశుడయ్యాడు ఇంటాయన. అప్పటికిగాని ఆమెకు వాకిట్లో వేచివున్న అతిథి గుర్తుకు రాలేదు.

త్వరత్వరగా భిక్షతీసుకొని వాకిట్లోకి వచ్చిన ఆ ఇల్లాలిపై కళ్ళెర్రచేశాడు కౌశికుడు.

"అడగంగానే ఓ ముద్ద పడవేస్తే నేను వెళ్ళిపోకపోయానా? ఈ మండుటెండలో ఇంతసేపు నన్ను వాకిట్లో నిలబెట్టడం నీకు సరదాగా వుందా?" అన్నాడు. ఆ మాటలకు గృహిణి ఎంతగానో నొచ్చుకొంది. తన భర్త పొలంనుండి ఆకలితో మాడుతూ భోజనానికి వచ్చాడని వారికి సేవచేస్తూ అతిథి మాట మరచానని చెప్పింది.

తన ఆలస్యాన్ని తప్పుగా అర్థంచేసుకోవద్దని ప్రార్థించింది.

అయినా కౌశికుడు వింటేనా? నీకు నీ మగడంత ఎక్కువయ్యాడా? బ్రాహ్మణులంటే అంత చులకనయ్యారా? అంటూ తిట్టిపోశాడు కండకావరంతో–

భూమిదేవలు, దేవతల చేత సైతం పూజ అందుకొనే వారు అయిన బ్రాహ్మణుల్ని లెక్కచెయ్యకున్నావని మండిపడ్డాడు. బ్రాహ్మణులను అవమానిస్తే, వారికి కోపంవస్తే లోకాలు తల్లక్రిందులౌతాయని నీకు తెలియదా? అని నిలదీసి అడిగాడు.

"బ్రాహ్మణులు దేవతలతో సమానమన్న విషయం నాకు తెలుసు. వారి గొప్పతనం కూడా నాకు బాగా తెలుసు. ఒక విప్రుడు కోపంతో సముద్రాలను పుక్కిలించడం. మరో ద్విజుడు దండకారణ్యాన్ని దగ్ధం చేయడం, ఇంకొక భూసురుడు వాతాపి అనే అసురుణ్ణి త్రాగి జీర్ణంచేసుకోవడం ఇలా ఇంకా, ఎందరోమహర్షుల ప్రభావాల గురించి సర్వం విని వున్నాను.

"తెలిసి తెలిసీ కొరివితో తలగోక్కునే వారుంటారా ఎవరైనా? అయినప్పటికీ మీ





## శ్రీ కపిలేశ్వరస్వామి ఆలయం, తిరుపతి

### ఆలయకార్యక్రమ వేళల సవరణ

### (1-11-82 నుండి 28-2-83 వరకు)

| | | |
|---|---|---|
| సుప్రభాతం | ఉ. 6-00 గం॥ నుండి | 6-15 గం॥ వరకు |
| సర్వదర్శనం | ఉ. 6-15 గం॥ నుండి | 9-30 గం॥ వరకు |
| అభిషేకము (ఆర్జితము) | ఉ. 9-30 గం॥ నుండి | 10-30 గం॥ వరకు |
| మొదటిగంట | ఉ. 10-30 గం॥ నుండి | 10-45 గం॥ వరకు |
| సర్వదర్శనం | ఉ. 10-45 గం॥ నుండి | 11-30 గం॥ వరకు |
| రెండవగంట | ఉ. 11-30 గం॥ నుండి | 11-45 గం॥ వరకు |
| సర్వదర్శనం | ఉ. 11-45 గం॥ నుండి | మ. 3-30 గం॥ వరకు |
| అభిషేకము (ఆర్జితము) | మ. 3-30 గం॥ నుండి | సా. 4-00 గం॥ వరకు |
| సహస్రనామార్చన (ఆర్జితము) | సా. 4-00 గం॥ నుండి | 5-00 గం॥ వరకు |
| రాత్రిగంట | సా. 5-00 గం॥ నుండి | 5-15 గం॥ వరకు |
| దీపారాధన | సా. 5-15 గం॥ నుండి | 5-45 గం॥ వరకు |
| సర్వదర్శనం | సా. 5-45 గం॥ నుండి | రా. 7-15 గం॥ వరకు |
| ఏకాంతసేవ | సా. 6-45 గం॥ నుండి | రా. 7-30 గం॥ వరకు |

గమనిక: సర్వదర్శనముతోబాటు ఒక్కొక్కరికి 1 రూపాయి టిక్కెట్‌పై ఆర్జితసేవా దర్శనము కలదు.

విషయంలో నేనిలా ప్రవర్తించానంటే అందుకు కారణం వుంది. పతియే ప్రత్యక్ష దైవంగా భావిస్తూ మనసా వాచా కర్మణా పతిహితం కోరడం నా వ్రతం. నా దృష్టిలో ఈ పాతివ్రత్యధర్మానికి తక్కువైనవే తక్కిన ధర్మాలన్నీ.

నువ్వు కోపిష్టివని కూడా నాకు తెలుసు. కోపంతో నువ్వొక కొంగను చంపడంకూడా నా పాతివ్రత్య ప్రభావంతో తెలుసుకొన్నాను. నీ కోపం రూపుమాపడానికే నేనిలా చేశాను. మానవుడి మనసును క్రోధం, మోహం అనే రెండు శత్రువులు పట్టి పీడిస్తుంటాయి. ఆ రెంటినీ అణచివేసిననాడు బ్రాహ్మణ్య గౌరవం వస్తుందిగాని ఊరికే రాదు. సత్యం, అహింస, ఇంద్రియనిగ్రహం వంటి సుగుణాలు కలవాణ్ణి అరిషడ్వర్గాన్ని అణచినవాణ్ణి ఎల్లవారిని తనలాగే చూసుకొనే వాణ్ణి బ్రాహ్మణుడని దేవతలు కీర్తిస్తారు కాని. నీలాటివాణ్ణి కాదు. వేద శాస్త్రాలు వల్లె వెయ్యడమేగాని ధర్మసూక్ష్మాలు నీకు తెలియవు. వెంటనే మిథిలానగరానికివెళ్ళు అక్కడ ధర్మవ్యాధుడనే కిరాతుడుంటాడు, ఆయన సత్యవాది; జితేంద్రియుడు, మాతాపితృ భక్తుడు. వారిద్వారా ధర్మసారం తెలుసుకొని నీ సందేహాలు తీర్చుకో.

ఆ ఇల్లాలు ఏకధాటిగా ఇలా కర్తవ్యబోధ చేసేసరికి కౌశికుడు నిశ్చేష్టుడై పోయాడు-అదిచూసి ఆ ఇల్లాలు చప్పున చల్లబడి పోయింది, "మిమ్ములను ఇలా అన్నందుకు ఏమీ అనుకోవద్దు. నేను ఆడదాన్ని. అంతగా తెలివితేటలు లేనిదాన్ని. కాబట్టి నా తప్పును క్షమించండి" అని కౌశికుణ్ణి ప్రార్థించింది.

కౌశికుడు మిథిలకు కదిలాడు. "తల్లీ! అలా అనకమ్మా - నీ తిట్లకు నేను అర్హుణ్ణే. నువ్విలా తిట్టినందువల్ల నాకు జ్ఞానోదయమైంది, వెళ్ళి వస్తాను" అంటూ ఆ పతివ్రత ప్రభావాన్ని పొగడుతూ తన తప్పును తెగ నాడుకుంటూ ధర్మవ్యాధుణ్ణి దర్శించడానికి బయలుదేరేడు -

(మహాభారతం శాంతిపర్వం ఆధారంగా)

— శ్రీమతి జయలక్ష్మి.

# విభూతి ధారణ

శ్రీ నందివెలుగు వేంకటేశ్వరశర్మ

కామికాగమే:-

భస్మం చతుర్విధం జ్ఞేయం కల్పంచైవోపకల్పకమ్.
అనుకల్పమకల్పం చ చతుర్వేవం ప్రకీర్తితమ్.
విరజానలజం భస్మం కల్పమిత్యభిధీయతే,
శివయోగ సముత్పన్నం ఉపకల్పమితిస్మృతమ్.
శివాగ్నిహోత్రే చోత్పన్నం అనుకల్పముదాహృతమ్.
జఠరాగ్నిసముత్పన్నం ఆకల్పం చేతి కీర్తితమ్
కల్పాది చానుకల్పాంతం సర్వేశ్చాపి పరిగ్రహేత్.
అకల్పమన్యే సర్వేఽపి న గృహీతుంకదాచన.

భస్మములు నాలుగురకములు 1 కల్పము 2 ఉపకల్పము 3 అనుకల్పము 4 అకల్పము. విరజానల భస్మము కల్పమనిన్ని, శివయోగసముత్పన్నమైనదిఉపకల్పమనీ. శివాగ్ని భస్మము అనుకల్పమనీ. ఈ మూడును పవిత్రమైనవని, సర్వులు గ్రహింపదగినవని, జఠరాగ్ని భస్మము అకల్పమని, దీనిని విసర్జించవలయునని ఆగమ ప్రమాణము చెప్పుచున్నది.

బోధాయనగృహ్యసూత్రే:-

అథాతో విభూతి సంపాదనధారణవిధిం-వ్యాఖ్యాస్యామః
శుచిర్భూత్వా వికటాంగాం ఉన్మత్తాం అశివాం హీనాతి
రిక్తాంగాం
వంధ్యాం అస్థిచేలాం అశుభ భక్షిణీం రోగిణీం
విహాయ,
సులక్షణాయాః గోమయమాదాయ పిండం కృత్వా
సంశోష్య
శ్వేతవచనీయైః సంభారైః పరిచ్ఛాద్య గృహ్యాగ్నౌ
వైతానేవా
పచనేవో పోషయేత్. దారుపాత్రే మృణ్మయేవా
స్థాపయేత్ అథతద్భస్మా దాయాభిమంత్రయేత్.

మఱియు భస్మముచేయు విధము- దూడతోకూడిన. పరిశుభ్రమైన, నిర్మలాహారమును భుజించునట్టిది, సర్వాంగములు కల్గినట్టిది. ఆవును పరిశీలించి స్నానమొనరించి అరటి ఆకులో గోమయమును గ్రైకొని చిన్న చిన్న ఉండలుచేసి ఎండించి ఊకను పోసి అగ్నిని ప్రజ్వలింపజేసి ఆహుతియగు వఱకు, రుద్రచమకాదులు పఠించుచు చల్లారిన పిదప కొయ్యపాత్రలోగాని, మట్టిపాత్రలోగాని జాగ్రత్త చేయవలయును. ఇంకను యజ్ఞాగ్ని భస్మము ఔపాసనాగ్ని భస్మము బిల్వకాష్ఠాగ్నిభస్మమునుగూడ గ్రహియింపనగు.

బోధాయనస్మృతే:-

లలాటే హృది దోర్ద్వంద్వే గళే కుక్షౌ శిరస్యథ
ధారయేచ్ఛ సితం భస్మం ద్విజో నిత్యమతంద్రితః,

బృహన్నారదీయే:-

త్రిపుండ్రోద్ధూళనే శ్రద్ధా యేషాం నైవోపజాయతే,
ఉపపాతకదోషేణ దుష్టాస్తే నాత్ర సంశయః.

పంచబ్రహ్మమంత్రములతో గృహస్థులు. త్ర్యంబకమను మన్త్రముతో బ్రహ్మచారులు, అఘోరమంత్రముతో వానప్రస్థులు, ప్రణవోచ్చారణముతో యతులు, పంచాక్షరీ మంత్రముతో స్త్రీలు, విభూతిని ధరించవలయును. విభూతిధారణవలన శైవతేజము సిద్ధించును.

ధరించవలసిన స్థానములు:-

షోడశస్థానములు, ద్వాత్రింశస్థానములు అష్టస్థానములు. లలాటము, చెవులు, హృదయము, భుజములు, బొడ్డు, గుహ్యము, శిరస్సు, పంచస్థానములు, లలాటము. భుజములు, హృదయము, బొడ్డు

కారణాగమే:-

భస్మం వామకరే స్థాప్య దక్షిణేనాభిమంత్రయేత్,
మధ్యాంగుళ్యా జవైర్యుక్త మపరైర్జలవర్జితమ్.
హస్తౌ సంశోధ్య చాస్త్రేణ సర్వాంగం
ధారయేత్క్రమాత్,
మూర్ధ్ని చైవ లలాటే చ హృదయే గుహ్యపాదయోః,
కర్ణే చాంసద్వయే బాహౌ కూర్పరే మణిబంధకే,
పృష్ఠే చ పార్శ్వయోశ్చైవ
సర్వాంగం ధారయేత్క్రమాత్.



విభూతిని ఎడమచేతి యందుంచుకొని కుడిచేతితో అభిమంత్రించవలయును. కుడిచేతిమధ్య వ్రేలితో ఉదకమునుపోసి మిగిలిన వ్రేళ్ళతో కలుపవలయును. అస్త్రమంత్రముతో శోధించి మూర్ధము, లలాటము హృదయము, గుహ్యము. పాదములు, చెవులు, భుజములు, మోచేతులు, మణికట్టు పృష్ఠభాగము, పార్శ్వములందు, భస్మమును ధరించవలయును.

కారణాగమే:-

లలాటే హృది బాహ్వోశ్చ,
దైర్ఘ్యకం తు షడంగుళమ్,
శేషం త్రయాంగుళంప్రోక్తం
త్రిపుండ్రంధారయేత్క్రమాత్.
ఊర్ధ్వపుండ్రం అనాయుష్యం
దీర్ఘపుండ్రం తపఃక్షయమ్,
నేత్రయుగ్మాంతమానేన
ధారయేద్భసితం క్రమాత్.

విభూతిరేఖలు లలాటహృదయ బాహువులందు ఆరంగుళముల పొడవుగను, మిగిలినచోట్ల మూడంగుళముల పొడవుగను, మూడేసి రేఖలుగా ఉండవలయును. ఊర్ధ్వపుండ్రము పనికిరాదు. దీర్ఘముగా భస్మమును ధరించుటవలన తపస్సు నశించును. నేత్రాంతము వఱకు భస్మరేఖలుండవలయును.

ధార్యం భస్మ త్రిసంధ్యం తు
గృహిణా జలసంయుతమ్
సర్వకాలే భవేత్ స్త్రీణాం
యతీనాం జలవర్జితమ్,

గృహస్థు నీటితోతడిపి విభూతిని ధరించవలయును. యతులు, స్త్రీలు పొడివిభూతినే ధరించవలయును.

కారణాగమే:-

బ్రహ్మవిష్ణుర్మహేశశ్చ త్రయో రేఖా ఇతిస్మృతా,
అధో బ్రహ్మాతతో విష్ణుస్తదూర్ధ్వే తు మహేశ్వరః.
త్రిపుండ్రద్వయరంధ్రేషు మధ్యేచిద్రం ప్రయత్నతః.
షణ్ముఖశ్చ గణేశశ్చ త్వధిదేవౌ ద్విరేఖయోః.

మూడురేఖలు క్రిందినుండి పైకి బ్రహ్మ విష్ణుమహేశ్వరులనియు, మధ్య రెండు ఖాళీలు ఒకదానికి షణ్ముఖుడు, రెండవదానికి గణపతి అధిదేవతలు. మఱియు

ఈశానమంత్రముతో శిరస్సునందును, తత్పురుషమంత్రముతో లలాటమందును, అఘోరమంత్రముతో హస్తములందును, వామదేవమంత్రముతో వక్షఃస్థలమందును సద్యోజాతమంత్రముతో ఉదరమందును, భస్మమును ధరించవలయును.

వినా భస్మత్రిపుండ్రేణ వినా రుద్రాక్షమాలయా,
పూజితోఽపి మహాదేవో న స్యాత్తస్య ఫలప్రదః.

విభూతి, రుద్రాక్షధారణ లేనివాడు శివాలయములందు అర్చనచేయరాదు. (త్రిపుండ్రరుద్రాక్షహీనేన శివపూజాం న కారయేత్) అను ప్రమాణములు పెక్కులున్నవి.

## రుద్రాక్షధారణవిధిః

స్కాందపురాణే:-

సూర్యనేత్ర సముద్భూతాః కపిలా ద్వాదశ స్మృతాః,
సోమనేత్రోత్థితా శ్వేతాస్తే షోడశవిధాః క్రమాత్.
వహ్నినేత్రోద్భవాః కృష్ణాః దశభేదా భవంతి హి,
శ్వేతవర్ణం తు రుద్రాక్షం జాతితో బ్రాహ్మముచ్యతే.
క్షాత్రం రక్తం తథా మిశ్రం వైశ్యం కృష్ణం తు
శూద్రకమ్.
విభూవుస్తే చ రుద్రాక్షా హ్యష్టాత్రింశ త్ప్రభేదతః,

శివుఁడు త్రిపురాసురులను జయించు సమయమ్మున నేత్రములనుండి ఉద్భవించిన జలబిందువులు నేలపైబడి రుద్రాక్ష వృక్షములైనవి. సూర్యనేత్రమునుండి కపిలవర్ణముగా పదిరెండురకములు, సోమనేత్రమునుండి తెలుపువర్ణముగా పదియారు రకములు, అగ్నినేత్రమునుండి నలుపు వర్ణముగా పదిరకములు మొత్తము ముప్పది ఎనిమిదిరకములు. తెలుపు బ్రహ్మజాతి, ఎఱుపు క్షత్రియ, మిశ్రమము వైశ్య, నలుపు శూద్రజాతి అని.

జాబాలోపనిషత్తు:-

ధాత్రీఫలప్రమాణం యచ్ఛ్రేష్ఠమేతదుదాహృతమ్.
బదరీఫలమాత్రం తు మధ్యమం ప్రోచ్యతే బుధైః.
అధమం చణమాత్రం స్యాత్ప్రక్రియైషామయో
చ్యతే.

ఉసిరికకాయంత ప్రమాణము ఉత్తమము, రేగుపండంత మధ్యమము. సెనగగింజంత అధమము అనియుచెప్పఁబడినది.

శివధర్మోత్తరే:-

స్నానే దానే జపే హోమే వైశ్వదేవే సురార్చనే.
ప్రాయశ్చిత్తే తథా శ్రాద్ధే దీక్షాకాలేవిశేషతః.
రుద్రాక్షం ధారయేద్విప్ర స్సంధ్యాదిషు చ కర్మసు.

పరాశర సంహిత:-

రుద్రాక్ష ధారణం కార్యం
సర్వం శ్రేయోర్థిభిస్సదైః,
కంఠపాశే శిఖాయాం చ
కర్ణే హస్తేంచ కాదరాత్.
వేదోక్తవర్త్మనా నిత్యం
ఖలు రుద్రాక్షధారిణః,
తేషాం వంశప్రసూతాశ్చ
మునయస్సకలా అపి,
శ్రౌతధర్మపరా శుద్ధాః
ఖలు రుద్రాక్షధారిణః.

సర్వకర్మలయందును రుద్రాక్షధారణ ముఖ్యము, వేయి, ఐదువందలు. మూఁడు వందలు, నూటఎనిమిది రుద్రాక్షలు ధరించవలయును. కంఠమునందు పెక్కుసరము లుండవచ్చును. సిగయందు 1. శిరమున 300, ఈశానమన్త్రముతోను, కంఠమున 32. తత్పురుష మంత్రముతోను. బాహుద్వయమున 16+16 అఘోరమంత్రముతోను, మణికట్టులందు 12+12 హృదయ మంత్రముతోను, స్కంధపథమున 500, యజ్ఞోపవీతముగా 116 ధరించవలయును. రుద్రాక్షలలో 14 ముఖభేదములున్నట్లు, ఒక్కొక్కముఖానికి ఒక్కొక అధిదేవత ఒక్కొక్కవిశేషము ఉన్నట్లు ప్రమాణములున్నవి.

జాబాలోపనిషత్తు:-

ఏకవక్త్రం తు రుద్రాక్షం పరతత్త్వస్వరూపకమ్.
తద్ధారణాత్పరేతత్త్వే లీయతే విజితేంద్రియ.
పంచవక్త్రం తు రుద్రాక్షం పంచబ్రహ్మస్వరూపకమ్
పంచవక్త్రస్స్వయం బ్రహ్మ పుంహత్యాం చ
వ్యపోహతి.
షడ్వక్త్రమపి రుద్రాక్షం కార్తికేయాధిదైవతమ్.
తద్ధారణాన్మహా శ్రీ స్స్యాన్మహదారోగ్య ముత్తమమ్.

ఓం హ్రాం అను మంత్రముతో ఏకముఖి రుద్రాక్షను, ఓం హ్రీం అను మంత్రముతో ద్విముఖిని, ఓం హ్రూం అను మంత్రముతో త్రిముఖిని. ఓం హ్రేం అను మంత్రముతో చతుర్ముఖిని, ఓం హ్రైం అను మంత్రముతో పంచముఖిని ఓం హ్రౌం అను మంత్రముతో షణ్ముఖిరుద్రాక్షను ధరించవలయును. లింగంచదర్శనం పుణ్యం భవేద్రుద్రాక్ష దర్శనం అను ప్రమాణముకలదు.

## దైవత్వము

బెల్లమునుదిని దాని తీపిరుచిజూప
దరమె? తీపి తినినవాని కెఱుకగాని;
దైవరూపంబు జూపింప దరముగాదు
చూచుటకు ప్రయత్నముచేసి చూడవలయు.
పూలమాలలో దారము పొసగినటుల
మాయచే కప్పబడె జగన్నాయకుండు;
పూలు మెల్లగ కదిపినజాలు కనుల
ముందు సాక్షాత్కరించునా పుణ్యతముడు!
పుణ్యపురుషుల ఉపదేశములను వినుచు
వారు నడచిన త్రోవనుబట్టి పోవ
తెలియు దైవమహిమ! గాని కలడొలేడొ
యనువృథాప్రసంగముచేత గనుటయగునె?

— బావిశెట్టి వేంకటరమణమూర్తి.

(16 వ పేజీ తరువాయి)

అపుడు పరమశివుడు లింగోద్భవ మూర్తియై కనిపించి తమ మువ్వురికి గల అభేదత్వమును, పరస్పరావలంబనమునూ నుడివెను. కావున లింగోద్భవమూర్తి స్వరూపమున అగుపడిన పరమాత్ముడద్వైత భావమును ప్రకటించుచూ "ఏకంసత్-విప్రా బహుధావదంతి" అను వాక్యమును రూఢీ పరచుచున్నాడు. అవసరమగునపుడు రూప ధారణముచేసి పరమశివుడు భక్తులను 'ఉద్ధరణ' చేయుచున్నాడు.

లింగము చేతనాచేతన రూపమగు సర్వ పదార్థములను వలయితముచేసి సర్వాధారయై వఱలునది. సర్వకారణమైనది. ఆకాశము లింగస్వరూపమని, భూమి తత్పీఠికయని ఆలయము సర్వభూతములని, లయించుటచే లింగమని అందురు. లింగమునుండి సర్వభూతములుద్భవించినవి. శాంభమైన తేజమే లింగము. అట్టి లింగస్వరూపుని, శివరాత్రినాడు అర్చించిన వారికి మోక్షము కరతలామలకము.

ఆయననర్చించునపుడు సర్వమంగళాలంకృతాకృతిగా ఆయనను భావించి పూజింపవలయును. పార్వతి లేనియెడల 'శివుడే' లేడు. అందరికిని ఐహికాముష్మికముల నిచ్చునది సర్వమంగళయైన పార్వతీదేవి భోగ, మోక్ష, సుఖములను దయచేయును. కావుననే ఆమెకును శివునకునూ అభేదము. శివుడు అర్థనారీశ్వరుడు.

అందువలననే ఆది జగద్గురు శంకరాచార్యులవారు శివుని, పార్వతిని ఒకటిగనే సంభావించి కీర్తించియున్నారు.

'అంభోధర శ్యామలకుంతలాయై
తటిత్ప్రభాతామ్ర జటాధరాయ
దివ్యాంబరాయై చ దిగంబరాయ
నమశ్శివాయై చ నమశ్శివాయ!
ప్రదీప్త రత్నోజ్వలకుండలాయై
స్ఫురన్మహా పన్నగ భూషణాయ
శివాన్వితాయై చ శివాన్వితాయ
నమశ్శివాయై చ నమశ్శివాయ'.

మేఘసదృశమైన వినీలకేశములు కలిగి ప్రక్కనే తామ్రమువలె ప్రజలచే వెలుగు జటాజూటము గలవాడును ఒకవైపు దివ్యాంబరము కలిగి మరొక పార్శ్వమున దిగంబరత్వమును చూపుచున్నవాడునూ ప్రకాశమానమైన రత్నకుండలము లొక వైపు భాసింపగ, మరొకప్రక్క ఘనమైన సర్పహారమును భూషణముగ చేసికొని రాజిల్లుచున్నవాడునూ శివశక్తి యొక వైపును, శివరూపము మరొకవైపును చూపుచున్న పార్వతీ పరమేశ్వర ఏకస్వరూపమునకు నమస్కారము అని ఇంకనూ శ్రీ శివ పరమాత్ముని శ్రీ శంకరాచార్యులు సర్వ మంగళాలంకృతాకృతిగ నుతించి యున్నారు. అట్టి శివస్మరణ నిరంతరము చేయవలెను.

శివరాత్రినాడు అప్రయత్నముగనైననూ తెలియకనైననూ, వ్యాజము చేతనైననూ మేల్కొని శివధ్యానమును చేయుటయో లేక శివపూజ చేయుటయో చేసినవారికి శుభ ఫలితము దక్కును. క్రూరమృగమునకు భయపడి తెలియక బిల్వవృక్షమునెక్కిన శబరుడు వెదజల్లిన బిల్వములు క్రిందనున్న శివలింగముపై పడుటచే అతనికి శివరాత్రి పూజాఫలితము దక్కినది. శివపరమాత్ముని కృపకతుడు పాత్రుడయ్యెను. అట్లుండుటచే భక్తులైనవారు శివుని మనస్సునందుంచుకొని ధ్యానించుచూ శివరాత్రినాడు మేల్కొనియుండి అర్ధరాత్రివేళ ఒక బిల్వదళము చేతనైననూ పూజించుట విధిగా చూచుకొనవలయును.

మఱి శివరాత్రినాడు మాత్రమే ఇంత ప్రాముఖ్యముగా శివపూజ ఏల చేయవలెనని కొందరికి సందేహము కలుగవచ్చును. అంతేకాదు ఇతర దినములలో శివపూజ చేసిన శివకృప కలుగును కదా, అనియు అనుకొనవచ్చును. మనస్సు వికారములకు లోనైనది, చంచలమైనది, దాని భావాదులు చంద్రుని ప్రభావమువలన చాలా వరకు మారుచూవచ్చిన వనుట విదితము. అట్టి మనస్సు చంద్రుని వృద్ధిక్షయములనుసరించి యుండును. కృష్ణచతుర్దశి రాత్రినాటికి మనస్సుపై చంద్రుని ప్రభావము చాల తక్కువగా నుండును. కావున ఆ దినము సాధకుడు మనస్సును నిగ్రహించుటకు ప్రయత్నించిన సఫలీకృతుడు కాగలడు. ఇట్లు ప్రతినెలలోనూ వచ్చు కృష్ణపక్షచతుర్దశి రాత్రియూ 'మాస శివరాత్రి' యని పిలువబడి చంద్రునితనజటాజూటము నందుంచుకొన్న నిర్వికారుడైన పరమశివుని సోమ శేఖరుని ఆనాడు ధ్యానించు వారికి మనోలయము జరుగుటకత్యంతావకాశము కల్గించుచున్నది. ఆనాటి రాత్రి పూర్తిగా అవికారుడైన పరమేశ్వరుని ధ్యానించుట విశేషము. ఈ సాధన మహాశివరాత్రినాడు అనగా మాఘ కృష్ణచతుర్దశినాడు చేసిన వారికి లింగోద్భవమూర్తియగు మహేశ్వరుని కృప అవిచ్ఛిన్నముగ లభింపగలదు.

కావున చంద్రశేఖరుని స్వరూపమును భావించి ఆయనను మహాశివరాత్రినాడు మేల్కొని సన్నుతించుట, మహాఋషులందఱి చేతనూ శుభకరమని నియమింపబడియున్నది. ఈమహాశివరాత్రినాడే హాలాహల భక్షణముకూడా జరిగి, లోకక్షేమము కల్గినది.

— శివరాత్రినాడే శివస్మరణ చేసిన చాలునని ఇందలి అర్థముకాదు. సర్వకాల సర్వావస్థల యందునూ, పరమశివుని ధ్యానించుచూ, మహాశివరాత్రి వ్రతదీక్ష బూని వ్యవహరింపవలయును. అట్లైనచో సంసారబంధముల నుండి ఎల్లరకూ విడుదల లభింపగలదు.






తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# ఉదయాస్తమాన సర్వ సేవా పథకం

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి వారిని సంపూర్ణంగా అర్చించడానికి భక్తులకొక సదవకాశం!

తలుపులు తెరచినప్పటి నుండి తిరిగి తలుపులు మూసేవరకు ఒక దినంలో తిరుమల శ్రీవారి ఆలయంలో జరిగే సమస్త పూజావిధులను అనగా సుప్రభాతం, తోమాల, అర్చన (మూడు పర్యాయాలు) నైవేద్యం ఇంకా ఇతర ప్రత్యేక సేవలను ఉదయాస్తమాన సర్వసేవావిధి పథకం క్రింద భక్తులు తమ పేరిట స్వంత ఖర్చులతో స్వామివారికి జరిపించవచ్చును.

పథకంలోని ముఖ్యాంశాలు :

* కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం పేరిట ఒక లక్షరూపాయల విరాళాన్ని క్రాస్ చేసిన డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా చెల్లించాలి. శుక్రవారం సేవలకు మాత్రం మూడులక్షల విరాళం (అభిషేక నిమిత్తం) ఇవ్వవలసి వుంటుంది.
* భక్తులు తమ కైంకర్యములు జరిపే రోజున ఆరుమంది సభ్యులకు శ్రీవారి దర్శనం వుంటుంది. అనివార్య కారణాలవల్ల కొన్ని సేవలు రద్దుకాని పక్షంలో సుప్రభాతం, తోమాలసేవ, సహస్రనామార్చన, ఏకాంతసేవల వంటి అన్ని పూజావేళలలో శ్రీవారిని దర్శించవచ్చును. (శుక్రవారం తప్పించి)
* కైంకర్యదినాన ఆలయంలోపల దాత పేరు ప్రదర్శింపబడుతుంది. గోత్రాదులతో సహా దాత పేరును శ్రీవారి కొలువులో ప్రకటిస్తారు.
* ఆ దినాన జరిగే ఆర్జిత సేవలన్నింటిని కైంకర్యదాత తనవారితోసహా తిలకించవచ్చును.
* కల్యాణోత్సవంలో శ్రీవారి ఉత్సవమూర్తులకు సమర్పించే శేషవస్త్రాలు మూడింటిలో ఒకదానిని గృహస్థుకు బహూకరిస్తారు. ఉచితప్రసాదంగా 25 లడ్డులను, 5 వడలను ఇస్తారు.
* వస్తువుల ధరలు గణనీయంగా పెరిగిపోయిన పక్షంలో పూజాకార్యక్రమాల అదనపు వ్యయాన్ని దాతలే భరించవలసి వుంటుంది. అందుకు సిద్ధంకానపుడు ఆనాటి అదనపు వ్యయం భర్తీ చేసేందుకు దేవస్థానం మరొకరి విరాళాన్ని స్వీకరించవలసి వస్తుంది. అటువంటి సందర్భాలలో ఒకరు లేదా అంతకు మించిన దాతల పేర్లతో ఆనాటి పూజలు జరుపబడుతవి.
* కైంకర్యములు జరిగే తేదిని గురించిన వివరాలను దేవస్థానం ఆయా దాతలకు తెలియజేయగలదు.

ఈ పథకం గురించిన ఇతర వివరాలకు - వివరణలకు కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి అనే చిరునామాకు వ్రాయండి.

# చిదంబరయాత్ర

— శ్రీ ఎం. సి. శివశంకరశాస్త్రి

ఎంతోమంది ఋషులకు, పుణ్యపురుష లకు, భక్తులకు, మహాభక్తులకు జన్మనిచ్చిన భూమి మన భరతభూమి. మహాభక్తులలో శ్రేష్ఠతముడు నందుడు. నందుడు ఒక హరిజనుడు. ఓ బ్రాహ్మణ యజమాని ఇంట సేవకుడుగా వుండేవాడు.

ఒకనాటి రాత్రి ఓ బ్రాహ్మణ పండితుడు చిదంబరేశ్వరుని మహిమలను గురించి చెబుతూ ఆ పరాత్పరుని ఒక్కసారి దర్శించి ధ్యానిస్తే జన్మ తరిస్తుందని నొక్కి చెప్పగా విన్న నందుడికి ఎలాగయినా చిదంబర యాత్ర చేసి ఆ పరాత్పరుని దర్శించాలనే కోరిక కల్గింది.

వెంటనే బ్రాహ్మణ యజమాని కడకెళ్ళి చేతులు జోడించి నుంచుని "అయ్యా! నటరాజుయొక్క దయ, ప్రేమను గురించి విన్నది మొదలు ఆ స్వామిని దర్శించాలనే కోరిక నాలో నానాటికీ ఎక్కువవుతోంది. నా మీద దయతలచి ఓ మూడు దినములు సెలవిప్పించారంటే వెళ్ళి ఆ పరమాత్ముని దర్శించుకుని వస్తాను" అంటూ వినయంగా పలికాడు నందుడు. "ఏమిటీ! చిదంబరం వెళ్ళి నటరాజును చూచి రావాలనే కోరిక కల్గిందా? నీవెంత? నీ కులమెంత?? ఛం-డా-లు-డా మారు మాటాడక వెళ్ళు" అని కొరడాతీసి కొట్టబోయాడు.

ఆ సమయానికి అక్కడే వున్న ఓ మాల పెద్ద అడ్డొచ్చి "బాబయ్యా! మాకు నట రాజులు, గిటరాజులు ఎందుకు చెప్పండి. మా భూస్వాములే మాకు దేవుళ్ళు. పెట్టినా కొట్టినా మీరే మాదిక్కు" అని ఎంతో బాధగా పలికాడు. "జుట్టు మెలిపెట్టి డొక్కలో పొడిచానంటే కుక్కినపేనులా చచ్చిపడి వుంటావ్" అంటూ పళ్ళు పటపటా కొరికాడు బ్రాహ్మణ యజమాని. "అయ్యా! నేను మీ సేవకుణ్ణి, నా ప్రాణాలు తీయటానికి కూడ మీకధికారం వుంది. కాని నటరాజును దర్శించనిదే నే బ్రతకలేను, దయదల్చి ఓ మూడు దినములు మాత్రమే సెలవిప్పిం చండి" అని కన్నీరు కారుస్తూ ప్రార్ధించాడు నందుడు.

ఇదంతా గమనిస్తున్న మరో బ్రాహ్మణు నికి వొళ్ళుమండిపోయి "ఒరేయ్ నందిగా! దేవుడంటే నీకు చాల విశ్వాసం వుందికదూ?" అన్నాడు కళ్ళెర్రజేస్తూ. భగవంతుడంటే ఎవరికుండదు స్వామీ విశ్వాసం! సర్వశక్తుడు పరమదయాళువు అగు ఆ పరాత్పరుడే నాకు తల్లీ, తండ్రీ" అన్నాడు నందుడు. "ఎంతగా ఎదిగి పోయావురా ఛండాలుడా! నీవు ఛండాలకులంలో పుట్టావన్నది




మాత్రం మరచి పోకు" అన్నాడు విప్రుడు. "అన్నీ ఆ భగవంతునికే తెలియాలి" అన్నాడు నందుడు. "ఆc! అలారా దారికి ఆ భగవంతుడే నిన్ను ఛండాలునిగాను, సేవకునిగాను సృష్టించాడని నమ్ముతావా?" కర్కశంగా పలికాడు బ్రాహ్మణ యజమాని. "ఆ మాయామర్మం ఏమిటోగాని నన్ను నన్నుగా మాత్రం పుట్టించాడా దేవుడు. కామందులవారు కాదనక సెలవిప్పించండి" అంటూ మళ్ళీ దీనంగా ప్రార్ధించాడు నందుడు.



అందుకా బ్రాహ్మణునికి కోపం వచ్చి "ఒరేయ్! మాల మాదిగలకు చిదంబరంతో గాని, నటరాజుతోగాని పనిలేదు. మిమ్మ ల్నెలా పుట్టించాడో, ఎందుకు పుట్టించాడో ఆలోచించుకుని బ్రతకటం మీ ధర్మం" అన్నాడు. "స్వామీ! మీరన్నట్లు నేను దరిద్రుణ్ణి, అజ్ఞానినని నాకుబాగాతెలుసు బ్రాహ్మణుల కొక దేవుడని, మాలల కొక దేవుడని మీ గ్రంథాలు చెబుతాయేమోకాని నాకుమాత్రం తెలియదు. ఏదేలావున్నా యిప్పుడు మీరే మా స్వాములు. ఓ మూడు దినములు సెలవిప్పించారంటే చిదంబరేశుని దర్శించి రాగలను" అంటూ మళ్ళీ పాత పాటే మొదలెట్టాడు.

వీడికెలాగయినా తగిన బుద్ధి నేర్పించా అని నిశ్చయించుకున్న బ్రాహ్మణుడు. "ఒరేయ్ దురదృష్టం చేతనే నీకీ పాడుబుద్ధి పుట్టింది. మన పొలాల్లో ఆరు పొలాలు బాగా పండి కోతకు సిద్ధంగా వున్నాయ్. ఆ ఆరు పొలాల్లోను పంటకోసిన తర్వాత చిదంబరం కాకపోతే కాశికి వెళ్ళిరా" అన్నాడు. వెంటనే కొడవలిచేతబట్టి ఆనందంగా పొలం కేసి వెళ్ళిపోయాడు నందుడు. అక్కడున్న వారందరూ బ్రాహ్మణుని తెలివి తేటలకు నందుని వెఱ్ఱితనానికి ఆశ్చర్యపడ్డారు.

మరుదినం తెల్లవారేసరికి నందుడు దొడ్డి వాకిట యజమాని దర్శనానికై ఎదురు చూస్తూ కూర్చున్నాడు, కొంత సేపటికి యజమాని బయటికొచ్చాడు. నవ్వు ముఖ ముతో నందుడు చేతులెత్తి నమస్కరిస్తూ "స్వామీ! ఆరుపొలాల్లోనూ వరికోత పూర్త యింది. తమరు సెలవిస్తే....! అంటుండ గానే" ఏమిటీ! ఆరుపొలాల్లోనూ కోతపని పూర్తయిందా నా కళ్ళలో దుమ్ముకొట్టి పోదామనుకున్నావా?" అన్నాడాబాపడు. "లేదు బాబయ్యా! నిన్న సరాసరి ఇక్క ణ్ణుంచీ పొలానికేవెళ్ళి పగలు రాత్రీ భగ వంతుణ్ణే ధ్యానిస్తూ కోతపని పూర్తిచేసు కొచ్చాను. అనుమానం వుంటే మీరే స్వయంగా వచ్చి చూసుకోండి" అని చెప్పి బ్రాహ్మణ యజమానిని పొలానికి తీసుక పోయాడు నందుడు.

పొలంవైపుచూస్తే యజమానే దగ్గర వుండి పంట కోయించినట్టుగా వుంది. బాపనికాశ్చర్యంవేసి నందుని ముఖంకేసి తదేకంగా చూశాడు. బాపని మనసు మారి పోయింది. అతనికి కలిగిన ఆశ్చర్యానికి, పశ్చాత్తాపానికి అంతు లేకపోయింది. ఇలాంటి భక్తుడు ఏక్కడా వుండడనుకుని సిగ్గుతో తలవంచుకున్నాడు బ్రాహ్మణ యజ మాని. అల్లంత దూరాన నించున్న నందుడు చేతులు జోడించి ఇక సెలవా స్వామీ అన్నాడు వినయంగా.

ఎప్పుడో ఒకప్పుడు మాలలకూ, బ్రాహ్మ ణులకు వున్న తేడా చూపిస్తానంటూ కోపంతో నందుణ్ణి కొట్టిన రాతిదెబ్బ నందుడి కుడి చెంపమీద స్పష్టంగా కనిపించేసరికి బ్రాహ్మ ణుని హృదయం ద్రవించి "నందా! నా నందా!!" అంటూ ఆనందంగా నందుడి దగ్గరికి నడచాడు. ఎప్పటిలాగే నందుడు అంటరానివాడుగా దూరంగా తప్పు కున్నాడు. "నాయునా నందా! ఇక దూరంగా వెళ్ళకు. నీవంటి మహాభక్తులు ఈ ప్రపంచంలోనే అరుదుగా వుంటారు. ఇన్నేళ్ళుగా ఎన్నెన్నో బాధలుపెట్టి నన్ను కళ్ళు తెరిపించావు. ఇక నన్ను క్షమించు" అన్నాడు బ్రాహ్మణుడు. ఆ పొగడ్తలు విన లేని నందుడు వినమ్రుడై "స్వామీ! భగ వంతుడు దయామయుడు. ఆయన కృపయే ఈ దీనునికి ప్రాప్తించింది. ఇక నాకు సెలవిప్పించ వలసినదిగా ప్రార్థన" అనే సరికి "నాయనా! నీకు సెలవిప్పించడానికి నేనెవణ్ణి. నీ విశ్వాసము, నీ ప్రేమ, నీ సద్వ ర్తనే నిన్ను చిదంబరానికి తీసుకపోతుంది. ఇప్పటికే నీ జన్మ ధన్యమైనది. నీవు నాకు గురుతుల్యుడవు. చిదంబరంలో నీ కొరకే కాక ఈ నిర్భాగ్యుని కొరకు గూడ ఆ పరా త్పరుని ప్రార్థించు." అని కన్నీరు కారుస్తూ నందుని రెండుచేతులూ పట్టుకుని వేడు కుంటూ మనసారా ఒక్కసారి నందుణ్ణి కౌగి లించుకున్నాడు బ్రాహ్మణయజమాని. "స్వామీ! నేను మాలవాణ్ణి" అన్నాడు నందుడు తానంటరానివాడుగా తెలియ జేస్తూ. "నీవు మాలకాదు. ఆ చిదంబరేశుని మెడలో పూమాలవు" అంటూ ఆనంద బాష్పాలు రాల్చాడు బ్రాహ్మణ యజమాని!



---

## పాపలం

పాపలం .... పసిపాపలం
కన్నవారి ముద్దుబిడ్డలం
కలిసిమెలసి ఆడెదం
మనసు విప్పిపాడెదం ........ ॥

తెలుగుతల్లి పిల్లలం
భరతమాత బిడ్డలం
భావి భారత పౌరులం
నవభారత నిర్మాతలం ........ ॥

వయసున మేము పిన్నలం
చదువులు నేర్చెడి బాలలం
ప్రతిభను చూపెడి మిన్నలం
భాస్కరతేజ సమానులం ........ ॥

మాతాపితరుల కన్నులం
గురువులు మెచ్చెడి శిష్యులం
పెద్దలు ప్రేమించెడి పిల్లలం
పురాణపురుషుల వారసులం ........॥

కులమతభేదాల్ మరచెదం
కలతలు మానిమెలిగెదం
స్వార్థం .... విడనాడెదం
మంచిని మమతను పెంచెదం ........॥

— 'కొమరగిరి'

---



# శ్రీనివాసకల్యాణము



(గతసంచిక తరువాయి)

(ఖరహరప్రియ రాగం—జంపెతాళం)

సిరి క్రోధవివశయై చింతాభరాత్మయై
పెరిమ విడనాడి ఎడవీడ బలుకంగా
హరియు కన్నుందమ్ములందు మందస్మితము
నెరయగా, నిటుపల్కె నెనరుట్టిపడగా.

కేశవ:- తరళాక్షి! యీ ముని విధాతృ పుత్రుడుగాడె
వరపౌత్రుడగు మనకు వరతత్త్వవిదుడు
పాపని దొసంగులను సైపరే తలిదండ్రు
లాపగిది నీ మౌని సైపదగు మనకు—

కథక:- హరి యిట్లు పల్కుటయు—

కం. సిరియును కాలి బొటనవ్రేల్
ధరణిన్ రాయుచును, బాష్పధార లురలగా,

లక్ష్మి:- హరి నారాయణ కేశవ
పరమాత్మ ముకుంద మాధవాగోవిందా!.

ఉ. దేవరవారి యోరిమి కిదే నతిసేతును, మౌని త్రుళ్ళరి
డై వెసదన్నెనాకు నెలవైన యురంబది చిత్తగించి మీ
భావము సమ్మతించినను, బాపురె! ఈ పెరవాని కాలితా
కేవముగాదె మానవతి కీ మొగమిచ్చక మేలశ్రీహరీ.

ద్వి. మీసేవ యిన్నాళ్లు చేసినందులకు
దాసురాలికి ఆతతాయి భూసురుని
కాలితాకు లభించె, జాలు పదివేలు
ఏల నాకికతాల్మి? ఏల మీబల్మి?
సిరి భాగ్యవతి యంచు పరివారు మెచ్చ
వరువుగా నిన్నాళ్లు బ్రతికినదాన
నలుగురిలో యెట్లు తలయెత్తి కొందు?
సెలవిందు నాథ! ఈ చింతాభరమ్ము
అవమాన భారము నారి పోవగను
దవుదొల నెందైన తలదాచి కొందు.

కం. తొలి బాముల నేపాపము
సలిపితినో, ఆయఘమ్ము చల్లరగనా
తలపున మీ పదయుగమ్ము
నిలిపి తపము సలిపికొందు నీరజనయనా!

కథక:- అపుడు శ్రీహరి యేమని పల్కుచున్నాడు.

(కాంభోజ—త్రిపుట)

కేశవ:-దేవి! వలదీ యలుక నీ పదసేవకుల దెసదొసగు గల్గిన
కావదగదె దయావిధేయవుకావె సుదతీ ॥ దేవి ॥
నీవు లేని వికుంఠపుర మిది, నీవు విడియని ఎడదనాయది
దీపె లేని గృహమ్ముభాతిని తేజ మెడలున్ ॥ దేవి ॥
శ్రీనివాసుడనైతినీదయ, పూని ప్రోచితి ముజ్జగమ్ములు
వీని కెపుడనపాయినివి నీవేను గదవే! ॥ దేవి ॥
కడలిరాయని కేమిచెప్పుదు? కంజజున కెటు మోము
జూపుదు?
పడతి నన్నెడబాసి చనెనని నుడవగలనా? ॥ దేవి ॥

కథక:- అని యెంత ప్రార్థించినను శ్రీదేవి మానక్రోధమ్ము విడువనేరక ఏమనుచున్నది.

(అఠానా—జంపె)

లక్ష్మి:-ఎందున్ననాథ! యీ యిందిరకు మీ యడుగు
అందె డెందము వియ్యమందు నిది నిక్కువము॥ఎందు॥
దయయుంచి సెలవిమ్ము దాసి మ్రొక్కులు గొమ్ము
జయమగును గాక! నిర్భయము నీ కగుగాక! ॥ఎందు॥

కథక:- అని సెలవంది, భూనీళాదేవులం జేరబిలచి,

లక్ష్మి:-చెల్లియలార; మీవలనసేగి యొకప్పుడు నేనెరుంగ, నా వల్లదొసంగు గల్గిన కృపన్ సయిరింపరె, నన్ను నంపరే! ఎల్లయు దానయై తిరుగు నెల్లపుడుం బలురూపులూని శ్రీవల్లభు, డింతయేమరక వర్తిలుడమ్మ! శుభమ్ముమీకగున్!

కథక:- హరిని వారలకప్పగించి, నిశ్చేష్టుడై తలవాల్చియున్న విభుని దెస కన్నీటితో మరలి కనుంగొనుచు, శ్రీదేవి భూలోకమ్మునకుంజని, అందు కొల్లాపురమ్మున సకలాభీష్టదాయినియై బహుకాలమ్ము వసింపుచున్నంత—

సూత్ర:- అయ్యయ్యో! ఎంతపని జరిగిందంటేనూ! లక్ష్మీనారాయణులకే తప్పలేదే యెడబాటు! ఆ నారదుడు అడుగు పెట్టగానే అనుకున్నాను. ఏదో మునుగుతుందని—

కథక:- ఇందులో నారదుడి దేమున్నదండీ! అంతా ఆ నారాయణమూర్తి లీల తప్పితే, ఆ స్వామి దివ్యచిత్తాన ఎలా ఉందో అలా జరక్కతీరదు. తక్కినవారంతా నిమిత్తమాత్రులు.

సూత్ర:- యీ యాలీమొగుళ్ల కీచులాట బాగానేఉంది; కాని, లక్ష్మి అమ్మవారు వెళ్లిన పిమ్మట స్వామి ఏమిచేశారో?

కథక:- అంతట గోవిందుడు రమాదేవిలేని వైకుంఠంబున నిలువ నొల్లక. కానున్న కార్యంబూహించినవాడై, భూనీళలం బిలిచి, లక్ష్మిని వెదకి క్రమ్మర తెత్తువనియు, అందాక



★ ★

# శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం, తిరుచానూరు

## నిత్యపూజా నివేదనలు

సుప్రభాతం — ఉ. 5-00 గం॥ నుండి 5-30 గం॥ వరకు

సహస్రనామార్చన — ఉ. 5-30 గం॥ నుండి 6-00 గం॥ వరకు

(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు.)

నిత్యఅర్చన — ఉ. 6-00 గంటలకు

(ఏడాదికి రు 150/- లు చెల్లించిన గృహస్థులకు మాత్రమే.)

శుద్ధి, మొదటి గంట — ఉ. 6-15 గం॥ నుండి 6-45 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 6-45 గం॥ నుండి మధ్యాహ్నం 1-00 గం॥ వరకు

శుద్ధి, రెండవగంట — మ. 1-00 గం॥ నుండి 1-30 గం॥ వరకు

సర్వదర్శనం — మ. 1-30 గం॥ నుండి రాత్రి 7-00 గం॥ వరకు

శుద్ధి, రాత్రికైంకర్యము — రా. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు

సర్వదర్శనం — రా. 7-30 గం॥ నుండి 8-30 గం॥ వరకు

ఏకాంతసేవ — రా. 8-30 గం॥ నుండి 9-00 గం॥ వరకు

## శుక్రవారాలలో....

సుప్రభాతం — ఉ. 4-00 గం॥ నుండి 4-30 గం॥ వరకు

సహస్రనామార్చన — ఉ. 4-30 గం॥ నుండి 5-00 గం॥ వరకు

(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు)

నిత్యఅర్చన — ఉ. 5-00 గం॥ నుండి 5-15 గం॥ వరకు

శుద్ధి, మొదటిగంట — ఉ. 5-15గం॥ నుండి 5-45 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 5-45 గం॥ నుండి 7-00 గం॥ వరకు

సళ్ళింపు — ఉ. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు

మూలవర్లుకు అభిషేకం — ఉ. 7-30 గం॥ నుండి 9-00 గం॥ వరకు

(100 రూ. టిక్కెట్‌తో ఇద్దరు వ్యక్తులకు మాత్రమే.)

అలంకారము, రెండవగంట — ఉ. 9-00 గం॥ నుండి 10-00 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 10-00గం॥ నుండి రాత్రి 8-00గం॥ వరకు

ఊంజల్‌సేవ — రా. 7-00 గం॥ నుండి 8-00 గం॥ వరకు

(అద్దాలమండపంలో రు. 150 టిక్కెట్‌తో జరుపుకొనవచ్చును. గృహస్థుకు 5 గ్రాముల వెండి డాలర్ బహూకరిస్తారు.)

రాత్రిగంట — రా. 8-00 గం॥ నుండి 8-30 గం॥ వరకు

ఏకాంతసేవ — రా. 8-30 గం॥ నుండి 9-00 గం॥ వరకు

## ఆర్జితం వివరాలు :

ప్రత్యేక దర్శనం: రూ. 2-00
సహస్రనామార్చన: రూ. 6-50
నిత్యఅర్చన: రూ. 150-00 (ఏడాదికి)
అర్చన: రూ. 1-00
హారతి: రూ. 0-50

పూలాభిషేకం (శుక్రవారాలలో) రూ. 100-00
ఊంజల్‌సేవ (శుక్రవారాలలో) రూ. 150-00
తిరుచ్చి ఉత్సవం: రూ. 63-00
గజవాహనం: రూ. 32-00.

మీరు పార్షదులతో వైకుంఠము గనిపెట్టి యుండుండనియు
జెప్పి వారల వీడ్కొని చనువాడై.

(ముఖారి—ఝంపె)

కేశవ:-ఎదమీది యిందిర ఎడబాయుగాకేమి
హృదయ పద్మము నందు ఇందిరాదేవి
పదిలమై లేదే? నిత్యానపాయిని కాదె?
ఇది జగన్మంగళా స్పద మౌనుగాకేమి ॥ ఎదమీద ॥

కథక:- అని చింతించి-

(సావేరి — ఝంపె)

ఏకతమ్మున వెడలె శ్రీకాంతుడావేళ
వైకుంఠమును వీడి వనమాలి దెసమాలి ॥ ఏకత ॥

పులుగుతత్తడి లేక, చిలువపానుపు లేక
చెలువెసగు వక్షమున కలిమిచెలి లేక ॥ ఏకత ॥

తొలిపల్కుల బరాబరుల సందడులు లేక
నలుకెలంకుల పార్షదుల హళాహళిలేక ॥ ఏకత ॥

వనజజాండము కుక్షి భరియించు తొలివేల్పు
అణువులో అణువగుచు అఖిలమ్ము తానగుచు ॥ ఏకత ॥

ఇట్లు భూలోకమ్మునకుం జని, రమాదేవి, వెండియు తన చెంతకు వచ్చునుపాయమ్ము చింతించుచు, శేషాచలమ్మునకేగి, అది ఏకాంత ప్రదేశమ్మని నిశ్చయించి, అందు వారాహ పుష్కరిణికి దక్షణదిశ యందున్న తింత్రిణీవృక్షమ్ము చెంగటనున్న పుట్టలో సూక్ష్మరూపమ్మునం బ్రవేశించి, అజ్ఞాతమ్ముగా బహుకాలమ్ము గడపెనంతట-

సూత్ర:- చూడుబాబూ! తన భర్త ఇలా బెంగపెట్టుకు, అజ్ఞాతంగా పడివుంటే ఆ ఇల్లాలు లక్ష్మీఅమ్మవారు చూస్తూ ఊరకుందా?

కథక:- ఎందుకు ఊరకుంటుంది! ఏదో కోపంకొద్దీ బయలుదేరి వచ్చిందేగాని, అమ్మవారికి మాత్రం మనసు పీకుతూ ఉండదూ?

సూత్ర:- బాగా చెప్పేవునాయనా! నా ఆయువు కూడా పోసుకు వెయ్యేళ్ళు వర్ధిల్లు. ఆ ఆవిడకు మనస్సు పీకుతూఉన్నా ఆడవాళ్ళకుండే అభిమానం బయటపడ నివ్వదులే; ఏమంటావ్? ఊఁ తరువాత కథకానీ, విందాం-

కథక:- అంతట కొల్లాపురీ మహాలక్ష్మి అమ్మవారు శ్రీమన్నారాయణుని ప్రచ్ఛన్న వృత్తి నెరింగి తానొక గొల్లపడుచు వేషమూని బయలుదేరెనట. ఎటువలెనూ.

(బిలహరి—ఝంపెతాళం)

గొల్లపడుచై తాను కొల్లాపురీ లక్ష్మి
చల్లగొనరోయమ్మ చల్లోయనుచువచ్చె ॥ గొల్ల ॥

దయజిమ్ము కనుదమ్మి కాటుక ముసుంగుతో
మయిజారు కుడియోర పయుట చెరంగుతో ॥ గొల్ల ॥

అలతికవ్వున గవ్వి తెలి పల్వరుసడాలు
తలదుత్తపై బెట్టి తరపిదూడల పాలు ॥ గొల్ల ॥

పావరా సెజ్జపై పాల్కడలి పవళించు
పావనికి బ్రియమైన పాలు పాపహరాలు ॥ గొల్ల ॥

పాలుగొనరోయమ్మ! పాలో యనుచువచ్చె
వెన్నగొనరోయమ్మ! వెన్నో యనుచువచ్చె ॥ గొల్ల ॥

ద్వి. చోళ భూపాలకుం డేలేటి పురమునకు
శ్రీలలన యిటు గొల్ల చేడెయై చనుదేర
కపిలగోవై వచ్చె కమలాసనుడు తాను
త్రిపురాంతకుడు వెల్లక్రేపగుచు తోడరా.

సూత్ర:- ఏమిటీ! బ్రహ్మదేవుడూ శివుడూకూడా చక్కావచ్చారూ! అవునులే, దేవతలందరిదీ ఒకటే పార్టీ.

కథక:- ఇట్లు అజహరులు గోవత్సములై చనుదెంచిన సన్న యెరిగి రమాదేవి కన్నుక్రేవల ప్రియమ్ము దొలక వారల గారవించి, ఆ యావును, దూడను అమ్మ జూపెనట, ఎటువలెను.

(పూరీ కల్యాణి—ఝంపె)

లక్ష్మి:-చోళపురజనులార! సుకృతాత్ములార!
ఆలపాల్దాగివు నిత్యానందులార! ॥ చోళ ॥

నాల్గుచన్నుల ప్రణవనాదాలు జుమ్మనగ
పాల్గురియు నీయావు బహుపుణ్యముల ప్రోవు ॥ చోళ ॥

నొసట మచ్చున్న ఈ పసిక్రేపు గుడుచుపై
నిసువులు పాల్దాగివ విసమే యరిగిపోవు ॥ చోళ ॥

కొలువుండు నమ్మ ఈ గోవు ముఖమ్మున వాణి
విలసిల్లు నీ కోడె కలగలిసి శర్వాణి ॥ చోళ ॥

ఈ వత్సతరి రొక్క మిచ్చి కొనరారయ్య
శ్రీవత్సలాంఛనుని సేవించుకొనరయ్య ॥ చోళ ॥

కథక:- అంతట చోళరాజు దేవేరి తన బిడ్డ పాలకోసమై ముచ్చటపడి అడిగిన రొక్కమిచ్చి, ఆ యావును దూడను కొనినంత, రమాదేవియు సంతసించి, ఇంక శేషాచలవాసునకీయావు పాలొసంగి అకలి దీర్చుంగదా యని యథేచ్ఛం జనియె.

సూత్ర:- ఎంత పుణ్యాత్మురాలయ్యా ఆ రాణి! చతుర్ముఖుణ్ణీ త్రిలోచనుణ్ణీ తన కొట్టంలో కట్టి వేసుకొన్నది కదయ్యా!

కథక:- అవును, అదృష్టమంటే అలా కలసివచ్చిందే మరి!

సూత్ర:- బాగా చెప్పేవు, చూడు బాబూ! నీ పేరేమిటో చెప్పేవు కావు,

కథక:- ఏడుకొండల వాని పేరేనండి వేంకటరమణమూర్తి.

సూత్ర:- నాయనా! వేంకటరమణమూర్తీ! ఆ రాణి తన బిడ్డ కోసమని అవునంతముచ్చటపడి కొనుక్కొంది కదా! మరి ఆ పుట్టలో నారాయణమూర్తి పొట్ట యెలా నిండుతుందంటావు?

(సశేషం)

# తిరుమల యాత్రికులకు సదుపాయములు

* * *

* అన్ని వర్గాలవారికి అందుబాటులో ఉండేటట్లు ఉచిత, పరిశుభ్రమైన సత్రాలు, లేదా సరసమైన రేట్లకు కాటేజీలలో ఆవాస సౌకర్యం.
* శ్రీవారిని దర్శించు యాత్రికుల క్యూషెడ్లలో గాలి, వెలుతురుగల విశాలమైన ఏర్పాటులు.
* క్యూ షెడ్లలోనే కాఫీబోర్డువారి అల్పాహార సదుపాయం.
* సరసమైన ధరలకు అన్నపుపొట్లాల అమ్మకం.
* యాత్రికులు వెలుపలకు రానక్కరలేకుండా క్యూలదగ్గరే మరుగుదొడ్డి సౌకర్యం.
* ఆంధ్రప్రదేశ్ పాలసరఫరా సంస్థచే స్వచ్ఛమైన పాలవిక్రయం.
* యాత్రికులు చదువుకునేందుకు దేవస్థానం ముద్రిత గ్రంథాలు. స్వామివారి, అమ్మవారి చిత్రపటాల అమ్మకం.
* క్యూలోని యాత్రికులకు విసుగులేకుండా ఉండేందుకు టెలివిజన్ ప్రదర్శనం, భక్తిసంగీత ప్రసారం.
* క్యూషెడ్లలోను, తిరుమలకుపోవు కాలిబాట 7 వ మైలువద్ద వైద్యసదుపాయం.
* సామానులు, పాదరక్షలు భద్రపరచుకొనేందుకు ప్రత్యేక సౌకర్యం.
* తిరుమలలో సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసునుండి వివిధప్రాంతాలకు ఆటో సౌకర్యం.

## ఉచిత బస్సుసదుపాయం

* దళారీలనుండి వంచకులనుండి తప్పించేందుకు ముఖద్వారంలో పేష్కారుస్థాయి అధికారి సిబ్బంది.
* క్యూషెడ్లలోని యాత్రికుల ఫిర్యాదులు విచారించేందుకు కావలసిన సౌకర్యములకుగాను పేష్కారు స్థాయిలో మరొక అధికారి, సిబ్బంది.
* యాత్రికుల సామానులను భద్రంగా తిరుమలకుచేర్చే సౌకర్యం ఏర్పాటైంది. తిరుపతిలో ఏ సత్రములో నైనాగాని, టోల్ గేట్ వద్దగాని తమసామాగ్రి అప్పగించి రసీదుపొంది ఆ రసీదు తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీస్ దగ్గర కౌంటర్ లో ఇచ్చి సామాగ్రి పొందవచ్చును.
* దుండగులనుండి యాత్రికులను కాపాడేందుకు, తిరుమలకు వెళ్ళే దోవపొడుగునా రాత్రింబవళ్ళూ పోలీసు గస్తీ ఏర్పాటుచేయబడింది.
* దారిపొడుగునా మంచినీటి సదుపాయం ఉన్నది.
* రాత్రిపూటగాని, తెల్లవారుఝామునగాని కొండకు వెళ్ళదల్చుకొన్న వారికి వీలుగా మంచికాంతి శక్తిగల దీపాలు ఏర్పాటైనవి.
* వివిధప్రాంతాలనుండి వచ్చేయాత్రికులకు బోధపడేందుకుగాను తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసులో, దేశంలోని ముఖ్యభాషలలో విచారణ కార్యాలయాలు.
* ప్రత్యేక కాటేజీలలోని అదనపు సౌకర్యాలు అంజనాద్రినగర్, శేషాద్రి, గరుడాద్రి, శంకుమిట్ట కాటేజీలలో కూడ ఏర్పాటైనవి.




(ఆకాశంలో ఎగిరిపోతూ రెండు పక్షులు మానవభాషలో మాట్లాడుకొంటూ పోతున్నట్లు - గాలి జోరుగావీస్తున్నట్లు - పక్షుల రెక్కల చప్పుడు ఆ గాలికి శ్రుతి పలుకుతున్నట్లు)

ఒకటోపక్షి: అటు చూడు ! ఆ కోటపైన చంద్రకాంత శిలావేదిక మీద చల్లని వెన్నెట్లో విశ్రాంతి తీసుకొంటున్న వారెవరో గుర్తుపట్టావా ?

రెండోపక్షి: తెలియకేం ? జానశ్రుతి మహారాజు. మహావృష సామ్రాజ్యానికి ప్రభువు. ఆయన పేరుప్రతిష్ఠలు అదివరకు విని వున్నాం. ఎన్నో దాన ధర్మాలు చేసి పేరెన్నికగన్న ఏలిక అతడు.

ఒకటోపక్షి: ఆయన చేరువుగా ఎగురుకుంటూ పోదాంపద.

రెండోపక్షి: ఓ భల్లాక్ష ! గబ్బిలాయిలాగా జానశ్రుతి కీర్తిప్రకాశానికి చేరువుగా అలా ఎగురుకొంటూపోతే భస్మం అయిపోతావు జాగ్రత్త ! జానశ్రుతి ఎన్నో ధర్మశాలలు, విశ్రాంతి గృహాలు నడుపుతూ వుంటాడు. ఇతనితో సరితూగే భూరి దానాలు చేసే ధర్మప్రభువు ఈ లోకంలో మరొకడు లేడని గుర్తించు.

ఒకటోపక్షి: (హేళనగా పకపకానవ్వి) ఏమిటోయ్ ! ఎందుకు నన్నలా భయపెడుతావు ? మనం ఎల్లప్పుడూ ఆకాశంలో విహరించే వాళ్ళం. మనకు ఈ లోకపుపోకడ బాగా తెలుసు. జానశ్రుతిలో ఏ గొప్పతనాన్ని చూచి అలా అతన్ని పైకిఎత్తేస్తున్నావు ? ధర్మశాలల్లో, అన్నసత్రాల్లో అన్ని వేళలా అతిథులకు సౌకర్యాలు, భోజన సదుపాయాలు ఈ రాజు ఏర్పాటుచేస్తున్నాడు. సరే ఇవన్నీ ఏ భావంతో చేస్తున్నాడో నీకు తెలుసా ? ఇంత చేస్తున్నా జానశ్రుతి మనస్సు నిర్మలంకాలేదు. తానేదో చాలా సాధించాననే దర్పం, గర్వం ఇతనిలో ఆవరించివున్నాయి. తనను పోలిన ధర్మదాత ఈ లోకంలో మరొకడు లేడనే అహంభావం ఇతని హృదయంలో నిండివుంది. అందుకనే వితరణ మూలాన సంభవించే సత్ఫలితాలన్నిటినీ సరిగ్గా అనుభవించలేకుండా వున్నాడు. మానసికంగా ఎదగలేదు. ఆధ్యాత్మికపు అనుభవానికి సన్నిహితంగా రాలేదు.

రెండోపక్షి: అయితే లోకంలోవున్న ప్రతిష్ఠకు; మనుష్యుల అంతరంగంలోవున్న యదార్థస్థితికి అంత తేడా వుంటుందన్న మాట. ఆధ్యాత్మికానుభవంతో ప్రశాంతమైన అంతరంగం గల వ్యక్తులెవరైనా నీకు తెలుసా ?

**ఒకటోపక్షి :** ఆఁ! తెలుసు. బండితోలుకొంటూ బ్రతికే ఆత్మజ్ఞాని రైక్వుడు. ఆ మహానుభావునితో పోలిస్తే ఈ జానశ్రుతి ఏ స్థాయిలో వున్నాడో మనకు బోధపడుతుంది. కేవల దానధర్మాలతో విరామం లేకుండా జానశ్రుతి వుండటానికి మూల కారణం కీర్తికాంక్ష. అంతే. అతడు చేసే సత్కర్మలన్నీ కీర్తికామనా దూషితాలు. ఇక రైక్వుడో! ఉన్నచోటనేవుండి అన్నీ సాధించుకొంటున్నాడు. ఆత్మానుభవంతో విరాజిల్లుతున్నాడు. తన వృత్తి మానుకోలేదు. వైరాగ్యం అంటూ సమాజానికి దూరంగా పోలేదు. తన నిర్మల నిర్లిప్త జీవనానికి స్వస్తి చెప్పలేదు. అతనికి గతాన్ని గురించి చింతలేదు. భవిష్యత్తును గురించి ఆరాటంలేదు. చెప్పుఇప్పుడు ఎవరు గొప్పవారంటావో?

**రెండోపక్షి:** నిశ్చయంగా రైక్వుడే! రైక్వుడే!

**ఒకటోపక్షి:** ఇక మనం తూర్పుకు ఎగురుకొంటూ పోదాంపద.

(అంతరిక్షంలో దూరదూరంగా ఆపక్షులు ఎగిరిపోతూ వెళ్తున్నట్లు)

**జానశ్రుతి:** ఏమిటీ పక్షుల సంభాషణ తీరు. 'నిశ్చయంగా రైక్వుడే! రైక్వుడే!' ఈ మాటలే నాగుండెలో ప్రతిధ్వనిస్తున్నాయి. రానురాను రాత్రి ప్రపంచాన్ని అంతటినీ చీకటి తెరలతో కప్పేస్తోంది. అయినా నిద్రపట్టడంలేదు. రైక్వుణ్ని గురించిన చింతనలతో రాత్రి గడిచిపోయింది. తూర్పుతెగురువారుతున్నది. ఉషస్తేజం విరాజిల్లుతున్నది. (ప్రభాత భేరీ నినాదం. ప్రాతఃకాలాన్ని సూచించే భూపాలరాగంతోవేణునాదం)

**వైతాళికులు:** మేలుకో! మహారాజా! మేలుకో! శత సహస్రానికి హస్తాలతో లోకానికి దానాలందించే ధర్మప్రభూ! మేలుకో! తూర్పున సూర్యుడు ఉదయిస్తున్నాడు. అతని కిరణాలు నీ కీర్తి తేజంలా విరజిమ్మబడుతున్నాయి. దేశదేశాలనుండి నీ దానాలు అందుకోడానికి జనాలు వస్తున్నారు. మేలుకో.

**జానశ్రుతి:** వైతాళికులారా! ఆపండి ఆ పొగడ్తలు. ఇంతవరకు నేను చాలా గొప్పవాడిననీ, ధర్మదాతననీ విర్రవీగాను. నా కన్నా మించినవాడు ఒకడున్నాడని తెలిసింది. ప్రస్తుతం మీరు నా ముందు నుండి వెంటనే వైదొలగండి.

(పిలిచేగంటి మోగించిన చప్పుడు)

**జానశ్రుతి:** ఎవరక్కడ?

**రాజభటుడు:** నేను ప్రభూ! ఏమిసెలవు.

**జానశ్రుతి:** నేను ఏలుబడి సాగిస్తున్న మహావృష సామ్రాజ్యంలో అంతావెతికి రైక్వుడనే వానిని గుర్తుపట్టి రావాలి. ఎక్కడున్నాడో మరి! ఆ మహాత్ముని దివ్య దర్శనభాగ్యం కలిగేవరకు నా మనస్సుకు స్థిమితంలేదు. నా ఆందోళనలకు అంతం లేదు. వెళ్ళు.

**రాజభటుడు:** సరే! వెళ్తున్నాను. (తనలో) రాజుగారి ఆజ్ఞవింతగా వుంది. అయినా రాజాజ్ఞ. (రాజభటుడు వెళ్ళినట్లు కొంత వ్యవధి).

**రాజభటుడు:** అబ్బ! మహావృష సామ్రాజ్యంలో ఎంతవెతికినా కన్పించడేం రైక్వుడు. ఈ అప్రసిద్ధుడైన వానిపట్ల ఎందుకో రాజుగారికి అంత శ్రద్ధ. ఏ విశేషంవుందో అతనిలో, ఏ పుట్టలో ఏ పామువుందో ఏమో! అనేక గ్రామాలు వెతికాను. అనేక పట్టణాలు కలయ చూచాను. రైక్వుని జాడ ఇంతవరకు తెలియలేదు. ఇప్పుడిప్పుడు త్వరలో అతడు కన్పిస్తాడనిపించి మంచి శకునాలు అడుగడుగనా అగుపడున్నాయి. ఇదేదో చిన్నారిపల్లె, అటు ఎవరో వెళ్తున్నారు. అడుగుతాను. చూడండి! ఈ ఊళ్ళో రైక్వుడనే వ్యక్తి ఎవరైనా వున్నారా?

**దారినపోయేవాడు:** లేకేం. ఆయనది మా ఊరే, అలా అటుపోతే చెరువు వస్తుంది. ఆ చెరువు గట్టుమీదగా తూర్పుదిక్కుగా వెళ్తే అతడు వుండేచోటు వస్తుంది.

**రాజభటుడు:** చాలా సంతోషం. (రాజభటుని అడుగులచప్పుడు)

**రాజభటుడు:** ఎవరబ్బా అక్కడ బండిక్రింద కూర్చొన్నవాడు? ఆయనే రైక్వుడై వుంటాడు. (దగ్గరగా వెళ్ళి) అయ్యా! మీరేనా రైక్వుడంటే?

**రైక్వుడు:** ఆఁ! అవును నేనే. ఏంకావాలి?

**రాజభటుడు:** మా జానశ్రుతి మహారాజులుంగారు మీ జాడ కనుక్కొని రమ్మన్నారు. మీ కోసం దేశంలో చాలాచోట్ల వెతికాను. చివరకు మీ దర్శనం అయింది.

**రైక్వుడు:** మహారాజుగారికి నాతో ఏంపని?

**రాజభటుడు:** మహాత్మా! నీకు ఆ పని ఏమిటో తెలియదు. రాజాజ్ఞ శిరసావహించి మిమ్మల్ని వెతికాను. కనుక్కున్నాను. అంతే, ఇక తిరిగివెళ్ళి రాజుగారికి చెప్పాలి ఈ వార్త, సెలవు ఇప్పించండి వెళ్తా.

**రైక్వుడు:** సరే. (రాజధానికి తిరిగి రాజభటుడు వెళ్ళడం. రాజభవనం వీణా వాదన ధ్వని)

**రాజభటుడు:** జయము జయము మహారాజా! మీరు ఆజ్ఞాపించిన రీతిగా రైక్వుణ్ని ఒక మారుమూల పల్లెలో కనుక్కోగలిగాను.

**జానశ్రుతి:** రైక్వుడెలావుంటాడు? ఆయనలో ప్రత్యేకత ఏమిటి?

**రాజభటుడు:** అతడు బండి తోలుకొంటూ కాలక్షేపం చేసే నిర్లిప్తజీవి. నిరంతరం కళ్ళల్లో శాంతితేజం తొణికిసలాడుతున్న మహానుభావుడు.

**జానశ్రుతి:** త్వరగా వెళ్ళి నా ఆజ్ఞగా సేనానికీ, మహామంత్రికీ చెప్పు. సపరివారంగా వెళ్ళిత్వరలో రైక్వుని దర్శనం చేసుకొని రావాలి. అన్ని ఏర్పాట్లు త్వరలోనే జరిగిపోవాలి. (ఏర్పాట్ల హడావడి, పరివారంతో రైక్వుని వద్దకు రాజు బయలుదేరి వెళ్తున్నట్లు).

**రైక్వుడు:** ఏమిటో ప్రశాంతమైన ఈ చిన్నారి గ్రామంలో ఈ రాజ పరివార సంరంభం. రథాలు నడుపుకొంటూ వచ్చేవారు, గుర్రాలపై స్వారీ చేసుకొంటూ వచ్చే రౌతులు, ఎంత హడావిడి! అడుగో! మహారాజుకూడా వెనుక వస్తున్నాడు. ఏదో బలవత్తరమైన కారణం వుంటేగాని ఈ యాత్రచేసి వుండడు. సరే చూద్దాం. (మహారాజుకు జయ జయధ్వానాలు. రైక్వునికిదగ్గరకు చేరుకొన్న తర్వాత).

**రాజపరివారం:** (అందరూకలిసి) జయము జయము రైక్వా!

**జానశ్రుతి:** మహానుభావా! రైక్వా! ఇవిగో మా ప్రణామాలు.

**రైక్వుడు:** ఏం మహారాజా! ఇలా విచ్చేశారు?

**జానశ్రుతి:** మహాత్మా! ముందు నేను మీకు సమర్పించుకొనడానికి తెచ్చిన ఈ విలువైన కానుకలు స్వీకరించండి.

**రైక్వుడు:** ఎందుకు నాకీ కానుకలు. అసలు మీకు ఏంకావాలి? మీ హృదయంలో మసలుతున్న ఆకాంక్ష ఏమిటి?

**జానశ్రుతి:** స్వామీ! చేతులు జోడించి అడుగుతున్నాను. ఒకసారి మేడమీదకూర్చొని విశ్రాంతి తీసుకొంటూ వుంటే ఆకాశంలో పక్షులు సంభాషించుకొంటూ ఎగురుతూ పోతున్నాయి. పక్షిభాష తెలిసిన నాకు వాటి సంభాషణ అర్థమైనది. అవి మీ మహత్త్వాన్ని గురించి పొగిడాయి. ఆ నాటినుండి మిమ్మల్ని చూడాలనే కోరిక అగ్నికీలయై నన్ను కాల్చసాగింది. ఇప్పటికి నా జన్మ ధన్యమైంది. నేను అందించే కానుకలు స్వీకరించండి. నాకు కావాల్సినది ఆనందప్రాప్తికి హేతువైన తత్త్వజ్ఞానం, దానిని బోధపరచండి. నన్ను కృతార్థుణ్ని చెయ్యండి.

**రైక్వుడు:** ఓయి రాజా! ఈ కానుకలకు ఆత్మజ్ఞానానికి పొత్తు ఏముందంటావ్? బండితోలి సంతృప్తిగా బ్రతుకుతూవుండే నాకు కొత్త అవసరాలేంలేవు. అయినా ఈ విలువైన వస్తువులను ఇక్కడకుతెచ్చి వాటివల్ల నా వద్దనుండి ఆత్మజ్ఞానం కొందామనుకోవడం అవివేకం. అమూల్యమైన కానుకలతో, రాజ్యవైభవాలతో ఆత్మజ్ఞానాన్ని కొనలేవు. రాజా! ముమ్మాటికీ కొనలేవు. ఆత్మజ్ఞానం వ్యాపార దృష్టికి అందదు. అది విపణివీధిలో అమ్ముడుపోయే వస్తువుకాదు. ఈ కానుకలనన్నిటినీ నావద్దనుండి తొలగించి తీసుకొనిపో.

**జానశ్రుతి:** రైక్వా! మీ మందలింపు వ్యాకులకు నా మనస్సు చివుక్కుమన్నది. అయినా మీ నిరసనకు నేను అర్హుణ్ని. భౌతిక సంపదలకు ఆకర్షింపబడని మీ మహోన్నతహృదయ స్థితికి జోహరులు. ఆత్మానుభూతికి మార్గం ఏమిటి? నేనేం చెయ్యాలి?

**రైక్వుడు:** మహారాజా! సాధనచెయ్యాలి. మథన పడాలి. సాధనా పరితప్త హృదయంలో మార్పువస్తేగాని ఆధ్యాత్మికానుభూతి లభించదు.

జానశ్రుతి: మహాత్మా! ప్రస్తుతానికి సెలవు. నా హృదయం పరిపక్వం అయినప్పుడే నన్ను కటాక్షిద్దురుగాని లెండి. ఆక్షణం త్వరలోనే రావాలని ఆకాంక్షిస్తున్నా! ఆశీర్వదించండి, (మహారాజు తన పరివారంతో తిరిగి పోవడం. కొంత కాలవ్యవధి).

జానశ్రుతి: రైక్వులవారు చెప్పింది అక్షరాలా నిజం. నా ఐశ్వర్యం నాకు ఉన్నతమైన అనుభూతులను ఇవ్వనేఇవ్వదు. నా గుండెలోమార్పు నాకు అన్నీ కూర్చిపెడుతుంది. నా మనస్సులోని పరిపక్వత నా వ్యక్తిత్వానికి పుష్టికూర్చుతుంది. ఆధ్యాత్మికానుభూతి పొంది మనోనిశ్చలతను సాధించుకొనడానికి ఇదే మార్గం. ప్రస్తుతం ఇన్నాళ్ళుగా నేను పడ్డ మథనకు ఫలంగా నా హృదయం నిర్మలంగా వుంది. రైక్వమహాశయుని మళ్ళీ దర్శించాలి. ఈ సారి ఆయన వద్దకు అట్టహాసంగా ఆడంబరంగా వెళ్ళను. నిర్లిప్త హృదయంతో వినమ్రంగా రైక్వుని వద్దకు వెళ్ళ జ్ఞాన భిక్ష పెట్టమని అడుగుతాను. (మహారాజు ప్రయాణాన్ని సూచించే గుర్రపు డెక్కల చప్పుడు).

రైక్వుడు: ఏం మహారాజా! మళ్ళీవచ్చావు. నీ ముఖం నిర్మలంగావుంది. ఆత్మజ్ఞానానికి పొందడానికి నువ్వు అర్హత సాధించి కొన్నట్లు అన్పిస్తోంది.

జానశ్రుతి: స్వామీ! ఎంతో మథనపడ్డాను. మనస్సుకు ప్రస్తుతం నైర్మల్యం, స్థిరతా వచ్చాయి. నన్ను శిష్యుడిగా స్వీకరించండి.

రైక్వుడు: సరే! అలా లేడి చర్మంమీద దగ్గరగా కూర్చో. కొన్ని విషయాలు వివరిస్తా.

జానశ్రుతి: అలాగే! ధన్యుడ్ని.

రైక్వుడు: జానశ్రుతీ! ముందు నువ్వు చేసిన దానాలను గురించి దానివల్ల నీకు వచ్చిన మానసికదోషాలను గురించి చర్చిస్తాను. నువ్వుచేసే దానాలకు గర్వపడటం ఎంత అవివేకం! గర్వంతో దర్పంతో ఇందతా నా ప్రయోజకత్వమే అని ఏ పనీ చెయ్యవద్దు. అంటే కర్తవ్య దృష్టితో నిష్కామంగా నిర్మలంగా పనులు చెయ్యాలి అన్నమాట. అంతా నా ప్రయోజకత్వమే అనే ఊహ అహంకారాన్ని పుట్టిస్తుంది. అది ఆత్మ వినాశనానికి దారి.

జానశ్రుతి: నా హృదయంలోని ఆవేదన వల్ల ఆర్తివల్ల ఇలాంటి విషయాలు నాకు ఒక్కొక్కటే స్ఫురించడం ప్రారంభించాయి. మీ మాటలు నాలో వాటికి స్థిరత కూర్చుతున్నాయి. ఇంకా వివరించండి.

రైక్వుడు: రాజా! నీకు కలిగింది అందరికీ దానంఇవ్వు. కాని కేవల కీర్తికాంక్షతో మాత్రం ఆ దానాలు చేయడం శ్రేయస్కరంకాదు. నీ సంపత్తిని ఎవరికో ఇస్తున్నాననే భావంతో దానాలు చెయ్యవద్దు. ఈ సంపత్తి అంతా సర్వవ్యాపకమైన ఆత్మకు చెందినది. ఆ ఆత్మతత్త్వంలో నేనున్నానని, ఇది మళ్ళీ ఆ ఆత్మతత్త్వానికే చెందుతుందని ఏదైనా ఎవరికైనా ఇచ్చావనుకో, అప్పుడు అహంకార భావం వుండదు. తెరిపిగా వుంటుంది. కర్తవ్యాన్ని నిర్వహించినట్లు సంతృప్తిగా వుంటుంది. దానివల్ల ఆత్మానందం లభిస్తుంది. అప్పుడు ఆత్మతృప్తుడవు అవుతావు. ఇదీ మార్గం. మనం చేసే ఏ పనిలోనైనా నిర్వహణలో నిర్మలత సాధించుకొనడం ద్వారా ఆత్మానుభూతికి పయనించడం అనేది ఒక తిన్ననైన బాట.

జానశ్రుతి: మహాత్మా! మీ మాటలవల్ల నాకన్నీ కరతలా మలకమౌతున్నాయి. వెలుగు సముద్రంలో ఈదులాడుతున్నట్లువుంది. ధన్యమైనది నాజన్మ.

❋

# ధర్మరక్షణ కార్యక్రమాలు

## " గీతాజయంతి "

తిరుమల తిరుపతి దేవస్థానం హిందూ ధర్మరక్షణ సంస్థ విజయవాడవారి ఆధ్వర్యంలో పూర్ణానందంపేట శ్రీ దాసాంజనేయ స్వామి కోవెలలో డిసెంబర్ 24, 25, 26 తేదీలలో గీతాజయంతి మహోత్సవములు వైభవముగా నిర్వహింపబడినవి.

ప్రతిరోజు నగర సంకీర్తన గీతాచార్యుల పూజ, సామూహిక గీతాపారాయణ కార్యక్రమములు ఉదయంపూట జరుపబడగా, సాయంత్రం బ్రహ్మశ్రీ వెంపటిలక్ష్మీ నారాయణశాస్త్రి, శ్రీ ఆచార్య యస్. వి. యల్. నర్సింహం శ్రీమతి టి. కె. చూడామణి గీతోపన్యాసములు భక్తులను రంజింప జేసినవి.

తొలుత ఈ కార్యక్రమాలను శ్రీ పులిపాటి వేంకటేశ్వరరావుగారు ప్రారంభించి యున్నారు. విజయవాడలోని స్థానిక పాఠశాల విద్యార్థినీ విద్యార్థులకు గీత సాంఖ్య యోగం స్థితప్రజ్ఞ లక్షణములపై పోటీ నిర్వహింపబడినది. ఈ పోటీలో 54 మంది పాల్గొన్నారు. స్థానికపాఠశాల అయిన సత్యనారాయణపురం శిశువిద్యా మందిరం ప్రాథమిక పాఠశాల, ఉన్నతపాఠశాలకు చెందిన విద్యార్థులు ఎక్కువ పాల్గొన్నారు.

ఈ పాఠశాల విద్యార్థులు మూడు వర్గాలలో పాల్గొని బహుమతి పొందినవారు. యు. కామేశ్వరశర్మ, వి. బాలకృష్ణ, కె. బి. వి. ఎస్. రామకృష్ణప్రసాద్, భాస్కర శర్మ, శ్రీనివాస్, యు. లక్ష్మణసూరి, జి. ఎస్. చక్రవర్తి. ఉయ్యూరు పాఠశాలకు చెందిన పి. శ్రీనివాసరావు, వేరొక విద్యార్థిని వి. దుర్గమ్మ బహుమతులు పొందిరి. ఆంధ్రపత్రిక ఉపసంపాదకులు శ్రీ డి.యం. కె. గాంధి బహుమతి ప్రదానము చేశారు. చాలామంది భక్తులు ప్రతిదినము పాల్గొని కార్యక్రమములు జయప్రదంచేశారు.

## వరంగల్

1982 డిసెంబర్ 16 వ తేదినుండి వరసగా నెల దినములు వరంగల్ గీతా భవనంలో ధనుర్మాసోత్సవములు, గీతాసేవా మహిళా మండలి నిర్వహణలో శ్రీమాన్ ముడుంబై రామానుజాచార్యులు (వ్యవస్థాపకులు గీతా ప్రచారక పరిషత్) అధ్వర్యంలో జరుపబడినవి.

సంప్రదాయ పరంపరగా అవిచ్ఛిన్నముగావస్తున్న ఈధనుర్మాసోత్సవములను, వరంగల్ నగరంలో హిందుధర్మ రక్షణసంస్థ వ్యవస్థాపకులలో ఒకరైన శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వాములవారు 1956 లో ప్రారంభించి యున్నారు. నాటినుండి ఈ ఉత్సవములను గీతాసేవా మహిళామండలివారు మిక్కిలి క్రమశిక్షణతో జరిపించుచున్నారు.

గీతా భవనమునందు శ్రీ పార్థసారధి స్వామివారి మహామండపమునందు, నిత్యము ఉదయం 6 గంటలనుండి వరసగా 12 గంటలవరకు నిర్ణీత కార్యక్రమములను ఏర్పాటు చేయుట జరిగినది.

సుప్రభాత గోష్ఠి తర్వాత నిత్యారాధనాదికము. శ్రీ విష్ణుసహస్రనామస్తోత్ర సమష్టి పారాయణము తిరుప్పావై దివ్య ప్రబంధ సమిష్టి సేవాకాలము లక్ష్మి కృష్ణాష్టోత్తర సమష్టిఅర్చనా వైభవము, శ్రీ కృష్ణ శ్రీ ఆండాళ్‌యొక్క తిరునామసంకీర్తనము మంగళహారతులు తీర్థప్రసాద గోష్ఠి.

సాయంత్రం 5 గంటలనుండి 7–30 గంటలవరకు కవిశాబ్దిక కేసరి శ్రీమాన్ విద్వాన్ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యస్వామి వారిచే తిరుప్పావై దివ్య ప్రబంధ కాలక్షేపము జరుపబడినవి.

## ముక్కోటిఏకాదశి

ముక్కోటి ఏకాదశిరోజు ఉదయం 5 గంటలకు జరిగిన ద్వార దర్శనమునకు నగరం నలుమూలలనుండి విచ్చేసిన సేవార్థుల సందడితో మందిరం కిటకిటలాడినది. ప్రతి కుటుంబము తమ తమ గోత్రనామములతో పూజలను జరిపించుకొని సమష్టి భగవన్నామ సంకీర్తన వైభవములో చేరి, తీర్థప్రసాదాదులను స్వీకరించి ఆనందించిరి.

## గీతాజయంతి

ఇదే ఏకాదశిరోజున "గీతా జయంతి" కార్యక్రమము సమష్టిగా 18 అధ్యాయములు గీతా పారాయణము, గీతా ప్రచారక పరిషత్ వ్యవస్థాపకులు శ్రీమాన్ ముడుంబై రామానుజాచార్యులవారి ఆధ్వర్యములో జరుపబడినది. ఇందు ప్రస్ఫుటముగా అధ్యయనము చేయగలిగిన స్త్రీ-పురుషులు విశేష సంఖ్యలో పాల్గొనిరి.

గీతా హవనాదినము బాలబాలికలకు గీతా పోటీ పరీక్షలు పండితోపన్యాసములు చక్కగా జరిగినవి.

గీతా పోటీ పరీక్షలలో పాల్గొన్న స్థానిక గీతా విద్యాలయ బాలబాలికలకు తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మప్రచారమును దృష్టిలో నుంచుకొని "భర్తృహరిసుభాషితములు" అనే గ్రంథములను బహుమతులకై పంపించియుండిరి.

డా॥ యస్. పద్మనాభాచార్యగారి అధ్యక్షతన శ్రీ న. చ. రఘునాథాచార్యులవారు, శ్రీ ముడుంబై రామానుజాచార్యులవారు గీతాపోటీ పరీక్షలను నిర్వహించిరి.

( 43 వ పేజీలో )

# వార్తాలహరి

## శ్రీ వేంకటేశ్వర ఆయుర్వేద వైద్య కళాశాల

శ్రీ వేంకటేశ్వర ఆయుర్వేద వైద్య కళాశాల జనవరి 21వ తేదినుండి పని చెయ్యడం ప్రారంభించింది. తొలుత కల్యాణి డామ్ రిజర్వాయర్ వద్దగల భవన సముదాయంలో దీనిని ప్రారంభించాలను కొన్నారు. కానీ ఆ భవనాల మరమ్మత్తు పని ఇంకా పూర్తికానందున విద్యార్థుల ప్రయోజనాల దృష్ట్యా ఈ సంవత్సరం నుండే కళాశాలను ప్రారంభించడం మంచిదని తిరుపతి యోగ శిక్షణాకేంద్రంలో తాత్కాలికంగా దీనిని నెలకొల్పుతున్నారు. 1982–83 విద్యా సంవత్సరానికి గాను 20 మంది విద్యార్థులను మొదటి సంవత్సరంలో చేర్చుకొన్నారు. వీరిలో 13 మంది యువకులు, 7 మంది యువతులు, వీరంతా రాయలసీమ జిల్లాలవారు. యోగ కేంద్రంలోని ఆయుర్వేద పరిశోధనాధికారి డాక్టర్ ఎస్. పి. దీక్షిత్ ఈ కళాశాలకు తాత్కాలిక ప్రధానాచార్యులుగా నియమితులయ్యారు. రానున్న ఐదు సంవత్సరాలలో ఈ కళాశాల సమగ్ర అభివృద్ధికిగాను తిరుమల తిరుపతి దేవస్థానం రూ. 23 లక్షల, 70 వేల రూపాయలను మంజూరు చేసింది.

## నిర్వాహకమండలి నిర్ణయాలు

**(సమావేశ తేది : 29–12–1982)**

* తిరుపతి కల్యాణిడామ్ వద్దగల ప్రభుత్వ భవన సముదాయంతోబాటు అక్కడి ఇంజనీరింగ్‌శాఖ సిబ్బంది ఆరుమందిని దేవస్థాన స్వాధీనంలోకి తీసుకోవటం ఆమోదించటమైనది.
* టి. టి. డి. సహకారసంస్థ డైరెక్టర్లుగా దేవస్థానబోర్డు సభ్యులైన శ్రీ కె. వీరారెడ్డి, శ్రీమతి కె. ప్రభావతమ్మ గార్లను నామినేట్ చేసేందుకు తీర్మానించటమైనది.
* టి. టి. డి. కృత్రిమ అవయవ ఏర్పాటు కేంద్రంలో డెప్యుటేషన్‌పై పనిచేస్తున్న శ్రీ సి. ఎమ్. రాజ్‌ను రు. 900-40-1300-50-1500 వేతన స్కేలుపై దేవస్థాన సేవలోకి తీసుకొనేందుకు తీర్మానించటమైనది.
* సగంశాతం సబ్సిడీతో గొడుగులను, ఉచితంగా శేషవస్త్రాలను సరఫరాచేసే పథకాన్ని ఆంధ్రప్రదేశ్‌లోని ఆలయాలకు మాత్రమే గాక దేశంలోని ఆలయాలన్నింటికీ విస్తరింపజేయటమైనది.
* తిరుమల శ్రీవారి ఆలయంలోకి ప్రయివేట్ ఫోటోగ్రాఫర్ల ప్రవేశాన్ని పూర్తిగా నిషేధిస్తూ తీర్మానించడమైనది.
* తిరుమల తిరుపతి దేవస్థానాలలోని పారిశుద్ధ్యపు పనివారలకు మూడు జతల యూనిఫారాలు, రెండుజతల చెప్పులు మంజూరు చేసేందుకు అంగీకరించటమైనది.

## ఉచితనేత్ర చికిత్స

ప్రఖ్యాత నేత్రవైద్యులు పద్మవిభూషణ్ డాక్టర్ పి. శివారెడ్డి సారథ్యంలో టి. టి. డి. ఉచిత నేత్రచికిత్సా శిబిరాన్ని నిర్వహించనున్నది.

ఫిబ్రవరి 25వ తేది నుండి మార్చి 7వ తేది వరకు తిరుపతిలో దేవస్థాన రెండవ కొత్త సత్రంలో జరిగే ఈ సేవా కార్యక్రమంలో శివారెడ్డిగారి డాక్టర్ల బృందంతోబాటు స్థానిక రుయా ఆసుపత్రి వైద్యులు దేవస్థాన వైద్యశాఖ సిబ్బందికూడా పాల్గొంటారు. ఫిబ్రవరి 25, 26వ తేదిలల్లో బయటిరోగులను పరీక్షించి ఫిబ్రవరి 27, 28 తేదిలలో శస్త్రచికిత్సలు జరుపుతారు. శస్త్రచికిత్సలు జరిగిన రోగులకు, వారి సహాయకులు ఒకరికి దేవస్థానం ఉచిత భోజనవసతి సౌకర్యాలను కలుగజేస్తుంది. రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలలోని నేత్ర రోగులు ఈ సదవకాశాన్ని వినియోగించుకోవలసిందిగా తిరుమల తిరుపతి దేవస్థానం కోరుతోంది.

## అన్నమాచార్యపీఠం

సంకీర్తనాచార్యులు శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యుల వారిపేరిట శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఒక సాహిత్యపీఠం ఏర్పాటయింది. తెలుగు విభాగంలో రీడర్‌గా పనిచేస్తున్న శ్రీ కె. సర్వోత్తమన్ ఈ పీఠానికి సంచాలకులుగా నియమితులయ్యారు. డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య సారథ్యంలో సంస్కృత విభాగంలో శ్రీ వేంకటేశ్వర అధ్యయనశాఖ ఒకటి ప్రారంభమైనది. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి రజతోత్సవ కానుకగా

తిరుమల తిరుపతి దేవస్థానంవారు విరాళ మిచ్చిన నిధులతో ఈ పీఠాల ఏర్పాటు జరిగింది.

## స్థానికుల సమావేశం

ఇటీవల కొంతకాలంగా తిరుమలలోని స్థానికులు, పోలీసులు, దేవస్థాన ఉద్యోగుల మధ్య సమస్యలు సమసిపోయి సుహృ ద్భావ వాతావరణం నెలకొంటున్నది. తిరు మలలోని స్థానిక ప్రజాసంస్థలతో దేవస్థాన అధికారులు సన్నిహితత్వాన్ని పెంచు కోవటం ద్వారా ఇది సాధ్యమైంది. టి. టి. డి. కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామి రెడ్డి ఇటీవల తిరుమలలో స్థానికుల సమా వేశంలో మాట్లాడుతూ యాత్రికావసరాలతో బాటుగా స్థానికుల అవసరాలు తీర్చేందుకు కూడా దేవస్థానం తగిన కృషిచేస్తుందని చెప్పారు. స్థానికులకు కట్టెలు, బొగ్గులు సమృద్ధిగా లభించేలా చూస్తామని, పశువుల మేతకు స్థలం కేటాయిస్తామని తగిన స్థలా లలో టాక్సీస్టాండ్లు ఏర్పాటు చేస్తామని వాగ్దానం చేశారు. జిల్లా అదనపు పోలీసు సూపరింటెండెంట్ శ్రీ ఆర్. సీతారామారావు, టి.టి.డి. సంయుక్త కార్యనిర్వాహణాధి కారి శ్రీ జి. వెంకటేశ్వర్లు తమ ప్రసంగాలలో దేవస్థాన ఆశయాల సాధనకు సహకరించ వలసిందిగా స్థానికులకు విజ్ఞప్తి చేశారు.

స్థానికసంస్థల నాయకులు శ్రీయుతులు కె. ఎం. కృష్ణయ్య, కె. రాజగోపాల్, ఇ. వి. లక్ష్మీపతి, ఆకుల కృష్ణయ్య తదితరులు దేవ స్థాన అధికారులతో సహకరించేందుకు తమ సంసిద్ధత వ్యక్తంచేశారు.





తిరుమల తిరుపతి దేవస్థానముల ఆధ్వర్యంలో దక్షిణాదిరాష్ట్రాల హాకీటోర్న మెంటు జనవరి 27 వ తేది నుండి 30 వ తేది వరకు తిరుపతిలో జరిగింది. అనేకజట్లు పాల్గొన్న ఈ హాకీ పోటీలలో ఇండియన్ ఓవర్‌సీస్ బ్యాంక్, మద్రాసు జట్టు రోలింగ్ షీల్డును, రూ. 1250 నగదు బహుమతిని గెలుచుకుంది. టి. టి. డి. కార్యనిర్వహ ణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి, రోలింగ్‌షీల్డును బహుకరిస్తున్న దృశ్యం. పోటీల నిర్వాహకులు శ్రీ ఎం. రామకృష్ణయ్య (టి. టి. డి. వెల్‌ఫేర్ ఆఫీసర్) ను కూడా ఫోటోలో చూడవచ్చును.




ఇటీవల తిరుపతిలో జరిగిన భారతీయ సైన్సు కాంగ్రెస్ సమా వేశాలలో ఏర్పాటైన టి. టి. డి. పుస్తక ప్రదర్శనశాల.

(45 వ పేజీ తరువాయి)

పరీక్షలలో పాల్గొన్న బాలబాలికల కంద రకును కవిశాబ్దికకేసరి, శ్రీ న. చ. రఘునాథాచార్యులవారు బహుమతుల నొసంగిరి.

ధనుర్మాసమునందు శ్రీ ఆండాళ్ వైభవములో పదిరోజులు, తిరుమంజనోత్సవమును పదిమంది సేవార్థులు రోజుకు ఒక్కరు చొప్పున జరిపించిరి.

10 వ తేదిన శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆలయంలో అధ్యయనోత్సవము ప్రారంభించి 12 వ తేదిన పరమపదోత్సవము వైభవముగా జరుపబడెను.

వేద దివ్యప్రబంధ అధ్యాపకులను శ్రీ వంగేటి జయలక్ష్మమ్మ ("గీతాసేవా మహిళామండలి" కోశాధ్యక్షురాలు) ఘనముగా సత్కరించిరి.

15 వ తేది సాయంత్రం జరిగిన శ్రీ గోదా కళ్యాణోత్సవమును శ్రీ యాదా నారాయణ దంపతులు మరియు శ్రీ కుక్కడపు కృష్ణమూర్తి కుమారుడు సంతోష్‌కుమార్ దంపతులు శ్రీ పులుమాట వెంకటయ్య దంపతులు వైభవముగా జరిపించిరి.

## శ్రీమద్భాగవత సప్తాహ మహోత్సవము

కళింగపట్నం శ్రీ వేంకటేశ్వర భక్త సంఘం సారథ్యంలో గత సంవత్సరకాలము నుండి జరుగుతున్న శ్రీమద్భాగవత పురాణ కాలక్షేప పరిసమాప్తి సందర్భముగ 1982 డిశంబరు 9 వ తేదీ నుండి 16 వ తేదీ వరకు స్థానిక శ్రీమన్నారాయణ మందిరమున అగ్రహారమున మహావైభవముగ, భక్తి ప్రపత్తులతో నిర్వహింపబడినది. మొదటి దినమున ముందుగ విష్వక్సేనపూజ, పుణ్యాహవచనము, రక్షాసూత్రధారణతో ప్రారంభమైనది. తర్వాత శ్రీ దోల సీతారాములునాయుడు దంపతులు విజయ పతాకమును (కపిధ్వజమును) ఎగురవేసిరి. శ్రీ డా॥ యస్. చిట్టిబాబు శ్రీ ఎస్. అప్పారావురెడ్డి అఖండ జ్యోతులను వెలిగించగా, ఋత్విక్కులు వ్యాస, పోతన, భాగవతములను శ్రీ విష్ణుసహస్రనామ, శ్రీగీతా పారాయణలను ద్వాదశాక్షరి అష్టాక్షరి మంత్రజపములను సహస్రనామార్చనలు ఆరంభించిరి. సాయంత్రం 5-30 గం॥కు శ్రీమాన్ ఎస్. టి. పి. వి. కూర్మాచార్యులుగారు పరంధామ గతులైన శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య త్రిదండి శ్రీరామ రామానుజ జీయరుస్వామివారి విగ్రహమును ఆవిష్కరించి భాగవతోపన్యాసమును గావించిరి. ప్రతిదినం ఉదయం అర్చనలు పారాయణములు జరుగుతూ సాయంత్రం ప్రముఖపండితులచే భాగవతోపన్యాసములు గావింపబడినవి. పండిత సత్కారములు జరిగినవి. చివరగా 16 వ తేది యథా శాస్త్రముగ హవనము పూర్ణాహుతి జరిగినవి. ఈ సందర్భముగ శ్రీ భక్తసంఘంవారు అకించన నారాయణ సమారాధనముగూడ గావించిరి. పలు భక్తసంఘములు రాత్రి 11 గం॥ వరకు భజన సంకీర్తనలు జేసినవి.

*



వెనుక అట్టమీది చిత్రం :

తిరుమల శ్రీవారి ప్లవోత్సవం

(1983 మార్చి 26 వ తేది నుండి 28 వ తేది వరకు)

Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press, by M. Vijayakumar Reddy, L.P.T., Manager, T.T.D. Press, Tirupati.





SRI KODANDA RAMA SWAMY TEMPLE, TIRUPATI.
TO 21.3.83] BRAHMOTSAVAM.








# శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము, తిరుమల.

## నిత్యపూజ, దర్శనాదికముల కార్యక్రమము

### శని, ఆది, సోమ మరియు మంగళవారములు

ఉదయము 3-00 నుండి 3-30 వరకు సుప్రభాతము
,, 3-30 నుండి 3-45 వరకు శుద్ధి
,, 3-45 నుండి 4-30 వరకు తోమాలసేవ
,, 4-30 నుండి 4-45 వరకు బంగారు వాకిలివద్ద కొలువు: పంచాంగ శ్రవణం
,, 4-45 నుండి 5-30 వరకు మొదటి అర్చన
,, 5-30 నుండి 6-00 వరకు మొదటిఘంట బలి మరియు శాత్తుమొర
,, 6-00 నుండి మ 12-00 వరకు సర్వదర్శనము
మధ్యాహ్నం 12-00 నుండి 1-00 వరకు రెండవఅర్చన,(ఏకాంతం)
మధ్యాహ్నం 1-00 నుండి సాయంత్రం 7-00 వరకు కల్యాణోత్సవం వాహనసేవలు మొ॥
,, 1-00 నుండి 7-00 వరకు సర్వదర్శనం
రాత్రి 7-00 నుండి 8-00 వరకు శుద్ధి, రాత్రికైంకర్యములు
,, 8-00 నుండి 12-00 వరకు సర్వదర్శనం
,, 12-00 నుండి 12-30 వరకు శుద్ధి
12-30 ఏకాంతసేవ

### బుధవారము

### సహస్రకలశాభిషేకం

ఉదయం 3-00 నుండి 3-30 వరకు సుప్రభాతము
,, 3-30 నుండి 3-45 వరకు శుద్ధి
,, 3-45 నుండి 4-30 వరకు తోమాలసేవ (ఏకాంతం)
,, 4-30 నుండి 4-45 వరకు బంగారువాకిలివద్దకొలువు పంచాంగశ్రవణం
,, 4-45 నుండి 5-30 మొదటి అర్చన
,, 5-30 నుండి 6-00 మొదటిఘంట, బలి,శాత్తుమొర
,, 6-00 నుండి 8-00 సహస్ర కలశాభిషేకము (ఆర్జితము)
ఉదయం 8-00 రాత్రి 7-00 వరకు సర్వదర్శనం
మధ్యాహ్నం 1-00 నుండి సాయంత్రం 7-00 వరకు కల్యాణోత్సవం వాహన సేవలు
రాత్రి 7-00 నుండి 8-00 వరకు శుద్ధి ఇత్యాది
రాత్రి 8-00 నుండి 12-00 వరకు సర్వదర్శనం
,, 12-00 నుండి 12-30 వరకు శుద్ధి
రాత్రి 12-30 ఏకాంతసేవ

### గురువారము

### తిరుప్పావడ

ఉదయము 3-00 నుండి 3-30 వరకు సుప్రభాతం
,, 3-30 నుండి 3-45 వరకు శుద్ధి
,, 3-45 నుండి 4-30 వరకు తోమాలసేవ.
,, 4-30 నుండి 4-45 వరకు బంగారువాకిలివద్ద కొలువు మరియు పంచాంగ శ్రవణము
,, 4-45 నుండి 5-30 వరకు మొదటి అర్చన
,, 5-30 నుండి 6-00 వరకు మొదటిఘంట, బలి శాత్తుమొర
,, 6-00 నుండి 8-00 వరకు సళ్లింపు, 2 వ అర్చన (ఏకాంతం), తిరుప్పావడ, అలంకరణ, ఘంట ఇత్యాది
,, 8-00 నుండి సాయంత్రం 6-00 వరకు సర్వదర్శనం
మధ్యాహ్నం 1-00 నుండి సాయంత్రం 6-00 వరకు కల్యాణోత్సవం వాహనసేవలు మొ॥
సాయంకాలం 6-00 నుండి 8-00 { శుద్ధి, పూలంగి సమర్పణ / రాత్రి కైంకర్యము, ఘంట }
రాత్రి 8-00 నుండి 12-00 వరకు పూలంగి సర్వదర్శనం
,, 12-00 నుండి 12-30 వరకు శుద్ధి
,, 12-30 ఏకాంతసేవ

### శుక్రవారము

### అభిషేకము

ఉద॥ 3-00 నుండి 3-30 వరకు సుప్రభాతము
,, 3-30 నుండి 5-00 వరకు సళ్లింపు మరియు నిత్యకట్ల కైంకర్యములు
,, 5-00 నుండి 7-00 వరకు అభిషేకము (ఏకాంతము)
,, 7-00 నుండి 8-30 వరకు సమర్పణము
,, 8-30 నుండి 9-30 వరకు తోమాలసేవ మరియు అర్చన ఘంట, బలి, మరియు శాత్తుమొర
,, 9-30 నుండి 10-00 వరకు రెండవ గంట, బలి, శాత్తుమొర
,, 10-00 నుండి రాత్రి 7-00 వరకు సర్వదర్శనం
మధ్యాహ్నం 1-00 నుండి సాయంత్రం 7-00 వరకు కల్యాణోత్సవం వాహనసేవలు
రాత్రి 7-00 నుండి 8-00 వరకు శుద్ధి, రాత్రి కైంకర్యము
రాత్రి 8-00 నుండి 12-00 వరకు సర్వదర్శనం
,, 12-00 నుండి 12-30 వరకు శుద్ధి
12-30 ఏకాంతసేవ

**పేష్కార్ : శ్రీవారి ఆలయం, తిరుమల**

**సర్కారు ఆర్జిత కల్యాణోత్సవం, బ్రహ్మోత్సవం, ఊంజల్ సేవ, వాహనసేవలు, డోలోత్సవం, మంగళవారాలలో ప్లవోత్సవం, మధ్యాహ్నం 1 గంట నుండి 7 గంటల మధ్య జరుగును.**



ఇప్పుడిటు కలగంటి నెల్లలోకములకు
నప్పడగు తిరువేంకటాద్రీశుగంటి ॥

అతిశయంబైన శేషాద్రిశిఖరముగంటి
ప్రతిలేని గోపురప్రభలు గంటి
శతకోటి సూర్యతేజములు వెలుగగగంటి
చతురాస్యుబొడగంటి చయ్యన మేలుకంటి ॥

కనకరత్న కవాట కాంతులిరుగడగంటి
ఘనమైన దీపసంఘములు గంటి
అనుపమ మణిమయమగు కిరీటముగంటి
కనకాంబరముగంటి గక్కన మేలుకంటి ॥

అరుదైన శంఖచక్రాదులిరుగడగంటి
సరిలేని అభయహస్తముగంటిని
తిరువేంకటాచలాధిపుని జూడగగంటి
హరిగంటి గురుగంటినంతట మేలుకంటి ॥

(శ్రీ వేంకటేశ్వరస్వామివారి సాక్షాత్కారానుభూతిపై
తాళ్ళపాక అన్నమాచార్యులవారి సంకీర్తన.)

# మీ మాట

## ఎందుకీ ఆలస్యం

సప్తగిరి మాకు ఏ నెలలోనూ సకాలంలో అందటంలేదు. పోస్టల్ స్టాంపుల ప్రకారం ఆ శాఖవారి ఆలస్యం ఏమీ కనిపించటం లేదు. గత ఏడాది నవంబరునెల పత్రిక డిశంబరు నెల 31వ తేదిన అందినది. అదే విధంగా డిశంబర్‌నెల పత్రిక జనవరి 30వ తేదిన అందినది. ఇక జనవరి 83 సప్తగిరి ఫిబ్రవరి 8 వ తేది వరకూరాలేదు. ఇకపై పత్రిక మాకు సకాలంలో అందే ఏర్పాట్లు చేయవలసిందిగా కోరుతున్నాము.

హెచ్. కె. రావు. — గుంటూరు–7.

బస్సు, రైలు, సౌకర్యాలు గల మా జనగామతాలుకాకుసప్తగిరి చాలాఆలస్యంగా వస్తున్నది. పత్రికను ఇలా ఆలస్యంగా విడుదలచేయక నెల మొదటి వారంలో అందేలా చూస్తారని ఆశిస్తున్నాను.

బి. అన్నపూర్ణేశ్వరి. — గిర్నిగడ్డ.

## ముఖచిత్రం

1983 జనవరి సప్తగిరి ముఖచిత్రం కళాత్మకంగా ఎంతో రమణీయంగావుంది. సప్తగిరిలో ఇటీవల కథానికలు, ఆధ్యాత్మిక శీర్షికలు ఎంతో మెరుగు పరచి పాఠకులలో పఠనాసక్తి పెంపొందింప జేశారు. పత్రికను ప్రతినెలా ఆలస్యం లేకుండా విడుదల చేయగలరు.

అయితా సత్యనారాయణ. — సూళ్ళూరుపేట.

## కర్మసాక్షి

జనవరి సప్తగిరిలో ప్రచురించిన 'కర్మసాక్షి' కవిత రమణీయంగావుంది. సైన్సు వేదాంతం సాహిత్యంలో అంతర్లీనమై అలరించే ఈ కవితను అనువదించి సప్తగిరి పాఠకులకు అందించిన శ్రీ పి. మోహన్ అభినందనీయులు.

పి. వి. యస్. ప్రాత్రో, — పాచిపెంట.

కర్మసాక్షి శీర్షికన ప్రముఖ తమిళ జాతీయకవి శ్రీ సుబ్రహ్మణ్య భారతిగారి కవితా మాధుర్యం చవిచూపించారు. చాలా సంతోషం. ఆంధ్రానువాదం చేసి భారతి గారి కవిత్వాన్ని ఆంధ్రులకు అందుబాటులోకి తెచ్చిన శ్రీ మోహన్‌గారికి ధన్యవాదాలు. సప్తగిరిలో ప్రతిశీర్షికలోనూ కనీసం ఒక్కొక్క కవితనైనా ప్రచురింప ప్రార్థన.

బచ్చు బాపిరాజు, — రామచంద్రపురం.

## ముందుగా ప్రచురించండి !

హిందువుల పండుగల గురించి ఆపండుగ ఏ మాసంలోవస్తుందో అదేమాసపు సప్తగిరిలో ప్రచురిస్తున్నారు. కాని ఏకారణం చేతనైతేనేమి పండుగ వెళ్ళిన తరువాతే సప్తగిరి మాకు చేరటంచేత పండుగ వైశిష్ట్యాన్ని ముందుగా చదవలేకపోతున్నాము. ఉదాహరణకు జనవరి సప్తగిరిలో సంక్రాంతి, రథసప్తమి గురించి బాగా వ్రాశారు. కాని పత్రిక మాకు నెలాఖరుకు చేరటంతో బాధపడటం జరిగింది. కావున ఇకపై పండుగల ప్రాశస్త్యాన్ని గురించిన రచనలు ఒకనెల ముందుగా ప్రచురించటం బాగుంటుంది.

కె. బాలకృష్ణారావు. — హైదరాబాదు.

## కోణార్క

కోణార్క సూర్యదేవాలయం గురించి డా॥ టి. ఆర్. కృష్ణన్ వివరించిన విషయాలు ఆ దేవాలయ పుట్టుపూర్వోత్తర గాథలతో సమగ్రవిజ్ఞానంతో వుండటంలో అతిశయోక్తి లేదు. రచయిత డా॥ కృష్ణన్‌గారికి దానిని ప్రచురించిన మీకు మా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ద్విభాష్యం కృష్ణమూర్తి. — మొగల్తూరు.

## గృహలక్ష్మి

సప్తగిరిని క్రమం విడువకుండా చదివే పాఠకులలో నేనొకణ్ణి. పత్రికలోని విషయాలే కాకుండా గెటప్ కూడా బాగుంటున్నది. జనవరి సంచికలో ప్రచురించిన 'మాంగల్యం తంతునానేన' అనే వ్యాసం చక్కగావుంది. రచయిత శ్రీ రేబల్లె వెంకటేశ్వర్లుగారి చిరునామాను తెలియజేయగలరు.

ఆర్. కృష్ణమూర్తి, — మద్రాసు.

[రచయిత చిరునామా: శ్రీ రేబల్లె వెంకటేశ్వరులు, చరిత్రాధ్యాపకులు, జూనియర్ కాలేజీ, హస్నాబాద్, కరీంనగర్ జిల్లా.]


*Statement about ownership and other particulars about*

**SAPTHAGIRI**
**(MONTHLY)**
**FORM IV**
(*See Rule* 8)

| | | |
|---|---|---|
| 1 | Place of publication | ... TIRUPATI. |
| 2 | Periodicity of its publication | ... Monthly |
| 3 | Honorary Editor | ... Sri G. Kumaraswamy Reddy, I.A.S. Executive Officer, T.T.D |
| 4 | Printer's Name (Whether citizen of India) Address | ... Sri M. Vijayakumar Reddy, L.P.T., ... Yes ... Manager, T.T.D. Printing Press, Tirupati. |
| 5 | Editor & Publisher's Name (Whether citizen of India) Address | ... K. Subba Rao, M.A., ... Yes Editor, Sapthagiri, T.T.D. Journal, Tirupati. |
| 6 | Names and addresses of individuals who own the Newspaper and partners or shareholders holding more than one per cent of the total capital. | ... Board of Trustees ... represented by the Executive Officer on behalf of T. T. D., Tirupati. |

*I, K. Subba Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.*

TIRUPATI.
*Date*: 26-2-1983.

(*Sd.*) K. SUBBA RAO,
*Signature of the Publisher.*



# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాస పత్రిక...


గౌరవసంపాదకులు .

శ్రీ జి. కుమారస్వామిరెడ్డి,
ఐ. ఏ. ఎస్.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

ప్రచురణకర్త - సంపాదకుడు :
శాస్త్రిపాటి సుబ్బారావు,
ఎమ్. ఏ.

ఉపసంపాదకుడు :
తిరుమూరు సుధాకర్ రెడ్డి,
ఎమ్. ఏ. బి. ఇడి.

ముద్రాపకుడు :
ఎమ్. విజయకుమార్ రెడ్డి.

విడిప్రతి-రు. 1-00
సం॥ చందా-రు. 12-00

ప్రతులకు :
వెల్ ఫేర్ ఆఫీసర్,
టి. టి. డి., తిరుపతి.


## ఈ సంచికలో....


మార్చి 1983
సంపుటి 13 సంచిక 10

# సంపాదకీయం

నాదాన్ని బ్రహ్మస్వరూపమని అన్నారు. ఈ సృష్టి ఆవిర్భావానికి ముందు ఏకరూపమైన నాదమే ఉండేదని, పరమాత్మ సంకల్పంవల్ల కాలక్రమాన సృష్టి అంతా ఏర్పడిందని మన వాఙ్మయం— మన వాఙ్మయమేకాదు ప్రపంచవాఙ్మయం చాటుతోంది. భగవంతుడు 'కావాలి' అనగానే విశ్వమంతా వెలిగిపోయిందని, అలా విశ్వరచన జరిగిందని వారి సిద్ధాంతం. మనం ప్రణవం అనుకున్నదాన్ని ఇతరులు వేరేగా అనుకున్నారన్నమాట.

నాదప్రధానమైన భాష ఎలా జనించింది-అని భాషావేత్తలు నలుచర్చలుచేసి ఆదిదంపతులు పరస్పరానురాగ, భావవ్యక్తీకరణకు ఆలపించిన సాంకేతిక నాదజనితమే భాష అని ఒక అభిప్రాయానికి వచ్చారు. మాహేశ్వర సూత్రాల ఆవిర్భావ వృత్తాంతంతో జతపరిస్తే ఇది సరిగావున్నదనే అనవచ్చు అంటే ఆదిదంపతుల హావభావ విన్యాసాల కనుగుణంగా అఖండ నాదము లయబద్ధమై, గతియుతమై, సార్థకశబ్దమై, పదమై వివిధ సాహిత్యప్రక్రియల వాఙ్మయంగా విశ్వరూపం దాల్చిందనవచ్చు అంటే జీవ సృష్టికి, జీవవంతమైన భాషాసృష్టికి కూడ ఆ పరమనాదమే 'ఆది' అంటే ఆశ్చర్యంలేదు.

ఈ విధంగా చూస్తే సాహిత్యప్రక్రియలలో కూడా నాదలయాత్మకమైన గీతాలు తత్సమీపప్రక్రియలే 'ఆది' అని చెప్పుకోవచ్చు. ఆ తరువాతనే నూత్నప్రయోగాలు, ప్రక్రియలు ప్రారంభమైవుంటాయి. తెలుగు సాహిత్యంకూడా ఇంతే. పై మెట్టువారికి క్రిందివి లెక్కకురానట్లు, ఉత్పలాలు, చంపకాలు అలంకరించుకొని మత్తేభాలపై శార్దూలశౌర్యంతో ముందు దూకుడు కల్గిన కవిసమాజంలో ఆదిస్వరూపాలను ఆధ్యాత్మిక తత్పరతతో, నిష్కామంగా ఆరాధించి తమ వంశాన్నే కర్పూర నీరాజనమిచ్చిన ధన్యజీవులు కోటికొక్కరేమో. నిజంగా ఆ ఘనత, ధన్యత ఆంధ్రసాహిత్యంలో తాళ్ళపాక వంశానికే దక్కింది.

పనికిరానిదని మూలపడవేసిన పదకవితకు వేంకటశైలవల్లభ సమారాధనలో పాలుకల్పించి, పవిత్రతను చేకూర్చి 32 వేల దివ్యప్రబంధాలకు (పాటలకు) వేంకటేశ్వరునే రసరాజుగా ఒకవంక, ఆధ్యాత్మిక పరమావధిగా మరొకవంక రూపించి, రచించి, పదకవితా పితామహ బిరుదునందుకున్న తాళ్ళపాక అన్నమయ్య, తాళ్ళపాకవంశపు తొలిపూజాకుసుమం. ఇన్నికీర్తనల రచనకన్న ఇంతటి రచనకాలంబనగా వేంకటేశ్వరునే స్వీకరించి, నిరూపించిన అన్నమయ్య భావుకత బహుశః విశ్వవాఙ్మయంలో అనూహ్యమైన ఘటన. అన్నమయ్య భార్య తిమ్మక్క ద్విపదలో సుభద్రాకల్యాణం రచించి ఆంధ్రపదసాహిత్యంలో ఆదికవయిత్రి స్థానాన్ని పొందింది.

అన్నమయ్య కుమారుడు పెదతిరుమలాచార్యుడు. బహుభాషా కోవిదుడేగాక తండ్రి నడవడిన నడిచిన చరితార్థజీవి. అన్నమయ్య జరిపించలేని అశేష కైంకర్యాలను స్వామికి జరిపించి ప్రత్యేక పీఠాలను నెలకొల్పుకున్న పరమవైష్ణవుడు. తండ్రివలె వేంకటేశ్వరునిపై ఆధ్యాత్మిక శృంగార రచనమేగాక, భగవద్గీతకు తెలుగువ్యాఖ్యనిచ్చిన తొలి తెలుగుకవి అన్నా ఆశ్చర్యంలేదు. తండ్రివలె రక్తిని, విరక్తిని సమానంగా ఆరాధించిన కర్మయోగి.

విఘ్నేశ్వరుని సహకారంలేకపోతే వ్యాసభారతం ఎందరికి తెలిసేదో తెలియదు. మనమడు చిన్నన్న అనుకోకపోతే అన్నమయ్య చరిత్ర మాత్రం అసలు బైటకు వచ్చేదేకాదు. తండ్రితాతల బాటలో తన మాటలు సాగించటంతోబాటు, ఇన్నివేల కీర్తనలు వేంకటేశ్వరునిపై వెలయింపచేసిన ఆ మహామహుని చరిత్రను అందించిన చిన్నన్నకు తెలుగుజాతి నిజానికి చాలా ఋణపడివుంది వీరి రచనలను గ్రంథరూపంలో వెలువరించేందుకు దేవస్థానం చేస్తున్న ప్రయత్నం, చేయవలసినదానిలో చంద్రునికో నూలుపోగు మాత్రమే. ఫాల్గుణ బహుళ ద్వాదశిన జరిగే వర్ధంతి, ఆ మహనీయునికి, ఆ వంశానికి మనం చెల్లించుకునే గౌరవయుత సంస్మరణ మాత్రమే. సంస్కృతభాషా పాండిత్యం కలిగి, అందులో కావ్యలక్షణ గ్రంథాలను రచించికూడా, తాళ్ళపాకవారు తమ ప్రతిభనంతా పదసాహిత్యానికే పెట్టుబడి పెట్టారంటే అంతరార్థం ఏదో ఉండాలి.

వాస్తవానికి మనసుకు చేరువై మురిపించేది, ఆట, పాట. ఆకట్టుకునేది అందలి పదవిన్యాసం. మిగిలిన సాహిత్య ప్రక్రియలు అంత చేరువయ్యేవికావు ఆచార్య రామానుజులు, బహుళ జనార్థం గోపురసందేశాన్నిచ్చినట్టే, తాళ్ళపాకవంశం వేద విజ్ఞానసుధను పాటల బాటలలో ప్రవహింపజేసింది. అందుకనే అన్నమయ్య అన్న ఈ పాటలో 'నీ సేవకు సంకీర్తన విధానమే చాలు.తక్కినవన్నీ (ప్రక్రియలన్నీ) భండారాన ఉండదగ్గవి మాత్రమే' అన్నాడా అనిపిస్తుంది ఆ మ్రొక్కునే ఆ వంశమంతాచెల్లించినట్లు కన్పిస్తుంది.

దాఁచుకో నీపాదాలకుఁ దగ నేఁ జేసిన పూజలివి
పూఁచి నీ కీర్తిరూప పుష్పము లివియయ్యా

ఒక్క సంకీర్తనే చాలు నొద్దికై మమ్ము రక్షించఁగ
తక్కినవి భండారాన దాఁచివుండనీ
వెక్కసమగు నీనామము వెలసులభము ఫలమధికము
దిక్కై నన్నేలితి విఁక నని తీరని నా ధనమయ్యా

‘నావలననే పేరుకెక్కేవు నీవు’ అని సాక్షాత్తూ ఆ శ్రీనివాసుడితోనే అనగలిగిన వేంకటేశ్వర ప్రచారకుడు అన్నమయ్య. ఆయన కవిత అంతగా జనసన్నిహితం అయిందంటే అందుకు కారణం వారి జానపద ప్రియత్వమే! జానపదసాహిత్య పరిశోధనలో అగ్రతాంబూలం అందుకొన్న డా॥ బి. రామరాజుగారి ఈ రచన గతఏడాది అన్నమాచార్య జయంతి ఉత్సవాలలో వారు సమర్పించినది. సం॥

# అన్నమయ్యకవితలు - జానపదరీతులు

— ఆచార్య బి. రామరాజు

పదకవితా పితామహులని పేరుగాంచిన తాళ్లపాక అన్నమాచార్యులవారు (1424 - 1503) సంగీతసాహిత్యము లందలి మార్గ-దేశి సంప్రదాయములనెడు ఉభయవిభూతులకు ఏతమెత్తిన పరమభాగవతోత్తములు. ఆయన తిరుపతిలో వేంకటేశ్వరస్వామి సన్నిధిని గేయకవితకు పట్టాభిషేకమొనర్చిరి. అనాదిగా అనాగరకుల నడుమ సెలయేరువలె పరుగెత్తుచుండిన జానపద గేయస్రవంతి అన్నమాచార్యుల చేతిచలువతో వేంకటేశ్వరస్వామి పాదములకడ సంగీతము నింపుకొని పూర్ణ సరస్వతియైనది. అన్నమయ్యకు పూర్వము తెలుగులో పాటలుండెనను సాక్ష్యముదప్ప ఈ పాటలూ నాటివేయని చెప్ప గలవి లేవు. అవి మనకు దక్కకుండ పోయినవి. నన్నిచోడుడు, పాల్కురికి సోమనాథుడు పేర్కొన్న తీరుతీరు పాటల పేరులు దక్క వాని పాఠములు మనకు లభించవు. లభించినను ఇవి యవియేనని ఇదమిత్థముగా చెప్పజాలము. ఆనాటి పేరుతో నేటికిగూడ ప్రచారమందున్న పాటలతో సరివచ్చు పాటలుండెడివని భావింపవచ్చును. నాచన సోముని వసంతవిలాసము లోనిదని లక్షణకారులుదాహరించిన

వీణాగానము వెన్నెలతేట - రాణ మీరగా రమణులపాట
ప్రాణమైన పినబ్రాహ్మణువీట - జాణలు మెత్తురు జాజర
పాట ’

యనునదొక్కటే అన్నమయ్యగారికి పూర్వపు జాజర పాటలోని మచ్చుపిసరు. కృష్ణమాచార్యులు రచించిన సింహగిరి నరహరి వచనములు, శ్రీ రంగనాథ వచనములు, ప్రతాపరుద్రుని కాలమునాటివి (1320) కలవు కాని యవి తాళబంధ చ్ఛందో విరహితములు, చూర్ణికలు, ఏగంటివారి వచనములు చెప్పిన గార్లపాటి లక్ష్మయ్య ఏ కాలమువాడో సరిగా తెలియదు. పాల్కురికి సోమనాథుని తరువాత వాడనుట మాత్రము నిశ్చయము. ఇక అన్నమయ్యగారి యసంఖ్యాక సంకీర్తనములే యానాటి జానపద గేయముల రీతులు తెలిసికొనుటకు మనకు తోడ్పడగల యాధారములు. తమ కాలము నాటికి ప్రచారములోనున్న జానపద గేయములలో తమకు రుచించిన ఫణితులన్నింటికి సరిపోవు సంకీర్తనములనేకము అన్నమయ్యగారు కూర్చినారు. జానపదగేయ రీతులున్న అన్నమయ్యగారి సంకీర్తనములు మూడువిధములు. అవి 1. జానపద గేయముల రీతినిబోలిన పల్లవి మాత్రముగల సంకీర్తనములు. 2. జానపద గేయముల రీతినిబోలిన చరణములు మాత్రముగల సంకీర్తనములు. 3. జానపద గేయముల రీతినిబోలిన పల్లవి చరణములును గల సంకీర్తనములు. ఈ నాటి సినిమాపాటలలోని జానపద గేయరీతులను పరిశీలించినచో నిట్టి పద్ధతియే గోచరించును. అన్నమయ్యగారు ‘సంకీర్తనాపరిశుద్ధిన్ ........ చేయుఋాని’ న వారు కనుక ఈ మార్గమవలంబించి యుందురనుకొనుచున్నారు. ఇక అన్నమయ్యగారి సంకీర్తనములందుకాననగు జానపద గేయరీతులను స్థాలీపులాకన్యాయముగ ప్రదర్శింతును.

నన్నిచోడుడు ఉవిదలింపు మిగుల పాడునట్టి ఊయల పాటలను పేర్కొనెను. ఈ నాడు ‘ఓం నమశ్శివాయ యను నక్షరముల తొట్టెలో ఆవిర్భవించెనే ఉయ్యాలా’ యను పాట యొకటి వినబడుచున్నది. ఇదే వరుసలో అన్నమయ్యగారు.

ఆహిరి

అలర చంచలమైన ఆత్మలందుండనీ అలవాటు సేసె
నీ వుయ్యాలా
పలుమారు నుచ్ఛ్వాస పవనమందుండ నీ భావంబు
దెలిపె నీ వుయ్యాలా

అను సంకీర్తనము రచించిరి. ఎనిమిది ‘కిటతకిట’ల ఆవృత్తముల పాదములు పన్నెండును, రెండు పాదముల పల్లవియు గలదీపాట. దీని పాదములు

‘ఉదయాస్త శైలంబు లొనర కంబములైన ఉడు
మండలము మోచె నుయ్యాలా
అదన నాకాశపద మడ్డదూలంబైన అఖిలంబునిండె
నీ ఉయ్యాల

పదిలముగ వేదములు బంగారు చేరులై పట్టి వెరపై
తోచె నుయ్యాల
వదలకిటు ధర్మదేవత పీఠమై మిగుల వర్ణింప
నరుదాయ నుయ్యాల '

అదే రీతిలో సాగిపోవుటనుబట్టి పల్లవియు చరణము లును ఒకే తీరుగా సాగిన పాటలలో దీనిని పరిగణింపవచ్చును.

శంకరాభరణమున చతురశ్రగతిలో నడచు మరియొక ఊయలపాట కలదు.

ఉయ్యాల బాలు నూచెదరుకడు
నొయ్య నొయ్య నొయ్యనుచు ॥
బాలయవ్వనలు పసిడి వుయ్యాల
బాలునివద్ద బాడేరు
లాలి లాలి లాలి లాలమ్మ యెల్ల
లాలి లాలి లాలి లాలనుచు

ఈ సంకీర్తనమే నేడు మనయిండ్లలో పాడుకొను ఊయలపాటకు సమీపముగా నున్నది. స్వామివారి డోలోత్సవమునకై అన్నమయ్య ఇట్టి తెలుగుపాటలేకాక సంస్కృతము నను ఊయలపాటలు రచించినారు.

ఊయల పాటలకు మిక్కిలి సమీపమునందుండునవి లాలి పాటలు, జోలపాటలు. శిశువులను లాలించుటకు అనగా ఊరడించుటకు, ఆడించుటకు నుపకరించునవి లాలిపాటలు; శిశువులను జోకొట్టుచు నిద్రపుచ్చుట కుపకరించునవి జోల పాటలు.

' జోజో యని మీరు జోల పాడరో
సాజపు జయంతి నేడే సఫల మిందరికి'

అను జోలపాట దేసాళం రాగమున త్రిశ్రగతిలో నడచి నట్టిది.

' జో అచ్యుతానంద జోజోముకుందా
రార పరమానంద రామ గోవిందా ॥
తొలుత బ్రహ్మాండంబు తొట్లె గావించీ
నాలుగు వేదముల గొలుసులమరించీ
బలువైన ఫణిరాజు పానుపమరించీ
చెలియ డోలికలోన చేర్చి లాలించీ ॥జోజో॥

అను ప్రసిద్ధమైన జోలపాటను బోలిన సంకీర్తనమును తిరుపట్ల మదనగోపాలునిపై నీ తీరుగా పాడినట్లు అన్నమాచార్య చరిత్ర పీఠిక పుట 61–62లో కలదు.

జోవచ్యుతానంద జోజో ముకుంద
రావె పరమానంద రామ గోవింద ॥జో॥

అంగజుని గన్న మాయన్న యిటురారా
బంగారు గిన్నెలో పాలు పోసేరా
దొంగ నీవని సతులు పొంగుచున్నారా
ముంగిట నాడరా మోహనాకారా ॥జో॥

.... ... ....

అంగుగా తాళ్ళపాకాన్నయ్య చాల
శృంగార రచనగా చెప్పె నీ జోల
సంగతిగ సకలసంపదల నీవేళ
మంగళము తిరుపట్ల మదన గోపాల ॥జో॥

గండవరపు గోపాలునిపై శ్రీరాగం జంపె తాళములో నొక లాలిపాట చెప్పినట్లు పై గ్రంథము పుట 62లో కలదు.

లాలనుచు నూచేరు లలనలిరుగడల
బాల గండవర గోపాల నిను చాల ॥

ఈ వరుసలో సాగిపోవు లాలిపాటలు మనయిండ్లలో పాడుకొనుట అందరెరిగిన విషయమే.

శివుని పరముగా

' లాలి శంకర సదా లాలితకుమారా
లాలి పటు తాండవోల్లాస ఘనధీరా
లాలి పంచాస్య కైలాస సంచారా
లాలి మధురాలాప లాలి గంభీరా ' యనియు

శ్రీరాముని పరముగా

' లాలి శ్రీరఘురామ లాలి రిపుభీమా ' యనియు

' లాలి గరుడతురంగ లాలిభవభంగా
లాలి సీతానంగ లాలివేదాంగా' యనియు

సీతమ్మ పరముగా

' లాలి బంగరుబొమ్మ లాలి మాయమ్మ
లాలి ముద్దుల గుమ్మ లాలి సీతమ్మ యనియు

గోదాదేవి పరముగా

' శ్రీ విల్లి పుత్తూర నావిర్భవించీ
భావమలరగ తిరుప్పావు రచియించీ యనియు

తీరుతీరు లాలిపాటలు మన యిండ్లలో పాడుకొనుట యలవాటు.

లాలనుచు పాడరమ్మా ఈ బిడ్డ లక్ష్మీ విలునుడమ్మా
పాదమున చక్రమమ్మా ఈ బిడ్డ వేదాంతవేద్యుడమ్మా
రామలాలీ మేఘశ్యామలాలీ
తామరస నయన దశరథ తనయలాలీ

అను సుప్రసిద్ధమైన వరుసలో నడచు లాలిపాటలు అన్నమయ్యగారు రచించినట్లులేదు. అన్నమయ్య స్వామి వారి డోలోత్సవమునకై ఊయల పాటలే యధికముగా రచించిరికాని లాలిపాటలు, జోలపాటలు తక్కువగా రచించినారు. అన్నమయ్యగారి దృష్టిలో వేంకటేశ్వరస్వామి యువకుడైన శృంగారరాయడు. ఆయనకు లాలి జోల పాటలంతగా పట్టవు. యక్షగానములందు స్త్రీలపాటలు లాలి, జోల (సువ్వాల ధవళము) వంటివి ప్రౌఢదంపతుల నుద్దేశించి పాడెడు నలవాటు ఇటీవలిదై యుండును. ఆ నాటిది కాదేమో!

శ్రీకృష్ణపరమాత్ముని శైశవమును, బాల్యమును, బాలక్రీడలను వర్ణించు సాకుతో అన్నమయ్యగారు పిల్లలకు ఉగ్గు పెట్టునపుడు తలకు పోయునపుడు, గోరుముద్దలు తినిపించునపుడు పాడెడు పాటల ననుకరించుచు కొన్ని సంకీర్తనములు కూర్చినారు.

ఉగ్గువెట్టరే వోయమ్మా-చె
య్యొగ్గినిదె శిశువోయమ్మా ॥

అని భైరవి రాగమున చతురస్రగతిలో సాగిన పాటయు

అబ్బురంపు శిశువు, ఆకుమీది శిశువు
దొబ్బుడు రోలి శిశువు, త్రువ్వి త్రువ్వి త్రువ్వి

అని మంగళ కౌశికిరాగమున చతురస్రగతిలో సాగిన పాటయును ఉదాహరణములు: పసిపాపలకు ఉగ్గు పోయునపుడును, నీళ్ళుపోయునపుడును పాడెడు పాటలు పిల్లలకు గోరుముద్దలు తినిపించుచు తల్లులు 'చందమామ రావె-జాబిల్లి రావె' యని పాడెదరు. ఆ పాట ననుకరించుచు అన్నమయ్య-

'చందమామ రావో జాబిల్లిరావో మంచి
కుందనంపు పైడికోర వెన్నబాలుతేవో'

అను పాటను రచించినారు.

పిల్లల ఆటపాట లెన్నియో తీరులు. ఆయా ఆటల కనువైన పాటలును, ఆటలందోడినపుడు అప్పు తీర్చుటకుద్దేశించిన ఎన్నియో తెలుగునాట వాడుకలో నున్నవి. దాగిలిమూతలాట లేదా దోబూచియాట ఆడునపుడు పాడెడు పాటననుకరించుచు అన్నమయ్యగారీ పాటను రచించిరి.

ధన్యాశి

బండివిరిచి పిన్నపాపలతో నాడి
దుండగీడు వచ్చెదోబూచి ॥

కూతపాట కనుకరణముగా శంకరాభరణము చతురస్రగతిలో క్రిందిపాట.

గురుతెరిగిన దొంగ కూగూగు వీడె
పుడిలోన దాగేని కూగూగు'

ఆంధ్రదేశమున సంక్రాంతి పండుగ సమయమున బాలికలు గొబ్బెళ్లు పెట్టి ఆడుచు పాటలు పాడెదరు.

సుబ్బీ గొబ్బెమ్మా సుఖమూలియ్యవే
తారమ్మయ్య తందానగొబ్బీ
గొబ్బియళ్ళొ గొబ్బిగొబ్బున
గొబ్బియళ్ళొ చందమామ
కరకంకణములు ఘల్ ఘల్లనగా
వినెడు సరసుల గుండె ఝుల్ ఝుల్లనగా

అనునవి వాడుకలోనున్న గొబ్బిపాటలకుదాహరణములు. అన్నమయ్యగారు ఈ క్రింది గొబ్బిపాటను చతురస్రగతిలో రచించినారు.

దేసాళం

కొలని దోపరికి గొబ్బిళ్ళో యదు
కుల స్వామికిని గొబ్బిళ్ళో ॥
కొండ గొడుగుగా గోవుల గాచిన
కొండుక శిశువుకు గొబ్బిళ్లో
దుండగంపు దైత్యులకెల్లను తల
గుండు గండనికి గొబ్బిళ్లో

ఈ పాటలన్నియు కోలాట వరుసలకు సరిపడునట్టివే. కోలాట వరుసలను కోపులందురు. కోలాట కోపులు పెక్కువిధములు. వీనిలో చతురస్రగతి పాటలే యధికము. అన్నమయ్య పాటలలో కోలాట యనుమాట లేకున్నను కోలాటపాటలతో సంపూర్ణ సామరస్యముగల పాటలుండుటను బట్టి యవి కోలాటపాటలై యుండునని యూహించుచున్నాను. నా యూహమునకుగల కారణములివి. గుజిలీ పాటల పుస్తకములందీ నాటి కోలాట పాటలెన్నియో కలవు. ఈ పాటలు నాటినుండి నేటివరకేమాత్రము మారలేదని నొక్కి చెప్పజాలము. కాని ముఖ్యలక్షణములు మాత్రము తక్కిన పాటలందు వలెనే వీనిలోగూడ చెదరకుండ దిగివచ్చినటుల చెప్పకొనవచ్చును.

గొల్లవారి వాడలాకు కృష్ణమూరితీ _ నీవు
ఏమి పనికొచ్చినావు కృష్ణమూరితీ ॥

శివశివ మూర్తివి గణనాథా నీవు
శివుని కుమారుడవు గణనాథా ॥

నామాట వినవమ్మ కోవెలా ప్రాణ
నాథుని తేవమ్మ కోవెలా ॥

ఎంతొ చక్కని చిన్నదీ కృష్ణయ్యా ని
న్నింటికే రమ్మన్నదీ కృష్ణయ్యా ॥

మొదలైన వన్నియు జానపదుల కోలాట పాటల కుదా హరణములు. ఈ పాటలన్నియు చతురస్రగతిలో నున్నవి. రెండు పాదములకు కలిపి యెనిమిది వృత్తములున్నవి. రెండు పాదములందును చివరన సంబోధనములున్నవి. మొదటి పాదములో చివర యావృత్తమును 'థ(అ) నీవు' అని నాలుగక్షరముల కాలములో పాడుకొనవలయును. అక్షరములు తగ్గించుటచే పాటకు కొంత యూపిరి సలిపినట్లుండును. అన్నమయ్యగారి సంకీర్తనములందిట్టి పాటలెన్నియోకలవు. ఉదాహరణమునకు

శ్రీరాగం

వట్టి వలపు చల్లకు విష్ణుమూరితి నాతో
వెట్టిదీర మాటలాడు విష్ణుమూరితి

ఈ పాట వెనువెంట రెండవ సంపుటములో మధుసూదన త్రివిక్రమ, శ్రీధర, హృషీకేశ, పద్మనాభ, దామోదర, వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, పురుషోత్తమ, అధోక్షజ, నారసింహాది విష్ణునామములు పాదాంతములందు సంబోధనలుగా నుంచి అన్నమయ్యగారు చెప్పిన పాటలన్నియు కోలాట పాట వరుసలే. సంబోధన పదములే పాదాంతములందుండ వలెనను నియమములేదు. ఛాంగుభళా, వృథావృథా, గెలుపులు, సంకీర్తనం, వైష్ణవం, మంగళము, పెండ్లికూతురు, పెండ్లికొడుకు వంటి మాటలతో ప్రతిపాదమంతమగు పాటలు కూడా కోలాటపాట వరుసలే! ఇంకను

పాడి

చింతలే చిగురులే చిచ్చులట
ఇంతటి లోనికి నేలాగే

వరాళి

మనలోని మాటా మనసులో తీటా
వెనకజెప్పేకాని విడువమీపూట

సామంతం

నీవే యిన్నిట నిజమరివి
వావిదెలుప యిక వద్దయ్యా

సామంతం

ఎగ్గో తప్పో యెరుగనిది
నిగ్గులు దేరగ నినుబైకొండు

వంటి పొట్టి పాదములున్న చతురస్రగతి పాటలన్నియు కోలాటవరుసలే!

నాచన సోమనాథుడు చెప్పిన జాజరపాటకు అన్నమయ్య సంకీర్తనములందు రెండు చక్కని యుదాహరణము లున్నవి. వసంతవిలాసమందలి పంక్తులనుబట్టి వెన్నెల రాత్రులందు వీణాగానము మరియు రమణుల పాటల మేళవింపుతో జాణలు మెచ్చునది ఆ నాటి జాజరపాట. శ్రీనాథుని కాలమున 'వారుణీ రసాస్వాద మదాతిరేకముతో చంద్రికలు గాయ వీధుల కనకవీణలు మీటుచు భీమనాథుని జాదురజాదురంచు అంగనలు పాడునది జాజరపాట. ఈ రెండింటను జాజరయననేమిటో అర్థము తెలియరాదు. శృంగారప్రియులు పరస్పరము చల్లుకొనెడి కస్తూరి, గందవొడి, పుప్పొడి మున్నగు పరిమళద్రవ్యముల పొడియని అన్నమయ్యగారే తొలిసారిగా చెప్పినారు. ఇప్పటికిని తెలంగాణమున కుంకుమబుక్కా, గులాలు చల్లుకొనుచు జాజరపాటలు పాడుట సంప్రదాయము.

జాజిరి జాజిరి జాజిరి జాజ
బుగ బుగ మామిండ్లు బూసుకరాంగ
భూమికి తాళలేసురాంగ

అగుండీ గుండు ఇత్తడిగుండు
గుండువోయి కొండమీద మోతలేసె

మీ అవులు మా అవు మక్కెమల్లావులు
పెద్దమకుంట్లకు నీల్లాగబోతే
జాజిరి జాజిరి జకుల్తపాప
జాజిరాడ బోతే ఏమేందొరికే

వంటివి తెలంగాణమున ప్రచారమున నున్న జాజర పాటల వరుసలు.

(సశేషం)

## ప్రశ్నోపనిషత్

### ద్వితీయ ప్రశ్నము

(గతసంచిక తరువాయి)

7

ప్రజాపతిశ్చరసి గర్భే త్వమేవ ప్రతిజాయసే
తుభ్యం ప్రాణః ప్రజాస్త్విమా బలిం హరంతి-యః
ప్రాణైః ప్రతితిష్ఠతి.

ప్రాణమా ! సృష్టికి కారణమైన నీవే గర్భమునందుండి ఇంకొక రూపములో వస్తున్నావు. (ప్రజనీవే. ప్రజాపతివి నీవే.) ప్రతి జీవికి లోపల పంచ ప్రాణ రూపకంగా తిరుగుతూ ఉంటావు. నీ వల్ల పుట్టిన యీ జీవులు తినే ఆహారం నీ అభివృద్ధికే.

(ప్రాణప్రతిష్ఠకు ఆహారం ముఖ్యం. ఆ ఆహారం పరిశుద్ధమూ సాత్వికమూ అయి ఉండాలి. 'బలి' అని అనడములో ముని ఉద్దేశం అదే.)

8

దేవానామసి వహ్నితమః
పితౄణాం ప్రథమా స్వధా,
ఋషీణాం చరితం సత్యమ్-
అథర్వాంగిరసామసి.

ప్రాణమా ! నీవు దేవతలకు యజ్ఞాది కర్మలను నిర్వహించడములో అగ్నివై, పితృదేవతలకు ఆనందకరుడవైన స్వధా రూపుడవై, ఋషులకు సత్యరూపుడవై మునులకు జ్ఞానరూపుడవై ఉంటున్నావు.

9

ఇంద్రస్త్వం ప్రాణ ! తేజసా రుద్రోసి పరిరక్షితా
త్వమంతరిక్షే చరసి సూర్యస్త్వం
జ్యోతిషాం పతిః,

ప్రాణమా ! నీవు ఇంద్రుడవు. తేజస్సుచే రుద్రుడవు. విశ్వరక్షకుడవు నీవే. దహరాకాశమందు చరించే జీవనాడి నీవు. జ్యోతిస్సులకు (నక్షత్ర తారాగ్రహగణాలకు) ప్రభువు నీవే.

(వాన కురియడం, దానివల్ల పృథివి (భూమి) పండడం, అది అన్నమవడం-ఇది కలగడానికి మూలం ఇంద్రుడు.

(ప్రాణులను కాలానుసారంగా కన్ను మూయించేవాడు రుద్రుడు. ప్రతి ప్రాణికీ హృదయములో ఉండి జీవితరక్ష కలిగించేది వాయురూపములో ఉండే వాయువు. రాత్రి నక్షత్రాలకు, గ్రహాలకూ వెలుగు నిచ్చి విశ్వమునకు జీవశక్తిని (చైతన్యమును) కలిగించేది సూర్యుడు.-(ఇవన్నీ ప్రాణమ్)

10

యదా త్వమభివర్షస్యథేమాః ప్రాణః తే
ప్రజా ఆనందరూపాస్తిష్ఠంతి
కామాయాన్నం భవిష్యతి.

ప్రాణమా ! పర్జన్య రూపముతో నీవు సమృద్ధిగా వాన కురియగానే యీ ప్రాణులు ఆనందంగా ఉంటారు. జీవితం పుష్టిగా తుష్టిగా పెరగడానికి అన్నం అవశ్యకం. అది నీవు కురిసే వానవల్లనే లభ్యమౌతుంది.




11

వ్రాత్యస్త్వం ప్రాణైకఋషిరత్తా
విశ్వస్య సత్పతిః, వయమాద్యస్య దాతారః
పితా త్వం మాతరిశ్వనః.

ప్రాణమా ! నీవు నిత్య పరిశుద్ధుడవు. సంచార శీలుడవు (ఋషివి). భోక్తవు నీవే. జగత్పతివి నీవే. మేము ఆహారపదార్థాలను ఇచ్చేవారం. అంతరిక్షమందు విహరించే వాయువునకు నీవు తండ్రివి.

12

యా తే తనూర్వాచి ప్రతిష్ఠితా
యా శ్రోత్రే, యా చ చక్షుషి,
యా చ మనసి సంతతా
శివాం తాం కురు మోత్క్రమీః.

ప్రాణమా ! వాక్కునందు చెవులయందు కన్నులయందు మనసునందు వ్యాపించి ఉన్న నీ శరీరాన్ని మంగళ కరముగ అలాగే ఉంచు. వెలుపలకు వెడల నియ్యకు.

(ఇంద్రియాలు ప్రాణశక్తివల్లనే పని చేస్తూ ఉంటాయి. ఏ యింద్రియం సరిగా పనిచెయ్యలేదన్నా అక్కడ ప్రాణశక్తి తగ్గిందన్నమాట. ఆలాటి ప్రమాదం రానీయకు. నీవు అలాగే ఉంటూ ఉండు. అన్నిటికన్నా నీవే మిన్న. ఈ ఇంద్రియాలు ప్రాణోత్తమత్వాన్ని సుస్పష్టంగా వెల్లడించాయని గ్రాహ్యం.)

13

ప్రాణస్యేదం వశే సర్వం
త్రిదివే యత్ప్రతిష్ఠితమ్.
మాతేవ పుత్రాన్ రక్షస్వ
శ్రీశ్చ ప్రజ్ఞాం చ విధేహి న ఇతి'-

ముజ్జగాలలో స్థావరజంగమాత్మకమై ఉన్నదంతా, ప్రాణమా ! నీ యధీనములోనే ఉంది. నిన్ను కాదని చైతన్యవంతమై ఉండేది ఏదీ లేదు.

తల్లి కొడుకుల కాపాడేట్టు మమ్మల్ని కాపాడు. జీవనశోభను, విజ్ఞానమును మాకు కలిగించు.

అని ఇంద్రియాలు అన్నాయి.

ఇది ద్వితీయ ప్రశ్నము.

*

### తృతీయ ప్రశ్నము

అథ హైనం కౌసల్యశ్చాశ్వలాయనః పప్రచ్ఛ.
'భగవన్ః కుత ఏష ప్రాణో జాయతే?
కథమాయాత్యస్మిన్ శరీరే?
ఆత్మానం వా ప్రవిభజ్య కథం ప్రాతిష్ఠతే?
కేనోత్క్రమతే? కథం బాహ్యమభిధత్తే?
కథమధ్యాత్మమితి'.

తరువాత అశ్వలుని కొడుకు కౌసల్యుడనే ముని పిప్పలాదుణ్ణి ఇలాగు ప్రశ్నించాడు.

భగవన్ ! ప్రాణం పుట్టుక ఎలాగు ? ఈ శరీరములోనికి ఎలాగ చేరుతూంది ? తనను తాను విభజించుకుని ఏ విధంగా ఉంటూంది? ఏ మార్గాన లోనుంచి వెలుపలకు వెళ్ళిపో తుంది? బాహ్యవస్తుజ్ఞానం, ఆధ్యాత్మిక జ్ఞానం ప్రాణానికి ఎలా కలుగుతున్నాయి? సెలవీయవలసింది-అని.



2

2

తస్మై స హోవాచ
'అతిప్రశ్నాన్ పృచ్ఛసి
బ్రహ్మిష్ఠోఽసీతి తస్మాత్తేఽహం బ్రవీమి.

ఆ మాటలు విన్నాడు పిప్పలాదుడు. చాలా ప్రశ్నలువేశావు. బ్రహ్మపదార్థాన్ని తెలుసుకునే నిష్ఠగలవాడిలాగా ఉన్నావు. నీ ప్రశ్నలకు జవాబు విను.

3

ఆత్మన ఏష ప్రాణో జాయతే
యథైషా పురుషే ఛాయైతస్మిన్
ఏతదాతతం మనోకృతేనాయాత్యస్మిన్
శరీరే.

ఈ ప్రాణం ఆత్మ (ఈశ్వరుని) నుంచి పుడుతుంది. శరీరమునందు నీడలాగ ఆత్మయందే ప్రాణం ఉంటుంది. ఆ ప్రాణాన్ని యీ జగత్తు ఆశ్రయించి ఉంటుంది. జీవుడుచేసిన మానసిక కర్మల ననుసరించి ఆ ఫలం అనుభవించడంకోసం ప్రాణం యీ శరీరములో అంటిపెట్టుకుని ఉంటుంది.

4

యథా సమ్రాడే వాధికృతా
న్వినియుంక్తే ఏతాన్ గ్రామాన్
ఏతాన్ గ్రామాన్ అధితిష్ఠస్వే
త్యేవమేవైష ప్రాణ
ఇతరాన్ ప్రాణాన్ పృథ
క్పృథగేవ సంనిధత్తే.

సార్వభౌముడు తన ఉద్యోగులను ఆ యా గ్రామాలను నిర్దేశించి అక్కడ ఉండండని (రాచకార్యాలుచేస్తూ ఉండండని) ఏర్పాటుచేసినట్టే ప్రాణం ఇతర ప్రాణాలను వేర్వేరుగా అంతశ్శరీరభాగాలలో ఉంచి ఆ యా ఇంద్రియాలు సక్రమంగా పనిచెయ్యడానికి ప్రధాన కారణం అవుతుంది.

(అపానాది ప్రాణాలు మిగతా నాలుగున్నా ప్రధాన ప్రాణమే. అది తనను తాను విభజించుకుని నేత్రాదులు చెయ్యవలసే పనులను ఆయా ప్రాణాలచే చేయిస్తుందని భావం.)

5

పాయూపస్థేఽపానం, చక్షుశ్శ్రోత్రే ముఖ
నాసికాభ్యాం ప్రాణస్స్వయం ప్రాతిష్ఠతే,
మధ్యే తు సమానః, ఏషహ్యేతత్ హుత
మన్నం సమం నయతి, తస్మాదేతాః సప్తార్చిషో
భవంతి.

అపానం, ఉదానం, సమానం, వ్యానం- అనే పేర్లతో ప్రాణం తనను తాను విభజించుకుని శరీరములో ఆయా స్థలాలలో ఉంటూ ఇంద్రియాలచే ఆయా పనులు చేయిస్తూ ఉంటుంది.

అపానం అనేది మలమూత్ర విసర్జనచేసే ఇంద్రియాలలో ఉండి ఆ పనులు వాటిచే చేయిస్తూ ఉంటుంది.

ప్రధానమైన ప్రాణమే కన్నులయందు, చెవులయందు ఉండి ముఖనాసికలద్వారా బయటికి వస్తూ లోపలకు పోతూ ఉంటుంది. వస్తుదర్శనం, శ్రవణం, మూర్కొనడం అనే పనులను చక్షుశ్శ్రోత్రాలచే ముఖనాసికల మార్గాల చేయిస్తూ ఉంటుంది.

సమానం అనేది శరీరములో మధ్యనుంటుంది. మధ్యభాగం అంటే నాభి (బొడ్డు). ఈ సమాన ప్రాణమే లోనికి చేరిన అన్నమును ఆ యా ఇంద్రియాలకు సమంగా చేర్చుతుంది. ఆ అన్నం ఆధారంగా కన్నులు మొదలైన ఇంద్రియాల పనులు చక్కగా సాగుతూ ఉంటాయి.

(ప్రాణశక్తి వల్లనే లోపలా పైనా శరీర యంత్రం సమర్థంగా పనిచేస్తూన్నది.)

6

హృది హ్యేష ఆత్మా. అత్రైతదేకశతం
నాడీనాం, తాసాం శతం శత మేకైకస్యాం
ద్వాసప్తతిర్ద్వాసప్తతిః, ప్రతిశాఖా నాడీ
సహస్రాణి భవంతి, ఆసు వ్యానశ్చరతి.

జీవాత్మ శరీరమునందు హృదయ స్థానమునందు ఉంటుంది. అక్కడ నాడులు నూటిపై ఒకటి ఉంటాయి. ఆ నాడులకు ఒకొక్క దానికి నూరు నూరు ఉపనాడులలో ఒకొక్కదానికి సంబంధించి డెబ్బై రెండువేల చొప్పున పిల్లనాడులుంటాయి. వ్యానం అనే ప్రాణం ఈ అన్ని నాడుల లోనూ తిరుగుతూ ఉంటుంది.

7

అథైకయోర్ధ్వ ఉదానః
పుణ్యేన పుణ్యం లోకం నయతి,
పాపేనపాపం,
ఉభాభ్యామేవ మనుష్యలోకమ్.

ఉదానం అనేది ఒక ప్రాణం. అది ప్రాణ విభాగములో ఇంకొకటి. నాభికిపైన ఉంటుంది. వేదం చెప్పిన మంచి పనులు చేస్తే పుణ్య లోకానికి, వేద నిషిద్ధములైన కర్మలు చేస్తే పాపలోకానికి, రెండూ చేస్తే మానవలోకానికి ప్రాణుల్ని చేర్చుతూ ఉంటుంది.

8

ఆదిత్యోహ వై బాహ్యః ప్రాణ ఉదయత్యేష
హ్యేనం చాక్షుషం ప్రాణమనుగృహ్ణానః
పృథివ్యాం యా దేవతా సైషా పురుషస్యాపాన
మవష్టభ్యాంతరా యదాకాశః
స సమానో వాయుర్వ్యానః.

సూర్యుడే ప్రకృతికి బహిఃప్రాణం. కళ్ళలో ఉండే ప్రాణానికి తోడయి ఉదయిస్తూ ఉంటాడు.

(సూర్యకాంతి తగిలితేగాని కళ్ళకి తెలివి రాదు.)

భూమియందున్న దేవత (భౌతికాగ్ని) మానవ శరీరమందున్న అపానవాయువును తన దగ్గరగా తెచ్చుకుని జీర్ణకోశానికి పుష్టిని కలిగిస్తూ ఉంటుంది.

భూమికీ ఆకాశానికీ మధ్య తిరుగుతూ ఉంటుంది సమానం అనే ప్రాణం.

(ప్రాణి సంచార సమయములో జీవ శక్తిని కాపాడుతూ సంచార శక్తిని ప్రకోపింపచేస్తూ ఉంటుంది.)

ప్రాణి నిలకడకికుదురైన పృథివియందు తిరుగుతూఉండే వాయువు 'వ్యానం'- (పైన తిరుగుతూఉండే గాలి నాడీ సమూహమందున్న వ్యానానికి తోడ్పడుతూ ఉంటుంది.)

(సశేషము)

# అన్నమయ్య శరణాగతి

– శ్రీ జి. శివరామకృష్ణ

శరణు జొచ్చెడి తత్త్వము భక్తిమూలమైనది. జీవుడు భగవంతుని చేరుటకు రెండు మార్గములలో ప్రయాణము సాగించును. ఈ రెండు మార్గములు- 1. ప్రవృత్తి 2. నివృత్తి.

అహంకార జనిత జ్ఞానముతో జీవుడు విషయలోకమున ప్రవేశించును. తనచే దర్శింపబడునంతటికి నాతడే కర్తయనుకొనును. లోకమున విజృంభించును. తానే సర్వశక్తిమంతుడని అనుకొనును. తానిక సాధించలేనిది ఏమియు లేదనుకొనును. ఇట్టి అహంకారతత్త్వముగల జీవునికి లోకమున ఒకానొకచోట తన కర్తృత్వమునకు గొప్ప పరాభవము కలుగుచున్నది. తాననుకున్నది సాధింపలేక పోవుచున్నాడు. అసమర్థుడుగా నిరూపింపబడుచున్నాడు. అప్పుడతని ప్రవృత్తి మార్గమునకు భంగము కలిగినదన్నమాట. అప్పుడే అతనికి జ్ఞానోదయమగుచున్నది. తాను కర్తను గాదని తెలుసుకొని ఈ చరాచర సృష్టికి కర్త ఎవరో తెలుసుకొనవలెనని కుతూహలపడుచు జ్ఞానార్థియై భగవదన్వేషియై నివృత్తి మార్గము పట్టుచున్నాడు. భగవంతుని శరణుజొచ్చుచున్నాడు. "నీవు వలసినట్టు సేయి నేనేమి బాధ్యుడను కాను" అని తనను భగవంతునకు అర్పించుకొనుచున్నాడు. నీవు తప్ప నాకింక దిక్కెవ్వరూ లేరని శరణాగతుడగుచున్నాడు. భగవంతునితో ఐక్యమును పొందుచున్నాడు. అపుడు జీవుడు పరమాత్ముడగుచున్నాడు. అప్పుడు ఉండేదొకడే. అతడే పరమాత్ముడు.

నిరహంకారుడై జీవుడు పరమాత్మోన్ముఖుడగుచున్నాడు. పరమాత్మునితో సంబంధము కల్పించుకొనుచున్నాడు. శరణుజొచ్చుచు భక్తుడగుచున్నాడు. ఆ భక్తిమార్గములో పయనించుచున్నాడు. ఈ శరణాగతి "ఆత్మార్పణముగా" కూడ చెప్పకోవచ్చు. ఎప్పుడైతే జీవుడు భగవంతునికి శరణుజొచ్చిన వాడైనాడో అక్కడ ప్రమేయమంతా భగవంతునిదే. భక్తునిది కాదు. భక్తుని సంరక్షణ భారమంతయు భగవానుడు గ్రహించును.

భావము పరాకాష్ఠనందనంతవరకు భగవంతుడు వేచియుండును. ఎప్పుడైతే గజేంద్రునివలె "నీవే తప్ప నితఃపరం బెరుగ మన్నింపదగున్ దీనునిన్ రావే ఈశ్వర కావవే వరదా సంరక్షింపు భద్రాత్మకా" అను అత్యుత్కటభావము కలిగిందో అప్పుడు భక్తుని రక్షించుటకు భగవంతుడు వ్యక్తుడగుచున్నాడు.



జీవుడు పరమాత్ముని శరణువేడుటవలన అత్యధిక ఆనందమును పొందగలుగుచున్నాడు. కర్తృత్వ భావనారాహిత్యము పొందుచున్నాడు. కర్తృత్వము ఎప్పుడును కర్మఫలము నాశించియుండును గనుక అది దుఃఖకారణమగుచున్నది. జీవుడు శరణాగతుడగుటవలన కర్మచేయుచు కర్మఫలత్యాగమును భగవంతునికి సమర్పించుచు నిష్కామకర్ముడై అధికానందము పొందగలుగుచున్నాడు.

అన్నమాచార్యులవారు ఈ శరణాగతాంతర్గత తత్త్వమును క్రింది సంకీర్తనలో దృష్టాంతాలంకారములలో విశదపరచియున్నారు.

దేవుడు గలవారికి దిగులు చింతయులేదు
శ్రీవిభుడే అన్నిటా రక్షించు గనక.

యేలిక గల బంటుకు యేవిచారములేదు
కోలిమగడు గలాలికి వొవ్వమిలేదు
పోషిమి దండ్రిగల పుత్రుని కంగదలేదు
మేలుగా బండిన భూమికి గరవులేదు.

బలముగల రాజుకు భయమేమియులేదు
కలిమి గలవాని కక్కరలేదు
యిల నాచారవంతుని కే పాపమునులేదు
తలపు బుణ్యముగల ఆతనికి జేటులేదు.

గురువు గలవానికి గొఱత యేమియులేదు
వరము గలవానికి భ్రాంతులులేవు
యిరవై శ్రీ వెంకటేశు డన్నిటా మాకుగలడు
అరయదాసులము మా కడ్డాకే లేదు.

(అ. సం._7 వ సం._11 పుట)

కీర్తనలోని భావము సంక్షిప్తముగానిది.

దేవుని మీదనే భారమువేసి జీవించువారికి దిగులులేదు. చింతలేదు. అతని ఆలన పాలనలు ఆ పరమేశ్వరుడే చూచుకొనును. మానవులు తామే కర్తవ్యమును నిర్వహించుచున్నామనియు, తామే కర్తలమని తలంచి సుఖదుఃఖముల పాలగుచుందురు. కర్తృత్వము దేవుని కప్పగించిన మనము సుఖదుఃఖములకు బాధ్యులము కాము. యజమాని గల సేవకునకు ఏ విచారముండదు. భర్తగల భార్యకు తీరని కోర్కెలేదు. తండ్రిగల పుత్రునకు బరువులేదు. పండిన భూమికి గరవు లేదు. బలమున్న రాజుకు భయముండదు. కలిమితో మెలగువానికి అన్నియు సాధ్యములే. సదాచారికి ఏ పాపమంటదు. పుణ్యవంతులకు కీడు కలుగదు. గురువుగల శిష్యునకు సందేహములుండవు. పరలోకమందు ఆసక్తి ఉన్నవాడు ఈ లోకపు భ్రాంతులకు లోనుగాడు: శ్రీ వేంక

(37వ పేజీ)

★  ★

# శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం, తిరుచానూరు

## నిత్యపూజా నివేదనలు

సుప్రభాతం — ఉ. 5-00 గం॥ నుండి 5-30 గం॥ వరకు

సహస్రనామార్చన — ఉ. 5-30 గం॥ నుండి 6-00 గం॥ వరకు

(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు.)

నిత్యఅర్చన — ఉ. 6-00 గంటలకు

(ఏడాదికి రు 150/- లు చెల్లించిన గృహస్థులకు మాత్రమే.)

శుద్ధి, మొదటి గంట — ఉ. 6-15 గం॥ నుండి 6-45 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 6-45 గం॥ నుండి మధ్యాహ్నం 1-00 గం॥ వరకు

శుద్ధి, రెండవగంట — మ. 1-00 గం॥ నుండి 1-30 గం॥ వరకు

సర్వదర్శనం — మ. 1-30 గం॥ నుండి రాత్రి 7-00 గం॥ వరకు

శుద్ధి, రాత్రికైంకర్యము — రా. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు

సర్వదర్శనం — రా. 7-30 గం॥ నుండి 8-30 గం॥ వరకు

ఏకాంతసేవ — రా. 8-30 గం॥ నుండి 9-00 గం॥ వరకు

## శుక్రవారాలలో....

సుప్రభాతం — ఉ. 4-00 గం॥ నుండి 4-30 గం॥ వరకు

సహస్రనామార్చన — ఉ. 4-30 గం॥ నుండి 5-00 గం॥ వరకు

(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు)

నిత్యఅర్చన — ఉ. 5-00 గం॥ నుండి 5-15 గం॥ వరకు

శుద్ధి, మొదటిగంట — ఉ. 5-15 గం॥ నుండి 5-45 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 5-45 గం॥ నుండి 7-00 గం॥ వరకు

నళింపు — ఉ. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు

మూలవర్లకు అభిషేకం — ఉ. 7-30 గం॥ నుండి 9-00 గం॥ వరకు

(100 రూ. టిక్కెట్‌తో ఇద్దరు వ్యక్తులకు మాత్రమే.)

అలంకారము, రెండవగంట — ఉ 9-00 గం॥ నుండి 10-00 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 10-00గం॥ నుండి రాత్రి 8-00గం॥ వరకు

ఊంజల్ సేవ — రా. 7-00 గం॥ నుండి 8-00 గం॥ వరకు

(అద్దాలమండపంలో రు. 150 టిక్కెట్‌తో జరుపుకోవచ్చును. గృహస్థుకు 5 గ్రాముల వెండి డాలర్ బహూకరిస్తారు.)

రాత్రిగంట — రా. 8-00 గం॥ నుండి 8-30 గం॥ వరకు

ఏకాంతసేవ — రా. 8-30 గం॥ నుండి 9-00 గం॥ వరకు

## ఆర్జితం వివరాలు :

ప్రత్యేక దర్శనం : రూ. 2-00

సహస్రనామార్చన : రూ. 6-50

నిత్యఅర్చన : రూ. 150-00 (ఏడాదికి)

అర్చన : రూ. 1-00

హారతి : రూ. 0-50

పూవాభిషేకం (శుక్రవారాలలో) రూ. 100-00

ఊంజల్ సేవ (శుక్రవారాలలో) రూ. 150-00

తిరుచ్చి ఉత్సవం : రూ. 63-00

గజవాహనం : రూ. 32-00.

పెద్దిదిపేయై లు ప్తమై యుండెడివి. కొన్ని రచనలు అందదుకులుగా గ్రంథపాతము లతో తప్పులతోనుండగా వానినెల్ల కంట వ త్తిదుకొని సవరచి, గ్రంథపాతములను స్వయముపూరించి నిర్దుష్టముగా ప్రచురింప జేసినారు. ఈ సంపుటమందు 12 కృతులు అజ్ఞాతకర్తృకములు. 7 కృతులు జ్ఞాతకర్తృ కములు. అందు ప్రకటింపబడిన వేంకటా చలపతి శతకములోని దొక్కపద్యము.

విద్దవు టాస్య రంగమున నిల్పి
ప్రబోరవుఁగావెకట్టి, యే
ప్రొద్దున వెంటఁ దంబురను బూని
శాత్త్విక నాట్యశాస్త్రపున్
బుద్ధులు వెప్పి, నా హృదయ పుత్రిక
మీకును మేలు పాడఁగా
దిద్దితి వేంకటాచలపతీ!
కలశాంబుధి కన్యకా పతీ!

'శ్రీ వేంకటేశ్వర కళ్యాణ' మను గేయా త్మక రచనమున 6 గేయములు మాత్రమే లభింపగా, మిగిలిన మూడు గేయములను శ్రీ ప్రభాకరశాస్త్రిగారు స్వయముకూర్చి ముగింపు చేసినారు. ఆ పూరణము మూల రచన కనుగుణముగానున్నది.

అట్లే కర్త పేరు లేని 'వేంకటశైల నాయక శతకము' ను శోధించి, ఆ శతక కర్త ప్రబంధరాజ విజయ వేంకటేశ్వర విలాస కర్త గుణపవరపు వేంకటేశ్వర కవి యని గుర్తించినారు. వాచవిక్తై ఆ యమక శత కములోని దొక మచ్చుతునుక.

కమ్మఁ తమ్మిపోదుమిసి, గమ్మక
నమ్మకరాంతుఁడెమ్మె పై
విమ్మెయు, విమ్మెయున్ గడిమి,
యిమ్మెయుఁ గ్రుమ్మెమరమ్మ, రమ్మ, పే,
రమ్మ. కరమ్మ నెమ్మది తిరమ్మగ
నమ్మిన, నమ్మ నెంచి, చి
త్తమ్మున మంచి యేలు విరతమ్మిక
వేంకట శైలనాయకా!

## తిరుప్పావై—సప్తపదులు :

ద్రవిడ వైష్ణవులు వేదకల్పముగా అధ్య యనము చేయు 'నాలాయిర' మను ద్రవిడ ప్రబంధసహస్రిలో 'తిరుప్పావై' అను ముప్పది పాశురముల గ్రంథమున్నది. అది తెలుఁగు దేశమునందుకూడా వైష్ణవు లకు వాచోవిధేయమైయుండును. తిరు ప్పావై తెలుఁగుసేత గల గ్రంథము మదరాసు ఓరియంటల్ లైబ్రరీ నున్న సప్తపదులు పదింటిని కనుగొనిరి. ఆ పది పాశురములు తెలుగు పాటలుగా రచించిన వాఁడు శ్రీనివాసగురుడు. కడమ యిర్వది పాశురములను సప్తపదులుగా శ్రీ శాస్త్రి గారనువదించి 1925లో తొలుత ప్రకటించిరి. దానినే కె. వెంకటస్వామి నాయుఁడుగారు తి. తి. దేవస్థానం కమిటీ ప్రెసిడెంటుగా నుండగా (1950) తిరుప్పావై—సప్తపదులు అను పేర మరల ప్రచురించినారు. అరవ మూలములో కూడిన ఈ తెనుఁగు అనువా దము చిన్ని పొత్తమును టి. టి. డి. వారు మరల ప్రచురించుట లెస్స.

శ్రీ ప్రభాకరశాస్త్రి మహోదయులు ప్రాచీన గ్రంథములనుండి శ్రీ వేంకటేశ్వర వర్ణనా పరములైన రచనల నెల్ల సేకరించి ఒక సంపుటముగా ముద్రింపనున్నట్లు (1950) తెల్పినారు. ఆ సంవత్సరమే శ్రీ శాస్త్రిగారు పరమపదించుటచే ఆ సేకరణము ప్రచురింపవలనుపడలేదు. అది ప్రకటితము కావలసియున్నది.

## శ్రీ అన్నమాచార్య జీవితచరిత్ర :

సుప్రసిద్ధ సంకీర్తనాచార్యులు తాళ్ళ పాక అన్నమయ్య జీవితచరిత్రమును, ఆయన మనుమడు చిన తిరువేంగళ నాథుఁడు అను పేరుగల చిన్నన్న ద్విప దలో రచించెను. ఈ ప్రామాణిక రచనను సముద్ధరించి ప్రకటించుచు, దానికి 126 పుటలు గల విస్తృత పీఠికను రచించి అను సంధించినారు. ఇందు వేంకటేశ్వరస్వామి వైభవము (చిత్రములతోకూడ) సంకీర్తన లాధారముగా చరిత్రాదికము ఉపపత్తులతో వివరించినారు.

ఏనాడో ఆరంభించి, ఆగిపోయిన తాళ్ళ పాకవారి సంకీర్తనలు 4, 5 సంపుటములు పరిష్కరించి ప్రచురించినారు. అటు పిమ్మ టనే, శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు కొన్ని సంపుటములు ప్రచురించిరి. ప్రస్తుతము శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ గారు పరిష్కర్తలై ప్రచురింపజేయు చున్నారు. కాని ఈ సంకీర్తనల ప్రచురణకు ప్రేరణ ప్రధానముగా వేటూరి వారిదే.

## సంకీర్తన ప్రచురణ :

అన్నమాచార్యులవారి విగ్రహములను గుర్తించి, వాని ప్రతిబింబములు తీయించి నారు. తాళ్ళపాకవారి అరలో తాము, శిష్యుడు శ్రీ ఏ. వి. శ్రీనివాసాచార్యులవారి సాయమున సంకీర్తనల రేకులన్నింటిని వెలికి తీయించిన ప్రథములు ప్రభాకరులే.



లేపాక్షి శిల్పం : ఫోటో : డా॥ వి. కామేశ్వరరావు.

పాక అన్నమయ్య వర్థంతి యుత్స
ం తొలుత ప్రకల్పన మొనరించి-
ఎల ప్రచారమునకు క్రొత్త ఊపిరి
ు. అది యీనాడు దేవస్థానము
లంబముతో అనిదంపూర్వముగా
పూవులా రుకాయలుగా వర్థిల్ల
.

ాలా రచనము :

ప్రభాకరశాస్త్రిగారు వేంకటేశ్వరస్తుతి
ా రచించిన పద్యము లొండు చిత్త
.

వేడుకొండలమీఁద నూరును
యు దరిలేని పట్టునందు
ృతివి దివ్య నిలయంబు లచ్చోట
ంభోగ్యభాగ్యముల్ పరిఢవిల్ల
చుంటి సర్వప్రపంచము మ్రొక్క
వారి కావదల్ దొడర కుండ
ు కొనుచుంటి వెప్పుడుఁగోటాను
భక్తులను నీ కొండదరికి

ము వేనవేలు ద్రవ్యంబుసేక
ంటివి వడ్డితోఁ బెంచి పెంచి
త్మ్ము తరమగునే నుతింప?
శ్వర దేవ! నిశ్శంక భావ!

ందూ ధర్మ ప్రతిష్ఠానమునకు-వేంక
మహిమాను వర్ణనాపరములైన రచ
లువరించుటలో వారు తనుపుగొనిరి.
విత లక్ష్యములలో తాళ్ళపాక కవుల
ం వెలువరించుట ఒక ప్రధానాంశము.
క్తి వాఙ్మయమునకు తోడ్పడు
ి. ఆయా రచనల ప్రకటన ఆంధ్ర
తమునకు ఎంతో మేలొనగూర్చినది
ారి ప్రభాకరశాస్త్రి వర్యులు వేంక
వాఙ్మయోద్ధారకులలో ప్రధానులు-
ఖులు.

కిలి లేని భక్తి మనసారఁ దలంచి నమస్క
రించి, మా
కట మూర్పవే యన వెసన్ సుఖమిచ్చి
యనుగ్రహించి తో
కర కల్పకంబ! పరికించితి నీమహనీ
యతల్ 'కలౌ
కటనాయకో' యను సువిశ్రుత సూక్తి
యథార్థ భావమున్.

(ఆంధ్రాభ్యుదయము-మాసపత్రిక-1925)

'వేటూరివారి సారస్వత వరివస్య'
నా సిద్ధాంతవ్యాసము నుండి] *

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

శ్రీ అన్నమాచార్య ప్రాజెక్టు సమర్పణ



# శ్రీ అన్నమాచార్య సంకీర్తనలు

## (ప్రీరికార్డెడ్ కేసెట్లు - రెండుసెట్లు)

ప్రముఖ గాయకులు శ్రీ పి. బి. శ్రీనివాస్, శ్రీ జి. బాలకృష్ణప్రసాద్, శ్రీమతి ఎస్. జానకి, కుమారి ఎస్. పి. శైలజగార్ల మధురమనోజ్ఞ సంగీత రసధుని

**శ్రీ వేంకటేశ్వర గీతమాలిక** (మూడుసెట్లు)

కుమారి ఆర్. బి. శోభారాజు, శ్రీ జి. బాలకృష్ణప్రసాదుల గీతికాగుచ్ఛం.

**శ్రీ కామిశెట్టి శ్రీనివాసులుగారి భక్తిభావస్ఫోరక వ్యాఖ్యానంతో**

మచ్చుకి ఇదిగో ఈ పాటను చూడండి.

పాపపుణ్యముల పక్కమిదెరుగను
నాపాలిటి హరి నమోనమో
మానసవాచక మతకర్మంబుల
కానకముగ నీ దాసుడను
భువి త్రివంధ్యల భోగభాగ్యముల
నానాగతులను నమోనమో
వలసగా జాగ్రత్స్వప్న సుషుప్తుల
ఇలలో నీకే హితభటుడ
వెలుపల లోపల వేళావేళల
తలివాక్కు నీకె నమోనమో
పుట్టుక తెలియను పుట్టినమీదట
అట్టె నీ శరణాగతుడ
గట్టిన శ్రీ వేంకటపతి నీ కృప
పట్టపరమైతి నమోనమో.

**వ్యాఖ్యానం**

ఏది పాపమో, ఏది పుణ్యమో నాకు తెలియదు. వీని పర్యవసానాన్ని కూడా నేను తెలుసుకోలేను. నాకు బుద్ధి వచ్చినప్పటి నుంచి తెలిసింది ఒక్కటే! నీవు నాపాలిటి వేల్పువు.

ఇది సమయం, ఇది అసమయం అనే జ్ఞానం లేదు. నీ దివ్యనామాన్ని స్మరించడమే నాకు తెలుసు. జనన మాదిగా నేను శరణువేడి నీ చరణాల వద్ద పడివున్నవాడిని; నీవాడిని. నన్ను కడదాకా, కాపాడే బాధ్యత నీదే.

అన్నీ ఇలాంటి అలౌకికానుభూతిని కలిగించే పాటలే—

తిరుమల తిరుపతి దేవస్థానం సమాచార కేంద్రాలలో తగ్గింపు రేట్లకు పై కేసెట్లు దొరుకుతున్నాయి. త్వరపడండి. ఈ అవకాశాన్ని జారవిడుచుకోకండి.

# పొడుపుకథల్లో తాత్త్వికత

డా. కసిరెడ్డి వెంకటరెడ్డి

జానపదులు సృష్టించిన పారమార్థికసాహిత్యంలో 'తత్త్వాలు' విశిష్టమైనవి అవి మాతృకగా పొడుపుకథలెన్నో పుట్టుకొచ్చాయి. తత్త్వచింతనలో ఇవి మేధావుల రచనల కేమాత్రం తీసిపోనివి. సం॥

వేదాలు సూత్రించినట్టి, ఉపనిషత్తులు ప్రవచించినట్టి పరబ్రహ్మమెుక్క తత్త్వాన్వేషణం అనాదిగా కొనసాగుతూనే ఉంది. తత్త్వచింతనం అనేది మానవజీవనంలో పెనవేసుకొనిపోయిన ఒక అంశమయింది. ప్రాణిప్రకృతుల సత్యనిరూపణార్థం తత్త్వచింతనం ఆవిర్భవించింది. శాస్త్రీయ విజ్ఞానం ప్రపంచంలోని అన్ని దిశల్ని స్పృశించని కాలంలోనే ప్రకృతి పరతత్త్వాల్ని గూర్చి పంచభూతాల్ని గూర్చి చింతన ప్రారంభమయింది. భౌతికపరమైన సత్యాల్ని శాస్త్రీయ విజ్ఞానం వెల్లడిస్తున్నా మనిషికి సంతృప్తి కలుగడంలేదు. అందువల్లనే కర్మకాండకు, జ్ఞానకాండకు సంబంధించిన విషయాలతో, తద్వివరణలతో, తర్కాలతో బృహద్గ్రంథాలు ఆవిర్భవించాయి. భారతీయ జనతలో ఏ కొందరో ఈ విషయం తెలిసినవారు. జానపదులు ఈ గ్రంథాల ముఖం కూడా చూడలేదు. కానివారు ఉపనిషద వేదాంత భావనాలంబితమైన సాహిత్యాన్ని అతివేలంగా సృష్టించారు. స్పష్టాస్పష్టమైన జానపదమార్మిక కవిత్వాన్ని కుప్పలు తెప్పలుగా, కుమ్మరించారు. అవి కాలజ్ఞాన తత్త్వాలుగా, ఆత్మబోధామృతాలుగా, కలిప్రమాణాలుగా ఇంకా అనేక నామాలతో పిలువబడ్డాయి. ఆయా వ్యక్తుల నామాల్నిబట్టి తత్త్వాలని పిలువబడ్డవికూడా కొన్ని ఉన్నాయి. జానపద సాహిత్యంలోని పారమార్థిక గేయాల్ని తమ తమ గ్రంథాల్లో పరిశోధకులెందరో ఇంతకు మునుపే చర్చించారు. ఇక్కడ మాత్రం పొడుపుకథల ఛాయలున్న కొన్ని జానపద ప్రహేళికల్ని పరిశీలిద్దాం. తత్త్వంలో కర్మ జ్ఞాన భక్తులు అవిభాజ్యాలైనందువల్ల ఈ పొడుపుకథల్ని కర్మసంబంధులనీ, జ్ఞాన సంబంధులనీ, భక్తి సంబంధులనీ విభజిద్దాం.

## కర్మసంబంధులు :

భారతీయతాత్త్విక జీవనంలో కర్మకు అత్యంతప్రాధాన్యముంది. కర్మమన్నంతనే నిత్యానుష్ఠాన జీవన కార్యక్రమాలకు అతి దూరమయిందని కొందరు భావిస్తుంటారు. జీవితాన్ని అనుశాసనబద్ధంగా తీర్చిదిద్దుకోడానికి, మానవుణ్ని క్షణక్షణ కర్మానుగామిగా రూపొందించడానికి, చేసేపనికి పవిత్రతను ఆపాదించడానికి మాత్రమే కర్మకాండ ఆవిర్భవించింది. ఇటువంటి కర్మలు నిత్య నైమిత్తిక కామ్యనిషిద్ధాలని తెలుపబడ్డాయి. భారతీయులు స్మృతి శాస్త్రసిద్ధాంతానుసారులై అనాదికాలంనుండి ఇటువంటి కర్మల్ని ఆచరిస్తూనే ఉన్నారు. సమాజంలో కాలక్రమంగా వచ్చిన పరిణామాల్ని పరిశీలిస్తూనే కర్మకాండలో అనేక పరివర్తనలు తెచ్చారు. కర్మశాస్త్రాలు ధర్మశాస్త్రాలు ఛాందసాలైన పిడివాదాలకు దిగక, కరడుగట్టిన మానిసులుగా వ్యక్తుల్ని సిద్ధంచేయక, మనోవికాసానికి సమాజ శ్రేయస్సును ఆకాంక్షించే సత్కర్మకు ప్రాధాన్యం ఇచ్చాయి. ఆ కారణాన్నే జానపదులు పుస్తకాల్ని చూడకున్నా తద్విషయ జ్ఞానాన్ని కర్ణాకర్ణించి మస్తకాల్లోకి యెక్కించారు.

కుంటనిండె–కుంటయెండె
కుంటయెన్కా–పంటపండె
పంటగోసి–కుప్పలెత్తి
కుప్పగాలె–అప్పుదీరె

(కుమ్మరావం)

కుంట నిండింది, కుంటలోకి ఒండ్రుమట్టి వచ్చింది. కుంట యెండింది. ఇక ఆ బంక మట్టి కుమ్మరికి పంటేమరి ! అతడు ఆ కుంట వెనుకనె ఆ మట్టితో కుండలపంట పండించాడు. కుమ్మరిసారెపై కుండలు ఎదిగెదిగి వస్తాయి. ఆ కుండల్ని కుమ్మరి కోస్తాడు. వాటిని రకరకాలైన పద్ధతులతో

తీర్చిదిద్దుతాడు. ఎండబెడతాడు. ఆ తర్వాత కుప్పలెడతాడు. కుప్ప కాలుస్తాడు. ఈ కాల్చడాన్నే కుండలు వానడం అంటుంటారు. అప్పుడీరడం ఇక కుండలమ్మిన పిదపనే జరుగుతుంది. కుంట నిండడం, ఎండడం, కోయడం, కుప్పలెట్టడం, కాల్చడం ఈ పొడుపుకథలో ప్రధానాంశాలు.

కాలజ్ఞాన తత్త్వాల్లో యాగంటివారి పేరిట ఉన్న మేలల్లో ఇటువంటివి యెన్నో ఉన్నాయి. కాని ఇది లేదు. ఆకాశవాణి ప్రసారం చేసిన యాగంటివారి తత్త్వాల్లో ఇది వినిపిస్తోంది.

కుంటనిండి పంటపండి
పంటపండి కుప్పగాలే
కుప్పగాలీ అప్పుతీరెరా – యా గంటి లింగ
దీని భావము నీకు దెలుసూనా

ఇటువంటి తత్త్వాలనుండి జారి జానపదుల నోటపడి కొన్ని మార్పులతో చేర్పులతో పొడుపుకథా రూపాన్ని సంతరించుకొన్న వాటిలో పై కర్మప్రహేళిక ఒకటి. కర్మమంటే పని. కుమ్మరిపని ఇందులో ఉంది. మర్మంతోకూడిన తత్త్వముంది. అందువల్ల తాత్త్విక ప్రహేళికల్లోని కర్మ సంబంధుల్లో ఇది చేర్చబడింది.

ఆకూలేని అడవిలోన
మేకలైదు మెయ్యాబోతే
కండ్లులేని వాడు సూసేరా
కాళ్లులేనివాడు ఉరికేరా
(చెరువు–చేపలు–ఎండ్రకాయ–పాము)

ఆకులేని అడవి చెరువు. మేకలైదు చేపలు. కండ్లు లేనిది ప్రాము. ఈ తాత్త్విక సంబంధి పొడుపుకథ భావమే ఉన్న తత్త్వమొకటి కనిపిస్తోంది.

ఆకులేని అడవిలోన
తోకలేని మృగము బుట్టె
తోకలేని మృగమూ కడుపూనా – ఓ
యాగంటిలింగా
ఈకలేని పక్షిబుట్టెరా!

ఈ తత్వంలో అంతూపొంతూ చిక్కని ఇటువంటి భావాలుగలవి యెన్నో ఉన్నాయి. ఇటువంటి వాటినుండి దూరమై అర్థదిశకు దగ్గరై ఇవి తాత్త్విక సంబంధి పొడుపుకథలుగా మారాయి.

ఊరులేని పాటిమీదా
పేరులేని గరిక మొలచే
నోరులేని లేడి మేసేరా
ఓరితమ్మి ఓరి అన్న
దీనిలోని మాయయేందిరా!

ఊరిలేని పాటితోలు
పేరులేని గరికచాలు
నోరులేని లేడి కత్తి (వాలు)
ఓరితమ్మి ఓరి అన్న
దీనిలోని మాయ యిదేరా!

పాటిఅంటె పాటినేల. సాంద్రమైన నేలను పాటినేల అంటారు. ఓ ఊరు పాడుబడితే అక్కడ దిబ్బ యేర్పడుతుంది. దానిని గ్రామీణులు పాటిగడ్డ అంటారు. నెత్తి వెంట్రుకల్ని కత్తిమేసింది–అదీ విడుపు. క్షుర కర్మ కర్మే. కనుక ఇదికూడా కర్మసంబంధి పొడుపుకథల్లో చేర్చడం జరిగింది.

ముంతల సెట్టు
సెట్టుకు కాయ,
కాయ పండయింది,
ముంత పగులకుండ
పండు తెగుతది
(కడుపు, బీజం, పిండం, ప్రసవం)

ముంతఅంటే దేహం, చెట్టంటే ఉదరం, కాయఅంటే బీజం, పండంటే పిండం, ముంత పగలకుండ అంటే శరీరం చెడకుండ; పండు తెగుతుందంటే ప్రసవమవుతుందని అర్థం. భారతీయ సంస్కృతి షోడశ కర్మల్ని ప్రతిపాదించింది. గర్భానికి గర్భస్థశిశువుకుఎన్నో కర్మలు చేయవలసి ఉన్నాయి. ఈ రోజు మందుల్ని ఉపయోగించడం తగిన జాగ్రత్తలు తీసుకోడం ఎటువంటిదో కర్మాచరణంకూడా అటువంటిదే. ఆ కారణాన్నే ఈ ప్రహేళికను తాత్త్విక సంబంధమైన కర్మ ప్రహేళికల్లో చేర్చడం జరిగింది.

విడుపు కథలుండి అర్థవివరణాను కూల్యాలైన కర్మ సంబంధి తాత్త్విక ప్రహేళికలు జానపదుల్లో మిక్కిలి తక్కువగా వినిపిస్తున్నాయి. అవికూడా వడ్రంగి, కమ్మరి, కంసాలి మొదలైన వృత్తిపనులు చేసే వృద్ధులు మాత్రమే పొడుస్తున్నారు. వారు కూడా తాము పొడిచిన పొడుపుల్లో సగానికి పైగా విడుపుల్ని చెప్పలేని స్థితిలో ఉన్నారు. తాత్త్విక ప్రహేళికల్లో కర్మ సంబంధుల రాశి తక్కువదే అయినా వాసి గణనీయమయిందే!

## పరమాత్మ పథము

పొడరాదా పదము పదిజన్మలకు వరము
పట్టరాదాపథము పరమాత్మ పథము ॥ పొడ ॥

యుగములను జగములను నడిపించు పథము
బహుగొప్పసామ్రాజ్య మొనగూర్చు పదము
ఇహపరమ్ములకైన ఇలవైన పదము
సుఖశాంతులను గూర్చు చక్కనీ పదము ॥ పొడ ॥

ఏడేడులోకాలు వెలిగించు పదము
ఎదలోన మదిలోన మెదిలేటి పదము
ఎల్లదేవతలు కొలిచేటి పదము
ఏడుకొండలపైన వెలసినా పదము ॥ పొడ ॥

– ఆదూరి సత్యవతీదేవి

**జ్ఞానసంబంధులు :**

బ్రహ్మజ్ఞానావిష్కరణలో భారతీయ సంస్కృతి విశ్వవిశాలాలైన భావాల్ని సంభావించింది. ఈ విషయంలో మహర్షుల దర్శనాలు ఉపనిషదమృతాన్ని ప్రవహింప జేశాయి.

"ఈశ్వరుడు ఈ జగత్తు అంతటా వ్యాపించి ఉన్నాడు. తేజస్సులాగా సర్వత్రా వ్యాపించిన ఆ బ్రహ్మాన్ని నేనే, పూర్ణమై అక్షరమై ఉన్న ఈ బ్రహ్మం ఓం అని చెప్పబడుతున్నది. ఈ ఆత్మే బ్రహ్మం, ఆ బ్రహ్మం స్వయంప్రకాశమానుడైన ప్రత్యగాత్మే స్వరూపంగాగలది, ఏకైక చైతన్యమే బ్రహ్మం, ఆ చైతన్యమే ప్రజ్ఞానం, ఆ ప్రజ్ఞానమే బ్రహ్మం, ఎక్కడ నుండి భూతాలు ఇక్కడ పుట్టాయో, దేనివల్ల జీవిస్తున్నాయో, మరణం ద్వారా దేనిలో లయమవుతున్నాయో అదే బ్రహ్మమని గ్రహించండి. విజ్ఞానమే బ్రహ్మ, జ్ఞానంకన్నా పవిత్రమైనదింకొకటి లేదు."

ఇట్టి మహావాక్యాలెన్నో బ్రహ్మజ్ఞాన స్వరూపాన్ని వివరించాయి. అయినా అన్వేషణ ఆగలేదు. ఇంకా కొనసాగుతూనే ఉంది. మహర్షిప్రోక్తాలైన ఇటువంటి మహావాక్యాల్ని ఊతగా తీసుకొని కథలూ గాథలూ ప్రాదుర్భవించాయి. అవి మౌఖిక ప్రచారాన్ని పొంది భారతీయ జనజీవనంలో ప్రవేశించాయి. అటువంటి వాసనాలంబితుడైన జానపదుడు ఆ భావనా మననధ్యానాలచేత జానపగేయ సాహిత్య శరీరంలో ఆత్మసదృశమైన తత్త్వాన్ని ప్రతిష్ఠించాడు. అట్టి తత్త్వంలో కర్మజ్ఞాన భక్తి మార్గాలు పరమోదాత్తాలైనవి. జానపద గేయ సాహిత్యాంతర్భాగాలుగా పరిగణించ దగినట్టి తాత్త్విక సంబంధులైన పొడుపు కథల్లో అటువంటి జ్ఞానమార్గ ఛాయలు ఎడనెడ కనిపిస్తున్నాయి. అందులో కొన్ని పరిశీలిద్దాం.

మూడుమూరల తోటలోన
ఆరుమూరల కాయగాసె
అడుగులేనిదొంగ వచ్చె
తొడిమలేని తెంపు తెంపె

(యముడు ప్రాణంతీయడం)

మూడుమూరలతోట ముజ్జగాలు. ఆరుమూరల కాయ మనిషి. అడుగులేని దొంగ యముడు. తొడిమలేని తెంపు తెంపడం ప్రాణం దీయడం - రూపు మిగలకుండడం. ఇది యెవరి తత్త్వానికో అనుసరణకావాలి. వృద్ధజానపదులు దీనిని పొడుపుకథగా చెబుతున్నారు. మనిషిని ఆరుమూరల కాయ అనడంలో అరిషడ్వర్గాల్లో తిరిగేవాడనే ఉద్దేశ్యం ఉండేమో! యమధర్మరాజును అడుగులేని దొంగ అనడం జానపదుల నిశిత పరిశీలనానికి నిదర్శనం.

చంద్రగిరిల చెట్టుపుట్టె
తిరుపతిల తీగవారె
ఆకాశాన కాయగాసె
పర్వతాన పండుపండె

(చంద్రుడు)

చంద్రుడెక్కడో జన్మిస్తాడు, ఆ వెన్నెల తీగ ఎక్కడెక్కడికో పారుతుంటుంది. నిజానికది ఆకాశాన కాసినకాయ. అస్తమయ కాలానికి అది అస్త్రాద్రిపై పండువలె అవుతుంది. పండురూపం పొందిన తర్వాత అందరేమవుతారో చంద్రుడూ అదే అవుతాడు బ్రహ్మపదార్థం విశ్వవ్యాప్తమయింది. జానపదుని భావనకూడా విశ్వవ్యాప్తమై ఉంది.

మర్మకవిత్వం ఛాయలోకి వచ్చే ఇటువంటివి కొన్ని వేగంటివారి రచనల్లో తుమ్మెద పదాలుగా కనిపిస్తున్నాయి. ఇటువంటి పదాలు జానపదుల నోళ్ళలో నానుతూ అనేక విధాలుగా మార్పులు చెందుతూ ఏది మాతృకో ఏది ప్రతికో గుర్తించలేని దశకు వచ్చింది.

చన్నులేని ఆవుపాలు
చెయ్యిలేని వాడుపిండె
అగ్నిలేని పాలు కాగె
నోరులేని బాలతాగె

(వాన)

ఆకాశదేవతే ఆవు. ఆమె వర్షిస్తోంది. ఆ దేవతకు స్తనాలులేవు. ఆ పాలను పిండే వానికి చేతులులేవు. భూమిమీద అగ్నిలేదు,



ప్రేమయింపకోయ్ మురళీ....          చిత్రం: ఇ. గోపాలరావు.

కాని పాలు కాగుతున్నాయి. భూమికి నోరు లేదు. ఆ భూతాల ఆ పాలను తాగుతోంది. ఆకాశమంతా అల్లుకుపోయిన మహత్త్వాన్ని అద్దంలో పట్టిచూపాడు జానపదుడు.

క్రాంత దర్శులైన మహర్షులు భావించిన విశ్వవిశాలాలైన ఉపనిషద్ భావనలకు, వసుధైక కుటుంబాదర్శాన్నికై కలలుగన్న ప్రాచీనార్వాచీన ప్రాక్పశ్చిమ మేధావుల రచనలకు జానపదుల తాత్త్విక విజ్ఞానం ఎంతమాత్రం తీసిపోయేదికాదు. శబ్ద సంస్కారాన్ని మించిన అర్థ సంస్కారంతో జానపదుల తాత్త్విక ప్రహేళికలు దివ్యాలై భవ్యాలై అందరిని ఆలోచనా విహంగాలుగా చేసేస్తున్నాయి. ఇక భక్తి ప్రహేళికలపై అటువంటి విహంగ వీక్షణం చేద్దాం.

### భక్తి సంబంధులు :

మంచికి ప్రతీక అయిన దైవాన్ని గూర్చి జీవులుచేసే ధ్యానం భక్తి అనబడుతుంది. ఈ ధ్యానానికి యెన్నో సోపానాలుంటాయి. జీవునిలో దైవ సంపదఉంది. అజ్ఞానం వల్ల అది తెలియదు. భక్తిద్వారా జీవుడు తనలోని దైవీగుణాల్ని గుర్తిస్తాడు. అహంకార మమకార వర్జితుడవుతాడు. సమత్వాన్ని ఆచరణలో పెడతాడు. తనవారూ పరులూ అనే భేదభావం విడిచి అందరొక్కటనే మానసిక స్థితిని పొందుతాడు. అమృతపుత్రుడైన మానవునిలోని దైవీ సంపదను లోకకల్యాణార్థం ఉపయోగించే నిమిత్తమై భక్తి ఆవిర్భవించింది. భక్తి తత్త్వానికి సంబంధించిన సాహిత్యమెంతో పుట్టింది.

అట్లే జానపద సాహిత్యంలో భక్తికి సంబంధించిన గేయాలు, వచనాలు, గేయ వచనాలు ఎన్నో కనిపిస్తున్నాయి. పొడుపు కథల్లో పటిష్ఠమైన భక్తితత్వం కనిపించదు. కొన్ని పొడుపుల్లో మాత్రం దైవాన్ని స్మరించడమో లేదా దైవీ చిహ్నాల్ని తలంచడమో గమనిస్తాం. అంతమాత్రానికే భక్తి అనబడదు, కాని జానపదులు భక్తిభావ సంబంధులనడానికి అవి నిదర్శనాలవుతాయి. అటువంటివే కొన్ని ఈ శీర్షిక క్రింద చూపించడం జరుగుతుంది.

ఇంతంత గుడిగాదు
ఈశ్వరుని గుడిగాదు
కంచు గోపురముగాదు
కదిలించరాదు

(ఆకాశం)

ఆకాశం శూన్యం. అది యెవరికి నిలయమని యెలా చెప్పగలం? ఎక్కడ మానవుడుంటాడో అక్కడ ఈశ్వరుడుంటాడు. లేనిది ఉన్నట్లు కనిపిస్తోంది. అది యెంత ఉంది? ఇంతాఅంతా లేదు, ఎంతో ఉంది. అందుకే కదిలించరాదనే సత్యాన్ని పలకడం. ఈ పొడుపుకథలోని కూర్పును పరిశీలిస్తే ఇది కూడా జానపదుల తత్త్వమే అనిపిస్తుంది.

పచ్చ పచ్చనిదదే
పసుప్పూసుకునే దదే
దేశం తిరిగే దదే
దేవుని పక్కల పండేదదే

(బంతిపువ్వు)

మనిషి అలంకార ప్రియత్వాన్ని దేవుని ద్వారా తీర్చుకొంటున్నాడు. కళానైపుణ్యాన్ని ప్రకటించుకొంటున్నాడు. కొందరు దైవాన్ని అలంకార ప్రియునిగా చేశారు. పూలరంగనిగా మార్చారు. అందువలన బంతిపువ్వుపై పుట్టిన ఈ పొడుపుకథలోని చివరిపాదం వల్ల భగవంతుని భోగప్రియత్వాన్నే జానపదుడు చెప్పడం జరిగింది. భగవత్తత్త్వం సామాన్య మానవునికి కూడా అర్థమయ్యేట్టు కథా రూపక ప్రచారం జరిగింది. అందువల్ల విద్యాగంధశూన్యుడైన జానపదునికి దైవీ గుణాలు తెలిశాయి. అసురీగుణాలు అర్థమయ్యాయి. ఆ కారణాన్నే దైవానికి తన సర్వస్వం అర్పణ చేసుకొనేట్టి, లేదా తృణమో పణమో సమర్పించుకొనేట్టి మానసిక స్థితికి మానవుడు వచ్చాడు. జానపదుడేమో తోటలో పూచిన బంతిపూవుకే విశ్వజనీనతను ఆపాదించాడు.

ఓహో సన్నాసి
నీపైనిండ విభూతి
నీ సేతులకు శంఖు చక్రాలు
నీ నెత్తిన రుద్రాక్షలు

(ఆముదం చెట్టు)

అటువంటి దైవీతత్త్వాన్ని ప్రచారం చేయడానికి కొందరు సన్యాసజీవనం చేపట్టారు. నిరలంకృతులై నిరాడంబరులై సంచరిస్తూ సమాజాన్ని దైవీతత్త్వంద్వారా ఏకసూత్రాన బంధించడానికి వారు ప్రయత్నం చేశారు. అటువంటి సన్యాసులను ఆముదం చెట్టుకు సంకేతించారు. భగవంతునిపై భగవద్భక్తులపై జానపదుల విశ్వాసం అచంచల మయింది.

గుడివెనుక నల్లన
గుడిలోన తెల్లన

(కొబ్బరి కుడుక)

గుడిచుట్టు నల్లన
గుడిలో తెల్లన

(అన్నంకుండ)

గుడినిండ నిప్పులు
గుడికి తాళం

(దానిమ్మపండు)

గుడిలోన నల్లన
గుడివెనుక తెల్లన

(గులాబి)

ఇటువంటివన్ని భక్తి సంబంధులైన పొడుపుకథలేం కావు. కాని కొన్ని ఛాయలున్నాయి. జానపదుని హృదయంలో దైవానికి సంబంధించిన దైవీ చిహ్నాలకు సంబంధించిన కొన్ని కల్పనలున్నాయి. అటువంటి కల్పనల్ని ఈ పొడుపుకథల్లో దిఙ్మాత్రంగా జానపదులు ప్రదర్శించారు. కేవలం అటువంటివాటినే ఆధారంగా తీసుకొని భక్తి సంబంధులనే ఈ శీర్షిక క్రింద జానపదుల కొన్ని పొడుపుకథల్ని ఉదాహరించడం జరిగింది.

మొత్తం మీద జానపదుని తాత్త్విక జీవనంలో కర్మజ్ఞాన భక్తి మార్గాలకు అత్యంత ప్రాధాన్యం ఉంది. జానపద తాత్త్వికప్రహేళికలు అధికంగాలభించకున్నా జానపదుల పారమార్థిక సాహిత్యానికి యెటువంటి కొరత లేదు. భక్తి సుదీర్ఘాలైన కథలద్వారా ప్రచారమవుతుంది. ముక్తకాలవంటి పొడుపుకథా పద్ధతులు భక్తికి వాహకాలు కాజాలవు. తాత్త్విక విషయాల్ని అందించలేవు. ఒక్కొక్క భావన ఒక్కొక్క రీతిగా ఉంటుంది. ఆ భావనల్ని ఆ రీతుల్లో చెప్పడమే మంచిది. *

# యువ వాణి

## యోగంతో రోగనివారణ

*అందరూ అనుకొనేటట్లుగా యోగాభ్యాసమంటే కేవలం ఒక వ్యాయామప్రక్రియ కాదు- అదొక ప్రత్యేక ఆధ్యాత్మిక సాధన - దానితో శారీరక మానసిక రుగ్మతల్నికూడా నయం చేసుకోవచ్చునని చెబుతున్న ఈ వ్యాస రచయిత్రి* **శ్రీమతి ఎస్. ఆర్. వై. రాజ్యలక్ష్మీదేవి** *తిరుపతిలోని యోగపరిశోధనా కేంద్రంలో ప్రిన్సిపాల్‌గా పనిచేస్తున్నారు.*

ఆరోగ్యమే మహాభాగ్యము అను ఆర్యోక్తి అందరికి తెలిసినదే. ఆరోగ్యము కాపాడుకొనుట రెండు విధములు. ఒకటి వ్యాధులు రాకుండగనే నివారించుకొనుట. రెండవది వ్యాధులు వచ్చిన తరువాత నయం చేసికొనుట. చికిత్సా విధానము లనేకములు గలవు. పాశ్చాత్య వైద్యవిధానము, ఆయుర్వేద, యునాని, హోమియోపతి మొదలగు వైద్యవిధానములు. కాని పై చెప్పబడిన వైద్యవిధానములలో రోగము వచ్చిన తరువాత చికిత్సపొంది బాగుచేసుకొను విధానములు చెప్పబడినవేగాని రోగమే రాకుండా చేసుకొను విధానము అంతగా చెప్పబడలేదు. మరొక ముఖ్య విషయమేమన పై చెప్పబడిన వైద్యశాస్త్రములలో భౌతికదేహానికి సంబంధించిన వ్యాధులను నయముచేయు పద్ధతులు చెప్పబడినవేగాని మానసిక సంబంధమైన అశాంతికి చికిత్స చెప్పబడలేదు. యోగశాస్త్రము సరిగా అభ్యసించినవారు ఇహపరలోకములలో సుఖశాంతులను సులభంగా పొందవచ్చును.

ప్రాణము ఆత్మకు శరీరమునకు సంబంధమును కల్పించుచున్నది. ఆరోగ్యంగా వుండాలంటే ఈ ప్రాణవాయువును వశము చేసికొనుట చాలా అవసరము. యోగశాస్త్రము పంచవాయువులగురించి బోధించుచున్నది. అందువలన ఆరోగ్యమునకు యోగ చికిత్స యితర చికిత్సలకంటె మంచిది. అంతేగాక యోగభ్యాసమువలన క్రమశిక్షణ అలవాటగును.

యోగమనగా ముక్కుమూసుకొని కూర్చుండుట లేకకొన్ని ఆసనములువేయుట అను అపోహ సామాన్యప్రజలలో ఎక్కువగా వున్నది. అందువలన యోగమనగానేమి? యోగమువలన ఆరోగ్యము చెడకుండా కాపాడుకొనుట ఎట్లు? మానసిక ఆరోగ్యము, శాంతి ఎట్లు పొందగలరు? రోగమువచ్చిన దానిని సులభముగా యోగాభ్యాసము ద్వారా నివారించుకొను మార్గమేమి? వీటిని గురించి క్లుప్తముగా తెలియపరచదలచుకొన్నాను.

ప్రస్తుతము చాలామంది జాతీయ సమస్యలుగా మారిన క్షయ, కుష్టు, మలేరియా, ఫైలేరియా, నేత్రవ్యాధులు, పోలియోలతో బాధపడుచున్నారు. మనలో చాలామంది మధుమేహము, రక్తపుపోటు, ఉబ్బసము, కీళ్ళనొప్పులు, మొ॥గు వ్యాధులతో చిరుతప్రాయము వారుగూడా బాధపడుచున్నారు. ఈ వ్యాధులన్నింటికి యోగచికిత్స చాలా ఉపయోగపడుచున్నది. ఈ చికిత్సను శాస్త్రీయముగా, ఆధునిక పద్ధతులద్వారా తిరుపతి యోగపరిశోధనాలయములలో ఉచిత భోజన వసతి సదుపాయములను కలిగించి వ్యాధులను నయము చేయుచున్నారు.

యోగమనగా "యోగశ్చిత్తవృత్తి నిరోధః" అని పతంజలి యోగశాస్త్రములో చెప్పియున్నారు. పలువిధములుగా పోవు మనోవృత్తులను నిరోధించి, దృష్టిని అంతర్ముఖము చేసి మనస్సును భగవంతుని యందు ఏకాగ్రము చేయుట యోగము. మనస్సునకు దేహ ఆరోగ్యమునకు సంబంధము కలదు. మనస్సునకు ప్రాణమునకు సంబంధము కలదు. ఎవనిచేత మనస్సు కట్టబడుచున్నదో వానిచే ప్రాణము కట్టబడును. ఎవనిచే ప్రాణము కట్టచున్నదో వానిచే మనస్సు కట్టబడుచున్నది. శారీరకారోగ్యము, మానసికశాంతి, మనోనైర్మల్యము, చిత్తశుద్ధి, కర్మశాంతియైన మోక్షమును పొందుటకు అష్టాంగయోగము ఒకచక్కని మార్గమని పురాణేతిహాసములు చాటుచున్నవి. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ సమాధులని ఎనిమిది అంగములు కలవు.

అందు యమ నియమములు అహింస సత్యాస్తేయ, బ్రహ్మచర్య అపరిగ్రహములు, శౌచ, సంతోష, తపస్స్వాధ్యాయ, ఈశ్వర ప్రణిధానాని నియమః అని పతంజలి చెప్పియున్నారు. ఈ యమ, నియమములలో మితాహారము, శౌచము ఆరోగ్యమునకు చాలా ముఖ్యము, శ్రీ కృష్ణుడు భగవద్గీతలో

> యుక్తాహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు
> యుక్త స్వప్నావ బోధస్య యోగోభవతి దుఃఖః

అని చెప్పియున్నాడు.

> పుష్టం సుమధురం స్నిగ్ధం
> గవ్యం ధాతు ప్రపోషణమ్
> మనోభిలషితం యోగ్యం
> యోగీ భోజన మాచరేత్.
>
> [హఠయోగ ప్రదీపిక]

దేహమునకు బలమును కలిగించునవి, నేతితోకూడినవి మధుర పదార్థములు. ఆవు పాలు మున్నగువానితో కూడినవి. సహజ రుచి కరములయినవి. ధాతుపుష్టి నొసగునవి. యోగము వృద్ధిచేయునవి అగు భోజనమును యోగులు తినవలయును.

> సుస్నిగ్ధ మధురాహారః
> చతుర్థాంశ వివర్జితః
> భుజ్యతే సంప్రీత్యై
> మితాహారస్స ఉచ్యతే. [హ॥ప్ర]

మిగుల మెత్తనైనది, మధురమైనది అగు ఆహారము ఉదరము మూడు భాగ



# పంచరత్న మాలికా

తిరువేంకటనాథవదాంబురుహ
భ్రమరాయిత మన్నయ మాకలయే
కలనాదమనోహరగీతశతైః
విపశీకృతసర్వదిశావలయమ్ ॥

విరాగమప్యనేకరాగభాసురం ద్వయాశ్రితమ్
ద్వయాతిగే పదే విరాజమాన మప్యభంగురే
గుణత్రయీవినాకృతం ముహుర్గుణై రలంకృతం
సమాశ్రయే గురుం అఘూకృతార్తిభార మన్నయమ్ ॥

పరిపాలయ దేశికశీతరుచే
మయి పాతయ కామపి దృష్టికలాం
అవలంబ్యలతామివ తాం సుదృఢాం
అధిరోఢుమనాః పదవీం పరమాం ॥

తాళ్ళపాకవంశవార్ధిభూషణం సుభాషణం
తోషితాఖిలాంధ్రలోక కీర్తనం సువర్తనమ్
వేదినం సమగ్రభక్తివాదినం వినోదినమ్
భావయే మహానుభావ మన్నయార్యదేశికమ్ ॥

కిరంతం సమంతా న్నవం గీతచూర్ణమ్ (సారమ్)
గుణై రాశ్రితానామ్ మనోమోహ(వేష్ట)యంతమ్
శ్రియఃకాంతగేహే చరమ్ భక్తిచోరమ్
భజే దేశికేంద్రమ్ సదాభీష్టసిద్ధ్యై ॥

ఇతి దాసానుదాసేన శ్రీనివాసేన కల్పితామ్।
మాలికాం ప్రతిగృహ్ణీయాదన్న మాచార్య దేశికః ॥

– ఎల్లంరాజు శ్రీనివాసరావు

ములు నిండువరకు సంప్రీతిగా భుజింపబడు నది మితాహారమని చెప్పబడుచున్నది.

మితాహారమును భుజించవలయును. మితాహారమనగా సాత్త్వికాహారము. కడుపు నిండా భుజించక అర్ధభాగము భుజించి నాలుగవవంతు నీటితోనింపి మిగిలినది వాయుధారణకు వదిలి వేయవలెను. అపథ్య కరములైన మత్స్యమాంసాదులు, మద్య పానము విసర్జింపవలెను. తరువాత శౌచము; శౌచమనగా శరీరమును మన స్సును పరిశుభ్రముగా వుంచుకొనుట. వ్యాధికి మాలిన్యమే కారణము. నేతి, జాతి, నీలి, కపాలభాతి, త్రాటకము మున్నగు క్రియలు శరీరములోని మలములను శుభ్రముచేసి మలబద్ధకము నివారించి ఆరో గ్యము కలుగచేయును. జఠరాగ్ని ని చక్కగా వృద్ధిచేసి జీర్ణశక్తిని అభివృద్ధి చేయుటవలన సదా ఆనందము నొసగును. సకల వ్యాధులులను నయము చేయును. కపాలభాతి వలన కలిరోగములు నివారింప బడుచున్నవి. "కఫరోగాంశ్చవింశతిః" (హఠయోగప్రదీపిక) చక్రి కర్మవలన ప్రేగులయందు - నిలిచియుండు దుర్మల ములు తొలగింపబడును. మూలచక్రము విస్తారమగును. శూల, గుల్మము మున్నగు వ్యాధులు నివారణ యగును. దీపనము కలుగును. శంఖ ప్రక్షాళనము వలన కఫ పిత్తములు నివారించబడును. గజకరణి వలన నాడీ చక్రములు స్వాధీనమగును.

మోచనం నేత్రరోగాణాం
తన్ద్రాదీనాం కపాటకమ్
యత్న తస్త్రాటకం గోప్యం
యథాహాటక పేటకమ్

త్రాటకాది క్రియలవలన సమస్త నేత్ర వ్యాధులు నివారణయగును. తన్ద్రి మొద లగు వ్యాధులు నివారింపబడును. తన్ద్రి యనగా నిద్రకుముందు వచ్చు తామసిక ప్రవృత్తితోగూడిన సోమరితనము.

సృష్టిలో ఎన్ని జీవరాసులుగలవో అన్ని ఆసనములు గలవు. ఇందు కొన్ని ధ్యాన మున కుపయోగపడునవి, మరికొన్ని ఆరో

గ్యమున కుపయోగపడునవి. ఆసనాభ్యాసమువలన ఆరోగ్యము, బలము అంగ లాఘవము కలుగును. వ్యాధులు నివారింపబడును. నిర్మూలింపబడును.

సర్వాంగాసనము, పశ్చిమోత్తానాసనము, భుజంగాసనము, శలభాసనము, ధనురాసనము ధౌతిక్రియ. ఉజ్జాయి ప్రాణాయామము మున్నగునవి ఉబ్బసమును పోగొట్టును.

మధుమేహమును పోగొట్టుటకు జానుశీర్షాసనము, మహాముద్ర, ధనురాసనము మయూరాసనము, రేచక పూరక ప్రాణాయామములు అభ్యసింపవలెను. వీటి వలన ఇన్సులిన్ ఎక్కువగా తయారగును. ఉత్తేజ పరచును.

శవాసనము, రేచక పూరక ప్రాణాయామము, సూర్యనమస్కారములు మున్నగునవి రక్తపోటును గుండెజబ్బును నివారణ చేయును. ఈ విధముగా అన్ని వ్యాధులకు ధనవ్యయము లేకుండా యోగ చికిత్సా విధానములు గలవు.

**తరువాతి అంశము ప్రాణాయామము.**

సూర్యభేదన ముజ్జాయి, సత్కారీ శీతలీ తథా
భస్త్రికా భ్రామరీ మూర్ఛాప్లావినీ త్యష్ట కుమ్భకాః
[హఠయోగ ప్రదీపిక]

సూర్యభేదన, ఉజ్జాయి, సీత్కారీ, శీతలీ భస్త్రికా, భ్రామరీ, మూర్ఛా, ప్లావినీ అని ప్రాణాయామములు ఎనిమిదిరకములు.

ప్రాణాయామాది అభ్యాసము వలన కపాలశుద్ధి అయి ఎనిమిది విధములైన వాతదోషములు నివారింపబడును. కడుపు నందుగల క్రిమి దోషములనుకూడా నివారించును. కంఠమునందుగల కఫాది శ్లేష్మ దోషములను పోగొట్టును. నాడులు, జలోదరము దేహమునందలి ధాతువులు వీని యందుగల దోషములను పోగొట్టును. గుల్మము, ప్లీహమును, జ్వరమును పైత్య వికారములను పోగొట్టును. త్రిదోషములను పోగొట్టును.

**1. సూర్యభేదన ప్రాణాయామము:** వాత సంబంధమైన వ్యాధులు నయము గును. దీనివలన దేహములో ఉష్ణము కలుగును. కావున చలికాలములో చేయుట మంచిది.

**2. ఉజ్జాయి ప్రాణాయామము:** కఫ సంబంధములయిన వ్యాధులను నిర్మూలించును.

**3. శీతలీ, శీత్కారి ప్రాణాయామముల** వలన చల్లదనము కలుగును. వేసవిలో చేయుట మంచిది.

**4. భస్త్రికా ప్రాణాయామము:** అన్ని వేళలా చేయవచ్చును. ఈ ప్రాణాయామము వలన నాడీశుద్ధి కలుగును. జఠరాగ్ని ప్రజ్వరిల్లును. భుజించిన ఆహారము బాగుగా వంటబట్టును. రక్త ప్రసారము బాగుగానుండును. మేధాశక్తి అభివృద్ధి మగును. దేహమునందలిముఖ్యగ్రంధులు ఉత్తేజమగును. సకల వ్యాధులు నిర్మూలన మగును. బ్రహ్మనాడిలో ప్రాణప్రవేశ మయినపుడు ఆయుర్వృద్ధి కలుగును. అమృతత్వము లభించును.

నరోగో మరణం తన్ద్రా ననిద్రా నక్షుత్తృషా
నచమూర్ఛా భవేత్తస్య యోముద్రాం వేత్తి ఖేచరీమ్
[హఠయోగ ప్రదీపిక]



ఖేచరీ మొదలగు ముద్రలవలన రోగము, మరణము, తన్ద్రి, నిద్ర, ఆకలి, దప్పి మూర్ఛ కలుగవు.

పద్యతే ననరోగేణ లిప్యతే నచకర్మణా
బాధ్యతే ననకాలేన యోముద్రాం వేత్తి ఖేచరీమ్
[హఠయోగ ప్రదీపిక]

ఖేచరీ ముద్రను తెలిసికొనిన వాడు జ్వరము మున్నగు వ్యాధులచే పీడింపబడడు. కర్మముచేత బాధింపబడడు. మృత్యువునోట పడడు.

ఆరోగ్యమునకు భగవద్ధ్యానము కూడా చాలా ముఖ్యము. ధ్యానము వలన శరీరములో బలము గొప్ప శక్తి కలుగును. ధ్యానము వలన ఆరోగ్యమేగాక అనేక శక్తులుగూడ కలుగును. ముముక్షువులైన జిజ్ఞాసులు ధ్యానము నేర్చుకొనుటకు యిచ్చట వుపదేశముగూడా యివ్వబడును.

ఈ యోగసాధనలన్నియు అనుభవజ్ఞులైన గురువుల సన్నిధిలో అభ్యసించవలెను. పుస్తకములుచూచి చేయరాదు. యోగచికిత్స, యోగాభ్యాసము నేర్చుకొనుటకు ఆసక్తి కలవారి కొరకు వ్యాధులు నివారణ చేయుట కొరకు తిరుమల తిరుపతి దేవస్థానమువారి ఆధ్వర్యమున తిరుపతిలో ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ రిసర్చ్ ఇన్ యోగ అండ్ ఎలైడ్ సైన్సెస్ అను యోగ పరిశోధనాలయమును నెలకొల్పి వున్నారు. అన్ని రకములైన వ్యాధులు ఉచితముగా మందులు లేకుండా నయము చేయబడు చున్నవి. ఈ సదవకాశమును ఎల్లరును వుపయోగించుకొని వ్యాధులకు దూరులగుటయేగాక జీవితలక్ష్యమును సాధింపవచ్చును. నిరవధిక నిరతిశయానందములు పొందవచ్చును. ప్రతి ఒక్కరూ మీమీ విద్యుక్త ధర్మములు నిర్వహించుచూ ఉదయము, సాయంత్రము రెండు గంటలకు తక్కువ లేకుండా యోగాభ్యాసము ధ్యానముచేసిన ఆయురారోగ్యములు, మనశ్శాంతి ఆత్మానుభూతి పొందగలరు.

❋



చిత్తూరుజిల్లా సత్యవేడు తాలూకాలో మద్రాసు పట్టణానికి 45 మైళ్ళ దూరాన నాగలాపురంలో వేదనారాయణస్వామి ఆలయమున్నది. ఈ ఆలయమందు శ్రీ మహావిష్ణువు మత్స్యావతారమున వెలసి యున్నాడు. గర్భాలయమందు స్వామి ఇరువైపుల శ్రీదేవి, భూదేవిలతో వేదనారాయణస్వామి పేరిట పూజలనందుకొను చున్నాడు. ఈ ఆలయము విజయనగర వాస్తు శిల్పమునకు మచ్చుతునకగాపేర్కొన వచ్చును.



### ఐతిహ్యము :

కలియుగావతరణకుముందు ప్రళయము సంభవించి ప్రపంచమంతయు నీటిమయమైపోగా సృష్టికర్త బ్రహ్మనిద్రావస్థలోనుండుట కనిపెట్టిన హయగ్రీవుడనే రాక్షసుడు సృష్టికర్తవద్ద నుండి వేదములను అపహరించుకొని వెళ్ళగా, ఈవిషయమును విన్న శ్రీమన్నారాయణుడు మత్స్యరూపమును ధరించి రాక్షసుని సంహరించి వేదములను బ్రహ్మ కప్పగించినాడు. ఈ ఐతిహ్యమంతయు ఈ ఆలయమునందు శిల్పరూపమున గలదు.

### ఆలయ నిర్మాణము :

శ్రీ వేదనారాయణస్వామి ఆలయము విజయనగరాధీశుడైన శ్రీకృష్ణదేవరాయలు తన మాతృమూర్తి నాగలాంబ పేరిట నిర్మించినట్లు చరిత్రకారుల భావన. ఇతడు దక్షిణ దిగ్విజయ యాత్ర పూర్తిగావించి కుంభకోణమునుండి తిరిగివచ్చునపుడు తన తల్లి జన్మస్థానమైన నాగలాపురమును దర్శింపవచ్చునపుడు ఒకరాత్రి కలలో శ్రీహరి వేదనారాయణ రూపమున కనబడి నాగలాపురమందు తనకు సప్తప్రాకారములతో కూడిన ఆలయమును నిర్మింపమన్నాడట! శ్రీ కృష్ణరాయలు నాగలాపురము చేరిన వెంటనే స్వామి ఆజ్ఞమేరకు ఆలయ నిర్మాణమునకు పూనుకొని నిర్మాణ బాధ్యతను 'వడమాల' అనే హరిదాసునకు అప్పగించి ఆలయంలో పూజానిధులకై అయ్యేడి ఖర్చులకై హరిదాసునకు 'హరికండాపురము' అనే గ్రామాన్ని దానమొసగినాడు. నేటి నాగలాపురమే నాటి హరికండాపురము.

వేదనారాయణస్వామి ఆలయం చుట్టూ పెద్ద పెద్ద రాతి దిమ్మెలతో నిర్మించిన మూడు ప్రాకారములున్నవి. ఆలయంలోనికి ప్రవేశించుటకు మొదటి ప్రాకారమునందు నాలుగు వైపుల నాలుగు ప్రవేశ ద్వారములున్నవి. మొదటి ప్రాకారమునందలి ద్వారములపై గోపురములున్నవి. నేడు ఆలయ ముఖద్వారముగానున్న పడమటి ద్వారముపై మిగతా గోపురముల కంటే ఎత్తైన గోపురమున్నది. కాని ఈ గోపురమెందువల్లనో పూర్తిగా నిర్మింపబడ లేదు. గోపుర అధిష్ఠానము పెక్కులతలు, లతాంగులు, అష్టదిక్పాలకులు మొదలగు శిల్పములతో అలరారుచున్నది. తూర్పు, ఉత్తరము, దక్షిణ గోపుర ద్వారములు నేడు మూతబడియున్నవి. ఆలయంలోనికి ప్రవేశించగానే మొదటి ఆవరణమునందు దక్షిణమున, ఉత్తర వైపుల రెండుబావు

లున్నవి. ఇచ్చటనున్న ఒకమండపము గోడలపై, మత్స్యావతారగాథ శిల్పము నందు చూపబడినది. ఈ శిల్పములందు శ్రీమహావిష్ణువు రాక్షసుని చంపు శిల్పము, బ్రహ్మవేదములను శ్రీహరినుండి అపహరించు శిల్పములు అత్యంత సుందరముగా మలచబడియున్నవి.

రెండవ ప్రాకారమునందు దక్షిణాన మాత్రమే గోపురముతో అలంకరించిన ప్రవేశ ద్వారమున్నది. ఈ ద్వారము దాటగానే వీరాంజనేయ, లక్ష్మీనరసింహ, కోదండరామ మందిరములున్నవి. ఈ రెండవ ప్రాకారమునందే తూర్పు ముఖముగా దేవి (శ్రీ వేదవల్లి) ఆలయమున్నది. ఈ ఆలయము, మహామండపము, ముఖమండపము, అంతరాళము, గర్భగృహము అను కలిగియున్నది. గర్భగృహమునందు దివ్యమంగళకరమైన వేదవల్లి తాయారు విగ్రహమున్నది.

త్రిమూర్తి విగ్రహములున్నవి. వీనిలో ప్రస్తుతింపదగినది ఏకపాద త్రిమూర్తి విగ్రహము. దీనిని మీటిన సప్తస్వరాలు పలుకును. మహామండపమున కిరుపైపుల స్థానక గణపతి, దుర్గ విగ్రహములున్నవి. మండప కప్పులో రాసలీలా శిల్పములున్నవి. ముఖమండపమునందు రామానుజ, శంకర, ఆంజనేయ, విష్వక్సేన, ఆళ్వారుల యొక్క లోహపు విగ్రహములున్నవి.

గర్భగృహమునందు మత్స్యావతార రూపమున శ్రీమహావిష్ణువు, భూదేవి శ్రీదేవి, విగ్రహములు ప్రతిష్ఠింపబడియున్నవి. స్వామి ఉత్సవ విగ్రహము శ్రీకృష్ణునిది ప్రధానాలయము నందలి గోడలగూడు లందు వీణాధర, దక్షిణామూర్తి, స్థానక గణపతి, దుర్గ, భూవరాహ బ్రహ్మ మొదలైన విగ్రహాలున్నవి. స్వామికి క్షీరాభిషేకములకు బదులు తైలాభిషేకము చేయుట ఆచారము.

శ్రీ మహావిష్ణు దశావతారాలలో పెక్కింటికి అర్చామూర్తులు వెలసి వివిధ క్షేత్రాలలో భక్తుల పూజలందుకొంటున్నాయి. నాగలాపురంలో టి. టి. డి. యాజమాన్యంలోవున్న శ్రీ వేదనారాయణస్వామి ఆలయం మత్స్యావతార రూపధైన శ్రీహరికి సంకేతం. ఈ మార్చిలో అక్కడ జరుగనున్న సూర్యపూజ సందర్భంగా ఈ వ్యాసం ప్రచురిస్తున్నాము.



# నాగలాపురం వేదనారాయణస్వామి

రెండవ ప్రాంగణమునుండి గోపుర పరివేష్టితమైన ద్వారము ద్వారా ప్రధానాలయము చేరవచ్చును. ఈ ప్రవేశద్వారము ముందుభాగమున బలిపీఠము, ధ్వజస్తంభముగల మండపమున్నది. ప్రధానాలయము, పశ్చిమాభిముఖముగా నిర్మింపబడినది. దీనిలో భాగములుగా గర్భగృహము, అంతరాళము, ముఖమండపము, మహామండపములచుట్టూ స్తంభముల సాయంతో నిర్మించిన మండపము, ప్రదక్షిణపథము వున్నవి. ఈ మండపమునందే త్రివిక్రమ, లక్ష్మీ, వేణుగోపాల, వరాహమూర్తి, హయగ్రీవ, లక్ష్మీనారాయణ, విష్ణు, భూదేవి,

వేదనారాయణస్వామి ఆలయమునందు ప్రతి సంవత్సరము మార్చినెలలో జరుగు సూర్యసేవ అతి పవిత్రమైనది. ఈ ఉత్సవ సమయమునందు (మార్చి 26, 27, 28 తేదీలయందు) సూర్యకిరణాలు మహద్వార గోపురమునుండి స్వామి గర్భాలయము లోనికి ప్రవేశించి మొదటిరోజు స్వామి పాదములమీద, రెండవరోజు నాభిమీద, మూడవరోజు మోముపైన ప్రసరించును. ఈ వింత ఆ నాటి శిల్పులయొక్క వాస్తు కళానైపుణి నిదర్శనము.

ఆలయమునందు తెలుగు, తమిళ కన్నడ భాషలలో వేయించిన కొన్ని శాసనములున్నవి. వాటిలో ముఖ్యమైనది. కృష్ణరాయలకు శ్రీ మహావిష్ణువు కలలో కనబడి తనకు నాగలాపురమందుఆలయమునిర్మింపమనుటను తెలియజేయునది. అట్లే శ్రీకృష్ణదేవరాయలు ఆలయము నిర్వహణకై హరిగండాపురమును అగ్రహారముగా ఏర్పాటు చేసిననట్లు తెలుపు శాసనముకూడ ఆలయ చరిత్రను తెలుసుకొనుట కెంతగానో వుపయోగపడుతున్నది.

ప్రస్తుతమీ ఆలయము (1967 సం॥ ఏప్రిల్‌నెల, 29వ తేదినుండి) తిరుమల తిరుపతి దేవస్థానములవారి పరిపాలనలో నున్నది. ఈ పాలక సంస్థ వేదనారాయణ స్వామి ఆలయమందు అనాదిగా ఆచారములో నుండిన పూజలు, ఉత్సవములను పునరుద్ధరించుచున్నది.

— శ్రీ పి. కృష్ణమూర్తి

# దేవుని కడప

— శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

కడప మండలము పెక్కు పుణ్యక్షేత్రాలు, దర్శనీయ స్థలాలు వెలసిన ప్రాంతము. కడప పట్టణానికి సుమారు కి. మీ. దూరంలో 'దేవుని కడప'లోని శ్రీలక్ష్మీ వేంకటేశ్వరాలయము ప్రాచీనమైనదే కాక అత్యంత పవిత్రమైన క్షేత్రము.

పూర్వము తిరుపతి యాత్రకు వెళ్ళు ప్రయాణీకులు ఇచటి స్వామిని సేవించి ఒంటిమిట్ట మీదుగా తిరుమలకు వెళ్ళేవారు. తిరుమల క్షేత్రమునకు 'గడప'గా వుండు ఈ ప్రాంతము కడపగా మారినదని చెప్పుదురు. ప్రాచీనకాలమున ఇది పావన కృపాశ్రమము. కృపాచార్యుల పేర "కృపావతి"గా వ్యవహరింపబడి కాలక్రమమున "కృప" కడపగా మారినదని చెప్పెదరు.

దేవుని కడపలోని వేంకటేశ్వరుడు కృపాచార్యులచేత ప్రతిష్ఠించబడినవాడు. మృకండు మహర్షి ఈ దేవుని సేవించాడు. తిరుమలను వరాహక్షేత్ర మన్నట్లే దేవుని కడపను హనుమత్ క్షేత్రమందురు. ఇప్పటికిని వేంకటేశ్వరమూర్తికి వెనుకభాగాన ఆంజనేయుని శిలావిగ్రహము కన్పించును. తిరుపతి శ్రీనివాసునికి కడప వేంకటేశుడు ప్రతీక. ఆ అర్చావతారము వలెనే ఇదియును భక్త సంరక్షకము. ఇచటి వేంకటేశ్వరుఁని ప్రసన్న వేంకటేశ్వరుడని వ్యవహరింతురు. దేవాలయ శాసనములననుసరించి చూడ ఈ దేవునికి తిరువేంగళనాథుడని పేరు. పదకవితా పితామహుడైన తాళ్ళపాక అన్నమయ్య ఈ దేవునిపై ఎన్నో కీర్తనలను రచించి, కప్పురపు నవ్వుల కడప రాయా – నాకు కప్పవోయి వచ్చుడము కడపరాయా" అని మ్రొక్కులు చెల్లించాడు. పదసంగీతపితామహుడైన క్షేత్రయ్య కడప వేంకటేశుని కీర్తించాడు. 14 వ శతాబ్ది మొదటి భాగములో వైష్ణవాచార్యులైన వేదాంత దేశికులు రచించిన దేహళీశ స్తోత్రములో ఈ క్షేత్రము వర్ణింపబడినది. అప్పట్లో దీనిని "దేహళి" నగరమనేవారు.

విజయనగర రాజులైన హరిహర, బుక్కరాయలు ఈ స్వామిని సేవించినవారే. సాళ్వవంశమునకు చెందిన నరసింహరాయలకు ఈ వేంకటేశ్వరుడు ఇలవేల్పు.

శ్రీకృష్ణదేవరాయలు మణులనే కాక, మడులను కూడా సమర్పించాడు. గోలకొండ నవాబులు ఈ దేవుని పట్ల భక్తి తాత్పర్యములు కలిగి యుండినట్లు కనిపించును.



నంద్యాల ఔబళేశ్వర మహారాజు, ఉదయగిరి సీమకు చెందిన తిమ్మయ్యదేవ మహారాజు, సదాశివదేవరాయలు, చిన్న ఔబళ మహారాజు మొదలగువారు ఈ స్వామికి గ్రామాలను, భూములను దానము చేసినట్లు ఆలయమందలి శాసనాలు తెలుపుచున్నవి.

ఈ దేవాలయమందలి శిల్పము ప్రాచీనమైనది. ఆలయ నిర్మాణము పల్లవులతో ప్రారంభమై విజయనగర సార్వభౌముల పర్యవేక్షణక్రింద జరిగినట్లు తెలియచున్నది. తిరుపతిలోని గోవిందరాజస్వామి ఆలయ గోపురము ఒకే రీతిగా నిర్మింపబడినవి. మట్లరాజులు ఈ గోపుర నిర్మాణము కావించినట్లు తెలియుచున్నది. పద్మావతీ దేవాలయమందలి స్తంభములలో పల్లవుల శిల్పం కనిపించుచున్నది. స్వామి సన్నిధిలో గణపతి శిల్పము అతి రమణీయమైనది. ఆలయ స్తంభములపై చెక్కబడిన దంపతులు విజయనగరరాజ వంశీయులకు సంబంధించిన వారని ప్రతీతి. మంటపము పై కప్పులోని వర్ణచిత్రము మనలనెంతో ఆకర్షించును. స్వామి ద్వారపాలకుల విగ్రహములు, ఆళ్వారుల విగ్రహములు చూడముచ్చటగ నున్నవి. విశాలమైన ఈ ప్రాకారము ఆలయ శోభను పెంపొందించుచున్నది. సర్ థామస్ మన్రో ఈ దేవుని దర్శించుటయే గాక ఆలయగోపుర మరమ్మతులను కూడా చేయించాడు.

స్వామి పుష్కరిణిని హనుమత్ పుష్కరిణి అందురు. పాతకడప చెరువునీళ్ళు పుష్కరిణి చేరుటకు, పోవుటకు మార్గములున్నవి. పుష్కరిణి మధ్య మంటప మొకటి వున్నది. వెలుపల పడమటి దిక్కున తీర్థవాసి మంటపమున్నది. 1930 వరకు పుష్కరిణిలో తెప్పోత్సవములు జరుగుచుండెడివి. ఈ పుష్కరిణికి సమీపముననే శివాలయమున్నది. ఈ ఆలయమునకు చేరువగా యాత్రికులు విడిది చేయుటకు పెద్ద సత్రమున్నది.

ప్రసన్న వేంకటేశ్వరుని రథోత్సవము ప్రతియేటా మాఘశుద్ధ పాడ్యమి నుండి సప్తమి వరకు జరుగును. ఈ ఉత్సవములు వేలాది యాత్రికులను ఆకర్షించును. తిరుమల – తిరుపతి దేవస్థానమువారు ఈ క్షేత్ర ప్రాశస్త్యమును గుర్తించి ఇచట దాదాపు 2 లక్షల రూ॥ల వ్యయముతో కల్యాణమంటపమును నిర్మించినారు. ఈ ఆలయ ధర్మకర్తలమండలి అత్యంత శ్రద్ధాసక్తులతో దేవాలయ సర్వతో ముఖాభివృద్ధికి ఎంతగానో కృషిచేయుచున్నది. తరచు వివాహ మహోత్సవాదులతో ఆలయ ప్రాంగణము నిండియుండును. ఆస్తికులందరికీ ఆరాధ్యదైవమైనవాడు, మొలక నవ్వుల కడపరాయుడు.

## త్యాగం

న కర్మణా న ప్రజయా
నధనేన త్యాగేనై కేన
అమృతత్వ మానశుః ॥

సత్క్రియలు చేయటంవల్ల గానీ- సత్ సంతానాన్ని కనటంవల్ల గానీ, అపారమైన ఐశ్వర్యం ఆర్జించటం వల్లగానీ లభించని "అమృతత్వం" ఒక్కత్యాగంవల్ల మాత్రమే సాధకుడు ఆవిష్కరించుకో గలుగుతాడు"- అని పై మంత్ర వాక్యానికి తాత్పర్యం. సత్కర్మాచరణవలన పుణ్యం లభించవచ్చు. పై మంత్రార్థం సత్కర్మలను ఏమాత్రం గర్హించటంలేదని గుర్తించాలి. అట్లాగే-సంతానంవల్ల పున్నామ నరకం నుండి విముక్తి లభించవచ్చు. ప్రాచీనులు సంతాన లాభమునకు ఇచ్చిన ప్రాముఖ్యం అందరకు తెలిసిందే. సంతాన ప్రాప్తియే యీ సృష్టి సర్గాన్ని అవ్యవహితంగా కొనసాగిస్తున్నది. 'ధనమూల మిదం జగత్' ధన సంపాదన ఐహికాముష్మిక శ్రేయోదాయకం. ఇవి అన్నీ గొప్పవే. అయితే ఇవి ఏవీ "త్యాగం"తో సరితూగ జాలవు.

త్యాగంలో మాత్రమే అనిర్వచనీయమైన దివ్యత్వం వుంది. త్యాగమే అమృతత్వాన్ని ఆవిష్కరించుకో గలదని ఈ ఋక్కునొక్కి వక్కాణించటం గమనించదగ్గ అంశం.

రామాయణంలో ఆదికవి వాల్మీకి మహర్షి శ్రీరామచంద్రునిగాథ హృదయంగమంగ అభివర్ణించాడు.

కూజంతం రామరామేతి
మధురం మధురాక్షరం
ఆరుహ్య కవితాశాఖాం
వందే వాల్మీకి కోకిలం ॥

అని ఆ మహాకవికి తరువాతి కవులు చేయెత్తి మ్రొక్కి ప్రక్కన నిలబడ్డారు!

వాల్మీకి శ్రీరాముని 'రామో రాజీవ లోచనః' అని అనేకమారులు అభివర్ణించి 'విగ్రహవాన్ ధర్మః' రాముడు మూర్తీభవించిన ధర్మమే అని సహృదయులు తలయూపేటట్లు రామాయణకథ తీర్చిదిద్దాడు. రాముడు సమస్త కల్యాణగుణగణాలతో భాసించవచ్చు. అయితే రాముని దివ్యుని చేసింది అతని అతిలోక త్యాగం. తాను-సింహాసనాన్ని త్యజించి, పితృవాక్య పరిపాలనకై పదునాలుగేండ్లు అరణ్యవాసం చేశాడు.

నిత్యసత్యవ్రతుడై-తన సామ్రాజ్యాన్ని సర్వస్వాన్ని ఒక సన్న్యాసికి ధారవోసిన హరిశ్చంద్ర చక్రవర్తి త్యాగం-యుగయుగాంతరముగా-సహృదయుల హృదయాలను ఉఞ్జూత లూగిస్తూనే ఉంది. ఈ

## వెలుగుబాట

డా॥ నండూరి రామకృష్ణమాచార్య

పౌరాణిక గాథలు అటుంచిచారిత్రకకాలంలో బుద్ధభగవానుడు దేశదేశాంత రాలలో దివ్యుడుగా అమృతత్వం ఆవిష్కరించుకోగలిగాడు? ఎందుచేత? అతని మహత్తర త్యాగం అనన్య సాధారణం. అతిమానుషం.

ఒక అర్ధరాత్రి-అర్ధాంగినీ చిరంజీవినీ సింహాసనాన్ని వదలి, విశ్వమానవ కల్యాణం కోసం-అంతఃపురం వదలి అరణ్య సీమలలోకి వెళ్ళిపోయాడు. ఎందరు మానవులు పగలు-రాత్రిళ్లు-ఎన్ని ప్రయాణాలు చేయలేదు? ఎంతమంది తమతమ గృహాలనుండి ఎన్నో కారణాలవల్ల నిష్క్రమించటంలేదు కాని-ఆనాటి యువరాజు-సిద్ధార్థునియాత్ర బౌద్ధ వాఙ్మయ ప్రపంచంలో "మహాభినిష్క్రమణం"గా చిరస్మరణీయమై నిలిచింది. వివేకానంద మహర్షి బుద్ధుని త్యాగం లోని ఆధ్యాత్మిక ప్రతిపత్తిని వేనోళ్ళ శ్లాఘించాడు.

అధునాతన యుగంలో గాంధీమహాత్ముని చరిత్ర సుప్రసిద్ధం. మహాత్ముని 'త్యాగం'-భారతదేశానికి స్వాతంత్ర్యం సముపార్జించటం మాత్రమేగాక, యావత్ ప్రపంచానికి-అహింసాసిద్ధాంతం సత్యనిష్ఠ ద్వారా అమృతత్వాన్ని ఆవిష్కరించింది. మహాత్ముని శంఖారావానికి తమ గుండెలు శ్రుతి గల్పుకొని బారసాల నుండిచెరసాలకు వెళ్ళిన త్యాగమూర్తులు ఉన్నారు!

"త్యాగమే ఆధ్యాత్మిక భారమితి"

అందుచేతనే అన్ని మతాలలో "సన్న్యాస దీక్ష" ఏర్పడింది. మానవ చరిత్రలో సర్వసంగ పరిత్యాగియైన సన్న్యాసి జగదారాధ్యుడైనాడు, దేశదేశాలలో మతమతాంతరాలలో

"తలలు బోడులైన తలపులు బోడులా?"

అని వేమన వంటివారు అధిక్షేపించవచ్చు. తలలు మాత్రమేగాక తలపులుగూడ బోడులైన వారేగదా నిజమైన సన్న్యాసులు. సర్వసంగ పరిత్యాగులు. అయితే, సంసారంలో ఉండి గూడ త్యాగయోగులు అయినవారున్నారు. "సన్న్యాస వ్యవస్థ"- త్యాగానికి సర్వమతాలు సమకూర్చిన "గుర్తింపు" అని గ్రహించవచ్చు.

ఏ సమాజంలో అయినా స్వార్థ త్యాగి, దయావీరుడుగా దివ్యుడుగా గుర్తింపబడే అమృతత్వం ఆవిష్కరించుకోగలుగుతున్నాడు. పై ఋక్కుకు- స్వేచ్ఛానువాద ప్రాయమైన తెలుగు పద్యం.

"సాధనలు గావు - సంతాన సంపదల్;
సత్క్రియాచరణము - జ్ఞాన పటిమ;
త్యాగమొకటె అమృతయోగ సిద్ధికి త్రోవ!
సకలధర్మసార సంగ్రహమ్ము."

# తూర్పుతిరిగి దణ్ణంపెట్టు

"ఈ రోజు ఏమీ చదవలేదురా! రేపే పరీక్ష" అన్నాడొక విద్యార్థి. "అయితే తూర్పు తిరిగి దణ్ణంపెట్టు" అన్నాడు సహ విద్యార్థి. ఈ రోజుకు ఒకటో తేది దాటి నాలుగు రోజులైంది. జీతాలులేవు అన్నాడొక ఉద్యోగి. అయితే తూర్పు తిరిగి దణ్ణం పెట్టు అని ఓదార్చాడొకడు. "ఈ రోజు ఇన్‌కంటాక్స్‌వాళ్ళు నా ధనమంతా పట్టుకున్నారు" అని ప్రభుత్వానికి వన్ను లెగవేసిన ఒకని వేదన. "అయితే తూర్పు తిరిగి దణ్ణం పెట్టు" అని ఒకని సానుభూతి వాక్యం. ఏమిటిది? మూడు భిన్నరంగాల్లో ఉండే (విద్యార్థులకు, ఉద్యోగులకు, వ్యాపారులకు) వారి బాధలకు ఒకటే జవాబు వచ్చింది. ఇంకో విషయం గమనించారా? పై వాక్యం బాధితునితో ఎదుటి వాడంటున్నాడు. తూర్పు తిరిగే దణ్ణమెందుకు పెట్టాలి? పడమరకెందుకు పెట్టగూడదు అని ఒక విమర్శకుని ప్రశ్న. ఏమిటి? ఎందుకు? ఇప్పుడు పరిశీలిద్దాం.

ప్రతి భాషలోను ఆ భాషకు తనదంటూ చెప్పుకునే ఒకానొక ప్రత్యేకత ఉంటుంది. అది ఆ భాషకు మాత్రమే పరిమితం. ఆ భాష మాట్లాడు ప్రజల సాంఘిక, మత, రాజకీయ స్థితిగతులవలన మరెన్నో ఇతర కారణాలవలన భాషకు అట్టి "ప్రత్యేకత" సిద్ధిస్తుంది. అవి ముఖ్యంగా నుడికారాలనీ, సామెతలనీ, కవిసమయాలనీ పిలవబడతాయి. వాటిని అన్యభాషల్లోకి అనువాదం చేయుటకు వీలుకాదు. చేసిననూ ఆ భాషీయులకు దాని సొగసు బోధపడి, ఆనందాన్నీయదు. అసలు ఒక్కోసారి అర్థంకాదు.

"వైర్‌లెస్ ఆఫీసును" ఎవరో తెలుగు తెలియని వారు వితంతుకార్యాలయమని అనువదించారు. కాని తెలుగులో వితంతు పదానికి కర్థమేమిటి? రాత్రి పదింటికి పోలీస్ ఆఫీసర్ వితంతుకార్యాలయానికేగెను. అను వాక్యాని కేమి అర్థం చెప్పగలరు?

తూర్పు తిరిగి దణ్ణం పెట్టు అనేది ఒక నుడికారం. దీనిని మరోవిధంగానో ఆంగ్లంలోకి అనువదిస్తే ఆంగ్లేయునికి దీనిలోని సజీవత్వం అవగాహన అయి హర్షించజాలడు. సక్రమంగా చేయవలసిన పనిని చేయలేని పరిస్థితిలో ఈ నుడికారాన్ని ప్రయోగిస్తారు. ఈ నుడికారమెలా ఏర్పడిందా అని ఆలోచిస్తే ఇలా తోస్తుంది.

మరణించిన తల్లిదండ్రులకు "శ్రాద్ధం" పెట్టడం కొడుకు విధి. దాని నాతడెంతో శ్రద్ధాసక్తులతో, నిండుభక్తితో, విధినిషేధాలు పాటించి, సక్రమమైన పద్ధతిలో పెట్టవలెను. శ్రద్ధతో కూడినది కనుకనే శ్రాద్ధమైంది. అయితే ఏ కారణం వల్లనో పెట్టలేకపోతేనో బ్రాహ్మణుడు దొరకక పోతేనో: వలయు సామగ్రి చిక్కకపోతేనో! తాను సమయానికి ఇంట్లోలేక, ఏ నట్టడవిలాంటి ప్రదేశంలోనో చిక్కుపడడం తటస్థిస్తేనో? అటువంటి నిస్సహాయ పరిస్థితిలో నవమాసాలు మోసి కనీ, పెంచి పెద్దచేసి చివరికి చనిపోయిన తల్లిదండ్రులకు శ్రాద్ధకర్మలేవిధంగా ఆచరించి పితౄణమునుండి విముక్తి పొందాలి? విధిలేదు. గత్యంతరం లేదు. కనుక "తూర్పు తిరిగి దణ్ణంపెట్టు, చేసినంత పుణ్య" మని సెలవిచ్చారు ధర్మజ్ఞులు. తూర్పున పితృలోకముంటుంది కనుక మరో దిక్కు తిరగకుండ తూర్పుకే తిరగమన్నారు.

అక్కడితో అలాపుట్టిన ఈ వాక్యం కాలక్రమేణ భాషలో నుడికారంలా స్థిరపడి తక్కిన సందర్భాలలోగూడ వాడబడి "అతివ్యాప్తి" నొందినది.

– శ్రీ వెలుదండ నిత్యానందరావు

## "విరించి హరార్చిత వేంకటేశ్వరా!"

నీ కనుచూపు సోకఁగనె నీరజకైరవపంక్తి విచ్చెడిన్
నీ కరుణాకటాక్షమున నీచము లుచ్చము లొక్కటయ్యెడిన్
నీ కమనీయ గాత్రమున నీరద చంచల లేకమయ్యెడిన్
శ్రీ కమలా మనోహర! విరించిహరార్చిత! వేంకటేశ్వరా!

నీ కనుచూపులందు నవనీతపుఁ జల్లఁదనంబు దోచెడిన్
నీ కనుచూపులందు పరి నిర్జితచంద్రిక శీతముండెడిన్
నీ కనుచూపులందు కమనీయ సుధారుచి జాలువారెడిన్
శ్రీ కమలామనోహర! విరించిహరార్చిత! వేంకటేశ్వరా!

నీ కనుదమ్మిలోన రమణీయ విశుద్ధకవిత్వగుంఫముల్
నీ కనుగొనయందున మనీషి మనోహర శాస్త్రజాలముల్
నీ కనుదామరందున వినిశ్చల యోగసమాధివాసముల్
శ్రీ కమలామనోహర! విరించిహరార్చిత! వేంకటేశ్వరా!

ఈ కలిలోన నీవొకఁడవే శరణంబవు మానవాళికిన్
పాకరిపు ప్రముఖ వందిత కోమల పాదవారిజా!
నీ కడగంటి చూపొకటినేడిదె నాపయిఁ బర్వఁజేయుమా!
శ్రీ కమలామనోహర! విరించిహరార్చిత! వేంకటేశ్వరా!

లోకములోన నిన్విడచి లోతుగఁజూచిన లేరు బాంధవుల్
చీకటి బుద్ధితో మనసు చేతిగులాముగ మారిపోయితిన్
నాకపు సౌఖ్యముల్ క్షణికనందన హేతువులంచుఁదేలెనో
శ్రీకమలామనోహర! విరించిహరార్చిత! వేంకటేశ్వరా!

– మేడవరం మల్లికార్జునశర్మ

# పత్నీ పరిత్యాగము

శ్రీ భరణిపంత రాధాకృష్ణమూర్తి

అగ్నిసాక్షిగా వివాహమాడిన అర్ధాంగిని ఏమిషతోనైనా పరిత్యజించే అధికారం పురుషుడికీయదు హిందూ సంప్రదాయం— అందుకొక ప్రమాణం మార్కండేయపురాణంలోని ఈ కథ.

సం॥

ఉత్తానపాద చక్రవర్తికి సురుచి యను భార్య వలన ఉత్తముడను కుమారుడు కలిగెను. బలపరాక్రమ దయాధర్మ శీలములలో ఉత్తముడు సజ్జనులచే సర్వదా కీర్తించబడు చుండెడివాడు. శిష్టజన సంరక్షణలో దుష్టజన శిక్షణలో ఉత్తమ మహీపాలుడు తన పూర్వజులను సహితము మరపించి కన్న బిడ్డలవలె పాలించుచుండెను.

ఉత్తముడు బభ్రుసుతయైన బహుళను ధర్మపత్నిగా స్వీకరించెను. సర్వాంగ సుందరి, మనోహర లావణ్యవతియైన బహుళాదేవి నాటి సుందరాంగనలలో ఖ్యాతి గాంచినది. అసామాన్య రూపురేఖా విలాసినియైన అర్ధాంగిని పొందినది మొదలు ఉత్తమ మహీకాంతుడు ఆమెకను సన్నలలో మెలగుతూ ఆమె ఆనందార్థమే తాను జన్మించినట్లు సంచరించు చుండెడివాడు. అతని మనస్సు, కర్మ, వాక్కు అన్నియునూ బహుళాదేవి ఆనందము కొఱకే సాగుచుండెడివి. అది యిది యననేల? కలలో సహితం మహారాజువల్ల అర్ధాంగికి సంతోషమును కలుగజేయు కార్యములే జరుగుచుండెడివి. తన నింతటి యనురాగముతో ప్రాణాధిక ప్రియముగా ప్రేమించుచున్న భర్తపై బహుళకు యనురాగము లేకపోలేదు. కాని ఆది నుండియు ఆమెకు తన భర్త తన యాదేశానుసారమే అడుగువేయవలెనన్న అహంభావ మేర్పడిపోయినది. క్రమక్రమముగా ఆ భావము దినదిన ప్రవర్ధమానము కాసాగినది. ఆది నుండియు తన భర్త తనకు సంతోషమును కలుగజేయుటకై చేయు ప్రయత్నముతో ఆమె కతనిపై ఒక విధమైన లోకువ యేర్పడినది. కాలప్రవాహములో బహుళాదేవి కనుసన్నలు రాజాజ్ఞలుగా మారిపోయినవి. మంత్రి, సామంత, పురోహిత, దండనాయక దౌవారికాదులతో పరివేష్టితుడై చక్రవర్తి సభాభవనములో సింహాసనాసీనుడైయున్న సమయములో కూడ బహుళారాణి అతనిపై అధికారమును చలాయించ ప్రయత్నించెడిది. అట్లు జరిగిన ఒకనాటి ప్రయత్నములో ఉత్తముని సహనము సరిహద్దులు దాటినది. ఉత్తమ భూపాలుడు తన స్వభావము సర్వులకు తెలియజేయవలెనను అభిలాషతో ఆ సభ నేర్పాటు చేసెను. సామంతులనందరినీ విందునకాహ్వానించెను. సభ అంతయు కోలాహలముగా నున్నది. స్తోత్ర పాఠములు ముగిసినవి; మంత్రి సామంతాదుల వినయాచరణ వలన ఉత్తముని ఉత్తమత్వము వ్యక్తీకరించ నవసరము లేకుండగనే సువ్యక్తమగుచున్నది. విందారంభమైనది. భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యపానీయాదులు సిద్ధహస్తులైన పాకశాస్త్ర ప్రవీణుల ద్వారా సంసిద్ధము చేయబడినవి. అందరి కందరూ మహదానందముతో విందులారగించు



## శ్రీ వేదనారాయణస్వామి ఆలయం, నాగలాపురం.

* సోమకాసురుని సంహరించి వేదములను బ్రహ్మకిచ్చిన పుణ్యదేశం.

### ఆలయ కార్యక్రమములు

#### ఉదయము

| | | |
|---|---|---|
| సుప్రభాతము | 6-00 గం॥ నుండి | |
| | 6-30 గం॥ వరకు | |
| విశ్వరూపదర్శనము | 6-30 గం॥ నుండి | |
| | 8-30 గం॥ వరకు | |
| తోమాలసేవ | 8-30 గం॥ నుండి | |
| | 9-00 గం॥ వరకు | |
| సహస్రనామార్చన | 9-00 గం॥ నుండి | |
| | 9-30 గం॥ వరకు | |
| మొదటిగంట, బలి, | 9-30 గం॥ నుండి | |
| శాత్తుమొర | 10-00 గం॥ వరకు | |
| సర్వదర్శనము | 10-00 గం॥ నుండి | |
| | 11-30 గం॥ వరకు | |
| అష్టోత్తర నామార్చన | 11-30 గం॥ నుండి | |
| రెండవగంట | 12-00 గం॥ వరకు | |
| తీర్మానము | మ. 12-00 గంటలకు | |

#### సాయంత్రము

| | |
|---|---|
| సర్వదర్శనము | 4-00 గం॥ నుండి |
| | 6-00 గం॥ వరకు |
| తోమాల, అర్చన | 6-00 గం॥ నుండి |
| రాత్రికైంకర్యములు | 7-00 గం॥ వరకు |
| సర్వదర్శనము | 7-00 గం॥ నుండి |
| | 8-45 గం॥ వరకు |
| ఏకాంత సేవ | 8-45 గం॥ నుండి |
| | 9-00 గం॥ వరకు |
| తీర్మానము | రాత్రి 9-00 గంటలకు |

#### ఆర్జిత సేవలు

అర్చన — రూ. 2-00

హారతి — రూ. 1-00

గమనిక: శ్రీ వేదనారాయణస్వామివారి అర్చన టిక్కెట్లు 1980 మే 23 వ తేది నుండి మూడురూపాయల నుండి రెండురూపాయలకు తగ్గించబ డినది. భక్తులు గమనించగలరు.

పేష్కారు

స్థానికఆలయాలు

చున్నారు. అదే సమయములో మహారాజు పరుసముగా రాణిపైకి తిరిగి చిరునవ్వు నవ్వుచూ, ప్రేమతో 'పానము చేయు' మనుచూ పానపాత్ర నందించెను. ఆమె విసురుగా మహారాజు కోర్కెను తిరస్కరించి నది. చక్రవర్తి అనునయించుకొలదీ ఆమె లోని తిరస్కార భావము ద్విగుణీ కృతము కాసాగెను. దానినతడు సహించలేక పోయెను. ఎంతగా అణచుకుందమన్ననూ క్రోధమాగలేదు. ఉత్తరక్షణములో అతడు క్రోధస్వరముతో సేవకుని పిలిచి అజ్ఞా పించుచూ "యీ దురహంకారిణిని వెంటనే అరణ్యమధ్యమున విడచిరమ్ము. మారు పలుకకుము". అనెను. కర్తవ్యపాలకుడైన ఆ సేవకుడు రాజాజ్ఞను వెంటనే పాలించెను. సౌందర్య సంజనితాహంకారము బహుళా దేవిని అడవుల పాలుజేసినది.

అసామాన్య రూపు రేఖా విలాసినియైన అర్ధాంగిని పరిత్యజించినాడే కాని ఉత్తముని చిత్తము మాత్రమా మెమీదనే యున్నది. కొన్ని క్షణములపాటు పత్ని పరిత్యాగమునకు వెత చెందినను మహా రాజామెను గురించి అధికముగా విచారించ లేదు. బహుళకు జరుగవలసిన ప్రాయ శ్చిత్తమే జరిగినదనుకొని స్థిమితపడెను.

కాలము గడుచుచున్నది. ఒకనాడుత్త ముని యాస్థానమునకు బ్రాహ్మణుడొకడు వచ్చి అతని కెదురుగా దీనవదనముతో నిల బడెను. ఉత్తముడా బ్రాహ్మణోత్తముని జూచి "విప్రవరా! మీదీనత్వమునకు హేతు వేమిటి" యని ప్రశ్నించెను. అంత ఆ విప్రుడు గద్గద కంఠముతో "మహారాజా! నా స్థితినేమని చెప్పెదను? అగ్నిసాక్షిగా పెండ్లి యాడిన నా భార్యను నిన్నటిరాత్రి యెవడో అపహరించుకొని పోయెను.ఆమె లేకుండ నేను బ్రతుకజాలను. నా కర్మ కాండ అంతయు ఆమెమీదనే ఆధారపడి యున్నది. గృహస్థాశ్రమములో ప్రవేశించి నది మొదలు భార్యలేకుండ అగ్ని కార్యము జరుగదుకదా! అట్టి స్థితిలో ఆమె లేనిచో నేను చేయగల ధర్మకార్యమేముండును. కర్మభ్రష్టుడనై నేను చేయగలదేమున్నది. కర్మభ్రష్టుడైన బ్రాహ్మణుడు చండాలుని కన్న అధముడు. కనుక మహారాజువైన నీవు దుష్టులబారినుండి నా అర్ధాంగిని విడి పించి నా కనుగ్రహించగోరు చున్నాను. ధర్మప్రభువైన నీ కన్న మాకు దిక్కె వ్వరు? అదియునుగాక ప్రజలభాగ్యము లోను, ధర్మాచరణములోను కూడా ఆరవ భాగము ప్రభువునకు చెందును. ఐహికపార లౌకిక విషయములలో ప్రజాభాగమును పంచుకొనునట్టి చక్రవర్తి ప్రజారక్షణచేసి తీరవలెను. మహారాజున్నాడనియే కదా! మేము నిర్భయముగా గుండెలమీద చేతులు వేసికొని సుఖముగా నిదురించగలుగు చున్నాము. అట్టి సమయములోనే యిట్టి ఘోరము జరిగిపోయినది. కనుక రాజా! సత్వరము నీవు నా కష్టమును నివా రించుము" అనెను.

ఉత్తమ భూపాలుడు బ్రాహ్మణుని వాక్యము లాలకించి దీర్ఘముగా నిట్టూర్చి "విప్రవర్యా! నీ భార్యను తిరిగి నీ వద్దకు చేర్చుటకై స్వయముగా నేనే బయలుదేరె దను. కాని నాదొక ప్రశ్న. నీ భార్యరూప గుణశీలములు నేనేమియు యెరుగను కదా! ఆ వివరములు తెలియజేసినచో నేను సత్వరమే సహకరించగల్గెదను." అని పలుక బ్రాహ్మణుడానందముతో "మహా రాజా! నా ధర్మపత్ని సౌందర్యరాశి కాదు; పోనీ అన్నచో కనీసము రూపవతికూడా కాదు. ఆమె నొక పర్యాయము చూచిన వారెవరూ మరల చూడగోరరు. యదార్థము చెప్పవలెనన్న ఆమె కురూపియే. ఇక గుణ విషయమందువా! నిరంతరము రుసరుస లాడుచుండును. సర్వదా నా మాటకు వ్యతి రేకమే పలుకుచుండును. ఎంతకాలము నుండి యెన్ని విధములుగా ప్రయత్నించి నను ఆమెను మార్చలేకపోయితిని. రూప వతి అయినను, కురూపియైనను అగ్ని సాక్షిగా పెండ్లియాడిన భార్య భార్యకాక పోవునా? మహారాజా! ఏమైననూ రాజ్య పాలకుడివిగా నీవు నా భార్యను" అని యింకనూ బ్రాహ్మణు డేదియో అనబోవు

చుండగా మహారాజు మధ్యలోనే ఆపి- "బ్రాహ్మణోత్తమా! సౌందర్యముతోబాటు సత్స్వభావము కూడలేని ఆ భార్యతో నీవేమి సుఖించెదవు? రూపవతి, గుణవతి. అయిన మరొక కన్యను నీకు వివాహము చేసెదను. హాయిగా ఆమెతో సంసారము చేయుచూ నీ కర్మకాండను నిర్విఘ్నముగా కొనసాగించుకొనుము." అనెను.

ఆ మాటల కా బ్రాహ్మణుని హృదయము మథనపడినది. అతడావేశముతో "రాజా! అది అధర్మము. శ్రుతి విరుద్ధము. భార్య యొక్క అందచందములను చూచి ఆమెను పరిత్యజించు అధికారము పురుషునికిలేదు. అగ్నిదేవుని యెదుట చేసిన ప్రమాణానుసారను ధర్మబద్ధముగా స్వీకరించిన పత్నితోనే పురుషుడు జీవయాత్ర సాగించి తీరవలెను. ఆమె మెడలో మాంగల్యము నుంచునాడే ఆమె అతనికి ధర్మపత్ని అయినది. సర్వ ధర్మ కర్మలూ ఆమెతోనే యాచరింపవలెను. ఈ విధి నుల్లంఘించు సావకాశము రాజ శాసన మీయజాలదు. ఒకవేళ యిచ్చిననూ దానిని నేను స్వీకరించను. నీవు ధర్మ ప్రభువే అయినచో నా భార్య నాకు తెచ్చి యిమ్ము" అనెను.

అంగీకార సూచకముగా మహారాజు తల త్రిప్పి వెనువెంటనే రథమును సిద్ధము జేసి కొని బ్రాహ్మణపత్ని నన్వేషించుటకు స్వయముగా బయలుదేరెను. అట్లు బయలు దేరిన ఉత్తమ భూపాలుడు చాలాదూరము ప్రయాణము చేసి చేసి అరణ్యములో ఒక మున్యాశ్రమమును చూచెను. ప్రసన్న హృదయముతో రథముదిగి ఆశ్రమములో ప్రవేశించి మునిచంద్రుని సమీపించి సాష్టాంగ నమస్కారముచేసి వినయముగా నిలబడినాడు. ఆ మునిచంద్రుడు మంద స్మిత వదనముతో చక్రవర్తినిచూచి ఆసన మును చూపి శిష్యుని పిలిచి చక్రవర్తికి అర్ఘ్యమిమ్మనెను. అంత కుశాగ్ర బుద్ధియైన శిష్యుడా చక్రవర్తిని గుర్తించి గురుదేవుని రహస్యముగా పిలిచి- "గురుపూజ్యా! యీ మహారాజు కర్ఘ్య మీయవచ్చునో కూడదో యోచింపుడు". అనెను. అంత ఆ ముని శ్రేష్ఠుడు దివ్యదృష్టితోచూచి శిష్యునితో మౌనము వహించుమనెను. దానికి చక్ర వర్తి విభ్రాంతుడైనాడు. అంత మునీశ్వరుడు క్షణకాలమాగి- "మహారాజా! నీ రాకకు కారణమేమి?" అని ప్రశ్నించగా చక్రవర్తి బద్ధాంజలియై వినయముగా- "మునివర్యా! త్రికాలజ్ఞులకు తెలియని దేమున్నది? అయిననూ అర్థినై వచ్చితిని గనుక విన్నవించుకొనుచున్నాను.

నా రాజ్యములోని సదాచార సంపన్నుడైన బ్రాహ్మణ శ్రేష్ఠుని భార్యను యెవ్వడో దొంగ అపహరించుకొనిపోయెను. ప్రజల భాగ్యములతోబాటు వారి ధార్మిక ఫలములో కూడ ప్రభువు భాగస్వామి కదా! కనుక వారికి జరుగు అన్యాయములను నివారించుట నా కర్తవ్యముగా భావించి ఆ బ్రాహ్మణ పత్ని నన్వేషించుటకై బయలు దేరితిని. తమకు తెలిసినచో ఆ వివరము చెప్పండి." అని కోరెను.

ముని చిరునవ్వునవ్వి- "రాజా! చాల సంతోషము. ప్రస్తుత మా బ్రాహ్మణపత్ని ఒకానొక రాక్షసుని యధీనములోనున్నది." అనుచూ అతడా రాక్షసుడు వసించు స్థలమును గురించి కూడ వివరముగ చెప్పెను. అంత మహారాజు సంతోషముతో వెడల బోవుచూ, మునిచంద్రా! మీ ఆశ్రమములో ప్రవేశించబోవు నాకు అర్ఘ్యము నిమ్మని మీ శిష్యున కాదేశించి యున్నారు. కాని మరుక్షణములోనే నాకా యవకాశము లేకుండా యెందులకు చేసినారు. దీనికి కారణము చెప్పగోరుతున్నాను. అని అర్థించెను.

అందులకు మహర్షి నవ్వి- రాజా! నీవు నీ భార్యను అరణ్యములో విడిచివేసినావు. భార్యా రహితునకు కర్మాధికారముపోవును. పదిహేనురోజులు కర్మను విడనాడినవాడు చండాల సముడు. అర్థమయినదా! అనెను. దానికి చక్రవర్తి సిగ్గుతో తలవంచుకొని బ్రాహ్మణపత్ని నన్వేషించు యూహతో మునికి నమస్కరించి రథముపై బయలు

## శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం
### శ్రీ వేంకటేశ్వర కల్యాణ ప్రదేశం
### నారాయణవనం.

★

### నిత్యకార్యక్రమ వివరాలు

| | | | |
|---|---|---|---|
| సుప్రభాతం ఉ॥ | 6-00 నుండి | | 6-30 |
| విశ్వరూపదర్శనం | 6-30 | ,, | 8-30 |
| తోమాలసేవ | 8-30 | ,, | 9-00 |
| కొలువు, అర్చన | 9-00 | ,, | 9-30 |
| శాత్తుమొర & గంట | 9-30 | ,, | 10-00 |
| సర్వదర్శనం | 10-00 | ,, | 11-30 |
| 2-గంట, అష్టోత్తరం (ఏకాంతం) | 11-30 | ,, | 12-00 |
| తీర్మానం | 12-00 | | |
| సర్వదర్శనం సా॥ | 4-00 | ,, | 6-00 |
| తోమాలసేవ, అర్చన (ఏకాంతం) | 6-00 | ,, | 7-00 |
| రాత్రి కైంకర్యం | | | |
| శాత్తుమొర | | ,, | 7-00 |
| సర్వదర్శనం | 7-00 | ,, | 8-45 |
| ఏకాంతసేవ | 8-45 | ,, | 9-00 |

### ఆర్జితాదుల వివరాలు

| | | |
|---|---|---|
| అర్చన, అష్టోత్తరం .... | రు. | 3-00 |
| హారతి .... | రు. | 1-00 |
| కొబ్బరికాయకు .... | రు. | 0-50 |
| సహస్రనామార్చన .... | రు. | 5-00 |
| పూలంగి (గురువారం మాత్రం) .... | రు. | 1-00 |
| అభిషేకానంతర దర్శనం (శుక్రవారం) | రు. | 1-00 |

దేకివిపకరా రాక్షసుని నివాసమునైయుండె ఒం
టరిగా యున్న ఆ బ్రాహ్మణ పత్నిని
గుర్తించి ఆమెను సంబోధించి - "అమ్మా!
నీ హావ రేఖలు పరిశీలించ నీవు విశాలుని
పుత్రుడైన సుశర్మ భార్యవలె నున్నావు.
నీవీ అరణ్యములోనికి వచ్చిన కారణమేమిటి?
నీ సంగతి సందర్భములు వివరముగా
చెప్పుము." అన్న మహారాజు పలుకులాల
కించిన సుశర్మ భార్య ఆనందముగా
"మహాపురుషా! నేనతిరాత్రుడను బ్రాహ్మ
ణుని పుత్రిని. విశాలుని కోడలును. ఇప్పుడు
మీరు చెప్పిన పేరుగలవారి యిల్లాలినినేనే.
అద్రిపుత్రుడైన బలాకుడను రాక్షసుడు
నన్ను కొంగిలించి తెచ్చి యీ అరణ్య
ములో ఉంచెను. నాటి రాత్రి ఆరుబయట
నేను నిశ్చింతగా నిదురించుచున్న సమ
యములో యీ దుష్కరుడు నన్నిట్లు
చేసెను. మహానుభావా! ఇక్కడ నేననుభ
వించు దుఃఖము శత్రువునకైననూ వద్దు"
అని తన కష్టపరంపరను వివరించుచూ
మహారాజు నొక ప్రదేశమునకు పిలిచి
అక్కడనుండి యెదురుగానున్న ప్రదేశ
మును చూపుమని సంజ్ఞ చేసినది. మహా
రాజు కిమ్మిక యెదుట భీకర రూపములతో
రాక్షసుని వెంబడి ప్రత్యక్షమాయెను.

అదే సమయములో బలాక రాక్షసుడు
కూడ చూచుటవలన మహారాజు వాని
దృష్టిలో పడెను. ఆక్షణములో వాడు
బయలుదేరి హుటాహుటి మహారాజును సమీ
పించి దండప్రణామము లాచరించి "ప్రభూ!
నేను మీ రాజ్యములో జీవించుచున్నాను.
మీ ఆజ్ఞను పాలించుటకు సర్వదా సంసిద్ధు
డను. మనస్సులో మీరు నన్ను తలచు
కొన్న క్షణములో మీ ముందు వాలగలను."
అనెను. అంత మహారాజు బ్రాహ్మణపత్నిని
రథముపై కూర్చుండుమని రాక్షసునివైపు
కృతజ్ఞతా సూచకముగా నవ్వి రథమును
మున్యాశ్రమము వైపు మరలించి మహర్షిని
సమీపించి దండప్రణామము లాచరించి -
'స్వామీ! నా ధర్మపత్ని వృత్తాంతమును
తెలుపుడని కోరెను. ముని క్షణకాలమాగి -
"రాజా! నీ ధర్మపత్ని ప్రస్తుతము పాతాళ
లోకములో సురక్షితముగా నున్నది.
నాగరాజామెను తన అంతఃపురములో
సురక్షితముగా నుంచెను. అతని పుత్రి
యగు నంద నీ భార్యయందు మితాభి
మానము ప్రదర్శించుచుండుట వలన ఆమె
తండ్రి ఆమెను మూగదానివి కమ్మని
శపించెను. అని మునిదీక్షలోకి వెళ్ళి
పోయెను.

అంత ఉత్తమ భూకాంతుడు రథమును
రాజధానివైపు మరలించి బ్రాహ్మణుని
యింటి దగ్గఱ ఆగి అతని భార్య నతనికి
సమర్పించి" ఓ బ్రాహ్మణోత్తమా! నాకు
నా ధర్మపత్నిపై చెప్పలేని యనురాగ
మున్నది. కాని ఆమె నాపై యెల్లవేళల
యందు యధికారము చలాయించుటకే
ప్రయత్నము చేయుచుండుటవలన ఆమె
నరణ్యములో విడిచి వేయించితిని. ఆమెకు
నాపై అనురాగాభిమాన భక్తులుకుదురు
నట్లే దేని మార్గమును తెలియజేయు''
డని కోరెను. అంత ఆ బ్రాహ్మణుడు
యోచించి అందుకొక వ్రత విధానము కల
దనియు ఆ వ్రతాచరణము వలన భార్యా
భర్తల మధ్య తప్పకనురాగము ఉద
యించుననియు చెప్పగా మహారాజు సంతో
షముతో ఆ వ్రత విధానమునకు సంకల్పము
చేయగోరెను. ఆ మీదట సుశర్మ ఉత్తము
నిచే "మిత్రవింద" యనుఉత్తమ వ్రతము
నేడు మార్లు చేయించి - "మహారాజా! ఇక
నీవు నీ సతిని తీసికొనివచ్చి ఆమెతో సమస్త
భోగములూ అనుభవించుము. భక్తి శ్రద్ధ
లతో యజ్ఞదానాది ధర్మకార్యము లాచరిం
పుము'' అనెను.

ఆ తరువాత మహారాజు తన సౌధము
చేరి రాక్షసుని స్మరించగనే అతడు ప్రత్యక్ష
మైనాడు. ఆ రాక్షసునికి తన భార్యయున్న
స్థలము చెప్పి ఆమెను సురక్షితముగా తీసి
కొని రమ్మని ఆదేశించి పంపెను. వాడు
కొలది కాలవ్యవధిలో చక్రవర్తి ఆదేశమును
పాలించి మహారాణితో చక్రవర్తి యెదుట
నిలిచెను.

తన నాథుని చూచుచునే బహుళారాణి
సంతోషమో! దుఃఖమో తెలియని దివ్యాను
భూతితో అలింగనము చేసికొని అతని
యందు బద్ధానురాగ అయినది.

## భక్తులదాసుడం

శేషశయనుడా - శ్రీనివాసుడా
మమ్ము కాచిబ్రోవుమయ్యా వేంకటేశుడా

మీనమై వేదాలను కాచినావే
కూర్మమై మందరము మోసినావే

ఆదివరాహమై ఆ ధరను కాచినావె
నరసింహుడవై నీ భక్తుని బ్రోచినావే

భార్గవుడవై భూపుల పీచమడచినావే
రాముడవై రావణు పరిమార్చినావే

వామనుడవై బలిఖొంచినావె
కృష్ణుడవై కంసుని దునిమినావే

బుద్ధుడవై శాంతిబాట వేసినావే
దేవదేవుడవై భక్తులదాసుడవై

ఏడు కొండలపై నిలచినావే
కలికివై మానవకలి బాప రావే

- ఎస్. రామయ్య

# ధర్మకర్త

**— శ్రీ శిరిపురపు జవహర్ లాల్**

ప్రజలు విస్తుపోతున్నారు. భక్తిగురించి విస్తృతంగా చర్చలు జరుగుతున్నాయి. నగరంలో ఏవేవో కరపత్రాలు నలుగురి చేతుల్లోకి వస్తున్నాయి. ఏ పుస్తకాల షాపుల్లోచూచినా వేదాలు ఉపనిషత్తుల మీద చిన్న పుస్తకాలు వేలాడుతున్నాయి.

నగరంలో 'ధార్మిక మహాసభలు' జరుగుతున్నాయి. ఎక్కడ చూచినా తానై తిరుగుతున్నాడు బసవరాజు. బసవరాజు నగరంలో ఒక చిన్న పుస్తకాల దుకాణం నడుపుతుంటున్నాడు. కేవలం అది జీవించడంకోసం. అతని వెనుకవైపు, అతను మతం గురించి ఉత్సాహ పూర్వకమైన దాని ప్రచారం గురించి అహరహం కృషి చేస్తున్నాడు. అవివాహితుడు.

ధార్మిక మహాసభలలో అతను ఏర్పరచిన చర్చలు కొత్తరకంగా ఉన్నాయి. సామాన్య జన సందోహానికి దగ్గరగా ఉన్నాయి. సాయంత్రాలు అన్నమాచార్యులు, త్యాగయ్య, రామదాసులు రచించిన కీర్తనలు, భామాకలాపాలు, హరికథలు పురాణ శ్రవణం, భక్తిరస చిత్రప్రదర్శనం, ఇదంతా ఏమిటో ప్రజానీకానికి అర్థంకావడం లేదు.

అతని ప్రచార ధోరణిలో ఒక వేగం, ఒక దూకుడు, ఒకతేజం కొత్తపుంతలు తొక్కినవి. అందరి చేతుల్లోను ఒక అచ్చుపత్రిక. దాని ఖరీదు వారు ఊహించనంత తక్కువగా ఉంది. పత్రికనిండా మతంగురించిన వివిధ విషయాలు ఉన్నాయి.

దీని వెనుక బసవరాజు పడుతున్న శ్రమ అతని మిత్రుల సహాయ సహకారాలు చెప్పుకోదగ్గవి.

తన మతం గురించి బడుగు ప్రజలకు ఒక అవగాహన కల్పించాలన్న అతని ఉద్దేశ్యం కొంతవరకు నెరవేరిందనే చెప్పవచ్చు.

టూరిస్టుబస్సుల నేర్పాటుచేసి కేదారనాథం నుంచి రామేశ్వరం వరకు అనేక తీర్థయాత్రలు నిర్వహించాడు. అక్కడక్కడ దేవాలయాలలో ప్రభాత సమయాలలో ప్రార్థనా శ్లోకాలు చదివేవాడు. నలుగురిచే చదివించేవాడు. నిజంగా ఉదయం పూట మంద్రస్వరంతో అతను పాడుతుంటే ప్రాణానికి ఎంత హాయిగా ఉండేదో.

అతను యం. ఏ. ఫిలాసఫీ చేశాడు. దిగులులేని జీవితం. అయినా ఏదో ఆలోచన. ఏదో చేయాలని. ఏం చేయాలి? ఒక గమ్యం వెదకాలి. తనను గురించి ఆలోచించే వాళ్ళు వెనక ఎవరూలేరు. సంసార జీవితంపట్ల వ్యామోహములేదు.

ఒకసారి వివేకానంద మిషనుకు వెళ్ళాడు. అక్కడ పుస్తకాలను చూస్తుంటే తన గమ్యం ఏదో తెలుసుకున్నాడు. అది తన మతం.

ఆరోజునుంచి మతం గురించి మనిషి గురించి ఎన్నోపుస్తకాలు ఎన్నోరాత్రులు చదివాడు.

తన మతంలో, దాని ప్రచారంలో ఒక నూతనత్వం సృష్టించాలి. అదే తపన. అప్పుడే మతం గురించి ఒక కొత్త సమన్వయం రూపొందించాడు.

మహాసభల స్వాగతోపన్యాసంలో బసవరాజు ఒక కొత్తదనం రేకెత్తించాడు.

హిందూధర్మ ప్రచారం ఎందుకు? ఎలా?అనే అంశంపై ఒక కల్పన.

'మతమనేది మన పల్లెలోని ప్రజలదాకా వెళ్ళాలి. వాళ్ళకు మన వేదవేదాంగాల గురించి వివరంగా తెలియడం జరగాలి. మన ఆధ్యాత్మ సాహిత్యంవాళ్ళు వాడుకోవడం జరగాలి. అప్పుడే మతం మార్చుకోవడం లాంటివి తగ్గుతాయి. కనీస అవసరాలయిన తిండి బట్ట గురించే వారు పరధర్మంపట్ల మక్కువ చూపుతున్నది. మన మతం గురించి సరియైన అవగాహన లేకపోవడం రెండవ విషయం. రెండవదాన్ని మనం అందజేస్తే మొదటిది అంతపెద్ద విషయంగా చర్చకురాదు.' అంటూ పేర్కొన్నాడు.

అదే భావన వేదికగా ధార్మిక మహాసభలను తీర్చిదిద్దాడు. అదే ప్రారంభం పల్లెదిక్కు ప్రయాణం.

తన మతం గురించి తన మనిషికి చెప్పాలి. దాని పవిత్రతను తెలియజెప్పాలి. దాని ప్రాముఖ్యం తెలియజెప్పాలి.

గంగా హిమాలయాలవలె పురాతనమై, తరతరాల నుండి సామాజిక జీవిత విధానంలో జీర్ణించుకుపోయిన తన మతం తన గమ్యం.

అదే అంతంలేని ఆరంభం. *

## " పరిపాలయమాం దేవా "

గుడులను కట్టించి గోపురములు నిల్ప
వేలు లక్షలులేవు వెచ్చ మిడఁగ
తపము లొనర్పగా జపములు సలుపగా
మనసు నిల్కడచేయు మహిమ లేదు
స్తోత్రపాఠాలతో స్తుతులను జేయగా
భాషపై అధికార పరిధి లేదు
వేదాలు వర్ణించి విజ్ఞత నందగా
ప్రాచ్యభాషాజ్ఞాన ప్రాప్తి లేదు

ఏమిలేనట్టి నిరుపేదనేను మిమ్ము
నెటుల దర్శింతు దరియింతు నెవ్విధాన?
అస్మదీయార్తిఁ బాపగా నాజ్ఞ యిడవె
సప్తగిరివాస! కల్యాణచక్రవర్తి.

— మల్లాది సుమిత్రాకృష్ణ

మానవ నాగరిక సాంస్కృతిక జీవితమునకు, ఆధ్యాత్మిక సాహిత్యమునకు ఆధార ఆధేయ సంబంధము కలదు. అనాది నుండియు నాగరికతా సంస్కృతులకు మూలకందము ఆధ్యాత్మిక సాహిత్యము. మానవుడు ఆధ్యాత్మిక భావన గలిగి సృష్టి రహస్యముల తెలిసికొనగోరెను. విమర్శాత్మక జ్ఞానముతో తాను దర్శింప గలిగిన ఆధ్యాత్మిక తత్త్వజ్ఞానములను మంత్ర యుక్తములగు ఋక్ రూపమున వెలయింపజేసెను. కాలక్రమమున వేదభాష సులభగ్రాహ్యముకానందున ఉపనిషత్తులు, షడంగములు వెలసినవి. తరువాత రామాయణము, అష్టాదశపురాణములు, గీతలు ఆవిర్భవించినవి.

ఋగ్యజుః సామాత్మకమగు త్రయీ విద్యయే శ్రీవిద్య. శ్రీవిద్యయే బ్రహ్మవిద్య. శ్రీస్త్రైణరూపమునకు నామరూపలింగములు లేవు. బ్రహ్మవిద్యారూపిణియగు పరాదేవతయే అవిచ్ఛిన్నమయి, అనూచానమయి స్థితి (ఆధారము) గలిగిన సత్పురుషుల క్కాశ్రయణీయమయినది అమృతరూపిణి అయిన శ్రీః.

ఉత్కృష్టతరమయిన ప్రయోజనమును పొందగోరి వినాశములేని అమృతాశ్రీదేవతా (ఆధ్యాత్మిక) తత్త్వమును తెలిసికొనుటకు సునిశితమయిన తీక్ష్ణబుద్ధి, శుచియగు మనస్సు కావలయును. నిత్యానిత్యవస్తు వివేకము, ఐహికాముష్మిక ఫలభోగవిరాగము, శమదమాది సంపత్తి, ముముక్షుత్వము అను నాలుగు సాధనములు కలవాడే ఆధ్యాత్మికవిద్యకు అధికారి యని శంకరాచార్యులు నుడివిరి. పారమార్థిక తత్త్వము తర్కసాధ్యముకాదు. అనుభవైక వేద్యము.

చిన్మయదృష్టితో తన్మయభావమున పరతత్త్వమును తరచిచూచిన ఆనందమయ నాదబిందువు కావనగును. ఈ పరమానంద నాదబిందువే శ్రీదేవి. (శ్రీమాత.) నాదబిందు కళలో చలాచల, సగుణ నిర్గుణ, ప్రకృతి పురుషులకు భేదములులేవు. పరబ్రహ్మమునకును బ్రహ్మశక్తికిని భేదము లేదు. "యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహమ్" అను గీతాచార్యుని పలుకుల రీత్యా వ్యక్తము, అవ్యక్తము అను రెండు రూపములు పరబ్రహ్మమునకు గలవు. ఈ రెండు విధముల వ్యవస్థగలిగి యున్న పరమాత్మను ఎవరు ఏ విధముగ రూపకల్పన జేసికొని ఉపాసించుచుందురో, ఆయా సాధనములలో నిష్ఠగల ఆ యుపాసకులను ఆయా రూపముతోనే ప్రత్యక్షమయి అనుగ్రహించును. పెద్దల అభిమతమును బట్టి చిచ్ఛక్తియగు శ్రీదేవతను మాతృరూపమున ధ్యానమొనరించుచు నుపాసించుట లెస్సయని యెరుగవలయును. పెద్దలు మననము నిదిధ్యాసము చేయుచు ప్రకృతిని సేవించి తమ అనుభూతిని వెల్లడించి యున్నారు కదా!

# సృష్టి సామాన్యధర్మాలు

— శ్రీ మీసగండం పరమాత్మాచారి

సృష్టికి పూర్వము ఈ విశ్వమంతయు గాఢాంధకార బంధురమయి భూ నభోన్తరాళము లెల్ల గ్రమ్ముకొని యుండు తరి ప్రకృతి దివ్యమంగళలీలా విలాస చిన్మయ చారుహాసము, ఓంకార నాద ఆది పరా దేవతాశక్తి అఖండ పరంజ్యోతిర్మూర్తియై వెలుగజొచ్చెను. సృష్టి స్థితి లయకరుడు, శ్రీవిరాడ్విశ్వస్వరూపుడు, దివ్యమంగళాకరుడు, చిన్మాత్రస్వరూపుడగు ఆ పరమాత్మ ప్రళయార్ణవ మధ్యంబున ఆదిశేషుని పయి వటపత్రశాయియై యోగ నిద్రయందు లీనమయి కోటి సూర్యప్రభా భాసమానుండయి భాసించుచుండెను. కొంత కాలమునకు పరమాత్మ మేలుకొని సృష్టి జగములు సృజించు జిజ్ఞాస తన మనంబున రేకెత్తినది. "నేనెవడను? ఇట్లు బాలునిగా నన్నెవరు చేసిరి? ఏ యాధారముతో జేసిరి? ఇది యెట్లు తెలిసికొనవచ్చును? అని యాలోచించునపుడు "సర్వం ఖల్విదమేవాహం నాన్యదస్తి సనాతనం" (అంతా నేనే. నేను తప్ప సనాతనమయినది యేదీ లేదు) అని శ్రీభగవతి అతని సందియమును నివారించినది. ఈ యర్థ జ్ఞానము మొట్టమొదటగా చిత్ర విచిత్ర గుణసంపన్నమగు మాయాశక్తి ఉపాధిగా గల పరమేశ్వరుని హృదయము నందావిర్భవించినది. జ్ఞానము వలన మనస్సు, మనస్సు వలన పంచభూతములు ప్రభవించెను. అందుండి శబ్దస్పర్శరూపరస గంధము లుద్భవించెను. ఆ పయి త్రిగుణములు కలిగెను. త్రిగుణముల నుండి త్రిమూర్తు లుదయించిరి. అంతలో సర్వలోక ప్రళయకడలి మీద నిరాధారముగా తన సాటి విభూతుల నొప్పుచున్న సఖీజనము సేవించుచుండగ సాలంకృతలయిన "రతీ, భూతి, బుద్ధీ, మతీ, కీర్తి, స్మృతీ, ధృతీ, శ్రద్ధా, మేధా, స్వధా, స్వాహా, క్షుధా, నిద్రా, దయా, గతీ, తుష్టి, పుష్టి, క్షమా, లజ్జా, జృంభా, తంద్రా" అను ఇరువదియొక్క శక్తులు వేరువేరుగా పరివేష్టించి యుండగా చిరునగవు లొలుకుచు త్రిమూర్తులు త్రికళలు దేవీత్రయమై నిలిచెను. వారు శ్వేతవర్ణిని, రక్తవర్ణిని, కృష్ణవర్ణిని. శ్వేతాంగి బ్రహ్మశక్తియైన సరస్వతి. అరుణాంగి విష్ణుశక్తియైన లక్ష్మీదేవి. కృష్ణాంగి శంకరుని శక్తియైన మహాకాళి. తరువాత ఈ త్రిమూర్తులే సృష్టి స్థితిలయ లీలా విలాసముల కంతటికిని మూలమైరి. త్రిమూర్త్యాత్మక చిచ్ఛక్తి పంచభూతాత్మకముగా శరీరముల సృజించి వానియందు యత్నాత్మయై తానందు వసింపుచు ఏకాదశేంద్రియముల మిళితమై షోడశాత్మకుడయి ప్రకాశించుచు ఆనందించుచున్నాడు. శ్రీ

విరాడ్విశ్వ స్వరూప పరమేశ్వరుడు బ్రహ్మాది కల్పాంతము నందును, మ హా ప్ర ళ య కల్పాంతము నందును యోగనిద్ర జెంది స్థిరుడై యుండును. దీనిని బట్టి ఏదో తెలియరాని మహత్తర శక్తి నిర్గుణ, నిర్వికార, నిరంజనమై సర్వాంతర్యామి ఆత్మ రూపమున సర్వ జీవులయందు వెలుగొందు చున్నదనవలెను.

జ్ఞానరూపమున ఈశ్వరుడును, బుద్ధి రూపమున దుర్గయు, మనోరూపమున బ్రహ్మయు, ఇంద్రియముల రూపమున సకల దేవతలును అన్ని జీవులయందు ఉన్నారు. ఈ జగమంతయు మాయచే పుట్టి మాయచే పెరిగి మాయలోనే యడంగు చున్నది. తల్లిదండ్రులు దారాపుత్రాదు లన్నియు ఈశ్వరకృత మాయా ప్రభావమును కర్మబంధములై యున్నవి.

దినమంతయు తిరిగి తిరిగి పక్షు లన్నియు సాయంకాల మగుసరికి ఒక వృక్షమునకు జేరి తలకొక కొమ్మను నిర్మించుకొన్న కులాయములందు రేయెల్లా వసించి తరువాతనే లేచి చెట్టొక పిట్టయై పోవునట్లు ఈ సకల జీవులును తమ తమ కర్మబంధములను బట్టి పుట్టి పెరిగి యది తీరగనే ఎవరి దారిని వారేగుదురు. ఇదియంతయు ఈశ్వర సంకల్ప మాత్ర సంజనిత మాయా విలాస ప్రభావమే. జ్ఞానులీమాయకు లోను గాక ద్వంద్వములకు చిక్కక సర్వప్రాణుల యందు సర్వక్రియా కారణశక్తియగు ఈశ్వరుని సదా స్మరించు చుందురు.

మానవ జీవిత పరిమాణము అత్యంతాల్పాల్పము. దానిని సద్వినియోగము గావించు కొనవలెను. దుస్తర సంసార సాగరము నుండి తరించి జనన మరణములు లేని మోక్షము నొందవలయునన్న ధర్మ సాధనోపాయమును నావతప్ప అన్యోపాయము కానబడదు. సర్వశుభ సంపదలిచ్చు ధర్మాచరణము ముఖ్య కర్తవ్యముగా భావించి ధర్మవర్తనుల మయి చరించుచు జ్ఞానోపార్జనము గావించుకొనవలయును. అప్పుడే ముక్తి లభించును. పరుషవాక్కులు, కోపము, ఓర్పమి, ఆశలు విడిచి నిష్కల్మష హృదయము కలిగి సద్ధర్మమును వీడక యుండడమే ధర్మమగును.

మోక్షమొందుటకు ధర్మసాధనమునకు మించిన సాధనోపాయము అన్యమేదియు లేదు. అందుకనే సాధువులు ధర్మమును ముఖ్యకర్తవ్యముగా ఆచరింతురు. అది మానవులకు మాతాపితాగురువులై బాంధవ పుత్ర మిత్రాదులునై యున్నది. తదన్యమైనది వేరొండులేదు. జీవితాంతమున మనతో గూడ రాగలదియు, వచ్చునదియు ధర్మమొక్కటియే. సర్వవిధముల మనకు రక్షణగా నుండునది తద్ధర్మమే. ఈ ధర్మము ఏ పదార్థమునకు కూడ సాధనభూత మగుచున్నది. సృష్టి స్థితి లయముల కంతటికిని ధర్మమొక్కటే మూలము.



---

## శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం, శ్రీనివాసమంగాపురం.

శ్రీనివాసమంగాపురంలోని శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయంలో జరుగు నిత్య కల్యాణోత్సవం, అభిషేకం, నిత్యఅర్చన వివరాలను యాత్రికుల సౌకర్యార్థం ప్రచురిస్తున్నాము.

**నిత్యకల్యాణోత్సవం :**

నిత్యకల్యాణోత్సవసేవ ప్రతిరోజూ ఉదయం 10-30 నుంచి 12-00 గంటలవరకూ జరుగుతుంది. ఈ సేవకు 150 రూ॥లు చెల్లించాలి. పదిమంది వ్యక్తులను ఈ సేవలో పాల్గొంటానికి అనుమతిస్తారు. గృహస్థుకు వస్త్రబహుమానం వుంటుంది.

**అభిషేకం :**

ప్రతి శుక్రవారం అభిషేకసేవ జరుగుతుంది. (ఉదయం 7-30 నుంచి 9 గంటలవరకు) అభిషేకం చేయించేవారు 100 రూ॥లు చెల్లించాలి. ఇద్దరు వ్యక్తుల్ని ఈ సేవలో పాల్గొనటానికి అనుమతిస్తారు.

**నిత్యఅర్చన :**

నిత్యఅర్చనసేవ సంవత్సర కాలమూ ప్రతిరోజూ వుంటుంది. ఈ సేవ చేయించదలచినవారు 42రూ॥లు చెల్లించాలి.




తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# ఉదయాస్తమాన సర్వసేవాపథకం

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి వారిని సంపూర్ణంగా అర్చించడానికి భక్తులకొక సదవకాశం!

తలుపులు తెరచినప్పటి నుండి తిరిగి తలుపులు మూసేవరకు ఒక దినంలో తిరుమల శ్రీవారి ఆలయంలో జరిగే సమస్త పూజావిధులను అనగా సుప్రభాతం, తోమాల, అర్చన (మూడు పర్యాయాలు) నైవేద్యం ఇంకా ఇతర ప్రత్యేక సేవలను ఉదయాస్తమాన సర్వసేవానిధి పథకం క్రింద భక్తులు తమ పేరిట స్వంత ఖర్చులతో స్వామివారికి జరిపించవచ్చును.

**పథకంలోని ముఖ్యాంశాలు :**

* కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం పేరిట ఒక లక్షరూపాయల విరాళాన్ని క్రాస్ చేసిన డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా చెల్లించాలి. శుక్రవారం సేవలకు మాత్రం మూడులక్షల విరాళం (అభిషేక నిమిత్తం) ఇవ్వవలసి వుంటుంది.
* భక్తులు తమ కైంకర్యములు జరిపే రోజున ఆరుమంది సభ్యులకు శ్రీవారి దర్శనం వుంటుంది. అనివార్య కారణాలవల్ల కొన్ని సేవలు రద్దుకాని పక్షంలో సుప్రభాతం, తోమాలసేవ, సహస్రనామార్చన, ఏకాంతసేవల వంటి అన్ని పూజావేళలలో శ్రీవారిని దర్శించవచ్చును. (శుక్రవారం తప్పించి)
* కైంకర్యదినాన ఆలయంలోపల దాత పేరు ప్రదర్శింపబడుతుంది. గోత్రాదులతో సహా దాత పేరును శ్రీవారి కొలువులో ప్రకటిస్తారు.
* ఆ దినాన జరిగే ఆర్జిత సేవలన్నింటిని కైంకర్యదాత తనవారితోసహా తిలకించవచ్చును.
* కల్యాణోత్సవంలో శ్రీవారి ఉత్సవమూర్తులకు సమర్పించే శేషవస్త్రాలు మూడింటిలో ఒకదానిని గృహస్థుకు బహూకరిస్తారు. ఉచితప్రసాదంగా 25 లడ్డులను, 5 వడలను ఇస్తారు.
* వస్తువుల ధరలు గణనీయంగా పెరిగిపోయిన పక్షంలో పూజాకార్యక్రమాల అదనపు వ్యయాన్ని దాతలే భరించవలసి వుంటుంది. అందుకు సిద్ధంకానపుడు ఆనాటి అదనపు వ్యయం భర్తీ చేసేందుకు దేవస్థానం మరొకరి విరాళాన్ని స్వీకరించవలసి వస్తుంది. అటువంటి సందర్భాలలో ఒకరు లేదా అంతకు మించిన దాతల పేర్లతో ఆనాటి పూజలు జరుపబడుతవి,
* కైంకర్యములు జరిగే తేదిని గురించిన వివరాలను దేవస్థానం ఆయా దాతలకు తెలియజేయగలదు.

ఈ పథకం గురించిన ఇతర వివరాలకు - వివరణలకు కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి అనే చిరునామాకు వ్రాయండి.

(11 వ పేజీ తరువాయి)

ఈశ్వరుడు అన్ని వేళల భక్తుల హృదయములలో నివసించుచుండును. ఎందుకనగా స్వామికి భక్తులు దాసులు. దాసుల కష్ట సుఖములను విచారించు బాధ్యత భగవానునిదే. అందుకనే భక్తునికి భగవంతునకు గల సంబంధము విడదీయరానిది.

భగవత్సృష్టి యంతయు ద్వంద్వాత్మకం. ఏకసూత్ర ప్రతిపాదితము. ఈ ద్వంద్వ భావము లోకమందంతటను కన్పట్టుచున్నది. యజమాని - సేవకుడు, భర్త - భార్య, తండ్రి - పుత్రుడు, గురువు - శిష్యుడు, భక్తుడు-భగవంతుడు, ఇత్యాదిగా ద్వంద్వత భావింపబడుచున్నది. భగవంతుని భావనయందు ద్వంద్వంలో విరుద్ధ భావప్రతిపాదన లేదు. విరుద్ధభావన యంతయు మానవుని ప్రతిపాదన. వానికి ఈ లోకము విభిన్నాత్మకమై కన్పట్టుచున్నది. ఈ అనేకత్వములో ఏకత్వమును దర్శించలేకయున్నాడు. ద్వంద్వమూలంగా ఈ అనేకత్వం ఏర్పడింది. ఈ ద్వంద్వంలో మనము సమన్వయసూత్రము ప్రతిపాదించుకొన్న ఆ సూత్రమే అనేకత్వమును కూడ దర్శితము. ద్వంద్వంలో ఉండే ఏక సూత్రానికి ప్రతీకగా పరమేశ్వర అర్ధనారీశ్వర తత్త్వాన్ని, అనేకత్వంలో ఉండే ఏక సూత్రానికి ప్రతీకగా పరమేశ్వర విశ్వరూపాన్ని చెప్పుకోవచ్చును.

ఈ ఏకత్వ సూత్రము ఆధారంగా భగవంతుని నుండి విడివడిన జీవుడు అతనివైపు ఆకర్షింపబడుతూ ఆ సూత్రం మీదనే కర్మ కొనసాగించుచున్నాడు. ఈ సూత్రము భగవంతునికే విదితము. జీవునకు అగోచరము. అందుకే భగవత్సృష్టి కార్యక్రమము జీవున కర్థముగాదు. అర్థముకాని దశనుండి ప్రారంభమవుతుంది నివృత్తి మార్గము. అప్పుడు అగమ్యగోచరమైన ఈ సృష్టికి మూలాధారమును అన్వేషించుటకు భగవంతుని శరణు పొందును. భగవత్ప్రతిపాదితమైన సూత్రమును కర్మగావించుచు కర్మఫలమును భగవంతుని కర్పించి ఆనందుడగుచున్నాడు.

ఈ శరణాగతిభావము ఆళ్వారుల భక్తి సంప్రదాయమందు ప్రపత్తి మార్గంగా చెప్పబడింది. ఆళ్వారులు తమ దివ్య ప్రబంధములలో ప్రపత్తి ప్రాముఖ్యమును గురించి విశేషముగా ప్రస్తావించియున్నారు.

తన దోషములను బాగుగా గుర్తించి పశ్చాత్తాపమును ప్రకటించుచు తన ఆశ్రయ హీనతను అనుభవమున దెప్పుకొనుచు, భగవంతుడొక్కడే తన కాధారభూతుడుగా విశ్వసించుట, తనముద్ధరింప వలసినదని భగవంతుని ప్రార్థించుట అనునవియే ప్రపత్తికి ముఖ్యలక్షణములు.

ప్రపత్తి పథములో సాధన యనావశ్యకము. కేవలము భగవంతుని త్రికరణశుద్ధిగా ఆశ్రయించుటయే ప్రపత్తి పథములో ముఖ్య కర్తవ్యము. ఇట్టి శరణాగతి తత్త్వమును ఆళ్వారులు విశేషముగా ప్రశంసించి యున్నారు.

"ఓ కరుణామూర్తీ! నాకు నాది యని చెప్పుటకేదియునులేదు. ఇల్లులేదు. వాకిలి లేదు. బంధువులులేరు. అశాశ్వతమైన నా జీవితములో నీ పాదారవిందములను గట్టిగా శరణింపనైతిని. ఓ భగవానుడా! నేనిపుడు బిగ్గరగా ఆక్రందించుచున్నాను. నీవు తప్ప, ఇక నా కాశ్రయమిచ్చు వారెవరున్నారు?"

"ఓ తులసీమాలాధారీ! నీవే నాకు రక్షకుడవు"

ఈ రీతిగా తొండరడిప్పొడి యాళ్వారులు భగవంతుని శరణించుట శరణాగతులందరకును మార్గదర్శకులగుచున్నారు.

భగవద్గీత ప్రతిపాదించిన మోక్షమార్గంగా 'శరణాగతి' ని విశిష్టాద్వైతమార్గం విశ్వసిస్తున్నది.

"సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వ పాపేభ్యో
మోక్షయిష్యామి మా శుచః"

(18వ అధ్యాయం—66వ శ్లోకం)

ఈ శ్లోకమందలి మొదటిపాదము జీవుని కర్తవ్యమును సూచించును. రెండవ పాదము భగవంతుడొసంగు ప్రతిఫలమును సూచించును.

జీవుడు తాను చేయవలసినది చేయనిచో భగవంతుడు తానొసంగవలసినదాని నొసంగడు. ప్రకృతియందొకానొక అప్రతిహత నియమమును భగవానుడేర్పరచెను. అది యేదనగా పాపముచే దుఃఖము, పుణ్యముచే సుఖము, జ్ఞానముచే లేక భగవచ్ఛరణాగతిచే మోక్షము కల్గును. ●




## ప్రత్యేక కల్యాణోత్సవం

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆర్జిత కల్యాణోత్సవం - కలవారు మాత్రమే చేయగల కైంకర్యం కాదిప్పుడు! - 1981 నవంబర్ 1 వ తేది నుండి ఆర్జిత కల్యాణోత్సవం రేటు 2,000 రూ.లకు పెంచబడిన దృష్ట్యా సామాన్యులకు అందుబాటులోవుండే విధంగా కేవలం 500 రూ.లతో మాత్రమే వేరొక 'కల్యాణోత్సవం' ఏర్పాటయింది. గృహస్థుతో కలిసి ఐదుగురిని మాత్రమే అనుమతించే ఈ కల్యాణోత్సవంలో ప్రసాదాల పంపకం వుండదు. మిగతా అంశాలన్నీ మామూలుగానే వుంటాయి. ఈ కల్యాణోత్సవం జరిపించ దలచేవారు—

పేష్కారు, తిరుమల ఆలయం సంప్రదించవలసి వుంటుంది.



# శ్రీనివాసకల్యాణము



(గతసంచిక తరువాయి)

కథక: ఇదిగో! మనవిచేస్తున్నా కాదూ! ఇల్లా కపిలగోవు చోళ రాజు ఆలమందతో మేతకేగుచు ప్రతిదినమును వేంక టాద్రి పైకెక్కి, స్వామి వసించెడి పుట్టబిలమ్ములో నాల్గుచన్నులు ఏకధారగాజేసి పాల్గురిసి, గోవిందునకు తుష్టి గూర్చుచున్నంత–

సూత్ర: బలేవాడవు మూర్తీ నువ్వు! పాలన్నీ ఆ పుట్టలోనే పోస్తే రాచబిడ్డ పొట్ట ఏం కావాలి?

కథక: పెద్దలు మీరూ అంతే అన్నారూ?

జీవకోటుల నెల్ల పోషించిపెంచు
ఆదినారాయణుడు తనయావుపాల
నిట్లు వరితుష్టు డగుచుంట ఎరుగలేక
చోళవిభురాణి యపుడుగోపాలు బిలిచి–

గోపాలునితో నేమనుచున్నది–?

రాణి: ఆవుజూచిన కడుపునిండు నయూరె దీనిపొదుంగులో లేవు పాలొక చుక్కయేని బలే! యిదేమిరగొల్లడా?

గొల్ల: దేవరాన! ఇదేమి వింతయొ తెలియదో దొరసాని! ఈ యావు పోకడలెల్ల నిక్కము నరసియెల్లి వచించెదన్.

కథక: అని పలికి గొల్లండు మరు నా డాయావు చర్యలు గనిపట్టి యున్నంత–

ఎప్పటట్ల గోవు పుట్టనెక్కి నాల్గుచన్నులన్
కువ్వగూరక్షీరధార కురియుచుంట జూచి, మా
యవ్వ! తెల్లమాయె దీని యాగడమ్ము, నావయిం
దవ్వపెట్టి ముచ్చుకాన! తప్పిపోవ నేర్తువే!
ఔనె గోవుకాన! ముచ్చువై యిదా! వృథాగపాల్
కానపాలుచేసి నాకు గండ కత్తెరైతి; నిన్
కానకున్ బలీయకున్న కాను గొల్లబోయడన్
కాను సుమ్మటంచు చేతి గండ్రగొడ్డ లెయ్యెడన్,
బిరానెత్తి గోవునెత్తి బిట్టు వ్రీలగొట్టబో
కరీంద్ర రక్షకుండు గోవుగావ పుట్టనుండి "మా
నరా, దురాత్మ" యంచు వ్రేటునాటకుండ అడ్డురాన్
హరీహరీ! తుదుత్తమాంగ మగ్గమయ్యె వ్రేటుకున్.
వరతుధార హరిశిరమ్ము బళ్లుమనుచువ్రీల, నం
బరము నంట రుధిరధార పర్వులెత్తె బుస్సునన్
చరమదిశను స్రెత్తుటేర్ల సవితృడంత మునిగిపోన్
ధరను ద్రెళ్లిపడియె గొల్ల దానవారి ముందటన్–

సూత్ర: అయితే, రమణమూర్తీ! ఈ మేళతాళాల సందడిలో నాకు తెలిసిందికాదు. ఏమయిందంటావు? నారాయణ మూర్తి శిరస్సేనా పగిలింది?

కథక: అవునండి, శిరస్సుపగిలి ఏడు తాళ్లెత్తున రక్తం చిమ్మింది. గొల్లవాడు అదలిపోయి ప్రాణాలు వదిలాడు.

సూత్ర: హరిహరీ! ఎంతపని జరిగిందండేనూ! మరి ఆ గోవు మాట?

కథక: ఆ గోవు అంబేయని అడలుతూ, ముట్టె ఎగబట్టి, ఒక్క పరుగున చోళరాజు సన్నిధిలో పోయి పడింది.

సూత్ర: పాపం! దాని బాధంతా నారాయణమూర్తి కోసమే కాని తనకోసం కాదు సుమా.

కథక: బాగా సెలవిచ్చారు. అది బ్రహ్మదేవుడే కాదటండీ. అంతట చోళరాజు "గోవు ఒంటరిగా ఇలా అడలు కొంటూ వచ్చిందెందువల్లా? గోపాలుడేమైనాడా?" అని ఆలోచిస్తూ ఉండే ఆ గోవు కన్నీరు కారుస్తూ మళ్లా వేంకటాచలం ముఖం పట్టినంత, చోళరాజుకేమీ పాలుపోక సపరివారంగా ఆవువెంట తానూ బయలు దేరినవాడై.

సూత్ర: సరాసరి పుట్టదగ్గరకే వచ్చింది కాబోలు గోవు?

కథక: రాజు ఆ పుట్టను అక్కడ మడుగులు కట్టిన రక్తాన్ని చెంతనే పడిఉన్న గొల్లణ్ణిచూచి, ఏమిటీ వింత అని విచారిస్తూ ఉండగా, శ్రీ మన్నారాయణమూర్తి.

తోహరా. చతుర్బాహువుల శంఖచక్రముఖ
సాధనములు ధరియించి
క్షితిపతి ముందట రక్తసిక్తుడయి
కేశవ దేవుడు నిలిచి,
ఏమనుచున్నారు.

(అఠాణా–జంపె)

కేశవ: –

ఔనోయి! చోళనృప! అమితగర్వాటోప!
మౌనులై యిటనున్న మామీదన ప్రతాప?

॥ మౌనోయి ॥

గతిలేక ఒరుల సంగతిలేక ఇటు లేక
గతి పుట్టలోనున్న వెతకి చంపుదువన్న? ॥ ఔనోయి ॥
గోవధము వారింపబోవ నాతలపైన
గావచ్చునోటు? పెనుగండ్ర గొడ్డలి వ్రేటు? ॥ ఔనోయి ॥
నరుడవా నీవు దానవు డవుదువేగాని
తిరుగు మింక పిశాచ దేహమును బూని ॥ ఔనోయి ॥

కథక: ఇట్లు శపించినంతట చోళరాజేమనుచున్నాడు.

చోళరాజు: నిరపరాధిని దేవ! నాయెడ నేరమించుకలేదు. నీ విరవుగా నిటనున్న వైనము లెరుగకీతడు చెల్లరే! పరశువెత్తిన దాని కింతటి పాపకర్మముకూడె, నో హరి! మురారి! కృపాకరా! శరణంటి దాసునిగావవే,

కథక: అనుచు చరణమ్ముల పయింబడి వేడికొను భూపాలుని పయిం జాలిగొని శ్రీహరి ఏ మని పల్కుచున్నారు.

కేశవ: రాజా! వేగిరపడి నిన్ను శపించాను. దిక్కుమాలి యిట నున్న నాకీ పాపకర్మంకూడా చుట్టుకోవలెనా? నాపలుకు తిరుగనేరదు. నే నేమిసేతు? నీవు నిరపరాధి వవుదువు కనుక చిరకాలం ఇట్లు పిశాచరూపంలో ఉండి, నేను ఆకాశరాజు కూతును చెట్టపట్టినప్పుడు నా శిరస్సున మకుటమై నిలువగలవు. ప్రతి శుక్రవారం ఆ కిరీటం అరుగడియలు నేను ధరించి ఆనందబాష్పములు వహింతును. దానిచే నీకు సుఖమగుగాక.

సూత్ర: పరిజనం చేసే పాపంలో యజమానికూడా పాలుపంచుకోవడం యిదే కాబోలు.

కథక: పిమ్మట శ్రీనివాసుండు తలపుండు మానుటకై జిల్లేడు పాలకోసం, పత్తికోసం ఆ కొండపై తిరుగుచుండ ఒక నాడు.

ఆ.వె. వృషభ దానవేంద్రుడు వెన్నంటి యేగిన
భూవరాహపతియు బోరిలోన
వాని నుక్కడంచి, వసుధాసమేతుడై
చేరవచ్చె వృషభ శిఖరి కపుడు

సూత్ర: వృషభాసురుణ్ణి చంపటంవల్ల వారాహగిరికే వృషభాద్రి అనే పేరు వచ్చింది. అంతేగా? ఆ స్వామి తమ నెలవుకే వచ్చారు.

కథక: అంతే! ఇట్లేతెంచి ఎప్పటియట్ల గిరిసాను దేశమ్ముల విహరించుచుండి, అందొకచో హరింగాంచి, ఈత డెవ్వడో క్రొత్త దనుజుం డనియెంచి "ఓరీ! ఎవ్వండవు, నా మెట్టపై కాలుపెట్టితి" వని ఘుర్ఘురింప, హరియు వరాహదేవున కెదుట పడనోడి, ఒక పొదలో దాగి యున్నంత.

సూత్ర: అవునవును, కాని కాలంలో అయినవాళ్ల ఎదుటపడటం కష్టమే.

కథక: భూవరాహపతి మోరఎత్తి మునికోర జీర దరిజేర చేవయుడిగి హరిశిరమువాంచి అటచింత నుండ —పొడగాంచి నిదానించి చూచి, హరిగా నెరింగి నొచ్చుకొనుచు, నెయ్యమ్మున ఏమనుచున్నారు.

భూవరాహ: వికుంఠవాసా! ఈ గూఢవర్తన మేల! ఇంతటి దైన్యమునకు గతంబేమి?

కథక: అని అడిగిన, హరి నిజవృత్తాంతంబెల్ల విన్పించి, ఏమను చున్నారు,

కేశవ:—

(పున్నాగవరాళి—ఖండగతి)

ఇల్లువాకిలి లేక ఇల్లాలికింగాక
అల్లాడుచున్న నన్నాదరింపగదన్న! ॥ ఇల్లు ॥
తలదాచు కొందు, నీ దండనే పడియుందు
నెలవిమ్ము నాకింత, తొలగునా కీ వంత ॥ ఇల్లు ॥

కథక: అంతట భూవరాహస్వామి ఏమనుచున్నారు.

భూవరా:—

(జంఝూటి—ఖండగతి)

సిరిగలాడవు నీవు పరువుగల వాడవో
హరి! నీ పొరుగు పేద కగునుగావా బరువు ॥ సిరిగలా ॥
పరియాచకము గాక విరజయా యీ కొలను
అరుదైన వైకుంఠపురమొ గిరికందరము ॥ సిరిగలా ॥
నెలయిచ్చి కైకొనవె ఇలనీ వలసినంత
వలదయా మొగమోట నిలువదగు నీయంత ॥ సిరిగలా ॥

సూత్ర: గట్టివాడే నయ్యోయి భూవరాహస్వామి! పద్మనాభయ్య పప్పులుడక నిచ్చేట్టు లేదు.

కథక: గొప్పవాళ్ల పొరుగు ముప్పుగాదటండీ! అంతట శ్రీహరి యేమనుచున్నాడు.

కేశవ. చం. వలదు వరాహదేవ! పెరవాడనె నీ కిటులాడ! సర్వముం
గలిగియు లేనివాడ నయిగా నినువేడెద; నీయధీనమీ
యిల సకలమ్ము, నాకు నొక యింతయొసంగకొరంత రాదయా
బలియుడవైన నీ పొరుగు భద్రము నాకని చేయి సాచితిన్.

(సశేషం)

# తిరుమల యాత్రికులకు సదుపాయములు

* * *

* అన్ని వర్గాలవారికి అందుబాటులో ఉండేటట్లు ఉచిత, పరిశుభ్రమైన సత్రాలు, లేదా సరసమైన రేట్లకు కాటేజీలలో ఆవాస సౌకర్యం.
* శ్రీవారిని దర్శించు య[illegible]ల క్యూషెడ్లలో గాలి, వెలుతురుగల విశాలమైన ఏర్పాటులు.
* క్యూ షెడ్లలోనే కాఫీబోర్డువారి అల్పాహార సదుపాయం.
* సరసమైన ధరలకు అన్నపుపొట్లాల అమ్మకం.
* యాత్రికులు వెలుపలకు రానక్కరలేకుండా క్యూలదగ్గరే మరుగుదొడ్డి సౌకర్యం.
* ఆంధ్రప్రదేశ్ పాలసరఫరా సంస్థచే స్వచ్ఛమైన పాలవిక్రయం.
* యాత్రికులు చదువుకునేందుకు దేవస్థానం ముద్రిత గ్రంథాలు. స్వామివారి, అమ్మవారి చిత్రపటాల అమ్మకం.
* క్యూలోని యాత్రికులకు విసుగులేకుండా ఉండేందుకు టెలివిజన్ ప్రదర్శనం, భక్తిసంగీత ప్రసారం.
* క్యూషెడ్లలోను, తిరుమలకుపోవు కాలిబాట 7 వ మైలువద్ద వైద్యసదుపాయం.
* సామానులు, పాదరక్షలు భద్రపరచుకొనేందుకు ప్రత్యేక సౌకర్యం.
* తిరుమలలో సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసునుండి వివిధప్రాంతాలకు ఆటో సౌకర్యం.

## ఉచిత బస్సుసదుపాయం

* దళారీలనుండి వంచకులనుండి తప్పించేందుకు ముఖద్వారంలో పేష్కారుస్థాయి అధికారి సిబ్బంది.
* క్యూషెడ్లలోని యాత్రికుల ఫిర్యాదులు విచారించేందుకు కావలసిన సౌకర్యములకుగాను పేష్కారు స్థాయిలో మరొక అధికారి, సిబ్బంది
* యాత్రికుల సామానులను భద్రంగా తిరుమలకుచేర్చే సౌకర్యం ఏర్పాటైంది. తిరుపతిలో ఏ సత్రములో నైనాగాని, టోల్ గేట్ వద్దగాని తమసామాగ్రి అప్పగించి రసీదుపొంది ఆ రసీదు తిరుమలసెంట్రల్ రిసెప్షన్ ఆఫీస్ దగ్గర కౌంటర్ లో ఇచ్చి సామాగ్రి పొందవచ్చును
* దుండగులనుండి యాత్రికులను కాపాడేందుకు తిరుమలకు వెళ్ళే దోవపొడుగునా రాత్రింబవళ్ళూ పోలీసు గస్తీ ఏర్పాటుచేయబడింది.
* దారిపొడుగునా మంచినీటి సదుపాయం ఉన్నది.
* రాత్రిపూటగాని, తెల్లవారుఝామునగాని కొండకు వెళ్ళదల్చుకొన్నవారికి వీలుగా మంచికాంతి శక్తిగల దీపాలు ఏర్పాటైనవి.
* వివిధప్రాంతాలనుండి వచ్చేయాత్రికులకు బోధపడేందుకుగాను తిరుమల సెంట్రల్ 'రిసెప్షన్ ఆఫీసులో, దేశంలోని ముఖ్యభాషలలో విచారణ కార్యాలయాలు.
* ప్రత్యేక కాటేజీలలోని అదనపు సౌకర్యాలు అంజనాద్రినగర్, శేషాద్రి, గరుడాద్రి, శంకుమిట్ట కాటేజీలలో కూడ ఏర్పాటైనవి.




# [illegible]

**అది విదిశాపట్టణం. అక్కడ ఒక బాలుడు** అకాలమరణం చెందాడు. అంత్యక్రియల కోసం శవాన్ని శ్మశానానికితీసుకుపోయారు. ఇంతలో ఎక్కడినుంచోవచ్చి వాలిందొక గద్ద—

"ఇదేమిటి, ఇక్కడనా ఏడవటం? మీకేమీభయమున్నట్లులేదే? ప్రొద్దుగూకిం దంటే దెయ్యాలూ భూతాలువచ్చి పీక్కు తింటాయి సుమా! చావుపుట్టుకలు సహజం గానీ వింతగాదు గదా! పోయినవాడితో బాటు మీరూపోవాలనుకుంటున్నారా ఏమి? ఇక ఆ పీనుగును వదిలేసి త్వరగా ఇళ్ళకు వెళ్ళండి."

అంటూ పెద్దమనిషిలా సలహాయిచ్చిందా గద్ద—

ఆ మాటలు వినగానే అక్కడివాళ్ళంతా మరొకసారి గొల్లునఏడ్చారు. గద్ద మళ్ళీ అందుకొంది.

"వెఱ్ఱి నాయనలారా! ఏడిస్తే చచ్చిన వాళ్ళు బ్రతికివస్తారా! ఊరుకోండూరు కోండి! అయినా నాకెందుకు లెద్దూ! ఇలాగే ఏడుస్తూ వుండండి! కాసేపటికి మీక్కూడా చావు మూడుతుంది".

ఆ మాటలతో భీతావహులైయ్యారు శవం చుట్టూ వున్నవాళ్ళు. శవాన్ని విడిచిపెట్టి వెళ్ళేందుకు తయారయ్యారు.

ఇంతలో ఒక నక్కవచ్చి వారిదారికి అడ్డుపడింది.

"ఆ గద్దమాటలువిని భయపడ్డట్లున్నారే! అయ్యో! ముద్దులు మూటగట్టే ఈ పిల్ల వాణ్ణి ఇలా పారేసిపోవటానికి మీ కెలా కాళ్ళాడుతున్నాయి? మీ దుఃఖభారమంతా తీరిపోయేలా కాసేపు ఏడ్చి వెళ్ళండి. ఎవరు హుశారు? ఆ దేవుడు కనికరిస్తే పిల్లవాడు బ్రతికవచ్చునేమో? ఇంకా ప్రొద్దుగుంకలేదు చీకటిభయంలేదు" అంటూ అభయం ఇచ్చిం దానక్క.

ఆ మాటలతో ఆశపుట్టి మళ్ళీ శవంచుట్టూ మూగారు బంధుజనాలు, అదిచూసి గద్దకు కోపం వచ్చింది.

"ఈ మందబుద్ధి మాటలు మీరు విన వచ్చా? శవం ఆకృతికూడా వికృతమై పోయిందే! ఇక ప్రాణం ఎలావస్తుంది? మృత్యువుకు దయాదాక్షిణ్యాలు లేవు. నిలు వునా ప్రాణాల్ని హరిస్తుంది. దురాశకు పోకుండా ఇంటికివెళ్ళి అపరక్రియల్ని చేసి ఆత్మాయికి సద్గతి కలిగించండి".

ఇలా అంటుండగా గద్దమాటలకు నక్క అడ్డుపడింది. ఆ గద్ద ఉత్తకసాయిది, దానికేం? ఏమైనా అంటుంది. చూస్తూ చూస్తూ పిల్లవాణ్ణివదలి పోవడం కన్నవారి తరమౌతుందా? ఏమీకాని నాకే కన్నీళ్ళు నిలవడంలేదే? అయినా అంత దయమాలి వెళ్ళాల్సిన అవసరమేమొచ్చె? మన ప్రయత్నం మనం చెయ్యాలిగా! ఆపైన దైవబలం ఉంటే కానిదేముంది? అంతగా చేతకాకపోతే అప్పుడు వెళ్ళిపోవచ్చునుగా?"

అని నక్క ఎక్కడలేని ప్రేమ ఒలక బోసింది—దాంతో మళ్ళీ ఏడవసాగేరు బంధు వులు. గద్దకు చిర్రెత్తుకవచ్చింది.



"నేను పుట్టి ఒకటి రెండూకాదు వెయ్యికి మించి రెండు మూడు వందల సంవత్సరాలుదాటి పోయాయి. బాలుడు కనిపిస్తుంది. యువకుడు కనిపిస్తుంది, నడివయసువాడైనా సరే ముసలివాడు అయినాసరే-ఒక్కసారి చచ్చిపోయాక మళ్ళీ బ్రతకడం చూళ్ళేదు. అయితే పునర్జన్మమాత్రం ఉండంటాడు- పీనుగు బ్రతుకుతుందని చెపుతుందేమిటి ఈ తెలివి తక్కువ నక్క? ఇదేం నష్టాలావా?"

ఈ మాటలతో వాస్తవంలోకివచ్చి గుండె రాయిచేసుకొన్నారు అక్కడివాళ్ళు. శవాన్ని వదిలివేసి నడవసాగేరు. పరుగెత్తుకొంటూవచ్చి మళ్ళీ అడ్డుపడింది జంబుకం-

"ఇదేమిటి? నామాటలపైన నమ్మకం లేదా? అయితే వినండి. పూర్వం ఆ శ్రీరామచంద్రుడు బ్రాహ్మణ బాలకుణ్ణి బ్రతికించలేదా? సృంజయుడి కొడుకు చనిపోతే నారదమహర్షి తన ప్రభావంతో బ్రతికించలేదా? అలాగే ఏ సిద్ధుడో, ఏ దేవతో మీ రోదనవిని దయతలిచి బాలుడికి ప్రాణదానం చెయ్యకపోతారా? పిల్లవాడు బ్రతకడం మీకు ఇష్టంలేదా? ఎందుకలా పారిపోతున్నారు? ఇలా నక్క నిష్ఠూరమాడేసరికి చెప్పలసంవేసి వెళ్ళిపోతున్నవాళ్ళంతా మళ్ళీ శవం దగ్గరమూగి గుండెలు బాదుకుంటూ ఏడవసాగేరు.

ఇంతలో ప్రొద్దుకుంకనే కుంకింది-గద్దగానీ నక్కగానీ మాట్లాడటం మానేశాయి. ఇంతసేపూ ఆ శవంమీది ప్రేమతోకాదు ఆ రెండూ వాదించుకొన్నది-ఆకలితో నకనకలాడిపోతున్న ఆ రెండు జంతువులూ ఆ శవాన్ని తమ పొట్టన పెట్టుకోడానికే పోటీ పడ్డాయి.

ప్రొద్దుపోతే చూపానదు గనుక ప్రొద్దుండగనే బంధువుల్ని సాగనంపడానికి అంత సేపు వాగింది గద్ద-

ప్రొద్దుపోతే గద్ద వెళ్ళిపోతుందనీ ఆ పీనుగును తానే స్వంతం చేసుకోవచ్చుని ఆ మనుషుల్ని నిలిపేసివుంచింది నక్క. తానొకటితలిస్తే దైవమొకటి తలుస్తుందన్నట్లుగా, బంధువుల రోదనవిని ఆ మరుభూమిలో శంకరుడు ప్రత్యక్షమైనాడు.

ఏంకావాలో కోరుకొమ్మని ఆభక్తవశంకరుడు అడిగిందేతడవుగా పుత్రభిక్ష పెట్టమని ప్రార్థించాడా బాలుడి తండ్రి.

వెంటనే పరమశివుడు బాలుణ్ణి బ్రతికించి నూరేళ్ళు బ్రతుకమని ఆశీర్వదించాడు.

కడుపుకూటికోసం కక్కుర్తిపడిన గద్దకు నక్కకు ఆకలన్నదే లేకుండా వరమిచ్చి అదృశ్యమైనాడు.

తమపనులు చక్కబెట్టుకొనేందుకు ఈ కథలోని గద్ద నక్కల మాదిరిగా కొందరు కపటబుద్ధులు సుద్దులుచెపుతూ వుంటారు. అలాంటివారి మాటల గారడీలో పడకూడదు మనం.

అంటూ భీష్మాచార్యులు ధర్మరాజుకు (మహాభారతం శాంతి పర్వంలో) నీతి నేర్పాడు.

— జితేంద్ర

---

# దానఫలం

— ఎం. వెంకటరావు

ఒక బిచ్చగాడు ఇంటింటికీ వెళ్ళి సాయంత్రందాకా బిచ్చమెత్తాడు. ప్రొద్దు వాలే వేళ అయింది. త్వరగా తన కొంపకి చేరుకోవాలని బాటనపడి జోరుగా నడుస్తున్నాడు. బాటంతా సందడిగా ఉంది. జనం బాటకు ఇరుప్రక్కల బారులుతీర్చి నిలుచొని ఉన్నారు. "ఎవరు వస్తున్నారు"- అని బిచ్చగాడు జనంలోని ఒక మనిషిని ప్రశ్నించాడు. "రాజాధిరాజు" వేంచేస్తున్నారు" అని బదులు చెప్పాడు గుంపులోని ఒక మనిషి.

ఇంతలో బంగారు రథం రానేవచ్చింది. సాయంకాలపు నీరెండలో రథం ధగధగా మెరిసిపోతూవుంది. బిచ్చగాని ఆశరెక్క విప్పింది! "ఈ నాటితో నా దరిద్రం తీరిపోతుంది. ముష్టిబ్రతుకు ముగిసిపోతుంది." అని సంబరపడ్డాడు.

తిన్నగా రథం వచ్చి అతని ముందే ఆగింది. ఏమి అదృష్టం! ఆణుకువతో తన జోలెను 'ప్రభువు' ముందుకు చాచిపట్టుకొన్నాడు. ప్రభువు బిచ్చగాని ముందుకు వచ్చి కుడిచెయ్యి చాచాడు. బిచ్చగాని గుండె గుభేలుమంది! ఏమిటీ విపరీతం! రాజాధిరాజు తన ముందు చెయ్యిచాచాడు. బిచ్చగాని మతిచలించింది. ఏమి చెయ్యడానికి అతనికి పాలుపోలేదు. తన ఆశలన్నీ కుప్పకూలిపోయాయి! అతడు తటపటాయించి తన జోలెలోని ఒక బియ్యపు గింజ తీసి ప్రభువు చేతిలో ఉంచాడు. ప్రభువు చిరునవ్వునవ్వుతూ రథం ఎక్కాడు. రథం ముందుకు సాగిపోయింది.

బిచ్చగాడు ఉసురోమంటూ తన గుడిసెకు చేరుకున్నాడు. రాత్రి వంటకని బియ్యం చేటలో పోశాడు. అతని కళ్ళు మిరుమిట్లుగొల్పాయి. చేటలోని బియ్యంలో ఒక బంగారు గింజ మెరిసిపోతూ ఉంది!

బిచ్చగాడు తలబాదుకుంటూ ఏడవసాగాడు. "అయ్యో! నేనెంత వెఱ్ఱిబాగులవాణ్ణి! రాజాధిరాజు నాముందు చెయ్యి చాచి అడిగినప్పుడు నా సర్వస్వం ధారపోయాలనే బుద్ధిలేని అధముణ్ణి! నా లోభత్వమే నా దారిద్ర్యానికి కారణమైంది." అని తన్నుతాను తిట్టుకోసాగాడు.

*

## శ్రీమద్రామాయణ కావ్యవైభవము

రచయిత: శ్రీ మాధవపెద్ది నాగేశ్వరరావు. ప్రకాశకులు శ్రీ సీతారామనామ సంకీర్తన సంఘము, శ్రీరామనామ క్షేత్రము—గుంటూరు—4 వెల: 4 రూపాయలు.

భారతీయ సంస్కృతికి దర్పణమువంటి రామకథను మహనీయులెందరో రచించారు. పురుషోత్తముడై శ్రీ రామచంద్రుని దివ్యగుణములను వర్ణించు శ్రీమద్రామాయణము ప్రపంచమందలి పలుభాషలలో, పలు రూపములలో సాక్షాత్కరించి పాఠకులను అలరిస్తున్నది.

శ్రీరామచంద్రుని వాగ్వైభవము, సత్యధర్మనిరతి, ప్రియదర్శనత్వము, కౌసల్యాది రాణుల శీలము, సీతామహాసాధ్వి సౌశీల్య వైభవము, సీతారాముల దాంపత్యశోభ, లక్ష్మణ, భరతశత్రుఘ్నుల భ్రాతృభక్తి, సేవానిరతి, శబరి వృత్తాంతము, ఆంజనేయుని భక్త్యావేశము, విభీషణుని భక్తి ప్రపత్తులు, వసిష్ఠ విశ్వామిత్ర అత్రి, అగస్త్య మహర్షుల దివ్యజీవనము, రామరాజ్య ప్రాశస్త్యము, శ్రీరామ మంత్రమాహాత్మ్యము మున్నగు శీర్షికలలో శ్రీ మద్రామాయణ సారవ్వరూప మీకృతిలో చక్కగా చిత్రింపబడినది.

కృతికర్త శ్రీ మాధవపెద్ది నాగేశ్వరరావు గారు విద్యాధికులు. విద్యాశాఖలో వున్నతోద్యోగములను నిష్కళంకముగ నిర్వహించి మన్ననలందుకొన్నవారు. వారి కత్యంత ప్రీతిపాత్రమగు రామాయణ పాత్రల వైశిష్ట్యమును తెలుపుటకు వాల్మీకిమహర్షి రచితమగు శ్లోకములను, కంకంటి పాపరాజకవి ప్రణీతమగు ఉత్తర రామాయణములోని పద్యములను సందర్భోచితముగా వుదహరించుచూ వాటి భావమును సరళసుందరముగ వివరించినారు.

శ్రీరాముడు ప్రియభాషి, మధురభాషి, సత్యభాషి. మహర్షులపట్ల శ్రీరామచంద్రుని వినయవర్తనమును కంకంటి పాపరాజు చిత్రించిన తీరు యిట్లున్నది.

కుశలంబే మునులార! శిష్యులకు, మీకున్?
శిష్యసంఘం బిహ
ర్నిశమున్ సేవలు సేయునే? తపములున్
నిర్విఘ్నతన్ సాగునే?
కుశపర్ణాంబుఫలాదులబ్బునె వనక్షోణిన్,
మిమ్ముంజేరిదు
ర్దశలెవ్వారునుజేయకుందురు గదా తథ్యంబుగా
చెప్పరే.

వాల్మీకి మహర్షి శ్రీరామచంద్రుని సత్యధర్మ నిరతిని శ్లాఘిస్తూ

"భవాన్ క్రియాపరో లోకే భవాన్ దేవ పరాయణః
ఆస్తికో ధర్మశీలశ్చ వ్యవసాయీచ రాఘవః"

అంటాడు.

శ్రీరామచంద్రుడు, లక్ష్మణస్వామిని తన బహిఃప్రాణమని పేర్కొంటూ,

'రామస్యదక్షిణో బాహుః నిత్యం ప్రాణో బహిశ్చరః'

అంటాడు.

## గ్రంథసమీక్ష

మిథిలాధినాథుడగు జనకమహారాజు సీతాదేవిని శ్రీరామచంద్రునికిచ్చి కన్యాదానము చేయుచూ:

'ఇయం సీతామమసుతా సహధర్మచరీతవ
ప్రతీచ్ఛ చైనాం భద్రంతే పాణిం గృహ్ణీష్వ
పాణినా'

అన్నాడు. 'సీతాదేవి పతివ్రతా మహాభాగా' అని వర్ణింపబడినది.

హనుమంతుని దివ్యచారిత్ర్యము-వాక్యజ్ఞత, బుద్ధి వైభవము, జితేంద్రియత్వము, భక్త్యావేశము మనోజ్ఞముగ వర్ణింపబడినవి.

ధర్మశీలుడైన విభీషణుని భక్తిప్రపత్తులు ఆదర్శ పూర్ణములైనవి.

జనకుడు రాజర్షి. దశరథుడు వాగ్విదులలో శ్రేష్ఠుడు.

విభిన్న భ్రాతృత్వము, అనే అధ్యాయములో వాలిసుగ్రీవుల, రావణ కుంభకర్ణుల, సంపాతి జటాయువుల మనస్తత్వములు చిత్రింపబడినవి.

దండకారణ్య మందలి ఋష్యాశ్రమములను ఆదికవి వర్ణించిన తీరు చూడుడు:

కుశచీర పరిక్షిప్తం
బ్రాహ్మ్యలక్ష్మ్యా సమావృతమ్
యథాప్రదీప్తం దుర్దర్శం,
గగనే సూర్యమండలమ్

అన్నాడు.

చివర శ్రీరామ మంత్రి మాహాత్మ్యమును పార్వతీ పరమేశ్వరుల సంవాద రూపమున వివరించినారు.

శ్రీమద్రామాయణ సారస్వరూపమును సుబోధకముగా రచించిన శ్రీమాధవపెద్ది వారు, ప్రచురించిన శ్రీసీతారామనామ సంకీర్తనం సంఘమువారు అభినందనీయులు రామకథామృతము గ్రోల దలచిన వారందరూ తప్పక చదువదగిన గ్రంథమిది.

— శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

## హైందవవేయము

(రచయిత: శ్రీ ముడుంబై రంగ కృష్ణమాచార్యులు స్వచ్ఛంద వ్యవస్థాపకులు, టి.టి.డి. హిందూ ధర్మ రక్షణశాఖ, మెదకు జిల్లా. ప్రథమముద్రణ—దుందుభి యుగాది. ⅛ క్రౌన్ సైజు, 72 పుటలు – వెల, రెండు రూపాయలు.]

భారతీయ వైశిష్ట్యాన్ని విశదీకరించే గ్రంథాలు ఆయా భాషల్లో ఎన్నో వెలువడ్డాయి. నేటికీ వెలువడుతున్నాయి. అలాంటి వాటిలో "హైందవీయం" అనే ఈ పుస్తకం ఒకటి. ఇది పరిమితిలో చిన్నదైనా, విషయ సమన్వయంలోను, వివేచనా సౌలభ్యంలోను ప్రకృష్టమైనదని చెప్పవచ్చు. హిందువులకు సంబంధించిన విషయాలతో ఇది నిండివుంది కాబట్టి హైందవీయమనే పేరు దీనికి సార్ధకమయిందనడంలో సందేహం లేదు. ఇందులో మనం, మనదేశం, మనమతం, మనకులం, మన దైవం, మన దైవనివాసం, మన దైవనామం, మన విగ్రహం, మన పవిత్రాతి పవిత్ర గ్రంథం, సప్తగిరీశుని పవ్త

సూత్రాలు అనే పది విషయాలు వివరంగా వింగడింపబడ్డాయి. తిరుమల తిరుపతి వేంకటేశ్వరస్వామి ఈ రచయితకు కలలో కన్పడి హిందూ మత ప్రాశస్త్యాన్ని వివరించమని ఆదేశించారట. దైవప్రేరణతో వెలువడిన ఈ పుస్తకం ప్రకృష్టమైనదన డంలో అనుమానం లేదు. రచయిత భక్తి ప్రపత్తులకిది నిదర్శనం.

అన్యమతదూషణం లేకుండా, అవసర మైన అంశాల్ని మాత్రమే పుటికి పుచ్చు కొంటూ, సరళగ్రాంథికంలో సాగిన ఈ గ్రంథరచనాధోరణి మెచ్చుకొనతగింది. ఎడ నెడ ఉదహరింపబడిన శ్లోకాలూ, పద్యాలూ ఇందలి విషయప్రామాణికతను ప్రసాదిస్తు న్నాయి. ఇందలి ప్రతి ప్రకరణం ఎంతో బాగున్నా 5, 9 ప్రకరణాలు మరీబాగు న్నాయి.

ఈ గ్రంథంలోని అభిప్రాయాలు కొన్ని పరిశీలనార్హములు. అవి 1. 'ఇందువు'- అనే మాటనుండి 'హిందువు' ఏర్పడినది. (13 వ పుట.) 2. 'సింధుపురము' (హస్తినా పురము) రాజధానిగా కలది సింధూదేశము (14 వ పుట). 3. జుట్టుకుట్టు, కట్టు, బొట్టు- అనే మాటల్లోని 'కట్టు' కు మొలత్రాడు అని అర్థం (58 వ పుట). హేతువాదులైన చలం, త్రిపురనేని రామస్వామిచౌదరి మొదలైన వారు చివరకు పరమ ఆస్తికులయ్యారు (27 వ పుట). వీటిల్లోని 1, 2 అభిప్రాయా లతో ఏకీభవించడం సాధ్యంకాదు. 3 వది 'కట్టు' అనేదానికి 'వస్త్రధారణ' అని రూఢ్యర్థం. 4 వ దాన్లో చలం రమణా శ్రమం చేరడానికి కారణం వివరించివుంటే బాగుండేది. పోతే త్రిపురనేని మొదటి నుండి కూడ ఆస్తికుడేగాని నాస్తికుడు కాదు. హేతువాదుల్లో భావహేతువాదులు, భౌతికహేతువాదులు అని రెండు రకాలు. భావహేతువాదులు దేవుణ్ణి నమ్ముతారు. కాని దేవుని పేరుతో జరిగే దోపిడీని విమ ర్శిస్తారు. త్రిపురనేని భావహేతువాది అని ఆయన గ్రంథాల్ని పరిశీలిస్తే తెలుస్తుంది.

ఇక ఇందులో ఉటంకింపబడిన శ్లోకాలూ, పద్యాలూ వున్నగువాటికి ఆకరాలు ఇచ్చి వుంటే బాగుండేది. బ్రాహ్మీముహూర్తము ('మనవి' లో మొదటిపంక్తి) (బ్రాహ్మ ముహూర్తము అనివుండాలి). 'సింహ వాహిని' (43 వ పుట). (సింహవాహన- అని వుండాలి). ఇత్యాది అచ్చుతప్పులు దొర్లకుండా చూచుకోవడం అవసరం.

శ్రీ వేంకటేశ్వరుడు కారయితగా, ప్రేర కుడుగా తిరుమల తిరుపతి యాజమాన్యము వారు ఆర్థిక సాహాయ్య - అనుమోదకులుగా విలసిల్లిన పుస్తకంలో ఆస్వామివారి చిత్రం చేర్చివుంటే సమంజసంగా వుండేది.

మొత్తంమీద ప్రతి హిందువూ చదివి ఆచరించదగ్గ విషయాలెన్నో ఇందులో వున్నాయి. ఇలాంటి ధార్మిక గ్రంథాల ముద్రణకు ఆర్థికసాయం చేసిన, చేస్తూ వున్న టి. టి. డి. యాజమాన్యం ప్రస్తుతికి పాత్రం.

— డి. నాగసిద్ధారెడ్డి

## సప్తతి రత్నమాలికా

(శ్రీవంగీపురం రంగస్వామి అయ్యంగారు, సన్నిధి వీథి, తిరుచానూరు. వెల: రు. 1–50.)

విశిష్టాద్వైత మతాచార్యులలో మహా ప్రసిద్ధులైన శ్రీ వేదాంతదేశికులవారి గుణా తిశయాన్ని వర్ణిస్తూ శ్రీ ప్రతివాదిభయం కరం అణ్ణన్ స్వామిగారు రచించిన డెబ్భై శ్లోకాలుగల స్తోత్రరూపమైన కావ్యం ఈ సప్తతి రత్నమాలిక. విశిష్టాద్వైత మతాను యాయులైన వడహలి, తెంగలి యిరు తెగలవారూ వేదాంతదేశికులను సమానం గానే గౌరవిస్తారు. దానికీగ్రంథమే తార్కాణం. ఇది వ్రాసిన అణ్ణన్‌స్వామి ప్రతిపక్షపరం పరకు చెందినవారయికూడా, దేశికులవారి ఉదాత్త గుణశీలాలన్నిటినీ వర్ణిస్తూ, వారి పట్ల మాత్సర్యాకుల హృదయులైన వారిని యీసడించారుకూడ.

ఆళ్వారులతోపాటుగా, ఆచార్యపురుష లతోపాటుగా, శ్రీ వేదాంతదేశికులవారికి కూడ విగ్రహాలువెలసి, గుళ్లు నిర్మింపబడి, నిత్యారాధనలు జరుగుతున్నాయి. అది వారి గుణోన్నతిని, మహనీయతను వెల్లడిం చడమేకాదు. శ్రీవైష్ణవులకు వారియందు గల శ్రద్ధాభక్తులకు కూడా సాక్షీభూతంగా ఉంది.

వేదాంతదేశికులు 'నిగమాంత మహాదేశి కులు' శతాధికగ్రంథకర్త. విశిష్టాద్వైతాని కెంతో, సంస్కృతసాహిత్యానికీ అంతగానే వీరి సేవాభాగ్యం లభించింది. వీరు తిరు మల శ్రీనివాసుని ఘంటాంశాన జన్మించే రని ప్రతీతి. అదే విశ్వాసంతో నేటికీ తిరు మల గర్భాలయంలో గంట ఉంచరు. దేశి కుల వారి అసలు పేరు వేంకటనాథుడు. 'వేదాంతదేశికు' లనేది బిరుదనామం. ఇది గాక వీరికి 'కవితార్కికకేసరి,' 'సర్వతంత్ర స్వతంత్ర' వంటి బిరుదులు కూడ శ్రీరంగే శుని దయచేతను, శ్రీరంగనాయకి కృప చేతను లభించాయి.

రాజసన్మాన ధనవైభవాదులన్నిటినీ తిరస్కరించి, ఉంఛవృత్తితో నూరేళ్లు జీవితం గడిపిన యీ మహాదేశికులు సంస్కృత, ప్రాకృత, ద్రావిడ భాషలలో శతాధికంగా గ్రంథాలు రచించిన మనీషి. పాదుకాసహస్రం, దయాశతకం, రహస్య త్రయ సారం, వైరాగ్యపంచకం, తత్త్వ ముక్తాకలాపం, సంకల్ప సూర్యోదయం, శతదూషణి వంటి వీరి కృతులెన్నో పండిత లోకంలో ప్రసిద్ధాలు.

ఈ మహనీయుని గురించి స్తోత్ర రూపంలో వర్ణిస్తూ చెప్పిన యీ 'సప్తతి రత్నమాలిక' కు తెలుగు తాత్పర్య వివర ణలు వ్రాసి, మూలంతోపాటుగా తెలుగు లిపిలో ప్రచురించి శ్రీ వంగీపురం రంగ స్వామి అయ్యంగారు శ్రీవైష్ణవాభిమానుల అభిమానానికీ, కృతజ్ఞతకు పాత్రు లయ్యారు. గ్రంథాదిలో దేశికులవారిని, గ్రంథకర్తని పరిచయం చేశారు. వివరణ లింకా విపులంగా వ్రాసి, అచ్చుతప్పులు సరి దిద్ది కొద్దిలోనే మరింత చక్కని మార్పుతో మలిముద్రణవేసి అందించగలరని ఆశి స్తాను. ఈ గ్రంథం వైష్ణవాభిమానులందరూ సంగ్రహించదగినది.

— ముట్నూరి సంగమేశం

 

# ధర్మరక్షణ కార్యక్రమాలు



## అన్నమాచార్య సంకీర్తనామృతం గ్రంథావిష్కరణ

శ్రీ సముద్రాల లక్ష్మణయ్య రచించిన 'అన్నమాచార్య సంకీర్తనామృతం, గ్రంథావిష్కరణ సభ ఫిబ్రవరి 25 సాయంత్రం 6 గం॥లకు స్థానిక అన్నమాచార్య కళా మందిరంలో జరిగింది,

సభకు తిరుమల తిరుపతి దేవస్థానముల పౌరసంబంధశాఖాధికారి శ్రీ రావులసూర్య నారాయణమూర్తి అధ్యక్షత వహించారు. వారు గ్రంథప్రాశస్త్యాన్ని వివరించి తి. తి. దేవస్థాన ప్రచురణలు, రచయితలకు ఆర్థిక సహాయం పథకం తదితర అంశాల్ని గురించి వివరించి భవిష్యత్కార్య క్రమాలను విపులీకరించారు.

శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ గ్రంథాన్ని ఆవిష్కరించారు. అన్నమాచార్యుల సంకీర్తనలకు వ్యాఖ్యానం అవసరాన్ని గురించి వివరిస్తూ కొన్ని సంకీర్తనలను ఉదహరించారు.

డా॥ పి. రాధాకృష్ణశర్మ, మాట్లాడుతూ వేదార్థం నిగూఢంగావున్న అన్నమయ్య సంకీర్తనలను శ్రీ లక్ష్మణయ్య సోదాహరణంగా వ్యాఖ్యానించారని అన్నారు.

గ్రంథరచయిత సముద్రాల లక్ష్మణయ్య కృతజ్ఞతలు తెలియజేస్తూ 'అన్నమయ్య మాటలు, అనంతార్థాలమూటలు 'అనీ గ్రంథ రచనకు ప్రోత్సహించినందుకు ప్రచురణకు ఆర్థిక సహాయం అందజేసినందుకు తి.తి. దే అధికారులకు ఋణపడివున్నామనిఅన్నారు.

ప్రారంభంలో శ్రీ ముదివర్తి కొండమాచార్యులు స్వాగతంచెప్పగా, సభాంతంలో సి. సుందరరావు వందన సమర్పణ చేశారు.

## గుంటూరు లక్ష్మీనారాయణస్వామి కల్యాణమహోత్సవం

గుంటూరు శ్రీ లక్ష్మీనారాయణస్వామి కల్యాణమహోత్సవ కార్యక్రమాలు మార్చి నెల 24 నుంచి 28 తేదివరకూ జరుగుతాయని ఆ దేవస్థాన అభివృద్ధి సంఘంవారు తెలియ జేస్తున్నారు. ప్రముఖ విద్వాంసుల హరి కథా కాలక్షేపాలు ఇతర కార్యక్రమాలుకూడా వుంటవి.

## కుంభాభిషేకం

నగిరితాలూకా మునగమాకుల కొత్తూరు గ్రామంలో శ్రీ కోదండరామస్వామి దేవాలయ ప్రారంభోత్సవం సందర్భంగా మార్చి 23వ తేదినుండి 25 తేదివరకు కుంభాభిషేకం జరుగుతుందని ఆ గ్రామస్తులు తెలియ జేస్తున్నారు. ఆ గ్రామంలోని భజన సంఘం ఆధ్వర్యంలో రు. 75 వేలవ్యయంతో శ్రీ కోదండరామస్వామి ఆలయ నిర్మాణం జరిగిందని గ్రామస్తులందరూ చందాలు వేసుకొని ఈ కార్యం నెరవేర్చారని భజన సంఘం ప్రతినిధి వ్రాస్తున్నారు.

## రెడ్డిపాలెంలో ధార్మిక కార్యక్రమాలు

తిరుమల తిరుపతి దేవస్థానముల హిందూధర్మ రక్షణసంస్థ నెల్లూరుశాఖ ఆధ్వర్యాన మహాశివరాత్రి మహోత్సవం సందర్భంగా రెడ్డిపాలెం గ్రామంలో 11-2-83 నుండి 13వ తేదివరకూ ధార్మిక కార్యక్రమాలు జరిగాయి. ఈ కార్యక్రమాల్లో సర్వశ్రీ జి. రామయ్య, పి. బాలయ్యదాసు, జి. రామరాజు, శ్రీమతి ఎన్. వసంతకుమారి పాల్గొన్నారు.

## శ్రీ వేంకటేశ్వర భక్తసంఘ ద్వితీయ వార్షికోత్సవం

పాలకొండ శ్రీ వేంకటేశ్వర భక్తసంఘ ద్వితీయ వార్షికోత్సవం స్థానిక సీతారామ స్వామి ఆలయంలో ఇటీవల జరిగింది. శ్రీ వై. వి. నరసింహమూర్తి కార్యక్రమానికి అధ్యక్షత వహించారు. శ్రీ టి. పురుషోత్తం ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. శ్రీ టి. ఆనందరావు, శ్రీ ముట్నూరు సూర్య నారాయణ, సభలో ఉపన్యసించారు. శ్రీ కె. రామాచార్యులు రచించిన శ్రీ పద్మావతీ శ్రీనివాస కల్యాణం యక్షగానాన్ని బాలికలు అభినయించారు.

## కరీంనగర్‌లో మహాశివరాత్రి

తిరుమల తిరుపతి దేవస్థానముల హిందూ ధర్మరక్షణ సంస్థ ఆధ్వర్యంలో మహాశివరాత్రి పూజాకార్యక్రమాలు జరిగాయి. స్థానిక వేంకటేశ్వర భక్తసంఘాలు ఈ కార్యక్రమాలలో పాల్గొన్నాయి. శ్రీ ప్రొద్దుటూరి నీలకంఠం, శ్రీ బొమ్మా వేంకటేశ్వర్ తదితరులు ఈ కార్యక్రమాల్లో పాల్గొన్నారు.

## సంగారెడ్డిలో

స్థానిక హిందూధర్మ రక్షణసంస్థ ఆధ్వర్యంలో కార్యక్రమాలు జరిగాయి. స్థానిక వేంకటేశ్వర భక్తసంఘాలు ఈ కార్యక్రమాలలో పాల్గొన్నాయి.

## మచిలీపట్టణములో

తి. తి. దే. హిందూధర్మ రక్షణసంస్థ మచిలీపట్నం బాలాజీశాఖ ఆధ్వర్యంలో శ్రీమద్భగవద్గీతోపన్యాసాలు మార్చి 13వ తేదినుంచి 29వ తేదివరకూ జరుగుతాయని సంస్థ నిర్వాహకులు తెలియజేస్తున్నారు.

## తిరుపతిలో

స్థానిక అన్నమాచార్య కళామందిరంలో తిరుపతి హిందూధర్మ రక్షణసంస్థ ఆధ్వర్యంలో మార్చి 5 నుంచి 27 వతేది వరకూ హరికథ, సంగీతం, భజన, కార్యక్రమాలు జరుగుతాయి. ఇవేకాక 17వ తేది నారాయణ వనంలోనూ, 18వ తేది నాగలాపురంలోనూ, హరికథా కార్యక్రమం, 4, 11, 18, 25 తేదులలో తిరుచానూరులో సంగీత కార్యక్రమాలు జరుగుతాయి.

# వార్తాలహరి

### వేదశాస్త్ర విద్వత్సదస్సు

శ్రీ వేంకటేశ్వర వేదశాస్త్రాగమ విద్వత్ సదస్సు 1983 ఏప్రిల్ 7వ తేదీ నుంచి 11వ తేదీ వరకు శ్రీనివాసమంగాపురంలో జరుగనున్నది. ఏప్రిల్ 12వ తేదీన సదస్సు ఉపసంహారోత్సవం వుంటుంది. ఈ సదస్సులో వేదశాస్త్ర ప్రవేశపరీక్ష, ఋగ్వేదం, కృష్ణయజుర్వేదం, (తైత్తిరీయశాఖ) శుక్లయజుర్వేదం (కణ్వశాఖ) సామవేదం, అథర్వణవేదం, దివ్యప్రబంధం, న్యాయ, వ్యాకరణ, మీమాంసా, జ్యోతిషశాస్త్రాలు, ద్వైత, అద్వైత. విశిష్టాద్వైత వేదాంతశాస్త్రాలు తదితర అంశాలపై పరీక్షలు నిర్వహించి ఉత్తీర్ణులైనవారికి సంభావనలు ఇస్తారు. ఈ సదస్సు నిర్వహణకుగాను తిరుమల తిరుపతి దేవస్థానం ఈ ఏడాది రు. 1 లక్షా 25 వేలను మంజూరు చేసింది.

### టి. టి. డి. నిధులు

రాష్ట్రప్రభుత్వ అభ్యర్థన మేరకు కొన్ని షరతులకు లోబడి టి. టి. డి. నిధులను రాష్ట్ర ప్రభుత్వ ఖజానాకు తరలించడానికి టి.టి.డి. బోర్డు ఫిబ్రవరి 28న తిరుమలలో టి. టి. డి. ఛైర్మన్ బి. నాగిరెడ్డిగారి అధ్యక్షతన జరిగిన సమావేశంలో నిర్ణయం తీసుకుంది.

టి. టి. డి. నిధులకు వాణిజ్య బ్యాంకులిస్తున్న వడ్డీరేటు చెల్లించాలనీ, టి. టి. డి. ఏ సమయంలో ఎంతకావాలంటే అంత చెల్లించాలనీ, నిధుల రక్షణకు రాష్ట్రప్రభుత్వం పూర్తి బాధ్యత వహించాలనీ, టి.టి.డి. నిధులను నిర్ణీత గడువుకు ముందుగా బ్యాంకులనుండి ఉపసంహరించడంవల్ల కలిగే నష్టాన్ని ప్రభుత్వం భరించాలనేవి బోర్డు విధించిన షరతులు, రాష్ట్రప్రభుత్వం ఈ షరతులకు అంగీకరించినమీదట బోర్డు ఈ నిర్ణయం తీసుకొంది.

### బైపాస్ రోడ్లు

తిరుపతిలోని బైపాస్ రోడ్లను త్వరితంగా పూర్తి చేసేందుకు తిరుమల తిరుపతి దేవస్థానం తక్షణ చర్యలు తీసుకొంటున్నది. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారక రామారావు సూచనలమేరకు టి. టి. డి. బోర్డు అధ్యక్షులు శ్రీ బి. నాగిరెడ్డి, ఆంధ్రప్రదేశ్ మునిసిపల్ పరిపాలశాఖ కార్యదర్శి శ్రీ ఎస్. ఎన్. ఆచంట, టి. టి. డి. కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి ఇటీవల బైపాస్‌రోడ్‌ల విషయమై చర్చలు జరిపారు. ఫలితంగా వీటి నిర్మాణానికయ్యే 80 లక్షల రూపాయల వ్యయాన్ని టి. టి. డి. పూర్తిగా భరించడానికి అంగీకరించింది.

తిరుపతి రైల్వే వోవర్‌బ్రిడ్జినుంచి కపిలతీర్థంవరకూ 3.9 కి. మీ.పొడవు బైపాస్‌రోడ్ పని దాదాపుగా పూర్తియిపోయింది. రెండవ బైపాస్‌రోడ్ అలిపిరినుంచి ప్రారంభమై గెజిటెడ్ ఆఫీసర్లకాలనీ మీదుగా చిత్తూరు రోడ్‌తో కలుస్తుంది. 6 కిలోమీటర్ల పొడవు ఉండే ఈ బైపాస్‌రోడ్‌ను తిరుపతి పట్టణాభివృద్ధి సంస్థ తన మాస్టర్ ప్రణాళికలో ప్రతిపాదించింది. దీనిపని ప్రారంభదశలోనే వుంది. ఈ రెండురోడ్‌లు పూర్తిఅయినపుడు మద్రాసు, బెంగుళూరు, విజయవాడ మార్గాలనుండి తిరుపతికివచ్చే వాహనాలు తిరుపతిమీదుగా వెళ్ళవలసిన అవసరం వుండదు. అందువల్ల పట్టణంలో వాహనాల రద్దీ తగ్గి అటు పట్టణప్రజలకి ఇటు ప్రయాణికులకూ సౌకర్యం కలుగుతుంది.

### నేత్రశిబిరం

ప్రఖ్యాత నేత్రవైద్యులు, అంధత్వ నిర్మూలన కృషిలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సలహాదారులు పద్మవిభూషణ్ డా॥ పి. శివా

## నిర్వాహకమండలి నిర్ణయాలు

**(సమావేశ తేదీలు : 29-1-1983 మరియు 31-1-1983)**

- తిరుమల తిరుపతి దేవస్థాన ఉద్యోగుల సహకారబ్యాంకుకు రు. 5 లక్షల స్వల్పకాలిక ఋణాన్ని ఏడాదికి 8 శాతం వడ్డీపై ఇచ్చేందుకు అంగీకరించడమైనది.
- తిరుమల తిరుపతి దేవస్థానముల సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ డి. సుబ్బరాయలు పదవీకాలాన్ని తే 1-2-83 ది నుండి ఒక ఏడాదిపాటు పొడిగించటం ధృవీకరించటమైనది.
- శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదాననిధికిగాను శ్రీ ఎల్. వి. రామయ్యచెట్టి ధర్మసంస్థ నుండి వచ్చిన రు. 16 లక్షల 50 వేల విరాళాన్ని స్వీకరించేందుకు అంగీకరించడమైనది. ఆ విరాళాన్ని ఏదైనా ఒక జాతీయంచేయబడిన బ్యాంకులో జమచేసి దానిపై వచ్చే వడ్డీమొత్తాన్ని అన్నదాన వినియోగానికి ఉపయోగింప తీర్మానించటమైనది.
- సొమ్ముచెల్లింపుపై యాత్రికుల ఉపయోగానికి కేటాయించే నిమిత్తం 5 కార్లను కొనుగోలు చేసేందుకు తీర్మానించటమైనది.
- తిరుమల శ్రీవారి ఆలయానికి సరఫరాచేసే పుష్పాల నిత్యావిత్తాన్ని 50 కిలోగ్రాముల నుంచి 70 కిలోగ్రాములకు పెంచడమైనది.

రెడ్డి సారథ్యంలో తిరుమల తిరుపతి దేవస్థానములవారి ఉచితనేత్ర చికిత్సాశిబిరం ఫిబ్రవరి 25వ తేదినుండి మార్చి 4వ తేది వరకు తిరుపతిలో దేవస్థానంవారి రెండవ సత్రంలో జయప్రదంగా నిర్వహించబడింది. టి. టి. డి. నిర్వహిస్తూవస్తున్న నేత్రచికిత్సా శిబిరాలలో ఇది ఇరవై రెండవది.

ఫిబ్రవరి 27వ తేది సాయంత్రం నేత్ర చికిత్సా కార్యక్రమానికి లాంఛనప్రాయంగా ప్రారంభోత్సవం జరుపుతూ అంధత్వనివారణకై మనం జరపవలసిన కృషి ఇంకా ఎంతో ఉందని, మనదేశంలోగల 60 లక్షల మంది అంధులకుగాను 4 వేలమంది నేత్ర వైద్యులు మాత్రమే ఉన్నారనీ అందువల్ల ఇటువంటి నేత్రచికిత్సా శిబిరాల నిర్వహణకు ఎంతో ప్రాధాన్యత కలదని చెప్పారు శ్రీశివారెడ్డి. టి. టి. డి. కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి అధ్యక్షత వహించారు. దేవస్థాన సీనియర్ మెడికల్ ఆఫీసర్ డాక్టర్ ఎస్. ఆర్. వై. ధనలక్ష్మి నివేదికను సమర్పిస్తూ నేత్రచికిత్సకుగాను 3,850 మంది రోగులను పరీక్షించామని వారిలో 450మందికి శస్త్రచికిత్సలు జరుగుతాయని చెప్పారు. ఈ శిబిరంపై దేవస్థానం 60 వేలు వ్యయం చేస్తున్నదని ఆపరేషన్లు జరిగినవారికి ఉచిత భోజన వసతి సౌకర్యాలతోబాటు కంటిఅద్దాలను కూడా టి.టి.డి. ఉచితంగా ఇస్తున్నదని ఆమె వెల్లడించారు. సభాధ్యక్షులు శ్రీ కుమారస్వామిరెడ్డి మాట్లాడుతూ శ్రీశివారెడ్డిగారు సూచించిన విధంగా ఇకపై ఏడాదికి రెండు నేత్రచికిత్సా శిబిరాలను నిర్వహించడానికి ప్రయత్నిస్తామని వీటికోసం దేవస్థాన సత్రాలు కాకుండా వేరే చోటును ఎన్నిక చేస్తామని చెప్పారు. దేవస్థాన సత్రాల రిసెప్షన్ఆఫీసర్ శ్రీ ఆదినారాయణ వందన సమర్పణ చేశారు.

ఈ నేత్రశిబిరంలో డాక్టర్ శివారెడ్డిగారితోబాటు డా॥ నవాజ్‌ఖాన్, డా॥ నరసింహారావు తదితర నేత్రవైద్యులు 9 మంది పాల్గొన్నారు. స్థానిక రుయాఆసుపత్రి వైద్య సిబ్బంది, దేవస్థాన వైద్యసిబ్బంది వారికి సహకరించారు. *



నేత్రచికిత్సాశిబిరంలో శస్త్రచికిత్సలు చేస్తున్న డా॥ పి. శివారెడ్డి.






మార్చి 2వ తేదిన కడపలో టి.టి.డి. కల్యాణమండపానికి శ్రీ ఎస్. రామమునిరెడ్డి (రాష్ట్ర ఆరోగ్యవైద్యశాఖామంత్రి) శంఖుస్థాపన చేసిన దృశ్యం. శ్రీ జి. కుమారస్వామిరెడ్డి టి. టి. డి. కార్యనిర్వహణాధికారి, శ్రీ అమితావ్ భట్టాచార్య (కడప కలెక్టర్), శ్రీ కె. ఓబులరెడ్డి (పార్లమెంటు సభ్యులు) తదితరులను ఫోటోలో చూడవచ్చును.

Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press, by M. Vijayakumar Reddy, L.P.T., Manager, T.T.D. Press, Tirupati.

# శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము, తిరుమల

## వివిధ ఆర్జిత ఉత్సవముల ధరల వివరములు.

| | | |
|---|---|---|
| 1. | స్పెషల్ దర్శనము | రు. 25 |

ఈ టికెట్టు తిరుమలలోనూ, దేశంలో ఆంధ్రా బ్యాంకువారి వివిధశాఖలలోను లభించును.

### సేవలు

| | | |
|---|---|---|
| 1. | అమంత్రణోత్సవము | రు. 400 |
| 2. | అభిషేకము (పులికాపు సేవ) | రు. 500 |
| 3. | పునుగుగిన్నె | రు. 200 |
| 4 | జాఫ్రాగిన్నె | రు. 100 |
| 5. | కస్తూరిగిన్నె | రు. 100 |
| 6. | సహస్రకలశాభిషేకము | రు. 3500 |
| 7. | తిరుప్పావడ * | రు 5000 |
| 8. | కోవిల్ ఆళ్వారు తిరుమంజనం | రు. 3000 |
| 9. | ఐనా మహల్లో డోలోత్సవం * | రు. 1500 |
| 10. | సహస్ర దీపాలంకార సేవ | రు. 2000 |
| 11. | పవిత్రోత్సవం | రు 5000 |
| 12. | ఊంజల్ సేవ | రు. 1500 |
| 13 | నూతన ఊంజల్ సేవ | రు. 3000 |

### తిరుమల, తిరుపతిలో వసతి సౌకర్య వివరాలు

తిరుమలలో

| | | |
|---|---|---|
| (1) | ప్రత్యేకపు కాటేజీలు | రు. 75 |
| (2) | టి. బి. లోపల కాటేజీలు | రు. 50 |
| (3) | యస్. వి. గెస్టుహౌస్ పెద్దగదులు | రు. 50 |
| | మూలగదులు | రు. 40 |
| | ఒక్కగదివి | రు. 35 |
| (4) | హెచ్. ఆర్. జి. కాటేజీలు కల్యాణమంటపాలు | రు. 150 |
| | రూయాకాటేజీ, గోగినేని కాటేజి | రు. 80 |
| | సి. సి. కాటేజీలు | రు. 100 |
| | శంకుమిట్ట తూర్పు నెం॥ 9 | రు. 50 |
| | ఆళ్వారుల టాంక్ కాటేజి నెం॥ 39 | రు. 80 |

తిరుపతిలో

శ్రీనివాస చౌల్ట్రీ: 15, 12, 10. రూ.

పద్మావతిగెస్టుహౌస్ (ఏ సి) రెండుపడకలవి: 40 రూ.

ఒక్కపడకవి: 30 రూ.

శ్రీవేంకటేశ్వరగెస్టుహౌస్: రెండుపడకలవి: 16 రూ.

### ఉత్సవములు

| | | |
|---|---|---|
| 1. | వసంతోత్సవము | రు. 3000 |
| * 2. | తెప్ప ఉత్సవం | రు. 2500 |
| 3. | కల్యాణోత్సవము | రు. 2000 |
| 4. | బ్రహ్మోత్సవము | రు. 1000 |
| 5. | పుష్పయాగం | రు. 3500 |

### వాహనములు

| | | |
|---|---|---|
| 1. | బంగారుగరుడ కల్పవృక్ష, సర్వభూపాల, సూర్యప్రభ ఒక్కొక్కదానికి | రు. 125 |
| 2. | వెండిగరుడ, చిన్న శేష, ఏనుగు, గుఱ్ఱం, హంస, హనుమంత వాహన సేవ ఒక్కొక్కదానికి | రు. 100 |

షరా:— సహస్ర కలశాభిషేకము ప్రతి బుధవారమునను, తిరుప్పావడ ప్రతి గురువారమునను జరుగును.

1. ఆమంత్రణోత్సవమునకు ఇద్దరికి మాత్రమే అనుమతి. 2,3,4,5,6, సేవలకు ఒక్కొక్కరికి మాత్రమే అనుమతి.
2. ప్రతిదినం మధ్యాహ్నం 1-00 గం॥ 7-00 గం॥ లోపల సర్కారు లేదా ఆర్జిత కల్యాణోత్సవం, బ్రహ్మోత్సవం, వాహనసేవలు, సర్కారు డోలోత్సవం (ఉయ్యాల) (సర్కారు లేక ఆర్జిత ప్లవోత్సవం, మంగళవారంనాడు) జరుగుతవి.

* ఈ ఉత్సవముల వారికి 5 గ్రా. బంగారు పతకం బహూకరింతురు.

### * నిబంధనలు *

కాటేజీలు కావలసినవారు ఆ ప్రాంతపు రిసెప్షన్ ఆఫీసర్ పేరిట కనీసం పదిరోజులు ముందుగా డిమాండ్ డ్రాఫ్టు మూలకంగా డబ్బుపంపాలి. ఒక కాటేజీ కొరకు పంపి వేరొక వసతి ఏర్పాటైతే జమచేయగా మిగిలిన డబ్బు వాపసు ఇవ్వబడుతుంది. ఉదయం 8 గంటలనుండి మరునాడు ఉదయం 8 గంటలవరకు ఒకరోజుగా లెక్కించబడుతుంది. డబ్బు కట్టినవారు మొదటి రోజున రానిపక్షంలో అంతకు ముందు చెల్లించిన డబ్బు తిరిగి ఇవ్వబడదు. తరువాత ఛార్జీలకు లెక్క కట్టబడదు.

ఈ రిజర్వేషను 2 రోజులకు మాత్రమే: పరిస్థితులను బట్టి పొడిగింపు వుంటుంది. ఏ వసతి దొరకని పక్షంలో డబ్బు తిరిగి ఇవ్వబడును.

డబ్బు కట్టినవారు తమకు ముందుగా పంపబడిన రిజర్వేషను కార్డును లేదా మనియార్డరు రశీదును లేదా నగదు రశీదును ఆయా రిజర్వేషన్ కేంద్రాలలో చూపవలసి వుంటుంది. లేనిచో రిజర్వేషన్ రద్దుకాగలదు.

తిరుమల తిరుపతి దేవస్థానం




శరణు శరణు విభీషణవరదా
శరధి బంధన రామ సర్వగుణస్తోమ

మారీచ సుబాహు మదమర్దన తాటకాహర
క్రూరేంద్ర జిత్తు తలగుండు గండా
దారుణ కుంభకర్ణ దనుజ శిరచ్ఛేదక
వీరప్రతాప రామ విజయాభిరామ ॥

వాలి నిగ్రహ సుగ్రీవరాజ్యస్థాపక
లాలిత వానరబల లంకాపహార
పాలిత సవనాహల్య పాపవిమోచక
పౌలస్త్య హరణ రామ బహు దివ్యనామ ॥

శంకరచాప భంజక జానకీ మనోహర
పంకజాక్ష సాకేత పట్టణాధీశ
అంకిత బిరుద శ్రీవేంకటాద్రినివాస
ఓంకారరూప రామ ఉరుసత్యకామ ॥

( తాళ్ళపాక అన్నమాచార్యులవారి రామావతార వైభవ వర్ణన. )

# మీమాట

## ముఖచిత్రం

ఫిబ్రవరి సంచిక ముఖచిత్రం శివపార్వతులు ఆకర్షణీయంగావుంది. కాని పార్వతీదేవి చిత్రీకరణలో చిత్రకారుడు కొంచెం శ్రద్ధ చూపించివుంటే ఇంకా చాలా బాగావుండేది.

బాలప్రబోధం శీర్షికలోని 'పావలం' గేయం చాలా బాగుంది. ఇలాంటి మంచి పాటలని ప్రతినెలా ప్రచురిస్తే విద్యార్థులకు ఉపయోగకరంగా వుంటాయి. ఆ గేయాన్ని నేను పురాణప్రబోధ పరీక్షల విద్యార్థులకు నేర్పుతున్నాను. నాలాగే ఇతర ఉపాధ్యాయులుకూడా ఆ పాటను తమ విద్యార్థులకు నేర్పుతారని ఆశిస్తున్నాను.

కె. వీరభద్రరావు. — ఈతముక్కల.

ఫిబ్రవరి సంచిక అత్యంత ఆకర్షణీయంగా వుంది. 'రుద్రాక్షలు' 'విభూతిధారణ' వ్యాసాలు విజ్ఞానదాయకంగా వున్నాయి. గత రెండుమాసాలుగా 'సప్తగిరి' ప్రచురణలో ప్రత్యేకత కనిపిస్తూ మమ్మల్ని ఆకట్టుకొంటున్నది.

ఎం. సత్యనారాయణశర్మ. — తరిగొండ.

## బొమ్మల సీరియల్

ప్రసిద్ధ పురాణగాథలను బొమ్మలతో ప్రచురించవలసిందిగా కోరుతున్నాను.

ఎం. శివరామకృష్ణగాయత్రి. — హైదరాబాద్.

## గృహలక్ష్మి

గృహలక్ష్మి శీర్షికక్రింద మీరు ప్రచురించిన శ్రీమతి జయలక్ష్మి రచన 'ఉత్తమ ఇల్లాలు' బాగుంది. అయితే మహాభారత శాంతిపర్వం ఆధారంగా అని రచనచివర అచ్చువేశారు. ఇది శాంతి పర్వంలోనిది కాదు. అరణ్యపర్వంలో మార్కండేయమహాముని ధర్మరాజుకు చేసిన ఉపదేశంలోని కథ ఇది.

## బాలప్రబోధం

జనవరి సంచికలోని 'జనాబాయి' కథ మాకెంతో నచ్చింది. రచయిత డా॥ మల్లీప్రియ నాగరాజుగారికి మా అభినందనలు. ఇటువంటి మంచికథలను ఇతోధికంగా సప్తగిరిలో ప్రచురింపప్రార్థన.

కస్తూరి వెంకటసత్యసుబ్రహ్మణ్యం, అమలాపురం.

ఫిబ్రవరి బాలప్రబోధంలోని చిదంబర యాత్ర చాలా బాగుంది. హరిజనులపై న్యూనతా భావాలు అలుముకున్న ఈ కాలంలో బాలుర మనస్సుకు హత్తుకునేట్లు వ్రాసిన ఈ కథ సమాజానికి కనువిప్పు. ఈనాటి సమాజానికి ఇలాంటి కథలు ఎంతో స్ఫూర్తి నిస్తాయి. రచయిత శ్రీ ఎం. శివశంకరశాస్త్రికి కృతజ్ఞతలు.

వి. రాధాకృష్ణమూర్తి,—శ్రీవ్యాసాశ్రమం, ఏర్పేడు.

## ఆలస్యం

సప్తగిరిలో ప్రచురించే వేదాంత విషయాలు చాల సంతృప్తికరంగా వున్నప్పటికీ పత్రిక సకాలంలో రాని కారణంగా నిరాశా నిస్పృహ చెందవలసివస్తోంది.

వి. రామమోహనరావు, — విజయవాడ.

సప్తగిరి పత్రిక సరిగా అందడంలేదు. ఈ నెల పత్రిక వచ్చేనెల చేరుతోంది. ప్రతినెలా 10 తేదిలోగా పత్రికను పంపిస్తే మీ సొమ్మేంపోతుంది? ఇదేనా మీ దైవభక్తి?

డి. శ్యామసుందరరెడ్డి, — బండోనిపల్లె.

*

## వికలాంగుల సకల కళాకేంద్రం !



రుధిరోద్గారి ఉగాది శుభోదయాన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావుగారిచేత ప్రారంభోత్సవం జరుపుకొన్న శ్రీ వేంకటేశ్వర వికలాంగుల శిక్షణకేంద్రం. 12 లక్షల వ్యయంతో నిర్మాణమైన ఈ కేంద్రంలో ప్రతి ఏటా 6 లక్షల వ్యయంతో 100 మంది వికలాంగులకు జీవనోపాధి వృత్తుల్ని నేర్పేందుకు టి. టి. డి. సంకల్పించింది.

# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాస పత్రిక...



గౌరవసంపాదకులు.

**శ్రీ జి. కుమారస్వామిరెడ్డి,**
ఐ. ఏ. ఎస్.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

ప్రచురణకర్త - సంపాదకుడు:

**కాట్రపాటి సుబ్బారావు,**
ఎమ్. ఎ.

ఉపసంపాదకుడు:

**తిరుమూరు సుధాకర్ రెడ్డి,**
ఎమ్. ఎ. బి. ఇడి.

ముద్రాపకుడు:

**ఎమ్. విజయకుమార్ రెడ్డి.**

**విడిప్రతి-రు. 1-00**

**సం॥ చందా-రు. 12-00**

ప్రతులకు:

**వెల్ ఫేర్ ఆఫీసర్,**
టి. టి. డి., తిరుపతి


## ఈ సంచికలో....


**ఏప్రిల్ 1983**

**సంపుటి 13 సంచిక 11**




ముఖచిత్రం: నవనైవేద్యం

చివరిఅట్ట: ఉగాది శుభాకాంక్షలు — శ్రీ మారేమండ శ్రీనివాసరావు (శ్రీశైలం)

# సంపాదకీయం

* * *

దుందుభి నిజంగా పేరు సార్థకం చేసుకున్నది. ఈ సంవత్సరంలో జరిగిన అనేక సంఘటనలు ఒక్కొక్కటీ ఒక్కొక్క వాదంగా వినూత్న వ్యాఖ్యానంతో వినిపించాయి. సమాజంలోని నీరవం అశక్తతగా పరిగణించరాదని, సామాజిక రాజకీయ విజ్ఞానంలో అదొక తంత్రమని, తమతలచినప్పుడు ఎదురుదెబ్బ కొట్టగల సంఘటిత శక్తి సామర్థ్యాలు సమాజంలో నిగూఢంగా వున్నాయని, సమయం చూచి సవ్యసాచిత్వం నెరపగల 'నరశక్తి' సమాజానిదని, ఈ భారతంలో నరనారాయణసేవ సమానగౌరవ భావాలతో నెరపవలసివున్నదని, అప్పుడే నరుడు నారాయణ సన్నిహితుడౌతాడని, జనంవేరు మనంవేరు అనుకున్నవారు వేరుగానే వుండక తప్పదని ఇలా ఎన్నో అర్థాలు అనాదిగా వినిపిస్తున్నవే ఐనా ఈనాడు మారుమ్రోగాయి.

ఒక భక్తునికోసం స్వామి వైకుంఠాన్నే వదలి పరుగెత్తారని, ఒక భక్తురాలికోసం పిండి విసిరారని, ఒక అత్తచేత వాతలు కూడా అనుభవించారని, ఒక భక్తురాలు ముడిచి ఇచ్చిన పూలను ముసిముసి నవ్వులతో స్వీకరించారని, ఒక భక్తునిచే 'అంత్యజుని' మోయించారని, దర్శనంకోసం తపించే మరో భక్తునికోసం తన వాహనాన్నే పక్కకు తప్పించి దర్శనం ఇచ్చారనీ మన వాఙ్మయమంతా భగవానుని భక్తత్రాణపరాయణత వక్కాణిస్తున్నపుడు నారాయణ ప్రసాదం నరులందరికీ లభించాలన్న ఒక ఆలోచన కల్గటం ఆశ్చర్యం కాదేమో ! మరి పారమార్థిక దృష్టికి 'పరమార్థ' దృష్టికి కొంత భేదం తప్పదని కొందరి భావన. వికలాంగుల సేవకు ఏర్పడుతున్న విశిష్టప్రక్రియ దుందుభి సందేశం. ఆర్తులపాలిటి ఆశావాదం.

క్రొత్తవింతలతోపాటు, పాతభావాలలో క్రొత్తకదలికలు కన్పిస్తున్నాయి. కాలగతికి చాలా అనుగతికంగా వుండే సంఘటనలివి. నిత్యనూతనత్వాన్ని అన్వేషించే కాలంలో నిలకడ దేనికీ వుండదనేదే దుందుభి నూతనారావం. పాతవాదం వెనక్కుపోయి క్రొత్తరావం కాస్తకాస్త దగ్గరౌతోంది.

ఈ వచ్చేది 'రుధిరోద్గారి.' అర్థాన్ని ఊహించలేనంత భయంకరమైనది. నిజానికి భయపడవలసింది లేదేమో. అధికార, వర్గ, వర్ణ, ధర్మ, భాషా వ్యత్యాసాలు ఆధారంగా మనల్ని మనమే హింసించుకోవటంతో ఈ సమాజానికి రుధిరోద్గారం చాలాకాలంగా జరుగుతునేవున్నది. మన అశేష మేధాసంపత్తి రణరహిత మారణానికి మాత్రమే ఉపయోగపడుతున్నది. అయితే సహన, సమతా, సహజీవన భావాలు జీవరస త్రివేణియై అంతర్వాహినిగా ప్రవహిస్తూ అమృత స్యందినులు కావటంవల్ల ఆ ఉద్గారం అణగి సమాజం మళ్ళీ ఉపశమనాన్ని పొందుతున్నది. దుర్భర జీవనాన్ని కల్పించగల శక్తి మాత్రం ఈ సంవత్సరానికి లేదని చెప్పవచ్చు శిశిరం తరువాత వసంతం వచ్చినట్లే ఈ వర్షచక్రంలో రుధిరోద్గారి, రక్తాక్షి, క్రోధన, అక్షయలు ఉత్తరోత్తర సౌమ్యస్వరూపాలని, ప్రభవతో నూత్నచక్ర ప్రభవం జరుగుతుందని సూచనగా కన్పిస్తున్నది. నిశ్చలనంలోని ఆ వ్యుత్పత్తి సార్థక శబ్దాలతో నిరూపించగలిగిన మహామహుల ప్రజ్ఞావిశేషాలకు మనం తలవంచవలసిందే.

కాలవిశేషాన్ని చెప్పుకోవటానికి తప్ప నిజానికింతటి విశ్లేషణ అనవసరం. మన బ్రతుకులు గ్రహగతులతో దానాలతో, ముడిపడివున్నా వాటి గతులు కలియుగదైవం శ్రీ వేంకటేశ్వరుని అనుమతికి లోబడక తప్పదు. కనుక మనకు ముప్పులేదు. అదే మన సుఖచిత్రం.

" మధువాతాఋతాయతే
మధుక్షరంతి సింధవః
మాధ్వీర్నస్సంత్వోషధీః




—శ్రీ సుచంద్ర

షడ్రుతువులలో వసంతఋతువు సర్వ జనానంద సంధాయి. ఆహ్లాద మయమైన ప్రాకృతిక వాతావరణంలో తెలుగు వారి తొలిపండగ అయిన సంవత్సరాది మహి కాధ్యాత్మికానందాలను తలమున్కలుగా అందిస్తూవస్తుంది. ఈ ఆనంద సమయం లోనే అలనాటి ఆంధ్రభోజుడు శ్రీకృష్ణ దేవరాయలు వసంతోత్సవాలు నిర్వహించి, కవిపండిత సత్కారాలుచేసి, ఆంధ్రభాషా యోషను పూజాప్రసూనాలతో అర్చించాడు.

తరతరాల మన తెలుగు సాహిత్యంలో వసంతాన్ని శ్రుతిమధురంగా వర్ణించని కవి "నభూతోనభవిష్యతి". "వసంత కాలే సంప్రాప్తకాకః కాకః పికః పికః" అన్నట్లుగా అప్పటి వరకు స్తబ్దంగావున్న కవి వర్యులు సైతం వసంతశోభను వర్ణించాల్సి వచ్చేసరికి శృంగార వీరరసావతారులే అవుతారు. ఆంధ్ర సాహిత్యానికే మణిమకుటం అనదగిన ప్రబంధయుగంలో ఈ వసంతర్తువర్ణనలు తక్కిన పూర్వానంతర కావ్యాల వర్ణనకన్న మిన్నగ రసజ్ఞుల నలరించాయి.

ప్రప్రథమాంధ్రప్రబంధనిర్మాత అయిన అల్లసాని వారి అల్లిక జిగిబిగిలో వసంతశోభ అత్యంతశ్రమాసుభగంగా అలరింది. వసంతరాజు మంచిసుళ్లు దిరిగిన మలయానిలాశ్వాన్నధిరోహించి వచ్చిన తరుణంలో, తుమ్మెదల బారులే ఆగుఱ్ఱపు కళ్ళాలుగ, లవవీదళాలలతలే ఆభరణాలుగ గోచరిస్తున్నాయట. కాలాన్ననుసరించి మన్మథుడు శృంగార దండయాత్రకు బయల్దేరి యువతీయువకుల చిత్తభ్రమ కలిగించే లక్షణాన్ని వసంతరాజుకే అన్వయించి, అతనినే అనంగదేవునిగా ఆరోపించిన అల్లసానివారి మనుచరిత్ర మనోహర వర్ణనా ప్రతీక.

సంగీతసాహిత్యకళానిధిగా ప్రశస్తి వహించిన రామరాజభూషణుడుకూడ వసుచరిత్రలో, "లలనాజనాపాంగవలనా వసద నంగతులనాభికాసంగదోః ప్రసంగ" అన్నట్టి హిందోళరాగాలాపన కనువైన ప్రఖ్యాత పద్యంలో వసంతర్తువర్ణనచేయుటం అతని సమయజ్ఞతకు చిహ్నం. మంచువల్ల కళదప్పినతామరలచూసి సూర్యుడుకోపంతో మంచుపై దాడిరాగా అది ఉత్తర దిక్కుకు పారిపోగా సూర్యుడు దానిని వెంబడించాడని చెబుతూ ఉత్తరాయనం ప్రారంభమైనదన్న విషయాన్ని చమత్కరించాడు. అంతేగాక చైత్రమాస వసంతోత్సవాల వర్ణన విస్తారంగా చేశాడు.

రాఘవపాండవీయద్వ్యర్థికావ్యంలో పింగళి సూరన వసంతర్తుశోభను ప్రౌఢ శైలిలో అభివర్ణించాడు.

"అంత వసంత మొప్పెచరమా
గ్రిమభాగ చరాళిలత్తసా
మంత మనంత జాలక
సమంజస రంజిత కుంజకుంజరో
ధ్వాంత నితాంతసాంద్ర మధుదావ
విజృంభిత చంచరీస్వనా
త్యంతనిరంతరీకృత దిగంత
మతాంతలతాంత కుంతమై"

భావసంపదకన్న మాధురీగుణ సమేతమైన భాషాసౌష్ఠవానికీపద్యం ప్రతీకగా వుండి ప్రాచీనభక్తకవి పోతనగారి యొరవడిని స్మరణకు తెస్తున్నది.

ప్రబంధ కవులందరికన్న మిన్నగ ఊహాశాలీనతను ప్రదర్శించిన మహాభాగుడు సాక్షాత్తు శ్రీ కృష్ణదేవరాయలేనని చెప్పాలి. ఆయన గావించిన వసంతవర్ణనలోని ఉత్ప్రేక్షా సౌందర్యమిది. "అరుణవర్ణంలో వున్న మోదుగమొగ్గ అప్పుడే పుట్టిన మన్మథ శిశువుబొడ్డుకోయడానికి వసంతర్తువు దానిచేతిలోవున్న ఆపిత్రంగావున్నది." మోదుగ మొగ్గకొనవంగి ఆకారంలో కొడవలిలాగవుండటం ఈ వర్ణనపెంతో సాభిప్రాయంచేస్తున్నది. ప్రకృతిలోని స్త్రీ పురుషులకు మన్మథ భావోదయమైనదన్న సూచనను ఎంతో మృదువుగా చెప్పాడు ఆంధ్రభోజుడు.

యతిని సైతం విటుని చేయజాలిన మరొక సహజకవి సంకుసాలనృసింహకవి గావించిన వసంతవర్ణన యిలావున్నది. మన్మథుడు అట్టహాసంగా విల్లు ప్రయోగించుకొనివస్తుంటే, విరహుల నిట్టూర్పులు దట్టమైనాయి. కోకిలల, చిలుకల వుల్లాసం పెరిగింది. పూచిన ప్రతి పూవూ మదనబాణం లాగేవుండి, వీచిన ప్రతిగాలీ మలయానిలమే అయి చూచిన ప్రతి స్త్రీ మదచుంబితార్థంగావున్నది. మన్మథుని బాణాగ్ని వల్ల గ్రీష్మంగా, పూలతేనెలప్రవాహంవల్ల వర్షర్తువులా, రసికజనమనస్తత్వం వల్ల శరత్తుగా త్రికాలాలమేళనం ఆ వసంతోత్సవం" అని ఎంతో భావగర్భితంగాచేసి, పైన తెల్పిన తన ప్రశస్తిని నిలబెట్టుకున్నాడు కవికర్ణరసాయన శాస్త్రజ్ఞుడు.

హంస వింశతి కావ్యంలో, వనలక్ష్మికీ, వసంతుడికీ పెళ్ళి జరుగుతున్నట్లు, చెట్లూ, లతలూ అనే స్త్రీ పురుషులు ఒకరిపై ఒకరు బుక్కాయి చల్లుకొంటున్నట్లుగా పువ్వొళ్లు నిండాయని అయ్యలరాజు నారాయణామాత్యుడు అభినవ లీలావిలాసంతో వసంతాన్ని అభివర్ణించాడు. [43 వ పేజీలో]

# శ్రీమద్భగవద్గీత

## మొదటి అధ్యాయం

### అర్జునవిషాదయోగం

జాతిమతాలకు అతీతమైన విశాల దృక్పథంతో మానవాళికి కర్తవ్యోపదేశం చేసే మహత్తర అమృతాన వేదాంత గ్రంథం భగవద్గీత. ఆర్షధర్మప్రచార కృషిలో భాగంగా తి. తి. దే. ప్రచురించిన భగవద్గీతా గ్రంథాలు అత్యంత ప్రజాదరణ పొందాయి. వాటిలో ఒకటైన శ్రీ రావుల సూర్యనారాయణ మూర్తిగారి గీతానువాదాన్ని ధారా వాహికంగా ప్రచురిస్తున్నాము. సం॥

ధృతరాష్ట్ర ఉవాచ:

ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః।
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ॥

ధృతరాష్ట్రుడు: సంజయా! ధర్మానికి నిలయమైన కురుక్షేత్రంలో యుద్ధసన్నద్ధులై నిలిచిన నా వాళ్లూ, పాండవులూ ఏం చేశారు?

సంజయ ఉవాచ:

దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా।
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్॥

సంజయుడు: యుద్ధానికి సంసిద్ధులైవున్న పాండవ సైన్యాలను చూసి, దుర్యోధనుడు ద్రోణాచార్యుల దగ్గరకు వెళ్లి ఇలా అన్నాడు.



పశ్యైతాం పాండుపుత్రాణాం ఆచార్య మహతీం చమూమ్।
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా॥

ఆచార్యా! మీ శిష్యుడూ, ధీమంతుడూ అయిన ధృష్టద్యుమ్నుడు వ్యూహం పన్నిన పాండవుల మహాసైన్యాన్ని చూడండి.

అత్ర శూరా మహేష్వాసాః, భీమార్జునసమా యుధి।
యుయుధానో విరాటశ్చ ద్రుపద శ్చమహారథః॥

ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజ శ్చ వీర్యవాన్।
పురుజిత్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుఙ్గవః॥

యుధామన్యుశ్చ విక్రాన్తః ఉత్తమౌజాశ్చ వీర్యవాన్।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః॥

ఈ పాండవులసైన్యంలో ధైర్య సాహసవంతులూ, అస్త్ర విద్యానిపుణులూ, శౌర్యంలో భీమార్జున సమానులూ వున్నారు. సాత్యకి, విరాటుడు, ద్రుపదుడు, ధృష్టకేతువు, చేకితానుడు, కాశీరాజు, పురుజిత్తు, కుంతిభోజుడు, శైబ్యుడు, యుధామన్యుడు, ఉత్తమౌజుడు, అభిమన్యుడు, ఉపపాండవులు కూడా వున్నారు. వీళ్లంతా మహారథులే.

అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ।
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే॥

బ్రాహ్మణోత్తమా! ఇక మన సైన్యంలోవున్న నాయకులూ, సుప్రసిద్ధులూ అయిన వాళ్ల గురించి కూడా చెబుతాను.

భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితిఞ్జయః।
అశ్వత్థామా వికర్ణ శ్చ సౌమదత్తి స్తథైవ చ॥

అన్యే చ బహవశ్శూరాః మదర్థే త్యక్తజీవితాః।
నానాశస్త్ర ప్రహరణాః సర్వే యుద్ధవిశారదాః॥

మీరు, భీష్ముడు, కర్ణుడు, కృపాచార్యుడు, అశ్వత్థామ, వికర్ణుడు, సౌమదత్తి వున్నారు. ఇంకా ఎంతోమంది శూరా

గ్రేవరులూ. యుద్ధవిశారదులూ నా కోసం జీవితాల మీద ఆశ వదలి సిద్ధంగా వున్నారు.

అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్।
పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితమ్॥

భీష్ముడు రక్షిస్తున్న మన సైన్యం అపరిమితం. భీముడి రక్షణలోవున్న పాండవ సైన్యం పరిమితం.

అయనేషు చ సర్వేషు యథాభాగ మవస్థితాః।
భీష్మమేవాభిరక్షంతు భవంత స్సర్వ ఏవ హి॥

అందువల్ల మీరంతా యుద్ధరంగంలో మీ మీ స్థానాలు వదలిపెట్టకుండా ఉండి భీష్ముణ్ణి కాపాడాలి.

తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః।
సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్॥

అలా అంటున్న దుర్యోధనుడికి సంతోషం కలిగిస్తూ కురువృద్ధుడైన భీష్ముడు సింహనాదంచేసి శంఖం పూరించాడు.

తత శ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః।
సహసై వాభ్యహన్యంత స శబ్దస్తుములోఽభవత్॥

వెంటనే కౌరవవీరుల శంఖభేరి ఢక్కామృదంగ గోముఖాది ధ్వనులతో దిక్కులన్నీ పిక్కటిల్లాయి.

తత శ్శ్వేతై ర్హయై ర్యుక్తే మహతి స్యందనే స్థితౌ।
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః॥

అప్పుడు తెల్లగుర్రాలు కట్టిన మహారథం మీద కూర్చున్న కృష్ణార్జునులు కూడా తమ దివ్యశంఖాలు పూరించారు.

పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః।
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః॥

అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః।
నకుల స్సహదేవశ్చ సుఘోష మణిపుష్పకౌ॥

కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీ చ మహారథః।
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః॥

ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే।
సౌభద్రశ్చ మహాబాహుః శంఖాన్ దధ్ముః పృథక్పృథక్॥

శ్రీకృష్ణుడు పాంచజన్యం, అర్జునుడు దేవదత్తం, భీముడు పౌండ్రకం ఊదారు. ధర్మరాజు అనంతవిజయం, నకుల సహదేవులు సుఘోష మణి పుష్పకాలు పూరించారు. కాశీరాజు, శిఖండి, దృష్టద్యుమ్నుడు, విరాటుడు, సాత్యకి, ద్రుపదుడు, ఉపపాండవులు, అభిమన్యుడు తమతమ శంఖాలు అన్నివైపులా ఊదారు.

స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్।
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్॥

ఆ శంఖధ్వనులు భూమి ఆకాశాలను దద్దరిల్లజేస్తూ కౌరవ వీరుల హృదయాలను బద్దలు చేశాయి.

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః।
ప్రవృత్తే శస్త్రసంపాతే ధనురుద్యమ్య పాండవః॥

హృషీకేశం తదా వాక్యం ఇద మాహ మహీపతే!

అర్జున ఉవాచ:

సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత!

కురురాజా! అప్పుడు అర్జునుడు యుద్ధసన్నద్ధులైన దుర్యోధనాదులను చూసి, గాండీవం ఎత్తిపట్టి శ్రీ కృష్ణుడితో "అచ్యుతా! రెండుసేనల మధ్య నా రథాన్ని నిలబెట్టు" అన్నాడు.

యావ దేతాన్ నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్!
కైర్మయా సహ యోద్ధవ్యం అస్మిన్ రణసముద్యమే॥



శ్రీ వైకుంఠ పెరుమాళ్ళ అభిషేకం, కుంభకోణ శిల్పం.
ఫోటో: కె. సీతారామరావు.

యోత్స్యమానానవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః యుద్ధే ప్రియచికీర్షవః॥

"కృష్ణా! రథాన్ని ముందుకు పోనీ. దుష్టుడైన దుర్యోధనుడికి ప్రియం చేయటానికి సమరరంగానికి వచ్చిన వాళ్ళందరినీ చూడాలనుకుంటున్నాను" అన్నాడు అర్జునుడు.

సంజయ ఉవాచ:

ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత।
సేనయో రుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్॥

భీష్మ ద్రోణ ప్రముఖతః సర్వేషాం చ మహీక్షితామ్
ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి॥

సంజయుడు: ధృతరాష్ట్రా! అర్జునుడి మాటలు ఆలకించిన శ్రీ కృష్ణుడు రెండు సేనల మధ్య భీష్మద్రోణాదులకు ఎదురుగా రథం ఆపి, అక్కడ చేరిన కౌరవ బలాన్ని అవలోకించమన్నాడు.

తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్।
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీం స్తథా॥

శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయో రుభయో రపి।
తాన్ సమీక్ష్య స కౌన్తేయః సర్వాన్ బంధూనవస్థితాన్॥

కృపయా పరయాఽఽవిష్టో విషీదన్నిద మబ్రవీత్.

అప్పుడు అర్జునుడు ఉభయ సేనలలోనూ యుద్ధానికి సిద్ధంగావున్న తన తండ్రులనూ, తాతలను, గురువులను, మేనమామలను, సోదరులను, పుత్రులను; పౌత్రులనూ, మిత్రులనూ, బంధువులందరినీ చూశాడు. చూసి మిక్కిలి దయగలిగి దుఃఖిస్తూ విశేషకృపాంతరంగుడూ, విషాదవశుడు అయి ఇలా అన్నాడు.

అర్జున ఉవాచ:

దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్॥

సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి।
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే॥

గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే।
న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః॥

కృష్ణా! యుద్ధాసక్తులై ఎదురుగావున్న చుట్టాలను చూడగానే నా అవయవాలు తడబడుతున్నాయి. నోరు ఎండిపోతున్నది. శరీరమంతా గగుర్పాటుతో కంపిస్తున్నది. గాండీవం చేతిలోంచి జారిపోతున్నది. దేహం మండుతున్నది. నిలబడడానికికూడా శక్తిలేదు. నా మనస్సు తల్లడిల్లుతున్నది.

నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ।
న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే॥

కేశవా! దుశ్శకునాలు కానవస్తున్నాయి. యుద్ధంలో బంధువులను చంపడంవల్ల కలిగే మేలు ఏమీ గోచరించడం లేదు.

న కాంక్షే విజయం కృష్ణ! న చ రాజ్యం సుఖాని చ।
కిం నో రాజ్యేన గోవింద! కిం భోగైర్జీవితేన వా?॥

కృష్ణా! యుద్ధవిజయం మీద, రాజ్యసుఖాలమీద నాకు ఆసక్తిలేదు. రాజ్యభోగాలతో కూడిన జీవితంవల్ల ప్రయోజనం ఏమీ లేదు.

యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగాస్సుఖాని చ।
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ॥

ఆచార్యాః పితరః పుత్రాః తథైవ చ పితామహాః।
మాతులాశ్శ్వశురాః పౌత్రాః స్యాలాస్సంబంధిన స్తథా॥

ఎవరికోసం రాజ్యం, భోగం, సుఖం కోరుతున్నామో వాళ్లంతా–గురువులు, తండ్రులు, కుమారులు, తాతలు, మేనమామలు, మామలు, మనుమలు, బావమరదులు, ఇతర బంధువులూ–ధనప్రాణాల మీద ఆశవదలి ఈ రణరంగంలోనే వున్నారు.

ఏతా న్న హంతు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన।
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే॥

మధుసూదనా! వాళ్లు నన్ను చంపితే చంపనీ. ముల్లోకాలనూ ఏలే అవకాశం కలిగినా నేను మాత్రం వాళ్లను వధించదలచుకోలేదు. అలాంటప్పుడు ఈ రాజ్యం కోసం వాళ్లను చంపుతానా!

నిహత్య ధార్తరాష్ట్రా న్నః కా ప్రీతి స్స్యా జ్జనార్దన?।
పాపమేవాశ్రయేదస్మాన్ హత్వైతా నాతతాయినః॥

దుర్యోధనాదులను సంహరించి మనం పొందే సంతోషమేమిటి? జనార్దనా! ఈ పాపాత్ములను చంపితే మనకూ పాపమే.

తస్మాన్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్।
స్వజనం హి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ॥

బంధువులైన దుర్యోధనాదులను చంపడం మనకు మంచిదికాదు. మాధవా! స్వజనాన్ని వధించి ఎలా సుఖపడగలం?

(44వ పేజీలో)




# ప్రశ్నోపనిషత్

## తృతీయ ప్రశ్నము

(గతసంచిక తరువాయి)

9

తేజోహవై ఉదాన స్తస్మాదుపశాంతతేజాః
పునర్భవ మింద్రియైర్మనసి సంపద్యమానైః.

తేజస్సే ఉదానం అనే ప్రాణం. ఇది తన శక్తిని లోపలకు తీసుకుంటే ప్రాణికి మృతి సంభవిస్తుంది. ఆ అవస్థలో ఇంద్రియాలన్నీ మనసులో చేరిపోతాయి. అప్పుడు మన స్సంకల్పం ప్రకారం తిరిగి పుట్టడం జరుగుతుంది.

(ప్రాణికి కళా కాంతీ పటుత్వం కలిగించేది ఉదానం అని భావం.)

10

యచ్చిత్తస్తే నైవ ప్రాణమాయాతి ప్రాణ స్తేజసా యుక్తః సహాత్మనా యథాసంకల్పితం లోకం నయతి.

జీవుడు యీ శరీరమునుంచి తర్లిపోయేటప్పుడు ఏలాటిఆలోచనతోపోయిప్రాణాన్ని చేరుతాడో ఆ ప్రాణం ఉదానముతోకలిసి తన సంకల్పాన్ని అనుసరించి యీ లోకములో ఇంకొక శరీరాన్ని ప్రవేశించి పుట్టుతూ ఉంటాడు. ఇదే సంకల్ప శరీరం అంటే.

(యాంతేమతి స్సాగతిః- చివరిగడియలో అనుకున్నదే తరువాతి అనుభవానికి పునాది.)

11

య ఏవం విద్వాన్ ప్రాణం వేద న హాస్య ప్రజా హీయతేఽమృతో భవతి. తదేష శ్లోకః,

ప్రాణతత్త్వం తెలుసుకున్న బుద్ధిమంతుని వంశం కొరవడదు (నశించదు పైగా వంశాభివృద్ధి అవుతుంది). ప్రాణతత్త్వం తెలిసిన జ్ఞాని అమరుడౌతాడు. ఈ మాటకు చెప్పబోయే శ్లోకం ప్రమాణం.

12

ఉత్పత్తిమాయతిం స్థానం
విభుత్వం చైవ పంచధా,
అధ్యాత్మం చైవ ప్రాణస్య
విజ్ఞాయామృత మశ్నుతే
విజ్ఞాయామృత మశ్నుతే ..

ప్రాణం ఈశ్వరునుండి ఉద్భవించి అయిదు విభాగాలుగా మారి శరీరములో ఆయాస్థానాలలో ఉంటూ ఇంద్రియాలచే ఆయా పనులు చేయిస్తూఉండే యీప్రాణతత్త్వాన్ని సరిగాతెలుసుకున్న బుద్ధిమంతుడు దేవత్వాన్ని పొందుతాడు.

ఇది తృతీయ ప్రశ్నము

## చతుర్థ ప్రశ్నము

అథైనం సౌర్యాయణీ గార్గ్యః పప్రచ్ఛ
భగవన్ ! ఏతస్మిన్ పురుషే కాని స్వపంతి?
కాన్యస్మిన్ జాగ్రతి? కతర ఏష దేవ
స్స్వప్నాన్ పశ్యతి? కస్యైతత్సు ఖం భవతి?
కస్మిన్ను సర్వే సంప్రతిష్ఠితా భవంతీతి...

తరువాత గార్గ్యుడు అనే ముని పిప్పలాదుణ్ణి ఇలాగడిగాడు.

భగవన్, ఈ శరీరములో నిద్రించి ఉండేవి ఏవి? మేల్కొని ఉండేవి ఏవి? కలలు కనేది ఎవరు? సుఖం అనుభవించేది ఎవరు? అన్ని పదార్థాలూ ఎవనియందు సుస్థిరంగా ఉంటున్నవి?

2

తస్మై స హోవాచ యథా:
గార్గ్య! మరీచయోఽర్కస్యాస్తం గచ్ఛతః సర్వా
ఏతస్మిన్ తేజోమండల ఏకీభవంతి.
తాః పునఃపునరుదయతః ప్రచరంత్యేవం
హ వై తత్సర్వం పరే దేవే మన స్యేకీభవతి.
తేన తర్హ్యేవ పురుషో న శృణోతి
న పశ్యతి, న జిఘ్రతి, న రసయతే
న స్పృశతే నాభివదతే, నాదత్తే నానందయతే,
న విసృజతే. నేయాయతే, స్వపితీ త్యాచక్షతే.

గార్గ్యుని ప్రశ్నలకు పిప్పలాదుడిలా సమాధానం చెప్పాడు.

గార్గ్యా! సూర్యుడు అస్తమించగానే కిరణాలన్నీ ఆ తేజశ్చక్రములోనే లీనమై, ఉదయించగానే అవి వెలుపలకు వచ్చి వెలుగుతాయి. అలాగే జ్ఞానేంద్రియాలూ, కర్మేంద్రియాలున్నూ, అన్నిటికి పైనచెప్పబడిన మనసునందు చేరిపోతాయి. అంటే ఆ సమయములో మనస్సు తమోగుణంతో సంబంధం కలదై ఉంటుందని అర్థం. ఆ అవస్థలో పురుషుడు వినడు, కనడు, మూచూడడు (వాసనచూడడు), రుచిచూడడు, స్పృశించడు, మాటాడడు, చేతులతో దేనినీ తీసుకోలేడు, ఏ సుఖం అనుభవించలేడు, మలమూత్ర విసర్జన చెయ్యలేడు. అడుగు తీసి అడుగు వెయ్యలేడు.

ఈ అవస్థనే నిద్రిస్తున్నాడని చెప్పవలసి ఉంది. (తామసగుణ ప్రభావం అజ్ఞానం. అది నిద్రావస్థ. ఆ అవస్థలో ఏ ఇంద్రియాలూ పనిచెయ్యవు.)

3

ప్రాణాగ్నయ ఏవైతస్మిన్పురే జాగ్రతి
గార్హపత్యోహ వా ఏషోఽపానో వ్యానోఽ
న్వాహార్యపచనో యద్గార్హపత్యాత్ప్రణీయతే
ప్రణయనా దాహవనీయః ప్రాణః

ఈ శరీరమునందు మేల్కొని ఉండేవి ప్రాణములనే అగ్నులే. మూలాధారమునకు క్రిందనున్న ప్రాణం అపానం-అదే గార్హపత్యం అనే అగ్ని. దానినుంచి ఉత్పన్నమయేది 'వ్యానం'-అదే దక్షిణాగ్ని ఆగార్హ పత్యాగ్నినుంచి పై అంతశ్శరీర భాగానికి వ్యాపించేది ఆహవనీయం.

(అగ్ని వైదికకర్మలకు లౌకికకర్మలకున్నూ ఉపయోగిస్తూ ఉంటుంది.

వైదిక సంప్రదాయం ప్రకారం గృహపతి (ఇంటి పెద్ద) అగ్నికార్యం చెయ్యాలి. దానికి ప్రత్యేకించి ఇంటిలో ఒకభాగం వేరుగా ఏర్పరచుకోవాలి. దానికే అగ్నిహోత్ర గృహం అని వ్యవహారం.

ఈ సమాధానములో ప్రాణస్థితిని చెప్తున్నాడు. ఒకటే ప్రాణం. తాను శరీరములో సాగించే వ్యాపారాన్ని బట్టి అన్ని విధా

లుగా మారి ప్రత్యేక నామములు కలదై ఉంటుంది.

అపానం నుంచి శరీరములో పై భాగాలకు వ్యాపించి ముక్కు మొదలైన ఇంద్రియాలకు ప్రాణం పని కల్పిస్తుంది.

అంతశ్శరీరములో కుడివైపునుంచి వచ్చి తరువాత అంతటా తిరుగుతూ అంతశ్శరీరాన్ని సమర్థంగా ఉంచేది వ్యానం అనే ప్రాణమే.

ఈ విధంగా ప్రాణం మూడగ్నులను పోలి ఈ శరీరములో ఉండి జీవితాన్ని నడుపుతూ ఉంటుంది.)

4

యదుచ్ఛ్వాస నిశ్వాసా వేతావాహుతీ సమం నయ
తీతి స సమానః, మనో హ వావ యజమాన
ఇష్టఫల మేవోదానః స ఏనం యజమానమహ
రహర్బ్రహ్మ గమయతి.

ప్రాణరూపాంతరం సమానం అనేది ఒకటి. ఉచ్ఛ్వాసనిశ్వాసాలను సమాన కాల పరిమాణములో నడుపుతూ ఉంటుంది. కనుక దానికి 'సమానం' అని పేరు. అది నాభియందుంటుంది.

మనస్సే (జీవాత్మయే) యజమానుడు. ఇష్టఫలమే 'ఉదానం' అనే ప్రాణం. ఆ ఉదానం యీ మనస్సును నిత్యమూ బ్రహ్మస్థానానికి చేర్చుతూ ఉంటుంది.

(బ్రహ్మ పదార్థాన్ని తెలుసుకోడానికి మనోనిష్ఠ ప్రధానం. మనస్సును స్థిరంగా ఉంచాలంటే ఉచ్ఛ్వాసనిశ్వాసాలు వశంలో ఉండాలి. వాటిని అదుపులో ఉంచేది సమానం అనే ప్రాణం. జీవాత్మ బ్రహ్మస్థానాన్ని పొందడం అనే ఫలం కోసం చేసే ప్రాణాయామమే యజ్ఞం. ఆయజ్ఞానికిప్రధానాహుతులు ఉచ్ఛ్వాసనిశ్వాసాలు. ఉచ్ఛ్వాసనిశ్వాసాలు మనస్సు స్వాధీనంలో ఉంటే సమాధి అనే అవస్థ సఫలం అవుతుంది. అదే ఉదానం చేసే పని.

జీవాత్మ సమాన సహాయంతో ఉచ్ఛ్వాసనిశ్వాసాలను వశపరచుకుని నిశ్చలం బ్రహ్మదర్శనం కోసం యోగస్థుడౌతాడు. ఆవిధంగా బ్రహ్మసాక్షాత్కారం అవుతుంది అని సారం.)

5

అత్రైష దేవః స్వప్నే మహిమానమనుభవతి,
యద్దృష్టం దృష్టమ్ అనుపశ్యతి, శ్రుతం శ్రుత
మేవార్థమను శృణోతి, దేశదిగంతరైశ్చ ప్రత్య
నుభూతం పునః పునః ప్రత్యనుభవతి,
దృష్టం చాదృష్టం చ, శ్రుతం చాశ్రుతం చ,
అనుభూతం చాననుభూతం చ సచ్చాసచ్చ
సర్వం పశ్యతి, సర్వః పశ్యతి.

స్వప్నమునందు జీవాత్మ ఒక విధమైన మహిమను అనుభవిస్తూ ఉంటాడు.

మేల్కొని ఉన్నపుడు కన్నులతో చూచిన దానినే స్వప్నములో చూస్తాడు. చెవులతోవినినదానినే స్వప్నములో వింటాడు దేశములో దిగ్భాగాలలో ప్రత్యేకించి అనుభవించిన దానినే మరి మరి అనుభవిస్తూ ఉంటాడు.

ఈ జన్మలో చూచిన దానినే కాక వెనక జన్మలో చూచిన దానిని, అలాగే వినిన దానిని, అనుభవించిన దానిని ఉన్న దానిని ఈ జన్మలో కలిగే స్వప్నములో చూడడం వినడం, అనుభవించడం, అదే ఇది అని తెలుసుకోడం అనే లక్షణాలతో జీవుడు ఉంటాడు. అదే విధంగా జీవాత్మ ఉన్న ప్రాణికోటి అంతా స్వప్నములో చూడడం జరుగుతూ ఉంటుంది.



(శరీరం నశించిపోయేది. మనస్సు నశించిన శరీరములోంచి ఇంకో శరీరంలోకి సంక్రమిస్తుంది. ఆ మనస్సుకి 'మరుపు' అనేది ఉండదు. స్మృతినిత్యము దీని సంబంధంవల్ల మనస్సు రెండో జన్మలో పూర్వజ్ఞాన శక్తివల్ల ఆనాటి అనుభవాలను చెప్తూఉంటుంది. ఆ స్మరణ రెండో జన్మలో అయిదేండ్ల వరకు, కొందరికి పన్నెండేళ్ళ వరకు ఉంటుంది. ఈలాటి స్మృతి ఆధారం చేసుకునే కొందరు శరీరులు పూర్వజన్మ విషయానుభవాలు వెల్లడిస్తూ ఉంటారు. ఈలాటి మహిమతో జీవాత్మ ఈ శరీరములో మనస్సునూ, ఇంద్రియాలనూ నడుపుతూ ఉంటుంది.)

6

స యదా తేజసాభిభూతో భవతి అత్రైష దేవః
స్వప్నాన్న పశ్యత్యథ తదైతస్మిన్ శరీర ఏతత్
సుఖం భవతి.

జీవాత్మ గాఢనిద్రకు సంబంధించిన అవస్థ (సుషుప్తి) యందు పడగానే ఇక ఏలాటి కలలున్నూ కనడు. అప్పుడు యీ శరీరమందే బ్రహ్మానందం అనుభవిస్తాడు.

(తెలివికి-గాఢనిద్రకీ సంధిలోనే స్వప్నాలు వస్తాయి. అదే కలతనిద్ర. గాఢనిద్రకే 'సుషుప్తి' అని వ్యవహారం. ఆ అవస్థలో జీవునకు బ్రహ్మపదార్థమందు కలిసే స్థితి (అమృతస్థితి) కలుగుతుంది. అంతకన్నా పొందవలసే ఆనందం, సుఖం ఇంకేముంటుంది? ....అయితే ఆ సుఖం అనుభవించి జీవుడు తిరిగి జాగ్రదవస్థలోకి రాగానే ఇంద్రియ వ్యాపార ధోరణిలో పడి ఆత్మానందానుభవం మరిచిపోతాడు. ఈ మరపే లౌకికమైన అజ్ఞానం.

7

స యథా సోమ్య వయాంసి
వాసోవృక్షం సంప్రతి
తిష్ఠంతే, ఏవం హ వై తత్సర్వం
పర ఆత్మని సంప్రతిష్ఠతే

ఓ సౌమ్యుడా! రాత్రి సమయమందు పక్షులు తమ నివాసస్థానమైన చెట్టునందఙగి ఉన్నట్టే సజీవ నిర్జీవ పదార్థమంతా పరమాత్మయందే నిల్చి ఉంటుంది.

(సృష్టి స్థితికి పరమాత్మయే ఆధారం)

(40 వ పేజీలో)



# శ్రీనివాసకల్యాణము



(గతసంచిక తరువాయి)

(సామరాగం—ఆదితాళం)

ఈ యుపకారము చేయగదయ్యా
ఈ యగచాట్లపుడిటు లుండవయ్యా ॥ ఈయుప ॥

కలివచ్చినపై కలుగు సకల మీ
మలపై విడియుంగలదు వైకుంఠమె ॥ ఈయుప ॥

అపుడు నరులను నీ కొండకాకర్షించి, ముందుగా నీకు పంచామృతస్నానం, నిత్యనైవేద్యం కల్పిస్తాను. నీ పుష్కరిణీలోనే ముందుగా అందరూ స్నానంచేస్తారు.

సూత్ర: అవునవును కలిమికావాలంటే ఎవరికైనా కలికాలమే రావాలి.

కథక: భూవరాహస్వామి ప్రసన్నుండై, హరికి నూరడుగుల మేరకొలిచి యిచ్చి, తత్పరిచర్యకై వకుళమాలిక అనే భక్తురాలిని నియమించి నంతట.

సూత్ర: అవును, హరియేమిటి, కిరియేమిటి, వారూవారూ ఒకటే కనక చివరకు రాజీపడ్డారు. బాగానేవుంది కాని, ఈ వకుళమాలిక ఎవరుబాబూ?

కథక: పూర్వం యశోదాదేవి కృష్ణభగవానుణ్ణి పెంచింది కాదండీ కొంతకాలం. ఆ మమకారం తీరక హరి పరిచర్యకై కనిపెట్టుకొని ఉండి, ఈ రూపంతో చక్కా వచ్చింది. ఆ నాడంటే ఆ తల్లిని నానా అగచాట్లు పెట్టాడు గాని ఇప్పుడేముంది పాపం! తప్పిపోయిన కుర్రాడిలా తిరుగుతున్నాడాయె-పైగా తలమీద పెద్ద పుండాయెను.

సీ. ఆ నాడు వ్రేపల్లెలోన లీలాబాలు
డైన కృష్ణమ్మతో నా యశోద
వేగలేవాయె, నేడీ గుట్టలంబడి
గతిమాలి యిట్లు ప్రాకృతునివోలె
తిరిగెడి హరి చేరదీసి, నెయ్యమ్మార
తలపుండు గడిగి, మందులును మాకు
లిడి, పుట్టతేనియ వడిచి శ్యామాకాన్న
మువగల్పి తిన్పించు బుజ్జగించి
అనుదిన మ్మొలలార్చు, నాయన్న శ్రీని
వాస! రావోయి యంచు నావకుళమాల
పెరిమె మీరగ తలదువ్వి విరుల గ్రువ్వి
పెండ్లికొడుకట్లు గోముగా పెంచుకొనియె.







సూత్ర: ఆహాహా! ఏనాటి అనుబంధాలండీ యివి!

కథక: మీకింకోమాట చెప్పమరిచాను-ఇన్నాళ్లు హరి ఉంటూ వచ్చిన ఆ పుట్ట వున్నదే; అది కౌసల్యాదేవకీ దేవుల గర్భ వాసం సుమండీ! ఆపుట్టపై సేదలారే చింతచెట్టే దశరథ వసుదేవుల చల్లని బాహుబంధం, మీరు విన్నారోలేదో?

సూత్ర: కావచ్చు శ్రీహరిదంతా చిత్రచరిత్ర. ఇంతకు మనకథ లోకి రండి. వకుళమాలిక పోషణతో శ్రీనివాసమూర్తి పుంజుకొన్న తరవాత ఏమయింది?

కథక: స్వామివారిలా కోలుకొనేలోపల అచట తొండమండలంలో నారాయణవనం పాలించే ఆకాశరాజు ఇంట్లో లక్ష్మీ అమ్మవారు అవతరించారు.

సూత్ర: అట్టెట్టెట్టె....ఎంత గంతువేసేవంటేనూ! ఆకాశరాజేమిటి; కొల్లాపురంలో ఉండే లక్ష్మీదేవి ఆయనింట్లో అవతరించట మేమిటి! కథంతా కొత్తపుంత పట్టిస్తున్నావు.

కథక: తమరు పెద్దలు-ఇందులో కొత్త యేమున్నదండి? నారాయణమూర్తి భూమిపై అవతరించినప్పుడల్లా లక్ష్మీ అమ్మవారు అవతరిస్తూ వుంటుంది కాదండీ. ఆ నాడు జనకమహారాజింట్లో పుట్టింది.

సూత్ర: అయితే ఈ ఆకాశరాజెవరు?

కథక: పూర్వం కాళహస్తిలో మాధవుడనే బ్రాహ్మణుడుండే వాడు.అతడొక మతంగ కన్యను పెండ్లాడి కులభ్రష్టుడై తుదకీ వెంకటాద్రిని దర్శించి పావరహితుడైనాడు. అతడే సుధర్ముడనే రాజుకు ఆకాశరాజనే పేర జన్మించాడు.

సూత్ర: ఆకాశరాజనే పేరు బాగుంది సుమా. అమ్మవారు పూర్వం సముద్రుడికి భూమికి పుట్టింది. ఇప్పుడాకాశానికే పుట్టింది.

కథక: ఆకాశరాజు కామె దొరికిందేగాని పుట్టలేదు సుమండీ. ఆ తల్లి అయోనిజ కాదటండీ-

సూత్ర: ఎట్లా ఎట్లా! దొరికింది-

కథక: మరే—

ఆ నరపాలకుండనపత్యు డగుచు
పూనెను కావింప పుత్రకామేష్టి
జన్నమ్ముకై భూమి దున్ను చుండగను
పున్నెమ్ము పంటయై పొడమెనొక కన్నె
ఆ కన్నియంగాంచి ఆకాశరాజు
ఆకాశమందె హర్షాతిరేకమున
పద్మమందుదయించి పద్మాయతాక్షి
పద్మావతి సమాఖ్య పడసి వర్ధిల్లె
పిమ్మట ఆ రాజుకు వసుధానుడనే కొడుకు పుట్టేడు.

సూత్ర: ఒకటేమిటి, లక్ష్మీ అమ్మవారే ఇంటికి నడిచివస్తే లోప మేముంటుంది?

కథక: లలితగాత్రము నేత్రజిత శతపత్రమాచెలి........

సూత్ర: ఆగు ఆగు-పద్మావతీదేవిని వర్ణిస్తున్నావా ఏమిటి కొంపతీసి. సాక్షాత్తూ లక్ష్మీదేవి అన్నావు చాలదటయ్యా కథలోకిరా—

కథక: చిత్తం-శ్రీనివాసమూర్తి ఒక్కదినమ్మున వేటకై బయలుదేరెనట-ఎటువలెను-

సీ. దాసాని పూవన్నె తళుకుపుట్టము కుచ్చె
లిరవొంద వెనుకకు విరిచికట్టి
గలుగల్లు రనెడి గజ్జెలతోడ నీలి చ
ల్లడమూని, వెండిబిళ్లల హారంగు
మొలనూలులోన పచ్చలపిడిబాకు గీ
లించి, ఊదావన్నె కంచుకమ్ము
తాలిచి, తలచుట్టు నీలికోక ధరించి
నెమలి యీక తురాయి నీటుగులుక

దంతపుంగుండలమ్ములు, దండకడెము
నొసట కస్తూరితిలక మింపెసగ, నిలివె
డెత్తుభల్లమ్ము చేబూని, గిత్తకనుల
శ్రీనివాసుడు బోయవేసాన వెడలె.

(రామప్రియ—ఖండగతి)

హరివెడలె వేటకై తురగమెక్కి సవారి
శరచాపములు దాల్చి గిరులచరియదారి ॥ హరి ॥

గిరిసానువుల తురగఖరహతులతకత్రకల
మురజములు మ్రోగ ధాతురజమ్ము రేగగా ॥ హరి ॥

తూపు తూపునను ఘాతుక మృగమ్ములుకూల
చాపటాంకృతి బెదరి చదలపులుగులుతేల ॥ హరి ॥

ఇట్లొక అడవియేనుగు వెంటదగిలి, నారాయణవన పురోపకంఠమ్మున, పద్మావతీదేవి తన చెలికత్తెలతో విహరించు ఉపవనమ్ము చెంత ఆమదపుటేనుగు శ్రీనివాసాభిముఖమ్ముగా మరలి, తొండమెత్తి నమస్కరించి అంతర్ధానము చెందుటయు.

సూత్ర: అవును, స్వామివారిని అమ్మవారిచెంత చేర్చింది; మాయమయింది. బాగుందయ్యా బాగుంది-తరువాత?

(40 వ పేజీలో)

### రామాయణంలో

# సంగీత నృత్యాలు

— శ్రీ ముట్నూరి సంగమేశం

ఆదికావ్యమైన వాల్మీకి రామాయణంలో ఆనాటి భారతీయ సభ్యతా సంస్కృతులు అన్ని కోణాలనుంచి అద్దంపట్టి చూపినట్లు వర్ణించబడ్డాయి. సమస్త భారతీయ విజ్ఞానానికి మూలాధారమైన వేదమే, రామావతారకాలంలో వాల్మీకి మహర్షిచే రామాయణ రూపంలో సంతరించబడిందని చెప్తారు. అందుకు తగినట్లుగానే వేదవిద్యా నిష్ణాతులైన కుశలవులకే ఆమహర్షి తన రామాయణకృతిని వేదోపబృంహణార్థం అందించి ప్రచారానికి తెచ్చాడని కావ్యావతరణికలో స్పష్టంచేయబడింది. కుశలవరూపులైన కుశలవు లాకావ్యాన్ని మొదట మునిజనాశ్రమాల్లోను, ఆ పిదప నగర వీథుల్లోను, చివరకు శ్రీరాముని సభాస్థానంలోను మధురంగా పాడి వినిపించారు. ఇలా ఈ కావ్యం సంగీతం తోనే శ్రీకారం చుట్టి సంగీతమయంగానే ప్రచారంలోకి వచ్చింది. కావ్యరచనలో ఇమిడిన సంగీత తత్త్వాన్ని. గంధర్వరూపులు గాంధర్వ తత్త్వజ్ఞులు అయిన కుశలవుల గానకళా కౌశల్యాన్ని గ్రంథావతరణికలోని యీక్రింది వాక్యాలు విస్పష్టంగా వివరిస్తాయి.

"పాఠ్యేగేయేచమధురం ప్రమాణై స్త్రిభిరన్వితం
జాతిభిః సప్తభిర్యుక్తం తంత్రీలయసమన్వితం
రసైః శృంగార కరుణ హాస్యరౌద్ర భయానకైః,
వీరాదిభిర సైర్యుక్తం కావ్యమేతదగాయతామ్",
తౌతు గాంధర్వతత్త్వజ్ఞౌ స్థానమూర్ఛన కోవిదౌ
భ్రాతరౌ స్వరసంపన్నౌ గంధర్వావివ రూపిణౌ"

ఈ వాక్యాలు రామాయణాన్ని వేద త్రయివలె పాఠ్యము గేయమూ శ్రవో మధురమూ అని నిరూపిస్తాయి. ప్రధానమైన జాతి (రాగ) సప్తకంతో తంత్రీలయ సమన్వితంగా, రసోదంచితంగా, స్థాన మూర్ఛనాదులెగిరి, స్వరసంపన్నత వెల్లడిస్తూ కుశలవులు దీన్ని గానంచేశారని చెప్పడంతో సంగీత కృతులకి, వాటిని పాడి వినిపించే గాయకులకి కావలసిన సమస్త లక్ష్యలక్షణ సంపద శారీరిక ధర్మాలు ఆనాటికే పరాకాష్ఠకు చెందిన ప్రమాణాలతో ఉండేవని బోధపడుతూంది. కుశలవులు గాంధర్వరూపులు, కుశీలవ వేషధారులు అని వర్ణింపబడ్డారు. శ్రుతి, లయ, రాగం, సంగతి, తానం, స్వరం వంటి సమస్తమైన లక్షణాలు తెలిసి, రసోదంచితమై సుమధురమైన గేయకావ్యాన్ని అందిపుచ్చుకొని, అవసరానుకూలంగా దాన్నే పాఠ్యంగా వినిపించి ప్రవచిస్తూ, వారీ కావ్యాన్ని మునిజనాశ్రమాల్లో పాడి ప్రశంసలందు కొన్నారని,

"సాధుసాధ్వితి తావూచుః పరం విస్మయమాగతాః,
తే ప్రీతిమనసః సర్వే మునయో ధర్మవత్సలాః
ప్రశంశసుః ప్రశస్తవ్యౌ గాయమానౌ కుశలవౌ"

అని చెప్పిన వాక్యాలవల్ల స్పష్టమౌతూంది. కాగా ఈనాటి దాసరి పదాలు, బుర్రకథలు వంటి ప్రక్రియలానాడు మరింత ఉదాత్తమైన శైలిలో ప్రచారంలో ఉండేవని తెలుస్తూంది.



అయితే యీ సందర్భంలో నృత్యాభినయాలెలా ఉన్నవో వెల్లడికాలేదు. కాని అయోధ్యాపుర వర్ణనంలో నృత్య వాద్య గీత నాటకాదులన్ని అత్యుచ్ఛ దశలో ఉన్నట్లు చెప్పబడింది.

"వధూనాటక సంఘైశ్చ సంయుక్తాం సర్వతః పురీమ్"
"దుందుభీభి ర్మృదంగైశ్చ వీణాభిః పణవైస్తథా.
నాదితాం భృశమత్యర్థం పృథివ్యాం తామనుత్తమామ్"

వీణా పణవ మృదంగ దుందుభి నిస్వన భరితమైన ఆ పట్టణంలో అనేక నాటక సంఘాలు, అందులోను స్త్రీలతో కూడిన నాటక సమాజాలు ఉండేవంటే ఆ కళల

ఔన్నత్యాన్ని వేరేచెప్పనక్కరలేదు. వసిష్ఠుడు పంపిన వర్తమానాన్ననుసరించి మేనమామ యింటినుంచి బయలుదేరి హుటాహుటిగా అయోధ్యా నగరానికి వస్తూన్న భరతుడు నగర సమీపానికి వచ్చినపుడు అక్కడ ఎప్పిధమైన గీత వాద్య ఘోషలు వినబడక పోయేసరికి ఆశ్చర్య పోతాడు.

"భేరి మృదంగ వీణానాంకోణ సంఘట్టితః పునః
కి మద్య శబ్దోవిరతః ''

నిత్యోత్సవాలలో విధేయంగా ఆచరించే నృత్యగానాలతోను, వచ్చిపోయే భక్తదర్శకులతోను కోలాహలంగా ఉండే దేవాలయాలన్నీ నిర్మానుష్యంగా నిశ్శబ్దంగా ఉన్నాయట.

"దేవాగారాణి శూన్యాని నభాంతీహ యథాపురా"

ఇవన్నీ ఆనాటి సమాజంలో నృత్యగీతాలకున్న స్థానాన్ని తెలియజేస్తున్నాయి. ఈ కళలలో ఆరితేరినవారిని అవసరోచితంగా సన్మానించడం సందర్భానుసారంగా వారి నేర్పును వినియోగించుకోవడంకూడ ఉండేవని తెలుస్తూంది. ఋష్యశృంగుణ్ణి రావించడానికి రోమపాదుడు వేశ్యాజనాన్ని సబహుమానంగా నియోగిస్తాడు. వారు సమయోచితమైన వేషభాషలు ధరించి ఆడుతూ పాడుతూ వెళ్ళి ఆ ఋషిని ఆకర్షించి నగరానికి తీసుకొని వస్తారు.

రాజాంతఃపురాల్లోను, సంపన్నులైన వారి యిళ్ళలోను ఎల్లప్పుడూ సంతోషసూచకంగా సంగీత నృత్యాలు జరుగుతూ ఉండేవనీ ఉల్లాసోత్సాహాలను వ్యక్తం చేయడానికి నాట్యగానాలు అనూచానంగా ఉపయోగపడుతున్నాయనీ తెలియడానికి కిష్కింధాపట్టణాన్ని వర్ణించే సందర్భంలోను, కుశనాభుని కుమార్తెల కథలోను వ్రాసిన వాక్యాలు తోడ్పడతాయి. సీతాన్వేషణార్థం వానరసేనతో కలిసి రావలసిన సుగ్రీవుడు ఎంతకూ రాకపోయేసరికి శ్రీరాముని పంపున లక్ష్మణుడు కిష్కింధకు వెళ్తాడు అక్కడ అతనికి నిరంతరాయంగా సాగుతున్న సంగీత సమారోహ మెదురవుతుంది.

"ప్రపిబన్నేవ సతతం శుశ్రావ మధురస్వనం
తంత్రీగీత సమాకీర్ణం సమతాళ పదాక్షరమ్ ''

అని వ్రాసిన దానిని బట్టి వానరుల్లో కూడ సుమధురంగా కంఠమెత్తిపాడేవారూ వీణాదికాన్ని వాయించేవారూ, తాలలయాదికాన్ని సమంగా ఛందోనుకూలంగా నిర్వహించే విద్వాంసులు ఉండేవారని తెలుస్తూంది. హనుమంతుడు గొప్ప సంగీతవేత్తగా ప్రసిద్ధుడు. హనుమద్భరతమనేది కూడ భరతశాస్త్రజ్ఞు లెరిగినదే.

కుశనాభుని కుమార్తెలు నూరుమంది. రూపయౌవన సంపన్నలైన యీ కన్యలొకసారి ఉద్యాన విహారానికివెళ్ళి మహోల్లాసంతో నృత్యగానాలు, వాద్యవిలాసాలు నెరపి ఆనందింపసాగారు.

"గాయంత్యో నృత్యమానాశ్చ
వాదయంత్యస్తు రాఘవ
ఆమోదంపరమం జగ్ముః
వ్వరాభరణ భూషితాః"

యువతులు, అందకత్తెలు, ఆభరణాలంకృతలు, ఒళ్ళెరుగని ఆనందతన్మయత్వంతో ఆడిపాడి విహరిస్తూన్న ఆ కన్యలనుచూచి వాయుదేవుడికే మతి చలించిందని విశ్వామిత్రుడు రామలక్ష్మణులతో చెప్తాడు. స్వతఃసిద్ధమైన సౌందర్యాకర్షణకు సంగీతం మరింత సహకరిస్తుందని చెప్పకచెప్పినట్లున్న సత్యమిది.

సంగీత నృత్యాలు తామానందించడానికే కాదు, వేరొకరిని ఆనందింప జేయడానికి కూడ వినియోగపడేవి. అతిథి అభ్యాగతుల్ని ఆదరించి చేసి చూపే మర్యాదలలో నృత్యగీతాదిక ప్రదర్శనాలు ఏర్పాటుచేసే పద్ధతి అప్పటికే సర్వత్రా ఆచరణలో ఉండేదనే విషయం భరతశత్రుఘ్నులకు వారి సైన్యానికి ఆతిథ్యమిస్తూ భరద్వాజుడుచేసిన యేర్పాట్లు వేనోళ్ళవెల్లడిస్తాయి. అతడు మహర్షి. తపోధనుడు, అతని సంకల్పం అమోఘం. అతడు తలచినదే తడవుగా నారదుడు తుంబురుడు అలంబుసాది అప్సరసలు వగైరా దేవ గంధర్వులందరూ వీణాపణవాదులతో వేలకొలదీ వచ్చి తమ నృత్యగాన లయవిన్యాస వాద్య విశేషాలతో భరతాదుల్ని ఆనందింప జేశారు.

సంగీత రసానందం బ్రహ్మానంద సహోదరమనే విషయం మాండకర్ణి వృత్తాంతంలో విదితమౌతుంది. సీతారామలక్ష్మణులు అరణ్యంలో సంచరిస్తూ ఆయా మునీశ్వరుల ఆశ్రమాల్లో విహరిస్తూ తిరుగుతూన్న సందర్భంలో ఒకనాడు వారికి ఒక సరోవరం సమీపంలో నృత్యగానాల ధ్వని వినిపిస్తుంది కాని ఆ ప్రాంతంలో ఎవరూ కనబడరు. తర్వాత వారి ఆశ్చర్యకరమైన విషయాన్ని గురించి అడిగినప్పుడు ధర్మభృతి అనే ముని వారికి మాండకర్ణి కథ వినిపిస్తాడు.

మాండకర్ణి మహాతపస్వి. అతడు తన తపః ప్రభావంచేత పంచశిరమనే పేరున ఆసరోవరాన్ని కల్పించాడు. అందులో మునిగి అతడు ఘోరంగా తపస్సు చేస్తూ ఉంటే దేవతలు భయపడి ఆతని తపస్సును భంగపరచాలని యత్నించి అయిదుగురు అప్సరసలను అతని వద్దకు పంపేరు. వారి ప్రయత్నం ఫలించింది. అతడు తపస్సు మాని, ఆతటాకంలోనే ఒక భవనం నిర్మించి అందులో హాయిగా వారితో విహరింపసాగాడు. మీ రిపుడు విన్న సంగీత వాద్య ధ్వనులు ఆ అప్సరసలవే. ఆ మునీశ్వరుడదే లోకంగా వారితో కాలం గడుపుతున్నాడు. అని చెప్పాడు.

ఈ సందర్భంలో

'తాసాం సంక్రీడమానానామేషవాదిత్ర నిస్వనః
శ్రూయతే భూషణోన్మిశ్రో గీతశబ్దోమనోహరః॥

అనే వాక్యంవల్ల అక్కడ నృత్యగానాలు రెండూ ముమ్మరంగా జరుగుతూన్నట్లు తెలుస్తూంది.

రావణాంతఃపుర పరివారంలో ఇలా నృత్య గానాలతో రాజును మెప్పించి మైమరపించేటంతగా ఆనందింపజేసే నృత్యగాన కళాకుశలలైన సుందరు లెందరో ఉండే

(36వ పేజీలో)

# తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణలు

## తెలుగు

ఆర్షధర్మ వైశిష్ట్యాన్ని వివరించే క్రింది గ్రంథాలను పాఠకులకు అందుబాటు ధరలతో తిరుమల తిరుపతి దేవస్థాన ప్రచురణ విభాగం అందజేస్తున్నది.

| | | |
|---|---|---|
| ఆచారములు - ఆడంబరములు | శ్రీ కల్లూరి చంద్రమౌళి | 0_20 |
| ఆండాళ్ వైభవము | ,, | 0_20 |
| అహల్య | శ్రీ సాంప్రతి సురేంద్రనాథ్ | 0_50 |
| ఆళ్వారుల దివ్యవైభవము | శ్రీ డి. రాఘవయ్య | 2_50 |
| అన్నమాచార్యులవారి ఆధ్యాత్మ | స్వరరచన : | |
| శృంగారసంకీర్తనలు (స్వరసహితము) | శ్రీ మంచాళ జగన్నాథరావు | |
| సంపుటి 1 | | 35_00 |
| సంపుటి 2 | సంపాదకుడు : | 35_00 |
| సంపుటి 3 | శ్రీ వ్రాడేవు పురుషోత్తం | 35_00 |
| ఆర్షసంస్కృతి | శ్రీ కల్లూరి చంద్రమౌళి | 4_00 |
| అన్నమాచార్య సాహితీకౌముది | డా॥ ముట్నూరి సంగమేశం | 0_75 |
| అన్నమాచార్య చరితం. (హరికథ) | విద్వాన్ కనుములూరి శివరామయ్య | 1_50 |
| భక్తపురందరదాసు | శ్రీ ఎస్. బి. ఎస్. భట్టాచార్య | 0_50 |
| భగవత్ స్తోత్రరత్నమాల | | 1_00 |
| భగీరథుడు | కరుణశ్రీ | 0_50 |
| ధృవుడు | శ్రీ డి. నాగసిద్ధారెడ్డి | 0_50 |
| దాక్షాయణి | శ్రీ ఆర్వీఎస్ సుందరం | 0_50 |
| దయాశతకము | శ్రీ కోశియాలం శఠకోపాచార్యులు | 9_00 |
| కల్యాణసంస్కృతి | డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్య | 1_75 |
| కోదండరామ సుప్రభాతం | డా॥ ఎస్. బి. రఘునాథాచార్య | 0_50 |
| ఉషశ్రీ భారతం | | |
| 1వ భాగము | ఉషశ్రీ | 4_00 |
| 2వ భాగము | ,, | 5_00 |
| భారతీయ తత్త్వశాస్త్రము | డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ గ్రంథానికి శ్రీ బులుసు వేంకటేశ్వర్లు అనువాదం | 5_00 |
| హనుమంతుడు | డా॥ ప్రసాదరాయకులపతి | 0_50 |
| మదాలస | శ్రీ సముద్రాల లక్ష్మణయ్య | 0_50 |
| మన సమస్యలకు భగవద్గీత పరిష్కారములు | డా॥ ఎస్. బి. రఘునాథాచార్య | 1_25 |
| మన ఆలయముల చరిత్ర | శ్రీ గోపీకృష్ణ | 7_00 |
| మహర్షులచరిత్రలు | శ్రీ బులుసు వేంకటేశ్వర్లు | 3_50 |
| నమ్మాళ్వార్ | డా॥ పి. శౌరిరాజన్ | 0_50 |
| నాదయోగి త్యాగయ్య | శ్రీ తిరుమూరు సుధాకరరెడ్డి | 1_00 |
| పురుషసూక్తం | డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్య | 1_00 |
| పద్మావతీ శ్రీనివాసం | శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి | 0_20 |

| | | |
|---|---|---|
| పుష్కరవేణి | సంకలనం: డా॥ ఎస్. బి. రఘునాథాచార్య | 0_50 |
| ఋగ్వేదం 1 వ భాగము | శ్రీ నేమాని వెంకటరమణశాస్త్రి | 100_00 |
| 2 వ భాగము | | 100_00 |
| శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం | శ్రీ పి. బాలకృష్ణమూర్తి | 0_50 |
| శృంగార సంకీర్తనలు సంపుటం 22 | పరిష్కర్తలు: రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, గౌరిపెద్ది | 5_00 |
| ,, 23 | శ్రీ పి. టి. జగన్నాథరావు | 5_00 |
| ,, 24 | శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ | 5_00 |
| ,, 25 | ,, | 5_00 |
| ,, 26 | ,, | 5_00 |
| ,, 27 | ,, | 5_00 |
| ,, 28 | ,, | 5_00 |
| శ్రీరామచంద్రుడు | శ్రీ టి. నరసింహాచార్యులు | 1_00 |
| శ్రీ వేంకటేశ్వర శతకం | ముకుందదైవజ్ఞులు | 0_25 |
| స్తోత్రరత్నములు | | 2_00 |
| సువర్ణపుష్పమాల | డా॥ ఎస్. బి. రఘునాథాచార్య | 0_25 |
| శ్రీమద్భాగవత పురాణపరిశీలనము | శ్రీ డి. నాగసిద్ధారెడ్డి | 1_00 |
| శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యం (వచనం) | | 2_00 |
| ,, శ్లోకాలు 1 | | 5_00 |
| ,, శ్లోకాలు 2 | | 4_25 |
| శ్రీసూక్తం | డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్య | 0_70 |
| షోడశరామాయణ రహస్యాలు | శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ | 5_00 |
| శ్రీనివాస బాలభారతి కథామంజరి | | 4_00 |
| సుందరకాండ | ఉషశ్రీ | 4_25 |
| సావిత్రి | శ్రీ సముద్రాల లక్ష్మణయ్య | 0_50 |
| తత్త్వదీపిక | శ్రీ చిన్న శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామి | 0_75 |
| త్యాగరాజకీర్తనలు సంపుటి 1 | సంకలనం : | 35_00 |
| సంపుటి 2 | కళాప్రపూర్ణ శ్రీ మంచాల జగన్నాథరావు | 35_00 |
| సంపుటి 3 | ,, | 35_00 |
| సంపుటి 4 | ,, | 35_00 |
| వేదములు | శ్రీ కల్లూరి చంద్రమౌళి | 0_50 |
| వ్యాసరాయలు | శ్రీ సుదర్శనభట్టర్ | 0_50 |
| వైరాగ్యశతకం | శ్రీ ఏనుగు లక్ష్మణకవి | 0_20 |
| వేదకల్పతరువు | శ్రీ మహావాది వేంకటరత్నము | 5_00 |
| విష్ణుసహస్రనామం | ఆర్గస్ సెంట్రల్ ఎంటర్ ప్రైజెస్ | 1_00 |
| శ్రీ వేంకటేశ్వరస్వామి | ,, | 1_00 |
| బుద్ధిశాలిమంత్రికథలు | ,, | 1_00 |
| హరిశ్చంద్ర | ,, | 1_00 |
| తాళ్ళపాకకవుల కృతులు | డా॥ వేటూరి ఆనందమూర్తి | 30_00 |
| ,, పదకవితలు | ,, | 45_00 |
| వేంకటేశ్వర సహస్రనామ్ | శ్రీ యామిజాల పద్మనాభస్వామి | 3_00 |
| బాలకృష్ణుడు | అమరచిత్రకథా ప్రచురణలు | 2_00 |
| భగవద్గీత | ,, | 2_00 |
| కృష్ణుడు - నరకాసురుడు | ,, | 2_00 |

(48 వ పేజీలో)




**తిరుమల తిరుపతి దేవస్థానం వారి ప్రచురణగా వెలువడనున్న గోపీనాథ రామాయణం వాల్మీకి రామాయణానికి యథామూలకంగా వెలసిన తెలుగు రామాయణంగా ప్రసిద్ధి చెందింది - ఆ కావ్యకర్త శ్రీ గోపీనాథుని వెంకయ్యశాస్త్రిని గురించిన రచన ఇది. సం॥**

గోపీనాథుని వెంకయ్యశాస్త్రిగారి పేరు గుర్తుకు రాగానే గోపీనాథరామాయణం మన మనసులో మెదుల్తుంది. ఏకస్తుత్యం స్థానం వెంకటగిరి సంస్థానం స్ఫురణకు వస్తుంది. వెంకయ్యశాస్త్రిగారి పోషక ప్రభువు, మహామనీషి సర్వజ్ఞ కుమార యాచమనాయుడు స్మరణకు వస్తాడు.

క్రీస్తుశకం 1813 లో వెంకయ్యశాస్త్రి గారు జన్మించారు. దాదాపు ఆ శతాబ్ది మంతా జీవించారు. వెంకటగిరి సంస్థాన కవీశ్వరులుగా మన్ననలు పొంది మనుగడ కొనసాగించారు. సమకాలంలో పత్రికలూ, పండితులూ ఆయనను వెంకయ్య శాస్త్రి అనే వ్యవహరించారు. "మా ఆస్థాన కవీశ్వరులు గోపీనాథునివెంకయ్యశాస్త్రులు" అని సర్వజ్ఞ కుమార యాచేంద్రుడు అభిమానంగా పేర్కొన్నాడు. శాస్త్రి గారు స్వయంగా "గోపీనాథుని వెంకయ్య శాస్త్రులు" అని చేవ్రాలు చేసేవారు. ఇటీవలి కాలంలో పండితులూ, విమర్శకులూ ఆయనకు 'వెంకటకవి' అనే గ్రాంధిక నామం ప్రచారంలోకి తెచ్చారు. నెల్లూరుకు సమీపంలో, 30 మైళ్ళలో లక్ష్మీపురం అనే అగ్రహారం వుంది. అదే శాస్త్రిగారి స్వస్థలం. వెంకటగిరి సంస్థాన కవీశ్వరులయ్యాక గూడా ఆయన అక్కడే వుంటూ వచ్చారు. ఇప్పటికీ అక్కడి ప్రజలు వెంకయ్యశాస్త్రిని గూర్చి కథలుగా చెప్పుకుంటుంటారు.

వెంకయ్యశాస్త్రిగారికి ఆంధ్ర దేశంలో గొప్ప పేరుప్రతిష్ఠలనిచ్చింది ఆయన రామాయణానువాదమే. ఈ గ్రంథపీఠిక నుండి ఒకటి రెండు అంశాలు పేర్కొనదగ్గవి. నెల్లూరు పట్టణానికి సమీపంలోనే వున్న వేదగిరి నరసింహస్వామి తిరునాళ్ళలో ఒక తపస్వి కన్పించి, తనకు ఒక విద్యను అనుగ్రహించినట్లుగా ఆయన చెప్పుకొన్నారు. అప్పటినుండి ఆయనకు కవితాకళ కరతలామలకమైంది. శాస్త్రి గారు బాల్యంనుండీ పరమభక్తులు. ఒకసారి ఆయనకు శ్రీకృష్ణుడు కలలో కన్పించి జన్మచరితార్థం అయ్యేటట్లు తన అవతార కథ యేదైనా వ్రాసి తన కంకితమీయమని ఆనతిచ్చాడట! పైగా వాల్మీకి ప్రత్యక్షమై 'తన కణువౌసగిన తెలివిని' తన కిచ్చినట్లు ఆయన వ్రాసుకున్నారు. ఈ కథమాట ఎటున్నప్పటికీనా, గొప్ప భక్తిభావంతో ఆయన రామాయణ రచనకు పూనుకున్నట్లు నిశ్చయించవచ్చు.

ఒకమాటు వెలుగోటి కుమారయాచమ నాయుడు పెదపవని నుండి వెంకటగిరి వెళ్తూ దారిలో లక్ష్మీపురం వద్ద మజిలీ చేశాడు. వెంకయ్యశాస్త్రిగారి పేరుప్రసిద్ధి విని, ఆయనను పిలిపించుకొని, రామాయణానువాదంలోని కొన్ని భాగాలు విన్నాడు. శాస్త్రిగారి అనువాదం యథామూలంగా వుందనీ, దైవాంకితం అయిందనీ సంతోషించాడు.

క్రీస్తుశకం 1859, ఆగష్టు 13 వ తారీకున వెంకయ్యశాస్త్రిగారు వెంకటగిరిసంస్థానంలో పండిత సమక్షంలో తమ రామాయణాన్ని పఠించారు. ప్రభువు శాస్త్రిగారిని ఆస్థాన కవీశ్వరులుగా నియమించుకొన్నారు. మణులూ, మాన్యాలూ ఇచ్చారు. సమకాలికుల నుండి ఆధునిక పరిశోధకులవరకు శాస్త్రిగారి అనువాదాన్ని యథామూలమనే పేర్కొన్నారు. అంతేకాదు, శాస్త్రిగారి రామాయణం వెలుగోటి సర్వజ్ఞ కుమార యాచమనాయుడికి అంకితమైనట్లు వ్రాశారు ఇందులో నిజంలేదు.

వెంకయ్యశాస్త్రిగారి అనువాదం ఒక నిర్దిష్ట ప్రణాళికలోకి ఒదిగేదికాదు. ఆయన మూలానువాదంతో పాటు వ్యాఖ్యానువాదం చేశారు. రంగనాథ భాస్కర రామాయణాలను అనుసరించారు. స్వతంత్రంగా వర్ణనలు సమకూర్చారు. అవాల్మీకీయాలను ఆదరించారు. వ్యాఖ్యాకారుడి విశ్లేషణల్ని, అనుసరించి ఒకే శ్లోకానికి మూడు నాలుగు విధాలుగా అనువాదాలు చేశారు. సీతా కల్యాణం ఆర్షసంప్రదాయంలో మంత్ర ప్రధానంగా జరిగినట్లు మూలంలో వుంది. వధూవరుల మధ్య తెరలు పట్టడం, తలంబ్రాలు పోసుకోడం మొదలైన ఆంధ్రాచారాలను శాస్త్రిగారు చేర్చారు. సీతారాముల ప్రణయాన్ని ప్రాబంధికరీతిలో తీర్చారు. రాములవారి జన్మకాలం వాల్మీకి చెప్పలేదు. శాస్త్రిగారు రంగనాథ రామాయణం నుండి వుద్ధరించి తిథివారనక్షత్రాలను పేర్కొన్నారు.

తొలి ఐదుకాండల్లో అవాల్మీకాలకు తావివ్వని శాస్త్రిగారు యుద్ధకాండలో విశృంఖలంగా అమూలక కథలను చేర్చారు. శాస్త్రి

గారి కథలెందుకు ఆదరించారో బోధపడదు. రంగనాథ భాస్కర రామాయణాల్లోని ఈ ప్రసిద్ధగాథల్ని విస్మరిస్తే తన అనువాదానికి వన్నె కలుగదని ఆయనభావించారేమో? కాలనేమి వృత్తాంతం, భరతుడి స్వప్నం, శుక్రుడివద్ద రావణుడు శోకించడం, రావణుడు పాతాళహోమం చెయ్యడం, మొదలైన అవాల్మీకీయాలు శాస్త్రిగారిఅనువాదంలో కనుపడులుతాయి. ఈ కథలకు రంగనాథ రామాయణం నిధానం. ఐతే రంగనాథ భాస్కరరామాయణాల్లో వున్న ఈ కథలకు శాస్త్రిగారి అనువాదంలో చేరిన కథలకు వివరాల్లో తేడాలు కన్పిస్తున్నాయి. జంబుకుమార వృత్తాంతం, ఉడుతభక్తి, సులోచన వృత్తాంతం కథలు అమూలకాలైనా రసవంతమైనవి. వీటిని శాస్త్రిగారు ఎందువల్లనో అనువదించకుండా విడిచిపెట్టారు.

శాస్త్రిగారి రామాయణానువాదమంతా ఒక్కతీరుగా లేదు. గ్రంథారంభంలో వామనరూపంలో కన్పించే పద్యశిల్పం గ్రంథాంతానికి వచ్చేసరికి త్రివిక్రమరూపం ధరించింది. అందువల్లే తొలికాండలకంటే సుందరకాండ మొదలైనవి అధికంగా ఆస్వాదయోగ్యాలు. శాస్త్రిగారు ప్రాచీన సంస్కృతాంధ్ర కావ్యాలన్నీ మథించారు. పోతన పద్యరచనా శిల్పాన్నీ, ప్రబంధ కవుల వర్ణనా చమత్కృతినీ పుణికి పుచ్చుకున్నారు. ప్రబంధాలలోని మంచి మంచి పద్యాలకు ఛాయలనదగిన పద్యాలు ఆయన రచనలలో తరచుగా కన్పిస్తాయి. దుష్కర ప్రాసలతో, సుదీర్ఘ సమాసాలతో నిండిన పద్యాలూ, పంచపాది పద్యాలు ఈ రామాయణంలో దర్శనమిస్తాయి. ఆశ్వాసాంతాల్లో శ్లేష, బంధ కవిత్వాలు కన్పిస్తాయి. ఈ చిత్రబంధ కవితలమీది ప్రీతి ఆయన్ని వెన్నాడుతూనేవుండి మాఘాన్ని తెనిగించే దాకా విడిచిపెట్టలేదు. శాస్త్రిగారు మెచ్చింది ప్రాబంధిక శైలే అయినా కవిత్రయం వారి కవితారహస్యాలున్నూ, ఆయన ఆకళించుకొన్నారు. యుద్ధకాండలో మహాభారత శైలిని తలపించే ఘట్టాలూ, పద్యాలూ ఎదురవుతూనే వుంటాయి. శాస్త్రిగారి పద్యరచనాసౌందర్యమే ఆయన రామాయణానికి ఆధునిక రామాయణాలలో అగ్రస్థానం చేకూర్చింది. ఇప్పటికి ఐదు పర్యాయాలు అచ్చుపడడమే ఈ గ్రంథ ప్రామాణ్యానికి తిరుగులేని దాఖలా! ఇంతకూ వెంకయ్యశాస్త్రిగారు తమ అనువాదానికి శ్రీమద్రామాయణము అనే పేరు పెట్టారు. గోపీనాథరామాయణం అనేది వావిళ్ళవారు పెట్టినపేరు. ఆ పేరే ప్రచారంలోకి వచ్చింది.

వెంకటగిరి ఆస్థాన కవీశ్వరులుగా వెంకయ్యశాస్త్రిగారు నియమించబడడంతో అక్కడి పండితులలో అసూయలు చెలరేగాయట! రామాయణం శాస్త్రిగారు తెలిగించలేదనీ, ఆయనకు కవిత్వం చెప్పడం రాదనీ, వాళ్ళు ప్రభువుకు విన్నవించుకున్నారట! వెంకయ్యశాస్త్రిగారిని పరీక్షించేందుకు ప్రభువు బ్రహ్మవైవర్తపురాణంలోని కృష్ణజన్మఖండాన్ని ఆంధ్రీకరించమని ఆజ్ఞాపించారట! ఇది జనశ్రుతి. ఇందులోని వాస్తవం ఎట్లావున్నా ఆ ప్రభువు రాధాకృష్ణ భక్తుడు. బృందావనం నుండి స్వామిపాదుకలను తెచ్చి తన పూజామందిరంలో ప్రతిష్ఠించుకున్న కృష్ణదాసుడు రాధాకృష్ణభక్తి తత్త్వాన్ని ప్రచారం చెయ్యడానికి వెంకయ్యశాస్త్రిగారిచేత కృష్ణజన్మ ఖండాన్ని, చిలకపాటి రామానుజశర్మచేత బ్రహ్మ, ప్రకృతి, గణేశ ఖండాలనూ తెనిగింపచేశాడు. ఈ పుస్తకాలు రాధాకృష్ణ భక్తికి మూలకందాలు.



గోపీనాథుని వెంకయ్యశాస్త్రి

శాస్త్రిగారు ప్రసన్నమైన శైలిలో 'కార్తీక కౌముదీ రుచిరకావ్యం'గా 5000 గద్యపద్యాల్లో కృష్ణ జన్మ ఖండాన్ని తీర్చిదిద్దారు. ఈ అనువాదం యథాశ్లోకంగా నడిచింది. ఇందులోని ఉషాపరిణయం, రామాయణం, పార్వతీపరిణయం మొదలగు ఉపాఖ్యానాలు రసబంధురమైనవి. శాస్త్రిగారు కృష్ణ జన్మఖండాన్ని శ్రీరాముడికి అంకితం చేశారు.

సర్వజ్ఞ కుమార యాచమ నాయడి తరువాత ఆయన కుమారుడు రాజగోపాల కృష్ణ యాచేంద్రుడు అధికారంలోకి వచ్చాడు. ఈయన గొప్ప కవిపండిత పోషకుడు, మహామనీషి. దశకుమార చరిత్ర, శిశుపాలవధ ఈయనకు ప్రియమైన సంస్కృత కావ్యాలు. ఎనమచింతల సంజీవ రాయశాస్త్రిచేత దశకుమార చరిత్రను, వెంకయ్యశాస్త్రిగారిచేత మాఘకావ్యాన్ని అనువదింప చేశాడు. ఇరవై సర్గల్లో వున్న మాఘ కావ్యాన్ని శాస్త్రిగారు నాలుగాశ్వాసాల్లో తెనిగించి, రాజగోపాలకృష్ణుడికి అంకితం చేశారు. కేవల పద్యకావ్యాన్ని చంపూకావ్యంగా రూపొందించారు. మాఘ కావ్యంలోని ప్రౌఢిమ శబ్దగతమైనది. ప్రతి పదాన్ని, సమాసాన్ని చిత్రికపట్టి తీర్చిన మూలకారుని జిలుగుపనితనం అనువాదంలోకి తీసుకొని రావడం అసాధ్యం. మూలకారుణ్ణి క్షుణ్ణంగా పరిశీలిస్తేతప్ప ఈ కావ్యానువాదం తలపెట్టలేరు. వెంకయ్య శాస్త్రిగారి గంభీరపాండిత్యం, బహుగ్రంథ, శాస్త్ర పరిచయం, కవితాశక్తి ఈ గ్రంథానువాదంలో సమగ్రంగా దీపించాయి.

(32వ పేజీలో)

# అన్నమయ్య కవితలు - జానపదరీతులు

— ఆచార్య బి. రామరాజు

(గతసంచిక తరువాయి)

హిందోళవసంతం

జగడపు జనవుల జాజర
సగినల మంచపు జాజర ॥

మొల్లలు తురుముల ముడిచిన బరువున
మొల్లపు సరసపు మురిపెముచా
చల్లన బుప్పొడి జారగ పతిపై
చల్లెద రతివలు జాజర
.... .... .... .... ....
చాలు చాలు నీజాజర నన్ను
జాలి బరచె నీ జాజర ॥

వలపు వేదనల వాడేను యీ
తలనొప్పులచే దలకేను
పులకల మేనితో బొరలేను కడు
జలిగొని చల్లకు జాజర

అను జాజర పాటలు రచించినారు. సంస్కృతపు చర్చరియే తెలుగు జాజరయని పండిత పరిశోధకుల యభిప్రాయము.

జాజరపాటలవలె అల్లోనేరెళ్ళ పాటలు కూడ శృంగార గేయములే. పెద్దనేరేడుపండ్లను అల్లనేరేళ్ళందురు. అల్లనేరేళ్ళే అల్లోనేరేళ్ళుగామారి పాదాంతపదములుగా నిలిచిన పాటల నాపేరుతో బిల్తురు.

అల్లోనేరడల్లో అల్లో నేరడల్లో
అల్లల్ల నేరడి అల్లనేరాడి అల్లో నేరడల్లో

యనునది ఆ పాట వరుస. అన్నమయ్య గారిందు కుదాహరణముగా

దేసాళం

నెయ్యములల్లో నేరెళ్ళో
వొయ్యన వూరెడి వువ్విళ్ళో॥

అను చతురస్రగతి పాట రచించిరి. పుక్కిళ్ళో, తొక్కిళ్ళో యను పాదాంత పదములున్న అన్నమయ్య పాటలు కూడ ఈ వరుసపాటలే!

గౌరుకొమ్మ రోకట దంచుచు జంగమలింగము మల్లికార్జునుని శుభకాంతలు పాడినట్లు నన్నిచోడుడు వర్ణించెను. విన్నకోట పెద్దన రోకటి పాటలు తరువోజలనెను. ఈనాడు వినబడు రోకటి పాటలుకొన్ని తరువోజకునుద్విపదకును మధ్యనున్న వరుసలో గలవు. వీనిని విన్నచో

'సువ్వి సువ్వి రామచంద్ర – సువ్విసువ్వికీర్తిసాంద్ర
సువ్విసీతమ్మమాకు – శుభములిమ్మా

యను కొట్నముల పాట పెండ్లి పాటలలోనిదేకాని అచ్చైలోక వ్యవహారమునగల దంపుడు పాటల కోవలోనిది గాదనిపించును దీనినే సువ్వాల యందురు. ఇది త్రిశ్రగతిలో కొట్నముల వేగమున కనుకూలముగా నడుచుచున్నది. ఇది పాదమున కెనిమిదేసి 'తకిట' ల చొప్పున రెండు పాదములు గల రచనము తులసీదళము రామసువ్వాలవంటి పాటలన్నియు నిట్టివే పాల్కురికి పేర్కొన్న రోకటి పాటలు తరువోజల వరుసలో వ్యాపించిన నాలుగు 'తకిటతక' ఆవృత్తుల రచనలో లేక త్రిశ్రగతిలో నడచిన రచనములో తెలియరాదు. పాల్కురికి సోమన్న తెలంగాణమువాడు కనుక తెలంగాణమందు ప్రచారమున నున్న రోకటిపాటల జాతమన్నవి త్రిశ్రగతి మరియు చతురస్రగతిలో నడుచునవిగా నున్నవి.

1. సువ్వీ సువ్వెన్నలా సువ్వెన్నలాలా-సువ్వెన్నలాలా
సువ్వానీపాడరమ్మా రాములాలా-రఘురాములాలా

2. వజనాలబండమీద వడ్లెండాబోసి - ఉల్లి పూలజల్లెడ
మల్లెలచాటు
వడ్లోడు జేసిన వన్నెలాగజమూ - కమ్మరోడు జేసిన
గంటల్లాపొన్ను

3. సువ్వియనుచు పాడరమ్మా - సుందరాంగులు
చూడరమ్మా
నవ్వుమాటగాదుకొమ్మా - నాతిసంర్తలాడెనమ్మా

అనునవి తెలంగాణపు రోకటిపాటల కుదాహరణములు

1. సువ్వన్న చుక్కల్లు రాజమామిండ్లు - నా చేతి
రోకండ్లు నల్లరోకండ్లు
చేయించు అన్నయ్య చేవరోకండ్లు - వేయించు
అన్నయ్య వెండిపొన్నల్లు

2. సువ్వని నేనొక్క పోటేసితేను - చుక్కలు పిక్కటిల్లి
సూరన్న కదలు
అప్పని నేనొక్క పోటేసితేను - ఆకసమ్ము కదలు
ఆ రాజు కదలు

3. తమలపాకులమీద వడ్లెండ్లబోసి - రా చిలుక పో
చిలుక వడ్లుదంతాము
రా చిలుక దంచినవి రాసులయి - పో చిలుక
దంచినవి పోగులయి

అనునవి సాగరాంధ్రపు రోకటి పాటల కుదాహరణములు
అన్నమయ్యగారు రచించిన

కేదారగౌళ

సువ్వి సువ్వి సువ్వని
సుదతులు దంచెద రోలాల॥

పాట చతురస్రగతిలో నడచినది.

భూపాళం

సువ్వి సువ్వి సువ్వాలమ్మ
నవ్వుచు దేవకి నందను గనియె॥

అను పాటయును చతురస్రగతిలోనే సాగినది. 'ఘార మైన వేపమాను పాలువోసి పెంచినామా, తీరనిచేదేకాక తియ్య నుండీనా (V-90) వంటి త్రిస్రగతి పాటలన్నమయ్యగారు పాడినను సువ్విపాటలు త్రిస్రగతిలో పాడకపోవుట వింతగనే యున్నది.

స్త్రీల పాటలలో శోభనములు, పెండ్లిపాటలు, వరుస పాటలు, సంవాదములు, అత్తకోడండ్ర ఆరడిపాటలు, బావ మరదండ్ర సంవాదపు పాటలు మున్నగువాని ననుకరించుచు అన్నమయ్యగారు పెక్కు సంకీర్తనములు రచించియున్నారు. అట్టివానిలో కొన్ని యుదాహరింతును.

శ్రీరాగం

పిడికిట తలంబ్రాల పెండ్లికూతురు - ఇంత
పెడమరలి నవ్వెనే పెండ్లికూతురు॥

బౌళి

పెట్టని కోటిందరికి పెండ్లికొడుకు - బొమ్మ
బెట్టె నసురులకెల్ల పెండ్లికొడుకు

వసంతం

శోభనమే శోభనమే
వైభవముల పావనమూర్తికి॥

అనుపాట చతురస్రగతిలో నడచినది.

భూపాళం

నిండుసోబనము నేడు నెయ్యపుదంపతులకు
మెండుగ నారతులెత్తి మీదసేస చల్లరే॥

అనునది రుక్మిణీశ్రీకృష్ణుల శోభనమును వర్ణించు పాట.

పాడి

రావేరావే రట్టడి కోడల
పోవేపోవే అత్తయ్యా-పొందులు నీతో చాలును

అను అత్తాకోడండ్ర సంవాదపు పాటయు.

ముఖారి

ఓపో అదేమోయి వో బావ యింక
వోపనంటే బోవునటే వోవో మరదలా

పాడి

యేలే యేలే మరదలా చాలు చాలుంజాలును
చాలు నీతోడి సరసంబు బావ॥

గాటంపు గుబ్బలు గదలంగ గులికేవు
మాటల దేటల మరందలా
చీటికి మాటికి జెనకేవే వట్టి
బూటకాలు మానిపోవే బావ॥

వంటి బావమరదండ్ర సంవాదపు పాటలును ఆ కాలమున వినోదవాదము నెరపిన పెండ్లిపాటల ఛాయలేమో!

తలుపుదగ్గరి పాటలు అన్నమయ్య కాలమునాటికి (తమిళము నుండి) తెలుగులోనికి ధారాళముగా ప్రవేశించ లేదు కాబోలు. 'లకుమమ్మకేమైన లంచమిమ్మనవో-శుకవాణి తలుపుమూసుక తియ్యదు' అను పాటలో వీని సూచన మున్నది. 'కలికి కవాటము బంధనజేసిన - కారణమేమీ లక్ష్మీ' యను వాడుకలోనున్న తలుపుదగ్గరిపాట వరసలో అన్నమయ్య,

(29వ పేజీలో)

# భరతుడి భక్తి

— శ్రీ ఎం. లక్ష్మణాచార్యులు

భక్తి అనేది శ్రద్ధా ప్రేమల మిశ్రమం. దీనిలో తొమ్మిది రకాలున్నాయనే విషయం సర్వవిదితం. అవి శ్రవణభక్తి, కీర్తనభక్తి, స్మరణభక్తి, పాదసేవనభక్తి, అర్చనాభక్తి, వందనభక్తి, దాస్యభక్తి, సఖ్యభక్తి మరియూ ఆత్మనివేదన భక్తి అనేవి

శ్రవణం కీర్తనం విష్ణోః
స్మరణం పాదసేవనం,
అర్చనం వందనం దాస్యం
సఖ్యమాత్మ నివేదనం.

[శ్రీమద్భాగవతం—7. 5. 23–24]

వీటిని మూడుభాగాలుగా విభజిస్తే మొదటి మూడూ పరోక్షంగా ఆరాధ్య దైవమును (నిరాకారస్థితిలో) సేవించడానికీ, మరో మూడు (పాదసేవనము. అర్చన, వందనము) భగవంతుని సన్నిధానములోనే సేవించడానికీ. మిగిలిన మూడు పద్ధతులూ, (దాస్య, సఖ్య, ఆత్మనివేదనలు) భావాత్మకంగా సేవించడానికి

## యువ వాణి

ఉపయోగపడుతాయి, పాదసేవ, అర్చన, వందనములు, భగవంతుని పరోక్షస్థితిలో కూడా ఆయనను ప్రత్యక్షంగా ఉన్నట్టు భావించి నిర్వహించడం మనందరికీ తెలిసిన విషయమేకదా. ఇక ప్రస్తుత విషయానికి వస్తే దశరథమహారాజు పుత్రరత్నాల్లో ఒకటైన భరతునిలో ఈ నవవిధములైన భక్తి పద్ధతులూ మనకు స్పష్టంగా గోచరిస్తాయి.

భరతుడు సదాచార సద్గుణ సంపన్నుడు, జ్ఞాని, త్యాగి, అంతకంటే ముఖ్యంగా భగవంతుని యెడల విశుద్ధమైన నిష్కామ ప్రేమగలవాడు. జ్యేష్ఠుడైన శ్రీరామచంద్రుని యెడల అపార ప్రేమానురాగాలు, భక్తిశ్రద్ధలూ కలిగి ఉన్న ఆదర్శసోదరుడు ఒక్కొక్క భక్తి పద్ధతిని వివరిస్తూ, అది భరతునితో ఎలా ఉన్నదో, వివిధగ్రంథాల్లో అది ఎలా వర్ణించబడిందో తెలియచేస్తాను.

### శ్రవణభక్తి:

భగవంతుని నామ, రూప, గుణ ప్రభావ లీలాదులను, రహస్యములైన భక్తి ముక్తి దాయకములైన కథలను శ్రద్ధాసక్తులతో విని తన్మయం చెందడమే శ్రవణభక్తి దీనితో తరించిన వారిలో ప్రథముడూ ముఖ్యుడూ పరీక్షిత్ మహారాజు. (శౌనకాది మునులు గూడా ఈ కోవకు చెందుతారు) ఇక భరతుని విషయానికి వస్తే, హనుమంతుడు శ్రీరామచంద్రమూర్తి విజయ వార్తను వినిపించడానికి నందిగ్రామానికి వచ్చినప్పుడు, ఆయనను భరతుడు ఎంతో గౌరవ శ్రద్ధలతో గౌరవించి ఆయన సందేశాన్ని విని తన దుఃఖాలన్నీ మరచిపోయి దప్పికగొన్నవాడు అమృతాన్ని త్రాగిన విధంగా ఆనందం పొందుతాడు.



రామచరితమానస్‌లో శ్రీ తులసీదాస్ ఇలా వర్ణిస్తాడు.

సునత బచన్ బిసరే సబ్ దూఖా,
తృషావంత్ జిమిపాయి పియూషా.

ఇక వాల్మీకి రామాయణంలో

బహూని నామ వర్షాణి
గతస్య సుమహద్వయం
శృణోమ్యహం ప్రీతికరం
మమనాథస్య కీర్తనమ్

[యుద్ధకాండ 126–1]

శ్రీరాముడు అడవికిపోయి చాలా ఏళ్ళు గడిచాయి. కాని ఆ తర్వాత నేడే నేను నా స్వామి కీర్తన (సందేశము) వినుచున్నాను అని ఆయన ఆంజనేయునితో అంటాడు.

ఇదే ఆధ్యాత్మరామాయణంలో

శృత్వాతు పరమానందం
భరతో మారుతాత్మజాత్

[యుద్ధం 14–65–66]

అని ఉన్నది.

హనుమంతునిద్వారా రామసందేశం విని

"చిరస్యపూర్ణః ఖలు మే మనోరథః"

అని అంటాడు.

### కీర్తనభక్తి:

భగవంతుని రూప, గుణ. ప్రభావ తత్త్వాదులను శ్రద్ధాభక్తులతో ఉచ్చరిస్తూ. శరీరములో పులకరింత, గద్గదము, కన్నీరు, మానసోల్లాసము, తన్మయత మొ॥ వాటిని అనుభవించడము కీర్తనలోవి అంతర్భాగములు

అధ్యాత్మ రామాయణంలోని అయోధ్య కాండలో సుమంత్రుడు భరతుని గురించి చెప్పుతూ

"రామమేవానుశోచంతం
రామరామేతి వాదినమ్"

అని అంటారు.

భరతుడు నందిగ్రామములో విరాగి జీవితం గడుపుతూ భగవంతుడైన శ్రీరామచంద్రుని గుణగణాలను, పదపదికను కీర్తిస్తూ ఉండేవాడు.

శ్రీ తులసీదాసు ఇలా అంటారు.

పులక గాత్ హియం సియ రఘువీరూ,
జీహ్ నామ్ జప్ లోచన నీరూ.

పులకితమైన శరీరముతో మనస్సులో సీతారాములను స్మరిస్తూ రామనామం జపిస్తూ బాష్పలోచనుడై ఉండేవాడట. ఇలాగే పద్మపురాణములోని పాతాళఖండములో కూడా.

గర్తశాయీ బ్రహ్మచారీ
జటావల్కల సంయుతః,
కృశాంగయష్టిర్దుఖార్త
కుర్వన్ రామకథా ముహుః.
(1/30)

భరతుడు శల్యావశిష్టుడై మాటి మాటికి రామనామజపం చేస్తూ రామవియోగతప్తుడై ఆయన్ని తిరిగి కలియడానికి వేగిరపడే వాడట.

## స్మరణభక్తి :

పరమాత్మ రూప, గుణ, విభవాదుల్ని, తత్త్వాది రహస్యాల్ని మననం చేసుకుంటూ, భగవంతుని స్వరూపంలో లీనమవడం దీని స్వభావం.

పాదుకలు తిరిగి తెచ్చిన నాటినుండి తిరిగి తన అన్నను కలిసే వరకూ భరతుడు రామ గుణగణాలను స్మరించుకుంటూనే ఉంటాడు. అన్నను తిరిగి రాజ్యానికి రప్పించే ప్రయత్నంలో వెళ్ళేటప్పుడూ, నిరాశతో తిరిగి వచ్చేటప్పుడూ రామ నామాన్ని జపిస్తూనే ఉంటాడు. నంది గ్రామంలో ఉంటూ కేవలం జీవిస్తున్నా ఆతనికి రామచంద్రమూర్తి దివ్యనామస్మరణే ఆధారమైనది.

భరతస్తు మహామాత్యైర్మా
తృభిస్సహితా సహ,
అయోధ్యామగమచ్ఛీఘ్రం
రామమేవానుచింతయన్।
[అధ్యాత్మ రామాయణం – 9-69-76]

ఇక పద్మపురాణములోని పాతాళఖండంలో
(1/40)

దుర్భాగస్య మమప్రాప్తం
స్వాఘమార్జనమాదరాత్
కరోమి రామచంద్రాంఘ్రిం
స్మారం స్మారం సుమంత్రిణః.

(మంత్రివరులారా! ఈ దుర్భాగ్యానికి తన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసుకునే అవకాశం లభించింది. అందువల్ల నేను రామచంద్రుని పాదపద్మాలను నిరంతరమూ గౌరవపురస్సరముగా స్మరిస్తూ నా పాపాలని కడిగేసుకుంటాను.)



చాముండేశ్వరి ఆలయశిల్పం

ఫోటో : శ్రీ వావింటపర్తి కృష్ణారావు.

## పాదసేవన భక్తి :

భగవంతుని దివ్యమంగళ విగ్రహానికి లేక చిత్రపటానికి లేక ఆయన రూపాల్ని లేక ఆయన పాదారవిందాల్ని శ్రద్ధాభక్తులతో చూడడము, పూజించడము, సేవించడమూ చేస్తూ ఆ భగవత్ కైంకర్యములో మనసా వాచా కర్మణా లీనమవడాన్ని పాద సేవన భక్తి అని చెప్పుకోవచ్చు.

భరతునిలో ఈ పాదసేవన భక్తి మనకు చాలా ఉత్కృష్టస్థితిలో గోచరిస్తుంది. శ్రీ మహాలక్ష్మి భగవంతుని చరణారవిందాలను కొలుస్తూవుంటే మన భరతుడు చరణపాదుకలను కూడా సేవించవచ్చని, తద్వారా ఐహికాముష్మిక సుఖాలను బడయవచ్చునని ఋజువు చేశాడు. రాముడు అడవిలో వేసిన ప్రతి అడుగునూ ఆయన ఎంతో భక్తితో గౌరవిస్తాడు. రాముడు తిరిగిరానని చెప్పినప్పుడు ఆయన పాదుకలను గ్రహించి, తన శిరస్సుపై ఉంచుకుని తిరిగివస్తాడు. శ్రీరాముడు తిరిగివచ్చినప్పుడు, భరతుడు ఆ పాదుకలను శిరస్సుపైనుంచుకొని ఆయనకు ఎదురేగినాడని వాల్మీకి రామాయణంలో, అధ్యాత్మరామాయణంలో ఉన్నది.

యావన్న చరణౌ భ్రాతుః
పార్థివవ్యంజ నాన్వితౌ,
శిరసా ప్రగ్రహీష్యామి
నమే శాంతిర్భవిష్యతి.
(వాల్మీకిరామాయణం 13/9)

మహాభారతంలో గూడా

విసర్జిత స రామేణ
పితుర్వచన కారిణా,
నందిగ్రామే కరోద్రాజ్యం
పురస్కృత్యస్యపాదుకే.
(వన 277/39)

అని ఉల్లేఖించబడివుంది.

## అర్చనభక్తి :

అర్చావతారముముందుగాని, చిత్రపటము ముందుగాని లేక పరమాత్ముని స్వరూపాన్ని

మనోక్షేత్రములో ఊహించుకుని మనో సామాగ్రితోనే నానావిధములైన ఉపచార ములతో, సేవలతో శ్రద్ధాభక్తి సమన్వితుడై పూజించుట. ఆయన తత్త్వాన్ని ప్రభావాన్ని తలచుకుని పులకిత గాత్రుడగుట అర్చనా భక్తి అని అనబడుతుంది.

శ్రీరామచంద్రుని సమక్షములోనూ, పరోక్షములోనూ భరతుడు ఆయన్ను పూజిస్తూ-సేవిస్తూ ఉండేవాడు. భరతుడు భారద్వాజాశ్రమం వచ్చినపుడు ఆయన కూర్చోమన్న సింహాసనంలో కూర్చోలేదు సరికదా, దానిపై స్వయముగా రామ చంద్రుడు కూర్చున్నట్టుగా భావించి తాను మంత్రి స్థానములో కూర్చొని రాత్రంతా ఆ సింహాసనానికి చామరము వీస్తూ గడి పాడని మనకు వాల్మీకి రామాయణంలో అవగతమవుతుంది.

> అసనం పూజయామాస
> రామయాభిప్రణమ్య చ
> వాలవ్యజనమాదాయ
> న్యషీదత్సచివాసనే.
>
> (వా. రా. అయో. 91/38/39)

ఆధ్యాత్మ, పద్మపురాణాల్లో గూడా భర తుడు విశేషమైన భక్తిశ్రద్ధలతో రాజోప చారములతో, గంధపుష్పాక్షతలతో రాముని పాదుకలను పూజించాడని వివరించబడింది. రామచరితమానస్‌లోగూడా భరతుని అర్చనాభక్తినిగురించి తులసీదాస్ గొప్పగా వర్ణిస్తాడు.

## వందనభక్తి :

శాస్త్రములలో చెప్పబడిన విధముగా భగ వంతుని రూపాన్ని తయారుచేసి, లేక ఆయన మూర్తిని మనస్సులో ధ్యానించు కుని ఆయన పాదపద్మాలకు మనస్ఫూర్తిగా గౌరవభక్తులతో నమస్కరించుటే వందన భక్తి అనబడుతుంది.

> "కహత్ సప్రేమ్ నాయిమహి మాథా !
> భరత్ ప్రణామ్ కరత్ రఘునాథా !"

అని భరతుని భక్తి గురించి శ్రీ తులసీదాసు అంటాడు. శ్రీరామునికి సాష్టాంగప్రణామం చేశాడని, ఆయన పాదధూళి శిరసున ధరించి తాను ధన్యత నొందినట్టు భావించాడని.

> "మాతుర్మే దుష్కృతం కించిత్
> స్మర్తుం నార్హసి పాహి నః"

అనే శ్లోకంలో భరతుడు తన తల్లిచేసిన దోషాన్ని క్షమించి మరచిపొమ్మని తమం దరినీ రక్షించమని, వేడుకుని ఆయన పాదా లను తన శిరసుపై ఉంచుకుని సాష్టాంగ ప్రణామం చేశాడని ఆధ్యాత్మరామాయణ కర్త అంటాడు. వాల్మీకి కూడా భరతుని లోని ఈ వందనభక్తిని చాలాచోట్ల ఉదహ రించాడు.

## దాస్యభక్తి :

పరమాత్ముని రూప గుణ విభవైశ్వర్యా దులను, తత్త్వ రహస్యాలను అవగాహన చేసుకొని, ఆయనకు సేవచేస్తూ తనను ఒక సేవకునిగా పరమాత్ముని సేవ్యునిగా (యజ మానిగా) భావించడమే దాస్యభక్తి అన బడుతుంది. (27 వ పేజీలో)

## పిల్లనగ్రోవి

అది మనకు వట్టి రాతిబొమ్మ,
ఆ విశ్వానికి ఎదనందనంలో పండువెన్నెలకొమ్మ,
జన్మనిచ్చింది మొదలు గళంలో పాడుతూనేవుండే కోకిలమ్మ
మౌళిపరిసర్పిత బర్హిబర్హలావణ్యము
పెదవిని విడిచి బతకలేని పిల్లంగోవి -
మనకు పలకదు - మనసు పగలదు -
ఆ వ్యద్రంకికి జీవనరాగాలు, జీవితభాష్యాలు అందులోనే -
ఎన్నో పిల్లనగ్రోవులు చేశాడాతడు
ఎదుటనున్న మోహనభావానికి నివేదించాలని
రసరాగాలు రంజిల్లినా
కనుగొల్కులు వర్షమేఘాల్లా వెదజల్లినా
ప్రతి వేణువును ముక్కలు ముక్కలు చేశాడు -
ఏదీ నచ్చలేదు
ఎదమెచ్చి ఎదలోనిఎదకు అందించలేదు !
పరిభ్రమత్ ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లో అశ్రుతర్పణం, -
ఒకే జన్మచుట్టూ అవరించిన స్మృతిలా
ఒకే ఒకే కోరిక - కాదు కాదు - తపస్సు
ఉషస్సులు, అసుర సంధ్యలు,
దివారాత్రాలు - ఆ ఆవేదన పైనే -
మాయమనసో !
తీయని మనసో - బొమ్మకే తెలుసా ?
అందుకే
తనే పిల్లంగ్రోవిగ మారిపోయి,
స్వామిపెదవి సింహాసనాన్నెక్కాడు !

— మోవా



శ్రీ కోదండరామస్వామి ఆలయం

భారతదేశంలో రామాయణానికున్న ప్రశస్తి మరే యితర పురాణగ్రంథానికి లేదనడం అతిశయోక్తి కాదు. అనుశ్రుతంగా వస్తున్న రామాయణాన్ని రచించి వాల్మీకి మహర్షి సంస్కృత సాహిత్యంలో అగ్ర పీఠాన్ని ధిష్టించారు.

రామాయణంలోని రాముడిపాత్ర విలక్షణమైనది. ఆదర్శప్రాయమైనది. అంచేతే కలియుగంలో ఊరూరా రామాలయాలు వెలిశాయి.

వరాహ పురాణంలో రావణవధానంతరం శ్రీ రాముడు సీతాలక్ష్మణ సమేతుడై లంక నుంచి అయోధ్యకు వెళుతూ మధ్యే మార్గంలో తిరుపతిలో విడిది చేశాడని ప్రస్తావించబడింది.

**ఆలయ నిర్మాణం:**

ఇక్కడి మూర్తిని రఘునాథస్వామి అని, శ్రీ కోదండరామస్వామి అని వ్యవహరిస్తారు. శ్రీ గోవిందరాజస్వామి ఆలయం లోపలి తూర్పు గోపురం మీదవున్న శాసనం ప్రకారం ఆలయ నిర్మాణం, మూర్తి ప్రతిష్ఠాపన శా॥ శ॥ 1402 అనగా క్రీ. శ. 1480 లో జరిగినట్లు తెలుస్తున్నది. క్రీ. శ. 1480 లో సాళువ నరసింహరాయలు పరిపాలిస్తున్న సమయంలో చక్రవర్తికి శుభాన్ని కోరి శఠగోపదాసర్ నరసింహరాయ మొదలియార్ మూర్తిని ప్రతిష్ఠాపనజేసి ఆలయ నిర్మాణం గావించినట్లు శాసనంలో వివరణ వున్నది.

**చారిత్రక ప్రాధాన్యత :**

చరిత్ర పుటలలో శ్రీ కోదండరామస్వామి ఆలయానికున్న ప్రాధాన్యత అపూర్వమైనది. శ్రీ కోదండరామాలయానికి సంబంధించిన దాదాపు 20 శాసనాలు శ్రీ గోవిందరాజస్వామి, తిరుమల శ్రీ వేంకటేశ్వర స్వామి ఆలయాలలో లభ్యమవుతున్నాయి. ఈ శాసనాల ఆధారంవల్ల ఈ ఆలయచరిత్ర కొంతవరకూ తెలుస్తున్నది.

శ్రీ కోదండరామస్వామి ఆలయంలోని శాసనం ప్రకారం శా॥ శ॥ 1452 అనగా క్రీ.శ. 1530 లో విజయనగరమును అచ్యుత దేవ మహరాయలు పరిపాలిస్తున్న సమయంలో ఆయనకు సౌభాగ్యాన్ని కోరి శ్రీ కుమార రామానుజ అయ్యంగార్ శ్రీ కోదండరామ స్వామికి దారురథాన్ని నిర్మింపజేసి సమర్పించాడు.

క్రీ. శ. 1801 లో అప్పటి కలెక్టర్‌గావున్న మిస్టర్ స్ట్రాటన్ తిరుమల పరిసర ఆలయాల చరిత్రను స్థానికుల నుంచి సేకరించే నిమిత్తం తయారుచేసిన ప్రశ్నలకు లభించిన జవాబులను క్రోడీకరించి సవాల్-ఇ-జవాబ్ పట్టీ గ్రంథాన్ని తయారు చేశారు. ఆ గ్రంథం ప్రకారం అప్పట్లో ఈ ఆలయానికి శ్రీ గుండప్ప, శ్రీ వెంకటరావులు ధర్మకర్తలుగా వుండేవారు.

తిరుమల తిరుపతి దేవస్థానం ఈ ఆలయ నిర్వహణ చేపట్టిన తర్వాత ఆలయం ఎంతగానో అభివృద్ధి చెందింది.

తిరుపతి రైల్వే స్టేషన్ నుండి సుమారు ఒక కిలోమీటరు దూరంలో, పట్టణానికి మధ్యభాగంలో ఈ రామాలయం వుంది.

**ప్రాకారం :**

పూర్వం నిర్మింపబడిన ఆలయాలు ఆయా ప్రాంతాల ప్రజలకు ఆధ్యాత్మికతను




ప్రసాదించడమేగాకుండా ఆవశ్యమయోల్లో రక్షణ కేంద్రాలుగాకూడా వుండేవి. ముఖ్యంగా ముస్లిం దండయాత్రలకాలంలో ఆలయప్రాకారాలు దాదాపు 15 అడుగులకు మించి నిర్మించడం జరిగింది. అనేకయుద్ధ సమయాలలో దేశంలోని అనేక దేవాలయాలు ఆయా ప్రాంతాలలోని ప్రజలకు రక్షణ కేంద్రాలుగా ఉపయోగపడ్డాయనడానికి ఎన్నో దృష్టాంతాలున్నాయి. శ్రీ కోదండరామస్వామి ఆలయం తూర్పున 345 అడుగుల పొడవున ఉత్తరాన 174 అడుగుల వెడల్పుతోనూ సుమారు 15 అడుగుల ఎత్తుతోనూ అలరారుతూవుంది.

**గోపురం :**

ఈ ఆలయానికి మునుపువున్న ప్రాచీన గోపురం స్థానే సుమారు 29 అడుగుల ఎత్తుగల నూతన గోపురాన్ని నిర్మించారు.

**గోపురం** మూడు అంతస్థులు గలిగి శిల్ప సముదాయంతో విరాజిల్లుతోంది. గోపురం అధిష్ఠానం ఎత్తు 4 అ॥ 6 అంగుళాలు. విజయ నగర చిహ్నాలు గోపురం లోపలిభాగంలో కనిపిస్తాయి. గోపురం పైభాగంలో ఏడు కలశాలున్నాయి. పశ్చిమ దిశాభిముఖంగా వున్న ఈ ఆలయానికి ఎదురుగా శ్రీ ఆంజనేయ స్వామి ఆలయం వున్నది.

**ఆలయ ప్రాంగణం :**

గోపురం దాటిన పిమ్మట సువిశాలమైన ప్రాంగణం కనిపిస్తుంది. ఆలయ ప్రాంగణంలో నల్లని నాపరాళ్లు పరిచారు. గోపురానికి తూర్పుదిశలో బలిపీఠం, ధ్వజ స్తంభం వున్నాయి. దక్షిణదిశన రెండు మంటపాలు, రావివృక్షం వున్నాయి.

అన్ని ఆలయాలకువలె ఈ ఆలయంలోనూ గర్భగృహం. అంతరాళం, ప్రదక్షిణం, ఇతర మంటపాలూ వున్నాయి.



**ముఖమంటపం :**

విజయనగర శైలిగల నాలుగు స్తంభాలున్నాయి. స్తంభాలపైనున్న శిల్పాలలో లక్ష్మీనారాయణ, యోగనరసింహ, కృష్ణ, విష్ణు, గోవర్ధనగిరిధారి ముఖ్యమైనవి. ముఖ మంటపానికి దక్షిణదిశలో శ్రీరామానుజా చార్యులు, ఉత్తర దిశలో విష్వక్సేన ఆలయాలున్నాయి.

**మహామంటపం :**

మహామంటపంలో నాలుగు వరుసలలో విజయనగర శిల్పశైలిలో నిర్మితమైన స్తంభాలున్నాయి.

లక్ష్మి, నారసింహ, కృష్ణ, విష్ణు, పరశురామ, వేణుగోపాలస్వామి శిల్పాలు ఈ స్తంభాలపై కనిపిస్తాయి. మహామంటపానికి మధ్యలో తూర్పుదిశలో గరుడాళ్వార్ కనిపిస్తారు. విశాలమైన ఈ మంటపంలో వేదికలున్నాయి.

**ముఖ్యాలయం :**

ముఖమంటపానికన్నా ఎత్తులో ముఖ్యాలయం వున్నది. ఇక్కడ అంతరాళం, గర్భగృహం వున్నాయి. అధిష్ఠానంకన్నా గర్భగృహం అయిదు అడుగుల ఎత్తులో వుండటం విశేషం.

**ద్వారపాలక విగ్రహాలు :**

అంతరాళ ప్రవేశద్వారానికి ఇరువైపులా సుమారు ఏడు అడుగురాతి ద్వారపాలక విగ్రహాలున్నాయి. వైష్ణవాలంకారాలతో శోభించే ఈ విగ్రహాలలో చక్కని శిల్పశైలి గోచరమవుతుంది.

**గర్భగృహం :**

గర్భగృహ విమానం 'ద్వితల' విధానంలో నిర్మింపబడింది. శిఖరం వేసరజాతి శైలిలో వున్నది. శిఖరంపై ఏకకలశం దర్శనమిస్తుంది. గర్భగృహంలో రఘునాథలేక శ్రీ కోదండరామస్వామి, సీతాదేవి, లక్ష్మణ విగ్రహాలున్నాయి.

కోదండరాముడికి ఎడమవైపున లక్ష్మణ కుడివైపున సీతాదేవి విగ్రహాలున్నాయి.



విగ్రహాలు, పట్టుపీతాంబరాలతోనూ, స్వర్ణ, రజిత ఆభరణాలతో అలంకరింపబడివున్నాయి. ఆభరణాలతో అలంకరింపబడిన ఉత్సవ విగ్రహాలు యాత్రికుల కనువిందొనరిస్తాయి.

**ముఖ్య శిల్పాలు :**

పరిమాణంలోనూ, ప్రమాణంలోనూ, శిల్పవైశిష్ట్యంలోనూ గర్భగృహంలోని మూలస్థాన విగ్రహాల తర్వాత ద్వారపాలక శిల్పాలు పేర్కొనదగినవి. ఇవిగాక విష్ణు. యోగనారసింహ, పరశురామ, కృష్ణవిగ్రహాలు విశిష్టతను చాటుతున్నాయి. ఈ శిల్పాలు ముఖమంటప స్తంభాలపైమలచబడివున్నాయి.

— పాయసం సుబ్రహ్మణ్యం



స్వామివారి శేషపాన్పు ఉత్సవం



గరుడోత్సవం

### ధనము

"అర్థానా మార్జనం దుఃఖమ్
అర్జితానాం చ రక్షణే
ఆయే దుఃఖం వ్యయే దుఃఖమ్
ధిగర్థం దుఃఖ భాజనమ్."

ధనసంగ్రహణ దుఃఖంతో కూడిన పని. ఆర్జించిన ధనాన్ని రక్షించుకోటం కూడ దుఃఖకృత్యమే. ఆదాయం దుఃఖం. ధన వ్యయం దుఃఖం. ఛీ! ఛీ! ధనం దుఃఖ భాజనం!

ఇది వైరాగ్యం బోధించే వేదాంతులు చెప్పిన నీతిబోధ. అయితే - వాస్తవ జగత్తులో ధనం లేకపోతే క్షణం గూడ బ్రతుకటం కష్టం. రామాయణంలో లక్ష్మణుడు అన్నగారు-త్యాగమూర్తి అయిన శ్రీరామునితోనే చెప్పిన మాటలు ఈ సందర్భంలో ఉదాహరించదగినట్టివి.

ధనమార్జయ కాకుత్స్థ
ధన మూలమిదం జగత్ ।
అంతరం నాభి జానామి
నిర్ధనస్య మృతస్యచ ।

"డబ్బు ప్రోగుచేయవయ్యా, కాకుత్స్థ వంశంలో పుట్టినవాడా; ఈ జగత్తుకు ధనమే మూలం. డబ్బులేనివానికి శవానికి ఏం తేడా ఉందో నాకు తెలియదు" అన్నాడు లక్ష్మణుడు.

డబ్బులేనివాడు - ధనస్వామ్య సమాజంలో నడవనూగిగదా. ధనమే వ్యావహారికమైన కర్మజగత్తుకు గురుత్వాకర్షణ నాభి.

సత్యం, విప్రతి పన్నాలైన యీ రెండు భిన్నధ్రువాల మధ్య ఉయ్యాలలూగుతుంది!

ధనం - ఈ లోకంలో కొనలేని దేమిటి? సాధించలేని దేమిటి? అని ఒక వేడినిట్టూర్పు విడిచే వేదాంతులున్నారు. వాపోయే దరిద్రులు ఉన్నారు. ప్రాచీనకాలంలో-నాగరకత పెరుగని రోజులలో ధనానికి నేటి ప్రాబల్యం ఉండేదికాదు. పరాక్రమానికి, పాండిత్యానికి, సంగీతానికి, సాహిత్యానికి-వివిధ విద్యలకు చతుఃషష్టి కళలకు సముచిత ప్రాధాన్యం - గౌరవప్రపత్తులు లభించేది. ధనానికి సమాజవ్యవస్థలో సార్వభౌమ పట్టాభిషేకం కట్టిపెట్టటం కేవలం కలియుగ లక్షణమే అనిపిస్తుంది!

ఒక పరిహాసకథ ఉంది. ఢిల్లీలో ఒక దొంగ ఏకాంతంగా దారివెంట నడచిపోయే ఆగంతకుణ్ణి ఆపి-కత్తి ఝుళిపిస్తూ, "నీ దగ్గరవున్న డబ్బు ఇచ్చేస్తావా? లేకపోతే నీ తలకాయ నరికి పారవేయమంటావా" అని బెదిరించాడట! ఆ ఆగంతకుడు "ఏమైనాసరే - నీకు డబ్బు ఇచ్చేది లేదు. తలకాయ లేకుండా అయినాసరే ఢిల్లీలో బ్రతుకవచ్చునేమోగాని డబ్బు లేకుండా జీవించటం సాధ్యంకాదు" అని సమాధానం చెప్పాడట! ఇది పరిహాసగాథ అయినా ఇందులో పరమార్థం గూడ లేకపోలేదు.

మానవజీవితాన్ని క్షీరసాగరంవలె మథించి మథించి, చక్కని చిక్కని సామెతల వంటి సుభాషిత శ్లోకాలు వ్రాసిన భర్తృహరి-ధనాన్ని గూర్చి చెప్పిన శ్లోకం.

## వెలుగుబాట

డా॥ నండూరి రామకృష్ణమాచార్య

"యస్యాస్తి విత్తం సనరః కులీనః
స పండితః సశ్రుతవాన్ గుణజ్ఞః
స ఏవ వక్తా సచ దర్శనీయః
సర్వే గుణాః కాంచన మాశ్రయంతి ॥"

పై శ్లోకానికి - శ్రీ ఏనుగు లక్ష్మణకవి హృదయంగమమైన అనువాదం చేశాడు.

"ఏ నరునకు విత్తముగల
దా నరుడు కులీనుడధిక దార్యుడతండే
ధీనిధి! ధన్యుడు! నేర్పరి!
నానా గుణ గణము కాంచనంబున నిలుచున్!"

అయితే - పై శ్లోకాలు అన్నీ లక్ష్మణుడి వాదాన్ని బలపరుస్తున్నాయా? స్థూల దృష్టికి అవి ధనమాహాత్మ్యాన్ని అభివర్ణిస్తున్నాయి గాని సూక్ష్మదృష్టితో చూస్తే అవి అధిక్షేపణకే.

ఐహిక జగత్తులో ధనం సాధించలేనిది ఏదీ లేదనిపించవచ్చు! అందుచేతనే సంపన్న దేశమైన అమెరికా "Almighty Dollar"- "డాలరు సర్వసామ్యం" సామెతగా పరిణమించింది. (డాలరు అమెరికను నాణెము) సమాజంలో ప్రాయికంగా కులపాలికల పాతివ్రత్యాన్ని-ప్రజాస్వామ్యంలో పౌరుల ఓట్లను సయితం ధనం కొనగలిగితే-ఇక చెప్పగలిగింది ఏముంది? అయితే, ప్రపంచంలో ఏ కోటీశ్వరుడైనా-శీలవతియైన సౌందర్యవతి పాతివ్రత్యాన్ని, నిజాయితీగల పౌరుని ఓటు కొనలేడు. ధనానికి సర్వంసహాధిపత్యం ఉన్నదనుకోటం వట్టి భ్రమ. ప్రపంచంలో ఎందరో కవీశ్వరులు పోతనవంటివారు ధనానికి దాసోహం అనలేదు. త్యాగరాజు - నిధిచాలసుఖమా? రాముని సన్నిధి చాల సుఖమా? నిజముగ పలుకుము మనసా! అని ఆలపించి-ఆచరణలో చూపించాడు - తన వైరాగ్యాన్ని! ధూర్జటి మహాకవి."

"తరగల్ పిప్పలపత్రముల్ మెరుగు
టద్దంబుల్ మరుద్దీపముల్
కరి కర్ణాంతము లెండమావులతతుల్
ఖద్యోత కీట ప్రభల్
సురవీథీ లిఖితాక్షరంబులసువుల్
జ్యోత్స్నాపయః పిండముల్
సిరులందేల మదాంధు లౌదురు
జనుల్ శ్రీకాళహస్తీశ్వరా!"

అని ఎలుగెత్తి ఆలపించాడు.

వేదాంతులు - కవీశ్వరులు - యోగులు చెప్పిన మాటలు అటుంచి, ఒకసారి వాస్తవ జగత్తును సమీక్షిస్తే గూడ ధనానికి ఉన్న శక్తి పరిమితం ఆభాసమాత్రం అనిపిస్తుంది.

ధనముపెట్టి దేని కొనవచ్చు పృథివిలో?
లోనిగుంజుకాదు! పైని డొలక ॥
ఔషధాలుగాని-ఆరోగ్యమును గాదు!
వేవకులముగాని చెలిమిగాదు!
సురుగు పరుపుగాని మరపు నిద్దురగాదు!
సౌఖ్యములమగాని శాంతిగాదు!
చదువు బిరుదుగాని సంస్కారమునుగాదు!
ఒడలుగాని వెలది యెదదగాదు ॥

అయితే - యీ చర్యకు సరియైన ముగింపు ఏమిటి? కాళిదాస మహాకవి చెప్పిన

"త్యాగాయ సంభృతార్థానాం"

"ధన సంపాదన పరోపకారార్థం త్యాగబుద్ధితో దానం చేయుటానికే-" అనే తీర్పు చిరస్మరణీయమైనది. *

[23వ పేజీ తరువాయి]

"త్వద్దాస దాస చరమావధి దాసదాసః!"
అని కులశేఖరుని భావనగదా!)

భరతుని ఈ లక్షణము మనకు చక్కగా గోచరిస్తుంది. వనవాసానికి వెళ్ళిన రామచంద్రుని తిరిగితెచ్చి ఆయనకు దాసుడై ఉంటానని తల్లి కైకేయితో గురువు వసిష్ఠులవారితో ఆయన అంటాడు. చిత్రకూటం వెళ్ళే దారిలో కూడా ఆయన ఇదే భావాన్ని అందరితోనూ వ్యక్తపరుస్తాడు. శ్రీరాముని మాటకు కట్టుబడే తాను ఒక దాసునిగా ఆయన వియోగాన్ని పదునాల్గు సంవత్సరాలు భరించి, తానొక విరాగియై రాచ కార్యాలను నిర్వహించి దేశానికి కూడా అమూల్యమైన సేవచేశాడు.

తల్లి కైకతో ఒకచోట ఇలా అంటాడు:

నివర్తయిత్వా రామం చ
తస్యాహం దీప్తతేజసః
దాసభూతో భవిష్యామి
సుస్థితేనాంతరాత్మనా.

(వా. రా. అయో. 73/1)

చిత్రకూటంలో భరతుడు రామునితో ఇలా చెప్తాడు.

"అహమప్యాగమిష్యామి
సేవేత్వాం లక్ష్మణోయథా."

లక్ష్మణునిలా నేనూ మీతో అడవికివచ్చి సేవ చేస్తానంటాడు.

## సఖ్యభక్తి:

భగవంతుని ప్రభావాన్ని, తత్త్వాన్ని రహస్య, మహిమల్ని తెలుసుకొని విశ్వాస యుక్తమైన మైత్రితో ఆయనకనుకూలముగా అవడమూ ఆయనయెడల అనన్యమైన ప్రేమానురాగాలు కలిగివుండి, నిరంతరమూ, ఆనందంగా ఉండడమే సఖ్యభక్తి. భరతుని ఆచరణలో మిగతా భక్తి పద్ధతులతోపాటుగా ఇదిగూడా వుంది.

చిత్రకూటంలో శ్రీరాముని ప్రార్థిస్తూ:

ఏభిశ్చ సచివైః సార్థం
శిరసా యాచితో మయా
భ్రాతుః శిష్యస్య దాసస్య
ప్రసాదం కర్తుమర్హసి.

[వా. రా. అయో. [102/12]

(అంటే ఈ మంత్రులతోపాటుగా శిరసువంచి మీకు నివేదించేది ఏమంటే నేను మీ సోదరుడను, శిష్యుడనూ, దాసుడను కూడా. నా మీద దయ చూపండి.)

వేరే ప్రసంగంలో

"యోమేభ్రాతా పితా బంధుః
యస్యదాసోస్మి సమంత!"

అని అంటాడు. దీన్నిబట్టి తెలిసేదేమంటే 'బంధు', 'భ్రాతా' అనే శబ్దాలు సఖ్యభావాన్ని తెలియచేస్తాయి.

ప్రభుపితు భ్రాతుసుహృదు గురుస్వామీ!
పూజ్యపరమ హిత అంతర్యామీ:

అని తులసీదాసు అంటాడు.

## ఆత్మనివేదన భక్తి:

పరమాత్మయొక్క సకల లీలలనీ తత్త్వాలనూ, మహిమలను తెలుసుకొని అహంకార మమకారములను త్యజించి, పరమాత్మను తలచుకుంటూ, ఆర్తప్రపత్తులతో, నిష్కామ బుద్ధితో అన్ని పనులుచేస్తూ కర్తృత్వాన్ని ఆయన కప్పగించి తన సర్వస్వాన్ని ఆయన చరణాలకు అర్పించడం అనేది ఆత్మనివేదన అని పిలువబడుతుంది.

భరతుడు తనను రాముని సొత్తని భావిస్తూ, అతనికి తన సర్వస్వమూ అర్పించడం చేస్తూవుండేవాడు.

ఆధ్యాత్మరామాయణంలో

అసమప్యైవ రామాయ
రాజ్ఞే మాం క్వగతోఽస్మిభోః.

మహారాజా! నన్ను రాముని కప్పగించకుండానే మీరు ఎక్కడికి వెళ్ళారు అంటాడు.

దీన్నిబట్టి భరతుడు రామునికి సర్వస్వమూ అప్పగించాడని తెలుస్తుంది. తన మనసూ, తనువూ, వాక్కు పరమాత్ముడైన రామునికి అర్పించిన ధన్యజీవి భరతుడు. ఆయన సంరక్షణలోనే తన జీవితమంతా గడిపాడు.

కింకరోహం మునిశ్రేష్ఠ!
రామచంద్రస్య శాశ్వతః
*      *      *
నేష్యేఽయోధ్యాంరమానథం
దాసః సేవేతి నిచరత్.

అనేదాన్నిబట్టి ఆయన తన జ్యేష్ఠుని విశాల భావాల్ని మన్నిస్తూ ఉండేవాడని ఆయనకు సేవకుడుగానే తనను భావించేవాడని తెలుస్తుంది.

పై విషయాలనుబట్టి చూస్తే భరతుని జీవితమంతా "ఆత్మసమర్పణ" అని ముఖ్యంగా తేటతెల్లమవుతుంది. రాముని సుఖదుఃఖాలను తన సుఖదుఃఖాలుగా భావిస్తూ తనలో నవవిధములైన భక్తి పద్ధతులను నిలుపుకున్నాడు. రామునికే అంకితమైన భరతుడు ఆదర్శ సోదరుడు, ఆదర్శ తనయుడు, ఆదర్శ భక్తుడు.

భరతపాత్ర నిజముగా వాల్మీకి అద్భుత సృష్టి. మనము భరతునివలె తొమ్మిది రకములైన భక్తిపద్ధతులు అవలంబించకపోయినా, ఏ ఒక్కటి అవలంబించినా ధన్యులమవుతాము.

(శ్రీ జయదళాల్ గోయందకా వ్యాఖ్య ఆధారంగా)



( 20వ పేజీ తరువాయి )

సామంతం

బలుపగు కర్మము లివివో జీవుల
ప్రారబ్ధంబులు సంచితంబులును
బలిసి తీరనివి పెరుగునె కాని
బ్రహ్మల బహు కల్పంబుల దాక

అను పాటను రచించినారు.

స్త్రీల పాటలలో ధవళాలు, నివాళి, మంగళహారతి మొదలగునవి ఎక్కువగా శుభకార్యముల సందర్భమున వినబడునట్టివి. దృష్టి దోషము తగులకుండుటకై పారాణిపళ్ళెమును చుట్టుత్రిప్పుచు పాడునట్టిది నివ్వాళి. పెండ్లిలోగాని పూజా సమయములందుగాని హారతి ఇచ్చునపుడు పాడునట్టిది మంగళహారతి. అన్నమయ్యస్వామినే పెద్ద భూతముగా కీర్తించెను. ఆస్వామిని పట్టగలిగిన దుష్టశక్తులేమియుండును? కనుకనే కాబోలు అన్నమయ్య నివ్వాళి పాడినట్లు లేదు. తీరుతీరు మంగళహారతులు మాత్రము తెలుగులోను సంస్కృతములోను పాడినారు.

లలిత

మాధవునకు మంగళము - సాధుప్రియునకు
జయమంగళము
మదనగురునకు మంగళము మా - మదిలో
హరికిని జయమంగళము
మదరిపుహరునకు మంగళము - చదువుల
మూర్తికి జయమంగళము

గుండక్రియ

జయమంగళము నీకు సర్వేశ్వరా
జయమంగళము నీకు జలజవాసినికి

తీరిక సమయములలో మనయిండ్లయందు స్త్రీలు పాడుకొను రామాయణ సంబంధి దీర్ఘగేయములలో శాంతగోవింద నామాలు, పెండ్లి గోవింద నామాలు, అలని గోవిందనామాలు ముఖ్యమైనవి. ప్రతిచరణము చివరన గోవిందయను పద ముండుటచే వీనిని గోవిందనామములందురు. శ్రీరామాదుల అన్నప్రాశనమును శాంతగోవింద నామములిట్లు వర్ణించును.

బంగారు తబుకుతో గోవిందారామ
క్షీరాన్నమును దెచ్చి గోవిందారామ
పసిడి గిన్నెలో నుంచ గోవిందారామ
ఆయుధంబులు పండ్లు గోవిందారామ

ఈ వరుస ననుకరించుచు అన్నమయ్యగారు

దేసాళం

కొల్లవలపులు చల్లె గోవిందరాజ నిన్ను
గొల్లెతలు నవ్వేరు గోవిందరాజు॥
గొప్పలు మాచన్నులివి గోవిందరాజు-నిన్ను
కుప్పెలవలె నొత్తిని గోవిందరాజు

యను పాటను రచించినారు. అదేవిధంగా

'అంతట రాములవారూ, అంగను సీతనుగూడీ
సంతసమందుచు వేగా, స్వపురమునకు చనుదెంచీ'

యని సాగిపోవు స్త్రీల రామాయణపు పాట కనువుగా

జౌళి

సత్యముసేయగ వచ్చును - సర్వేశ్వర యీ
మాటకు
నిత్యము నీవే యెరుగుదు - నేనేమీనెరుగజుమీ

అను పల్లవిని కూర్చినారు.

అన్నమయ్య పాటలందు ఖండగతిలో నడచిన పాటలు చాల కలవు. నన్నయకు పూర్వము శాసనములందలి తరువోజలటు సీసపద్యములుగాను, ఇటుస్త్రీల పాటలుగాను మారినట్లు తోచును. స్త్రీలపాటల వరుస దంపుళ్ళపాటలవలెనే, తరువోజ వరుసను పోలియున్నది. తరువోజ రెండవ పాదమందలి చివరిగణములు సూర్యగణములుగామారి పరిగెత్తెడు పాటను సీసపద్యముగా నడిపించినవి. ద్విపద యందును నిట్టి మార్పే వచ్చినది. తరువోజలట్లు పాట వరుసలోకాక సీసపద్యము నడకతో సాగిన పాటలుకూడ తొలి దినములందుండి యుండును. ఇట్టివే యక్షగానములందు జంపెలను పేరుతో కనబడుచున్నవి. యక్షగాన మనునది త్రిపుట, ఏకతాళి, జంపె అర్ధ చంద్రిక, కురుచజంపె, ఏలవంటి పాటలను ద్విపద మరియు వచనమును గొనిసాగిపోయిన్న రచనమని కందుకూరి రుద్రయ సుగ్రీవవిజయ యక్షగానము సాక్ష్య మిచ్చుచున్నది. అటు తరువాత, అనగా విజయనగర సామ్రాజ్య పతనానంతరము దక్షిణాదికి తరలిపోయిన యక్షగానములందు తలుపు దగ్గరి పాటలును, పదములును దరువులును ప్రవేశించినవి. జంపెలు జానపదుల 'హరిహరీ నారాయణాది నారాయణా' యను వరుసలోనివి. గత శతాబ్దముననే జంపెలు కథాకథనమున కుపక్రమించినవి.

(శేషం)




అది మిట్టమధ్యాహ్నసమయం. ఒక కొండపై శివాజీ మహారాజు ఠీవిగా నిల్చొని వున్నారు. వారి అడుగులకు మడుగులు వొత్తుతూ చుట్టూ పరివారం వుంది. అల్లంత దూరంలో వందలాది మనుషులు కట్టడంపని సాగిస్తున్నారు. కొందరు కొండపైకి బండ రాళ్ళను ఎక్కిస్తున్నారు. మరికొందరు పీపాలతో నీళ్ళను మోసుకుపోతున్నారు. రాళ్ళు పగలగొట్టేవాళ్ళూ, సున్నం కలిపే వాళ్ళూ ఇలా ఎవరిపనిలోవారు తలమునకలుగా వున్నారు. చురచురమంటున్న ఆఎండ కంటే తీక్షణంగావున్నాయి శివాజీమహారాజు చూపులు. అదేపనిగా తన సర్దారులను పనికి పురమాయిస్తూ అదిలించి పారేస్తున్నారు. ఆ సర్దారులు తమక్రిందనున్న పనివాళ్ళపై తమప్రతాపం చూపిస్తున్నారు. ఆపనివాళ్ళ చేతులలో అక్కడ ఒక మహాదుర్గం మెల్లిగా రూపు దిద్దుకొంటోంది.

# దైవీసంపద

ఈ హడావిడిలో ఎక్కడినుంచో భగవన్నామ సంకీర్తన వినిపించింది. "జయ జయ రఘువీర" అంటూ! కాసేపటికి చేతిలో భిక్షాపాత్రతో, నెరసిన గడ్డంతో, కాషాయ వస్త్రాలుదాల్చిన స్వాములవారొకరు అక్కడ కనిపించారు. వారిని చూసీచూడగానే చేతులు జోడించి శిరసు వంచారు ఛత్రపతి శివాజీ!

హిందూధర్మంపట్ల ఆధర్మాన్ని ప్రచారం చేసే సాధువులపట్ల శివాజీకి పంచ ప్రాణాలు గదా! తనుకు వందనం చేసిన మహారాజుకు దీవెనలను అందించారు, ఆ స్వాములవారు. ఆయన సమర్థ రామదాస స్వామి. మహారాష్ట్ర దేశంలోని 'జాంబ' గ్రామంలో జన్మించి పన్నెండవ ఏటనే తపస్సు కుపక్రమించి పన్నెండేళ్ళు తపో దీక్ష వహించి బ్రహ్మజ్ఞానం సంపాదించిన ఘనుడాయన. తన ముప్పయ్యోరవ ఏట నుండి రాష్ట్రోద్ధరణ, ధర్మోద్దరణ కార్యక్రమం

ప్రారంభించి స్వధర్మార్థం, స్వరాజ్యార్థం పొందిన మృత్యువు మోక్షాన్ని కలిగిస్తుందనే నినాదంతో హిందువులను జాగృతంచేస్తున్న ధర్మపునరుద్ధరణ చక్రవర్తి అతడు. అలాంటి వ్యక్తి శివాజీని చూడటానికి వచ్చాడు. కాసేపటికి శివాజీ, రామదాసస్వామి మాటల లోకి దిగారు.

"చక్రవర్తులకు క్షణమైనా తీరికవున్నట్లు లేదే!" మర్యాద కోసం మాట జారారు స్వాములవారు. ఆ ఒక్క మాటతోనే గర్వం పొంగుకువచ్చింది శివాజీకి. నా బాధ్యతలు ఎన్నని చెప్పమంటారు, స్వామీజీ! ఒక వైపు రాజ్యంలోని ప్రజలందరికీ తిండీ బట్టా చూడాలి, మరోవైపు మొగలాయీల దండయాత్రల నుండి వారి ప్రాణాలు కాపాడాలి. ఇదేమైనా తేలికపాటి వ్యవహారమా? అసలు ఇంతస్వల్పకాలంలో ఇంతటివిజయం సాధించడమంటే మాటలా? కొద్దిమంది మావళీలతో మొదలుపెట్టి మొగలులనే ఎదిరించగల మహాసామ్రాజ్యం నిర్మించాను గదా...." ఇలా తన విజయ పరంపరల గురించి మహారాజు తనకు తానే చెప్పుకోవటంతో రామదాసస్వామికి మనస్సు చివుక్కుమంది. అయినా పైకి ఏమీ అనకుండా చిరునవ్వుతో వింటూ ఊరుకొన్నారు. ఇంతలో భోజనవేళ కావటంతో స్వామివారిని రాజప్రాసాదానికి భిక్షకు ఆహ్వానించి తీసుకుపోయారు శివాజీ. అక్కడ స్వామివారికి ఘనమైన మర్యాదలు జరిగాయి. మహారాణి వారే స్వయంగా వారికి భోజనం వడ్డించారు. ఇంతటి ఆదరణలోనూ స్వామివారికి ఏదో కొరతగానే వుంది. పైకి మందహాసం చిందిస్తున్నా లోలోపల ఏదోచింతిస్తూనేవున్నారు.

"శివాజీలో గర్వం, అహంకారం ప్రవేశించాయి. మహారాజు మంచివారే! కానీ అహంకారం అన్నది పతనానికే దారితీస్తుంది మహారాజును గనక సరైన దోవలో పెట్టకపోతే మహారాష్ట్ర సామ్రాజ్యం తద్వారా హిందూధర్మం కష్టాల పాలవుతాయి. ఎలాగైనాసరే తాను నిమిత్తమాత్రుడననీ, అంతా దైవకృపతో జరుగుతున్నదని శివాజీ మనసుకు వచ్చేలా చేయాలనుకొన్నారు రామదాసస్వామి. భోజనాలు అయ్యాక కాసేపు విశ్రాంతి తీసుకొని మళ్ళీ దుర్గం వద్దకు బయలుదేరారు శివాజీ, రామదాసస్వామీ!

దుర్గం పనిజరుగుతూవుంది. స్వాముల వారు ప్రక్కనే వున్నారని చెప్పి శివాజీ మరింతగా తన అధికారదర్పం ప్రదర్శిస్తున్నారు. మహారాజుకు సమీపంలో కొందరు బండలు పగుల గొడుతున్నారు. ఆ బండల వైపే చూస్తున్నారు స్వామీజీ. హఠాత్తుగా ఒక బండ బ్రద్దలయింది. అందులోనుండి ఒక కప్ప బయటకు దూకింది. అది చూచి "జయజయ రఘువీర" అంటూ కళ్ళుమూసి దైవాన్ని స్మరించారు స్వామీజీ! వెంటనే కళ్ళు తెరచి శివాజీని చూస్తూ—

"శభాష్! మహారాజా! నీ రాజ్యంలో ప్రజల బాగోగులే కాదు. జంతువుల మంచి చెడ్డలుకూడా నువ్వే చూస్తున్నట్లున్నావు. నీ దయవల్లే కాబోలు రాతిలోని ఆ కప్పకూడా తన ప్రాణం కాపాడుకోగలిగింది." మహా మేధావియైన శివాజీకి ఆ మాటలలోని అవహేళన క్షణంలో అర్థమైపోయింది. మరుక్షణంలో వారిలో గర్వం పటాపంచలయిపోయింది. స్వామివారి పాదాలకు ప్రణమిల్లి "స్వామీ! నన్ను క్షమించండి. అంతా నా ఘనతేనని విర్రవీగాను. దైవాన్ని విస్మరించాను. తెలివితక్కువగా ప్రవర్తించాను. మీ విమర్శతో మళ్ళీ గర్వమన్నది నాలో చొరకుండా చూసుకుంటాను." అంటూ హామీ ఇచ్చారు.

హైందవజాతి చరిత్రలో అదొక మహోజ్జ్వలఘట్టం. సమర్థరామదాసస్వామిని శివాజీకి రాజగురువును చేసిన అద్భుత సన్నివేశమది. కనిపించిన ప్రతి కోటపైనా హిందువుల ధర్మపతాకాన్ని ఎగురవేయిస్తానని శివాజీచేత శపథం చేయించాడు సమర్థ రామదాసస్వామి. ఆ ఇద్దరూ ఒకటై ఆ పని నెరవేర్చారు.

"రాతిలో కప్పకు ఆహారం ఎలా వస్తున్నది? కొబ్బరికాయలో నీళ్ళెలా పుడుతున్నాయి! శిశువు తాగేందుకు మాతృమూర్తికి స్తన్యమెలా వస్తున్నది? ఎవరు ఇస్తున్నారు ఇవన్నీ? సృష్టిలో కనిపించే ఘనత అంతా ఆ పరమాత్ముడి అంశారూపమే! ప్రతిభ అన్నదంతా ఆ దైవీ సంపదే! మనం నిమిత్తమాత్రులం మాత్రమే" అన్నది రామదాసస్వామి శివాజీకి చేసిన జ్ఞానోపదేశం.

— జితేంద్ర

*

## బడి — గుడి

బడి – బడి – బడి
చదువుల బడి
గుడి – గుడి – గుడి
దేవునిగుడి!
గణగణ మ్రోగిన
బడిగంట –
పిల్లలు ఇండ్లకు
పరుగంట!
గుడిలో మ్రోగిన
జే గంట
దేవుని రమ్మని
పిలుపంట!
బడిలో చదివిన
చదువున –
భుక్తి – బుద్ధికలవు:
గుడిలో చేసిన
పూజలు
భక్తికి – ముక్తికి నెలవు॥

— జి. రాజేందర్

[18 వ పేజీ తరువాయి]

ప్రాయమువంటిన ముదిమి అందుకు తోడైంది. మూలంలోని శబ్దమాధుర్యాన్ని, శ్లేషసౌభాగ్యాన్ని, అనువాదంలో పొదిపిన శాస్త్రిగారి ప్రతిభ అసామాన్యం. వెంకయ్య శాస్త్రిగారి కీర్తికాయాన్ని శాశ్వతంగా నిల బెట్టడానికి శిశుపాలవధ కావ్యమొక్కటి చాలు.

శాస్త్రిగారు త్రిమతస్తులకూ ఆమోద యోగ్యంగా భగవద్గీతను పద్యానువాదంగా వెలయించారు. సర్వజ్ఞకుమార యాచమ నాయుడు వచనంలో వ్రాసిన శృంగార భావాలను బ్రహ్మానంద శతకంగా పద్యాను వాదంచేశారు. ఈ శతకం శాస్త్రిగారికి బహుళ ప్రచారాన్ని, కళంకాన్ని తెచ్చి పెట్టింది. ఆ భానరసిక తారావళి అనే లఘుకావ్యాన్నికూడా ఆయన రచించారు. బాల్యంలో మారుతీ శతకాన్ని రచించారు. చివరి రోజులలో రాధికా పరిణయ ప్రబంధాన్ని వ్రాశారు. ఇందులో కొన్ని పద్యాలు తప్ప మిగిలిన గ్రంథం కాల గర్భంలో కలిసిపోయింది. వెంకటగిరి కాశీ విశ్వనాథస్వామి వైభవాన్ని తిరునాళ్ళ దండకంగా వ్రాశారు. వెలుగోటి ప్రభువులపై కొన్ని పద్యాలు చెప్పారు. భక్తి కీర్తనలు వ్రాశారు. శాస్త్రిగారు మొత్తం ఇరవై వేలపైబిలుకు పద్యాలు వ్రాశారు. ఆస్థాన కవీంద్రులుగా సంపాదించిన సిరు లను దానధర్మాలకు వినియోగించారు. లక్ష్మీపురం చెరువుకట్ట పునరుద్ధరణచేశారు. స్థానికులు ఇప్పటికీ ఆ చెరువుకట్టను శాస్త్రి గారి పేర పిలుస్తారు. కొళ్ళపూడి కోదండ రాముడికి మడిమాన్యాలు సమర్పించారు.

శాస్త్రిగారు సహస్రమాసజీవి. ఆయన చివరిరోజులలో సూతసంహితను అనువ దిస్తూ వచ్చారు. 1892 జూన్ 6 న పోషక ప్రభువు సర్వజ్ఞ కుమారులు మరణించారు ఆ మూడవనాడే, అనగా జూన్ 8 న శాస్త్రి గారు దిగులుతో స్వర్గస్థులయ్యారు. శ్రీ పుట్ట పర్తి నారాయణాచార్యులుగారు వెంకయ్య శాస్త్రిగారిని గూర్చి ఇట్లా పేర్కొన్నారు.

"గోపీనాథులు చాల ప్రసిద్ధులైన విద్వ త్కవులు. శాస్త్ర పాండిత్యముతో పరిపక్వ మైనది వారి సాహిత్యము. ప్రాచీన మహా కవుల కోవకు చెందిన వారిలో వీరు కడపటి వారు". ఈమాట సత్యం కాకపోతే వీరేశ లింగం పంతులుగారు గోపీనాథుని వెంకయ్యశాస్త్రిగారితో తమ కవుల చరిత్రను ముగిస్తారా ?



---

## శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం, శ్రీనివాసమంగాపురం.

శ్రీనివాసమంగాపురంలోని శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయంలో జరుగు నిత్య కల్యాణోత్సవం, అభిషేకం, నిత్యఅర్చన వివరాలను యాత్రికుల సౌకర్యార్థం ప్రచురిస్తున్నాము.

**నిత్యకల్యాణోత్సవం :**

నిత్యకల్యాణోత్సవసేవ ప్రతిరోజూ ఉదయం 10-30 నుంచి 12.00 గంటలవరకూ జరుగుతుంది. ఈ సేవకు 150 రూ॥లు చెల్లించాలి. పదిమంది వ్యక్తులను ఈ సేవలో పాల్గొంటానికి అనుమతిస్తారు. గృహస్థుకు వస్త్రబహు మానం వుంటుంది.

**అభిషేకం :**

ప్రతి శుక్రవారం అభిషేకసేవ జరుగుతుంది. (ఉదయం 7-30 నుంచి 9 గంటలవరకు) అభిషేకం చేయించే వారు 100 రూ॥లు చెల్లించాలి. ఇద్దరు వ్యక్తుల్ని ఈ సేవలో పాల్గొనటానికి అనుమతిస్తారు.

**నిత్యఅర్చన :**

నిత్యఅర్చనసేవ సంవత్సరకాలమూ ప్రతిరోజూ వుంటుంది. ఈ సేవ చేయించదలచినవారు 42రూ॥లు చెల్లించాలి.

# వసిష్ఠ గీత

**— శ్రీ వి. సుబ్బారాయుడు**

యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్.

ఎప్పుడైతే ప్రపంచములో ధర్మచ్యుతి జరుగునో, ధర్మరక్షణ కొరకు తననుతానే సృష్టించుకొనెదననినాడు భగవంతుడు. ఆయా యుగములలో భగవంతుడెత్తిన అవతారములిందులకే.

త్రేతాయుగములోనిది రామావతారము. కృష్ణావతారము ద్వాపరములోనిది. ద్వాపర యుగములోని కృష్ణుడు ధర్మప్రబోధకుడైతే త్రేతాయుగములోని రామునకు ధర్మప్రబోధము గావించబడి, ధర్మాచరణము గావించ బడినది. రామునకు ధర్మప్రబోధము గావించినది వసిష్ఠమహర్షి. అర్జునునకు ధర్మ ప్రబోధము గావించినది శ్రీకృష్ణపరమాత్మ. వసిష్ఠమహర్షి బోధామృత సారాంశమే వసిష్ఠ గీత లేక జ్ఞానవాసిష్ఠము. శ్రీకృష్ణపరమాత్మ గావించిన ధర్మప్రబోధమే భగవద్గీత.

మారీచ సుబాహులు వారి యనుచరులు అరణ్యములలో మునులు చేయు యజ్ఞ యాగాది వైదికకర్మలను ధ్వంసము గావించుచు అధర్మవర్తనులై యుండిరి. అప్పటికే సన్యాసాశ్రమ స్వీకారముజేసి మునివృత్తి జరించుచుండిన విశ్వామిత్రమహర్షి తనంతటతానే రాక్షస సంహారము గావించుట ధర్మవిరుద్ధము గావున, అయోధ్యాపతి-దశరథ మహారాజు కడకేగి జరుగుచున్న దుష్కృత్యములను వివరించెను. తన కోరికను మన్నింతునను మాటను ముందు తీసికొని, పిదప దశరథునితో యాగసంరక్షణార్థము శ్రీరాముని తనవెంట బంపుమనెను. ఆడినమాట తప్పినదిగాదు సూర్యవంశము. అందువల్ల రాముని బంప నిశ్చయించుటలో దశరథుడు మనోవేదనకు గురియైనప్పటికీ విశ్వామిత్రుని వెంట బంప నిశ్చయించుకొని రాముని పిలువబంపెను.

అప్పటికి రాముని వయస్సు పదునాలు వత్సరములు. ఆయన మానసిక స్థితియే వేరు. సమస్త వస్తుజాలముతో గూడిన ఈ ప్రపంచము అశాశ్వతమైనదని, భౌతికమైన రాజ్యభోగములు క్షణికములని, మానవ జీవితమే నీటి బుడగవలె క్షణభంగురమైనదని తలచుచు చింతాక్రాంత మానసుడై విరాగి వలె నుండెడువాడు.

కురుక్షేత్ర యుద్ధరంగములో తాను యుద్ధముచేయుటకు సమకట్టిన బంధుప్రాత మును జూచి, బంధుత్వములను ఏకరువు పెట్టుచు, వారిపై యుద్ధముచేయ నిచ్ఛగించక, రాజ్యభోగముల నాకాంక్షించుట చేతనే గదా ఈ సంగ్రామోద్ధతి? యని పలువిధముల తలపోసి; బంధు నాశనకారి యగు నీ యుద్ధమును చేయనని, ధనుర్బాణములు చేయి జారిపోవుచున్నవని పలవరించి, శరచాపముల క్రిందవైచి అర్జునుడు యుద్ధవిముఖుడాయెను.

శ్రీరామచంద్రుని మానసిక స్థితిగూడ ఇప్పుడిటువంటిదే.

శ్రీరాముని ఆంతరంగిక స్థితిని గమనించిన విశ్వామిత్రమహర్షి వసిష్ఠమహర్షితో "మహాభాగా! మీరు రఘుకుల గురువులు, తపోధనులు, త్రికాలజ్ఞులు, రామునకు జ్ఞాన బోధ గావించి, హృదయ తాపము చల్లార్చి కార్యోన్ముఖుని జేయుమ" ని విన్నవించెను.

కథల ద్వారాను, పెద్దల సంభాషణల ద్వారాను, సంవాదముల ద్వారాను, సూక్తుల ద్వారాను తత్త్వబోధ గావించినాడు వసిష్ఠమహర్షి శ్రీరామచంద్రునకు. ముని వ్యాధ సంవాదమను ప్రస్తుతాంశము అందులో నొకటి.

పూర్వజన్మ సంస్కారముగల ఒక లేడి బోయవానిచే చంపబడెను. ఆ లేడి వ్యాధుని ముఖము చూచి మరణించెను. కాన మరు జన్మలో ఆ లేడి వ్యాధుడుగ జన్మించెను. మృగములను వేటాడుచు చివరకు ఒక ముని ఆశ్రమమునకు విశ్రాంతికై వచ్చెను.



మునికి వ్యాధునకు జరిగిన సంవాదమే ఒక తత్త్వబోధ.

ముని: ఓ వ్యాధుడా! నీవు మృగవధనేల చేయుచుంటివి? హింస మహాపాతక మను విషయము నీకు తెలియదా? మేఘములయందు వ్రేలాడు నీటి బిందువులు క్షణికములు. భోగభాగ్యములు మెరపులవలె చంచలమైనవి. యౌవనము గూడ అశాశ్వతమే. శరీరమునకు వాటిల్లగల హానిని గురించి యూహించ లేము. నశించు సంసార వ్యాసంగివి గాక మోక్షమార్గమును అభిలషించుము.

వ్యాధుడు: మౌనివర్యా! మీరు చెప్పినదే నిజమైతే దుఃఖోపశమనము కొరకు అతి కఠినమైనదియు, అతిమృదువైనదియు కాని పద్ధతి ఏదో సెలవిండు.

ముని: ఓయీ! నీవు ధనుర్బాణములను విసర్జించి, మునుల పద్ధతుల నవలంభించి, నియమ నిష్ఠల నాశ్రయించి, దుఃఖరహితుడవై ఋష్యాశ్రమముల యందే వసింపుము.

ముని వాక్యముల నాలకించిన వ్యాధుడు తన పూర్వపు వ్యాపారమును కట్టిపెట్టి, నియమము దప్పక నిష్ఠల నాచరించి, యాచించకయే లభించు దానినే భుజించుచు ఋష్యాశ్రమములలో కొంతకాలము గడుపగా, సజ్జనసాంగత్యము ద్వారా లభించిన చిత్తశుద్ధితో ఏది శాశ్వతమైనది? ఏది అశాశ్వతమైనది? అను విషయమును తెలిసికొనగల స్థితికి వచ్చెను. అతనితో

ముని: మేధావీ! ఆత్మ చైతన్యమైనది. జడముకాదు. భౌతిక కాయము ఎన్ని పర్యాయములు మరణించినను చేతన మగు ఆత్మ మరణించినట్లుగాదు. ఆ చేతనత్వమే భ్రాంతిచేత స్థూలశరీరము (భౌతికము) సూక్ష్మశరీరము (ఆత్మ)గ ప్రకాశించును. సూర్యమండలమున నున్న సూర్యుడు ఎట్లు సర్వత్ర కాంతిని ప్రసరింపజేయునో, అట్లే భగవంతుడు తననుండి ఉత్పన్నమైన శరీరధారుల యందు జీవుడుగ (చైతన్యము) నున్నాడు. లోని స్వప్నావస్థ, బయటి జాగ్రదవస్థల యందు భగవత్స్వరూప మగు చైతన్యమే "నేను" అను నిజ స్థితిని ఎరిగిన జీవుడే ముక్తుడు. జీవుడు కాల్చబడడు. చంపబడడు.

మునికి వ్యాధునకు జరిగిన సంభాషణను రామునకెరిగించి, తర్వాత రామునితో

వసిష్ఠుడు: రామచంద్రా! దేహము నిజము కాదు. మనస్సును వేరుచేసినచో దేహమే లేదు. సమస్తము బ్రహ్మమయమే. ప్రపంచమంతయు బ్రహ్మ తత్త్వముచేతనే నడచుచున్నది. ఉన్నది ఒక్క ఆత్మయే. ప్రపంచముగాని, ప్రపంచములో కనిపించునవిగాని ఏమియును లేనివే. కనిపించునదంతయు నశించునదే. శరీరమే నేనను వారికి భ్రాంతి తొలగదు. తత్త్వజ్ఞానముచేత మాత్రమే ఈ భ్రాంతి తొలగగలదు. స్థిర చిత్తులైన మునివ్యాధుల సంభాషణల నాలకింపుము.

వ్యాధుడు: మునిశ్రేష్ఠా! ఈ జగత్తే అసత్య మయితే ఈ విషయమును తెలిసికొనుట వల్ల మాత్రము ప్రయోజనమేమి గలదు?

ముని: ఓయీ! జగత్తు అసత్యము, స్వప్న సదృశము మాత్రమేనని చెప్పుట ఏల యన అట్లు చెప్పుటచే ఇది కేవలము మానసిక భ్రమయని – నిజముకాదని తెలిసికొనగలందులకు మాత్రమే.

మరియు మనస్సు వస్తురూప వ్యాపారమును విడచి, నిర్వికారమై, అనంతమై, లోపల, వెలుపల స్థిరమైనట్టి ఏ పరిశుద్ధాత్మవై నీవుండెదవో అదియే "నీవు." తనను తాను ఆత్మరూపముగ గాక, భౌతిక శరీర రూపముగ ఎవరు ఎరుగుచున్నారో ఆ యెరుకయే అవిద్య. మేలుకొనిన తర్వాత స్వప్న విషయము లెట్లు అసత్యములని తెలిసికొనుచున్నామో ఆత్మజ్ఞానము పొందిన తర్వాత జగత్తులో కనుబడు పదార్థము లన్నియు అసత్యములేయని తేలును. దృశ్యప్రపంచమును చూచి అజ్ఞాని భయపడును. జ్ఞాని భయమునొందడు. సజ్జన సాంగత్యము లేకపోవుటచే బుద్ధి శాంతిని పొందకున్నది.

వ్యాధుడు: మహాత్మా! పూర్వజన్మల అభ్యాసముచే నాయందు అవిద్య దృఢపడినది. శమించకున్నది. గురుసేవచేసి

## బొట్టు

రెండు బొమల నడుమ
నిండు చందురు పోలె
యుండు తిలకము బ్రదుకు
వందించు నిది నిజము

సంస్కృతీ సభ్యతల
సంతరించును బొట్టు
దైవ చింతన నిచ్చి
ధన్యుల చేయును బొట్టు

శాంతి కది చిహ్నంబు
నమత మమతల గుర్తు
కాంతినిడు వదనమున
కళల నింపును బొట్టు

పరదేశ సంస్కృతిని
బట్టుకొని పరుగిడకు
మనధర్మమును దెలసి
మనవోయి మానవుడా

వట్టి పోయిన మోము
వట్టి బుర్రనె జూపు
మట్టి బొమ్మకు గూడ
బొట్టున్న ముద్దుగద

తన ధర్మమునను రణ
మును బొందినను మేలె
పరధర్మ మతి భయం
కర మనుట వినలేదె.

— ఆనంద్, కమలం

శాస్త్ర విచారణతో, సత్సాంగత్యముచేసి నా శ్రమను తొలగించుకొని శాంతిని పొందెదను.

ముని: పృథమనస్కా! కనుపించున దంతయు ఒక స్ఫురణ మాత్రమే యని భావింతువేని సంతాపము, సందేహము, అహంకారములు నశించగలవు. చేయు పనులకు నేను కర్తనుగాను, భగవంతుడే కర్తయను భావము కలుగవలెను. దృశ్య ప్రపంచమునకు సన్నిహితుడుగాక చైతన్య వస్తువగు ఆత్మను గురించి చింతనచేయుచు, ఆత్మయందే స్థిర చిత్తముగలిగి, కామక్రోధాది ద్వంద్వ ముల నుండి విముక్తిని పొందినవాడే ఆత్మను పొందును. నీవు ప్రజ్ఞానవంతుడ వైతివి. నీ యిష్టానుసారము వర్తింపుము.

ఈ బోధనలు వినిన వ్యాధుడు "అభ్యాస హీనుడనగుటచేతనే నిజస్థితి తెలియజాలక పోయితిని. ఇతర మును లతో నుండి కొంతకాలము తపమాచ రించెద" నని నిర్ణయించుకొని, తపమా చరించియు విశ్రాంతిని పొందలేక పోవుటవలన మరల ముని యొద్దకేతెంచి

వ్యాధుడు: స్వామీ! తమరు సెలవిచ్చినట్లు కొంతకాలము తపమాచరించితిని. కాని విశ్రాంతి కలుగలేదు. నాకెపుడు విశ్రాంతి కలుగగలదో తెలుపప్రార్థన.

ముని: ప్రజ్ఞానీ! నీ యందిపుడు జ్ఞానము అతిస్వల్పముగ అగ్నివలెనున్నది. కాల క్రమమున నీకు పూర్ణవిశ్రాంతి లభించ గలదు. నీ భావికాలమును గురించి చెప్పెద. విను.

నీవిట్లు అనేక యుగములు తపమాచ రించెదవు. బ్రహ్మ నీకు ప్రత్యక్షమగును. "నా శరీరములోని ప్రతి అవయవము ప్రతిక్షణము అభివృద్ధిజెంది, క్రమముగా అది ముల్లోకముల బాహ్యమున నేగాక, విశాలరూపముగ నుండి వెలుగొంది, అనంతమైన దృశ్యములో అంతము నేను పొందవలె" నను వరమును కోరె దవు. వరమును పొంది ఆ ప్రభావముతో నీ దేహము కోరిన పదార్థముల గాంచు టకు అనుక్షణము అభివృద్ధిజెంది కోరిన వానినెల్ల సృష్టిలో గాంచగలవు. ఇట్లు నీతపఃఫలితమును అనుభవించుచు కొంత కాలము గడిపి విరాగి వయ్యెదవు. "నా అవిద్య నశించకున్నది. కేవల బ్రహ్మ జ్ఞానమువల్ల తప్ప మరిదేని చేతను ఇది అంతముగాదు. మోక్షము పొందజాలను. ఈ దేహమును త్యజించెద" నని పలికి వాయురేచకము చేసి దేహమును వదలె దవు. అప్పుడు జీవుడు సూక్ష్మరూపమున ఆకాశమున వాయువుగనుండును అని పలుకు మునితో

వ్యాధుడు: బ్రహ్మవేత్తా! నేను తెలియమిచే పురుషార్థ భ్రమతో దుఃఖ భాజనుడ నైతిని. నా తదుపరి భావికాలస్థితి ఏ విధముగ భాసిల్లగలదో తెలిపి పుణ్యము కట్టుకొనుడు.

ముని: ఓయీ! ఎవరు వారియొక్క సహజ మైన పుణ్యకర్మలచే, శమ దమాది సాధ నలచే బ్రహ్మజ్ఞానమును కలిగించు శ్రవణ, మననాది ఉపాయములచే తత్త్వజ్ఞానమును పొంది బ్రహ్మసమాన రూపులై, కంటికగుపడు ప్రపంచ విష యములపై అనాసక్తులై, సమస్త కర్మ లను, దురాలోచనలను నశింపు చేసికొనె దరో వారే సర్వమును జయించిన వారయ్యెదరు.

వ్యాధుడు: మునిపుంగవా! మీరు చెప్పి నట్లు జీవుడు ఆకాశమున వాయురూప ముగ నుండిన తరువాత మరెట్టి స్థితి సంభవించగలదో వివరించ గోరు చున్నాను.

ముని: తత్త్వవేత్తా! నీ మనోవృత్తి మహ త్త్వము పొందినది. నీవు కోరినయట్టి స్థితిని పొందగల శక్తి నీకు గలదు. మరి కొంత వివరించెద. సావధాన చిత్తుడవై ఆలకింపుము.

నీ జీవుడు భూమిపైన "నేనురాజు" నను భావముతో భాసించును. సింధు రాజుపై రాజ్యవిస్తరణ కాంక్షచే విదుర థాది రాజుల నోడించి చక్రవర్తి వయ్యె దవు. తత్త్వశాస్త్రజ్ఞులైన మంత్రులతో పలు విషయాలపై ప్రసంగించెదవు. మంత్రి నీతో "నీకిప్పటి కెన్నియో జన్మలు గడచినవి. వానిని నేనెరుగు దును. నీవెరుగవు. ఆకాశగామిగా బహు కాలము వృథా గావించితివి. ఇందుకు నీ తామసగుణమే ప్రధానమైనది" అనగా విని నీవు "తరణోపాయమును ఆదే శింపు"మని కోరెదవు. భయరహితుడవు కమ్మని, పురుషప్రయత్నముచే దేని నైనను సాధింపవచ్చుననియు, నిన్న జేసిన చెడుకార్యము నేడు జేసిన సత్క ర్మచే జయించబడునట్లు, నీవు పూర్వ జన్మలో చేసిన దుష్కృత్యముల ప్రభా వము నేడు చేయు సుకర్మల ప్రభావ ముతో సమసి పోగలదనియు, సాధనలో ప్రయత్నలోపము ఉండ రాదనియు. సోమరితనము విడువవలెననియు. నిశ్చయ ప్రయత్నముతో, నిరంతర భావముతో ఏది కావలెనని కోరుదువో అది ఆ విధముగనే జరుగుననియు బోధించును.

మునిసత్తముడు భవిష్యత్తును గురించి చెప్పినట్లుగా వ్యాధుడు రాజై రాజ్యమేలి, మంత్రిచెప్పినట్లుగా తర్వాత రాజ్యత్యాగముచేసి, వివేకవంతులతోడి ప్రసంగములతో, నిరంతర తత్త్వ విచా రణతో. తపోనిష్ఠలతో కాలము గడిపి జీవన్ముక్తుడయ్యెను.

మునివ్యాధ సంవాద రూపమగు తత్త్వ విషయములనేగాక, తదితర అనేక విషయములను వసిష్ఠమహర్షి శ్రీరామచంద్రుడికి బోధింపగా. ఆయన మనస్సుమారి కార్యోన్ముఖుడై విశ్వా మిత్ర మహర్షి వెంట యాగసంరక్ష ణార్థము, లక్ష్మణునితో గూడ బయలు దేరెను. •

(14 వ పేజీ తరువాయి)

వారని హనుమంతుడు సీతను వెదకుతూ అక్కడచూసిన దృశ్యాన్నిబట్టి తెలుస్తుంది.

"నృత్తవాదిత్రకుశలా రాక్షసేంద్ర భుజాంకగాః,
వరావరార్హస్య నిషణ్ణా దదృశే కపిః"
"అంగహారైస్తథైవాన్యా కోమలైర్నృత్యశాలినీ,
విన్యస్తశుభ సర్వాంగీ ప్రసుప్తా వరవర్ణినీ"

నాట్య గానాలకి వాద్యాలతో విడరాని పొత్తు. అవి ఆనాటికే ఎన్నెన్నో విధాలుగా ఉండేవనేది ఈ సందర్భంలో హనుమంతుడక్కడ చూసిన వీణా పణవ ముడ్డుక డిండిమ, పటహ, కలశ, విపంచీ మృదంగాది చిత్ర విచిత్రమైన వాద్యాలవల్ల స్పష్టమౌతూంది. వీటిని వాయించే నేర్పుకూడ అప్పటి రాజాంతఃపురాల్లో నియమితులైన పరిచారికా వర్గంలో ఎందరికో ఉండేదని కూడ బోధపడుతూంది.

నృత్యగాన కళలు, వాద్యపాండిత్యం, నటనాభినయాల్లో చాతుర్యం వగైరాలు ఆనాటికే వేర్వేరు జాతుల పరమయ్యాయని కూడ రామాయణం ద్వారా స్పష్టమౌతుంది. నటులు, నర్తకులు, కుశీలవులు, శైలూషులు వగైరా పేర్లతో ఆయా వృత్తులవారు పేర్కొబడ్డారు. వృత్తి, జాతి అనేవి ఏర్పడినప్పుడు వాటికి తగిన కులధర్మాలుకూడ సహజంగానే వికసిస్తాయి. వారి నీతి నియమాలు వారికే నియతంగా ఏర్పడి సమాజంలో ఆమోదముద్ర నందు కుంటాయి. రాముడు అరణ్యానికి పోయేముందు సీతను అయోధ్యలోనే ఉండిపొమ్మనిచెప్తాడు. ఆమె అతణ్ణి విడిచి ఉండడానికి ఇష్టపడదు. రాముడు ఏదేదోచెప్పి ఒప్పించబోయే సరికి ఆమె విసిగి "శైలూష ఇవ మాం రామ పరేభ్యోదాతు మిచ్ఛసి" అని భార్యనింకో చోట ఉంచడం, ఉండమనిచెప్పి వంపడం వంటివి శైలూష ధర్మాలు కాని సామాన్య ధర్మాలు కావని స్పష్టంచేస్తుంది. ఒకరిధర్మం వేరొకరికి పనికిరాదు. అది స్వధర్మానికి విరుద్ధం. అన్ని ధర్మాలు యథాతథంగా కాపాడటం రామధర్మం.

సంగీతమంటే నృత్యగానాలతోను, వాద్య ఘోషలతోను కూడినదే కాని ఏ ఒక్క అంగంతోటో ఉంటే అది సంగీతమనిపించుకోదు. 'నృత్యవాదిత్ర గీతానాం త్రయం సంగీత ముచ్యతే' అని సంగీతాన్ని నిర్వచిస్తారు. ఆ యీ నిర్వచనానికికూడ మూలం రామాయణంలోని వర్ణనలేనేమో అనిపిస్తుంది. వర్షాకాలాన్ని వర్ణిస్తూ వాల్మీకి మహర్షి 'వనేషు సంగీత మివప్రవృత్తమ్' అని అప్పటి వనాంతర వాతావరణాన్ని సంగీత ప్రదర్శనంతో పోల్చివర్ణించారు.

" షట్పాద తంత్రీమధురాభిధానం
ప్లవంగమోదీరిత కంఠతాలం,
ఆవిష్కృతం మేఘ మృదంగనాదై
ర్వనేషు సంగీతమివప్రవృత్తమ్"
" క్వచిత్ ప్రనృత్తైః క్వచిదున్నదద్భి
క్వచిచ్చవృక్షాగ్ర నిషణ్ణకాయై
ర్వ్యాలంబ బర్హా భరణై ర్మయూరై
ర్వనేషు సంగీతమివ ప్రవృత్తమ్"

తుమ్మెదలు శ్రుతి కూరుస్తున్నట్లు, మేఘాలు వాద్యఘోషలు నెరపుతూన్నట్లు, ఆభరణాలంకృతలైనట్లు పురివిప్పి నెమళ్ళు నాట్యంచేస్తూన్నట్లు, వనచరులు మహోల్లాసంతో వివిధాకృత్యను రూపధ్వని విశేషాలతో సతాళంగా గానంచేస్తున్నట్లు, చెప్పి అన్నీ చేరి సంగీత ప్రదర్శనలా ఉన్నాయనడంలో ఇవన్నీ చేరితేనే సంగీతమనిపించుకొంటుందనే భావం స్పష్టమౌతూంది.

కథాకళి వంటి ప్రదర్శనాలలో ముందుగా చండవాద్యంవంటివి వాయించి ప్రజలనాహ్వానిస్తారు. మన వీధినాటకాలలో కూడ పెద్ద పెద్ద మద్దెళ్లు తాళాలు వాయించి యిదే విధంగా నాటక ప్రదర్శనం జరగబోతూందని తెలియజేస్తారు. పై వర్షావర్ణనంలోకూడ వాల్మీకి యీ విషయాన్ని స్ఫురింప జేశాడు.

"స్వనైర్ఘనానాం ప్లవగాః ప్రబుద్ధా
విహాయనిద్రాం చిరసన్నిరుద్ధాం,
అనేక రూపాకృతి వర్ణనాదా
నవాంబు ధారాభిహతా నదంతి".

రాత్రంతా ప్రదర్శనానికి నిద్రమానుకొని, నిద్ర ఆపుకొంటూ కోలాహలంగా వచ్చి ఆనందించే ప్రజాసమూహం వలె వానర సమూహమంతా ఆ వార్షుక సంగీతాన్ని మేఘ ఘోషతో గమనించి వానలో వచ్చి ఆనందించ సాగాయని వ్రాసిన దానినిబట్టి యీ సంప్రదాయమెంత ప్రాచీనమైనదో తెలుస్తుంది. దీన్నే తర్వాత భరతనాట్య శాస్త్రంకూడ అనువర్తించి నాందీ ప్రస్తావనల్లో వివరంగా వర్ణించింది.

# రామాయణంలో శబరి

వైకుంఠపురంలో అంగరంగ వైభోగంతో విరాజిల్లే ఆ శ్రీమహావిష్ణువు సిగ నలంకరించిన దివ్యపారిజాత పుష్పజీవితం ఎంత చరితార్థమో ఎక్కడో ఒక అడవిలో మారుమూల ముక్కుపట్టుకొని కూర్చున్న మహర్షి పాదాల మీదబడి వాడిపోయే అడవి మల్లె జీవితంగూడ అంతే చరితార్థం. అన్ని పూలు దివ్యపారిజాతాలు కానక్కరలేదు, కాలేవుగూడ. అన్ని పూలకు ఆ శ్రీ మహావిష్ణువు శిరస్సు నలంకరించే అవకాశంరాదు, రానక్కరలేదుగూడ. కాని శ్రీమహావిష్ణువు శిరస్సు నలంకరించిన పారిజాతం మానవ దృష్టిని ఆకర్షించినంతగా ఎక్కడో మహర్షి పాదాలమీదబడి వాడిపోయే అడవిమల్లె ఆకర్షించలేదు. అయితే మహాత్ముల దృష్టిలో మాత్రం రెండూ సమానమే.

రామాయణంలో శబరి ఒక అడవిమల్లె పువ్వు. ఆమె అడవిలోనే పుట్టింది. అడవిలోనే రాలిపోయింది. ఆమె అంతరంగం భక్తిభావంతో పరిమళించింది. ఆమె జీవితం మహర్షుల సేవకు అంకితమైంది. పరిచారికాభక్తికి ఆమె పెట్టినపేరు. ఆమె తల్లిదండ్రులెవరో తెలీదు, ఆమె ఎందుకు పెళ్ళాడలేదో అసలే తెలీదు. శబరి ఒక గొప్ప సన్యాసిని. ఏ వయస్సులో ఆమె మతంగ మహర్షి ఆశ్రమంలో అడుగుపెట్టిందో! ఎందుచేత తన జీవితాన్నంతా ఆ ఆశ్రమసేవకే ధారవోసిందో! బహుశః అదంతా ఒక పూర్వజన్మ వాసన–దాని ప్రేరణ.

మతంగాశ్రమంలో ఒక మూల ఉంది శబరి కుటీరం. ఆమె ఉషఃకాలాన్నే లేచేది, ఆశ్రమంలో కసవూడ్చేది. నీళ్ళు చల్లేది. రకరకాల ముగ్గులు పెట్టేది. పూజకు పూలు తెచ్చేది, భోజనానికి పండ్లు అమర్చేది. ఆ మహర్షుల నారబట్టలు పిండిపెట్టేది. వాళ్ళిచ్చే తీర్థప్రసాదాలు పుచ్చుకొని, కళ్ళకద్దుకొని తన కుటీరానికి వెళ్ళేది. ఆమెదొక తీరికలేని జీవితం, కోరికలేని జీవితం, తృప్తికి నోచుకొన్న జీవితం, ముక్తికి చేరువయ్యే జీవితం.

శబరి ఆలోచనఅంతా ఆశ్రమ పరిచర్య మీదే, ఆమె బ్రతుకంతా ఆశ్రమ పరిచర్య కొరకే! ఆ మతంగాశ్రమాన్ని చిమ్మిచల్లటం లోనే ఆమె కోర్కెలు గుండెలో చల్లబడ్డాయి. అక్కడ ముగ్గులు పెట్టడంలోనే ఆమె తల 'ముగ్గుబుట్టలా' మారిపోయింది. పూలు సేకరించటంలోనే ఆమె కనుచూపు సన్నగిల్లింది, పండ్లు ఏరటంలోనే ఆమె నోటి పండ్లన్నీ రాలిపోయాయి. బట్టలు పిండటం లోనే ఆమె శరీరం ముడుతలుపడి మెలికలు దిరిగింది. శబరి ఇప్పుడు గాలికి గలగలలాడే ఒక ఎండుటాకు! ఏ క్షణంలోనైనా రాలిపోయే ఒక పండుటాకు! అయినా ఆమెకు అలసటలేదు, బాధల్లేవు, భయాల్లేవు అసంతృప్తి అసలేలేదు.

ఆశ్రమంలోని మహర్షులంతా ఒక్కొక్కరే సిద్ధిపొందారు. అదృశ్యమయ్యారు, అయినా శబరి ఇంకా మిగిలిఉంది, ఆశ్రమంలో ఒంటరిగాఉంది. ఎవరికోసమో? ఎందుకోసమో?

ఆమె ఒంటరిగా ఉందేగాని ఆమె మనస్సుకు మాత్రం ఒంటరితనంలేదు. ఆమె మనస్సులో ఎవరో ఉన్నారు. వాళ్ళకోసమే ఆమె మిగిలిఉంది. వాళ్ళకోసమే ఆమె ఎదురుచూస్తున్నది. అంతేగాదు. ఆశ్రమంలోని యజ్ఞ వేదికలు, దర్భకొనలు. పూల తీవలు, పండ్లచెట్లు చుట్టుప్రక్కలఉండే గుట్టలు, కొండలు, సెలయేళ్ళు, పక్షులు,



మృగాలు అన్నీ ఆమెకు తోడే. అన్నీ ఆమెకు ఏవోగత స్మృతులను కలిగించేవే. పూర్వ పరిచయాలను గూర్చి మూగబాసలో మాటాడేవే.

ముడుతలు పడ్డముఖంతో, పొగమంచు దొంతరల్లాంటి జుట్టుతో, పూడుకపట్టబావి అడుగున మినుకు మినుకు మనే మిణుగురుల్లాంటి కళ్ళతో, వణుకుతున్న కాళ్ళతో, కఱ్ఱ ఊతవేసుకొంటూ శబరి మాటిమాటికి తన కుటీరం వాకిట నిలిచి, కుడిచేతిని కళ్ళకానించి, చూపుసారించి, వంగిపోయిన వడుమును ఒకింత నిక్కించి ఎవరికొరకో ఎదురుచూస్తున్నది. ఏదో మూటాముల్లె సర్దుకొని ప్రయాణానికి సిద్ధమై మాటిమాటికి వాకిట నిలిచి బండికొరకు ఎదురు చూచే ఆడపడుచులా ఉంది ఆమె మనస్సు సముద్రాన్ని చేరుకోటానికి ఆరాటంతో ఎగిరెగిరి దూకే ఏటి ప్రవాహంలా ఉంది ఆమె మనస్సు. ఆ చెట్టు, ఈ గుట్ట, ఆ కొండ, ఈ బండ ఎక్కడ ఏ శబ్దమైనా శబరి రామా! రామా! రామా! అని పలవరిస్తున్నది.

ఈ నిరీక్షణ ఎప్పటినుండో! ఎంతవరకో!

మతంగ శిష్యులైన మహర్షులంతా స్వర్గానికి వెళ్ళుతూ 'శబరీ! నిన్ను చూడటానికి శ్రీరామచంద్రుడు వస్తాడని, లక్ష్మణునితో కలిసి నీవు చేసే అతిథి సత్కారాలన్నీ స్వీకరిస్తాడని, ఆ పుణ్యపురుష దర్శనంతో నీవు పునరావృత్తిలేని లోకాలకు చేరుతా'వని చెప్పారట. అప్పటినుండి శబరి ఎదురుచూస్తున్నది. కళ్ళుకాయలుకాచేలా ఎదురుచూస్తున్నది. ఎంతకూ ఆ రాముడు రాడు. ఎక్కడున్నాడని! ఎప్పుడు వస్తాడని! ఆయనంతట ఆయనేరావాలి. ఆయనకు బుద్ధిపుట్టినప్పుడు రావాలి. తన్ను గ్రహించాలి. తన జన్మ తరించాలి. అంతవరకు ఈ ప్రాణి నిరీక్షణ ఇలా కొనసాగవలసిందే. అంతవరకు ఈ ప్రాణి తపన ఇలా తలుపులు తెరుచుకొని కూర్చోవాల్సిందే.

అయితే ఆయన ఎప్పుడోగదా వస్తాడని ఊరకుండటం ఎలాగ? ఆయన ఏ రోజైనా రావచ్చు. ఏ క్షణాన్నైనా రావచ్చు. ఏ తోవనైనా రావచ్చు.

ఆయన ఎంతోదూరం ప్రయాణంచేసి వస్తాడు. అలసివస్తాడేమో! ఆకలిగొని ఉంటాడేమో! ఊరకుంటే ఎలాగు!

శబరి ఆయన ఆతిథ్యానికి అన్నీ సిద్ధం చేసింది. ఇల్లలికింది. ముగ్గు పెట్టింది. కూర్చోటానికి వేదిక సిద్ధంచేసింది. చెట్టు చెట్టుకు ఒక మేలిమి పండు ఏరితెచ్చింది. పండు పుల్లగా ఉంటే ఎలా? పచ్చిగా ఉంటే ఎలా? పెట్టిన ఫలితం దక్కుతుందా? అందుచేత శబరి ప్రతిచెట్టు పండును రుచి చూచింది. మధురంగా ఉన్న వాటినే, మాగినవాటినే గంపనింపింది. రకరకాల తేనెలుగూడా తెచ్చింది. రాముడు దప్పిగొని ఉంటాడేమో! సెలయేటి నీటిని దొప్పల్లో నింపి ఉంచింది. మాలలు కట్టి మెళ్ళో వెయ్యటానికి, పాదపూజలు చెయ్యటానికి రకరకాల పూలుకోసింది. ఇక ఆయన రావటమే ఆలస్యం.

ఆరోజు ఉదయం ఏదో తెలియని ఆనందం శబరి హృదయాన్ని బలంగా అలముకొన్నది. క్రొత్తకాంతి ఒకటి ఆమె కళ్ళల్లో తొటికిసలాడింది. కఱ్ఱ ఊత వేసుకొంటూ కుటీరం వాకిట్లో వచ్చినిలిచింది. అడవిలోని చెట్లన్నీ కొప్పులు సవరించుకొన్నట్లు గూళ్ళలోని పక్షులు రెక్కలు రెపరెపలాడిస్తూ కిలకిలా కూస్తున్నయ్. ఆ కిలకిలారావంలో శబరికి రామశబ్దం వినిపిస్తూ ఉంది. చుట్టుప్రక్కల కొండలన్నీ పైట కొంగులు సవరించుకొన్నట్లు సెలయేళ్ళు గలగలా పారుతున్నయ్. ఆ గలగలా రావంలోగూడ ఆమెకు రామశబ్దమే వినిపిస్తూ ఉంది. నేలంతా పులకించినట్లు మృగాలు గంతులు వేస్తూ అరుస్తున్నయ్, ఆ అరుపుల్లోగూడ ఆమెకు రామశబ్దమే వినిపిస్తూఉంది. పరమపురుష దర్శనంతో ప్రకృతి సర్వము పరవశతనొందినట్లుంది.

శబరి తలయెత్తి చూచింది.

అల్లంత దూరాన ఒక వింటికొప్పు వేగుచుక్కలా ఆమె కంటికి కన్పించింది. అది తన యింటివైపే నడిచివస్తున్నట్లుంది. కొంతసేపటికి జడలు గట్టిన జుట్టు కన్పించింది. తరువాత చంద్రబింబంలాంటి

## మూర్తి విశేషము

శ్రీలువొంగెడి సప్తగిరులు
వసుధజనతకు పంచుసిరులు
పసిడివెలుగుల నీదుకోవెల
విశ్వశాంతికిగానకోయిల

శ్రీకరంబగు నీదురూపము
జగతికే ఒక దివ్యదీపము
సర్వమంగళనీదుమూర్తి
నిఖిలజనులకు బాపు ఆర్తి

శ్రీచూర్ణశోభావమౌ నీవదనము
దరహాస చంద్రికామణిసదనము
అభయావ్రతొంచెడి నీహస్తము
ఆపన్న జనులకు ప్రియనేస్తము.

కరుణను కురిపించు నీ కన్నులు
వరుణుని మరపించుసరితెన్నులు

మనసును బంధించునీ చిన్నెలు
మమతను చిందించు పూవన్నెలు

శ్రీనివాసము నీదు వక్షస్థలి
సురమౌని మనుజులకు రక్షస్థలి
దురితహరమౌపాదయుగళము
శిష్టహృదిలో భక్తి నిగళము.

నీ భక్తిపానాన పొంగు గుండియలు
నీ కీర్తిగానాన మ్రోగు వీధియలు
నీ దర్శనాన మనసుమధుపాత్ర
తిమిరాలతీర్చు నీ స్మరణమాత్ర.

పతితపావను పాద పీఠిక
సకల శిరసులువంచు వేదిక
నరుల మనసున కలుగుకోరిక
తీర్చి చల్లగబ్రోచు ఏలిక.

— పోగుల శ్రీనివాసరావు

ముఖం. నీలమేఘం లాంటి మేను. అడవి అంతా కాంతిరేఖలతో కళకళలాడింది. శబరి శరీరం జలదరించింది. కళ్ళు చెమ్మగిల్లాయి పెదవులు రామా! రామా! రామా! అని వలవరించాయి.

ఇంతలో నీలమేఘశ్యాముడు రాముడే ఆమె వాకిట నిలిచాడు. నీడలా లక్ష్మణుడు వెంట ఉన్నాడు. రామునికి ఏవేవో అతిథి మర్యాదలు చెయ్యాలని శబరి ఇంతదాకా అనుకొంది. తీరా ఆయన వచ్చాక ఏం చెయ్యాలో ఆమెకు తోచలేదు. అటూ ఇటూ తిరిగింది. అగుపించే వాటికోసమే వెదికింది. ఆయన కొరకు తీర్చిదిద్దిన ఆ అందమైన వేదిక, ఆ వేదిక మీది కృష్ణాజినంగూడ ఆమెకు కన్పించలేదు. ఎందుకో ఎక్కడలేని తొట్రుపాటు! ఎందుకో ఎన్నడు లేని ఒక ఆవేశం! ఏదో అపరిమితమైన ఆనందం!

రాముడు ఆమె పారవశ్యాన్ని చూచాడు. ఒక్క చిరునవ్వు నవ్వాడు. సాదరంగా ఆమె వదికే చేతులు పట్టుకొని అవ్వా! కూర్చొమ్మని కూర్చుండ బెట్టాడు. తానూ కూర్చున్నాడు. శబరి కన్నీటిని చేత తుడిచాడు. తమ్ముని వైపు చూచాడు-తన ప్రక్క కూర్చొమ్మని. శ్రీరాముని హస్త స్పర్శతో యోగిని అయిన ఆ శబరిమేను అనిర్వాచ్యమైన ఒక అనుభూతిని పొందింది ఆమెలోని అణువణువూ వెయ్యి విద్యుత్తుల కాంతితో వెలిగింది. ఏదో నవయౌవనం ఆమెను తొంగిచూచింది.

శబరి రామలక్ష్మణుల పాదాలు పళ్ళెంలో ఉంచింది. కడిగింది, కళ్ళకద్దుకొనింది. ఏరి కోరి తెచ్చిన పూలతో ప్రియమార పూజించింది. ఆ రామ పాదాలమీదనే వాలిపోయింది. అప్పుడు శబరి ప్రాణాలు శబరిలోలేవు. ఆమె ఎంతసేపు ఆ పాదాలమీద అలా వ్రాలిఉందో! ఆ అన్నదమ్ములెంతసేపు కాలు కదల్పకుండా అలా కూర్చున్నారో! అంతా మౌనం.

రాముడు ఆమెను లేవదీశాడు. ఆమె ముఖంలోకి చూచాడు. ఒక్క చిరునవ్వు నవ్వాడు. పున్నమినాటి మహాసముద్రం ఆమె ముఖంలో పరవళ్ళు త్రొక్కింది. ఆప్యాయంగా శబరీ! నీ తపస్సు నిర్విఘ్నంగా వృద్ధిపొందుతున్నదా? అన్నాడు.

ఆమె 'ప్రక్కనున్న గంపలోని ఒక పండు తీసి రామునిచేత ఉంచింది.

మరొకటి లక్ష్మణుని చేతికందించింది.

రాముడు పండు తిన్నాడు, 'శబరీ! ఇంద్రియ నిగ్రహం నీకు పరిపూర్ణంగా సిద్ధించిందా?' అన్నాడు.

ఆమె మరోరకం పండు తీసింది. రామునిచేత వుంచింది.

లక్ష్మణుని కొకటి అందించింది.

రాముడు పండు తిన్నాడు. 'శబరీ! చాంద్రాయణాది వ్రతాల ఫలాలు పొందావా? నీ మనస్సు సుఖంగా వుందా?' అని అడిగాడు.

ఆమె ఇంకోరకం పండు తీసింది. రామునిచేత వుంచింది. లక్ష్మణుని కొకటి అందించింది.

'శబరీ! నీవు చేసిన గురుశుశ్రూష సఫలమైందా?' అన్నాడు రాముడు పండుతిని చిరునవ్వు నవ్వుతూ-చిరుబొజ్జను చేత నిమురుకొంటూ.

మధురాతి మధురమైన మరోఫలం తీసి శబరి ఈసారి రాముని నోటికందించింది.

ఒకటి లక్ష్మణుని చేతికిచ్చింది.

రాముడు అలా ఎన్ని కుశల ప్రశ్నలు వేశాడో!

శబరి అలా ఎన్ని ఫలాలు ఆయన కర్పించిందో!

రాముడు తృప్తిగా త్రేన్చాడు. లక్ష్మణుడు తృప్తిగా తల ఆడించాడు.

అప్పుడన్నది శబరి - 'మీ కొరకే మిగిలి వున్నానని మీ కొరకే ఎదురు చూస్తున్నానని మతంగ శిష్యులైన మహర్షులు మిమ్మల్ని గురించే చెప్పారని'.

'శాప విముక్తుడైన కబంధుడు నిన్ను గూర్చి చెప్పాడు. ఈ ఆశ్రమాన్ని గూర్చి చెప్పాడు. నిన్ను చూచాను. నా కడుపు నిండింది. ఇక ఈ ఆశ్రమాన్ని చూద్దామా శబరీ! అన్నాడు రాముడు నిరుత్తరావుతూ.

కర్ర ఊతవేసుకొంటూ శబరి ముందు నడిచింది. మహర్షుల యజ్ఞవేదికలు చూపించి. ఆ మహర్షుల తపశ్శక్తిచే ఆశ్రమానికివచ్చి చేరిన సప్తసముద్ర జలాల సంగతి చెప్పింది. ఆ మతంగ శిష్యుల స్వేదబిందువులు నేలరాలి పువ్వులై పూచిన వైనం వివరించింది. వాడని ఆ పూల నన్నింటినీ చూపించింది. మహర్షుల యజ్ఞయాగాది క్రతు విశేషాలు, తపోవ్రత విధానాలుఒక్కొక్కటే వర్ణించి చెప్పింది. ఆశ్రమంలోని చెట్టు చెట్టును చూపించింది. గుట్ట గుట్టను చూపించింది. చిట్టచివరకు సెలవిమ్మన్నట్లు చేతులు జోడించి నిలిచింది.

శ్రీరాముడు ఆనందంతో తల ఊపాడు. అభయ హస్త మిచ్చాడు.

ప్రక్కనున్న యజ్ఞగుండంలో అగ్నిహోత్రం మండుతూ ఉంది. శబరి శరీరం ఒక్క క్షణంలో సమిధలా ఆహుతి అయిపోయింది. కోటి విద్యుత్తుల కాంతి ఒకటి ఆ గుండం నుండి పైకి లేచి వెళ్ళింది.

రామాయణంలో వాల్మీకి శబరిని ఒక రేఖా చిత్రంగా మాత్రమే చూపాడు. అయినా పాఠకుడు ఆ పాత్ర దగ్గర ఆగి ఆలోచిస్తేచాలు ఏదో అనిర్వాచ్యమైన అనుభూతి అతని హృదయాన్ని అలముకొంటుంది. ఒక విధమైన వివశతను కలిగిస్తుంది.

వ్యక్తి ముక్తికి గొప్పవంశం వుండ నక్కరలేదు. పాండిత్యం వుండనక్కరలేదు. పదవులుండనక్కరలేదు, అంగబలం వుండ నక్కరలేదు. అర్థబలం అసలే అక్కరలేదు. మనః పవిత్రతే ముక్తికి ముఖ్యసోపానము.

**డా॥ అప్పజోడు వెంకటసుబ్బయ్య**

(12 వ పేజీ తరువాయి)

కథక: పద్మావతీదేవి చెలికత్తెలు అట్లు మాయమైన వేటగాని, వానికై దిక్కులు చూచుచున్న పేటకానింగాంచి, ఏమనుచున్నారు-

(మోహన—[illegible])

చెలికత్తెలు:—

అక్కరో కంటివా అపురూపమిదియు
ఎక్కడివాడో ఈ చక్కనివాడు ॥ అక్క ॥

నీలమేఘము డాలు నేలెడి మేను
క్రాలుగన్నులును సింగమువంటి కౌను ॥ అక్క ॥

అనరాదుగాని మాయాకిటిం దగిలి
వెనువెంట వచ్చిన విచ్చుడేమొ ॥ అక్క ॥

కథక: అంతట పద్మావతీదేవి వెడంద కనుదోయి విచ్చి చూచుచు ఏమనుచున్నది.

(అఠాణ—ఖండగతి)

పద్మావతి:—

బోయవేసకాడు, వెనుమాయదారి వీడు, ఈ
చాయకేలవచ్చె వింతాయె నాలిమ్రుచ్చు ॥ బోయ ॥

కన్నెలాడుచోట, మనమున్న విరులతోట తా
వన్నె వేసమూని వనవన్నరాబనేమి ॥ బోయ ॥

కథక: అనుటయు, నా చెలులు శ్రీనివాసునితో నేమనుచున్నారు.

(హుసేని—మిశ్రగతి)

చెలికత్తెలు:—

వింతమానిసి వగుదువోయీ
యెంతకైనా తగుదువోయీ
అంతిపురి చెలులున్న
తోటల పొంతనా వేటా? ॥ వింత ॥

కేశవ: వలదు బొమముడి వాడి చూపులు
తెలియ కేతెంచితి లతాంగి
తెలుపుడిది నందనమొ
అచ్చర తెరవలో మీరు. ॥ వలదు ॥

చెలిక: పురము నారాయణవనమ్మిది
భూపు డాకాశావనీశుడు

కేశవ: సరిసరే, ఈ సరసిజేక్షణ
నరవరుని తనయ ॥ సరిసరే ॥

చెలిక: మేలుబళి! నేర్చితివి మాటలు
మేలమేలా నీకు మాతో
చాలు వచ్చిన త్రోవ
బొమ్మిక జాణతనమేలా ॥ వింత ॥

సూత్ర: చెలికత్తెలు గట్టివాళ్లే నయ్యోయి! మాట చొరనిచ్చేట్టు లేరు-

కథక: శ్రీనివాసమూర్తైనా తక్కువవాడా? అంతవరకూ తాను చేయాని నిలిచిన చెట్టుకొమ్మను కొంచెం ఊగించి, పద్మావతీదేవిమీద పూలజల్లు కురిపిస్తూ అంటున్నాడు కదా! (సశేషము)

---

(10 వ పేజీ తరువాయి)

8

పృథివీ చ పృథివీమాత్రా చాపశ్చాపోమాత్రా చ తేజశ్చ తేజోమాత్రా చ వాయుశ్చ వాయుమాత్రా చ ఆకాశశ్చాకాశమాత్రా చ చక్షుశ్చ ద్రష్టవ్యం చ శ్రోత్రం చ శ్రోత్రవ్యం చ ఘ్రాణం చ ఘ్రాతవ్యం చ రసశ్చ రసయితవ్యం చ త్వక్చ స్పర్శయితవ్యం చ వాక్చ వక్తవ్యం చ హస్తౌచాదా తవ్యం చోపస్థశ్చా నందయితవ్యం చ పాయుశ్చ విసర్జయితవ్యం చ పాదౌచ గంతవ్యం చ మనశ్చ మంతవ్యం చ బుద్ధిశ్చ బోద్ధవ్యం చ అహం కారశ్చాహం కర్తవ్యం చ చిత్తం చ చేతయితవ్యం చ తేజశ్చ విద్యోతయితవ్యం చ ప్రాణశ్చ విధారయితవ్యం చ.

పృథివి మొదలయిన పంచభూతాలూ, వాని మాత్రలు, కన్నులు మొదలయిన జ్ఞానేంద్రియాలు, శబ్దస్పర్శాదులు, కర్మేంద్రియాలు, అవి చేసే పనులు మనస్సు, బుద్ధి అహంకారం, చిత్తం, తేజస్సు, ప్రాణం, ప్రాణం ధరించేదిన్నీ (నాశంలేని పరమాత్మపై ఆధారపడి ఉన్నాయి.)

9

ఏష హి ద్రష్టా శ్రోతా స్ప్రష్టా ఘ్రాతా
రసయితా మంతా బోద్ధా కర్తా
విజ్ఞానాత్మా పురుషః, స పరే అక్షర ఆత్మని
సంప్రతిష్ఠతే.

చూచేవాడు, వినేవాడు, తాకేవాడు, ఆఘ్రాణించేవాడు, రుచిచూచేవాడు, ఆలోచించేవాడు, తెలుసుకునేవాడు, చేసేవాడు, విజ్ఞానరూపుడున్ను అయి ఈ శరీరమందు ఉండే జీవుడు నాశమెరుగని ఆ పరమాత్మయిందే నిలిచి ఉంటాడు. (జీవుడు ఆ యా ఇంద్రియాలచే ఆయా పనులు చేయిస్తూ ఉంటాడు. అలాటి జీవుడు కూడా పరమాత్మపై ఆధారపడే ఉంటాడు.)

10

పరమేవాక్షరం ప్రతిపద్యతే స యో హ వై
తదచ్ఛాయ మశరీర మలోహితం శుభ్రమక్షరం
వేదయతే యస్తుసోమ్య! స సర్వజ్ఞః సర్వో
భవతి, తదేషశ్లోకః

నీడ, శరీరము, రక్తము-లేనివాడున్ను పరిశుద్ధుడు. నాశం లేనివాడున్నూ. అయిన పరమాత్ముని తెలిసినవాడు పండితుడు. అతడు ప్రకృతినీ పరమాత్మను, సృష్టి రహస్యాన్ని తెలిసినవాడవుతాడు. అతడే పరమాత్మను చేరగలడు. యీ మాటకు ప్రమాణం చెప్పబోయే శ్లోకం దానిని విను.

11

విజ్ఞానాత్మా సహ దేవైశ్చ సర్వైః ప్రాణా భూ
తాని సంప్రతిష్ఠంతి యత్ర,
తదక్షరం వేదయతే యస్తు
సౌమ్య! స సర్వజ్ఞః సర్వమేవావిశేతి

విజ్ఞాన రూపుడైన జీవుడు, దశేంద్రియాలూ (కర్మేంద్రియాలూ అయిదు, జ్ఞానేంద్రియాలు అయిదు వెరసి పది) పంచ ప్రాణాలూ, పంచ భూతాలూ, నాశ రహితుడైన సర్వమునూ వ్యాపించి ఉన్నవాడైన పరమాత్మునియందే ఆధారపడి ఉంటాయని తెలిసిన బుద్ధిమంతుడే అన్నీ తెలిసినవాడు విద్వాంసుడు, విద్వాంసుడు అని చెప్పదగిన వాడు అవుతాడు. అతడే పరమాత్మయందు చేరగల కృతార్థుడు. (సశేషము)

## తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# టెండరు ప్రకటన

ఆర్. పో. సి. నెం. ప్రకటన: 12/సిఇ/83. తే. 22-3-83.

కార్యనిర్వాహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి వారిచే రిజిష్టర్ కాబడిన కాంట్రాక్టర్ల నుండి ఈ క్రింది పనులకుగాను, సీలు వేయబడిన టెండర్లు కోరబడుతున్నవి. టెండరు ప్రకటనలోని 5వ కాలమ్‌లో పేర్కొనబడిన విధంగా సీలువేసిన కవరులో ఆయా పనులకు తమ టెండర్లను ఆయా సంబంధిత అధికారులకు తే 25-4-83 ది మధ్యాహ్నం 3 గంటలకుగాని అంతకుముందుగాని చేరేటట్లుగా పంపవలసి వుంటుంది. టెండర్లు అదేరోజున మధ్యాహ్నం 3-15 గంటలకు తెరువబడుతవి.

టెండరు పత్రాలు కావలసినవారు టెండరు పత్రాల ఖరీదుకు డిమాండ్ డ్రాఫ్టును జతచేసి తమ తరగతి రిజిస్ట్రేషన్, పూర్వానుభవంకు సంబంధించిన ఋజువులతో తే 15-4-83 ది లోగా సంబంధిత అధికారులకు దరఖాస్తు చేసుకోవాలి. గడువు తేది తరువాత చేరిన దరఖాస్తులు, ఆవశ్యకమైన వివరాలులేని దరఖాస్తులు మొత్తంగా నిరాకరించబడుతవి.

టెండరు పత్రాలను తే 18-4-83 ది నుండి తే 20-4-83 ది వరకు (రెండురోజులూ కలుపుకొని) సంబంధిత అధికారుల కార్యాలయాలలో, కార్యాలయ పనివేళలలో పొందవచ్చును. టెండరు పత్రాల ఖరీదును కార్యనిర్వాహణాధికారి, అకౌంట్ కోడ్ నెం. 689, టి. టి. డి. అకౌంట్లు ఖాతాలో తిరుమల, తిరుపతిలలోగల స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా కార్యాలయాలలో డిమాండ్ డ్రాఫ్టు మూలకంగాగానీ, చలానా ద్వారాగానీ చెల్లించాలి.

టెండరు పత్రాలు మార్చుకోరానివి. ఏ పరిస్థితులలోనూ టెండరు పత్రాల మూల్యం వాపసు ఇవ్వబడదు. పోస్టుద్వారా టెండరు పత్రాలు పంపబడవు. టెండరు పత్రాలు తెచ్చుకొనే ఏర్పాట్లను టెండరు దారులే చేసుకోవాలి.

టెండరు పత్రాల స్వీకరణగడువు తేదీనాడు అనూహిత కారణాలవల్ల కార్యాలయం మూతబడినట్లయితే ఆ తర్వాతి పని దినంనాడు మధ్యాహ్నం 3 గం॥ వరకు టెండర్లు స్వీకరించబడుతవి.

ఏ క్షణంలోనైనా ఎట్టికారణం తెలుపకుండానే ఏదో ఒక టెండరునుగానీ లేదా అన్ని టెండర్లనుగానీ నిరాకరించే అధికారం లేదా టెండరు ప్రతిపాదనలనే ఉపసంహరించుకొనే అధికారం కార్యనిర్వాహణాధికారికి వుంటుంది.

భవనాలను 'టర్న్‌కీబేసిస్' విధానంపై ఇంటిలోపల నీటిసరఫరా, విద్యుత్‌పరికరాల బిగింపు, శానిటరీ సాధనాల ఏర్పాట్లతో పూర్తి ఆకారంతో పూర్తిచేసి కాంట్రాక్టర్ అప్పగించవలసి వుంటుంది. నీటిసరఫరా, విద్యుత్‌సరఫరా, శానిటరీ సాధనాల ఏర్పాట్లకు కావలసిన పార్టు (బి) మరియు (సి) లలోని పరికరాలను అర్హతకలిగి, అనుమతి, అధికారం పొందిన ఏజెంట్ల నుండే పొందాలి. ఇందుకు ఋజువుగా ఆ ఏజెంట్ల నుండి తీసుకొన్న అంగీకారపత్రాన్ని టెండర్లతో జతచేయాలి. ఆయా ఏజన్సీల ద్వారా సకాలానికి నిబంధనల కనుగుణంగా అనుబంధ పనులను పూర్తిచేయించేందుకు కాంట్రాక్టరే బాధ్యతవహించాలి. సివిల్‌పనులనేగాక నీటిసరఫరా, విద్యుత్, శానిటరీ సాధనాల ఏర్పాట్లను కూడా సకాలంలో పూర్తిచేసేందుకు కాంట్రాక్టర్ బాధ్యత వహించాలి.

టెండర్లు తెరచిన రోజునుంచి 4 మాసాల వరకు మాత్రమే ఏ టెండరు అయినా చెల్లుబడి అవుతుంది.

టి. టి. డి. కి స్టాండింగ్ సెక్యూరిటీ డిపాజిట్ చెల్లించనట్టి కాంట్రాక్టర్లు టెండరు వేసేటప్పుడు తమ కాంట్రాక్టు విలువలో 1½ శాతం సొమ్మును, చలానా లేదా డిమాండ్‌డ్రాఫ్టు ద్వారా చెల్లించి, కాంట్రాక్టులో 1 శాతం విలువకు బ్యాంకు గ్యారంటీని టెండరుతోబాటు చూపించాలి. కాంట్రాక్టర్ల రన్నింగ్ బిల్లుల నుండి భవిష్యత్‌లో సెక్యూరిటీ డిపాజిట్ కొరకుగాను, ఆగిపోయిన నిధులకుగాను 7½ శాతం సొమ్ము నిలిపివుంచబడుతుంది.

టి. టి. డి. కి రూ. 1 లక్షను స్టాండింగ్ సెక్యూరిటీ డిపాజిట్‌గా నిర్ణీత ఫారంతో చెల్లించిన కాంట్రాక్టర్లు క్రింది రీతిగా ఇ.ఎం.డి., ఎఫ్.ఎస్.డి. లను చెల్లించాలి.

**1) ఎర్నెస్ట్‌మనీ డిపాజిట్ :**

కాంట్రాక్టు విలువలో 1 శాతం (75 వేల రూపాయలకు మించకుండా)

**2) బిల్లులనుంచి నిలుపుదల :**

| పని విలువ: | | | నిలుపుదల శాతం: |
|---|---|---|---|
| 1. | మొదటి రూ. 50 లక్షల పనివరకు | | 3½ శాతం |
| 2. | రూ. 50 లక్షలకు పైబడి రూ. 1 కోటికి లోబడిన పనులకు | మొదటి రు. 50 లక్షలకు | 3½ శాతం |
| | | రు. 50 లక్షల పై పనులకు | 2 శాతం |
| 3. | రూ. 1 కోటికి మించిన పనులకు | మొదటి రు. 50 లక్షలకు | 3½ శాతం |
| | | రు. 50 లక్షల పై పనులకు | 2 శాతం |
| | | రు. 1 కోటి పై పనులకు | 1½ శాతం |

| వరుస సంఖ్య [1] | పని పేరు [illegible] | ఇ.ఎం.డి. (ధరావతు) కాంట్రాక్టు విలువ లో [illegible] శాతం [3] | కాంట్రాక్టు లో 1శాతం [4] | టెండరు ఫారాలు పొందవలసిన, చేర్చవలసిన అధికారి కార్యాలయం [5] | టెండర్ షెడ్యూల్సు ఖరీదు [6] | కాంట్రాక్టు వ్యవధి [7] | టెండరు వేసేందుకు అర్హతగల కాంట్రాక్టర్ [8] |
|---|---|---|---|---|---|---|---|
| 1. | మఠాధిపతుల వసతికొరకు తిరుమల ఉత్తర మాడ వీధిలో భవన నిర్మాణం | రు. 3,700/ | రు. 2,475/ | ఇ.ఇ. 1 తిరుమల | రు. 100/ | 6 నెలలు | మూడవతరగతి ఆపైన |
| 2. | తిరుమలలో నారాయణగిరి అతిథి గృహం రెండో అంతస్తు నిర్మాణం | రు. 8,430/ | రు. 5,620/ | ,, | రు. 200/ | 18 నెలలు | ,, |
| 3. | తిరుమల నారాయణగిరి అతిథిగృహం మధ్య వరుస బ్లాకు (1 మరియు 2) నిర్మాణం | రు. 6,785/ | రు. 4,525/ | ,, | రు. 200/ | 18 నెలలు | ,, |
| 4. | తిరుమల మేదరమిట్ట ప్రాంతంలో టి.టి.డి. కో-ఆపరేటివ్ స్టోర్సుకు, కో-ఆపరేటివ్ బ్యాంకుకు భవననిర్మాణం | రు. 3,390/ | రు. 2,260/ | ,, | రు. 100/ | 6 నెలలు | ,, |
| 5. | తిరుమలలో ధర్మాచార్య సంస్థవద్ద హెచ్.టి. మరియు ఎల్.టి. ఓవర్ హెడ్ లైన్ల ట్రాన్స్ ఫార్మర్ సబ్‌స్టేషన్ ఏర్పాటు | రు. 12,960/ | రు. 8,640/ | ఇ.ఇ. 3 తిరుపతి | రు. 200/ | 12 నెలలు | ,, |
| 6. | కాలిబాట యాత్రికులకు నృసింహస్వామి ఆలయం నుండి తిరుమల 7 వ మైలువరకు షెల్టర్ ఏర్పాటు | | | | | | |
| | ,, రీచ్ — 1 | రు. 11,250/ | రు. 7,500/ | ఇ.ఇ. 5 తిరుమల | రు. 200/ | 18 నెలలు | ,, |
| 7. | ,, రీచ్ — 2 | రు. 11,250/ | రు. 7,500/ | ,, | రు. 200/ | ,, | ,, |
| 8. | ,, రీచ్ — 3 | రు. 11,250/ | రు. 7,500/ | ,, | రు. 200/ | ,, | ,, |
| 9. | ,, రీచ్ — 4 | రు. 11,250/ | రు. 7,500/ | ,, | రు. 200/ | ,, | ,, |
| 10. | ,, రీచ్ — 5 | రు. 11,250/ | రు. 7,500/ | ,, | రు. 200/ | ,, | ,, |
| 11. | ,, రీచ్ — 6 | రు. 11,250/ | రు. 7,500/ | ,, | రు. 200/ | ,, | ,, |
| 12. | ,, రీచ్ — 7 | రు. 11,250/ | రు. 7,500/ | ,, | రు. 200/ | ,, | ,, |
| 13. | ,, రీచ్ — 8 | రు. 11,250/ | రు. 7,500/ | ,, | రు. 200/ | ,, | ,, |
| 14. | తిరుమల జి.ఎన్.సి. ప్రాంతంలో ప్రత్యేక తరహా కాటేజీల నిర్మాణం | | | | | | |
| | ,, నెం. 1 | రు. 3,355/ | రు. 2,235/ | ,, | రు. 100/ | 6 నెలలు | ,, |
| 15. | ,, నెం. 2 | రు. 3,355/ | రు. 2,235/ | ,, | రు. 100/ | ,, | ,, |
| 16. | ,, నెం, 3 | రు. 3,355/ | రు. 2,235/ | ,, | రు. 100/ | ,, | ,, |
| 17. | ,, నెం. 4 | రు. 3,355/ | రు. 2,235/ | ,, | రు. 100/ | ,, | ,, |

| వరుస సంఖ్య [1] | పనిపేరు [2] | ఇ.ఎం.డి. (టెండరుతోటి) కాంట్రాక్టు విలువలో 1½ శాతం [3] | కాంట్రాక్టులో 1శాతం [4] | టెండరు ఫారాలు పొంద వలసిన / చేర్చ వలసిన ఆఫీసు కారిపేరు [5] | టెండర్ షెడ్యూల్సు ఖరీదు [6] | కాంట్రాక్టు వ్యవధి [7] | టెండరు వేసేందుకు అర్హతగల కాంట్రాక్టర్ [8] |
|---|---|---|---|---|---|---|---|
| 18. | తిరుమల జి. ఎస్. సి. ప్రాంతంలో ప్రత్యేక తరహా కాటేజీల నిర్మాణం. ,, నెం. 5 | రు. 3,355 | రు. 2,235 | ఇ. ఇ. 5 తిరుమల | రు. 100/ | 6 నెలలు | మూడవతరగతి ఆపైన ,, |
| 19. | ,, నెం. 6 | రు. 3,355/ | రు. 2,235/ | ,, | ,, | ,, | ,, |
| 20. | ,, నెం. 7 | రు. 3,355/ | రు. 2,235/ | ,, | ,, | ,, | ,, |
| 21. | ,, నెం. 8 | రు. 3,355/ | రు. 2,235/ | ,, | ,, | ,, | ,, |
| 22. | ,, నెం. 9 | రు. 3,355/ | రు. 2,235/ | ,, | ,, | ,, | ,, |
| 23. | ,, నెం. 10 | రు. 3,355/ | రు. 2,235/ | ,, | ,, | ,, | ,, |
| 24. | ,, నెం. 11 | రు. 3,355/ | రు. 2,235/ | ,, | ,, | ,, | ,, |
| 25. | ,, నెం. 12 | రు. 3,355/ | రు. 2,235/ | ,, | ,, | ,, | ,, |
| 26. | ,, నెం. 13 | రు. 3,355/ | రు. 2,235/ | ,, | ,, | ,, | ,, |
| 27. | ,, నెం. 14 | రు. 3,355/ | రు. 2,235/ | ,, | ,, | ,, | ,, |
| 28. | ,, నెం. 15 | రు. 3,355/ | రు. 2,235/ | ,, | ,, | ,, | ,, |
| 29. | ,, నెం. 16 | రు. 3,355/ | రు. 2,235/ | ,, | ,, | ,, | ,, |
| 30. | తిరుమలలో క్యాంటీన్ కాంప్లెక్స్‌వద్ద నిర్మించే ప్రవేశ తోరణంకు అలంకారపుపని | రు. 2745/ | రు. 1,830/ | ఇ. ఇ. 6 తిరుమల | రు. 50/ | ,, | ,, |
| 31. | ,, వస్తువులసరఫరా | రు. 470/ | రు. 315/ | ,, | రు. 25/ | 1 నెల | 4-వ తరగతి ఆపైన |
| 32. | తిరుమలలో నూతన క్యూకాంప్లెక్స్‌భవనంలో మరుగుదొడ్లవరుస (బ్లాక్ 5, 6) నిర్మాణం | రు. 9000/ | రు. 6,000/ | ఇ. ఇ. 1 తిరుమల | రు. 200/ | 6 నెలలు | రెండవతరగతి ఆపైన |
| 33. | తిరుమల నూతన క్యూకాంప్లెక్సు భవనంలో మధ్యప్రవేశ మండపం నిర్మాణం | రు. 5250/ | రు. 3,500/ | ,, | రు. 150/ | ,, | ,, |

(5 వ పేజీ తరువాయి)

ప్రబంధ లక్షణాలంతగా గోచరించని భారతభాగవత హరివంశాది పురాణ కావ్యాలలో సైతం ప్రాచీన కవులు వసంతర్తు శోభను యథాశక్తిగా వర్ణించారంటే ఋతువులలో దీని ప్రాధాన్యం అవగతమవుతుంది. కనుకనే నంది తిమ్మన తన పారిజాతాపహరణంలో "ప్రతివర్ష వసంతోత్సవ కుతుగాగతకావ్యనికర...." అన్న దీర్ఘ పాదంలో రాయలవారి వసంతోత్సవ విజయాలను మనసార వర్ణించి, మనల్ని ప్రమోదభరితులను చేశాడు.

వసంత నవరాత్రులు ప్రారంభించబడే సంవత్సరాది పర్వదినంగూడ ప్రాచీన సాహిత్య వసంత వర్ణనల్లాగే ప్రమోదభరితం అవుతుందని, ఈ "రుధిరోద్గారి" మనకు సర్వశ్రేయ స్సహితం అవుతుందనిఆశిద్దాం.

(8వ పేజీ తరువాయి)

యద్య ప్యేతే న పశ్యంతి లోభోపహతచేతసః ।
కులక్షయకృతం దోషం మిత్ర ద్రోహే చ పాతకమ్ ॥

రాజ్యకాంక్షాపరులైన కౌరవులు వంశనాశనం, మిత్ర ద్రోహంవల్ల కలిగే పాతకాన్ని గ్రహించలేక పోతున్నారు.

కథం న జ్ఞేయ మస్మాభిః పాపాదస్మాన్నివర్తితుమ్ ।
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన ॥

జనార్దనా ! వంశక్షయంవల్లవచ్చే దోషాన్ని బాగా తెలిసిన మనమైనా ఆ పాపం నుంచి ఎందుకు తప్పించుకో కూడదు ?

కులక్షయే ప్రణశ్యంతి కులధర్మా స్సనాతనాః ।
ధర్మే నష్టే కులం కృత్స్నం అధర్మోఽభిభవత్యుత ॥

వంశనాశనంతో ప్రాచీన కులధర్మాలు నశిస్తాయి. కులధర్మాలు నశించిన వంశమంతటా అధర్మం అలుము కుంటుంది.

అధర్మాఽభిభవాత్కృష్ణ ! ప్రదుష్యన్తి కులస్త్రియః ।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః ॥

కృష్ణా ! అధర్మం ప్రబలితే కులస్త్రీలు చెడిపోతారు. దానితో జాతి సంకరం జరుగుతుంది.

సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ ।
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదక క్రియాః ॥

వర్ణసంకరం వల్ల కులానికీ, కులనాశకులకూ కలిగేది నరకమే. వారి పితృదేవతలు పిండోదక కార్యాలు లేక అధోగతి పాలవుతారు.

దోషై రేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః ।
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః ॥

కులాన్ని నాశనంచేసే వాళ్ళమూలంగా కలిగే వర్ణ సాంకర్యం కారణంగా శాశ్వతాలైన జాతిధర్మాలూ, కుల ధర్మాలూ అడుగంటిపోతాయి.

ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన ।
నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ ॥

జనార్దనా ! కులధర్మాలు నశించిన కుటుంబాలవారు శాశ్వత నరకవాసులవుతారని వింటున్నాము.

అహో ! బత ! మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్ ।
యద్రాజ్యసుఖలోభేన, హంతుం స్వజన ముద్యతాః ॥

ఎంత ఆశ్చర్యం ! రాజ్యలోభంతో బంధువులను చంప డానికి పూనుకుని, ఘోరపాపాలు చేయడానికి సిద్ధపడ్డాం కదా.

యది మామప్రతీకారం అశస్త్రం శస్త్రపాణయః ।
ధార్తరాష్ట్రా రణే హన్యుః తన్మే క్షేమతరం భవేత్ ॥

ఆయుధాలు ధరించిన ధార్తరాష్ట్రులు అస్త్రశస్త్రాలు విసర్జించిన నన్ను యుద్ధంలో సంహరిస్తే అది నాకు మరింత మంచిది.

సంజయ ఉవాచ :

ఏవ ముక్త్వాఽర్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।
విసృజ్య సశరం చాపం శోక సంవిగ్న మానసః ॥

సంజయుడు : అర్జునుడు అలా చెప్పి దుఃఖాక్రాంతుడై విల్లమ్ములు విడిచిపెట్టి రణరంగంలో రథం మీద చతికిల బడ్డాడు.

ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం, శ్రీకృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని "అర్జున విషాదయోగం" అనే మొదటి అధ్యాయం సమాప్తం.

(సశేషం)

## "విగ్రహశిల్ప రహస్యము"

[శ్రీ దేవరకొండ శేషగిరిరావు వెల: 6-00 రూ. 1-8 డెమ్మీ 136 పుటలు. ప్రతులకు డి. వి. సుబ్బారావు 8-14-2, రెడ్‌క్రాస్ వీధి, గాంధీనగరం, కాకినాడ, తూ.గో.జిల్లా]

విగ్రహారాధన వేదసమ్మతము కాదని మనలో కొందఱి వాదము. కాని అది శాస్త్ర పరిచయములేని మాట. ఋగ్వేదములోనే విగ్రహనిర్మాణ ప్రశంస యున్నది.

"క ఇమం దశభి ర్మమేంద్రం క్రీణాతి ధేనుభిః
యదా వృత్రాణి జంఘన దథైనం మే పునర్దదత్

"నా ఈ ఇంద్రుని ఎవడేని పది ఆవుల నిచ్చి కొనినచో, బాగుండును. అయితే అట్లుకొనినవాడు తన పని తీరిన పిదప అనగా ఆ ఇంద్రపూజ వలన తన పాపములను పోగొట్టుకొనిన తరువాత, మరల నా యింద్రుని నాకిచ్చి వేయవలయును.

ఇట్లనుటచేత ఆ కాలముననే శిల్పాచార్యులు ఇంద్రాది దైవమూర్తులను నిర్మించి కొంత గోధనమునకో, మఱొక ప్రతి ఫలమునకో - వాటిని భక్తులకు ఉపాసనార్థమై (అద్దెకు) ఇచ్చుచుండెడివారని తెలియుచున్నది. కావున విగ్రహారాధనము, లేదా ప్రతిమార్చనము ఋగ్వేదకాలముననే కలదని విశదమగుచున్నది. అంతియేకాదు. ఋగ్వేదములో రథనిర్మాణము, ఖడ్గాద్యాయుధములయు, భూషణములయు నిర్మాణ ప్రశంసను గూడ కాంచగలము. సృష్టికర్త ఈ జగములను కర్మారుని (కమ్మరి) వలె నిర్మించినాడని దిగువ నుదాహరించిన మంత్రవాక్యమనుచున్నది.

"బ్రహ్మణస్పతి రేతా సం కర్మార ఇవాధమత్

వేదర్షులలో పెక్కురు మహాశిల్పాచార్యులూ, శిల్పప్రవర్తకులును. సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సువర్ణులనెడి పంచఋషులు పంచశిల్పములకు స్రష్టలని యుజుర్వేదమును, సంస్కృత వాఙ్మయమును సుస్పష్టముగనే పేర్కొనుచున్నవి. అంతియేకాక, భృగ్వంగిరోగణము, ఋభువులు, త్వష్ట, విశ్వరూపుడు, బృహస్పతి మొదలగు వారుమహాశిల్పులనుటకు అనేక దృష్టాంతములున్నవి. "తక్షామ భృగవో న రథమ్" అనెడి మంత్రవాక్యమునకు అర్థము వ్రాయుచు సాయణులు "....అథవా భృగవో రథకారాః" అని వచించెను. వీరే కాక, వసిష్ఠాగస్త్య, విశ్వామిత్ర, కశ్యపాదులుకూడ శిల్పులును, శిల్పశాస్త్ర నిర్మాతలును, అనెడి విషయమును నేడు వారి పేరులతో ప్రచారమునందున్న శిల్పశాస్త్ర గ్రంథములే విశదీకరించుచున్నవి. మన పురాణములందు అటనట శిల్పప్రశంస యున్నది. అగ్నిపురాణము ప్రత్యేకముగా దేవతా మూర్తుల నిర్మాణ ప్రకారములను అనుశాసించినది "మయశిల్ప, కాశ్యపశిల్ప సమరాంగణ సూత్రధార, అపరాజిత పృచ్ఛ శిల్పరత్నాదులలోను, కొన్ని ఆగమములలోను మూర్తి నిర్మాణ ప్రకారములు విస్తరముగా వివరింపబడినవి. అట్లే విష్ణుధర్మోత్తరము నందును మూర్తి నిర్మాణ ప్రశంస కలదు.

---

## దివ్యవాణి

ఉన్నవాడిజేబు ఎన్నడు తరగదు
కన్నవాడిప్రేమ ఎన్నడు కరగదు
నన్నుకాదని చెడుట నరకదారి
అన్నినీవని అనుట అథమదారి
నిన్నునీవె తెలిసి నిజములో కలిసి
సన్నుతించిన జన్మ సార్థకంబగును
పన్నిన పన్నాగ పరిధిలో నీవుంటె
ఎన్ని జన్మలకైన నిన్ను నీ వెఱుగవు
కన్నుతెరిచిచూడు కలగాని కలిలోన
అన్నినీవిగావు నిన్న నీదికాదు
సున్నకెంత విలువ మున్ను అంకెలేక
నిన్నుచేరు దైవమన్ని నీకొసగు

— సుంకర రామమోహనరావు

---

# గ్రంథసమీక్ష

ప్రకృతి గ్రంథము విష్ణుధర్మోత్తర పురాణము 3వ ఖండము 44 అధ్యాయమునుండి 85వ, అధ్యాయము వఱకు ఆంధ్రీకరణము గ్రంథకర్త శ్లోకములనిచ్చి వాటికి సరళ శైలిలో తాత్పర్యము వ్రాసినారు. ఇందు-బ్రహ్మ, విష్ణు, శంభు, ఇంద్ర, యమ, వరుణ, విశ్వకర్మ, విశ్వరూపాదులైన 56 విగ్రహముల నిర్మాణ ప్రకారములు వివరింపబడినవి. విష్ణు విగ్రహమునుగూర్చి చెప్పుచు -

"మనస్తు గరుడో జ్ఞేయః, సర్వభూత శరీరగం,
తస్మాచ్ఛీఘ్రతరం నాస్తి, తదైవ బలవత్తరమ్."

"మనస్సే గరుడపక్షి. మనస్సుకంటె వేగముగా పోవునది మఱియొకటి లేదుకదా! (26, 27 పుటలు) ఈ విధముగా అటనట విగ్రహశిల్ప రహస్యము లీగ్రంథమున వివరింపబడినవి. 17 పుటలుగల "తొలి పలుకు"లో స్వామి దయానందుల "ధర్మ విజ్ఞానము" నాధారము చేసికొని విగ్రహారాధన రహస్యములు కొన్ని వివరింపబడినవి. అట్లే గ్రంథాంతమున అనుబంధములో ఆధునికుల భావనను గూర్చియు, అవతారతత్త్వమును గూర్చియు మఱి కొన్ని విశేషములో సంగబడినవి. ఈ కాలమున ఇట్టి గ్రంథముల ఆవశ్యకమెంత యేని కలదు.

ఇట్టి గ్రంథములకు ధనసహాయము చేయుచు, ముద్రాభాగ్యమును కలిగించుచున్న తిరుమల తిరుపతి దేవస్థానంవారు అభినందనీయులు.

— భూమానంద.

✻

## వార్తాలహరి



జీర్ణోద్ధరణ తరువాత శ్రీ ఆంజనేయస్వామి ఆలయం

తిరుమలలో శ్రీవారి పుష్కరిణీ తీరానగల ఎదురు పుష్కరిణి ఆంజనేయస్వామి వారి ఆలయ జీర్ణోద్ధరణ సందర్భంగా మార్చి 12 వ తేది నుండి 5 రోజులపాటు ఆలయ సంప్రోక్షణ కార్యక్రమాలు ఆగమోక్త విధిని నిర్వహించబడినవి.



మహా సంప్రోక్షణ విధిని మొదలుపెట్టి సన్నివేశంలో టి. టి. డి. కార్య నిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి, వారి అర్ధాంగి.

### శ్రద్ధాంజలి

రాష్ట్ర దేవాదాయ ధర్మాదాయశాఖ మంత్రి, శ్రీ ఈలి ఆంజనేయులుగారు మార్చి 28 వ తేదిన గుండెపోటుతో హైదరాబాదులో ఆకస్మికంగా మృతిచెందటం పట్ల 'సప్తగిరి' తన ప్రగాఢ సంతాపం ప్రకటిస్తోంది. తత్త్వచింతనకు, దైవభక్తికి పేరుపొందిన శ్రీ ఆంజనేయుల మృతికి శ్రద్ధాంజలి ఘటించే నిమిత్తం మార్చి 29వ తేదిన టి. టి. డి. కార్యాలయాలన్నింటిని మూసివుంచారు.

### అన్నమాచార్య వర్ధంతి

పదకవితాపితామహులు,సంకీర్తనాచార్యులు తాళ్ళపాక అన్నమాచార్యులవారి 480 వ వర్ధంతి ఉత్సవాలు తిరుపతి శ్రీ అన్నమాచార్య కళామందిరంలో ఏప్రిల్ 10 వ తేది నుండి 12 వ తేది వరకు జరగనున్నాయి. ప్రసిద్ధ కళాకారులు పాల్గొంటున్న ఈ ఉత్సవాల ప్రారంభ దినాన శ్రీ మేడసాని మోహన్‌గారి అష్టావధాన కార్యక్రమం ప్రత్యేకాకర్షణ.

### ఏకాంత సేవ

తిరుమల శ్రీవారి ఆలయంలో ఏకాంత సేవా సమయాన్ని ఫిబ్రవరి 12 వ తేది నుండి మార్పు చేయటం జరిగింది. ఆమంత్రణోత్సవంతో సంబంధం లేకుండా ఏకాంత సేవకు 50/ రూ లతో ప్రత్యేక టికెట్‌లను ప్రవేశపెట్టిన దృష్ట్యా ఈ మార్పు అవసరమైంది. ప్రస్తుతం ఏకాంతసేవ రాత్రి 12-30 గం॥లకు కాకుండా 10-30గం॥ లకే జరుగుతున్నది.

### ఉగాది ఆస్థానం

ఏప్రిల్ 14 వ తేది తిరుమల శ్రీవారి ఆలయంలో ఉగాది ఆస్థానం జరుగుతుంది. తత్కారణంగా ఆరోజున కల్యాణోత్సవం,

బ్రహ్మోత్సవం వాహనసేవలు, వసంతోత్సవం వంటి ఆర్జిత సేవల్ని రద్దు చేయడమైనది. ప్రసాదచెరుపులు పద్యారం వడులు స్వీకరించబడుతాయి.

## సమాచారకేంద్రం

తిరుపతి విమానాశ్రయంలో యాత్రికుల సౌకర్యార్థం టి. టి. డి. నెలకొల్పిన సమాచారకేంద్రానికి టి.టి.డి. కార్యనిర్వహణాధికారి సతీమణి శ్రీమతి నిర్మలా కుమారస్వామి రెడ్డి మార్చి 27వ తేదిన ప్రారంభోత్సవం చేశారు. ఈ కేంద్రంలో దేవస్థాన ప్రచురణలతోబాటు యాత్రికులకు అవసరమైన సూచనలను సలహాలను అందించటమేగాక 25 రూపాయల ప్రత్యేక దర్శనం టికెట్‌లను కూడా విక్రయిస్తారు. ఇటువంటి కేంద్రాలనే త్వరలో తిరుపతి ఆర్. టి. సి. బస్టాండులోనూ, రైలుస్టేషన్‌లోనూ, అలిపిరివద్ద నెలకొల్పాలని దేవస్థానం సంకల్పించింది.

## సంక్షిప్తవార్తలు

* అన్నమాచార్య వాఙ్మయ ప్రచురణ పథకం ప్రత్యేకాధికారిగా శ్రీగౌరిపెద్ది రామసుబ్బశర్మగారిని టి. టి. డి. పునర్నియమించింది. గత సంవత్సరం అక్టోబరు 1 వ తేది పదవీ విరమణ చేయవలసి వుండిన శ్రీ శర్మగారు మరో రెండేళ్ళపాటు తమ పదవిలో కొనసాగుతారు.

* ఆలయాలకు సగంశాతం సబ్సిడీతో ప్రతిమలను, విగ్రహాలను సరఫరా చేస్తున్న సందర్భాలలో వాటి రవాణా వ్యయంలో కూడ సగంశాతం భరించాలని తిరుమల తిరుపతి దేవస్థానం ఇటీవల నిర్ణయించింది.

* యాత్రికులకు, ఉద్యోగులకు చాలినంతగా వైద్యసదుపాయం కల్పించే నిమిత్తం తిరుమలలోని అశ్విని హాస్పిటల్‌లో ఒక మెడికల్ ఆఫీసర్‌ను, తిరుపతిలోని కేంద్రవైద్యశాలలో ఇద్దరు మెడికల్ ఆఫీసర్లను టి. టి. డి. అదనంగా నియమిస్తోంది.

# నిర్వాహకమండలి నిర్ణయాలు

### (సమావేశ తేదీలు : 28-2-1983 మరియు 1-3-1983)

* తిరుమల తిరుపతి దేవస్థానముల సహకారసంస్థ డైరెక్టర్‌గా దేవస్థాన పాలక మండలి సభ్యురాలైన శ్రీమతి కె. ప్రభావతమ్మ స్థానంలో శ్రీమతి ఎన్. రాజకుమారిని నియమించడమైనది.

* శ్రీ వేంకటేశ్వర శిల్పకేంద్రంలో చదువు పూర్తిచేసిన విద్యార్థులకు 'శిక్షణ శిల్పులు' గా నెలకు 200 రు॥ స్థిరవేతనంతో రెండేళ్ళపాటు శిల్పకేంద్రంలోనే ఉపాధి కల్పించేందుకు తీర్మానించడమైనది.

* తిరుమల తిరుపతి దేవస్థానముల దత్తత గ్రామమైన తాళ్ళపాకలో తి. తి. దే. నిర్మించిన ప్రాథమిక పాఠశాల నూతన భవనాన్ని నెలకు రూ॥ 100/- నామమాత్రపు అద్దెతో కడప జిల్లాపరిషత్ కార్యదర్శికి పాఠశాలను 30 సంవత్సరాలపాటు లీజుకివ్వటమైనది.

* తిరుమల తిరుపతి దేవస్థాన ఆలయాలలో పనిచేస్తున్న నాదస్వర, డోలు వాద్యకారులకు లోయర్ డివిజన్ గుమాస్తా వేతనాన్ని (రూ॥ 425-650) మంజూరు చేయడమైనది.

* తిరుమల శ్రీవారి ఆలయంలో నిత్య దిట్టం క్రింద అదనంగా యాత్రికులకు పంచిపెట్టే అన్నప్రసాదాలకు శని, ఆదివారాలలో క్రిందివాటిని చేర్చడమైనది. కదంబం ( ఉదయం మొదటిగంట తరువాత ) రెండుసోలలు. కదంబం ( రాత్రి గంట తరువాత ) రెండుసోలలు దధ్యోదనం ( రెండవగంట తరువాత ) రెండుసోలలు.

* హరిద్వారంలోని భద్రకాళీ పీఠాన్ని, ఆపీఠాధిపతులైన శ్రీ కల్యాణానంద తీర్థస్వామీజీ కోర్కె మేరకు ఎట్టి షరతులు లేకుండ స్వాధీనం చేసుకొనేటందుకు అంగీకరించడమైనది.

* యాత్రికుల సౌకర్యాలకై ఖర్చుచేసే నిమిత్తం తిరుచానూరు గ్రామపంచాయతీకి 1981-82, 1982-83 సంవత్సరాలకు గాను రూ॥ 50,000 ల గ్రాంటును మంజూరు చేయడమైనది.

* 1983 జనవరిలో రాష్ట్ర శాసనసభ రద్దు కారణంగా టి.టి.డి. బోర్డులో ఏర్పడిన మూడు ఖాళీలకు ప్రస్తుత శాసనసభ సభ్యులైన శ్రీమతి నన్నపనేని రాజకుమారి, శ్రీ తలారి రుద్రయ్య, శ్రీ గుర్రం మాధవరెడ్డి గార్లను టి.టి.డి. నిర్వాహక మండలిలోని ఒక ఖాళీకి శ్రీమతి నన్నపనేని రాజకుమారిని ఇటీవల ఆంధ్రప్రదేశ్ గవర్నర్ నామినేట్ చేయటం సమోదు చేయటమైనది.

* తిరుపతి రైల్వే వోవర్‌బ్రిడ్జినుంచి కపిల తీర్థంవరకు రాష్ట్రప్రభుత్వం నిర్మిస్తున్న బైపాస్‌రోడ్ మిగులు పనిని దేవస్థాన ఇంజినీరింగ్‌శాఖ చేపట్టి సత్వరంగా పూర్తి చేయాలని తీర్మానించడమైనది.

* తిరుమల తిరుపతి దేవస్థాన ఉద్యోగుల గృహవసతికోసం తిరుపతి వినాయక నగర్, గోవిందరాజనగర్ ప్రాంతాలలో రు॥ 54 లక్షల 76 వేలవ్యయంతో అదనపు క్వార్టర్లను నిర్మించేటందుకు తీర్మానించడమైనది.

* తిరుమల తిరుపతి దేవస్థానముల విద్యాలయాల ప్రాంగణాలను ఆట స్థలాలను రాజకీయాలతో నిమిత్తంలేని ప్రజాహిత సంస్థలు ధార్మిక సంఘాలు తమ తమ కార్యకలాపాలకు వాడుకొనేందుకు అంగీకరిస్తూ దేవస్థానం ఇటీవల ఉత్తర్వులు జారీ చేసింది. *

| | | |
|---|---|---|
| అభిమన్యుడు | అమరచిత్రకథా ప్రచురణలు | 2_00 |
| సీతా[illegible] | ,, | 3_75 |
| మహాభారతం | ,, | 2_00 |
| శ్రీరామకథ | ,, | 2_00 |
| [illegible]గర్వభంగం | ,, | 2_00 |
| కార్తికేయుడు | ,, | 2_00 |
| గణేశుడు | ,, | 2_00 |
| నారదగాథలు | ,, | 2_00 |
| రామానుజులు | ,, | 2_00 |
| భజగోవిందం | శ్రీ స్వామీ చిన్మయానంద | 3_50 |
| హిందూధర్మము | శ్రీ నములకంటి జగన్నాథమ్ | 5_00 |
| భారతం భాగం-2 | ఉషశ్రీ | 2_50 |
| అన్నమాచార్యులు | శ్రీ కామిశెట్టి శ్రీనివాసులుశెట్టి | 1_00 |
| ఆధ్యాత్మసంకీర్తనలు మొదటి సంపుటం పునర్ముద్రణ | పరిష్కర్త: శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ | 5_00 |
| శ్రీనివాస బాలశిక్ష | సంకలనం: డా॥ విద్వాన్‌విశ్వం | 1_00 |
| సీతాదేవి | డా॥ డి. శ్రీధరబాబు | 1_00 |
| శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు | పరిష్కర్త: వేటూరి ప్రభాకరశాస్త్రి | 4_80 |
| లక్ష్మీకటాక్షము | విద్వాన్ జి. టి. సూరి | 0_70 |
| అన్నమాచార్య సంకీర్తనలు సంపుటి 1 | కూర్పు: శ్రీ కామిశెట్టి శ్రీనివాసులుశెట్టి | 2_25 |
| సంపుటి 2 | ,, | 2_75 |
| కథాసరిత్సాగరము | అనువాదం: డా॥ విద్వాన్ విశ్వం | 5_00 |
| ఆదిత్యపురాణ అంతర్గత శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యం | అనువాదం: ఆర్. రామమూర్తిశర్మ | 5_00 |
| ఆదిత్యహృదయము | శ్రీ బులుసు వేంకటేశ్వర్లు | 0_75 |
| భారతీయ తత్త్వశాస్త్రము | ,, | 5_00 |
| హనుమంతుడు _ భీముడు | అమరచిత్రకథ | 2_00 |
| భీష్ముడు | ,, | 2_00 |
| ఏకలవ్యుడు | శ్రీ ఎస్. బి. ఎస్. భట్టాచార్య | 0_50 |
| అద్వైతము_బ్రహ్మతత్త్వము | శ్రీ కె. ఎల్. నారాయణరావు | 5_00 |
| తిరుపతి చరిత్రము | అనువాదం: దివి రంగనాథాచార్యులు | 15_00 |
| శ్రీ వేంకటేశ్వర వైభవం | శ్రీ పండిత వేదాన్తం జగన్నాథాచార్యులు | 12_00 |
| శ్రీ వేంకటాచల మహాత్మ్యము | | 4_25 |
| (స్కాందపురాణం) | అనువాదం: విద్వాన్ సరిపెల్ల విశ్వనాథశాస్త్రి | 3_25 |
| శ్రీ రామానుజ కీర్తికౌముది | సంకలనం: శ్రీ ధనకుధరం వరదాచార్యులు | 10_00 |
| శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యుల జీవితచరిత్రము (ద్విపద) | తాళ్ళపాక చిన్నన్న | 7_25 |
| అన్నమాచార్య సంకీర్తనలు, ఆధ్యాత్మికములు | పరిష్కర్త: గౌరిపెద్ది రామసుబ్బశర్మ | 5_00 |
| అన్నమాచార్య సంకీర్తనలు : రెండవ సంపుటి | పరిష్కర్త: కె. శ్రీనివాసులుశెట్టి | 1_00 |
| అందియకథ | అనువాదం: పూతలపట్టు శ్రీరాములురెడ్డి | 2_50 |
| సూక్తిముక్తావళి | డా॥ ఎస్. బి. రఘునాథాచార్య | 0_20 |

వీటి ప్రతులు తి. తి. దేవస్థానముల సమాచార కేంద్రాలన్నింటిలోనూ లభిస్తాయి. లేదా వెల్‌ఫేర్ ఆఫీసరు, తి. తి. దేవస్థానములు, తిరుపతి. అను చిరునామాకు వ్రాసి పొందవచ్చును– పోస్టలుఛార్జీలు ప్రత్యేకం. వి.పి.పి. లు అంగీకరించబడవు.

Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press,
by M. Vijayakumar Reddy, L.P.T., Manager, T.T.D. Press, Tirupati.




27-3-'83—T. T. D. INFORMATION CENTRE
AT AIRPORT–RENIGUNTA



SRI VENKATESWARA SWAMY FLOAT FESTIVAL
FROM 24-3-'83 TO 28-3-'83.



## భూపాళం

వాఁడె వేంకటేశుఁడనేవాఁడె వీఁడు
వాఁడిచుట్టుఁగై దువవలచేతివాఁడు

కారిమారసుతునిచక్కనిమాటలకుఁ జొక్కి
చూరగా వేదాలగుట్టు చూపినవాఁడు
తీరని వేడుకతో తిరుమంగయాళువారి-
ఆరడిముచ్చిమికూటి కాసపడ్డవాఁడు

పెరియాళువారిబిడ్డ పిసికి పైవేసిన-
విరులదండల మెడవేసినవాఁడు
తరుణి చేయివేసిన దగ్గరి బుజముచాఁచి
పరవశమై చొక్కి పాయలేనివాఁడు

పామరులఁ దనమీఁదిపాటలెల్లాఁ బాడుమంటా
భూమికెల్లా నోర నూరిపోసినవాఁడు
మామకూఁతురలమేలుమంగనాచారియుఁ దాను
గీముగానే వేంకటగిరి నుండేవాఁడు

— అన్నమాచార్య సంకీర్తన

# యాత్రికులూ - రైలుబళ్ళూ!

ఏనుగుచుట్టూ పదిమంది మూగారట. పదినిమిషాల తర్వాత 'ఓస్ ఇంతేనా!' అనుకున్నార్ట. ప్రజాసౌకర్యం కోసమే తాము న్నట్లు చెప్తుంటే నిజమేననుకుని, తిరుపతికి కొత్తబళ్ళొస్తాయని, యాత్రికులకు కొన్ని సమస్యలు తీరగలవనీ కలగని, కలగని కొత్త టైంటేబుళ్ళు వచ్చేదాకా వేచివేచి చూస్తే ఏముంది? ఆ ఏనుగు సామెతే అనిపిస్తుంది.

అడిగిన వాటికి కాదనకుండా దేవస్థానం సహాయం చేస్తున్నా, యాత్రికుల సంఖ్య వేలల్లో పెరుగుతున్నా, యాత్రికుల ప్రయాణసౌకర్యాలు బహుళజన ప్రయోజనకరంగా మాత్రం పెరగటంలేదు. మన అభివృద్ధి, ముందుచూపు, చంద్రమండలం చేరే వేగపు రైలుబళ్ళు వేసేదిగా వుండగా సామాన్యుల కందుబాటు సౌకర్యాలుమాత్రం ఏర్పడనేలేదు. తిరుపతి నుండి వున్నవన్నీ ఎక్స్‌ప్రెస్ బళ్ళేకాని, దూరప్రాంతానికి ప్యాసింజరుబళ్ళు పెద్దగా లేవనేచెప్పాలి. ఇది ఇలావుండగా వున్నవి చాలవన్నట్లు 'ఢిల్లీఛలో' అని మొగ్గుకూడా ఎక్స్‌ప్రెస్, ఫాస్టుఎక్స్‌ప్రెస్, సూపర్‌ఫాస్టుల దాకా, పడకల దగ్గర్నుండి ఎయిర్‌కండిషన్ల వరకు పెరుగుతున్నదేకాని, దేశంలో మిగిలిన బడుగు జనాన్నిగూర్చి ఎవరికీ పడుతున్నట్టులేదు. ఇంకా కొత్తరైళ్ళు కావాలని తిరుపతి పక్షాన రైల్వే ఉద్యోగులే ఆమధ్య పత్రికలద్వారా కోరారు. కాని సూపర్ ఫాస్టు నాడి, వాళ్ళ సాధారణ అవగాహనకు అందినట్లులేదు. చివరకు వచ్చే సమాధానం పెట్టెలు చాలవనో, ఇంజన్లులేవనో, పట్టాలకు రెస్టు లేకుండా బళ్ళున్నాయనో, ఇవేవీ కాకపోతే కొత్తబళ్ళకు చాలినంతగా జనం వస్తారనే నమ్మకం లేదనో- మొత్తంమీద ఎదురైయ్యేది వామహస్తం మాత్రమే.

అందువల్ల ఈ క్రింది ప్రతిపాదనలు కొద్దిమార్పులతో సాధ్యమౌతాయేమో రైల్వే ఉద్యోగులూ, అధికారులూ, పరిశీలిస్తే బాగుంటుంది.

మద్రాసుకు చాలా ప్రాంతాలనుండి చాలా రైలుబళ్ళున్నై. కనుక కాకినాడ-మద్రాసు సర్కార్ ఎక్స్‌ప్రెస్‌లో ఒకటి రెండు పెట్టెలు కోవాడకు కేటాయించి ఆ బండిని తిరుపతి-వాల్తేరు నడుమ సింహాద్రి ఎక్స్‌ప్రెస్‌గా తిరుమల ఎక్స్‌ప్రెస్ వేళలలో, సాయంత్రం 4 గం॥ ప్రాంతంలో వాల్తేరు చేరి, అక్కడ నుండి ఉదయం 9 గంటలకు బయల్దేరి తిరుపతికి ఉదయం 6 గంటలకు చేరేటట్లు నడపవచ్చు. దీనివల్ల తిరుపతికి అదనంగా ఒకబండివేసినట్లవుతుంది. 'తిరుమల'ను గుంటూరు మీదుగా నడపాల్సిన అవసరం తప్పుతుంది.

తిరుపతి నుండి హైదరాబాదుకు విజయవాడ మీదుగా బళ్ళులేవు గనుక తిరుమల ఎక్స్‌ప్రెస్‌ను రాత్రి 9 గంటలకు తిరుపతిలో బయల్దేరి 6 గంటలకు విజయవాడ చేరే విధంగా నడిపితే అక్కడ పెద్దకాలహరణం లేకుండా గోల్కొండకు జోడించవచ్చు. హైదరాబాద్‌కు ఇప్పుడున్న వేళలలో చేరేటట్లు చేయవచ్చు, పైగా ఈ మార్గంలో రెండు బళ్ళుంటాయి కనుక పెట్టెల సంఖ్య కూడా తగ్గించుకోవచ్చు. ఈ పద్ధతులవల్ల వున్నబళ్ళే కొద్దిమార్పులతో ఎంతో ప్రయోజనకారులు కాగల అవకాశం వుంది.

# మీమాట

తిరుపతి నుంచి ఢిల్లీకి సరాసరి బండి కావాలనే ప్రతిపాదన విషయంలో జయంతి జనతా ఎక్స్‌ప్రెస్‌ను తిరుపతికి మళ్ళించిగాని, లేదా రేణిగుంట నిజాముద్దీన్ పెట్టెతోపాటు జనరల్ కంపార్టుమెంట్‌ను, తిరుపతి నుండి రేణిగుంటకు చేర్చి ఈ బండితో కలిపితే సరాసరి ఢిల్లీ వరకు సౌకర్యం ఏర్పడుతుంది. తిరుపతి నుండి ఋషికేష్‌కు ఒకపెట్టె వేస్తే ఎంతో లాభకరంగా వుంటుందని చాలా కాలంగా సప్తగిరి ద్వారా సూచించటం జరిగింది కూడా. దీనివల్ల తిరుపతినుండి ఢిల్లీదాకా ఒకటి, ఋషికేశ్‌కు ఒకటి మొత్తం రెండు పెట్టెలు అదనపు సౌకర్యాన్ని కలిగిస్తాయి. దీన్ని గుంటూరు మార్గంగా (గుంటూరు 6-00 ని॥లకు విజయవాడ 7-20 కు చేరేట్లు) మళ్ళించ గలిగితే చాలా ప్రయోజనాలు సిద్ధిస్తాయి. ఈ బళ్ళ బాగోగులను బట్టి ప్రత్యేక ఎక్స్‌ప్రెస్‌ల విషయం అప్పుడాలోచించుకోవచ్చు.

ఇక ప్యాసింజర్ బళ్ళ విషయంలో, యాత్రికుల అవస్థలు ఎంతచెప్పినా తీరదు. కాకినాడ ప్యాసింజరు తప్ప, దూరప్రాంతానికి ఆ మార్గంలో వెళ్ళేబండి తిరుపతి నుంచి లేదు. అందువల్ల అదనంగా ఇంకొక బండి విధిగా నడపవలసి వుంటుంది.

తిరుపతి విజయవాడల నడుమ 447, 439, 441, విజయవాడ తిరుపతుల నడుమ 442, 440, 446 పేర్లతో నడిచే ప్యాసింజరులను తిరుపతి-విజయవాడ, ప్యాసింజర్లుగా మార్చి ఒంగోలులో 30 నిమిషాలకు మించని వ్యవధి యిచ్చి నడిపితే సామాన్యయాత్రికులకు చాలా మేలు చేసినట్లవుతుంది. తిరుపతిలో మధ్యాహ్నం 1-30కు బయల్దేరి విజయవాడకు మరునాడు ఉదయం 6 గం॥లకు చేరేటట్లు, విజయవాడలో సాయంత్రం 5-45 కు, బయల్దేరి తిరుపతికి ఉదయం 10 గం॥లకు చేరేటట్లు ఏర్పాటు చేయవచ్చు దీనివల్ల యిప్పుడు తిరుమల ఎక్స్‌ప్రెస్‌కు వున్న రద్దీ (అంటే కమ్మీలు పట్టుకు వేలాడే స్థితి) చాలావరకు తప్పుతుంది.

ఇది జరిగితే తిరుపతి నుండి ఉదయం 10 గం॥లకు పూరి, మ. 1-30 కి పాసింజరు, 7 గం॥ వాల్టేర్, 9-00 లకు తిరుమల, 10-30 లకు ప్యాసింజర్- ఇలా దూరపు ప్రాంతం బళ్ళు ఏర్పాటు చేసుకోవచ్చు. ఇదేవిధంగా జమ్మూ-తావి-మద్రాస్ ఎక్స్‌ప్రెస్ గూడూరు వచ్చే వేళను 30 నిమిషాలు తగ్గించి గూడూరు తిరుపతి-(448) ప్యాసింజరు బండి కాలాన్ని కొద్దిగా పొడిగిస్తే ఈ రైలులో వచ్చే యాత్రికులు ఏ ఇబ్బందీ లేకుండా తిరుపతి చేరేందుకు వీలవుతుంది. చీరాల-మద్రాసుప్యాసింజరును విజయవాడ వరకు పొడిగిస్తే రైల్వేవారికి అన్నివిధాల అదనపు రాబడివుంటుంది.

ఇవన్నీకాక యిప్పుడున్న రైలుబళ్ళకు కేవలం ఒకటి రెండు అదనపు పెట్టెలతో హౌరా, ఢిల్లీలకు సరాసరి ప్రయాణ సౌకర్యం సంపాదించుకోవచ్చు. తిరుపతి నుంచి పూరీ ఎక్స్‌ప్రెస్, మద్రాసునుండి 51 (లింక్) గూడూరు — విజయవాడల నడుమ చేయి చేయి కలుపుకుని ప్రయాణం చేస్తాయి. అందువల్ల హౌరాకు ఒకటి, ఢిల్లీకి ఒకటి, రెండే రెండు పెట్టెలను 'పూరి'కి తగిలిస్తే ఢిల్లీకి హౌరాకు సుఖంగా ప్రయాణం చేయవచ్చు.

ముఖ్యమైన విషయం ఇంకొకటి వుంది. కాట్పాడి-తిరుపతి మధ్య పెద్దలైను వేసే కార్యక్రమం ప్రారంభమైనట్లుంది. ఇప్పుడు

(45 వ పేజీలో)



# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాస పత్రిక...



గౌరవసంపాదకులు :

**శ్రీ జి. కుమారస్వామిరెడ్డి,**
ఐ. ఏ. ఎస్.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

ప్రచురణకర్త - సంపాదకుడు :

**కాట్రపాటి సుబ్బారావు,**
ఎమ్. ఎ.

ఉపసంపాదకుడు :

**తిరుమూరు సుధాకర్‌రెడ్డి,**
ఎమ్. ఎ. బి. ఇడి.,

ముద్రాపకుడు :

**ఎమ్. విజయకుమార్‌రెడ్డి.**



**విడిప్రతి-రు. 1-00**

**సం॥ చందా-రు. 12-00**

ప్రతులకు :

**వెల్‌ఫేర్ ఆఫీసర్,**
టి. టి. డి., తిరుపతి.


## ఈ సంచికలో....


**మే 1983**

సంపుటి **13** సంచిక **12**






ముఖచిత్రం: అలిపిరివద్దగల గరుడాళ్వారుల విగ్రహం

# సంపాదకీయం

'మనిషి బుద్ధి మహామర్కటం
మత్తెక్కితే మరీసంకటం'

ఈ భావాన్ని మనకందించిన పూర్వీకులు ఏ మాటలలో అన్నా చాలా గొప్పగా చెప్పారనే ఒప్పుకోవాలి. నరుడు వానరాంశజుడు అనే మాట ఎలావున్నా వానరత్వంలో ఒక వైశిష్ట్యం వుంది. దానిలో అనుకరణ శీలం ఎంత ప్రస్ఫుటంగా వుందో భావతీవ్రత, నిరంతర సంచలనతత్త్వం అంత విస్తృతంగావున్నై. ఒకటి భావవికాసానికి చిహ్నమైతే రెండోది పరిశోధక తత్త్వానికి నాంది. మూడవది పరార్థం హరించుకోవాలనే దుర్గుణం. ఇందులో అంతా ఒకటే.

ఇవన్నీ ఎలావున్నా మత్తెక్కిన కోతి చేయలేని ఆగడమంటూలేదు. ఎంతటి విశిష్టవస్తువైనా ధ్వంసం కావలసిందే! ఆంజనేయస్వామి ఒక విశిష్ట కార్యం కోసం లంకాదహనం చేస్తే మిగిలిన కోతిమూక తమరాజైన సుగ్రీవుని మధువనాన్ని నిష్కారణంగా ధ్వంసంచేసి, వద్దన్న దధిముఖుడికి 'ఘన' సన్మానం చేసిన విషయం ఆదికావ్యంలో అభివర్ణితం.

మనం అపర ఆంజనేయులం కాలేకపోయినా మనలో మాత్రం మార్కట్యమే నాట్యం చేస్తుంది. మనం రోజురోజుకీ సూత్రాలనూ శాస్త్రాలనూ వల్లెవేయటంలోనే మోజు పెంచుకుంటున్నాంతప్ప లభించిన విజ్ఞానాన్ని సమాజ వికాసానికి ఉపయోగించే శక్తివున్నా బుద్ధిని మాత్రం కోల్పోతున్నాం. నిజానికి మనం వల్లించేదానికీ, ఆచరణకూ ఎక్కడా పొంతన కన్పించటంలేదు. కోతికి కల్లుమాదిరిగానే మానవుడు అధికార, కీర్తి, కాంతా, కనక వ్యామోహమత్తుడై తన మాట చెల్లుబడికోసం వర్గ వర్ణ ధర్మ వ్యత్యాసాలు ఆధారంగా దుర్బలులపై విరుచుకుపడుతున్నాడు. దీని ఫలం వ్యవస్థావిచ్ఛేదకమైన ప్రతిఘటన. వ్యక్తుల దోషాలకు వ్యవస్థలు బలౌతున్నాయన్నమాట!

శ్రీరాముడు శబరి ఎంగిలిఫలాలను తిన్నాడని రామాయణంలో వుంది. క్షత్రియుడైన శ్రీకృష్ణుడు పెరిగింది గోకులంలో! 'చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః' అన్న ఆ పరమాత్మ, ఆ గీతలోనే ఆత్మవత్సర్వ భూతాని అనీ, శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః అనీ జ్ఞాని అనవాడు జీవజాలాన్ని దృష్టిభేదం లేకుండా ఆత్మతత్త్వాన్ని గుర్తించి ప్రవర్తించాలని సెలవిచ్చారు. భారతంలోని ధర్మవ్యాధోపాఖ్యానం, హరిశ్చంద్రుడు వీరబాహువద్ద సేవచేయటంలాంటి ఇతర కథలు కులంకన్న గుణంమిన్న అనే ధర్మాన్ని బోధించేనే! ఇక పురాణ సాహిత్యంలో కూడా ఇంతే! అద్వైతాచార్యులు శంకరాచార్యులకు సమవర్తి 'చండాల' రూపంలో సమత్వం బోధించటంలో అంతరార్థం, విశిష్టాద్వైత సిద్ధాంతంలోని మునివాహన భోగం, బ్రహ్మరాక్షసత్వాన్ని పోగొట్టిన మాలదాసరి కథ, కన్నప్పకథ, నందనార్‌కథ ఈ ధర్మాన్ని భంగ్యంతరంగా నిరూపించేనే! ఇక రాజకీయంగా చూచినా భారతకాలంలో వైవాహిక విషయాలలో వర్ణ ప్రాధాన్యం లేదనేందుకు ఆధారాలున్నాయి. మన చరిత్రలో కులాలు కులాలుగా పోట్లాడుకున్న సందర్భాలెన్ని? నిజానికి మన గ్రామవ్యవస్థలో అందరు అన్న, అక్క, మామ, బాబాయి అనే అనుబంధాలతో బ్రతికినవాళ్ళే. కాని సహజీవన, సమజీవన, సదవగాహన సిద్ధాంతాలలో ఏర్పడిన మన సమాజ వ్యవస్థకు నేడు మనం విచిత్రమైన రంగులు పులుముతున్నాం.

కలకన్నా నిజం కఠోరమైంది. కోతికైనా కొంత నిలకడవుందేమోగానీ మనిషి బుద్ధికి మాత్రం లేదు. మానవ విజ్ఞానం సూర్యమండలం దాటుతున్నా మనసు మాత్రం ఏ మాత్రం ఎదగటంలేదు. వ్యక్తిగతమైన అవసరాలు తీర్చుకునేందుకు, సాధించలేని కసితో, తాము జరిపే అత్యాచారాలకు రక్షణగా పదిమందిని రెచ్చగొట్టేందుకు వాడుకొంటున్న ఆయుధాలేతప్ప నిజానికి మన వ్యవస్థలలో దోషం ఎక్కడా కన్పించదు. వ్యక్తుల దోషాలకు వాళ్ళను శిక్షించటంమాని వ్యవస్థాభక్షణకు పూనుకొంటే అది 'కంచెచేను మేత'కన్నా వేరేకాదు. శిక్షణ, సంస్కారం, శిక్ష కావలసింది వ్యక్తికి. అప్పుడు వ్యవస్థలుకూడా మారటం సహజం. పరస్పర నిందారోపణలవల్ల సామూహిక దండప్రయోగంవల్ల సాధించగలిగేది ఏమీలేదు. పొరుగింటి నిప్పుతో మన చుట్ట కాల్చుకోవాలనుకున్నంత కాలం ఇంటికొక వివేకానందుడుపుట్టినా ఇంతే! అద్వైతం బోధించిన శంకరులు, దాన్ని విశిష్టం చేసిన రామానుజులు ఒకే మాసంలో జన్మించిన ఈ పుణ్యభూమిలో మనం నేర్చుకోవలసింది సమతాధర్మాన్ని గురించే! ఇంతేగాక ఈ ఏడు ఆ ఇద్దరి జన్మ తిథులు ఒకే రోజున వస్తున్నవి— ఇలా 251 సంవత్సరాల కొకమారు జరుగుతుందట. భంగ్యంతరంగా ఈ ఇరువురూ ఒకే సందేశాన్ని అందిస్తున్న సంకేతమైన ఈ మహత్తర దినాన మనం మననం చేసుకొని నేర్చుకోవలసింది ఎంతైనా వుంది. కానీ మనం ఎంత మారగలిగాం? ఏదో పాతపాట జ్ఞాపకం వస్తున్నది.

**'మనుషుల బుద్ధులు కోతులకుంటే — కోతుల బుద్ధులు కొందరివి'**

**మొదటిది ఆంజనేయుల వారిది. రెండవది మనది. అంతే!!**

# తిరుమల విష్ణువు - శ్రీ వైష్ణవులు

— శ్రీ జె. మునిరత్నం





పుట్టుకతోడనే కంటిచూపు కరువై తనకు ప్రపంచం అంధకారకూపమైనా, అంతర్నేత్రాలతో తనకంటూ ఓ సాహిత్య లోకాన్ని సృష్టించుకొని అందులో విశృత విహారం చేసే ఈ రచయిత శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం నుండి తెలుగు సాహిత్యంలో ప్రథమశ్రేణిలో ఎమ్. ఏ. పట్టా అందుకొని తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఉపకారవేతనంతో 'అన్నమయ్య ఆళ్వారుల తులనాత్మక' పరిశీలన అనే అంశంపైపరిశోధన సాగిస్తున్నారు — విద్యార్థి దశనుండే ఈయన రచయితగా రాణిస్తున్నారు.

తిరుమల జగద్విఖ్యాత పుణ్యక్షేత్రం. క్షేత్రాధీశ్వరుడు శ్రీ వేంకటేశ్వరుడు. ధన జనాకర్షణోపేతుడు. సర్వలోక సుప్రసిద్ధుడు.

ఆర్తులు, జిజ్ఞాసువులు, అర్థార్థులు, జ్ఞానులు, అన్ని కోవలకు చెందినవారు వచ్చి ఆస్వామిని సేవించి ఆశయ సాఫల్యాన్ని పొందినంత సంతోషంతో తిరిగిపోతుంటారు. తమ కలికల్మషాలు కడిగేసేందుకు, సుఖ శాంతులు ప్రసాదించేందుకు సాక్షాత్తు విష్ణువే విగ్రహరూపంగా యిక్కడ వెలిశాడని వారి అచంచల విశ్వాసం. పడకై, గొడుగై స్వామిని బాయని శేషుడే శేషాచలాకృతి ధరించాడని భావిస్తారు.

విష్ణువే వేంకటేశ్వరుడనేందుకు బ్రహ్మాండ వరాహ పురాణాదుల్లో ఆధారాలు కనిపిస్తున్నాయి. భృగువు తన్నడంవల్ల అలిగి వెళ్లిన అర్ధాంగి వియోగాన్ని సహించలేక ఆమెను వెదుక్కుంటూ వెళ్లి శ్రీనివాసుడు శేషాచలవాసుడు కావడము, పద్మావతీ పరిణయము, భక్తుల కలికల్మష హరణార్ధము విగ్రహరూపము ధరించడము, ఇత్యాది అంశాలతో గూడిన పౌరాణిక గాథ బాగా ప్రచారంలోకి వచ్చింది.

పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చ అనే ఐదు స్థితులలో విష్ణువు భక్తుల ననుగ్రహిస్తూ ఉన్నాడని వైష్ణవం చెబుతుంది. విగ్రహరూపంలో ఉంటూ భక్తుల కోరికలీడేర్చే మూర్తిని అర్చావతారం అంటారు. ఇలాంటి అర్చామూర్తులలో నూట ఎనిమిది దివ్యదేశాలలో ఉన్న మూర్తులు వైష్ణవులకు చాలముఖ్యమైనవి. అందులో తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి అతిప్రధానమైన మూర్తి.

ఈ తిరుమల విష్ణువు ఎప్పుడు వెలిశాడో చెప్పడంచాలా కష్టం. క్రీ. పూ. 3, 7 శతాబ్దాలమధ్య కాలంలో వెలసిన సుప్రసిద్ధ ప్రాచీన తమిళ లక్షణ గ్రంథమైన 'తొల్కాప్పియం'లో తిరుమల ప్రసక్తి ఉంది. తిరుమల, కన్యాకుమారి తమిళనాడుకు ఉత్తర దక్షిణ సరిహద్దులుగా అందులో పేర్కొనడం జరిగింది.

క్రీస్తుశకం ఒకటవ శతాబ్దంలో వెలసిన సంఘకావ్యాల్లో తిరుమల విష్ణుదేవుని శైలంగా కీర్తింపబడింది. "అగనానూరు" 149వ పాటలో "ఒడియావిళవిన్ నెడియోన్ కున్ర్రమ్" పదబంధం యీ విషయాన్నే సూచిస్తుంది, 'ఇళంగో' రచించిన శిలప్పదికారంలో కూడా వేంకటాచలం విష్ణు నిలయమనే పేర్కొనబడి ఉంది.

అతిప్రాచీనకాలం నుంచి కవులు, గాయకులు, భక్తులు, పండితులు ఎందరెందరో ఎన్నెన్నో విధాలుగా తిరుమలనూ, తిరుమలరాయనీ కీర్తించారు. వారిలో ప్రధానంగా పేర్కొనదగినవారు తిరువైష్ణవులు.

తిరుశబ్దము శ్రీశబ్ద పర్యాయంగా తమిళంలో వాడబడుతూవుంది. ఇదేవిధంగానే వైష్ణవసాహిత్యంలోనూ చోటుచేసుకొని ఒక పారిభాషిక పదంగా స్థిరపడి ఆ సాహిత్యంతోబాటే అనేక భాషల్లోను ప్రవేశించింది. తెలుగులో కూడ వైష్ణవసాహిత్యంలో యీ తిరుశబ్దం కనిపిస్తుంది. అన్నమాచార్యాది శ్రీ వైష్ణవ రచయితలెందరో దాన్ని ప్రయోగించి ఉన్నారు. దీన్నిబట్టి శ్రీ వైష్ణవులే తిరువైష్ణవులని తెలుస్తుంది.

సర్వము విష్ణుమయమని, విష్ణువుకన్న మించిన దైవం లేదని భావించి దేవతాంతరాల జోలికి పోకుండ విష్ణువును విష్ణుభక్తులను సేవించేవారే తిరువైష్ణవులని చెప్పుకోవచ్చు.

ఈ తిరువైష్ణవ సాహిత్యానికంతటికీ ఆద్యుడూ, ఆధారభూతుడు నమ్మాళ్వారనే చెప్పుకోవచ్చు. ఈయన తక్కిన ఆళ్వారులు గానంచేసిన దివ్యప్రబంధాలను శ్రీమన్నాథమునులకు బోధించి ఆళ్వారులకూ, ఆచార్యులకూగూడా కేంద్రప్రాయుడై "ప్రపన్న జనకూటస్థుడు" నే ప్రశంస పొం

దాడు. నమ్మాళ్వారునుండి గ్రహించి నాధ మునులు సంకలనం చేసిన నాలాయిర దివ్య ప్రబంధమువల్ల ఆళ్వారుల రచనల విశేషాలు తెలుస్తాయి. పన్నెండుగురు ఆళ్వారులలో 'తొండరడిప్పొడియాళ్వారు' (విప్రనారాయణ) మధురకవి ఆళ్వారు మినహా పదుగురు మాత్రమే వేంకటశైలాన్ని వేంకటేశ్వరుణ్ణి (213) పాశురాలలో కీర్తించి ఉన్నారు. క్షేత్రాధీశ్వరులనే గాక దివ్య దేశాలను సంస్మరిస్తే కూడా కలికల్మషాలు పోతాయని ఆళ్వారుల అచంచల విశ్వాసం. "తిరుమాలిరుంజోలై కొండా" అన్నంతనే ఏమాశ్చర్యము. శ్రీమహావిష్ణువచ్చి నా మనసు నిండునట్లు ప్రవేశించాడు" అన్న నమ్మాళ్వారు సూక్తి ఆళ్వారుల విశ్వాసానికి తార్కాణం. అందుకే ఆళ్వారులు కొండల రాయణ్ణే గాక కొండనుగూడా కొనియాడారు. తిరుమలమీద తిరుమలేశుని మీద ఆళ్వారులు రచించిన పాశురాల సంఖ్యతో బాటు వాటిలోని భావాలు కూడా మచ్చుకు తెలుసుకొందాం-

## పొయ్‌గై ఆళ్వార్

మొదటి ఆళ్వారైన ఈయన కాంచీపురం తిరువెగ్గా అనే ప్రదేశంలో ఒక కొలను తామరలో జన్మించారు. ఈయన స్వామి మీద 10 పాశురాలు పాడారు. ఈయన తిరుమల ప్రశస్తిని, తిరుమలరాయుని వైభవాన్ని కొనియాడిన తీరు పరికించండి. "కొండలరాయని అర్చించడంకోసం పుష్ప తీర్థ ధూపదీపాలతో నానాదిక్కులనుండి సూక్ష్మార్థశ్రుతి జ్ఞానులైన వైదికులు చేర వచ్చే తిరుమల పాంచజన్యధరునికిష్టమైన ప్రదేశము".

## పూదత్తాళ్వార్

రెండవ ఆళ్వారైన ఈయన మహాబలిపురంలో జన్మించారు. ఈయన స్వామికి సంబంధించి 9 పాశురాలు చెప్పారు. తిరుమలలో నరులేగాక వానరాది జంతుజాలము కూడా స్వామిని భక్తితో సేవిస్తాయని ఆళ్వార్ భావించారు కాబట్టి "తిరుమలలోని కోతులు ప్రాతఃకాలాన్నే పూలతోనిండిన గుంటలలో స్నానంచేసి అక్కడ పుష్పించిన పూలు తెచ్చి స్వామినర్చిస్తాయి" అన్నారు.

## పేయాళ్వార్

మూడవఆళ్వారైన ఈయన మైలాపూరు చెన్న కేశవస్వామి ఆలయప్రాంగణములోని కొలనులో ఒక పువ్వులో జన్మించారు. ఈయన పాశురాలు 19. పూదత్తాళ్వార్, వానరాలసేవను వర్ణిస్తే, పేయాళ్వార్ ఏనుగులు కూడ స్వామినర్చించడానికి సంసిద్ధమవుతున్నట్లు ఉత్ప్రేక్షించారు. "కుంభస్థలాలనుంచి, చెంపలనుంచి కారే మద జలంతో పుక్కిలించి సెలయేరులా కాళ్ళ దాకా ప్రవహించే ఆనీటితోనే కాళ్లు కడుగుకొని ఏనుగులుకూడ స్వామిని సేవిస్తాయని" పేయాళ్వార్ చమత్కరించారు—

## తిరుమళిశై ఆళ్వార్

నాల్గవ ఆళ్వారైన ఈయన పూనమల్లి ప్రక్కనేఉన్న మహీసారక్షేత్రం అనే తిరుమళిశైలో జన్మించారు. ఎన్నో మతాలను చూచి ఎన్నెన్నో అద్భుతాలనుచేసి ఎందరినో మెప్పించారు. ఈయన పాశురాలు 15. "కొండఅని వెంకటాచలాన్ని పాడాను మోక్షసిద్ధుడనై ధ్యానిస్తున్నాను" "కారుణ్యంతో కల్మషాలను కడిగివేసే వేంకటాచలానికి వెళ్లి సేవించండి అది. స్వర్గమర్త్య వాసులకు పెన్నిధి"—అని శేషాచలాన్ని శ్లాఘించారు.

## కులశేఖరాళ్వార్

ఈయన కేరళదేశపు రాజు. పరమభాగవతులు. భాగవత విధేయులు. రాజ్య పరిత్యాగంచేసి రంగనాధ కైంకర్యంలోనే కాలాన్ని గడపినవారు. ఈయన పాశురాలు 11. తిరుమలలో జీవితం పరమోత్కృష్టమని, స్వర్గాధికతమమని భావించారు. తన కోరికనిలా వెల్లడించారు. తిరుమలలో పక్షిగా, చేపగా, చంపకవృక్షంగా, ఓషధిగా అడవియేరుగా, కొండలో ఒకభాగంగా, స్వామిసేవకుడుగా, గర్భగృహసోపానంగా అది ఇది యేల మాధవుని మహీధరం మీద యేదైనా అవుతాను"

## పెరియాళ్వార్

భట్టనాథుడు అనే ఇతను శ్రీవిల్లిపుత్తూరు నివాసి. స్థానిక వైష్ణవాలయంలో పుష్పమాలికా కైంకర్యముచేసి పునీతులయ్యారు. పాండ్యరాజును స్వామి అనుగ్రహంతో వైష్ణవుణ్ని చేశారు. ఈయన పాశురాలు 11. "వేదతత్వమా, విద్వన్మణీ, ఉత్తుంగ శేఖరసమోపేత వేంకటాధినాయకా, ప్రపంచ క్షేమార్థమై నడుముకట్టిన స్వామీ, దామోదరా, నా వేంకటేశ్వరా"—అని స్వామిని నోరార కీర్తించి, ఆయనపై తనకున్న భక్తిప్రపత్తులను ప్రకటించారు.

## అండాళ్

గోదాదేవి అనే ఈమె పెరియాళ్వారుగా పెంపుగాంచిన విష్ణుచిత్తుని పెంపుడు కూతురు. పుష్పవనంలో అయోనిజగా లభించిన సాధ్వీపారిజాతము. తను ధరించిన పుష్పమాలికలను స్వామికి పంపి సంతోష పరచిన సౌశీల్యవతి. ఈమె పాశురములు 16. వేంకటేశ్వరునికి మేఘ సందేశాన్ని పంపింది. తనలో ప్రవేశించి నిస్సారవతిగా చేసిన నారాయణునికి తన వృత్తాంతాన్ని తెలియచేయమని వేంకట శైలంమీద నివసించే మేఘాలను కోరింది.

## తిరుప్పాణాళ్వారు

వీరు అస్పృశ్యులుగా పరిగణింపబడి రంగని అనుగ్రహానికి పాత్రులైనవారు. బ్రాహ్మణోత్తముని భుజాలమీద శ్రీరంగాలయం ప్రవేశించి రంగనికీర్తించి ఆయనలో ఐక్యమయినవారు. ఈయన పాశురములు, (2) అమలుడు, ఆద్యుడు ప్రభువు. నన్ను దాసులసేవకు వినియోగించిన విమలుడు, దేవసార్వభౌముడు, అందమైన తోటలతో నిండిన వేంకటాచలాధీశుడు-అని స్వామిని కొనియాడాడు.

## తిరుమంగై ఆళ్వారు

పరకాలుడని వ్యవహరింపబడేవారు. దండనాధులుగా, సామంతులుగా చోళాధీశ్వరుని కుడిభుజంగావుండి వైష్ణవులై, వైష్ణవ క్షేత్రాలు కొన్ని సందర్శించినవారు. ప్రతి నిత్యం వేయిమందికి తక్కువ కాకుండ భాగవతులకు అన్నసంతర్పణం చేసేవారట. శ్రీమన్నారాయణునివల్ల, స్వయంగా మంత్రోపదేశం పొందినవారు. ఈయన పాశురాలు 62. శ్రీ కృష్ణావతారములోనేకాక తక్కిన అవతారాలలోని భగవల్లీలలనుకూడ వేంకటేశ్వరుని లీలలుగానే భావించి కొనియాడారు. భగవంతుడు తన భావముతో ప్రవేశించి అనుగ్రహించిన విషయాన్ని ప్రస్తావించి ఆర్ద్రచేతస్కులై ఆయనను వినుతించారు. తిరుమలవాసా నిరాధారుణ్ణై పాపినై ఉపాయమెరుగనివాణ్ణైన నేను నిన్నే ఆశ్రయించాను. దాసుణ్ణి అనుగ్రహించు, అని వేడుకొన్నారు.

## నమ్మాళ్వార్

పరాంకుశులనే ఈయన తిరుక్కురుకూరులో జన్మించి ఒక చింతచెట్టుక్రింద యోగసమాధిలోవుండి విష్వక్సేనుని వల్ల విష్ణుతత్వాన్ని ఎరిగినవారు. వేదతుల్య ప్రబంధాలను రచించడమేగాక, ఆళ్వారుల దివ్యప్రబంధాలను నాధమునులకు బోధించి, శ్రీవైష్ణవమునుజ్జీవింప చేశారు. ఈయన పాశురాలు 62. ఈయన వేంకటేశ్వరుని శరణు జొచ్చినతీరు గమనించదగివుంది. అనుపమ కీర్తివంతుడా త్రిలోకేశ్వరుడా నన్నేలువాడా, సాటిలేని దేవతలు ప్రీతితో ఆరాధించే వేంకటేశ్వరుడా "అన్యధా శరణములేని నేను నీ చరణము నాశ్రయించి శరణుజొచ్చితిని" అని ప్రపత్తిచేశారు.

## తిరుమలనంబి

ఆళ్వారుల తర్వాత ఆ వరుసలో పేర్కొనదగిన తిరుమలేశుని సన్నిహితులు తిరుమల నంబి. శ్రీరంగంలో యామునాచార్యులు ప్రసంగవశాత్తు చెప్పిన నమ్మాళ్వార్ పాశుర భావానికి ముగ్ధులై తిరుమలకు వచ్చి స్వామిని సేవించాలని స్థిరనిశ్చయము చేసికొన్నారు. తిరుమలలో స్వామి కైంకర్యము చేస్తూ రామానుజులకు రామాయణము బోధించి వైష్ణవాచార్యునిగ తీర్చిదిద్దారు. స్వామికి నిత్యం స్నానానికి పాపవినాశంనుండి తర్వాత ఆకాశగంగనుండి నీళ్లు తెచ్చేవారట. ఈ సంప్రదాయం నేటికి తిరుమలలో సాగుతున్నది. ఆ కైంకర్యం, తిరుమలనంబి వంశస్థులే నిర్వహిస్తున్నారు. తిరుమలనంబి రచనలేవీ చేయకపోయినా స్వామిసన్నిధిలో మానసపూజా కుసుమంగా ప్రకాశించారు.

## తిరుక్కచ్చినంబి

కాంచీపూర్ణులని పిలువబడే తిరుక్కచ్చినంబి పూనమల్లినివాసి. నిరంతర భగవత్సహవాసి. తిరుమల, కంచి, శ్రీరంగానికివెళ్ళి అక్కడి స్వాములతో స్వయంగా మాట్లాడిన ఘనత ఈయనదే. రామానుజుల సందేహాలను సైతం కంచీవరదునడిగి తీర్చినదిట్ట. ఈయన శోళింగపురములో నుండగా శ్రీ వేంకటేశ్వర భగవానుడు అశ్వాధిరూఢుడై కనిపించి ఆకర్షించి దారెల్లాపూలు వేసుకొంటూ వెళ్ళి తిరుమలచేరి అదృశ్యుడయ్యాడు. వెన్నంటి వెళ్ళిన తిరుక్కచ్చినంబి తిరుమలలో స్వామిని సేవిస్తూ కొన్నాళ్లుండి ఆలవట్ట కైంకర్యముచేయగా తిరుమలేశుడు తనకా కైంకర్యము అనవసరమని సంభాషించి సంతోషపరిచి తిరిగి కంచికి పంపినట్లు సంప్రదాయ కథనం.

## రామానుజాచార్యులు

శ్రీ పెరంబుదూరు జన్మస్థలము. విశిష్టాద్వైత ప్రవర్తకులు. విష్ణుతత్త్వప్రచారకులు. వీరు తిరుమలకు మూడుసార్లు వచ్చినట్లు తెలుస్తోంది. ఇప్పటి పూజాపద్ధతులను ఏర్పరచినది కూడా వీరేనని చెబుతారు. అర్చకులను వారికి నివాసవసతులను కూడ ఏర్పాటు చేశారట. ఈయన తన శ్రీభాష్య మంగళాచరణ శ్లోకములోనే వేంకటేశ్వరుని స్తుతించారు. తమ సర్వశక్తులు వేంకటేశ్వర ప్రసాదితాలేనని విశ్వసించి వినుతించారు.

## అనందాళ్వార్

ఈయన కన్నడ దేశస్థులు. రామానుజులవారిచే ప్రార్థింపబడి స్వామికర్చనాది కైంకర్యాలు చేయడంకోసం యాత్రికులకు వసింప వీలుకాని తిరుమలకు వచ్చారు. కొలను, పుష్పవనము, నిర్మించి స్వామి నర్చిస్తూ వచ్చారు. తమ యీ కైంకర్యములో భగవంతుడుకూడ సహాయపడినట్లు తెలుస్తూ వుంది. వెంకటేశ్వరునితో స్వయముగా సంభాషింపగలిగిన ఈయన, వేంకటేశ్వర ఇతిహాసమాల అనే చక్కటి సంస్కృత గ్రంథం రచించారు. సర్వదక్షులైన ఈయన స్వామిని సమీపించి భిషగ్వరునిగా కీర్తించారు.

## వేదాంతదేశికులు

కాంచీపుర సమీపంలోని తూప్పిల్ గ్రామములో వేంకటనాధుని అనుగ్రహంవల్ల జన్మించిన ఈయన వేంకటనాధుడనే పేరుతో ప్రసిద్ధులయ్యారు. బహుగ్రంథకర్త. కవి. తార్కిక సింహ, సర్వతంత్ర స్వతంత్ర, ఉభయ వేదాంతాచార్యాది బిరుదులెన్నో పొందారు. వేదాంతదేశిక బిరుదాన్ని వేంకటేశ్వరుడే తనకు ప్రసాదించాడని తన దయాశతకంలో పేర్కొన్నారు. వేంకటేశ్వరుని పట్ల ఈయనకుగల భక్తి ప్రపత్తులు అపారం.

## మణవాళమామునులు

వీరు "పిళ్లైలోకాచారియార్" రచనలకు వ్యాఖ్యాన ప్రాయాలైన పలురచలుచేశారు. తన స్వీయరచనలలోగూడ వేంకటేశ్వర విభవాన్ని కొనియాడారు. తిరుమలకువచ్చి కొన్నాళ్లుండి స్వామిని సేవించి ఒక మఠమును స్థాపించి తనకు మారుగా వేరొకరిని కైంకర్యానికి నియమించి వెళ్లారు. తిరుమలేశునిపట్ల వీరికున్న భక్తి అనంతం.

తిరుమల విష్ణువుతో పలువిధాలా సంబంధము పెట్టుకొని తరించిన తిరువైష్ణవుల నాదర్శంగా వుంచుకొని ఆస్వామితో సన్నిహిత సంబంధాన్ని గలిగి శాశ్వత ఆనందాన్ని పొందడం సర్వజన సముచిత కర్తవ్యంగా గుర్తించవలసి వుంది.

"కైవల్యమునకంటె కైంకర్యమెక్కుడు"

(అన్నమాచార్యులు)

*



పూర్ణకుంభ స్వాగతం



అభిషేక సేవలో



శ్రీవారి ప్రసాద స్వీకారం

# తిరుమలలో ముఖ్యమంత్రి

(15—4—83)








# ప్రశ్నోపనిషత్

(గతసంచిక తరువాయి)

## పంచమ ప్రశ్నము

అథ హైనం శైబ్యస్సత్యకామః పప్రచ్ఛ.
స యో హ వై తద్ భగవన్! మనుష్యేషు
ప్రాయణాంత మోంకార మభిధ్యాయీత.
కతమం వావ స తేన లోకం జయతీతి.

తరువాత శిబికొడుకు సత్యకాముడు అనే ముని పిప్పలాదుణ్ణి ఇలా ప్రశ్నించాడు.

భగవన్! మనుష్యులలో ఎవడు బ్రతికి ఉన్నంతవరకు ఓంకారం జపిస్తాడు? ఆ జపంమూలాన అతడు ఏలోకానికి వెళ్లుతాడు?

2

తస్మై స హోవాచ ఏతద్వై సత్యకామ! పరం
చాపరం చ బ్రహ్మ యదోంకారః
తస్మాద్ విద్వానేతేనైవాయతనే నైకతరమన్వేతి.

ఆ ప్రశ్నకి పిప్పలాదుడు ఇలా చెప్పాడు.

సత్యకామా! పరమనీ, అపరమనీ ఆత్మ వేత్తలు చెప్పే బ్రహ్మమే ఓంకారం. ఆ రహస్యం తెలిసిన బుద్ధిమంతుడు ఆ ఓంకార ధ్యానమనే మార్గాన పరమూ, అపరమూ అని రెండు విధాలుగా ఉన్న బ్రహ్మపదార్థములో ఏదో ఒక దానిని చేరుతాడు.

3

స యద్యేకమాత్ర మభిధ్యాయీత,
స తేనైవ సంవేదిత స్తూర్ణమేవ
జగత్యా మభిసంపద్యతే. తం ఋచో
మనుష్యలోక 'ముపనయంతే
స తత్ర తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా
సంపన్నో మహిమాన మనుభవతి.

బ్రహ్మచర్యం, స్థిరసంకల్పం, శ్రద్ధ-యీ మూడూ ఆధారంగా బ్రహ్మోపాసన ఏక మాత్రముగా-అంటే అతి సామాన్య పద్ధతిగా చేసినా అతడికి ఆత్మజ్ఞానం కలుగుతుంది. ఋక్కులు ఆ వ్యక్తిని మనుష్యలోకములో సమృద్ధిగా సంపద కలవానినిగా, సజ్జను రిలో మాననీయునిగాను చేస్తాయి.

('ఏకమాత్ర - ఉపాసన' అంటే:

ప్రణవములో ఉన్న మూడక్షరాలలో వరుసగా ఋక్, యజుర్, సామవేదాలున్నా యని గ్రహించాలి. వాటిలో ప్రార్థన రూప ములైన జ్ఞానం కలిగించేవి ఋగ్వేదసూక్తులు. వాటిని అధ్యయనం చేసినా జ్ఞానం, సంపద, లోకమాన్యత, ఐహికసుఖజీవనం కలుగు తాయి.)

4

అథ యది ద్విమాత్రేణ మనసి సంపద్యతే
సోఽంతరిక్షం యజుర్భి రున్నీయతే
సోమలోకం, స సోమలోకే విభూతి
మనుభూయ పునరావర్తతే.

ద్విమాత్రలచే ధ్యానించేవాడు సుస్థిర మైన మనస్సు కలవాడౌతాడు. వానిని యజుర్వేద సంబంధములైన పుణ్యకర్మలు చంద్రలోకానికి చేర్చుతాయి. అతడు అక్కడ సర్వసంపదలను (సుఖాలను) అనుభవించి తిరిగి యిక్కడకు వస్తాడు.

(ద్విమాత్రలంటే ఋగ్వేదం, యజుర్వేదం. ఋగ్వేదమువల్ల జ్ఞానం, యజుర్వేదంవల్ల వైదిక కర్మాచరణం కలుగు తాయి. వాటిని తెలిసి సక్రమంగా చేసిన వాడు చంద్రలోకములో సుఖిస్తాడు.)

5

యః పున రేతత్త్రిమాత్రేణో మిత్యనేనైవాక్షరేణ
పరం పురుష మభిధ్యాయీత, స తేజసి సూర్యే
సంపన్నః. యథా పాదోదర స్త్వచా వినిర్ముచ్యతే
ఏవం హ వై స పాప్మనా వినిర్ముక్తః స సామభిరున్నీ
యతే బ్రహ్మలోకం. స ఏతస్మా జ్జీవఘనా త్ప
రాత్పరం పురిశయం పురుష మీక్షతే తదేతౌ
శ్లోకౌ భవతః.

ఓం అనే అక్షరముతో త్రిమాత్రమైన సామముతోసహా పరమపురుషుణ్ణి సర్వదా ధ్యానించినవాడు సూర్యతేజస్కుడై పొర విడిచిన పాములాగా పాపవిముక్తి పొందు తాడు. సజీవశక్తితో బ్రహ్మపదం చేరుతాడు. ఈ శరీరములో ఆత్మగా ఉన్న బ్రహ్మను చూడగలుగుతాడు. దీనికి ఈ క్రింది శ్లోకాలు ప్రమాణం.

6

తిస్రో మాత్రా మృత్యుమత్యః ప్రయుక్తా
అన్యోన్యసక్తా అనవిప్రయుక్తాః.
క్రియాసు బాహ్యాభ్యంతర మధ్యమాసు
సమ్యక్ప్రయుక్తాసు న కంపతే జ్ఞః.

ఒకదానితో ఒకటి సంబంధముకలవై, ఒకదానినొకటి విడిచి ఉండనివి, వశించే స్వభావముగలవిన్నీ, ధ్యానమునందు ఉపకరించేవిన్నీ అయిన మూడు మాత్ర లున్నూ బాహ్యములు (వెలుపలివి) అభ్యంతరములు (లోపలివి) మధ్యమములు అయిన క్రియలయందు లెస్సగా ప్రయో గింప బడినపుడు ఆత్మతత్వం, అక్షరతత్వం తెలిసిన బుద్ధిమంతుడు కదలడు. (ఏలాటి చలనమును పొందడు.)

(అ, ఉ, మ్-అనే మూడున్ను పరబ్రహ్మో పాసనకు ఆధారమైన అక్షరాలు. వాటి సమ్మేళనమే ఓంకారం. ప్రళయ సమ యంలో అదికూడా పరబ్రహ్మమందు కలిసి పోతుంది. అంటే అదే పరమపదసోపానం అని భావం. దానిని గురించి శారీరకమైన మానసికమైన క్రియాకలాపములో ప్రవ ర్తించే జ్ఞాని ప్రళయ సమయములో (చివరి గడియలో) దానిద్వారా పరమపదాన్ని చేరుతాడుగాని ఏలాటి సంకల్ప వికల్పాల కున్ను లోబడడని భావం.)

7

ఋగ్భిరేతం, యజుర్భిరంతరిక్షం, స సామభి
ర్యత్తత్కవయో వేదయంతే, తమోంకారేణై
వాయతనే నాన్వేతి, విద్వాన్యత్తచ్ఛాంత
మజర మమృత మభయం పరంచేతి.

ఆత్మయోగంకల పురుషుడు ఋక్కులచే ఈ మానవలోకమున పదార్థవిజ్ఞానముకల వాడై సుఖంగా జీవిస్తాడు. యజుస్సులచే ఐహితకర్మలు చేసి వానిఫలితముగా చంద్ర లోకాన్ని చేరి అక్కడ పుణ్యఫలం అనుభ విస్తాడు. ఇక్కడ ఉన్నంతవరకూ సౌజన్య మూర్తిగా అందరికీ ఆదరణీయుడౌతాడు. సామోపాసనతో ఓంకారం ఊతగా విద్వాం సులు గ్రహించే పరమపదాన్ని పొందు తాడు.

పరమపదం శాంతమైనది, శిథిలంకానిది, నాశంలేనిది, ఆశ్రయించినవారికి అభయ ప్రదం, సర్వోత్తమం - అని గ్రహించేది.

## షష్ఠప్రశ్న

అథ హైనం సుకేశా భారద్వాజః పప్రచ్ఛ.
భగవన్! హిరణ్యనాభః కౌసల్యో రాజపుత్రః
మాముపేత్యైతం ప్రశ్నమపృచ్ఛత. షోడశకలం
భారద్వాజ! పురుషం వేత్థ? తమహం కుమారము
బ్రువం నాహం ఇమం వేద. యద్యహమిమ మవే
దిషంకథం తే నావక్ష్యమితి సమూలో వా ఏష పరిశు
ష్యతియోఽ నృత మభివదతి, తస్మాన్నార్హా
మ్యనృతం వక్తుం. స తూష్ణీం రథమారుహ్య
ప్రవవ్రాజ తం త్వాం పృచ్ఛామి క్వాసౌ పురుష ఇతి.

తదుపరి భరద్వాజుని వంశంలో పుట్టిన వాడు సుకేశుడు అనే ముని పిప్పలాదమహామునిని ఇలా ప్రశ్నించాడు.

భగవన్! కోసలదేశ రాజనందనుడు హిరణ్యనాభుడనే యువకుడు ఒకనాడు నా వద్దకు వచ్చి భరద్వాజా! పదారు కళలుగల పురుషుణ్ణి నువ్వు ఎరుగుదువా? అని ప్రశ్నించాడు.

నే నెరగనని-నేను సమాధానంచెప్పాను.

నాకు తెలిసేవుంటే నీకు చెప్పనా? తెలియని దానిని తెలుసుననిగాని, తెలిసిన దానిని తెలియదనిగాని అబద్ధమాడితే సమూలంగా చెడిపోతాడు. కనుక నేను అసత్యమాడడానికి అంగీకరించను'- ఆ మాటకు ఆ రాకుమారుడు కిమ్మనకుండా రథమెక్కి వెళ్లిపోయాడు. ఆ ప్రశ్నే నేను వేస్తున్నాను, ఆ షోడశ కళాపురుషుడు ఎక్కడ ఉంటాడు?

2

తస్మై స హోవాచ. ఇహైవాంతశ్శరీరే
సోమ్య! స పురుషో యస్మిన్నేతాః
షోడశకలాః ప్రభవంతీతి.

సుకేశుని ప్రశ్నకి పిప్పలాదు డిలాగు బదులుపలికాడు. సౌమ్యుడా! నీ వడిగిన ఆ పురుషుడు ఈ శరీరంలోపలనే ఉన్నాడు. పదారు కళలున్నూ అతనినుంచే పుట్టుతూన్నవి.

(అన్ని జీవుల హృదయమందు ఈశ్వరుడున్నాడు. ఆ హృదయానికే దహరాకాశం అని పేరు. దానియందు జ్యోతీరూపాన వెలుగుతూన్న ఈశ్వరుడే 'ఆత్మ'-)

(ఈ మాటనే గీతాచార్యుడు అర్జుననకు చెప్పాడు.)

3

స ఈక్షాం చక్రే. కస్మిన్నహముత్క్రాంత ఉ
త్క్రాంతో భవిష్యామి? కస్మిన్ వా ప్రతిష్ఠితే
ప్రతిష్ఠాస్యామీతి-

ఈ శరీరం నుంచి నేను వెళ్లిపోవడం, తిరిగి ఈ శరీరంలోకి వచ్చి ఉండడం అనేవి జరగడానికి ఎవరు మూలం? - అని లోపల ఉన్న జీవుడికి ఒక శంక కలిగింది-

4

స ప్రాణమసృజత, ప్రాణాత్ శ్రద్ధాం. ఖం, వా
యుర్జ్యోతిరాపః పృథివీంద్రియం మనోఽన్నమ్
అన్నాద్వీర్యం తపో మంత్రాః కర్మ లోకాః
లోకేషు చ నామ చ.

ఈశ్వరుడు ముందుగా ప్రాణం సృజించాడు. ఆ ప్రాణం నుంచి శ్రద్ధ, ఆకాశం, వాయువు, అగ్ని, జలం, భూమి, ఇంద్రియ సముదాయం, మనస్సు, అన్నము రూపొందాయి. ఆ అన్నము నుంచి వీర్యమూ, తపస్సు, మంత్రాలూ, కర్మలూ, లోకాలూ, పేర్లూ పుట్టాయి. ఇవే షోడశ (పదారు) కళలు.

(ఇంద్రియాలను అదుపులో ఉంచుకొనడం తపస్సు. తనకూ - ఎదుటివానికీ మంచిని కలిగించే ఆలోచన మంత్రం. ఈ లోకానికీ పై లోకానికీ సంబంధించి ఋషులు చెప్పిన చెయ్యవలసిన మంచిపనులు కర్మలు.)

5

స యథేమా నద్యః స్యందమానాః సముద్రాయణాః
సముద్రం ప్రాప్య అస్తం గచ్ఛంతి,
భిద్యేతే తాసాం నామరూపే సముద్ర ఇత్యేవం
ప్రోచ్యతే.
ఏవమేవాస్య పరిద్రష్టు రిమాః షోడశకలాః
పురుషాయణాః పురుషం ప్రాప్య అస్తం
గచ్ఛంతి, భిద్యేతే తాసాం నామరూపే పురుష
ఇత్యేవం ప్రోచ్యతే స ఏషోఽ
కలోఽమృతో భవతి తదేష శ్లోకః.

ఈ నదులు స్వేచ్ఛగా ప్రవహించేవే అయినా చివరకు సముద్రాన్ని చేరేవే. సముద్రమును చేరగానే నామరూపాలు లేకుండా అయిపోతున్నాయి. ఆ జలరాశి సముద్రము అనే పేరుతో ప్రసిద్ధమై ఉంటూంది. అలాగే యీ పదారుకళలూ పర్వేశ్వరుని వంకకే వెళ్లి అతనిని చేరగానే నామరూపాలు లేకుండా అతనిలో అణిగి ఉంటాయి. పదారుకళలూ తనలోవున్నా పేరు ఆ పురుషునిదే (ఈశ్వరునిదే). ఈ తత్త్వం తెలిసిన తరువాత జీవాత్మ కళామయమయిన యీ శరీరాన్ని విడిచి అమృతస్థితి పొందుతాడు. దీనికి క్రింది శ్లోకం ప్రమాణం.

6

అరా ఇవ రథనాభౌ కలా యస్మిన్ ప్రతిష్ఠితాః,
తం వేద్యం పురుషం వేద యథా మా
వో మృత్యుః పరివ్యథా ఇతి

బండికుంచమునందు రేకులు ఉన్నట్టు ఏ దేవునియందు ప్రాణము మొదలైన పదారు కళలున్ను ఉంటున్నాయో ఆ ఈశ్వరుడే తెలుసుకోదగినవాడు. ఆ ఈశ్వరుణ్ణి తెలుసుకున్న వారిని (మిమ్ము) మృత్యువు బాధించకుండుగాక! (బాధించదు.)

(విశ్వవిభుణ్ణి తెలుసుకున్న విజ్ఞానికి మృత్యుభయం ఉండదు.)

7

తాన్ హోవాచైతావదేవాహమేతత్
పరంబ్రహ్మ వేద నాతః పరమస్తీతి.

ఈ విధంగా మునుల ప్రశ్నలకు సమాధానాలు చెప్పి మునులారా! పరమాత్మను గురించి నాకింతే తెలుసును. ఇంతకంటే తెలియవలసేదిలేదు - అని పిప్పలాదుడు అన్నాడు.

8

తే తమర్చయంతస్త్వం నహి పితా
యోఽస్మాక మవిద్యాయాః పరం పారం.
తారయసీతి.
నమః పరమఋషిభ్యో
నమః పరమఋషిభ్యః.

ఆ సుకేశాదులు తమ ప్రశ్నలకు తగిన సమాధానాలిచ్చి ఆత్మజ్ఞానం కలిగించిన పిప్పలాదునకు సవినయంగా నమస్కరించి మహాత్మా! మా అజ్ఞానాన్ని పోగొట్టి అవలి గట్టుకి చేర్చిన ఉద్ధారకుడవు. నివు మా తండ్రివని భావించి పూజిస్తున్నాము.

పరమ ఋషులకు నమస్కారం....

అని సెలవుతీసుకుని వెళ్లిపోయారు.

ఇది ప్రశ్నోపనిషత్తు సమాప్తం)

# శ్రీనివాసకల్యాణము




(గతవంచిక తరువాయి)

కేశవ:

(సౌరాష్ట్రి—మిశ్రగతి)

జలజపత్ర విశాలలోచన
చాల బడలితి వేటకతమున
పలుకు తేనియ లొలికి
నా దగ గొలగ త్రోయగదే ॥ జలజ ॥

సూత్ర: ఆఁ ఆఁ! తల్లిదండ్రుల చాటు పిల్లను ఎంతమాట న్నాడూ!

కథక: అపుడు చెలికత్తెలన్నారు కదా—

చెలిక: ఎంతసాహస మెవ్వడవు
నీ వేది నీకుల మేది గోత్రము
ఇంతకును ఊరేది పేరే
దింత యాగడమా ॥ ఎంత ॥

కేశవ: కలువరాయుని కొలము, దేవకి
గన్నవాడ వసిష్ఠగోత్రుడ
తెలియవో వసుదేవ తనయుని
హలధరానుజుని ॥ జలజ ॥

చెలిక: ఎట్టెటూ! కలరొకో చుట్టపక్కాల్ నీకు?

కేశవ: బావ లౌదురు నాకు పాండుసుతులు

చెలిక: ఔనా! బలారె! నీ మేనెల్ల నలుపేమి?

కేశవ: జననమ్ము కృష్ణపక్షాన నాకు.

చెలిక: ఆయెబో, ఏటికీ బోయవేసము?

కేశవ: రాచకన్నెను వలవేసి పట్టనెంచి.

చెలి: ఎంతకులేవు! నీవేలు రాజ్యమదేడ?

కేశవ: చెల్లు నా యేల్బడి ఎల్లదెసల.

సూత్ర: భేషుభేషు–మాటకుమాట బాగానే అందించాడుగాని, పద్మావతీదేవి ఇంతకు ఏమన్నదో–

కథక: పద్మావతీదేవి చెలులతో ఏమనుచున్నది.

ఏలనే మీకు వీనితో మేలమాట?
కంచి వరదుండు లేడా రంగపతిలేడా,
వేంకటాద్రీశ్వరుడు లేడా, వెఱ్ఱిగాక
ఎరిగెరిగి తండ్రి నను బోయ కిచ్చునటవె?

సూత్ర: ఊఁహూ! అంతవరకు దిగిందికద?

కథక: పద్మావతి ఇట్లుపల్కి, పెడమొగ మ్మగుటయు చెలికత్తెలు ఏమని మేల మాడుచున్నారు....

చెలికత్తెలు:—

(ఆనందభైరవి—మిశ్రగతి)

ఇంతమేటియు నింతపోటరి
ఇంతవల్లని మేని సొబగుం

(37 వ పేజీలో)



# శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం, తిరుచానూరు

## నిత్యపూజా నివేదనలు

సుప్రభాతం — ఉ. 5-00 గం॥ నుండి 5-30 గం॥ వరకు

సహస్రనామార్చన — ఉ. 5-30 గం॥ నుండి 6-00 గం॥ వరకు

(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు.)

నిత్యఅర్చన — ఉ. 6-00 గంటలకు

(ఏడాదికి రు 150/- లు చెల్లించిన గృహస్థులకు మాత్రమే.)

శుద్ధి, మొదటి గంట — ఉ. 6-15 గం॥ నుండి 6-45 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 6-45 గం॥ నుండి మధ్యాహ్నం 1-00 గం॥ వరకు

శుద్ధి, రెండవగంట — మ. 1-00 గం॥ నుండి 1-30 గం॥ వరకు

సర్వదర్శనం — మ. 1-30 గం॥ నుండి రాత్రి 7-00 గం॥ వరకు

శుద్ధి, రాత్రికైంకర్యము — రా. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు

సర్వదర్శనం — రా. 7-30 గం॥ నుండి 8-30 గం॥ వరకు

ఏకాంతసేవ — రా. 8-30 గం॥ నుండి 9-00 గం॥ వరకు

## శుక్రవారాలలో....

సుప్రభాతం — ఉ. 4-00 గం॥ నుండి 4-30 గం॥ వరకు

సహస్రనామార్చన — ఉ. 4-30 గం॥ నుండి 5-00 గం॥ వరకు

(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు)

నిత్యఅర్చన — ఉ. 5-00 గం॥ నుండి 5-15 గం॥ వరకు

శుద్ధి, మొదటిగంట — ఉ. 5-15గం॥ నుండి 5-45 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 5-45 గం॥ నుండి 7-00 గం॥ వరకు

పళ్ళింపు — ఉ. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు

మూలవర్లుకు అభిషేకం — ఉ. 7-30 గం॥ నుండి 9-00 గం॥ వరకు

(100 రూ. టిక్కెట్‌తో ఇద్దరు వ్యక్తులకు మాత్రమే.)

అలంకారము, రెండవగంట — ఉ. 9-00 గం॥ నుండి 10-00 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 10-00గం॥ నుండి రాత్రి 8-00గం॥ వరకు

ఊంజల్ సేవ — రా. 7-00 గం॥ నుండి 8-00 గం॥ వరకు

(అద్దాలమండపంలో రు. 150 టిక్కెట్‌తో జరుపుకోవచ్చును. గృహస్థుకు 5 గ్రాముల వెండి డాలర్ బహూకరిస్తారు.)

రాత్రిగంట — రా. 8-00 గం॥ నుండి 8-30 గం॥ వరకు

ఏకాంతసేవ — రా. 8-30 గం॥ నుండి 9-00 గం॥ వరకు

## ఆర్జితం వివరాలు :

ప్రత్యేక దర్శనం: రూ. 2-00

సహస్రనామార్చన: రూ 6-50

నిత్యఅర్చన: రూ. 150-00 (ఏడాదికి)

అర్చన: రూ. 1-00

హారతి: రూ. 0-50

పూలాభిషేకం (శుక్రవారాలలో) రూ. 100-00

ఊంజల్ సేవ (శుక్రవారాలలో) రూ. 150-00

తిరుచ్చి ఉత్సవం: రూ. 63-00

గజవాహనం: రూ. 32-00

## కళావని

# కూచిపూడి - పరిసర కళాక్షేత్రాలు

— డా॥ చింతారామనాథం

ఎన్నో శతాబ్దముల నుండి నాట్యకళో పాసనకు; నాట్యకళాపోషణకు దాక్షిణాత్యులు పేరెన్నిక గనినారు. దాక్షిణాత్యుల నాట్య కళా ప్రియత్వ మీనాటిదికాదు. ఆంధ్రులు దాక్షిణాత్య ప్రవృత్తిగలవారనియు, బహు నృత్త, గీత వాద్య ప్రియులనియు భరతుని వక్కాణ. అంతేకాదు. తిక్కన-విరాటపర్వము; ఎఱ్ఱన - నృసింహపురాణము; నాచన సోముడు - ఉత్తరహరివంశము; శ్రీనాథ మహాకవి కృతులు, అష్టదిగ్గజముల ప్రబంధ ములు పరికించిన ఆయా మహాకవుల నాట్య వర్ణనలందు ఆనాటి యాంధ్రుల నాట్యకళా వైభవము నాట్యకళా ప్రభావము ప్రస్ఫుట మగును. అంతేకాదు దక్షిణదేశమున బౌద్ధ శిల్పములను; రామప్ప దేవాలయములోని నాట్య భంగిమలను హంపీలోని అపురూప శిల్పములను, చిదంబరమునందలి నటరాజ స్వామి ఆలయగోపురముల గోడలలో నిబిడీ కృతమైన శిల్పములను పరిశీలించిన దక్షిణ దేశమున నాట్యశైలూషి వేసిన వాలకములు అలవోకలని విదితమగును. అసలు దాక్షి ణాత్యుల నాట్యములో శిల్పకళ అంతర్వా హినియై సంగీత సాహిత్యములతో కలిసి త్రివేణీ సంగమమై రస సముద్రమున తరం గిణియై సమీహితమగును. శిల్పములేని నాట్యము శిల్పానికి నోచుకొనని శిలవంటిది. జీవితములేని జీవివంటిది. నాట్యానికి శిల్పము జీవమైన రసము. ఆత్మయగును. అందువలననే దాక్షిణాత్యుల నాట్యశైలి అపూర్వమైనదని; నిత్యనూతనత్వముతో నిసర్గ రసస్యందినియైనదని హృదయానంద దాయినియని ప్రశస్తి నొందుచున్నది.

### కూచిపూడి నాట్యకళ – శ్రీ సిద్ధేంద్రయోగి

దాక్షిణాత్యుల నాట్యశైలులలో ఆంధ్రు లకు గర్వకారణముగ నిలిచినది కూచిపూడి నాట్యకళ. ఇది ఆంధ్రుల జాతీయ నృత్య కళ. దక్షిణదేశమున నున్న ప్రాచీన శాస్త్రీయ నాట్య శైలులన్నింటియందు ప్రాచీనమై శాస్త్రీయమై విరాజిల్లుచున్న



క్షేత్రయ్య ఇష్టదైవం - మొవ్వ వేణుగోపాలస్వామి ఆలయం.

నాట్యకళ కూచిపూడి నాట్యకళ. సుమారు ఏడెనిమిది దశాబ్దముల ప్రాచీనతను, చారిత్రక ప్రాధాన్యతను; సశాస్త్రీయతను; సంప్రదాయ చోదితమును కలిగినది కూచి పూడి నాట్యకళ. నేడు కూచిపూడి నాట్యకళ ఖండాంతరఖ్యాతితో ప్రపంచమునందంత టను నీరాజనముల నొందుచున్నది. కూచి పూడి నాట్యకళాక్షేత్రమున జన్మించిన నాట్యా చార్యులెందరో తమ జీవితములను ఆ నాట్య కళాధిదేవతకు నైవేద్య మొనర్చినారు. అందరికి నా వందనములు. అందరిలో అందమైన మలుపు త్రిప్పి అటు ఆంధ్ర వాఙ్మయమునకు ఇటు కర్ణాటక సంగీత మునకే గాక నాట్యంలో నవరసము లొలి కించి, పలికించి పులకింపజేసిన కలాప ప్రక్రియాప్రబంధ సృష్టి ప్రతిష్ఠా మహిమా న్వితుడు, యోగిపుంగవుడు సిద్ధేంద్రయోగి. సిద్ధేంద్రుని మానసపుత్రిక - సిరిసిరిమువ్వ- సత్యభామ - భామాకలాపము. ఈ యోగి పుంగవునిచే ప్రభావితుడుగాని నాట్యవేత్త; రసజ్ఞుడు; సాహితీవేత్త దక్షిణ దేశమునవే లేదు. ఆంధ్రవాఙ్మయమున కలాప, యక్ష గాన వాఙ్మయమునకు శ్రీకారము చుట్టిన శ్రీ సిద్ధేంద్రుని మార్గమున పయనించని కవి ఆంధ్రకలాప యక్షగాన వాఙ్మయ చరి త్రమున కానరాడు. అంతేకాదు. 'హరికథా పితామహుడై'న ఆదిభట్ల నారాయణదాసు సహితము శ్రీ సిద్ధేంద్రుని సృష్టిపై చిత్రికి స్పందించెను. ప్రణతిల్లెను. అనుసరించెను అసలు సిద్ధేంద్రునిచే ప్రభావితముగాని ప్రతిభాసంపన్నులైన సంగీత సాహిత్య నాట్య స్రష్టలు లేరనవచ్చును. అందు లకు హేతువు శ్రీసిద్ధేంద్రుని భామాకలాప మొక అపూర్వ అలంకార భరతశాస్త్ర లక్ష్యము. కావుననే సిద్ధేంద్రుని భామా కలాపము వడగట్టిన అలంకార భరతశాస్త్ర ముగ భాసిల్లుచున్నదని శ్రీ విశ్వనాథవారి వక్కాణ. సిద్ధేంద్రుడు తన స్వగ్రామమైన కూచిపూడిలో తనకు పూర్వమే తిష్ఠవేసి యున్న నాట్యకళాజ్యోతిని ప్రజ్వరిల్ల జేసెను. తరువాతి తరమువారు వారసత్వ ముగ వచ్చుచున్న ఆజ్యోతిని యారనీయక



ఆంధ్రవిష్ణు ఆలయం – శ్రీకాకుళం

వెలుగులను తగ్గనీయక; నేటివరకు కాపాడు కొనుచు విస్తృతప్రచారము చేయుచుండిరి.

కూచిపూడికి దక్షిణముగ క్షేత్రయ్య మొవ్వ; బౌద్ధారామము వాణిజ్య కేంద్రము అయిన ఘంటసాల, దేవదాసీ నృత్య సంప్రదాయమున పీఠమైన శ్రీకాకుళము; పశ్చిమముగ బహురూపక కళకు సుప్రసిద్ధమైన గడ్డిపాడు (హనుమంతరాయపురము) లు సుమారొక పదిమైళ్ల పరిధిలో నేర్పడి కూచిపూడి పరిసరక కళాక్షేత్రములుగ చరిత్ర ప్రసిద్ధములైనవి. వీటి చారిత్రక ప్రాశస్త్యమును తెలుపుటే ఈ వ్యాసరచనోద్దేశము.

## మొవ్వ :

మొవ్వ గ్రామమున ఒక శివాలయము, ఒక విష్ణ్వాలయము రెండును కలవు. ఈ యూరుకీ నామమెట్లు వచ్చినదని విచారించగ శ్రీ మంత్రాల నారాయణమూర్తిగారిట్లు చెప్పిరి. "మౌద్గల్య మహర్షిచే శివలింగ ప్రతిష్ఠ చేయబడిన గ్రామమగుటచే మొవ్వ అను నామమేర్పడినది." ఇంతేకాదు వేరొక ఐతిహ్యముకలదు. నటరాజు ఆనందాతిరేకమున తాండవము చేయు సమయమున ఆస్వామి చరణ కింకిణులలో నొక మువ్వ ఇట నిపతితమగుటచే ఈ పవిత్రస్థలమునకు 'మువ్వ' అను నామమేర్పడినదందురు.

ఈ మొవ్వ గ్రామమున సుమారేడెనిమిది వందల సంవత్సరముల ప్రాచీనతగల ఆలయము శ్రీ వేణుగోపాలస్వామి ఆలయము. ఈ స్వామిని సేవించి, పదములు రచించి, అంకితము గావించి తరించిన వాగ్గేయకారుడు: పదకర్త క్షేత్రయ్య.

క్షేత్రయ్య ఆరాధ్య దైవమైన వేణుగోపాలస్వామి ఉత్సవ విగ్రహములందు 'మువ్వ' అని లిఖంపబడియున్నది. కనుక ఈ గ్రామము

మువ్వ→మువ్వ→మొవ్వ గ మార్పుచెంది యుండవచ్చును. ఏదిఏమైన నేడీగ్రామము 'మొవ్వ' గనే వ్యవహృత మగుచున్నది.

శ్రీ వేణుగోపాలస్వామి విరాట్ స్వరూపమును ఉత్సవ విగ్రహములను పరీక్షించిన పిమ్మట ఆస్వామిని వేణుగోపాలస్వామి యనుట కంటే మువ్వగోపాలస్వామి యనుటయే ఉచితముగ కన్పట్టును. క్షేత్రయ్యయు 'మువ్వగోపాల' 'మువ్వగోపాల' అనియే సంబోధించెను; ప్రయోగించెను. వ్యవహరించెను. ఉదాహరించెను. అనగా క్షేత్రయ్య మువ్వలు ధరించి నర్తించు బాలగోపాలుని-మువ్వగోపాలుని ఆరాధించి యుండును.

## క్షేత్రయ్య పదములు :

ప్రపంచమున సాహిత్య ప్రక్రియలన్నింటికి ప్రథమమైనది పదకవిత. చరిత్ర కందినంత వరకు తెలుగు సాహిత్యమున ఈ పదకవితకు పితామహుడు ప్రథమాంధ్ర సంకీర్తనాచార్యుడు అన్నమయ్య. అన్నమయ్య రచనలు సంకీర్తనలుగ ప్రసిద్ధి నొందగ క్షేత్రయ్య రచనలు పదములుగ ప్రఖ్యాతి నొందుచున్నవి. ఏది యేమైన అసలైన సిసలైన పదకర్త క్షేత్రయ్యఅనుట నిర్వివాదాంశము. ఇక క్షేత్రయ్య పూర్వాశ్రమజీవితమును గుఱించి క్లుప్తముగ తెలిపెదను.

వేంకట రమణమ్మ వేంకటాచలం అను పుణ్య దంపతుల గర్భశుక్తిముక్తాఫలం వరదయ్య. ఈతడు మొవ్వ వంశస్థుడు. ఇంత కాలం వరదయ్య 'వరద' గ వ్యవహృతుడయ్యెను. ఈతడు క్రీ. శ. 1600–1700 కాలమునందు మొవ్వ గ్రామమునందుద యించెను. ఈతని జీవిత చరిత్ర విద్యాభ్యాస విషయములందు చిత్ర విచిత్ర రీతుల భిన్న విభిన్న వాణులు విన్పించుచున్నవి. ఏది ఏమైన వరదయ్య పదకర్త అగుటకు పూర్వము సంగీత సాహిత్యములతో పాటు నాట్యమునుకూడ నభ్యసించి యుండవలయును. ఆ తరువాత అతనికి భగవదనుగ్రహముకూడ తోడైయుండును. ఈతనికి పూర్వమే కూచిపూడివారు నాట్యకళతోపాటు సంగీత, సాహిత్య, మంత్రశాస్త్రములందు లబ్ధప్రతిష్ఠులైనట్లు చారిత్రకాధారముల వలన తెలియుచున్నది. ఇట్టితరి వరదయ్యను కూచిపూడి భాగవతులు అయస్కాంతము వలె నాకర్షించి యుందురు. అదియును గాక కూచిపూడి, మొవ్వలు భౌగోళికముగ ప్రక్కప్రక్కలనే ఏర్పడియున్నవి. తన కాలమునకే భరత విద్యాధురంధరులుగ పరమ భాగవతోత్తములుగ ఖ్యాతి గాంచిన కూచిపూడి భాగవతుల శుశ్రూషించి క్షేత్రయ్య అభినయ విద్యనభ్యసించి యుండును.

వరదయ్య సంగీత నాట్యములభ్యసించి ప్రావీణ్యము సముపార్జించనిచో పదమును అభినయమున కంత అనువుగ రచించి యుండెడివాడు కాడు. అందువలననే

క్షేత్రయ్యను కేవలము పదకర్తగనే గాక ఉత్తమ అభినయాచార్యునిగ సంగీత కళానిధిగ శ్రీ ఆదుర్తిగారు 'మహాకవి క్షేత్రయ్య' చలన చిత్రమునందు చిత్రీకరించిరి. కాని క్షేత్రయ్యను సిద్ధేంద్రయోగి శిష్యునిగ చిత్రీకరించుట చరిత్రకు పొసగని విషయము.

వరదయ్య మువ్వగోపాలుని కరుణా కటాక్ష వీక్షణమునగాని మరే యితర ప్రేరణము వలనగాని పదములు వ్రాయ నారంభించెను. ఈతడు తేటతెలుగున తేనెలు జాలువారునట్లుగ మృదు మధురములుగ, మధురభక్తి ప్రతిపాదితములుగ శృంగార రస సుధా కలశములుగ: మువ్వ గోపాలునికి అంకితముగ పదసహస్రము లను వెలయించెను. వరదయ్య అంతటితో తృప్తి చెందలేదు. నానావిధ దేశాటనము: బుధవర్గముతో సంభాషణము పుణ్యక్షేత్రముల సందర్శనము చేయదలచెను. తొలుత నానా రాజ సందర్శనము గావింప దలంచి మధుర కేతెంచెను. కాని రాజాస్థానముల ప్రవేశమంత సులభముకాదని గ్రహించెను. అంతటితో నిరాశ నిస్పృహలను జెందక దక్షిణాపథమునగల పుణ్యక్షేత్రములను తీర్థములను సేవింప దలంచెను. నానా క్షేత్రములను సందర్శించి వరదయ్య క్షేత్రజ్ఞుడుగ క్షేత్రయ్యగ అన్వర్థ నామధేయుడయ్యెను. తాను దర్శించిన సేవించిన ప్రతి స్వామిమీద పదములు చెప్పెను. ఎట్టకేలకు రాజాస్థానములో స్థానము సంపాదించెను. ఈ సందర్భమున క్షేత్రయ్య చెప్పిన ఈ చాటువు చూడుడు.

"తముదా మెవత్తు రర్థుల
క్రమ మెరిగిన దాత కడకు రమ్మన్నారా
కమలంబులున్న చోటికి
భ్రమరంబుల నచ్యుతేంద్ర రఘునాథనృపా:

ఈ విధముగ క్షేత్రయ్య తిరుమల నాయకుని రఘునాథ నాయకుని విజయరాఘవ నాయకుని గొల్కొండనవాబు అబ్దుల్లా కుతుబ్‌షాలను దర్శించి వారి యాస్థానము సంపాదించి దివినుండి భువికి దిగివచ్చిన గాంధర్వ సార్వభౌముడా! అభినవ అభినయ భరతాచార్యుడా! అనునట్లు తన పదరచనతో గాననృత్యాభినయములతో దక్షిణా పథమునుయ్యాల జంపాల లూగించి అసంఖ్యాక పురస్కారములంది పదకర్తృత్వ, పదాలాప, పదాభినయ విషయమున తదనంతర తరమువారికి మార్గదర్శియయ్యెను.

క్షేత్రయ్య తన పదరచనతో ఇటు ఆంధ్ర వాఙ్మయమునకు, అటు కర్ణాట సంగీతమునకు ఇటు కూచిపూడి నాట్యమునకు పుష్టిని తుష్టిని చేకూర్చెను. ఇటువంటి పరమ భాగవతోత్తముని; మహాకవిని అభినయాచార్యుని, మహాప్రవక్తను ఆంధ్రుల కొసంగిన మొవ్వగ్రామము సదా శ్లాఘనీయమై నదిగదా!

## ఘంటసాల

అపురూపములైన బౌద్ధశిల్పములకు కాణాచి ఘంటసాల. ఆంధ్ర దేశమునందు ఒకనాడు ఓడరేవు ప్రాంతమై ప్రముఖ వాణిజ్య కేంద్రముగ ప్రసిద్ధి పొందినది ఘంటసాల. అంతేకాదు. ఆంధ్రదేశ చరిత్ర కాధారముల నొసంగుచున్నది ఘంటసాల. ఘంటసాలలో లభించు బౌద్ధమతావశేషములకు ఓడరేవునకు అవినాభావ సంబంధము కలదు. నాడు ఘంటసాల ప్రముఖ విదేశ వాణిజ్య కేంద్రమగుటచేతను, బౌద్ధ మతమును విదేశములలో ప్రచారము చేయుటకు రాకపోకలకు అనువగు స్థానమగుటచేతను, బౌద్ధులు ఘంటసాలను తమ ప్రధాన ప్రచార కేంద్రముగ నెన్నుకొని యుందురు. ఆనాటికే విదేశీయులను బౌద్ధమత మధికముగ నాకర్షించుచు పునాదులు వేసికొనుచున్నది.

ఇక ఘంటసాల బౌద్ధుల కాశ్రయమిచ్చుటను గూర్చి ఆలోచించిన బౌద్ధమతమునకు జన్మనిచ్చినది ఉత్తర హిందూస్థానమైనను పెంచి పెద్దజేసినది దక్షిణ దేశమే. అందువలననే ఘంటసాల, గుడివాడ, జగ్గయ్యపేట, అమరావతి, భట్టిప్రోలు యిత్యాది ప్రాంతములు బౌద్ధకాలమునాటి శిల్పముల అవశేషముల కాకరములై నాటి చరిత్రకు నేడు ఆధారముల నొసంగుచున్నవి. సాక్షాత్తు బుద్ధ భగవానుని పాదస్పర్శచే పావిత్ర్యమును పొందినదో లేదో కాని బౌద్ధ స్వీకారమున అందరికంటే ముందడుగువేసి 'బుద్ధం శరణం గచ్ఛామి' అన్నది ఆంధ్రులు అందులో ఘంటసాల. ఇందులకు కారణ మూహింపవచ్చును. ఆంధ్రులు ఎల్లపుడు వైవిధ్యమును నిత్యనూతనత్వమును కోరువారగుటచేతను, జీవకారుణ్యము, విశ్వ

( 35 వ పేజీలో )



ఘంటసాలలోని బుద్ధుని శిధిల విగ్రహం.

# తిరుమల యాత్రికులకు సదుపాయములు

* * *

- అన్ని వర్గాలవారికి అందుబాటులో ఉండేటట్లు ఉచిత, పరిశుభ్రమైన సత్రాలు, లేదా సరసమైన రేట్లకు కాటేజీలలో ఆవాస సౌకర్యం.
- శ్రీవారిని దర్శించు యాత్రికుల క్యూషెడ్లలో గాలి, వెలుతురుగల విశాలమైన ఏర్పాటులు.
- క్యూ షెడ్లలోనే కాఫీబోర్డువారి అల్పాహార సదుపాయం.
- సరసమైన ధరలకు అన్నపుపొట్లాల అమ్మకం.
- యాత్రికులు వెలుపలకు రానక్కరలేకుండా క్యూలదగ్గరే మరుగుదొడ్డి సౌకర్యం.
- ఆంధ్రప్రదేశ్ పాలసరఫరా సంస్థచే స్వచ్ఛమైన పాలవిక్రయం.
- యాత్రికులు చదువుకునేందుకు దేవస్థాన ముద్రిత గ్రంథాలు. స్వామివారి, అమ్మవారి చిత్రపటాల అమ్మకం.
- క్యూలోని యాత్రికులకు విసుగులేకుండా ఉండేందుకు టెలివిజన్ ప్రదర్శనం, భక్తిసంగీత ప్రసారం.
- క్యూషెడ్లలోను, తిరుమలకుపోవు కాలిబాట 7 వ మైలువద్ద వైద్యసదుపాయం.
- సామానులు, పాదరక్షలు భద్రపరచుకొనేందుకు ప్రత్యేక సౌకర్యం.
- తిరుమలలో సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసునుండి వివిధప్రాంతాలకు ఆటో సౌకర్యం.

## ఉచిత బస్సుసదుపాయం

- దళారీలనుండి వంచకులనుండి తప్పించేందుకు ముఖద్వారంలో పేష్కారుస్థాయి అధికారి సిబ్బంది.
- క్యూషెడ్లలోని యాత్రికుల ఫిర్యాదులు విచారించేందుకు కావలసిన సౌకర్యములకుగాను పేష్కారు స్థాయిలో మరొక అధికారి, సిబ్బంది.
- యాత్రికుల సామానులను భద్రంగా తిరుమలకుచేర్చే సౌకర్యం ఏర్పాటైంది. తిరుపతిలో ఏ సత్రములో నైనాగాని, టోల్ గేట్ వద్దగాని తమసామాగ్రి అప్పగించి రసీదుపొంది ఆ రసీదు తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీస్ దగ్గర కౌంటర్ లో ఇచ్చి సామాగ్రి పొందవచ్చును.
- దుండగులనుండి యాత్రికులను కాపాడేందుకు, తిరుమలకు వెళ్ళే దోవపొడుగునా రాత్రింబవళ్ళూ పోలీసు గస్తీ ఏర్పాటుచేయబడింది.
- దారిపొడుగునా మంచినీటి సదుపాయం ఉన్నది.
- రాత్రిపూటగాని, తెల్లవారుఝామునగాని కొండకు వెళ్ళదల్చుకొన్న వారికి వీలుగా మంచికాంతి శక్తిగల దీపాలు ఏర్పాటైనవి.
- వివిధప్రాంతాలనుండి వచ్చేయాత్రికులకు బోధపడేందుకుగాను తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసులో, దేశంలోని ముఖ్యభాషలలో విచారణ కార్యాలయాలు.
- **ప్రత్యేక కాటేజీలలోని అదనపు సౌకర్యాలు అంజనాద్రినగర్. శేషాద్రి, గరుడాద్రి, శంకుమిట్ట కాటేజీలలో కూడ ఏర్పాటైనవి.**



## రెండవ అధ్యాయం — సాంఖ్యయోగం

[గతసంచిక తరువాయి]

సంజయ ఉవాచ:

తం తథా కృపయాఽఽవిష్టం అశ్రుపూర్ణాకులేక్షణమ్।
విషీదంత మిదం వాక్యం ఉవాచ మధుసూదనః॥

శ్రీ భగవానువాచ:

కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్।
అనార్యజుష్ట మస్వర్గ్యం అకీర్తికర మర్జున॥

క్లైబ్యం మా స్మ గమః పార్థ! నైతత్త్వ య్యుపపద్యతే।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప॥

సంజయుడు: దయామయుడైన అర్జునుడు కన్నీరు కారుస్తుండగా శ్రీ కృష్ణపరమాత్మ ఇలా అన్నాడు.

అర్జునా! ఈ సంక్లిష్ట సమయంలో ఆర్యధర్మ విరుద్ధమూ అపకీర్తిదాయకమూ, నరకప్రాప్తి హేతువూ అయిన ఈ పాడుబుద్ధి నీ కెందుకు పుట్టింది? నపుంసకుడిలాగ అధైర్యం పొందకు. ఇది నీకు పనికిరాదు, మనోదౌర్బల్యము నీచం. దాన్ని విడిచిపెట్టు. నీవు శత్రుమర్దనుడవు కదా! యుద్ధం ప్రారంభించు.

అర్జున ఉవాచ:

కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన॥

అర్జునుడు: మధుసూదనా! పూజార్హులైన భీష్మ ద్రోణాదులను బాణాలతో నేనెలా కొట్టగలను?

గురూనహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్య మపీహ లోకే।
హత్వార్థకామాంస్తు గురూ నిహైవ
భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్॥

మహానుభావులైన గురువులను చంపడం శ్రేయస్కరం కాదు. వారిని సంహరించి రక్తసిక్తాలైన రాజ్యభోగాలు అనుభవించడం కంటే బిచ్చమెత్తుకోవడం మేలు.

న చైత ద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యది వా నో జయేయుః।

యానేవ హత్వా న జిజీవిషామః
తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః॥

యుద్ధం చేయడం మంచిదో కాదో తెలియడంలేదు. మనం జయిస్తామో వారు జయిస్తారో చెప్పలేము. ఎవరిని చంపితే మనకు జీవితం మీద విరక్తి కలుగుతుందో ఆ ధార్త రాష్ట్రాదులే ఎదురుగా వున్నారు.

కార్పణ్య దోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మ సమ్మూఢచేతాః।
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్॥

గురువులూ బంధువులూ అనే మమకార దోషంవల్ల నా బుద్ధి నశించింది. మంచి ఏదో చెడు ఏదో తెలియడం లేదు. శిష్యుడిగా నిన్ను ఆశ్రయించిన నాకు ఏది శ్రేయోమార్గమో దాన్ని ఆదేశించు.

న హి ప్రపశ్యామి మమాపనుద్యాత్
య చ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణామ్।
అవాప్య భూమా వసపత్న మృద్ధం
రాజ్యం సురాణా మపి చాధిపత్యమ్॥

భూలోకాధిపత్యం లభించినా, స్వర్గాధిపత్యం సిద్ధించినా నా శోకం తగ్గుతుందనుకోను.

సంజయ ఉవాచ:

ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః।
న యోత్స్య ఇతి గోవిందం ఉక్త్వా తూష్ణీం బభూవ హ॥

సంజయుడు: అర్జునుడు శ్రీకృష్ణుడితో అలాచెప్పి యుద్ధం చేయనని ఊరకున్నాడు.

త మువాచ హృషీకేశః ప్రహస న్నివ భారత।
సేనయో రుభయో ర్మధ్యే విషీద న్తమిదం వచః॥

రెండు సేనల మధ్య విషాదవశుడైవున్న అర్జునుణ్ని చూసి శ్రీకృష్ణపరమాత్ముడు పరిహాసంగా ఇలా అన్నాడు.

శ్రీ భగవానువాచ:

అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।
గతాసూ నగతాసూంశ్చ నానుశోచ న్తి పండితాః॥

అర్జునా! దుఃఖించనవసరంలేనివాళ్లకోసం దుఃఖిస్తున్నావు. పైగా మహాపండితులాగ మాట్లాడుతున్నావు. చనిపోయినవాళ్ల గురించికాని, బ్రతికున్నవాళ్ల గురించికాని వివేకులు శోకించరు.

న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః।
న చైవ న భవిష్యామః సర్వే వయ మతః పరమ్॥

నీవూ నేనూ వీళ్లంతా గతంలోనూ వున్నాము. భవిష్యత్తులో కూడ వుంటాము.

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా।
తథా దేహాన్తర ప్రాప్తిః ధీర స్తత్ర న ముహ్యతి॥

జీవుడికి ఈ శరీరంలో కౌమారం, యౌవనం, వార్ధక్యం వచ్చినట్లే మరణానంతరం మరో శరీరం వస్తుంది. ఇందుకు ధీరుడు దుఃఖించడు.

మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ! శీతోష్ణ సుఖదుఃఖదాః।
ఆగమాపాయినోఽనిత్యాః తాం స్తితీక్షస్వ భారత॥

కుంతీ పుత్రా! విషయాలకు వశమైన ఇంద్రియాలవల్ల శీతోష్ణాది గుణాలు, సుఖదుఃఖాలూ కలుగుతుంటాయి. కోరికలకూ ఇంద్రియాలకూ కలయిక అశాశ్వతం. కనుక ఓ భరత వీరా! ఆ బాధలను సహించు.

యం హి నవ్యథయ న్త్యేతే పురుషం పురుషర్షభ।
సమదుఃఖ సుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే॥

పురుషవర్యా! శీతోష్ణసుఖదుఃఖాదులు ఎవరిని బాధించవో అలాంటి ధీరుడే ముక్తికి అర్హుడు.

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః
ఉభయోరపి దృష్టోఽన్తః త్వనయో స్తత్త్వదర్శిభిః॥

లేనిది ఎప్పటికీ వుండదు. ఉన్నది ఎప్పటికి లేకపోదు ఈ రెండింటి నిర్ణయం తత్వజ్ఞులకే తెలుస్తుంది.

అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్।
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చిత్కర్తుమర్హతి॥

ఈ విశ్వమంతటా వ్యాపించివున్న ఆత్మవస్తువు నాశనం లేనిది. దాని నెవరూ అంతం చేయలేరు.

అన్తవన్త ఇమే దేహా నిత్య స్యోక్తా శ్శరీరిణః।
అనాశినోఽప్రమేయస్య తస్మా ద్యుద్ధ్యస్వ భారత॥

నాశనం లేని ఆత్మకు ఈ శరీరాలు శాశ్వతాలు కావు. ఒక్కటే నిత్యం. కనుక ఓ భారతవీరా! యుద్ధం వదలుపెట్టు.

య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే॥

ఈ ఆత్మ చంపుతుందని కాని, చంపబడుతుందని కాని వాళ్లిద్దరూ అజ్ఞానులే. ఆత్మ చంపేది కాని, చచ్చేది కాదు.

న జాయతే మ్రియతే వా కదాచిత్
నాయం భూత్వా భవితా వా న భూయః।
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే॥

ఆత్మకు పుట్టడం చావడం అనేవి లేవు. అది ఒకప్పుడు , మరొకప్పుడు లేకపోవడం జరుగదు. జన్మరహితమూ, శ్వతమూ, అనాది సిద్ధమూ అయిన ఆత్మ నిత్యం. అందుల్ల శరీరాన్ని నాశనం చేసినా అందులోని ఆత్మమాత్రం వదు.

వేదవినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్।
కథం న పురుషః పార్థ! కం ఘాతయతి హన్తికమ్॥

పార్థా! ఆత్మ నాశనరహితమనీ, చావు పుట్టుకలు లేనిదనీ శ్వత మైనదనీ తెలుసుకున్న వాడు ఎవరినైనా ఎలా చంపుడు? ఎలా చంపిస్తాడు?

వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి।
తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ॥

మానవుడు చిరిగిపోయిన పాతబట్టలను విడిచిపెట్టేసి బట్టలు వేసుకున్నట్లే ఆత్మ కృశించిన శరీరాలను వదలి త్త దేహాలు పొందుతుంది.

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః।
న చైనం క్లేదయ న్త్యాపో న శోషయతి మారుతః॥

ఈ ఆత్మను ఆయుధాలు నరకలేవు; అగ్ని కాల్చలేదు; తడుపలేదు; గాలి ఎండబెట్టలేదు.

అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ
నిత్య స్సర్వగతః స్థాణుః అచలోఽయం సనాతనః॥

ఆత్మ ఖండించరానిది, కాలనిది, తడవనిది, ఎండనిది; అదినిత్యం. సర్వవ్యాప్తం, శాశ్వతం, చలనరహితం, సనాతనం.

అవ్యక్తోఽయ మచింత్యోఽయం అవికార్యోఽయ ముచ్యతే।
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి॥

ఆత్మ జ్ఞానేంద్రియాలకు గోచరించదు. మనస్సుకు అందదు. వికారాలకు గురికాదు. ఈ ఆత్మతత్త్వం తెలుసుకొని నీవు విచారించడం మాను.

అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్।
తథాపి త్వం మహాబాహో! నైనం శోచితు మర్హసి॥

అర్జునా! శరీరంతోపాటు ఆత్మకు కూడా సదా చావు పుట్టుకలుంటాయని భావిస్తున్నప్పటికీ నీవిలా శోకించవలసిన పనిలేదు.

జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ।
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి॥

పుట్టినవాడికి చావు తప్పదు. చచ్చినవాడికి పుట్టుక తప్పదు. తప్పించరాని ఈ విషయంలో తపించ నవసరంలేదు.

అవ్యక్తా దీని భూతాని వ్యక్తమధ్యాని భారత!।
అవ్యక్త నిధనా న్యేవ తత్ర కా పరిదేవనా?

జీవులు పుట్టుటకు పూర్వం కాని, మరణానంతరం కాని ఏ రూపంలో వుంటాయో తెలియదు. మధ్యకాలంలో మాత్రమే కనబడుతాయి. అర్జునా! అలాంటప్పుడు విచారమెందుకు?

ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చిదేనం ఆశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః।
ఆశ్చర్యవచ్చైన మన్యః శృణోతి శ్రుత్వా ప్యేనం వేద న చైవ కశ్చిత్॥

ఒకడు ఈ ఆత్మను ఆశ్చర్యంగా చూస్తున్నాడు. ఇంకొకడు దీన్ని గురించి విచిత్రంగా మాట్లాడుతున్నాడు. మరొకడు వింతగా వింటున్నాడు. అయితే ఈ ఆత్మ స్వరూప స్వభావాలు తెలుసుకున్న వాడు ఒక్కడూలేడు.

(20 వ పేజీలో)



# జనార్ధనాష్టకమ్

— శ్రీ పచ్చిపులుసు వేంకటేశ్వర్లు

'మధుర కవితలు' అనడంతోటే మధురాష్టకమ్ జ్ఞప్తికి వస్తుంది.

"అధరం మధురం, వదనం మధురం,
నయనం మధురం, హసితం మధురమ్,
హృదయం మధురం, గమనం మధురం,
మధురాధిపతే రఖిలం మధురమ్"

'మధురావతి'ని గూర్చిన
పలుకులెల్ల మధురమే కదా!

భక్తి మార్గంలో సర్వశ్రేష్ఠమైనది మధుర భక్తి.

మధురభక్తి అనేసరికి మధుర మధుర మూర్తి గోకులమాధవుడే కనుల ఎదుట నిలుస్తాడు.

ఆ మువ్వ గోపాలుడు మురళిని చేబూని మందహాస రోచిస్సుల వెలార్చుతూ, కస్తూరి తిలకంతో, వక్షాన కౌస్తుభంతో, నాసాగ్రాన నవమౌక్తికంతో, స్వర్ణకంకణ కరాలతో ముగ్ధమోహనంగా సాక్షాత్కరించి, మనల్ని ఆనందలోకాలకు తీసుకవెళ్లుతాడు.

'కృష్ణ' అన్న పేరులో ఎంత మధువుందో! ఎంత వలపుందో! ఎంత మత్తుందో! ఎంత మైమరపు వుందో!

ఆ జనార్దనుణ్ణి తలచుకుంటేనే మధురకవిత జాలువారుతుంది.

ఆ సుందర కవితాజలధిలో మునకలిడిన కవులెందరో!

హృదయాన్ని ఆనందార్ణవం చేసుకొన్న పుణ్యపురుషులెందరో!

అందులో రెండవ కందుకూరి రుద్రకవి ఒకడు. అతడు నిరంకుశో పాఖ్యానం, సుగ్రీవ విజయం, జనార్ధనాష్టకమ్ వ్రాశాడు.

తన నిరంకుశోపాఖ్యానంలో కందుకూరి లోని జనార్దనుణ్ణి ఇలా ప్రార్థిస్తాడు.

పక్కిరా తేజిపై నెక్కి యభ్యాసి
చాబూరు ద్రుంచిన సత్యరాశి
సిరి మనోధనము ముచ్చిలిన కన్నపుదొంగ
గొల్ల చేడెలతోడు కోడెకాడు
భువన మంతయు గన్న పుత్రుగాంచిన తండ్రి
స్వర్ణాంబరము గట్టు వన్నెబెట్టు
పౌరస్త్య భోగిపై బవళించు సుఖవాహ
పరమ పదంబేలు పాదుషాహి

మానవులకెల్ల నిజపద స్మరణమాత్ర
నైహికాముష్మికము లిచ్చునట్టి దాత
కందపుర జనార్దనుడు భీకర విరోధి
మర్దనుడు భక్తలోకంబు మనుచుగాత!

ఆ జనార్దనుడు నిజపదముల స్మరించినంత మాత్రమున ఐహికము, ఆముష్మికము నిచ్చునట్టి దాతయట. ఆ పేరు తలచినంత ఆనంద సామ్రాజ్యాభిషిక్తుడౌతాడు గదా సామాన్యుడు.

మధురభక్తిలో పరదైవమొకడే పురుషుడు. సకల జీవరాశులు స్త్రీ మూర్తులు. స్త్రీ హృదయం నవనీతం. అది రసార్ణవం. రసప్లావితమైన హృదయం, భక్తిభావపేశలమౌతుంది.

అలా భావించే కవి హృదయం పరవశించి కవితల పందిరిపెట్టుతుంది. అమృతత్వ సిద్ధిని పొందుతుంది.

అలా తెలుగులో కవితల్లిన కవితల్లజులెందరో!

'రసోవై సః'! రసమేదైవస్వరూపము.

గోపాలుడు గోపకాంత మందిరానికి వచ్చాడు. ఆ ముగ్ధమోహన రూపాన్ని మనోహరంగా వర్ణిస్తుంది.

సిరులుమించిన పసిడిబంగరు
జిలుగుదుప్పటిజారగా
చరణ పద్మముమీద దేహము
చంద్రకాంతులు దేరగా
మురువు చూపుచు వచ్చినావో
మోహనాకృతి మీరగా
గరుడవాహన! దనుజమర్దన!
కందుకూరి జనార్దనా!

అంత మురువుచూపే రూపమది.

(30 వ పేజీలో)

'వెలుతురున్న తంగేటి జున్ను గృహమేధి
యోమహాత్మ: కన్తికార్థకేటి'

అని ప్రారంభించేసి-

'ఇచిరసంగ్స్వాంద రీతికి బ్రహ్మచారి
ఇలిం కాపాలికావ్యనామంబుగాన
భూసురోత్తమ గార్హస్థ్యమునకు సరియే'

అని దీనదళితజనులకు గృహస్థజీవనం ఎలా ఆశ్రయకారకమైందో, సమాజంలో ఎవరెవరిని నిరాశ్రయులుగా భావించి, ఎద సిరి కలవారు పాలించి, లాలించాలో- ఆ విషయాన్ని పెద్దనమహాకవి తన 'మను చరిత్ర'లో గృహమేధియైన ప్రవరుడికి 'యతి' చేత చెప్పించారు. అది నిజమే నని మొన్న మొన్నటిదాకా మనం కూడా ఒప్పుకున్నాం.

కాని.... కాలం మారింది. గృహస్థధర్మా లకు కానికాలం వచ్చింది.

మనం హడావిడిగా బస్సెక్కబోతుంటాం. రైళ్ళల్లో మందితో కలిసి రాజకీయరామాయ ణంలోనూ, 'చతుర్ముఖ' పారాయణంలోనూ మునిగి తేలుతుంటాం. ఇంతలో మన కార్య క్రమాలకు అడ్డుగోడగా, ఈ ఉపశ్రుతికి అపశ్రుతిగా ఏదో విన్పిస్తుంది.

'కాళ్ళు కళ్ళు లేవు నారాయణా
కదల మెదలలేను నారాయణా
కరుణించి కాపాడు నారాయణా!
కడుపునబుడతాను నారాయణా'-

చెక్కకాళ్ళ మీదనో, చేతులతోనో, దేకు తూనో, పాకుతూనో, చేతిసహాయంలేక నోటితో పాత్రపట్టుకునో, కర్రతాటింపుతో కాళ్ళుతొక్కుతూనో మన ముందు వెళ్ళే దృశ్యం కన్పిస్తుంది. గుండె గుభేలు మంటుంది. తనవారిలో ఇది కలవారి జ్ఞాప కాలు తళుక్కుమంటై. మనలోని మాన వత్వం వరదలై పారుతుంది. చేయి చటు క్కున జేబులోకి వెళ్తుంది. కనికరంకోసం ఎదురుచూచే హృదయం మన ఎదురుగానే వుంటుంది. జేబులో చెయ్యి అందులోనే వ్రేళ్ళు తిప్పుతుంది. ఐదు, రెండు, ఒకటి యాభై, ఇరవై ఐదు, పది, ఐదు. ఆఖరికి ఆ ఆఖరి ఐదుమీద ఆగుతుంది. ఆ ఐదన్నా వస్తే ఆర్తులకు అదృష్టమే. 'అర్థంలోని పర మార్థం' మనకు అప్పుడే జ్ఞాపకానికి వస్తుంది. చివరకు మిగిలేది వీళ్ళంతా 'న్యూసెన్స్' 'అసలు రానీయకూడదు' అనే నిరసన మాత్రమే. ఇంతవరకు ఆశతో నిలుచున్న జీవి నిశ్శబ్దంగా అలవోక చిరునవ్వుతో ఇంకొక కావుకు వెళ్తాడు, మళ్ళీ మళ్ళీ ఇవే వింటూ, తన చేదునవ్వులే ఫలాహారంగా తింటూ. మనకు మనసంటూ ఒకటుంటే, ఇంకా మాన వత్వం మిగిలుంటే, ఆ నవ్వులే రాళ్ళరువ్వుగా 'నీవింతే నీబ్రతుకింతే' అంటుంటే, మన లోని అహం మరింతసిగ్గుతో తలవంచుకుని పాతపారాయణలో తలదూర్చి తప్పు కుంటుంది.



ఈ కథ సమాజ బాధాసాగరంలో ఒక చిరుతరంగం మాత్రమే.

పూయని పువ్వు, పండని కాయలాగా నిండుజీవితాలను నిస్పృహతో సాగిస్తున్న వారెందరో వున్నారు. పండంటి పసిపాపకు ప్రాకటం రాకపోతే ఏదోకాస్త ఆలస్యం, అదేవస్తుందిలే అని ఊరడిల్లారు తల్లి దండ్రులు. అనుకోని వ్యాధివల్ల ఆ బిడ్డ అవిటిబ్రతుకు. వెళ్ళదీయాలని తెలిసినప్పుడు ఆ గుండెల మంట ఎంత?; సాయంత్రం షికారుకో, సినిమాకో వెళ్దామని చెప్పి ఉత్సాహంగా బయల్దేరిన ఉద్యోగి ఆనాడు అలా ఇంటికిరాకపోగా, ఇక ఏనాడూ తాను తన అంగవైకల్యంవల్ల అర్జనపరుడు కాలే దన్న కఠోరసత్యం కట్టెదుట వుంటే, ఆ బ్రతుకుతీరు, ఆ యింటివారి ఎవరి కెరుక? దైవికమైనవి. దైనిక సంబంధమైన, కార ణాలెన్నెన్నో ఆ జీవితాలలో చెలగాటమాడి పరపరావుజీవులుగా మార్చివేశాయి."అమ్మా రావే! అక్కా రావే! చెల్లీ రావే! నాన్నా రండి! తమ్ముడూ రారా! అంటూ దయ నీయస్థితిలో వాళ్ళందరు వ్రేళ్ళు, వీళ్ళు లెక్కవేసుకుంటూ గడపవలసిందేనా? తమ అశక్తతకు, పరాధీనతకు చింతిస్తూ వుండ వలసిందేనా? కలిసివుంటే కలదు సుఖం అనుకునే ఆనాటి ఉమ్మడి కుటుంబాలలో ఈ భారాన్ని ఆ సంసారాలే భరించేవి. కాని అవన్నీ కలల్లాంటి రోజులు. మరి ఈనాడు.... కాదుగదా!

మనకు మనస్సు మానససరోవరమంత ఆర్థికపరిధులు ఆవగింజంత.ఐదుపైసలకన్న పెరగలేని మన ఔదార్యపు చేవ ఎంత? చేవగల సంస్థలు ముందుకురావాలి. ఆనాడు ఈ ప్రయత్నంలో నూతనశక్తి పుడుతుంది.



టి. టి. డి. ఉచితనేత్ర చికిత్సాశిబిరం

నడిచేది కాళ్ళతోనే ఐనా నడిపించేది "కన్ను" కనుకనే దాన్ని 'నయనం' అన్నారు. కన్నులేని నడక బ్రతుకుకే పెద్ద పడక. అనుకోని ఆఘాతంవల్ల అతనింటికి దేశానికీ బరువని ఎవరన్నా అంటే అది అక్షరసత్యం.

మానవ ప్రయత్న సాధ్యమైనంత వరకు

అంధత్వనివారణలో విస్తృత ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈనాడు దేశంలో లెక్కకు మిక్కిలిగా 'సంచార నేత్ర చికిత్సా శిబిరాలు' నిర్వహింపబడుతున్నాయి. తిరుమల తిరుపతి దేవస్థానం కూడా ప్రతి సంవత్సరం నేత్రచికిత్సా శిబిరాలను నడిపి అంధత్వంవల్ల పరాధీనులుగావున్న వ్యక్తులను ఒకరకంగా స్వయంశక్తులుగా తయారయేందుకు తోడ్పడుతోంది. నిజానికి దేని విలువైనా అదిపోగొట్టుకున్న వారికే తెలుస్తుందేమో! కాని అసలు చూపే రాదన్న వారి పరిస్థితి ఏమిటి?



**టి.టి.డి. వల్ల చక్రాలబండి పొందిన ఒక యువకుడు.**

ఇది ఇలావుండగా, లోగడే అనుకున్నట్లు దైవిక కారణాలవల్లనో, ఇతరత్రానో అంగ వైకల్యం పొంది లోకానికి తాము భార మన్నట్లు బ్రతుకుతున్న వారి పరిస్థితి ఏమిటి? వారికి ముందుగా 'తామెవరికీ భారం కామని' తగిన అవకాశాలు కల్పించి అదు కొని తాముకూడా జనజీవనంలో భాగ స్వాములు కాగలమన్న ఆత్మవిశ్వాసాన్ని ఏర్పరచాలి. తమ ఏయే అవయవాల బల హీనతవల్ల బ్రతుకు జీవవంతం కాక పోయిందో, ఆయా అవయవాలకు తగిన ఊత కల్పించి, తగిన శిక్షణ యిచ్చి ముందు మానసిక వైకల్యం పోగొట్టాలి. అప్పుడు మనస్థైర్యం కలుగుతుంది.

ఈ కార్యక్రమంలో దేవస్థానం ఇంత వరకు గణనీయమైన పరిశ్రమాత్మక విజయం సాధించిందనవచ్చు. కుష్ఠువ్యాధి నివారణ, బాధితుల పునరావాస శిక్షణలను







ప్రముఖులచే కృత్రిమావయవాల వితరణ.

కాక మూగబధిరాంధ పాఠశాలను కూడా ఈ వరకే నిర్వహిస్తున్న దేవస్థానం 1981లో కృత్రిమాయవ సరఫరా, శిక్షణాలయాన్ని స్థాపించింది. ఈ సంస్థ కృషివల్ల, సుమారు 250 మందికి వివిధ కృత్రిమావయవాలను వారి వారి అవసరాలకు తగినట్లు అమర్చి వాటిని ఉపయోగించటంలో శిక్షణ ఇవ్వటం జరిగింది. కేవలం నడవలేనివారికి చక్రాల కుర్చీలు (వీల్‌చైర్స్) కూడా ఇస్తున్నారు. ఇవన్నీకూడా ఉచితంగా ఇస్తున్నవే. కొందరు దాతలేర్పరచిన నిధులమీది రాబడితోకూడా ఇవి ఇవ్వటం జరుగుతోంది.

ఈ కార్యక్రమంవల్ల వారి ముఖాలలో చిరుదివ్వెలు వెలిగాయి. ఎప్పుడూ ఎండల కాలమే అనుకున్న వారి జీవితాలలో తొం కరి తొలిచినుకులు కురిశాయి. జీవనసారపు తొలిరసధారలు గ్రోలినవారి అనుభూతిని వారే చెప్పాలి.

"ఇప్పుడు నేనుకూడా నలుగురిలో ఒకడ్ని! నన్నుచూసి నేను సిగ్గు పడటం లేదు, బాధపడటంలేదు" అంటూ ఆ వ్యక్తి తన చేయివైపు సగర్వంగా చూపు సారించాడు. చొక్కా మడతకింద వున్నంతవరకూ ఆ చేయి అన్ని చేతుల వంటిదిగానే వుంది- చొక్కాను పైకి మడిచినపుడు మాత్రం ఎదుటివారికి తెలుస్తుంది. అది అసలు చెయ్యికాదని! అయితే నేం! ఇప్పుడు ఆ చెయ్యికి చేతకాని తనంలేదు.



**కొత్త 'చేతి'తో జయరామయ్య.**

"మాది కడపజిల్లా, కేతవరంగ్రామం. నా పేరు జయరామయ్య. నేను ఒక పేదరైతుని ఎకరా పొలంపైన వచ్చే రెక్కల కష్టంతో

నేనూ నా భార్యా ముగ్గురు పిల్లలూ బ్రతుకుతున్నాం. నాకు తెలిసిన చదువువల్లా అదునుచూసి పదును ఎరిగి పంటపండించడమే! ఒకరోజున ధాన్యం తీసుకొని దంపకానికి రైసుమిల్లుకు వెళ్ళాను. ఆ రోజు నా జీవితంలో ఒక దుర్దినం. ఆరోజు రైసు మిల్లులోని రాకాసి యంత్రంలో నా కుడిచెయ్యి నలిగిపోయింది.

జమ్మలమడుగు ఆసుపత్రిలో ఆపరేషన్ చేసి కుడిచెయ్యి తీసివేసిన నాటినుంచీ ఏడేళ్ళు అంగవైకల్యం తెచ్చిన ఆర్థిక దుస్థితిలో అంగలారుస్తూ వున్నాను. ఒంటి చేత్తోనే పంటపండించ గలిగిన పత్తావున్న వ్యక్తికి అవిటివాడ్ని అనే భావం నన్ను మానసికంగా దిగజారుస్తూ వచ్చింది.

'ఆరోజు మా లాయర్ బాబు చెప్పే వరకూ నాకు తెలియదు. తిరుపతి వెళ్తే నాకు మళ్ళీ చేయి వస్తుందని, అదీ ఉచితంగానే అనీ!" అంటూ సంబరపడిపోతూ చెప్పాడు జయరామయ్య. వాళ్ళ గ్రామంలోని ఒక మంచిమనిషి సలహాపై అతను కేతవరంనుంచి తిరుపతి వచ్చి టి. టి. డి. కృత్రిమావయవ కేంద్రం డాక్టర్లను కలుసుకొని తన బాధ చెప్పుకొన్నాడు. అతడికి వారివద్దనుంచి వెంటనే చల్లని ఓదార్పు దొరికింది. డాక్టర్లు అతడికి దేవస్థానం సత్రంలో ఉచితవసతిని కల్పించి పది రోజులపాటు రోజూ ఆసుపత్రికి రావలసిందిగా కోరారు. జయరామయ్య సంతోషంతో అంగీకరించాడు - పదిరోజులు పూర్తయేసరికి జయరామయ్యకు కృత్రిమ హస్తం అమర్చడం, ఆ చేత్తో అతనిచేత పనులు చేయించడం జరిగిపోయింది. డాక్టర్లు ఇచ్చిన సలహాలను సూచనలను చెవిలో వేసుకొని రెండుచేతుల కొత్తరూపంతో కొత్తఆశలతో ఇంటికి తిరిగి వెళ్ళాడు.

"నాకు జరిగిన మేలు నాలాంటి వారికి పదిమందికి జరగాలని కోరుకొంటున్నాను" అన్నాడు ఆ బక్క రైతు వెళ్తూ వెళ్తూ!

ఇది వారి తొలిమజిలీ. ఒక దృఢ విశ్వాసంతో "మోటు వారదీ జీవితం, మొలకెత్తును ప్రతిక్షణం, తామెప్పుడూ సమాజ సేవ కనర్హులం అనే మాట విన్పించినా, బాట ఇంకా తేలలేని స్థితి ఏర్పడింది. కళకళలాడే ముఖాల ఆనందప్రవంతిని ఏ పంటల కనువుగా మళ్ళించటమా అని సమాజం సందిగ్ధతలోవున్న తరుణంలో కాలంమార్పు కలిసివచ్చింది. శ్రావణ కారుణ్యమేఘాలు గ్రీష్మంలోనే కుండపోతగా వర్షించాయి.

వ్యష్టి, సమష్టి, ఆర్థికోన్నతిలో భాగస్వాములను చేసేందుకు తిరుపతి, విశాఖలలో వృత్తి విద్యాశిక్షణ, ఉపాధి కేంద్రాల నేర్పరచి, అంగవైకల్య బాధితులకు వారి వారి వైకల్యాలవల్ల అభ్యంతరంరాని వృత్తిశిక్షణ గరిపి, భావిభారతంలో యోగ్యులైన పౌరులుగా తీర్చిదిద్దాలని ఆయన సంకల్పించారు.

ఆయన కార్యదీక్ష, ప్రేరణ - ప్రభుత్వ,



వికలాంగుల కేంద్రం ప్రారంభోత్సవానికి విచ్చేస్తున్న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారకరామారావు.

## మరొక మలుపు

తన కళా వైదగ్ధ్యంతో, శ్రీరాముడుగా, శ్రీ కృష్ణుడుగా, పాత్రలలో జీవించి తెలుగు జనుల గుండెలలో గుడికట్టుకొన్న మహానటుడు ముఖ్యమంత్రి కావటంతో, ఈ జీవులలో తమకేదైనా మేలు జరుగదా అన్న ఆశలు మోసువేశాయి. అంతటి జనాభిమాని కింతటి పట్టం వచ్చినప్పుడు జనులలో ఆపాటి ఆశలు కలగటం పరిపాటి.

నరరూప నారాయణ సేవలో అందివచ్చిన ఈ అవకాశాన్ని ఆవగింజంతైనా వదులుకోకుండా ముఖ్యమంత్రి శ్రీ యన్. టి. రామారావు ముందుకు నడిచారు. ఆ ఆరాటం ఫలితమే ఈ శ్రీ వేంకటేశ్వర వికలాంగుల వృత్తి శిక్షణ, ఉపాధికేంద్రం.

'నిజాం శల్య చికిత్సాలయం' తీరుతెన్నులపై ఏర్పడిన అవగాహన ఆధారంగా తిరుమల తిరుపతి దేవస్థానాల సహయోగంతో 14-4-83న ఫలరూపం దాల్చింది. ఈ సంస్థకు ప్రారంభోత్సవం జరిపి ముఖ్యమంత్రి సంస్థలోని వివిధ విభాగాలను సందర్శించి ఆ తీరుపట్ల తమ ఆసక్తిని, సంతృప్తిని వ్యక్తం చేశారు.

ప్రప్రథమంగా 12 లక్షలు, తరువాత సాలీనా 6 లక్షలు వ్యయం కాగల ఈ నూతన శిక్షణాలయంలో ప్రతి సంవత్సరం 100 మందికి వారి వారి ఆసక్తి, శక్తియుక్తుల ననుసరించి, టర్నర్లు, ఫిట్టర్లు, ఎలక్ట్రానిక్ అసెంబ్లింగ్, శానిటరీ వస్తువుల తయారీ, టైప్‌రైటింగ్, రబ్బరుస్టాంపుల తయారీ, సైనుబోర్డులు వ్రాయటం, కుర్చీల అల్లకం, తేలికపాటి ఇంజనీరింగ్ పనులలో శిక్షణ యిస్తారు. ఒక్క తేలికపాటి ఇంజనీరింగ్ పనులలో తప్ప మిగిలిన శిక్షణలలో ఎవ్వరైనా చేరవచ్చు. శిక్షణకాలంలో వీరికి



ఒక అశక్తసోదరి పునరావాసంపై ముఖ్యమంత్రి అనక్తి:



ఒక వికలాంగ సోదరుడికి 'అన్న'గారి అలంబన:

ఉచిత భోజన వసతి ఏర్పాటు చేస్తారు. శిక్షణ పూర్తి అయిన తర్వాత ఇక్కడనే పని చేయదల్చుకున్న వారికి యోగ్యతలనుబట్టి భృతి ఇవ్వటం జరుగుతుంది. మిగిలిన వారికి బయటి పరిశ్రమలలో ఉపాధి కల్పించేందుకు ఈ సంస్థ తోడ్పడుతుంది.

ఈ బృహత్తర కార్యక్రమం సమర్థవంతంగా శాశ్వత ప్రాతిపదికపైన నిర్వహించాలనే దేవస్థాన సంకల్పం. అందుకు తగిన చర్యలు ప్రారంభమైనవికూడా. దూర ప్రాంతాలవారికనువుగా పడకలున్న వైద్యాలయాన్ని ఏర్పాటు చేయాలన్నది ముఖ్యమంత్రి సంకల్పం. ఈ ప్రయోగంలో దాతల సహకారం, ఆర్తులకొక అఖండ వరదానం.

కాని ఒకటిమాత్రం వాస్తవం. ఇప్పుడు సమాజంలో ఒక నూతన చైతన్యం వెల్లివిరుస్తోంది. ఏ వస్తువూ నిరసన పాత్రమైంది కాదన్న భావం ఇప్పుడిప్పుడే ఏర్పడుతోంది ఒకప్పుడు సమాజానికి తాము భారమను కొన్న వ్యక్తులుమానసికంగా పరిణతిని పెంచుకుని అన్ని రంగాలలో ముందంజ వేస్తున్నారు. అవయవాలన్నీ సక్రమంగా వున్న అందరివలెనే వారికీ కష్టసహిష్ణుత, మిగిలిన వారికి లేని అవగాహన అలవడుతున్నవి.

కాని వైద్యులకన్నా, వృత్తిశిక్షకులకన్నా వికలాంగులను జీవన స్రవంతిలోకి తీసుకోవలసిన బాధ్యత సమాజానికే ఎక్కువగా వుంది. ఎంతటి సుశిక్షితుడైనా, అందరివలె తాను చేయలేనేమోనన్న దడుపు, బెరుకుతనం కొంత తప్పనిసరిగా వుంటుంది. దైహిక లోపాలు, ధైర్య, స్థైర్య, ప్రజ్ఞా లోపాలుగా కానక్కరలేదని, అర్థవంతమైన బ్రతుకు సాగించే హక్కు అందరివలెనే వారికీ వుందనీ, ఒక అవయవంలో లోపించినశక్తి, అణువణువు తేజోవంతంగా శేషాంగశ్రేణిలో పరివ్యాప్తమై వుంటుందనీ, దానివలన తన ప్రగతికే గాక జనప్రగతికి కూడా తోడ్పడగలరనే విశ్వాసం కల్గించి, ఉపాధి కల్పించగలిగినప్పుడు, ప్రతి వ్యవస్థా కేటాయింపు పద్ధతిన దీనికి కంకణం కట్టుకున్నప్పుడు, వారి జీవితనందనంలో ఆశాపారిజాత పరిమళం వెల్లివిరిస్తుంది. ఇంటింటా ఆనందజ్యోతులు వెలుగుతాయి.

ఏ వర్గానికైనా మనంఎంతైనా సాయం చేయవచ్చు-కానీ మరొక వర్గంనుండి గమనింపులేదనే వాదన ఎప్పుడూ తప్పదు. కాని ఈవర్గానికి చేసే సహాయం కుల, మత, జాతి, వయోలింగ భేదాలు లేకుండా అందరికీ అందించగలిగేది.

'ఆవేదనకూ, ఆనందానికీ కన్నీరే కడపటి భావం.' ఆశగా మోమెత్తి చూసే ఈవర్గపు ఆవేదనాశ్రువులను ఆనందబాష్పాలుగా మార్చగలిగితే ఇహంలోనే మనం ఇంపైన పరతత్త్వాన్ని చూడగలం.

'ఆనంద లీలే గోవిందరూపం
ఆమాట అంటే రారాదు కోపం—'




టి.టి.డి. కృత్రిమావయవకేంద్ర సందర్శనానంతరం అందరికీ ముఖ్యమంత్రి వీడ్కోలు.

## రామాయణసుధ

రచన : ఆచంట లక్ష్మీనరసింహం

మూల్యం : రు. 20-00

ప్రతులకు ;

రచయిత ; ఎస్. ఆర్. టి.

418, వనస్థలిపురం, హైదరాబాదు 500019.

---

ఏ సుముహూర్తంలో ఆదికవి వాల్మీకి అమృతహస్తంనుంచి రామాయణంపుట్టిందో గాని-దానివెంట పరశ్శతంగా అన్నిభాషల్లోను సంగ్రహంగానో సమృద్ధిగానో రామాయణ గ్రంథాలు పుడుతూనే ఉన్నాయి. ముఖ్యంగా సంస్కృతాంధ్రాల్లో ఈరచనలు అనేకం.

సంస్కృతంలో చంపూనాటకాది ప్రక్రియలలో వదులుమీద ఉన్నాయి. తెలుగులో కూడ-పూర్వకవుల పదసాహిత్యంలో అయితేనేమి - గద్యసాహిత్యంలో అయితేనేమి - రామకథలను దొంతర పెట్టవచ్చు.

ఇదివరకే ఆధునికాంధ్ర సాహిత్యంలో చేయితిరిగిన ముగ్గురు రచయితలు వ్యవహారభాషలో వ్రాసి ప్రజలదగ్గరకు తెచ్చారు. పద్యగ్రంథాలు ప్రజాసామాన్యానికి అందుబాటులో లేనందువల్ల-పై వారి వచన రచనలు జనాదరణకు పాత్రములైనాయి.

మళ్లా 'రామాయణసుధ' పేరుతో ఈ బృహద్గ్రంథం ప్రజల ముందుకు వచ్చింది. ముచ్చటయిన ఆకృతి, బాపుగారు అందించిన సంప్రదాయబద్ధమైన ప్రాచీన రామాభిషేక చిత్రం ఒక చిరంతన సుగంధాన్ని అందిస్తున్నది. స్ఫుటమైన అచ్చు; కథాసందర్భాలు వెతుక్కోనక్కర లేకుండా ఎక్కడికక్కడ ఉపశీర్షికలు. ఏమాత్రం సాహిత్యసంపర్కం ఉన్న పాఠకులైనా చదివి అర్థం చేసుకోవచ్చు. యథార్థరామాయణ కథను తెలుసుకోవచ్చు.

తెలుగులో—ఆధునిక రీతిలో—అన్ని విధాలుగాను రామాయణాలు పుట్టి ఉండగా మళ్లా ఈ రచన పునరుక్తిగదా-అనే ప్రశ్న సహజం. ఇక్కడ విశ్వనాథవారి మాట జ్ఞాపకం వస్తుంది.

'మరల నిదేల రామాయణంబన్న చో
నీ ప్రపంచకమెల్ల నెల్లవేళల
దినుచున్న యన్నమే తినుచున్న దిన్నాళ్లు
తనరుచి బ్రతుకులు తనవిగాన

.... .... .... .... .... ....

.... .... .... .... ....

తలచిన రామునే తలచెద నేమను
నాభక్తిరచనలు నావిగాన

ఎవరెన్ని రామాయణాలు వ్రాసినా వ్రాయబోయినా వారు పైప్రశ్నకు చెప్పే సమాధానం ఇదే అనుకుంటాను.

## గ్రంథసమీక్ష

లక్ష్మీనరసింహంగారు చాలవరకు శ్రీమద్రామాయణాన్నే అనుసరించారు. రామాయణ హృదయాన్ని 'తన తెలుగు' లోకి పరివర్తించకుండా ఇంచుమించు శ్లోకాలకు దండాన్వయం వ్రాశారు. ఇందువల్ల ఒక పేరా అంతా ఒకే వాక్యంగా ఏర్పడడం ఉంటుంది. (చూ. పుట 114 మొదటిపేరా) దానివల్ల మలచిన తెనుగువాక్యానికి సంస్కృత వాసన తప్పదు. అందువల్ల సాధారణపు తెలుగు పాఠకుడికి గ్రంథంమీద తాదాత్మ్యంతో కూడిన ఆత్మీయత ఏర్పడదు విషయం తెలుస్తుంది, కాని అది సరాసరి హృదయంలోకి ప్రసరించక ఏదో అడ్డుపడుతూన్నట్టుంది. పూర్వకవులు ఏ సంస్కృత రచననైనా తెనిగించారుగాని, అనువదించలేదు. ఆధునికులు చాలమంది ఈ భేదం గుర్తించలేదు.

లక్ష్మీనరసింహంగారు సాధ్యమైనంతలో దూరాన్వయం లేకుండా సులభ వ్యవహార వచనమే వ్రాసి పాఠకులను, సన్నిహితులను చేసుకున్నారనే చెప్పవచ్చు. అయితే తెనుగు చెయ్యడం ఒకకళ. మూలభావాన్ని హృద్గతం చేసుకొని అలతి అలతి వాక్యాలుగా తిక్కన్నగారిలా స్వంతబాణీలో వ్రాస్తే అది సంస్కృత గంధం విడిచి తెలుగులో వెలువడినట్టుంది. తెలుగు తావులు విరజిమ్ముతుంది. ఈరచయిత అవని పెట్టుకోలేదు. మూలవిధేయంగా వ్రాశారు.

రామాయణసుధా రచయిత ఒక్క వాల్మీకి భావాలనే కాక—ఎడనెడ రామకృష్ణ పరమహంస, వినోబాజీ మున్నగు ఉత్తమ పురుషులు రామాయణ పాత్రలకు సన్నివేశాలకు ఇచ్చిన వ్యాఖ్యలను కూడా వివరించి గ్రంథంవిలువను పెంచడం ప్రశంసనీయం.

పరిశీలించగా అక్కడక్కడ మూలంతో చిన్నచిన్న వ్యత్యాసాలు కనపడతాయి.

కుశలవులు సీత కుమారులని వాల్మీకి చెప్పలేదు. కుశలవులనే అన్నాడు. వారు అయోధ్యకు వెళ్లి ఆ వీధులలో పాడితే-ఋషులు పారితోషికాలిచ్చినట్టు రామాయణం వల్ల రుజువుకాదు. ఋషులవద్ద పాడింది, అరణ్యసీమలోనే. "మానిషాద, ప్రతిష్ఠాం అగమః" అంటే నీవు కలకాలం అప్రతిష్ఠ పొందుదువుగాక" అని కాదు, "ఓరీ నీకు చిరకాలం నిలకడ ఉండదురా" అని శాపం అంటే ఆట్టే రోజులు మన్నవు, మరణిస్తావు అని భావం. భాస్కరుడు ఇట్లాగే తెనిగించాడు.

రచయిత శబ్దప్రయోగ విషయంలో మరికొంత శ్రద్ధవహిస్తే రచనకు ఇంకా వన్నె వచ్చేది. "హంతకి, వంశీకుడు, తపోఫలం శక్తివంతుడు" వంటి అపశబ్దాలు ఇట్టి ఉద్గ్రంథంలో ఉండకపోవడం మంచిది.

అచ్చులో కూడా తగినంత జాగ్రత్త వహిస్తే-సంస్కృత శ్లోకాలలో అన్ని తప్పులు పడిఉండేవి కావు. గోష్ఠి, నిష్ఠురాలు, వశిష్ఠ, ఎక్కడా 'ష్ఠ' లేకపోవడం వింత !

మొత్తంమీద ఈ నీహారలేశాలను విడిచిపెడితే — ఈ రామాయణసుధ సంస్కృత రామాయణం చదువుకోలేనివారికి, అర్థంకానివారికి, తెలుగుపద్యం అర్థంకానివారికి, వాల్మీకి రామాయణ కథా మాధుర్యాన్ని కరతల ఆమలకం చేస్తుందని నిస్సంశయంగా చెప్పవచ్చు.

— ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి



# షిర్డీసాయి

— శ్రీ ఎల్లంరాజు సుబ్బారావు

ఎన్నో క్లిష్టసమస్యలతోను, అశాంతితోను బాధపడుతున్న మానవాళికి శాంతికిరణాలను ప్రసాదించి, వాళ్ల జీవితాల్లో ఆశారేఖలను ఆనందజ్యోతులను వెలిగించే మహనీయులు పుణ్యపురుషులు ఎందరో తరచు భారత దేశంలో జన్మిస్తూ వున్నారు. అట్టి అవతార పురుషుల రాకతో భారతదేశం పునీతం అయింది. అలాంటి సిద్ధపురుషుల కోవకు చెందినవారే శ్రీ షిర్డి సాయిబాబా.

ఈ అవతార పురుషుని గూర్చిన విశేష మేమంటే యీయన జన్మ, జన్మస్థలం బాల్యజీవితం–వీటికి సంబంధించిన వివరాలన్నీ యిప్పటికీ నిగూఢంగానే వున్నాయి. మహారాష్ట్రంలోని అహమ్మద్‌నగర్ జిల్లాలోని ఒక కుగ్రామమయిన షిర్డీలో 16 సంవత్సరాల ప్రాయంలో తొలిసారిగా సాయిబాబా ప్రత్యక్షమైనాడు. అప్పటికే ఆధ్యాత్మిక సాధనలో పరిపూర్ణుడయిన యీ యువకునిలో ఎన్నో మానవాతీతశక్తులు గోచరించాయి. ప్రథమంలో బాబా ఒక వేప చెట్టు క్రింద కూర్చొని, కొంతకాలానికి దగ్గరలోని ఒక శిథిలమయిన మశీదుకు తన నివాసాన్ని మార్చాడు. ఈ మశీదుకే ఆయన 'ద్వారకామాయి' అని నామకరణంచేశాడు. ఇక్కడే ఆయన తాను దేహయాత్ర చాలించే వరకు నివసించాడు. (1918 అక్టోబరు 15వ తేదీ వరకు)

సాయిబాబా ప్రేమ, దయ, కరుణలకు మూర్తిస్వరూపుడు. బీదల కష్టాలను బాపుతూ, రోగార్తులకు మందులిస్తూ ఆయన ప్రథమంలో మానవాళికి సేవ చేశాడు. తర్వాత ఆయన మశీదులోని పవిత్రాగ్నిని (ధునీ) వెలిగించి, అందులో విభూతి భక్తులకు పంచిపెట్టేవాడు. ఇప్పటికీ షిర్డీలోని ద్వారకామాయిలో ఆయనవెలిగించిన అగ్నిహోత్రం ఆరకుండా వెలుగుతూనే వుంది. ఆయన కరుణాదృష్టి పడగానే ఎందరో పాపులు పునీతు లయ్యారు. తలచుకుంటే ఎవరికయినా ఆయన సామ్రాజ్యాన్ని ప్రసాదించగలిగేవారు. కాని ఆయనమాత్రం ఫకీరు వేషంలో భిక్షాపాత్రతో యాచించి, ఆ భిక్షాన్నంతోనే తాను తన భక్తులతోభుజిస్తూ జీవయాత్ర గడిపారు. ఆయన త్రికాలవేది, ఉత్కృష్ట మానవతావాది. నిజమయిన పరివ్రాజకుడు. నశ్వరమయిన వస్తువులపై ఆయన ఎప్పుడూ ఆసక్తి చూపలేదు ఎప్పుడూ ధ్యాననిష్ఠలోనూ, కేవల అద్వైతసుఖంలోనూ ఆయన కాలం గడిపాడు. ఆయన హృదయం అతిపవిత్రంగా నిర్మలంగా ఉండేది. భక్తులమధ్య ఆయన అమృతవాక్కులు కురిపించేవాడు. బంగారు రాయి, ధనికుడు–దరిద్రుడు, రాజు–పేద వీరందరూ ఆయన దృష్టిలో సమానులు. నిందలను, ప్రశంసలను ఆయన సమదృష్టితో స్వీకరించాడు. సిద్ధపురుషులకన్నా అతీతమయిన స్థానాన్ని తాను పొందగలిగినా, ఆయన ఎప్పుడూ ఎలాంటి సిద్ధులను ప్రదర్శించి యెరుగడు. కాని అవసరమని తోచినపుడు భక్తుల అనుగ్రహార్థం కొన్ని మహిమలు చూపాడు. ఇదికూడా భగవానుడు సర్వశక్తిమయుడని, సర్వజ్ఞుడని తెలుపగలందులకే ఆయన యీ దివ్యశక్తులను ప్రదర్శించాడు.




షిర్డీలోని వర్తకులు జ్యోతులు వెలిగించడానికి చమురు యివ్వడానికి నిరాకరించినా బాబా నీళ్లతోనే వత్తులు వెలిగించాడు. ఈ జ్యోతులు రాత్రంతా వెలుగుతూ వచ్చాయి. ఒకసారి షిర్డీలో పెనుతుఫాను వచ్చి ప్రజలంతా భయభీతులై ఆయన వద్దకు వచ్చి మొరపెట్టుకొన్నారు. సాయిబాబా బయటికి వచ్చి, ఉచ్చైస్స్వరంతో మేఘాల వంక చూస్తూ–"చాలు, చాలు, మీ ఉధృతాన్ని తగ్గించుకొని ప్రశాంతంగా సాగిపొండి" అని ఆదేశించాడు. వెంటనే పెనుగాలులు తగ్గి, వర్షమాగిపోయి ప్రశాంత వాతావరణం ఏర్పడింది. బాబా భక్తులనుండి కోరేవి రెండు మాత్రమే– నిష్ఠ (అచంచల విశ్వాసము), సబూరి (సహనం లేక ఓర్పు) గురువును త్రిమూర్త్యాత్మకంగా భావించి పరిపూర్ణమయిన విశ్వాసాన్ని ఉంచవలసినదిగా ఆయన భక్తులకు ఉపదేశ మిచ్చేవాడు.

భయంకరమయిన, నయంకాని దీర్ఘవ్యాధులను కూడా బాబా తమ దివ్యశక్తుల చేత నయం చేసేవాడు. భీమాజీపటేల్ చాల కాలంగా గుండె నొప్పితో బాధపడుతుండేవాడు. ఇదేచివరికి క్షయగా పరిణమించింది. అన్ని చికిత్సలు చేయించుకొని, విసిగి, నిరాశతో అతడు బాబాను ఆశ్రయించాడు. బాబా హృదయం ద్రవించింది. రెండ స్వప్నాలతో అతనివ్యాధిని నిర్మూలించాడు బాబా మరొక భక్తుడు డాక్టరు పిళ్లె నా కురుపులతో చాలా బాధపడుతుండేవాడు బాధ భరింపరానిదైనపుడు ఆయన బాబా వద్దకువచ్చి తన ప్రారబ్ధకర్మను రాబోయే పదిజన్మల్లో అనుభవించేటట్లు చేయమని ప్రస్తుతం తనబాధను వెంటనే నివారిం మని వేడుకొన్నాడు. బాబా యీ సంగ వినగానే "పదిజన్మలెందుకు? పదిరోజుల్లో పురాతన కర్మఫలితాలను అనుభవిస్తే స



ప్రకటన

## గొడుగుల పంపిణీ

మైకుసెట్లవలెనే పత్రై శాతం సబ్సిడీతో గొడుగుల జతను కూడా ఆలయాలకు రాశంగా ఇవ్వాలని తే 6-8-82 దిన రుమల తిరుపతి దేవస్థాన నిర్వాహక ండలిలో తీర్మానించటం జరిగింది నుక గొడుగులు అవసరమైన ఆల మాల అధికారులు తమ అభ్యర్థనలు ంపుకోవలసిందిగా కోరటమైనది. డుగుల జత సగం వెల రూ. 600/- వుతుందికనుక టి. టి. డి. కార్య ర్వహణాధికారి పేరిట ఆ మొత్తానికి మాండ్ డ్రాఫ్టు తీసుకొని ఆయా ల్లాల అసిస్టెంట్ దేవాదాయ కమిష ర్ల ద్వారా తమ దరఖాస్తులను పంపిన తంలో, అలాంటి వారికి గొడుగులు ంజూరు చేయబడుతవి.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

పోతుంది" అనిచెప్పి 10 రోజుల్లోనే డాక్టరు పిల్లాను స్వస్థుణ్ణి చేశాడు. భక్తులంటే బాబాకు వల్లమాలిన ప్రేమ. వారి బాధలను కష్టాలను తనపై వేసుకొని వారిస్థానే తానే ఆబాధలను అనుభవిస్తూ వుండేవాడు. బాబా దగ్గర ఒక మహిళా భక్తురాలు తన కుమారునితో ఉంటుండేది. ఆ పిల్లవాడికి ఒకసారి ప్లేగు తగిలి వళ్లంతా బొక్కలెక్కాయి చివరకు బొబ్బలప్లేగుగా మారింది. ఆ భక్తురాలు బాబాను ఆశ్రయించగానే ఆయన ఆమెకు అభయమిచ్చాడు. బాబా ధరించిన అంగీ తీసిచూస్తే ఆయన వంటినిండా బొబ్బలే. భక్తులకష్టాలను తనవిగానే భావించి వాటిని భరిస్తూ వుండేవాడు. భక్తుల ప్రాణాలను కాపాడడానికి తన ప్రాణాన్నిసహితం పోగొట్టుకొన్న ఉదంతం కూడా బాబా జీవితంలో మనకు గోచరిస్తుంది.

1918 సంవత్సరం అక్టోబరు నెలలో తాత్యాపటేల్ అనే భక్తుడు తీవ్రమయిన వ్యాధికి లోనయి, మరణశయ్య మీద ఉన్నాడు. అందరూ బ్రదకడని ఆశవదలుకొన్నారు. బాబా కూడా ఆ సమయంలో వ్యాధిగ్రస్తులై, జ్వరంతో బాధ పడుతున్నారు. కాని విజయదశమి రోజున ఒక విచిత్రమయిన సంఘటనజరిగింది. జ్వరంతో ఉన్న సాయిబాబా మహాసమాధిపొందారు, మరణశయ్యపై ఉన్నభక్తుడు తాత్యాపటేల్ కోలుకొన్నాడు. బాబా తరచు చెబుతూ వుండేవాడు—'భక్తుల ప్రాణాలను కాపాడడానికి నా శిరస్సునే అర్పిస్తాను,' అని చివరకు యిదే భక్తుల ప్రాణాలను కాపాడిన సంఘటనగా సాయిబాబా జీవితంలో మిగిలిపోయింది.

భౌతికంగా బాబా మన మధ్య లేకపోయినా, వాస్తవంలో బాబా మరణించలేదు. బాబా చిరంజీవి; సర్వాంతర్యామి. ఎన్నో రూపాల్లో భక్తులకు దర్శనమిస్తూ, ఎన్నో విధాలుగా వారిని ఆదుకొంటూ బాబా మన మధ్యనే సంచరిస్తున్నాడు. బాబా ప్రధాన లక్ష్యం—మానవాళి కష్టాలను, బాధలను తొలగించడం-భక్తులకు మంచి వస్తువులను ప్రసాదించడం, చివరకు వారిని జన్మ పరంపర నుండి, ప్రారబ్ధకర్మలనుండి విముక్తులను చేయడం. మనము చేయువలసినదల్లా ఆయనలో పరిపూర్ణమయిన విశ్వాసముంచి ఆయన్ను శరణు వేడడమే. బాబాసందేశం విశ్వజనీనం; విశ్వ వ్యాప్తం. ఆయన దృష్టిలో రామ్-రహీమ్ ఒక్కరే. ఒకే భగవానుని వివిధరూపాలు. దేవాలయం-మశీదు రెండూ ఆయన నివాసస్థానాలే. గీత-కొరాను రెండూ ఆయన అనుగ్రహ గ్రంథాలే. బాబా జీవితకాలంలో షిర్డీలో హిందువులు శ్రీరామనవమి, ముస్లింలు గంధోత్సవం రెండూ ఒకేసారి జరుపుకొనేవారు; అది యీనాటికి జరుగుతున్నది. అన్ని మతాలు ఒకే లక్ష్యంకోసం ఏర్పడినవని, భగవంతుడు అందరికి ఒకడేనని సాయిబాబా తరచు చెబుతూ వుండేవారు. జాతీయ సమైక్యతాభావం కోసం ప్రయత్నించే నేటి సమాజానికి సాయిబాబా బోధనలే శిరోధార్యాలు; ఆచరణయోగ్యాలు.

శ్లో॥ నమః శ్రీ సాయినాథాయ, మోహ
తంత్ర వినాశినే।
గురవే బుద్ధిబోధాయి, బోధమాత్ర
స్వరూపిణే॥



(19 వ పేజీ తరువాయి)

దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత ।।
తస్మా త్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి ॥

అన్ని దేహాలలోనూ వుండే ఆత్మకు చావు అనేదే లేదు. అందువల్ల ఈ ప్రాణుల గురించి నీవు దుఃఖించ నక్కరలేదు.

స్వధర్మ మపి చావేక్ష్య న వికంపితు మర్హసి ।
ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే ॥

నీ ధర్మాన్ని తెలుసుకొని అయినా నీవు జంకకు. ఎందుకంటే క్షత్రియుడికి ధర్మయుద్ధాన్ని మించిన మహాభాగ్యం మరొకటి లేదు.

యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్ ।
సుఖినః క్షత్రియాః పార్థ లభన్తే యుద్ధ మీదృశమ్ ॥

తెరచివుంచిన స్వర్గద్వారం లాంటి ఈ సంగ్రామం నీకు అప్రయత్నంగా లభించింది. ఇలాంటి సదవకాశం పుణ్యం చేసుకొన్న క్షత్రియులే పొందగలుగుతారు.

అథ చేత్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం నకరిష్యసి ।
తతః స్వధర్మం కీర్తిం చ హిత్వాపాప మవాప్స్యసి ॥

నీవు ఈ ధర్మయుద్ధం చేయకపోతే నీ కులధర్మమూ, పేరు ప్రఖ్యాతులూ పాడుచేసిన పాపం కట్టుకుంటావు.

అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్ ।
సంభావితస్య చాకీర్తిః మరణాదతిరిచ్యతే ॥

అంతే కాకుండా నీ అపకీర్తిని ప్రజలు చిరకాలం చెప్పుకుంటారు. పరువు ప్రతిష్ఠలున్న వాడికి అపనిందకంటే మరణమే మంచిది.

భయా ద్రణా దుపరతం మంస్యన్తే త్వాం మహారథాః ।
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్ ॥

ఇన్నాళ్లూ నిన్ను మహావీరుడిగా గౌరవిస్తున్న వాళ్లంతా భయపడి యుద్ధం మానేశావని భావించి చులకనగా చూస్తారు.

అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యన్తి తవాఽహితాః ।
నిన్దన్త స్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్ ॥

నీ శత్రువులు నీ పరాక్రమాన్ని నిందిస్తూ అనరాని మాటలెన్నో అంటారు. అంతకుమించిన దుఃఖమేముంది?

హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్ ।
తస్మా దుత్తిష్ఠ కౌన్తేయ! యుద్ధాయ కృతనిశ్చయః ॥

అర్జునా! ధర్మయుద్ధంలో మరణిస్తే స్వర్గం పొందుతావు. శత్రువులను జయిస్తే రాజ్యభోగాలు అనుభవిస్తావు. అందువల్ల కృతనిశ్చయంతో యుద్ధానికి నడుం బిగించు.

సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి ॥

సుఖదుఃఖాలూ, లాభనష్టాలూ, జయాపజయాలూ సమానంగా భావించి సమరం సాగించు, అప్పుడు నీకు పాపం కలుగదు.

ఏసా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు ।
బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి ॥

పార్థా! ఇంతవరకూ నీకు సాంఖ్యమతానుసారం ఆత్మతత్వం గురించి చెప్పాను. ఇక సంసారబంధం వదులుకోవడానికి సాధనమైన నిష్కామ కర్మయోగం గురించి చెబుతాను విను.

నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే ।
స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥

ఈ కర్మయోగం ప్రారంభించి పూర్తి చేయలేకపోయినా వృథాగా పోదు; దోషం లేదు. ఏ కొద్దిగా ఆచరించినా ఈ యోగం దారుణమైన సంసారభయం నుంచి కాపాడుతుంది.

(సశేషం)

[ 29 వ పేజీ తరువాయి ]

ఆ ముగ్ధమోహనుడు దగ్గరికి వచ్చాడు. ఆ దివ్యమంగళ రూపునికి శరీరమంతా నఖ క్షతాలు, దంతక్షతాలు.

గోపకాంతకు కోపతాపాలు అతిశయించాయి. మనసు ఉడికింది, మమత ఉబికింది.

“దనుజ మర్దనా! మొలక కెంపులు పెదవినెవ్వతె ఉంచెరా? చిత్తగించక, జీరువారను కత్తిగోరుల చెక్కిలెవ్వతె నొక్కెరా? నిన్న రాతిరి చవికలోపల నీవు, చెలి కూడుంటిరా? ఉన్న మార్గములన్నియును నేనొకతె చేతను ఓంటిరా? విన్నమాత్రము గాదురా నిను కన్నులారా వీధిలో కనుగొంటిరా?”

సాక్ష్యాధారాలతో పట్టుపడ్డాడు. తప్పించుకోలేడు. గుక్కతిప్పుకోలేడు.

జిలుగు దుప్పటి విప్పించింది. శరీరమంతా ముల్లుమోపగ సందులేనన్ని మోవి కెంపులు గప్పినవి.

“తెల్ల వారినదాక ఎక్కడ తిరుగులాడితి కల్లలాడక చెప్పరా?” అని నిలేసింది.

ఏదో చెప్పబోయాడు, చెప్పనిస్తుందా? ఆ ధూర్త గోపాలుని విషయం తనకు తెలియదూ?

“నీ మీద ఒట్టు! నేనేమీ ఎరగను” అని అన్నాడు.

“నాకు తెలుసును లేరా! దబ్బులన్నియు తెలుసుకొంటిని. తప్పుబాసలు సేయకు. మబ్బుదేరెడి కన్నుగవతో మాటిమాటికి డాయకు. తత్తరంతో ఒడలిపై చెయి వేయకు” అని వారిస్తుంది.

తమ గత స్నేహాన్ని తలచింది. “అండబాయక కూడి యుంటిమి, నేడిట్లాయెను. కదలిపో ఎప్పటి చోటికి” అని తరిమింది.

కాని మనసు లాగింది.

ఆ దివ్యాకర్షణనుండి బయటకు రాగలదా? **“ఉండరా నీ మాటలకు నేనోర్వజాలను మాటికి” అని లొంగింది.**

కృష్ణుడి ఒడిలో వాలింది.

ఇప్పుడామె మరుని చేతిబంతి.

కోపతాపాలు పోయాయి. మదన గోపాలుని చేతి రాజిలుక అయింది.

కొసరలన్నియు దీర్చుకొంటివి
నాగుణము లెరిగే శయ్యనూ
ఆపనెరింగి పలికితివి పలవాది
పూవుల శయ్యనూ
మదనకేళికి నీవే జాణవు మాటనేమిటివెయ్యనూ!
కదియరారా! … … …

ఇదీ, తర్వాతిపద్యం రెండూ శృంగార పద్యాలు. అందునా సంభోగ శృంగారం. కాని ‘శయ్య’ అనే పదానికి ‘హృదయ శయ్య’ అని అన్వయించుకుంటే ఈ పద్యాలకు తాత్త్వికార్థం అవగత మవుతుంది.

కవి ఏ కామితమాశించి ఈ పద్యాలు వ్రాశాడో ఈ క్రింది పద్యంలో తెలుస్తుంది.

జంట నేత్రము లంటి చూచితె
జాజిపూవుల పూచెరా
మింటిత్రోవను జూచుచుండగ
మేఘవర్ణము గప్పెరా
కంటిలో నొకపండు వెన్నెల
కాయుచున్నది యేమిరా!
కంటిలేరా! … … …

తన కనులను ఆ దేవదేవుని కనులతో కలిపితే, జాజిపూవులు పూసినవట. అంటే జ్ఞానజ్యోతి వెలిగినదని అర్థం. ఆ మేఘశ్యాముని చూడగా చూడగా విశ్వమంతా మిథ్య, మాయ అని మేఘవర్ణము చెప్పింది.

ఎప్పుడైతే జగన్మిథ్యాభావన ద్యోతకమైందో, బ్రహ్మసత్యం అనే సత్యం తెలిసి బ్రహ్మ సాక్షాత్కారం కలిగింది.

అందుకే ‘కంటిలో ఒకపండు వెన్నెల కాయుచున్నది’-అంటే మనోనేత్రం విచ్చుకొని, జ్ఞానజ్యోతిప్రకాశం కనుపించింది అని అర్థం.

దానిని నేను చూచాను, అంటుంది ఆ గోపిక.

ఇదే ఈ సుప్రసిద్ధమైన అష్టక పరమార్థం

తెలుగు మాటల తేటలతో, హృదయావర్జక మయేట్లు మనోహరంగా వ్రాసిన పద్యనీరాజనమిది.

# తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణలు

# తెలుగు

ఆర్షధర్మ వైశిష్ట్యాన్ని వివరించే క్రింద గ్రంథాలను పాఠకులకు అందుబాటు ధరలతో తిరుమల తిరుపతి దేవస్థాన ప్రచురణ విభాగం అందజేస్తున్నది.

| | | |
|---|---|---|
| ఆచారములు - ఆడంబరములు | శ్రీ కల్లూరి చంద్రమౌళి | 0-20 |
| ఆండాళ్ వైభవము | ,, | 0-20 |
| అహల్య | శ్రీ సాంప్రతి సురేంద్రనాథ్ | 0-50 |
| ఆళ్వారుల దివ్యవైభవము | శ్రీ టి. రాఘవయ్య | 2-50 |
| అన్నమాచార్యులవారి ఆధ్యాత్మ | స్వరకల్పన: | |
| శృంగారసంకీర్తనలు (స్వరసహితము) | శ్రీ మంచాళ జగన్నాధరావు | 35-00 |
| సంపుటి 1 | సంపాదకుడు: | 35-00 |
| సంపుటి 2 | శ్రీ వేదవ్యాస పురుషోత్తం | 35-00 |
| సంపుటి 3 | | |
| ఆర్షసంస్కృతి | శ్రీ కల్లూరి చంద్రమౌళి | 4-00 |
| అన్నమాచార్య సాహితీకౌముది | డా॥ ముట్నూరి సంగమేశం | 0-75 |
| అన్నమాచార్య చరితం (హరికథ) | విద్వాన్ కనుములూరి శివరామయ్య | 1-50 |
| భక్తపురందరదాసు | శ్రీ ఎస్. బి. ఎన్. భట్టాచార్య | 0-50 |
| భగవత్‌స్తోత్రరత్నమాల | | 1-00 |
| భగీరథుడు | కరుణశ్రీ | 0-50 |
| ధ్రువుడు | శ్రీ డి. నాగసిద్ధారెడ్డి | 0-50 |
| దాక్షాయణి | శ్రీ ఆర్వీఎస్ సుందరం | 0-50 |
| దయాశతకము | శ్రీ కోశియాలం శఠకోపాచార్యులు | 9-00 |
| కల్యాణసంస్కృతి | డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్య | 1-75 |
| కోదండరామ సుప్రభాతం | డా॥ ఎస్. బి. రఘునాథాచార్య | 0-50 |
| ఉషశ్రీ భారతం | | |
| 1 వ భాగము | ఉషశ్రీ | 4-00 |
| 2 వ భాగము | ,, | 5-00 |
| భారతీయ తత్త్వశాస్త్రము | డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ గ్రంథానికి | 5-00 |
| | శ్రీ బులుసు వేంకటేశ్వర్లు అనువాదం | |
| హనుమంతుడు | డా॥ ప్రసాదరాయకులపతి | 0-50 |
| మదాలస | శ్రీ సముద్రాల లక్ష్మణయ్య | 0-50 |
| మన సమస్యలకు భగవద్గీత పరిష్కారములు | డా॥ ఎస్. బి. రఘునాథాచార్య | 1-25 |
| మన ఆలయముల చరిత్ర | శ్రీ గోపీకృష్ణ | 7-00 |
| మహర్షులచరిత్రలు | శ్రీ బులుసు వేంకటేశ్వర్లు | 3-50 |
| నమ్మాళ్వార్ | డా॥ పి. శౌరిరాజన్ | 0-50 |
| నాదయోగి త్యాగయ్య | శ్రీ తిరుమూరు సుధాకరరెడ్డి | 1-00 |
| **పురుషసూక్తం** | **డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్య** | **1-00** |
| **పద్మావతీ శ్రీనివాసం** | **శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి** | **0-20** |

| | | |
|---|---|---|
| పుష్కరవేణి | సంకలనం: డా॥ ఎస్. బి. రఘునాథాచార్య | 0_50 |
| ఋగ్వేదం 1వ భాగము | శ్రీ నేమాని వెంకటనరసింహశాస్త్రి | 100_00 |
| 2వ భాగము | | 100_00 |
| శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం | శ్రీ పి. బాలకృష్ణమూర్తి | 0_50 |
| శృంగార సంకీర్తనలు సంపుటం 22 | పరిష్కర్తలు: రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ,గౌరిపెద్ది | 5_00 |
| ,, 23 | శ్రీ పి. టి. జగన్నాథరావు | 5_00 |
| ,, 24 | శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ | 5_00 |
| ,, 25 | ,, | 5_00 |
| ,, 26 | ,, | 5_00 |
| ,, 27 | ,, | 5_00 |
| ,, 28 | ,, | 5_00 |
| శ్రీరామచంద్రుడు | శ్రీ టి. నరసింహాచార్యులు | 1_00 |
| శ్రీ వేంకటేశ్వర శతకం | ముకుందదైవజ్ఞులు | 0_25 |
| స్తోత్రరత్నములు | | 2_00 |
| సువర్ణపుష్పమాల | డా॥ ఎస్. బి. రఘునాథాచార్య | 0_25 |
| శ్రీమద్భాగవత పురాణపరిశీలనము | శ్రీ డి. నాగసిద్ధారెడ్డి | 1_00 |
| శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యం (వచనం) | | 2_00 |
| ,, శ్లోకాలు 1 | | 5_00 |
| ,, శ్లోకాలు 2 | | 4_25 |
| శ్రీసూక్తం | డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్య | 0_70 |
| షోడశరామాయణ రహస్యాలు | శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ | 5_00 |
| శ్రీనివాస బాలభారతి కథామంజరి | | 4_00 |
| సుందరకాండ | ఉషశ్రీ | 4_25 |
| సావిత్రి | శ్రీ సముద్రాల లక్ష్మణయ్య | 0_50 |
| తత్త్వదీపిక | శ్రీ చిన్న శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామి | 0_75 |
| త్యాగరాజకీర్తనలు సంపుటి 1 | సంకలనం: | 35_00 |
| సంపుటి 2 | కళాప్రవీణ శ్రీ మంచాల జగన్నాథరావు | 35_00 |
| సంపుటి 3 | ,, | 35_00 |
| సంపుటి 4 | ,, | 35_00 |
| వేదములు | శ్రీ కల్లూరి చంద్రమౌళి | 0_50 |
| వ్యాసరాయలు | శ్రీ సుదర్శనభట్టర్ | 0_50 |
| వైరాగ్యశతకం | శ్రీ ఏనుగు లక్ష్మణకవి | 0_20 |
| వేదకల్పతరువు | శ్రీ మహావాది వేంకటరత్నము | 5_00 |
| విష్ణుసహస్రనామం | ఆర్గస్ సెంట్రల్ ఎంటర్‌ప్రైజెస్ | 1_00 |
| శ్రీ వేంకటేశ్వరస్వామి | ,, | 1_00 |
| బుద్ధిశాలిమంత్రికథలు | ,, | 1_00 |
| హరిశ్చంద్ర | ,, | 1_00 |
| తాళ్ళపాకకవుల కృతులు | డా॥ వేటూరి ఆనందమూర్తి | 30_00 |
| ,, పదకవితలు | ,, | 45_00 |
| వేంకటేశ్వర సహస్రనామ్ | శ్రీ యామిజాల పద్మనాభస్వామి | 3_00 |
| బాలకృష్ణుడు | అమరచిత్రకథా ప్రచురణలు | 2_00 |
| భగవద్గీత | ,, | 2_00 |
| కృష్ణుడు - నరకాసురుడు | ,, | 2_00 |

# అన్నమయ్య లోకజ్ఞత

అన్నమయ్య వైష్ణవమత భక్తిసిద్ధాంతాల్ని పండితులకేగాక పామర జనుల లోను,ఆయా వృత్తులవాళ్ళలోను ప్రచారం చేయతలపెట్టాడు. అందుకు వారి వృత్తి విశేషాల్నే ఆధారంగా తీసుకొని భగవదంశాల్ని ప్రబోధిస్తూ సంకీర్తన రచన గావించాడు. ఈ వృత్తిపాటల్లో వర్తక వ్యాపారానికి సంబంధించిన నేతబేహారి, ఓడ బేహారి, వడ్డీవ్యాపారి, వైద్యుడు, పూత వృత్తులవాళ్ళు, చల్లఅమ్మకపు గొల్లెత, సోదె చెప్పే ఎరుకత, కమ్మరి, కుమ్మరి మొదలైన వృత్తుల విశేషాలు కన్పిస్తాయి. ఈ వృత్తులవాళ్ళంతా ఒకచోటనే స్థిరపడి బ్రతికే వాళ్ళుకాక ఒక ప్రదేశం నుంచి ఇంకొక ప్రదేశానికి సంచరిస్తూ జీవనం సాగిస్తారు. కాబట్టి వీళ్ళద్వారా భక్తితత్త్వాలు కూడ సులభంగా వ్యాప్తం కాగలవనే దృష్టితో అన్నమయ్య ఈ వృత్తుల్ని సంకీర్తన రచనకు వినియోగించుకున్నాడు. ఈ వృత్తి గేయాల్లో కొన్నింటికి ఉదాహరణ:

## నేతవృత్తి :

వ్యవసాయం తర్వాత అతిముఖ్యమైంది నేతవృత్తి. మనిషి జీవించడానికి అత్యవసరమైన వాటిలో ఆహారం ప్రధానమైందికాబట్టి అన్నమయ్య వ్యవసాయవృత్తిని ఎక్కువగా వర్ణించాడు. అన్నమయ్య జీవించిన ప్రాంతంలోను, దానికి చుట్టుప్రక్కల ప్రాంతాల్లోను నేతపరిశ్రమ వ్యవసాయం తర్వాత విరివిగా సాగుతుండేది. అందుకే అన్నమయ్య వస్త్రోత్పత్తికి ఆధారమైన నేతపనికి ప్రాధాన్యమిస్తూ అందలి అంశాల్ని భగవత్పరంగా పోల్చిచెప్పాడు.

"వాడలవాడల వెంట వాఁడెవో వాఁడెవో
నీడనుండి చీరలమ్మే నేత బేహారి"

ఈ కీర్తనలో పంచభూతాల్ని పలువన్నెనూలుగా, గుణాలు, కర్మాలు, చేతల్ని నూలుకండెలు, కుచ్చులుగా పోల్చికర్మాన్ని వెలకట్టి మైలసంతలో భగవంతుడు నేత వ్యాపారం చేయడం కన్పిస్తుంది.

"వమ్ముల రాట్నము నిలువక గుంద్రము నిల్చునా
వమ్మినీయవ్వల లేక భవములు మానునా"

ఈ అంశాల్ని ఆధారంగా తీసుకొని భగవంతుడు లేనిదే లోకాలు నిలువవని ఉద్బోధించాడు.

## కమ్మరి :

మానవజీవితానికి నిత్యావసరమైన వృత్తులలో అతిముఖ్యమయింది వ్యవసాయం. ఈ వ్యవసాయానికి అవసరమైన ఇనుప పనిముట్లను, కొయ్యపనిముట్లను తయారు చేసేవాళ్ళు కమ్మరివాళ్ళు. వీళ్ళనే కంసాలె వాళ్ళు అని కూడా అంటారు. వీళ్ళలో లోహపు పనివాళ్ళు కొయ్యపనివాళ్ళు అని ఇరువర్గాలున్నారు. అన్నమయ్య లోహపు పనివాళ్ళను ఆధారంగా తీసుకొని ఆ పనిలోని అంశాల్ని ఆధ్యాత్మిక విషయాలతో జోడించి చెప్పాడు.

అన్నమయ్య ఎంతటి రసజ్ఞుడో అంతటి లోకజ్ఞుడు కూడా! అన్నమయ్య కీర్తనలో కానవచ్చే వివిధ వృత్తుల ప్రజల జీవితాను శీలనమే అందుకు సాక్ష్యం.

"మెఱుగఁ గ్రూరత్వమెప్పుడుఁ గొలిమిలో
కఱు పదెనెకడఁగాఁగిని"

క్రూరత్వం రాక్షస కృత్యం. అందుకే క్రూరత్వాన్ని కొలిమిలో కాల్చబడే కఱుతో పోల్చి చెప్పాడు. ఇలాంటి కీర్తనలు అన్నమయ్య రచనలలో చాల కన్పిస్తాయి.

## కుమ్మరి :

మట్టితో పాత్రల్ని తయారుచేసి వాటిని అమ్ముకొని బ్రతుకును సాగించేవాడు కుమ్మరి. పంచమ్మలు విలువైన లోహపు పాత్రలను కొనగలరు. కాని సామాన్య ప్రజలకు మట్టిపాత్రలే శరణ్యం. అయినా వేసవికాలంలోను వివాహ సమయాల్లోను, వ్యక్తిమరణానంతర కార్యాదుల్లోను ఈ మట్టిపాత్రల ప్రాధాన్యమెట్టిదో అందరికీ తెలిసిన విషయమే. పైగా అనంత అష్టైశ్వర్యాలతో తులతూగుతున్న స్వామివారికి ప్రతి నిత్యమూ నైవేద్యమిచ్చేది కూడ మట్టిపాత్ర తోనే. అందుకు కారణం మట్టిపాత్ర నిర్మలత్వానికి, పవిత్రతకు సూచకమని చెప్పుకోవచ్చు. ఒక కుమ్మరి భక్తుడు నిర్మల మనస్కుడై మట్టిపూలను సమర్పిస్తే భగవంతుడు వాటినే స్వీకరించాడు కానీ అహంకార చిత్తంతో బంగారు పుష్పాలు సమర్పించిన భక్తుని అనుగ్రహించలేదు. ఈ దృష్టితో అన్నమయ్య కుమ్మరి దాసుల భక్తి తత్పరతను వర్ణించి వీళ్ళ జీవనాధార వృత్తిలోని అంశాల్ని ఆధారంగా తీసుకొని భగవద్విషయాల్ని వ్యక్తం చేశాడు. దీనివల్ల తన కాలంలో కుమ్మరి వృత్తికి ఎంతటి ప్రాధాన్యత వుండేదో తెలుస్తుంది.

"ఇమ్మైన పాపంబు లెన్నవలసినఁ బ్రాణి
పమ్మితంబునఁ జేయఁజాలఁగాకేమి
కుమ్మరి నొక యేడు గుదియ కొకనాఁడౌను
వమ్మితలఁచిన విష్ణునామంబు చేత

కుమ్మరి ఎన్నో రోజులు శ్రమించి మట్టిపాత్రల్ని తయారుచేసినా వాటిని గుదియతో ఒక్కరోజులో పగలగొట్టవచ్చు. అలాగే జీవుడు ఏండ్లకొద్దీ ఎన్నిపాపాలు చేసినా విష్ణునామ స్మరణచే అన్నీ క్షణ కాలంలో పరిహారమౌతాయని ఈ కీర్తనలోని సారాంశం.

"కుమ్మరవాఁడు లేక కుండ దాఁబుట్టీనా
నెమ్మి నీవు పుట్టించక నేనే పుట్టితినా"

అనే కీర్తనలో కుమ్మరివాడు మట్టిపాత్రలను సృష్టించినట్లు భగవంతుడు జీవుల్ని సృష్టిస్తాడని భగవంతునికి, కుమ్మరికి సమన్వయం చేయడం కన్పిస్తుంది.

## సోదివృత్తి

సోది అనేమాట శోధన శబ్దభవం కావచ్చు. శోధనమంటే అన్వేషించి సత్యాన్ని తెలుసు

కోవడం. సోది చెప్పేవారు అంతరంగిక మైన రహస్యాల్ని తమ అనుభవం చేత గాని, దైవకృప వల్లగాని గుర్తించి ఇత రులకు చెప్తుతారు.

"ఎదుకచెప్పే పీయువృమెల్లా నెరుఁగుదు
మెరుఁగైన పొమ్మొలిర్పి మెచ్చువయ్యావమ్మ"

ఈ కీర్తనలో సోది చెప్పించు కొనేవాడు శ్రీ వేంకటేశ్వరుడు. వేంకటేశ్వరుని వల చింది పద్మావతి. శ్రీ వేంకటేశ్వరుని దివ్య మంగళాకారాన్ని వర్ణించడం ఈ కీర్తనలోని బాహ్యార్థం. పూతనసంహారం, కాళీయ మర్ధనం మొదలైన అవతార విశేషాల్ని కీర్తించడం అంతరంగిక విషయం.

## చల్ల అమ్మకం

అన్నమయ్య కీర్తనల్లో ఈ చల్ల అమ్మ కపు పాటలు చాలా ఉన్నాయి.

" పిల్లగ్రోవి పట్టుమంటా బెరరేఁటివి మా
గొల్లవారి పిల్లంగ్రోవి కోరోచల్లా"

ఈ కీర్తనలో చల్ల అమ్మకపు వృత్తిచేసి జీవించే ఒక గొల్లపడుచు వీధులవెంట పాట పాడుతూ చల్ల అమ్మడం కన్పిస్తుంది.

## చేతివృత్తులు

లౌకిక, అధ్యాత్మిక విషయాలతో సమ న్వయించి చెప్పబడిన చేతివృత్తుల అంశా లతో కూడిన పాటలుకూడ అన్నమయ్య రచనలలో కన్పిస్తాయి.

లలన జవ్వనాలు లక్కపూసకపురులు
శ్రీకాంతునిపై జేయని భక్తులు
చెంబుమీఁది కనకపుఁబూత

పై కీర్తనల్లో లక్కపూస కపురులు, కన కపుపూత మొదలైన చేతివృత్తుల ప్రస క్తులు ఉన్నాయి. దీనివల్ల తన కాలంలో అన్ని వృత్తులతోపాటు పూతపనులు, పూసల అల్లికలు మొదలైనవికూడా ఉండే వని తెలుస్తుంది.

## వర్తకం

వర్తకం సముద్రవర్తకమనీ, భూమి మీద వర్తకమని రెండు రకాలు ఉంటాయి.

వ్యాపారం కాలానుగుణంగా సాగుతుం టుంది. సముద్ర వ్యాపారంలో రేవుల్లో సరుకులు దించుకొంటూ, వస్తువుల ధరలు గమనించుకొంటూ వ్యాపారం సాగించాలి. ఈ విషయాల్ని ఆధారంగా తీసుకొని అన్నమయ్య-

"కాంతల మానవనేటి కరవట్నాలకు దిగె
మంతనాన జీవుఁడనే మంచి మరకాఁడు"

అనే కీర్తనలో వర్ణించాడు. సంసార సాగ రంలో దేహమనే ఓడపై పాపపుణ్యాలనే సరుకుల్ని నింపుకొని జీవుడనే మరకాడు గమ్యాన్ని చేరడాన్ని గూర్చి, నిట్టూర్పులనే తుఫాను గాలులు వీస్తున్నప్పుడు కోరికలనే చావలెత్తి భగవన్నామంతో బరువుగా చేసు కొని ఓడను జాగ్రత్తగా నడపడం మొద లైన అంశాల్ని పారమార్థిక జీవితానికి పోల్చాడు.

ఓడ వ్యాపారస్థుడు ధనాన్ని దాచు కొన్నట్లు జీవిని భగవంతుడు దాచుకోవా లని -

''వోడబేరమాదేవాఁడు వొకదరి చేరిచి
కూడిన యర్థముగాచుకొనీనట — అంటాడు

వడ్డీవ్యాపారాన్ని ఆధారంగా తీసుకొని-

"కూడఁగానే ఆసలెక్కి కోరిన నీ రతులను
వాటికెఁగూడి వచ్చిన వడ్డీవలెను

అని నాయకుని శృంగారరతుల్ని వర్ణిం చాడు. ఇనుమడించిన వలపు వడ్డీలాగా అధికంగా లభించేదని -

"కలసి నీ విద్దరినిఁగాఁగిలించు కొనవయ్య
వలపు లినుమడించి వడ్డివచ్చెనీకును

అని పోల్చాడు. ఇలా వ్యాపారానికి సంబం ధించిన పాటలు అన్నమయ్య రచనల్లో అనేకం కన్పిస్తాయి.

## వైద్యవృత్తి

శారీరక బాధల్ని ఆ బాధల నివారణను గూర్చి తెలియజేసేది వైద్యవృత్తి. రోగాల్ని నివారించడానికి ఔషధాలు, అను పానాలు, ఉపశాంతికర పదార్థాలు ఆయు ర్వేదంలో చెప్పబడినాయి. ఆయుర్వేదంలో భస్మాలు, లేహ్యాలు, చూర్ణాలు, రసాయ నాలు, కషాయాలనేవి రోగనివారణ మందులు. మందు పుచ్చుకొన్న తర్వాత దానివల్ల నయం కన్పించడం, రోగదోషాలు పోవడం, భయాదులు పోవడం జరుగు తుంది. ఈ వైద్యశాస్త్ర విషయాల్ని అన్వ యింప జేస్తూ అన్నమయ్య ఈ క్రింది కీర్తన వర్ణించాడు.

"శ్రీహరిపాద తీర్థమే చెడనిమందు
మోహపాశాల గోసిమోక్షమిచ్చేమందు"

శ్రీహరి పాదతీర్థమనే మందు భస్మాల వలె కారమైంది కాదని చల్లనిదని, చూర్ణాల వలె నూరని, కాచని నున్ననిమందని కషా యాల్లోలాగా వేరు వెల్లంకులు కలపనిదని మందుల లక్షణాల్ని ఆధారంగా తీసుకొని శ్రీహరి పాదతీర్థమనేమందు సమస్త బాధల్ని నివారిస్తుందని వర్ణించాడు.

"కొనరో కొనరో మీరు కూరిమిమందు
పునికి మనికి కెల్ల నొక్కటేమందు"

అనే కీర్తనలో కూడ వైద్యవృత్తి ఆధా రంతో భగవన్మహిమను కీర్తించడం కన్పి స్తుంది. ధ్రువుడు, ప్రహ్లాదుడు, నారదుడు మొదలైన భక్తాగ్రేసరులందరు కొన్నటు వంటి ఉత్కృష్టమైన మందునే కొనండి అని పామర ప్రజలకు ఉద్బోధించాడు. భౌతికమైన మందులు మనిషికి శారీరక రోగాల్ని నయం చేయవచ్చుకాని భగవ ద్భక్తి అనే మందు జననమరణాలనే రోగాల్ని నశింపజేసి శాశ్వత సౌఖ్యాన్ని ప్రసాదిస్తుందని ఈ కీర్తనలోని అంతరార్థం ఇలాంటి కీర్తనలు అన్నమయ్యరచనలలో చాలా కన్పిస్తాయి.

ఇలా పరిశీలించినట్లైతే భక్తునికి కుల భేదాలుగాని, వృత్తిభేదాలుగాని లేవని చెప్పడం అన్నమయ్య ఉద్దేశ్యమని తోస్తుంది. అంతేగాక కవికి అవసరమైన లోకజ్ఞత అన్నమయ్య రచనలలో పుష్క లంగా ఉందని తెలుస్తుంది. సమాజానికి వివిధ వృత్తులవాళ్ళు మూలస్తంభా లని నిరూపించడం వ్యక్తమవుతుంది. అన్నమయ్యలోని ఈ వృత్తులవాళ్ళ విశే షాంశాలన్నీ తర్వాత వచ్చిన వాగ్గేయకారు లందరికీ మార్గదర్శకాలైనాయని చెప్ప వచ్చు.

— కుమారి పొన్నా లీలావతి

(15 వ పేజీ తరువాయి)

ప్రేమ, శాంతి, విశ్వమానవ సౌభ్రాతృత్వము, నిత్యపరిణామశీలములు నిసర్గ గుణములగుటచేతను "అహింసో పరమో ధర్మః" అను సూక్తి ప్రధానముగా కలిగిన బౌద్ధమునకు ఆశ్రయమిచ్చి, ఆదరించి అవలంబించి యుందురు.

## బౌద్ధము — శిల్పకళ

బౌద్ధమత ప్రవక్తల ప్రబోధముకన్న ఆ మత ప్రచారమునకు ఆలంబనమై శిల్పకళ మిన్నగ ప్రజల నాకర్షించినది. భాష కన్న భావముమిన్న యనునది శిల్పముల విషయమున యధార్థముగ కన్పట్టును. ఈ శిల్పములు సజీవములు. ఇవి ప్రాణులు గాని ప్రాణులు, జీవులుగాని జీవులు, చిరాయువులు, అనిర్వచనీయ ఆనంద ప్రదాయకములు. శాంతి, దాంతి, అహింస, ప్రేమాదులు ఈ శిల్పములందు గోచరించును. ఇట్టి శిల్పశైలి అమరావతి శైలి యగుట ఆంధ్రులకు గర్వకారణము. శిల్పకళను సాధనముగ జేసికొని బౌద్ధులు తమ మత ప్రచారము గావించిరి. లలిత కళలను సాధనములుగ జేసికొని తమ తమ అభీష్టములను సిద్ధింప జేసికొనుట ప్రాచీన కాలము నుండి కద్దు. పాల్కురికి సోమనాధుడు కవిత్వమును సాధనముగ జేసికొని వీరశైవ మతమును ప్రచారము గావించెను. కూచిపూడివారు క్రీ. శ. 1506 లో సంబేట గురవ రాజు దుష్కృత్యములను వీరనరసింహ రాయల సమక్షమున కేళికగ ప్రదర్శించి ప్రయోజనమును సాధించుట పూర్వోక్తములు.

ఈ విధముగ బౌద్ధశిల్పములకు తావై చరిత్రకారులకు ఆధారముల నొసంగుచు సుప్రసిద్ధమైన చరిత్రను సృష్టించుకొనిన శిల్పకళాక్షేత్రము ఘంటసాల.

## శ్రీకాకుళము :

పూర్వము నిశంభుడనే లోకకంటకుని పీడనుండి ఆంధ్రప్రాంతమునకు విముక్తి నొసంగిన ఒకానొక శాతవాహన ఆంధ్ర రాజునే అనంతరకాలమున దైవముగా భావించి కొలుచుచుండిరని ఒక గాథ కలదు. ఆ రాజు ఆంధ్ర నాయకస్వామి అనే తెలుగు వల్లభుడని, తెలుగురాయుడని, ఆంధ్రవిష్ణువని వ్యవహరింతురు. ఆంధ్రులకు రాజధానియయి ఆంధ్రమహావిష్ణువనబడు శ్రీకాకుళేశ్వర స్వామికి నివాసమైనది శ్రీకాకుళము. ఈ దేవాలయము దేవదాసీల ఆరాధనా నృత్యములకు రంగస్థలమైనది. స్వామి తిరునాళ్ల సమయముననేకాక ప్రతినిత్యము దేవదాసీ సమూహము 'నృత్యం దర్శయామి' యని తమ నృత్యముతో స్వామిని యారాధించిరని చరిత్రవలన తెలియుచున్నది. నేటికిని యిట దేవదాసీలు కలరు. సశాస్త్రీయ దేవదాసీ నృత్య సంప్రదాయమునకు పీఠమైనది శ్రీకాకుళము. కృష్ణవేణీ ప్రవాహతరంగముల వలని పావిత్ర్యము కలిగి అష్టోత్తర తిరుపతులలోను మహిమాన్వితమైన మహాపుణ్యక్షేత్రము శ్రీకాకుళము.

ఒకనాటి యాంధ్రుల రాజధానియయిన శ్రీకాకుళము నేటొక క్షుగ్రామముగ మిగిలి యున్నది. కాని శ్రీకాకుళేశ్వరస్వామి ఆలయము శతాబ్దముల తరబడియున్నను చెక్కుచెదరలేదు. నాటి రాజుల శిల్పకళాభిరుచికి; శిల్పుల నైపుణ్యమునకు ఉదాహరణముగ నిలిచియున్నదీ దేవాలయము. ఈ స్వామికి కోదండరామన్న దేశాయిగారు సుమారేడెనిమిది వందల ఎకరముల సుక్షేత్రమైన మాగాణినిచ్చిరి. దీనికి చల్లపల్లి జమిందారులు ధర్మకర్తలు. ఈ పుణ్యక్షేత్రమున ముక్కోటి వైశాఖ పూర్ణిమ మహోత్సవములు నయనానంద దాయకములు. పుణ్యప్రదములు. ఈ తిరునాళ్లే శ్రీనాథ కవిసార్వభౌమునిచే వర్ణింపబడినవి. ఈ తిరునాళ్లలో స్థానిక దేవదాసినుల నృత్యప్రదర్శనములే కాక కూచిపూడి భాగవతుల ప్రదర్శనములను వార్షికములుగ భక్తులకొఱకేర్పాటు చేయుదురు.

కొందరీ శ్రీకాకుళము శ్రీకృష్ణదేవరాయలకు రాజధానియయినదని అందురు. ఏది ఏమైన శ్రీకాకుళము ఆంధ్రదేశములోని ఒక ప్రముఖ ప్రాచీన దేవదాసీ నృత్య సంప్రదాయమునకు ప్రతిభా సంపన్నులైన కవివరేణ్యులకు నివాసమై చరిత్ర ప్రసిద్ధమైనది.

## గడ్డిపాడు : (హనుమంతరాయపురము)

సంగీత నృత్య నాటక యక్షగానములకు కూచిపూడి ఎట్లు ప్రసిద్ధి నొందినదో అటులే పగటి వేషములకు (బహురూపక కళకు) ప్రసిద్ధమైనది గడ్డిపాడు. ఈ ఊరు కూచిపూడికి పశ్చిమదిశగ నాలుగు క్రోసుల దూరముననున్నది. ఇందలి బ్రాహ్మణు లందరు వేదాధ్యయన పరులు. ఈ గ్రామమునందు కణుపూరివారు; కవులవారు; కూచివారు; వల్లూవఝులవారు; బాపట్లవారు; బెల్లంకొండవారు; శ్రీకారంవారు; యిత్యాది వంశస్థులుండెడివారు. బ్రాహ్మభాగవతులు నివసించు గ్రామమగుటచే గడ్డిపాడు అగ్రహారమైనది. ప్రస్తుతము పైనపేర్కొనబడిన వంశములలో ఒకరు ఇద్దరు వినా మిగిలిన వారెవ్వరు ఇందులేరు. వీరు కూడ ప్రస్తుత



కూచిపూడి శ్రీ సిద్ధేంద్రయోగి ఆరాధ్యదైవం రాజగోపాలస్వామి



శ్రీ సిద్ధేంద్ర నాట్య కళాక్షేత్రము — కూచిపూడి.

మీ ప్రదర్శన లిచ్చుటలేదు. గడ్డిపాడున పగటివేషములు నేతిబీరకాయ చందమున నున్నవి. ఈ గ్రామీణులా గ్రామనామమునే హనుమంతరాయపురముగ మార్పు జేసి కొనిరి.

ఈ గడ్డిపాడు పగటివేషధారులకు గురువు వల్లావఝుల వేంకటరామయ్య. వీరు మైసూరు ప్రాంతము నుండి వచ్చి గుంటూరు మండలములోని రేపల్లెలో స్థిర నివాస మేర్పరచుకొని గడ్డిపాడు బ్రాహ్మణులకు పగటివేషములు (బహురూపక కళ) ను నేర్పి ఖ్యాతిగాంచిరని కొందరు చెప్పుదురు. కాని గడ్డిపాడు భాగవతులీ బహురూపక కళను రూపక కళయందు నాట్యకళయందు నిష్ణాతులు కళావేత్తలు అయిన కూచిపూడి భాగవతుల నుండి అభ్యసించిరని కొందరందురు. ఏదిఏమైన గడ్డిపాడొక బహురూపక కళాక్షేత్రమగుట నిర్వివాదాంశము.

కూచిపూడిలో నాట్య నాటక యక్షగాన విద్యలలో ప్రావీణ్యము లేనివారు సామాన్యమైన ప్రజ్ఞ కలవారగుటచే వారీ బహురూపక కళను చేపట్టిరి. కూచిపూడి భాగవతులకేనాడీ భరత విద్య అబ్బినదో ఆనాటి నుండి పగటి వేషములును ప్రచారములోనికి వచ్చినవి. కూచిపూడివారు ప్రదర్శించు బైరాగి వేషకథ; బుడబుడక్కలవేషకథ; శక్తివేషకథ; ఇత్యాది కథలనే గడ్డిపాడు వారు ప్రదర్శించెడివారు. ప్రస్తుతము గడ్డిపాడునందు పగటివేషముల మేళములులేవు. కాని కూచిపూడియందీకళ నేటికిని సజీవమై ప్రచారమగుచు ప్రజలకు విజ్ఞాన వినోదముల నందించుచున్నది.

ఈ విధముగ కూచిపూడికి పరిసర కళాక్షేత్రములైన మొవ్వ, ఘంటసాల, శ్రీకాకుళము, గడ్డిపాడు అన్నియు సుమారొక పదిమైళ్ళ పరిధిలో కేంద్రీకృతమై దివిసీమను దివ్యసీమగ చేయుచున్నవి. ఇట్టి మహాభాగ్యమొక దివిసీమకే దక్కినదనుట నతిశయోక్తిగాదు. ఈ కళాక్షేత్రములన్నింటికి కూచిపూడి కళాకేంద్ర స్థానమై రాజధానివలె విరాజిల్లుచున్నది. పైన పేర్కొనబడిన కూచిపూడి పరిసర కళాక్షేత్రములలో ఒక్క కూచిపూడిలో వినా లబ్ధప్రతిష్ఠులు అల్పముగ కన్పట్టుదురు. కూచిపూడి కళాకారులు శతాబ్దములు అవిచ్ఛిన్నముగ నాకళననుష్ఠించుచు మండలాంతరములకు, రాష్ట్రేతరములకు దేశాంతరములకు, ఖండాంతరముల వరకు గొనిపోయి అట ప్రతిష్ఠించి కూచిపూడి నాట్యకళా భారతిని ఆవిష్కరించి ప్రచారముగావించుచుండిరి. దక్షిణాదిలోని మేలట్టూరు నాట్య సంప్రదాయము కూచిపూడి నాట్య సంప్రదాయపు వారసత్వము కలిగినట్టిదే. కూచిపూడి కళాకారులలో కొందరు ప్రచారార్థమరిగి యట స్థిరపడిరి. కర్నూలు మండలములోని బనగానపల్లి నవాబు కోరికపై కొందరు అక్కడ స్థిరపడిరి. అచ్యుతప్ప నాయకుని ఆస్థానమున స్థానము సంపాయించి అక్కడ కొందరు స్థిరపడిరి. కూచిపూడి పరిసర కళాక్షేత్రములకేకాక ఆంధ్రుల సంస్కృతికి ఆంధ్రుల జాతీయ నాట్యకళకు కేంద్రస్థానమైతన కళాసురభిళములనుఖండాంతరములకు గొనిపోవుచున్నదనుటకు సాక్ష్యం కొద్దిమాసముల క్రిందటి డా. శ్రీ వెంపటి చిన్నసత్యంగారి అమెరికా దిగ్విజయ కళా జైత్రయాత్ర. అంతేకాదు. ప్రపంచములోని చాల ఖండములందు కూచిపూడినాట్య అకాడమీలు స్థాపించబడి శిక్షణతో ప్రదర్శనలతో ప్రచారము జరుగుచుండుట అవశ్యము ప్రశస్త్యమైన విషయము.



కూచిపూడి నర్తకి శ్రీమతి వి. బాల

(11 వ పేజీ తరువాయి)

డెంత వెదకిన దొరకదే
అల కంతు దివదు జయంతుడే ‖ ఇంత ‖

**కేశవ:** కాంతలారా తొల్లి కల్పాది
క్రమ్మరం గనుగొంటినే నే
యింతికై తపముంటి నేడు
ఫలించె మిన్నుల నంటిలిక్. ‖ కాంత ‖

**కథక:** అనుచు కెనుదీయక మేరమీరి దగ్గరికివచ్చు బాలసి, బాలికామణి లాతని నొక్కపెట్టిన కిలకిలనవుచు రాలి రుప్పుటయు అశ్వరాజమ్ము వదలినంతట శ్రీనివాసుండును క్షతగాత్రుండై తూలిపడుచు చేలిఫల్లమ్ము నూదికొనుచు, అల్లినల్లన పర్వతాగ్రమ్ముచేరి మస్తక వ్యథాకలితుండై అన్నపానమ్ములుడిగియున్నంత–

**సూత్ర:** అవును, కుడిచికూర్చొక తనకెందుకు చెప్పు రాచబిడ్డతో సరసాలు?

**కథక:** అపుడు వకుళమాలిక చేరనరిగి.

(కమాన్ – జంపె)

**వకుళ:** ఏలరా యన్న నీ కిట్టి పాటు ఘటిల్లె
కూళలెవ్వరు నిన్నురాలరువ్విరిరా ‖ ఏలరా ‖
పువువంటి నీమేను పుండ్లుగా గారింప
నెవరికి చేయాడె నేమిసేతునురా ‖ ఏలరా ‖
గతిమాలి ఇటుల నొక్కరి జోలికింబోక
బ్రతుకగా దైవ మోర్వకపోయెగా కొడుక ‖ ఏలరా ‖
విందుగా నా కనుల ముందు తిరిగే కూన
ఎందు కేగితి వేట కీపాటు కొరకేన? ‖ ఏలరా ‖

**కథక:** అని శ్రీనివాసుని యొడలెల్ల నిమిరి, సేదదీర్చి నివ్వరి యన్నము పాలలోమెదిపి తినిపింపబోవ, అతండు తినక శూన్యవిలోకనంబుల దిలకించుచు, నిట్టూర్పు చుండ, ఆ యవ్వ పెక్కుభంగుల నూరార్చుచు నేమను చున్నది–

**వకుళ:** నాయన్నవుగా! నీ మనసువిప్పి చెప్పగదోయి కన్నయ్యా! ఇంత నివ్వెరపాటు నీ.కేలనయ్యా? కానలో బీతుగొంటివో, భూతం సోకిందో, కూడు నీళ్ళు మాని ఈ నిర్భాగ్యురాలిని హింసింపకోయీ! నీ మన సులో ఏమైనా తలచితివో! ఎవరినైన వలచితివో, ఏమరుపాటుమాని, ఇదిగో నా చెవిలో చెప్పరన్నా, నా కన్నవుగా –

**కథక:** అనుచు బుజ్జగింప ఎట్టకేల కాతండు నడచిన వృత్తాంత మెల్ల వినిపించి ఏమనుచున్నాడు –

**కేశవ:** ఆ పద్మాక్షిని పెట్టబట్టనిచో నేను బ్రదుకనవ్వా! దానినెట్లు కూడుస్తావో నీదే భారం.

(సైంధవి – చాపు)

ఏమని చెప్పుదునే
ఆ భామ చక్కదనమేమని చెప్పుదునే
వామలోచన సుధామయ వీక్షలు
కామకోటి జనకము లతిలోకము లేమనిచెప్పుదునే ‖ఏ‖

సుదతి లేనగవు సొలపున విరజా
జడి వెలికమ్ములు కదలు పదిపదులు– ‖ ఏమని ‖

**వకుళ:** అయ్యో, కన్నయ్యా! ఎంతకోరిక కోరితివోయీ! రాచకూతురుపై బాళి నీకేల పుట్టిందిరా తండ్రీ! ఇల్లా? వాకిలా? నిరుపేదలం, మనమెడ? ఆ తల్లి ఏడ? ఆ తల్లినెట్లు తెత్తును? ఏమిసేతును?

**కేశవ:** అవ్వా, ఎందుకధైర్యపడతావు, నీకో రహస్యం చెప్పేను వినుకో.

ఆ తరలాక్షి కంటపడినప్పుడె అంబుధి దాటినట్లు, దు
ర్జాతుల దైత్యులం దునిమి సాధ్విని నేగయికొన్న
యట్లు, క
న్యాతిలకమ్ము నగ్నిశిఖలందు పరీక్షయొనర్చినట్లు, నా
కై తపియించి కన్నెయిటు లాయితమైనటులాయె
నెమ్మదిన్

**సూత్ర:** ఏమయ్యోయ్! మీ శ్రీనివాసమూర్తికి బొత్తిగా మతి పోయినట్లుందే? సముద్రం దాటడమేమిటి, కన్యను అగ్నిపరీక్ష చేయడమేమిటి? ఆ కన్య తనకోసం పుట్టడ మేమిటి?

**కథక:** అవు నవును. మీ రాక్షేపిస్తారనుకుంటూనేవున్నా నేను. ఆ తల్లి లక్ష్మీఅమ్మవారే అనుకున్నాగాని యీ దేవ రహస్యం నాకుమాత్రం ఏం తెలుసు? ఆనాడు రావణా సురుడు సీతమ్మవారి నెత్తుకపోవడానికి వచ్చినపుడు, అగ్నిదేవుడు సీతమ్మవారిని తనలో దాచుకొని, వేద వతి అనే కన్యను రావణున కప్పగించాడు. రావణుడు సీతమ్మనే ఎత్తుకపోయా ననుకున్నాడు. శ్రీరాముల వారు రావణసంహారంచేసి విడిపించిందా వేదవతినే. ఆ కన్యనే అగ్నిపరీక్ష చేయబోతే అపుడు సీతాదేవివచ్చి యథార్థం మనవిచేసి, వేదవతిని భార్యగా గ్రహించ

వరిసించదని వేడుకొంది. శ్రీరామచంద్రుడవానన్నాడు కదా! నేను ఏకపత్నీవ్రతుడ్ని. ఈ జన్మలో ఆమెను గ్రహించలేను. నేను వేంకటాద్రిపై వెలసి యామెను పెట్టబట్టుతామన్నాడు. ఆవిడే యీ పద్మావతి. ఇదండీ కథ.

సూత్ర: ఏమో అనుకొన్నాను - నువ్వు గట్టివాడవే సుమా. ఎక్కడికక్కడి కేదో ముడిపెట్టుతూనే ఉన్నావు. సరే కానీ -

కథక: శ్రీనివాసు డీరహస్య మెరిగించినంత వకుళమాలిక వైష్ణవదాసి వేషమూని, నారాయణవనమ్మున కరిగె, నంత శ్రీనివాసుండు శిరసున గద్దెబుట్టతో, కరమున టింగుబుర్రతో, చంకను బుడుతనుదాల్చి, ఎరుకయై బయలుదేరెనట -

సూత్ర: మహానుభావుడాయన ఒకటికాదు. పదివేషాలు వేస్తాడు.

కథక: అచట నారాయణవనమ్మున పద్మావతీకన్య ఆరామమ్మున శ్రీనివాసుని కాంచి వచ్చినది మొదలుగా, విరాళిగొని కన్యాంతఃపురమ్మున పూలసెజ్జ బొరలుచు తనలో దానేమని విలపించుచున్నది.

పద్మావతి:

పూవులతోట కేమిటికి బోయితి, బోయినదాన నచ్చటం
దీవయుయేల లెక్కి సుదతీమణులం గవగూడి
యూగితిన్,
పూవులతూపు వేల్పువలెబోయు యతండటకేల రావలెన్,
తీవరకత్తెనై అతని తేజిని రాళ్లొని ఏల రువ్వితిన్?

(కేదారగౌళ - మిశ్రగతి)

ఆయలరు విలుకాడొ అతని చెలికాడొ
బోయవలె వచ్చి కొనిబోయెనే నామనసు ॥ఆయలరు॥
మాయగా, నునులజ్జపాయగా, వెడకినుక
పూని పూవులరువ్వువాని రువ్వితి రాల ॥ఆయలరు॥
పట్టుకొనగాబోయి పట్టుపడినట్లాయె
అయ్యయో ఈగుట్టు అస్వ్యతెరిగిన రట్టు ॥ఆయలరు॥
అకట రాచకొలమ్ము ఆమీద కన్యాత్వ
మెకసక్కెములకు పాలౌనేమొ నాబ్రతుకు ॥ఆయలరు॥

కథక: అనుచు కన్నీరుమున్నీరుగా, అన్నపానములుడిగి, కన్నవారిమోము గననొల్లక, నెచ్చెలులకు మారు పలుకక, తనలో దానులుకుచున్న కన్నియంగాంచి, నమ్మిన నెచ్చెలులు తమలోదా మెచ్చరించుకొని దరియ జేరి ఏమనుచున్నారు -

చెలికత్తెలు:

1) అమ్మ చెల్లా! ఇవి భూతచేష్టలేనే
2) కానే, ఈసోకు పూలతోట లోదేనే
3) తాకనే, ఇది మగభూతం వలె ఉంది.
4) దీనికి శాంతి కంతు పూజలేనే -

కథక: అని మేలమాడు నెచ్చెలుల పద్మావతీ కన్య కసరికొట్టుచు కీల్గింటున దురిమిన పూలచెండ్ల విసిరికొట్టుచుండ చెలులు -

చెలికత్తె బృందం:

(జంఝూటి - త్రిశ్రగతి)

ఉన్నమాటయన్న ఇంత ఉలుకిదేలనే
కన్నెవయసు వలపు దాచుకొన్న దాగునే ॥ఉన్న॥

పాలనంటి కులము జున్నుబాల ప్రాయమూ
ఏల మనసు నమ్ముకొంటి వేముపాయమూ ॥ఉన్న॥

ఇంత వలపు ఇంతసిగ్గు నెందు జూడమూ
సుంత అతనిపై రిచెవి చెంత నూదుమూ ॥ఉన్న॥

కథక: అనుచు పలుగతుల మేలమాడుచుండ నంతకంత కగ్గలంబైన విరాళిం దాళజాలక పద్మావతి అలుకమాని వలవంతలపాలై - నిలుపోవలేక -

పద్మావతి:

(నాటకురంజి - మిశ్రచాపు)

తాళనే, మేలము లేలనే
ఓ చెలులారా చాలనే తాళజాలనే
తాళనే ఈ మందెమేలము చాలునే, పువుదోట కాతం
డేలవచ్చెనె, నా మనోధన మేల ముచ్చిలిపోయె
నయయో ॥తాళనే॥

ఏమి తలచిన వాని తలపే ఏమిచూచిన వానిరూపే
రామలారా! ఇందరుండియు కామితము నీడేర్పరిది నా
నోము ఫలమొ మరేమి పాపమొ ॥తాళనే॥

సూత్ర: పాపం! పట్టి కసుగాయ, ఈ కన్నెవలపు ఎట్లా కడతేరుతుందయ్యా మూర్తీ.

కథక: మీరుకూడా బెంగపెట్టుకోకండి మరి. స్వామి బయలుదేరారు కారూ! ఎరుకత వేషంతో - అదుగో -

(సశేషము)

# అన్నమయ్య కవితలు - జానపదరీతులు

— ఆచార్య బి. రామరాజు

[గతసంచిక తరువాయి]

అన్నమయ్య కాలమున జంపెలు కేవలము పాటలుగనే యుండెననుటకు ఆయన పాడిన ఖండగతి సంకీర్తనములే సాక్ష్యములు. మరియును 'నిత్యాయ విబుధ సంస్తుత్యాయ, నిత్యాధిపత్యాయ, మునిగణప్రత్యయాయ' వంటి సీసపద్యపు పాటలీ విషయమును చక్కగా నిరూపించును. అన్నమయ్య గారి రచనములందు ఖండగతిలో దేశిజనుల వాడుకలోనున్న వరుసలు చాల కలవు.

'కాయము మోచితి గడన గడించితి
చేయూర పుణ్యము చేసితినా'

యనునది చెంచిత పాట వరుసలో నున్నది.

ముఖారి

చూపులోపలి చూపు చూడకుర వోరీ నీ
పైపూత వలపులకు చాలైతిమోరి॥

యనుపాట

'ఈ యింటి గౌరమ్మ ఎవరాడు బిడ్డా
పాగొండ పత్తిగొండ దొరలాడు బిడ్డ'

యను విసురురాతి పాట వరుసలో నున్నది.

భూపాళం

'ఏమి చిత్రంబేమి మహిమలు యేమి నీ మాయా
వినోదము
వామనాచ్యుత నిన్ను దెలియగ వసుధలో
మా తరములా

యను సంకీర్తనమందలి పల్లవి

'మొనలు మీదుగ తలలు క్రిందుగ మొలచి'
యున్నది వృక్షమూ
మోదమలరగ మింటి మీదను మదగజము
విహరించెరా'

యను కాలజ్ఞానతత్త్వమువలె నున్నది. ఈ సంకీర్తన మందలి

'సకలలోకనివాస నాయకశౌరి మురహరి
నరహరి
ప్రకటమాయెను నీ గుణంబులు పొలముచ్చ
వటంచును'

వంటి చరణములు మాత్రము స్త్రీలు పాడుకొను

'వేడ్క వెలసిన మీ ప్రభావము విష్ణులోకము
నందునా
పల్లవించిన యింద్రలోకము బ్రహ్మలోకము
నందునా'

యని సాగిపోవు శ్రీశైల భ్రమరాంబికాష్టకము ధోరణిలో నున్నవి.

ఖండగతి పాటల వలెనే అన్నమయ్య రచనములందు చతురశ్రగతి పాటలుకూడ అనేకములున్నవి. వీనిలో చాల వరకు

'కన్నులు దెరవక కమలబాంధవుడు
వెన్నెల రేణువు వెలయదిదే'

వంటి ఏకతాళి వరుసలే యక్షగానములందు ఏకతాళి గ్రంథ మర్యాదను పొందినది. ఐనను లోకమున వాడుకలోనున్న ఏకతాళి వరుసలోని యావృత్తములందన్నియు నక్షరము లుండవు.

'తొలకెడి జలముల తోడికన్నుగవ
తలచినడెందము తలకీని'

యని రెండవ పాదములో దీర్ఘము (రాగము) తీయుటకు అనుకూలముగా అక్షరము జారిపోయినది. పండితుల కీర్తనలు నిబంధపు నిండును సాధించుటకై నిండుగా నక్షరములు నింపుకొనును. తొలిదినములందీ లక్షణమధికముగా కానుపించును, యక్షగానములందలి అర్ధచంద్రికలు, త్రిపుటలు ఏకతాళములు, అక్షరములతో పిటపిటలాడుటయే దీనికి నిదర్శన మనుకొందును. అన్నమయ్య ప్రథమ సంకీర్తనాచార్యుడు మరియు పదకవితాపితామహుడు. ఆయన మనుమడు చెప్పినట్లు 'సంకీర్తన పరిశుద్ధిన్ .... చేయబూనినవాడు. ఈ పరిశుద్ధి స్వామివారి కంకితమగుటతో సగమును, పూర్తియైన నిబంధ పదమును మలచుటలో కడమ సగమును సాధింపబడినదని నమ్మెదను. పదఛందోరీతి నతిక్రమించిన పొట్టిపాదములు దేశి లేదా జానపద ప్రభావమేయని యనుమానించి వెదకి వెదకి వానినే యిట జానపద దేశి వరుసలుగా పేర్కొనుచున్నాము.

పాల్కురికి సోమనాథుడు పేర్కొన్న చాగుభళా పాటలకు ఉదాహరణముగా అన్నమయ్యగారు.

పాట

చక్కని తల్లికి చాంగుభళా తన
చక్కెరమోవికి చాంగుభళా

యనెడు పదం ప్రసిద్ధి పొందినది రచించినారు.

శ్రీనాథకవి కూడ 'తందానమ్మ్యమ్ముకున్' అను మాటలని తందానలుగూడ గొప్పవాళ్ళు పదునే పూజలు సూచి పదములై నట్లు కానవచ్చును. తెలుగువేమెంచంద్రులను నేమ వినలకు తందాన పదములందును సాక్ష్యములు. కానిపైన పేర్కొన్నది తందానలాట. 'వాడు తానె తందానలాడు తున్నాడు' అను మాట దీనివల్లనే పుట్టినదను కొందును. తందాన పదములు భక్తివేదాంతములకేకాక శృంగారమునకు జాతులకును అంకితమైనవి కలవు. ఇట్టి జాతుపదములను లెల్ల పదములందుకు కూడ.

తాశల్లే లెల్లేల తర్కుతాశల్లే లెల్లేల ॥ తా ॥
లెల్లలమ్మా పేరు లేతమామిడి పూత
పూసియు కాతగా సేనయా ॥ తా ॥

ఈ లెల్లతందానపాట వరుసలో అన్నమయ్య వేదాంత పరమైన తందాన పాటను రచించినారు.

బౌళి

తందనాన ఆహి తందనాన పురె
తందనాన భళా తందనాన ॥
బ్రహ్మమొకటె పరబ్రహ్మమొకటె పర
బ్రహ్మమొకటె పరబ్రహ్మమొకటె

జానపదుల భక్తిగేయములలో మేలుకొలుపులు ముఖ్యమైనవి. స్త్రీలు పురుషులు తమతమ యిష్టదైవతముల పేరుతో ప్రాతఃకాలమున మేలుకొలుపులు పాడుచు పరాత్పరుని లీలా విభూతిని కొనియాడుదురు. ప్రాతతరములవారు రాలిపోవు కొలది ఈ యలవాటు మన యిండ్ల నుండి జారిపోవు చున్నను ఆకాశవాణివారి ప్రభాత సేవా కార్యక్రమముల ప్రసారము కొంత యూరట కల్పించుచున్నది. పాల్కురికి సోమనాథుడు పేర్కొన్న ప్రభాతపదములు మేలుకొలుపులై యుండవలెను. గుడిగోపురములందు ప్రభాతసేవలో మేలుకొల్పులు పాడెడు నలవాటిప్పటికిని కలదు. ప్రారంభముననో పాఠాంతముననో మేలుకో యను మాటలుండుటచే నివి మేలుకొల్పులైనవి. వీనిని భూపాళములందురు కూడ. భూపాళ రాగమున పాడుటచే నివి భూపాళములైనవి. పండిత గాయకుల బౌళికి జానపదుల భూపాలమునకు పోలికలున్నవట.

మేలుకొనవే చంద్రశేఖర-మేలుకొనవే ఇంద్ర
వందిత
మేలుకొనవే ఫాలలోచన-నీలకంఠహరా!
.... .... .... ....
కేశవయని నిన్ను వాసిగభక్తులు-వర్ణింపు
చున్నారు లేవరా
వాసవ వందిత వసుదేవనందన-వైకుంఠపుర
వాస లేవరా
బంగారు చెంబుతో పన్నీరు పట్టుక-
పడతి రుక్మిణి వచ్చె మేలుకో
రంగైన బంగారు కెంగేల బూనుక-తరుణి
సత్యవచ్చె మేలుకో
.... .... .... ....
మేలుకొనవే రామతులసీ-మేలుకొనవే లక్ష్మి
తులసి
మేలుకొనవే కృష్ణరాయల - లక్ష్మితులసమ్మా -
తులసీ మేలుకొనవే.

యనునవి తీరుతీరు మేలుకొలుపు పాటల కుదాహరణములు. ఇటులే అన్నమయ్యగారు కూడ తీరుతీరు గతులలో మేలుకొల్పులు పాడినారు. ఉదాహరణమునకు-

మేలుకో శృంగారరాయ-మేటిమదనగోపాల
మేలుకోవే నా పాలముంచిన నిధానమా ॥
మిన్నక వేపాలుమాని మేలుకోవయ్యా
సన్నల నీ యోగనిద్రచాలు మేలుకోవయ్యా
.... .... .... టూ
విన్నపాలు వినవలె వింత వింతలూ
పన్నగపు దోమతెర పైకెత్త వేలయ్యా
తెల్లవారె జామెక్కె దేవతలు మునులు
అల్లనల్లనంతనింత నదివో వారె
చల్లని తమ్మిరేకుల సారసపు గన్నులు
మెల్లమెల్లనె విచ్చి మేలుకొనవేలయ్యా ॥
.... .... .... ....
పొలయలుక నిద్దరు భోగించదొరకొంటి
అలరవడి మేల్కొనవె యఖిలేశ్వరా ॥
.... .... .... ....
ఎందాక నిద్ర నీకిదె తెల్లవారెగదె
యిందిరారమణ నీవిటు మేలుకొనవే ॥
.... .... .... ....
ఏకాంతలో నిన్నెనసి తలచిరని. లేకలు వచ్చెను
లేవయ్యా
శ్రీకాంతుడనగు శ్రీవెంకట నాళీక దళాక్షుడ
లేవయ్యా ॥

అన్నమయ్యగారి ఈ మేలుకొల్పుల వరుసలు వేరైనను అన్నియు భూపాళరాగమందే యుండుట గమనించదగిన విషయము.

జానపదములు తెలిసియో తెలియకో కాలక్షేపమునకో కర్మపరిపాకమునకో పాడుకొనెడు కాలజ్ఞానతత్త్వములు వేదాంతభజన కీర్తనలు మున్నగువానిని పోలిన పాటలు అన్నమయ్యగారనేకము రచించినారు. ఇవి తుమ్మెదా చిలుకా, హంసా, కర్మమా యను సంబోధనములతోగాని పాదాంతపదములతోగాని యుండును. పాల్కురికి సోమనాథుడు తుమ్మెదపదములను పేర్కొనెను.

'శివశివయనమేలు తుమ్మెదా-శివుడంటేనె
వినమేలు తుమ్మెదా
శ్రీకంఠుడను పూవు తుమ్మెదా-మూడు లోకమ్ము
లాయెను తుమ్మెదా

యను ఏగంటివారి తత్త్వమును,

'ఏ వూరు ఏపల్లి తుమ్మెదా-యెక్కడికి యెల్తావు
తుమ్మెదా'॥

యను దుందుడుకు కోడలిని వర్ణించు పల్లెపాటయును

'ఓయీ భామల్లార తుమ్మెదా-పండిన వరిచేలు
తుమ్మెదా॥

యను పొలముకోత పాటయును సాగిన వరుసలోనే అన్నమయ్యగారు

శ్రీరాగం ఏకతాళి

తొల్లటివలెగావు తుమ్మెదా యింక
నొల్లవుగా మమ్మునో తుమ్మెదా
తోరంపు రచనల తుమ్మెదా కడు
దూరేవు గొందులే తుమ్మెదా
దూరిన నెరగవు తుమ్మెదా మమ్ము
నోరగ జూడకు వో తుమ్మెదా॥

యను తుమ్మెదపాటను రచించిరి.

ఆహిరి

జీవాతుమై యుండు చిలుకా నీ
వావలికి బరమాత్ముడై యుండు చిలుకా

యను అన్నమయ్యగారి పాట

'కాలయముడు మనకు పొరుగింటి వాడనుచు,
కలకాలమును దెలియు చిలుకా
కలకాలమును దెలిసి కళనంటి నాగురుని,
కంటి నడుమను జూడు చిలుకా'

యను తత్త్వమును బోలినది. ఇట్టిదే

శ్రీరాగం

ఎన్ని బాధలబెట్టి యేచెదవు నీవింక నెంతకాలము
దాక కర్మమా
మన్నించుమనుచు నీ మరుగు జొచ్చితిమి
మామాటాలకించవో కర్మమా'

యను అన్నమయ్యగారి సంకీర్తనము

ఆహిరి

పారకుమీ వో మనసా, పంతము విడువకుమీ
మనసా
పారిన నీవే బ...గయ్యెదవు, చేరువనాడే చెప్పవే
మనసా॥

యను అన్నమయ్యగారి పాట

'ఎంతని వేడుదు పంతమునాపై, సుంతయు
దయ రాదేలనయా
ఝుమ్మను ప్రణవనాదము లోపల, గ్రమ్మిన
వెన్నెల కాంతివయా'

యను తత్త్వమును బోలినట్టిది.

'శివ శివ యని భజియించెడి వారికి చిత్తము
నిలవై నెక్కడిదీ
అవివేకంబున దిరిగెడివారికి ఆత్మ విచారం
బెక్కడిదీ'

యను జ్ఞానబోధ అధ్యాత్మ కీర్తనము. ఇదే తీరు నడకలో ఏకతార ధ్వని ననుసరించుచు అన్నమయ్యగారొక గొప్ప సంకీర్తనము వ్రాసినారు.

రామక్రియ

ఓహోడేండేం వొగి బ్రహ్మమిదియని
సాహసమున శ్రుతి చాటెడిని॥

సామంతం

పాడైన యెరుకతో బంధమోక్షములొక్క
గాడిగట్టుట తెలివిగానకే కాదా॥

యను అన్నమయ్యగారి సంకీర్తనము యాగంటివారి

'పటులింగతేజ స్వత్వాబి గాకుండీను
చెట్టుమీద నొకరాయి చిక్కినటుగాదా
అటు దేహ బహురూపమిటు గానకుంటీను
వట్టిగుడిలో నమశ్శివాయనుట గాదా'

యను పాటను బోలినది.

జానపదగేయ రీతులలోపాటు జానపదముల భాషను వారి దూపటను పలుకుబడులను ఆదరించుచు అన్నమయ్యగారు నేక సంకీర్తనములు రచించెను. ఉదాహరణమునకు

ఆహిరి

ఏసుకుండేటివాడె శినవాడె చింత
శిగడమ్మ గోసిదె శినవాడె

ఆహిరి

శిరుత నవ్వులవాడు శిన్నెకా
వెరపేరుడు సూపవె శిన్నెకా

మేచబౌళి

శిన్నెక సేవె శెలువుని తా
వెన్నలు సవిగొను వెన్నుని తా ॥

భైరవి

పిన్నవాడవని నమ్మనెల్లదు నిన్ను
సిన్నైన యాబదెల్ల సిక్కుసేరై పోయను

సంగీతరత్నాకరము మొదలుకొని సంకీర్తన లక్షణము వరకున్న గ్రంథములలో దేశిగానమునుగూర్చి ముచ్చటించు నపుడు ఏలల ప్రసక్తి కాననగును. జానపదగేయ రీతులలో ఏలలదొక విశిష్టస్థానము. ఎత్తుగడలోను, మధ్య సంబుద్ధిలోను, ముక్తాయింపులోను ఏలలను త్రిభంగి ధనుస్సుతో పోల్చవచ్చును. మొదటి పాదపు ఎత్తుగడలలో విల్లెక్కుబెట్టి, మధ్య పాదపు సంబుద్ధితో బాణము సంధించి, నారి సారించి, మూడవ పాదపు ముగింపుతో ఎదుటివారి గుండెగూడులందు భావములను బాణములను నాటవచ్చును. అవి భక్తి భావములు కానిండు రక్తిభావములు కానిండు. ఆ రెండింటికిని కావలసినంత శక్తి ఏలపాటయను విల్లునుండి లభించును. 'ఏలల వెట్టుచు నింపు సొంపార బసవపురాణమును జరిపెడువారు పాల్కురికి సోమనాథుని కాలమందుండిరి. కందుకూరి రుద్రకవి తన సుగ్రీవ విజయము యక్షగానములో

'భాను వంశమునబుట్టి – దానవకామిని గొట్టి
మౌనివరులు సన్నుతింపగా – ఓ రామచంద్రా
పూని మఖము నిర్వహింపవా'

యను ఏలపాటను రచించెను.

'సన్నంపూ దిడ్డీవాకిట – పున్నమా వెన్నెల బైటా
కిన్నెరాల నాద మింటీరా – ఓ యాగంటి లింగా
వినగ వినగ వింతలాయెను రా'

యనునది ఏగంటివారి ఏలపాట

'నాయకాహ్వాన పూర్వమై నయముగలిగి
ప్రేమ్ష పరిభాష దగి రాగ మిశితమైన
యేలపాట పదంబు నా నిలఁజెలంగు
మహిత నాయక సంబుద్ధి మధ్యమగుచు'

అన్నమయ్యగారును ఆయన మనుమలు చిన తిరుమలాచార్యులును ఏలా లక్షణము నింతగా చెప్పి లక్ష్యమేల రచింపరైరోయని ఒకప్పుడను కొంటిని. నేను నా పిహెచ్‌డి సిద్ధాంత వ్యాసము రచించునాటికి (1955) గాని, దానిని ముద్రించునాటికి (1958) గాని అన్నమయ్య యేలలు నాకంట పడలేదు. అందుకే 'ఏలల నిర్మాణము అన్నమయ్య అభిమానించిన నిబంధపదముల నిర్మాణమున కందక పోవుట చేతకాబోలు ఏలలాతని రచనములందు ఇప్పటికి ముద్రితమైన వానిలో లేవు. ముందు ముందు ప్రకటింపబోవు వానిలో లభించునో యేమో వేచి చూడవలె'నని ఒడలు దగ్గర పెట్టుకొనియే అనుమానముతో నాథీసిస్‌లో వ్రాసితిని. నా యనుమానము నిజమైనది. 1960 లో అచ్చైన అన్నమాచార్యుల వారి సంకీర్తనల పదమూడవ సంపుటములో దేసాళం రాగమున నొక గొప్ప యేలపాట (సంఖ్య 223) అచ్చైనది. దానిలో 25 పదములు లేదా చరణములున్నవి.

దేసాళం

మేడలెక్కి నిన్నుజూచి – కూడేననే యాసతోడ
వాడుదేరి వున్నారందురా – వెంకటేశ
యాడనుంటి విందాకానురా

ఇందులోని సంబుద్ధి 'వెంకటేశ' యని మాత్రమున్నది. 'ఓ వెంకటేశ' యన్నచో మరికొంత నిండుగా నుండును. ఐనను 'వెంకటేశ' యని అన్నమయ్యగారు నాడు పిలిచిన మాత్రమున 'ఓ' యనుట స్వామివారి వంతైయుండును. అందుకే దాని యవసరము లేకపోయినది.

కేవలము జానపదుల బాణీలు కొన్ని మాత్రము గుర్తుపెట్టుకొని పదకవితా పితామహులు తెలుగునాట పారించిన మార్గ-దేశి సంగీత భాగీరథికి దోసిలెత్తిన నా సాహసమును సంగీత విద్వాంసులు నా భక్త్యంజలిగా భావించవలెనని కోరుచు విరమించుచున్నాను.

(సమాప్తం)




# మహిళాభ్యుదయానికి మార్గం

— శ్రీమతి శిష్టా వసుంధరాదేవి

సృష్టికి కారకురాలు స్త్రీ. స్త్రీ లేనిది అసలు సృష్టేలేదు. ఆమె ప్రాణశక్తి, ప్రణయామృతాన్ని అందించే ప్రణయరాజ్ఞి. ఆమె మనస్సు పూవుకన్నా మృదువు ప్రేమ కరుణలకు నిలయం, ఆమె హృదయం. మమతానురాగాలు పంచిఇచ్చే మాతృమూర్తి. చల్లని సంసార జీవిత నౌకకు చుక్కాని. మనస్సులో బడబాగ్ని చెలరేగుతున్నా, కన్నులలో వాత్సల్యం, ప్రేమ కురిపించగల అమృతమూర్తి స్త్రీ. ఆమె మనస్సు ఎంత మృదువో, ఎంత సున్నితమో అంత వజ్రకఠినం. ఆ మనస్సు నెదుర్కొనే ఏ దుష్టశక్తి ఐనా పగిలి ముక్కలుకాక తప్పదు. అనంతమైన సృష్టిని అల్లకల్లోలం చేయగల కాలస్వరూపిణి. దుర్మార్గులకు, వంచకులకు ప్రళయ శక్తి ఆమె.

కళలకు, కావ్యాలకు ఆధారం స్త్రీ. నవ రస భావాలకు నాయిక. ఓర్పు, నేర్పు ఆమె సొత్తు. స్నేహభావం, క్షమ, శాంతి వీటన్నికి నిలయం స్త్రీ హృదయం. అలాంటి మహత్తర శక్తి స్వరూపిణి స్త్రీ. పవిత్రమైన ఇతిహాస పురాణకాలంలోని భారతీయ సంస్కృతీ సంప్రదాయాలకు, ఆనాటి ప్రత్యక్ష రూపం అది.

ఏ యుగాలలోనైనా, ఏ కాలంలోనైనా సద్గుణవతి, వినయవతి ఐన స్త్రీ యుగ యుగాలలోనూ కీర్తించబడుతుంది. పూజించబడుతుంది.

స్త్రీ ఉన్నతురాలు కావడానికి ఉన్న ఒకే ఒక ధర్మం పాతివ్రత్యధర్మం. జీవితం దేశ కాలపరిస్థితులకు లోనైనా అన్ని కాలాలలోనూ స్త్రీ అనుసరించవలసిన ధర్మం అది. ఆ ధర్మం అనుసరించిన స్త్రీకి సాధ్యం కానిదేమీ ఉండదు. ఆ ధర్మాన్ని అనుసరించే సీతామహాసాధ్వి అగ్నిలోనుండి అజేయురాలై తిరిగివచ్చింది. ఆ ధర్మం చేతనే సావిత్రి భర్త ప్రాణం కాపాడుకోగలిగింది. ఆ ధర్మం అనుసరించడం వలననే అనసూయ త్రిమూర్తులను పసిబిడ్డలుగా మార్చగలిగింది. సతీసుమతి సూర్యోదయం ఆపగలిగింది ఆ ధర్మం అనుసరించడం వలననే వారికాశక్తి కలిగింది.

ఐతే యుగాలు మారాయి. కాలం మారింది. కాలం మారినా, యుగంమారినా స్త్రీకి సౌశీల్యం అవసరం అన్న విషయం మాత్రం సత్యం.

ప్రస్తుత నాగరిక సమాజంలో అవన్నీ కట్టుకథలుగానే ప్రచారం కాబడుతున్నాయి. ఈనాటి విద్యావంతులైన స్త్రీలలో కనీస ధర్మాధర్మ విచక్షణాజ్ఞానం లోపిస్తున్నదనడానికి ఏమాత్రం సంశయంలేదు.

భర్త కురూపియైనా, దుష్టుడైనా, మూర్ఖుడైనా, మనసా వాచా అతనినే భగవంతునిగా భావించి, సేవించడం వెనుకటి కాలంలోని స్త్రీ ధర్మంగా భావించేది.

ఈనాడు భర్తలో ఏదైనా లోపం ఉంటే సర్దుకుపోయే సహనశక్తి ఈనాటి స్త్రీలలో నశించి పోతున్నదనే చెప్పాలి. అసలు భర్తకు ఎందుకు లొంగి ఉండాలి? నేను తక్కువ ఏమిటి? అతను ఎక్కువ ఏమిటి? ఈనాటి స్త్రీ వాదన ఇది. పైగా, భార్యాభర్తలు విడిపోవడం, పునర్వివాహం అన్న విషయాలు సర్వసామాన్యమై పోయాయి.

పరభాషావ్యామోహంలో కూరుకుపోతూ విదేశీ సంస్కృతీ సంప్రదాయాల మోజులో మునిగిపోతున్న ఈనాటి నాగరిక సమాజంలోని మనుష్యులకు మన భారతీయ వివాహ వ్యవస్థ గురించి వివాహ ధర్మాలను గురించి ఎంతమందికి తెలుసు? తెలుసుకోవాలని కనీసం అసక్తినైనా ఎంతమంది కనవరుస్తున్నారు?

కష్టసుఖాలనేవి మనిషి జీవితధర్మాలు. అవి ప్రతి ఒక్కరికీ తప్పవు. జీవితంలో కష్టనష్టాలు ఎదురైనా మనిషి తన ధర్మం తప్పక సంచరించినప్పుడే ఆ మనిషి జన్మ సార్థకమౌతుంది. మనోనిగ్రహం కోల్పోయినప్పుడు వ్యక్తి ధర్మం తప్పడానికి అవకాశం ఉంటుంది. ఆ మనోనిగ్రహంకలగాలంటే, ఆధ్యాత్మిక చింతన అవసరం. మనస్సుకు ప్రశాంతత స్వాంతన లభించేది ఒక్క ఆధ్యాత్మిక చింతన వలననే. అందువలన మనోబలం, మనోనిగ్రహం కలిగి ఉండటం కోసం, పూజా పునస్కారాలు ఏర్పరచబడినాయి. ముఖ్యంగా స్త్రీకి కూడా అవి సదా ఆచరింప దగినవి. ఈ ఆధ్యాత్మిక చింతన బాల్య దశనుంచీ రావాలి. అలా రావాలంటే, ప్రతితల్లీ తాను ఆచరించి తన పిల్లలకు ఆ చింతన కలగజేయాలి.

నేటి సమాజంలో స్త్రీ ఒక విలాస వస్తువుగా భావింపబడుతోంది. స్త్రీపై గౌరవాభిమానాలు తరిగిపోయాయి. ఇలా ఎందుకు జరుగుతున్నదో, ఈ పరిస్థితికి కారణం ఏమిటో, అందులో తన బాధ్యత ఎంత ఉన్నదో ప్రతి స్త్రీ ఆలోచింప వలసివున్నది.

స్త్రీ, పురుషునితో సమానహక్కులకోసం, పోరాడటం ఎంత దయనీయమైన పరిస్థితి. పురుషునికంటె పరిపూర్ణ ఉన్నతురాలు స్త్రీ. తర్వాతనే పురుషుడు. అతనికామె ఆరాధ్య దైవం.

స్త్రీ అలా భావింపబడాలంటే ఈనాటి స్త్రీ మన భారతీయ సంస్కృతీ సంప్రదాయాలను, ధర్మాలను అనుకరిస్తూ, అనుసరిస్తూ, అనుసరింపజేస్తూ ఉండాలి. అప్పుడే పవిత్రమైన మన ఇతిహాస పురాణకాలంలోని భారతీయ సంస్కృతీ సంప్రదాయాలకు ప్రత్యక్ష రూపమైన ఆనాటి భారతీయ స్త్రీరూపం, ఈనాటి స్త్రీలోనూ రూపుదిద్దుకుంటుంది. అలాంటి మార్పు అందరిలో రావాలని, వస్తుందని ఆశిద్దాం.



# నేను నాస్తికురాలినా?

'నాలో కొద్దిగా హేతువాదభావాలు వున్నమాట వాస్తవమే! కానీ నేను నాస్తికురాల్ని కాను. హేతువాదం వేరు, నాస్తికత్వం వేరు. నేను నాస్తికురాల్ని అనటం కేవలం దుష్ప్రచారం మాత్రమే!' శ్రీమతి నన్నపనేని రాజకుమారి అన్నమాటలివి– తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహక మండలిలో తమను సభ్యురాలిగా నామినేట్ చేసిన సందర్భంలో తల ఎత్తిన విమర్శలకు సమాధానంగా ఆమె పై ప్రకటన చేశారు. టి. టి. డి. ఆధ్వర్యంలో తిరుపతి శ్రీ అన్నమాచార్య కళామందిరంలో ఏప్రిల్ 20వ తేదీన జరిగిన నన్నయ జయంత్యుత్సవాలకు ప్రధాన అతిథిగా హాజరయిన శ్రీమతి రాజకుమారి అనేక విషయాలపై తమ అభిప్రాయాలను నిర్ద్వంద్వంగా సభాముఖంగా ప్రకటించారు–

"నేను మూఢనమ్మకాలకు వ్యతిరేకిని. పసిపిల్లలలో అంటువ్యాధులు ప్రబలినప్పుడు వల్లీయులు ఆధునికవైద్యం చేయించక వేపమండల ప్రయోగాలకు పాల్పడటం నన్ను విపరీతంగా కలవరపెట్టింది. దీనిని, మరికొన్ని ఇటువంటి అంధవిశ్వాసాలను ఖండిస్తూ మూడేళ్ళ క్రితం నేను కొన్ని సభల్లో ప్రసంగించాను – దాన్ని అడ్డంపెట్టుకొని నన్ను నాస్తికురాలినిగా చిత్రించేందుకు ఇప్పుడు కొందరు ప్రయత్నించడం హాస్యాస్పదం" అన్నారు శ్రీమతి రాజకుమారి. తాను పుట్టింది ఆస్తికుల కుటుంబంలోనేనని తమ పినతల్లి శ్రీమతి చావలాల అన్నపూర్ణమ్మ శిక్షణలో తాను బాల్యంలోనే భక్తిభావాలు అలవరచుకొన్నానని చెబుతూ ఆమె ఇంకా ఇలా అన్నారు.

"మా పినతల్లి నా చేత 'రుక్మిణీ కల్యాణం' చదివిస్తూ వుండేది. అందులో 'నమ్మితి నా మనంబున సనాతనులైన ఉమామహేశులన్' అనే పద్యాన్ని ప్రతి రోజూ పారాయణంచేయవలసిందనీ, అలా చేస్తే నాకు మంచి భర్త లభిస్తాడనీ ఆమె చెప్పింది. ఆమె చెప్పిన ప్రకారం పంథొమ్మిది ఏళ్ళు వచ్చేవరకు ఆ పద్యాన్ని ప్రతి నిత్యం పఠిస్తూనే వున్నాను – దాని ఫలితంగానే కాబోలు నాకు ఏ దురలవాట్లూ లేని ఉన్నతుడైన, విద్యాధికుడైన భర్త లభించారు. వారి ప్రోత్సాహమే నన్ను ఇంతదానిని చేసింది. మావారి పేరు శ్రీ ముకుందరావు, నాకొడుకు పేరు రఘురామ్



దేవస్థాన పాలకమండలి సభ్యురాలు, సత్తెనపల్లి నియోజకవర్గ శాసనసభ్యురాలు శ్రీమతి నన్నపనేని రాజకుమారి.

ఇలా మా కుటుంబ సభ్యులపేర్లు పరిశీలిస్తే అవి చాలావరకు దేవుడిపేర్లుగానే కనిపిస్తాయి –ఇంతెందుకు? ఆ స్వామివారి అనుగ్రహం నాకు లేకపోతే నాకీ గౌరవం లభించి వుండేదేకాదు. మనశ్శాంతికీ మనోస్థైర్యానికీ దైవభక్తి ఎంతైనా అవసరమని నేను నమ్ముతున్నాను", అంటూ మన పురాణాలలోని స్త్రీలపాత్రలను గురించి కూడా శ్రీమతి రాజకుమారి తమ వైఖరిని వివరించారు.

'మన పురాణాలలోని స్త్రీల పాత్రలను పరిశీలిస్తే వారికి చాలా అన్యాయంజరిగినట్లు అనిపిస్తుంది. కానీ మన సమాజంలో నేటి స్త్రీకి జరుగుతున్న అవమానాలను, అమర్యాదను పరిశీలిస్తే ఆనాటి సీతకు, ద్రౌపదికి జరిగిన అన్యాయం ఏపాటిదని ఆశ్చర్యపోవాల్సి వస్తుంది. ఆనాటి సీతమ్మ విముక్తికి ఒక రాముడు, ద్రౌవదీ మాన సంరక్షణకు ఒక కృష్ణుడు అండగా నిలిచారు. కాని దైవభక్తి, పాపభీతి లోపించిన నేటి సమాజంలో ఆధునిక స్త్రీకి బాసటగా నిలిచే వారెవరు? కేవలం చట్టాలూ, కోర్టులూ తప్ప" అంటూ ఆమె తమ నిర్వేదం వెల్లడించారు.

హిందూధర్మరక్షణకై జరుగుతున్న ప్రయత్నాలను సమర్థిస్తూ ఎవరి మతాన్ని, ఎవరి సంప్రదాయాన్ని వాళ్ళు కాపాడుకోవాలనుకోటంలో తప్పేమీలేదని ఈ విషయంలో క్రైస్తవులు చేస్తున్న కృషిని మనం గమనించాలని అన్నారామె – ధర్మరక్షణ కార్యక్రమాలకై మనం నిస్వార్థంగా పని చేయకపోవటం పట్ల ఆమె తమ బాధని వ్యక్తంచేశారు. భగవంతుడి సొమ్ము దుర్వినియోగం కానంతవరకు మనం మన ధర్మప్రచారానికి ఎంత వ్యయం చేసినా తప్పులేదని ఆమె నొక్కి చెప్పారు.

మన సమాజంలో వేదపండితులు తదితర విద్వాంసులకు నానాటికి ఆదరణ తగ్గిపోయి వారిజీవితాలు దుర్భర పరిస్థితులకు లోనుకావటం శోచనీయమని చెబుతూ "దేవస్థాన పాలకమండలి సభ్యురాలిగానే గాక ఒక శాసన సభ్యురాలిగా కూడా నేను ఈ విషయంలో చొరవతీసుకునేందుకు సిద్ధంగావుంటానని, ఈవర్గాలవారి అభివృద్ధికి జరిగే ప్రయత్నాలకు తాము మద్దతు నివ్వగలమని" హర్షధ్వానాలమధ్య ప్రకటించారు శ్రీమతి రాజకుమారి.

— సుధాకర్

# నిర్వాహకమండలి నిర్ణయాలు

[తే 18-4-1983 దిన తిరుపతిలో టి.టి.డి. పరిపాలనాభవనంలో దేవాదాయశాఖ ఇన్ ఛార్జి కమీషనర్ శ్రీ ఎల్. సుబ్బయ్య ఐ.ఏ.ఎస్. అధ్యక్షతన జరిగిన టి. టి. డి. పాలకమండలి సమావేశంలో ఆమోదం పొందిన కొన్ని ముఖ్యనిర్ణయాలు.]

* టి. టి. డి. బోర్డు అధ్యక్షులయిన శ్రీ ఓ. నాగిరెడ్డి, సభ్యులయిన శ్రీ ఓ. సత్య నారాయణగార్లు తమ పదవులకు రాజీ నామాలు చేసిన సందర్భంలో దేవస్థాన సంస్థల అభివృద్ధికి వారు చేసిన ఉత్తమ సేవలను శ్లాఘించడమైనది.

* దేవస్థాన పర్యవేక్షక సంఘాల ఖాళీల లోకి ఈ క్రింది ట్రస్టుబోర్డు సభ్యులను నామినేట్ చేయడమైనది.

(ఎ) వేలంపాటల కమిటీ
– శ్రీ జి. మాధవరెడ్డి ఎం.ఎల్.ఏ.
– శ్రీ టి. రుద్రయ్య ఎం.ఎల్.ఏ.

(బి) నిర్మాణాలసంఘం
– దేవాదాయశాఖ కమీషనర్

(సి) బాలమందిర్, పూర్ హోమ్, బధిరాంధపాఠశాలల పర్యవేక్షక సంఘం
– శ్రీ టి. రుద్రయ్య ఎం.ఎల్.ఏ.

(డి) టి.టి.డి. కళాశాలల పాలకసంఘం
– శ్రీమతి నన్నపనేని రాజకుమారి ఎం.ఎల్.ఏ.

(ఇ) శ్రీ పద్మావతీ స్త్రీలపాలిటెక్నిక్ విద్యార్థుల ఎంపికసంఘం
– శ్రీ టి. రుద్రయ్య ఎం.ఎల్.ఏ.

* తిరుమల, తిరుపతి ప్రాంతాలలోని టి. టి. డి. ఉద్యోగులకు వారి మూల వేతనంపై 10 శాతం మొత్తాన్ని యాత్రి కుల భత్యంగా మంజూరు చేయాలన్న టి. టి. డి. ఉద్యోగుల సంఘంవారి కోర్కెను ప్రభుత్వ ఆమోదానికి పంపడ మైనది.

* న్యూఢిల్లీలోని శ్రీ వేంకటేశ్వర కళాశాల పాలకసంఘంలోని టి.టి.డి. ట్రస్టుబోర్డు సభ్యుల ఖాళీలకు శ్రీమతి ఎన్. రాజ కుమారి, శ్రీ జి. మాధవరెడ్డిగార్లను నామినేట్ చేయడమైనది.

* నెల్లూరులోని శ్రీ వేంకటేశ్వర కస్తూర్బా కళాకేంద్రం ఆడిటోరియం పాలకసంఘా నికి టి. టి. డి. ప్రతినిధులుగా శ్రీమతి ఎన్. రాజకుమారి, శ్రీ టి. రుద్రయ్య గార్లను నామినేట్ చేయడమైనది.

(48 వ పేజీలో)



---

**మీమాట** (2 వ పేజీ తరువాయి)

**మీటర్‌గేజ్** ద్వారా తిరుపతినుండి రామేశ్వ రందాకా ప్రయాణం చేయగలిగే సౌకర్యం వుంది. ఈ సౌకర్యానికి భంగం రాకుండా ఈ కాస్తదూరం ప్యారలల్ లైన్‌వేస్తే, రామేశ్వరండాకా లైను మార్చేవరకూ జనా నికేవిధమైన ఇబ్బందీ లేకుండా రెండులైన్ల పైనా ప్రయాణం చేయవచ్చు. ఇప్పటి మధుర ఎక్స్‌ప్రెస్‌ను తిరుపతి-రామేశ్వరం ఎక్స్‌ప్రెస్‌గా మార్చి మధురకును ఒకటి రెండు పెట్టెలు వేయవచ్చు మరి.

ఇవన్నీ ఎవరికీ తెలియనివీ, ఇదివరకు చెప్పనివీ కాదు. అనగా, అనగా- ఎవరన్నా వింటారేమోననీ, నరసేవే నారాయణ సేవ అంటున్న ఈ రోజుల్లో నరులంటే నాణాలు చిమ్మగల్ల దొరలేకాదనీ, నాణ్యమైన మన స్సుతో నారాయణసేవకు పరుగులెత్తి వస్తున్న పామరులుకూడాననీ—అంతే!

**'నాగరాజ్'**



తిరుపతి పరిసరాలలో గల టి.టి.డి. దేవాలయాలు కలుపుతూ యాత్రికుల సౌకర్యం కోసం దేవస్థానం ప్రారంభించిన 'కాంట్రాక్ట్' బస్‌కు శ్రీ జి. కుమారస్వామిరెడ్డి ప్రారంభోత్సవం చేశారు.

## అన్నమాచార్య వర్ధంతి

పదకవితకు ప్రథమాచార్యులైన శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యులవారి 480వ వర్ధంతి మహోత్సవాలు ఏప్రిల్ 10వ తేది నుండి 12వ తేది వరకు టి. టి. డి. ఆధ్వర్యంలో తిరుపతి శ్రీ అన్నమాచార్య కళా మందిరంలో నిరాడంబరంగానూ సంగీత సాహిత్యాభిమానులకు సంబరంగానూ జరిగాయి. 10వ తేది ఉదయం శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యులు శ్రీ వేంకటేశ్వరస్వామి చిత్రపటాలను నగరసంకీర్తనతో ఊరేగింపుగా తీసుకురావటంతో వర్ధంతి ఉత్సవాలు మొదలయ్యాయి. ఆనాటి ఉదయం 9 గం॥ నుండి సాయంత్రం 4 గం॥ వరకు జరిగిన 'అఖండ ఆరాధన'లో అన్నమాచార్య ప్రాజెక్టు, ఎస్. వి. సంగీత నృత్య కళాశాల కళాకారులు ఎంతో భక్త్యావేశంతో పాల్గొని సంకీర్తన సభ నిర్వహించారు.

అఖండఆరాధన అనంతరం ఆనాటి సాయంత్రం జరిగిన శ్రీ మేడసాని మోహన్ అష్టావధానం ఈ వర్ధంతి ఉత్సవాలకు ఒక ప్రత్యేకాకర్షణగా నిలిచిపోయింది. ఎంతో సభారంజకంగా సాగిన ఈ 'సారస్వత సాముగరిడీ'కి డాక్టర్ మద్దూరి సుబ్బారెడ్డి (శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధిపతి) గారు సంవిధానం నెరిపారు.

పృచ్ఛకుల పంక్తిలో డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య నిషిద్ధాక్షరిని, డా॥ పి. రాధాకృష్ణమూర్తి న్యస్తాక్షరిని, కుమారి భాస్కర స్వర్ణాంబ దత్తపదిని, శ్రీ కె. జయచంద్రారెడ్డి అప్రస్తుత ప్రశంసను, శ్రీ పి. వి. శ్రీనివాసమూర్తి సమస్యాపూరణాన్ని, శ్రీ సముద్రాల లక్ష్మణయ్య కావ్యపఠనాన్ని, శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి ఆశువును, శ్రీ కె. ఎం. డి. హెన్రీ ఘంటావాదనం నిర్వహించారు.

ఆనాటి సాయంత్రం జరిగిన సాహిత్య సాంస్కృతిక సభను శ్రీ డి. సుబ్బరాయులు (టి.టి.డి. సంయుక్త కార్యనిర్వహణాధికారి) ప్రారంభించారు. ముఖ్య అతిథిగా విచ్చేసిన డా॥ జె. చెన్నారెడ్డి అన్నమాచార్యుల అధ్యాత్మ సంకీర్తలు, రెండవ సంపుటం (పునర్ముద్రణ) ఆవిష్కరించారు. వక్తగా విచ్చేసిన డా॥ కె.సర్వోత్తమన్ అన్నమయ్య భక్తితత్త్వాన్ని విశ్లేషిస్తూ అన్నమయ్యది రాజసభక్తి అని పేర్కొన్నారు. సభానంతరం జరిగిన శ్రీ డి. పశుపతి బృందం గాత్రకచేరి, శ్రీ జి. బాలకృష్ణప్రసాద్ బృందం లలితసంగీతం శ్రోతల్ని అలరించాయి.

రెండవరోజు కార్యక్రమంలో ఉదయం కుమారి జె. కృష్ణకుమారి హరికథ, సాయంత్రం శ్రీ పుదుక్కోట్టై ఆర్. రామనాథన్ వయోలిన్ కచేరి జరిగాయి. ఆరాత్రి శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి (టి.టి.డి. పౌరసంబంధశాఖాధికారి) అధ్యక్షతన అన్నమాచార్య వాఙ్మయంపై సదస్సు నిర్వహించబడింది. ఇందులో శ్రీ ఆర్. ఏ. జయంత, శ్రీ కోరాడ రామకృష్ణ, డా॥ కె. వాణి, శ్రీ జె. బాలసుబ్రహ్మణ్యం పాల్గొన్నారు. అనంతరం శ్రీ కె. ఆర్. గణపతి వేణుగానం, శ్రీమతి అరుంధతీ సర్కార్ బృందం గాత్రకచేరి వుండినవి.

చివరిరోజు ఉదయం శ్రీ కె. ఆర్. కృష్ణ వీణకచేరి జరపగా, సాయంత్రం శ్రీమతి జి. జానకీరమణ గాత్రసభను నిర్వహించారు. ఆరాత్రి జరిగిన సాహిత్య సదస్సులో డా॥ పి. రాధాకృష్ణమూర్తి అధ్యక్షతన అన్నమాచార్య వాఙ్మయ ప్రణాళిక విశేషాధికారి శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ ప్రసంగించారు. అన్నమయ్యలోని కవిహృదయాన్ని, భక్తుడి అంతరంగాన్ని ఆయన సోదాహరణంగా వింగడించారు. అన్నమయ్య రాజస

## వార్తాలహరి

భక్తుడనే అభిప్రాయాన్ని ఆయన ఖండించారు. అన్నమయ్య బాల్యానికి సంబంధించిన కొన్ని కథలను గాథలను ఇటీవల వెలుగులోకి తెచ్చిన శ్రీ మైనంపాటి సుబ్రహ్మణ్యకవిని శర్మగారు సభకు పరిచయం చేశారు. 'చిన్నచెంబుతో నీళ్ళు శీకాయ ఉదకంబు' అనే పద్యం అన్నమయ్య శతకంలోనిదని చెప్పేందుకు శ్రీ మైనంపాటి సుబ్రహ్మణ్యకవి దగ్గర ఆధారాలు ఉన్నాయని శ్రీ రామసుబ్బశర్మగారు వెల్లడించి సభను ఆశ్చర్యంలో ముంచివేశారు.

ఆరాత్రి సంగీత కార్యక్రమంలో విజయవాడ జి. వి. ఆర్. ప్రభుత్వ కళాశాల అధ్యాపకులు శ్రీ ఎం. వి. రమణమూర్తి, శ్రీ పి. సూర్యారావు బృందం గాత్రకచేరి ఒక ప్రత్యేకాకర్షణ. చివరి అంశంగా శ్రీమతి ఇందిరా కామేశ్వరరావు (విశాఖపట్నం)

బృందంవారి గాత్రంకూడా సభను ఆకట్టుకొంది- అన్నమాచార్య ప్రాజెక్టు వక్తాన శ్రీ డి. పశుపతిగారి వందన సమర్పణతో వర్ధంతి ఉత్సవాలు జయప్రదంగా ముగిశాయి.

## నన్నయ జయంతి

భగవంతుడిపై విశ్వాసాన్ని పాదుకొల్పేందుకు మన పురాణ వాఙ్మయం ఎంతగానో ఉపకరిస్తున్నదని, అలాంటి వాఙ్మయ స్రష్టలను గౌరవించడం మన సంస్కృతికి కొలబద్ద అనీ పేర్కొన్నారు శ్రీమతి నన్నపనేని రాజకుమారి-



నన్నయ జయంతి సభలో శ్రీమతి నన్నపనేని రాజకుమారి.

నన్నయ జయంత్యుత్సవాల సందర్భంగా తిరుమల తిరుపతి దేవస్థానముల హిందూధర్మ రక్షణ సంస్థ స్థానిక కళాశాలల విద్యార్థులకు నిర్వహించిన వ్యాసరచన పోటీలలో విజేతలకు బహుమతులు అందజేస్తూ ఆమె పై విధంగా అన్నారు. 'నన్నయ కవిత్వతత్త్వం' అనే అంశంపై జరిగిన ఈ పోటీలో మొత్తం 56 మంది విద్యార్థినీ విద్యార్థులు అత్యంతాసక్తితో పాల్గొన్నారు. వారిలో శ్రీ పద్మావతీ మహిళా కళాశాల విద్యార్థిని కుమారి ఆర్. విజయ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ కళాశాల విద్యార్థి శ్రీ ఎం. వి. రామనాథ్, శ్రీ వేంకటేశ్వర జూనియర్ కళాశాల విద్యార్థి శ్రీ ఎం. రమేష్ ప్రథమబహుమతులుగా శ్రీవారి రజత డాలర్లను గెలుచుకొన్నారు. మిగిలిన విద్యార్థులందరికీ దేవస్థానం ప్రచురించిన ధార్మిక గ్రంథాలను బహూకరించడం జరిగింది.

ఏప్రిల్ 19, 20 తేదీలలో తిరుపతి శ్రీ అన్నమాచార్య కళామందిరంలో జరిగిన నన్నయ జయంత్యుత్సవాలలో ఆచార్య దివాకర్ల వేంకటావధాని, డా॥ జె. హేమలత, శ్రీ ఎర్రంరాజు శ్రీనివాసరావు, శ్రీ చిట్టా దామోదరశాస్త్రి తదితరులు నన్నయ భారతంపై సాహిత్య ప్రసంగాలు కావించారు- టి.టి.డి. పౌరాణిక పాఠశాల ప్రిన్స్‌పాల్ శ్రీ మల్లాది చంద్రశేఖరశాస్త్రి పురాణ పఠన, ఉపన్యాస కార్యక్రమాలు నిర్వహించారు- టి. టి. డి. సంయుక్తకార్య నిర్వహణాధికారి శ్రీ డి. సుబ్బరాయులు చేత ప్రారంభింపబడిన ఈ కార్యక్రమాలు హిందూధర్మ రక్షణ సంస్థ ఇన్‌ఛార్జి కార్యదర్శి శ్రీ సముద్రాల లక్ష్మణయ్య వందన సమర్పణతో ముగిశాయి.

## ధర్మసమ్మేళనము

కడపజిల్లా కమలాపురంలో తిరుమల తిరుపతి దేవస్థానముల హిందూధర్మరక్షణ సంస్థ మార్చి 26, 27, 28 తేదిలలో మూడు రోజుల భక్తి కార్యక్రమములు ఏర్పాటు చేసినది. గీతాపారాయణము, హరిభజనలు హరికథలు, ధార్మికోపన్యాసములు వేంకటేశ్వర వైభవ చిత్రప్రదర్శనము ఏర్పాటు చేయబడినవి. ఈ కార్యక్రమమునందు హిందూమతమునకు సంబంధించిన అన్ని సంఘములు, హరిజనులు, పాల్గొన్నారు, స్థానిక దేవాలయముల ధర్మకర్తలు దేవతల సామూహిక ఊరేగింపు నిర్వహించారు.

ఈ భక్తి కార్యక్రమ సభలకు స్థానిక సర్పంచ్ శ్రీ జి. వి. సుబ్బారెడ్డిగారు అధ్యక్షత వహించారు. చిత్తూరుజిల్లా యర్రంపల్లి రామకృష్ణ సేవాశ్రమవాసులు శ్రీరామకృష్ణానంద స్వామీజీగారు భక్తి, ధర్మము, సత్యము అను విషయాలపై సమాజమునందు ధార్మికచింతన అవసరమును గురించి బోధించిరి. "స్వామి వివేకానంద"ను మార్గదర్శిగ తీసుకొని మానవులు నైతిక విలువలను పెంపొందించుకొని పారమార్థిక చింతన కలిగివుండవలెనని కోరారు.

హిందూధర్మ రక్షణసంస్థ నిర్వాహకులు శ్రీ కె. కృష్ణాజీ హిందువులందరు ఐక్యతతో సంస్కృతి. సత్ప్రవర్తన, సదాచారములు కలిగి బిడ్డలను సత్పౌరులుగా తయారుచేసి సమాజ శ్రేయస్సుకు అంకితము కావలెనని కోరిరి.

తిరుపతి వాస్తవ్యులు శ్రీ షణ్ముగం భాగవతార్ మొదటిరోజు "రుక్మిణీ కళ్యాణము" రెండవరోజు "భక్తశిరియాళ" హరికథలు గానముచేసిరి. మూడవరోజు "శ్రీవారి వైభవము" చిత్రప్రదర్శన తిరుమల తిరుపతి దేవస్థానమువారు ఏర్పాటు చేశారు హరిదాసును, రామకృష్ణానందస్వామీజీ గారిని పై దేవస్థానముల తరపున కృష్ణాజీ సన్మానించారు.

## శ్రీ పద్మావతీ మహిళా పాలిటెక్నిక్ కళాశాల దినోత్సవము

తిరుపతి శ్రీ పద్మావతీ మహిళల పాలి టెక్నిక్ కళాశాల వార్షికోత్సవం ఏప్రిల్ 20వ తేది కళాశాల ఆవరణంలో జరిగింది.

సభకు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ రిజిస్ట్రార్ డాక్టర్ కె. చంద్రశేఖరరెడ్డి అధ్యక్షత వహించారు. ఆయన తన అధ్యక్షోపన్యాసంలో 'మహిళాశక్తి'ని గురించి చెప్పారు.

తిరుమల తిరుపతి దేవస్థానాల పౌర సంబంధ శాఖాధికారి శ్రీ రావుల సూర్య నారాయణమూర్తి మహిళల నుద్దేశించి ప్రసంగిస్తూ పెరుగుతున్న విద్యావకాశాలను వినియోగించుకుని మహిళలు శాస్త్రీయ సాంకేతిక రంగాలలో గణనీయమైన సేవ చేసి తమ శక్తిసామర్థ్యాలను నిరూపించు కోవాలని ఉద్బోధించారు.

కళాశాల నిర్వహించిన వివిధ పోటీలలో గెలుపొందిన వారికి తిరుపతి జడ్జి శ్రీమతి వి. కె. సరస్వతి బహుమతులను అంద జేశారు.

తొలుత విద్యార్థి సలహాదారు శ్రీ ఎస్.వి. నారాయణరావు స్వాగతం చెప్పారు. కళాశాల వార్షిక నివేదికను ప్రిన్సిపాల్ శ్రీ ఆర్. ఉదయభాస్కర్‌రెడ్డి చదివారు. శ్రీమతి చెంగాళమ్మ వందనసమర్పణ చేశారు.

కార్యక్రమం చివరలో సాంస్కృతిక కార్యక్రమాలు జనరంజకంగా జరిగాయి.

(45వ పేజీ తరువాయి)

- కర్నూలులో టి. టి. డి. కల్యాణమండప నిర్మాణానికి ఆమోదించడమైనది. ఏలూరు, ఒంగోలు, తిరుచానూరు, జహీరాబాద్‌లలోకూడా కల్యాణమండపాలను నిర్మించాలని తీర్మానిస్తూ జహీరాబాద్‌లో 5 లక్షలతోనూ మిగిలినచోట్ల 15 లక్షలకు మించకుండా నిర్మించాలని నిర్ణయించడమైనది.
- తిరుమలలో శ్రీ బేడి ఆంజనేయస్వామి ఆలయం, టి. టి. డి. కేంటిన్ కాంప్లెక్స్‌లకు మధ్యగల స్థలంలో రూ. 1 కోటి 20 లక్షలతో ఒక ఆస్థానమండపం నిర్మించేందుకు తీర్మానించడమైనది.
- తూర్పుగోదావరిజిల్లా అంతర్వేదిలోగల సత్రాన్ని టి.టి.డి. స్వాధీనం చేసుకొనే ప్రతిపాదనను అంగీకరించడమైనది.
- హిందూధర్మరక్షణసంస్థ పాలకసంఘంలో సభ్యులుగా జగద్గురు కంచికామకోటి పీఠాధిపతులు శ్రీ జయేంద్ర సరస్వతి స్వామి, పెజావర్ మఠాధిపతులు శ్రీ విశ్వేశ తీర్థస్వామి, వామదేవాశ్రమాధిపతులు శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయర్‌స్వామి వారలను తే 4-2-83 నుండి తే 4-2-86 ది వరకు మూడేళ్ళ పాటు పునర్నియమించడమైనది.
- దేవాదాయ ధర్మాదాయ శాఖవారి గుర్తింపును పొందిన ఆలయాలకు 8'×8' వైశాల్యం గల రాగిరేకు యంత్రాలను ఉచితంగా ఇచ్చేందుకు తీర్మానించడమైనది.
- తిరుమల తిరుపతి దేవస్థానంవారి పౌరాణిక పాఠశాలలో తే 14-5-83 నుండి తే 13-5-85 వరకు రెండేళ్ళపాటు రెండవ విడత విద్యార్థులకు శిక్షణ ఇచ్చేందుకు పాఠశాల ప్రధానాధ్యాపకులు శ్రీమల్లాది చంద్రశేఖరశాస్త్రి పదవీకాలాన్ని మరో ఏడాది పొడిగించేందుకు అంగీకరించడమైనది.
- ప్రముఖ ఆయుర్వేద వైద్యులు శ్రీకాల రాజ్ మహర్షి తిరుపతిలో నిర్వహిస్తూ వున్న ఉచితమూలికా వైద్య శిబిరాలకు ఆర్థిక సహాయం చేసేందుకు అంగీకరిస్తూ ఏడాదికి ఆరుశిబిరాలకు మించకుండా వుండాలని తీర్మానించడమైనది.
- తిరుపతి మైక్రోవేవ్ కేంద్రంవద్దగల రెండు ఎకరాల దేవస్థాన స్థలాన్ని దూరదర్శన్ రిలే కేంద్రం స్థాపనకోసం రాష్ట్ర ప్రభుత్వం ద్వారా భారత ప్రభుత్వానికి అప్పగించేందుకు అంగీకరించడమైనది.

## పౌరాణిక పాఠశాల

హిందువుల ఆధ్యాత్మిక వ్యాసంగాలలోనూ ధర్మప్రచార కృషిలోనూ పురాణ పఠనం ఒక ప్రత్యేక కళ–ఇది వంశపారంపర్యంగా వస్తున్న విద్యేతప్ప ఇదివరకు దీనికి ప్రత్యేక శిక్షణ సంస్థలంటూవుండేవి కావు. అందువల్ల ఈ కళ క్రమంగా క్షీణించి అంతరించిపోయే దశకు చేరుకోసాగింది. ఈ తరుణంలో తిరుమల తిరుపతి దేవస్థానం ఈ కళకు ఆలంబనంగా నిలిచింది. రెండేళ్ళ క్రితం 1981 మేనెల 14వ తేదిన దేవస్థానం ఆధ్వర్యంలో నెలకొన్న పౌరాణిక శిక్షణ పాఠశాలలో ఇప్పుడు మొదటి జట్టు విద్యార్థులు ఆరుమంది (నలుగురు యువకులు, ఇద్దరు యువతులు) తమ శిక్షణ పూర్తిచేసుకొని కొత్త పౌరాణికులుగా తమ పాత్రను సమర్థవంతంగా పోషించేందుకు సిద్ధంగా వున్నారు.

ప్రముఖ పౌరాణికులు శ్రీ మల్లాది చంద్రశేఖరశాస్త్రి ప్రధానాధ్యాపకత్వం నిర్వహిస్తున్న ఈ పౌరాణిక శిక్షణ పాఠశాలలో విద్యాప్రవీణ, భాషాప్రవీణవంటి ప్రాచ్య భాషాపండితులను వారి అర్హతలనుబట్టి చేర్చుకొని శ్రీమద్రామాయణ, భారత, భాగవత, భగవద్గీత, దేవీభాగవతం, శ్రీవేంకటాచల మాహాత్మ్యం తదితర పురాణాలను ప్రవచనంచేసే విధానం నేర్పుతున్నారు. ఈ శిక్షణ పొందినవారికి 'పౌరాణిక శిరోమణి' పట్టా బహూకరిస్తారు. శిక్షణ కాలంలో విద్యార్థులకు మొదటి సంవత్సరం రూ. 200-00 వంతున రెండవ సంవత్సరం రూ. 300-00 వంతున 'స్టైపండ్' ఇస్తున్నారు. ప్రస్తుతం ఈ పాఠశాలలో రెండవ విడత విద్యార్థులకు 'ప్రవేశాలు' జరుగుతున్నాయి. ఆసక్తిగలవారు కార్యదర్శి, హిందూధర్మ రక్షణ సంస్థ, తిరుపతి అనే చిరునామాకు తమ దరఖాస్తులను పంపుకోవచ్చును.



Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press, by M. Vijayakumar Reddy, L.P.E., Manager, T.T.D. Press, Tirupati.



### సాళంగనాట

అన్నిటా నీపెంపు వింత హనుమంత! నీ
వున్నచోట నిశ్చింత యో! హనుమంత!

రామునిసేనలఁగాచి రావణుగర్వమడచి
ఆముకొన్న బలవంత! హనుమంతా!
గోమున జలధి దాటి కొండతో సంజీవిదెచ్చి
ధీమంతుడవై తి వింత దివ్యహనుమంత!

చుక్కలు మొలపూసలై సూర్యమండలము మోచె
అక్కజపు నీరూపంత హనుమంత!
చొక్కమై మీరుండగాను సుగ్రీవాదులకెల్లా
అక్కర లేదించుకంతా హనుమంతా!

జంగచాచి చేయెత్తి సరిపిడికిలించుక
అంగము నిక్కించి తెంత హనుమంత!
రంగగు శ్రీ వేంకటాద్రిరామునిదేవి కిచ్చితి
వంగులియ్యక మొక్కంత హనుమంతా!

– తాళ్ళపాక అన్నమాచార్యుల సంకీర్తన.

# మీమాట

## ఉపదేశాలు

హిందూ ధర్మరక్షణకై పాటుపడుతున్న స్వాములవార్ల ఉపదేశములను వారివారి ఫోటోలతోసహా ప్రచురించగలరు. ప్రస్తుతం ధారావాహికంగా వస్తున్న శ్రీమద్భగవద్గీతను పాఠకులు ఒక పుస్తకంగా ఏర్పాటు చేసుకొనేందుకు అనుకూలంగా సప్తగిరిలో ముద్రించ ప్రార్థన.

పి. మాధవ్. — [illegible]

## రెండోవారానికైనా

సప్తగిరిలో ఎంతోమంది కొత్తరచయితల చేత ఎన్నోశీర్షికలపై ఉత్తమ రచనల్ని వ్రాయించి ప్రచురిస్తున్నందుకు చాల సంతోషం. కానీపత్రికను సకాలానికి ఎందుకు విడుదల చేయటంలేదో అర్థం కావటంలేదు. కనీసం నెల రెండో వారానికైనా పత్రికను పంపలేరా?

[illegible] — రాయచూరు

## బాల ప్రబోధం

బాలప్రబోధంలో మీరు ప్రచురించిన 'మాటలగారడీ' కథ రమణీయంగా వుంది. మహాభారత గాథను మధురమైన శైలిలో మా కందించిన జితేంద్ర గారికి మా అభినందనలు.

పి. మహేందర్ — [illegible]

## గ్రంథప్రచురణ

అష్టోత్తర శతోపనిషత్తులలో 10 మాత్రమే ప్రచారంలో వున్నాయి. అలాగే 32 వేల శ్లోకాలతో కూడిన యోగవాసిష్ఠం పాఠకులకు అందుబాటులో లేదు. తెలుగులో బ్రహ్మసూత్ర భాష్యాన్ని కూడా పొందలేకపోతున్నాము - ఇలాంటి అరుదైన గ్రంథాలను దేవస్థానంవారు తమ సొంత ప్రచురణలుగా ఎందుకు ముద్రించ కూడదు?

పుంకరరాయమోహనరావు — కందుకూరు

## సమాచారకేంద్రాలు

టి.టి.డి. సమాచార కేంద్రాలు దేశంలో ఎక్కడెక్కడ వున్నాయో అవి ఏం పనులు చేస్తున్నాయో తెలుసుకోవాలనుంది.

రాజకీయనాయకులు తిరుమల విచ్చేసిన సందర్భంగా వారి ఫోటోలతో పేజీలకు పేజీలను నింపడమెందుకు? వార్తగా ప్రచురిస్తే సరిపోతుంది గదా? ఆ పేజీలను సద్వినియోగం చేయండి!

* టి.టి.డి. సమాచార కేంద్రాల గురించి త్వరలో ప్రచురిస్తాము - మీ సూచన పరిశీలించగలం సం॥

జి. పి. గుప్త — [illegible]పల్లె

## విష్ణుపురాణం

తిరుమల తిరుపతి దేవస్థానంవారు గోపీనాథ రామాయణమును ముద్రించటం ముదావహం. అదే విధంగా వెంకటగిరి

(48 వ పేజీలో)

## రైలుబళ్ళు - అరణ్యరోదన?

గత మేనెల సప్తగిరి సంచికలో "యాత్రికులు రైలుబళ్ళు-" అనే అంశం పై 'శ్రీ నాగరాజ్' గారు బాగా వ్రాశారు. కానీ ఏం లాభం? మనం ఎన్ని వ్రాసుకొన్నా అరణ్యరోదనగానే వుంటుంది. భక్తుల సౌకర్యాలు ఎవరికి కావాలి? వస్తే వస్తారు లేకపోతే పోతారు. సామాన్య మానవుడు రైలు సౌకర్యాలు లేక ఎన్ని ఇబ్బందులు పడుతున్నది గమనించే వారెవ్వరు? తిరుపతి విజయవాడ ఎక్స్‌ప్రెస్ ఒక్కసారి చూస్తే గుండెలు ఆవలిస్తుంది. పిల్లా పాపలతో ఊపిరి ఆడక, స్థలంకోసం తన్నుకొనేవాళ్ళు, గుద్దుకొనేవాళ్ళు, అటు ఇటు సామానులతో పరుగుతీసేవారు, తిరునాళ్ళుగా వుంటుంది ఇదిగాక దొంగతనాలు! ఇంత-అగచాట్లు పడుతున్నా ఆ రైలువేగం నత్తనడకలాగే వుంటుంది.

తర్వాత పూరి ఎక్స్‌ప్రెస్ వుంది. అందులో నాలుగు లేక ఐదు పెట్టెలుంటాయి. అందులో ఒకటి మొదటి తరగతి, రెండు స్లీపర్లు, ఒకటి గార్డుపెట్టె. ఇక సామాన్య మానవుడు కూర్చోవటానికి చోటెక్కడిది? ఇంకో ఆరో, ఏడో పెట్టెలువేసి, గూడూరులో లింక్‌తో జోడించకుండా ప్రత్యేకంగా పంపిస్తే వచ్చిన నష్టమేమొ తెలియదు.

సరే, ఇక కాకినాడ తిరుపతి ప్యాసింజరు వున్నది. దీనికి మరో పేరు గూడావుంది. దొంగలబండి. ఇందులో లైట్లుకూడావుండవు. తిరుపతి నుండి విజయవాడకు ఇంతకన్నా వేరే రైళ్ళు లేనే లేవు.

శ్రీ వేంకటేశ్వరస్వామి దర్శనానికి రోజుకి కొన్ని వేలమంది, లక్షలమంది భక్తులువచ్చి పోతున్నారు. దేవస్థానంవారు ఎంతో ఉదారస్వభావంతో కొన్ని లక్షలు, కొన్ని కోట్లు ప్రజల సౌకర్యం కోసం రకరకాలుగా ఖర్చుపెట్టుతున్నారు. అయినా సరే ప్రజలకు రైలుబండ్లసౌకర్యం మాత్రం సరిగాలేదు. ఇక ఎవ్వరితో చెప్పుకోవాలి?

తిరుపతి నుండి వారణాసికి ఒక సూపర్ ఫాస్టు రైలు తిరుపతిలో సాయంత్రం 5 గంటలకువేస్తే ఎంతసౌకర్యంగా వుంటుంది. అదేవిధంగా మధురై వరకు వున్న బండిని రామేశ్వరానికి పొడిగిస్తే భక్తులకు ఎంత సౌకర్యంగా వుంటుంది! తిరుపతి నుండి ఢిల్లీకి ఎక్స్‌ప్రెస్ వేస్తే ఎంత సౌకర్యంగా వుంటుంది! ఇన్ని బండ్లు వుంటే వచ్చే లక్షలాది భక్తులకు ఎంత సౌకర్యంగా వుంటుంది! ఐతే చివరికి మనకు దొరికే సమాధానం ఏమంటే తిరుపతిలో రైలు పెట్టెలు వుంచేందుకు తావులేదనో, పెట్టెలు లేవనో! బూడిదలో పోసిన పన్నీరులాగా వుంటుంది. బహుశా ఈ అదనపు రైళ్లు రావాలంటే స్వలాభమున్న వ్యక్తిగానీ, తిరుపతిలో నివసించి ఢిల్లీకి వారం వారం పోయి వచ్చే వ్యక్తి దొరికితే రావచ్చును. లక్షలాది భక్తులు శ్రీ వేంకటేశ్వరుని ప్రార్థన చేయడం తప్ప ఇక చేయగలిగిందేమిలేదా?

పి. ఎస్. రాఘవేంద్ర — పుత్తూరు.




గౌరవసంపాదకులు .

శ్రీ జి. కుమారస్వామిరెడ్డి,
ఐ. ఏ. ఎస్.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

ప్రచురణకర్త - సంపాదకుడు :
కాట్రపాటి సుబ్బారావు,
ఎమ్. ఎ.

ఉపసంపాదకుడు :
తిరుమూరు సుధాకర్ రెడ్డి,
ఎమ్. ఎ. బి. ఇడి.

ముద్రాపకుడు :
ఎమ్. విజయకుమార్ రెడ్డి.

విడిప్రతి-రు. 1-00
సం॥ చందా-రు. 12-00

ప్రతులకు :
వెల్ ఫేర్ ఆఫీసర్,
టి. టి. డి., తిరుపతి

## ఈ సంచికలో....

జూన్ 1983
సంపుటి 14 సంచిక 1



రెండవకవరు: తిరుచానూరు శ్రీ పద్మావతీ అమ్మవారి తెప్పోత్సవం.
మూడవకవరు: తిరుమల కాలిబాటలోగల శ్రీ ప్రసన్నాంజనేయస్వామివారి విగ్రహం.

ఒక మనవి: గతసంచికలోని రెండవ మూడవ కవరుపేజీలు శ్రీ గోవిందరాజస్వామి బ్రహ్మోత్సవ దృశ్యాలని గమనించ ప్రార్థన.

ముఖచిత్రం: సప్తగిరి సౌందర్యం

# సంపాదకీయం

ప్రపంచంలో ఈనాడు పత్రికలకున్న ప్రాధాన్యం సమకాలీనంగా ఏ ఇతర ప్రచారసాధనానికీ లేదనిచెప్పవచ్చు. కాని లోతుగా పరిశీలిస్తే ఆదిమానవుని సంకేతాల పరిణామమే నేటి వార్తాపత్రికల రూపం అని చెప్పవలసి వుంటుంది.

'వృత్' అనే ధాతువుకు సాగటం అని అర్థం. సాగేదీ, సాగించేదీ గనుక ఆశక్తి వార్త అయింది. సమానధర్మాలు గల ఈ విశాలవిశ్వంలో ముఖ్యంగా ప్రాణికోటికంతటికీ సమధర్మమైన ఆహార భయ నిద్రామైథునాలలో, వాటిని ఆలంబనంగా చేసి కొని సామాన్యంగానో, ఒకోసారి లేదా విపరీతధర్మాలుగానో జరుగుతూవుంటై. అయితే ఈ ప్రవృత్తి బద్ధకార్యకలాపాలు వాటి వ్యత్యాసాలు ఏ ఒక సమూహానికో, జాతికో, వ్యక్తికో పరిమితం కాక బండికళ్ళమాదిరి కంటికి కన్పించనంత వేగంగా తిరుగుతూ ఎక్కడో ఒకచోట ప్రతిబింబిస్తూనేవుంటై. సామాజికమైన సామూహిక వైయుక్తిక కార్యకలాపాలను ప్రకటించే విధానమే వార్త.

ఈ వార్త అనేది రాజనీతిలో కూడా అతికీలకస్థానం ఆక్రమించింది. మహాభారతం సభాపర్వంలో ధర్మరాజుకు నారదుడు—

"వార్తయందు జగము వర్తిల్లుచున్నది
యదియులేనినాఁడ యఖిలజనులు
నంధకారమగ్నులగుదురు గావున
వార్త నిర్వహింపవలయుఁ బతికి."

అని ఉపదేశిస్తారు. దీనికి మూలం సంస్కృత మహాభారతంలో 'వార్తాయాం సంశ్రితస్తాత లోకోఽయం సుఖమేధతే' అని వుంది. వార్తవలన జనులకు క్షేమం కలుగుతుంది గనుక వార్తానిర్వహణం రాచరికంలో, ప్రముఖకర్తవ్యంగా నిరూపించారు మరి.

అసలీవార్త ఎలా రూపొందింది? ప్రాణికోటిలోని రెండు ప్రాణులకు సమానధర్మాలలో ఏర్పడ్డ మానసికోద్రేకాలను వ్యక్తంచేసేందుకు తోడ్పడిన నాదాత్మక సంకేతం వివిధ పరిణామాలను చెంది ఈనాటికి మన చేతిలో పత్రికగా రూపొందింది. అవ్యక్త స్వరావధానమే పశుపక్ష్యాదులలో భావవావగాహనకు కారణం కాగా వికసనశీలియైన మానవుడు స్పష్టాక్షరరూపంలో వ్యక్తం చేయగలిగాడు. ఈ వాఙ్మయ భావనాపరంపరను దూరస్థులకు వ్యక్తం చేసేందుకు వార్తాహరులుగా పక్షులను, పరివారాన్ని ఉపయోగించుకోవటం జరిగింది. భాష వివిధ పరిణామాలు పొంది వాఙ్మయం సాహిత్యరూపాలను సంతరించుకున్నా రామాయణ, మహాభారతాల కాలంనాటికి లిపిబద్ధమైన విధానం వుందని చెప్పేందుకు అవకాశంలేదు. రామాయణంలో అంగద, ఆంజనేయ సందేశాలూ భారతంలోని ద్రుపద, పురోహిత, సంజయ, శ్రీకృష్ణరాయబారాలుకూడా ఈ దశనే స్పష్టం చేస్తున్నై.

ఐతే దీనికీ రాజధర్మాలకూ సంబంధమేమిటన్న ప్రశ్నరావచ్చు. సమాజంలో వివిధ అంగాలు సక్రమంగా పనిచేసేందుకు పరస్పర అవగాహన అవసరం. సమాజమంతా సమానధర్మకర్మావృతమైందిగనుక వీటికి అవరోధం, వ్యత్యయం ఎక్కడ ఏర్పడుతున్నదో గ్రహించి వాటిని ఉపాయాల ద్వారా నిరోధించి సమాజాన్ని ముందుకు నడిపించడమనేది, ఆ వ్యత్యయాలు వాటి పరిణామాలను తెలియజెప్పి మానవుణ్ని సక్రమమార్గంలో నిలపటమన్నది శిష్టులైన వారి కర్తవ్యం. సమాజం లేదా సంఘనాయకులు (రాజనండి, మరేపేరైనాకానీ) ముందు ఈ విషయాలన్నీ తమ కనుకూలమైన పరిషత్తుల ద్వారా, గూఢచారుల ద్వారా రాబట్టుకుని వార్తావిశ్లేషణం చేసి లోపాలను సరిదిద్దే ప్రయత్నాలు చేసేవారు. ఇంతవరకు వార్తానిర్వహణలో ఇది మొదటి భాగం. ముఖ్యమైన రెండవ విభాగం వార్తాప్రచారం, ప్రసారణం. ఇదే ఈనాటి పత్రికావ్యవస్థకు ఊపిరి. అధికారపీఠ నిర్ణయాలను మొట్టమొదట వాగ్రూపంగానే ప్రసారం చేయటం జరిగేది. డప్పు, డమరు, కాహళ మొదలైన వాద్యవిశేషాలద్వారా జనాన్ని నిర్దిష్ట ప్రదేశాలకు ఆకర్షించి అక్కడనో లేదా వీధి వీధి హెచ్చరికగానో విన్పించటం చేసేవారు. ఇది ఈ నాటికీ అమలులోనున్న వ్యవహారం.

వాక్కు అక్షరమయ్యేందుకు చాలాకాలం పట్టివుంటుంది. మనదేశంలో జైనబౌద్ధాలదాకా కావ్యప్రపంచమంతా వాగ్రూపంలోనే వుండేదనవచ్చు. లిఖితరూప వార్తాప్రసారంలో మొదటిమెట్టు అశోకునితోనే ప్రారంభమైనట్లు కన్పిస్తుంది. బౌద్ధ ధర్మాభిరతిని గూర్చి తాను జయించిన ప్రాంతాలలో శిలాశాసనాలు వేయించింది మొదట అశోకుడే. ఆ తరువాతి రాచరికాలలో తామ్రశాసనాలు వివిధ ప్రచారరూపాలు వచ్చాయి. ఇక్కడి నుండి పత్రాలమీద వ్యవహారాలు, సందేశకార్యక్రమాలు ప్రారంభమయ్యాయి. రాచరికాలలో ఘర్షణలు సహజమేగనుక వాటి ప్రభావం సమాజం పైనకూడాపడి అనుకూలంగా, ప్రతికూలంగా సమాచార ప్రసారవిధానాలను పెంపొందించటం జరిగింది. కనుక ప్రజాపాలన కర్తవ్యంగాగల పాలకులు సామాజికమైన విజ్ఞానసంకలనం కోసం వార్తాహరణం సమాజశిక్షణ, పాలనల కోసం వార్తాప్రసారణం అనే విధులను తప్పనిసరిగా నిర్వర్తించవలసివున్నదన్నమాట.

(48 వ పేజీలో)

# శ్రీమద్భగవద్గీత (సీరియల్)

వ్యాఖ్యాత : శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి

(గతసంచిక తరువాయి)

వ్యవసాయాత్మికా బుద్ధిః ఏకేహ కురునందన।
బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్॥

కురునందనా! నిశ్చయాత్మకమైన బుద్ధి ఒకే విధంగా వుంటుంది. స్థిరసంకల్పం లేనివాళ్ల ఆలోచనలు పరిపరివిధాల పరుగులెడుతాయి.

యామిమాం పుష్పితాం వాచం ప్రవదంత్యవిపశ్చితః।
వేదవాదరతాః పార్థ! నాన్య దస్తీతి వాదినః॥

కామాత్మాన స్స్వర్గపరాః జన్మకర్మఫల ప్రదామ్।
క్రియావిశేష బహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి॥

భోగైశ్వర్య ప్రసక్తానాం తయాపహృతచేతసామ్।
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే॥

పార్థా : అవివేకులూ, అర్థవాదాలపట్ల ఆసక్తికలవాళ్లూ, స్వర్గసుఖాలకు మించి మరొకటి లేదని వాదించేవాళ్లూ వేద వాక్యాలు పలుకుతుంటారు. అలాంటివాళ్లు తాము చేసిన వైదిక కర్మల ఫలితంగా స్వర్గసుఖాలు అనుభవించాక, వాళ్లకు మళ్లీ కర్మభూమిలో పునర్జన్మ రూపమైన కర్మఫలమేతప్ప మోక్షం లభించదు. భోగభాగ్యాలూ కోరి వేదవాక్యాలకు వశులైన వారి బుద్ధి నిలకడగా వుండదు.

త్రైగుణ్యవిషయా వేదాః నిస్త్రైగుణ్యో భవార్జున!।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥

అర్జునా! వేదాలు మూడుగుణాలు కలిగిన కర్మకాండలను వివరిస్తాయి, నీవు త్రిగుణాలనూ విడిచిపెట్టి, ద్వంద్వాలు లేనివాడవై యోగక్షేమాలు కోరకుండా శుద్ధసత్వగుణం అవలంబించి ఆత్మజ్ఞానివి కావాలి.

యావా నర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే।
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥

నదినుంచి నీరుతెచ్చుకునేవాళ్లు నూతికి ఎలా ప్రాముఖ్యమివ్వరో అలాగే బ్రహ్మజ్ఞానులు ప్రతిఫలాపేక్షతో కూడిన వేద కర్మలకు ప్రాధాన్యం యివ్వరు.

కర్మణ్యే వాధికార స్తే మా ఫలేషు కదాచన।
మా కర్మఫలహేతుర్భూః మా తే సంగోఽస్త్వ కర్మణి॥

కర్మలు చేయుడం వరకే నీకు అధికారం. కర్మఫలంతో నీకు సంబంధంలేదు. కనుక ప్రతిఫలం ఆశించి కర్మచేయకు. అలా అని కర్మలు మానడానికి చూడకు.

యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనంజయ।
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా, సమత్వం యోగ ఉచ్యతే॥

ఫలం దక్కినా దక్కక పోయినా కర్మలు సమభావనతో సాగించు అర్జునా! ఈ సమదృష్టినే యోగమంటారు.

దూరేణ హ్యవరం కర్మబుద్ధియోగా ద్ధనంజయ।
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః॥

ధనంజయా! ప్రతిఫలాపేక్షతో ఆచరించే కర్మ నిష్కామ కర్మకంటే హీనం. ఫలితం ఆశించి కర్మచేసేవాళ్లు అల్పులు. అందువల్ల నీవు సమబుద్ధినే ఆశ్రయించు.



బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృత దుష్కృతే।
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్॥

సమభావన కలిగిన పురుషుడు పుణ్యపాపాలు రెండింటినీ ఈలోకంలో వదిలేస్తున్నాడు. కనుక సమత్వబుద్ధి అయిన నిష్కామకర్మనే నీవు ఆచరించు. కౌశలంతో కర్మలు చేయడమే యోగమని తెలుసుకో.

కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః।
జన్మబంధ వినిర్ముక్తాః పదం గచ్ఛ న్త్యనామయమ్॥

నిష్కామయోగులు కర్మఫలం ఆశించకుండా జన్మ బంధాలనుంచి తప్పించుకుని, ఉపద్రవంలేని మోక్షం పొందుతున్నారు.

(42 వ పేజీలో)

# ప్రగతిపథంలో

మనిషి పెరుగుదల మనకు కన్పిస్తుంది. ఒళ్ళు ఎదుగుదల గూడా చెప్పవచ్చు. కాని మనస్సు ఎదిగిందా లేదా-దీన్ని నిర్ణయించే హద్దులులేవు. దానికి మనస్సే సాక్షి. మనిషి ఎదిగినా మనస్సు ఎదగలేదని ఎన్నో సంఘటనలు మనకు తెలుసు. మరి మనుష్యుల హృదయాలను మలిచేది, ఎదుగుదలను ఎదురుగావున్న వాళ్ళకేగాక, అందరికీ అంచనావేసి చెప్పేది పత్రిక. కనుకనే పత్రికల ఎదుగుదల కూడా ఎంతో సహజంగా వుంటుంది. దానికది చాటుకుంటేనేగాని ఎదుగుదల ఎంతో మామూలు పద్ధతులలో అందదు. అందుకే పెళ్ళు, పెళ్ళుమంటూ మోతలెత్తిస్తున్న పత్రికలు తెల్లవారేసరికి వెళ్ళుమని పోవటం మనం చూస్తూనే వున్నాం.

కాని, ఏవో కొన్ని నైతికవిలువలతో, నిర్మాణాత్మక సిద్ధాంతాలతో లేదా ఆశయాలకు కట్టుబడి కొన్ని మాత్రం తమ అస్తిత్వాన్ని, ఆవశ్యకతను నిరూపించుకుంటూ ముందుకు సాగుతున్న పత్రికలు లేకపోలేదు. ఆ కోవకు చెందినదే 'సప్తగిరి'.

వెనక్కు తిరిగిచూస్తే ఆ వెనుకవున్న ఆధ్యాత్మిక తేజస్సు ఎంతబలీయమైనదో అనిపిస్తుంది....

శేషాచలపతి ఐన శ్రీనివాసుని దర్శించ వచ్చే వేలాది యాత్రికులకు దేవస్థానం చేస్తున్న, చేయనున్న సౌకర్యాల వివరాలను మూలమూలల్లోని భక్తులకు తెలియజేయటంతోపాటు క్షేత్రమహిమ, తదితర పౌరాణిక, వైదిక విజ్ఞానాన్ని ప్రబోధించి ఆస్తికులలో ఆధ్యాత్మిక రోచిస్సులవిచ్చి స్వంతంగా వెలగడానికి తోడ్పడేటందుకు 1949 సంవత్సరంలో తిరుమల, తిరుపతి దేవస్థానం ఒక ప్రచారసాధనం ఏర్పాటుకు శ్రీకారం చుట్టింది. దాని ఫలితంగా ఏప్రియల్ 1949 లో కరపత్ర సదృశమైన పత్రిక వెలువడింది. అప్పుడది ప్రచారమాత్రంగా వుండేది. దానిపేరే దేవస్థానపు 'బులెటిన్.' నాటినుండి నేటివరకూ అంటిపెట్టుకొనివున్న అభిమానులకు మాత్రమే సప్తగిరీశ విరాట్ స్వరూపం పత్రికా రూపంలో ఎలా సాగిందీ తెలుస్తుంది. అనంతంగా ఈ వేంకటేశ్వర సేవాకార్యక్రమం దినదిన ప్రవర్ధమానమై దేవస్థాన సమాచార ప్రసారంతోపాటు, పలువురు ఆర్షవిజ్ఞానంలో దిగ్దంతుల్లాంటి పండితుల సహకారంతో ఉత్తమ ఆధ్యాత్మిక సాహితీసౌరభాలను వెదజల్లింది 1961 వరకు.

ఈ మధ్యకాలంలో శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయంకూడా దేవస్థానం అధీనంలో ఉండటంతో, అందరు పండితుల మన్ననలు వ్యాసరూపంలో పత్రికకు కావలసినంత పరపతిని, ప్రజాశీకను సమకూర్చాయి. నిజానికి దేవస్థానం నుండి లోగడ వెలువడిన గ్రంథాలలో అధికశాతం మొదట మాసపత్రికలో వెలువడి తర్వాత గ్రంథరూపాన్ని సంతరించుకున్నాయంటే అందులో అసత్యం ఏమీలేదు.

మొక్క మానుకావటం, పూవు కాయకావటం రివాజు. అలాగే, ఈ పత్రికను కేవలం తిరుపతి యాత్రాసహాయిని స్థాయిలోనే నిల్పకుండా, దీన్ని మహోజ్జ్వల ఆధ్యాత్మికతా ప్రసారణ ప్రతీకగా నిలిచే మాసపత్రికగా తీర్చిదిద్దాలనే ప్రయత్నం 1961 లోనే ప్రారంభమైంది. 'బులెటిన్' 'దేవస్థాన మాసపత్రికగా,' వార్తాపత్రికల నిబంధనలకనుగుణంగా పేరును సంతరించుకున్నది ఈ 1961 లోనే. దీని కార్యరూపమే ఒక సంపాదకుణ్ని, అనుబంధ సిబ్బందిని 1963 లో నియమించటం. దీనివల్ల పత్రికపైన, దాని ప్రగతి విషయంలో ప్రత్యేక శ్రద్ధతీసుకునే అవకాశం కలిగింది. ఆనాడు పత్రిక ప్రతులసంఖ్య 3000 మాత్రమే. చిన్న ఆకృతిలో (1/8 డెమ్మీ) వున్న ఈ పత్రిక ఆ రోజులలో చందాదారులకు ఇవ్వటంతోపాటు తిరుమల, మద్రాసు, హైదరాబాద్, బెంగుళూరులలో పత్రిక విక్రయం జరుగుతుండేది. ఆంగ్ల, తమిళ, తెలుగు, కన్నడ, హిందీభాషల వ్యాసాలన్నీ చిన్న చిన్నవిగా ప్రచురితమౌతుండేవి.

ఆశించిన ఫలితాలు కొంతైనా పొందాలంటే పత్రిక ఉనికి పదిమందికి తెలియాల్సిన అవసరం ఎంతైనావుంది. ఈ ప్రజాశీకకు ప్రారంభంగా పత్రిక విక్రయాన్ని తిరుమల, తిరుపతి దేవస్థానానికి ఆనాడున్న ధర్మశాలలు, దేవాలయాలు, సమాచార కేంద్రాలలో 1966 జులైలో ప్రారంభించటం జరిగింది. విక్రయకేంద్రాలు మూడు నుండి పన్నెండుకు వచ్చి ఆ పైన విస్తరణ పొందాయి. దీనివల్ల పత్రిక ప్రతులసంఖ్య కూడా పెరిగింది.

దేవస్థాన విధాన ప్రచారం, ఆర్షవిజ్ఞాన ప్రసారం ఆశయమైనప్పుడు ఈ పరిధి పలు ప్రాంతాలలో విస్తరించక తప్పదు. అందువల్ల పత్రికను, కమీషన్‌మీద ఇతరవ్యక్తుల ద్వారా అమ్మించే విధానాన్ని 1967 ఏప్రెల్ నెలలో అమలుచేయటం జరిగింది.

ఇది ఈ పత్రిక ప్రగతిలో ఒక ముఖం. మానుకు కొమ్మలు వాటికి రెమ్మలు ఏర్పడటం మనకు కన్పించే దృశ్యం. స్వామివారు అనేక భాషాశాఖోపశాఖాత్మక సనాతనాశ్వత్థవృక్షం. కార్యక్రమ సమాచారంగాని, ఆధ్యాత్మికతా ప్రబోధంకాని అయా

నాగరాజ్

భాషలలో వుండే ఎక్కువ అవగాహన ఏర్పడ గలదన్న భావం బలపడింది.

ఇంతవరకు బహుభాషామయంగా వెలువడిన దేవస్థాన పత్రికను 1970 జనవరి నుండి ఇంగ్లీషు, సంస్కృతం అన్ని పత్రికలకు అంతర్భాగంగా పత్రికను తెలుగు, తమిళం, కన్నడం, హిందీభాషా పత్రికలుగా వేరుచేసి విడుదల చేయటం జరిగింది. దీనివలన ఆ భాషాపత్రిక ఆయా భాషా ప్రాంతాలలో మారుమూలలకు చొచ్చుకుని పోయే అవకాశం కల్గింది. అంటే స్థిరప్రాతిపదికపైన పత్రికను రూపొందించే విధానం 1966 నుండి 1970 వరకు దశలవారిగా జరిగిందన్నమాట.

పిల్లలకు పేర్లు పెట్టుకుంటున్నా మరీ అవసరం వచ్చేదాకా వాళ్ళు మనకు చిట్టీ, బుజ్జీ, అమ్మడు, బాచి, నాని వగైరా. అనగూడదు కానీ యీ పత్రిక విషయంలోకూడా



అదే జరిగింది. 1949 నుండి 1970 వరకూ అంటే దాదాపు 20 సంవత్సరాలపాటు పత్రిక పత్రికా సంప్రదాయానికనుగుణంగా, స్వావలంబకమై సాంకేతికమైన పేరేదీ లేనట్లుగానే పెరుగుతూ వచ్చిందన్నమాట. అందుకే స్వామి యీ బిడ్డకు ఆ కొరత తీర్చటం జరిగింది. 1970 జూన్‌లో, ఏడు కొండలకు సాంకేతిక ప్రతీకగా, 'బులెటిన్'గా పుట్టి పత్రికగా పెరిగి 'సప్తగిరి'గా అవతరించింది. నాటి నుండి ఈనాటికి అంతటి చరిత్ర వుంది ఈ పత్రికకు.

ఇక్కడి నుండి పత్రికగతిలో గణనీయమైన మార్పులు తీసుకురావడం జరిగింది. ఇన్ని ఏళ్ళపాటు చిన్న పత్రికగా వుంటూ వచ్చిన యీ పత్రికను ఏప్రియల్ 72 లో ¼ క్రౌన్ పరిమాణంలోకి తీసుకరావటం జరిగింది. ఇంగ్లీషు, సంస్కృతాలు అన్ని పత్రికలకూ సమానంగానే వుండేవి. కాని, అక్కరలేని వారిపై రుద్దనక్కర లేకుండా వుండేందుకు వివిధ భాషల పత్రికలు ఆ భాషా ప్రాంతాలలో గణనీయస్థితిని పొందేందుకు వీలుగా జనవరి 1975 నుండి ఇంగ్లీషు భాషాభాగాన్ని వేరుచేసి ఐదు భాషల్లో పత్రికలు విడివిడిగా విడుదల చేయటం జరిగింది. ఈ పద్ధతివల్ల ప్రతి సప్తగిరి, రెండవ భాషా పత్రికతో సంబంధం లేకుండా ముందుగా విడుదల అయ్యే అవకాశం ఏర్పడింది. 1975 ఆగస్టులో పత్రికను ¼ క్రౌన్ నుంచి ¼ డెమ్మీ సైజుకు మార్చటం జరిగింది.

ఇన్ని దశల వారీగా పరిణామం పొంది మన ముందున్న సప్తగిరి ఈనాడు ఆస్తిక సమాజంలోని పలువర్గాలవారికి అవసరమైన ఆలోచనాత్మకమైన, చైతన్యవంతమైన విషయాలు ప్రకటించటం జరుగుతున్నది.



ఆనాటి 3000 ప్రతుల ప్రచురణ ఈనాటికి 40,000 పైగా వుంది.

ఐతే ఈ కృషి, వృద్ధి, తత్ఫలితము ఏ వ్యక్తికో చెందింది మాత్రం కాదు. దేవస్థాన కార్యనిర్వాహణాధికారులందరూ ఒక్కొక్కరు తమతమ బాటలలో సప్తగిరి ప్రగతికి తోడ్పడ్డారనటంలో సందేహంలేదు.

డాక్టర్ చెలికాని అన్నారావు కార్యనిర్వాహణాధికారిగా వున్నకాలంలోనే 'బులెటిన్'ను దేవస్థాన మాసపత్రికగా మార్చటం జరిగింది. పత్రికను సుస్థిరమైన సంప్రదాయాలపై నడిపే కార్యక్రమం శ్రీ ఉమాపతి కాలంలో ప్రారంభమైంది. పత్రిక భాషా విషయక విభజనకూ, కొత్తపేరుతో అవతరించటానికి శ్రీ యం. చంద్రమౌళిరెడ్డి, పత్రికను ఐదు భాషలలో విడివిడిగా వెలువటానికి శ్రీ కె. రాజగోపాలరాజు కారణభూతులుకాగా, శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ కాలంలో పత్రికను ఆస్తిక సమాజంలోని



డా॥ సి. అన్నారావు

వివిధ వర్గాలవారికి ఆమోదయోగ్యంగా మలిచే ప్రయత్నాలు జరిగాయి. ఇప్పుడు సహృదయులు, సౌజన్యశీలి శ్రీ కుమారస్వామిరెడ్డి నాయకత్వంలో మరింతగా బలపడాలని ప్రయత్నిస్తున్నది. ఇలా 'సప్తగిరి' ప్రగతికి చేయూతనిచ్చిన మహానుభావు లెందరో వున్నారు.



శ్రీ బి. నరసింగరావు

## 'సప్తగిరి' సాధించినదేమిటి ?

ప్రతి పనికి ఒక ప్రయోజనం వుంటుంది. ఫలంలేని పనిని పనికిమాలినవాడు కూడా చేయడని సామెత. పరహితైషికంగా నడిచే పత్రికలకు అనంతమైనది ఆశయం, కర్తవ్యం మాత్రం, అనుకున్న ఆశయపు పరిధిలో సేవచేస్తూ ముందుకు పోవటమే. మనుషుల జీవితంలో మాదిరే పత్రికలకు

(41 వ పేజీలో)



శ్రీ కె. ఉమాపతి

**మోక్షవిషయక తత్త్వాన్వేషణకై** మన మహర్షులు గర్శించి వచించిన సిద్ధాన్తములే 'దర్శనములు' గా వ్యవహరింపఁబడుచున్నవి. 'దృశిర్- ప్రేక్షణే' - అను ధాతువుపై భావ, కర్మార్థముల రెండింటను 'దృశ్యతే ఇతి, దృశ్యతే అనేనేతి' - అని రెండు విధములుగా దర్శన శబ్దము నిష్పన్నమగును. కాఁగా దర్శనమనగా చూచునది లేక చూపునది యని యర్థము. అత్తరి, 'దేనిని?' - యను నాకాంక్ష యుత్థితమగును. అందులకు- సంసార మూలకారణమును నశింపజేయు జ్ఞానమును అని సమాధానము. ఈ దర్శనములు నాస్తికాస్తిక భేదముచే ద్వివిధములు. వేద ప్రామాణ్యము నంగీకరింపనివి నాస్తిక దర్శనములు. వేదప్రామాణ్యము నంగీకరించునవి యాస్తికదర్శనములు. చార్వాక బౌద్ధ జైన అర్హత దిగంబర దర్శనములు నాస్తికములు. ఆస్తిక దర్శనములలో రామానుజ, పూర్ణప్రజ్ఞ, నకులీపాశుపత. శైవ, ప్రత్యభిజ్ఞా, రసేశ్వర. ఔలూక్య, అక్షపాద, జైమిని, పాణిని, సాంఖ్య, పాతఞ్జల శాంకరదర్శనములు ప్రసిద్ధములు.

**వీనిలో** రామానుజ దర్శనము వైష్ణవ దర్శనము. అనగా విష్ణుపారమ్యతను బోధించునదని భావము. ఈ దర్శనమావిర్భవించుటకు పూర్వము బౌద్ధ జైనముల ప్రాబల్యమధికముగనుండెడిది. అందున జైనులయొక్క స్యాద్వాదము కడు నప్రధృష్యముగా బరగుచుండెను. 'స్యాదస్తి, స్యాన్నాస్తి, స్యాదస్తిచనాస్తిచ స్యాదవక్తవ్యః, స్యాదస్తి చావక్తవ్యః, స్యాన్నాస్తిచావక్తవ్యః, స్యాదస్తి చనాస్తి చావక్తవ్యః, అను సప్తభంగి భణితి వైచిత్ర్య ప్రతిపాదితమగు నీ వాదము 'సప్తభంగి నయము' ను పేర నాటి సత్-అసత్, సదసద్ అనిర్వచనీయ వాదముల నన్నింటిని నిర్జించుచుండెను. ఆ సమయమున నీ వాదమును ఖండించి వైష్ణవాచార్యులు పదార్థములను భోక్తృభోగ్య నియామకు లగు చిదచిదీశ్వర ప్రభేదత్రయాత్మనా ప్రతిపాదించిరి.

ఈశ్వరశ్చిదచిచ్చేతి పదార్థత్రితయం హరిః।
ఈశ్వరశ్చిదితి ప్రోక్తో జీవో దృశ్యమచిత్పునః॥

**అని** వారి సిద్ధాన్తము. ఏ తన్మతమున నిత్యశుద్ధబుద్ధముక్త స్వభావరూపమగు బ్రహ్మమే పరమార్థము. అదియే పరమాత్మ స్వరూపము. 'తదైక్షత బహుస్యాం ప్రజాయేయ' - అను శ్రుతిచే నదియే జీవశరీరమును బ్రవేశించి- 'సోఽయం దేవదత్తః' అను వాక్యమునందువలె- 'తత్త్వమసి' యను మహావాక్యబోధలో కారణమగుచున్నది. కావున తత్, త్వం పదార్థములకు



సామానాధికరణ్యము సిద్ధించుచున్నది. జీవాత్మకూడ శరీరత్వప్రకారమును పురస్కరించుకొని బ్రహ్మాత్మకమగుచున్నది. 'య ఆత్మని తిష్ఠన్నాత్మనోఽన్తరో య ఆత్మా నంవేదయస్యాత్మా శరీరమ్'- ఇత్యాదిశ్రుతి వాక్యమిందులకు ప్రమాణము. కావుననే సర్వశబ్దములు పరమార్థ వాచకములు అను వచనము ఉపపన్నమగును.

చిచ్ఛబ్ద వాక్యములగు జీవాత్మలు పరమాత్మకంటె భిన్నములని వీరి సిద్ధాంతము. 'ద్వా సుపర్ణా సయుజా సఖాయా' ఇత్యాది శ్రుతివాక్యమిందులకు ప్రమాణము.

**జీవాత్మ పరమాత్మల నిత్యత్వము-**

న జాయతే మ్రియతే వా విపశ్చిన్నాయం
భూత్వా భవితా వా న భూయః।
అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే॥

**అను శ్రుతి వలనఁదెలియుచున్నది. మఱియు వాని అణుత్వముకూడ -**

వాలాగ్రశత భాగస్య శతధా కల్పితస్య చ
భాగో జీవః స విజ్ఞేయః స చానన్త్యాయ **కల్పతే.**
**(శ్వేతాశ్వతరోపనిషత్)**

అనియు

'ఆరాగ్రమాత్రః హ్యవరః' (ముండకోపనిషత్)

అనియు

'అణురాత్మా చేతసా వేదితవ్యః'

అనియును చెప్పఁబడినది. **అచిచ్ఛబ్ద** వాచ్యమగు దృశ్యజగత్తంతయు **భోగ్య,** భోగోపకరణ, భోగాయతన **భేదములచే** ముప్విధములుగా వింగడింపఁ **బడినది.**

# రామానుజ దర్శనము

— శ్రీ కొల్లూరు అవతారశర్మ

జగదుపాదాన కారణముగా నీశ్వర పదార్థ వాచ్యుఁడుగా పురుషోత్తముఁడగు వాసుదేవుడు చెప్పఁబడినాఁడు. పరమాత్మయగు వాసుదేవుడు జీవునికన్న భిన్నుడు. **అత** డనంత కల్యాణవిభవసంపన్నుడు. **భక్త** వత్సలుడు. జీవనియామకుడు. **జీవు** డాతని యనుగ్రహపాత్రుడై సాన్నిధ్యము నంది విశిష్టుడగును. అద్వైతబ్రహ్మవలె నితడు నిర్గుణుడు, నిరాకారుఁడుకాదు. కాగా ననంత కల్యాణవైభవ సంపన్నుడు.

వాసుదేవః పరంబ్రహ్మ కల్యాణగుణ సంయుతః।
భువనానాముపాదానం కర్తా జీవనియామకః॥

అని చెప్పబడినది. ఇతడే తన భక్తులకు (జీవులకు) వారి వారి యర్హతల ననుసరించి బహువిధముల ఫలముల నిచ్చునని చెప్పబడినది.

వాసుదేవః స్వభక్తేషు వాత్సల్యాత్తత్తదీహితమ్।
అధికార్యాను గుణ్యేన ప్రయచ్ఛతి ఫలం బహు॥

(37 వ పేజీలో)

# శ్రీనివాసకల్యాణము

[గతసంచిక తరువాయి]

(ఎరుకం కాంభోజిరాగం)

ఎరుకత: ఎరుకడగరోయమ్మ ఎరుకా
గరిత్తలారా మంచి యెరుకా ॥ ఎరుకడగరో ॥

తలపు తలుపులు తెరచి
తెలియ జెప్పే ఎరుక ॥ ఎరుక ॥

తెరల మరుగున దాగు ఎరుక
మరపు మడతల దోగు ఎరుక
ఎరుక జెప్పేనమ్మ ఎరుక
ఎరుకడగరోయమ్మ యెరుక
మా మంచిఎరుక ఎరుకచెప్పేనమ్మ
ఎరుకా, ఎరుకో ఎరుకా.

చెలి: ఎరుకవ్వా ఇలా వచ్చేవా? మా రాణి పిలిచేని.

ఎరుకత: ఎరుకడగతవ తల్లీ ఎరక? ఎరక చెప్పేగాని నా బుడతడికింత బువ్వెడతావా అవ్వా!

చెలి: పెట్టేగాని నీ దేవూరవ్వా?

ఎరుకత: కొండమీద గోవిందుడుండే రేవల్లెతల్లీ, రేవల్లంటే రేవల్లెకాదు, ఎరుకవల్లే తల్లీ- బుడతడి కింత బువ్వెట్టు తల్లీ-

చెలి: గడప మెట్టేవో లేదో బువ్వబువ్వంటావు, లోనికిరా గదమ్మా! మా దొరసాని పిలిచేని.

కథక: ఇట్లా ఎరుకత ధారుణీదేవి చెంగటి కేతెంచి యేమను చున్నది-

ఎరుకత: అవ్వోయవ్వ-పెద్దదొరసాని! ఎరక చెప్పేనెరక! ఎరకడగవేయవ్వ! తలచిన తలపుచెప్పేను- మరచిన మాట చెప్పేను- తబ్బిబ్బుకాదు- తాటోటుకాదు- తార కాణ చేసేను-

కథక: అంత ధారుణీదేవి పైడిచేటలో ఆణిముత్యాలు పోయించి, ఎరుకత నుంగలనిడి, గద్దియ చేయంటి ముమ్మారు మ్రొక్కి "నా తలపు తెలుపవే అవ్వా" అనినంత ఎరుకత తన చేతికోల కందించి-

ఎరుకత: ఏడుకొండలమీద యెలిసినసామి
కంచి వరదరాజ గరుడాచలయ్య
సిమ్మాద్రి అప్పన్న శ్రీశైలవాస
యాదగిరి మల్లన్న ఆదిలచ్చిమ్మ
కనకదురగమ తల్లి కదిరినరసిమ్మ
వుజ్జయిని మాంకాళి వోబలేశయ్య
కొల్లాపురిలచిమి కోటిదండాలు
వాకున నిలవరే మీకు మొక్కేను.

అమ్మోయమ్మ! బాగ్గెంగలతెయ్యి, పతిష్టగలతెయ్యి, పంతతిగలతెయ్యి. ఓయవ్వ! ఒక్క తలపు తలసినావు; ఒక కోరికడిగినావు. ఆడోరివంకతలపా, మొగోరివంక తలపా అనేవు. ఇదిగిదిగో ఆడోరంటే గడ్డం, మొగోరంటే బొట్టు, కన్నబిడ్డ కోసం కళవళపడుతుండవ్. అది మనిసో, మానో, దయ్యమో, బూతమో అని అడగతవే అవ్వ. అవ్వోయవ్వ- అది మనిసి కాదు, మానుగాదు, దయ్యంగాదు, బూతంకాదు. అవ్వో నీ బొట్టెకు నల్ల మొగుడొ త్తడేయవ్వ. బొర్రల్లుడొ త్తడే యవ్వ. కొండమీది గోవిందుడొ త్తడే యవ్వ. బొడ్డున తామర పువ్వ, రొమ్మున రతనమాణిక్యం- సిరిగలల్లుడొ త్తడేయవ్వ- నీ కోరిక కాయగాదు పండేయవ్వ- అది యెన్నాళ్లకని అడ గతవే తల్లి- వొకటి రెండు మూడేయవ్వ- వొకటంటే వొక యేడుగాదు, రెండంటే రెండు నెల్లుగావు, మూడంటే మూడు నాళ్లుగావు. మూడుగడియలే అవ్వ- తారకాణడగతవే యవ్వో! ఇదుగిదుగో యీ దిక్కు నుండి ఆడకూతురు మనువడగ వత్తుండదో యవ్వ. ఇప్పుడే వస్తాదా, ఇకనే వస్తాదో అంటవు? ఇప్పుడంటె యీ చణాన నీ గడపకాడుండదే యవ్వ. నా మాట కల్లగాదు, కపటంగాదు, శీనివాసుడితోడు, యెంకటేసుర్లు తోడు, ఏడుకొండలవాడితోడు, నా గద్దెబుట్టతోడు. నీ బొట్టె పెళ్లి కొ స్తనే యవ్వ- వొళ్లోవరాలోసి నన్నంపవో యవ్వ.

కథక: అనుచు నెరుకత వెడలిపోవునంత వకుళమాలికయు ధారుణీదేవి చెంగటి కేతెంచె నెటులనెను.

(సౌరాష్ట్ర - ఆదితాళం)

ముందరవచ్చి నిలిచెను ముదుసలివైష్ణవి ॥ముందర॥

చెందిర తిలకము చెవికమ్మలు గురి
వెందపేర్లు గళమందు మెరయగా ॥ముందర॥

ఇందిరేశ అరవిందనయన- గో
విందమాధవ ముకుందా యనిశ్రీ
మందిరు బాడుచు- ॥ముందర॥

ధారుణీదేవి ఆ వైష్ణవికెదురేగి తోడ్తెచ్చి, పసిండిగద్దెయం దుంచి, అవ్వా! నీవెవ్వరు? నీవచ్చిన వృత్తాంతం బెట్టిదని యడిగిన—

వకుళ: వినవమ్మ నాటెంకి వేంకటాచలము
వనజనాభుండైన వైకుంఠుడచట
సిరిబాసి ఒంటి వసించుచునుండి
విరిదోటకడ నిన్న వేటకై వచ్చి
చెలులతోనాడు నీ చిన్నారికూతు
చెలువు కన్నులగాంచి వలచినాడమ్మ!
ఎల్లలోకమ్ముల నేలేటివాడు
చల్లనిచూపుల నల్లనివాడు
ఉరము రత్నమ్ముతో ఒరపైనవాడు
కరముల శంఖచక్రములున్నవాడు
గళమున వనమాలగలవాడు, మరియు
అలరువిల్తుని కడుపార కన్నయ్య
నాయయ్య కంచివరదయ్య రంగయ్య
ఆ యశోదమ్మ కన్నయ్య చిన్నయ్య
మనువడగ నంపె పద్మావతీ కన్య
తనకిమ్మటంచు; నీ తనయ భాగ్యమ్ము
నేమందునోయమ్మ, ఇందిరాదేవి
కామించినట్టి చక్కని సామి తానె
వలచినాడమ్మ! పర్వతరాజతనయ,
ఎఱుకులరాణి రావమ్మ పోవమ్మ
యనగ, వేల్పులు హస్త వనజముల్మొగిచి
వినుతించి పాదవందన మాచరింప
చెలగు నీసుత మేలు చిత్తమందెంచి
తెలిపి నీపతికి వార్తల నంపరమ్మ.

సూత్ర: మూర్తీ! వింటూంటే నాకే నోరూరుతూంది కదా. ఆకాశరాజు మాత్రం కాదంటాడా?

కథక: ఎందుకంటాడూ, కనకాచలం కాళ్లదగ్గరకొస్తే? వెంటనే శుకమహర్షిని రావించి, సుముహూర్తం నిశ్చయించి శ్రీనివాసుని చెంత కంపించాడు.



సూత్ర: గడ్డివాడే సుమా! కాలికింద భూమి మెలవనివ్వడు. ఇంతకు సుముహూర్తం ఎప్పుడంటావు? వ్యవధి ఏ మాత్రముంది?

కథక: వ్యవధి ఏదండీ-ఈ వైశాఖ శుద్ధ దశమి శుక్రవారం రాత్రికే-

సూత్ర: మనం కూడా వెళ్లాలయ్యా రమణమూర్తీ! ముక్కోటి దేవతలు, సప్తఋషులు, బ్రహ్మేంద్రాది దేవతలు వచ్చే ఆ వైభవం కలియుగ వైకుంఠం కదయ్యా! పాపం, మా ఆబిడనుకూడా తీసుకెళ్లాలి. మళ్లా ఇటువంటి జగత్కల్యాణం కంటబడదు. అన్నట్లు శుకమహర్షి వెళ్లిన మీదట శ్రీనివాసమూర్తి ఏమన్నారో?

కథక: కల్యాణం ఎదురుగావస్తే అంటానికేముంది? కన్నాలు కానుకలు మాట్లాడుకోవాలి కనుకనా? శుకులవారినెంతో మర్యాదచేసి తథాస్తు అలాగే కానివ్వండన్నారు, ఏమి ఎరగనట్లు. మేమానాటికి తర్లివస్తామని గెడగిరేకుమీద గోటితో లగ్నపత్రిక వ్రాయించి పంపారు. ఇంతలోనే వకుళకూడా చక్కావచ్చింది. శ్రీనివాసమూర్తి నమస్కరించగా శోభనప్పెళ్లి కొడుకువు కమ్మని దీవించింది.

సూత్ర: భాగ్యమంటే ఆయమ్మదే భాగ్యమన్నాను కాదూ! ఇంతకూ స్వామివారి పెళ్లిఖర్చుమాట ఆలోచించారో లేదో.

కథక: అదిగో, ఆసంగతే వకుళతో సంప్రదిస్తున్నారు.

శ్రీని: వకుళా! నీ దయవల్ల కల్యాణం నిశ్చయమైంది. మరి పెళ్లికి సొమ్మెక్కడయినా చూచావా? ఆవల వారిది రాచకుటుంబం. వారితో సరితూగకుంటే లోకం నవ్విపోతుంది.

వకుళ: అయ్యో నా తండ్రీ! నీకేమి తక్కువయిందని? లక్ష్మీ అమ్మవారిని పిలిపిస్తేవట్టాయెనా, అన్నీ ఆవిడే దిద్దుకుపోతుంది.

శ్రీని: వెర్రిదానవే వకుళా! ఇదెక్కడైనా కద్దా? సొమ్మిచ్చి పతిని తెచ్చుకుందురా లోకంలో యెవరైనా?

వకుళ: నిజమే నాయనా! మరి నేనేం చేతును? దిక్కుమాలిన దాన్ని నాబిడ్డ పెళ్లికి చేతిలో చిల్లిగవ్వయినా లేదాయె.

శ్రీని: అవ్వా! నాకో ఆలోచన తోస్తున్నది. భూవరాహస్వామి నడిగితేనో?

సూత్ర: మరే, తన సొమ్మంతా కొల్లబోయినట్లు, నూరడుగుల నేల ఇచ్చేందుకే అంత వెనుకముందాడిన వరాహస్వామి ఇస్తాడటయ్యా?

కథక: అలా అనకండి. ఇచ్చేందుకాయనవద్ద నేముంది? కొండలూ గొయిపలూ తప్పిస్తే, వకుళవెళ్లి అడిగితే, శ్రీనివాసుల కేమిలోపం? బ్రహ్మేంద్రాదులకు కబురంపితే సర్వం వారే చక్కబెట్టుతారని సలహాయిచ్చాడు.

సూత్ర: అవును సుమా! మనకు తోచిందికాదీమాట.

కథక: శ్రీనివాసుడంతట గరుడుని, శేషునిరావించి, బ్రహ్మేంద్రాదులకు, కైలాసపతికి శుభలేఖ లంపించారు.

సూత్ర: ఇకనేం? పెళ్లి పెద్దలంతా పెళ్లుమంటూ చక్కావచ్చారు.

కథక: శ్రీనివాసమూర్తి అంతట మయుణ్ణిపిలిచి, నారాయణవనం అలంకరించవలసిందని సెలవిచ్చారు.

సూత్ర: మయబ్రహ్మ తలుచుకుంటే ఇక తక్కువేముంది? ఆకాశమంత అరుగూ, భూమంత పందిరీ వేయించారు.

కథక: మీరు పెళ్లికి వెళ్లాలనే తొందరలో తడబడుతున్నారు-దేవతలకు కూడా చూడముచ్చటగా అలంకరించాడా నగరం-

(ఆనందభైరవి)

ఎచట చూచిన పూలతోరణ లెందునా ముత్యాలముగ్గులు

సూత్ర: ఆగు ఆగు - కస్తూరి కలయంపి మరిచావు.

కథక: ఎందుచూచిన రత్నదీపిక లెందునా నీలంపుతరుగులు.

సూత్ర: గరుడపచ్చల స్తంభాలు - వెన్నెల చాందినీలు - అబ్బబ్బా! కలియుగ వైకుంఠం కదయ్యా!

కథక: పిలువనేగెను చుట్టముల షణ్ముఖుడు
సమాగతులను మదనుండు గారవించె
వరుణుండు నీళ్లకావడి భుజమ్మున బూనె
పాచకత్వమ్మూనె పావకుండు
అనిలుండు గంధమాల్యమ్ములు సమకూర్చె
ధనదుండు వెచ్చంపు బనులుచూచె
తొండమానుడంత దివియలు వెలిగించె
సాగించె నింద్రుడచ్చరల మేళ

మొజ్జరిక మూనె నిక్ష్వాకువంశగురుడు
ప్రమథ గణము పూరించె తౌర్యత్రికమ్ము
అన్నిటికి దానె యయ్యె పద్మాసనుండు
వకుళ కనుదోయి మోదబాష్పముల వెలిగె-

(సశేషం)



## శ్రీరామ వనవాసము

# ద్వాదశవర్ష పర్యంతమా?

— నడిపినేని సూర్యనారాయణ

**ఆదికవి వాల్మీకి రామాయణములో,** అయోధ్యాకాండలో, శ్రీరామవనవాస కాలము పదునాలుగేండ్లని (14) తెల్పెను. కైక దశరథుని కోరిన వరములలో రెండవది శ్రీరామవనగమనము. అది పదునాలుగేండ్లు అవధిగలది. కైక దశరథునితో పల్కినపల్కులు ఇవి:

నవ పంచ చ వర్షాణి దండకారణ్యమాశ్రితః।
చీరాజినధరో ధీరో రామో భవతు తాపసః॥

(అయోధ్యాకాండ-11 వసర్గ-26వ శ్లోకము.) 'నవ పంచ చ' అనగా 9+5=14 సంవత్సరములని అర్థము. అదే 'కాండ'లో రాముడొసంగిన పాదుకలను గ్రహించిన పిమ్మట భరతుడు రామునితో ఇట్లనెను.

చతుర్దశ హి వర్షాణి జటాచీరధరోఽహ్యహమ్।
చతుర్దశే హి సంపూర్ణే వర్షేఽహని రఘూత్తమ॥
న ద్రక్ష్యామి యది త్వాం తు ప్రవేక్ష్యామి హుతాశనమ్।

(అయోధ్యాకాండ - 112 వసర్గ-23, 25 శ్లోకములు.)

పదునాలుగు సంవత్సరములు నేను జడలను ధరించి, జీవిస్తాను. గడువు పూర్తి కాగానే నీ దర్శనము కానిచో నేను అగ్నిలో ప్రవేశిస్తాను. అన్యరామాయణములలో కూడ రాముడు 14 సంవత్సరములు అరణ్యవాసము చేసెనని కలదు.

శ్రీ నరసింహపురాణమునకు కర్త వ్యాసులవారు (?). ఇది ఉపపురాణములలో చేరినది అని విజ్ఞుల నమ్మకము. ఈ పురాణమున రాముని వనవాసకాలము 12 సంవత్సరములని 48 అధ్యాయమున కలదు. అందు కైక దశరథుని కోరిన వరము ఇది:

ద్వాదశాబ్దం నివసతు త్వద్వాక్యాద్దండకే వనే।
(48 అధ్యాయం-50 శ్లో॥)

(నీ మాటవలన రాముడు వనములలో 12 సంవత్సరములుండవలెను.) తన దగ్గరకు వచ్చిన రామునితో కైక ఇట్లా అన్నది.

వనే వస మహాబాహో గత్వా త్వం ద్వాదశాబ్దికమ్।
(48-57)

రాముడడవులకు పోవుచు పౌరులతో ఇట్లు పల్కెను.

ద్వాదశాబ్దం వ్రతం చైతస్మిత్వాఽహం దండకే వనే।
(48-75)

రాముడు చిత్రకూటమున తనదగ్గరకు వచ్చిన భరతునితో ఇట్లు పల్కెను.

ద్వాదశాబ్దిక మేతన్మే వ్రతం పితృముఖేరితః (48-151)

భరతుడు పాదుకలను గ్రహించి రామునితో ఇట్లు పల్కెను.

నందిగ్రామే వసిష్యేఽహం పాదుకే ద్వాదశాబ్దికమ్॥
త్వం ద్వాదశాబ్ది కాదూర్ధ్వం యది నాయాసి సత్తమ।
తతో హవిర్యథా చాగ్నౌ ప్రధక్ష్యామి కళేబరమ్।

ఈ ఉదాహరణములలో నరసింహపురాణ కర్త- రాముడు అడవులందున్నది 12 ఏండ్లని స్పష్టముగా చెప్పెను.

వ్యాసమహర్షి మహాభారతారణ్య పర్వములో స్పష్టముగా 'రామునివనవాసము'- 14 ఏండ్లని తెల్పెను. అగ్నిపరీక్ష ఘట్టమున దశరథుడు రామునితో ఇట్లనెను.

సంపూర్ణానిహ వర్షాణి చతుర్దశ మహాద్యుతే।

ఓ రామా! 14 సంవత్సరములు ఇప్పుడు పూర్తియైనవి. వ్యాసమహర్షియే-నరసింహపురాణకర్తయగుచో-'12 ఏండ్లు' అని ఏల మార్చి చెప్పెను? ఈ ఉపపురాణకర్త తద్భిన్నుడగునేమో? '12 సంవత్సరములు వనవాసకాలము' అని మార్చి చెప్పినందులకు ప్రయోజనమేమో? పరిశీలింపవలెను. ఇది ఆనాటి శిక్షాస్మృతిని అనుసరించినదా? రామునికి అరణ్యవాసము శిక్షయా? పరిశోధకులు వివరింపవలెను. పాండవుల అరణ్యవాసకాలము 12 ఏండ్లు అని భారతమున కలదు. దానిననుసరించి, 'నరసింహ పురాణము' లో కర్త అట్లు చెప్పియుండవచ్చునేమో? నరసింహపురాణకర్త కృష్ణద్వైపాయన వ్యాసుడు కాక వేరొక వ్యక్తి అనియు, ఆనాటి 'శిక్షాస్మృతి' ననుసరించి, అట్లు మార్చి వ్రాసెననియుతోచుచున్నది! గీతాప్రెస్-గోరఖ్‌పూర్ వారు-నరసింహపురాణమును, మహాభారతమును, 'రామాయణము' ను ప్రచురించిరి.

దేవుడున్నాడా లేడా అనే ప్రశ్న ఎంత ప్రాచీనమో, దేవుడెలా ఉంటాడు అన్నదీ అంత పాత ప్రశ్నే!
'దైవ' స్వరూపంపై ప్రాచ్య పాశ్చాత్య వేదాంతుల భావనా ప్రపంచంలో చీలికలున్నాయా?

# తాత్త్వికుల దృష్టిలో దైవం

— మోహన్, ఈశ్వరమ్మ

"దేవుడున్నాడా, లేడా?" ఒక బాలుడి ప్రశ్న.

"ఉన్నాడు బాబూ" ఒక యోగి జవాబు.

"ఎలా ఉంటాడు? నాకు చూపించండి."

ఆయన ఆ బాలుని ఓ చెరువు దగ్గరకు తీసుకువెళ్ళి ఆనీటిలో ముంచి అదిమి పట్టాడు. ఉక్కిరి బిక్కిరై తేరుకొన్న బాలుడు ఆయనను ప్రశ్నార్థకంగా చూశాడు. యోగి జవాబిది.

"చూశావా, ఇప్పుడు నీటిలో నీ ప్రాణం కోసం నువ్వెంత తపన పడ్డావో దేవునికోసం అంత ఆరాటపడితే దేవుడు నీకు తప్పక కనిపిస్తాడు."

ఆ బాలు డెవరోకాదు, 'వివేకానందుడు' ఆ యోగియో? 'రామకృష్ణ పరమహంస!' ఈ ప్రశ్న ఆనాటిదీ ఈ నాటిదేకాదు. ఏనాటి నుండో పరంపరగా వస్తూనే ఉంది. జిజ్ఞాసువు అయిన మానవుడు అజ్ఞేయాన్ని గ్రహించడానికి అనంతంగా అన్వేషిస్తూనే ఉన్నాడు.

దేవుడు ఎలా ఉంటాడు? అతని ఉనికి ఏమిటి? అన్న విషయాలపై ఎందరో దేశ కాలాతీతులైన మహనీయులు, తత్త్వ శాస్త్రజ్ఞులు నిరంతర చింతనచే తమ భావాలను వ్యక్తీకరించారు. వారు వివిధ దేశాలకూ వివిధ మతాలకూ చెందినవారు కావచ్చు కాని వారి భావాలలోని మూలమూ, గమ్యమూ ఒకటే! అదే "దేవుడు". వేదకాలము నుండి ఆధునిక యుగం వరకు ఆయా దేశాలకూ, మతాలకూ చెందిన తాత్త్వికులు దేవునిగూర్చి ఏం చెప్పారో పరిశీలిద్దాం.

## వేదాలు, శ్రుతులు

ఊర్మిషట్కము అంటే ఆకలి, దప్పిక, శోకము, మోహము, జర, మృత్యువు. ఈ ఆరూ లేనిదే "బ్రహ్మ" అని శ్రుతులు దేవుని నిర్వచించాయి.

"దేవుడు: జ్ఞాన, శక్తి, ఆనందములకు మూలాధారము. మానవుడు అవ్యక్త పరమాత్మనుండి దివ్యశక్తులు గ్రహించాలి" అని వేదాలు చెబుతున్నాయి.

"ఆనందో బ్రహ్మ" అని ఉపనిషత్తులు వివరిస్తున్నాయి. షడ్దర్శనాలుకూడ ఈశ్వరు డున్నాడని అంగీకరించినాయి.

## బుద్ధుని దృష్టిలో దేవుడు

(క్రీ. పూ. 6వ శతాబ్దము)

దేవతారాధనను బుద్ధుడు హర్షించనూ లేదు, ఖండించనూలేదు. ఈశ్వరాజ్ఞచే ప్రపంచం నడుస్తుందని అంగీకరించినప్పుడు మానవుని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు తావుండదంటాడు. ఈశ్వరుడు సర్వాంతర్యామి, సర్వాతీతుడు అన్నవి పరస్పర విరుద్ధ సిద్ధాంతాలంటాడుబుద్ధుడు. ఎట్లా అంటే ఈశ్వరుడు సర్వాంతర్యామి అయితే సృష్టి చేయడానికేమీ మిగలదు. సర్వాతీతుడయితే ఈశ్వరునికీ ప్రపంచానికీ ఏమీ సంబంధం ఉండదంటాడు.

ఆయన దృష్టిలో దుఃఖ నివారణమే ముఖ్యసమస్య. అందుకే ఆత్మ, దేవుడు అనే అంశాలపట్ల మౌనం వహించి అహింస మానవత్వాలకు ఎక్కువప్రాముఖ్యమిస్తాడు.

## శంకరుని దృష్టిలో

(క్రీ.శ. 6వ శతాబ్దము)

వాక్కుకాని మనస్సుకాని వివరించలేని వాడే పరమేశ్వరుడు. ఇట్లాంటి గుణవిశిష్ట మైన బ్రహ్మనే అద్వైతము ఈశ్వరు డంటుంది.

'అహం బ్రహ్మాస్మి' 'తత్త్వమసి' అనే అభేద శ్రుతి వాక్యాలద్వారా శంకరులు జీవునికీ బ్రహ్మకూ భేదం లేదని ప్రతిపాదించారు. 'బ్రహ్మ' మాయలో ప్రతిబింబించడాన్ని ఈశ్వరుడుగాను, 'బ్రహ్మ' అవిద్యలో ప్రతిబింబించడాన్ని, 'జీవుడు' గాను శంకరులు వివరిస్తారు. నిర్గుణోపాసనకు మొదటి సోపానమే సగుణోపాసన అంటారు. వారి దృష్టిలో ఈశ్వరుడు సర్వశక్తి సమన్వితుడు. కర్మఫలప్రదాత, ధర్మస్వరూపుడు, రక్షితుడు. కావుననే ఈ గొప్ప ప్రపంచాన్ని ప్రణాళికాబద్ధంగాను, ధర్మబద్ధం గాను నిర్వహించ గలుగుతున్నాడు. ఈ విధంగా శంకరులు ఈశ్వరునియొక్క సర్వజ్ఞత్వము, సర్వాంతర్యామిత్వములను సత్తావాదం ద్వారా నిరూపిస్తారు.

## రామానుజుని దృష్టిలో

(క్రీ.శ. 11వ శతాబ్దము)

ఈశ్వరునికి ప్రపంచంతో సంబంధ మున్నదనే విషయంతో ప్రారంభించి, ఈశ్వరాస్తిత్వాన్నీ, ప్రపంచాస్తిత్వాన్నీ రామానుజులు నిరూపించారు.

ఈశ్వరుడు జగత్తుకు మూలాధారము. జగత్తుకు జీవులకు తమతమ ప్రత్యేకాస్తిత్వ

మున్నా, అవి బ్రహ్మకావు. బ్రహ్మదేవుడు నిత్యపరిపూర్ణుడు అని రామానుజులు వివరించారు. శంకరుని సిద్ధాంతాన్ని నిరాకరించి వీరు బ్రహ్మను సగుణ నిర్గుణ ఉభయ లక్షణ సమన్వితునిగా చిత్రించారు.

భగవంతుని 'లీలావిభూతి' రూపాన్ని అందరూ దర్శించ వచ్చునని, కాని అతని 'నిత్యవిభూతి' రూపాన్ని ముక్తజీవులు మాత్రమే దర్శించగలుగుతారని చెప్తారు. ఇదే విషయాన్ని భగవద్గీత "బ్రహ్మకు అప్రాకృత దివ్యదేహ ముంటుందని, అది దివ్య చక్షువులకు మాత్రమే గోచరిస్తుందనీ" వివరిస్తుంది. ఈ విధంగా రామానుజులు అనేక ప్రమాణాలద్వారా దేవుని ఉనికిని, స్వరూపాన్నీ, గుణాలను వివరించి సగుణ బ్రహ్మగా నిరూపిస్తారు.

## కన్ఫ్యూషస్ దృష్టిలో
(క్రీ. పూ. 6)

దేవుడున్నాడనే నమ్మకము చైనావారిలోనూ ఉంది. కన్ఫ్యూషస్‌కి పూర్వము "షిజింగ్" "షుజింగ్" అనే గ్రంథాలుండేవి. వాటిలో స్వర్గం గురించి, దేవతల గురించీ వివరించబడింది. ప్రాచీన చైనా వారి దైనందిన జీవితంలో స్వర్గము, దేవుడు ముఖ్యాంశాలు. దేవుని 'టై' అనీ, స్వర్గాన్ని 'టై ఇన్' అనీ అంటారు.

వీరు భగవంతుని రాజుగానో చక్రవర్తిగానో మాత్రమే ఊహించినారు. దేవుడు దేవతలకు అధిపతి అని భావించినారు. దేవతలను సంతృప్తి పరచడానికై వారు యాగాలు బలులు వంటి కర్మకాండలను చేసేవారు.

ఇలాంటి పరిస్థితిలో వచ్చిన కన్ఫ్యూషస్ కర్మకాండలను తగ్గించి మానవతా దృక్పథాన్ని పెంపొందించడానికి కృషిచేసినాడు. అయితే అతడు దేవుని నిరసించలేదు. ప్రతీదీ కాకుండా కొన్ని మానవాతీతమైన పనులు మాత్రమే దైవేచ్ఛ ప్రకారం జరుగుతాయంటాడు. అంటే దేవతలను ఆరాధించినప్పటికీ మానవులు స్వయంకృషినీ, వ్యక్తి

శాస్త్రిని విడిచిపెట్ట కూడదంటాడు. ఇతడు బలులను నిరసించాడు.

కన్ఫ్యూషస్ నీతికి ప్రముఖస్థానమిచ్చాడు. "చెడు వినకు, కనకు, చెప్పకు" అన్నది ఆయన సిద్ధాంతసారం. తోటి మానవుని ప్రేమించటం నైతికవిలువగా అంగీకరిస్తే భగవంతుని ఆరాధించటం ఆధ్యాత్మిక విలువగా అంగీకరించవచ్చు అంటాడు.

మొత్తంమీద కన్ఫ్యూషస్ బుద్ధునిలాగా సాంఘిక విలువలకు ఎక్కువ ప్రాముఖ్యమిచ్చి 'దేవుడు,' 'ఆత్మ' అనే విషయాలను నిర్లక్ష్యం చేశాడు. అంతేకాదు వీరిద్దరూ సమకాలికులు కావడం మరోవిశేషం.

### సోక్రటీస్ దృష్టిలో
(క్రీ.పూ. 5వ శతాబ్దము)

మహాపురుషులు, గ్రీక్ తత్త్వవేత్తలైన సోక్రటీస్, ప్లేటో, అరిస్టాటిల్‌ల కీర్తి అజరామరము. వీరి తాత్త్విక చింతన అంతా మానవ జీవితాన్ని, నైతిక ప్రమాణాలను ప్రపంచాన్ని ఆధారంగా చేసికొని అభివృద్ధి చెందింది.

సోక్రటీస్ దైవంగురించి ఎక్కడా వివరించక పోయినా దైవం ఉనికిని విశ్వసిస్తాడని ఈ క్రింద ఆతని అంతిమ ప్రబోధాన్ని బట్టి తెలుస్తూంది.

"నన్ను శిక్షించిన ప్రజలారా! మీకునా అంతిమ ప్రబోధాన్ని వినిపిస్తాను. నేను మరణించ బోతున్నాను. మరణసమయంలో మానవులకు దివ్యశక్తి లభిస్తుంది. మీరు నా హంతకులు. నేను మరణించిన వెంటనే నాకు విధించిన శిక్షకంటే పెద్దశిక్ష మీకోసం ఎదురుచూస్తూ ఉంటుంది. మానవులను చంపటం వల్ల మీ పాప పంకిల జీవితాలను నిరసించేవారు వుండ బోరని మీరనుకుంటే మీరు పొరబడుతున్నట్లే. అది తప్పించు కొనే మార్గమూకాదు. ఉత్తమమార్గమూ కాదు; గౌరవప్రదమూకాదు. మిమ్ములను మీరు అభివృద్ధి పరచుకోవటమే ఉత్తమ మార్గము. మన నిర్గమనకాలం దగ్గర పడింది. మనదారులలో మనము పయనిస్తాము. నాది మరణపథము.. మీది జీవనపథము. వీటిలో ఏది మంచిదో దైవానికే తెలియవలె" అని ముగిస్తాడు.

### ప్లేటో దృష్టిలో
(క్రీ. పూ. 5)

సోక్రటీస్ శిష్యుడు, భక్తుడు అయిన ప్లేటో తన యథార్థ జ్ఞానాన్వేషణ ద్వారా భగవంతుని ఉనికిని తెలియజేస్తాడు. దీనినే 'యథార్థసత్త' అంటాడు.

సుఖదుఃఖాల కతీతమైన మనస్సు 'యథార్థసత్త' (దేవుని)ను తెలిసికోగలదని వివరిస్తాడు. ఇతని తాత్త్విక చింతన శీలము, జ్ఞానము, ఆత్మ, రాజనీతి, ఆధారంగా అభివృద్ధి చెందింది. 'దైవానుగ్రహం, లభించే వరకు మానవుడు సత్కర్మలు చేస్తూ ఉండాలి.' అని ప్రబోధిస్తాడు.

### అరిస్టాటిల్ దృష్టిలో
(క్రీ. పూ. 4)

ప్లేటో తరువాతి వాడైన అరిస్టాటిల్ ఆధిభౌతికశాస్త్రము దైవశాస్త్రంతో పరాకాష్ఠ చెందింది. ఇందులో ప్రథమకారణంగాను, అంతిమ కారణంగాను భావించిన శుద్ధ ఆకృతినే అరిస్టాటిల్ దైవమన్నాడు.

అంటే ఇతడు శంకరునిలాగా దైవాన్ని సర్వాంతర్యామిగాను, సర్వాతీతుడుగాను వివరిస్తాడు గాని సృష్టికర్తగా అంగీకరించడు. 'పదార్థాన్ని ఎవరూ సృష్టించలేరు. అది శాశ్వతము. దీని సృష్టి స్థితులకు దైవము కారకుడు కాదు' అంటాడు.

### అల్ ఘజాలీ దృష్టిలో
(క్రీ. శ. 6)

ఇస్లాం మతస్థులు మహమ్మదు ప్రవక్తను భగవంతుని దూతగా నమ్ముతారు. ఆయన బోధనలన్నీ క్రోడీకరించిన గ్రంథమే "ఖురాను". మహమ్మదు మరణానంతరం

(36వ పేజీలో)

# హనుమజ్జననం

— దిట్టకవి

యత్రాస్తి భోగో నహి తత్రమోక్షః
యత్రాస్తి మోక్షోనహి తత్రభోగః
శ్రీమారుతేస్సే వసేవతచ్చరణాం
భోగశ్చమోక్షశ్చ కరస్థఏవ.

ఎచ్చట భోగములుండునో అచ్చట మోక్షములేదు. ఎచ్చట మోక్షముకలదో అచ్చట భోగములేదు. శ్రీ ఆంజనేయ స్వామి ఉపాసన, పూజ, అర్చనచేసిన వారికి అన్ని కోరికలుతీరి భోగమోక్షములు సిద్ధించును.

ప్రస్తుత భారతదేశ ప్రజలు తమ హృదయాలలో నిష్కామ సేవాయోగి, ధైర్య సాహసోద్దీపితుడు-స్వామిభక్తిపరాయణుడు దైవీశక్తి సంపన్నుడు అయిన ఆంజనేయుని ప్రతిష్ఠించుకోవాలి. ఆంజనేయ స్వామి ఆచరణ విధానమును అందరూ తమ జీవితంలో పాటించాలి. ప్రస్తుతం విద్వేషంతో, వివేక రహితులై అలసులైన నేటి భారతదేశ ప్రజలు ఆంజనేయుని ఆదర్శంగా తీసికొని అతని అడుగుజాడలలో నడిచి, అమేయబల సంపన్నులై, కర్తవ్య పరాయణులై, స్వామి భక్తులై తమ జీవితాలను సేవాకర్మలో వినియోగించాలి. మనమీ సమయంలో ఆంజనేయుని తత్వమును, ధార్మిక జీవితాన్ని ఆదర్శములను సంస్మరించుకొనటంఅత్యుత్తమం.ప్రస్తుతం హనుమజ్జనన విధానము తెలిసికొందము. పరాశర సంహితయందు చెప్పబడిన జన్మ విధాన మీవిధముగా నున్నది. మైత్రేయుడు పరాశరునిచూచి

"భగవన్ హనుమన్మ
త్రప్రభావో భవతాశ్రుతః
తస్యోత్పత్తిం స్వరూపంచ
శ్రోతుమిచ్ఛామ్యహంప్రభో!"

ఓ మహర్షి! హనుమంతుని మంత్ర ప్రభావమునెల్ల వినియుంటిని. ఆయన




యొక్క జన్మ స్వరూపమును వినగోరెదనని అడిగెను. అప్పుడు పరాశరుడిట్లు చెప్పెను. మైత్రేయా! ఒకానొకప్పుడు రాక్షస బాధా నివారణార్థమై దేవతలు, ఋషులు బ్రహ్మ యొద్దకుబోయి తమ బాధలను చెప్పుకొనిరి. బ్రహ్మ శివునడుగమని చెప్పెను. వారు శివునికడకుబోయి యడుగగా శివుడు విష్ణువు నడుగమని చెప్పెను. దేవతలందరు బ్రహ్మను, శివుని ముందిడుకొని శ్రీమహా విష్ణువు దగ్గరకేగి, రాక్షసుల బారినుండి తమ్ము రక్షింపుమని వేడుకొనిరి. ఆయన ముహూర్త మాత్రమాలోచించి, వధింతును. సందేహము లేదు. అని చెప్పి ఆత్మ తేజముపూని ఈశ్వరాది సకలసురులతో మీ మీ తేజముల నొసంగవలెననెను. దేవతలు తమ నివాసములకు వెళ్ళిరి. ఆంజనేయుడు సకల దేవతా స్వరూపుడనుటకు, ఈ దేవతలందరు తమ తమ శక్తి భాగముల నిచ్చుటయేకదా!

ఒకానొకప్పుడు రుద్రుడు ఉమాసహితుడై ధరాలోక పర్యటనము చేయుచు శ్రీమద్వేంకటాచలక్షేత్రమునకు వచ్చెను. అక్కడ పార్వతీదేవి సురత క్రీడానందములో మునిగియున్న కపియుగ్మమును చూచి

సిగ్గిల్లిచు రాగదృక్కులతో శివునివంక జూచెను! విభుడామె మనోరథమును గ్రహించి క్రీడించుటకై కపిరూపమును బొందెను. పార్వతియు కపినామాఠ, వారిరువురు సహస్ర వర్షములు క్రీడించిరి. శివుడు తన తేజమును పార్వతీ గర్భము నందుంచెను. ఇరువురు కైలాసమున కేగిరి. పార్వతి శివుని తేజమును గర్భమున నిలుపలేక అగ్నియందుంచెను. అగ్నియు భరింపలేక వాయువునందుంచెను. ఆయనయు దానిని నిలుపలేక విడువబోవు చుండెను. అంతలో కేసరిభార్య అంజనీదేవి పుత్రుని కొరకు తపస్సుచేయు చుండుటయు, ప్రతి దినమును తానొక ఫలమును ఆహారముగా ఆమె దోసిలియందుంచ దానినామె భక్షించుటయు గుర్తుకు వచ్చి వాయుదేవుడు ఈశ్వరుని తేజము నామె దోసిలియందుంచెను. ఫలభ్రాంతితో దానినామె భక్షించెను. కొన్ని దినముల కామె గర్భముదాల్చి భయపడుచుండ వాయువు, నీకు మహాబలపరాక్రమ వంతుడగు నొక పుత్రుడుదయించునని యూరట గొల్పెను. నవమాసానంతరము అంజనీదేవి

"వైశాఖేమాసికృష్ణాయాం
దశమీమందసంయుతా
పూర్వప్రోష్ఠపదాయుక్తా
తథావైధృతి సంయుతా
తస్యాం మధ్యాహ్న వేళాయాం
జనయామాసవై సుతం
మహాబలం మహాసత్వం
విష్ణుభక్తి పరాయణం".

వైశాఖమాస కృష్ణపక్షదశమీ శనివారము పూర్వాభాద్ర నక్షత్రము వైధృతి యోగమున మధ్యాహ్న వేళలో మహాబల సత్త్వుడైనట్టి బ్రహ్మ, విష్ణు శివస్వరూపుడైనట్టి దీర్ఘకాయము, మహా హనువును కలిగి యున్నట్టి పుత్రుని కనెను. అప్పుడు దేవతలు పుష్పవృష్టి గురిపించిరి. అప్పటినుండి ఎందరో భక్తులు, వాడవాడలా, ప్రతిపల్లె లోను, పట్టణమునందును హనుమద్దేవాలయములను నిర్మించి, వైశాఖబహుళదశమీ రోజున 'హనుమజ్జయంతి' పేరుతో ఉత్సవములు, ఆకుపూజలుచేసి స్వామివారి అనుగ్రహముపొంది, తమ కోర్కెలను సిద్ధింపచేసికొనుచున్నారు.

## రాష్ట్రంలోని సప్తగిరి మాసపత్రిక ఏజెంట్ల చిరునామాలు

శ్రీ వి. నరసింహాచార్య
సత్యదేవ న్యూస్ ఏజెన్సీ
బాపట్ల – 522101 గుంటూరుజిల్లా

పి. పద్మావతి
W/o పి. వి. ఆర్. అప్పారావు
హిందూ ఏజెంట్
పొన్నూరు – 522124 గుంటూరుజిల్లా

శ్రీ జి. గంగాధరరావు
24-9-1 అగ్రహారం (కోనేరుదగ్గర)
గుంటూరు – 522003

శ్రీ ఇ. వి. రమణమూర్తి
C/o శ్రీ విద్యాబుక్‌హౌస్ గాంధీచౌక్
ప్రభుత్వ ఆస్పత్రిదగ్గర
తెనాలి – 52.201 గుంటూరుజిల్లా

శ్రీ వి. రామమోహనశర్మ
న్యూస్ ఏజెంట్
ఆర్. టి. సి. బుక్‌స్టాల్
రేపల్లె, గుంటూరుజిల్లా

శ్రీమతి యస్. విజయలక్ష్మి
విజయలక్ష్మి బుక్‌స్టోర్స్
చిలకలూరిపేట (పోస్టు) గుంటూరుజిల్లా

శ్రీ అనుమోలు జగన్నాధరావు
అధ్యక్షులు, కార్యదర్శి. శ్రీవేంకటేశ్వర భక్త
సంఘం, నకరికల్లు – 522615
నరసారావుపేట తాలుకా గుంటూరుజిల్లా

శ్రీ పువ్వాడ కోటేశ్వరవిరల్‌గుప్త
గుప్తాజనరల్ స్టోర్స్
మంగళగిరి (పోస్టు) గుంటూరుజిల్లా

శ్రీమతి కె. దేవసేన
న్యూస్ ఏజెంట్
11-17-19 రామిరెడ్డిపేట
నరసరావుపేట – 522601 గుంటూరుజిల్లా

శ్రీ వల్లూరి దత్తాత్రేయ ఉమాశంకర్
S/o శ్రీ వల్లూరి ఆంజనేయులు
మారుతి న్యూస్ సర్వీసెస్ 6-16-24
61/1, అరండల్‌పేట గుంటూరు–522002

శ్రీ చిట్టికవి వేంకటరామానుజాచార్యులు
S/o చి. తిరుమలాచార్యులు
శ్రీవాసవీ కన్యకా పరమేశ్వరి దేవాలయం
పిడుగురాళ్ళ – 522413 గుంటూరుజిల్లా

శ్రీ ఎం. వెంకటాచార్యులు
అందోలు పోస్టు. మెదక్‌జిల్లా

శ్రీ ఎస్. అంజయ్య ఇ.డి.ఏ.
S/o ఎస్. నారాయణ
ఇర్కోడ్ పోస్టు
సిద్దిపేట తాలూకా. మెదక్ జిల్లా

శ్రీ పి. బాలరాజేషన్
C/o రాజేశ్వర మోదరన్ రైసుమిల్
4-7-20 న్యూమార్కెట్‌రోడ్
సిద్దిపేట – 502 103, మెదక్ జిల్లా

శ్రీ ఏ. కృష్ణయ్య
ఆయుర్వేద వైద్యులు, బాలాజీవాడ
నిర్మల్ – 504 106 ఆదిలాబాద్ జిల్లా

శ్రీ బి. శ్రీనివాస్
శ్రీరామబుక్‌హౌస్
బస్టాండు ఆదిలాబాద్ 504001

శ్రీ వడ్లూరి లక్ష్మీనరసయ్య
డి–161 బి.జోన్ రామకృష్ణాపురం–504301
ఆదిలాబాద్ జిల్లా

శ్రీ సి. శంకరగుప్త
C/o మంచిర్యాలగూడ్స్‌ట్రాన్స్‌పోర్ట్‌బ్రాంచి
లక్సెట్టిపేట – 504215
(వయా) మంచిర్యాల, ఆదిలాద్‌బాద్‌జిల్లా

శ్రీ వేముల ఆనంద్
న్యూస్‌పేపర్ ఏజెంట్
భీమవరం – 504204 ఆదిలాబాద్ జిల్లా

(29 వ పేజీలో)

**మన వేదాలు ఆదికావ్యాలు కాకపోయినా మన ఆదికవులు వర్ణనా వైచిత్రికి అవి ఆకరాలు అంటున్నారు ఈ వ్యాసకర్త.**

# వేదాలలో ఆలంకారిక రచన

## రాణీ హయగ్రీవశర్మ

పూర్వ మీమాంసకులు పరమేశ్వరుని దేవునిగ అంగీకరించిరి. కాన వేదము లన్నియు పరమేశ్వరుని నిశ్వాస భూతము లని భారతీయుల భావన. అట్టి వేదములు స్థూలముగ ఋగ్యజుస్సామాధర్వములు. వీనిలో కూడ అవాంతర భేదములు పెక్కు గలవు. ఇట్లు చెప్పుటకు పతంజలి మహా భాష్యపంక్తులు ప్రమాణము.

"ఏకశత మధ్వర్యుశాఖాః
సహస్రవర్త్మాసామవేదః
ఏకవింశతిధా బాహ్వృచమ్
నవధాఽథర్వణో వేదః" ఇతి
"చరణవ్యూహాదిషుశాఖా
పరిగణన విషయేఽధ్వర్యు
వ్యపదేశోఽన్యధాభాషితమ్
తథాఽపితన్నిర్ణయో
నాతీవాత్రావశ్యక
ఇతిమత్వాఽపిరమ్యతే
"అత్రఅధ్వర్యుపదేనయజుర్వేదః స్వీక్రియతే.
సచయజుర్వేదః శుక్లకృష్ణభేదేన ద్విధాప్రసిద్ధః"
—మహాభాష్యము. పస్పశాహ్నికము.

యజుర్వేదము 101 భేదములు. సామ వేదము వేయిమార్గములు. ఋగ్వేదము 21 భేదములు. అధర్వవేదము తొమ్మిది విధములు. వీనిలో చరణములు, అనువాకములు, పన్నములు శాఖలు పరిగణన విషయమై అనేకమంది అనేకరకములుగ అనేకములుచెప్పిరి. ఆవిషయములన్నియు ఇట అనావశ్యకము. ఇట అధ్వర్యు పదము చేత యజుర్వేదమును గ్రహింపవలయును. అది శుక్ల యజుర్వేదము కృష్ణయజుర్వేదము అని రెండు విధములు." ఆదిత్యానీమానియూగ్ంషి వాజసనేయేన యాజ్ఞవల్క్యేనాఖ్యాయంతే" శతపథ బ్రాహ్మణము. సూర్యదేవుని నుండి వెలువడిన ఈ శుక్లయజుర్వేదము వాజసనేయుడగు యాజ్ఞవల్క్య మహర్షిచేత అధ్యయనము చేయుబడెను.

"అపరాకృష్ణయజుర్వేద సం
హితాతిత్తిరినామ మహర్షిణా
ప్రోక్తేతి తైత్తిరీయ సం
హితా" ఇత్యపిఉచ్యతే.
అత్రవిషయే ప్రమాణం పాణినిః.
తేనప్రోక్త" తిత్తిరవరతంతుఖాండికోఖాచ్ఛణ్"

వేతాక భాగమగు కృష్ణయజుర్వేద సంహిత తిత్తిరి అను మహర్షిచేత అధ్యాపనము చేయుబడెనుగాన దీనికి తైత్తిరీయ సంహిత అని పేరువచ్చెను. ఈ విషయమున పాణిని మహర్షియే ప్రమాణము.

ఈ తైత్తిరీయశాఖయందు ఇది సంహిత భాగము, ఇది బ్రాహ్మణ భాగము అను వివేచనచేసి ఈ వేదమును పృథఃకరించుట చాలకష్టము. కారణము సంహిత భాగమని చెప్పిన దానిలోనూ బ్రాహ్మణభాగమని చెప్పినదానిలోనూ మంత్రము ఉండుటయే కారణము. అందుచే ఇది బ్రాహ్మణము, ఇది మంత్రము అను పృథఃకరణము సంప్రదాయము ననుసరించియే పఠన పాఠనాదుల సమయమున గురు పరంపరగా తెలిసికొనవలయును. ఇట్టి వేదమంత్రములు అపౌరుషేయములనియు భారతీయ మహర్షులందరు మంత్ర ద్రష్టలేగాని స్రష్టలు గారనియు భారతీయుల విశ్వాసము. ఇది యిట్లుండ చారిత్రకులు వేదమంత్రములు మొదట రచింపబడెనని తరువాతికాలమున బ్రాహ్మణ భాగరచనము జరిగెనని చెప్పుట విచారింపవలసియున్నది.

ఇట్టి వైదిక భాషలో రెండుమూడుచోట్ల మాత్రమే ఆలంకారిక రచనా విధానము ఎటులనో చోటుచేసికొన్నది. ముఖ్యముగ ఉపమాలంకార రచన ఈ వేదమంత్రములలో చోటుచేసికొన్నది. కృష్ణయజుర్వేదమున మంత్రభాగమంతయు కర్మకాండ విధానమును, బ్రాహ్మణ భాగమంతయు జ్ఞానకాండను తెలియజేయును. అందుచే వేదమంత్రములలో దాగియున్న ఉపమాలంకారము కేవలము కర్మకాండపరముగ సరిపోల్చబడెను.

యజ్ఞయాగాది క్రతు విధానము ప్రాయశ్చిత్తము లేకుండగ దోష రహితముగ గుణసహితముగ నిర్వర్తించుట చాలక్లేశముతో కూడినపని. కర్మకాండ ఆచరించుచుండగ మధ్యలో దానికి విఘ్నము కలిగినపుడు దాని పరిణామ ఫలము ఈ క్రింది మంత్రమున ఉపమాలంకార శోభితముగ పేర్కొనబడెను.

"యథావ్యాఘ్రగ్ం సుప్తంబోధయతి తాదృగేవ తపదోఖిల్వాహుః"
శ్రీకృష్ణయజుర్వేదము-మంత్రభాగము

దారినపోయే మానవుడు పొదలో నిద్ర పోవుచుండిన పెద్దపులిని ఊరకయే తట్టి లేపినచో దాని పర్యవసానము ఎటులుండునో అట్లే కర్మకాండలో దోషములు సంభవించిన లేక విధి విధానము లోపభూయిష్టముగా నుండిన అటులనే పరిణమించును. అని దీని భావము. దీనియందు యథా తాదృక్ ఏవ అనుపదములు వ్యాఘ్రము అను ఉపమానము. ఉపమాలంకారరచనమును స్ఫురింపజేయును. ఈ వాక్యమున కర్మపదమును స్పృశింప

( 29 వ పేజీలో )



# శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం, తిరుచానూరు

## నిత్యపూజా నివేదనలు

సుప్రభాతం — ఉ. 5-00 గం॥ నుండి 5-30 గం॥ వరకు

సహస్రనామార్చన — ఉ. 5-30 గం॥ నుండి 6-00 గం॥ వరకు

(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు.)

నిత్యఅర్చన — ఉ. 6-00 గంటలకు

(ఏడాదికి రు 150/- లు చెల్లించిన గృహస్థులకు మాత్రమే.)

శుద్ధి, మొదటి గంట — ఉ. 6-15 గం॥ నుండి 6-45 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 6-45 గం॥ నుండి మధ్యాహ్నం 1-00 గం॥ వరకు

శుద్ధి, రెండవగంట — మ. 1-00 గం॥ నుండి 1-30 గం॥ వరకు

సర్వదర్శనం — మ. 1-30 గం॥ నుండి రాత్రి 7-00 గం॥ వరకు

శుద్ధి, రాత్రికైంకర్యము — రా. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు

సర్వదర్శనం — రా. 7-30 గం॥ నుండి 8-30 గం॥ వరకు

ఏకాంతసేవ — రా. 8-30 గం॥ నుండి 9-00 గం॥ వరకు

## శుక్రవారాలలో....

సుప్రభాతం — ఉ. 4-00 గం॥ నుండి 4-30 గం॥ వరకు

సహస్రనామార్చన — ఉ. 4-30 గం॥ నుండి 5-00 గం॥ వరకు

(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు)

నిత్యఅర్చన — ఉ. 5-00 గం॥ నుండి 5-15 గం॥ వరకు

శుద్ధి, మొదటిగంట — ఉ. 5-15 గం॥ నుండి 5-45 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 5-45 గం॥ నుండి 7-00 గం॥ వరకు

సళ్ళింపు — ఉ. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు

మూలవర్లకు అభిషేకం — ఉ. 7-30 గం॥ నుండి 9-00 గం॥ వరకు

(100 రూ. టిక్కెట్‌తో ఇద్దరు వ్యక్తులకు మాత్రమే.)

అలంకారము, రెండవగంట — ఉ. 9-00 గం॥ నుండి 10-00 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 10-00గం॥ నుండి రాత్రి 8-00గం॥ వరకు

ఊంజల్ సేవ — రా. 7-00 గం॥ నుండి 8-00 గం॥ వరకు

(అద్దాలమండపంలో రు. 150 టిక్కెట్‌తో జరుపుకొనవచ్చును. గృహస్థుకు 5 గ్రాముల వెండి డాలర్ బహూకరిస్తారు.)

రాత్రిగంట — రా. 8-00 గం॥ నుండి 8-30 గం॥ వరకు

ఏకాంతసేవ — రా. 8-30 గం॥ నుండి 9-00 గం॥ వరకు

## ఆర్జితం వివరాలు :

ప్రత్యేక దర్శనం: రూ. 2-00
సహస్రనామార్చన : రూ 6-50
నిత్యఅర్చన : రూ. 150-00 (ఏడాదికి)
అర్చన: రూ. 1-00
హారతి రూ. 0-50

పూలాభిషేకం (శుక్రవారాలలో) రూ. 100-00
ఊంజల్ సేవ (శుక్రవారాలలో) రూ. 150-00
తిరుచ్చి ఉత్సవం: రూ. 63-00
గజవాహనం: రూ. 32-00

# యువవాణి

సైన్సు సమాజాన్ని ముందుకు నడిపించవచ్చు. కానీ మనిషిని మహోన్నతుణ్ణి చేయజాలదు. ఆ శక్తి సత్సాంగత్యానికి, దైవభక్తికీ మాత్రమే వుంది!

## నడవడి బాగుపడేమార్గం

— శ్రీ మన్నవ గిరిధరరావు

"మనుష్యుడు ఆకాశంలో పక్షివలె ఎగరడం నేర్చాడు. నీటిలో చేపవలె ఈదడం నేర్చాడు. కాని భూమిమీద మానవునివలె మెలగడం నేర్వలేదు" అని ఒక పాశ్చాత్య రచయిత వ్యాఖ్యానించాడు.

ఆతని విమర్శలో ఎంతో సత్యంవున్నది. మనుష్యుడు భౌతిక ప్రపంచంలో ఎన్నో ఘనవిజయాలు సాధించాడు. అంతరిక్ష యాత్రికులు ఐదునెలలపాటు ఆకాశంలో ఉండి వస్తున్నారు. శాస్త్రజ్ఞులు రెండేసి నెలలు సముద్రగర్భంలో ఉండిపోయి పరిశోధనలు చేస్తున్నారు. భారతీయ వైమానికులు గూడ అంతరిక్ష యాత్రకు సిద్ధమవుతున్నారు. డాక్టర్లు కృత్రిమగుండె కాయలతో రోగుల్ని జీవింప చేస్తున్నారు. కృత్రిమరక్తంగూడ తయారయ్యే స్థితి వచ్చింది. ఇవన్నీ ఆనందాన్నీ ఆశ్చర్యాన్నీ కలిగిస్తున్నాయి.

ఐతే మనిషికీ మనిషికీ నడుమ సంబంధాలు ఘోరంగా క్షీణిస్తున్నాయి. మనిషిని మనిషి నమ్మడం లేదు. ప్రేమానురాగాలు పుస్తకాలలో తప్ప కనిపించడంలేదు. మంచి నడవడి అనేది బజారులో అమ్మే సరుకుకాదు గనుక ఎక్కడా దొరకడం లేదు.

తండ్రి కుమారుణ్ణి గొప్పవాణ్ణి చేయాలని ఉన్నతవిద్య నేర్పించి డాక్టర్నిచేస్తే అతడు మద్యపానానికి దాసుడై పనికి రాకుండా పోతున్నాడు. మరొకడు ఆనకట్టలు గట్టి దేశ ప్రగతికి తోడ్పడుతాడనుకుంటే కాగితాలపై కాలువలు త్రవ్వి ప్రజాధనం స్వంతం చేసుకున్నాడు.

ఇలా విద్యావంతులే వ్యసనాలకు బానిసలవుతున్నారు. వంచన, దగా వృత్తిగా పెట్టుకుంటున్నారు. వీరు చదివిన ఆధునిక విజ్ఞానశాస్త్రాలు వీరి బుద్ధిని అదుపులో పెట్టలేక పోతున్నాయి. ఎందుచేతనంటే సైన్సు అనేది ప్రకృతిలో వివిధ కార్యకలాపాలు ఎలా జరుగుతున్నాయో వివరించి చెపుతుందేగాని మానవుని నడవడి ఇలా వుండాలి ఇలా వుండకూడదు అని చెప్పజాలదు.

విజ్ఞాన శాస్త్రాల ద్వారా టెలిఫోను, టెలివిజనులాంటి అనేక ఉపకరణాలను సమకూర్చుకుంటున్నాం. ప్రాణాన్ని కాపాడే మందులను తయారు చేసుకుంటున్నాం. వాటితో జీవితాన్ని మరింత సుఖవంత మొనర్చుకుంటున్నాం. ఇలా సైన్సువలన జరుగుతున్న మహోపకారం అసాధారణమైనది.

ఐతే భార్యాభర్తలు ఎలా వుండాలి అన్నదమ్ములు ఎలా వుండాలి ప్రజలతో రాజు ఎలా వ్యవహరించాలి మానవుడు మరొక మానవునితో ఎలా మెలగాలి అనే విషయాలను సైన్సుచెప్పదు, చెప్పజాలదు. అది దాని పనికాదు. ఐతే మనిషికి జీవిత ఉపకరణాలు ఎంత అవసరమో, తనతో ఇతరులు ప్రవర్తించే తీరు అంతకంటె ఎక్కువ అవసరం. తల్లిదండ్రులు తనను ప్రేమతో ఆదరంతో దగ్గరకు పిలవకపోతే బిడ్డకు దుఃఖం ముంచుకువస్తుంది. ఖరీదైన ఆట వస్తువులను దూరంగా త్రోసివేస్తాడు. అందుచేత మనుష్యుల నడుమ సత్సంబంధాలకే జీవితంలో ప్రథమస్థానం; ఉపకరణాలది ద్వితీయస్థానమే. ఈ సత్యాన్ని విస్మరించరాదు.

మానవుని నడవడి మెరుగు పడడానికి వేరే మార్గాలున్నాయి. అసలు మనుష్యుని స్వభావమేమిటి? మానవుడు అనుకరణశీలి. అతడు ఎప్పుడూ ఎవరినో చూచి వాళ్ళవలె జీవించాలని ప్రయత్నిస్తాడు. "శ్రేష్ఠుడు ఏ ఏ కర్మలను చేయుచున్నాడో, తక్కిన జనులును అవే పనులను చేయుదురు. ఆతడు దేనిని ప్రమాణముగ గ్రైకొనుచున్నాడో ఇతరులును దానినే అనుసరింతురు." అని శ్రీకృష్ణుడు గీతలో చెప్పినట్లు మానవుడు ఉత్తములైనవారిని అనుకరిస్తూ వుంటాడు. మిక్కిలి ప్రేమతో తొడికివలాడే మహనీయుని జూచి తానుగూడ ప్రేమస్వరూపుడవుతాడు. ఎంతో దయార్ద్రహృదయుని సాంగత్యం వలన తాను గూడ ప్రాణులమీద కారుణ్యమును పెంపొందించుకుంటాడు. పెద్ద అయస్కాంతము యొక్క రాపిడి వలన చిన్న ఇనుపముక్కగూడ అయస్కాంతమైనట్లు సామాన్యులు మహనీయుల జీవితాలను గుర్తుచేసుకోవడంవలన అసామాన్యులుగా ఎదుగుతారు. రమణ మహర్షి, రామకృష్ణ పరమహంస, షిర్డీసాయిబాబా, వివేకానంద మున్నగువారి ప్రభావం వలన ఎందరో మానవోత్తములు కాగలిగారు. అందుచేత వ్యక్తి బాగుపడే మార్గం సత్సాంగత్యం; ఉదాత్త పురుషుల సాన్నిధ్యం.

మరొకమార్గం ఏమిటంటే మనం చేసే మంచిపనికి మంచిఫలితం ఎలా వస్తుందో చెడ్డపనులకు గూడ చెడ్డ ఫలితాలు వచ్చి తీరుతాయనీ వాటిని అనుభవించకుండా తప్పించుకొనే వీలులేదనీ గ్రహించడం. లోకంలో నేరం చేసి న్యాయస్థానాల బారి నుండి తప్పించుకోవచ్చునుగాని పర్యేశ్వ

## రాష్ట్రంలోని సప్తగిరి మాసపత్రిక ఏజెంట్ల చిరునామాలు.

### శ్రీకాకుళంజిల్లా

శ్రీమతి ఎం. వి. సరస్వతీదేవి
ఏజెంట్
C/o ఎస్. మిన్నారావు
...ంపేట - 532 284

శ్రీ కె. రామారావు
C/o బ్రూక్‌బాండ్ ఏజెంట్
పాలకొండ - 532 440

శ్రీమతి ఉప్పలపాటి కృష్ణమ్మ
C/o నారాయణమూర్తి
తెలుగు పండిట్
వజ్రంగి పొందూరు - 532 168

శ్రీమతి ఎం. పద్మావతి
W/o వి. ఎన్. ఎన్. స్వామి
హెడ్‌మాస్టర్
మత్స్యలేశం
కళింగపట్నం బి.పి.ఓ.

శ్రీ కె. రామప్రసాదరావు
C/o ఎం. వి. శేషాచార్యులు
కిరాణ వర్తకుడు
కొండ్రావీధి టెక్కలి - 532 202

### పశ్చిమ గోదావరి జిల్లా

శ్రీ పి. కె. వి. రామానుజాచార్య
శ్రీ కృష్ణ లోకో రైల్వే స్టేషన్ రోడ్
తాడేపల్లిగూడెం - 534101

శ్రీ బి. శివరామకుమార్
కుమార్ న్యూస్ ఏజెన్సీ
రామమహల్ ఎదురుగా
ఏలూరు - 534002

శ్రీ టి. వెంకటగిరి నరసింహమూర్తి
మోర్త - 534 227 తణుకుతాలూకా

శ్రీ సి. గోపాలాచార్యులు
మల్లవరంపోస్టు, వయా నరసాపూర్

శ్రీ కర్రి గంగాధరరెడ్డి
అర్జునుడుపాలెంపోస్టు, వయా ఇరగవరం

శ్రీ కొండా వేంకటేశ్వరరావు
కన్నూరు-534 329

శ్రీ బొడ్డు వెంకటరత్నం
న్యూస్ ఏజెంట్ మైన్‌రోడ్
పెనుగొండ-534 320

శ్రీ బంగారుసీతా రామాంజనేయగుప్త
S/o బి. రామకృష్ణారావు, మెయిన్‌రోడ్
పాలకొల్లు-534 260

### ప్రకాశం జిల్లా

శ్రీ సి. సుబ్బరాయులు
శ్రీ సత్యనారాయణ ఏజెన్సీ
4-8-86 గిద్దలూరు

శ్రీ జి. వి. సుబ్బారావు
రావ్ అండ్ రావ్ ఏజెన్సీ
కొవ్వూరు-523 105, కందుకూరుతాలూకా

శ్రీ కోడూరి వెంకటసుబ్బారావు
ఎల్. ఐ. సి. ఏజెంట్, ఉప్పుగుండూరు

శ్రీ ఎస్. వి. రమణయ్య, సాకలబుక్‌షాప్
మార్కాపురం-523 316

శ్రీ అడపాహరి శ్రీపసన్న న్యూస్‌ఏజెన్సీ
లింగసముద్రం-523 114
కందుకూరుతాలూకా

ఎం. వి. చలం సులేఖ న్యూస్ ఏజెన్సీ
చీరాల

శ్రీ పి. వి. సుబ్రమణ్యం
ప్రభుత్వ ఆస్పత్రి దగ్గర, అద్దంకి

శ్రీ రాచపూడి వెంకటసుబ్బారావు
లాయర్‌పేట, ఒంగోలు-523 003

శ్రీ జి. మాలకొండయ్య
C/o పెద్దనరసింహులు ఎల్.ఐ.సి. ఏజెంట్
చీమకుర్తి-523 226

రుని న్యాయస్థానంలో శిక్ష పడకుండా తప్పించుకొనే వీలులేదు. అందుకే,

> "అన్నిటికంటె పైనున్నది పరలోకం
> కూర్చుంటా దక్కడొక న్యాయమూర్తి
> ఏ రాజూ లొంగదీసుకోలేడతన్ని"

అని షేక్స్పియర్ మహాకవి వ్రాశాడు. ఎంత సొగసుగా చెప్పాడు!

అందుచేత భగవంతుడు సర్వత్రావ్యాపించి యున్నాడనే సత్యాన్ని గుర్తించడం అవసరం. "మనుష్యుడు పాపకార్యాలను ఎవరూ చూడనపుడు చేస్తాడు. కాని అపుడు సహితం భగవంతుడు చూస్తూనే వున్నాడని, మనం చేసే పనులనే గాక మన ఆలోచనలను గూడ చూస్తున్నాడనే సత్యాన్ని గ్రహించినపుడు తప్పులు చేయకుండా ఉంటాం" అన్నారు గాంధీజీ.

అందుచేత మానవుని నడవడిని సరిదిద్దే శక్తి సైన్సుకు లేదు. కనుక సైన్సు సాధిస్తున్న కళ్ళుమిరుమిట్లు గొలిపే ఘనకార్యాల వలన మన జీవితం పూర్తికాదు. మనిషిలో మానవత్వం తొడికిసలాడితేనే జీవితానికి అందం, ఆనందం వుంటుంది.

మనుష్యుల నడవడి రెండు మార్గాలలో మెరుగు పడుతుంది. ఒకటి: స్వార్థాన్ని కనీసస్థాయికి తగ్గించుకొని లోకకల్యాణము కొరకు జీవితాన్ని ధారపోసిన మహనీయుల ఉదాహరణలను మన ఎదుట వుంచుకొనడం, వారిని అనుకరించడం. రెండవది: మనం చేసే ప్రతి చెడ్డపనికి చెడ్డ ఫలితం వుండి తీరుతుందని గ్రహించడం. ఇందు మొదటి మార్గం మంచిని పెంచటానికి, రెండవమార్గం చెడును నిరోధించడానికి ఉపకరిస్తాయి.



# మన ఆచారాలు-అంతరార్థాలు

— శ్రీ ఎ. హనుమంతప్ప

మనకు పూర్వం నుంచి కొన్ని ఆచారాలు వున్నాయి. మనం ఆ ఆచారాల్ని యిప్పటికీ పాటిస్తున్నాం. ఉదాహరణానికి దేవునికి టెంకాయ కొట్టడం, తలనీలాలు అర్పించడం మొదలైనవి. ఈ ఆచారాల్ని మూఢాచారాలని కొంతమంది భావిస్తున్నారు. కాని ప్రతి ఆచారానికీ ఒక అంతరార్థముంది. అంతరార్థం తెలిసి వ్యవహరిస్తే సదాచారం. తెలియకుండానే ఆచరిస్తే మూఢాచారం. ఒక ఆచారాన్ని అంతరార్థం తెలియకుండా ఆ ఆచారాన్ని ఆచరించినప్పటికీ దేవుని కరుణ బడయటానికి అవేవీ అడ్డురావు. అయినా మన ఆచారాలు గూఢార్థాలు లేకుండా ఏవీ లేవు. కొన్ని ఆచారాల గూఢార్థాల్ని పరిశీలించి తెలుసుకుందాం.

ఏదైనా విష్ణుమూర్తి పటాన్నిచూస్తే ఆ స్వామి పడుకునే ఆదిశేషునికి ఏడు తలలుంటాయి. ఆదిశేషునికి ఏడు తలలుండేటట్లు నిర్దేశించడంలో మన పెద్దల ఉద్దేశ్యమేమిటంటే దేవుడు సప్తలక్షణాలతో వెలుగుతున్నాడని అర్థం. ఈ అర్థాన్ని బొమ్మలోని ఏడుతలలు తెలియజేస్తాయి. తిరుపతి ఏడుకొండలకు కూడా అర్థమిదే. ఏడుకొండలకు ఏడుతలల ఆదిశేషుడని అర్థం. ఏడు కొండలపై వేంకటేశ్వరుడున్నాడు. అంటే దేవుడు సప్తలక్షణాలతో ప్రకాశిస్తున్నాడు అని భావం. బ్రహ్మ చతుర్ముఖుడు ఎంచేత? దేవుడు అన్ని దిక్కులను సమానంగా చూడగల్గునని దాని భావం. శివుడు ముక్కంటి. ఎందువల్ల అంటే మూడవకన్ను జ్ఞాన నేత్రానికి సంకేతం. అంటే తన్ను దర్శింపగోరే వారు మనోనేత్రంతో చూడాలని శివుని మూడవకన్ను మనకు తెలియజేస్తుంది. కాబట్టి త్రిమూర్తులకు మనవారేనాడో అభేదం పాటించాలన్న సంగతి మన మొక్కవ మరువరాదు.

ఇక పూజకు సంబంధించిన విషయాలు చూస్తే చాలా సూక్ష్మమైన భావాలు మనకు తెలుస్తాయి. టెంకాయ దేవుని ముందు పగులకొడతాం. పగులకొట్టకముందు దానికి ఒక చివర కొంచెం జుట్టు (పీచు) వుంటుంది. కొబ్బరికాయ పగులగొట్టిన తర్వాత ఆ జుట్టును పెరికివేస్తాం. అంటే ఆ మిగిలిన టెంకాయ పీచును ఏ విధంగా అయితే పెరికివేస్తామో అదే విధంగా మన అహంకారాన్ని దేవుని ముందు తీసివేస్తున్నామని దాని భావం. (కొంతమంది కొబ్బరికాయ పగులగొట్టిన తర్వాతకూడా పీచు పెరికివేయరు. ఇది తెలియని పద్ధతి. ఒకవేళ పూజారులు భక్తాదుల ఒత్తిడి వల్ల పీచు తీసివేయకుండా యిచ్చినప్పటికీ మనం వెంటనే పీచు తీసివేయాలి. ఎందుకంటే పీచు తీసివేయడంలో పై గూఢార్థముంది కాబట్టి.) రెండు కొబ్బరి చిప్పలలో ఒకదానికి మూడుకన్నులు (మూడు కనుములు) వుంటాయి. రెండు కన్నులు బాహ్యనేత్రాలకు మూడవకన్ను జ్ఞాన నేత్రానికి సంకేతం. భగవంతుని జ్ఞాన నేత్రంతో చూడాలని దాని భావం.

దేవునికి తలనీలాలు అర్పిస్తాం. తలలు బోడిచేసుకొనడంలో కూడా అర్థమిదే. ఏ విధంగా అయితే తలలు బోడి అయినాయో మా మనసుల్ని కూడా బోడిచేస్తున్నామని దేవునిముందు మన అహంకారాన్ని తీసివేస్తున్నాం. మూడు ఆకులుగల బిల్వపత్రిని పూజకు సమర్పిస్తారు. రెండుఆకులు బాహ్యనేత్రాలకు ప్రతీకలు. మూడవ ఆకు మన జ్ఞాననేత్రానికి సంకేతం (రెండు ఆకులు ఎదురెదురుగా వుండి మూడవ ఆకు రెండు ఆకులమధ్య పైభాగాన విడిగా వుంటుంది.) అందుకోసమే మనం పూజకు బిల్వపత్రిని సమర్పిస్తాం.

దేవుని గుళ్ళపై కాని గుడిచుట్టూవున్న కైవారపుగోడలపై కాని తెల్లపట్టీలు (సున్నపు పట్టీలు), ఎర్రపట్టీలు వుంటాయి. ఈ రెండు పట్టీలూ మానవజీవితం అశాశ్వతమని తెలియజేస్తాయి. తెల్లపట్టీలు మనిషి దేహంలోని ఎముకలకు, ఎర్రపట్టీలు రక్తానికి చిహ్నాలు. అంటే మానవ దేహం శాశ్వతంకాదు, ఎప్పుడైనా మట్టిలో కలిసిపోవలసిందే అని. అలా చెప్పకపోతే యేం మనిషి అశాశ్వతమన్న సంగతి తెలియదా అంటే, తెలియకకాదు అశాశ్వతమైన దేహం కోసం పాపాలు ఎందుకు చేస్తావు? పుణ్యకార్యాలు చేసి, దైవజ్ఞానం పొంది మోక్షం పొందమని ఆ ఎర్రపట్టీలు, తెల్లపట్టీలు తెలియజేస్తున్నాయి. ఇదే అర్థాన్నే కాషాయవస్త్రాలు కూడా తెలియజేస్తాయి.

దేవుని గుళ్ళయొక్క వాకిళ్ళు ఎందుకు పొట్టిగా వుంటున్నాయి? ఎంతో ఖర్చుపెట్టి కట్టించిన దేవాలయాలకు వాకిళ్ళు మాత్రం చిన్నవిగా వున్నాయి. కారణం దేవుని గుడిలోనికి ప్రవేశించే ముందు అహంకారాన్ని అణచివేసి వంగినడవాలని దాని వుద్దేశ్యం. ఎవరైనా తెలియనివారు వంగిప్రవేశించకపోతే తల కొట్టుకొంటుంది కదా! అప్పుడైనా వంగి దేవుని గుళ్ళోనికి ప్రవేశిస్తారనే వుద్దేశ్యంతో మన పూర్వీకులు దేవుని గుళ్ళకు వాకిళ్ళు చిన్నవిగా పెట్టారు.

ఇక కృష్ణుడు నలుపు - నీలమేఘశ్యాముడు. నలుపు అనంతత్వానికి ప్రతీక.

[26 వ పేజీలో]

ఆంధ్రదేశమందే కాక యావత్ భారత దేశం లోనే అనాదిగ బహుళ ప్రచార మందున్న జాతరలలో తిరుపతి గంగజాతర అతి ముఖ్యమైనది. ఈ జాతర ఎపుడు ఎవరి చేత ప్రారంభింప బడినదో కచ్చితముగా తెలియరావడం లేదు. ఐతే తాళ్ళపాక అన్నమాచార్యుల వారు ఈ దేవతను గ్రామము వెలుపల వెలయుమని ఆదేశించి నట్లు కొంతమంది ఉవాచ. పూర్వమీ దేవత క్షుద్రదేవతగా ఉండి గ్రామములోని ప్రజల వద్దనుండి బలులను కోరెడిదట! నరబలులను మాన్పించి, ఆమెకు 20 దున్నపోతులు, 400 మేకపోతులు, 700 కోళ్ళను బలి ఇచ్చు నట్లు అన్నమయ్య గంగమ్మతో ఒప్పందము గావించుకొన్నారు. పై ఒప్పందము ప్రకారము ఇటీవలి కాలం వరకు పై తెలిపిన సంఖ్యలో జంతుబలులు జరిగెడివి. ఈ ఒప్పందానికి నిదర్శనముగా ఈ రోజుకూడా తాళ్ళపాకవారి ఇంటిపేరున గ్రామ పొలిమేరల్లో తాళ్ళపాక గంగమ్మ ఆలయము మున్నది.

అన్నమయ్య మరణంతర్వాత ఈ దేవత తిరిగి గ్రామప్రజల్ని పీడించగా 16వ శతాబ్దంలో కుమార తాతాచార్యుల వారు ఈమెను గ్రామం నుండి వెళ్ళగొట్టనెంచి వెంటపడి తఱిమి ఆమెను గ్రామం వెలుపల తాతాచారి (తాతాయి) గుంట గట్టున నిలిపినారు. అందుచేతనే తాతాచారి దెబ్బ భుజం తప్పినా వీపు తప్పలేదు. అనే సామెత ప్రచారమందున్నది.

తిరుపతి గంగమ్మ ఆనాటినుండి గ్రామ ప్రజల్ని ఈతిబాధలనుండి కాపాడుతున్నది. ఒకమారు తిరుపతిలో కలరా, మశూచి, వ్యాధులు వ్యాపించి పలువురు చనిపోగా, గ్రామంలోని ఒక వృద్ధురాలు తన ఏకైక పుత్రుని ఊరు వదలిపెట్టి ఎచ్చటికైనావెళ్ళి బ్రతకమని అతనికి సద్ది మూటగట్టి ఊరికి పొలిమేర వరకు వెళ్ళి సాగనంపగ, గ్రామం వెలుపల ఒక పండు ముదుసలి ఆ బాలునికి ఎదురుపడి నాయనా! ఎచ్చటి కెళ్ళుచున్నావని ప్రశ్నించగా బాలుడు తన గమ్యాన్ని తెలుపగా, అందుకా వృద్ధురాలు నేను కూడా గ్రామాన్ని వదలి పెట్టి వచ్చుచున్నానని అతని వెంట కొంతదూరము నడచి, ఒక చెట్టుక్రింద కూర్చొని 'మనవడా! నా తల అంతయుదురదపగా వుంది. కొంచెముచూడు, అని ఆమె తలను చూపించినది. ఆ బాలుడు అవ్వ తలలోచూడగ తలంతయు కండ్లు, కండ్లుగా గోచరించగా ఆశ్చర్యపడి భయంతో 'అవ్వా! నీ తలంతయు కండ్లతో నిండియున్నది' ఇదిఏమి అనగా మనవడా నేను గంగమ్మను, నీవు ఏ ఊరు వెళ్ళినను నా యీ కండ్లతో నిన్ను చూచెదను. నా దృష్టిని తప్పించుకోలేవు. నేను శుచి, శుభ్రత లేని వారినే బాధింతును. నీవు నీ ఇంటికెళ్ళి పేడ, పంచితము, పసుపుతో నీ ఇంటిని శుభ్ర పరచి శుచిగా నన్ను కొలుచుకో నీకేమి ఆపద రాదన్నది. అంతేగాక నాకు ప్రతిఏడు జాతర జరిపించే ఏర్పాటుచేయి, నీ వంశము వారికి ఎటువంటి ఆపదలు కలుగవు అని చెప్పి ఆమె అదృశ్యమైపోగా, ఆనాటినుండి ఆ ఇంటివారు (కైకొలనులు) పూజారులుగా అమ్మవారికి జాతర జరిపించుచున్నారు. గంగమ్మ తలలోని కండ్లను వేయికండ్ల దుత్తగా జాతర సమయంలో కొత్తకుండకు రంధ్రములు పెట్టి వేపాకుతో నింపి, పిండి దీపముతో అలంకరించి పూజిస్తారు.

తిరుపతి గంగమ్మకు 6 గురు అక్క చెల్లెళ్ళు. వీళ్ళని సప్తకన్యకలు అని కూడా వ్యవహరిస్తారు. వారు 1) తాతాయిగుంట గంగమ్మ 2) తాళ్ళపాక గంగమ్మ 3) వేషాలమ్మ 4) అంకాళమ్మ 5) ముత్యాలమ్మ 6) పోలేరమ్మ 7) నేరేళ్ళమ్మ. వీరి పుట్టిల్లు అవిలాల.

తిరుపతి గంగమ్మ ప్రీతికొరకు ప్రతి ఏటా వైశాఖమాసం (మే నెల రెండవవారం) లో అవిలాల నుండి పసుపు, కుంకుమ, గంధము తెచ్చి చాటింపుచేసి వారము రోజులు ఉత్సవాలు రోజు కొక వేషంచొప్పున ధరించిజరుపుతారు. జాతర మొదటి మూడు రోజులు వేషధారులు బూతుమాటలు పలకడము ఈ జాతర విశేషం.



తాళ్ళపాక గంగమ్మ



మొదటిరోజు బైరాగివేషం, రెండవరోజు బండవేషం, మూడవరోజు తోటివేషంవేస్తారు. రెండవరోజు మూడవరోజు వరుసగా బండ వేషము తోటివేషాలు ధరించి ఊరంతా చుట్టుతారు. ఈ మూడు రోజులు స్త్రీ పురుష విచక్షణ లేకుండా బండ బూతులు కూస్తారు. ఈ రోజుల్లో స్త్రీలు మామూలుగా గృహాల్ని వదలి వెలుపలికి రావడానికి సంకోచిస్తారు. వేషాలలో ఆదివారం వేసే మాతంగివేషం పేర్కొనదగ్గది. ఈ వేషాన్ని సాలెవాళ్ళు వేసి అమ్మవారి ముందు పంబలవాళ్ళు పంబలు వాయిస్తుంటే మైమరచి ఆట ఆడుతారు. పూర్వమీవేషం ధరించే వ్యక్తికి నాలుక మధ్యలో పై నుండి క్రిందికి ఒక కమ్మీని గ్రుచ్చేవాళ్ళు. ఇంత జరిగినా ఆ వ్యక్తికి నొప్పి పుట్టడం కాని, రక్తం కారడం కాని జరిగేది కాదట! కమ్మి తీసివేసిన తర్వాత కొంత వేపాకు, కుంకుమ నమిలి మ్రింగితే ఆ గాయం మానిపోయేది. ఈ



గంగజాతర సప్రాలు

# ...జాతర
## ...ష్ణమూర్తి

వేషం పూజారి ఇంటివద్ద, మహంతుల మఠంలో ఆనవాయితీగా జరిగేడిది. మరుసటి రోజు సున్నపుకుండ కోసం ఈ వేషధారి తలపైన సున్నము పూసిన మూడు క్రొత్త కుండలు ఒకదానిపై ఒకటిపెట్టి తల వెంట్రుకలు కుండలకు మధ్యనున్న రంధ్రాలద్వార పైకి బాగా ముడివేసి కుండలు పడిపోకుండా వళ్ళు మరచి నాట్యము చేస్తాడు. ఏడవ రోజు మంగళవారం గ్రామమంతా కోలాహలంగా వుంటుంది. ఎక్కడ చూచిన పురుషులు స్త్రీ వేషాలు ధరించి తిరుగుతుంటారు. ఇందులో పేర్కొనదగ్గ అంశము అన్ని కులాల వారు పాల్గొనుట.

ఈ రోజు 'సప్రాలు' కూడా ఊరేగిస్తారు. ఈ సప్రాలు వెదురుదబ్బతో గోపురాకారంగా తయారుచేసి క్రింద నాలుగు వెదురుదబ్బలు కాళ్ళుగా ఉంచుతారు. ఆ వెదురు కాళ్ళను వంటికి నాలుగు వైపులా సప్రము తలపై ఉండునట్లు అమర్చి, పైన తెల్లగుడ్డలు కట్టి ఆడుతాడు. పూర్వము ఈ సప్రాలు అనేక రకాలుగా ఉన్నట్లు ఈ క్రింది పద్యం వలన తెలుస్తూంది.

సర్వజనులెల్లరు చాకలివారు నిర్వహించుకున్నేరు
సీటు సప్రాలు
పూల సప్రములందు పూదోడి వినుము బాల
లకు కుట్టంగ భాగ్యంబులొసగు
తేరు సప్రాల్ మీకు తేటగా నేను హరిమిలో
వినుము కువలయనేత్రి
నగరి సప్రంబులు నాణ్యంబుగాను మొగిలి
రేకులబోలు ముత్యాల చిలుకల్ ॥

ఈ వేషములు వేషాలమ్మ గుడివద్ద వేస్తారు. కట్టకడపటి వేషం పేరంటాలు వేషం. ఈ రోజు ఆలయ పూజారి ఆడవేషం ధరించి, వెళ్ళి దేవియొక్క కుంకుమ అందజేస్తారు. ఈ రోజు రాత్రి తాతాయగుంట గంగమ్మ, తాళ్ళపాక గంగమ్మల విగ్రహాలు బంకమట్టితో తీర్చిదిద్ది తెల్లవార్లు పూజలు జరిపి తెల్లవారు జామున ఆ విగ్రహాల్ని ధ్వంసము చేస్తారు. భక్తులు ఆ విగ్రహాలను ధ్వంసం చేయునపుడు ప్రజలు మా తాపమును దీర్చి మమ్ము రక్షించు మహాదేవి మీకు మేము పుత్రుల మనుచు వేడితే తెల్లవారి తప్పక వర్షము పడుతుంది. వర్షము పడితే దేవి గ్రామప్రజల్ని కరుణించినట్లు భావిస్తారు. ధ్వంసం చేసిన గంగమ్మ విగ్రహాల మట్టిని పిల్లలకు పాలలో కలిపి త్రాగిస్తే వారు దీర్ఘ వ్యాధులనుండి విముక్తులవుతారట।

తిరుపతి ప్రజలు గంగజాతర వేషాలను గురించి ఈ క్రింది విధంగా జావళీలు అప్పుడప్పుడు పాడుకొంటుంటారు.

సీ॥ పులిపాలు తిరుపతి పోలేరు తాయికి
గంగజాతర వినుడీ ఘనముగాను
మూడవవారంబున ముదమున బిడ్డలంత
భిక్షంబు లెత్తురు, ప్రీతితోడ
నాల్గవవారంబున నయమున రెడ్లంత
చాటింపు జరిపెదరు నయముమీర
బైరాగి వేషముల్ బాగైన పాముల
గొల్ల వేషంబుల్, కొరతలేక
బండవేషంబులు బ్రమురదీరగా నపుడు
కోమటివేషాలు కొమరి మిగుల
తోటివేషంబుల్, బంట్రోతు వేషాలు
సున్నపుకుండలు సూటిగాను
ఐదవవారంబున అధిక పొంగళ్ళలో
అడుగడుగు దండముల్ అమరి కగును
వేపాకు చీరలు వేయికండ్ల కుండలు
వేటుల కుంభాలు వేడ్కతోడ
పేరంటాలు వేషాలు ప్రేమతో దేవిని
పెంపుమీరంగ దిష్టిచుక్కయును బెట్టి
ప్రేతబండియు వెంచేసి ప్రజలు మెచ్చ
ధరణి తాతయ్యగుంట గట్టున స్థిరముగాను

పాశ్చాత్యుల ప్రకారము తిరుపతి గంగజాతర రోమ్ సామ్రాజ్యమునుండి ప్రాచీన ఆంధ్రులు స్వీకరించినారని ఒక వాడుక. కొందరీమె సాక్షాత్తూ శ్రీ వేంకటేశ్వరుని చెల్లెలని పేర్కొంటారు. మరికొందరు ఈమె దేశంలోని అష్టాదశ మహాశక్తులలో ఒకరని భావిస్తారు. ఈమె పూర్వము తిరుపతిని పీడిస్తున్న ఒక రాక్షసునితో ఏడు రోజులు అనేక అవతారములు ధరించిపోరి వానిని చంపుటచే ఆనాటినుండి ఆమె జ్ఞాపకార్థం జాతర జరుగుతున్నదట! దానికి నిదర్శనంగా జాతర కడపటి రోజు ఒక మనిషికి రాక్షసవేషం కట్టించి బండిలో పరుండబెట్టి (చనిపోయినట్లు) గ్రామం వెలుపలికి తీసుకెళ్ళి ఆ మరుసటి రోజు వరకు ఆ వేషగాణ్ణి గ్రామము వెలుపలే వుంచి, మరుసటి రోజు గ్రామం లోనికి తానిస్తారు. తిరుపతి గంగజాతరకు కలకత్తా కాళిపూజకు సంబంధమున్నదని కొంతమంది నమ్ముతున్నారు.

తిరుపతిచుట్టుపట్ల 50 గ్రామాల్లో తిరుపతి గంగజాతర పేరుతో జాతరలు జరుపుతారు. పాశ్చాత్య నాగరికత తాకిడివల్ల మారుతున్న పరిస్థితులవల్ల ఈ జాతర నానాటికి తన పూర్వపు ఔన్నత్యాన్ని కోల్పోతూ ఈనాడు నామమాత్రంగా మాత్రమే మిగిలి యున్నది.

[ 23వ పేజీ తరువాయి ]

నీలమేఘశ్యాముడంటే సర్వవ్యాప్తి. నెమలిపింఛాన్ని ధరిస్తాడు. నెమలిపింఛం ఈ ప్రపంచపు రంగులవలయానికి సంకేతం. నెమలిపింఛంలోని రంగులు ఈ ప్రపంచం లోని వివిధ రకాల సృష్టిని తెలియజేస్తా యన్న మాట. కృష్ణుని చక్రం వృత్తాకారం-వృత్తాకారం అందానికి ప్రతీక. అసలు వృత్తమెప్పుడూ అందమే. సరళరేఖ ఎప్పుడూ అందంకాదు. అంటే దైవత్వ మన్నది మనోహరమైనదీ, అందమైనదన్న మాట. కృష్ణుని చక్రం వృత్తాకారమని చెప్పు కున్నాం. వృత్తాన్ని నాలుగు విభాగాలు చేస్తే ఈ విధంగా ఏర్పడుతుంది. ఒక్కొక్క విభాగం 90° (తొంభై డిగ్రీలు) వుంటుంది. 90°×4=360°. మొత్తం కోణం మూడువందలఅరవై డిగ్రీలు. సరిగ్గా మన (తెలుగు) సంవత్సరానికి మూడువందల అరవై రోజులు. అంటే కృష్ణుని చక్రం ఒక సారి పూర్తిగా తిరిగితే ఒకసంవత్సరమన్న మాట. కృష్ణుని ఆకారవర్ణనలోకూడా మన వారు యింత గూఢార్థం వుంచి వర్ణించారు.

శివుడు అర్ధనారీశ్వరుడు. పురుషుడు (పురుషుడు=పురుషుడంటే మగవాడు అని మాత్రమే అర్థంకాదు. జీవుడు అని అర్థం. అది మగకావచ్చు ఆడకావచ్చు) పెళ్ళికాక ముందు సంపూర్ణ మానవుడు కాదు సగమే. పెళ్ళి అయింతర్వాత సంపూర్ణ మానవుడవు తున్నాడు. అదే అర్ధనారీశ్వరతత్వం. పురుషుడు+స్త్రీ=సంపూర్ణమానవుడు.

ఇక విఘ్నేశ్వరుడు. విఘ్నేశ్వరుని రూపం దైవలక్షణాలకు సంకేతం. చెవులు పెద్దవి, ఏకదంతం, కన్నులు చిన్నవి, పొట్ట పెద్దది. ప్రపంచంలో ఎంతోమంది దేవుణ్ణి ప్రార్థిస్తున్నప్పటికీ (ఒకేసారి) లేదా మాట్లాడుతున్నప్పటికీ అందరి పలుకులను, అందరి ప్రార్థనలను ఒకేసారి వింటాడు. ఈ భావం తెలియజేయడానికి చెవులు పెద్దవిగా వున్నట్టు మనవారు అభివర్ణించారు. కన్నులు చిన్నవిగా వుంటే బాగా చూడ గలిగే శక్తి వుంటుందని శాస్త్రీయ (సైంటిఫిక్) నిరూపణకూడా వుంది. ఏనుగు కన్నులు చిన్నవిగా వుంటాయికదా! పొట్ట పెద్దది అంటే ప్రపంచమంతా తనలో యిమిడివుంది. దేవునికి ఈ లక్షణాలన్నీ వున్నాయని చెప్పడానికోసమే విఘ్నే శ్వరుని తల ఏనుగు తలగా మనవారు కావ్యాలలో చెప్పుకొన్నారు. విఘ్నేశ్వరుని రూపంలో యింత అంతరార్థం వుందన్న మాట. దేవుని గుడిలో మంగళహారతి ఎందుకు పడతాం? మంగళహారతి పట్టిన తర్వాత ఆ మంగళహారతికి మనమంతా మొక్కుతాం. మంగళహారతి జ్యోతి. అంటే వెలుగు. ప్రకాశం. అదియే జ్ఞానం. జ్ఞానమే బ్రహ్మమని శ్రుతి చెప్తోంది. జ్ఞాన మనగా దైవస్వరూపం. జ్ఞానస్వరూపం మంగళహారతి కాబట్టి మనం మంగళహార తికి నమస్కరిస్తాము. జ్ఞానం మీరు కూడా సంపాదించండి అని ఆ జ్యోతి (మంగళ హారతి) తెలియజేస్తుంది.

తిరుపతి కొండలు-ఏడుకొండలు, విష్ణు మూర్తి పడుకునే ఆదిశేషునికి ఏడుతలలు, సప్తర్షులు, సప్తసముద్రాలు, పెళ్ళిలో ఏడడగులు నడవడం- కాబట్టి మన ఆచార సంప్రదాయాల్లో సప్తసంఖ్యకు ఎంతో ప్రాముఖ్యముంది. ఋగ్వేదంలో కూడా సప్తసంఖ్యకు చాలా ప్రాముఖ్యముంది. ఈ విధంగా ప్రతి ఆచారానికి ఏదో ఒక అంతరార్థం వుండేవుంటుంది.



## దారిచూపు దయామయా!

దారిచూపు దయామయా!
దరిచేర్చుము శ్రీనిలయా!
నీవన్నిధినే పెన్నిధిగా
నిరతము కోరుచుంటి॥

నిన్ను పొగడు కవివర్యుడు
నిన్ను తలచు మునితిలకుడు
నిన్ను మలచు కళాశిల్పి
నిన్ను కొలుచు భక్తాగ్రణి
నీతత్త్వము నరయలేక
నిట్టూర్పుల విడుచుచుండ్రు॥

మనసే ఒక పందనమ్ము
మమతే విరిపరిమళమ్ము
ఆ మనమున నీ వుండుము
ఆ మమతగ ననుబొందుము॥

ఆహారమ్ము నీధ్యానమె
ఆత్మలోన కలుగునట్లు
అలముకొన్న తిమిరమ్ములు
అంతరించి తొలగునట్లు
నీతేజము నెల్లదెసల
నివ్వటిల్లఁ జేయుమయా!

అంతట నీవుందువనుచు
అనుచుందురు భక్తజనులు
అయినా కనిపించవీవు
అనెడి వారికనుల కెపుడు॥

చింతల చీకట్లనుండి
వంతల అగచాట్లనుండి
నిన్ను చేరు దారికనక
నిర్వేదము చెందు మనసు॥

అందులకే వేడుచుంటి
సుందరమగు ధర్మపథము
ఆదారిన నడిపించుము
అఖిల జనుల! దివ్యరూప॥

— సురభి నరసింహము

## నిత్యానుష్ఠానక్రమము

ప్రకాశకులు: శ్రీ సీతారామనామ సంకీర్తన సంఘము, శ్రీ రామనామక్షేత్రము, గుంటూరు-4. వెల: రు. 2/-

శ్రౌతస్మార్తవిధులను చిన్నచూపు చూడ డమేకాక, అవహేళనచేసే ప్రారబ్ధం భార తీయతకు పట్టింది. ఇలాగు జరుగుతుందని వ్యాసభగవానుడు భాగవతములో శుకుని నోట చెప్పాడు. అది అలా జరగవలసిందే. ఎవ్వరూ దానిని ఎదిరించలేరు.

కానీ ప్రాచీనసంప్రదాయానికి మనస్సాగ్గి శిరసు వంచి చేతులు జోడించేవారు, తత్ ద్విధులనాచరించేవారు లేకపోలేదు. అలాటి వారందరున్నూ, ప్రత్యేకించి త్రిసంధ్యలూ సంధ్యావందన సూర్యనమస్కార విధులను నిర్వర్తించేవారు చేతనుంచుకోదగిన పవిత్ర గ్రంథం ఇది.

సంధ్యావందన ప్రక్రియకు సంబంధించి తెలుగులో అర్థాలుకూడా ఇందున్నాయి. కనుక గ్రుడ్డిగా ఏదో వార్చాము, తీర్చాము అని నీరసంగా అననక్కరలేదు. అర్థం తెలుసుకుని ఆచరించడం ఆవశ్యకం కదా!

భుజమెక్కుజందెమా! అనేపద్ధతి కాకుండా యజ్ఞోపవీతం ధరించే పద్ధతికూడా ఈ చిన్ని కృతిలో ఉంది.

విశేషించి చెప్పవలసేది శ్రీరామస్తుతి. చాలా సులువుగా కంఠపాఠం చెయ్యవచ్చు. రాముడు తెలుగువారి అభిమాన దైవతం కదా!

సూర్య నమస్కారాలు చేయనివారికి చేసేవారికిన్నీ ఇందలి ఘట్టం ఉపక రిస్తుంది.

తిలకధారణం (మృత్తికధారణం) భస్మ ధారణం దీనినిబట్టి చక్కగా తెలుసుకోవచ్చు.

నామపంజరస్తోత్రం చాలా ఆవశ్యకం. సర్వరక్షాకవచం అని చెప్పడములో సందే హంలేదు. ఇంటాబయటకూడా అది అంగ రక్షకం అవుతుంది. ప్రయాణాలలో తెలిసిన పెద్దలు దీనిని పఠించి బయలుదేరుతారని లోగడ వినివున్నాను.

ఆచమించినది మొదలు స్వస్తివాచకం వరకు ఉన్న యీ గ్రంథంలో స్వరం గూర్చి ముందే చెప్పారు. 'ముద్రణాలయ ములో స్వరబోధకములైన గుర్తులులేవని కాబట్టి స్వరజ్ఞులైన పెద్దలవల్ల ఆయా మంత్రా లకు స్వరం చెప్పుకోవలసి ఉంటుంది. స్వర మెరిగి శ్రౌతమార్గాన్ననుసరించాలి.

మొత్తంమీద శ్రీరామనామక్షేత్రంవారు ఆస్తికజనోపయోగియైన ఉత్తమ కృతిచేసి కృతార్థులయినారని మనసా అభినంది స్తున్నాను.

— యామిజాల పద్మనాభస్వామి

# గ్రంథసమీక్ష

## సాహిత్యసుధ

రచయిత: డా॥ ఎస్. గంగప్ప, ప్రతులకు: శశి ప్రచురణలు, సి-73, శ్రీనివాసనగర్. గుంటూరు-52006. వెల: రు. 15/-.

శ్రీ గంగప్పగారు కోలాచలం వారి నాట కాలను పరిశోధనచేసి డాక్టరు పట్టా పొందిన వారు. క్షేత్రయ్య, సారంగపాణి పద సాహిత్య మకరందాలను గ్రోలి పాఠక లోకానికి అందించినవారు. బహుగ్రంథ కర్త. వారి లేఖిని నుండి నేడీ సాహిత్య సుధ వెలువడింది. ఇది ఇరవై వ్యాసాల సంపుటి. "పురాణమిత్యేవ న సాధు సర్వం, న చాపి కావ్యం నవమిత్యవద్యం" అనే కాళి దాసు సూక్తిని పాటించి ప్రాతదంతా నెత్తినపెట్టుకోక, క్రొత్తదైనంత మాత్రాన కాలితో త్రొక్కక పాత క్రొత్త రచనలను సమ దృష్టితో సమీక్షచేశారు.

ఆకు మఱుగుపిందెలైన, తెరమఱుగు దీపకళికలైన ప్రవర, విష్ణుచిత్త, నిగమ శర్మల ధర్మపత్నుల పాత్రచిత్రణలు అపూర్వం. కరుటూరివారి శిష్యరక్షిత, సరోజనినాయుడి కవిత-సామాజిక స్పృహ వంటివ్యాసాలు సాహితీ సరస్వతికి క్రొత్త అలంకారాలు.

మతానికి మమత అనే కిరీటం పెట్టి చూడమంటున్నాడు జాషువా. వారి ఆత్మ నివేదన గబ్బిలకావ్యంలో ఎట్లా ప్రస్ఫుట మయినదో వివరించారు గంగప్పగారు. నేటి వాతావరణ కాలుష్యానికి తాజ్‌మహల్ రూపుమారిపోయినా జాషువాగారి తాజ్ మహల్ అజరామరం. గజనీమహమ్మద్ పద ఘట్టనలలో వాడివత్తలైన పువ్వు పిర దౌసి. వీరి వ్యాసంవల్ల నలిగిపోయినపువ్వు కూడా వాసనలు వెదజల్లుతుందని బుజువౌ తోంది. సుప్రసిద్ధులైన శ్రీ విద్వాన్ విశ్వం గారు ఎంత ఆర్ద్ర హృదయంతో పెన్నేటి పాటను వ్రాశారో అదే రీతిలో వ్యాసరచన కొనసాగింది. అట్లే వేదుల, నండూరి, కరుణశ్రీ. కె. వి. ఆర్. ప్రభృతుల పుష్ప హృదయాలను వ్యాసకర్త అందంగా ఆవిష్కరింపజేశారు.

దేశభాషలందు తెలుగు, త్రిపురాంత కోదాహరణం, రాయల లోకవృత్త పరిశీలన రఘునాథరాయల వాల్మీకిచరిత్రం, ధూర్జటి శివభక్తి, ఏడుపుల సాహిత్యం వంటి పెక్కు విషయాలు సాహితీ విద్యార్థులకు సుపరి చితాలు. అయినా నిన్న ఉదయించిన సూర్యుడు నేడూ క్రొత్తగానే కనిపిస్తు న్నాడు కదా!

---

### స్వీకారం:

### శ్రీనివాసకల్యాణం

(ఐదు అంకాల నాటకం)

రచయితలు: నాగరాజ్, సాగర్.

సర్వశ్రీ దివాకర్ల వేంకటావధాని,

డా॥ నండూరి రామకృష్ణమాచార్య,

ముదివర్తి కొండమాచార్యుల విపులపీఠికతో-

వెల: 5-00

ప్రతులకు: కె. ఎస్. రావ్,

11, జూనియర్ ఆఫీసర్స్ క్వార్టర్స్,

టి. టి. డి., తిరుపతి.

ఈ పుస్తకంలో పై కావ్యాల గుణగానం వినిపిస్తోంది. కాని రామలింగని కావ్యంలో ఒక అనౌచిత్యం (కొరవు) ఉందని పేర్కొన్నారు. నిగమశర్మ, ఇంటిలోని సొమ్ము లన్నీ మూటకట్టి పారిపోయినపుడు తన ముంగర పోయిందని అతని అక్క విలపిస్తుంది. ఈ విలాపం, ఆ పాత్రకు కళంక మని శ్రీరాళ్ళపల్లివారి విమర్శ. వారి అడుగుజాడల్లోనే శ్రీ గంగప్పగారు కూడా నడిచారు. స్త్రీలు పెట్టుకునే ఆభరణాలు అలంకారానికే కాక అందులో పవిత్రత, సౌభాగ్యం, మాంగల్యం ఆరోగ్యం మొ॥ తొంగిచూస్తున్నాయి. స్త్రీ పురుషులు కలిసి నపుడు స్త్రీ విడిచే దుష్టశ్వాస పురుషునకు తగిలితే అతని ఆయుర్దాయానికి భంగం కాబట్టి, చెడుగాలిని పవిత్రం చేసేది బంగారం కాబట్టి ఈ నాసాభరణం ఏర్పడింది. బంగారం ఆయుర్దాయాన్ని కలిగించేదని అయుష్యం వర్చస్యగ్ం..” అనే వివాహమంత్రం చెబుతోంది. అల్లాగే “అమృతం వై హిరణ్యం ఆయుః ప్రాణః” అనే మంత్రం కూడా ఉంది. మంగళసూత్రం ఎట్టిదో ఆనాటి స్త్రీలకు ముంగరకూడా అట్టిదే. దర్భపవిత్ర ప్రాణమై అక్కకు ప్రదానాదులిచ్చ్యాలి, లేదా పర్వమునకి ఆదరంతో చేసిన ఉంగరాలతో పాటు చెవులకో పైనా ఇయ్యాలి కాబట్టి తన ఉంగరం, అపైన తండ్రి ఇచ్చినది పోయిందని బాధపడతాడు నిగమశర్మ తండ్రి. నవగ్రహదోషాలు పోవడానికి నవ రత్న ఖచితమైన చెవికి పెట్టుకునే ఆభరణం పోయిందని ఇతని బావగారిబాధ. ఇందులో కూడా ఒక సంప్రదాయం ఉంది. ఏ బ్రాహ్మణుని కర్ణరంధ్రంలో సూర్యచ్ఛాయకు ప్రవేశం ఉండదో అట్టివాణ్ణిచూస్తే పుణ్యం నశిస్తుందని దేవలస్మృతి. “కర్ణ రంధ్రే రవేశ్ఛాయా న విశేద్ర్గజన్మనః, తం దృష్ట్వా విలయం యాంతి పుణ్యౌఘాశ్చ పురాతనాః” కొన్నాళ్ళాదుద్దువంటిది పెట్టుకుంటే చెవిరంధ్రం పెద్దదై సూర్యచ్ఛాయకు ప్రవేశం ఉంటుంది. అత్తగారిచ్చిన వస్తువు పోయిందని ఇతని తల్లి విలాపంలో ఒక అపూర్వ మమకారం ఉంది. ఇల్లా ఆ పద్యాన్ని మొత్తం పరిశీలిస్తే పోయినవి బంగారపు వస్తువులుకావు, పోయినది వైదిక సంప్రదాయమని తెలుతుంది. ఆపైన నిగమశర్మ అక్క కోరిన కోరిక తిలకించండి “ఏనతని యజ్ఞమునంగదుఃబుజ్యా రాలనై వేది యలంకరింతు ”- కాబట్టి రామలింగనిని, సంప్రదాయ ధోరణిలో పరిశీలించాలని మనవి చేస్తున్నాను.

ఇంకా సాహిత్య క్షేత్రాన్ని బాగా దున్ని గట్టి వంగడాలువేసి ఇబ్బడిముబ్బడిగా గంగప్పగారు పంటలు పండించాలని ఆశ.

— దేవరకొండ శేషగిరిరావు

## శ్రీరామకృష్ణ లీలాతరంగిణి

[రచయిత :— శ్రీ వెన్నెలకంటి లక్ష్మీనరసింహారావు. ప్రచురణ :— శ్రీ శిశుగ్రంథమాల, శారదానగర్, ప్లాటునెం. 75, హైదరాబాద్—500 267 ]

భగవదవతారాలలో శ్రీరామ, శ్రీ కృష్ణ అవతారాలు చాలా ప్రశస్తమైనవి. హిందువులకు అతిపూజనీయాలైన రామాయణ, భారత భాగవతాలు పై అవతారాల ప్రాశస్త్యాన్ని వుగ్గడించటానికి వెలువడినవే.

‘శ్రీరామకృష్ణ లీలాతరంగిణి’ అన్న ప్రకృతగ్రంథం పై రెండు అవతారాల మహిమను ప్రధానంగా ప్రశంసించటానికి రచించబడింది. ఇందులో భగవదవతారములు, అవతారావశ్యకత, శ్రీ రామావతార మహిమ, శ్రీరామతత్త్వము, శ్రీకృష్ణావతార మహిమ, శ్రీకృష్ణతత్త్వము, శ్రీరామకృష్ణ లీలలు, శ్రీరామకృష్ణనామ మహిమ, అన్న ఘట్టాలలో పై రెండు అవతారాల ప్రాధాన్యాన్ని అనేకవిధాలరచయిత వివరించారు.

పై విషయాలతో బాటు హనుమాన్ చాలీసా అనువాదము, శ్రీ వేంకటేశ్వర సుప్రభాతస్తోత్ర ప్రపత్తి మంగళాశాసనాలు ఓంకారమహిమ, యుగములు, మహాయుగములు, మనువులు, మంత్రపుష్పము దాని భావము ఇత్యాది విషయాలు గూడా వున్నాయి.

శ్రీ వెన్నెలకంటి లక్ష్మీనరసింహారావుగారు ఇంతకుముందే అనేక గ్రంథాలు రచించి, ప్రచురించి వున్నారు. వీరిరచన సరళ సుందరము. ఈ గ్రంథం భక్తులకు సమాదరణీయము.

— సముద్రాల లక్ష్మణయ్య.

(19 వ పేజీ తరువాయి)
లేదు. కాబట్టి దీనిని అలంకారిక పరిభాషలో లుప్తోపమగ పరిగణింపవచ్చును. ఇట్లే వేఱొక యుదాహరణ.

"యథావృక్షస్య సంపుష్పి
తస్యదూరాత్‌గంధోవాతి
ఏవం పుణ్యస్యకర్మణో దూరాత్‌గంధోవాతి"

పుణ్యకర్మ చేసినవానియొక్క కీర్తి చాటుకొనకయే అది ఎల్లెడల ప్రాకును అది యెట్లన పూలతో బాగా పుష్పించియున్న చెట్టుయొక్క పూలవాసనలు వాయు వశముచే దూరముగానున్న జనుల ఘ్రాణేంద్రియమునకు సోకుచున్నవిగదా! ఈ వాసనలు దూరముగనున్న వారినికూడ ఆకర్షించునని తెలుపుటకు భారతమునందలి సౌగంధికాపహరణ వృత్తాంతమే ప్రమాణము. ఈ మంత్రమునందుగూడ ఉపమాలంకార రచనము స్పష్టమేగదా! మూడవ యుదాహరణము: విభూతిధారణ సమయమున చెప్పబడు ఈ మంత్రము నారాయణోపనిషత్తు నందలిది.

"త్ర్యంబకం యజామహే
సుగంధిమ్ పుష్టివర్ధనమ్
ఉర్వారు కమివబంధనా
న్మృత్యోర్ముక్షీయమాఽమృతాత్"

పరిమళ యుక్తము, పుష్టివర్ధనము అగు దోసపండు తొడిమనుండి సహజముగ విడిపోయిన విధముగ మృత్యువుయొక్క బంధనమునుండి విడివడుటకై అమృతత్వ సంపాదనార్థము సంయమి యగు పరమేశ్వరుని పూజించుచున్నాను. దోసపండు పండిన పిమ్మట తొడిమ నుంచి సహజముగ అది విడిపోవును. అంతేగాక అది పరిణతి చెందుటచే సహజముగ శిథిలమై పోవును. అట్లే మానవ శరీరముకూడ సహజముగ పరిణతి చెందిన పిమ్మట జరాభరముచే జర్జరిత శైథిల్యము చెందును. అట్టి శరీరమునకు మృత్యుబంధనమును దోస తొడిమవలె విడివడుట యిట ప్రసక్తము. అద్భుతమైన పోలికలుగల ఉపమాలంకార రచనమిందిమిడియున్నది.

మొత్తము వైదిక వాఙ్మయమునందు ఈ మూడు స్థలములందే ఉపమాలంకార రచన స్పష్టముగ ప్రతిఫలించుచున్నది. మిగిలిన వాఙ్మయమున ఎక్కడను కానరాదు ఒకటి రెండు తావులందు స్పష్టాస్పష్టముగ కనిపించినను అవిప్రధానమైనవికావు.

లౌకిక సంస్కృత వాఙ్మయమునందు కూడ ఉపమాలంకార రచనాసౌందర్యమున మొదటగా వాల్మీకిమహర్షి పిమ్మట కాళిదాసు గణ్యులు. వీరిద్దరికి వైదిక వాఙ్మయము నందలి యీ అలంకార రచనమే మూలమని వేరుగా చెప్పఁబనిలేదు.

వాల్మీకి రామాయణ సుందరకాండమున ఏతత్సదృశ రచనమునే చేసిరి.

"ప్రతిపత్పాఠశీలస్య విద్యేవ తనుతాంగతా" సీతాదేవి పాడ్యమినాడు అధ్యయనముచేసిన విద్యవలె కృశించిపోయెనట. దీనినిబట్టి పాడ్యమినాటి వేదాధ్యయనము ఎంతమాత్రము మానవులకుపకరించదని తెలియుచున్నది. అందులకే మన భారతీయులు విద్యాభ్యాసమునకు చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య, పాడ్యమి, అష్టమి అనధ్యయన దినములుగ పరిగణించిరి. పాశ్చాత్య విద్యావిధానము భారతదేశమున ప్రవేశపెట్టిన తరువాత అధ్యయన దినములయొక్క స్వరూప స్వభావములే పూర్తిగమారి పోయెను. దీనిని గమనించి విద్యావేత్తలు అధ్యయన దినములను గూర్చి (కళాశాలలలో) పునరాలోచన చేయవలసిన ఆవశ్యకత యున్నది.

ఇట్టి అలంకారిక రచనమునే కాళిదాసు తన రఘువంశ కావ్యమున చెప్పియున్నాడు.

"దినాంతేనిహితంతేజః సవిత్రేవహుతాశనః"
సూర్యుని నుండి తేజస్సు అగ్నికి సాయంకాలము సంక్రమించిన విధముగ తండ్రి యొద్దనుండి రాజ్యము కొడుకునకు సంక్రమించెనని భావము. దీనివలన అగ్ని యొక్క తేజస్సుకు కారణము సూర్యుడే యని కూడ తెలియుచున్నది.

ఈ విధమైన ఉపమాలంకార రచనా విధానము అలౌకికభాషయగు వైదిక వాఙ్మయమునందు విరలముగ కనుపట్టి లౌకిక వాఙ్మయమున వాల్మీకితో ప్రారంభమై పండిత జగన్నాథరాయల వఱకు శాఖోపశాఖలుగ విస్తరించి ఆలంకారిక చరిత్రలో అపూర్వమైన స్థానమును సంపాదించుకొని పాఠకుని నేటికిని ఆలంకారిక రసానుభూతిని కలుగజేయుచునేయున్నది.



(18 వ పేజీ తరువాయి)
శ్రీ ఏ. హరి S/o ఏ. రాములు
1-5-118, ఖాన్‌దోజీ బజార్
సికిందరాబాద్ - 500 003

శ్రీ యలసూరి దినదయాళు
తిరుమలగిరి - 508 223 నల్లగొండ జిల్లా

శ్రీ పోలా బాబూరావు
S/o డి. శ్రీనివాసులు కొబ్బరిసోపు
యాదగిరి దేవస్థానం, యాదగిరిగుట్ట
నల్లగొండ జిల్లా

శ్రీ వి. నరసింహాచార్య, తెలుగుపండిట్
జడ్.పి. హైస్కూలు. కోటేపల్లి-501 106
వయా వికారాబాద్, రంగారెడ్డి జిల్లా.

శ్రీమతి పి. లక్ష్మీకామేశ్వరి
W/o పి. అనంతరామయ్య
10-గణేష్‌సింగ్ చాపల్లెగల్లీ లాల్‌దర్వాజా
హైదరాబాద్ - 2

శ్రీ కె. రాజేంద్రప్రసాద్
C/o జి. రాజారాం 1-25, హబ్సిగూడ
హైదరాబాద్-500 007

[32 వ పేజీలో]

# యాత్రాఫలం

## శ్రీరమణ




ఒకసారి తుకారామ్ పెద్ద చిక్కులో పడ్డాడు. నిజం చెబితే నిష్ఠూరం. అబద్ధం చెప్పి నమ్మించడం కష్టం. అవునంటే ఆశ యాలకు భంగం – కాదంటే అభిమానులకు ఆశాభంగం! ఏంచెయ్యటం? ఎలా ఈ సమస్యను పరిష్కరించటం? అన్న సందిగ్ధంలో పడిపోయాడు.

తుకారామ్ ఇరుగుపొరుగు వారంతా కాశీ యాత్రకు బయలుదేరుతున్నారు. ఆ భక్త శిఖామణి తమ వెంటవుంటే అరచేతిలో వైకుంఠం చూసినట్లే అని వారి నమ్మకం. అతను తమ మధ్యవుండి పాండురంగడిపై 'అభంగాలు" గానం చేస్తూవుంటే మార్గాయాసం మరచిపోయి తమ తీర్థయాత్రను ఒక మధురానుభూతిగా మలచుకోవాలని వారి తాపత్రయం.

అందుకే ఎంతో ముందుగానే తీర్థయాత్రల గురించి తుకారామ్‌తో ఒక మాటచెప్పి పెట్టేరు. అప్పటికి తుకారామ్ నిర్లిప్తంగా నవ్వి సరిపెట్టేడు. అంతటి భక్తుడు గదా తీర్థయాత్రను ఎలా కాదనగలడులే అని ఆయనపై కొండంత నమ్మకం పెట్టుకొన్నారు.

కానీ, తీరా బయలుదేరే సమయానికి తుకారామ్ వెనుకడుగు వెయ్యడం వారికేం నచ్చలేదు. అందుకే తుకారామ్‌కు ఎన్నో విధాల నచ్చచెప్పేరు, తీర్థయాత్రల ప్రాశస్త్యాన్ని గురించి! తీర్థయాత్రలు చెయ్యనిదే, పాపాలు పరిహారం గావన్నారు. పుణ్యం రాదన్నారు. అయినా తుకారామ్ ఉలకడు పలుకడు.

పేదవాడుకదా! డబ్బుగురించి బాధ పడుతున్నాడేమో అనుకున్నారు. మీ ఖర్చులు అంతా మేమే భరిస్తామన్నారు. అయినా తుకారామ్ ముందుకు రాలేదు. తీర్థయాత్రలు నిష్ప్రయోజనం అంటే వాళ్ళంతానిష్ఠూరంగా భావించేలావున్నారు. తనకేవో ఇబ్బందులున్నాయని చెబితే జనం నమ్మేలాలేరు. ఏం చెయ్యాలో తోచలేదు. చివరకు ఒక మంచి సెవం తొరికిందాయనకు తనకు అనారోగ్యంగా వుందన్నాడు.

ఆ మాటతో జనం మారుమాట్లాడకలేక పోయారు. "సరే అది మీ దురదృష్టం" అన్నారు. వాళ్ళతో తాను తీర్థయాత్రలకు వెళ్ళకుండానే ఆ యాత్రికుల శీలాన్ని పరీక్షించాలనుకొన్నాడు తుకారామ్. వెంటనే పెరట్లోకెళ్ళి ఒక నేతిబీరకాయను కోసుకొచ్చాడు.

తనకు ప్రతినిధిగా దానిని తీసుకెళ్ళమని కోరాడు. వాళ్ళు ఏ తీర్థంలో మునిగితే ఆతీర్థంలో దానిని ముంచమన్నాడు. వారితో బాటు దాన్నికూడా అన్ని ఆలయాల్లోకి తీసుకెళ్ళ మన్నాడు. ఆ నేతిబీరకాయకు లభించే తీర్థయాత్రాఫలమంతా తనకే చెందుతుందని, కాబట్టి శ్రద్ధగా దానిచేత యాత్రలు



# తిరుమల యాత్రికులకు సదుపాయములు

* * *

* అన్ని వర్గాలవారికి అందుబాటులో ఉండేటట్లు ఉచిత, పరిశుభ్రమైన సత్రాలు, లేదా సరసమైన రేట్లకు కాటేజీలలో ఆవాస సౌకర్యం.
* శ్రీవారిని దర్శించు యాత్రికుల క్యూషెడ్లలో గాలి, వెలుతురుగల విశాలమైన ఏర్పాటులు.
* క్యూ షెడ్లలోనే కాఫీబోర్డువారి అల్పాహార సదుపాయం.
* సరసమైన ధరలకు అన్నపుపొట్లాల అమ్మకం.
* యాత్రికులు వెలుపలకు రానక్కరలేకుండా క్యూలదగ్గరే మరుగుదొడ్డి సౌకర్యం.
* ఆంధ్రప్రదేశ్ పాలసరఫరా సంస్థచే స్వచ్ఛమైన పాలవిక్రయం.
* యాత్రికులు చదువుకునేందుకు దేవస్థాన ముద్రిత గ్రంథాలు. స్వామివారి, అమ్మవారి చిత్రపటాల అమ్మకం.
* క్యూలోని యాత్రికులకు విసుగులేకుండా ఉండేందుకు టెలివిజన్ ప్రదర్శనం, భక్తిసంగీత ప్రసారం.
* క్యూలైన్లలోను, తిరుమలకుపోవు కాలిబాట 7 వ మైలువద్ద వైద్యసదుపాయం.
* సామానులు, పాదరక్షలు భద్రపరచుకొనేందుకు ప్రత్యేక సౌకర్యం.
* తిరుమలలో సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసునుండి వివిధప్రాంతాలకు ఆటో సౌకర్యం.

## ఉచిత బస్సుసదుపాయం

* దళారీలనుండి వంచకులనుండి తప్పించేందుకు ముఖద్వారంలో పేష్కారుస్థాయి అధికారి సిబ్బంది.
* క్యూషెడ్లలోని యాత్రికుల ఫిర్యాదులు విచారించేందుకు కావలసిన సౌకర్యములకుగాను పేష్కారు స్థాయిలో మరొక అధికారి, సిబ్బంది.
* యాత్రికుల సామానులను భద్రంగా తిరుమలకుచేర్చే సౌకర్యం ఏర్పాటైంది. తిరుపతిలో ఏ సత్రములోనైనాగాని, టోల్ గేట్ వద్దగాని తమసామాగ్రి అప్పగించి రసీదుపొంది ఆ రసీదు తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీస్ దగ్గర కౌంటర్ లో ఇచ్చి సామాగ్రి పొందవచ్చును.
* దుండగులనుండి యాత్రికులను కాపాడేందుకు, తిరుమలకు వెళ్ళే దోవపొడుగునా రాత్రింబవళ్ళూ పోలీసు గస్తీ ఏర్పాటుచేయబడింది.
* దారిపొడుగునా మంచినీటి సదుపాయం ఉన్నది.
* రాత్రిపూటగాని, తెల్లవారుఝామునగాని కొండకు వెళ్ళదల్చుకొన్న వారికి వీలుగా మంచికాంతి శక్తిగల దీపాలు ఏర్పాటైనవి.
* వివిధప్రాంతాలనుండి వచ్చేయాత్రికులకు బోధపడేందుకుగాను తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసులో, దేశంలోని ముఖ్యభాషలలో విచారణ కార్యాలయాలు.
* ప్రత్యేక కాటేజీలలోని అదనపు సౌకర్యాలు అంజనాద్రినగర్, శేషాద్రి, గరుడాద్రి, శంకుమిట్ట కాటేజీలలో కూడ ఏర్పాటైనవి.

(29వ పేజీ తరువాయి)

శ్రీ ఎ. టి. బద్రీనాథ్
C/o ఎ. రంగాచార్యులు
1-1-710/2 శ్రీవాణికుటీర్ గాంధీనగర్
హైదరాబాద్ - 500360

శ్రీ సి. హెచ్. నాగేశ్వరరావు
శ్రీనివాస వస్త్రాలయం
మెయిన్‌రోడ్ మధిర - 507203
ఖమ్మం జిల్లా

శ్రీ ఎస్. వెంకటాచార్యులు, తెలుగుపండిట్
వి.పి.ఎస్. ధన్‌బాద్ క్వార్టర్స్
రుద్రంపూర్ - 507 119. ఖమ్మం జిల్లా

శ్రీ బి. ఎస్. ఆర్. గుప్త
న్యూస్‌ఏజెంట్ కల్లూర్ - 507209
ఖమ్మం జిల్లా

శ్రీ ఎస్. జనార్దనాచార్యులు
C/o మధుసూదనాచార్యులు
సిటిబ్యాంకు దగ్గర రంగనాయకులగుట్ట
భద్రాచలం పోస్టు, ఖమ్మం జిల్లా

శ్రీ ఎన్. ఓటూరి రాజేశ్వర్
అజంతా ట్రాన్స్‌ఫోర్టు
జగిత్యాల - 505 327
కరీంనగర్ జిల్లా

శ్రీ డి. శివయ్య
న్యూస్ ఏజెంట్
జమ్మిగుంట - 505 122
హస్నాబాద్ తాలూకా
కరీంనగర్ జిల్లా.

శ్రీ వై. తులసీదాస్
C/o లక్ష్మిరాజ్యం
న్యూస్ ఏజెంట్
పెద్దపల్లి - 505 172
కరీంనగర్ జిల్లా

శ్రీ వై. తులసీదాస్
C/o ఉమామహేశ్వర క్లాత్ సెంటర్
టెంపుల్ వీధి
వేములవాడ (పోష్టు)
కరీంనగర్ జిల్లా

శ్రీ పి. విశ్వనాథం
మురళి పాన్‌షాప్
C/o బాక్స్‌బిల్డర్స్
పో బజార్
మహబూబ్‌నగర్ - 509 001

శ్రీ డి. జగన్నాథం
S/o డి. రంగయ్య
యశోదాకృష్ణ ఏజెన్సీ
2-15 బి, శ్రీనగర్
డౌన్‌స్ట్రీట్
సంగారెడ్డి - 502 001

శ్రీ బి. ఎతిరాజులు
S/o నారాయణ
1-7-37
గిరునిగడ్డ
జనగామ - 506 167
వరంగల్‌జిల్లా

శ్రీ బి. నారాయణ
మహబూబ్‌నగర్
తొర్రూర్ - 506 163
వరంగల్ జిల్లా

శ్రీ బి. గోవర్ధన్
టీచర్
జడ్. పి. ఎస్. ఎస్.
నెక్కొండ - 506 122
వరంగల్‌జిల్లా

శ్రీ జి. నరసింహాచార్య
S/o జి. కృష్ణమాచార్య
కట్రవల్లె (పోష్టు)
వయా హయవర్తి
వర్ధన్నపేట తాలూకా
వరంగల్‌జిల్లా

శ్రీ అయితా లక్ష్మీనరసయ్య
లక్ష్మి మెడికల్స్
9-70
నరసంపేట - 506 132
వరంగల్‌జిల్లా

చేయించవలసిందనీ కోరాడు. వింతగా తోచినప్పటికి తుకారామ్ మీది గౌరవంచేత ఆయన కోర్కెకు అంగీకరించారు ఆ గ్రామస్తులు.

ఓ పదిరోజులు గడచిపోయాయి. కాశీ యాత్రకు వెళ్ళిన వారు తిరిగి వచ్చేశారు. వచ్చీరాగానే తుకారామ్ నేతిబీరకాయను ఆయనకు ఇచ్చేశారు. తమ యాత్ర చాలా బాగా జరిగిందని గొప్పగా చెప్పారు.

తుకారామ్ చిరునవ్వునవ్వి ఊరుకున్నాడు. కాశీయాత్ర జరిపినవారినంతా ఓ రోజున తన ఇంటికి విందుకు ఆహ్వానించాడు. అందరూ విందుకు వచ్చారు. పీటల ముందు కూచొని ఆత్రంగా తొలిముద్ద నోట్లో పెట్టుకోగానే నోరంతా చేదుచేదుగా అయిపోయింది. వాళ్ళకు వొళ్ళు మండిపోయింది.

"ఏమిటయ్యా! ఏంకూర ఇది? చేదు విషంగా వుందే!" అంటూ విరుచుకుపడ్డారు తుకారామ్‌పై. "అదేనండి నేతిబీరకాయ కూరండి" అన్నాడు తుకారామ్ ఎంతో వినయంగా! "నేతిబీరకాయ చేదు అని తెలియదటయ్యా నీకు" తీవ్రకోపంతో అడిగారు విందుకు వచ్చినవాళ్ళు.

"అవుననుకోండి – కానీ ఇది మామూలు నేతిబీరకాయ కాదు గదండీ! మీతోబాటు కాశీయాత్రచేసి వచ్చింది మరి! తీర్థాలలో మునిగాక దాని చేదు అంతా హరించుకు పోయి వుండాలిగదా" అన్నాడు తుకారామ్ అమాయకంగానే! ఆ మాటలో అంతరార్థం గ్రహించి ఆ గ్రామస్థులు సిగ్గుతో తలలు వంచుకొన్నారు. కాశీకి వెళ్ళినా తమరుచుల్లో అభిరుచుల్లో ఏ మాత్రం మార్పురాలేదని గ్రహించారు. తీర్థయాత్రల పరమార్థం తమకు గుర్తుచేసిన తుకారామ్‌కు వాళ్ళంతా వందనాలు చేశారు.

*

విశాల ఫాలముపై, ధర్మార్థకామములకు ప్రతీకలా అన్నట్లు మూడు విభూతి రేఖలు మధ్యలో ఫాలలోచనమా అన్నట్లు, అగ్ని హోమము కరుకుపొట్టు, నాగపాశములు వోలె మెడలో రుద్రాక్షమాలలు, అలంక రింప బ్రహ్మతేజస్సుతో విరాజిల్లుతున్నాడు. ముఖంమీద ముదురువారిన చర్మపువళులు వయస్సు ఐదుపదులు దాటినట్లు తెల్పు తున్నాయి. స్పష్టమైనవాక్కు. గంభీరంగా లయబద్ధంగా వెలువడుతూవుంది.

“చర్కర్తి చరికర్తి చరీకర్తి, చర్కృత శ్చరికృత శ్చరీకృతః; చర్కృతీతిః” అని. ఆయన చేసేది వేద పారమనుకొనేరు. ఆయన బాధాంతం తర్కంలో దోషజ్ఞుడు. ఐతేనేమి. ఇతన్నిచూచి, ఎప్పుడో రాలు గాయు, పరిహసించినాడు. “అస్మాకూనాం తార్కికేషామర్థరీనతు శబ్దరీ”. అని వాడింకా సిద్ధాంత కౌముది చదివే కుర్రవాడు. అంత శాస్త్రవేత్తను, అంత చులకనగా తిరస్క రిస్తాడా? తర్కంచదువుకొన్న మాత్రంతో, శబ్దజ్ఞానం లేకుండాపోతుందా? తార్కికుడై నంతమాత్రంతో అస్మచ్ఛబ్దానికీ తార్కిక శబ్దానికీ షష్ఠీవిభక్తి స్వరూపనిష్పత్తి ప్రకారం తెలీకపోవచ్చుగాని, సిద్ధస్వరూపం తెలియదా?

ఆపిల్లవాని ఎత్తిపొడుపు, తర్కపండితుని హృదయంలో శూలంవలె గుచ్చుకొంది. శబ్దశాస్త్రం సాధించవలెనని పట్టుదల వహించి నాడు. ‘డుకృఞ్ కరణే’ అనే ధాతువు యఙ్లుగంతము లట్టు రూపము ప్రక్రియా సిద్ధమును వర్ణించుచున్నాడు. “చర్కర్తి, చరికర్తి”ఇత్యాదిగా, భాష భావానికాధారం. మనస్సులోని భావాలను పరులకు తెలియ జేసే సాధనం. అది లేకుంటే మానవులు కిచకిచలాడేకోతులు గావలసివస్తుంది. మానవులకు దేవుడిచ్చినవరం భాష. ఐనా, అదే ప్రధానంగాదు. భావమే ప్రధానం. భావాన్ని అందించడంతో భాషపని తీరి పోతుంది. అపశబ్దం అనాగరికతను సూచి స్తుంది. కానియజంతాలు యఙ్లుజంతాలా భాషతో పర్కస్సులు. జీవితం దాంతో వృథా

భక్తి అనేది హృదయమందుంది. అందుకే మదిలోనే మాధవుడున్నాడనటం!
భక్త పరాధీనుడైన ఆ దేవదేవునికి కావలసింది ముఖ్య
హృదయమే గాని ప్వర్థమేమన్నా గాదు ॥ సం ॥

చేసికోరాదు. పరమ పురుషార్థం సాధించ వలసే మానవజన్మ ప్రయోజనం.

“న శబ్దశాస్త్రాభిరతస్య మోక్షః” శబ్దశాస్త్ర ప్రవీణునికి మోక్షంలేదు. అన్నారు. “భద్రం కర్ణేభిః శృణవామ దేవాః” అన్న వేద వాక్యం దేనికి బదులనే అర్థమేమిటి? అని గమనించరు పై మాటలను, “కర్ణైః” పదం సాధువా? కర్ణైః అని కాదనిలేదా? అని విచికిత్స చేస్తాడు.

అందుకే, సంప్రాప్తే సన్నిహితే కాలే నహినహి రక్షతి డుకృఞ్ కరణే- అన్నారు శంకరాచార్యులు.

పదం చేరినవారికి వెనక్కురావటంలేదు. అని వ్యాససూత్రం.

అట్టి పరమపదం శబ్దశాస్త్ర ప్రవీణునికి లేదట. శబ్దశాస్త్రం అనేమి. లౌకిక, శాస్త్రీ అన్నీ అంతే. ఇవన్నీ పొట్టకూటి విద్యలే. వీటికి అవిద్యలనిపేరు. ఋగ్వేదాదులు వేదాంగాలు పురాణేతిహాసాలు అన్నీ అవి ఇంతే. పరమాత్మను బోధించే ఉపనిషత్తు లకే విద్యలనిపేరు. వీటినే పరావర విద్య లని అంటారు. “అథ పరా, యయా తదక్షర మధిగమ్యతే” నాశములేని పరమాత్మను బోధించెడి విద్య.

# భక్తపరాధీనుడు

## శ్రీ కుంటిమద్ది శేషశర్మ

“చావుకాలము దాపురించిన
కాలవేళయు మూసిరా!
ఏ మెరుంగని పామరుండని
ఏమి యెరుంగని అమ్మరా!
“యత్ప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం మమ”
పునరావృత్తిలేని పరమపదం నాది.”
అన్నాడు గీతాచార్యుడు.

“నఖల్వేవం వర్తయన్యావ దాయుషం బ్రహ్మలోకమభిసమ్పద్యతే న చ పునరా వర్తతే.” అని శ్రుతి.

భక్తపరాధీనుడైన పరమాత్మ భక్తుని కైంక ర్యముచే ప్రీతుడై, అతని సర్వపాపము లనూ హతమార్చి తిరుగులేని తన పరమ పదమును చేర్చుకొంటాడు. అందుచొచ్చిన వానికిమరలాసంసారంలోనికితిరిగిరాకలేదు. అదే, శారీరక మీమాంసలో, ‘అనావృత్తి శ్శబ్దాత్’ వేదశబ్ద ప్రమాణం నుంచి పరమ

ద్వే విద్యే వేదితవ్యే పరా చైవాపరా చ॥ పరాపర విద్యలు రెండూ నేర్వవలసినవే. ‘అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽ మృత మశ్నుతే” మృత్యువు జననమరణ రూప సంసారము. అవిద్య లౌకికవిద్యలు., అమృతం-మోక్షము, అవిద్యలచేత సంసా రమును సమర్థవంతంగా నిర్వహించుకో వలె. పరమాత్మబోధక విద్యచేత తిరుగులేని ముక్తిని పొందవలె. అని ఆ శ్రుతికర్థము.

వ్యాకరణాది శాస్త్రములందు పరినిష్ఠిత పాండిత్యం సంపాదించుకొన్న ముక్తి లభించదు. మానవులకు ప్రకృతివ్యామోహం మెండు. ప్రాకృతికశరీరంలో బందీలైనవారు ప్రాకృత విషయాలపైపే మొగ్గుతూ వుంటారు. కాంతాకాంచనాల వ్యామోహం మెండు. “బలవానింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి.” చతుశ్శాస్త్ర పారంగతుడై

ఇంద్రియాలు పెడమార్గం పట్టిస్తూవుంటాయి. వాటి నదుపులో నుంచుకోవడం కష్టం.

"దైవీ హ్యేషాగుణమయీ
మమ మాయా దురత్యయా।
మామేవ యే ప్రపద్యన్తే
మాయామేతాం తరన్తి తే" (గీత)

భగవంతునికి పరాపర శక్తులురెండు. పర శక్తులు జీవాత్మలు. అపరశక్తి పంచ భూతాలు మనోబుద్ధ్యహంకారాలు.

భూమిరాపోఽనలోవాయుః
ఖం మనో బుద్ధిరేవ చ।
అహంకార ఇతీయం మే భిన్నా
ప్రకృతి రష్టధా, అపరా (గీత)

ఈ భగవంతుని అపరాశక్తేమాయ. అది దాటరానిది. ఆ భగవంతుని ప్రపన్ను లకే దానినుండి తప్పించుకొనేందుకు సాధ్య మౌతుంది. "మామేవ" నన్నే ఆశ్రయించ వలెనన్నాడు. "మామేకం శరణం వ్రజ" నన్నొక్కనినే శరణువేడమని పార్థసారథి కట్టి కడపటి ఉపదేశం.

ఉపదేశిస్తేనేమి: అది అందరికీ అర్థ మయ్యేదిగాదు. అర్థమైనా అవగతమయ్యేది గాదు. అవగతమైనా ఇంద్రియాలను విష యాలమీద నుంచీ తప్పించి పరమాత్మపైకి మళ్ళించేందుకు సాధ్యంగాదు.

అందునుంచే గురూపదేశం. "భజ గోవిందం భజ గోవిందం భజ గోవిందం భజ గోవిందం" అని ఆమ్రేడితం చేసినారు ఆచార్యులవారు.

ఆ ఆచార్యోపదేశం ప్రత్యక్షంగా చూపిం చేందుకు, ఏడుకొండలపైన అవతరించిన వాడు, "కలౌ వేంకట నాయకః" అని వేనోళ్ళ కీర్తింపడేవాడు శ్రీమంతుడైన శ్రీని వాసుడు.

జీవులారా! ఏ సుకృత విశేషంతోనో క్రిమికీటాది దశలు దాటి మానవ శరీరంలో పడినారు. అందువల్ల బుద్ధి వికసించింది. పటిష్ఠములైన జ్ఞానకర్మేంద్రియాలు సమ కూరినాయి. దుర్లభమైన మానవ శరీరం లభించింది. దీనిని సద్వినియోగం చేసు కోండి.

"విప్రాంతలపెత్తె ద్విజేంద్రు తమ
పో వ్రతిమాన్లెత్తె మునేము సేవ
దేవత తనవెత్తె కేలుఁపు పసదోః
ఎప్పుమాన్లెత్తె మునేము సేవ
మాతం తనవెత్తె మారంపు
తనదో ఎప్పుమాన్లెత్తె మునేమసేవ.
దంతేరతనపెత్తె ద్వాంపు తను
దోస ఎప్పుమాన్లెత్తె మునేమ సేవ.

.... .... .... ....

కంటిపు భక్తుల మొక్కఁ దెరాముగాన,
(ఆముక్తమాల్యద)

అంటాడు మాలదాసరి బ్రహ్మరాక్షసితో

అట్లు జననమరణరూప సంసార పారా వారంలో మునిగితేలుతూ గడ్డకు బడలేక ఏల ఇడుముల పాలౌతారు? ఇదిగో ఈ నాపాదాలనాశ్రయించండి. అని కుడిచేతితో చూపుచున్నాడు. అదీ తరణోపాయం. దాని ననుష్ఠించితే మీకు సంసారము "మోకాలి బంటీ" అనాయాసంగ గనట్టుబడవచ్చు. అని యెడమ చేతితో చూపించుతూ, ఏడు కొండల పై భాగమున నిలిచి, జనులనంద రినీ తరింపజేయుటయే నా అవతారము అని ప్రకటించుతూ వున్నాడు.

తావదార్తి స్తథావాఞ్ఛా
తావన్మోహ స్తథాఽసుఖమ్,
యావన్నయాతి శరణం
స్మృతి సర్వాఘనాశనమ్.

స్మరణమాత్రంతో సర్వపాపములు హరించు శ్రీహరిని శరణు పొందేంతవరకే బాధ, మోహము, అశాంతి, అసుఖము. అని లోకోద్ధరణముకై పరంధామమునుండీ ఏడుకొండలపైనికవతరించి, సాభినయంగా ఉపదేశించుచూ వున్నాడు.

అతనిసేవ కెందరో భక్తులు వస్తూ వున్నారు. సామాన్యులు అధికారులు ప్రజా ప్రతినిధులు మంత్రి పుంగవులు కష్టించి సంపాదించిన ముడుపులను చెల్లిస్తున్నారు. తమ యార్తిబాపి రక్షింపుమని వేడుకొంటు న్నారు. నిధులుకుమ్మరిస్తూవున్నారు. తమ పదవులను నిలబెట్టుమని ప్రార్థిస్తున్నారు, తమకు రక్షణగా వుండుమని విన్నవించు కొంటున్నారు.

ఆయన కన్నులకు నామాలు మెత్తి యుండినా, ఆనామాలచాటునుంచీ చూచే చూపులు, జనులకు కనుపించుటలేదు. కాని వీరి కుటిల హృదయాలు స్వామికి తెలియ నివిగావు. భక్తిభరాలస చిత్తములేవో ఆతని కెరుకకు రానివిగావు.

"నిలువుదోపులిత్తు నీరాజనము లిత్తు ముడుపులిత్తు కురుల ముడులనిత్తు ఆర్తి బాపుమనగ నారోగ్యమిమ్మన, లంచగొండి యని తలంచిరేమొ?" అని చిలిపినవ్వులు నవ్వుతున్నాడు.

## అక్షరార్చన

కన్నులివే కరగినవి నల్లనిస్వామి
అశ్రుధార పొంగినదిదె పదముల కోరి॥

ఎద లోపలి సడి లోదో
దివి కావలి గుడి లోదో .... ఈ సవ్వడి
పడివచ్చెదలే చల్లని నీ అడుగులబడి॥

గడియ పడని ఆనందమో
గొంతు విడని ఆవేదనో .... ఈ రసఝరి
తరియించునులే ఈ తరి నీ పదపూజారి॥

అందుకున్న ఆకసమో
ఆదుకున్న అమృతమో .... ఈ వరరాశి
పులకరించులే స్వామీ నీ చరణ ప్రియదాసి॥

.... ఎమ్. వి. ఆర్. లీల

అతనికి కావలసినవి ఈ ముల్లె ముడుపులు గావు. అతడు లక్ష్మీపతి; శ్రీనివాసుడు, వారి ఈ సంపదలాతని కరుణాకటాక్ష సంజనితములే. పూర్వజన్మ సుకృత విశేషంతో లభించిన సంపదలతో నన్ను మభ్యపెట్టు చున్నారే అని ముసి ముసినవ్వులు నవ్వుచున్నాడు.

"పత్రం పుష్పం ఫలం తోయం
యో మే భక్త్యా ప్రయచ్ఛతి"

శక్తిగలవాడు బంగారుపూలతో పూజించినా, లేనివాడు తులసీదళమర్పించినా, నేను గమనించేది వాని హృదయములోని భక్తి నేగాని, వాడిచ్చేవస్తువులనుగాదని మందహాస సుందర వదనారవిందుడగు చున్నాడు.

రత్నకిరీట భాభాస్యమాన శిరోభాగముతో, ఊర్ధ్వపుండ్ర దేదీవ్యమాన నిటాలముతో, శంఖచక్ర రారాజ్యమాన భుజాయుగళితో, ఇందిరాలంకృత వక్షముతో, పీతాంబరాలంకృత కటీతటముతో ఆ ప్రసాదిన సువర్ణాభరణములతో, విరాజిల్లు నా స్వామియొక్క పాదారవిందములను మనస్సులో నిలుపుకొని తన్మయురాలై యొక మహాసాధ్వీమతల్లి "స్వామీ నీపాదార విందములు నా శిరము నెప్పుడలంకరించునో గదా!" అనుభావము మదిని మెదలి పులకాంకితాంగియై, ఆ భావముగల ఆళవందారుగారి స్తోత్రరత్నములోని పద్యము నిట్లా చదువుతూవుంది.

"కదా పునశ్శంఖ రథాంగ కల్పక
ధ్వజారవిందాంకిత వజ్రలాంఛనమ్.
త్రివిక్రమ మచ్చరణాంబుజద్వయం
త్వదీయమూర్ధానమలంకరిష్యతి ॥"

శ్రీనివాసుని పాదారవింద ధ్యానమేగాని తననోటవచ్చు పదములేవో వాటివాచ్యార్థమేమో ఆ కారకమున శర్థమేమో, ఆమెకు తెలియదు. చిన్నప్పుడు కంఠస్థమైన పద్యమును దేవునికట్టు అలుకుతూ, ముగ్గు పెట్టుతూ చేతులు నిత్యకృత్య నిరతములైనా, నోరుమాత్రం పఠించుతూనేవుంది. అనుదినం ఎన్నేండ్లనుండో ఆవిధంగా ఆమెనోట ఆ పద్యమావృత్తమవుతూనే వుంది.

ఒక్కనాడు మహామేధాశాలి, పనవర్తి శేషాచార్యులు - వారిప్పుడు కీర్తిశేషులు- ఆమెనోట ఆ పద్యంవినుట తటస్థించింది. పదాలు స్వచ్ఛంగా వినిపించినాయి. అర్థమాకళించినాడు. అతని హృదయం తల్లడిల్లింది. "అయ్యో! ఎంత అపచారో"మనుకొన్నాడు. సవరించకపోతే సదా యీ అపచారాన్నామె చేస్తూనేవుంటుంది గదా! అని, ఆమె హృదయాన్ని చూడలేని, పదాలను మాత్రమే గ్రహించిన ఆతడు ఆమెతో నన్నాడు. "ఏమమ్మా! ఎంత అపచారమమ్మా! నీపాదాల నా స్వామి తలపై పెట్టజూస్తున్నావే" అని.

ఆమె కర్థంకాలేదు "ఏమన్నా! నేనేమి అపచారం చేసినాను?" అని అడిగింది. అందు కతడు, "త్వచ్చరణాంబుజం మదీయ మూర్ధానమలంకరిష్యతి?" అనమ్మా చెప్పవలె, నీపాదారవిందాలు నా తలపై నెప్పుడలంకరిస్తాయో" అని దానికర్థము. నీవు తారుమారుచేసి మచ్చరణాంబుజంత్వదీయ మూర్ధాన" మని అంటున్నావు. అదే అపచారమమ్మా అని విశదీకరించి చెప్పినాడు. ఆమె మనస్సు అతలకుతల మయ్యింది. ఒక్కనాడుగాదు. ఒక్కనెలగాదు, ఎన్నేండ్లనుంచో ఇట్లే పల్కుతూన్నానే అని కళవళించి పోయింది.

పనిపాటలమీద మనసు నిలవలేదు. యాంత్రికంగా పనిచేస్తూ వుంది గాని ఏమిచేసేది తెలిసి చేయడం లేదు. అన్నింట తబ్బిబ్బులే. తారుమార్లే నోటి కన్నం రుచించలేదు. కంటికి తూగుపట్టలేదు. అట్లా పొద్దుగడుస్తూవుంది ఆమెకు.

ఆచార్యులు తనదారితాను పోయినాడు తనవూరితెరువుపట్టి. మధ్యాహ్నమయింది. ఎండబలంగావుంది. గమ్యమింకా రెండు మూడు మైళ్ళదూరం. మార్గమధ్యంలో చెట్టునీడన విశ్రాంతికై మేనువాల్చినాడు? చల్లగాలికి కన్నులు మూతపడినాయి. తూగుపట్టింది.

ఎవ్వరో వీపున ఛళ్ మని చరచినట్లయ్యింది. కొన్ని మాటలు వినిపించినాయి. ఓరిమొద్దు వెధవా! పండితమానీ! మహాపండితు డైనావే. నా పాదాలు నా భక్తురాలి తలపై నుండటేనేమి? ఆమె అడుగులు నా నెత్తి నుండటేనేమిరా? నీ ముద్దుబిడ్డను నెత్తికెక్కించుకొని తొక్కించుకోవేమిరా? పాప పాదాలు తగిలినాయని పాపను దండిస్తావా? ఇంతేనా నీకు తెలిసింది. "జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్' అన్నది విన్నావా. జ్ఞానమంటే ఏమనుకొన్నావు. వట్టి తెలివిగాదురా? 'మోక్షే ధీర్జ్ఞానం' ముముక్షతరా జ్ఞానమంటే, అట్టి ముముక్షువుకూ నాకూ భేదంలేదని రా జ్ఞానీ త్వాత్మైవ"అంటే భేదమే లేనప్పుడు ఆమె పాదాలేమి నాపాదాలేమి? ఇంతమాత్రమన్వయించుకోలేని నీపాండిత్యమేల? ఆమె నెంతవ్యథలు పాలుచేస్తివిరా?" అని. ఆమాటలు విని కన్నులు తెరచిచూచినాడు. పరమాత్మ లీలకు ఆశ్చర్యపడినాడు. ఆయన భక్తపరాధీనతకు మురిసిపోయినాడు. ప్రయాణం ముందుకు సాగించక వెనక్కు మరలినాడు. ఆమె దగ్గరకుపోయి దండప్రణామంచేసి. అమ్మా తల్లీ! ప్రొద్దున నీపద్యాన్ని సవరించితి. నేనే పొరబాటుపడినాను. నీవు చెప్పిందే సరి. నాదే పొరబాటు. మరలా పుస్తకం చూస్తి. నీవుచెప్పినట్లే వున్నదమ్మా అని మనవి చెప్పుకొన్నాడు.

ఆమాట విని ఆమె నెమ్మదించింది. "తెల్లవారినుండీ నీవు చెప్పినప్పటినుండీ ఎన్నాళ్ళనుంచో అపచారం చేస్తున్నానే అని తపించి పోయినాను. ఇప్పుడు నీవు అదే సరి అన్నందువల్ల చింతతీరింది అని తృప్తిపడింది. అందుకే." "తదహం భక్త్యుపహృతమశ్నామి". భక్తితో ఏమిచ్చినా గ్రహిస్తాను. భక్తినే నేను గమనించేది. పదాలనుగాదు పదార్థాలనుగాదు అంటాడు భక్తపరాధీనుడు.

[ 16 వ పేజీ తరువాయి ]
ఇస్లాం మతము సూఫీ, సున్నీ, షియా మున్నగు శాఖలుగా విడిపోయి మతపరిస్థితులు కలుషితమయ్యాయి. ఇట్టి తరుణంలో గ్రీకు, పర్షియన్ తత్త్వాన్ని బాగా ఆకళింపుచేసుకున్న అల్‌ఘజాలీ నాటి ప్రజలను సమన్వయం చేయగలిగినాడు.

తర్కము ద్వారా కాక ప్రేమద్వారానే భగవంతుని తెలుసుకోగలమని ఆయన బోధిస్తాడు. "ఇచ్ఛ" భగవంతుని శాశ్వత గుణమనీ, ఆ స్వాతంత్ర్యంతోనే అతడు ప్రపంచాన్ని సృష్టిస్తాడనీ అల్‌ఘజాలీ వివరిస్తాడు. ఇతడు ఉపవాసాలకు ఎక్కువ ప్రాముఖ్యమిస్తాడు. భగవంతుని ప్రేమించడమే అత్యున్నత గుణమని తెలియజేస్తాడు.

## డేకార్ట్ దృష్టిలో
(క్రీ. శ. 16)

పూర్వ మధ్యయుగంలో క్రీస్తుబోధనల ప్రభావంగా పాశ్చాత్య దేశాలలో కూడ తాత్త్వికచింతన ఆరంభమైంది. ఇది గ్రీక్ తత్త్వశాస్త్రం ఆధారంగా అభివృద్ధిచెందింది. ఫ్రెంచి తత్త్వవేత్త డేకార్ట్ ఆధునిక పాశ్చాత్య తాత్త్విక చింతనకు ప్రాతిపదిక వేసినాడు.

మనసులోని అనేక అంతరభావాలలో దైవమున్నాడనేది ఒకటి. డేకార్ట్ వ్యక్తిలో ఉన్న దైవభావంతో ప్రారంభించిన దానికి కారణంగా దేవుని అస్తిత్వాన్ని నిరూపించినాడు. అంటే దైవభావము ఫలితము, దైవము కారణము.

డేకార్ట్ దృష్టిలో దైవము 'పరిపూర్ణుడు', 'నిరవధికుడు.' పరిపూర్ణ నిరవధిక దైవము స్వయంభూతము, కారణరహితము. అందుకే దైవాన్ని అతడు "స్వయంభువు" అంటాడు. దైవము తన ఛాయలోనే మానవుని సృష్టించాడని చెప్తాడు. మొత్తంమీద డేకార్ట్ దైవభావము పాండిత్యవాదుల దైవభావానికి దగ్గరగా ఉంటుంది.

## ఇమాన్యువల్ కాంట్ దృష్టిలో
(క్రీ. శ. 18)

18 వ శతాబ్ది మధ్యభాగంలో కాంట్ అనే జర్మన్ శాస్త్రవేత్త అనుభవ సంశయవాదుల మధ్య సమన్వయానికి కృషి చేశాడు.

దేవుని అస్తిత్వ నిరూపణకు పూర్వ తాత్త్వికులిచ్చిన వాదాలను ఇతడు ఖండించాడు. అరిస్టాటిల్‌వలె ఇతడుకూడ దైవము 'విశ్వనిర్మాతయే' గాని 'విశ్వస్రష్ట' కాదని నిరూపిస్తాడు. శాస్త్రజ్ఞానము, తత్త్వసిద్ధాంతాలు దేవుని అస్తిత్వాన్ని నిరూపించలేవని, నైతిక శ్రద్ధయే దీనికి ఆధారమని వివరిస్తాడు. గ్రీకు తాత్త్వికులవలె ఇతడు కూడ నైతిక సిద్ధాంతానికే ఎక్కువ ప్రాముఖ్యమిస్తాడు.

పరిశీలించి చూడగా ఏ మతంవారైనా ఏ దేశంవారైనా మానవాతీతమైన శక్తి ఒకటుందని నమ్మక తప్పలేదని గ్రహించవచ్చు. దాన్ని వివిధ భావాలలో 'భగవంతుడు,' 'పరమాత్మ,' 'ఈశ్వరుడు,' 'యథార్థసత్త,' 'శుద్ధ ఆకృతి,' అని వివిధ పేర్లతో పిలువవచ్చు. జడపదార్థాలుగాని, ప్రకృతి శక్తులుగాని తమంతతామే అట్టి నిర్మాణ కార్యముల నొనర్పజాలవు. ఈ దృష్టాంతమునుబట్టి అనంతము, అద్భుతము, చిత్రవిచిత్రములగు అనేక భూతజాలములతో నిండిన ఈ విశాల విశ్వాన్ని నిర్మించుటకో మహాశక్తిమంతుడగు నిర్మాతయుండవలెనన్నది అందరూ అంగీకరించిన సత్యము. ఆ నిర్మాతయే 'దేవుడు.' అతడు వ్యక్తావ్యక్త స్వరూపుడు. ఆయన వ్యక్తరూపమే జగత్తు. మానవుడు ఆ పరమాత్మతో తాదాత్మ్యము నొంది, ఆ శక్తులన్నిటిని సమగ్రముగా నలవర్చుకొని వాటిని స్వార్థమునకుగాక ప్రపంచరూపుడగు వ్యక్త పరమాత్ముని సేవయందు వినియోగించుటయే సర్వోత్కృష్టమగు కర్మయోగము. *

(8వ పేజీ తరువాయి)

ఇంకను నుపాసకుల యర్హతల ననుసరించి యాతడే—

> తదర్థం లీలయాస్వీయాః పఞ్చమూర్తీః కరోతివై
> ప్రతిమాదిక మర్చాస్యాదవతారాస్తు వైభవాః
> సంకర్షణో వాసుదేవః ప్రద్యుమ్నశ్చానిరుద్ధకః।
> వ్యూహశ్చతుర్విధో జ్ఞేయః సూక్ష్మం సంపూర్ణ
> షడ్గుణమ్ ॥

తత్తత్ఫల ప్రదానార్థమై తన లీలా విభూతిచే-అర్చా, విభవ, వ్యూహసూక్ష్మ అన్తర్యామి భేదములచే నైదువిధముల బరగుచున్నాడు. ప్రతిమాదు లర్చారూపములు. రామాద్యవతారములు విభవ స్వరూపములు. వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్నా నిరుద్ధ సంజ్ఞలచే వ్యూహము చతుర్విధము. షడ్గుణైశ్వర్య సమన్వితుడగు వాసుదేవ మూర్తియే సూక్ష్మరూపము. 'య ఆత్మని తిష్ఠన్నాత్మాన మన్తరో యమయతి' అను శ్రుతినిబట్టి యాతడే - 'అంతర్యామి' గా బరగుచున్నాడు.

> తదేవ వాసుదేవాఖ్యం పరంబ్రహ్మనిగద్యతే।
> అంతర్యామీ జీవసంస్థో జీవ ప్రేరక ఈరితః ॥

పూర్వ పూర్వోక్త మూర్త్యుపాసనా ఫలితముగా జ్ఞానముకలిగి క్రమక్రమముగా నుత్తరోత్తర మూర్త్యుపాస్త్యధికారము సంప్రాప్తించును. అందంతయు వాసుదేవుని యనుగ్రహము వలననే కలుగునని చెప్పఁబడినది.

> అర్చోపాసనయాక్షిప్తే కల్మషేఽధికృతో భవేత్।
> విభవోపాసనే పశ్చాద్వ్యూహోపాస్తౌ తతఃపరమ్।
> సూక్ష్మే తదను శక్తఃస్యాదన్తర్యామిణ మీక్షితుమ్॥

ఇంకను నిట్టి యనుగ్రహ ప్రాప్తి కనుకూలముగా వాసుదేవోపాసనా పద్ధతులు శ్రీ పఞ్చరాత్రమున-అభిగమన, ఉపాదాన, ఇజ్యా, స్వాధ్యాయ, యోగప్రభేదములచే నైదువిధములుగా చెప్పఁబడినవి. అభిగమన మనగా దేవతాస్థాన మార్గాదులను, తుడిచి యలికి పరిశుభ్రముచేయుట. ఉపాదాన మనగా గంధపుష్పాది పూజాసాధనములను సంగ్రహించుట. ఇజ్యయనగా దేవతా పూజనము. అర్థాను సంధానపూర్వకముగా మంత్రమును జపించుట, వైష్ణవసూక్త స్తోత్ర పాఠాదులు నామ సంకీర్తనము, తత్త్వ ప్రతిపాదక శాస్త్రాభ్యాసము మొదలగునవి స్వాధ్యాయమని వ్యవహరింపఁబడుచున్నది. యోగమనగా దేవతానుసంధానము. ఏవం విధ ఉపాసనాకర్మ సముచ్చితమగు విజ్ఞానముచే వాసుదేవుడు తెలియఁబడినవాడై పునరావృత్తి రహితమగు తన సాన్నిధ్యమునిచ్చును.

> స్వశక్త్యా వాసుదేవోఽపి సంప్రాప్యానందముత్తమమ్।
> పునరావృత్తిరహితం స్వీయం ధామ ప్రయచ్ఛతి॥

అత్తరి పురుషుని (జీవుని) సాంసారిక గుణములు తిరోహితములై అవిద్య నశించును. ఇది యంతయు వాసుదేవుని ప్రసాదమే.

"ఉక్తోపాసనయా పుంసాం
వాసుదేవః ప్రసీదతి"

అవిద్య నశించి, సాంసారిక గుణ ముక్తుడైన జీవుడు పరమాత్మ సన్నిధానమున ఆతనితో సమానుడై యాతనియొక్క సర్వజ్ఞత్వా నంత్య కల్యాణాది గుణ వైభవమును పొందునని పాంచరాత్ర రహస్యమున నిట్లు ప్రవచింపఁబడినది.



ఖజురహోశిల్పం
ఫోటో : ఎస్. మధు.

> ప్రసన్నాత్మా హరిర్భక్త్యా నిదిధ్యాసనరూపయా।
> అవిద్యాం కర్మ సంఘాతరూపాం సద్యో
> నివర్తయేత్ ॥
> తతఃస్వాభావికాః పుంసాంతే సంసార తిరోహితాః।
> ఆవిర్భవన్తి కల్యాణాః సర్వజ్ఞత్వాదయోగుణాః॥
> ఏవం గుణాః సమానాః స్యుర్ముక్తానా మీశ్వరస్యచ।
> సర్వకర్తృత్వమేవైకం తస్మాద్దేవే విశిష్యతే॥

ఏవంవిధ ఫలప్రదాతయగు పురుషోత్తముని బ్రహ్మముగా నిర్ణయించి యిదే భిత్తిపై శ్రీమద్రామానుజులు శారీరక మీమాంసా భాష్యమును ప్రణయించిరి. తత్సారభూతముగా చతుస్సూత్రియనుపేర నాల్గుసూత్రములు ప్రమాణ మూర్ధన్యములై ప్రకాశించుచున్నవి. "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" యనునది మొదటి సూత్రము. తాపత్రయాతురులచే నమృతత్వముకొరకు పురుషోత్తమాదివదవేదనీయమగు 'బ్రహ్మ' జిజ్ఞాస్యమని సూత్రార్థము. అయినచో నా బ్రహ్మ మెట్టిది యను నాశంక యుదయించును. తత్సమాధానముగా-"జన్మాద్యస్య యతః" యనెడి ద్వితీయ సూత్రమావిర్భవించినది. తదుపరి ఆ బ్రహ్మమును నిర్ధారించు ప్రమాణమెద్ది? యను సంశయమును నివారించుటకై -'శాస్త్రయోనిత్వాత్' అను తృతీయ సూత్రము ప్రతిపాదింపఁబడినది. ప్రమాణాన్తరాగోచరమగు బ్రహ్మమును శాస్త్రము మాత్రమెట్లు ప్రతిపాదించునను ప్రశ్నకు సమాధానముగా- 'తత్తు సమన్వయాత్' అని సూత్రించబడినది. ఈ చతుస్సూత్రీ వివేచనము దిఙ్మాత్ర నిర్దేశము మాత్రమే. అతి గహనమగు నీ యాత్మ విషయమును సంపూర్ణముగా దెలియుట కేవలము గురుముఖతః శాస్త్రాధ్యయనముచేసిననే సాధ్యమగును. 'బ్రహ్మవిద్య' కష్టసాధ్యమను నానుడి మనమందఱ మెఱిగినదే. అందులకు జిజ్ఞాస, శ్రద్ధ ప్రధానములు. తదర్థమై నారాయణ పరాయణత్వమే శరణోపాయము.





ఉత్తరాంధ్రంలోని అతి ప్రసిద్ధ వైష్ణవ క్షేత్రమైన సింహాచలానికిగల మహిమోపేత స్థల పురాణాలను సుసంపన్న చరిత్రను వివరించే వ్యాసమిది.

॥ సం ॥

# సింహాచల క్షేత్రము

— శ్రీ కె. సీతారామాచార్యులు

ఫోటోలు: సుజాత

మహావిష్ణువు వరాహనృసింహరూపములు రెండింటితోను అవతరించిన క్షేత్రము సింహాచలము. ఇది విశాఖపట్టణమునకు ఉత్తరముగా సుమారు పదిమైళ్ల దూరములో ఉన్నది. 200 అడుగుల యెత్తున నృసింహస్వామి దేవాలయము కొండపై ఉన్నది. మహావిష్ణువు ఆదిదేవుడని, అతని వలననే ఈ విశ్వమంతయు పుట్టినదని వేదములు పురాణములు ఘోషించుచున్నవి.

“ఏకో నారాయణో హరిః” అను సూక్తి కారణమున నారాయణుడే ధర్మస్థాపనకు, దుష్టశిక్షణ, శిష్టరక్షణార్థము అవతారములు దాల్చుచుండును. అతని మాయవలనే ఈ సమస్తసృష్టి జరిగినది. సనక సనందనాది మునుల శాపప్రభావమువలన వైకుంఠ రక్షకులైన జయ విజయులు రాక్షసులుగా జన్మించిరి. వారియొక్క రాక్షసత్వాన్ని నివారించటానికి నారాయణుడు వరాహ, నృసింహావతారములు దాల్చెను. ఆ రెండు రూపములతో వెలసిన క్షేత్రమే యీ సింహాచలము.

ఈ క్షేత్ర మాహాత్మ్యమునందు చాలా ఐతిహ్యములు కలవు. స్థలపురాణము వలన మనకు గోచరించు విషయములు చాలా కలవు. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని సముద్రమున పడవైచి అతనిపైన ఈ సింహగిరిని వుంచగా, నృసింహస్వామి దీనిని ప్రక్కకు తొలగించి ప్రహ్లాదుని రక్షించెను. పిమ్మట ప్రహ్లాదుడు స్వామిని ఈ కొండపై ప్రతిష్ఠించి పూజించెను. ఆ మందిరమునకు “ప్రహ్లాద మందిరము అని” ప్రసిద్ధికలదు. కాలవశమున ఆలయము శిథిలమై మట్టిచే కప్పబడినది. పురూరవుడు ఊర్వశితో విహరించుచు నీ గిరియొక్క సౌందర్యమునకు ముగ్ధుడై యిచ్చటనే యుండఁదలచెను. అపుడు ఊర్వశి పూర్వయుగములోని వృత్తాంతము స్మరించి, “ఇచట నృసింహస్వామి విగ్రహము వుండవలయును వెదుకుము” అని పురూరవుని కోరెను. అతడు చాలసేపు వెదకి స్వామిని గానక, అందుకొరకై తపస్సు చేయగా స్వామివారు సమాధియందు కన్పించి, “నీ యెదుటనున్న పుట్టయందే నా మూర్తి కలదు. బయటకుతీసి ప్రతిష్ఠించి యర్చింపు”మని ఆజ్ఞయిచ్చెను. ఈ విధముగా యీ క్షేత్రము సుప్రసిద్ధమయినదని ఇచటి స్థల పురాణము తెలుపుతున్నది.

ముప్పదిరెండు నారసింహస్థానములలో అహోబల, కృతశౌచ, హేరంపావ, సింహాచలములు ప్రధానములు. వాటిలో సింహాచలము అతిముఖ్యమైన క్షేత్రము. ఈ క్షేత్రమునకు క్షేత్రపాలకుడు శ్రీ త్రిపురాంతక విశ్వేశ్వరుడు. ద్వారపాలకులు అంజనేయ, కాలభైరవులు. ఈ క్షేత్రం శైవ వైష్ణవములకు సామరస్య సంధాయకముగా నున్నది. ముందుగా త్రిపురాంత కేశ్వరుని దర్శించిన తరువాతనే నృసింహస్వామిని దర్శింతురు. భక్తులు ఆపదలను నివారించి, వారివారి మనోరథములను తీర్చుటకు యీ సింహగిరియందు శ్రీ భగవానుడు లోక కల్యాణార్థమై యవతరించెను. ఇచట లక్ష్మీదేవి “సింహవల్లీతాయారు” అను నామముతో వెలసినది.

ఈ క్షేత్రమునందు ఇంకొక ప్రత్యేకత యున్నది. దేవాలయ ప్రాంగణములో ఒక గర్భస్తంభము కలదు. సంతానములేని దంపతులు ఆ స్తంభమును ఆలింగనము చేసుకొనినచో తప్పక సంతానము కలుగునని ప్రసిద్ధికలదు. సంతానగోపాల యంత్రముపై దీనిని ప్రతిష్ఠించారు. ఈ దేవాలయమున సహజసుందరమైన శిల్పము మనకు



స్వామివారి నిజరూప దర్శనం

కన్పించును. ఆ శిల్పము యొక్క నైపుణ్యము వర్ణనాతీతము. శృంగార కళ, నృత్యకళ. యుద్ధకళ కొన్నిచోట్ల ప్రాచీన కాల సాంఘిక నాగరికకథా జీవనవిధానము కూడా కన్పించును. ఈ దేవాలయ నిర్మాణము యెప్పుడు జరిగినదో నిక్కచ్చిగా చెప్పడము కష్టము. క్రీస్తుకు పూర్వం 200 సం॥లకు ముందు ఈ దేవాలయమున్నట్లు చరిత్రకారులు చెప్పుచున్నారు. మరి కొందరు రాజరాజనరేంద్రుని మనుమడు ఈ ఆలయమును నిర్మించినట్లు చెప్పుదురు. 15 వ శతాబ్దిలో శ్రీ కృష్ణదేవరాయలు పూర్వ దిగ్విజయయాత్రకు వచ్చినపుడు సింహాచలముదాకా వచ్చి యిచ్చట దిగ్విజయ స్తంభము నాటించెను. ఆ స్తంభము నేటికిని యున్నది. ఆ రాజు శ్రీ వరాహ లక్ష్మీ నృసింహస్వామివారినిదర్శించుకొని ఆభరణములు కానుకగా యిచ్చినట్లు నేటికిని శాసన మున్నది.



కళ్యాణమండపం స్తంభవరుస

ఈ సింహగిరియందు "గంగధార" అను పేరున సహజమైన జలము లభ్యమగును. ఆధారలో స్నానముచేసినవారు మోక్షము పొందగలరని ప్రసిద్ధికలదు. ఈ ఆలయ వతనమునకు ఒక ప్రత్యేక ఐతిహ్యము కలదు. ఈ దేవాలయమందు పరమభగవద్భక్తుడగు తాండవకృష్ణమాచార్యులవారు శ్రీస్వామివారి సన్నిధానములోనేస్థిరనివాస మేర్పరుచుకున్నారట. వారు సంగీత నైపుణ్యము కలవారు. వారి గానమునకు స్వామివారు ఆనందపరవశులై ప్రత్యక్షమై వారిగానమునకు పరితోడుగ నృత్యము చేయుచుండెడివారట. కొన్ని దినములకు శ్రీ రామానుజులవారు తీర్థయాత్రలు చేస్తూ శ్రీ సింహాచల నృసింహస్వామి వారిని దర్శించుటకు వచ్చిరి. రామానుజులు కృష్ణమాచార్యుల వారి విషయమంతయు విని, వారిని పరీక్షింపదలచి "ఆర్యా! మాకు మోక్షమున్నదా?"అనిప్రశ్నించెనట. ప్రతిరోజు మీరు గానముచేయుచుండగా స్వామివారు నృత్యము చేయుచుందురు గదా! ఆసమయమున మీరు నా ప్రస్తావన తెచ్చి, దక్షిణప్రాంతమునుండి ఒక యతీశ్వరుడు వచ్చినాడు అతనికి మోక్షము వున్నదా అని స్వామివారిని ప్రశ్నించండి యని రామానుజులవారు కృష్ణమాచార్యుల వారితో చెప్పారు. ఒక రోజున శ్రీ స్వామివారు నృత్యము పూర్తిగావించిన పిదప రామానుజులవారు అడిగిన ప్రశ్నను కృష్ణమాచార్యులవారు స్వామివారిని అడిగారు. దానికి శ్రీ స్వామివారు "నీకు నాకు మోక్షము కావలెనన్న ఆ యతీశ్వరుని ఆశ్రయించాల్సిందే" యని సమాధానము చెప్పారు.

ఆ మాటలకు కోపము వచ్చి తాండవ కృష్ణమాచార్యులవారు శ్రీ స్వామివారిని నిందిస్తూ "నా జీవితమంతయు నిన్ను నాగానముతో అర్చించానుగదా!"అన్నారు దానికి స్వామివారు "నీపాటకు నా ఆటకు సరిపోయినదని" సమాధానము చెప్పి కోపముతో "నీ కీర్తనలు ప్రపంచమందు ప్రచారముగాకుండుగాక" అని శాపమిచ్చారట. అంతట కృష్ణమాచార్యులవారు కోపముతో "నీ దేవాలయము ధ్వంసమయి పోవునని" ప్రతిశాప మిచ్చారట. కృష్ణమాచార్యులవారికి జ్ఞానోదయమై రామానుజుల



సింహవల్లీ తాయారు

వారిని ఆశ్రయించి మోక్షప్రాప్తికి ఉపదేశము పొంది శ్రీ వరాహన్నృసింహునిలోనే కలసిపోయిరి. శ్రీ స్వామివారి శాపఫలము గనే వారియొక్క కీర్తనలు వెలుగులోకి రాలేక పోయినవి. కృష్ణమాచార్యుల రచనలు "సింహగిరివచనములు" అనుపేర పిలువబడుతున్నాయి.

కృష్ణమాచార్యులవారి శాపము ఈ దేవాలయ పతనమునకు కారణమట. విజయరామగజపతి మహారాజునకు మహమ్మదీయులకు యిప్పటికి సుమారు మూడు శతాబ్దముల క్రిందట యుద్ధములు జరుగుచుండేవి. ఒకరోజు మహమ్మదీయుల దండు విజయనగర సామ్రాజ్యముపైకి దండెత్తి వచ్చి వారిచేతులో ఓడిపోయి పారిపోతూ మహారాజు ధర్మకర్తగా ఉన్న యీ సింహాచలము మీద పడినది. ఆ దండు ఆలయమున ధ్వంసము చేయుటకు కొండ ఎక్కినది. ఈ సంగతి తెలిసికొని సింహాచల దేవస్థానములో ఆస్థానాచార్యులుగా పని చేయుచున్న భగవద్భక్తుడు, మహాకవి యగు గోగులపాటి కూర్మనాథ దాస కవి శ్రీ స్వామివారి వెనుక ప్రక్కన కూర్చుని "వైరిహర రంహ! సింహాద్రినారసింహ!" అను మకుటముతో నిందాస్తుతి పరంగా సీస పద్యములను చెప్పనారంభించెను. ఉదా॥

సీ॥ మునివాటిక ఉయమంది మే కాదొల
పక్కటంబు గొంత నెక్కినావు
కాసింత కంటికి మే కాదొల సంపూర్ణ
పాడుపడంబు గత్తి బట్టితివి
ఎకిం పాశ్చాత్యుల సింహము లేక మె పోదు
శావసిగితి బదాబ్చినావు
మ్లేచ్ఛనాయక బలాలికి జంకి కాదొల
మిక్కిలి గండంబు మెత్తినావు

గీ॥ పట్టిగా నీవు తురకల మట్టుబంత
నిప వరాహాకృతి దరించి నావు సామి
వలదు సింహంబ తురుష్కుల పకింపు
వైరిహర రంహ! సింహాద్రి నారసింహ!॥

అని చెప్పెను. ఈ విధమైన నిందాస్తుతి పద్యములు అనేకరకములుగా చెప్పియున్నాడు.

మహమ్మదీయులు దేవాలయములో ప్రవేశించి స్తంభములను, కోవెల మీదవున్న శిల్పములను, రాతిరథములను భిన్నాభిన్నముచేసి, గర్భాలయములో ప్రవేశించుచుండగా నొక పెద్ద తుమ్మెదల దండు లోపలనుండివచ్చి ఆలయమున ముట్టడించిన మహమ్మదీయులను రక్కి, ముక్కలుగా చేసి రక్తధారలతో ముంచెత్తినది. ఆ తుమ్మెదల ధాటికి మహమ్మదీయులు తట్టుకొనలేక ఆయుధములను పారవైచి, విశాఖపట్టణము రైలుస్టేషనువద్దగల మెట్టవరకు పరుగెత్తిరి. ఆ మెట్టకే "తుమ్మెదల మెట్ట" అని ప్రసిద్ధి కలదు. మహమ్మదీయులు పాడుచేసిన దేవాలయ శిల్పములు శిథిలమై నేటికిని కనుపించుచున్నవి. ఈ క్షేత్రములో శ్రీ స్వామివారికి పాంచరాత్రాగమము ప్రకారము ఆరాధన జరుగును. ప్రతినిత్యము మహోత్సవములు జరుగుచుండును. చైత్రశుద్ధ ఏకాదశినాడు శ్రీ స్వామివారి కళ్యాణ మహోత్సవము, రథోత్సవముజరుగును. వైశాఖశుద్ధ తదియనాడు చందనమహోత్సవము (నిజరూప దర్శనము) జరుగును. వైశాఖ పౌర్ణమి, జ్యేష్ఠపౌర్ణమి దినములలో గొప్ప ఉత్సవములు జరుగును. ఆషాఢ పౌర్ణమినాడు సింహగిరికి ప్రదక్షిణములు వేయుదురు. దసరా, ముక్కోటి ధనుర్మాసోత్సవములు తెప్పఉత్సవము, కామదహనము మొదలగునవి నిత్యం జరుగుచుండును. ఈ క్షేత్ర మాహాత్మ్యమును భక్తి శ్రద్ధలతో చదివిన వారికి అభీష్టములు నెరవేరగలవు.

శ్లో॥ "సుందరాయ శుభాంగాయ మంగళాయ
మహౌజసే।
సింహశైల నివాసాయ శ్రీనృసింహాయ
మంగళమ్॥

*

---



శ్రీ ఎం. చంద్రమౌళిరెడ్డి

(7వ పేజీ తరువాయి)

కూడా మనమిది సాధించామనో, దీని సాధనకు తోడ్పడగలిగామనో సంతృప్తి కలుగుతుంది. దాన్ని ఊతగా తీసుకుని పత్రికలు మరింత ముందుకు సాగుతుంటాయి.

సప్తగిరి కేవలం దేవస్థాన కార్యక్రమాలు, ధార్మిక విషయప్రచారానికి మాత్రమేగాక రాజకీయాల కతీతంగా యాత్రిక సమస్యలను వినికిగలవారికి, వినగలవారికి నివేదించి పరిష్కారానికి యథాశక్తి పాలు పంచుకున్నది.

దేవస్థాన సమాచారకేంద్రాలు స్థాపనకు 1965 లో కొన్ని ప్రదేశాలను ఎన్నికచేస్తూ తీర్మానం జరుగగా ప్రతి జిల్లా కేంద్రంలోనూ, రాష్ట్రంలోని ప్రతి పుణ్యక్షేత్రంలోనూ సమాచార కేంద్రాలను స్థాపిస్తే బాగుంటుందని సూచించిన తర్వాత నెలలోనే దేవ



శ్రీ ఎస్. వి. సుబ్రమణియన్

స్థాన పాలకమండలి తత్తుల్యమైన తీర్మానం చేసిందంటే అది రాజకీయం కాదేమో!

తిరుపతి-రేణిగుంట బ్రాడ్‌గేజ్ ఏర్పడిన తర్వాత తిరుపతి - మద్రాసు-విజయవాడ-హైదరాబాద్‌ల నడుమ ప్రయాణ సౌకర్యాలు విస్తృతం చేసేందుకు సంపాదకీయాల ద్వారా, ఇతర శీర్షికల ద్వారా ఎలా ప్రయత్నం చేసిందీ, అవి ఎలా ఫలరూపం పొందిందీ లోగడ సప్తగిరి పాఠకులుగావున్న వారందరికీ తెలుసు.

తిరుపతి విమానాశ్రయాన్ని ప్రారంభించినప్పుడు దేశంలో వివిధ కీలక కేంద్రా



శ్రీ పి. ఎస్. రాజగోపాలరాజు

లను కల్పుతూ విమానయానం ఏర్పడాలని మొదటగా ప్రతిపాదించింది సప్తగిరే! ఆ ప్రతిపాదన ఫీడర్ సర్వీస్ రూపంలో ఇరుగు పొరుగు రాష్ట్రాలలో, ఆంధ్రప్రదేశ్ లోనూ ఆచరణలో, ఆలోచనలో ఇప్పుడున్నాయంటే అది 'సప్తగిరి' ప్రజాసమస్యలపట్ల నిర్మాణాత్మకమైన దృక్పథంతో ఆలోచిస్తున్నదని, సప్తగిరి సూచనలను మనసులో వుంచుకోగల అధికారవర్గం సప్తగిరి పాఠకులుగా వున్న దనటానికి నిదర్శనం. కాని వెంటనే మన్నింపు వుంటే మాన్యత, పత్రిక నాణ్యత మెరుగౌతాయి.

ఇతర విషయాల్లో సప్తగిరి సంపాదకీయాలుగాని, వ్యాసాలుగాని మంచిస్థాయికి చెందినవన్న ఆశీర్వాదం, ఆశంసనలు అప్పుడప్పుడూ పాలకులనుంచి, పాఠకులనుంచి లభించటంకూడా ప్రగతిద్యోతకమే. నిజానికది కార్యకర్తలకు కొండంతబలాన్నిస్తుంది.



శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్

ఇదీ యీ 'సప్తగిరి' ప్రగతిగీత. అయితే గతమంతా కమ్మనికథాకాదు. రాగలదంతా భయంకర వ్యథాకాదు. నిజానికి ప్రతి పంచికా ఉగాదిపచ్చడి అనుభూతే కల్గిస్తుంది. వండటం ఒక కళే. కానీ అందరినీ మెప్పించటం? పత్రిక విషయంలోకూడా అంతే.

ఆశయాలెప్పుడూ ఆకాశమంత వున్నతం. ఆచరణలు ఆవగింజతో సమానం. కనుక నడిచిందానికన్నా నడవాల్సిందే ఎక్కువ. దూషణ, భూషణల కతీతంగా తన బాటలో తను సాగటమే పత్రిక కర్తవ్యం. భర్తృహరి చెప్పనే చెప్పాడు.

నిందంతు నీతినిపుణా
యది వా స్తువంతు,
లక్ష్మీః సమావిశతు
గచ్ఛతు వా యథేష్టమ్।
అద్యైవ వా మరణ
మస్తు యుగాంత రేవా,
న్యాయ్యాత్ పథః ప్రవి
చలంతి పదం న ధీరాః॥

అని. మనిషికి ఆ ధైర్యమే కావాలి. అది ఆ వేంకటేశ్వరుడే ఇవ్వాలి.



శ్రీ జి. కుమారస్వామిరెడ్డి

(9వ పేజీ తరువాయి)

యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి ।
తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥

నీ బుద్ధి అజ్ఞానమనే కళ్మలాన్ని అధిగమించినప్పుడు నీవు విన్న విషయాలూ, వినబోయే అర్థాలూ విరక్తి కలిగిస్తాయి

శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా ।
సమాధావచలా బుద్ధిః తదా యోగ మవాప్స్యసి ॥

అర్థవాదాలు అనేకం వినడంవల్ల చలించిన నీ మనస్సు నిశ్చలంగా వున్నప్పుడు నీవు ఆత్మజ్ఞానం పొందుతావు.

అర్జున ఉవాచ:

స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ ।
స్థితధీః కిం ప్రభాషేత ? కిమాసీత వ్రజేత కిమ్ ? ॥

అర్జునుడు: కేశవా! సమాధినిష్ఠ పొందిన స్థితప్రజ్ఞుడి లక్షణాలేమిటి? అతని ప్రసంగమూ, ప్రవర్తనా ఎలా వుంటాయి?

శ్రీ భగవానువాచ:

ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ; మనోగతాన్ ।
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే ॥

శ్రీ కృష్ణభగవానుడు: మనసులోని కోరికలన్నిటినీ విడిచిపెట్టి, ఎప్పుడూ ఆత్మానందమే అనుభవించేవాడు స్థితప్రజ్ఞుడు.

దుఃఖే ష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ।
వీత రాగ భయ క్రోధః స్థితధీ ర్ముని రుచ్యతే ॥

దుఃఖాలకు క్రుంగనివాడూ, సుఖాలకు పొంగనివాడూ, భయమూ రాగద్వేషాలు వదిలి పెట్టినవాడూ అయిన మునీంద్రుడు స్థితప్రజ్ఞుడౌతాడు.

యః సర్వత్రానభిస్నేహః తత్తత్ ప్రాప్య శుభాశుభమ్ ।
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

స్నేహవ్యామోహాలు లేకుండా వ్యవహరిస్తూ శుభాశుభాలు కలిగినప్పుడు సంతోషం, ద్వేషం పొందకుండా వుండేవాడు స్థితప్రజ్ఞుడు.

యదా సంహరతే చాయం కూర్మోఽంగా నీవ సర్వశః ।
ఇంద్రియా ణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

తాబేలు తన అవయవాలను లోపలికి ఎలా ముడుచుకుంటుందో అలాగే ఇంద్రియాలను సర్వవిధాల విషయసుఖాలనుంచి మళ్లించిన వాడు స్థితప్రజ్ఞుడవుతాడు.

విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥

ఆహారం తీసుకోనివాడికి ఇంద్రియ విషయాలు అణగిపోతాయి. అయితే విషయ వాసన మాత్రం వదలదు. ఆత్మదర్శనంతో అదికూడా అడుగంటిపోతుంది.

యతతో హ్యపి కౌన్తేయ ! పురుషస్య విపశ్చితః ।
ఇంద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః ॥

కుంతీనందనా! ఆత్మనిగ్రహం కోసం అమితంగా ప్రయత్నించే విద్వాంసుడి మనసును సైతం ఇంద్రియాలు బలవంతంగా లాగుతాయి.

తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।
వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

యోగసాధకుడు ఇంద్రియాలన్నింటినీ వశపరుచుకుని నామీదే మనస్సు వుంచాలి. అలాంటివాడి ప్రజ్ఞ సుస్థిరమవుతుంది.

ధ్యాయతో విషయాన్ పుంసః సంగ స్తేషూపజాయతే ।
సంగాత్ సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే ॥

క్రోధా ద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశః బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥

ఎప్పుడూ శబ్దాది విషయాల గురించే ఆలోచించే వాడికి వాటిమీద ఆసక్తివల్ల కోరికలు పుడతాయి. కోరికలు కోపం కలగజేస్తాయి. కోపం మూలంగా అవివేకం కలుగుతుంది. అవివేకం వల్ల మరపు, మరపువల్ల బుద్ధినశించడం బుద్ధి నాశనంవల్ల తానే నశించడం జరుతుంది.

రాగద్వేష వియుక్తైస్తు విషయా నింద్రియైశ్చరన్ ।
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి ॥

మనసును నిగ్రహించుకుని రాగద్వేషాలు లేకుండా తన అదుపాజ్ఞలలోవున్న ఇంద్రియాలవల్ల విషయసుఖాలు అనుభవించేవాడు మనశ్శాంతి పొందుతాడు.

ప్రసాదే సర్వ దుఃఖానాం హాని రస్యోపజాయతే ।
ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే ॥

మనస్సు నిర్మలమైతే సమస్త దుఃఖాలూ నశించిపోతాయి. మనసు నిర్మలంగా వున్నవాడి ప్రజ్ఞకు చలనం లేదు.

నాస్తి బుద్ధి రయుక్తస్య న చాయుక్తస్య భావనా ।
న చాభావయత శ్శాంతిః అశాంతస్య కుత స్సుఖమ్? ॥

మనోనిగ్రహం లేనివాడికి ఆత్మవివేకం కాని ఆత్మ చింతన కాని అలవడవు. అలాంటివాడికి మనశ్శాంతివుండదు. మనశ్శాంతి లేనివాడికి సుఖం శూన్యం.

ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే ।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివామ్భసి ॥

సుడిగాలి చుక్కాని లేని నావను దిక్కుతోచకుండా చేసినట్లు, ఇష్టానుసారం ప్రవర్తించే ఇంద్రియాలకు లొంగి పోయిన మనస్సు పురుషుడి బుద్ధిని పాడుచేస్తుంది.

తస్మా ద్యస్య మహాబాహో ! నిగృహీతాని సర్వశః ।
ఇంద్రియా ణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

అర్జునా ! అందువల్ల విషయసుఖాల వైపుకు వెళ్ల కుండా ఇంద్రియాలను నిగ్రహించుకున్నవాడికి స్థిరమైన బుద్ధి కలుగుతుంది; వాడే స్థితప్రజ్ఞుడు.

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥

ఆత్మానుభూతిలేని అన్ని ప్రాణులకూ రాత్రిగాతోచే సమయంలో మనోనిగ్రహం కలిగిన ముని మేలుకుని వుంటాడు. విషయాలపట్ల ఆసక్తితో సర్వప్రాణులూ మెలకు వగా వున్నప్పుడు ఆత్మనిష్ఠకలిగిన యోగికి రాత్రి అవుతుంది.

ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠమ్
సముద్ర మాపః ప్రవిశన్తి యద్వత్ ।
తద్వ త్కామా యం ప్రవిశన్తి సర్వే
స శాన్తి మాప్నోతి న కామకామీ ॥

నిరంతరం నిండుతున్నప్పటికీ చలించకుండా నిలిచిన సముద్రంలో నదీజలాలు ఎలా ప్రవేశిస్తాయో అలాగే ఎవడిలో కామాలన్నీ లీనమై అణగి పోతాయో వాడు శాంతి పొందు తాడు. భౌతిక సుఖాలకు బానిస అయినవాడికి మోక్షంలేదు.

విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్స్పృహః ।
నిర్మమో నిరహంకారః స శాంతి మధిగచ్ఛతి ॥

కోరికలన్నిటినీ విడిచిపెట్టి ఆశ, అహంకారం, మమకారం లేకుండా మెలగేవాడు పరమశాంతి పొందుతాడు.

ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి ।
స్థిత్వాఽస్యా మంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి ॥

అర్జునా! ఇలా బ్రహ్మజ్ఞానం పొందినవాడి దృష్టి ప్రపంచ విషయాల మీదకు మళ్లీ మళ్లదు. జీవితం చివరి ఘట్టంలో అయినా అలాంటి జ్ఞానం కలిగితే మోక్షం లభిస్తుంది.

ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం, శ్రీ కృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని "సాంఖ్యయోగం" అనే రెండవ అధ్యాయం సమాప్తం.

(సశేషం)

# సప్తగిరి ఏజెంట్ల చిరునామాలు

## తూర్పుగోదావరి జిల్లా

శ్రీ దాసం ప్రభాకరరావు
మెయిన్‌రోడ్ కాకినాడ-533 001

శ్రీ కె. శ్రీరాములు
శ్రీసత్యవీరభద్ర ఏజెన్సీ
జామ్‌పేట, పెద్దవీధి రాజమండ్రి-2.

శ్రీ ఎస్. ఆర్. బ్రహ్మానంద
ముక్తిలింగంవారి వీధి తుని-533 401

## కృష్ణాజిల్లా

శ్రీ కె. వీరేశ్వరరావు
బుక్‌షాప్, కైకలూరు-521 333

శ్రీ కొండూరు పార్థసారథి
రామానుజ కూటం, బచ్చుపేట
మచిలీపట్నం-521 001

శ్రీ ఆర్. శ్రీనివాసన్
C/o ఎన్. శ్రీనివాసన్
16-6-1 గుంటువారివీధి, పూర్ణానందంపేట
విజయవాడ-520 016

శ్రీ వి. రామాచార్యులు
గాయత్రీగురుకుల్ సాయిమహల్‌దగ్గర
ఉయ్యూరు-521 165

శ్రీ కపిలవాయి కేశవరావు
ఏజెంట్ ఆంధ్రపత్రిక, కొండపల్లి (పోష్టు)

## నెల్లూరు జిల్లా

శ్రీ ఏ. సాయిబాబా
C/o వేంకటకృష్ణయ్య
న్యూస్ ఏజెంట్ అల్లూరు-524 315

## విజయనగరం జిల్లా

శ్రీ జి. వెంకటరాజు
శ్రీ వేంకటేశ్వర క్లాత్ ఎంపోరియం
ఎం. జి. రోడ్, క్లాక్‌టవర్ దగ్గర
విజయనగరం-531 201

**శ్రీ రాధాగోవిందపతి**
**న్యూస్ ఏజెంట్, పార్వతీపురం (పోష్టు)**

## చిత్తూరు జిల్లా

శ్రీ ఓ. కె. సుబ్రహ్మణ్యం
న్యూస్ ఏజెంట్ పాకాల (పోష్టు)

శ్రీ కె. వీరస్వామి చెట్టి
C/o ఆర్. డి. కన్నయ్యనాయుడు
అడ్వొకేట్ ఎం. ఓ. రోడ్
పుత్తూరు-517 503

శ్రీ టి. పి. ఉమాపతి
మెయిన్‌రోడ్ నారాయణవనం (పోష్టు)
పుత్తూరు తాలూకా

శ్రీమతి వి. వసుమతి
C/o వి. శ్రీనివాసాచార్యులు
బ్లాక్ ఎక్స్‌టెన్షన్ ఎడ్యుకేషన్
సి. టి. ఎం. పోష్టు-517 319

శ్రీ ఐ. జయచంద్రప్రకాష్
C/o డి. జగన్నాథం
స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా
వలమనేరు-517 408

శ్రీ సి. వేంకటరెడ్డి
3/90, బజార్‌వీధి వాయల్పాడు (పోష్టు)

శ్రీ టి. సి. ఉమాపతి
మెయిన్‌రోడ్ నారాయణవనం (పోష్టు)
పుత్తూరు తాలూకా

శ్రీమతి వి. వసుమతి
C/o వి. శ్రీనివాసాచార్యులు
బ్లాక్ ఎక్స్‌టెన్షన్ ఎడ్యుకేషన్
సి. టి. ఎం. పోష్టు-517 319

శ్రీ ఐ. జయచంద్రప్రకాష్
C/o డి. జయానందం
భారతీయ స్టేట్ బ్యాంకు
వలమనేరు (పోష్టు)

**శ్రీ సి. వెంకటరెడ్డి**
**3-90, బజార్‌వీధి వాయల్పాడు (పోష్టు)**

శ్రీ జి. ఆర్. పాండురంగయ్యశెట్టి
S/o శ్రీ జి. రామయ్యశెట్టి
విజయరంగ న్యూస్ ఏజెన్సీ
కీల్‌పట్ల (పోష్టు) - 517 408

శ్రీ కె. సుబ్బారావు
న్యూస్ ఏజెంట్ బైరెడ్డిపల్లె-517 419

శ్రీ బి. కె. శ్రీనివాసగుప్త
లాంగ్‌బజార్ వి. కోట (పోష్టు)

శ్రీ వి. ఎస్. కృష్ణమూర్తి
C/o వి. శ్రీకాంతయ్య న్యూస్ ఏజెంట్
నేతాజీరోడ్ కుప్పం-517 425

శ్రీమతి ఎన్. డి. సులోచన
మేనేజింగ్ పార్ట్‌నర్ ప్రతిభాప్రియదర్శిని
రైల్వేస్టేషన్ బుక్‌స్టాల్ తిరుపతి-517 501

## విశాఖపట్నం జిల్లా

శ్రీ. పి. వీరునాయుడు
శ్రీ సాయివారి బుక్ హౌస్
అనకాపల్లి-531 001

శ్రీ వి. వీరభద్రరావు
ఏజెంట్ ఏటికొప్పాక - 531 082

శ్రీమతి దొడ్డా పద్మాజయంతి
W/o ఐ. డి. వి. భాస్కరరావు
శ్రీ భాస్కర్ మెడికల్స్ పాడేరు (పోష్టు)

## కడప జిల్లా

శ్రీ బి. రామమోహన్‌మూర్తి
28-88 రామేశ్వర అగ్రహారం
ప్రొద్దుటూరు-516 360

శ్రీ పి. సూర్యప్రకాష్‌బాబు
S/o శ్రీ పి. వి. రామప్ప
విజయాస్టోర్సు పులివెందుల-516 390

శ్రీ సి. సుబ్రహ్మణ్యం
పద్మావతి ఏజెన్సీస్
10-277, బెల్లంమండి వీధి, కడప-516 001

శ్రీ సి. పి. వరలక్ష్మి
C/o పి. సుబ్బారావుగుప్త
**న్యూస్‌ఏజెంట్ రాజంపేట-516 115**

## బ్రహ్మోత్సవములు

లోకకల్యాణంకోసం, నిరంతరం నిర్విరామకృషిచేసి అన్నిరాష్ట్రాలలో ఎన్నో నిర్మాణాత్మక కార్యక్రమాలను నిర్వహించి గత రెండు సంవత్సరముల క్రితం తమ దేహయాత్ర చాలించిన శ్రీ మదుభయ వేదాన్తాచార్య పీఠాధిపతులగు శ్రీ శ్రీమన్నారాయణరామానుజజీయర్ స్వామి వారి అనుగ్రహ పాత్రులైన స్థానాచార్యులు శ్రీమాన్ నంబి వేణుగోపాలాచారి, శ్రీ పరమ హంస పరివ్రాజకాచార్యు వారి ఆదేశము ప్రకారము శ్రీ వేణుగోపాలస్వామి దేవాలయము జగిత్యాలలో 1979 నుండి బ్రహ్మోత్సవములు అతివైభవంగా జరుపు తున్నారు.

ఈ సంవత్సరము బ్రహ్మోత్సవములలో 80 మంది ఋత్విక్కులు, ఆచార్యులు, బ్రాహ్మణులు పాల్గొని నిత్యపూజలు మరియు భక్తులకు నేత్రపర్వముగా స్వామివారి కళ్యాణము జరిపించారు.

ప్రతిరోజు సాయంకాలము పురాణప్రవచనములు, నృత్యసంగీత కార్యక్రమము లిక్కడ జరుపబడుతుండినవి.

సర్వశ్రీ చిక్కుడుకాయల రంగాచార్యులు, మొర్తాడ్‌దేశికాచార్యులు, లకిశెట్టి పెదపాపాచార్యులు, కోవిల శ్రీనివాసాచార్యులు, చంద్రమౌళిశాస్త్రి (వాచస్పతి) మొదలగు వారు ప్రవచనములు గావించిరి.

స్థానాచార్యులు శ్రీ వేణుగోపాలాచారి భగవదారాధనము కన్నను భాగవత (తదీయారాధన) సేవయే ముఖ్యమను రామానుజ సిద్ధాంతము ప్రకారము భక్తులందరికి భోజనము ఉచితముగనే ధర్మదాతల యొక్క సంపూర్ణసహకారముతో కల్పించిరి.

వేణుగోపాలస్వామి గోవిందా! అనే భగవన్నామము దిక్కులు పిక్కటిల్లగా అనేక మంది భక్తులు స్వామివారి ఉత్సవాలలో పాల్గొని తీర్థప్రసాదములను స్వీకరించి తరించిరి.

## విజయగోపాలమ్

తెనాలి వాస్తవ్యులు డా॥ ఎల్. విజయగోపాలరావు రచించిన 'విజయగోపాలమ్' అనే భగవద్గీతా వ్యాఖ్యాన గ్రంథావిష్కరణ తే 16-5-83 దిన హైదరాబాద్ అశోకనగర్ లోని శ్రీ సత్యనారాయణస్వామివారి ఆలయ ప్రాంగణంలో జరిగింది. ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆచార్యులు డాక్టర్ బి. ఆర్. శాస్త్రిగారు అధ్యక్షత వహించారు. కళాప్రపూర్ణ డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారు గ్రంథాన్ని ఆవిష్కరించి దాని విశిష్టతను గురించి ప్రసంగించారు. గ్రంథకర్త శ్రీ విజయ గోపాలరావు తమ కృతి గ్రహీత అయిన శ్రీ జె. ఎస్. రాఘవేంద్రరావు, ఐ.ఏ.ఎస్. (ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ కార్యదర్శి) గార్ని శాస్త్రోక్తరీతిలో సన్మానించి వారికి తమ గ్రంథాన్ని సమర్పించారు. అనంతరం ఆచార్య తిరుమలగారు, డా॥ వెంపటి సూర్యనారాయణగారు గీతామాహాత్మ్యంపై ఉపన్యసించారు. డా॥ బి. ఆర్. శాస్త్రిగారు చివరగా అధ్యక్షోపన్యాసం ఇస్తూ 'విజయగోపాలమ్' కృతిని సమీక్షించారు.

గీతాబోధకు ఉపసంహార ప్రాయమైన సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ శ్లోకంలో సర్వధర్మాన్ అనే దానికి కర్తృత్వ భోక్తృత్వ, అహంకార, మమకారాది జీవధర్మములు నశిస్తేగాని పరమాత్మని సాధర్మ్యప్రాప్తి సిద్ధించదంటూ గ్రంథకర్త ఇచ్చిన వివరణ వినూత్నంగా ఎంతో సముచితంగావున్నదని శ్రీ శాస్త్రిగారు గ్రంథకర్తను అభినందించారు– ఈ గ్రంథ ముద్రణకు ఆర్థికసహాయం చేసిన తిరుమల తిరుపతి దేవస్థానం వారికి సభాముఖంగా ఆయన తమ కృతజ్ఞతలను తెలపడంతో ఈ కార్యక్రమం ముగిసింది.

# ధర్మరక్షణ కార్యక్రమాలు

### ఆదర్శ సేవాభజనమండలి

తిరుమల తిరుపతి దేవస్థానముల హిందూ ధర్మ రక్షణసంస్థవారి చొరవతో ఇటీవల చిత్తూరుజిల్లా గ్రామం మునగమాకుల కొత్తూరులో 15 మంది యువకులతో శ్రీ పట్టాభిరామ ఆదర్శసేవా భజనమండలి ఏర్పాటయింది. శ్రీ కె. కుప్పుస్వామి నాయుడు దీనికి అధ్యక్షుడు– ఈ సంఘ సభ్యుల కృషిఫలితంగా వదాన్యుల విరాళాలతో ఆ గ్రామంలో శ్రీ పట్టాభిరామస్వామి వారి దేవాలయం నిర్మించబడింది. ఆ ఆలయప్రాంగణాన్ని వేదికచేసుకొని ఈ భజనమండలి అనేక ధార్మిక కార్యక్రమాలను నిర్వహిస్తున్నది. మే 25 వ తేదిన ఈ సంఘసభ్యులు తమగ్రామంలో నృసింహ జయంతి ఉత్సవాలను వేడుకగా జరిపారు. హిందూధర్మ రక్షణసంస్థ పక్షాన శ్రీ ఎం. వి. ఎస్. శాస్త్రి ప్రధానవక్తగా హాజరై నృసింహావతార గాథను గ్రామస్థులకు విశదీకరించారు– ఆ సందర్భంగా జరిగిన సభలో శ్రీ పట్టాభిరామస్వామి నిత్యాభిషేక నిధికి విరాళాలు కోరుతూ రూ 116/ లు విరాళం చెల్లించిన దాతలపేరిట సంవత్సరంలో ఒక రోజున అభిషేకం జరుపుతామని భజన మండలి ప్రకటించింది. •



విజయగోపాలమ్ గ్రంథాన్ని అవిష్కరిస్తున్న డా॥ దివాకర్ల వేంకటావధాని. వేదికపై రచయిత శ్రీ విజయగోపాలరావు, శ్రీ బి. ఆర్. శాస్త్రి తదితరులు.



**కంచికామకోటిపీఠాధిపతులు శ్రీ జయేంద్ర సరస్వతిస్వాములవారు ఇటీవల తిరుమల సందర్శించినప్పటి దృశ్యం.**

## శ్రీ పద్మావతీ విశ్వవిద్యాలయం

శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవేరి, కామితార్థ ప్రదాయిని శ్రీ పద్మావతీఅమ్మవారి పేరిట రాష్ట్రప్రభుత్వం తిరుపతిలో నెలకొల్పిన మహిళా విశ్వవిద్యాలయ ప్రగతికి టి. టి. డి. తనవంతు దోహదం తాను చేస్తున్నది.

ఇటీవల ఈ విశ్వవిద్యాలయానికిగాను దేవస్థానం 15 లక్షల అభివృద్ధి గ్రాంటును మంజూరుచేసి తొలివిడతగా రు. 5 లక్షలను విడుదలచేసింది. విశ్వవిద్యాలయ తరగతుల నిర్వహణకుగాను అనేక దేవస్థాన స్థలాలను పరిశీలించిన మీదట శ్రీ పద్మావతీ మహిళా పాలిటెక్నిక్ కళాశాల ప్రాంగణాన్ని ఎంపిక చేయటం జరిగింది. ప్రస్తుతం



**హిందూ ధర్మరక్షణ సంస్థవారు గతంలోవలె ఈ ఏడాదికూడా మే 15 వ తేది నుండి 25 వ తేది వరకు తిరుపతిలో హిందూధర్మ వేసవిపాఠశాలను నిర్వహించారు. టి. టి. డి. సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ డి. సుబ్బరాయులు శిబిర ప్రారంభోత్సవం జరిపినప్పటి దృశ్యం.**

అక్కడగల 'యోగ' కేంద్రాన్ని నరసింగాపురంలోని శ్రీ వేంకటేశ్వర వేదపాఠశాల భవనంలోకి తరలిస్తారు. యోగకేంద్రం ఇదివరకికాలంలో ఉబ్బసం, పచ్చకామెర్లు వంటి వ్యాధుల నివారణలో ప్రముఖపాత్ర నిర్వహిస్తున్న దృష్ట్యా పల్లెప్రాంతాలవారికి ఈ కేంద్రం అందుబాటులో వుండేందుకు ఈ మార్పు ఉపకరిస్తుంది. కల్యాణీడామ్ వద్దగల భవనసముదాయంలో ఇకమీదట వేదపాఠశాలను నిర్వహించాలని దేవస్థానం నిర్ణయించింది.

## పురాణప్రబోధ పరీక్షలు

తిరుమల తిరుపతి దేవస్థానముల హిందూ ధర్మ రక్షణసంస్థవారు ఈ ఏడాది నిర్వహించిన పురాణప్రబోధ పరీక్షలలో 80 శాతం మార్కులతో మొదటిస్థానం కొడిగెనహళ్ళి పాఠశాల విద్యార్థి చిరంజీవి ఎన్. మునిరాజులు సంపాదించుకొన్నాడు. ఈ

# వార్తాలహరి

అబ్బాయి కొడిగెనహళ్ళిలోని ఆంధ్రప్రదేశ్ ఆశ్రమ పాఠశాలలో తొమ్మిదవ తరగతి చదువుతున్నాడు. ఈ పరీక్షలలో 79 శాతం మార్కులతో ద్వితీయస్థానం కడపజిల్లాకు చెందిన కుమారి ఎస్. వసుంధరకు, 78 శాతం మార్కులతో తృతీయస్థానం కుమారి పి. శాంతకు (వరంగల్ జిల్లా) లభించింది. ఈ ముగ్గురు విజేతలకు, జిల్లాస్థాయిలో ప్రథమ,ద్వితీయ,తృతీయ స్థానాలు పొందిన మరో 72 మంది విద్యార్థులకు త్వరలో దేవస్థానం పక్షాన శ్రీవారి రజతడాలర్లను బహూకరిస్తారు.

హిందూధర్మ రక్షణసంస్థవారి కార్యక్రమాలలోకి అతికీలకమైన ఈ పరీక్షలలో ఈ సంవత్సరం రాష్ట్ర వ్యాప్తంగా 394 పాఠశాలలనుండి 9577 మంది విద్యార్థులు పాల్గొన్నారు. వీరిలో 604 మంది మొదటి శ్రేణిలోనూ 2081 మంది ద్వితీయ శ్రేణిలోనూ 4376 మంది తృతీయశ్రేణిలోనూ ఉత్తీర్ణులయ్యారు. హిందూధర్మ రక్షణ సంస్థవారు ఇప్పటి వరకూ నిర్వహించిన ఇలాంటి పరీక్షలలో ఇది నాల్గవది.

(2 వ పేజీ తరువాయి)
సంస్థాన కవిమైన అప్పయ్యకవి రచించిన విష్ణుపురాణ ఆంధ్రానువాదాన్నిగానీ లేదా వెన్నెలకంటి సూరన విష్ణుపురాణాన్నిగానీ ప్రచురించడం ఎంతో అభిలషణీయం.

వేదాంత ప్రభాకరరావు — హైదరాబాదు.

## రామాయణంలో శబరి

'ఆమె పాక తీరికలేని జీవితం కోరికలేని జీవితం; తృప్తికి నోచుకోని జీవితం, ముక్తి చేరువయ్యే జీవితం' ఇలాంటి వాక్యాలతో ప్రారంభమైన రామాయణంలో శబరి' కథ (ఏప్రిల్ సప్తగిరి) చదువరుల హృదయాలను ఇట్టే ఆకర్షించి వేసింది. ఇలాంటి ఉత్తమ శైలిగల రచనల్ని, ఇకముందు కూడా ప్రచురించాలని ఆశ!

మంథా చిరంజీవి, — మద్రాసు

సప్తగిరిలోని వ్యాసాలన్నీ జ్ఞానదాయకాలే! భక్తిసాధనకు ఉపాధులే!

ఏప్రిల్ సంచికలోని భరతుని భక్తి శబరి రచనలు హృదయాన్ని కదిలించాయి.

ముఖ్యంగా రామాయణంలో శబరి చదువుతూవుండే ఆశ్రమ వాసులసేవ చేసుకొంటూ శ్రీరామ దర్శనం కోసం తహతహలాడుతున్న శబరి మనోనేత్రాలకు దృశ్యమానమై ఒడలు జలదరించింది.

ఓ. సుబ్బయ్య — కడప.

## శ్రీవారి తీర్థము

తిరుమలేశుని దర్శనభాగ్యం పొందిన తర్వాత యాత్రికులు శ్రీవారి తీర్థమును ఆలయములో పొంది, తమ ఇండ్లకు తీసుకొని వెళ్ళటం అనాదిగా వస్తున్న సంప్రదాయం. భక్తులు, ఆతీర్థమును ఎంతో పవిత్రముగా నుంచి, మంచిరోజులలో, సత్యనారాయణ వ్రతముతోపాటు శ్రీవారి తీర్థపూజ చేసుకొని సేవించటం ఆచారం. అయితే ఈ మధ్య తిరుమల వెళ్ళిన వారికి ఆలయములో తీర్థము లభ్యంకావడంలేదు. తీర్థమును పంచి యిచ్చే పద్ధతిని దేవస్థానమువారు ఎందుకు వదలివేసినారో తెలియదు.

శ్రీవారి తీర్థము దేవాలయ ప్రాంగణములోనే, (లడ్డూ లమ్మే చోట) లభ్యమయే ఏర్పాట్లు చేయవలసిందిగా దేవస్థానంవారికి విజ్ఞప్తి చేస్తున్నాను.

వెంకరమ్ భూమారెడ్డి — కోమకొండ



అనివార్య కారణాలవల్ల ఈ నెల సప్తగిరిని ఆలస్యంగా విడుదల చేస్తున్నందుకు చింతిస్తున్నాము. సం॥

(4 వ పేజీ తరువాయి)
వార్తాప్రసారణంవల్ల సమాజంలో వివిధ అంగాలు దోషనివృత్తి చేసుకొని విజ్ఞానవంతాలౌతాయని, రాజైనవాడు ఈ వార్తా నిర్వహణం చేయాలని నీతికోవిదులు నిర్దేశించారు. ఈ రెండూ సక్రమంగాలేని రాజ్యాలు ఎలా పతనమైనవన్న విషయానికి చరిత్ర పుటలలో సాక్ష్యం వుంది.

రాజులు, రాచరికాలు కాలప్రభావంవల్ల రద్దయి పోయినై. కాని సమాజ మూలధర్మాలకు, సామాజిక విజ్ఞానవిస్తరణకు వాటి ఆశయాలకు ఏవిధమైన మార్పురాలేదు. అందువల్ల అధికారికమైన యంత్రాంగపు, వార్తావిశ్లేషణ ప్రసారణాలు పాక్షికంగానే వుండే అవకాశం వుంది గనుక తద్భిన్నంగా సమాజంలో జరిగే పరిణామాలను బహిర్గతంచేసి న్యాయవిచారణకు ప్రోత్సహించే పటిష్ఠమైన ప్రసారవ్యవస్థ అవసరం కావటమే ఫలితులపరంగా పత్రికారంగ వ్యవస్థాపనకు ప్రారంభం. లిపిబద్ధమైన భాష విస్తృతమైన కొద్దీ, ప్రసార విధానాలలో నూతనత్వం ఏర్పడటం, లిఖితసందేశపత్ర విధానానికి బదులుగా వార్తలకు యాంత్రిక ప్రక్రియలద్వారా ప్రజలకందించి వారిలో సామాజికస్పృహ, తాము నిర్వహించవలసిన ఉత్తమకర్తవ్య ప్రబోధం కల్గించి దుర్మార్గాన్ని ప్రతిఘటించే పటిష్ఠశక్తిగా, సమాజాన్ని రూపొందించే ఆశయంతో నిర్వహణ శక్తి యుక్తులు దీక్షగలవ్యక్తులతో వ్యవస్థలు ఏర్పడి పత్రికారంగ విస్తృతికి దోహదం చేశాయి.

ఇలా వివిధ పరిణామాలు పొందిన పత్రికా చరిత్రలో అనేక రంగాలకు చెందిన చిన్న, పెద్ద పత్రికలనేకం వచ్చి కాలగర్భంలో కొన్ని కలిసిపోతూవున్నా అన్నిటి ముఖ్యాశయం తమధ్యేయాను గుణమైన వార్తాహరణ ప్రసారణాలు తద్ద్వారా ఆ విషయంలో ఆసక్తిగలవారికి జిజ్ఞాస పెంపొందించటం.

ఇలా రాచరిక వ్యవస్థ నుండి సామాజిక నిర్వహణల వరకూ వార్తానిర్వహణల విధానం మారుతూవచ్చినా, మూలధర్మం మానవస్వభావ పరిగణన, వికాసవిన్యాసం సమాజమంతటి అనాదిని కనుకనే నాటి వార్త నేటి వ్రత (పత్రికా) రూపంలో మూడు పూవులూ, ఆరుకాయలుగా ముందుకు సాగిపోతున్నది. ఆధ్యాత్మికంగా 'సప్తగిరి' కూడా ఈ బాటనే పయనిస్తూ అందరికి వందనాలర్పిస్తూ మరొక్క మజిలీకి సాగుతున్నది

Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press, by M. Vijayakumar Reddy, L.P.T., Manager, T.T.D. Press, Tirupati.

జూలై 1983
వెల: 1-00



# సప్తగిరి



తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాసపత్రిక



## ధన్యాసి

చదివెబో ప్రాణి సకలము యీ—
  చదువుమీఁది విద్య చదువ డాయఁగాని.

సిరులు చంచలమని చేఁత లధ్రువమని
  పరగుసంసారము బయలని
  తొరలినసుఖమెల్ల దుఃఖమూలమని
  యెరిఁగి లోభమువీడ నెరఁగఁడాయఁగాని.

తలకొన్నధర్మమే తలమీఁదిమోఁపని
  ఫలసీనొల్లమి దైవవశమని
  కలిమియు లేమియుఁ గడవఁగరాదని
  తెలిసి లోభమువీడఁ దెలియ డాయఁగాని.

యేచిన పరహితమెంతయుఁ దమదని
  వాచవులిన్ని నెవ్వగలని
  యీచందమున వేంకటేశుచేఁతలని
  చూచి లోభమువీడఁ జూడడాయఁగాని.

— శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యుల అధ్యాత్మ సంకీర్తన.



# మీ మాట

## సీరియల్స్

ఏప్రిల్‌మాసం నుండి 'శ్రీ మద్భగవద్గీత' సీరియల్ ప్రారంభించటం గొప్ప పుణ్యకార్యంగా భావిస్తున్నాను. దీని మూలంగా ఎంతోమంది అప్రయత్నంగా గీతాధ్యయనం చేసేందుకు మీరు కారకులైవారు. అదేవిధంగా శ్రీమద్భాగవతం, శ్రీమద్రామాయణం కూడా సీరియల్‌గా ప్రచురించగలరని ఆశిస్తున్నాను.

టి. రామారావు — హైద్రాబాదు.

## ఫోటోలు

మన దేశంలో గల ప్రముఖ పీఠాధిపతుల, స్వాములవారి ఫోటోలను ఒక్కొక్క నెలకు ఒక్కటిగా వారివారి సూక్తులతో ప్రచురించవలసిందిగా కోరుతున్నాను.

పి. మాధవి — సిరిసిల్ల.

## కరావలంబ స్తోత్రము

'శ్రీ లక్ష్మీ నృసింహ మమ దేహికరావలంబమ్' అనే స్తోత్రాన్ని సప్తగిరిలో ప్రచురిస్తే నావంటి పాఠకుల కెందరికో ఉపయుక్తం అవుతుంది.

కె. నరసింహారావు — కంచనపల్లి

## మూఢనమ్మకం కాదా?

మే '83 సంచికలో 'నేను నాస్తికురాలినా' అనే శీర్షికలో శ్రీమతి నన్నపనేని రాజకుమారిగారి అభిప్రాయాలు చదివాను. ఆమె ఒక సందర్భంలో నేను మూఢనమ్మకాలకు వ్యతిరేకినంటూనే తాను రుక్మిణీ కల్యాణం చదివినంత మాత్రాన మంచి భర్త లభించారని అన్నారు. ఇది మూఢనమ్మకం కాకుంటే ఏమిటండీ? రుక్మిణీ కల్యాణం చదివినంత మాత్రాన మంచి భర్త లభిస్తాడనుకోవటం పచ్చి మూఢనమ్మకం అని నేనంటాను.

కె. ఉమేష్‌రెడ్డి — ఆదిలాబాద్

[చదవటం వల్లే 'కాబోలు' అన్నది ఆమె వాక్యం. సం॥]

## షిర్డీసాయి

మే 1983 సప్తగిరిలో 'షిర్డీసాయిబాబా' ప్రచురించినందుకు చాలా సంతోషం. రచన ఎంతో బాగుంది. రచయిత శ్రీ ఎల్లంరాజు వెంచు సుబ్బారావుగార్కి నా అభినందనలు.

కురుగంటి హైమవతీదేవి — గుంటూరు.

## స్మృతులు

మనుస్మృతి, దక్షస్మృతి గృహ్యసూత్రాలు తదితర ప్రాచీన స్మృతి విజ్ఞానానికి సంబంధించిన వ్యాసాలను సప్తగిరిలో ఎందుకు ప్రచురించటం లేదు?

బి. జయప్రద - ఏలూరు

---

## ఒంగోలు - రేణిగుంటలకు 15 నుంచి ప్యాసింజర్ రైళ్లు

హైదరాబాద్, జూలై 11: దక్షిణమధ్య రైల్వేలో ఒంగోలు, రేణిగుంట స్టేషన్లమధ్య డైరెక్టు ప్యాసింజర్ రైలు సర్వీసుకల్పించే ఉద్దేశంతో నెం 440/439 గూడూరు పాసింజర్ రైళ్ళు ఈ నెల 15వ తేది శుక్రవారం నుండి ఒంగోలు నుంచి రేణిగుంట వరకు నడుస్తాయి. ఇప్పుడు ఇవి ఒంగోలు నుంచి గూడూరు వరకే నడుస్తున్నాయి.

నెం 440 ఒంగోలు - రేణిగుంట ప్యాసింజర్ రైలు, ఒంగోలు నుంచి గం॥ 4-40 నిముషములకు బయలుదేరి గం॥ 12-25 నిముషములకు రేణిగుంట చేరుతుంది. అదే విధంగా నెం 439 రేణిగుంట, ఒంగోలు పాసింజర్ రైలు రేణిగుంట-నుంచి గం॥ 14-05 నిముషములకు బయలుదేరుతుంది. ఈ కారణంగా నెం 426/447 గూడూరు రేణిగుంట పాసింజర్ రైళ్ళు ఈ నెల 15వ తేదీనుంచి రద్దు అవుతాయి.

12-7-83 తేది 'ఈనాడు' వార్త

---

## ఆగష్టు 1983 సంచికలో:

**దేవాలయాలపై బొమ్మ లెందుకు?**

డా॥ దేవరకొండ శేషగిరిరావు.
పరిశోధనావ్యాసం.

**గీతాచార్య -**
(ఏకపాత్రాభినయం)

శ్రీ బి. ఎల్. ఎన్. ఆచార్య రచన.

**లీలాశుకుని బాలగోపాలుడు**

కరుణశ్రీ కమనీయ సచిత్ర కథనం.

ఇవిగాక వెలుగుబాట, యువవాటి, బాలప్రబోధం ఇత్యాది మామూలు శీర్షికలు.

తప్పక చదవండి!



# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాస పత్రిక...


గౌరవసంపాదకులు.

శ్రీ జి. కుమారస్వామిరెడ్డి,
ఐ. ఏ. ఎస్.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

ప్రచురణకర్త - సంపాదకుడు:
కాట్రపాటి సుబ్బారావు,
ఎమ్. ఎ.

ఉపసంపాదకుడు:
తిరుమూరు సుధాకర్ రెడ్డి,
ఎమ్. ఎ. బి. ఇడి.

ముద్రాపకుడు:
ఎమ్. విజయకుమార్ రెడ్డి.

విడిప్రతి-రు. 1-00

సం॥ చందా-రు. 12-00

ప్రతులకు:
వెల్ ఫేర్ ఆఫీసర్,
టి. టి. డి., తిరుపతి


## ఈ సంచికలో....


జూలై 1983

సంపుటి 14 సంచిక 2




ముఖచిత్రం: తిరుమలలో శ్రీవారి ఆనివర ఆస్థానోత్సవం.

# సంపాదకీయం

ప్రపంచంలో 'గురు'శబ్దం ఉపాదుకున్నంత లఘువుగా ఏవారూ లేదేమో? విశ్వసాహిత్యంలోనూ, జనజీవనంలోనూ ఇటీవలికాలందాకా 'గురు' లేదా తత్తుల్య శబ్దానికి ఎంతో ప్రాధాన్యం వుండేది. భారతీయవాఙ్మయమంతా కూడా గురువును కేవలం విద్యాబోధకునిగా మాత్రమేగాక త్రిమూర్తి స్వరూపంగా ఆరాధించింది.

పశుపక్ష్యాది ప్రాణికోటికన్నా మానవజన్మ భిన్నమైనదని నిరూపించే జ్ఞానప్రదాత కనుక గురువు బ్రహ్మస్వరూపుడు. అనంతమైన విజ్ఞానాన్ని ఏ ఒక్కరికోగాక పదిమందికీ అమృతసమానంగా పంచాలనే వ్యాపనశీలం గలవాడు కనుక గురువు విష్ణుస్వరూపుడు. అనంతమైన జ్ఞానశక్తితో మానవునిలోని అంధకారాన్ని నిరోధించి, నివారించే అజ్ఞానసంహారక తత్త్వం కలవాడు కనుక 'మహేశ్వరుడు'. ఈ ధర్మాన్నే 'గు' శబ్దం అంధకారమని, 'రు' శబ్దం తన్నిరోధకమని, అజ్ఞానాంధకారాన్ని పోగొట్టేవాడు గనుక గురువనీ, పరబ్రహ్మ స్వరూపమనీ మన వాఙ్మయం వివరించింది.

ఇంతటి ఉత్తమభావాన్ని వర్ణించి చెప్పే పదజాలం అన్నిభాషలలోనూ, ముఖ్యంగా మనమే సన్నిహితమైన ఆంగ్లంలో వుంది. టీచర్, లెక్చరర్,మాస్టర్ ఇలా ఉన్న అన్నిపదాలలోనూ 'మాస్టర్' అనే శబ్దాన్ని మన వాఙ్మయంలోని గురుశబ్దతుల్యంగా భావించవచ్చు. అంటే శాసకుడు, అధికారి. శిష్యునికి ఏదిమంచో ఏదిచెడో వివరించి చెప్పే అధికారం కలిగినవాడు. అందువల్లనే విశ్వసాహిత్యంలో గురువుకు ఎప్పుడూ ఒక ఉత్తమస్థానం వుంది. ఇది లౌకిక విషయాలకూ, ఆధ్యాత్మిక విషయాలకూ కూడా వర్తిస్తుంది. తానార్జించిన విజ్ఞానాన్ని ప్రబోధించి, పరమాత్మావిష్కారానికి దోహదం చేయటమే గురువులక్ష్యం. రామాయణంలో ఆంజనేయులవారిని ఇలాంటి గురువుగా భావించటం గమనించదగ్గది. రామాయణాన్ని ప్రపత్తికావ్యం అనటంలో విశేషం ఆత్మ పరమాత్మను చేరేందుకు చేసేప్రయత్నంలో గురువుపాత్రను ఆంజనేయస్వామి ద్వారా నిరూపణ చేయటం, గురు ప్రాధాన్యాన్ని వివరించటమే నని అంటారు.

ఆత్మదర్శన విద్యలో గురువువయస్సుతో నిమిత్తంలేదని, జ్ఞానమే ప్రమాణమనీ, బోధన, భాషణ ద్వారానే కానక్కర లేదని "గురోస్తుమౌనం వ్యాఖ్యానం శిష్యాస్తుఛిన్నసంశయాః" అనే సూక్తి వివరిస్తోంది.

గురువు కేవలం బోధకుడు మాత్రమే కాదు. శిష్య హితకారికూడా. అందువల్లనే ఆయనను పురోహితుడు అనికూడా అన్నారు. సురగురువు బృహస్పతి, అసుర గురువు శుక్రుడు, మానవులలో, విశ్వామిత్రుడు, వశిష్ఠుడు తమను నమ్మిన వారి హితాన్ని త్రికరణశుద్ధిగా కోరి వారి, వారి అభ్యుదయానికి ఎలా తోడ్పడ్డారో మన పురాణాలవల్ల తెలుస్తోంది.

సరైన గురుసహాయం లుప్తమైగాని, అహంకారంతో దాన్ని అర్థం చేసుకొనకగాని చెడిపోయిన వారికి దృష్టాంతం రామాయణంలో వాలి, రావణుడు, భారతంలో దుర్యోధనుడు, శిశుపాలుడు.

గురు విశ్వాసానికి పాత్రులై ఉన్నతిని పొందినవారు పాండవులుకాగా, గురువునుండి వంచనద్వారా విద్యను పొంది గురుకోపానికి గురైనవారు భారతంలో కర్ణుడు, ఏకలవ్యుడు. మన సాహిత్యంలో ఇలాంటి దృష్టాంతాలెన్నో వున్నై.

కానీ యీనాడు గురుశిష్య సంబంధం ఎలా వుందన్నది మనం గుండెమీద చేయివేసుకు ఆలోచించాల్సిన విషయం. ఈ విశ్వవలయంలోనే ఒక విలయం తాండవిస్తున్నది. నైతిక, సామాజిక విస్పృహలవల్ల గురుశిష్యులిద్దరిలోనూ శ్రద్ధ, జిజ్ఞాసలు లోపిస్తున్నవి. విద్యను ఉపాధిమాత్రంగా గాక విద్యను విద్యగా నేర్చుకునేందుకు నిజమైన తృష్ణ గుడిలోని బడులనుండి ప్రారంభమైతే, కాలక్రమాన గుడిలాంటి బడులు విస్తృత పరిధిలో వెలసే అవకాశం వుంది. అంతవరకు మిగిలేది వీటిని గూర్చిన కలలే-కలలు!

# మహాభారత సావిత్రి

— శ్రీ తాతపూడి బ్రహ్మానందశాస్త్రి

వింటే మహాభారతం వినాలి. తింటే గారెలే తినాలని నానుడి. మహాభారతం పఠించడం వలన స్వయంకృత పాపహరణము- ఐహికాముష్మికప్రాప్తి కలుగును.

పంచమవేదమనబరగు యీ మహాభారత పుద్గ్రంథమున స్వర్గారోహణ పర్వములో చివరగా 'మహాభారతసావిత్రి'యను చిన్నప్రకరణము కలదు. ఇందు శ్రీ మహాభారత సారమును నాలుగు శ్లోకములలో యిమిడ్చినాడు వ్యాసభగవానుడు. వేదములసారము సావిత్రిగా విరాజిల్లినట్లు ఇది పంచమవేదమైన శ్రీ మహాభారతము యొక్క సారమేనని విబుధులు వాక్రుచ్చారు. దీనినే మహాభారత మాహాత్మ్యం అనికూడ అనవచ్చు. సావిత్రీ మహాసాధ్వి మనకు ఉపాసనీయమైన దేవతయినట్లు యీ భారతసావిత్రిని కూడా నిత్యము ఉపాసించి ముక్తిబడయవచ్చు.

మహాభారతము పూర్తిగా చదువలేని వారు యీ ప్రకరణమును నిత్యపూజా కార్యక్రమముతోబాటు పారాయణ చేసిన మోక్షప్రాప్తి కల్గును. జననమరణ భూయిష్ఠమైన యీ సంసార బడబాగ్నిలో సమిధలై మండుచున్న సామాన్య మానవులకు నిత్య శాంతిసాధనమై బరగుచుండును.

ఇందు మొదటి శ్లోకము వైరాగ్యమును, రెండవది ఆత్మజ్ఞానఫలము, మూడవది ధర్మాచరణము, నాల్గవది ధర్మార్థమోక్షములను కల్గించి సాధకులు యిహపరసుఖములను పొందగలరు.

మాతాపితృ సహస్రాణి, పుత్రదార శతానిచ
సంసారేష్వను భూతాని, యాన్తి యాస్యన్తిచాపరే!

కాలచక్రంలో చావుపుట్టుకలు సహజం. తన తన పూర్వజన్మ కర్మానుభవ ఫలితంగా జీవుడు ఎన్నో యోనుల నుండి పుట్టుతూ, ఎన్నో దేహములను విడుస్తూ ఎందరో జీవులు తండ్రులుగనూ, తల్లులుగనూ, భార్యలుగనూ, పుత్రులుగనూ, పుత్రికలుగనూ పుట్టుతూ, వాళ్లు నావాళ్లని, నాది నేనను అహంకారముతో మమతానురాగ బంధములతో బ్రతుకుతూ రాగల జన్మల్లో ఎందరో తల్లితండ్రులు భార్యాపుత్రులను సంపాదిస్తూ సంసార లంపటములో చిక్కుకుని మసగల్గుతున్నాడు.

దారసుతాదులు, ధనధాన్యములు మానవునకు దాటరాని బలితపు పాశంబులు- అవసానకాలమునందు ఎవరినీ అంటవు. కాని, ఇదినాది, నావల్లనే అంతా నడుస్తున్నదనే ధీమాతో మానవుడు ఎన్నో పాపములను చేస్తున్నాడు. కామక్రోధ లోభ మోహమద మాత్సర్యములతో నిండిన సంసార సాగరములో కొట్టుమిట్టాడుతూ, ఆత్మజ్ఞానమను తీరంచేరలేక అశాంతితో జీవిస్తూ గిట్టుతున్నాడు. ధనవంతుడు అధికధనముతో కూడిన చెడు అలవాట్లతోనూ, ధనహీనుడు బ్రతుకుతెరువు కోసం మనోవ్యాకులతపడుతూనో ఏదోవిధముగా చనిపోతున్నాడు. 'పునరపిజననం, పునరపిమరణం' అనుభవిస్తున్నాడు.

హర్షస్థాన సహస్రాణి
భయస్థాన శతానిచ
దివసే దివసే మూఢ
మావిశన్తి నపణ్డితమ్.

మానవునకు శాంతిలేదు. త్యాగబ్రహ్మ నుడివినట్లు 'శాంతము లేకా సౌఖ్యము లేదు-' నిద్రమేల్కాన్న లగాయతు నిద్రించేవరకూ తాపత్రయపడుతూ, నిత్యము జరిగే కొన్నిటికి అమితానందము పడుతూ, కొన్నిటికి దుఃఖపడుతూ, మనఃక్లేశముతో సతమతమవుతూ, ఈర్ష్యపడుతూ, జుగుప్సపడుతూ అశాంతితో అతలాకుతలమగుతున్నాడు. కాని దేహానికి అతీతమైన ఆత్మతానేనని వ్యవహరించే మహాత్ములు ఈ దుఃఖ సంతోషములతో సంబంధము లేకుండా నిత్యమూ శాంతచిత్తులై విరాజిల్లుతున్నారు.

ఊర్ధ్వబాహు ర్విరామ్యేష నచకశ్చిచ్ఛృణోతిమే
ధర్మాదర్థశ్చ కామశ్చ సకిమర్థం నసేవ్యతే!

నేను చెప్పేది ఎవరూ చెవినిపెట్టడం లేదు. చేతులెత్తి గొంతుచించుకుని ధర్మబోధ చేసినా చెవిటివానికి శంఖము వూదినట్లే యగుతున్నది.

నామాట వినండి. అన్యాయార్జనవల్ల కల్గేది పాపము, దుఃఖము. తనెంత సంపాదించిననూ ఆ సంపాదన అన్యాయమైన నిలవదు. ఖర్చులరూపంలో, రోగముల రూపేణా ఖర్చయి నిత్యమూత్న దరిద్రమేర్పడుచున్నది. అధర్మమువైపు కన్నెత్తి చూడకుండా న్యాయమార్గమున, ధర్మమార్గమున పయనించిన నీ ధర్మగుణమే నిన్ను రక్షించును. నీ న్యాయమార్గమే కీర్తిని కల్గించి, ఆ కీర్తిఫలితముగా ధనలాభము, ధనము వలన ఇహలోకమున అధర్మ విరుద్ధమగు భోగానుభవము, పరసుఖహేతువగు సత్కార్యాచరణము సిద్ధించును. ఋజువర్తనుడై ధర్మమార్గప్రయాణీకునకు శాంతి! సౌఖ్యములు కల్గును.

నజాతు కామాన్నభయాన్నలోభాత్
ధర్మం త్యజేజ్జీవిత స్యాపి హేతోః
నిత్యో ధర్మః సుఖ దుఃఖే త్వనిత్యే
జీవో నిత్యోహే తురస్యత్వ నిత్యః.

మానవుడు కామక్రోధలోభ మోహమద మాత్సర్యముల అరిషడ్వర్గముల లంపటములో చిక్కి, అనిత్యమైన భయభ్రాంతులకు గురై, నిత్యమైన ధర్మము జోలికి

(44వ పేజీలో)



**రక్షితాలి ముక్తిదేవ, అర్ధ్జాన స్వరూపిణే।**
గంగాపురి నివాసాయ, శ్రీనివాసాయ మంగళం॥

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండగు వైకుంఠవాసుండు, కర్మభూమి యగు భరత ఖండమున భక్తులను తరింపజేయుటకై, కలియుగ వైకుంఠ మనబడు తిరుమలయందు వేంచేసి భక్తుల మనోభీష్టము లీడేర్చుచున్నాడు.

భక్త శిఖామణులలో పేరెన్నికగన్న ముమ్మడి పోతాజీయను విశ్వబ్రాహ్మణ భక్తుడు 16 వ శతాబ్దమునకు పూర్వము ప్రతి 'మాఘ పూర్ణి'మకు తిరుమలేశ్వరుని 7 సం॥ నుండి సేవించుచుండెను. కొంతకాలమునకు శరీర అనారోగ్య కారణముల వలన తిరుపతికి వెళ్ళలేక దుఃఖించుచుండగా, శ్రీ స్వామి వారు స్వప్నమున గోచరించి "నేను మరుసటి రోజున సర్పరూపమును ధరించి రాగలను. నీవు దానిని మూడు ముక్కలు జేయుము. పడగ తోకలు అతుకుకొని పోగలవు. మధ్యభాగమును కుండలో నుంచి, దానిలో కొంత ధాన్యమును పోసి మూత యుంచవలయును. దానినుండి నీకు కావలసిన వస్తుసామగ్రి వెడలగలదు. దానిని వినియోగించి 'గంగాపురి' గ్రామ సమీప మందలి పర్వత పరిసరములందు త్రవ్వించగలవు. నీకు దర్శన మొసగెదనని" తెలిపి అంతర్థాన మయ్యెను. అంతనాతడు స్వప్నానుసారంగా తన గ్రామ సమీప మందలి పర్వత పరిసరము లందనేక స్థలములలో త్రవ్వించగా తుట్ట తుదకొక స్థలమున స్వామివారి "పట్టెనామములు" మెరసినవి. దానినుండి దివ్యజ్యోతి యుగుపించగా త్రవ్వటము నిలిపి దేవాలయ మేర్పరచెను. ఇతః పూర్వము త్రవ్విన నాలుగు గుహలయందు ఇతర దేవతలను స్థాపించి క్షేత్రరాజము గావించెను.

అట్టి క్షేత్రరాజము "సహ్యాద్రి" కుత్తర దిశగా 'ఆసిఫాబాదురోడ్' రైల్వేస్టేషన్‌కు తూర్పున రెండు మైళ్ళ దూరములోగలదు. పూర్వము "సిర్పూర్ – తాండూరు అమల్దారి"గా నున్న రోజులలో తాండూరు జమీందారులకు "భోస్‌లా ప్రభువులు" నాగపూరు వారు స్వామివారి శాశ్వతపూజలు జరుపునిమిత్తము అధికారములు సంక్రమింపజేసిరి. జమీందారులు పూజారులుగా నియమించిన బ్రాహ్మణులను "గంగాపురి వారు" అని పిలుచు చున్నారు.

తిరుపతియందు స్వామివారు ఏడు కొండల యందుండగా, గంగాపుర మందు ఒక కొండపై వెలసెను. తిరుపతి యందలి మహాత్మ్యములో ఏడవ వంతిచట గలదని భక్తుల విశ్వాసము. 'రథసప్తమి' రోజు నుండి 'నవరాత్రములు' ఆరంభమై 'మాఘపౌర్ణిమ' రోజున సాయంత్రి వైభవోపేతముగా, నదియందు రథోత్సవములు జరుగును. ఆనాటి వైభవములను దర్శించుటకుగాను జనము తండోపతండములుగా వచ్చెదరు. ఆనాటి శోభ అనుక్షణము తిరుపతిని జ్ఞప్తికి తెచ్చును. ఆనాడు స్వామి వారి దర్శనము, తిరుమలేశ్వరుని దర్శనముతో సమానమైనట్టిది.

స్వామివారి ప్రాధాన్యత దెలుపు సన్నివేశము లీ ప్రాంతమందు విరివిగా గలవు. విస్తరభీతిచే నొకదానినే దెలుపుచున్నాము. ఇచటికి పది మైళ్ళ మారుమూల దూరములో గల 'కన్నెపల్లి' అను గ్రామమున 'గట్టు గుండయ్య' అను బ్రాహ్మణునికి ఇరువది ఐదు సంవత్సరములవరకు సంతానప్రాప్తి లేదు. ఎన్నియో నోములునోచి నిరుత్సాహము జెందిరి. తుట్ట తుదకు 'గంగాపురి లక్ష్మీవేంకటేశ్వరస్వామి' వారి వద్దకు వెళ్ళి హృదయపూర్వకముగా నమస్కరించగా, ఆతని సతీమణి అదే మాసము గర్భవతియై, శుభసమయమున పుత్రరత్నమును గనెను. 'వేంకట రమణ' అను నామకరణ

## మన దేవాలయాలు

మొనరించి, స్వామి వారికి మ్రొక్కులు చెల్లించుకొనిరి. బాలునికి మూడవ సం॥వ జబ్బుచేసెను. వైద్యులు పరీక్షించి బ్రతుకజాలడని తెలిపిరి. ఆ బ్రాహ్మణుడు పుత్ర వియోగ మేర్పడనున్నదను బాధలో విధి ప్రకారముగా, ఆ గ్రామమందలి 'వేంకటేశ్వరుని' పూజావిధులను నిర్వర్తించి, తొందరపాటుతో రాగా, ఒక వైష్ణవస్వామి వారు (ఆ గ్రామ పరిసర ప్రాంతము లెచటను వైష్ణవులు లేరు) ఎదురుగా వేంచేసి "నాకు పుట్టు నామములు గలవు, పెట్టునట్టి నామములుగావు, ఇదిగో ఈ వేరును నూరి పోసిన మీ చిరంజీవి జీవించగలడని" తెలిపి ఒకవేరు నొసంగి అంతర్ధానమయ్యెను. వారట్లు చేయగా బాలుడారోగ్యవంతుడాయెను. ప్రస్తుతము ఏడు సం॥ వయస్సు గల్గి చూపరుల నాకట్టుకొనుచున్నాడు. ఆ దంపతులకు ఒకే కుమారుడు కలిగెను. గాని మరల సంతానము కలుగలేదు. ఇట్టి సన్నివేశములు మిక్కుటము గాగలవు. •

— ఎస్. రాజారామశాస్త్రి

చావుపుట్టుకలు ఐచ్ఛికం కానీ యాదృచ్ఛికం కానీ కావంటుంది మన వేదాంతం. మృత్యువు విధినిర్ణయం అనుకుంటే దానిని ఎదిరించటం ఎంత వృధానో చెబుతుందీకథ. సం॥

# మృత్యుర్ధావతి పంచమః

— శ్రీ చిట్టా దామోదరశాస్త్రి

కాశీరాజ్యాన్ని శాంతికాముడు పాలిస్తున్నాడు. ఆ రాజు వేటకు వెళ్ళి అలసి సొలసి ఓ కొలను ఒడ్డున చెట్టునీడన కూర్చున్నాడు. ఎండ మాడ్చేస్తోంది. ఆయనకు ప్రకృతి చిత్రంగా కన్పించింది. ఆలోచిస్తూ ఉండిపోయాడు. తాను కూర్చున్నచోట గాలి చల్లగా వీస్తోంది. తల ఎత్తి చూచాడు. పెద్ద మర్రిచెట్టు కన్పించింది. అంత పెద్దచెట్టుకు మూలం ఎంత చిన్న విత్తు! అడవిలో చెట్లను ఎవరు నాటుతున్నారు! ఎవరు నీళ్లుపోసి పెంచుతున్నారు? కాని...కాని... నశించిపోయేనాటికి ఎవడో ఒకడు యమ కింకరుడు లాగా వచ్చేస్తాడు.

ఏదో 'టప్పు' మని నేలమీద పడింది. పడుతూన్నప్పుడు, పసుపు పచ్చటి ఆకు - పండి రాలుతూంది కాబోలు - లీలగా కన్పించింది. తానేదో ఆలోచిస్తూ పరీక్షగా గమనించలేదు. పండుటాకు రాలటం సమంజసమే కాబట్టి దాన్ని గురించి ఆలోచించలేదు. ఐనా తర్కించే స్వభావం కాబట్టి 'ఆ ఆకు నేలరాలటానికి కారణం ఎవరు? అని ఆలోచించ సాగాడు. అప్రయత్నంగా 'కాలం మూడింది' అని నోటివెంట వచ్చింది. సరిగా అప్పుడు చిరుగాలి వీచింది. 'గాలికే ఆకు రాలిందేమో!' అనుకొన్నాడు.

కాశీరాజు పడిన ఆకువంక చూచాడు. ఆకు కదుల్తోంది. 'గాలికి-కాబోలు!' అనుకొన్నాడు. కదిలేది ఎలుకపిల్ల. 'ఆకేమైంది? పడింది ఆకు కాదా? పడి ఎగిరిపోయిందా? అంత పెద్ద గాలి రాలేదే' అనుకొంటూ ఉండగా .... ఆ ఎలుకపిల్ల పెద్దదిలాగా కనిపించింది. రాజాశ్చర్యపోయాడు. తనకు ముందు ఎలుక పిల్లలాగా కనిపించింది, కాని అది పెద్ద ఎలుకే. అయిఉంటుందని సరిపెట్టుకొన్నాడు. కాని ఇంతలో సరిపెట్టుకోవటానికి వీలులేని సంఘటన జరిగింది. ఆ ఎలుకను ఓ పిల్లి కబళిద్దామని చూస్తోంది. ఎలుక పారిపోతుందనుకొన్నాడు రాజు. ఎలుక పారిపోతే ఆశ్చర్యం లేదు. ఎలుక పిల్లి కెదురు తిరిగింది. పిల్లి పారిపోతోంది. వెంట పడేది ఎలుకేనా? అంత పెద్దగా ఉందే! అది కుక్క పిల్లకాదుగదా! పండిన ఆకు రాలి ఎలుక కాగా ఎలుక కుక్క కావటం ఏమాశ్చర్యం?

శాంతికామునకు ఒక్క క్షణం పాలుపోలేదు. 'ఎలుక ప్రాణభయంతో పారిపోగా వేరొక చోటినుండి వేటకుక్క ఉరికిందేమో!' అనుకొన్నాడు. పిల్లి బల్లిలా ఒదిగింది. కుందేలులా కుప్పించింది. ఐనా ఫలితం లేక పోయింది. పిల్లి గాలిలో ఉండగానే వేటకుక్కకు ఉపాహారమైంది.

ఇది కాదు ఆశ్చర్యం. వెనకనుంచి ఒక బాణం రివ్వున దూసికొని వచ్చింది, గాలి కంటే వేగంగా, ఇది నీ దారి అని కుక్క ప్రాణానికి చూపించటాని కన్నట్లు! అద్భుతమేమిటంటే ఆ కుక్క చనిపోయిన దాఖలా లేదుగాని ఆ చోట ఓ అందమైన ఆడపిల్ల ఒళ్లు విరుచుకొంటూంది. ఆ బాణం వేసింది ఈ వింటితోనే అన్నట్లు విల్లు చేత్తో పుచ్చుకొని అక్కడికి ఓ వేటగాడు వచ్చాడు. ఆ పిల్ల లేడిపిల్లలాగా పారిపోతుందేమో అనుకొన్నాడు కాశీరాజు. ఆమె పారిపోలేదు సరికదా, ఉరికింది వేటగానిమీదకు. వాడు విల్లు పారేసి ఆమెను రెండు చేతులా వాటేసుకొన్నాడు. ఆమె వాడిమీద ప్రేమతోనే ఉరికిందేమో! లేకపోతే వాడు విల్లెందుకు పారేస్తాడు?

'ఇంతవరకు కథ బహిరంగంగా నడిచింది. ఇక ఇది పొదలమాటుకు మారుతుం'దనుకొంటూ రాజు తల వంచుకొని ఆలోచిస్తూ ఉండగా....'కెవ్వు'మని కేక వినిపించింది. "ఆ మొరటువాని చేతుల్లో ఆ పిల్ల 'హరీ' అన్నదేమో!" అనుకొన్నాడు. కాని జరిగింది అత్యద్భుతం! ఆ వేటగాడు నేల్వ్రాలాడు. ఆ రాజుకు ఒక్క క్షణం మతి మతిలో లేదు. జరిగిందంతా ఒక కలలాగా ఉన్నది. కాని కల కాదని తన కళ్ళ ఎదుట ఉన్న పిల్ల సాక్ష్యమిస్తోంది. ఒక్కటి మాత్రం నిశ్చయమైంది. ఆమె మానవమాత్రురాలు కాదు, మరేదో. ఏదో ఎట్లా తెలుస్తుంది? అతడు రాజు; భయపడి పారిపోలేదు. ధైర్యంగా ముందుకు పోయినాడు.

ఆమె నవ్వింది. రాజు నమస్కరించాడు. 'తల్లీ! నీ వెవ్వరో దేవతవై యుండాలి. గాలివలె ఆకును రాల్చావు. ఎలుకలా పిల్లిని ఆకర్షించావు. కుక్కలా పిల్లిని చంపావు. చంపవచ్చిన వేటగానికి పిల్లలాగా కనిపించావు. ఏనుగులాంటి వానికి ఎదురు దూకావు. పాపం! వాడి కాయువు మూడింది కాబోలు. కొండంతవాడు బెండైనాడు,' అన్నాడు. ఆమె మళ్లీ నవ్వింది. 'రాజా! నీవు చాలా పుణ్యం చేశావు. అందుకే నీకు కనిపించాను. నీవు చెప్పినట్లు నేను దివ్యకాంతనే. అందుకే ఈ వింతలు, విశేషాలున్నూ' అన్నది.

అతనికి తృప్తికలుగలేదు. ఆమె మానవమాత్రురాలు కాదని తానే ఊహించాడు. జరిగినవి వింతలు విశేషాలు అని ఆమె

చెప్పనక్కర లేదు. ఇక ఆమె ఏమి చెప్పి నట్లు? అతడు నిర్భయంగానే ఆమెను సమీపించాడు. 'అమ్మా! నీ వెవరవో స్పష్టంగా చెప్పు తల్లీ!' అని అడిగాడు. ఆమె ఇంకా నవ్వుతూనే ఉంది. ఈసారి ఆమె ముఖంలో జాలికూడా ఉంది. 'ఓ రాజా! సర్వ శక్తిమంతుడైన భగవంతుణ్ణి తెలుసుకోవాలి గాని, అల్పురాల్ని! నన్ను తెలిసికొని ఏం లాభం? ఆ భగవదను గ్రహంతో నిర్దిష్ట కార్యాన్ని నిష్ఠతో చేసే వాళ్ళల్లో చివరిదాన్ని కూడాకాదు. భయంతో వెలిగే అగ్ని, సూర్యుడు; భయంతో లోక పాలనం, పదాగమనం చేసే ఇంద్ర వాయు వులు అగ్రగణ్యులు. పరుగెత్తి పనిచేసే వాడు ఐదవ వాడు....' అని అంటూంది.

కాశీరాజుకు కఠోపనిషత్తు మంత్రార్థం స్ఫురించింది. ఐనా అడుగు ముందు వేయుటం ఆగలేదు. ఆమె అన్నది గదా 'నన్ను నీవు తెలిసికోవలసిన సమయానికి నేనే వస్తాను. ముందుగా చెప్తే మూర్ఛపోతావు' అని. నిర్భయత్వం అతనికి ఒడలితో పుట్టిన గుణం. ఆమె మళ్లీ కనిపించి విశదీకరించే వరకు ఆగదల్చుకోలేదు. అతడు మరి రెండడుగులలో ఆమె పాదసన్నిధిలో ఉండ గలడు. అంతలో ఆమె ఆకాశంలో ఉంది. 'రాజా! నేను మృత్యుదేవతను. భగవం తుని భయంతో పరుగెత్తి పనిచేసే ఐదవ వాడైన యముని బంటును' అన్నది. రాజు ముఖం మెరిసింది. ఆమె 'నీ మనసు లోని మాట నాకు తెలుసు. నీకు మళ్లీ నేను ఎప్పుడు కన్పిస్తానా అనుకొంటున్నావ్. ఇప్పటికి పదకొండు నెలల పదకొండు రోజు లకి.... ఇక్కడ కాదు. ఇక్కడ దక్షిణంగా ఉన్న రాజ్యంలో రాజు కొడుకును చంపి నందుకు ఊరికి ఉత్తరాన ఉన్న ఊడల మర్రి ఉత్తరం కొమ్మమీద' అన్నది.

మృత్యుదేవత అంతర్థానమైంది. రాజు వేదాంతం తెలియని వాడు కాదు. 'పుట్టిన వాడు గిట్టక తప్పదు. అది మృత్యుదేవత చెప్పాలా? రమారమి ఈ సంవత్సరంలో తాను చనిపోతాడు. ఆ చింత తనకు లేదు. నిత్యం యుద్ధ సన్నద్ధుడైన తనకు 'విజ యమో వీరస్వర్గమో' అని తెలియదా? క్రొత్త ఏమిటంటే దక్షిణ దేశంలో ఊరికి ఉత్త రాన ఊడల మర్రి .... అందునా ఉత్తరపు కొమ్మమీద....తనను మృత్యుదేవత పల్కరి స్తుందా? ఇది కాదని నిరూపించ గలిగితే...

కాశీరాజు మనసా సర్వమూ త్యజించాడు. అక్కడనుంచి ఉత్తరంగా బైలుదేరాడు. పగటిపూట ప్రయాణంలో పొరపాటునకూడా తన గుర్రాన్ని దక్షిణం వైపుగా తిరగనీయ లేదు. రాత్రి మబ్బులేని వేళల్లో నక్షత్రాల గుర్తులతో ఉత్తరానికే సాగేవాడు. ఇట్లా కావాలని వీలైనంతగా ఉత్తరానికే పయ నించాడు. గుర్రం నడవలేని కొండప్రదే శాలు ఎదురైనాయి. గుర్రాన్ని వదలి నడక సాగించాడు శాంతికాముడు. పదకొండు నెలలు గడిచాయి. మృత్యు దర్శనానికి మరొక్క రోజుంది. కాని మృత్యు నిర్దిష్ట స్థలానికి ఎంత దూరంగా వీలౌతుందో అంత దూరంగా వచ్చేశాడు. ఇదంతా మృత్యు వును జయించటానికి కాదు. దక్షిణదేశంలో అది జరగకుండా ఉండటానికే....ఈలాగున అతని మనసులో ఆలోచనా తరంగాలు పెల్లుబుకుతూ ఉండగా....

తాను అలకనందా తరంగాలపై తేలి పోతున్నాడు. తాను సూటిగా ప్రయాణం చేయలేక పోతున్నాడు. అలకనంద ఉత్సా హంతో ఉరకలేస్తుంది. ఆహా! తనకు గంగా మధ్యంలో మృత్యు సాక్షాత్కారం! గంగమ్మ పొంగింది. మహా వేగంతో ప్రవహిస్తున్నది. దక్షిణదేశంలో చావవలసిన తాను పవిత్ర బదరీ ప్రాంతంలో చస్తున్నాడు. ఆ రాజు యోగాభ్యాసి. చచ్చేముందు ధ్యాన సమా ధిలో ఉండాలనుకొన్నాడు. ఈదటం మాని నీటిలో పద్మాసనం వేసికొని ధ్యానమగ్ను డైనాడు. కాని ప్రవాహ వేగానికి కొట్టుకొని పోతున్నాడు. అది గ్రహించాడు. తాను ప్రవాహకాష్ఠవత్ కొట్టుకొనిపోరాదు. అతనికి జలస్తంభన స్ఫురించింది. వెంటనే నీటి అడుగుకి వెళ్ళాడు. ఒక రాతిబండ తగిలింది. దానిమీద కూర్చున్నాడు. సర్వశక్తిమంతు డైన భగవంతుణ్ణి ధ్యానించే సమయంలో...

నీటివేగం హెచ్చుతోంది. మహావృక్ష మొకటి సమూలంగా కొట్టుకొని వస్తూంది. సమాధిలో ఉన్న శాంతికాముణ్ణి పద్మాసన స్థితిలోనే పైకి లేపేసింది. అతనికి జాగ్రద వస్థ కలిగే వేళకు వృక్షపంజరంలో రెక్కలు విరిగిన పక్షిలా ఉండిపోయాడు. "నదీనాం సాగరో గతిః" అన్నట్లు గంగా ప్రవాహంలో కొట్టుకొని పోయి పోయి సముద్రం పాలయ్యాడు. సముద్రంలో ఓ విశేషం ఉంది. తనది కాని దానిని తనలో దాచు కోదు. తరంగ హస్తాలతో ఒడ్డు చేర్చేస్తుంది.

[41 వ పేజీలో]




# ముండకోపనిషత్తు

## ప్రథమ ముండకం

## ప్రథమ ఖండం

బ్రహ్మా దేవానాం ప్రథమ స్సంబభూవ
విశ్వస్య కర్తా భువనస్య గోప్తా
స బ్రహ్మవిద్యాం సర్వవిద్యాప్రతిష్ఠాం
అథర్వాయ జ్యేష్ఠపుత్రాయ ప్రాహ.

దేవతలలో మొదటివాడు, విశ్వకర్త, లోకరక్షకుడున్ను అయిన బ్రహ్మ తన కొడుకులలో పెద్దవాడైన అథర్వునకు అన్ని విద్యలకున్ను కుదురైన బ్రహ్మవిద్యను ఉపదేశించాడు.

(ఆత్మతత్వాన్ని క్షుణ్ణంగా తెలిసినవారిలో ముందుగా చెప్పదగినవాడు, వర్ణాశ్రమ ధర్మాలను మానవులకు చెప్పి ధర్మరక్షచేసిన వాడున్ను అయిన ఒక బ్రహ్మర్షి తన శిష్యులలో మొదటివాడు అయిన అథర్వునకు బ్రహ్మజ్ఞానాన్ని బోధించాడు. శిష్యులు కొడుకులవంటివారు కనుక అథర్వుడు శిష్యాగ్రేసరుడై ఆ గురువుకి జ్యేష్ఠ పుత్రుడయాడు.)

2

అథర్వణే యాం ప్రవదేత బ్రహ్మా
అథర్వా తాం పురోవాచాంగిరే బ్రహ్మవిద్యాం
స భారద్వాజాయ సత్యవాహాయ ప్రాహ
భారద్వాజో౽ంగిరసే పరావరామ్.

గురువు ముఖతః తాను గ్రహించిన ఆ బ్రహ్మవిద్యను అథర్వుడు అంగిరునకు వివరించి చెప్పాడు. తరువాత అంగిరుడు భారద్వాజుడైన సత్యవాహునకు ఉపదేశించగా అతడు అంగిరసునకు బోధించాడు. ఈ రీతిగా బ్రహ్మవిద్య వరంపరగా వచ్చింది. (అథర్వునకే అథర్వణుడని వ్యవహారం.)

3

శౌనకో హ వై మహాశాలో౽ంగిరసం
విధివదుపసన్నః పప్రచ్ఛ
కస్మిన్ను భగవో విజ్ఞాతే
సర్వమిదం విజ్ఞాతం భవతీతి.

ఒకానొకప్పుడు శునకముని వంశీయుడైన ఒక ధనవంతుడైన గృహస్థు ఆచారాన్ని అనుసరించి సమిధ చేతపట్టుకుని అంగిరసుని వద్దకు వెళ్లి సవినయంగా నమస్కరించి అడిగాడు. భగవన్! ఏది క్షుణ్ణంగా తెలుసుకుంటే తెలుసుకోవలసేదంతా తెలుస్తుంది?....

(గురువు వద్దకు వెళ్లినప్పుడు ఉత్త చేతులతో వెళ్లకూడదు. ఆత్మవిద్య తెలుసుకోవాలనే సంకల్పముతో బ్రహ్మవేత్త అయిన ఆచార్యునివద్దకు వెళ్లినపుడు సమిధపట్టుకుని వెళ్లాలి అని శాస్త్రం చెప్తుంది. ఆ ఆచారం తెలిసినవాడు కనుక సమిత్పాణియై వెళ్లాడు.

జీవరహస్యం తెలుసుకోవాలంటే ఏది ముందు తెలుసుకోవాలని శౌనకుని ప్రశ్న.)

4

తస్మై స హోవాచ
ద్వే విద్యే వేదితవ్యే ఇతి హ స్మ
యద్బ్రహ్మ విదో వదంతి
పరాచై వాపరా చ.

శౌనకుని ప్రశ్నకు అంగిరసుడు చెప్పినదిది: పర, అవర - అని రెండు విద్యలు తెలుసుకోవాలి- అని బ్రహ్మవేత్తలన్నారయ్యా! (వాటిలో అవరావిద్య అంటే ఏమిటో ముందుచెప్పి తరువాత పరావిద్యను క్రిందివిధముగా చెప్పాడు.)

5

తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదో౽థర్వవేదః. శిక్షా కల్పో వ్యాకరణం, నిరుక్తం ఛందో జ్యోతిషమితి-అథ పరా యయా తదక్షర మధిగమ్యతే.

ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వవేదం- అనే నాలుగు వేదాలున్ను, శిక్ష, కల్పం, వ్యాకరణం, నిరుక్తం, ఛందస్సు, జ్యోతిషం- అనే ఆరున్ను (ఈ ఆరింటికి వేదాంగాలని పేరు. ఇవే ఆరు శాస్త్రాలున్ను) అవర అనే విద్యఅని తెలుసుకోవాలి.

నాశంలేని మూలపదార్థాన్ని తెలిపేది పరావిద్య.

6

యత్తదద్రేశ్య మగ్రాహ్యమగోత్రమవర్ణం
అచక్షుఃశ్రోత్రం తదపాణిపాదం
నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం
తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః.

అవరావిద్యవల్ల తెలుసుకోవలసేది జ్ఞానేంద్రియాలకుగాని, కర్మేంద్రియాలకుగాని సాధ్యంకాదు. కులం, గోత్రం, కన్ను, చెవి, కాళ్లు, చేతులు అనేవి దానికి ఉండవు. రంగు-అంటే-తెలుపు, నలుపు-ఇలాటి రంగు దానికి ఉండదు. అంతటా వ్యాపించి ఉంటుంది. అతిసూక్ష్మమైన పదార్థం అది. దానికి నాశంలేదు. ఏది చెయ్యాలన్నా చెయ్యగల సామర్థ్యం కలది. శాశ్వతంగా ఉండేది, సృష్టికి మూలం అదే-అని తెలిసిన బుద్ధిమంతులు జ్ఞానదృష్టితో చెప్పినమాట ఇది.

7

యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ
యథా పృథివ్యా మోషధయ స్సంభవంతి
యథా సతః పురుషాత్ కేశలో(రో)మాని
తథా౽క్షరాత్ సంభవతీహ విశ్వమ్.

సాలెపురుగులోంచి దారాలు, భూమి నుంచి ఓషధులు, బ్రతికిఉన్న మానవుని నుంచి శిరోజాలూ రోమాలూ పుట్టినట్టు నాశంలేని పరతత్వము (బ్రహ్మ నుంచి) యీ భూతకోటి పుట్టుతూంది.

8

తపసా చీయతే బ్రహ్మ
తతో౽న్న మభిజాయతే
అన్నాత్ ప్రాణో మన స్సత్యం
లోకాః కర్మసు చామృతమ్.

పరబ్రహ్మయొక్క జ్ఞానబలమువల్ల అన్నం ఏర్పడుతుంది. అన్నంవల్ల ప్రాణమూ మనస్సు, సత్యమూ, లోకాలూ, కర్మలూ, కర్మం ఫలమూ కలుగుతాయి.

('తపస్సు'-అంటే జ్ఞానం. బ్రహ్మపదార్థం జ్ఞానంవల్ల తెలియదగినది. ఆలాటి బ్రహ్మపదార్థం ఈ సృష్టికి ఆధారం. దాని నుంచి అన్నం- అంటే మహత్తు కలుగుతుంది. దాని నుంచి ఇంద్రియాలు ఏర్పడతాయి. అవే కనిపించే రూపానికి పనులు కల్పిస్తాయి. ఆ పనులే కర్మలు. వాటివల్ల కలిగే ఫలం ప్రాణులు అనుభవిస్తారు. కర్మఫలం యీ సృష్టిలో ఉన్న ప్రతి ప్రాణీ అనుభవించక తప్పదు.

ఇక్కడ 'అమృతం' - అంటే అర్థం మృతం=నశించేది. అది కానిది 'అమృతం'- అనుభవించక తప్పనిది.)

1

యః సర్వజ్ఞః సర్వవిత్
యస్య జ్ఞానమయం తపః
తస్మాదేతత్ బ్రహ్మ నామ-
రూప మన్నం చ జాయతే.

ఈశ్వరుడు అన్నీ తెలిసినవాడై అంతటా ఉంటాడు. అతని తపస్సు జ్ఞానమయం. ఆలాటి ఈశ్వరుని నుంచే యీ బ్రహ్మ రూపముగా చెప్పదగిన వేదమూ నామ రూపాలూ సృష్టికి పోషకపదార్థాలూ పుట్టుతున్నాయి.

(పుట్టించడం, పోషించడం, తనలోకి చేర్చుకోడం యీ మూడూ అతీతశక్తులు. ఇవి కలవాడు ఈశ్వరుడు. అన్నీ అతని సంకల్పంవల్ల కలుగుతూ ఉంటాయి. కనుకనే అతడు సర్వజ్ఞుడు. ఏది చెయ్యాలి? అని అనుకుని అది చేసి దానికి ఒక రూపమూ పేరూ కలిగిస్తాడు. అది పెరగడానికి సస్యాలు - పోషకపదార్థాలు సృష్టిస్తాడు. ఇదంతా ఆ ఈశ్వరునికి ఒక ఆట.)

*

## ద్వితీయఖండం

తదేతత్ సత్యం
మంత్రేషు కర్మాణి కవయో యాన్యపశ్యన్
తాని త్రేతాయాం బహుధా సంతతాని
తాన్యాచరథ నియతం సత్య కామా
ఏష వః పంథాః స్వకృతస్య లోకే.

ముందుచూపుగల మహర్షులు మంత్రాలలో కనుగొన్న కర్మలు వేదాలలో విస్తరించి అనేక విధాలుగా ఉన్నాయి. సత్యమునే ప్రధానముగా పాలించే కోరికగల బుద్ధిమంతులారా! ఆ కర్మలను మీరు తప్పక చెయ్యండి. ఈ లోకమందు చేసిన కర్మలకు తగిన ఫలం అనుభవించడానికే ఇదే మార్గం. ఈ మాట ముమ్మాటికీ నిజం.

(అగ్నికార్యం, సత్యవ్రతం మొదలైనవి యీ లోకములో తప్పక చెయ్యవలసే వైదిక కర్మలు. వాటిని చక్కగా చేసినవారు ఇక్కడే మంచి ఫలం అనుభవిస్తారు. వాటి వల్లనే పరబ్రహ్మను తెలుసుకోవడం అవుతుంది. ఈ భూమి కర్మభూమి, ఋషులు చెప్పినదే వేదంలో వివరంగా ఉంది. చెయ్యవలసేది చెయ్యక 'అదికావాలి ఇదికావాలి' అని ఆరాటపడి ప్రయోజనంలేదు.)

2

యదా వేలాయతే హ్యర్చిః
సమిద్ధే హవ్యవాహనే
తదాజ్యభాగావంతరేణాహుతీః
ప్రతిపాదయే చ్ఛ్రద్ధయా హుతమ్.

అగ్ని బాగా రాజుకుని మంటలు పైకి చిమ్ముతూన్నప్పుడు ఆజ్యభాగాలుగా ఉంచుకున్న ఆహుతులను ఆ అగ్నిలోవేసి తరువాత హోమం పూర్తిచెయ్యాలి. ఈ అగ్నికార్యం శ్రద్ధగా చెయ్యాలిగాని వెట్టి పనిగా చెయ్యకూడదు.

(దివ్యశక్తులుగల దేవతలందరూ అగ్ని యందు హోమంచేసిన పదార్థమును అగ్ని ముఖంగా పొంది సంతృప్తినీ సంతుష్టినీ పొందుతారు. అగ్నికార్యం చేసినవానికి మంచి ఫలం ఇస్తారు. కనుక దేవప్రీతికై అగ్నికార్యం శ్రద్ధగా చెయ్యాలి. పొగ లేకుండా బగబగమండుతూన్న అగ్నిలోనే హోమం చెయ్యాలి. అంటే అగ్ని సమిధలతో బాగా రాజుకోవాలని అర్థం. పొగలోవేసిన **ఆహుతి నిష్ఫలం.)**

3

యస్యాగ్నిహోత్రమదర్శ మపౌర్ణమాసం
అచాతుర్మాస్య మనాగ్రయణ మతిథివర్జితం చ
అహుత మవైశ్వదేవ మవిధినా హుత
మాసప్తమాన్ తస్య లోకాన్ హినస్తి.

అమావాస్య, పౌర్ణమి, చాతుర్మాస్యం, క్రొత్తపంట ఇంటికివచ్చే కాలం, ఈ సమయాలలోను, అతిథిసత్కారముతోను, భూతబలులతోను, చెయ్యవలసే విధిని అనుసరించి అగ్నికార్యం చెయ్యాలి. అలాగు చెయ్యనివానికి ఏడులోకాలకు సంబంధించిన ఫలం చెడిపోతుంది.

4

కాళీ కరాళీ చ మనోజవా చ
సులోహితా యా చ సుధూమ్రవర్ణా
స్ఫులింగినీ విశ్వరూపీ చ దేవీ
లేలాయమానా ఇతి సప్త జిహ్వాః.

అగ్నికి సప్తజిహ్వుడు - ఏడు నాలుకలు కలవాడు-అని ఒకపేరు. ఆ ఏడు నాలుకలే బగబగమండే అగ్నిలోంచి పైకిచిమ్మే జ్వాలలు. వాటికి కలపేర్లు యీ విధంగా చెప్తున్నాడు.

కాలి, కరాళి, మనోజవ, సులోహిత, సుధూమ్ర, స్ఫులింగిని, విశ్వరూపి.

(అగ్నికార్యం యథావిధిగా చేసేవారికి సుస్థిరమైన ఆరోగ్యం, శరీరపటుత్వం కలుగుతాయి.)

5

ఏతేషు యశ్చరతే భ్రాజమానేషు
యథాకాలం చాహుతయో హ్యాదదాయన్
తం నయంత్యేతాః సూర్యస్య రశ్మయో
యత్ర దేవానాం పతి రేకోఽధివాసః.

పైనచెప్పిన జ్వాలలయందు కాలానుసారముగా హోమం చేసిన వానికి ఆ హోమం చేసిన ఆహుతులు దేవతలందరకు ప్రభువై అన్ని శక్తులకూ కుదురైన ఆ యీశ్వరుని వద్దకు సూర్యకిరణాలద్వారా చేరుస్తాయి.

[37 వ పేజీలో]



# శ్రీనివాస కళ్యాణము

— కీ. శే. కాటూరి వేంకటేశ్వరరావు

[గతసంచిక తరువాయి]

సూత్ర: చాలుగాని ఇకరావయ్యా; పెళ్లివారు బయలుదేరే వేళయింది.

కథక: కొంచెం నిదానించండి. హరిని మంగళస్నానానికి రమ్మని శారదా గౌరీపతులు పిలిచినంతట—

ఖావమెుకతీరుగాగ నిందీవరాక్షు
డశ్రుబిందులు రెప్పలనప్పళించి
దైన్యమున మోమువాంచి, గద్గదిక నల్లి
నల్లి "సిరిలేని పెండ్లి నే నొల్ల" ననియె.

సూత్ర: ఎట్లాగూ! ఈ మాట ఏమయినా బాగుందా మూర్తీ? తీరా మంగళస్నాన సమయాని కిలా పేచీ పెట్టితే ఈ ప్రయత్నమంతా ఏమి కావలసింది చెప్పు. అదీగాక, లక్ష్మీదేవికి మొదలే తగని అభిమానం కదా, తగుదు నంటూ ఆ ఇల్లాలు సవతిపెళ్లికి పేరంటానికి వస్తుందటయ్యా?

కథక: మీరు అప్పుడే బెంగపెట్టుకోకండి. లక్ష్మి అమ్మవారి చెంత కదిగో సూర్యభగవానుణ్ణి పంపుతున్నారు.

సూత్ర: పెళ్లికి రమ్మనేనా?

కథక: శ్రీనివాసమూర్తి ఈ మధ్య బొత్తిగా నలతగా ఉన్నారు! మిమ్మొకసారి చూడాలంటున్నారనిచెప్పి తోడుకరమ్మన్నారు.

సూత్ర; అలాచెప్పు, ఆ జాలిగుండెల తల్లివచ్చి తీరుతుంది! ఏమంటావ్?

కథక: వచ్చారండీ, అమ్మవారు. అట్లు చనుదెంచిన శ్రీదేవికి కేశవుం డెదురేగి తోడ్తెచ్చి, చెంతనుంచుకొని, కొంత తడ విష్టగోష్ఠి నడపి, పిదప శ్రీహరి బ్రహ్మేంద్రాదులం జూపి,

శ్రీనివా:

సరసిజాసను డాదివేల్పులు సాధ్వి నాకిటు వెండియున్
పరిణయము తలపెట్టినంతట, వలదు నాకిపుడీపునః
పరిణయంబని ఎన్ని చెప్పిన వార లన్నిటి కన్నియున్
దిరుగజెప్పరు; రేమనిన్ గొనితేర నంపితి నెచ్చెలీ.

లక్ష్మి: బౌలెందు, మీర లీ యఖిలకుటుంబకు
లిల్లాలు లేకున్న నెట్లు గడచు

శ్రీని: చతురభాషిణి వాదు చాలింపు మీ యెల్లి
దములు. నా కిందిరా తరుణిలేదె?

లక్ష్మి: ఉన్నది లేదటులుండనిం డింత కా
సుదతి పేరడుగ వచ్చునొకో నాకు

శ్రీని: మానవుగా పోటుమాట, లాతన్వి పే
రేమియౌగాక నా కేమివలయు?

లక్ష్మి: ఏను వినగూడదేమొ పోనిండు నాథ

('తపస్సు'-అంటే జ్ఞానం. బ్రహ్మపదార్థం జ్ఞానంవల్ల తెలియదగినది. అలాటి బ్రహ్మ పదార్థం ఈ సృష్టికి ఆధారం. దాని నుంచి అన్నం- అంటే మహత్తు కలుగుతుంది. దాని నుంచి ఇంద్రియాలు ఏర్పడతాయి. అవే కనిపించే రూపానికి పనులు కల్పిస్తాయి. ఆ పనులే కర్మలు. వాటివల్ల కలిగే ఫలం ప్రాణులు అనుభవిస్తారు. కర్మఫలం యీ సృష్టిలో ఉన్న ప్రతి ప్రాణీ అనుభవించక తప్పదు.

ఇక్కడ 'అమృతం'- అంటే అర్థం మృతం=నశించేది. అది కానిది 'అమృతం'- అనుభవించక తప్పనిది.)

9

యః సర్వజ్ఞః సర్వవిత్
యస్య జ్ఞానమయం తపః
తస్మాదేతత్ బ్రహ్మ నామ-
రూప మన్నం చ జాయతే.

ఈశ్వరుడు అన్నీ తెలిసినవాడై అంతటా ఉంటాడు. అతని తపస్సు జ్ఞానమయం. అలాటి ఈశ్వరుని నుంచే యీ బ్రహ్మ రూపముగా చెప్పదగిన వేదమూ నామ రూపాలూ సృష్టికి పోషకపదార్థాలూ పుట్టుతున్నాయి.

(పుట్టించడం, పోషించడం, తనలోకి చేర్చుకోడం యీ మూడూ అతీతశక్తులు. ఇవి కలవాడు ఈశ్వరుడు. అన్నీ అతని సంకల్పంవల్ల కలుగుతూ ఉంటాయి. కను కనే అతడు సర్వజ్ఞుడు. ఏది చెయ్యాలి? అని అనుకుని అది చేసి దానికి ఒక రూపమూ పేరూ కలిగిస్తాడు. అది పెరగ డానికి సస్యాలు - పోషకపదార్థాలు సృష్టి స్తాడు. ఇదంతా ఆ ఈశ్వరునికి ఒక ఆట.)

*

## ద్వితీయఖండం

తదేతత్ సత్యం
మంత్రేషు కర్మాణి కవయో యాన్యపశ్యన్
తాని త్రేతాయాం బహుధా సంతతాని
తాన్యాచరథ నియతం సత్య కామా
ఏష వః పంథాః సుకృతస్య లోకే.

ముందుచూపుగల మహర్షులు మంత్రాలలో కనుగొన్న కర్మలు వేదాలలో విస్తరించి అనేక విధాలుగా ఉన్నాయి. సత్యమునే ప్రధానముగా పాలించే కోరికగల బుద్ధిమంతులారా! ఆ కర్మలను మీరు తప్పక చెయ్యండి. ఈ లోకమందు చేసిన కర్మలకు తగిన ఫలం అనుభవించడానికే ఇదే మార్గం. ఈ మాట ముమ్మాటికీ నిజం.

(అగ్నికార్యం, సత్యవ్రతం మొదలైనవి యీ లోకములో తప్పక చెయ్యవలసే వైదిక కర్మలు. వాటిని చక్కగా చేసినవారు ఇక్కడే మంచి ఫలం అనుభవిస్తారు. వాటి వల్లనే పరబ్రహ్మను తెలుసుకోవడం అవుతుంది. ఈ భూమి కర్మభూమి, ఋషులు చెప్పినదే వేదంలో వివరంగా ఉంది. చెయ్యవలసేది చెయ్యక 'అదికావాలి ఇదికావాలి' అని ఆరాటపడి ప్రయోజనంలేదు.)

2

యదా లేలాయతే హ్యర్చిః
సమిద్ధే హవ్యవాహనే
తదాజ్యభాగావంతరేణాహుతీః
ప్రతిపాదయే చ్ఛ్రద్ధయా హుతమ్.

అగ్ని బాగా రాజుకుని మంటలు పైకి చిమ్ముతూ ఉన్నప్పుడు ఆజ్యభాగాలుగా ఉంచుకున్న ఆహుతులను ఆ అగ్నిలో వేసి తరువాత హోమం పూర్తిచెయ్యాలి. ఈ అగ్నికార్యం శ్రద్ధగా చెయ్యాలిగాని వెట్టి పనిగా చెయ్యకూడదు.

(దివ్యశక్తులుగల దేవతలందరూ అగ్ని యందు హోమంచేసిన పదార్థమును అగ్ని ముఖంగా పొంది సంతృప్తినీ సంతుష్టినీ పొందుతారు. అగ్నికార్యం చేసినవానికి మంచి ఫలం ఇస్తారు. కనుక దేవప్రీతికై అగ్నికార్యం శ్రద్ధగా చెయ్యాలి. పొగ లేకుండా బగబగమండుతూన్న అగ్నిలోనే హోమం చెయ్యాలి. అంటే అగ్గి సమిధలతో బాగా రాజుకోవాలని అర్థం. పొగలోవేసిన **ఆహుతి నిష్ఫలం.)**

3

యస్యాగ్నిహోత్రమదర్శ మపౌర్ణమాసం
అచాతుర్మాస్య మనాగ్రయణ మతిథివర్జితం చ
అహుత మవైశ్వదేవ మవిధినా హుత
మాస ప్తమాన్ తస్య లోకాన్ హినస్తి.

అమావాస్య, పౌర్ణమి, చాతుర్మాస్యం, క్రొత్తపంట ఇంటికివచ్చే కాలం, ఈ సమయాలలోను, అతిథిసత్కారముతోను, భూత బలులతోను, చెయ్యవలసే విధిని అనుసరించి అగ్నికార్యం చెయ్యాలి. అలాగు చెయ్యనివానికి ఏడులోకాలకు సంబంధించిన ఫలం చెడిపోతుంది.

4

కాళీ కరాళీ చ మనోజవా చ
సులోహితా యా చ సుధూమ్రవర్ణా
స్ఫులింగినీ విశ్వరూపీ చ దేవీ
లేలాయమానా ఇతి సప్త జిహ్వాః.

అగ్నికి సప్తజిహ్వుడు - ఏడు నాలుకలు కలవాడు-అని ఒకపేరు. ఆ ఏడు నాలుకలే బగబగమండే అగ్నిలోంచి పైకిచిమ్మే జ్వాలలు. వాటికి కలపేర్లు యీ విధంగా చెప్తున్నాడు.

కాళి, కరాళి, మనోజవ, సులోహిత, సుధూమ్ర, స్ఫులింగిని, విశ్వరూపి.

(అగ్నికార్యం యథావిధిగా చేసేవారికి సుస్థిరమైన ఆరోగ్యం, శరీరపటుత్వం కలుగుతాయి.)

5

ఏతేషు యశ్చరతే భ్రాజమానేషు
యథాకాలం చాహుతయో హ్యాదదాయన్
తం నయంత్యేతా సూర్యస్య రశ్మయో
యత్ర దేవానాం పతి రేకోఽధివాసః.

పైనచెప్పిన జ్వాలలయందు కాలాను సారముగా హోమం చేసిన వానికి ఆ హోమం చేసిన ఆహుతులు దేవతలందరకు ప్రభువై అన్ని శక్తులకూ కుదురైన ఆ యీశ్వరుని వద్దకు సూర్యకిరణాలద్వారా చేరుస్తాయి.

[37 వ పేజీలో]

ప్రకృతిసిద్ధమైన పదార్థమును మానవుడు తన వివేకముచేత సొగసుగ సొవరించుట-సంస్కృతి.

అడవి పత్తు ప్రకృతి; పల్లెపట్టులలో పండింపబడు పత్తు సంస్కృతి. పత్తు ప్రకృతి; బియ్యము సంస్కృతి. బియ్యము ప్రకృతి; అన్నము, పరమాన్నము, చిత్రాన్నము, పొంగలి-సంస్కృతి. రాతిబండ ప్రకృతి; గృహప్రాంగణమున పరువబడిన రాయి సంస్కృతి. అమృతశిల ప్రకృతి; శిల్పిచెక్కిన విగ్రహము సంస్కృతి. మ్రానిమొద్దు ప్రకృతి; బల్ల, కుర్చీ-సంస్కృతి. మృగపక్షులకూత ప్రకృతి; వానిలోన స్వరప్రభేదములను గుర్తించి, జోడించి, రాగవిన్యాసములను చేయుట-సంస్కృతి.

సరిగమపదని-అన్న సప్తస్వరముల ప్రముఖ చిహ్నములు ఈ విధమట.

> షడ్జం మయూరో వదతి,
> గావస్త్వృషభ భాషిణః।
> అజావికం తు గాంధారం,
> క్రౌంచః క్వణతి మధ్యమమ్॥
> పుష్పసాధారణే కాలే
> పికః కూజతి పంచమం।
> ధైవతం హేషతే వాజీ,
> నిషాదం బృంహతే గజః॥
>
> — అమరకోశము 1-8.

(నెమలిది షడ్జస్వరము; ఎద్దుది ఋషభము; మేకది గాంధారము; క్రౌంచపక్షిది మధ్యమము; కోకిలది పంచమము; గుఱ్ఱముది ధైవతము; ఏనుగుది నిషాదము.)

వీధిలో మనము మాట్లాడునట్టి, వినునట్టి మాటలు-ప్రకృతి; అవే మాటలను ఒక క్రమమెరిగి పోహళించిన కావ్యము-సంస్కృతి. మాట్లాడవలెననిపించుట ప్రకృతి; మాటలలో మితిమర్యాదలు సంస్కృతి. తోటలో రకరకముల రూపురేఖల, రంగురంగుల ఆకులు, పూలు వెలుగొందుట ప్రకృతి; వానిని విడిపించి, హారములను, తురాయిలను రచించుట సంస్కృతి. ప్రకృతి మనజీవనమునకై మూలసామగ్రిని చేకూర్చును. వానిని మనము క్రమబద్ధరీతిని ఉపయోగించుకొందుము. అదియే సంస్కృతి. అడవిని తోటగాచేయుట సంస్కృతి. తలమీద వంకరటింకరగా, చిక్కుచిక్కుగా కురులుండుట ప్రకృతి. చెదరిన కురులను దువ్వి, జడవేసికొని, పూలు ముడుచుకొనుట సంస్కృతి. తనకు తానుగా నుండునది ప్రకృతి. ఆ ప్రకృతిని మనుజుని బుద్ధి క్రమబద్ధము చేయుటవలన అగునది సంస్కృతి. మన దేహపు రకరకముల కోరికలు ప్రకృతి. ఆహారవిహారములకు యుక్తాయుక్త స్థానాస్థాన కాలాకాలములను నిర్ణయించుట సంస్కృతి.

సంస్కృతి దేహసౌందర్యము, వాక్సౌందర్యములకు మాత్రమే పరిమితమైనది కాదు. ఇది బహిరంగ సంస్కృతి. దాని




కన్న ఉత్తమమైనది అంతరంగ సంస్కృతి. ఆశామోహములు ప్రకృతి; న్యాయవివేకములు సంస్కృతి. రోషాసూయలు ప్రకృతి; క్షమాసహనములు సంస్కృతి. ఇట్లు మనోవాక్కాయములన్న త్రికరణముల వ్యాపారములందును సంస్కృతి కవకాశమున్నది. సంస్కృతి పరాకాష్ఠనందుకొనునది మనుష్యుని మనస్సు యొక్క ఔన్నత్యమునందు. మనస్సులో పెద్దతనమున్న యెడల, అచట సొగసున్న యెడల-ఆ పెద్దతనమును, ఆ సొగసును మననుండి బయలువెడలు ధ్వనిలోను, మాటలోను, ముఖకవళికలోను, మన నడవడికల నయనాణ్యతలలోను పొడకట్టును.

అపుడు రెండు పనులు జరుగును.

మొదటిదిగా, ఎవరితో మనము మాట్లాడుచున్నామో వారి మనస్సునకు సంతోషము కలుగును. వారు మనలను ప్రేమించి ప్రసన్నులగుదురు.

రెండవదిగా, వారి మనస్సులలో ఏదైనను ఒక అల్పత్వమున్న, ఒక వక్రతవున్న అది నశించి, మనము కాంచిన ఒక ఉన్నతాదర్శము వారి కన్నులకును కనపడినట్లగును.

సంస్కృతి మన జీవముల బాంధవ్యమున ప్రవేశించినపుడు రెండువైపులకును స్నేహసంతోషములు తెచ్చును. ఈ కార్యక్రమమున రెండు విధానములు జరుగవలసి వచ్చును.

మొదటిది - అన్యస్వభావ పరిచయము.
రెండవది - స్వస్వభావ శిక్షణము.

ఇంకొకరి మనోగుణమును, బుద్ధిగుణమును మనము వీలైనంతవరకు తెలిసికొనవలసివచ్చును. అట్లు తెలిసికొన్న ఇతర


కన్నడమూలం:

శ్రీ జి. వి. గుండప్ప

తెనిగింపు:

శ్రీ ఎస్. రంగాచార్యులు


జనుల లక్షణములకు మన మనోభావములను, నడనుడులను మనము పొందికగానుండునట్లు చేయవలసి వచ్చును. ఇట్లు ఒక మనుజుడు ఇంకొక మనుజునితో స్నేహముతో పొందుకొనునట్లు తనను తాను దిద్దుకొనుటను సంస్కృతి అనవచ్చును.

## గోవుకథ

మంచిది. ఒకడు ఇంకొకనికి పొందుకొనుట అనగా ఏమి? మన గోవుకథలో, గోవు పులి ఇష్టమునకు లొంగుటయా? లేక పులి గోవుకు విధేయమగుటయా? పులి ఆవునుపట్టి తినుట ప్రకృతి; ఆవు మాటలను పులి మన్నించుట సంస్కృతి. గోవు తన దూడ విషయమును చెప్పుకొనుట సంస్కృతి. పులి విని కనికరము చూపుట ప్రత్యుత్తర సంస్కృతి. గోవులోనున్న సంస్కృతి పులిలోని సంస్కృతికి కారణమైనది.

# రుధిరోద్గారి

పేరున దుందుభి వైనను
పోరున సంగ్రామ హోమమున దుందుభి గా
హోరెత్తిరి నే సోదరి
పేరజెనె రాల చక్ర చిత్రాలయమున్.

పేరుకు నీవును క్షిప్రద
కే రుధిరోద్గారి, కాని పగతా గ్రు
స్ఫూర్తిక కపోలములు రుచి
రా రుణములు మాత్ర చేయు మన
నయమతి వై.

ఈ సున క్రమ్మిన పచ్చలు
మాసెడి కను పాప అరుణతోయజములుగా
భాసించునట్లు చేయుము
దేశము లెల్లెడల నీ యదృశ్యస్పర్శన్.

చలికిని నెండకు పేరా
కలి వెతకును పాలిబోయి కమలిన చిరు బి
డ్డల నాకమ్ముల పోయుము
చలత్తరంగమ్ము లట్లు సముదధికమ్ముల్.

ఎటనుండి వచ్చితివో యి
చ్చటి కిప్పు డనంత విశ్వ సంచారములో;
స్ఫుటముగ గ్రహాంతరమ్ముల
జటిల రహస్యములు మా కొసంగుదువేమో.

అరువది యేండ్లుగ నే భా
స్కర సంగతమౌ ప్రపంచచయమున విధిగా
తిరిగితివో, విశ్వరాసుల
పొరలెడు ననుభూతి సామ్యములు
తెల్పెదవో.

స్వాగత గోష్ఠివినా నీ
జాగోగుల ముచ్చటకు సభల్ లేవు గదా;
యే గోళ మందొ మజు చై
త్రాగమ నోత్సవము వేళలన్ నీ మజిలీ.

— వేమూరి వేంకట రామనాథం

సంస్కృతి ఉత్కృష్టస్థితికి వచ్చినపుడు రెండు జీవుల పరస్పర బాంధవ్యమునకు సూత్రమగును- అది అప్పుడే సూచింప బడినది. జీవమన్న ఏమి? అది రెండంశ ముల మిశ్రణము- ఒక అంశము దేహేం ద్రియ సముదాయము; మరియొకటి-ఆత్మ. ఇంద్రియము లోకభోగమును వాంఛిం చును; ఆత్మ తనకన్న ఉన్నతమైన ఒక చైతన్యపు సహవాసమును కోరును. సంస్కృతి ఈరెంటిని దృష్టియందుంచుకొని యుండును- లౌకిక సౌఖ్యము; ఆత్మో ద్ధారము.

ఈ రెండును అన్యోన్య విరుద్ధములను భావన జనులలో సామాన్యముగానున్నది. అవి రెండును విరుద్ధములు కావు, సహ కారులు- అన్నది సంస్కృతియొక్క తత్త్వము. అవి రెండు మెట్లవలె ఉండ దగినవి. క్రింది మెట్టులేనిది పై మెట్టు చెక్కుటకు వీలుకాదు; పై మెట్టుకు ఎక్కలే కున్న ఎడల క్రిందిమెట్టు సార్థకముకాదు. మనుష్య జీవనమునందు రెంటికిని తావున్నది.

మనుష్యుడను ప్రాణిలో ఆత్మ అన్న అంశము సర్వశ్రేష్ఠమైనదని అంగీకరించిన తరువాత అతని జీవనములోని మిగిలిన అన్ని అంశముల స్థానమును ఆశ్రేష్ఠాంశపు దృష్టిలో నిష్కర్షచేయుట యుక్తమగును. మనకు కావలయునని అనిపించు వస్తువులు లోకమున వేనకువేలు కలవు. వానిలో చాలకాలము మనునవియు కలవు; ఒకటి రెండు క్షణములు మాత్రము కావలసినవియు కలవు. వానిలో ఒక్కొక్కదానికి తగిన చోటొకటి ఉండును. తగినచోటున దానికి ఆ విలువ ఉన్నది; మిగిలిన తావులలో అది అనిష్టమనియే అనిపించును. నోటికి రుచి కరమైన పరమాన్నము తొడమీద పడినపుడు అసహ్యమగును. దీనిననుసరించియే ఆంగ్ల మున మలినమన్న ఏది? అని నిర్ణయించుట కొక సూత్రము కలదు. ఏ వస్తువు తనకు తగిన చోటును వీడి వేరుచోటికి వచ్చునో అది అప్పుడు మలినము. ఇదే తత్త్వమును రాజ్యాధికార నిబంధనకును అన్వయింప వచ్చును. రక్షకభటుడు అపరాధిని పట్టుకొని న్యాయాధీశుని ముందుకు తేవచ్చును. అది వాని కర్తవ్యము. ఆ భటుడు ఆ కర్తవ్య మును అతిక్రమించి తానే విచారించి, దండించినాడన్నచో అది మలినము. అట్లే న్యాయాధిపతి తానే అపరాధిని కనిపెట్టవ నని బయలుదేరిన - అది మలినము. అప రాధిని వెదకిపట్టుకొనుట రక్షకభటుని కర్త వ్యము; న్యాయాధిపతిదికాదు. ఇట్లు, ప్రతి అధికారమునకును ఒక పరిమితి ఉన్నది. లోకవస్తువుల ఉపయోగవ్యాప్తికిని అట్లే ఒక పరిమితి ఉన్నది. ఈ పరిమితులను, హద్దులను ఎఱిగి, ఒక్కొక్క వస్తువునకు చెల్లింపవలసిన వెలను దానికి చెల్లించుట న్యాయము. న్యాయమే సంస్కృతి.

ఇట్లు ప్రతియొక జగద్వస్తువునకును స్థానమును గుర్తించుట సంస్కృతియొక్క కార్యము. స్థానమునకు తగిన గౌరవమును గుర్తించుటయును సంస్కృతియొక్క కార్యమే. మొత్తమునకు మన ప్రవర్తనల ఉచితతయే సంస్కృతి. ఈ ఔచిత్యము నకు రెండు సూత్రములు.

1. ఆత్మవస్తువు సర్వశ్రేష్ఠమైనది; అందు వలన దానికి సర్వత్ర గౌరవము చేకూర వలెను. 2. ఆత్మవస్తువు నాలో ఉన్నట్లే అందరియందును సమానముగా ఉండుట వలన నా సుఖదుఃఖములకు నేను ఖరీదు కట్టునట్లు ఇతరుల సంతోషసంకటములకును నేను ఖరీదు కట్టవలయును. ఇట్లు నాకు ఇతరుల విషయమున కర్తవ్యము కలదన్న యెడల, తత్క్షణమే ఆ ఇతరుల అభిప్రాయ ములను, అభీష్టములను నేను తెలిసికొనుట అవశ్యమగును. ఇట్లు ఇంగితజ్ఞానము సంస్కృతియొక్క ఒక లక్షణమగును. మొదట ఇంగితజ్ఞానము; తరువాత తత్పరి ణామముగా నడనుడులలో ఔచిత్యము.

మనుష్యునిలోగల అనేకాంశములలో ఆత్మ అన్నిటికన్న మిన్నకదా? ఆత్మ అందరి యందును ఒక్కటే. అందువేత

అన్ని విషయములు తారతమ్యము చెప్పను. కాని రాదీ విషయములు అప్పగాదు-అవియు నానా విధముల సుగోష్ఠుల భేదములు గను సారమ — వస్తువుల విలువ వేరువేరుగ నుండును. ఒక వ్యక్తికి భోజనము ముఖ్యము, ఇంకొక వ్యక్తికి మానము ఎక్కువ ముఖ్యము. ఒకనికి గుండ్రని ముఖము సొగసు; ఇంకొకనికి కోల ముఖము సొగసు. ఒకనికి తీపి ఇష్టము; ఇంకొకనికి కారము. ఒక ఇంటికి పువ్వులు ఇష్టము; ఇంకొకరికి సంపెంగ. ఒకనికి వస్త్రాభరణములు ముఖ్యము; ఇంకొకనికి సంగీతము. ఇట్లు మనరుచిభేదములు; వానివలెనే మన స్థితిభేదములును. ఒకనికి త్వరగా కోపము వచ్చును; త్వరగా ఉపశమనమగును. ఇంకొకనికి అపురూపముగా కోపము వచ్చును; వచ్చిన తరువాత పన్నెండేండ్లు కసి. ఒకడు ఇతరులు చెప్పినది వినును, స్వతంత్రాలోచన లేనివాడు; ఇంకొకడు ఎవరినీనమ్మలేడు, అత్యాలోచనాపరుడు ఇట్లు మానవ సమాజమున మనఃప్రవృత్తులును, బుద్ధిశక్తులును, నీతియోగ్యతలును అనేక అంతస్తులుగా, పలు విధములుగా ఉండును. సంస్కృతీ సంపన్నుడు ఈ అంతస్తులను, తరగతులను గ్రహించి, ఆయా సందర్భములకు తగినట్లు తన వాగ్వర్తనములనుదిద్దితీర్చికొనవలయును. సందర్భమెటువంటిదైనను అతనిఉద్దేశము హిత-సంతోష కార్యము.

ఇచట హితమువేరు, సంతోషమువేరు అనుటను మనము గమనించవలెను. ఆ రెండును ఒకటియగు సందర్భములును కలవు. వేరు వేరుగా నుండు సందర్భములును కలవు. త్రాగుబోతుకు మద్యము సంతోషకరము; హితకరముకాదు. రోగగ్రస్తుడైన బాలునికి మిఠాయి సంతోషకరము; హితకరముకాదు. రోగికి చేదు మందు హితకరము; సంతోషకరముకాదు. అశిక్షితుడైన బాలునికి స్వాతంత్ర్యము సంతోషకరము; హితకరముకాదు.

రోగికి తేనె సంతోషకరమును అగును; హితకరమును అగును. మంచి విద్యార్థికి నియమపాలనము సంతోషకరమును అగును; హితకరమును అగును.

సంతోషము మొదట ఇంద్రియములను సమాధానపరచును. విచారణానంతరము అది హితమా? అహితమా? అన్నది బుద్ధికి గోచరమగును. హితము మొదట బుద్ధికి సరిగానున్నట్లు తోచును. పిదప ఏర్పడిన పదార్థముయొక్క అనుభవము మనస్సునకు సంతోషకారి కాకున్నను, మనము దానిని ఇష్టముతో స్వీకరింతుము. అలంకార ప్రీతి గల ఆలని చెవి కుట్టించుకొన్న బాధ కలుగునని తెలిసియుండియు దానిని ఇష్టముతో స్వీకరించును. హితమిటువంటిది. బుద్ధి వివేకముతో అంగీకరించునటువంటిది హితము; ఆత్మానందమును గుణించిన హితము మిగిలిన అన్ని విషయములను ఆత్మహితమునకు లోబడ కలిగించుకొనునట్టి సౌఖ్యము-సంతోషము.

ఇంగితజ్ఞతయొక్క రీతులను, వైవిధ్య ప్రకారములను ఉదాహరణములతో మనకు నిరూపించదగిన సాధనము కావ్యనాటకాది సాహిత్యము. సాహిత్యపు సూక్ష్మభావములను మన మనస్సులకు విశదపరచగలశక్తి సంగీత, అభినయ, శిల్ప, చిత్రలేఖన-ఇత్యాది లలితకళలది. ఇట్లు సాహిత్యాది లలితకళలు సంస్కృతికి పోషక ద్రవ్యములు. సంస్కృత వర్తనయొక్క దృష్టాంతములను మనము రామాయణ మహాభారతాది కావ్యములలో హెరాళముగ చూడవచ్చును.

( 33 వ పేజీలో )

## భూలోకమంటా భూగ్రహమంటా ఒకటికాదా?

మనం నివసిస్తోన్న భూమి నిజానికి ఒక గ్రహం కాదు. అది ఒక 'లోకం' కొపర్నికస్ చెప్పిన భూగ్రహం వేరు. మనం వుంటున్న భూలోకం వేరు.

భూమి గుండ్రంగాలేదు. బల్లపరపుగా వుంది. అది సగం సముద్రంలో వుంది. దానికి పరిభ్రమణం లేదు.

సూర్యుడు స్థిరంగాలేడు. ఆయన ఆరు గ్రహాలతోనూ, రాశిచక్రంతోనూ మేరుపర్వతంచుట్టూ ప్రదక్షిణం చేస్తున్నాడు.

మనం ఉత్తర ధ్రువం అనుకొంటున్నది ఉత్తర ధ్రువం కాదు: నిజానికది దక్షిణ ధ్రువం.

— ఈ వింత సిద్ధాంతాలు శ్రీ టి. వి. రామశాస్త్రివి. మన ప్రాచీన వేదవిజ్ఞానం ఆధారంగా ఆయన పై సిద్ధాంతాలు నిజమని నిరూపిస్తామంటున్నారు. తమవాదం యథార్థం కాదని తగిన ఆధారాలతో ఋజువు చేయగలిగిన వారికి ఆయన గొప్ప బహుమతి ప్రకటిస్తున్నారు.

వారి చిరునామా;

**టి. వి. రామశాస్త్రి,**

**శ్రీ కాళహస్తి, చిత్తూరుజిల్లా.**



# నవశక్తినిలయం నుండి
# భక్తులకు విశిష్టకానుక!

జగద్గురువులు శ్రీ కంచికామకోటి శ్రీ జయేంద్రసరస్వతి, శ్రీ శృంగేరి శారదాపీఠ మహాసన్నిధానం, శ్రీ ఆచార్య శ్రీ శరణతీర్థ మహరాజ్ (గొండాల్) మరియు ఇతర సాధువుల ఆశీస్సులు శ్రీముఖాలు గలిగిన దివ్యయంత్రాలు:

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీ మహామేరు (పంచలోహం) 1 1/2"x1 1/2" | — | రు. 300—00 |
| 2. | శ్రీచక్రం, ఇతర చక్రాలు ఒక్కొక్కటి 8 సెం.x8 సెం. | — | రు. 115—00 |
| 3. | శ్రీమహాలక్ష్మి యంత్రం 16 సెం.x16 సెం. | — | రు. 500—00 |
| 4. | వెండిపూత గలిగిన స్టాండులతో అష్టలక్ష్మి, అంబాజీ, బద్రినాథ్ బంగారుపూజా ప్రతిమలు ఒక్కొక్కటి 5.8 గ్రాములు. ఒక్కొక్కటి | — | రు. 75—00 |
| 5. | దృష్టి నివృత్తి యంత్రం (ఫ్రేముతో) (దృష్టిదోషాల నివారణకు, వాహన ప్రమాదాల నివారణకు పిశాచాలు పారద్రోలేందుకు, ఇంటిలో, ఫ్యాక్టరీలో, వ్యాపారంలో, ఐశ్వర్యసిద్ధికి) | — | రు. 50—00 |
| | దృష్టి నివృత్తి డాలరు | — | రు. 50—00 |
| 6. | వివాహప్రాప్తి డాలరు (మౌలికమైనది) (శీఘ్రంగా వివాహం జరిగేందుకు) | — | రు. 50—00 |
| 7. | వెండికవచంతో రుద్రాక్షమాల (54 పూసలతో) (పూజజరిపి పంపబడుతుంది) | — | రు. 250—00 |
| 8. | స్ఫటికమాల (మౌలికమైనది, 54 పూసలతో) | — | రు. 250—00 |
| 9. | వెండికవచంతో పద్మమాల (54 పూసలతో) | — | రు. 100—00 |
| 10. | ఎలక్ట్రానిక్ రాగికడియము (12 రాశులకు) ఒక్కొక్కరాశికి | — | రు. 20—00 |

50% శాతం సొమ్ముముందుగా పంపి ఆర్డరు ఇవ్వండి.
వస్తువులు వి. పి. పి. ద్వారా పంపబడుతవి.

విశ్వకర్మజ్ఞ, శ్రీవిద్యోపాసక
స్వామీజీ శ్రీ ఎస్. టి. మురుగభూషణం,
నవశక్తినిలయం,
153-లాయడ్స్ రోడ్డు, గోపాలపురం, మద్రాసు-600086, ఫోన్: 812013.

"ధరతీతి ధర్మః." "ధృఞ్ ధారణే" అను వ్యుత్పత్తిచే ధరించునది ధర్మమనఁబడును. "ధుధాఞ్ ధారణ పోషణయోః" అను వ్యుత్పత్తిచే ధరించునది పోషించునది ధర్మమనఁబడును. ఏయ్యదిలోకముచే అనగా ప్రజలచే ధరింపఁబడి ప్రజలను ధరించునో, ఏది ప్రజలచే పోషింపఁబడి ప్రజలను పోషించునో అయ్యది ధర్మమనఁబడును.

విశ్వప్రకాశమున ధర్మమనగా "ధర్మః పుణ్యే యమే న్యాయే స్వభావాచారయోః క్రతౌ, ఉపమాయామహింసాయాం కార్యే కేచ నిగద్యతే" యను విశాలార్థమును బోధించుచున్నది. కాని ఇట పై వ్యుత్పత్త్యర్థమును మాత్రము గ్రహించి నన్నయ తన భారతమునందెట్లు ప్రతిపాదించెనో చూతము.

"కావ్యం శివేతరక్షతయే కాంతాసమ్మితయోపదేశయుజే" అని కదా కావ్యలక్షణ

తెలుగులో భారత రచన జరగడానికి దారితీసిన కారణాలలో వైదిక ధర్మోద్ధరణకూడా ఒకటి! నన్నయ భట్టు ఆ పని ఎలా నిర్వహించాడో వివరిస్తుం దీ వ్యాసం. సం॥

చెసే యున్నాఁడు. జగత్తునకు హితమును కల్పించునది ధర్మమొక్కటియే యనుట నిర్వివాదాంశము. కావుననే నానా రుచిరార్థ సూక్తినిధి నన్నయ జగద్ధితంబుగా నని ప్రయోగించుట కేవలపాదపూరణము నకుఁగాక ధర్మప్రతిపాదకమై యున్నదని నన్నయ రచిత భారతమును బరిశీలించిన వ్యక్తముకాక మానదు.

ఉదంకోపాఖ్యానమున నుదంకుఁడు పౌష్యుపత్నిం గానక మరలి పౌష్య మహారాజుతో విన్నవింప "నీ పత్ని పాపని నీకామె గనపడలేదని పెద్దలతో బలుకుటయే ననుచునగుట ధర్మమునకు విరుద్ధము కావుననే నన్నయ యారాజుచే "భూదేవర నిమ్ము త్రిభువనపావను నశుచి వని యెట్లు పలుకగనగు నద్దేవిపవిత్ర పతివ్రత గావున నశుచులకుగాన గాదనవచ్చు" నని సంబోధించుట యాతని రుచిరార్థ సూక్తికి నిదర్శనము. అంధియేగాదు భోజనానంతరము ప్రక్షాళితపాదిపాదపదనుండయి యాచమించుట యుక్తమను ధర్మమును కాంతా సమ్మితముగా నుపదేశించినాఁడు. శాపమును గ్రమ్మరింపుమను నుదంకునికి పౌష్యునిచే "నిండుమనంబు నవ్యనవనీత సమానము పల్కు దారుణాఖండల శస్త్ర తుల్యము జగన్నుత విప్రుల యందు నిక్క

# నన్నయ్య భారతంలో ధర్మోపదేశం

ములు శాస్త్రజ్ఞులు నిర్ణయించినారు. అమంగళమును పరిహరించునట్టిది ఒక ధర్మము మాత్రమే. ఆ ధర్మమును ధర్మోపదేశము నకై ప్రారంభించి బోధించిన పురాణమే యగును గాని కావ్యముగాదు. పురాణ లక్షణములు గలిగిన యనేక పురాణ రచయితయగు వేదవ్యాస మహర్షిచే రచింపఁబడి యనేక ధర్మములను బ్రతిపాదించిన బృహద్గ్రంథమును ఇతిహాసమైన భారతమును "సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థయుక్తి లో నారసి మేలునా నితరులక్షరరమ్యత నాదరింప నానా రుచిరార్థ సూక్తినిధి నన్నయ భట్టు తెనుంగునన్ మహాభారత సంహితా రచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగన్" అని ప్రతిజ్ఞ చేసి యుపక్రమించినాఁడు. జగద్ధితంబుగన్ అను పదమును కూర్చుటలో కవి తన యభిప్రాయమును స్పష్టముగా ప్రకటిం

భారత కథను గురించిన ప్రస్తావనలో నన్నయ భారతమునుగూర్చి "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని యధ్యాత్మవిదులు వేదాంతమనియు నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని కవివృషభులు మహాకావ్యమనియు" చెప్పునప్పుడు మొదట ధర్మశాస్త్రమనియే వక్కాణించుట ధర్మమును ప్రతిపాదించుటకుపోద్ఘాతమనిచెప్పకయే చెప్పుచున్నదికదా.

కృతిభర్తయగు రాజరాజ నరేంద్రుని వర్ణించుచు మనుమార్గుఁడను విశేషణమును బ్రయోగించుటచే మనూక్త ధర్మశాస్త్ర నిరతుఁడని సూచించుచున్నాఁడు. ఇది యాతని భారత రచనలో నందందాయా వ్యక్తుల వర్ణించు సమయమున ధర్మావలంబులగు వారిఁగూర్చి వారి ధర్మాభినివేశమును తప్పక చెప్పుట గోచరించుచునే యుండును.

మీరెందును రాజులందు విపరీతము" నని సాత్త్విక రాజసప్రవృత్తులుగల మన స్తత్త్వ ధర్మమును సూచించినాఁడు.

ప్రమద్వర వృత్తాంతమున క్రుద్ధుండైన రురుండు సర్పముల వధించుచుండ సహస్రపాదుండను ముని లోకాపకారకములగు పావజాతినిగూడఁ జంపుట యుక్తము గాదని బోధించునపుడు "పుట్టుఁడు దోడన పుట్టు నుత్తమ జ్ఞానము సర్వభూత హిత సంహిత బుద్ధియు జిత్త శాంతియున్ మాన మద ప్రహాణము సమత్వము సంతతవేద విధ్యనుష్ఠానము సత్యవాక్యము దృఢ వ్రతముం గరుడాపరత్వమున్" అని యుత్తమ మానవుల ధర్మములనెల్లఁ బ్రతిపాదించినాఁడు.

ఎంత బలపరాక్రమములు కలిగినను, ఎంత మహిమోపేతుండయ్యును, నమేయ

మేధాసంపన్నుండైనను శాసనోల్లంఘనము ధర్మవ్యతిరేకము సుమ యని గరుడోపాఖ్యానమున నింద్రాది దేవతల నిర్జించి యమృతముం గొనిపోవుచున్న గరుడుడు ఇంద్రునితో కద్రువ పుత్రులకనముగాం గోరి "భవదభిరక్ష్యములగు నీ భువనంబులయందు సర్పములు ద్రిమ్మరుటకున్ దివిజాధిప నీకెఱింగింపవలసె నీయాజ్ఞ నాకుం బడయంగవలసెన్" అని యనుమతియందుటలోని ధర్మసూక్ష్మమును మానవులు శాసనబద్ధులైయుండుట యుక్తమని సూచించెను.

"ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః" అను వేదధర్మమును జరత్కారు చరిత్రలో విశదీకరించెను.

ఆస్తీకుండు సర్పయాగము దీర్చించునపుడు "దగుపాత్రునకెద్ది యిచ్చినన్ ఘనముగ నక్షయంబగునని" సదస్యులచే జనమేజయునకుంజెప్పించెను. పాత్ర మెఱింగి దానమొనర్చుట దానధర్మములందు గొప్ప ధర్మముగదా! పాములను గూడ జంపంజనదనుట నహింసా ధర్మమునకు బరాకాష్ఠయేగదా!

దాశరాజు నియోగంబున మత్స్యగంధి నదిని దాటింపనోడ నడపుటను గూర్చి 'ధర్మార్థంబుగం దన తండ్రి నియోగంబున నయ్యమున నోడం గడపుచు నుండెన" అను ధర్మమును సూచించెను. ఈనాటికి ఋషికేశమున గంగా నదిని దాటింప పణము గైకొనకుండుట భారత ధర్మమే గదా!

యయాతి చరిత్రలో శుక్రాచార్యుండు సురాసమ్మిశ్రభస్మము యుండై తన యుదరంబున నున్న యుక్కచుంగని సుర సేసిన దోషంబును నసురుల వలనసైన యుపకారంబును నెఱింగి, మొదలి పెక్కు జన్మములం బుణ్యకర్మముల్ పరంగం బెక్కు సేసి పడయంబడిన యద్ది యెఱుక జనులకొక్కట మ్రాత్రన చెఱుచు మద్యసేవసేయ నగునె, భూసురులాదిగం గల జనులీ సుర సేవించిరేని యిది మొదలుగం బాపవర్తిం బతితులగుదురు చేసితి మర్యాద దీనిం జేకొనుండు జనుల్" అని మద్య పానమున జ్ఞానము నశించునని దానితో ధర్మము నశించునని యా మద్యపానమును నిషేధించెను.

దేవయాని కచుం బరిణయమాడుమని గోర కచుండు "గురులకు శిష్యులు పుత్రులు పరమార్థము లోకధర్మపథమది దీనిం బరికింపక యీ పలుకులు తగదీ గురుపుత్రి నీకుం దగునే పలుకన్" అని చెప్పుటలో గురు శిష్య సంబంధమును సూచించుటయే గాక విద్యార్థులు విద్యార్థినులు గురుపుత్ర పుత్రికలు సోదరతుల్యులు వారిం గామించుట యధర్మమని సూచించెను. ఈనాండా ధర్మము లోపించుటచేగదా పాఠశాలలలోని యధర్మ ప్రవర్తనలు.

యయాతి నూతంబడిన దేవయాని నుద్ధరింప కోపమూర్ఛిత బాష్పపూరిత నయనయై యున్న దేవయానిం గని శుక్రాచార్యుండు "అనుపమ నియమాన్వితులై యనూన దక్షిణలం గ్రతు సహస్రంబులు సేసిన వారికంటె నక్రోధనుండ గరం బధికుండండ్రు తత్త్వ విధిజ్ఞుల్, అలిగిన నలుగక యెగ్గులు పలికిన మఱి వినని యట్ల ప్రతివచనంబు ల్పలుకక బన్నమువడి యెడందల పకయున్నతండ చూవె ధర్మజ్ఞుండిలన్" అని ధర్మమును వివరించి కోపించుట నీతి గాదని బోధింపంజేయుట నన్నయ ధర్మసూక్ష్మ పరిశీలనముతోంబాటు అవకాశము కలిగినపుడెల్ల నాతిదీర్ఘముగ సున్నితముగం గాంతా సమ్మితముగ ధర్మమును ప్రతిపాదించుచుండుట తెలుపును.

దాసియైన శర్మిష్ఠయయాతిం గోరినపుడు "నీలగళోపమాన కమనీయ గుణోన్నతిం జెప్పంజాలు నన్నేలిన దేవయానికి నరేశ్వర భర్తవుగాన నాకును, బోలంగ భర్తవీవ యిది భూనుత ధర్మపథంబు నిక్కువం బాలును దాసియున్ సుతుండు నన్న వివాయని ధర్మముల్ మహిన్" అనుటలో నీలగళుండగు శంకరుని యుపమానమునం బార్వతితోంబాటు గంగను గ్రహించినట్లు గ్రహింపుమనుటయేగాక దేవయానికి భర్తయగువాండె దేవయాని దాసియగు శర్మిష్ఠకుభర్తయగుటధర్మంబనుట సూచితము. యయాతి దాను శుక్రునికిచ్చిన వాక్యమునకు వెలిగాంగ బొంకుటయెట్లనగా శర్మిష్ఠ "చను బొంకంగ బ్రాణాత్యయమున సర్వ ధనాపహరణమున వధగా వచ్చిన విప్రార్థ

## భజే శ్రీనివాసమ్

చిదానందమూర్తిం సదామోదకీర్తిం
కృపాక్షీరసింధుం ప్రపన్నాత్మబంధుమ్,
ప్రవృత్తం సువృత్తం ప్రమోదార్ద్రచిత్తం
ప్రభుం దివ్యభాసం భజే శ్రీనివాసమ్॥

పరబ్రహ్మరూపం విరాడ్విశ్వదీపం
సతాం కల్పవృక్షం కృతాశీః కటాక్షమ్,
పవిత్రం సుగాత్రం ప్రమత్తారిజైత్రం
ప్రభుం మంజుహాసం భజే శ్రీనివాసమ్॥

విరాజత్కిరీటం వరశ్రీలలాటం
స్ఫురత్తారహారం సుచేతో విహారం
వరేణ్యం శరణ్యం త్రిలోకాగ్రగణ్యం
ప్రభుం ప్రీతదాసం భజే వేంకటేశమ్॥

మహామ్నాయసారం మనోజ్ఞావతారం
ఖగాధీశవాహం సుగంధార్ద్రదేహమ్,
అనంతం మహాంతం సమస్తాగమాంతం
ప్రభుం హృద్వికాసం భజే శ్రీనివాసమ్॥

విపన్నార్తినాశం విభుం వేంకటేశం
ప్రపన్నావలంబం ప్రసన్నాస్యబింబమ్,
పరేశం సురేశం చిరం సుప్రకాశం
ప్రభుం చిద్విలాసం భజే వేంకటేశమ్॥

— కరుణశ్రీ

# నా ఆత్మ వెలిగించావు

నా అశాంతి హృదయ మందిరంలో
నీ ప్రశాంత సుందర సుప్రభాతం విన్నాను,
నాస్తికానంద నందన వనంలో
నానా రూప విలాస పారిజాతాలు కన్నాను.

కనాకాచలం నీ నుదుటి తిలకం
మిహికాచలం నీ ఎదను వెలిగే పతకం.
ఒక కన్ను మండే సూర్యుడు
రెండవది పున్నమి చంద్రుడు.

బుక్కులు పలికే అనాదికి
దిక్కులు కలిపే వినోదం,
ప్రభవంలో ప్రళయవిరాట్టు
ప్రలయంలో లయ స్వరాట్టు.

సదసత్ సంశయంలో
తత్ తత్ సమన్వయానివి,
అస్తి నాస్తి విచికిత్సలో
'తత్త్వమసి' ప్రథమచికిత్స,

గంధంలో రక్త చందనానివి
రంగంపై అర్జున రథసారథివి,
భవరోగ ప్రమాదానికి
యోగమూలికా ప్రయోగివి,

అనంత జీవన స్వర వల్లరిపై
నిరంతర విరహగీతికా పల్లవివై,
అహంకార అంధకారంలో చిలికిన
నా ఆత్మను వెలిగించిన ఉదయ రవివి.

— ఉప్పు రాఘవేంద్రరావు

మున వధూజన సంగమమున వివాహ సమయములందున్" అని యీ యేనింటి యందసత్యభాషణంబు లేదను ధర్మసూక్ష్మము నుపదేశించెను. శుక్రుఁడు శాపంబీయంగా నయ్యయాతి "ఋతుమతియై పుత్రార్థము పతిం గోరిన భార్య యందుఁ బ్రతికూలుండై ఋతువిఫలత్వము సేసిననతనికి మఱి భ్రూణహత్య యగునండ్రు బుధుల్" అని చెప్పించుటలో నన్నయ పతి, భార్య యను పదముల వాడుకలో గొప్ప ధర్మజ్ఞతను బ్రకటించినాఁడు, భార్యయగు దేవయాని దాసియగు శర్మిష్ఠ భరింపఁబడునది యగుటచే భార్యయే! భరించువాఁడు గావున యయాతి భర్త. ఋతుమతియై దన్ను గోరిన భార్యను నిరసించుట ధర్మవిరుద్ధమని పై శబ్దములతో ధర్మసూక్ష్మమును బ్రతిపాదించినాఁడు.

పూరుని రాజుఁగాఁజేయ నఖిల జనులు యదుఁడగ్ర తనూజుఁడుండ నిట్లొనర్చుట బాడియే యన "తనయుండు తల్లిదండ్రులు పనిచిన పని సేయఁడేని పలుకెదలోఁజే కొనఁడేనివాఁడు తనయుండనఁబడునే పిత్రు ధనమున కర్హుండగునే" యని పుత్రధర్మమును నిరూపించెను. ఇది యానాఁడేగా దీనాటికిని శిరోధార్యమే. "జీవతో వాక్యకరణం.. త్రిభిః పుత్రస్యపుత్రతా" యను ధర్మముచే పుత్రుఁడు పుత్రధర్మమును వ్యతిరేకించినాఁడు పుత్రుఁడు కాఁడనుట సూచింపఁబడినది.

యయాతిచే పూరునకు రాజనీతిని బోధింపఁజేయుచు 'ఎఱుక గలవారి చరితలు గఱచుచు సజ్జనుల గోష్ఠి గదలక ధర్మం బెఱుఁగుచు నెఱిఁగినదానిని మఱవకనుష్ఠించునది సమంజసబుద్ధిన్. ఇచ్చునది ధనము పాత్రునకచ్చుగనొరువేఁ డకుండునదియభిముఖులై వచ్చిన యాశార్థుల వృథపుచ్చక చేయునది సర్వభూతప్రీతిన్, మనమునకుం బ్రియంబును హితమును బథ్యముఁ దథ్యమును నమోఘము మధురంబును బరిమితముసునగు పలుకొనరఁగ బలుకునది ధర్మయుతముగ నభలన్: వదనబాధాన నవ్యక్తముక్తములైన పలుకు లన్కడువాఁడి బాణతతులఁ బరమర్మలక్ష్యముల్ పాయకభేదించుచుండెడు దుర్జనయోధవరుల కడనుండకున్న ది.కరుణయార్జవ మక్షజయము సత్యంబును శమము శౌచమను వీని యెద నిల్పునది. శత్రుషడ్వర్గ జయమందునది,శుద్ధశాంతబుద్ధి మదముఁ గామంబు గ్రోధంబు మత్సరంబు లోభమును మోహమును నను లోని సహజవైరి వర్గంబు నొడిచినవాఁడ యొడుచు నశ్రమంబున వెలుపలియహితతతుల" ననిబోధించుటఁజూడ యీ ధర్మంబులన్నియు కేవలము నానాటి రాజులకు మాత్రమే కాక సర్వజనులకు సర్వకాల సర్వావస్థ లందు బాటింపఁదగిన ధర్మములని ఇంతియే గాదు ఇది ఈనాఁడు పాలకులు అధికారులుకూడ పాటించిన నార్థిక యసమానతలుండకసమసమాజస్థాపనజరుగును గదా!

అహంకార మెప్పుడును బనికిరాదు. అంతియేగాదు. ఆత్మస్తుతియునునింద్యమే యనుటతోఁబాటు నితరుల నవమానించుట సర్వదా నింద్యమనుటను దేవేంద్రుఁడు యయాతిని స్వర్గలోక పదభ్రష్టునొనర్చుటను "నది పాడియె యెందును నల్పమయ్యు దర్పము బహుకాల సంచితతపః ఫలహాని యొనర్పకుండునే" యను నర్థాంతరన్యాసాలంకారమున మనస్సునకు హత్తుకొనునట్లుపదేశింపఁ బడినది.

ఉత్తమాధమధర్మంబులు నిర్ణయించుచునొక్కగీతమున నన్నయ "సర్వభూతదయకు సత్యవాక్యమునకు, నుత్తమంబు ధర్మువొండెఱుంగ నొరుల నొప్పికోడకువతాప మొనరించునదియ కడు నధర్మమనిరి బుధులు" అని సూచించెను.

చక్కని పరిపాలన మొనర్చిన రాజులఁ గూర్చి "అతని రాజ్యంబున నుర్వీతలము ప్రజాసమృద్ధి వెలసిరుజాశోకాతంకక్షయశంకాపేతంబై ధర్మచరిత బెరుగుచుమండెన్" అని యొక్క కందంబున బ్రశంసించెను. ఈనాఁడిట్టి పాలన మృగ్యము గదా.

స్త్రీలు పురుషుల పురుషులు స్త్రీలఁ గనినంతనె కామించుట నింద్యమని సూచించెను.

(81 వ పేజీలో)




తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# ఉదయాస్తమాన సర్వసేవాపథకం

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి వారిని సంపూర్ణంగా అర్చించడానికి భక్తులకొక సదవకాశం!

తలుపులు తెరచినప్పటి నుండి తిరిగి తలుపులు మూసేవరకు ఒక దినంలో తిరుమల శ్రీవారి ఆలయంలో జరిగే సమస్త పూజావిధులను అనగా సుప్రభాతం, తోమాల, అర్చన (మూడు పర్యాయాలు) నైవేద్యం ఇంకా ఇతర ప్రత్యేక సేవలను ఉదయాస్తమాన సర్వసేవానిధి పథకం క్రింద భక్తులు తమ పేరిట స్వంత ఖర్చులతో స్వామివారికి జరిపించవచ్చును.

పథకంలోని ముఖ్యాంశాలు :

* కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం పేరిట ఒక లక్షరూపాయల విరాళాన్ని క్రాస్ చేసిన డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా చెల్లించాలి. శుక్రవారం సేవలకు మాత్రం మూడులక్షల విరాళం (అభిషేక నిమిత్తం) ఇవ్వవలసి వుంటుంది.

* భక్తులు తమ కైంకర్యములు జరిపే రోజున ఆరుమంది సభ్యులకు శ్రీవారి దర్శనం వుంటుంది. అనివార్య కారణాలవల్ల కొన్ని సేవలు రద్దుకాని పక్షంలో సుప్రభాతం, తోమాలసేవ, సహస్రనామార్చన, ఏకాంతసేవల వంటి అన్ని పూజావేళలలో శ్రీవారిని దర్శించవచ్చును. (శుక్రవారం తప్పించి)

* కైంకర్యదినాన ఆలయంలోపల దాత పేరు ప్రదర్శింపబడుతుంది. గోత్రాదులతో సహా దాత పేరును శ్రీవారి కొలువులో ప్రకటిస్తారు

* ఆ దినాన జరిగే ఆర్జిత సేవలన్నింటిని కైంకర్యదాత తన వారితోసహా తిలకించవచ్చును.

* కల్యాణోత్సవంలో శ్రీవారి ఉత్సవమూర్తులకు సమర్పించే శేషవస్త్రాలు మూడింటిలో ఒకదానిని గృహస్థుకు బహూకరిస్తారు. ఉచితప్రసాదంగా 25 లడ్డులను, 5 వడలను ఇస్తారు.

* వస్తువుల ధరలు గణనీయంగా పెరిగిపోయిన పక్షంలో పూజాకార్యక్రమాల అదనపు వ్యయాన్ని దాతలే భరించవలసి వుంటుంది. అందుకు సిద్ధంకానపుడు ఆనాటి అదనపు వ్యయం భర్తీ చేసేందుకు దేవస్థానం మరొకరి విరాళాన్ని స్వీకరించవలసి వస్తుంది. అటువంటి సందర్భాలలో ఒకరు లేదా అంతకు మించిన దాతల పేర్లతో ఆనాటి పూజలు జరుపబడుతవి.

* కైంకర్యములు జరిగే తేదిని గురించిన వివరాలను దేవస్థానం ఆయా దాతలకు తెలియజేయగలదు.

ఈ పథకం గురించిన ఇతర వివరాలకు - వివరణలకు కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి అనే చిరునామాకు వ్రాయండి.

# యువ వాణి

## ఆధ్యాత్మిక విద్య

— దిట్టకవి శ్రీనివాసాచార్యులు

ఆధ్యాత్మికవిద్య మనుష్యునకు లభించుట యనునది ఒక పెద్ద వరముగా భావింప వచ్చును. సకల విషయ వాసనల కాట పట్టయి, సంకుచిత, స్వార్థపూరిత మనుష్యులకు నిలయమైనట్టి, ఈ విద్రోహపూరితమైన కల్లోల వాతావరణ విశృంఖలాలను సడలించుకొని, శాంతపూరితమై, నిత్యతేజో వంతమై, ఆనందమునకునికి పట్టైన అఖండ బ్రహ్మానంద పదవితో కూడినట్టి ఆధ్యాత్మిక వాతావరణమునందు ప్రవేశించుట యనగా, అది కోటి పూర్వజన్మల పుణ్య ఫలితమని చెప్పకతప్పదు. అందునను అట్టి దుర్లభమైన ఆధ్యాత్మికాసక్తి బాల్యము నుండియే లభించుటయనగా అతనిపై సాక్షాత్తు శ్రీమన్నారాయణుని కృపాకటాక్ష వీక్షణములు ప్రసరించుటయే!

మహాసముద్రమును గూడా చిన్న తెప్ప నుపయోగించి దాటవచ్చును! అట్లేదట్టమై, నిబిడాంధకారముతోయున్న అరణ్యము లను సైతము చిన్నదీపము నుపయోగించి దాటవచ్చును. అదేవిధముగా ఘోరమైన సంసారసాగరమును గూడా ఆధ్యాత్మిక మనెడి చిన్న తెప్పనుపయోగించి దాట వచ్చును; క్షణికానందమును గూర్చి విషయ వాంఛల కాస్థానమైన మానవుని మనస్సు నందు ఎప్పటినుండైతే ఆధ్యాత్మిక తేజో బింబముదయించునో నిజముగా అప్పటి నుండియే అతని నిజజీవితము ప్రారంభ మైనదనియు అతని జన్మమునకొక సార్థకత ఏర్పడినదనియు గ్రహించవచ్చును. క్షణ క్షణమునకు దుఃఖములపాలు చేయు నదియు, ఆనందమునకు స్థానములేనటు వంటి అంతవరకు గడపిన జీవితము జీవి తమే కాదు!

కనుక దీనినిబట్టి ఆధ్యాత్మికశక్తి మన జీవితమునందు ఎంతముందుగా ప్రవేశిం చిన అంతమంచిదనియు, అప్పటినుండియే మన మానందమునకు మార్గమేర్పడునోగాని వచ్చునని యు తెలియుచున్నది. కావున బాల్యమునుండియే ఈ ఆధ్యాత్మిక విద్యా సక్తిని పెంపొందించుకొనినచో, మనస్సు పెరుగుచున్నకొలది ఆ విద్యాసౌగంధ్యపది మన హృదయమునందు వెల్లివిరిసి నిలిచియుండును!

అయితే బాల్యమునుండియే ఆ విద్య నలవరచుకొనవలెనన్నచో ప్రహ్లాదుడు, ధృవుడు, మార్కండేయుల వంటి మహనీ యులకు తప్ప మనవంటి సామాన్య మాన వులకు తనకుతానుగా స్వయముగా సున్ఫ వించుట చాలా కష్టము! అందునను ఆ యుగపు పరిస్థితులు వేరు! ఇప్పటి పరిస్థి తులు వేరు! ఆ కాలమునందు ఆధ్యాత్మిక మలవడుటకు వీలైన పరిస్థితులు పరిసరము లలో లభించినవి; ఈకాలములో ఇట్టి కల్లోల పరిస్థితులయందు స్వయానా, బాల్యము నందే అలవడుట కష్టము! కనుక ప్రక్కన ఉన్న పెద్దవారు వారికి ఆ విద్యపై ఆసక్తి కల్గించునట్లుచేసి, దానికి తగిన వాతావరణ మును వారే కల్పించవలయును! వారిలో ముఖ్యముగా తల్లిదండ్రులే ప్రధానపాత్ర వహించవలయును! బాల్యమునుండియూ పిల్లలందరూ సామాన్యముగా తల్లిదండ్రుల వద్దనేయుండి, వారికి అందుబాటులో మసలుచుందురు; అందున చిన్నవయస్సు నందు తల్లిదండ్రుల మాటే వారికి వేద వాక్యము! వారేది చెప్పినను అది ఆ పిల్లలు త్రికరణశుద్ధిగా నమ్మి అది ఆచరిం చుదురు. తల్లిదండ్రులు బాల్యమునందు చెప్పినమాటలు, పద్ధతులే వారి జీవితాం తము వరకు మనస్సులో నిలబడిపోవును! ఆ తర్వాత ఎవరేది చెప్పిననూ వారు నమ్మరు! కనుక బాల్యమునందు చెప్పిన మాట, వారి జీవితముపైన ఎంతయో ప్రభావము చూపును!

బాలలకు మొట్టమొదటి గురువు తల్లి! బాల్యమందు తల్లి యొడియే పిల్లలకు పరమావధి! అందులోనే వారికి స్వర్గా నందము సమకూడును! ఇంక ఎన్నివస్తువు లిచ్చినను వానియందు అవి లెక్క లోనికిరావు! తల్లియొడిలో పరుండి ఆమె చెప్పిన కథలు వినుచు, వారు చక్కగా నిద్రింతురు. అప్పుడు ఆమె చెప్పిన మాటలమీదనే జీవితాంతము వరకు తన పద్ధతులను కొనసాగింతురు. కనుక ఆ సమయములో తల్లి చెప్పుమాటలు వారి చిన్నారిబుద్ధిని వికసింపజేయునవిగా, ధైర్యసాహసోపేతములైనవిగా, శాంతపూరి తములైనవిగా యుండవలెను. ప్రస్తుతము ప్రపంచమంతయు 'భారతదేశ సింహము' గా కొనియాడబడుచున్న వివేకానందుని మొట్టమొదటి గురువు తల్లియే. ఆమె అత నికి ప్రతిదినము రామాయణ, భారత గాథలు బోధించుచు, ఉత్తేజపూరితము లైన మాటలను చెప్పెడిది. అట్లే ప్రతి తల్లియు బాలలలో ఆధ్యాత్మికాసక్తి కల్గు నట్లుగా బోధించి, వారిలో ఒక చైతన్య వంతమైన మార్పు కలుగునట్లు చేయ వలెను. దానధర్మములయొక్క విశిష్టతను, ప్రేమతత్వమును, సేవాభావమును, త్యాగ గుణములను వివరించి చెప్పి వారిచేత ఆ కార్యక్రమములు చేయించుచుండవలెను.

తాము ఆచరించుచు, వారిచేత ఆచ రింప చేయించుచుండుటవలన బాలల మన స్సుల యందు ఆ భావములు సుదృఢ ముగా నాటుకొనిపోవును. ప్రతిదినము పిల్లలను దేవాలయమునకు తీసుకొనివెళ్ళి వారికి అక్కడి విశేషములను వివరించుచు వారిలో ఆసక్తి కల్గింపజేయవలయును. వారికి మహాత్ముల యొక్క జీవితచరిత్రలు, బాలభక్తులైనటువంటి ప్రహ్లాదుడు, ధృవుడు, మార్కండేయుని జీవితవిశేషములు, వారల భక్తిప్రపత్తులు, వారికి వివరించి చెప్పి, అదే విధముగా వారిని గూడా ఆచరింపుడని పదే

పనే శాశ్వి చెప్పుచుండవలయును. వారి ముందు ఏ అసత్యములైన వచనములు గాని, కలహపూరిత వాతావరణముగాని సృష్టించరాదు! పెద్దలే వారిముందు తప్పులు చేసినయెడల ఇక పిన్నలకేమి అబ్బును? వారిముందు ఏమాట మాటాడినను ఏ పాట పాడినను భగవంతుని లీలా విశేషములను తెలియజేసేదిగా యుండవలయును. అట్లుచేసి వారిచుట్టూ ఒక భగవత్సంబంధమైన వాతావరణమును కల్గింపవలయును!

ఇక బాలల శిక్షణలో తండ్రి కర్తవ్యము గూడా చాలా కలదు. వారికి ధైర్యసాహసోపేతములను నేర్పుట, విద్యావినయముల యందు ఆసక్తి కల్గింపచేయుట, ప్రతి పని యందును వారికి ఉత్సాహము కల్గింపజేయుట, ఏదైనా కష్టములు, అపాయములు సంభవించినపుడు వాటిని తమ మేథాశక్తిచేత నివారించుకొనునట్లు చేయుటయను పద్ధతులను బిడ్డ తండ్రి నుండియే నేర్చుకొనును. వాటన్నింటి యందును తండ్రి చాలా శ్రద్ధతీసుకొని, బిడ్డలకు వారికుత్సాహకరమైన రీతిలో బోధించవలయును. వారు తమ జీవితమును సక్రమమైన విధానములో గడుపుటకు వారొనర్చవలసిన పద్ధతులన్నియు చెప్పవలయును. బీదసాదలయెడ దయాగుణము, అతిథి అభ్యాగతులన్నచో గౌరవము, పెద్దలయెడ వినయసంస్కారములు, నలుగురి ముందు మాట్లాడవలసిన తీరును వారికి అర్థమయ్యే రీతిలో బోధించవలయును.

బిడ్డలు ఏదైనా తప్పు చేసినయెడల వారిని శిక్షించుటయందు తండ్రి చూపించవలసిన నేర్పు ఎంతయోయున్నది. ప్రస్తుతము అందరు తల్లిదండ్రులు, బిడ్డలను సక్రమమైన మార్గములో పెట్టవలయునని, వారి మనస్సునకు గాయమగునట్లుగా తీవ్రముగా నిందించి, వారిని కొట్టుచుందురు. కాని వారి మనస్సునందు అట్టి పద్ధతులవలంబించుట వలన చేసిన తప్పు చేయగూడదను పరివర్తన ఏమైనా కలుగుచున్నదా? కలుగకపోగా వారు తల్లిదండ్రుల యందు వైరము పెంచుకొనుచున్నారు. అట్లుకాదు! బాల్యమునందు వివేకానందుడు తన తల్లిని నిందించినందులకు అతని తండ్రి అతనికి వేసిన శిక్ష ఏమిటో తెలుసా! వివేకానందుని గదియందు "నరేంద్రుడు (బాల్యనామము) ఈ విధముగా తన తల్లిని నిందించెను" అని ఆ నిందావాక్యములను గోడపై వ్రాసెను. ఆ వాక్యములను నరేంద్రుడు పదేపదే చూచి తన తప్పు క్షమించమని తల్లిదండ్రులను వేడుకొనెను! తర్వాత మరెప్పుడు అతడు తల్లిని నిందించలేదు! ఈ విధమైన రీతిలో తండ్రి, తమ బిడ్డలలో పరివర్తన వచ్చునట్లుగా, వారిని సునిశితముగా శిక్షింపవలయును.

ఈ విధముగా ప్రతి ఒక్క తల్లిదండ్రులు తమ బిడ్డలయొక్క శిక్షణయందు తగుశ్రద్ధ వహించి, ఉత్సాహపూర్వకముగా వారికి ఆధ్యాత్మిక విద్యయందు ఆసక్తి కల్పించినచో రాబోవు ప్రతి విద్యార్థి, ప్రతి యువతి, ప్రతి యువకుడు అఖండ ఆధ్యాత్మిక తేజముతో వెలుగొంది సక్రమమైన మార్గములో తమ జీవితములను కొనసాగించెదరను మాట వాస్తవము!



# శ్రీమద్భగవద్గీత (సీరియల్)

వ్యాఖ్యాత : శ్రీ రాప్తల సూర్యనారాయణమూర్తి

(గతసంచిక తరువాయి)

అర్జున ఉవాచ:

జ్యాయసీ చే త్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన ।
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ ॥

అర్జునుడు: జనార్దనా! కర్మకంటే జ్ఞానమే మేలని నీ వుద్దేశమా? అలాంటప్పుడు ఘోరమైన ఈ యుద్ధకర్మకు నన్నెందుకు పురికొల్పుతున్నావు?

వ్యామిశ్రేణైవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే ।
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయామ్॥

అటూయిటూ కాని మాటలతో నా మనసుకు మరింత కలత కలగజేస్తున్నావు. అలా కాకుండా నాకు మేలు చేకూర్చే మార్గం ఏదో ఒకటి ఖచ్చితంగా చెప్పు.

శ్రీభగవానువాచ:

లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తామయాఽనఘ!।
జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం కర్మయోగేన యోగినామ్ ॥

శ్రీకృష్ణభగవానుడు: అర్జునా! గతంలో నేను చెప్పిన రెండు మార్గాలూ లోకంలో వున్నాయి. అవి: సాంఖ్యులకు జ్ఞానయోగం, యోగులకు నిష్కామ కర్మయోగం.

న కర్మణా మనారంభాత్ నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే।
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥

కర్మలు చేయనంత మాత్రాన పురుషుడు కర్మబంధాలకు దూరంగా ఉండలేడు. కేవలం కర్మసన్యాసం వల్ల కూడా ఆత్మజ్ఞానం లభించదు.

న హి కశ్చిత్ క్షణ మపి జాతు తిష్ఠత్యకర్మకృత్।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః॥ 5

కర్మలు చేయకుండా ఎవడూ ఒక్క క్షణం కూడా వుండలేడు. ప్రకృతి గుణాల ప్రభావాలకు లోనై ప్రతివాళ్ళూ అస్వతంత్రులై కర్మలు చేస్తూనే వున్నారు.

కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్।
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే॥

పైకి అన్ని కర్మేంద్రియాలనూ అణచిపెట్టి మనసులో మాత్రం విషయ సౌఖ్యాల గురించి ఆలోచించే అవివేకిని కపటాచారం కలవాడు అంటారు.

యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున।
కర్మేంద్రియైః కర్మయోగం, అసక్తస్స విశిష్యతే॥

అర్జునా! మనసుతో జ్ఞానేంద్రియాలను స్వాధీనంలో వుంచుకొని, కర్మేంద్రియాల ద్వారా నిష్కామకర్మ చేస్తున్న వాడు ఉత్తముడు.

నియతం కురు కర్మత్వం కర్మ జ్యాయో హ్యకర్మణః।
శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః॥

నీ కర్తవ్యకర్మ నీవు ఆచరించవలసిందే. కర్మలు విడిచి పెట్టడం కంటె చేయడమే శ్రేయస్కరం. కర్మలు చేయకుండా నీవు దేహయాత్ర కూడా సాగించలేవు.

యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః।
తదర్థం కర్మ కౌన్తేయ! ముక్తసంగస్సమాచర॥

కుంతీపుత్రా! యాగసంబంధమైనవి తప్ప తక్కిన కర్మలన్నీ మానవులకు సంసారబంధం కలుగజేస్తాయి. కనుక ఫలాపేక్ష లేకుండా దైవప్రీతి కోసం కర్మలు ఆచరించు.

సహ యజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।
అనేన ప్రసవిష్యధ్వం ఏష వోఽస్త్విష్టకామధుక్॥

ప్రాచీన కాలంలో ప్రజలనూ యాగాలనూ సృష్టించి ప్రజాపతి ఇలా అన్నాడు: "యజ్ఞం కోర్కెలను నెరవేర్చే కామధేనువు. దీనివల్ల మీరు పురోభివృద్ధి చెందండి."

దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః।
పరస్పరం భావయన్తః శ్రేయః పర మవాప్స్యథ॥

యజ్ఞయాగాలతో మీరు దేవతలను సంతృప్తి పరచండి పాడిపంటలు లాంటి సమృద్ధులిచ్చి వారు మీకు సంతోషం కలుగజేస్తారు. పరస్పర సద్భావం పరమ శ్రేయస్సు మీకు చేకూర్చుతుంది.

ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః।
తైర్దత్తానప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః॥

యజ్ఞాలతో తృప్తిపడ్డ దేవతలు మీ వాంఛితాలు నెరవేరుస్తారు. దేవత లిచ్చిన సుఖభోగాలు అనుభవిస్తూ, వారికి మళ్ళీ ఆ సంపదలో కొంత కూడా అర్పించనివాడు దొంగ.

యజ్ఞశిష్టాశినః సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః ।
భుంజతే తే త్వఘం పాపా యే పచంత్యాత్మకారణాత్ ॥

యజ్ఞాలుచేసి దేవతలకు అర్పించగా మిగిలిన పదార్థాలు భుజించే సజ్జనులు సర్వపాపాలనుంచీ విముక్తులవుతున్నారు. అలా కాకుండా తమ కోసమే వండుకుంటున్న వాళ్ళు పాపమే తింటున్నారు.

అన్నా ద్భవంతి భూతాని పర్జన్యా దన్నసంభవః ।
యజ్ఞా ద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః ॥

అన్నం వల్ల ప్రాణులన్నీ పుడుతున్నాయి. వర్షంవల్ల అన్నం లభిస్తున్నది. యజ్ఞం మూలంగా వర్షం కలుగుతున్నది. యజ్ఞం సత్కర్మల వల్ల సంభవిస్తున్నది.

కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్ ।
తస్మా త్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥

కర్మ వేదం నుంచి పుట్టింది. పరమాత్మవల్ల వేదం వెలసింది. అంతటా వ్యాపించిన పరమాత్మ అందువల్లనే యజ్ఞములో ఎప్పుడూ వుంటాడు.

ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః ।
అఘాయు రింద్రియారామో మోఘం పార్థ! స జీవతి ॥

పార్థా! ఇలా తిరుగౌతున్న జగత్ చక్రాన్ని అనుసరించనివాడు పాపి: ఇంద్రియలోలుడు. అలాంటివాడి జీవితం వ్యర్థం.

యస్త్వాత్మరతి రేవ స్యాత్ ఆత్మతృప్తశ్చ మానవః ।
ఆత్మ న్యేవ చ సంతుష్టః తస్య కార్యం న విద్యతే ॥

ఆత్మలోనే ఆసక్తి, సంతృప్తి సంతోషం పొందేవాడికి విధ్యుక్తకర్మ లేవీ వుండవు.

నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన ।
న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః ॥

అలాంటి ఆత్మజ్ఞానికి ఈ లోకంలో కర్మలు చేయడం వల్లకాని మానడం వల్లకాని ప్రయోజనం లేదు. స్వార్థదృష్టితో సృష్టిలో దేనినీ అతను ఆశ్రయించడు.

తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర ।
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ॥

అందువల్ల నిరంతరం నిష్కామంగా కర్మలు ఆచరించు అలా ఫలాపేక్ష లేకుండా కర్మలు చేసేవాళ్ళకు మోక్షం కలుగుతుంది.

కర్మణైవ హి సంసిద్ధిం ఆస్థితా జనకాదయః ।
లోకసంగ్రహ మేవాఽపి సంపశ్యన్ కర్తు మర్హసి ॥

జనకుడు మొదలైనవారు నిష్కామకర్మతోనే మోక్షం పొందారు. లోకక్షేమం కోసమైనా నీవు సత్కర్మలు చేయాలి.

యద్య దాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే ॥

ఉత్తముడు చేసిన పనినే ఇతరులుకూడా అనుకరిస్తారు. అతను నెలకొల్పిన ప్రమాణాలనే లోకం అనుకరిస్తుంది.

న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥

పార్థా! ముల్లోకాలలోనూ నేను చేయవలసిన పని ఏమీ లేదు. నాకు లేనిది కాని కావలసింది కాని ఏమీ లేక పోయి నప్పటికీ లోకవ్యవహారాలు నిత్యమూ నిర్వర్తిస్తూనే వున్నాను.

యది హ్యహం న వర్తేయం జాతు కర్మ ణ్యతన్ద్రితః ।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః ।



అర్జునా! ఏ మాత్రమూ ఏమరుపాటు లేకుండా నేను నిరంతరంకర్మలుచేయకపోతే,ప్రజలంతా అలాగేప్రవర్తిస్తారు.

ఉత్సీదేయు రిమే లోకాః న కుర్యాం కర్మ చేదహమ్ ।
సంకరస్య చ కర్తా స్యామ్ ఉపహన్యా మిమాః ప్రజాః ॥

నేను కర్మలు ఆపివేస్తే ప్రజలంతా భ్రష్టులై పోతారు. రకరకాల సంకరాలకూ, ప్రజలనాశానికి నేనే కర్తనవుతాను.

సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత! ।
కుర్యా ద్విద్వాం స్తథా సక్తః చికీర్షు ర్లోకసంగ్రహమ్ ।

అర్జునా! అజ్ఞానులు ఫలితాలు ఆశించి కర్మలు చేసినట్లే ఆత్మజ్ఞానులు ఫలాపేక్ష లేకుండా లోకకల్యాణం కోసం కర్తవ్య కర్మలు ఆచరించాలి.

న బుద్ధిభేదం జనయేత్ అజ్ఞానం కర్మసంగినామ్ ।
జోషయేత్ సర్వకర్మాణి విద్వాన్ యుక్తస్సమాచరన్ ॥

ఫలంకోరి కర్మలుచేసే పామరుల బుద్ధిని విజ్ఞులు వికలం చేయకూడదు. జ్ఞాని యోగిగా సమస్త కర్మలూ చక్కగా ఆచరిస్తూ ఇతరుల చేతకూడా చేయించాలి.

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః।
అహంకార విమూఢాత్మా కర్తాహ మితి మన్యతే॥

ప్రకృతి గుణాలవల్ల సర్వకర్మలూ సాగుతుండగా, అజ్ఞాని అహంకారంతో, కర్మలను తానేచేస్తున్నానని తలుస్తాడు

తత్వవిత్తు మహాబాహో! గుణకర్మ విభాగయోః।
గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే॥

గుణాలు, కర్మల నిజస్వరూపం తెలిసిన తత్వవేత్త ఇంద్రియ రూపాలైన గుణాలు విషయరూపాలైన గుణాల మీదే నిలిచి వున్నాయని గ్రహించి వాటి దరికి చేరడు.

ప్రకృతే ర్గుణసమ్మూఢాః సజ్జన్తే గుణకర్మసు।
తా నకృత్స్నవిదో మన్దాన్ కృత్స్నవిన్న విచాలయేత్॥

ప్రకృతి గుణాలలో ముగ్ధులైన మూఢులు గుణకర్మల లోనే ఆసక్తి చూపుతారు. అయితే అల్పులూ, మందబుద్ధులూ అయినవాళ్ళ మనస్సులను జ్ఞానులు చలింప చేయకూడదు.



మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా।
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుద్ధ్యస్వ విగతజ్వరః॥

నీవుచేసే సమస్త కర్మలూ నాకు సమర్పించి, వివేకంతో ఆశామమకారాలు విడిచిపెట్టి నిశ్చింతగా యుద్ధం చెయ్యి.

యే మే మత మిదం నిత్యం అనుతిష్ఠంతి మానవాః।
శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యంతే తేపి కర్మభిః॥

అసూయలేకుండా శ్రద్ధాసక్తులతో నిరంతరం నా ఈ అభిప్రాయం ప్రకారం ప్రవర్తించే మానవులు కర్మబంధాల నుంచి విముక్తులవుతారు.

యే త్వేత దభ్యసూయన్తో నానుతిష్ఠంతి మే మతమ్।
సర్వజ్ఞాన విమూఢాం స్తాన్ విద్ధి నష్టా నచేతసః॥

నేను ఉపదేశించిన ఈ నిష్కామకర్మయోగ విధానాన్ని నిందించి ఆచరించనివాళ్ళు అవివేకులూ. అజ్ఞానులూ అన్ని విధాల చెడిపోయినవాళ్ళూ అని తెలుసుకో.

సదృశం చేష్టతే స్వస్యాః, ప్రకృతే ర్జ్ఞానవా నపి।
ప్రకృతిం యా న్తి భూతాని, నిగ్రహః కిం కరిష్యతి?

పండితుడు కూడా తన సహజ స్వభావం ప్రకారమే ప్రవర్తిస్తాడు. ప్రాణులన్నీ తమతమ ప్రకృతినే అనుసరిస్తాయి అలాంటప్పుడు నిగ్రహం ఏం చేస్తుంది?

ఇంద్రియ స్యేంద్రియ స్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ।
తయో ర్న వశ మాగచ్ఛేత్ తౌ హ్యస్య పరిపంథినౌ॥

ఇంద్రియా లన్నిటికీ తమతమ విషయాలపట్ల అనురాగం. ద్వేషం వున్నాయి. ఎవళ్ళూ వాటికి వశులు కాకూడదు. అవి మానవులకు బద్ధశత్రువులు.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥

ఇతరుల ధర్మం చక్కగా ఆచరించడం కంటే లోటు పాటులతో అయినా తన ధర్మం పాటించడమే మేలు. పర ధర్మం భయంకరితం కావడం వల్ల స్వధర్మాచరణలో మరణమైనా మంచిదే.

అర్జున ఉవాచ:

అథ కేన ప్రయుక్తోయం పాపం చరతి పూరుషః।
అనిచ్ఛ న్నపి వార్ష్ణేయ బలా దివ నియోజితః॥

అర్జునుడు: కృష్ణా! తనకు ఇష్టం లేకపోయినా మానవుడు దేని బలవంతం వల్ల పాపాలు చేస్తున్నాడు?

శ్రీ భగవానువాచ:

కామ ఏష క్రోధ రజోగుణ సముద్భవః।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్॥

శ్రీ భగవానుడు: రజోగుణంవల్ల కలిగిన కామక్రోధాలు అన్ని పాపాలకూ మూలకారణాలు. ఎంత అనుభవించినా తనివితీరని కామమూ, పాతకాలకు దారి తీసే క్రోధమూ ఈ లోకంలో మానవుడికి మహాశత్రువులు.

ధూమేనావ్రియతే వహ్నిః య థాఽదర్శో మలేన చ।
యథోల్బేనావృతో గర్భః తథా తేనేద మావృతమ్॥

పొగ అగ్నినీ, మురికి అద్దాన్నీ, మావి గర్భంలోని శిశువునూ కప్పివేసినట్లు కామం ఆత్మజ్ఞానాన్ని ఆవరించింది.

ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా।
కామరూపేణ కౌంతేయ! దుష్పూరేణానలేన చ॥

అర్జునా! ఎంతకీ తృప్తి ఎరుగని అగ్నిలాంటి కామం జ్ఞానులకు నిత్యశత్రువు. ఆత్మజ్ఞానాన్ని అలాంటి కామం కప్పివేసింది.

(సశేషం)

# పూజాఫలము

— డా॥ కె. ఎస్. సత్యనారాయణ

ఒకప్పుడు కాంచీపురాన్ని చోళ చక్రవర్తి పరిపాలించేవాడు. ఆయన రాజ్యంలో అనాథ రోగులు, పాపులు, దుఃఖితులు ఎవరూలేరు. రాజు నిత్యం ఎన్నో దాన ధర్మాలూ యజ్ఞయాగాలూ చేస్తూ ఉండేవాడు. సంపదలకేమీ లోటులేదు. వారు స్వయంగా అతివైభవంగా శ్రీనివాసుని పూజించేవారు. కాని ఆయన మనస్సులో మాత్రం– "నేను పూజించినట్లుగా భగవంతుని మరెవ్వరూ పూజించలేరు"– అనే గర్వం ఏర్పడింది. అయితే భగవంతుడు ధనంచేత లభించడు; భక్తిచేతనే లభిస్తాడు అనే విషయాన్ని ఆయన విస్మరించాడు.

ఆ కాంచీపురంలోనే విష్ణుదాసుడనే పేద బ్రాహ్మణుడుండేవాడు. ఆయన గొప్ప విద్వాంసుడు. గొప్ప భగవద్భక్తుడు. భక్తి శ్రద్ధలతో పత్ర పుష్ప ఫలాలు సమర్పించినా భగవంతుడు స్వీకరిస్తాడని ఆయననమ్మకం. నదీతీరాన ఒక దేవాలయం ఉంది. ప్రతిదినము రాజు, విష్ణుదాసుడు కూడ ఆ దేవుణ్ణి దర్శించడానికి వెళ్తూఉండేవారు. ఒకనాడు చోళరాజు అమూల్యమైన ముత్యములు, రత్నములు, సువర్ణపుష్పములు మున్నగు వానితో భగవంతుని అర్చించి నమస్కరించి ఆ దేవళంలో ఆసీనుడై యున్నాడు. ఇంతలో విష్ణుదాసు ఒక చేతిలో జలపాత్ర, మరొక చేతిలో పూజా సామగ్రినితీసికొని ఆలయంలోనికివచ్చాడు. ఆయన రాజునుగాని, రాజుచే చేయబడిన పూజనుగాని చూడలేదు. తన భక్తి పారవశ్యంతో తిన్నగా భగవంతుని సమీపించి ఆరాధించ నారంభించాడు. విష్ణుసూక్తాన్ని పఠిస్తూ భగవంతున కభిషేకం చేసిన కారణంగా రాజుచే భగవంతునకు సమర్పింపబడిన వస్త్రభూషణాలన్నీ తడిసిపోయినాయి. ఆపై బ్రాహ్మణుడు తులసీదళాలను పూలను సమర్పించాడు. ఇదంతా చూచి రాజు మాత్సర్యుడై– "ఓరీ దరిద్ర బ్రాహ్మణా! నీ కిసుమంతైనా బుద్ధి యున్నట్లు కన్పించటంలేదు. నేను ముత్యాలతో, వజ్రవైడూర్యాలతో, సువర్ణపుష్పాలతో భగవంతుణ్ణితో చక్కగా అలంకరించాను. నీవు వచ్చి ఆ అలంకారాన్నంతా చెడగొట్టావు." అని పరుషంగా మాట్లాడాడు.

దానికి బ్రాహ్మణుడు, – "రాజా! నిజానికి నేను నీవు సమర్పించిన పూజా సామగ్రిని చూడనైనా చూడలేదు. నా దృష్టిలో భగవదారాధనకు ప్రధానమైనది ఆడంబరం గాదు. భక్తి. ఎవరి దగ్గర ఏముంటే దానిని భక్తితోభగవంతునకుసమర్పించుకోవచ్చు."

పత్రం, పుష్పం, ఫలం. తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి అని భగవానుడు




చెప్పియున్నాడు కదా! భగవంతుడు ధనముచేత మాత్రమే ప్రసన్నుడయేటట్లయితే యీపేద ప్రజానీకం భగవంతుని ఎలా ఆరాధించగలరు? అందుచేత నీవు నీ ధనగర్వాన్నీ దర్పాహంకారాలను వదలి నీకు తగినట్లుగా భగవంతుని ఆరాధించు. భక్తులు తమ తమ శక్తిని అనుసరించి భగవంతుని అర్చిస్తూ ఉంటారు. మన మా అర్చనల్ని చూచి సంతోషించాలి" అని పలికాడు.

రాజుకైతే ధనమదం లేశమాత్రం కూడ తగ్గలేదు. బ్రాహ్మణవచనాలను తిరస్కరిస్తూ "నీ పత్ర పుష్ప ఫలాల పూజకు భగవంతుడు ప్రసన్నుడౌతాడో, లేక నా విలువైన వస్తువులచేత చేసిన పూజకు ప్రసన్నుడౌతాడో వేచిచూద్దాం" అని దర్పంగా పలికాడు. బ్రాహ్మణుడు మాటలకు ఒప్పుకొని సరే అని అంగీకరించాడు.

రాజు వెంటనే ముద్గల మహర్షిని పిలిపించి విష్ణుయాగాన్ని ఆయన పర్యవేక్షణలో తలపెట్టాడు. చాలమంది బ్రాహ్మణులను విద్వాంసులను ఆహ్వానించాడు. రాజు గర్వంతో అపార ద్రవ్యాన్ని వెచ్చిస్తున్నాడు. పేదవాడైన విష్ణుదాసు దగ్గర చిల్లిగవ్వైనా లేదు. భక్తిమాత్రం పుష్కలంగా ఉంది. ఆయన వ్రతాలు, ఉపవాసాలు, తులసీవన సేవనము, "ఓం నమోభగవతే వాసుదేవాయ" మంత్ర జపంచేస్తూ భగవంతుని భక్తితో ఆరాధించ సాగాడు. సర్వ కాల సర్వావస్థలయందు భగవన్నామకీర్తన చేస్తూ, "శునిచైవశ్వపాకేచ పండితాస్సమ దర్శినః" అన్నట్లుగా అందరియందు భగవద్దర్శనం చేస్తున్నాడు. ఈ విధంగా ఇరువురూ జితేంద్రియులై తమ తమ అభిరుచులను బట్టి సాధన కొనసాగిస్తున్నారు. ఇలా చాలాకాలం గడచిపోయింది.

విష్ణుదాసు ప్రతినిత్యం ఉదయం అనుష్ఠానం ముగించుకొని రొట్టెలు చేసుకొని మధ్యాహ్నం ఒక్కసారి భోజనంచేస్తూ రాత్రింబవళ్ళు సాధన చేస్తున్నాడు. ఒకనాడు రొట్టెలు చేసిపెట్టికొని మరల వచ్చి చూచే సరి కవి కన్పించలేదు. మరల చేసికొందే కొంతకాలం దానికి వృధా అయిపోతుందని భావించి ఆకలితోనే ఉండిపోయాడు. రెండవ రోజుకూడ రొట్టెలు చేసి పెట్టుకొని అనుష్ఠానం పూర్తయిన తర్వాత భగవంతునకు నివేదన చేద్దామను కొనేసరికి రొట్టెలు లేవు. ఈ విధంగా రొట్టెలు మాయమయి పోవడంలో ఏడురోజులు గతించాయి.

ఎనిమిదవ రోజున రొట్టెలెవరు దొంగిలిస్తున్నారో తెలుసుకోవాలని, రొట్టెలు చేసి పెట్టి ఒకమూల పొంచి కూర్చున్నాడు. ఇంతలో ఒక చండాలుడు రొట్టెలు తీసికొని పోవడాన్ని గమనించాడు. ఆ చండాలుడు నిజానికి ఆకలితో బాధపడుతున్నాడు. అతని

ముఖంలో దైన్యం వ్యాపించి ఉంది. శరీరం అస్థిపంజరంలా ఉంది. అతని దైన్యాన్ని చూచేసరికి బ్రాహ్మణుని హృదయం కరిగిపోయింది. అదే సమయంలో సర్వం శ్రీనివాసమయంగా భావిస్తూ శ్రీనివాసుని దర్శిస్తున్న విష్ణుదాసు చండాలుని నిజంగా భగవంతునిగా భావించి చండాలునితో – "ఆగు! ఆగు! ఎందురొట్టెలా తింటావు! నెయ్యియిస్తాను. దాంతో కలుపుకొని తిను." అన్నాడు. చండాలుడు భయపడి పారిపోతున్నాడు. విష్ణుదాసు నేతిపాత్రను తీసికొని – "నాయనా! ఆగు, ఇదిగో నెయ్యి తీసికో అంటూ" వెంట పరుగిడుతున్నాడు. కొంతదూరం వెళ్ళేసరికి ఆకలితో అలమటించే చండాలుడు మూర్ఛితుడై పడిపోయాడు. విష్ణుదాసుకొక అద్భుత దృశ్యం కన్పించింది. చండాలుని శరీరంలోనుండి సాక్షాత్తు శంఖ-చక్ర-గదా పద్మాలను ధరించిన చతుర్భుజుడైన నారాయణమూర్తి అవతరించాడు. విష్ణుదాసు డానంద పారవశ్యంలో మునిగి ఆ దివ్య మధుర మనోహర రూపామృతాన్ని నేత్రాంజలులద్వారా పానం చేయ నారంభించాడు.

తదుపరి ఇంద్రాది దేవతలు, మహర్షులు అక్కడికి విచ్చేసారు. విష్ణుమూర్తి తన సాత్విక భక్తుడైన విష్ణుదాసుని ప్రేమతో కౌగిలించుకొని తనతోబాటు తన విమానంలో ఆతనిని కూర్చుండబెట్టుకొన్నాడు. విమానం ఆకాశమార్గాన పయనిస్తోంది. క్రింద చోళరాజు యజ్ఞం చేస్తున్నాడు. యజ్ఞదీక్షితుడైన చోళరాజు దరిద్ర బ్రాహ్మణుడు విష్ణువిమానంలో అతని భక్తి ప్రభావంచేత తన యజ్ఞ పూర్ణాహుతికి పూర్వమే వెళ్ళిపోతూండడం కనులారా చూచాడు. విష్ణుదాసుడు భగవంతుని దర్శించడమే కాక స్వయంగా విష్ణుమూర్తితో వైకుంఠానికి వెళ్ళుచుండడం చూచేసరికి రాజు ధన గర్వం హారతికర్పూరంలా కరిగిపోయింది' రాజున కింతవరకు ఉన్న ధనసంపదలతో చేసిన కర్మలకే విశేష ఫలం ఉంటుందనే భావం కాస్తా తొలగిపోయింది. యజ్ఞంలో పూర్ణాహుతి జరుగుతోంది. రాజునకు సంతానం లేదు. అతడు తన తమ్ముని పుత్రునకు రాజ్యాధికారాన్నప్పగించి యజ్ఞగుండం దగ్గర నిలబడి – "హే భగవంతుడా! నాకు ధర్మార్థకామమోక్షములేవియు అవసరం లేదు. నిశ్చలమైన భక్తిని ప్రసాదించు.' అంటూ యజ్ఞగుండంలోకి దూకాడు. రాజు నిజానికి భగవంతుని భక్తుడే. ఆయన ద్రవ్యమంతా భగవత్సేవకే వినియోగించబడింది. విష్ణుయాగ ఫలితం లభించవలసి వుండనే వుంది. ఇంతవరకు రాజున కడ్డుగా ఉన్న ధనదర్పం తొలగిపోయింది. ఆయన యజ్ఞగుండంలోనికి దూకగానే భక్తవత్సలుడైన శ్రీమన్నారాయణమూర్తి యజ్ఞాగ్నినుండి ఆవిర్భవించి రాజును కౌగిలించుకొని విమానంపై కూర్చుండబెట్టుకొని వైకుంఠానికి తీసికొని వెళ్ళిపోయాడు.

★



★

ఆ రోజు అక్బరు పాదుషావారు అన్యమనస్కంగా వున్నారు. తాన్‌సేన్‌గారి మధురగానం మెల్లగా వారిచెవిని సోకుతోంది. అయినా వారి మనసు ఆ గాన రసాస్వాదనకు సిద్ధంగాలేదు. కాసేపటికి తాన్‌సేన్ అది గమనించనే గమనించాడు.

"పాదుషా వారెందుకో ఈ రోజు పరాకు చిత్తగిస్తున్నారు" పాటను హఠాత్తుగా ఆపివేశాడు తాన్‌సేన్. ఉలికిపాటుతో ఈ లోకంలోకి వచ్చాడు అక్బరు పాదుషా- కాసేపు పరీక్షగా తాన్‌సేన్ వైపు చూశాడు- ఎన్నాళ్ళనుంచో దాచిపెడుతున్న ప్రశ్నను ఇక బైటపెట్టక తప్పదనుకున్నాడు. ఇంతకంటే మంచి సందర్భం ఇక దొరకదేమో!

"తాన్‌సేన్‌జీ! మిమ్ముల ఓ విషయం అడగాలనుకొంటున్నాను" అంటూ అక్బర్ సింహాసనంపై సర్దుకు కూచున్నారు. తాన్‌సేన్ లేచినిల్చొని- "అడగండి జహాపనా" అన్నాడు.

"అదేమిటి? తమరు లేచారు? ముందు మీరు కూర్చోండి" అక్బరు ఆప్యాయత ఒలికించాడు. తాన్‌సేన్ వినమ్రంగా కూర్చున్నాడు.

"గాయకాగ్రణీ! మీ గానం అద్భుతం సంగీతంలో మీకు మీరేసాటి అనిపిస్తుంది. అయినా చాలాకాలంగా నాకు ఓ సందేహం. ఏ విద్యకయినా గురువంటూ ఒకరు వుంటారు కదా! అందులోను సంగీతం లాంటి లలితకళా సాధనలో గురువు తప్పనిసరి అనుకొంటాను- సంగీతంలో మీ గురువెవరో తెలుసుకోవాలని నా కోరిక" అక్బర్ తన సందేహాన్ని సూటిగా బైటపెట్టాడు.

తాన్‌సేన్ మందహాసం చిందించాడు- "జహాపనా! ఇంతకాలం మీకు ఈ విషయాన్ని చెప్పకపోవటం నాదే తప్పు. నాకూ ఓ గురువున్నారు సంగీతంలో!"

"వారెవరో తెలుసుకోవాలని స్వయంగా చూడాలని నా అభిలాష" కుతూహలంగా అడిగాడు అక్బర్ - తాన్‌సేన్ తన గురువుగార్ని గురించి వివరంగా చెప్పాడు. వారిని ఓ రోజు దర్బారుకు తీసుకురమ్మన్నారు అక్బర్- అది కుదరదన్నాడు తాన్‌సేన్.

# ఢిల్లీశ్వరుడు జగదీశ్వరుడు

"కొండ మహమ్మద్ దగ్గరకు రాకపోతే మహమ్మదే కొండదగ్గరకు వెళ్ళేడు" అన్నట్లుగా అక్బర్ - ఆ గురువును చూడను తాన్‌సేన్ వెంట తానే వెళ్ళాలనుకొన్నాడు. అందుకు ఓ సుముహూర్తం నిశ్చయమైంది.

తాన్‌సేన్ వెంట పాదచారియై సామాన్య పౌరుడిలా వెళ్ళాడు అక్బర్-అదొక మబ్బులు తాకే కొండచరియ - అక్కడనుంచి దూకుతోంది ఒక జలపాతం. అక్కడ ప్రకృతి పైట జారవిడిచినట్లుగా కొండలు కోనలు పచ్చటివృక్షాలు, పిచ్చిపూలునూ! లేళ్ళు జింకలు నెమళ్ళు అక్కడ స్వేచ్ఛావిహారం చేస్తున్నాయి. అక్కడ మనిషి అలికిడన్నది లేదు- సృష్టిరహస్యం శోధిస్తున్నట్లు నిశ్శబ్దంగా వుంది, ప్రకృతికాంత. ఆ నిశ్శబ్దంలోంచే దూసుకొస్తోందొక రసధ్వని-అక్బర్ పరికించి చూశాడు. తంబురామీటుతూ పాడుతున్న ఓ వైరాగి కనిపించాడు.

వారే మాగురువుగారని చూపించాడు తాన్‌సేన్ - ఆ మధురగానంలో మునిగిపోయిన అక్బర్ మహారాజుకు, తాన్‌సేన్ గురువుగురించి వేరేవివరాలు అడగాలనిపించలేదు. తాన్‌సేనుతో దర్బారుకు తిరిగి వచ్చేశాడు.

అప్పటినుంచి ఆయన మనసులో ఒకటే మథనం! తాన్‌సేనుకు తాన్‌సేనే సాటి అనుకొన్నాడు ఇన్నాళ్ళూ! కానీ అది తన భ్రమ మాత్రమే తాన్‌సేన్‌ను మించినగాయకుడు- తాన్‌సేన్ గురువు ఒకడున్నాడు ఈ లోకంలో అయితే అతడులేడు తన దర్బార్‌లో - అదే అక్బరు బాధ - ఆ గురువును తన దర్బారుకు రప్పించడం జరగనిదని!

మరి తన దర్బారులో అంతకంటే తక్కువ స్థాయి గాయకుడు వుండటం తనకు తలవంపుకాదా? పోనీ తాన్‌సేన్‌ను ఆ గురువు స్థాయికి ఎదగమని కోరితే.

ఓ రోజు అక్బరు అడిగాడు. "తాన్‌సేన్‌జీ! మీరు మీ గురువులాగా ఎందుకు పాడలేకపోతున్నారు?"

తాన్‌సేన్ తొణక్కుండా జవాబు చెప్పాడు. "జహాపనా! మా గురువు జగదీశ్వరుణ్ణి గురించి పాడుతున్నారు-మరి నేనేమో ఢిల్లీశ్వరుణ్ణి కీర్తిస్తున్నా! అందుకే మా గానంలో ఆ తేడా"

ఆ మాటలో దేవుడికి జీవుడికి వున్న తేడా తెలిసొచ్చింది అక్బర్‌కి.

— శ్రీరమణ

# సహజమార్గంలో రాజయోగం

డా॥ కే.సి. అరవిందరాజగోపాల్

భగవత్సాక్షాత్కారము పొందుట కనేక మార్గములు వాడుకయందున్నవి. అన్ని సాధనములకంటె సహజమార్గమనబడు రాజయోగసాధన వుత్కృష్టమైనది. ఇది స్వాభావికమైన, సహజమైన, సరళమైన, సులభమైన యోగసాధన. పతంజలిమహర్షి కాలమునుండియు వ్యవహారమునందున్న యోగభ్యాస పద్ధతియే యిది.

ఆధ్యాత్మికుడు ఎటువంటి సాధనను అవలంబించుటవలన తనయందు దివ్య లేక భగవద్గుణము అభివృద్ధి పొందునో అట్టి సాధనయే ఫలితములును చేకూర్చగలదని రూఢిగా తెలుసుకొనగలము. మానవుడు తన జీవిత పర్యంతము భగవంతుని నిజ తత్వమును అతని అనంత స్థూలరూపముల యందే వినియోగించినచో ఆ అనంత సత్యముమ తెలుసుకొనును. కావున వివేకశాలి యగు సాధకుడు సత్యము నాధారముగా గ్రహించి తన మార్గము సహజసరళముగా నుండుటకు నిర్ణయించుకొనును.

ఈ సాధనయందు ఇతర సాధనలలోని కఠోర నియమనిష్ఠలులేవు. ఈ యోగమునందు సాధారణ గృహస్థాశ్రమమును వీడి, ఆస్తిపాస్తులు విసర్జించి సన్యాసాశ్రమమును ఆశ్రయింపుమని విధించలేదు. దైవప్రాప్తికి లౌకికజీవిత మాటంకమని నుడువు వాదము అసమంజసమే కాక అస్వాభావికమైనదియును. సాధారణ జీవితమును ఆధ్యాత్మిక జీవితముగా మార్చుకొనుటయే ఈ సహజ మార్గ సాధన ఏకైకలక్ష్యము.

అభ్యాసి మొట్టమొదట నిర్ణయింపవలసినది సమున్నతలక్ష్యము. పిదప సాక్షాత్కారమునకు తీవ్రమైన తపన. పూర్వీకులు దీనిని 'తీవ్రజిజ్ఞాస' యని వర్ణించిరి. దాని అసలు స్వరూపము సహజమార్గ సాధకుని యందు వ్యక్తమగును. అత్యంత సూక్ష్మమగు పరమ సత్యమును అనుభూతికి తీసుకొని రావలెనన్న సాధకుడాచరించు పద్ధతియు సూక్ష్మముగా నుండవలెను. నేలపైనున్న సూదినెత్తుటకు క్రేనును ఉపయోగించుట వ్యర్థముకదా!

సహజమార్గమునందు గురువు తనశక్తి చేత సాధకునియందలి నిద్రాణశక్తులను మేల్కొల్పి త్వరితముగావించి ప్రాణాహుతి మూలమున దైవీయప్రవాహమతనివైపు త్రిప్పును. తత్ఫలితమై సాధకుడు పరమానందము, సాక్షాత్కారము పొందుచూ ఆధ్యాత్మికముగా అభివృద్ధి బడయును. ఈ విధముగా యింతవరకు వృథాశ్రమ, ప్రయాసలావశ్యకములైనదంతయు ప్రస్తుతము చాలా సులభముగాను, త్వరితముగాను స్వల్పశ్రమతోడను సాధింపనగును. కేవలమిదంతయు ప్రత్యక్షానుభవము వలన విశదమగును.

ఈ సాధనయందు కనని వినని ఆశ్చర్యమైనదేమన శిక్షణపొందిన ఒక బోధకుడు తాను పొందని దశనుకూడ ప్రాణాహుతి ద్వారా సాధకుడు పొందునట్లు చేయగలడు.



కాని సాధకునికి కలుగచేయునది బోధకుడు బాధ్యుడుకాడు. సర్వము చేయునది గురువులే. ఏది అతడు ప్రసారము చేయునట్లు పైకి కనబడునో అది సూటిగా అనంతము నుండియే ప్రవహించుచున్నది. ఏది ఎట్లుండినా సాధకుని వైపు ప్రవాహగతిని కలుగజేయుటకు తన ఆత్మశక్తిని అభివృద్ధి పరచుకొని యుండవలెను.

సాధకుడు సర్వదా భగవంతుని యందు లీనమై పవిత్రమైన జీవనమును గడువవలెను. నిజమునకు వైరాగ్యమనెడి స్థితిలో కూడ ఒకడు లౌకికభావరహితుడగుట అరుదు. దైవముననాదరణ చేసిన గృహస్థుడు దైవమును ఏమార్చినట్లు భావించినచో 'విరాగి' యను పిలువబడును కూడ 'పాపి' గా నిరూపింపబడును. మహనీయుడైన కబీరు ఈ విధముగా నుడివెను. "భగవంతుడు బ్రహ్మచారికి ఇరవై యడుగుల దూరములోను; సన్యాసికి ముప్పది యడుగుల దూరములోను, తన నారాధించునట్టి గృహస్థునికి వానియందే నివాసమేర్పరచుకొని యుండును."

మనము సర్వదా భగవంతుని తోడను, భగవంతునియందు లీనమై వుండిన ఎడల వైరాగ్యస్థితిని పొందుదుము. ఈ విధముగ భగవంతుని సాంగత్యము ప్రాపంచిక నిస్సంగత్వముగా పరిణమించును. ఇదియే యథార్థమైన వైరాగ్యము.

రాజయోగ సాధనయందు స్థౌల్యమును కరగించి తొలగించుటయే ప్రధానాంశము. ఇందులకు అంతఃశుద్ధికరణమను అపూర్వ పద్ధతిని ప్రతిపాదించినది. మంత్ర ప్రారంభమున పలువిధముల గ్రంథులు తటస్థించును. సాధకుడు గురుదేవుని యనుగ్రహముతో ఒక్కొక్కటిని అధిగమించి ప్రశాంత స్థితిని పొందును. ప్రథమమున ప్రాణా

హాతి ప్రసారము జ్ఞాతరూపమగు మానసమును స్పృశింపదు. కారణశరీరముపై పని చేయుట ఆరంభించును. తత్ఫలితముగా దైవీసంస్కారము సృజింపజేయును. ఈ సంస్కారములు క్రమముగా సూక్ష్మ రూపము నుండి భోగము కొఱకు వృద్ధి నొందును. తదంతటతానే ఈ భోగములు ప్రారంభమై వ్యాకోచము నొందనారంభించును. అట్టి వ్యాకోచము తదనంతరము అంతశ్చేతనవరకును వ్యాపించును. తర్వాత ఆ వ్యాకోచము జ్ఞాతరూప మానసము వరకును వ్యాపించును. అప్పుడు మనసు సరియైన రీతికి పరివర్తనము చెందును. ఈ స్థితియందే సాధకుడు తనలోని సూక్ష్మములైన మార్పులను గమనింప వీలగును.

సహజమార్గమభ్యసించు పద్ధతి ధ్యానము చేయుట. ఈ పద్ధతినే ప్రాచీనకాలమున పతంజలిమహర్షి అవలంబించెను. ఆమహర్షి యవలంబించిన మార్గమును అష్టాంగ యోగమని చెప్పుదురు. ఆ యోగమున ఎనిమిది అంగములు గలవు. అవి యమ, నియమ, ఆసన, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధి క్రమముగా వీటన్నిటిని సాధన చేసినచో సంప్రజ్ఞాత, అసంప్రజ్ఞాత సమాధులు రెండును ప్రాప్తించును. సహజ మార్గసాధన ధ్యానముతో ప్రారంభించి సమాధియందు అంతమగును.

ధ్యానము చేయునప్పుడు కేవలమొక్కసారి మాత్రమే లోనున్న దివ్యతేజస్సు ఆకర్షించునట్లు సాధకుడు చింతించవలెను. ఇతర భావము ఏదైన వచ్చినయెడల వాటిని త్రోసివేయకుండా అంగీకరించవలెను. ధ్యానఫలితమే ఏకాగ్రత.. ధ్యానమునకేకాగ్రత అవసరమని అందుకై మనస్సును నిర్బంధించువారు పరాజయము నొందుదురు. మనస్సును అత్యధికముగా నిర్బంధించక మామూలు పద్ధతిలో ఆసీనులై యుండవలెను. బ్రహ్మముహూర్తమున, ఉదయము 3 గం॥ నుండి 4½ గం॥ వరకు ధ్యానమునకు ప్రక్రమించుట చాలయువయుక్తముగా నుండును. ఆ సమయము వీలుపడనిచో ఏ నిర్ణీతకాలమునందైనను ధ్యానము చేయవచ్చును.

సాయంసమయమున అదే ఆసనము నందు అర్ధగంట కూర్చుండి క్లిష్టతలు, పూర్వాలోచనలు తన శరీరమునందలి ఘనత్వము లేక స్థూలత్వములన్నియు తన పైనుండి కరిగిపోవుచున్నట్లు లేక పొగవలె ఎగిరిపోవుచున్నట్లు సాధకుడు భావించవలెను. అది సాధకుని మనస్సునందున్న మలినములను తొలగొట్టి మనస్సును యథారీతిగా నిర్మలముగావించుటకు తోడ్పడును.

లయావస్థ దాని కఠినతమైన స్థితులను యిచ్చువాడు భగవంతుడేయని శ్రీరామ చంద్రజీగారు వక్కాణించిరి. భగవత్సాయుజ్యము పొందువిధానము గురుసహాయము వంటిదే. పూర్ణలయావస్థయనగా చిట్టచివరి వఱకు శూన్యకరణము. అయినను సంపూర్ణ శూన్యమనునది ఎన్నడును ఏ పరిస్థితి యందును లభ్యముకాదు. లయావస్థను మఱచు స్థితిని పూర్ణలయావస్థగా తీసుకొనవచ్చును. గొప్ప అవతారములకిది సాధ్యము కాలేదు. అది సహజమార్గమున అనుసరింపబడు సామాన్యపద్ధతి.

సత్యతత్త్వమును అంతస్థ్సితిగా పిలువవచ్చును. తర్వాత అదికూడ అదృశ్యమైపోవును. అప్పుడు మనము సమప్రదేశమును జేరుదుము. అందు మన ఈదులాట సాగిపోవును. సాధకుడు వాస్తవముగా తనయందు భక్తి కలిగియుండి, అంతమున శాశ్వతముగా స్థిరపడియుండిన అతను నిశ్చయముగా పరిపూర్ణత్వమును పొందగలడు. కావున అన్ని సాధనలోకెల్ల సహజమార్గమనబడు రాజయోగ సాధనయే ప్రఖ్యాతిగాంచు అత్యుత్తమ సాధనయనుటలో సంశయములేదని రూఢిగా చెప్పవచ్చును.



---

## రసవంసిషి — అన్నమయ్య

అన్నమయ్యా, అన్నమయ్యా
వెన్నెలయ్యా, వెన్నెలయ్యా
చక్కెరయ్యా, చక్కనయ్యా
నీ భక్తి చిక్కనయ్యా
తాళ్ళపాక వెండికొండ
నీ కీర్తి మంచుకొండ
కొలిచావు కొండలయ్య
నిలిచాడు అండగయ్యా.
పాడావు పాటలయ్యా
పగడాల దండలయ్యా
ముత్యాల మూటలయ్యా
రతనాల రాశులయ్యా.
ఆనాడు నన్నయ్య, ఈనాడు అన్నమయ్య
ఏనాడూ తెలుగన్నయ్యలే
తెలుగుతల్లి నోములపంటలే
తెలుగుజాతి వెన్నెలపంటలే.
మైథిలీ విద్యాపతి
బెంగాలీ చండీదాసు
హిందీలో సూరదాసు
తెనుగులో అన్నమయ్యే.
నీ సంకీర్తనలు – స్వర్గానికి నిచ్చెనలు
నీభావరత్నాలు – ముక్తికిసోపానాలు
నీజయంతులు, వర్ధంతులు
మా సంస్కృతి కెత్తిన వైజయంతులు.

— ఆర్. ఫణీంద్రరావ్

---

( 19వ పేజీ తరువాయి )

భార్యల వేధించు పురుషులకు ధర్మం బును బోధించుచు శకుంతలోపాఖ్యానమున "సతియును గుణవతియుఁ బ్రజావతియు నను వ్రతయునైన వనిత నవజ్ఞాన్విత దృష్టిఁ జూచు నతిదుర్మతి కిహముం బరముఁ గలదె మతిఁ బరికింపఁగన్. సంతత గృహమేధి ఫలం బంతయుఁ బడయంగ నోపునను గుణభార్యావంతుండగు వాఁడు క్రియావంతుఁడు దాంతుండు బుత్రవంతుండు నగున్" నని సూక్ష్మముగా ధర్మమును వివరించెను. పురుషులెల్లరీధర్మములనుష్ఠించిన గృహము స్వర్గసీమయగుటకు సందేహము గలదా?

స్త్రీలను సాభిలాషులై యవలోకించుట ధర్మహానియుఁగాక! పతితులగుదురనుటను మహాభిష వృత్తాంతమున దేవలోకంబున కేతెంచిన గంగాదేవి "ఊరు మూల మేర్పడఁగ నయ్యువిడవలువదొలఁగె నని లంబుచేత విధూతమగుచు, నమరులెల్లఁ బరాఙ్ముఖులైరి. దాని సాభిలాషుఁడై చూచె మహాభిషుండు. దానినెఱిఁగి కమలయోని వానికిఁ గరమల్గి మర్త్యయోనియందుఁ బుట్టుమనుచు శాపమిచ్చె" నని తెల్పెను. నేటి సమాజమున, అర్ధనగ్న పాదనగ్న పూర్ణనగ్న దృశ్యములెంతవరకు విహితములు? అర్ధాన మానవులు మానవతను వీడి పశుత్వమున కామాభిలాషులగుటఁ జూచుచున్నాము గదా!

మొదట స్నేహముతో నుండి పదంపడి ధనబల గర్వితుఁడై యున్నవాఁడు తొంటి స్నేహంబెట్లు మఱచి యుపాలంభించునో ద్రుపదుని మాటలతో జక్కఁగ జిత్రించెను. "వనపతితో దరిద్రునకుఁ దత్త్వవిదుండగు వానితోడ మూర్ఖునకుఁ బ్రశాంతుతోడఁ గడుఁగ్రూరునకున్ రణశూరుతోడ భీరునకు వరూథితోడ నవరూథికి సజ్జనుతోడఁ గష్ట దుర్జనునకు నెవ్విధంబునను సఖ్యము దానొనగూడనేర్చునే" సమశీలశ్రుతయుతులకు సమధనవంతులకు సమసుచారిత్రులకుం దమలో సఖ్యమును వివాహమునగుఁ గాకగునె రెండు నసమానులకున్" అని లోకములోని సామాన్య ప్రవృత్తమును బోధించెను. అనాఁడే కాదు. నేఁడు కూడ యీప్రవృత్తిగానుపించుచునేయున్నది గదా!

దుర్యోధనునకు శాబలు వార్త మంత్రి యగు కణికుఁడు బోధించిన రాజనీతిని 19 పద్యములచే బాహ్యముగ కౌటిల్యుని రాజనీతిని సంగ్రహముగా బోధించెను. ఇది యాతని యనేక గ్రంథములలోని ధర్మశాస్త్ర పరిచయమునకు తార్కాణము.

ఏకచక్రపురమున బకుని వాతఁబడు పురజనుల వరుసక్రమంబున పాండవులున్న యింటికి వంతురాగా బ్రాహ్మణిచే బలికించిన మాటలానాఁడే కాదినాటికినినవి యథార్థంబులే "పురుషహీనమైన బరమపతివ్రత యయ్యు జగముచేతఁ బ్రయ్యబడదె. పడిన యామిషంబు పక్షులపేక్షించునట్లు పురుషహీనయయిన యువతిఁ జూచి యెల్లవారుఁ జులుకనపేక్షింతురిదియుఁ బాపమనక హీనమతులు" పురుషరక్షణలేని స్త్రీలస్థితి యీనాటికిని దయనీయముగనేయున్నది. అబలలై యార్థికస్వాతంత్ర్యములేని స్త్రీని పాపరతులును హీనమతులైన పురుషులు కామించి యలజడిఁగలిగించుటఁ జూచుచునే యున్నాము.

అందే అతిథులు మున్నగువారిని హింసింపవలదనుచు "ధృతిసెడ వేఁడెడు వానిని నతిథిని నభాగ్యతుని భయస్థుని శరణాగతుఁ జంపఁగ నొడఁబడు దుర్మతి కిహముంబరముగలదె మది బరికింపన్" అని వీరందఱను హింసించుట పాపమనుట సూచించెను. ఈనాఁడు రాజకీయమున తమకు వ్యతిరేకులైన .వారిని హింసించుట జంపుట యెట్టి ధర్మము?

వసిష్ఠుని వృత్తాంతమున పాలకధర్మమును "పరులవలన బాధ పొరయకుండగ సాధుజనుల ధనముగాచు జనవిభుండు గరుణదప్పి తాన హరియించువాఁడగునేని సాధులోకమేమిసేయు" నని సూచించెను. ఈనాఁడు పాలకులు అధికారులీధర్మమును పాటించిన నీ లోకము స్వర్గమేయగుటయే గాక ఆర్థిక సమానత లభించుట యబ్బురముగాదు.

సభాపర్వమున నారదుఁడు ధర్మరాజునకు బోధించిన ధర్మములు రాజలోకమునకు సర్వదా శిరోధార్యములు.

శౌనకుఁడు ధర్మరాజునకు ధర్మములు జెప్పునప్పుడు "శోకభయస్థానంబు లనేకంబులు గలిగినను విహీనవివేకుం డాకులత బొందునట్లు వివేకముఁగలవాడు బుద్ధివికలుండగునే, శారీరమానస మహాదారుణ దుఃఖములఁ జేసి తఱిగి శరీరల్ క్రూరతర బాధఁబొందుదు రాదెంటిని బెఱతు రార్యుల మలినబుద్ధిన్, స్నేహార్ద్రమగ్నుండయి దేహి మహాదుఃఖముల నధృతిఁ బొందును. దుఃఖాహతుఁడు శోకతాప విమోహియగున్ స్నేహ మూలములు రాగాదుల్" అని స్థిరబుద్ధితో స్నేహాదులను జయించి విగత దుఃఖుఁడగునని బోధించెను.

గృహస్థధర్మముల నొడువుచు "ఆర్తునకు శయనంబును, భీతునకభయంబును దృషితునకు జలంబును, బుభుక్షితునకు నన్నంబును, శ్రాంతునకు నాసనంబును నిచ్చుట సనాతనంబైన యుత్తమ గృహస్థ ధర్మం" బని ప్రతిపాదించెను.

క్రోధమెట్లాపదలకు మూలమో దెలుపుచు "క్రోధంబు పాపంబు. గ్రోధంబునఁజేసి యగుఁజువ్వె ధర్మకామార్థహాని గడుఁగ్రోధి గర్జంబుగానండు క్రుద్ధుండు గురునైన నిందించు గ్రుద్ధుఁడైనవాఁడవధ్యులనైన వధియించు మఱియాత్మఘాతంబు సేయంగఁ గడగుఁ గ్రుద్ధుఁడస్మాదృశులకు ధర్మానుబంధులకిట్టి క్రోధంబు దాల్చుట గుణమె చెపుమ.

"గ్రోధము మహానలంబు. గ్రోధవర్జితుండు గుణకొని తేజంబు దాల్చు దేశకాలతత్త్వమెఱిఁగి క్షమగలవానికిఁ బృథ్వీపమునకు నిత్యంబు విజయసంసిద్ధియగున్ క్షమియైనవాని భుజవిక్ర

మము గనుక్ వెలయు సర్వకార్యక్షమమై" యని క్రోధముయొక్క యవగుణములను జెప్పి శాంత మెట్లన్ని సౌఖ్యములకాక రమో నన్నయభట్టు చక్కగా నిరూపించెను.

పురుషార్థములనెట్లు మానవుండు పొంద వలయునో నిరూపించుచు "ధర్మకామంబులు దఱుఁగంగ నర్థార్థియగువాఁడు పతితుఁడౌ నర్థసేవ నర్థార్థముగఁ జేయునతఁడు గ్రవనములో గోరక్షసేయు నక్కమువెఁబోలు వర్ణధర్మములకు హానిగాఁ గామార్థియగునా తఁడల్పజలాశయమున జలచరంబెట్లులజ్జలములతోఁ జెడునట్లు కామంబుతో హానిఁబొందు. వర్ణధర్మములు మహాద్రి మేఘము లట్టులు భయమును బరస్పరోదయమ్ములిట్లుగా త్రివర్గమెఱిఁగి సామ్యమున సేవించువాఁడు సర్వవిత్తముండు" నని ధర్మానుబంధముగా నర్థకామముల ననుభవింపవలయునని చక్కనియుపమానములతో నిరూపించెను.

మృత్యువెల్లపుడు వెంటనుండునని కార్యదక్షుండు "అంతకుండు జనులకాసన్నుఁడై యుండ నిమిషమాత్రమేని నిశ్చయింపఁదగని జీవనంబు దద్ద సుస్థిరముగాఁ జేసి కార్యమెడయఁజేయఁదగునె" యని జేయవలసిన కార్యంబుల వెన్వెంటఁ జేయుమని బోధించెను.

తీర్థయాత్రలవలని ఫలమును జెప్పుచు నన్నయ "[illegible] [illegible]చిత్తులైనవారు. ధృతినహంకార ప్రతిగ్రహాపేక్షయుండు నివృత్తాత్ములైనవారు నల్పభోజనులు నవారంభకులు నయ్యు నత్యంత సంతోషులైనవారు. సత్యవ్రతులు శుభాచారు లక్రోధనులగుచు ధర్మాన్వితులైనవారు, నఖిలతీర్థ శతములాడిన ఫలములు నఖిలయజ్ఞవిధులనైనఫలములబడయుదురు. విహీనభాగ్య దుష్కృతులకుఁ బరమతీర్థ సేవఁబడయ నగునే? తిలగోసువర్ణదానంబు లుపవాసములుఁ దీర్థములసేవయు నిమ్ములఁ జేయనివారు దరిద్రులు రోగులు నగుదు రాత్మదోషము పేర్మిన్. పదివేల కోట్లతీర్థములుదితములై పుష్కరములనుండు మునీంద్ర త్రిదశవరు లందు జేసిరి మదిఁ గృతకృత్యులయి తపముమఖములుఁ బ్రీతిన్" అని తీర్థస్నానఫలమును పుష్కర ఫలమును నిర్దేశించినాఁడు.

ధర్మాధర్మ విశేషంబులు బోధించుచు నన్నయ "వసుధ నధర్మవర్తులగువారల వర్ధన మెన్నఁడున్ సమంజసమయి నిల్వనేరదు, భృశంబుగ నాశమునొందు. దుర్మద వ్యసనుల ధర్మవర్తనఁ బ్రవర్ధితులయ్యును నేముజాడ రాక్షసులును దైత్యదానవులుఁ గ్రాఁగరె తొల్లిసహస్రసంఖ్యులన్. దేవతలు ధర్మవర్తులగుటను నభివృద్ధిఁబొంది ఘనమగు సిరిశ్రీ విభవాన్వితులయి ధరణీవల్లభ యున్నవారు నిరుపమకీర్తిన్. అధర్మవర్తులయందు దర్పంబుపుట్టు దర్పంబువలన మానంబు వుట్టు మానంబు వలనఁ గ్రోధంబుపుట్టుం గ్రోధంబువలనం జేసి లజ్జయు వృత్తంబునుం జెడు నష్టలజ్జావృత్తులయిన వారి నుపశమంబును లక్ష్మియు విడుచు" నని వివరించెను.

ధర్మము సర్వంబునకు హితముగా నుండ వలయుననుచు "ధర్మజ్ఞులైన పురుషులు ధర్మువునకు బాధసేయు ధర్మువైనన్. ధర్మముగా మది దలఁపరు ధర్మువు సర్వంబునకు హితంబుగవలయున్." అని సర్వులకు నహితంబుజేయు ధర్మంబు ధర్మంబు గాదనియు సర్వులకు హితము గలిగించు నదే ధర్మమని నిరూపించెను.

ధర్మరాజనహుష సంవాదంబున నన్నయ భట్టు అహింసను గూర్చి ప్రతిపాదించుచు "దానంబును బ్రియంబు చేతఁయును సత్యంబును నహింసయునను నివి నాలుగును సమానంబులయయినను నహింస విశేషంబెట్లనిన దేవమనుష్యతిర్యగ్యోను లనియెడు మూడు గతులయందును మనుష్యుండు దానాదిగుణంబులు గలిగి యహింసా పరుడయిన వాఁడు దేవగతి బడయు విపరీతుండై తిర్యగ్యోనులం బొందు" నని నిరూపించెను:

ఇట్లు నన్నయభట్టారకుఁ డెడనెడ సర్వకాల సర్వావస్థలయందు సర్వదేశవాసులును అనుష్ఠింపఁదగిన ధర్మంబులఁ బ్రతిపాదించి తాఁజేసిన మొదటి ప్రతిజ్ఞ "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని" న దానికి నీడుగాఁ దనచే రచింపఁబడిన భారతమున కాంతా సమ్మితముగా నుపదేశించెను. *

**డా॥ సముద్రాల వెంకటాచార్యులు**



## ప్రాప్తి

సీ॥ ముల్లె కాల్దగిలిన - ముట్టుకొనగలేడు
దృష్టిపడదు ఎట్టి - దిట్టకైన
ధనమెంతయున్నను - దాచుకొనగ లేడు
దొరల కవునా లేక దొంగకవునా
చేతికందిన ముద్ద - చేరి నోట బడదు
మ్రింగ లేడిల ఎట్టి - మేటియైన
ప్రాప్తి లేకుండిన - బడయడెంతటివాడు
పచ్చిపాలబడును - వయిన గుడ్డ

గీ॥ ప్రాప్తి అనియెడు - రెండక్షరములయందె
సకల వేదపురాణంపు సారమిముడు
దీని మర్మమెరింగెడి మానవాళి
మహిని మహనీయులయి యెప్డు మనగగలరు.

**— శ్రీమతి మల్లాది పద్మావతి**

[15వ పేజీ తరువాయి]

1. శ్రీరామచంద్రుడును, లక్ష్మణుడును విల్లమ్ములను, కత్తికటార్లను ధరించి దండకారణ్యమునకు బయలుదేరిన సమయమున సీతాదేవి నాథుని గురించి-"ఆర్యపుత్రా! శస్త్రాస్త్రములు చేతనున్నపుడు అవి క్రూర బుద్ధిని కలిగింపవచ్చును. నిరపరాధులకు మీవల్ల బాధకలుగవచ్చును." అని హెచ్చరించి, ఆ భయమునకు కారణమైన ఒక ఉపాఖ్యానమును చెప్పి, చివరకు ఇట్లు చెప్పెను.

స్నేహాచ్చ. బహుమానాచ్చ. స్మారయే న తు శిక్షయే।

"దేవా! నా ఈ మాట నీకు తెలియని దానిని తెలుపుటకనికాదు; నీ అభిప్రాయమును జ్ఞప్తికి తెచ్చుట కొఱకు, నీ యెడల నాకున్న ప్రీతి గౌరవములు నా చేత ఈ మాటలాడించినవి."

సీత ధర్మమును చెప్పినది. ఎవరికి? ధర్మస్వరూపునికి! అందుచేత మాటలో ధర్మచింతను నింపుటమేకాక వినయమునుకూడ నింపెను. ఇది ఔచిత్యము.

2. కురుక్షేత్రమున పాండవ కౌరవ సైన్యములు యుద్ధారంభమునకై సంభ్రమించి నిలిచినవి. అందరును ఆ ఉత్సాహోద్రేకములో నున్నపుడు ధర్మరాజు రథము నుండి దిగి, వట్టికాళ్ళతో శత్రుపక్షము దిక్కుగా నడచెను. అతని తమ్ములును, మిత్రులును అతడు భయపడి, శరణాగతుడగుటకు చనుచున్నాడని భ్రాంతిగొని అతని అడ్డగింప యత్నించిరి. అతడు చేసిన దేమి? భీష్మాచార్యులవద్దకేగి-

తమువాచ తతః పాదౌ
కరాభ్యాం పీడ్య పాండవః ॥
ఆమంత్రయే త్వాం దుర్ధర్ష!
త్వయా యోత్స్యామహే సహ ।
అను జానీహి మాం తాత!
ఆశిషశ్చ ప్రయోజయ ॥

యుధిష్ఠిరుడు భీష్ముని పాదములను రెండింటిని తన చేతులతో గ్రహించి,-తండ్రీ! నిన్ను గెలువగలవారు లేరు. నీతో ఇప్పుడు మేము యుద్ధము చేయువారలుగా నున్నాము. అందువలన నిన్ను వేడికొన వచ్చితిని, అనతినిమ్ము ఆశీర్వదింపుము. అనెను.

ఇది సంస్కృతిదారి. ధర్మజుడు అట్లు చేయకుండ ఉండిన యెడల అది తప్పగుచుండెనని భీష్ముడు స్పష్టముచేసి ఆశీర్వాదము చేసెను.

సంస్కృతియను త్రికరణ సంపదను వివరణాతీతవస్తువుల యందొకటియని చెప్పుటకద్దు. అది వివరణకు దొరకనిదైనను గుర్తింప వీలులేనిదికాదు. దానిని కన్నంతనే అందరును అది ఒక విశేషాకర్షణయని గుర్తుపట్టుదురు. సంస్కృతి మొండివట్టు, మోటుతనముల గురుతులు లేని దారి, వినయమర్యాదలదారి. వినయమర్యాదలు లేని బ్రదుకునకును, ఎంగిలి విస్తరికై ఎగబడివచ్చు కుక్క బ్రదుకునకును ఏమి వ్యత్యాసము?

---

## శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం, శ్రీనివాసమంగాపురం.

శ్రీనివాసమంగాపురంలోని శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయంలో జరుగు నిత్య కల్యాణోత్సవం, అభిషేకం, నిత్యఅర్చన వివరాలను యాత్రికుల సౌకర్యార్థం ప్రచురిస్తున్నాము.

**నిత్యకల్యాణోత్సవం :**

నిత్యకల్యాణోత్సవసేవ ప్రతిరోజూ ఉదయం 10-30 నుంచి 12-00 గంటలవరకూ జరుగుతుంది. ఈ సేవకు 150 రూ॥లు చెల్లించాలి. పదిమంది వ్యక్తులను ఈ సేవలో పాల్గొంటానికి అనుమతిస్తారు. గృహస్థుకు వస్త్రబహుమానం వుంటుంది.

**అభిషేకం :**

ప్రతి శుక్రవారం అభిషేకసేవ జరుగుతుంది. (ఉదయం 7-30 నుంచి 9 గంటలవరకు) అభిషేకం చేయించేవారు 100 రూ॥లు చెల్లించాలి. ఇద్దరు వ్యక్తుల్ని ఈ సేవలో పాల్గొనటానికి అనుమతిస్తారు.

**నిత్యఅర్చన :**

నిత్యఅర్చనసేవ సంవత్సరకాలమూ ప్రతిరోజూ వుంటుంది. ఈ సేవ చేయించదలచినవారు 42రూ॥లు చెల్లించాలి.

సరళంగా, వేగంగా, సుఖంగా సాగి పోయే బండికి ఓల ఊడిపోతున్నదని తెలిసి పరుగెత్తివెళ్ళి ఓలబిగించి చక్రం జారిపోకుండా చేసేవాళ్ళున్నట్లే-ఎక్కడో ఓ మూల దాగిఉన్న ఓలనే ఊడబెరికి బండిని పడద్రోయటానికి ప్రయత్నించేవాళ్ళుకూడ లోకంలో ఉంటారు. ఈ యిద్దరి పనులకు ఒక్కొసారి పెద్దకారణాలుండకపోవచ్చు. అప్పుడప్పుడు పరిస్థితుల ప్రభావాలుకూడ బలంగా ఉండవచ్చు. అయితే వ్యక్తుల సహజ స్వభావాలుమాత్రం తర్కాలకందని జన్మాంతర సంస్కారాలు.

రామాయణంలో మంథర కైకేయి అంతఃపురంలో దాసి. ఆమె చాటున దాగి రాముని జీవితరథానికి ఓలను ఊడదీసింది. ఆ దెబ్బతో రాముని పట్టాభిషేకమే ఆగిపోయింది. ఆయన జీవిత స్థితి గతులే మారిపోయాయి. రామాయణ మహాకావ్యమే ఒకపెద్ద మలుపు తిరిగింది.

మంథర పొట్టిది. పైగా పెద్దగూను. వికారమైన ఆకారం. ఆమె జీవితంలో ఎత్తును చూడలేదు. అందాన్ని, ఆనందాన్ని, చూచి హర్షించలేదు. ఆమెదొక ముడుచుకు పోయిన శరీరం. వరుటి పోయిన మనస్తత్త్వం.

ఆనాడు రామాభిషేకానికి అయోధ్య అందంగా అలంకరించుకొంది. ఎక్కడ చూచినా అరటిస్తంభాలే. మామిడాకుల తోరణాలే. రకరకాల పూసవరాలే. రంగు రంగుల దీపాలే. చందనాగరు ధూపాలే. ముత్యాల ముగ్గులే. మంగళవాద్యాలే. ఆనందోత్సాహ కోలాహలాలే.

మంథర ఆసమయంలో ఎందుకో కైకేయి మేడమెట్లు ఎక్కుతూ ఉంది. ప్రక్కనే ఇంకో చెలికత్తెగూడ ఉంది. ఒక్కోమెట్టు ఎక్కుతూఉంటే అలంకారాలతో నిండిన ఆ అయోధ్యానగరశోభ మంథరకుమరీ ఎక్కువగా అగుపిస్తూఉంది. ఇది అయోధ్యా! అమరావతా! అలకానగరమా! అని ఆమె ఆశ్చర్యపోతూఉంది.

అంతలోనే మంథరకు ప్రక్కనున్న కౌసల్యాదేవి అంతఃపురం కన్పించింది. ఆ అంతఃపురశోభ ఆనాడు మరీ కొట్టొచ్చి నట్లుంది. పైగా ఆ కౌసల్యాదేవి అంతఃపురం ఆవలికివచ్చి ఏటి ప్రవాహంలా ఉన్న యాచక సమూహానికి ఏమేమో ఇస్తూ ఉంది.

'ఇది ఎన్నడూ లేదే'! అని అనుకొంది మంథర. ప్రక్కనున్న చెలికత్తెతో 'ఏమిటే ఇదంతా!' అని అడిగింది ఆశ్చర్యంగా.

మంథర మనస్తత్వం ఆ చెలికత్తెకు తెలుసు. అందుచేతనే పాపం చెప్పటానికి




తటాపటాయించింది. అయినా సంతోషం ఆపుకోలేక 'రేపు రామాభిషేకం' అంది.

అంతే హఠాత్తుగా కడుపునొప్పి కలిగి నట్లు మంథర ముఖం మారిపోయింది. 'అలాగటే! నాకేమీ తెలీదే'! అంటూ మేడ మెట్లు గబగబా దిగింది. గుండెలు బాదు కొంటూ కైక మందిరంలో ప్రవేశించింది. కైకా! కొంపమునుగుతున్నది. ఇంకా పడుకొని ఉన్నావా! అని కసరినట్లు అరిచింది.

కైకకేమీ అర్థంగాలేదు.

'ఎందుకే మంథరా అలా అదరిపడతావు-ఏం జరిగిందని' అంది కైక ఎంతో నిబ్బరంగా.

'ఏం జరిగిందా? నీ మీద కుట్ర. నిన్ను సర్వనాశనంచేసే ప్రయత్నం. నీ మగడు నీకుచెప్పే వన్నీ అబద్ధాలే. నీవు కుడుమిస్తే పండగనే దానివి. అమాయకురాలివి. నీ మగడు భరతుని ఊళ్ళో లేకుండా చేసి ఆ రామునికి పట్టం గట్టుతున్నాడు. రేపే రామాభిషేకం - అమ్మో! అబ్బో!' అని గుండెలు బాదుకొంటూ చెప్పింది మంథర.

'రామాభిషేకమా! నా రామునికి యౌవ రాజ్యాభిషేకమా!' అని కొండంత సంతోషంతో కైక పడకమీది నుండి లేచి గట్టిగా మంథరను కౌగిలించుకొంది. 'ఎంత సంతోషవార్త చెప్పావే' అని తన మెడలోని రత్నాలహారాన్ని తీసి మంథర మెడలో వేసింది.

మంథరకు మతిపోయింది. ఒక్కసారి అలా కైక ముఖంలోకి సూటిగా చూచింది. కన్నీళ్ళు కార్చింది. కన్నెఱ్ఱ చేసింది. తన మెళ్ళో వేసిన హారాన్ని తీసి పారేసింది.

కైక ఆశ్చర్యంగా చూస్తూ ఉంది.

మంథర కైకకు అరణపుదాసి. పైగా దూరబంధువు. అందుచేత ఆ దాసికి కైక దగ్గర చనువు చాల ఎక్కువ. మంథర ముఖం చిట్లించుకొని మూర్ఖురాలా! అని మొదలుపెట్టి 'నీ కొంప మునుగుతున్నది. తెలియక సంతోషిస్తున్నావు. సవతికొడుకు ఉన్నతి ఏ స్త్రీకి అయినా మృత్యువుతో సమానం. రాముడే రాజైతే నీవు, నేను, అందరము ఆ కౌసల్యకు దాస్యం చెయ్యాలి. నీ కొడుకు భరతుడు ఆ రామునికి గొడుగు పట్టాలి. అతని దయాధర్మ భిక్షతో అందరం బ్రదుకు సాగించాలి అని చెపుతూ ఉండగానే కైక అడ్డుతగిలింది:

'రాముడు సుగుణాభిరాముడు. రాముడు రాజైతే అందరికీ సుఖమే; శుభమే, రాముని తరువాత మన భరతుడు రాజౌతాడు. అందుకింత దిగులెందుకే మంథరా' అంది కైక ఊసడించుకొంటూ.

మంథరకు ఏం చెప్పాలో అర్థంగాలేదు. ఎలా చెప్పాలో తెలియలేదు. తుదకు తల

బాధుకొంటూ 'తెలివితక్కువదానా! నేను చెప్పేది నీకర్థం కాలేదు. రాముని తరువాత భరతుడు రాజు కాడు. రాముని కొడుకే రాజౌతాడు. భరతుడు, అతని కొడుకులు శాశ్వతంగా రాజయోగానికి దూరమౌతారు. అంతేగాదు. రామలక్ష్మణులు ఏకమౌతారు. నీ కొడుకు దిక్కులేని వాడౌతాడు. అతడు అడవులు పట్టుకొని పోవలసిందే. ఒక్క సంగతి ఆలోచించు. ఇంత జరుగుతుంటే నీ మగడు ఒక్క మాటైనా నీతో చెప్పాడా? నీవేమో ఆయన ముద్దుల భార్యనని మురిసిపోతున్నావు. ఇదంతా ఆ కౌసల్యా దశరథులకుట్ర. ఇప్పటికైనా తెలుసుకో. నీ కంటె నాకెవరున్నారు. నీ క్షేమమే నా క్షేమం, నీ సంతోషమే నా సంతోషం. నీ సౌభాగ్యమే నా భాగ్యం-' అనే సరికి కైక మనస్సు మారింది. కళ్ళు ఎరుపెక్కాయి.

'అయితే ఇప్పుడు ఏం చేస్తామే మంథరా?' అంది కైక ఆత్రంగా.

మంథరబుద్ధి పాదరసంలా పనిచేసింది. దశరథుడిచ్చిన వరాల సంగతి గుర్తు చేసింది. 'భరతునికి పట్టాభిషేకం, రామునికి పద్నాలుగేళ్ళ వనవాసం- కైకా ఇవే నీవు కోరవలసిన వరాలు. త్వరగా బయలుదేరు. కోపగృహం ప్రవేశించు. దశరథుడు వస్తాడు. పట్టువదలకు. పని సాధించు'- అని కైకను త్వరపెట్టింది.

కైక కనురెప్ప లెగురవేసింది. మంథర బుద్ధిని ప్రశంసించింది. అందవికారమైన ఆమె రూపాన్ని గూడ అతిగా పొగడింది. అంతేగాదు. పనిపూర్తి కాగానే ఒక బంగారు కవచం చేయించి దాని గూనుకు తొడుగుతానని గూడ మాట ఇచ్చింది.



మొత్తానికి మంథర అనుకొన్నంత పని చేసింది. కైక వెనుక దాగి రాముని జీవిత రథానికి చీల ఊడదీసింది. పరిస్థితులను తారుమారుచేసింది.

రామాభిషేకం ఆగిపోయింది.

ఆయన జీవితం అడవుల పాలైంది.

దశరథుని ప్రాణాలు అనంతవాయువుల్లో లీనమయ్యాయి. ఆయన అంత్యక్రియలు గూడ పూర్తిఅయ్యాయి.

ఇక భరతుని అభిషేకం వైభవంగా జరుగుతుందని, అందుకు ఏ ఆటంకము ఉండదని మంథర ఆశించింది. ఎంతో ఆనందించింది. భరతుని అభిషేకం తన ప్రతిభకు పట్టాభిషేకం. దానితో తన ప్రాధాన్యం పెరిగిపోతుంది. ముమ్ముందు అందరు తన్ను గౌరవించే వారే. తన చుట్టు చేరేవారే. తన్నుచూచి భయపడే వారే. తన అనుగ్రహం కొరకు ప్రాకులాడే వారే. తాను ఇదివరకటిలా ఏదో సామాన్య దాసీలా ఉంటే ఎలాగ?

అందుకే మంథర అందంగా అలంక రించుకొని, రకరకాల ఆభరణాలు ధరించి, చిత్రవిచిత్రాలైన మొలనూళ్లు కట్టుకొని, వేషం వేసుకొన్న కోతిలా తన అంద చందాలు, ఆభరణాలు, అటుఇటు చూచు కొంటూ, తనలో తాను నవ్వుకొంటూ, చెలి కత్తెలంతా చుట్టూచేరి కొలువ భరత శత్రుఘ్నులున్న భవనం తూర్పువాకిట ప్రవేశించింది.

'అదుగో! దుర్మార్గురాలు దొరికింది' అని ద్వారపాలకులు మంథరను పట్టు కొన్నారు. శత్రుఘ్నునికి అప్పగించారు. శత్రుఘ్నుడు మంథరను చూచాడు. చుర చుర చూచాడు. ఆ చూపుకే ఆ దాసి సగం చచ్చింది. ప్రక్కనున్న చెలికత్తెలు బ్రదుకు జీవుడా అని పరుగెత్తిపోయారు.

శత్రుఘ్నుడు మంథర జుట్టు పట్టు కొన్నాడు. నేలమీద పడవేసి పశువును ఈడ్చినట్లు ఈడ్చాడు.

మంథర ఆభరణాలన్నీ ముక్కలై య్యాయి. నేలమీద అక్కడక్కడపడ్డాయి. ఆభరణ శిథిలాలతో, రకరకాల రాళ్ళకాంతు లతో నిండిన ఆ ప్రదేశమంతా నక్షత్ర ఖచిత మైన ఆకాశం నేలమీదికి దిగివచ్చినట్లు కన్పించిందట.

మంథర చావుకేక పెట్టింది. కైక ఆ కేకవిని 'శత్రుఘ్నా! మంథర చస్తుంది. క్షమించి వదలు' అని హడావిడిగా అడ్డు వచ్చింది.

కైకమ్మనుగూడ ఆ శత్రుఘ్నుడు ఒక విదిలింపు విదిల్చాడు.

అప్పుడు భరతుడు రావటమే ఒక్కక్షణం ఆలస్యమైఉంటే శత్రుఘ్నుని చేతులో మంథర చచ్చి ఉండేదే.

భరతుడు త్వరత్వరగా వచ్చి తమ్ముని చెయ్యి పట్టుకొన్నాడు. శత్రుఘ్నా! స్త్రీ హత్య మహాపాతకం. అది జరిగితే అన్న గారు మనముఖమే చూడరు. అందుచేత మంథరను వదలు' అన్నాడు.

అప్పుడు శత్రుఘ్నుడు మంథరను వది లాడు. ఆ దుష్టదాసికి ఇంకా ఆయుష్యం ఉంది. అందుకే మిగిలింది. చివరకు రామాభిషేకం గూడ చూచింది. మరి ఆ పట్టాభిషేకం చూస్తూ తానుచేసిన పనికి సంతోషించిందో లేక పశ్చాత్తాపపడిందో?

మొత్తానికి మంథర రామాయణంలో ఒక మరపురానిపాత్ర. ఆ మహాకావ్యాన్నే ఒక మలుపు త్రిప్పినపాత్ర. రామాయ ణంలోనే గాదు—లోకంలో ఈనాటికీ ఎందరో మంథరలున్నారు. అందరు వారిని ఒక కంట గమనించటం అవసరం.

*

---

[10వ పేజీ తరువాయి]

(యథావిధిగా ఆ యా సమయాలలో శ్రద్ధగా అగ్నికార్యం చేసినవాడు పరబ్రహ్మ జ్ఞానం కలవాడై బ్రహ్మపదం పొందుతాడు.)

6

ఏహ్యేహీతి తమాహుతయ స్సువర్చసః
సూర్యస్య రశ్మిభిర్యజమానం వహంతి
ప్రియాం వాచ మభివదంత్యోఽర్చయంత్యః
ఏష వః పుణ్య స్సుకృతో బ్రహ్మలోకః.

శోభాయమానములైన కాంతులతో ఆ ఆహుతులు హోమం యథావిధిగా శ్రద్ధతో చేసిన యజమానిని ఉద్దేశించి నువ్వుచేసిన మంచిపనికి తగిన పుణ్యఫలం ఇది రా! రా! అని ఇంపుగా మాటాడుతూ సూర్యకిరణాల ద్వారా బ్రహ్మలోకానికి చేరుస్తాయి.

7

ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా
అష్టాదశోక్త మవరం యేషు కర్మ
ఏతచ్ఛ్రేయోఽభినందంతి మూఢాః
జరా మృత్యుం తే పునరేవాపి యంతి.

వేదాలు చెప్పిన కర్తలు పద్దెనిమిది విధాలుగా ఉన్నవి. వాటినే యజ్ఞభేదాలుగా నిర్ణయిస్తున్నారు. అయితే వాటిని ఏదో ఇహలోక సుఖంకోసం కోరికపెట్టుకుని చెయ్యడం చాలా నీచపువని అవుతుంది. అలా కాక దానివల్ల మేలుకలుగుతుందని పొగిడేవారు ఉత్త అవివేకులు. అలాటి వారు తిరిగి పుట్టడం ముసలితనముతో బాధపడడం చివరకు మృత్యువు పాలవడం తప్పదు. అలాటి మూర్ఖులు కోరికతో చేసే యజ్ఞాది కర్మలు (పటుత్వంలేని) ఓటు పడవలని చెప్పాలి. అలాటివాటితో జనన మరణకారణమైన సముద్రాన్ని దాట శక్యం కాదు కదా!

8

అవిద్యాయా మంతరే వర్తమానాః
స్వయం ధీరాః పండితమ్మన్యమానాః
జంఘన్యమానాః పరియంతి మూఢాః
అంధేనైవ నీయమానా యథాంధాః

తెలిసీ తెలియని తెలివితో అన్నీ తెలిసిన వారమని విర్రవీగుతూ ఇక్కట్టులచే బాధపడుతూ బ్రతికే మూర్ఖులు గ్రుడ్డివాడొ కడు దారిన నడుస్తూ మిగతా గ్రుడ్డివాళ్ళని కూడా నూతిలో పడద్రోసినట్లు తాము చెడిపోవడమేకాక తమను అనుసరించిన వారిని కూడా చెడగొట్టుతారు.

9

అవిద్యాయాం బహుధా వర్తమానా
వయం కృతార్థా ఇత్యభిమన్యంతి బాలాః
యత్ కర్మిణో న ప్రవేదయంతి
రాగాత్తేనాతురాః క్షీణలోకా శ్చ్యవంతే.

అవిద్యకు (భ్రాంతికి) కట్టుబడి తిరిగే వారు ఉత్త మూర్ఖులు. మేము కృతార్థులం అయామని అనుకుంటూ ఉంటారు. ఏదో కోరికతో కర్మలుచేస్తూ వాటివల్ల తాత్కాలికంగా వచ్చే సుఖం అనుభవించి అది తీరిపోగానే పుణ్యలోక నివాసం లేని దౌర్భాగ్యులై మళ్ళీ సంసార తాపత్రయానికి చిక్కుతారు. అలాటి అజ్ఞానులకు బ్రహ్మతత్త్వం ఏమి తెలుస్తుంది?

10

ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం
నాన్య చ్ఛ్రేయో వేదయంతే ప్రమూఢాః
నాకస్య పృష్ఠే తే సుకృతేఽనుభూత్వా
ఇమం లోకం హీనతరం వా విశంతి.

భార్య, కొడుకులు, సంపద-వీటికోసం చేసే కర్మ ఇష్టం. నూతులు, చెరువులు, తోటలు, శరణాలయాలూ నిర్మించడం పూర్తం. ఇవే శ్రేష్ఠములైన పనులనీ, ఇంకేదీ శ్రేయస్కరం కాదని అనుకునేవారు మూర్ఖాగ్రేసరులు. వారు ఆ పనులుచేసి వాటివల్ల స్వర్గసుఖం అనుభవించి అది కాస్తా తీరిపోగానే మళ్ళీ కష్టాలకు కుదురైన యీ లోకానికి వస్తారు.

(ఇష్టాపూర్తములు శాశ్వతమైన బ్రహ్మ సాయుజ్యాన్ని ఇవ్వజాలవు.)

11

తపశ్శ్రద్ధే యే హ్యుపవసం త్యరణ్యే
శాంతా విద్వాంసో భైక్షచర్యాం చరంతః
సూర్యద్వారేణ తే విరజాః ప్రయాంతి
యత్రామృతః పురుషో హ్యవ్యయాత్మా.

సంసార సంబంధమైన జీవితముపై విరక్తికలిగి 'జ్ఞానులు' అని చెప్పదగిన బుద్ధిబలము కలవారై భిక్షావందనముతో కడుపుమంట చల్లార్చుకుంటూ మనస్సును నిలుకడగా ఉంచుకుని, కషసుఖాలు లెక్కించక కారడవులలో శ్రద్ధగా చెయ్యవలసే వైదిక కర్మలను చేసేవారు ఏలాటి దోషాలూ లేనివారై నాశములేని బ్రహ్మపదాన్ని చేరుకుంటారు.

12

పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో
నిర్వేద మాయా న్నాస్త్యకృతః కృతేన
తద్విజ్ఞానార్థం స గురు మేవాభిగచ్ఛేత్
సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్.

కర్మలవల్ల వచ్చే ఫలాలను బాగా విమర్శించి- వీటివల్ల ఈశ్వరుడు కనిపించడని బ్రాహ్మణుడు నిరాశపడతాడు. ఆ బ్రహ్మజ్ఞానం తెలుసుకోవాలనే కోరికతో అతడు ఆచారం అనుసరించి సమిధచేతబట్టి వేదతత్త్వముతో బ్రహ్మోపాసచేసే సమర్థుడైన గురువువద్దకు వెళ్లుతాడు.

(ఏవేవో వైదికకర్మలు చేస్తే వచ్చేఫలం శాశ్వతమైన సుఖం ఇవ్వదు. శాశ్వతమైన సుఖం ఇచ్చేది బ్రహ్మజ్ఞానం. అది తెలుసుకోవాలంటే తెలిసిన విద్వాంసుడి వద్దకు వెళ్ళాలి. గురువువద్దకు వెళ్ళినప్పుడు రిక్త హస్తాలతో వెళ్ళకూడదని సనాతనాచారం. బ్రహ్మజ్ఞానం బోధించే వ్యక్తివద్దకు సమిత్పాణియై వెళ్ళాలని ఋషుల అనుశాసనం.

బ్రహ్మతత్త్వంకోసం పరిశ్రమ చేసేవాడు 'బ్రాహ్మణుడు.' 'బ్రాహ్మణ' శబ్దం ఇక్కడ జాతిని చెప్పేదికాదు. బ్రహ్మపదార్థాన్ని అన్వేషించేవ్యక్తి ఏ జాతివాడైనా బ్రాహ్మణుడే!)

13

తస్మై స ఉపసన్నాయ సమ్యక్
ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ
యేనాక్షరం పురుషం వేద సత్యం
ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్.

ఆ గురువు జితేంద్రియుడున్నూ, ప్రశాంత హృదయుడున్నూ అయి తన వద్దకు వచ్చిన ఆ వ్యక్తికి నాశంలేనివాడున్నూ, నిత్యుడున్నూ అయిన యీశ్వరునకు సంబంధించిన బ్రహ్మవిద్యను బోధిస్తాడు.

ఇది ప్రథమ ముండకం

(సశేషము)

(36 వ పేజీ తరువాయి)

బంగారు పట్టీలున్నా, [illegible] మెయిల పట్టుకు పట్టుగలవారను. ఇది మా నమ్మిక. అందు లకు అజహారులు సాక్షులు ఈ [illegible] సాక్షి.

కథక: పిమ్మట నా పత్రమ్ము చూపుచేసే పవేరు. [illegible] ఆ సొమ్ములో పలికిన పదార్థములు తెప్పించుకొనెను-

సూత్ర: ఇదటయ్యా కదా! చెప్పేనున్నారు! అందుకోసమేనా స్వామివారు వడ్డీకాసుల వాడైనాడు?

కథక: దాను జగన్మోహనుడై ఉన్నాడు గదండీ. ఖర్చుల సంపద కంతటికీ దాతా భర్తా కూడా స్వామివారే. అనాటి నుండి భూరి సంతర్పణమ్ము [illegible]-

సూత్ర: అరె సే యజ్ఞానం అన్నయుండాగా సంతర్పణవేళ కూడా తప్పించావూ!

కథక: అయ్యోతొందరా? దేవతలందరికీ విశ్రాంతమంతటికీ సంతర్పణే కాదటండీ- ఆ వేళనే విష్వక్సేనుడు ప్రయాణభేరి వేయించినంతట-

సూత్ర: ఇకచాలుగాని నారాయణవనం ఇంతటనైనా చేరు కుందాం పదవయ్యా:

కథక: అచట పద్మావతీ కన్యను పెండ్లికూతుగావించి గౌరిని సమర్పింప జేసిన పిమ్మట-

(సురటరాగం - మిశ్రగతి)

కొమరుగా నిరుగడల రమణులు
కొలిచిరాగా రాకుమారిక
సమదగజయానమున పెండిలి
చవికె కేతెంచె, ॥ కొమరు ॥

సూత్ర: ఆహాహా: కన్నులు గలిగినఫలం. మిన్ను మన్ను లకు బుట్టిన కన్య, సన్నని కాటుకరేఖ అద్దిన చేరెడేసి ఆసోగకన్నులనుండి చిరునవ్వు. లేతసిగ్గు వెల్లువలవు తున్నవి కదయ్యా! ఆ తల్లి పెళ్ళిపీటపై అడుగుపెట్టితే మహా మాంగల్యం ఏదో భూమిపై అవతరించినట్లుం దయ్యా!

కథక: అరుగో వసిష్ఠులవారు-

వసిష్ఠ: సర్వమంగళ మాంగల్యే........అయం ముహూర్త స్సుముహూర్తోస్తు.

కథక: ముత్తైదువలు కూర్చున్న ముందువరుసలో గౌరీ సరస్వతుల మధ్య, బంగారుపీటపై చెక్కిట చేయాని కూర్చుంది లక్ష్మీ అమ్మవారు-చూచారా?

సూత్ర: అవునవును-అది సంతోషమో సంతాపమోగాని, ఆ తల్లి చెక్కిళ్లు క్షణం తెల్లదామరలు క్షణం మంకెన పూలు పూస్తున్నవి.

కథక: పెళ్ళికూతురు వెనుకనే అరుంధతీదేవి.

సూత్ర: పెండ్లి కుమారుడి వెనుక వకుళమాలికా-చూస్తున్నా నయ్యా చూస్తున్నాను.

వసిష్ఠ: [illegible] కన్యాం ప్రతీచ్ఛంతు-

బ్రహ్మ: ప్రతీచ్ఛామహే

వసిష్ఠ: అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకాయ-వేంకటాచల నివాసాయ-వరాయ-ఆకాశరాజ పుత్రీం-పద్మావతీ నామ్నీం-కన్యాం-దశపూర్వేషాం-దశాపరేషాం-మధ్యం శ్యానాం-బ్రహ్మలోకే నివాస సిద్ధ్యర్థం-కన్యాం-కనక సంపన్నాం-దాస్యామి విష్ణవే తుభ్యం-ధర్మార్థకామేషు నాతిచరితవ్యా-

శ్రీని: నాతిచరామి-

సూత్ర: నాతిచరామి అనే ఈ ప్రతిజ్ఞ ఇప్పటికెన్నిసార్లు చేశారో స్వామి!

కథక: అవును-చరాచరేశ్వరుడైన స్వామి ఎవరిని చెట్టబట్టినా మరి వదలరు. ఆ బాహుబంధంలో ఎందరికైనా చోటు ఉండనే ఉంటుంది. సమస్త జగత్తును తన బాహు వుల్లోకి తీసుకుందుకే కదా, ఈ ఏడుకొండలెక్కి చేర పిలుస్తున్నారు.

సూత్ర: అదిగో! వధూవరులు తలంబ్రాలు పోసుకుంటు న్నారు.

(సైంధవి రాగం - ఆదితాళం)

ముత్తయిదువలు:

కరివేల్పు పెండ్లికొడుకాయెను అల
మేల్మంగ పెండ్లికూతురాయెను ॥ కరివే ॥
ముత్యాలువానలై జారెను అవి
ముత్యాలు తరగలై లేచెను ॥ కరివే ॥
హరికరము అవనికై జాచెను పద్మ
కైదోయి మింటికై సాచెను ॥ కరివే ॥
మిన్ను మన్ను దోసిళ్లు కూడెను మనసు
లిను మిక్కిలేతాము లాడెను ॥ కరివే ॥

వసిష్ఠ: అష్టవర్షా భవేత్కన్యా పుత్రవత్పాలితామయా

సూత్ర: లక్ష్మీ అమ్మవారు పద్మావతిని తన కౌగిటిలోకి తీసి కొని, ఆ తల్లి శిరస్సుపై బొటబొట కన్నీరు కారుస్తు న్నది. ఏదీ! మంగళహారతి అనండమ్మా!

(ఆనంద భైరవి - జంపె)

ముత్తైదువలు:

మంగళం బలమేలు మంగాసమేతునకు
మంగళం శేషగిరి మందిరునకు ॥ మంగళం ॥
ఏడుకొండలవిడిసి ఈరేడులోకాల
నేలుకొను కరిమేని వేలుపునకు ॥ మంగ ॥
నలువసేవలుగొనే నా తండ్రి కానంద
నిలయ దివ్యవిమాన కలితునకు ॥ మంగ ॥
కలితమో హరూ మంగళ దీపికాయితో
జ్వల రత్నమకుటరుచి విలసితునకు ॥ మంగ ॥

( గుడిగంటలు )

స్వస్తి.



# రంగనాథ దండకము

* * *

జయ జయ ! శ్రీ భూమి నీళా వధూ లోల ! కారుణ్యశీలా !
జగన్మోహనాకార ! గోవర్ధనోద్ధార ! గోపాల చూడామణీ !
దీన చింతామణీ ! సత్యసంకల్ప ! భోగీంద్రతల్పా ! భవన్నామ
సంకీర్తనల్ సేయఁగా నేరనే స్వామి ! నా తల్లివిన్ నీవె;
నా తండ్రివిన్ నీవె; నా యొజ్జవున్ నీవె; నా దైవమున్ నీవె;
నా ప్రాణమున్ నీవె; నా సర్వమున్ నీవె; కస్తూరి రంగయ్య !
భూదేవతన్ నమ్మి చెట్లున్న చందాన నిన్ నమ్మి నేనుంటి;
నన్ బ్రోవ భారంబు నీదంటి; కావేటి రంగయ్య ! కన్నార
నీ రూపు కానంగ లేనైతి; నోరార నిన్ బిల్వ నోమంగ
లేనైతి; చేయార నీసేవ చేయంగ లేనైతి; చిత్తంబులో
నిన్నుఁ జేర్పంగ లేనైతి; ఈ పాడు జన్మంబుచే
నేమి మేలాయె ? పుష్పంబుగాఁ బుట్టియున్నన్
భవత్పాదపూజోపయుక్తిన్ పునీతత్వముం
బొంది యుందున్ గదా ! యాగమా ? యోగమా ?
జ్ఞానమా ? దానమా ? సత్యమా ? శౌచమా ? యేదియున్
లేదె ? ఏ రీతి నన్నుం గటాక్షింతువో యోగ
నిద్రాభిరామా ! ఫలమ్ముల్ ప్రసాదించు పద్మాలు రెండున్న
వంచున్ భవత్పాదయుగ్మంబ ఆ జంట యంచున్
భజింపంగ నెంతున్ గదా ? చంచలమ్మైన చిత్తమ్ము
నన్నెడకో లాగు; ఆ కోతిసైన్యమ్ముచే అంతలంతల్
పనుల్ గొన్న పిన్నాణి వీ కోతిబుద్ధిన్ రవంతేని
మార్గమ్ములోఁ బెట్టలేవా ? హరీ ! అన్ని పాపాలకున్
మూలమౌ ఆఁకలిన్ దప్పికన్ బాపవే ! ఆశలన్మాపవే !
జన్మదుఃఖమ్ము వారింపవే ! నిత్యదాస్యమ్ము సంధింపవే !
క్షేమయోగమ్ము లన్నింటికిన్ తల్లిదే భారమంచున్
విచారమ్ము లేకుండు మార్జాలపోతమ్ము చందమ్మునన్
సర్వధర్మంబులన్ వీడి నిన్నొక్కనిన్ పట్టుగా గట్టిగా
నాశ్రయింతున్ ప్రభో ! పాహి మాం సర్వశేషిన్ ! విభో !
రక్ష మాం రంగశాయిన్ ! నమస్తే నమస్తే నమః.

— ముదివర్తి కొండమాచార్యులు.

(8 వ పేజీ తరువాయి)

ఆ విధంగా శాంతికాముడు ఆ మహావృక్షంతో పాటు ఒడ్డుచేరాడు. సూర్యోదయం అవు తూంది. గంగా సాగర సంగమదేశం తన రాజ్యానికి దక్షిణాన ఉన్నదే – అని అతడు గ్రహించాడు.

శాంతికామునికి మృత్యుదేవత మాటలు గుర్తువచ్చాయి. స్వీయరక్షణకు కత్తికూడా ఉంచుకోలేదు. తాను, హత్య ఎల్లా చేయ గలడు? అతడు గంగాసాగర సంగమస్థలి లోని ఒక చిన్నద్వీపంలోకి పారిపోయాడు. అక్కడ చాలా మంది రాజభటులు కని పించారు. శాంతికామునికి మృత్యువు వెంటాడి నట్లనిపించింది. రాజభటుల కంట పడకుండా దాక్కున్నాడు. సాయంకాలం కాబోతోంది. రాజభటులు వెళ్ళిపోయారు. మృత్యువు చెప్పిన గడువు దాటిపోతుంది. బహుశః మృత్యువు తన మాట మర్చి పోయిందేమో అనుకొంటున్నాడు.

అక్కడికొక బాలుడు వచ్చాడు. వాడొక రైతు బిడ్డలాగున్నాడు. వాడి చేతిలో పుచ్చ కాయ ఉంది. వాడికాకాయ తినాలనిపిం చింది అది పెద్ద గుమ్మడికాయంత ఉంది. తికమక పడుతున్నాడు. తోడు పడటానికి ఎవ్వరూ లేరు. చుట్టూ కలియచూశాడు. ఎవ్వరూ కనిపించలేదు. శాంతికాముడికి తుమ్ము వచ్చింది. "ఇక్కడ దాక్కున్నావా? అంటూ ఆ పిల్లవాడు శాంతికాముని దగ్గరకు వచ్చాడు. 'నీవెవరుబాబు? నీకేం కావాలి?' అన్నాడు శాంతికాముడు. "నీవు కాశీ రాజువా?" అన్నాడు పిల్లవాడు.

శాంతికాముడు తాను కాశీరాజు నన్న మాట మర్చిపోయి పదకొండు నెలల పద కొండు రోజులైంది. ఇప్పుడా పిల్లవాడు జ్ఞాపకం చేశాడు. "మృత్యుదేవత చెప్పినట్లు ఆ పిల్లవాడు రాజకుమారుడు కాదు గదా!' అనుకొంటుండగా 'నాకీకాయ కోసిపెట్టవా?' అని పిల్లవాడు పుచ్చకాయను శాంతికామున కిచ్చాడు. శాంతికాముడు తన దగ్గర కత్తి లేదన్నాడు. వాడు తన దుస్తులతో దాచిన కత్తిని శాంతికామున కిచ్చాడు. శాంతి కాముడు ఎడమచేతిలో పుచ్చకాయను పుచ్చు కొని కుడిచేత్తో ఆ కాయ కోసిమ తరుగ బోయాడు. ఆ కాయ ముక్క చందుకో వచ్చిన పిల్లవాని మెడ హఠా కాయ తొడి మతో పాటు నేలరాలింది.

ఇంతలో ఆ దేశపు రాజభటులు అక్కడికి వచ్చారు. శాంతికాముణ్ణి బంధించి రాజు ముందుంచారు. రాజు రోదిస్తున్నాడు. జ్యోతిష్కులు చెప్పనే చెప్పారు.... ఉత్తర దేశపు రాజు తన కుమారుణ్ణి చంపుతాడని.. అందుకే తాను తన కొడుకును పుచ్చకాయల దీవిలో దాచిపెట్టాడు. తాను చాటులవల్ల విన్నాడు....కాశీరాజు సర్వసంగ పరిత్యాగం చేసి రాజ్యం వదలి పారిపోయాడని .... జ్యోతిష్కుల మాట నిజం చేయటానికే మారువేషంలో వచ్చాడేమో .... అంటూ దుఃఖించాడు.

రాజకుమారుణ్ణి హత్యచేసి మునిలా ముక్కుమూసు కూర్చున్నాడని నేరారోపణ శిక్ష మరణదండన! విధి ఎంత బలీయమో శాంతికామునికి అర్థమైంది. ఊరికి ఉత్త రాన ఊడల మర్రి గురించి ఆలోచిస్తు న్నాడు. నేరస్తుణ్ణ ఎలాగూ చంపటమా అని ఆలోచిస్తున్న రాజుకు శాంతికాముని ఊహ ప్రేరణ కలిగించింది. ఊరికి ఉత్తరాన ఉన్న ఊడల మర్రికి వ్రేలాడదీసి చంప మని రాజాజ్ఞాపించాడు. "ఆహా!" అను కొన్నాడు శాంతికాముడు. ఒక క్షణంలో ఒంటిని తరలిస్తారనగా రాజు శాంతికాము నితో నీ తుది కోరిక కోరుకో: మరణదండన మాత్రం మార్చమనకు అన్నాడు.

శాంతికాముడు ఒక్కక్షణం ఆలోచించాడు రాజు ఊడలమాను ఉత్తరపు కొమ్మకు వ్రేలాడతీయమని చెప్పలేదు. రాజభటులు ఏ దిక్కు కొమ్మకైనా తనను వ్రేలాడతీయ వచ్చు. మృత్యుదేవత చెప్పినట్లు ఉత్తరపు కొమ్మకే రాజభటులు వ్రేలాడతీస్తారేమో! కడపటి ప్రయత్నం చేసి చూద్దామను కొన్నాడు. 'రాజా! ఆ మర్రి దక్షిణపు కొమ్మకు వ్రేలాడ తీయవలసిందిగా ఆజ్ఞా పించండి' అన్నాడు. రాజాశ్చర్య పోయాడు. 'సరే! నన్నాడు. రాజభటులు శాంతికాముణ్ణి తీసికొని పోయారు. ఊరి ఉత్తరపు ఊడలమర్రిని చూచి 'నీ సంగతి నాకు సంవత్సరం క్రిందే తెలుసు సుమా' అన్నట్లు తలఊపాడు. రాజభటులు వాణ్ణి పిచ్చివాడి క్రింద జమకట్టారు. రాజాజ్ఞ ప్రకారం శాంతికాముణ్ణి ఆ మాను దక్షిణపు కొమ్మకే వ్రేలాడతీశారు. ఇక క్షణంలో వాడు చనిపోతాడనగా.... ప్రళయఝుంఝ వీచింది. చెట్టు వ్రేళ్ళతో పైకి లేచింది. ఆ మహావృక్షం పెడతిరిగింది. దక్షిణపు కొమ్మ శాంతికామునితో పాటు ఉత్తరానికి మారింది. శాంతికాముడు నిర్భయంగా చూస్తున్నాడు. వానికి ప్రసన్నుడైన యమ ధర్మరాజు ప్రత్యక్షమైనాడు. యముడు నచికేతునికి చెప్పిన కఠోపనిషన్మంత్రం.

భయా దస్యాగ్ని స్తపతి. భయా త్తపతి సూర్యః।
భయా దిద్రశ్చ వాయుశ్చ, మృత్యుర్ధావతి పఞ్చమః॥

శాంతికామునికి స్ఫురించింది.



## ప్రకాశ విమర్శీయము

గ్రంథకర్త: శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావు. 1-118-1 గంగనపల్లి రోడ్డు, చిత్తూరు-4. వెల 15 రూపాయలు.

ప్రకాశ విమర్శీయము నలుపది రంగములతో కూడిన ఐదంకముల మతనాటకము. గ్రంథకర్త శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావుగారు.

ప్రకాశ విమర్శీయము, మతనాటకము అనుపేర్లు చూడగానే సంస్కృతమందలి ప్రబోధ చంద్రోదయము, సంకల్ప సూర్యోదయము అను నాటకములు స్మృతికి తగులును. మత ప్రమేయము, గర్భిత వస్తుకత్వము అను లక్షణములున్నను ఇది వానివంటి నాటకము కాదు. ఇందలి పాత్రలు మానవులే, వస్తువును లౌకికమే. మంత్రశాస్త్రమున పురుష ప్రకృతులకు ప్రకాశ విమర్శలను నామములున్నవి. గ్రంథకర్త గారానామములను నాయికా నాయకులుగా (ప్రకాశమూర్తి, విమర్శాదేవి) గ్రహించి, ఆధునిక రాజకీయములందలి కొన్ని యంశములను హేళనాత్మముగా జతచేసి, విస్తృతము క్లిష్టమునగు వస్తువును కల్పించి యీ బృహన్నాటకమును రచించిరి. ఇప్పుడు పద్యగద్యాత్మకములైన పెద్ద నాటకములను తెలుగులో వ్రాయుట అరుదైనది. అట్టి యెడ గ్రంథకర్తగా రట్టి ప్రయత్నము చేపట్టి కృతకృత్యులగుట ముదావహము.

గ్రంథకర్తగారు ప్రాచ్యపాశ్చాత్య నాటక విధానములు రెండును ఎఱింగినవారు. నాటకమును పంచాంక పరిమితమొనర్చుట రెండు విధానములందునున్నది. అంకమును రంగములుగా విభజించుట పాశ్చాత్య విధానమే. సంస్కృతమున నొక్కొక్క యంకమొక్కొక్క రంగము. ఈ నాటకము నాందీపద్యముతో నారంభమగుచున్నది. ప్రస్తావనలేదు. నాందీ పద్యమును రచించు విషయమున గ్రంథకర్త మఱికొంత జాగరూకత వహించి యుండవలసినది. చివర భరతవాక్యము సలక్షణమై యొప్పారుచున్నది. ఇందలి బహురంగములలో రెండు మూడింటిని విష్కంభములుగానో ప్రవేశకములుగానో భావింపవచ్చును.

అమరావతీ పట్టణమును సార్థకనామధేయుడైన శుద్ధబుద్ధావతార మహారాజు పాలించుచుండెను. నీతిమంతుడతని ప్రధానమంత్రి. బౌద్ధుడైన మహారాజు సైన్యమునుండి దృఢగాత్రులను తొలగించి బధిర పంగ్వంధాదులను సైనికులుగా నియమింపనాజ్ఞాపించెను. ఇట్లే అతడు పంటలను నాశనముచేయు మూషిక జంబుకాదులను హింసింప కూడదనియు, బౌద్ధ సన్న్యాసులకు పలువిధములైన రక్షణ కల్పింపవలెననియు పిచ్చిశాసనములు కావించెను.

## గ్రంథసమీక్ష

పౌరులెంత మొరపెట్టుకొన్నను అతడు వినిపించుకొనలేదు. రాజ్యము బలహీనమయ్యెను. పరిసర రాజ్యమైన యవన రాజ్యమున కేలిక అక్రమజ్యోతి. రణజిత్తతని మంత్రి. వారెట్లైనను అమరావతీ రాజ్యము నాక్రమింప వలెనను నుద్దేశముతో గూఢచారుల ద్వారా సైన్యములకు సంబంధించిన కొన్ని రహస్యములను సంపాదింప యత్నించిరి. రాజకుమారుడైన ప్రకాశమూర్తియు మంత్రి కుమారుడైన సుందరకీర్తియు దుండగుల జట్టును కూర్చుకొని నగరములో విశృంఖలముగా విహరించుచుండిరి. రాజమంత్రి కుమారులిరువురును సేనానాయకుని కూతురైన విమర్శాదేవిని ప్రేమించిరి. ఇది వారిరువురికిని వైరకారణమయ్యెను. సుందరకీర్తి రాజకుమారుని హతమార్చ సంసిద్ధుడై ఆకాశరామన్న ఉత్తరములు కల్పించి సేనాధిపతికి క్లేశము కలిగించెను. అతడు శత్రు గూఢచారులకు సాయము కావించుటయేకాక మాఱువేషముతో యవన రాజ్యమున కరిగి అచ్చట దళవాయి ఉద్యోగము సంపాదించెను. అమరావతీ సేనాధిపతియైన కుమారచంద్రుడును, సరిహద్దు నిఘా దళాధిపతియైన వీరభద్రుడును రాజ్యరక్షణమునకు కొన్ని రహస్య దళముల నేర్పాటు చేసిరి. వారికి శంకరయోగి అనేక విధముల తోడ్పడుచు సకాలమున దేశరక్షణ కవసరములైన హెచ్చరికలిచ్చుచుండెను.

ప్రకాశమూర్తిలో అఖండమైన మార్పు కలిగెను. రాజు యవన రాజ్యముపై దండెత్తుట కంగీకరింపక పోయినను అతడు తల్లితో కూడ చిన్న సైన్యముతో యుద్ధమునకు సిద్ధమయ్యెను. సుందరకీర్తి యవన సైన్యముతో అమరావతి వైపు వచ్చుచుండగా ప్రకాశ సుందరకీర్తులకు ద్వంద్వయుద్ధము జరిగెను. అందు సుందరకీర్తి హతుడయ్యెను. యవన సైనికులు పాఱిపోయిరి. ప్రకాశమూర్తి తల్లిమాట వినక పురోగమింపగా యవన సేన వారిని బందీలుగా గ్రహించెను. తొలగించిన సైనికులను మరల సేనలో చేర్చుకొనుట కంగీకరింపుమని సేనాధిపతి కోరగా బుద్ధావతారు డంగీకరింపలేదు. తరువాత అతని చేతులకు బంగారు సంకెలలు తగిలించుటకు యవన సేనాధిపతి వచ్చుచున్న వార్తవిని అతడు మేడపై నుండి క్రిందికి దుమికి ప్రాణములు కోల్పోయెను. మంత్రియు సేనాధిపతియు తొలగించిన సైనికులను మరల సేనలలో చేరవలసినదని ఆహ్వానించిరి. వారు తండోపతండములుగా వచ్చి సేనలో చేరిరి. అమరావతి సైన్యము యవనరాజ్యము వైపు పురోగమించెను. ప్రకాశమూర్తి మిత్రుడును ఆస్థానపండితుని కుమారుడును అయిన భావయ్య మూగవాడుగా నటించుచు యవన సైనికులచే బంధింపబడి ప్రకాశమూర్తియు తల్లియు నుండిన చెఱసాలచేరుకొని వారికుత్సాహము కల్పించెను. యవనసైన్య మమరావతీ పురమును ముట్టడింపనేగిన సమయమున రక్షణ హీనమైన యవనరాజ్యమును (అశ్వ

పురిని) ప్రవేశించి దళాధిపతి వీరభద్రుని అగ్రమకోత్పత్తి యుద్ధావతారుని బొజకు చేయించిన బంగారు సంకెళ్ళ నతని చేతులకే తగిలించెను. అతడు సంధి షరతులకంగీకరించి జీవిత పాలన విధానములను మార్చుకొనెను. ప్రకాశమూర్తి తల్లితోకూడ సురక్షితముగా అమరావతీ పురము చేరెను. ప్రకాశమూర్తికిని విమర్శాదేవికిని వివాహము జరిగెను. అతడమరావతీ రాజ్యమునకు పట్టాభిషిక్తుడయ్యెను. నాటకము మోదాంతముగా ముగిసెను.

విస్తృతమైన యీ నాటకమునకు తగిన కథావస్తువును కల్పించి దాని నంకములుగను రంగములుగను విభజించుటలో కవిగారు ప్రదర్శించిన నేర్పు ప్రశంసనీయముగానున్నది. సూక్ష్మముగా పరిశీలించినచో నిందు పంచసంధులను గుర్తింపవచ్చును. కథా కల్పనలో భారతదేశమునందలి ఆధునిక రాజకీయ పరిస్థితులు ధ్వనించుచున్నవి.

పాత్రచిత్రణమున కవిగారు సిద్ధహస్తులు. పెక్కుపాత్రల పేర్లు సాభిప్రాయములుగానున్నవి. పేర్లను బట్టియే వారి ప్రవృత్తులను గ్రహింపవచ్చును.

ఈ నాటకమున ప్రధాన రసమువీరమే.

సంభాషణలు సముచితములుగను, సందర్భోచితములుగను, సరసములుగను సాగినవి. నాటకమునకు సంభాషణ చాతుర్యమే కదా ప్రాణము? ఈ నాటకమతి విస్తృతమగుటచే ప్రదర్శనార్హత కోల్పోయినది. ప్రదర్శన కర్హము కావలెనన్న గ్రంథకర్తగారే దీనికి సంగ్రహ రూపమును సిద్ధముచేయవలెను.

ఈ నాటకమున సుమారు 150 పద్యములు 20 గేయములు ఉన్నవి. పద్య గేయ రచన ధారాళముగనే సాగినది. కాని పద్యములందు దోషములెక్కువగా నున్నవి కవిగారు పాదమధ్యమందే పెక్కుచోట్ల విసంధి పాటించినారు. నాందీ పద్యమునందలి చంద్రుకున్, మహేశుకున్, వజ్రాయుధ శివులు అను ప్రయోగములు కతిపయములుగా నున్నవి. నీతివంతులు, అతిమెత్తన, బౌర్పుత, వైష్ణవత, శుద్ధయుద్ధ అవతారుని (సంధిచేసిన గణభంగము) వాక్షాళ, బహిర్భాజము, విహారలోటకున్, నాచతురమ్ము, యుధుడు అహ్వానముగను (55) సామ్యత, పండిత జత, శోభపతి (68) మ్యుమతూపుతో (81) సేరస్తుని, వివాహము విస్మరాయు, శాంతి దాయినే ఆ క్రమునామకే (112) మానం కలహంనాస్తి, శాంతాపధగామికే, అబ్ధ, అధర్మ పాపములర్ (126) అల్లికల్లోల సంగ్రరంబు (159) నింపలంకారము, కీర్తియుతుమై (184) యుద్ధారువము (185) క్షణిక ఆవేశముకు (217) పట్టణ పల్లెలందు (230) పరిశుద్ధ సాయమును (237) వెన్నెలలీ యొసగి (267) చిరంజీవిరస్తు మున్నగు ప్రయోగములను సులభముగా సవరించుకొనవచ్చును. దీనివలన నాటక రసభావములకు కలిగిన భంగమేమియు లేదు.

కవిగారు భాషాతత్త్వవేత్తలు. సుమారేబదియేండ్ల క్రిందటనే వాడుక భాష అను గ్రంథమును పండితుల కందజేసిరి. వారు కోకొల్లలుగా వాడిన లోకోక్తులు సామెతలు నాటకమునకు వన్నె చేకూర్చుచున్నవి. వారు పెక్కు మాండలికములను ప్రయోగించిరి. కొన్నిటి కర్థము చివర నొసంగిరి. కొన్ని శబ్దములను వారు క్రొత్తగా సృష్టించిరి. కవనించు, మొగ్గించు, స్మగ్లించు, అతిశయోక్తించు, విందించు, మినికించు, మున్నగునవి అట్టివానిలో కొన్ని. ఇవి గ్రాహ్యములుగానేయున్నవి. ప్లేటుమార్చు అనుటకు పళ్ళెముమార్చు అని వాడియుండిరి. వేడియుద్ధము, చల్లయుద్ధము తోకపిట్ట అనునవికూడ నిట్టివే. పలువురు వాడినచో - నివియు ప్రచారములోనికి వచ్చును. రాజుగారు కుమారుని రాణిని కూడ గౌరవ పూర్వకముగానే సంబోధింతురు. ఇది రాచమర్యాద కాబోలును. ఏవో స్వల్పదోషములున్నను నాటకము వ్యంగ్య ధోరణిలోసాగి సహృదయానంద సంధాయకముగుచున్నది. ఈ రోజులలో నింత పెద్ద, మంచి వచ్చనాటకమును తెలుగువారికందిచ్చిన గ్రంథకర్త నభినందించుచున్నాను. ఈ నాటకమును వారు మాతృదేవి కంకితమిచ్చి మాతృభక్తిని ప్రకటించుకొన్నారు.

— దివాకర్ల వేంకటావధాని

## శ్రీ మహాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణము: బ్రహ్మఖండము

మూలము: బ్రహ్మవైవర్తపురాణము.
అనువాదకర్త: శ్రీ పట్టుపల్లి వెంకటరాయగుప్త.
కాపుపహోటు: ఏవా ఇంజనీరింగ్ కంపెని,
స్టేషన్‌రోడ్, గుంటూరు - 522001.

పుటలు: 146. వెల: 8 రూపాయలు.

"అష్టాదశ పురాణానాం వ్యాసః కర్తా నసంశయః" అనిన మాటప్రకారము ఈ బ్రహ్మవైవర్తమునకు కూడా వ్యాసుడే కర్త. ఇది వైష్ణవ పురాణములలో ఒకటిగా ప్రసిద్ధికెక్కినది. ఏవో కొన్ని పురాణములు మాత్రము దీనిని సౌరపురాణమని చెప్పినవి. ఈ పురాణము ప్రథమ ద్వితీయభాగములుగ ముద్రితమైనది. మొదటి సగభాగమును 1. బ్రహ్మఖండము (30 అధ్యాయములు); 2. ప్రకృతి ఖండము (67 అధ్యాయములు); 3. గణపతి ఖండము (46 అధ్యాయములు); మిగిలిన సగభాగము శ్రీకృష్ణ జన్మఖండము. బ్రహ్మ బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త పురాణములు మూడును ఎక్కువభాగము బ్రహ్మ చెప్పినవి. బ్రహ్మను గూర్చి చెప్పినవిగా నున్నవి.

బ్రహ్మవైవర్తపురాణమునందలి బ్రహ్మఖండము చాల క్రొత్త విషయములకు నిధానము. సాధారణముగ:—

సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణిచ ।
వంశానుచరితం చైవ పురాణం పంచలక్షణమ్ ॥

అను లక్షణముతో పురాణస్వరూపములు అన్నీ ఒకే విధముగనున్నను, ప్రతిపురాణమునందును ఎక్కువగా హరినిగాని, హరునిగాని, శక్తినిగాని, సూర్యునిగాని, గణపతినిగాని, స్కందునిగాని మూల వ్యక్తినిగా జేసి కథ నడిపించుట సహజము. అందువల్లనే కొన్ని పురాణములు వైష్ణవములనీ, కొన్ని శైవములనీ, కొన్ని శాక్తములనీ, కొన్ని సౌరములనీ, కొన్ని గాణాపత్యములనీ, కొన్ని స్కాందములనీ ప్రసిద్ధికెక్కినవి. ఆయా పురాణముల యందు వారే వక్తలు,

"మద్ద్వయం భ్రిత్రయంచైవ
బ్ద్వయం వచతుష్టయం।
అనాప లింగ కూస్కాని
పురాణాని దశాష్టవ॥"

అన్న సూక్తిలో బ్రత్రయంలో మన బ్రహ్మ వైవర్తమున్నది. ఇందులో బ్రహ్మ ఖండము సృష్టిరహస్యములను, కొన్ని మంత్రరహస్యములను, కొంత వైద్యరహస్యమును, మరికొందరు ఇతర పురాణము కనపడని వ్యక్తుల చరిత్రములను మనకు చూపుచున్నది.

పదమూడవ అధ్యాయమున ఉపబర్హణుడు వైరాగ్యముతో శరీరత్యాగమునకు సిద్ధమగునప్పుడు మూలాధారాది షట్చక్ర భేదనమును, పదునారవ అధ్యాయమున ధన్వంతరి మొదలగు పదునాల్గురు ఘన వైద్యులను చెప్పుసందర్భమున వైద్య శాస్త్రమును, పందొమ్మిదవ అధ్యాయమున సర్వప్రాణులకు నిత్యము పారాయణ యోగ్యమగు బ్రహ్మాండపావనము అను కృష్ణకవచమును, సంసారపావనము అను శివకవచమును రెండును చేర్చుటవల్ల గ్రంథమునకు గొప్ప విశిష్టత ఏర్పడినది. గ్రంథము నడుమ నడుమ ఆయా సందర్భములలోని విలువగల మూల శ్లోకములను అట్లట్లనే గ్రంథములో ఉటంకించుటకూడా గ్రంథము యొక్క గొప్పదనమునకు కారణమైనది. మూలమునకు యథావాక్యానువాదము కాకపోయినను పెద్దగా వదలిన పట్టులుకానరావు. గ్రంథకర్త శ్రీ మట్టుపల్లి శివసుబ్బరాయగుప్తగారు గొప్పగా చదువుకున్న వ్యక్తికానట్లు తనకు తానే చెప్పుకొనెను. స్వప్నమునందగపడిన స్వామి:– "మద్గతచిత్తుడవు, మద్భక్తుడవు, నన్నే పూజించువాడవు మత్పరాయణుడవు కావలసినదనియు మేఘగంభీరస్వరముతో పలికి అంతర్ధానమొందెను" అని చెప్పుటచే ఈయనకుగల దైవానుగ్రహము, ఈ గ్రంథ రచనకు కావలసిన శక్తిని ప్రసాదింపగలదు. అదికాక వీరు ఆశ్రయించిన పండితులందరూ చాలగొప్పవారు. వారి సాహాయ్యము ఆ దైవానుగ్రహమునకు ఇబ్బడి ముబ్బడికాగలదు. పుత్రికానంతాప రహితుడైనను 'విమలరవికోటి సంకాశు' డగు వేంకటేశుని అల్లునిగా గొన్న ఈ పుస్తికాపుత్రికారత్నము తనకోటి జన్మముల తపఃఫలము. నడుమనడుమ చిత్రించిన శివకృష్ణాది చిత్రములు చాల మనోహరముగా నున్నవి. కాని

పాపేన జాయతే వ్యాధిః
పాపే న జాయతే జరా (70 పేజి)

వంటి స్థలములందు 'జరా పాపేన జాయతే' అని సవరించుకొను వ్యుత్పత్తి యుండినచో ఈ చిల్లర దోషములు లేక గ్రంథము ఇంక కొంత విశిష్టత కలిగివుండుననవచ్చును. ఇట్టి దోషములను ఎత్తి చూపుట ఇంత మంచి గ్రంథమునందు చేయరాని పని యని వదలితిని.

— గౌరిపెద్ది రామసుబ్బశర్మ

---

## గమనిక

సమీక్షకు గ్రంథాలు పంపేవారు రెండు ప్రతులను పంపాలని రచయితలు గమనించ ప్రార్థన. సం॥

---



---

(5 వ పేజీ తరువాయి)
పోవడంలేదు. ధర్మమార్గము జీవికి నిత్య శుభమార్గమగును. ధర్మో రక్షతిః ! రక్షతి. మనం ధర్మాన్ని రక్షిస్తే- ధర్మం మనలను రక్షిస్తుంది. సుఖదుఃఖాలు శాశ్వతమైనవి కావు. కావున ప్రాణము మీదకు వచ్చినను ధర్మమును విడువరాదు.

ఇమాంభారత సావిత్రీం
ప్రాతురుత్థాయయఃపఠేత్
స భారతఫలం ప్రాప్య
పరబ్రహ్మాధి గచ్ఛతి.

ధర్మాది సాధనముల ద్వారా జీవునకు నిత్యశాంతిని చేకూర్చుటే మానవ కర్తవ్యం, పై శ్లోకములను నిత్యము పఠించు భక్తుడు యిహమందు ఆనందము పొంది, పరమందు స్వర్గధామము చేరును.

శ్రీ మహాభారతసావిత్రి యుపదేశ శ్లోకములను ఆచరణపెట్టుశక్తిని భగవానుడు మానవులకిచ్చుగాక !

❋

# శుక్రవారం సేవలు: వేళల మార్పు

* * *

తిరుమల శ్రీవారి ఆలయంలో శుక్రవారాలలో స్వామివారికి అభిషేకం ఏర్పాట్లుకు సళ్ళింపు, శుద్ధి తదితరకార్యక్రమాలకుగాను కేటాయించిన సమయం (ఉదయం 3-30 గం॥ నుండి 4-30 గం॥ వరకు) తక్కువగా వుంటున్నందువలన ఆరోజు ఉదయం సుప్రభాత దర్శనంకు తక్కువ సంఖ్యలో యాత్రికులను అనుమతించవలసి వస్తున్నది. ఈ అసౌకర్యం తొలగించే నిమిత్తం ఆ సమయాన్ని పెంచారు. పరిమిలా. శ్రీవారి ఆలయంలో శుక్రవార సేవల సమయాలను తే 1-7-1983 ది నుండి క్రింది విధంగా సవరించారు.

| | | |
|---|---|---|
| సుప్రభాతం | ఉ. 3-00 గం॥ నుండి | 3-30 గం॥ వరకు |
| సళ్ళింపు, శుద్ధి ఉదయం మొదటిగంట అభిషేక ఏర్పాట్లు | ఉ. 3-30 గం॥ నుండి | 5-00 గం॥ వరకు |
| అభిషేకం | ఉ. 5-00 గం॥ నుండి | 6-30 గం॥ వరకు |
| సమర్పణ | ఉ. 6-30 గం॥ నుండి | 8-00 గం॥ వరకు |
| తోమాలసేవ అర్చన (ప్రైవేటు) | ఉ. 8-00 గం॥ నుండి | 9-00 గం॥ వరకు |
| రెండవగంట బలి, శాత్తుమొర | ఉ. 9-00 గం॥ నుండి | 9-30 గం॥ వరకు |
| సర్వదర్శనం | ఉ. 9-30 గం॥ నుండి | రా. 7-00 గం॥ వరకు |
| శుద్ధి, నిత్య కైంకర్యములు | రా. 7-00 గం॥ నుండి | రా. 8-00 గం॥ వరకు |
| సర్వదర్శనం | రా. 8-00 గం॥ నుండి | రా.12-00 గం॥ వరకు |
| శుద్ధి | రా. 12-00 గం॥ నుండి | రా.12-30 గం॥ వరకు |
| ఏకాంతసేవ | రా. 12-30 గం॥ | |

పేష్కారు, తిరుమల.

# వార్తాలహరి

## దేవాదాయకమిషనర్

ఆంధ్రప్రదేశ్ దేవాదాయశాఖ కమిషనర్గా శ్రీ ఎల్. సుబ్బయ్య, ఐ. ఏ. ఎస్ స్థానంలో శ్రీ కె. మురళీధర్, ఐ. ఏ. ఎస్. నియమితులయ్యారు. శ్రీ మురళీధర్ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ రెవిన్యూశాఖలో డిప్యూటీ కార్యదర్శి.

## అభిషేకదర్శనం

శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయంలో అభిషేక దర్శనానికి ఇటీవల 2 రూపాయల ప్రత్యేక టిక్కెట్లను ప్రవేశపెట్టారు. ఇప్పటి వరకూ అభిషేక సమయంలోకూడా సర్వ దర్శనం వుంటూవచ్చింది. ఇకమీదట రెండు రూపాయల ప్రత్యేకదర్శనం టిక్కెట్ల పైన మాత్రమే అభిషేక సమయంలో భక్తులను దర్శనానికి అనుమతిస్తారు.

## వికలాంగ కేంద్రం

తిరుపతిలో ఈ ఉగాదినాడు అలిపిరివద్ద ప్రారంభమైన శ్రీవేంకటేశ్వర వికలాంగుల శిక్షణ కేంద్రం ప్రాంతీయ కార్యాలయం డైరెక్టర్గా టి. టి. డి. సీనియర్ మెడికల్ ఆఫీసర్ శ్రీమతి వై. ఆర్. ధనలక్ష్మి ఇటీవల నియమితులయ్యారు.

## పరకామణి అలవెన్సు

తిరుమల శ్రీవారి ఆలయంలో పరకామణి విభాగంలో పనిచేసే అటెండర్లకు నెలకు రూ. 10/లు ప్రత్యేక అలవెన్సు ఇచ్చేందుకు ఇటీవల టి. టి. డి. అంగీకరించింది.

## విద్వాన్ విశ్వం

టి. టి. డి. ప్రధాన సంపాదకులు డా॥ విద్వాన్ విశ్వంగారి పదవీకాలాన్ని 1983 ఆగష్టు నుండి మరో ఏడాదిపాటు పొడిగించటం జరిగింది.

( 48 వ పేజీలో)

## తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# టెండరు ప్రకటన

ఆర్. వో. సి. నెం. ప్రకటన: 3/సివి/83. తే. 8-7-83.

కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి వారిచే రిజిష్టర్‌కాబడిన కాంట్రాక్టర్ల నుండి ఈ క్రింది పనులకుగాను, సీలువేయుబడిన టెండర్లు కోరబడుతున్నవి. టెండరు ప్రకటనలోని 5 వ కాలమ్‌లో పేర్కొనబడిన విధంగా సీలువేసిన కవరులో ఆయా పనులకు తమ టెండర్లను ఆయా సంబంధిత అధికారులకు తే 18-8-83 ది మధ్యాహ్నం 3 గంటలకుగాని అంతకుముందుగాని చేరేటట్లుగా పంపవలసి వుంటుంది. టెండర్లు అదేరోజున మధ్యాహ్నం 3-15 గంటలకు తెరువబడుతవి.

టెండరు పత్రాలు కావలసినవారు టెండరు పత్రాల ఖరీదుకు డిమాండ్ డ్రాఫ్టును జతచేసి తమ తరగతి రిజిస్ట్రేషన్, పూర్వానుభవంకు సంబంధించిన ఋజువులతో తే 1-8-83 ది లోగా సంబంధిత అధికారులకు దరఖాస్తు చేసుకోవాలి. గడువు తేది తరువాత చేరిన దరఖాస్తులు, అవశ్యకమైన వివరాలులేని దరఖాస్తులు మొత్తంగా నిరాకరించబడుతవి.

టెండరు పత్రాలను తే 12-8-83 ది నుండి తే 16-8-83 ది వరకు (రెండురోజులూ కలుపుకొని) సంబంధిత అధికారుల కార్యాలయాలలో, కార్యాలయ పనివేళలలో పొందవచ్చును. టెండరు పత్రాల ఖరీదును కార్యనిర్వహణాధికారి, అకౌంట్ కోడ్ నెం. 689, టి. టి. డి. అకౌంట్లు ఖాతాలో తిరుమల, తిరుపతిలలోగల స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా కార్యాలయాలలో డిమాండ్ డ్రాఫ్టు మూలకంగాగానీ, చలానా ద్వారాగానీ చెల్లించాలి.

టెండరు పత్రాలు మార్చుకోరానివి. ఏ పరిస్థితులలోనూ టెండరు పత్రాల మూల్యం వాపసు ఇవ్వబడదు. పోస్టుద్వారా టెండరు పత్రాలు పంపబడవు. టెండరు పత్రాలు తెచ్చుకొనే ఏర్పాట్లను టెండరు దారులే చేసుకోవాలి.

టెండరు పత్రాల స్వీకరణగడువు తేదీనాడు అనూహిత కారణాలవల్ల కార్యాలయం మూతబడినట్లయితే ఆ తర్వాతి పని దినంనాడు మధ్యాహ్నం 3 గం॥ వరకు టెండర్లు స్వీకరించబడుతవి.

ఏ క్షణంలోనైనా ఎట్టికారణం తెలుపకుండానే ఏదో ఒక టెండరునుగానీ లేదా అన్ని టెండర్లనుగానీ నిరాకరించే అధికారం లేదా టెండరు ప్రతిపాదనలనే ఉపసంహరించుకొనే అధికారం కార్యనిర్వహణాధికారికి వుంటుంది.

భవనాలను 'టర్న్ కీబేసిస్' విధానంపై ఇంటిలోపల నీటిసరఫరా, విద్యుత్‌పరికరాల బిగింపు, శానిటరీ సాధనాల ఏర్పాట్లతో పూర్తి ఆకారంతో పూర్తిచేసి కాంట్రాక్టర్ అప్పగించవలసి వుంటుంది. నీటిసరఫరా, విద్యుత్‌సరఫరా, శానిటరీ సాధనాల ఏర్పాట్లకు కావలసిన పార్టు (బి) మరియు (సి) లలోని పరికరాలను అర్హతకలిగి, అనుమతి, అధికారం పొందిన ఏజెంట్ల నుండే పొందాలి. ఇందుకు ఋజువుగా ఆ ఏజెంట్ల నుండి తీసుకొన్న అంగీకారపత్రాన్ని టెండర్లతో జతచేయాలి. ఆయా ఏజన్సీల ద్వారా సకాలానికి నిబంధనల కనుగుణంగా అనుబంధ పనులను పూర్తిచేయించేందుకు కాంట్రాక్టరే బాధ్యతవహించాలి. సివిల్‌పనులనేగాక నీటిసరఫరా, విద్యుత్, శానిటరీ సాధనాల ఏర్పాట్లను కూడా సకాలంలో పూర్తిచేసేందుకు కాంట్రాక్టర్ బాధ్యత వహించాలి.

టెండర్లు తెరచిన రోజునుంచి 4 మాసాల వరకు మాత్రమే ఏ టెండరు అయినా చెల్లుబడి అవుతుంది.

టి. టి. డి. కి స్టాండింగ్ సెక్యూరిటీ డిపాజిట్ చెల్లించనట్టి కాంట్రాక్టర్లు టెండరు వేసేటప్పుడు తమ కాంట్రాక్టు విలువలో 1½ శాతం సొమ్మును, చలానా లేదా డిమాండ్‌డ్రాఫ్టు ద్వారా చెల్లించి, కాంట్రాక్టులో 1 శాతం విలువకు బ్యాంకు గ్యారంటీని టెండరుతోబాటు చూపించాలి. కాంట్రాక్టర్ల రన్నింగ్ బిల్లుల నుండి భవిష్యత్‌లో సెక్యూరిటీ డిపాజిట్ కొరకుగాను, ఆగిపోయిన నిధులకుగాను 7½ శాతం సొమ్ము నిలిపివుంచబడుతుంది.

టి. టి. డి. కి రూ. 1 లక్షను స్టాండింగ్ సెక్యూరిటీ డిపాజిట్‌గా నిర్ణీత ఫారంతో చెల్లించిన కాంట్రాక్టర్లు క్రింది రీతిగా ఇ.ఎం.డి., ఎఫ్.ఎస్.డి. లను చెల్లించాలి.

**1) ఎర్నెస్ట్‌మనీ డిపాజిట్ :**

కాంట్రాక్టు విలువలో 1 శాతం (75 వేల రూపాయలకు మించకుండా)

**2) బిల్లులనుంచి నిలుపుదల :**

| | వని విలువ: | | నిలుపుదల శాతం: |
|---|---|---|---|
| 1. | మొదటి రూ. 50 లక్షల పనివరకు | | 3½ శాతం |
| 2. | రూ. 50 లక్షలకు పైబడి రూ. 1 కోటికి లోబడిన పనులకు | మొదటి రు. 50 లక్షలకు | 3½ శాతం |
| | | రు. 50 లక్షల పై పనులకు | 2 శాతం |
| 3. | రూ. 1 కోటికి మించిన పనులకు | మొదటి రు. 50 లక్షలకు | 3½ శాతం |
| | | రు. 50 లక్షల పై పనులకు | 2 శాతం |
| | | రు. 1 కోటి పై పనులకు | 1½ శాతం |

| వరుస సంఖ్య [1] | పనిపేరు [2] | ఇ.ఎం.డి. (కొంతవరకేది) కాంట్రాక్టు విలువ లో 1½ శాతం [3] | కాంట్రాక్టు లో 1శాతం [4] | టెండరు ఫారాలు పొందు ఏలిన/చేర్చు వలసిన లేక కార్యాలయం [5] | టెండర్ షెడ్యూల్సు విలువ [6] | కాంట్రాక్టు వ్యవధి [7] | టెండరు వేసేందుకు అర్హతగల కాంట్రాక్టర్ [8] |
|---|---|---|---|---|---|---|---|
| 1. | తిరుమల మేదరమిట్ట ప్రాంతంలో టి.టి.డి. సహకార బ్యాంకు భవన నిర్మాణం | రు. 3,750/ | రు. 2,500/ | ఇ.ఇ. 1 తిరుమల | రు. 150/ | 12 నెలలు | రెండవతరగతి ఆపైన |
| 2. | తిరుమలలో ఒకటి మరియు రెండు కొత్త సత్రాల మధ్యనున్న డార్మిటరీ భవనంపై మొదటి అంతస్థు నిర్మాణం | రు. 10,875/ | రు. 7,250/ | ఇ.ఇ. 4 తిరుమల | రు. 200/ | 6 నెలలు | ,, |
| | తిరుమల జి. ఎన్. సి. ప్రాంతంలో ప్రత్యేక తరహా కాటేజీల నిర్మాణం | | | | | | |
| 3. | బ్లాక్‌నెం. 1 | రు. 3,355/ | రు. 2,235/ | ,, | రు. 200/ | 6 నెలలు | ,, |
| 4. | బ్లాక్‌నెం. 2 | రు. 3,355/ | రు. 2,235/ | ,, | రు. 200/ | 6 నెలలు | ,, |
| 5. | బ్లాక్‌నెం. 3 | రు. 3,355/ | రు. 2,235/ | ,, | రు. 200/ | ,, | ,, |
| 6. | బ్లాక్‌నెం. 4 | రు. 3,355/ | రు. 2,235/ | ,, | రు. 200/ | ,, | ,, |
| 7. | బ్లాక్‌నెం. 5 | రు. 3,355/ | రు. 2,235/ | ,, | రు. 200/ | ,, | ,, |
| 8. | బ్లాక్‌నెం. 6 | రు. 3,355/ | రు. 2,235/ | ,, | రు. 200/ | ,, | ,, |
| 9. | రేణిగుంటకు బిట్యుమినస్‌తో సెమీగ్రౌట్‌ను నిర్మించుట | రు. 8,700/ | రు. 5,800/ | ఇ.ఇ. 6 తిరుపతి | రు. 200/ | ,, | ,, |
| 10. | తిరుపతి గోవిందరాజనగర్‌లో బి. తరగతి క్వార్టర్ల నిర్మాణం (బ్లాకునెం. 21) | రు. 5,250/ | రు. 3,500/ | ఇ.ఇ. 6 తిరుపతి | రు. 200/ | 9 నెలలు | ,, |
| 11. | తిరుపతి గోవిందరాజనగర్‌లో బి. తరగతి క్వార్టర్ల నిర్మాణం (బ్లాక్‌నెం. 22) | రు. 5,250/ | రు. 3,500/ | ,, | రు. 200/ | ,, | ,, |

**కార్యనిర్వహణాధికారి,**

తిరుమల తిరుపతి దేవస్థానములు.

[ 41వ పేజి తరువాయి ]

## సిద్ధయ్యమఠం

కడప జిల్లా ముడుమాల గ్రామంలో శ్రీసిద్ధయ్యస్వామి మఠం వద్ద లక్ష రూపాయలకు మించని ఖర్చుతో ఒక ఉచిత ధర్మశాలను నిర్మించాలని ఇటీవల టి.టి.డి. నిర్ణయించింది. శ్రీ సిద్ధయ్యస్వామిశ్రీమద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి వారి ప్రియశిష్యులు. కంది మల్లాయపల్లెలో శ్రీ బ్రహ్మంగారి మఠంవద్ద టి.టి.డి. ఇదివరకే ఒక సత్రాన్ని నిర్మించింది. సిద్ధయ్యస్వామివారి మఠంలో గల జీవసమాధులు ఇప్పటికీ ఎందరో యాత్రికుల పూజలందుకొంటూవున్నాయి. బ్రహ్మంగారి కాలజ్ఞాన వచనాలకు సంబంధించిన ఎన్నో తాళపత్ర గ్రంథాలు ఇక్కడ భద్రపరచబడివున్నాయి. ఈ అపూర్వ వేదాంతగ్రంథాల్ని పరిష్కరించి వాటి ప్రచురణ జరిపించడానికి టి.టి.డి. నిశ్చయించింది.



Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press, by M. Vijayakumar Reddy, L.P.T., Manager, T.T.D. Press, Tirupati.



1.


శ్రీ వేంకటేశ్వర మ్యూజియం
ఆలయకళ
తిరుపతి
SRI VENKATESWARA MUSEUM
ON TEMPLE ART
TIRUPATI

2.



3.





పూరయ మమకామం గోపాల
పూరయ మమ కామం
వారం వారం వందన మస్తుతే
వారిజ దళనయన గోపాల

మన్యే త్వా మిహ మాధవదైవం
మాయాస్వీకృత మానుషభావం
ధన్యైరా దృత తత్త్వస్వభావం
ధాతారం జగతామతివిభవం

బృందావన చరబర్హావతంస
బద్ధకుంజవన బహుల విలాస
సాంద్రానంద సముద్గీర్ణహాస
సంగీత కేయూర సముదితదాస

మత్స్యకూర్మాది దశమహితావతార
మదను గ్రహాదవ మదనగోపాల
వాత్సల్య పాలిత వరయోగిబృంద
వరనారాయణ తీర్థ వర్ధిత మోద ।

నారాయణతీర్థుల ‘కృష్ణలీలాతరంగిణి’

# మీ మాట

## తిరుపతిలో టి. టి. డి. క్యాంటిన్

తిరుమల తిరుపతి దేవస్థాన యాజమాన్యం యాత్రికుల సదుపాయాల విషయంలో 'తిరుమల'లో చూపుతున్న శ్రద్ధాసక్తులు 'తిరుపతి'లో చూపించడం లేదని చెప్పటానికి విచారిస్తున్నాను. ముఖ్యంగా భోజనవసతి సౌకర్యాలలో ఈ వివక్షత కొట్టవచ్చినట్లు కనబడుతోంది. తిరుమల యాత్రికులకు తిరుమలలో ఉపాహార భోజనశాలల కొరతలేదు. ప్రయివేట్ క్యాంటీన్ల సంగతి ఎలావున్నా, వేలాది యాత్రికులకు ఒక్కసారిగా భోజన ఏర్పాట్లకు వీలు కలిగించే 'శ్రీవేంకటేశ్వర కేంటీన్ కాంప్లెక్స్' కామధేనువులా వుంటుంది. దేవస్థానంవారు కోటిరూపాయలవరకూ దీనిపై ఖర్చుపెట్టి ప్రపంచంలోకే పేరెన్నికగన్న భోజనశాలగా తీర్చి దిద్దుతున్నారు. ఇదంతా తిరుమల విలాసం.

ఇక తిరుపతి దేవస్థాన ధర్మశాలల భోజనశాలల్లో వినిపించేదంతా విలాపమే!. తిరుపతిలో టి.టి.డి. కొత్త సత్రాలలో వున్న ఏకైక భోజనశాల యాత్రికులకు ఏమూలకూ చాలదు! సత్రాలలో యాత్రికుల సంఖ్య ఏటి కేటికీ పెరుగుతున్నప్పటికీ ఈ భోజనశాలను విస్తరించాలన్న ఆలోచన టి.టి.డి.కి రాకపోవటం వింతగా వుంది. ఈ క్యాంటీన్లో వడ్డించేపదార్థాలు ఒకరకంగావుంటున్నాయి నగదు మాత్రం ఎక్కువే! క్యాంటిన్ సిబ్బంది నిర్లక్ష్యత సరేసరి! అది సర్వత్రా వున్నదే! రెండు రూపాయలకే ప్లేటుభోజనం పెడుతున్నాం గదా అనవచ్చు దేవస్థానం వారు. ఆ ప్లేట్లలో ఏం పెడుతున్నారో, ఎంత కొలతలో పెడుతున్నారో ఎవరన్నా చూస్తే బాగుంటుంది. టి.టి.డి. క్యాంటిన్లో రెండురూపాయల ప్లేటు భోజనం కంటే అక్కడేవున్న ప్రయివేట్ హోటళ్ళలో భోజనం నాలుగింతలు మెరుగ్గా వుంటున్నది. కాకపోతే వీటిలో ఓ అర్ధ రూపాయి రేటెక్కువ! టి.టి.డి. సత్రాలలో క్యాంటిన్‌ని నిర్వహిస్తున్న తీరుతెన్నులు చూస్తుంటే – దీన్నిలా చెడగొడుతున్నారేమా అని బాధ కలుగుతుంది. అలావుంది పరిస్థితి. ఇటీవలి కాలంలో టి.టి.డి. క్యాంటిన్‌కు వెళ్ళేవారి కన్నా బైట హోటళ్ళకు వెళ్ళేవారి సంఖ్యే అధికంగా వుంటున్నది. ఇలా ఎందుకు జరగాలి? తిరుమలలో క్యాంటిన్ల విషయమై అంత శ్రద్ధ చూపే దేవస్థానం తిరుపతిలో వీటిని ఎందుకు చిన్నచూపు చూస్తున్నది?

కృష్ణచైతన్య — తిరుపతి.

[ప్రత్యేకంగా ఒక క్యాంటిన్ పెట్టమనే కదా మీ ఉద్దేశ్యం. ॥సం॥]





**గమనిక :**

సప్తగిరి పత్రికకు సంవత్సరం కంటె తక్కువకాలానికి చందాలు స్వీకరింపబడవు—

వెల్‌ఫేర్ ఆఫీసర్, టి.టి.డి.



# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాస పత్రిక...


గౌరవసంపాదకులు.

**శ్రీ జి. కుమారస్వామిరెడ్డి,**
ఐ. ఏ. ఎస్.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

ప్రచురణకర్త - సంపాదకుడు :

**కాట్రపాటి సుబ్బారావు,**
ఎమ్. ఎ.

ఉపసంపాదకుడు :

**తిరుమూరు సుధాకర్ రెడ్డి,**
ఎమ్. ఎ. బి. ఇడి.

ముద్రాపకుడు :

**ఎమ్. విజయకుమార్ రెడ్డి.**

**విడిప్రతి-రు. 1-00**

**సం॥ చందా-రు. 12-00**

ప్రతులకు :

**వెల్ ఫేర్ ఆఫీసర్,**
టి. టి. డి., తిరుపతి.


## ఈ సంచికలో....


ఆగష్టు 1983

సంపుటి 14 సంచిక 3

# సంపాదకీయం

ఇది శ్రావణం. వచ్చేది భాద్రపదం. ఆపైన ఆశ్వయుజం. ఆ తర్వాత కార్తీకం. ఇలా వరలక్ష్మీవ్రతంతో ప్రారంభమై ధనలక్ష్మీవ్రతంతో పరిసమాప్తమయ్యే కాలంలో ఎక్కువభాగం స్త్రీరూప దేవతారాధనకే ఏర్పాటు చేశారు మన ద్రష్టలు. వరలక్ష్మి, సరస్వతి, దుర్గాదేవి, ధనలక్ష్మి ఇలా వివిధ రూపాలలో చరాచరప్రకృతికి మాతృరూపిణిగా, శక్తిరూపిణిగా మహాశక్తిని ఆరాధిస్తున్నాం తరతరాలుగా! ఈ దృశ్యమాన జగత్తంతా స్త్రీ రూపంగా, పరమేశ్వరుని పరమపురుషుడుగా భావించే మనకు మహామోహకమైన మాయావరణాన్వితమైన ప్రకృతిని స్త్రీ రూపంలో ఆరాధించటం చాలా సహజంగానే వుంది!

వాస్తవానికి మగువ మెచ్చిన ఇల్లు, దివిజులకు నట్టిల్లు, అపీ స్త్రీకి గౌరవమున్న ఇంట సిరులు చిందులు వేస్తాయని మన పూర్వులు ఏనాడో చెప్పారు. మన వివాహ ప్రక్రియలో కూడా వరుని నారాయణస్వరూపునిగా భావించి బ్రహ్మలోక జిగీషతో కన్యాదానం చేస్తూ – 'శ్వశ్రువాం భవసామ్రాజ్ఞీ, శ్వశురేభవ సామ్రాజ్ఞీ, ననందరి భవ సామ్రాజ్ఞీ మూర్ధానం పత్యురారోహ' అని అత్తమామల బావమరదుల మనస్సులో, మన్ననతో మహారాణికిగల గౌరవాన్ని పొందమని శుభాశంసనం చేస్తారు. భార్యాభర్తల సంబంధాన్ని వివరించి ధర్మేచ, అర్థేచ, కామేచ నాతిచరితవ్యా అని హెచ్చరించి నాతిచరామి అని త్రికరణశుద్ధిగా వాగ్దానం చేయించుకొంటారు.

సాహిత్యపరంగా మనకు కనిపించే బ్రహ్మవాదినులైన మైత్రేయి, గార్గిల దగ్గరనుండి ఈనాటి కవయిత్రుల వరకు అన్ని వర్గాల మహిళాభివృద్ధి మన సంప్రదాయాని కమగుణంగా సాగిందనీ మెలివేసుకు మరీ చాటుకుంటాం!

నిజానికిదంతా నిజమనిపించే కమ్మని కలలావుంది. వెనకటి తరాలతో ఈనాటి సమాజస్థితి పోల్చిచూస్తే మనం ఎంత 'ఎదిగామో' తెలుస్తుంది.

పెంచిన తండ్రి అనుమతిలేకుండా దుష్యంతుణ్ణి పెళ్ళాడిన శకుంతలను సమాజం వెలివేయలేదు. పుత్రవ్యామోహంతో రాముణ్ణి పద్నాలుగు సంవత్సరాలు అడవికి పంపటానికి కారకురాలైన కైకనుగాని, దాసి మంధరనుగాని ఆనాటి సమాజం హింసించలేదు. అహల్యను గౌతముడు నిరాదరించాడేగాని నిరాకరించలేదు. పరస్త్రీ లోలుడైన రావణుని రాజ్యంలో ఉన్న సీతాసాధ్విని శ్రీరాముడు అగ్నిశుద్ధితో స్వీకరించాడు. జాబాలి సత్యకాముడు ఎలా అయిందీ అందరికీ తెలుసు. ఒక్క తాటకవధతప్ప రామాయణంలో కూడా స్త్రీ హింస జరిగిందనేందుకు అవకాశం లేదు.

ఇక భారతకాలంలోని సత్యవతి, కుంతి, గాంధారి,. ద్రౌపది లాంటి పాత్రలను తీసుకున్నా వారి వారి ప్రత్యేకస్థానాల్ని సమాజం గుర్తించి గౌరవించిందనే చెప్పాలి! అత్యాచారులు, ఆతతాయిలు అని పేరు తెచ్చుకొన్న ధార్తరాష్ట్రులను ప్రజలు నిరసన బుద్ధితో చూసినా వారి కులకాంతలను నిరసించిన ఘట్టాలు మనకు కనపడవు. నిజానికి రాజకీయ కార్పణ్యంతో ఒక్క ద్రౌపది మీద జరిపిన అవమానంతప్ప కౌరవులు మరి ఏ ఇతర స్త్రీ మీద దౌర్జన్యం జరిపిన దాఖలాలు మచ్చుకైనా కన్పించవు. రామాయణ భారత కాలాలలో స్త్రీలపై జరిగే అత్యాచార ప్రయత్నాన్ని ఆనాటి సభ్యసమాజమంతా నిరసించింది. సమయం వచ్చినపుడు ఏకలక్ష్యంతో ఎదుర్కొని దురాచారులకు గుణపాఠం నేర్పింది. అపఖ్యాతిపాలైన స్త్రీలను సైతం అన్నపానాదులకు లోపం లేకుండా భరించాలని మనుధర్మశాస్త్రమూ శాసించింది.

కాని ఈనాటి మనస్థితి ఏమిటి? పచ్చనిదంతా మెచ్చతగిందనే భ్రమతో పాచిబండలమీద పరుగెడుతున్నాం! పురుషునికి ఇహపరతారకంగా 'షట్కర్మయుక్తా కులధర్మపత్నీ' అనిపించుకున్న అతివను, 'ఈ నా జీవన సూత్రం నీగళమంగళసూత్రం; వర్ధిల్లాలిక వర్షశతం' అని దీవనతోతెచ్చుకున్న దేవతామూర్తిని లోభంతో లోలుపత్వంతో క్షోభపెడ్తున్నాం. కట్నాలు కాముకతలది పైచేయిగా అత్యాచారాలతో ఇంటాబైటా కూడా మానవతులను అవమానంపాలు చేస్తున్నాం, బ్రతుకు బుగ్గిచేస్తున్నాం. ఆనాటి అత్యాచారులు ఈ లోకాన్ని తొంగిచూడటం జరిగితే తమకింత నికృష్టత లేదనే తృప్తి నిజంగా కలిగితీరుతుంది.

[48 వ పేజీలో]

# చాణక్యుని నీతిదర్పణం

— శ్రీ ఎం. లక్ష్మణాచార్యులు

మహాపురుషులు కాలానికిగాని, పరిస్థితులకుగాని బానిసలుకారు. వాళ్ళు గొప్పశక్తి మంతులవడంవల్ల తామున్న పరిస్థితుల్నీ, కాలాన్నీ తమ వశంచేసుకొని, వాటిని తమకు అనుకూలంగా మార్చుకుంటారు. అలాంటి వారిలో ఆర్యచాణక్యుడు ఎన్నదగినవాడు. కౌటిల్యుని పేర అర్థశాస్త్రం వ్రాసిన ఈ బుద్ధిశాలి భారతచరిత్రలో తనకంటూ ఓ ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకున్నాడు. చంద్రగుప్తునికి గురువుగా, మార్గదర్శిగా, మంత్రిగా, రక్షకుడిగా ఉండి, అతనిద్వారా మాతృభూమిని శత్రువుల బారినుండి రక్షించి, అన్ని విధాలా ప్రశంసలనందుకున్న గౌరవనీయుడు మన చాణక్యుడు.

చాణక్యుడు వ్రాసిన గ్రంథాల్లో నీతిదర్పణం చాలా పేరుపొందింది. ఇందులో పదిహేడు అధ్యాయాలున్నాయి. సమాజంలోని అన్ని వర్గాలవారికి, అన్ని వయసులవారికి, అన్ని రకాలవారికి ఉపయోగపడే ఈ పుస్తకం పండిత పామర రంజకమై నాటికీ, నేటికీ కీర్తిప్రతిష్ఠలతో వెలుగుతోంది.

మనిషికి సత్ప్రవర్తన చాలా ముఖ్యం. తన నడవడికను సరిదిద్దుకున్నవాడు తను బాగుపడడమే కాదు, నలుగురూ బాగుపడడానికి ఒక దారి చూపిస్తాడు. సమాజం అతని సలహాలను, ఆజ్ఞలను మనసారా మన్నిస్తుంది.

ఏది, ఎప్పుడు, ఎక్కడ, ఎలా, ఎందుకు చేయాలో తెలుసుకోడం ప్రతిమనిషి ధర్మం. అప్పుడే మనిషి జంతువుకంటే వేరనిపించుకుంటాడు.

ఇలాంటివి తెల్సుకోవాలంటే సజ్జనులతో స్నేహం, మంచి పుస్తకాల పఠనం చాలా అవసరం. ఈ నీతిదర్పణం మనకు ఓ చక్కని దారి చూపిస్తుంది.

ఇప్పుడు మనం ఈ నీతిదర్పణంలోని కొన్ని శ్లోకాల్ని వాటి భావాల్ని గమనిద్దాము.

ప్రతిరోజూ ఒక్క శ్లోకంగానీ, అర్ధ శ్లోకంగాని, ఒక్క చరణంగాని, అందులో సగం లేదా ఒక్క అక్షరం లేదా సగం అక్షరం అన్నా చదువుతూ ఉండాలి. ఎందుకంటే అభ్యాసం కూసువిద్యగదా- తినగ తినగ వేము తియ్యనుండు అనేదాన్ని గుర్తు చేసుకుంటూ రోజూ క్రమం తప్పకుండా చదవడం, దానం చేయడం చేస్తూవుండాలి.

శ్లోకేన వా తదర్ధేన
తదర్థేన తదార్థార్థా క్షరేణ వా
అవంధ్యం దివసం కుర్యా
ద్దానాధ్యయన కర్మభిః

ప్రళయే భిన్న మర్యాదా
భవన్తి కిల సాగరాః
సాగరా భేదమిచ్ఛన్తి
ప్రలయేపి నసాధవః

చెలియలి కట్ట ఎప్పుడూ దాటని సముద్రం గూడా ప్రళయకాలంలో చెలియలికట్ట దాటుతుంది. కాని గొప్పవాళ్ళు గొప్ప కష్టకాలం వచ్చినా సరే, తమ హద్దుల్ని దాటరు. తమ స్థాయిని, పరువు-ప్రతిష్ఠల్ని దిగజార్చుకోరు.

యో ధ్రువాణి పరిత్యజ్య,
అధ్రువం పరిషేవతే
ధ్రువాణి తస్య నశ్యన్తి
అధ్రువం నష్టమేవహి-

ఎవరు తనకు నిర్దేశింపబడిన పనుల్ని, లేక వస్తువుల్ని వదలి అనవసరమైన వాటి గురించి, అసందర్భమైన వాటికోసం, ప్రయత్నాలు చేస్తూవుంటాడో వాడు ఆ అనవసరమైన వాటితోపాటు తనకు నిర్దేశించిన పనుల్లోకూడా అపజయం పొందుతాడు. (నష్టపోతాడు)

త్యజేదేకం కులస్యార్థే
గ్రామస్యార్థే కులం త్యజేత్
గ్రామం జనపదస్యార్థే
ఆత్మార్థే పృథివీ త్యజేత్॥

కులం కోసం అవసరమైతే ఎవరినన్నా ఒకర్ని విడిచిపెట్టాల్సి వస్తే వెనుకాడరాదు. గ్రామం మేలుకోసం కులాన్ని, దేశం మేలుకోసం గ్రామాన్ని, ఇంకా తన ఆత్మగౌరవం కోసం మొత్తం భూమినే వదలాలి.

అతిరూపేణ వై సీతా
అతిగర్వేణ రావణః
అతిదానాద్బలిర్బద్ధో
హ్యతి సర్వత్ర వర్జయేత్।

అత్యంత సౌందర్యంవల్లనే సీతాపహరణం జరిగింది. అతిగర్వం వల్లనే రావణుడు చంపబడ్డాడు. అతిగా దానం చేయడం వల్లనే బలి మాటకు బద్ధుడయ్యాడు. అందువల్ల ఏదన్నాసరే 'అతి' పనికిరాదు.

ఏకాకినా తపో ద్వాభ్యాం
పఠనం గాయనం త్రిభిః
చతుర్భిర్గమనం క్షేత్రం
పంచభిర్బహుభీ రణమ్।

తపస్సు ఒంటరిగా, చదవడం ఇద్దరితో, గానం ముగ్గురితో, యాత్ర నలుగురితో, వ్యవసాయం ఐదుగురితో, యుద్ధం అనేక మంది సహాయంతో చేయడం ఉత్తమం.

యథా చతుర్భిః కనకం పరీక్ష్యతే
నిఘర్షణ-చ్ఛేదన-తాప-తాడనైః
తథా చతుర్భిః పురుషః పరీక్ష్యతే
త్యాగేన శీలేన గుణేన కర్మణా॥

గీటురాయిమీద గీయడం, విరగ కొట్టడం, కాల్చడం-కొయ్యడం-ఈ నాలుగు

క్రియలద్వారా బంగారం ఎలా గుర్తింప బడుతోందో, అలాగే త్యాగం, సత్ప్రవర్తన, గుణము, చేసేపనులు- ఈ నాలుగు పనుల ద్వారా మనిషి గుర్తింపబడుతాడు.

తావద్భయేన భేతవ్యం
యావద్భయమనాగతమ్
ఆగతం తు భయం దృష్ట్వా
ప్రహర్తవ్యమశంకయా ॥

భయం సమీపించనంతవరకు భయముంటే భయపడాలి కాని భయం సమీపించిన తర్వాత దాన్ని చూసి నిర్భయంగా, నిస్సందేహంగా దెబ్బతీయాలి.

నాస్తి కామసమో వ్యాధి
ర్నాస్తి మోహసమో రిపుః
నాస్తి కోపసమో వహ్ని
ర్నాస్తి జ్ఞానాత్పరం సుఖమ్ ।

కామంతో సమానమైన రోగం, మోహానికి సమానమైన శత్రువు, కోపంతో సమానమైన నిప్పు, మరియు జ్ఞానాన్ని మించిన సుఖం లేదు.

జన్మ మృత్యుం హి యాత్యేకో
భునక్త్యేక శ్శుభాశుభమ్
నరకే స పతత్యేక
ఏకో యాతి పరాం గతిమ్ ।

మనిషి జన్మించేటప్పుడూ, మరణించేటప్పుడూ ఒంటరిగానే ఉంటాడు. తను చేసిన మంచి చెడ్డపనుల ఫలితాలను అనుభవిస్తాడు. నరకానికి కూడా ఒంటిగానే పోతాడు. స్వర్గానికి ఒక్కడుగానే వెడతాడు.

సత్యేన ధార్యతే పృథ్వీ
సత్యేన తపతే రవిః
సత్యేన వాతి వాయుశ్చ
సర్వే సత్యే ప్రతిష్ఠితమ్ ।

సత్యంవల్లనే భూమి స్థిరముగా ఉన్నది. సూర్యుడు సత్యంవల్లనే ప్రకాశిస్తున్నాడు. గాలికూడా సత్యంవల్లనే వీస్తున్నది. (ఇంతెందుకు) ప్రపంచంలో ఉన్న అన్ని పదార్థములూ సత్యంలోనే ఉన్నాయి.

చలా లక్ష్మీశ్చలాః ప్రాణ
శ్చలే జీవిత మందిరే
చలాచలే చ, సంసారే,
ధర్మ ఏకోహి నిశ్చలః ॥

ధనం, ప్రాణం, జీవితం, ఇల్లు మొ॥ అన్నీ అశాశ్వతాలు. సాగిపోతున్న ఈ ప్రపంచంలో కేవలం ఒక్క ధర్మమే నిశ్చలమైనది. (దానియందు మనం శ్రద్ధ, ఆసక్తి చూపించాలి.)

లుబ్ధ మర్థేన గృహ్ణీయా
స్తబ్ధమంజలి కర్మణా,
మూర్ఖ ఛందాను రోధేన
యాథార్థ్యేన చ పండితమ్ ॥

లోభిని ధనంతో, గర్విని నమస్కారంతో మూర్ఖుణ్ణి అతడననుసరించే పద్ధతితో- ఇంకా పండితుణ్ణి సత్యంతో వశపర్చుకోవాలి.

సింహాదేకం బకాదేకం
శిక్షేచ్చత్వారి కుక్కుటాత్,
వాయసాత్ పంచ శిక్షేచ్చ,
షట్శున స్త్రీణి గర్దభాత్ ॥

సింహంనుండి ఒక్కగుణం, కొంగనుండి ఒక్కగుణం, కోళ్ళనుండి నాలుగు గుణాలు, కాకినుండి ఐదుగుణాలు, కుక్కనుండి ఆరు గుణాలు, ఇంకా గాడిదనుండి మూడు గుణాలు నేర్చుకోవాలి-

ప్రభూతం కామమల్పం వా
యన్నరః కర్తు మిచ్ఛతి
సర్వారంభేణ తత్కార్యం
సింహాదేకం ప్రచక్షతే ।

తన మనసుకు తగిన నచ్చిన పని-చాలా పెద్దదైనా చిన్నదైనా సరే, దాన్ని సర్వ విధాలా ప్రయత్నించి-ఆ పని నెరవేర్చుకోవాలి. ఈ ఒక్క గుణం సింహం నుండి నేర్చుకోవాలి.

ఇంద్రియాణితు సంయమ్య
బకవత్ పండితో నరః
దేశకాలబలం జ్ఞాత్వా
సర్వకార్యాణి సాధయేత్.

కొంగ ఏ విధంగా తను వేటాడే ప్రాణిపై జాగ్రత్తగా తన ప్రతి అవయవాన్ని ముడుచుకొని వేటాడుతుందో అలాగే తన ఇంద్రియాలను అదుపులో పెట్టుకొని దేశము కాలము, బలము- ఈ మూడింటిని అర్థం చేసుకొని (గ్రహించి) పనులన్నిటిని, విద్వాంసుడు చెయ్యాలి. ఇలాంటి గుణం కొంగనుండి నేర్చుకోవాలి.

ప్రత్యుత్థానంచ యుద్ధంచ
సంవిభాగంచ బంధుషు
స్వయమాక్రమ్య భోగం చ
శిక్షేచ్చత్వారి కుక్కుటాత్,

బ్రహ్మ ముహూర్తంలో లేవడం, యుద్ధంలో వెనుకాడక పోవడం, బంధువుల్లో ఏ వస్తువునైనా సమానంగా పంచడం, తను తినబోయే దానిని స్వయంగా కైవసం చేసుకోవడం- ఈ నాలుగింటిని కోడిపుంజు నుండి మనం నేర్చుకోవాలి.

గూఢమైథున చారిత్వం
కాలే కాలే చ సంగ్రహమ్
అప్రమత్త మవిశ్వాసం
పంచ శిక్షేచ్చ వాయసాత్ ।

స్త్రీ-సంభోగం రహస్యప్రదేశంలో చేయడం, రహస్యంగా ముందుకు సాగిపోతూ ఉండడం, అప్పుడప్పుడు తమ కిష్టమైన వస్తువుల్ని ప్రోగుచేసుకోడం, అన్ని పనుల్లో జాగ్రత్తగా ఉండడం, ఎవర్నీ నమ్మకపోవడం- ఈ ఐదుగుణాల్ని కాకి నుండి నేర్చుకోవాలి-

బహ్వాశీ స్వల్పసంతుష్టః
సునిద్రో లఘుచేతనః
స్వామి భక్తిశ్చ శూరశ్చ
షడేతే శ్వానతో గుణః ।

( 46వ పేజీలో)

# శ్రీమద్భగవద్గీత (సీరియల్)

వ్యాఖ్యాత: శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి

[గతసంచిక తరువాయి]

ఇంద్రియాణి మనో బుద్ధిః అస్యాధిష్ఠాన ముచ్యతే ।
ఏతై ర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్ ॥

ఈ కామానికి ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి ఆశ్రయాలని చెబుతారు. ఇది వీటిద్వారా జ్ఞానాన్ని ఆవరించి దేహధారులకు మోహం కలుగజేస్తున్నది.

తస్మా త్త్వ మింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ ।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞాన విజ్ఞాన నాశనమ్ ।

అర్జునా! అందువల్ల మొట్టమొదట ఇంద్రియాలను నీ చెప్పుచేతల్లో వుంచుకొని, జ్ఞానవిజ్ఞానాలను నాశనం చేసే కామమనే పాపిని పారద్రోలు.

ఇంద్రియాణి పరాణ్యాహుః ఇంద్రియేభ్యః పరం మనః ।
మనసస్తు పరా బుద్ధిః యో బుద్ధేః పరతస్తు సః ॥

దేహంకంటే ఇంద్రియాలు గొప్పవి. మనస్సు ఇంద్రియాల కంటె శ్రేష్ఠం. బుద్ధి మనస్సు కంటే అధికం. అయితే బుద్ధిని అధిగమించింది ఆత్మ.

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సం స్తభ్యాత్మన మాత్మనా ।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ ॥

అర్జునా! ఇలా బుద్ధి కంటే ఆత్మ గొప్పదని గుర్తించి బుద్ధితోనే మనస్సు నిలకడ చేసుకొని, కామరూపంలో వున్న జయింపరాని శత్రువును రూపుమాపు.

ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం, శ్రీకృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని "కర్మయోగం" అనే మూడవ అధ్యాయం సమాప్తం.

## నాల్గవ అధ్యాయం

### జ్ఞానయోగం

శ్రీభగవానువాచ:

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహ మవ్యయమ్ ।
వివస్వాన్ మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥ 1

శ్రీ భగవానుడు: వినాశంలేని ఈ యోగం నేను పూర్వం సూర్యుడికి ఉపదేశించాను. సూర్యుడు మనువుకూ, మనువు ఇక్ష్వాకుడికి బోధించారు.

ఏవం పరమ్పరాప్రాప్తం ఇమం రాజర్షయో విదుః ।
స కాలేనేహ మహతా యోగో నష్టః పరన్తప ॥ 2

అర్జునా! ఇలా సంప్రదాయ పరంపరగా వచ్చిన కర్మయోగాన్ని రాజర్షులు తెలుసుకున్నారు. అయితే అది ఈ లోకంలో క్రమేపీ కాలగర్భంలో కలిసిపోయింది.

స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః ।
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్ ॥ 3

నాకు భక్తుడవూ, స్నేహితుడవూ కావడంవల్ల పురాతనమైన ఈ యోగాన్ని నీ కిప్పుడు మళ్ళీ వివరించాను. ఇది ఉత్తమం, రహస్యమూ అయిన జ్ఞానం సుమా!

అర్జున ఉవాచ:

అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః ।
కథమేత ద్విజానీయాం, త్వమాదౌ ప్రోక్తవానితి ॥ 4

అర్జునుడు: సూర్యుడి జన్మచూస్తే ఏనాటిదో. మరి నీవు ఇప్పటివాడవు. అలాంటప్పుడు నీవు సూర్యుడికి ఎలా ఉపదేశించావో ఊహించలేకపోతున్నాను.

శ్రీభగవానువాచ:

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।
తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరన్తప ॥ 5

శ్రీభగవానుడు: అర్జునా! నాకూ నీకూ ఎన్నో జన్మలు గడిచాయి. వాటన్నిటినీ నేను ఎరుగుదును. నీవు మాత్రం ఎరుగవు.

అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సమ్భవామ్యాత్మమాయయా ॥

జననమరణాలు లేని నేను సర్వప్రాణులకూ ప్రభువునైనప్పటికీ నా పరమేశ్వర స్వభావం విడిచిపెట్టకుండానే నేను మాయాశక్తివల్ల జనిస్తున్నాను.

యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత ।
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్ ॥

ఈ లోకంలో ధర్మం అధోగతిపాలై అధర్మం ప్రబలినప్పుడల్లా నేను ఉద్భవిస్తుంటాను.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మ సంస్థాపనార్థాయ సమ్భవామి యుగే యుగే ॥ 8

సజ్జన సంరక్షణకూ, దుర్జన సంహారానికీ, ధర్మసంస్థాపనకూ నేను అన్ని యుగాలలోనూ అవతరిస్తుంటాను.

జన్మ కర్మ చ మే దివ్యం ఏవం యో వేత్తి తత్త్వతః ।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సోఽర్జున ॥ 9

: అర్జునా ! అలౌకికమైన నా అవతార రహస్యం యథార్థంగా ఎరిగినవాడు ఈ శరీరం విడిచిపెట్టాక మళ్లీ జన్మించడు. నన్నే చేరుతాడు.

వీతరాగ భయ క్రోధాః మన్మయా మాముపాశ్రితాః ।
బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః ॥ 10

అనురాగం, భయం, కోపం విడిచిపెట్టి, నన్నే ఆశ్రయించి నామీదే మనస్సు లగ్నం చేసినవాళ్లు ఎంతోమంది తత్త్వజ్ఞానమనే తపస్సువల్ల పవిత్రులై నన్ను పొందారు.

యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ ! సర్వశః ॥ 11

అర్జునా ! ఎవరు ఎలాగ నన్ను ఆరాధిస్తారో వాళ్లని అలాగే నేను అనుగ్రహిస్తాను. అందువల్ల నా మార్గమే మానవులు అన్ని విధాల అనుసరిస్తారు.

కాంక్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః ।
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా ॥ 11

ఈ లోకంలో కర్మలకు ఫలం శీఘ్రంగా సిద్ధిస్తుంది. కనుకనే కర్మఫలం ఆశించి మానవులు దేవతలను ఆరాధిస్తారు.

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణ కర్మ విభాగశః ।
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్ ॥ 13

వారి వారి గుణాలకు, కర్మలకు తగ్గట్లుగా నాలుగు వర్ణాలు నేనే సృష్టించాను. అయినప్పటికీ వాటికి కర్తనైన నన్ను కర్తను కాదనీ, శాశ్వతుడననీ తెలుసుకో,

న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా ।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే ॥ 14

నన్ను కర్మలంటవనీ, నాకు కర్మఫలాపేక్ష లేదనీ గ్రహించినవాడిని కర్మలు బంధించవు.

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వై రపి ముముక్షుభిః ।
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్॥

మోక్షంపట్ల ఆసక్తి కలిగిన పూర్వులుకూడా ఈ విషయం గుర్తించే కర్మలు చేశారు. కనుక పురాతనకాలంనుంచీ వస్తున్న కర్మవిధానం నీవూ అనుసరించు.

కిం కర్మ కిమ కర్మేతి కవయోఽప్యత్ర మోహితాః ।
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥ 16

పండితులుకూడా కర్మ ఏదో, కర్మకానిది ఏదో తెలియక తికమకలవుతున్నారు. సంసారబంధాలనుంచి విముక్తి పొందడానికి అవసరమైన కర్మస్వరూపం వివరిస్తాను విను.

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యంచ వికర్మణః ।
అకర్మణ శ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః ॥ 17

కర్మ అంటే ఏమిటో, శాస్త్రాలు నిషేధించిన వికర్మ అంటే ఏమిటో, ఏపనీ చేయకపోవడమనే అకర్మ అంటే ఏమిటో తెలుసుకోవడం అవసరం. కర్మతత్త్వాన్ని గ్రహించడం కష్టసాధ్యం.

కర్మణ్యకర్మ యః పశ్యేత్ అకర్మణి చ కర్మ యః ।
స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥

కర్మలో అకర్మ, అకర్మలో కర్మ చూసేవాడు మానవులలో బుద్ధిమంతుడు; యోగి; సమస్త కర్మలూ ఆచరించేవాడు.

యస్య సర్వే సమారమ్భాః కామ సఙ్కల్ప వర్జితాః ।
జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం తమాహుః పండితం బుధాః ॥ 19

ఫలాసక్తి లేకుండా అన్ని కర్మలూ ఆచరించడంతోపాటు జ్ఞానమనే అగ్నితో పూర్వపు వాసనల్ని నాశనం చేసుకున్నవాడిని పండితుడని పెద్దలు చెబుతారు.

త్యక్త్వా కర్మఫలాసఙ్గం నిత్య తృప్తో నిరాశ్రయః ।
కర్మ ణ్యభిప్రవృత్తోఽపి నైవ కిఞ్చి త్కరోతి సః ॥ 20

కర్మఫలాపేక్ష విడిచిపెట్టి నిత్యమూ సంతృప్తితో దేనిమీదా ఆధారపడకుండా, కర్మలు చేసేవాడు, ఏమీ చేయనివాడే అవుతాడు.

నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః ।
శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్ ॥ 21

వాంఛలు వదలిపెట్టి చిత్తమూ, మనస్సూ వశపరచుకుని, ఈ వస్తువు నాది అనేది లేకుండా కేవలం శరీరపోషణకోసం కర్మలు ఆచరించేవాడు పాపం పొందడు.

యదృచ్ఛా లాభ సన్తుష్టో ద్వన్ద్వాతీతో విమత్సరః ।
సమ స్సిద్ధా వసిద్ధౌ చ కృత్వాఽపి న నిబధ్యతే ॥ 22

అప్రయత్నంగా లభించిన వస్తువులతో సంతృప్తి చెందుతూ, ఇతరుల మీద ఈర్ష్యపడకుండా, సుఖదుఃఖాలకు లొంగకుండా జయాపజయాలపట్ల సమదృష్టి కలిగినవాడు కర్మలు చేసినా బంధాలలో చిక్కుకోడు.

(సశేషం)

భగవంతుని ప్రేమతో సాక్షాత్కరించుకో వచ్చును అనడమే భక్తియోగం. అన్ని యోగాల కంటే ఇది సులభమైనది. అందు బాటులో ఉన్నది కూడ. ఈ యోగానికి శరీరం, మనస్సుల వ్యాయామం అవసరం లేదు. స్వభావానికి విరుద్ధమైన ఏ పనిని కూడా ఇది విధించదు. దేవునిమీద నిష్కళంకమైన ప్రేమ ఉంటే చాలు. 'మాయాధీశుడగు పరమేశ్వరుని మాయాంతర్గతుడగు జీవుడు ఆశ్రయింపవలసి యున్నాడు. తరించుటకు వేరుమార్గము లేదు. అట్లు ఆశ్రయించుటనే భక్తి అందురని గీతామకరందములో చెప్పబడింది.

' ప్రేమ అన్ని భావాలకంటే వేగంగా మనస్సును ఆకర్షిస్తుందంటారు. ఇటువంటి భావనాయుక్తమైన ప్రేమరసాన్ని ఎట్లు ఉపయోగించుకోవచ్చునో తెలియజేసేది భక్తి. ప్రేమ-భక్తి అవినాభావ సంబంధం కలవి. ముక్తి సాధనం భక్తి. భక్తికి ఆకరం ప్రేమ.

'యే తు సర్వాణి కర్మాణి
మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన
మాం ధ్యాయన్త ఉపాసతే.'
'తేషామహం సముద్ధర్తా
మృత్యుసంసారసాగరాత్
భవామి న చిరాత్పార్థ
మయ్యావేశితచేతసామ్'

(భగవద్గీత - పన్నెండవ అధ్యాయము, 6,7 శ్లోకాలు)

అని శ్రీకృష్ణపరమాత్ముడు పార్థునకు బోధించాడు. అంటే ఎవరు సమస్తకర్మలను నాయందు సమర్పించి, నన్నే పరమగతిగా తలచినవారై, అనన్యచిత్తంతో నన్నే ధ్యానిస్తూ ఉపాసిస్తున్నారో, అటువంటి చిత్తవృత్తి కలిగినవారిని అతిశీఘ్రంగా మృత్యురూపమైన సంసార సాగరాన్ని దాటించే వాడినిగా ఉన్నానని అర్థం. ఈ మాటలను బట్టి మునుగుతున్నవానికి నావ ఏలాంటిదో సంసార ముఖ బాధితుడికి కూడా భగవంతుడు మనకండదాడని, ఎంత గొప్ప పదవులపైనప్పటికీ కూడా ఒక చిన్న నావ వేలవాటిపడుతున్నట్లుగా భక్తి అనే తెప్పచే సంసారసాగరాన్ని దాటవచ్చునని గ్రహించ వచ్చు.

'భక్తిరవిచ్ఛిన్న స్వష్ట మాన్యా
భక్తిః పరమా మతా।
దయాధర్మపరో నిత్యం
విష్ణుధర్మేషు తత్పరః.'
(శ్రీపద్మపురాణం, ఉత్తర ఖండం)

ఎవరు తాను చేస్తున్న పనిలో మనస్సును లగ్నం చేసుకొంటాడో అదే భక్తి అనిపించుకొంటున్నది. అతడు దయాధర్మాలను తెలిసికొన్నవాడై విష్ణుధర్మంలో ఆసక్తి కలవాడుగా ఉండాలి.

నవవిధాలైన భక్తిమార్గాలిట్లున్నాయి.

# భక్తి - పూజ

**— శ్రీ జి. ఎన్. మోహన్**

'శ్రవణం కీర్తనం విష్ణోః
స్మరణం పాదసేవనమ్,
అర్చనం వందనం దాస్యం
సఖ్యమాత్మనివేదనమ్.'

— శ్రవణం, కీర్తనం, స్మరణం, పాద సేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం అనేవి నవవిధ భక్తులు. ఇట్టి నవవిధాలైన భక్తిమార్గాలలో భగవంతుని ఆరాధించేవారికి కరుణాసముద్రుడైన స్వామి తానుగా సర్వసుఖాలనిచ్చి అనుగ్రహిస్తాడు.

అర్చన అంటే పూజ. ఇది అష్టవిధాలు. ఇవి ముగ్గు, సుగంధం, అక్షతలు, పుష్పం, ధూపం, దీపం, ఉపహారం, తాంబూలం అనేవి. అందుచేత పూజాపద్ధతుల్లో దీని అవసరం అధికంగా ఉంటుంది.

దేవుడి మహిమను తెలుసుకొని ప్రగాఢమైన విశ్వాసాన్ని ఉంచడమే భక్తి.

'క్షత్రియో వాథవైశ్యో వా
శూద్రో వా సుర సత్తమే,
భక్తిం మద్విష్ణో శేషేణ
ముక్తిం యాతి న సంశయః.'
(శ్రీ పద్మపురాణం, ఉత్తర ఖండం)

— క్షత్రియుడైనా, వైశ్యుడైనా, శూద్రుడే అయినా ఎవ్వరైనప్పటికీ విష్ణువు మీద భక్తి ఉంచేవారు ముక్తిని పొందుతారు.

భగవంతుని మన రెండుకళ్ళచేత ప్రత్యక్షం చేసుకోవడం సాధ్యం కాని పని. మన శరీరం లాగా దేవుడికి రక్తమాంసమయమైన ప్రాకృత శరీరం లేదు. అతడు జ్ఞానానందమయుడని వేదాలు ఘోషిస్తున్నాయి. అతడు నిరాకారుడు; 'సర్వవ్యాపి' అని మన విశ్వాసము. అయినప్పటికీ అతడు మనలాగానే మనుష్యాకృతిలో ఉన్నాడని భావించి దేవపూజకోసం దేవాలయాల్లోకానీ, ఇళ్ళలోకానీ కళ్ళు, చేతులు, పాదాలు ఇత్యాది సామాన్య అవయవాలు ఉన్న విగ్రహాలను స్థాపించికానీ, చిత్రాలనుఉంచి కాని కానీ పూజ చేస్తున్నాము. భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్ముడు చెప్పినట్టుగా

'పత్రం, పుష్పం, ఫలం, తోయం
యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృత
మశ్నామి ప్రయతాత్మనః.'

[37వ పేజీలో]

గాండీవీ! నీ యిచ్చమేరకు, శ్వేతాశ్వములఁ బూన్చిన నీ రథము, సుభటసేనా మధ్యమునకుఁ దోలుకొని వచ్చితిని. ఈ కురుక్షేత్రమున, నిరుపక్ష సైన్యములెల్ల యుద్ధ వ్యూహములఁ దీర్చి యున్నవో చూడుము! ఘంటా హుంకృతులతో, గజ ఘీంకృతులతో, భేరి భాంకృతులతో నిరుసైన్యములు నూతనోత్సాహమున నెట్లు కేరింతలాడుచున్నవో పరికించితివా? రణ ముహూర్తము దాయుచున్నది. భీషణ దుందుభులు పర్జన్య గర్జనము గావింప నున్నవి. సమర మెవ్వరితోఁ జేయనెంచితివో త్వరితముగ నిర్ణయించుకొనుము.

శౌర్య సంపన్నుఁడు మీ ప్రాథమిక ధనుర్విద్యాగురుఁడు కృపాచార్యుఁడు. సింహ లాంగూల కేతనధారి, మీ గురుపుత్త్రుఁ డశ్వత్థామ. అశ్వత్థామకించుకదెసకనున్నవాఁడు సింధుదేశాధిపతియు, మీ యింటి యల్లుఁడునగు జయద్రథుఁడు. భద్రగజముపై వెల్లగొడుగు నీడను, రత్నఖచితసువర్ణసర్ప కేతనుఁడై ప్రకాశించువాఁడు మీ పెదతండ్రి పెద్ద కుమారుఁడు సుయోధనుఁడు. వారే దుశ్శాసనాది సోదర బృందము. అతఁడే మీయున్న కుమారుఁడు లక్ష్మణకుమారుఁడు. అతఁడే శకునిమామ. వారు మద్రదేశాధీశ్వరులు, మీకు మేనమామయునగు శల్యుఁడు.



[చూపుచున్నట్లు] వారతిరథులు, వారే యర్ధరథులు, వారు సమరథులు, అల్లవారే మహారథులు. బ్రహ్మచర్యోజ్జ్వల దీప్తి కనులఁ బ్రస్ఫోటింప, రూపొందిన వీరరసావతారమై, చేతఁ జెను విల్లును, దాళధ్వజమును ధరించి, తన తెల్లని గడ్డమటునిటు కదలాడఁ గదలివచ్చిన హిమవన్నగము వలెఁ గౌరవ సేనా ముఖమున సేనాపతియై ప్రకాశించువాఁడు, కురువృద్ధుఁడగు మీతాత భీష్ముఁడు. మీ తాతప్రక్కన, ధీర గంభీర మూర్తియైఁ కాంచనమయ వేదికా పతాకతో వెలుగొందువాఁడు మీ కురుకులాచార్యులగు ద్రోణుఁడు. అతని పార్శ్వమున నవరశంకరుని ఖ్యాతి, వృషభ ధ్వజుఁడై దీపించు అతని యెడమ పార్శ్వమున నున్నవారు భగదత్తుఁడు, బృహద్బలుఁడును. కుడి ప్రక్కననున్నవాఁడు నీ మిత్రుఁడు కృతవర్మ. మీపినతండ్రి భూరిశ్రవుఁడాప్రక్కన. నీకు సుహృదులగు బాహ్లిక సుదక్షిణాదులీ దిక్కున. సుయోధనునికి వెనుక నిలిచిన వారే సుశర్మాది సంశప్తకులు. బాగుగా పరికించితివి గదా కూడియున్న మీ కురు వంశజులందరిని?

[ఆశ్చర్యమున బరికించుచు] కవ్వడీ! నీ గాత్రము ఘర్మకణ సంప్లుత మగుచున్నదేమి? ఎందులకీ తత్తరపాటు? కాయము కంపించుచున్నది. కన్నులు బాష్పములతో నిండియున్నవి. సంగ్రామమే సింగారమగు రాచపుట్టువునకీ విన్నదనముండ రాదు. అర్జునా! నీ హృదయ దౌర్బల్యమునకుఁ గారణమేమి? అశ్వత్థామను జూచియా? ద్రోణాచార్యుని వీక్షించియా? ధార్తరాష్ట్రశతమును గాంచియా? పితామహ భీష్ముని జూచి భీతిఁ జెందియా? నిన్ను, గంటిని రెప్పవలెఁ గాపాడుటకు నీ వెంట నే నున్నాను. హృదయమును బదిలపరచుకొనుము. ధైర్యమును జెదరనీకుము. కౌంతేయా! గాండీవమును జేఁ జార్చి, స్యందనముపైఁ జదికిలఁబడితివేమి? నీ ప్రవర్తనముఁ గాంచిన నెల్లరుఁ బరిహసింతురు. చిత్తమును జిక్కఁబట్టుము. లెమ్ము! గాండీవము నందుకొనుము. దేశ కల్యాణమునకై రక్తమును ధారఁబోయుటయే వీరవతంసుని విధ్యుక్త ధర్మము.

# గీతాచార్య

## (ఏకపాత్రాభినయం)

— శ్రీ బి. ఎల్. ఎన్. ఆచార్య

ఖండ ఖండములుగా వ్రక్కలైన యార్యావర్తమును సంఘటితము చేయుటకు, వర్గ వర్గములుగఁ జీలిపోయిన యార్య సంతతిని సమైక్యపరచుటకుఁ, బ్రజాహితైషి యగుఁ యజాతశత్రువును స్వరాజ్యమునఁ బ్రతిష్ఠించుటకు, చతుస్సముద్ర ముద్రిత ధరిత్రీ వలయమును నేకచ్ఛత్రముక్రిందికిఁ గొనివచ్చి, ప్రపంచమున శాంతి నెలకొలుపుటకు, దుష్టుఁడగు దుర్యోధనుని సార్వభౌమత్వమును విదీర్ణ మొనర్చుటకు, బద్ధకంకణుడవై విజృంభింపుము.

ఏమనుచున్నావు? రక్తపుకూడుఁగుడువఁ జాలవా? బంధునాశ మొనర్ప లేవా? ఆహా! అనార్యులకు సంసేవ్యము, నమలమగు స్వర్గమునకు దూరము, నపకీర్తికరము నపవిత్రమునగు పాడుమమత నీకీ విషమ సమయమున నేర్పడినదా, పరిపంథి

వెన్నుకొనుట మాని బంధుగులను వెదకుచున్నావా? పరంతపా! ఇది యూహప రంగము కాని వివాహరంగము కాదు. యుద్ధరంగమున బంధు సంస్మరణము వీరునికిం దీరని కళంకము.

ఫల్గునా! లక్కయింట మిమ్ముం గాపుర ముంచి, నడురేయిని మిమ్మెల్లరం జంపు టకై చిచ్చుం బెట్టించిన దుష్కర్ములు, మీకు విషాన్నమును బెట్టించిన దుర్న యులు, మాయాద్యూతమున మీ సామ్రా జ్యమును హరించి, మిమ్ము డవులపాలు సేసిన దుశ్చరిత్రులు, మీ భార్యను సిగం బట్టి రచ్చకీడ్చుకొచ్చి యుగదీతపౌర వరి జనసమక్షమున వస్త్రాపహరణముం గావిం చిన దురాత్ములు, ఐదూళ్లిచ్చినను జాలునని వేడికొనినను, నిరాకరించి, యుద్ధమునకై జబ్బం జరిచిన దుర్మదాంధులు, ఇపుడు మిమ్ముంతమొందించు తలంపున శస్త్రాస్త్ర పాణులై యుద్ధరంగమున నిలిచిన దుర్వి దగ్ధులునగు కౌరవు లీ యుద్ధరంగమున నాతతాయులుగా కాక సోదరులుగ దోచుచున్నారా? భీష్మ పితామహునికి మీపై వాత్సల్యము కలదా? నిజముగ నాతనికి మీపై వాత్సల్యమే కలదేని ధార్త రాష్ట్రుల ధూర్త వర్తనముల నిరోధింప కుందునా! మీ యన్నదమ్ముల తగవు లాటలో వారివక్షము నాతండవలంబించునా? మీ కులాంగన యగు ద్రౌపది చీరలొలుచు వేళ తగదని చెప్పక సభయందు శిలావిగ్ర హము వలెంగూర్చుండునా? కత్తులు రాపాడ నున్న వేళ, బంధుత్వమును దడవుచు నిర్వీ ర్యుండ వగుచుంటివేలయ్యా! విజయా! నీవు ముక్కంటిని పోర నెదిరించిన జెట్టివి! కాలకేయాది రాక్షసులను గసిమసంగచేసిన వీర కంఠీరవుండవు! ఖాండవదహనమొనర్చి యాఖండలునింబోరగెల్చిన దర్పశాలివి! రాజసూయ మహాధ్వర ప్రవర్తక ప్రతిభుం డవు! నీ కీ కన్నీరు, గద్గదరవము, భీరు త్వము, దైన్యము తగదు. శౌర్య ధైర్య స్థైర్య సామర్థ్యములు, దాన ధర్మైక తత్ప రత, యశము, భక్తి రణరంగమందు ధీరత, ప్రజాపాలనములు క్షత్రియునకుం బ్రకృతి సహజ స్వభావ కర్మములు. ధర్మ సంగరమే క్షత్రియునికి శ్రేయస్కరము. స్వధర్మమును వీడి నీ యెసగము నెరిం చుటే కాక పాపమును పొందుదువు అపకీర్తి నిలిచిపోవును. గౌరవహీనముగ బ్రదుకుటకంటె మృత్యువు మేలు, నీ వీ యుద్ధమునకు వెనుకాడినచో ఇంతవరకు నిన్ను మహావీరుడని మెచ్చిన యోధ వరులే యుద్ధభీరుడవని చులకన చేతురు. కౌరవులు నిన్ను జూచి నవ్వుదురు. విరోధులను జెండాడి విజయమో వీరస్వర్గమో యేదో యొకటి సాధించుటే క్షత్రియధర్మము. సమర విజయుండ వైతివా? — భూభోగములబ్బును. ఖ్యాతి పెరుగును. వీరస్వర్గమందితివా? — స్వర్గ సుఖములు కైవసమగును. క్షత్రి యుండు రణైకజీవి. స్వధర్మమునాచరిం చుటే నీ కర్తవ్యము. స్వధర్మమును దృజించి నిషిద్ధ ధర్మమును సేవింపకుము. ప్రపంచ శాంతిని, జాతిక్షేమమును, నీ కురు కులక్షేమమునకై త్రోసివేయకుము. నీయస్త్ర సన్న్యాసకార్యము వలన నధర్మమునకు జయము ప్రపంచ హితమున కాఘాతము నేర్పుదును. ప్రజాక్షేమమునకు హానిం గూర్చెడువాడు స్వజనుడైనను క్షమింప రాదు. వానిని ప్రేమించుటయు మహాప రాధమే!

[అనునయింపు రీతి] బీభత్సూ! పాంచాలిని "బంధకి" యని యవహేళన మొనర్చిన కర్ణుని బరిమార్చెదనని నాడు శపథముం జేసితివే? ఆ ప్రతినను ద్రోసి పుచ్చి మృషావాదివగుదువా? అలనాటి కౌరవోజ్జ్వాలితలాక్షాగార దూర్వారుణ జ్వలన జ్వాలికలను గౌరవహతకుల కవోష్ణ రక్త ధారలచేం జల్లార్పవా?

ఏమీ? పగను బగతో నణచుట తగవు కాదందువా? [హేళనగ] ఆహా! ఏమి నీ నీతిశాస్త్రకోవిదత్వము? అటులైన – వీర త్వము, వివిధ శస్త్రాస్త్ర పాండిత్యము, శౌర్యప్రదర్శనములు క్షత్రియుల కెందు కయ్యా? రచ్చలలో గారడీలొనర్చి కాసుల సంపాదించుకొనుటకా? సవ్యసాచీ! నీ విట్లు దిగులుపడి దిగ్భ్రమముం జెందిన నీ కీ యుద్ధమున సాయమొనర్ప నరుదెంచిన రాజులు నిన్ను క్షమింపరు. రథమును

## మురళి — రవళి

ఊదవా, మాధవా! వేణువు
ఆదమఱచింది రాధికా తనువు
ఆదమఱచి మేల్కొన్న ఆ వధువు
గ్రోలిసోలింది నీ నామ మధువు
పచ్చిక మేయుటల్ మఱచెనే గోవులు
మచ్చిక సేయుటల్ నేర్చెనే నీ తావులు

కరగిపోయెను నీరమై కొండలు
కదలలేకను జనులైరి కొండలు
పాటపాడుటె మానెను పికములు
మాటలాడుటె మానెను శుకములు

పేడి వచ్చెను పాములె తమ ఆవాసాలను
వేడి చేరెను నీతోడి సావాసాలను
ఉల్లముప్పొంగ వచ్చిరి గోపికలు
హల్లీసకము చేసిరి దీపికలు

తానమాడుచుండిరి గోవబాలలు
మౌనమూగ సాగిరి బంగారు డోలలు
నీళ్ల కయివచ్చిన భామలు
యిళ్ళనే మఱచిరి గొల్లభామలు

చన్నుకుడుచుట విడచిరి పిల్లలు
జున్నునాకుట మానిరి గొల్లపిల్లలు
గారాము జోలలూపుచుండిరి తల్లులు
మారాము మాని పరుండిరి పిల్లలు

శయ్యను వీడుచుండిరి నవదంపతులు
చేష్టలుడిగి వినసాగిరి సతీపతులు
పొంగిపొరలి పాఱెను యమున
తొంగిచూచెను భానుడుదయమున
ఊదవా, మాధవా! వేణువు
ఆదమఱచింది రాధికా తనువు
అందులో యేముంచావో మఱి, మత్తు
అందరి కది కల్గించును గమ్మత్తు.

— తేల్కర్ శంకర్‌రావ్

వెనుకకు మరిల్పినచో నిను చెప్పక మానరు. నీ ధైర్యసాహసములపై యుధిష్ఠిరుని విజయము, నా యాదేశము, దేశాభ్యుదయము నిర్భరములై యున్నవి. ఈ నిర్వైతుర నిర్వేదమును వీడి శత్రువుల నెదుర్కొనుము.

అయ్యో! "బంధుమరణము, బంధు మరణము"ని వాపోయెద వేమయ్యా! మరణము శరీరమునకే కాని యాత్మకు లేదు. పాంచభౌతికమైన దేహమునకు బాల కౌమార వార్ధక్యముల వలె మరణమును స్వాభావికము. ప్రకృతి పరివర్తనములకుఁ గ్లేశముఁ జెందుట యజ్ఞానము, వర్థరహితము. ఈ సృష్టి కర్మసూత్ర సంపన్నము. "జాతస్యహి ధ్రువో మృత్యుః". పుట్టినవారు గిట్టుట, గిట్టినవారు తిరిగి పుట్టుట సహజము. వారాచరించిన పాపపుణ్య కర్మలే వారి సుఖదుఃఖములకు హేతువులగును. ఆత్మ నిత్యము సత్యము ననాది. దానికి పుట్టుచావులు లేవు. శస్త్రములు దానిని ఖండింపలేవు. అగ్ని కాల్చ లేదు. గాలికది యెండిపోదు; నీట నది తడిసిపోదు. ఆత్మయవధ్యము. పాత వస్త్రమును వదలి క్రొత్త వస్త్రమును ధరించు వట్లాత్మ మరియొక దేహమున బ్రవేశించుచు నిత్యమైయుండును. దేహమునే కాని యాత్మనెవ్వరుఁ జంపఁజాలరు.

హింసనే సహింపలేవా? అటులయిన, మిమ్ము హింసలపాలొనర్చిన విధ్వంసక శక్తులయెడ జాలిఁ జూపుట ధార్మికహింస కాదా? నీవు వీరుఁడవని, విజయము సాధింతువని నమ్మి, నీకు సహాయంగా వచ్చిన దేశదేశరాజన్యులు నీ యుద్ధ విముఖతచే ధార్తరాష్ట్రుల దౌర్జన్య దావాగ్నులచే నిలువునఁ గాల్పఁబడుదురే? అది హింసకాదా? దానిని సహింపఁగలవా? ధర్మాధర్మములను గార్యాకార్యములను యథాతథముగ గ్రహింపక తర్కాదుల గ్రహించుట రాజసబుద్ధి. సమస్తమును విపరీతముగఁ దలచుటఁ దామసబుద్ధి. నీలో నిప్పుడు తామసబుద్ధి యధికమగుటచే నిట్లూహించుచున్నావు. లేదేని విరటుని పురమున స్త్రీలకు నాట్యము నేర్పుచుండిన నాటి స్త్రీ సహజమగు హృదయ దౌర్బల్యము, మార్దవము, కారుణ్యము మోహశోక మమకారములు నీలో నిలిచిపోయి యుండును. అదియుఁ గాదేని పేడిపికమ్మని యూర్వశి యిచ్చిన శాప మజ్ఞాతవాసముతోఁ దొలఁగియుండదు లేకుండిన నీ వెప్పుడైనను యుద్ధరంగమున వెనుకాడితివా? ప్రతిపక్షులపై జాలిఁదలచి హింసింపక మానుకొంటివా?

ఏమీ! నేను యుద్ధమునకు, బంధునాశమునకుఁ బ్రోత్సహించుచుంటినా? బాగున్నది నీ యభియోగము. ప్రపంచమున శాంతి నెలకొలుపుటకై పాండవదూతనై రాయబారము నెరపలేదా? సామదాన భేదములఁ బ్రయత్నింపలేదా? విధివిలాసమట్లున్నది. చతుర్థోపాయమగుచు యుద్ధము తప్పకపోయినది. అమృతమునకు ముందు హాలాహలముద్భవించినట్లే ప్రపంచ శాంతికి ముందు యుద్ధము కర్తవ్యమైనది. అదియటుంచుము. మొదటినుండియు యుద్ధమును వాంఛించినదెవరు? ధర్మరాజు యుద్ధము వలదని మొత్తుకొనుచుండినను, నీవును నేనుఁ గాదే కదా 'కదనము కదనము'ని కత్తులు నూరినది? నీవు నా సోదరి భర్తవగుట, మా సుభద్ర పసుపుకుంకుమలఁ గాపాడుటకై, నీ కోరికపై నీ వెంట నుండి పార్థసారథినై నీ గుఱ్ఱాలను దోలుచున్నాను.

నీవు విజయమును సాధింతువని నీ సోదరులును ద్రౌపదియు గంపెడాసతోనున్నారు. నీయుద్ధ విముఖతచే కపిధ్వజము మర్యాదయు, గాండీవము పరువును గంగపాలగునని, నీ తల్లి కుంతీదేవి చుట్టాలలోఁ దలయెత్తి తిరుగలేకపోవునని, పాశుపతాస్త్రమును నీకుఁ బ్రసాదించునపుడు పశుపతి నీకొసఁగిన 'విజయోఽస్తు' నియెడి యాశీస్సు రిత్తవోవునని, ముల్లోకములవారును 'బ్రగల్భములఁ బలుకుటలో ఫల్గునుఁడు దిట్ట' యని నిన్ను హేళన మొనర్తురని, భవిష్యత్తునూహించి, బాల్యస్నేహితుఁడవగుట నీకు హితముఁ జెప్పుచుంటిని. అంతేకాని దుర్యోధనాదులు నాకు మాత్రము బంధుగులు కారా?

ఏమీ? నీవు విరాగివా? నీవనుసరించునది వైరాగ్యమా? ఉభయసైన్యములు రణోన్ముఖులై నప్పుడిట్టి వైక్లబ్యమును బొందుట భీరులక్షణమగునేకాని వైరాగ్యమనిపించుకొనదు. అనుభవించుచున్న రాజ్యమును త్యాగ మొనర్చుట వైరాగ్యమగునుగాని, పగవారి చేతులలోఁబడిన స్వరాజ్యమునుద్ధరింపలేని యశక్తత వైరాగ్యమెట్లగును? పౌరుషవంతుఁడగు క్షత్రియుఁడు, స్వీయ భుజార్జితమగు ధరణి నభిలషించునుగాని, యొకరి యేలుబడిక్రింద 'మనువృత్తి' నాశింపఁడు. అందుకై పరధర్మమగు బిక్షుకవృత్తిననుసరింతునందువు. వలదు వలదు. మీరు నామేనత్త బిడ్డలగుట మీకు నేనే యెదుర్కొత్తును. వేదాంతార్థములనుచ్చరించుకొనుచు జీవితశేషమును గడుపుఁడు. ఏమట్లు చూచెదవు? నిరర్థకులకు, నిర్వ్యాపారులకు సోమరిపోతులకు శుష్క వేదాంత ప్రసంగములే కదా పొద్దుగడపు సాధనములు?

(39 వ పేజీలో)

# స్మరణ

స్మరియించు - స్మరియించు
యమున కెరటాల రాధయని!
గోపాలయని!
పొద్దు పోయేదాక!
నిద్దురొచ్చేదాక:

బృందావనమందలి తీగల బృందాలు
రాధవోలె ఆడజూచు!
వెదురులన్ని వేణువువలె పాడజూచు
ఆడజూచు! పాడజూచు!

పచ్చిక రాధ - మాధవుల పాదాల
తివాచియని మురిసె!
ఆకులన్ని వింజామరల మౌదుమని తలచె!
పూలన్ని గంధపాత్రలమని మురిసె!

— తందాళై రాఘవాచార్య

అది సుప్రసిద్ధ సాలగ్రామక్షేత్రం. గండకీ తీరం. సుప్రభాతసమయం. వాతావరణం ప్రశాంతంగా ఉంది. జనసందోహం చాలా ఉన్నా ప్రశాంతతకేమీ లోపంలేదు. కొందరు స్నానాదులు నిర్వర్తించుకుంటూ ఉంటే మరికొందరు ధ్యాన నిమగ్నులై ఉన్నారు. వారిలో కొందరు యాత్రికులు మరికొందరు క్షేత్రవాసులైన సిద్ధులు. ఈ ప్రశాంతతను, తన్మయత్వములో తీరం నుండి తిలకిస్తున్నాడొక యువకుడు. అతడు కడు సుందరుడు. పుండరీకదళాయత నేత్రుడు. పేరు పుండరీకుడు. సార్థకనామధేయుడు. ముఖకవళికలనుబట్టి అతడేదియో సుదీర్ఘముగ ఆలోచించుచున్నట్లు చూపట్టును.

పుండరీకుడు పిన్నవయసునుండియు భక్తుడు. తల్లిదండ్రులను దైవతములుగా నర్చించి సేవించువాడు: భోగములయెడ నాతని మనసు వైముఖ్యము చూపెడిది. బహుశః యీతని యీ ప్రవృత్తికి బలీయమగు జన్మాంతర సంస్కారమేదియో కారణమై యుండవచ్చును. ప్రాయము పెరుగుచున్నకొలది అతనిలోని వైరాగ్య భావముగూడ మెండుగా పెరుగసాగెను. తల్లిదండ్రులు ఐహిక సుఖములలో నాతని ముద్దు మురిపెముల జూడ వేడుకగలవారై యాతని ప్రవృత్తిని మార్చుటకై పరివరి విధముల ప్రయత్నించుచుండిరి. ఫలితముగా పుండరీకుడు గృహస్థుడయ్యెను. కాని, గార్హస్థ్యమునకూడ నాతని ప్రవృత్తి మారలేదు. నశ్వరములును, హేయములు నగు సంసారసుఖములను, రూప యౌవన సంపదలను అతడు క్షణికములు తుచ్ఛములుగా దలంపసాగెను. ప్రాక్తన సంస్కార బలముచే నాతడు నిరంతరేశ్వర ధ్యాన నిమగ్నుడై సర్వమును మైమరచి యుండెడివాడు. ఈ స్థితిలో ఇల్లాతనికి బందిఖానయైనది. స్వేచ్ఛా విహంగమువలె నెగురదలచినాడు. తన జీవిత లక్ష్యమునకై వెదుకదలచినాడు.

[illegible]

(స్థిర సంకల్పమెవ్వరు వారించగలరు? వెల్లువలై ప్రవహించు ప్రవాహమునెవ్వరడ్డగలరు? — [illegible], తన లక్ష్యము నన్వేషించుటకై [illegible] బయలుదేరినాడు. కంఠ మాలాముల ధరించుచూ, గంగాది పుణ్యనదులను, పుణ్యక్షేత్రములను సేవించుచు [illegible].

"న మే భక్తః ప్రణశ్యతి"
"న హి కల్యాణకృత్కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి"

(నా భక్తుడెన్నడు నశించడు. కల్యాణకారకమైనపనులు జేయువాడెప్పుడును దుర్గతిని పొందడు) — అనికదా గీతాచార్యుని ప్రవచనము. పైగా—

# పార్షద పుండరీకుడు

— శ్రీ కొల్లూరు అవతారశర్మ

"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే।
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ॥"

(ప్రపత్తితో నేను నీవాడను అని యొకపరి శరణుజొచ్చినచో సర్వప్రాణులకు అభయ మొసంగెదను. ఇది నా వ్రతము) — అని ప్రతిజ్ఞ పూనినవాడాయె. ఆ పరాత్పరుని లీలలు వక్తుమశక్యములు. వాగ విషయములు, కడుదురూహ్యములు. అతడెవ్వ డెట్లు భక్తులననుగ్రహించునో ఎవ్వరికిని దెలియదు. కాని, తన్ను నమ్మిన వారిని తప్పక తరింపజేయుననుట శతప్రతిశత సత్యము. ఆతని సంకల్పమమోఘము. తదనుసారముగా నారదుడు ప్రేరేపింపబడినాడు. పుండరీకునకు తారసపడినాడు. కాని యా జడదారి యెవ్వరో పుండరీకునకు తెలియదు.

[illegible]

(కాషాయాంబర దండములు ధరించినంత మాత్రమునసే యతీశ్వరుని పూజింపవలెను. అతని యతిత్వ విషయమును సంశయింపవలసినలేదు) అన్న సముదాచారము నెఱింగినవాడు గావున సుచిత రీతినాతని నాసనార్ఘ్య ప్రదానాదులచే సత్కరించినాడు. మౌనియు మెచ్చినాడు. అతనివంక నిశితముగా జూచినాడు. అతని నిర్వ్యాజతను గుర్తించినాడు. తత్కారణమును ప్రశ్నించినాడు. మహాత్ముల తోడి మైత్రి సాప్తపదీనము అనగా ఏడుమాటల సంబంధము కలదిగా పెద్దలచే ప్రవచింపబడినది.

"యతః సతాం సన్నతగాత్రి సంగతం
మనీషిభిః సాప్తపదీన ముచ్యతే"
(కుమారసంభవము)

ఈ కొలది సంభాషణములోనే పుండరీకునకు అతడాత్మీయుడైనాడు. తన హృదయములోని తపనను ఆతనికెఱింగించినాడు. తోడనే నారదునకుఁ గూడ నాతడాత్మీయుడైనాడు. నారదుడు తన నైజము నెఱింగించినాడు. పుండరీకుని యానందమునకు అవధులులేవు. ఆతని తనువు పులకించినది. నేత్రములు వికసించినవి. గొంతు గద్గదమైనది. వెదకుచున్న తీగ కాలికి తగిలినట్లైనది. భాగవతోత్తములు భగవత్స్వరూపులుగదా! నారదునిలోనే యా భక్తుడా క్షణమున నారాయణునిగాంచినాడు. ఆ గురుశిష్య సమాగమసమయ మంతటి పవిత్రతమమైనది. కాని యంతలోనే పుండరీకుని మోహమావరించినది. భగవద్భాగవతుల నడుమ భేదము చూపట్టినది. తోడనే పుండరీకుడు భవతరణోపాయమును తెలుపఁ బ్రార్థించినాడు. కింకర్తవ్యతా విమూఢుడై కర్తవ్యమును దెలుపవలసినదని ప్రాధేయపడినాడు. (సాధకుని సాధనలోని మధ్యస్థదశ ఇది). సద్గురు సమాగమము సంప్రాప్తించినది. భగవదనుగ్రహప్రాప్తికిది రెండవ సోపానము. (ప్రవృత్తి ప్రథమ సోపానము).

[33 వ పేజీలో]

# దేవాలయాలపై శృంగార శిల్పాలు

— డా॥ దేవరకొండ శేషగిరిరావు

పరమ పవిత్రంగా భావించే ఆలయాలపై బూతుబొమ్మలేమిటి? చర్చి, మసీదులపైగాని, గురుద్వారాలపైగాని లేని బూతుబొమ్మలు మన ఆలయాలపై ఎందుకున్నట్లు? ఆసేతు హిమాచలంలో అన్ని ఆలయాలలోను లేకపోయినా కొన్నింటిపై ఎందుకున్నట్లు? చాలామంది చాలారకాలుగా ఊహించారు. కారణం పూర్తిగా తెలియకపోయినా కొన్ని అభిప్రాయాలను మీముందుంచుతున్నా.

1) శిల్పులు, తమ శిల్పసౌందర్యానికి దృష్టిదోషం తగులకుండా ఈ బూతుబొమ్మలను ప్రధానంగా ఒరిస్సా ఆలయాలపై చెక్కినట్లు ఒక అభిప్రాయం. ఇది అంత తృప్తికరంగాలేదు. పోనీ ఒకబొమ్మను చెక్కారనుకుందాం కొన్ని ఆలయాలలో చాలా ఉన్నాయికదా!

2) ఇది మామూలు జనాన్ని ఆకర్షిస్తుందని, ఏదో ఒక విధంగా భగవంతుని మందిరానికి రావడానికి వీలుకలిగిస్తుందని మరొక వాదం. ఇదీ రుచించడంలేదు.

3) ఇవి సాధకుని పరీక్షచేస్తాయని మరొకవాదం. టిబెట్టులో లామాలకు కొన్ని పరీక్షలను పెడతారట. కేవలం వివిధ భంగిమల్లో ఉన్న బూతుబొమ్మలను చూపించి మనస్సు చలించిందో, లేదో అనే పరీక్ష చేస్తారట. ఆపైన నగ్నంగా స్త్రీలను చూపిస్తారట. కొంతకాలం ఈ పరీక్ష కొనసాగుతుంది. మనస్సుకి ఏ వికారాలు లేనపుడు దీక్షనిస్తారట. అట్లే స్త్రీ పురుషులు కలుసుకున్నట్లు చూసినా మనస్సు చలించకుండా ఉండగలిందులకు ఇది సన్యాసులకు పరీక్ష వంటిదని ఒక అభిప్రాయం. గృహస్థులే కాకుండా సాధువులు, సన్యాసులుకూడా ఆలయ దర్శనం చేసుకుంటారు కదా!

4) ఈ మిథున శిల్పాలను ఆలయాలపై చెక్కాలని శాస్త్రాలు చెబుతున్నాయి కనుక చెక్కడం ఉందని శ్రీ గంగోలిగారి వాదన. ఇట్టి ప్రతిమలను చెక్కాలని వైఖానస కాశ్యపజ్ఞానకాండలో (అ. 82), భోజుని సమరాంగణ సూత్రధారంలో, వరాహమిహిరుని బృహత్సంహితలో, అగ్ని మత్స్య పురాణాలలో, హయశీర్షపాంచరాత్రంలో- ఇట్లా పెక్కు గ్రంథాలలో ఉన్నమాట వాస్తవం. శాస్త్రాలు ఇట్లా చేయవలసింది, ఇట్లా చేయవద్దని శాసిస్తాయి. కారణాలు చెప్పవు. చెప్పనవసరం లేదు కూడా. శాస్త్రం చెప్పిందని అన్నప్పటికి హేతువుకోసం పెనగులాడుతూ ఉంటాడు మానవుడు. చిత్రకళ నాలుగు పురుషార్థాలనిస్తుందని విష్ణుధర్మోత్తరపురాణం చెప్పిందని శ్రీవారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారంటున్నా అసంతృప్తి మొలకెత్తుతూనే ఉంది.

5) ఖజురహోవంటి ప్రాంతాలలో ఈ బొమ్మలు కౌల, కాపాలికుల తాంత్రికాచారాలను, సాధనలను వ్యక్తీకరిస్తున్నాయని ప్రమోద్‌చంద్రగారి అభిప్రాయం. భవభూతి మాలతీమాధవంలో, సోమదేవుని కథా సరిత్సాగరంలో, క్షేమేంద్రుని నర్మమాలలో, రాజశేఖరుని కర్పూరమంజరిలో, కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయంలో, మధ్యయుగానికి చెందిన పుస్తకాలలో ఈ కాపాలికుల భ్రష్టాచారాలు వర్ణింపబడ్డాయని, తంత్రాచారాలు ప్రబలినరోజులలో ఈ ఆలయ నిర్మాణం సాగిందని అతని అభిప్రాయం. తంత్రాలను, అందులోముఖ్యంగా వామాచార తంత్రాలను నిందించినవారు లేకపోలేదు. పంచమకారాలతో (మధువు- మైథునము- వంటివి) పూజచేసేవిధానం పతనానికి దారి తీస్తుందని ఈ ఆచారాలను గట్టిగానిరసించి తంత్రమార్గంలో వైదికాచారాన్ని ప్రవేశపెట్టి జాతికొక నీతిమార్గాన్ని అందించిన ఘనత ఆదిశంకరులకు దక్కింది. అయినా ఈ ఆచారాలు నేటికీ కొన్నిచోట్ల బెంగాలు, అస్సాంవంటి ప్రాంతాలలో ఉన్నాయి. భోగంయోగానికివిరుద్ధంకాదని, భోగంద్వారానే యోగం సిద్ధిస్తుందని రుద్రయామళాన్ని పేర్కొంటూ ఉంటారు. నేలమీదపడినవాడు నేలనే ఆసరాగా తీసికొని లేచినట్లు పతనానికి కారణమైన భోగాన్నే ఆశ్రయించి భోగాన్ని జయించవచ్చుననే కులార్ణవ తంత్రం వీరికాధారం. మరణానికి హేతువైన గరళం, మరణ సమయంలో ఇస్తే బ్రతకడంలేదా? రోగాన్ని కలిగించే మందును తగు మోతాదులో ఇస్తే రోగం హోమియోపతి విధానం ద్వారా నయమవడంలేదా అని తర్కాలంకార పండితుని మాటలను సర్ జాన్‌వుడ్రాఫ్, మహానిర్వాణ తంత్రంలో పేర్కొన్నాడు. బ్రహ్మజ్ఞానం పొందడానికి, యోగికి శారీరకంగా, మానసికంగా సంయోగం ఉంటుందని ఇది వారికి ముక్తినిస్తుందని కొన్నివామ మార్గ తంత్రాలంటున్నాయి. ఇట్టిశారీరక యోగం సన్యాసులలో క్రింది తరగతి వారికుందని పై మెట్టు నెక్కిన అవధూతలకు లేదని శక్తితో (స్త్రీ) కూడినపుడు లతాసాధన అంటారని, ఈ సాధనను గూర్చి శివసంహిత (45 పుట) ప్రాణతోషిణి 618 పుట), గాంధర్వ తంత్రం (60 పుట) కౌలావలి (29 పుట) గ్రంథాలలో ఉందని స్టెల్లా క్రెమ్‌రిస్చ్ దొరసాని అంటోంది. లత చెట్టును పెనవేసుకొన్నట్లు నీవు నన్ను ఆలింగనం చేసికో అని అథర్వ వేదంలోనిమాట (4.8.4). లేతమామిడి చెట్టును మాధవీ లత పెనవేసుకొన్నట్లు

పార్వతి శివునిలో ఉన్నట్లు యోగవాసిష్ఠంలో నిర్వాణ ప్రకరణంలో 18వ సర్గలో చెప్పబడ్డది.

"పట్ల ప్రియేనయునా యుక్తోప్యస్త్రీకృత్వే
విలాసిని శరీరార్థే లతా ఘూంతరోచిషః"

భోగంద్వారా యోగాన్ని పొందడం, ఒకకొండ నుండి మరొకకొండ కొనపై దూకడం వంటిదని, చేరితే వెంటనే చేరుతాడు, లేదా పడిపోతే ఎన్నిజన్మలకైనా పతనం నుండి తేరుకోలేడని రామకృష్ణ పరమహంసగారన్నట్లు వినికిడి. ప్రసిద్ధ మతాచార్యులు, ఇట్టి సాధనలనంగీకరించలేదు. తంత్రాలు ముమ్మరంగా ప్రబలిన కాలంలో వారిసాధనలకు అనుగుణంగా ఈ బొమ్మలు చెక్కారని ఈ వాద సారాంశం.

6) త్రిపాఠీగారు పై వాదాన్ని ఖండించారు. తల గొరిగించినట్లున్న జాతు బొమ్మలు దిగంబర సన్న్యాసులను (జైనులలో ఒకశాఖ) గుర్తు చేస్తాయని, జైనమతంపట్ల అసహ్యభావం కలగడానికి ఇంతకన్న వేరు మార్గం లేదని అన్నారు.

7) ఈ సిద్ధాంతం పూర్తిగా మనం త్రోసివేయడానికి వీలులేదని, అయినా కొన్ని బొమ్మలకు వర్తించినా, చాలా బొమ్మల పట్ల ఇది వర్తించదని విద్యాప్రకాశ్‌గారి వాదన.

8) ఇది ఉపనిషత్తులలో చెప్పిన ఆత్మ పరమాత్మల ఐకమత్యాన్ని సూచిస్తోందని శ్రీరాధాకమల్ ముఖర్జీపండితవారి అభిప్రాయం. బృహదారణ్యకంలో నాల్గవ అధ్యాయంలో (3 బ్రా. 22) స్త్రీతో పురుషుడు కూడినపుడు మైమరచి ఉన్నట్లు, గాఢమైన నిద్రలో జీవుడు, పరమాత్మలో లీనమై ఉంటాడని చెప్పబడింది. అదే మొదటి అధ్యాయంలో నాల్గవ బ్రాహ్మణంలో(3-4) ప్రజాపతి ఒంటరిగా ఉన్నాడని, లోకంలో ఒంటరిగా ఉంటే సంతోషం లేదని, తన సంతోషం కోసం రెండవ వస్తువైన స్త్రీని కోరాడని. తాను స్త్రీ పురుషులుగా మారాడని, సృష్టికది ప్రారంభమని చెప్పబడింది. ఈ శిల్పాలు స్త్రీ పురుషుల, జీవాత్మ పరమాత్మల ఐక్యానికి గుర్తని వాదం. ఒక గుర్తే కనుక ఐతే ఇంత విశృంఖలంగా వారా? వివిధ భంగిమలలో చూపిన ఆ మూర్తులేమిటని మళ్లీ ప్రశ్న.

9) ఇవి కామశాస్త్రాన్ని బోధిస్తోందని మరొక అభిప్రాయం. దేవాలయం సర్వ విద్యలకు, సర్వకళలకు కేంద్రం. స్త్రీపట్ల కామం బలీయం. కామం లేకపోతే సృష్టి లేదు. ఇది అన్ని ప్రాణులకు సాధారణమైన ధర్మం. వాత్స్యాయనుని కామ పెట్టాలి. స్త్రీ మరొక పురుషుని కామించకుండా పురుషుడామెను సంతృప్తి పరచడం కోసం రకరకాల భంగిమలను వర్ణించాడు. ఇతర స్త్రీలు పురుషుని ఎట్లా లోబరుచుకుంటారో, లేదా పురుషుడు, ఇతర స్త్రీలను తన వలలో ఎట్లా వేసుకుంటాడోనని చెప్పడం కోసం, భ్రమ ప్రమాదాలనుండి రక్షించడం కోసం శాస్త్రం ఉంటుందికాని పరస్త్రీ గమనాన్ని చెప్పడం కోసం శాస్త్రం ఉండదు. అపైన ఇంద్రియ విషయాలపట్ల వైరాగ్యమే ప్రయోజనంగా కలది కామశాస్త్ర



శాస్త్రంలో స్త్రీపురుషులు కలుసుకునేటప్పుడు రకరకాల భంగిమలు, ముద్రలు వందల కొద్దీ ఉన్నాయి. ఇతర స్త్రీలను ఎట్లా వశపరచుకోవాలోకూడా అందులో చెప్పబడింది. ఋషి ఇట్లా వ్రాస్తాడా? వ్రాయవచ్చా అని సందేహం. వైద్యంలో అన్ని జంతువుల మాంసాలు వర్ణింపబడతాయి. కుక్క మాంసం గురించికూడా ఉంటుంది. అంత మాత్రంచేత కుక్క మాంసం తినమని లక్ష్యంకాదు. శాస్త్ర మర్యాదను గుర్తిస్తే సందేహం ఉండదు. పురుషుడు, మరొక స్త్రీతో వెళ్ళకుండా స్త్రీ అతనిని సంతోషమని మహిమ్నస్తవంలో మధుసూదన సరస్వతీస్వామి వ్రాసినట్లు శ్రీవారణాసివారు పేర్కొన్నారు. కామం దుఃఖంలోకే దారి తీస్తోంది సుమా అని హెచ్చరిస్తోంది.

ఈ బొమ్మలు కామశాస్త్రానికి ఉదాహరణలుగా ఉన్నాయని, కామాన్ని సేవించిన తర్వాతనే దైవాన్ని దర్శించడం కోసం సంపూర్ణ కామశాస్త్రాన్ని జనులకు బోధించడంకోసం ఉన్నాయని, వాద సారాంశం.

10) మానవ ప్రతిమలను చెక్కకూడదు. దైవ ప్రతిమలనే చెక్కాలి. మానవ ప్రతి

మనను చెప్పడం కూడా అపవిత్రం. అందంగా చెక్కిన మనిషిబొమ్మకన్న ఏకా రంగా అశాస్త్రీయంగా మలిచిన దైవప్రతి మయే శ్రేష్ఠమని శిల్పాచార్యుని సిద్ధాంతం. ఇట్టి దైవప్రతిమలే ఆలయాలలో మిథున శిల్పాలలో ఉన్నాయని మరొక వాదం. సృష్టిని అనుకరించడంగాక ప్రతి ప్రతిమ లోను దైవత్వాన్ని చూపించడమే లక్ష్యంగా భారతీయ శిల్పులు భావించారని డా॥ ఆనందకుమారస్వామిగారి అభిప్రాయం. ప్రేమ అంతా దివ్యమైనదే. అసహ్యకర మైన, అశ్లీలకరమైన భావాలను కల్గించ దని, భారతీయ దాంపత్యం పరమపవిత్ర మైనదని సర్ మోనియర్ విలియమ్స్ గారు సంస్కృత నిఘంటువులో వ్రాశారు. అట్లే ఇది శివశక్తుల సమ్మేళనంగా భావించారని, ఇది బుద్ధ సిద్ధాంతంలో కూడా ఉందని, శక్తి - ఆది బుద్ధుల సమ్మేళనం వల్ల బోధి సత్త్వులు-ప్రపంచం పుట్టినట్లుందని, జీవుని చేతన, లేదా ఆత్మాల్పదాన్ని ఈ బొమ్మలు సూచిస్తాయని డా॥ ఆనందకుమారస్వామి గారి వివరణ.

11) ప్రాచీన వాఙ్మయాన్ని పరిశీలిస్తే కొన్ని వందల శ్లోకాలు శృంగార సంబం ధంగా ఉన్నాయని,శృంగారాన్ని నీచంగా చూడలేదని, కొన్ని వందల సంవత్సరాల నుండి వస్తున్న పద్ధతే ఇందులోనూ ఉందని ఖజురహో వ్రాసిన విద్యాప్రకాశ్‌గారి అభి ప్రాయం.

12) మానవు డనుభవించేది, పశువులు అనుభవించే ఆనందమే సుమా అని గుర్తు చేస్తున్నాయని కొందరంటారు. స్త్రీ పురు షులు కలిసినపుడు చూస్తూఉన్నా, లేదా జంతువులు క్రీడిస్తూఉన్నపుడు చూచినా అసహ్యకరమైన భావం కలుగుతుంది ఇట్టి అసహ్యభావం కలిగించి వైరాగ్యభావాన్ని మనస్సులో బాగా నాటడం కోసం ఈ ప్రతి మలున్నట్లుగా వాదిస్తున్నారు. ఏదైనా ఒక వస్తువు కనపడీ కనపడకుండా ఉన్న పుడు మాత్రమే చూడాలనే బుద్ధిపుడుతుంది. ప్రత్యక్షంగా కనిపిస్తున్నపుడు కుతూహలం ఏర్పడదు. ఇది ఇంతేలే అని అనుకుంటాం. ఇట్టి మన స్తత్త్వానికి ప్రతీకగా ఉందని కొందరు భావిస్తున్నారు. ఇట్లా ఎన్నో అభి ప్రాయాలున్నాయి. ఆలోచించండి.

(ఆధారాలు :- స్టెల్లాక్రెమ్‌రిస్చ్-హిందూ టెంపుల్; 2) శ్రీవిద్యాప్రకాశ - ఖజురహో; 3) కామసూత్రాలు; 4) సర్ జాన్‌వుడ్‌రాఫ్- ది గ్రేట్ లిబరేషన్ - కృతజ్ఞతలతో)



---

## శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం, శ్రీనివాసమంగాపురం.

శ్రీనివాసమంగాపురంలోని శ్రీ కల్యాణ వేంకటేశ్వ రాలయంలో జరుగు నిత్య కల్యాణోత్సవం, అభిషేకం. నిత్యఅర్చన వివరాలను యాత్రికుల సౌకర్యార్థం ప్రచురిస్తున్నాము.

**నిత్యకల్యాణోత్సవం :**

నిత్యకల్యాణోత్సవసేవ ప్రతిరోజూ ఉదయం 10-30 నుంచి 12-00 గంటలవరకూ జరుగుతుంది. ఈ సేవకు 150 రూ॥లు చెల్లించాలి. పదిమంది వ్యక్తులను ఈ సేవలో పాల్గొంటానికి అనుమతిస్తారు. గృహస్థుకు వస్త్రబహు మానం వుంటుంది.

**అభిషేకం :**

ప్రతి శుక్రవారం అభిషేకసేవ జరుగుతుంది. (ఉదయం 7-30 నుంచి 9 గంటలవరకు) అభిషేకం చేయించే వారు 100 రూ॥లు చెల్లించాలి ఇద్దరు వ్యక్తుల్ని ఈ సేవలో పాల్గొనటానికి అనుమతిస్తారు.

**నిత్యఅర్చన :**

నిత్యఅర్చనసేవ సంవత్సర కాలమూ ప్రతిరోజూ వుంటుంది. ఈ సేవ చేయించదలచినవారు 42రూ॥లు చెల్లించాలి

# తెలంగాణలో
# హరివంశ కావ్యాలు

— శ్రీ ఎం. గోవిందస్వామినాయుడు

పంచమ వేదమని ప్రఖ్యాతిగాంచిన భారతమునకు ఖిలపర్వముగా ప్రసిద్ధి పొందిన భాగము హరివంశము. ఈ గ్రంథ ప్రాశస్త్యమును గూర్చి వ్యాసభగవానుడు

"అస్త్రీభుజంగ కాంతార పరిపక్వ ఫలాశనామ్
వాల్మీకి కథావా సంగ ద్వైప పుటీమహా"

అని ప్రవచించియున్నాడు. ఆంధ్ర సాహిత్యమునందును భారత రచనానంతరము హరివంశరచన సాగుట విశేషము. తెలుగులో పెక్కు హరివంశములు వెలసియున్నవి.

కవిత్రయములో తృతీయుడగు ఎఱ్ఱాప్రెగడ క్రీ.శ. 1325–1353ల మధ్య కాలమున హరివంశమును రచించి ప్రోలయ వేమారెడ్డి కంకితము గావించియున్నాడు. సంస్కృతమున హరివంశము- హరివంశ పర్వ, విష్ణుపర్వ, భవిష్యపర్వములను మూడు పర్వములతో కూడియుండగా అట్టి విభాగమును గావింపక ఎఱ్ఱన పూర్వభాగమని, ఉత్తరభాగమని విభజించెను. పూర్వభాగము తొమ్మిదాశ్వాసములుగ, ఉత్తర భాగము పది యాశ్వాసములుగ నున్నవి. మూలమును కొన్ని యెడల యథాతథముగ ననువదించుట, సంక్షేపముగావించుట విపులీకరించుట, విభక్తములయి వ్యవహితములుగా పలుచోట్ల కానవచ్చు కథాంశముల నొక్కచో కూర్చుట అను పద్ధతులపై ఎఱ్ఱన రచన సాగినది.

హరివంశమును తెనిగించిన వారిలో రెండవవాడు నాచనసోమన. మూలము నందలి రసవత్తర ఘట్టములను మాత్రమే గైకొని ఉత్తర హరివంశమను పేరుతో సోమన రచన సాగించెనందురు. సోమన కాలమును గూర్చి భిన్నాభిప్రాయము లున్నను క్రీ.శ. 1344 నాటివాడను వాదమునకు ఎక్కువ ప్రచారమున్నది. ఈ గ్రంథమున ఆరాశ్వాసములున్నవి. తిక్కన ఛాయలో రచన సాగించుచు ఆ మహాకవిని స్మరించుచు హరిహరనాథుని కంకితమొనగుట విశేషమగును.

గూళకల్లు వేంకటరమణకవి యను నాతడు హరివంశమును రచించినట్లు తెలియుచున్నది. ఇతని మరియొక కృతియగు 'కనక రంజిత శిఖామణీ పరిణయము'న వేంకటేశ్వరుడు ప్రత్యక్షమై — "మా పేరు గొన్న వేంకటరమణకవి, సత్కవివి, మాకు ముందు హరివంశము సంతయు తెనుగు జేసి యంకిత మొనర్చితివి" అని పేర్కొనుటం బట్టి ఈతడును హరివంశమును పూర్తిగా రచించెననవలయును కాని ఈతని గ్రంథములభ్యము. ఈ కవి రామలింగ నాయ్యని నుతించుట వలన క్రీ.శ. 1600 ప్రాంతము వాడని చెప్పవచ్చును.

తాళ్ళపాక వంశమునకు చెందిన తాళ్ళపాక పెదతిరుమలయ్య హరివంశమును రచించెననుటకు ఆధారములు కానవచ్చుచున్నవి. ఇతని కుమారుడగు తాళ్ళపాక చిన్నన్న అష్టమహిషీ కల్యాణమునందు కవి వంశావళి విభాగమున "ద్విపద రూపమున హరివంశ కావ్యము ఆయత రస స్ఫూర్తి హరివంశ మిగు రొత్త నన్వొంద జేసి" అని పేర్కొనెను. ఈ గ్రంథము నేడు కేవలము నామ మాత్రావశిష్టము. ఇతని కాలము 1460 – 1546 అని చెప్పవచ్చును.

నేమాని భైరవకవి యనునాతడు కోటగిరి వంశమునకు చెందిన శ్రీనివాస భూవరుని కోరికపై హరివంశమును రచించెను. ఆ భూపతి హరివంశ కథాశ్రవదైకచిత్తుడై పారిజాతాపహరణాది కథావళి ఎఱ్ఱన రచనలో లేకుండుటను గుర్తించి — "ఈ కథల నీవు తెనిగింపుమీర ప్రకట నేమాని భైరవసుకవిచంద్ర" అని కోరగా భైరవకవి గ్రంథరచన కుపక్రమించినట్లు తెలియుచున్నది. ఆశ్వాసాంత గద్యయందు "శ్రీమత్కల్యాణ గౌరీవరణ షట్పదాయ మాన మానసుడని" పేర్కొనెను. ఈతని హరివంశము మూడాశ్వాసముల ప్రబంధం. ఇతడు ప్రథమ, ద్వితీయ, తృతీయాశ్వాసములను పేరుతో గాక ఉత్తరభాగము పంచమ, షష్ఠ, సప్తమాశ్వాసములని పేర్కొనెను. నేమానిభైరవకవి ఎఱ్ఱన యందత్యంత గౌరవము గలవాడు. ఇతడు తెనిగించిన పారిజాతనిబంధన, అంధకాసుర సంహారాది వృత్తాంతములు ఎఱ్ఱన ఉత్తర భాగము నాల్గవ ఆశ్వాసము తరువాత చెప్పవలయును. కనుక తన గ్రంథమున ప్రథమ, ద్వితీయ, తృతీయాశ్వాసములనక పంచమ, షష్ఠ, సప్తమాశ్వాసములని పేరిడెనని శ్రీమతి యశోదారెడ్డిగారు భావించిరి.

ఆధునికులగు మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు ఆంధ్ర భవిష్య పర్వమను పేర నొక గ్రంథమును వ్రాసియున్నారు. ఇది ఆరాశ్వాసముల ప్రబంధము. పరమపురుషార్థమున కాలవాలమగు గ్రంథమేదేని తెనిగింపవలయునని సంకల్పించుకొని అట్టి దాని నన్వేషించుచు తుదకు మహాభారతం బను పంచమ వేదంబున కుపనిషత్తునాబరగు హరివంశము నందా మూలాగ్రంబవలోకించి భవిష్యపర్వమును రచింప నమకట్టినట్లు గ్రంథావతారికనుబట్టి స్పష్టమగుచున్నది. ఆశ్వాసాంత గద్యములనేకముఖముగ సాగింపక వివిధ వృత్తాంతములను పొందుపరచుట మల్లాదివారి నవ్యత యగును.

శ్రీవిశ్వనాథ నరసింహ కవిగారు బాల్యమిత్రుడు, సదాచార సంపన్నుడును, కవి సత్తముడును అగు పతంజలి శాస్త్రి ప్రేర

ణము వలన హరివంశ రచనను సాగించి నట్లు తెలియుచున్నది. ఈ గ్రంథమునందు ప్రథమ భాగము మాత్రము ముద్రితము. అది సప్తాశ్వాసపూర్ణము.

## వచన హరివంశములు

శ్రీ యస్. నరసింహాచార్యులుగారు, శ్రీ కొమాండూరు వేంకటరామానుజశర్మ గారు వాగ్వల్లీ పత్రికయందు హరివంశ మును ప్రకటించిరి. ఇందు వచనముతో బాటు అచ్చటచ్చట కొన్ని పద్యములు చేర్చబడినవి. శ్రీహరివంశమను పేరుతో ఏలూరిపాటి లక్ష్మీ సరస్వతి యను నామె పర్వత్రయ సహితముగా ఒక వచన హరి వంశమును రచియించినది. గోవిందలూరి సాంబశివయ్యగారు ఆంధ్రవారపత్రికనందు వచన హరివంశమును పేర కొంతభాగమును ప్రకటించిరి. పిలకా గణపతిశాస్త్రిగారు 'ఆంధ్ర దినపత్రిక'లో ఆదివారపు సంచిక కనుబంధముగ హరివంశమును పూర్తిగ ప్రకటించిరి.

హరివంశమను పేర్లతో కానవచ్చు గ్రంథ ములివియే కాని హరివంశము నాధారముగ నా గ్రంథమునందలి కొన్ని భాగముల కను వాదములుగ వెలసిన గ్రంథములసంఖ్యా కములు. హరివంశములోని కథలలో పారి జాతాపహరణ వృత్తాంతము, ప్రభావతీ ప్రద్యుమ్నుల చరిత్ర, ఉషానిరుద్ధుల ప్రణయగాథలు చాలా ప్రసిద్ధిపొందినవి. ఈ కథల నాధారముగ పద్యకావ్యములు, ద్విప దలు, యక్షగానములు, నాటకములు వెలసి యున్నవి.


'వేణుగానలోలునిగన'........ చిత్రం: కె. ద్వారకనాథ్.

## పారిజాతాపహరణము

మూల హరివంశమున విష్ణు పర్వములో 65 వ అధ్యాయము నుండి 76 వ అధ్యా యము వరకు ప్రస్తావింపబడిన వృత్తాంతము పారిజాతాపహరణము. ఈ కథ నాధార ముగా గొని నంది తిమ్మన పారిజాతాప హరణ కావ్యమును రచించి రాయల కంకిత మొసగెను. ఇది అయిదాశ్వాసముల ప్రబంధము. ఇతని కవిత్వమునకు మాధు ర్యమే ప్రాణము. ఇట్లే కృష్ణాధ్వరి పండి తుడు నైషధపారిజాతీయమను ద్వ్యర్థికావ్య మును రచించి రఘునాథరాయల కంకి తము గావించెను. లింగనమఖికామేశ్వర కవి 'సత్యభామాసాంత్వనము'ను పేరుతో కావ్యరచనగావించి మధురానాయకుడగు చొక్కనాథనాయకుని సవతితల్లి లింగాంబ కుమారుడగు ముద్దళగిరి కంకిత మొసగెను.

నందివరము సింగన, చల్లా నారాయణ కవి, తరిగొండ వేంకమాంబ మొదలగు వారు ఈ వృత్తాంతమును యక్షగానరూప మున రచించియున్నారు. నారాయణకవి, కొత్తపల్లి సుందరరామయ్య, మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు పారిజాతనాటక ముల రచించిరి. విజయరాఘవనాయకుడు కూడ పారిజాత నాటకమును రచించినట్లు తెలియుచున్నది.

## ప్రభావతీ ప్రద్యుమ్నము

మూలహరివంశము విష్ణుపర్వమున 91వ అధ్యాయమునుండి 97 వ అధ్యాయము వరకు వర్ణింపబడిన వృత్తాంతము. శృంగార ప్రధానమగు నితిహాసములలో నిది ప్రము ఖము. వరబల గర్వితుడు దేవమానవ విద్వేషియగు వజ్రనాభుని ఉపాయాంతర ముల శ్రీకృష్ణుడు సంహరించుట ఇందలి ఇతివృత్తము. ఈ కథను గైకొని ప్రబంధ ముగా సంతరించిన వారిలో పింగళిసూరన మొదటివాడు. పురాణ గాథలు విషయ

ప్రధానమైనది. మూలమందు గల లోపము లను సవరించి సంఘటనలకు కార్య కారణ భావములు కల్పించి నాటకీయతకు పోషించి రచన సాగించుట సూరన ప్రత్యేకత. ఈ కథనాధారముగా గ్రహించి ఓరుగంటి సోమశేఖరకవి ప్రభావతీ పరిణయమును, పొన్నాడ పెద్దిరాజుకవి ప్రద్యుమ్న చరిత్ర మును, ఫణిమాధవులు ప్రద్యుమ్న విజయ మును, ముప్పిరాల సుబ్బరాయకవి ప్రద్యుమ్న చరిత్రలను రచించిరి.

## అనిరుద్ధ చరిత్ర

ఇది శృంగార ప్రధానమగు చరిత్ర. బలిచక్రవర్తి కుమారుడగు బాణాసురుడు పరమేశ్వరు నారాధించి లోకాతీత వరముల బడసెను. ముల్లోకములందలి వీరులను జయించి తృప్తి పొందక, యుద్ధము లేని జీవితము చవిగాదని కోరి యరిష్టము దెచ్చుకొనెను. తన కుమార్తెయగు ఉష వలన కృష్ణసాహచర్యము నొంది ధన్యు డగుట ఇందలి ఇతివృత్తము. వీర శృంగా రములతో మేళవించిన ఈ కథను పలువురు రచించి యున్నారు.

వసుపులేటి రంగాజమ్మ ఉషాపరిణయ మును రచించెను. ఇది విజయరాఘవ నాయకున కంకితము గావింపబడినది.

తాళ్ళపాక తిరువేంగళనాథుడు ఉషా కల్యాణమను పేరుతో ద్విపద కావ్యమును సంతరించెను. గ్రంథావతారికను బట్టి అలి మేలుమంగాంబకు అంకితమిచ్చినట్లు తెలియుచున్నది.

దామెర అంకభూపాలుడు ఉషా పరి ణయమును రచించెను. రామచంద్రున కంకితము గావింపబడిన గ్రంథమిది. భగ వంతుడు కలలో కన్పించి ఉషాపరిణయ మను కృతి నిమ్మని కోరినట్లు అవతారికను బట్టి తెలియుచున్నది.

కనుపర్తి అబ్బయామాత్యుడు అనిరుద్ధ చరిత్రను, నాగినేని వేంకటప్పయ్య ఉషా కల్యాణ ప్రబంధమును రచించిరి. ధర్మ వరం కృష్ణమాచార్యులవారు, వేదం వేంకట రామశాస్త్రి గారు, గోపాలరాజు సీతా రామయ్యగారు ఈ కథను నాటకముగా రచించిరి. ఇంతేగాక [illegible] నరసింహరాయ డు, రంగాజమ్మ, విశ్వనాథకవి మొద లగువారు యక్షగానములుగా సంతరించిరి.

## శేషధర్మములు

హరివంశమున హరివంశపర్వ, విష్ణు పర్వ, భవిష్యపర్వములను మూడు పర్వము లున్నట్లు తెలియుచున్నది. కానీ శేషధర్మ ములను రచించిన కవులు ఆ భాగమును హరివంశములోనిదని తెలుపుటను బట్టి దానిని కూడా హరివంశభాగముగా తలంప వలసియున్నది. కృష్ణుడు ధర్మజునకుపదే శించిన ధర్మములివి. నారాయణుడు ధర్మ రహస్యములను చెప్పుచుండగా, పౌండ్రక వాసుదేవుడు ద్వారకానగరముపై దండెత్తి వచ్చెనను వార్త గొని దూత ఏతెంచెను. అంత కృష్ణుడు ఆయా ధర్మములనుపదే శించుటకు భీష్ముని నియోగించెను. ఇది యొక్కటియే హరివంశకథకు సంబంధించిన వృత్తాంతము. ఈ ధర్మములను గైకొని కవులు సంబంధములుగా, [illegible] లుగా రచించియున్నారు. వీరిలో మొదటి వాడు కొడిచెర్ల శ్రీనివాసరావు. రామచంద్ర మూర్తి సాక్షాత్కరించి కృతివేయుమనగా రచి వ్రాసినట్లు పీఠికా భాగము పేర్కొను చున్నది. రెండవవాడు తామరపల్లి తిమ్మయ్య. ఇందు పూర్వము ధర్మాజీవాడు కవిని పిలిపించి శేషధర్మముల ననువదింప జేసి రాముని కంకితము గావింపజేసెను. ఇట్లే చతుర్భుజ తిమ్మరాజు వెణుకుదురు పల్లి విశ్వనాథకవి వాక్కులకు ముగ్ధుడయి "ఇపుడు నీవు చెప్పబూనిన కావ్యంబంకితము చేయు మాపేర అనఘచరితా" అని కోరగా నాతడు మూడాశ్వాసముల రచన సాగిం చెను.

తురిమెళ్ళ రామయామాత్యుడు ఈ ధర్మ ములనే ఎనిమిదాశ్వాసముల కావ్యముగా సంతరించెను. సిద్ధిరాజను కవి శేషధర్మ ములను విరచించి ఉదయగిరి రఘునాయ కుల కంకితము గావించెను. కానాల నర సింహకవి తతిగొండ గ్రామమున వసించిన నరసింహస్వామి కంకితముగా ఎనిమిదాశ్వా సముల శేషధర్మములను రచించెను. వీరే గాక బచ్చు సిద్ధకవి, పురాణపండ్ల మల్లయ్య, భమిడిపల్లి వేంకటకవియు శేషధర్మము లను విరచించి యున్నారు. చదలువాడ సుందరరామశాస్త్రి, నోరి గురులింగశాస్త్రి మొదలయినవారు వచన కావ్యములుగా రచించి యున్నారు. హరివంశ కథకు, శేష ధర్మములకు ప్రధాన విషయమునందు సంవిధానము కుదురుట లేదు గనుక ఆ ధర్మములు హరివంశభాగములు గావని శ్రీమతి యశోదారెడ్డిగారు తలంచుచున్నారు

విష్ణు పారమ్యమును బోధించుచు హరి హరాభేదమును ప్రతిపాదించు గ్రంథము లలో హరివంశము ప్రధానమైనది. హరి వంశ పూర్వోత్తర భాగములు, పారిజాతాప హరణము, ప్రభావతీ ప్రద్యుమ్నము, అని రుద్ధ చరిత్రము మున్నగు కథల నాధార ముగా గొని వ్రాసిన ప్రబంధ నాటక యక్ష గానాదులు తెలుగున హరివంశములను పరిధిలో తప్పక నిముడ గలవు. *

## వినతి

ఉప్పొంగితి వార్నిధినై
ఉప్పునీటి భాగ్యానికి
ఉడిగినదాగర్వమిపుడు
శరము విడుము దాశరథీ!

*

ఎదుగుతున్న తనువుతోడ
ఎదుగుతున్న వయసుతోడ
ఎదుగదు యీ చిత్తకుబ్జ
ఎదకదుముకొనుము కృష్ణా!

*

మంచుకొండ గుండెలోన
పుట్టిపెరిగె భక్తి బాల
యుక్తవయసు వచ్చెనిపుడు
స్వీకరింపు మీశ్వరా!

— 'రసిక్'



మధురానగరిలో చల్లలమ్మబోదు....

చిత్రం : శ్రీ మారేమండ శ్రీనివాసరావు, శ్రీశైలం

# యువవాణి

పశ్చిమ జర్మనీలో మార్‌బర్గ్ విశ్వవిద్యాలయంలో సంస్కృత శాఖాధ్యక్షులుగా పని చేస్తూ ఆ మధ్య సెలవు మీద స్వదేశానికి వచ్చిన డా॥ పేరి సర్వేశ్వరశాస్త్రిగారిని కలుసుకొనే సదవకాశం కలిగింది. "ఏదేశాలలో మీకు కలిగిన అనుభవాలను పురస్కరించుకొని తెలుగు విద్యార్థులకు, యువకులకు మీరిచ్చే సలహా ఏమిటి?" అని అడగ్గా వారిలా అన్నారు.

"ఈ ప్రపంచం సత్యమైనదని కుమారిల భట్టు చెప్పాడు. ఆ మాటను మనం గుర్తుంచుకోవాలి. మన చుట్టూవున్న ప్రపంచాన్ని మనం నిర్లక్ష్యం చేస్తే మనకు అభివృద్ధి అనేది వుండదు" అన్నారాయన.

జగత్తు మిథ్య అనే భావం మనలో పాదుకొని పోయింది. అందు మూలాన ప్రతి విషయాన్ని నిర్లక్ష్యం చేస్తున్నాం. దేనిమీదా శ్రద్ధలేదు. శరీరఆరోగ్యం ఎడల నిర్లక్ష్యం, ఇంటి చుట్టూ పరిసరాలు పరిశుభ్రంగా వుంచుకొనడంలో నిర్లక్ష్యం, చేసే పనుల ఎడల నిర్లక్ష్యం, ఇంటిని ఆకర్షణీయంగా వుంచడంలో అశ్రద్ధ. ఎందువల్ల? జగత్తు మిథ్య అనే మాట చెవుల్లో గింగురుమంటూ వుంటుంది గనుక!

జగత్తు మిథ్యకాదు. విజ్ఞానశాస్త్రవేత్తల అభిప్రాయం ప్రకారం జగత్తు నిరంతరం మారుతూవుంటుంది. అనుక్షణం ప్రాణుల జీవకణాలలో మార్పుకలిగి బాల్యం పోయి కౌమారం, కౌమారం పోయి యౌవనం, యౌవనం పోయి వార్ధక్యం వస్తుంది. ఆ తరువాత మరణం. అంతమాత్రాన ప్రపంచం మిథ్య అనడానికి వీలులేదు. మార్పుచెందడం ప్రాణుల స్వభావమని అనుకోవాలి.

మానవులు మరణిస్తారు గనుక, ఒకనాడు వుండి మరొకనాడు వుండరు గనుక జీవితం ఎండమావులలో భ్రమ అనుకో కూడదు. జీవించి వున్నంతవరకు జీవితం సత్యమైనదే. అంతవరకు అది శాశ్వతమైనదే.

భోజనం ముందు కూర్చున్నపుడు తినగానే అరిగిపోయే కూరలో ఉప్పు ఎక్కువైతే 'ఉప్పుకషాయం' అంటూ దాన్ని వదలివేస్తాం. ఒక గంటలో, ఒకపూటలో నశించే పదార్థాలు రుచిగాలేకపోతే అయిష్టం జూపే మనుష్యులు 70, 80 ఏళ్ళు నడిచే తమ జీవితం శోభాయమానంగా వుండాలని, శరీరాలు ఆరోగ్యంగా వుండాలని, పరిసరాలు రమణీయంగా వుండాలని కోరుకోవద్దా?

డా॥ పేరి సర్వేశ్వరశాస్త్రి గారు ఇంకా ఇలా అన్నారు: "విజయవాడ కృష్ణానదిని ఆనుకొని వున్నది. ఇలాంటి నది జర్మనీలో గాని ఫ్రాన్సులోగాని గనుక వుంటే, వారు నదీతీరాలను ఉద్యానవనాలతో నింపివేస్తారు. అందులో ప్రపంచమంతటి నుంచీ రకరకాల పుష్పజాతులను తెచ్చి పెంచుతారు. నీటి ఊటలను, ఈతకొలనులను ఏర్పరుస్తారు. రంగు రంగుల దీపాలతో అలంకరిస్తారు. ప్రజలు అసంఖ్యాకంగా వచ్చి విశ్రాంతి తీసుకుంటారు."

కాని మనదేశంలో ఏం జరుగుతున్నది? నదీతీరాలను మరుగుదొడ్లగా జనులు ఉపయోగిస్తారు. సాయంకాలం అక్కడికి వెళ్ళి ఇసుకతిన్నెలమీద కూర్చొనే వీలులేదు. దుర్గంధం కొడుతూవుంటుంది.

ఈ సందర్భంగా జపానులో జరిగిన ఒక సన్నివేశాన్ని గుర్తుంచుకోవడం ప్రయోజనకరంగా వుంటుంది.

ఒక పంజాబీ పెద్దమనిషి జపాన్‌లో టోకియోనగరం నుండి కియోటో నగరానికి రైలులో ప్రయాణం చేస్తున్నారు. ఆయన ఎదురుగావున్న ఒక జపాన్ మహిళ అదేపెట్టెలో ఎక్కి ప్రయాణం చేస్తున్నది. ఆమెవద్ద పాతబడి మాసిపోయిన గుడ్డలు కొన్ని వున్నాయి. వాటినామె ఇస్త్రీ చేసిన సిల్కు తువ్వాలులో చుట్టి మూటగట్టింది.

ఆ భారతీయ ప్రముఖుడామెను "క్షమించండి. నాకు తెలియక అడుగుతాను. పనికిరాని పాతగుడ్డలను అంత అందమైన తువ్వాలులో దాచవలసిన అగత్యమేమిటి? అంత చక్కని వస్త్రాన్ని ఇందుకు ఉపయోగించాలా" అని ప్రశ్నించాడు.

అందుకామె "అయ్యా! ఇతరుల కంటికి మురికి దృశ్యమును చూడనిచ్చే హక్కు నాకేమివున్నది? లోకంలో ఎంతో మాలిన్యము, కశ్మలము ఉండనేవున్నది. నేను మరికొంత దానికి జోడించటం తగదు గదా!" అని అన్నది.

ఆమె పలికిన పలుకు ఎంతో అర్థవంతమైనది. మనం గ్రహించదగిన అంశమిది. మన వీథులు, పార్కులు, నదీతీరాలు, రైలుపెట్టెలు, తినిపారవేసిన తొళ్లికలతో, చెత్తాచెదారంతో నిండిపోతున్నాయి. మన దేశానికి వచ్చే విదేశీయులకు మనపై ఏహ్యభావం కలగడానికిది దారితీస్తున్నది. దీనికి పేదరికం కారణం కాదు. జీవితంమీద నిర్లక్ష్యం, అశ్రద్ధ ఇందుకు హేతువులు. మనం ప్రపంచాన్ని, జీవితాన్ని నిర్లక్ష్యం చేస్తున్నాం. ఈ దోషాన్ని సరిదిద్దుకోవాలి.

## మనచుట్టూ మాలిన్యం!

—శ్రీ మన్నవ గిరిధరరావు

# ఆదివారం ఏంచేయాలి?

వారంలో ఆరు రోజులు పనిచేసి ఆది వారం కోసం యెదురు చూస్తుంటారు ఉద్యోగులు. ఆ రోజు పేరుకు విశ్రాంతికే గాని ఎక్కువ 'బిజీ'గా వుంటారు. సరదా కోసము సినిమాఆటలు, రుచికర భోజనము లకు 'యాటలు'కై ఎక్కువ శ్రద్ధ వహిస్తుం టారు. అందుకని తలంటుస్నానముజేసి నోటికి హితవుగా విందులు ఆరగించి విలాస ములు గావింతురు. ఇది యిప్పటి కాలపరిస్థితి.

రాకరాక ఒక అతిథి ఆదివారం రోజున సంధ్యాసమయంలో వచ్చినాడు. ఆయన మాంసాహారి. ప్రొద్దుపోయి వచ్చుటచే మాంసము దొరకలేదు. గ్రుడ్డుకు వచ్చిన యొకకోడి యింటికిరాగానే పట్టుకొని మెడ కోసివేసినారు. చెకా, చెకా తిరుగాడుచున్న కోడి ఒక్క క్షణములో మాంసముగా తయా రయినది. ప్రొద్దుపోయినందున దీపాలు. వెలిగించారు. దీపమైతే ఆర్పి మరలా వెలి గించవచ్చు. మరి ప్రాణము పోయిన తిరిగి రప్పించలేము గదా. ఎంత క్షణికమో ఈ జీవిత మనిపించినది. మరునటి రోజు పెట్టకోసం పుంజు కేరింతలు కొట్టింది. ఇంటి చుట్టూ తిరిగింది. ఏమి జరిగినదో దాని కెవరు చెప్పగలరు? రెండు మూడు రోజులకు గాని దాని అరుపులు మానలేదు. కాని నేను మరువలేకపోయాను. స్నేహ వాత్సల్యా ములు మానవునికే పరిమితంకాదన్న సత్యాన్ని దానిగుండా తెలిసికొన్నాను.

జీవహింస చేయడము పాపమంటే మా మిత్రుడు మండిపడతాడు. మనకోసమే దేవుడు వాటిని పుట్టించాడు. అవి మనకు ఆహారమైనపుడు చంపడంలో పాపం లేదం టాడు. సైన్సు ప్రకారం గ్రుడ్లు మాంసము సంపూర్ణ ఆహారం క్రింద వినియోగించ వచ్చునుగదా అని వాదించాడు. మనము తిను ఆహారములో పాలు పండ్లు తాజా ఆకుకూరలలో కావలసిన విటమినులు లభ్య మగునపుడు మాంసమునకు ప్రాధాన్యత యివ్వపనిలేదు. అంతటి ఏనుగుకు ఆహా రము, ఆకులలములు తప్ప మరే నియ మములేదు.

మరి శాస్త్ర విధిగా ఆదివారం చేయవల సిన పనిపేరు. వారములలో మొదటిది ఆదివారం. సూర్యుడు అధిపతిగావున, రవి వారం అనికూడా అంటాము. ఆదిత్యుని ఉపాసన దినము. ఆరోజు చాల పవిత్ర మైనది. అందుకని మధువు, వధువు, మాంసము, తైలస్నానములు నిషేధములు. ఇది పాటించువారికి సకల సంపదలు కలుగు నని లేనిచో నిరంతరము రోగపీడితులై నిర్భరమైన దారిద్ర్యమును జన్మ జన్మ ములకు అనుభవించి తీరవలసినదే అని శాసించియున్నది.



ఆమిషం మధు పానం చ
యః కరోతి రవేర్దినే,
సప్త జన్మసు రోగః స్యాత్
జన్మ జన్మ దరిద్రతా.
స్త్రీ తైల మధు మాంసాని
సంత్య జేద్యో రవేర్దినే,
నిరస్య శోక దారిద్ర్యం
సూర్యలోకం స గచ్ఛతి.

ఈ సమస్త చరాచర ప్రపంచము సూర్య భగవానునిపై ఆధారపడియున్నది. అందుకే భగవంతుని రూపములో ఆదిత్యుని ఆరాధించుచున్నాము. రావణ సంహారము నకు బయల్వెడలిన శ్రీరామునికి అగస్త్య మహాముని సందేశము చూడండి.

"రామ రామ మహా బాహో
శృణు గుహ్యం సనాతనమ్,
యేన సర్వా నరీన్ వత్స
సమరే విజయిష్యసి.
ఆదిత్య హృదయం పుణ్యం
సర్వ శత్రు వినాశనమ్
జయావహం జపేన్నిత్యం
మక్షయ్యం పరమం శుభమ్.
సర్వ మంగళ మాంగళ్యం
సర్వ పాపప్రణాశనం
చింతా శోక ప్రశమన
మాయుర్వర్ధన ముత్తమమ్.

మునుల ఆదేశానుసారం ఆదిత్యస్తోత్రం చేసి రావణుని సంహరించి లోకానికి సుఖం కల్గచేసినటువంటి ప్రభువు శ్రీరామచంద్రుడు. అటువంటి పవిత్రమైన రోజే ఈ ఆదివారం. అందుకే వారంలో ఆదివారమునకు అంత విశిష్టత వున్నది.

— శ్రీ జి. రామయ్యా పిళ్లై

*

# వెనుకటిగుణం

కర్పూరధూళీ రచితాలవాలః
కస్తూరికా కుంకుమ లిప్త దేహః,
పన్నీర నీరైః పరిషిచ్యమానః
ప్రాంచం గుణం ముంచతి కిం పలాండుః ?

"కర్పూరపు పొడితో పాదుచేయవచ్చు: కుంకుమం కస్తూరి పులమవచ్చు. పన్నీటితో తడుపవచ్చునుగాని "ఉల్లి" గడ్డకు వెనుకటి గుణం పోతుందా?"- ఇది పై శ్లోక తాత్పర్యం.

తెలుగుభాషలో ఒక సామెత ఉంది.
పుట్టుకతోవచ్చే బుద్ధి పుడకలతోగానిపోదు.

అంటే సహజ సిద్ధమైన గుణాలు - మరణించే వరకు మనిషిని వదలిపెట్టవు అని భావం.

తెలుగువారికి పై శ్లోకం చదువగానే జ్ఞాపకం వచ్చేది సుమతీ శతకంలో ఒక పద్యం ఉంది.

కనకపు సింహాసనమున శునకము
గూర్చుండ పెట్టి శుభలగ్న మునం
దొనరగ పట్టము గట్టిన
వెనుకటి గుణమేల మాను వినురా
సుమతీ.

పై సంస్కృత శ్లోకంలో- సుమతీ శతకంలోని తెలుగు పద్యంలోగూడ రచనా శిల్పంలో ఒక సొగసు ఉంది. శ్లోకంలో 'ప్రాంచం గుణం' అనీ తెలుగు పద్యంలో వెనుకటిగుణం అని సూచ్యార్థ సూచకంగా కవి వదలిపెట్టాడు గాని ఆ వెనుకటిగుణం వాచ్యంచేసి చెప్పలేదు. చెప్పనక్కరలేదు. చెప్పగూడదు. చెప్పితే అది జుగుప్సావహం.

అయితే- సంస్కృత ఈ శ్లోకంలో ఈ పద్యంలో ప్రసక్తమైన "ఉల్లిగడ్డ" - "శునకం" కేవలం అన్యాపదేశాలు మాత్రమే లోకంలో ఇటువంటి బాపతు మనుష్యులు ఉంటారు సుమా! జాగ్రత్త అనే హెచ్చరిక వీటిలో అంతర్గర్భితంగా ఉంది.

అయితే ఇక మానవుడు పుట్టినప్పటి నుండి చచ్చిపోయే వరకు మారడా? విద్య పెంపకం పరిసరాల ప్రభావం మానవుల మీద ఉండదా? ఉండదని పై శ్లోకంగాని పై పద్యంగాని పిడివాదం చేయటంలేదు.

## వెలుగుబాట

డా॥ వండూరి రామకృష్ణమాచార్య

మనిషి - మారడు. విద్య - పరిసరాలు సంస్కారం అంతా పై పై పూత మెరుగులే అని వాదించే వారు లేకపోలేదు.

సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు
" Man is a saint when inspired
' and a criminal when compelled"

అని అన్నారు. "భవ్యప్రేరేపణ లభించినపుడు మానవుడు యోగికావచ్చు. ప్రతికూల పరిస్థితులవల్ల పాపికావచ్చు" అని ఆయన భావం.

వివేకానంద మహర్షి. Religion awakens the Divinity already in man" అంటారు.

అసలు ప్రతిమనిషిలో వాసనారూపంలో బీజప్రాయంగ "ఎన్నోగుణాలు" ఉంటాయి. మానవత్వం, అటు దివ్యత్వానికి ఇటు పశుత్వానికి మధ్య కదలుతూవుండే ఊయెల ఊపు.

ప్రపంచ చరిత్రలో ఎందరో భోగులు విరాగులైన యోగులుగా మారారు. దొంగలు దివ్యులుగా మహర్షులుగా మారారు.

యోగియగును మనిషి ఉత్తేజితుండైన !
పరిసరాలబట్టి పాపియగును !!
చదువు- చుట్టునున్న సాంఘిక స్థితిగతుల్
మనిషి మనసు- నడత- మలచగలవు.

అనే వారూ ఉన్నారు. ఇక రెండు వాదాలు సమీక్షించవచ్చు.

మొట్టమొదట ఉదహరించిన శ్లోకానికి స్వేచ్ఛానువాదం

పాదు తడువవచ్చు పన్నీటి జల్లుతో !
నింపవచ్చు కర్పూరంపు ధూళి !
చల్లవచ్చు పునుగు జవ్వాది - కస్తూరి !
మారి ఉల్లి గుణము వేరుగాదు.

అయితే- యీ వాదానికి పూర్వపక్షం నెలకొల్పుతూ చెప్పదగినమాట ఒకటిఉంది.

జనన మందినపుడు జనులెల్ల శిశువులే
పుణ్యుడెవడుగాడు పుట్టగానె !
పుట్టుపాపి ఒకడు పుడమిపైననులేడు
మనిషి గొప్పఋషిగ మారవచ్చు"

వచ్చే నెలలో చదవండి !

**శాంతము లేక సౌఖ్యము లేదు!**





ఆంధ్రదేశమున, తూర్పుగోదావరిజిల్లా, కొత్తపేట తాలూకాలో, శ్రీ జగన్మోహినీ కేశవస్వామి ఆలయాన్ని తన గర్భమున దాచుకొని, ఎందరికో దర్శన భాగ్యాన్ని కల్గిస్తూ, భక్తులను పునీతులను గావిస్తున్న ర్యాలీ గ్రామం, రావులపాలెంకు 6 కి. మీ. దూరంలో పడమటి వైపున ఉంది. ఈ జగన్మోహినీ దేవాలయం భక్తులకు ముక్తి ప్రదాన క్షేత్రంగా ఆంధ్రదేశంలో ప్రసిద్ధి గాంచింది. రాజగోపురంతో, అంతరాలయంతో, గర్భగుడితో అలరారే ఈ దేవాలయంలో వెన్నవలె నునుపుగా, మృదువుగా చెయ్యివేస్తే జారిపోయే సాలగ్రామశిల, అద్భుత శిల్పకళా సంపదతో విరాజిల్లుతూ, చూడముచ్చటగా చూపరులను ఆశ్చర్య చకితులను చేసే విధంగా వుంది. ఈ విధమైన నునుపుచేత చెక్కబడిన శిల్పం ఆంధ్రలో మరెచ్చటనూ కానరాదు.

ఈ దేవాలయంలోని విష్ణుమూర్తి శంఖ, చక్ర, గదా పద్మములతో నిలిచియున్నాడు. విగ్రహ శిల్పమును బట్టి ఇది కాకతీయుల కాలమునాటిదని చెప్పవచ్చు. ఈ విగ్రహం చక్కని నల్లరాతిపై చెక్కబడింది. ఈ శిలనే, సాలగ్రామ శిలయని అంటారు. ఇటువంటి శిల ఆ ప్రాంతమున దొరకనందున దీనిని ఎచ్చటనుండో తెచ్చి, ఇచ్చట చెక్కబడినట్లు మనం భావించవచ్చు. విగ్రహం వెనుక భాగాన స్త్రీ మూర్తి కన్పిస్తుంది. ఆమెయే జగన్మోహిని. దేశంలోని ఇతర కాకతీయశిల్పాలతో పోల్చి చూచిన, ఈ విగ్రహ శిల్పచాతుర్యం అత్యున్నత స్థాయికి చెందినదని చెప్పవచ్చును. అన్ని భాగములు 'మానసార' ప్రమాణమును అనుసరించి యున్నవి. ఈ దేవాలయం ఎదురుగా ర్యాలీగ్రామంలోనే ఒక శివాలయం వుంది. ఇదికూడ చాలా పురాతనమైనదే. ఇది చోళుల కాలంనాటిదని కొన్ని ఆధారాలవల్ల తెలుస్తుంది.

క్రీ.శ. 1916 సం॥నకు పూర్వం ఈ దేవస్థానం అర్చకుల స్వాధీనంలో వుండేది. ఆ తరువాత ర్యాలీగ్రామ వాస్తవ్యులైన శ్రీ వెంకట నరసింహరాజుగారు, వెంకట రత్నంగారు రాజమహేంద్రవరం (రాజమండ్రి) జిల్లా కోర్టులో దావావేసి మద్రాసు హైకోర్టు ద్వారా స్వామివారి స్థిర, చర ఆస్తులను స్వాధీనం చేసుకొన్నారు. తరువాత 1944 సం॥ము నుండి ఎండోమెంట్స్ డిపార్టుమెంట్ వారిచే నియమింపబడిన ధర్మకర్తలు, కార్యనిర్వహణాధికారుల ద్వారా ఈ దేవాలయం బాగోగులు చూడబడుతున్నాయి.

## స్థలపురాణం

పూర్వం దేవతలు, దానవులు పాలసముద్రమును మథించగా అమృతం ఉద్భవించిన సంగతి అందరికి తెలిసిందే. అమృతం కొరకు దేవదానవులు కయ్యానికి కాలుదువ్వగా, విష్ణువు మోహినీ రూపాన్ని దాల్చి, అమృతాన్నంతా దేవతలకే పంచిపెట్టి, దానవులకు ఏమీ మిగల్చలేదు. ఆ సమయంలో సుందర, సుకుమార ముగ్ధ మోహినీ రూపాన్ని చూచిన ఈశ్వరుడు ఆమె లావణ్య, హావ భావ చేష్టలకు ముగ్ధుడై, కామోద్రేకంతో కౌగిలించుకోబోయాడు. మోహిని బెదిరి, తత్తరపాటుతో పరుగెత్తనారంభించింది. ఈశ్వరుడు ఎలాగైనా మోహినిని ఒక్కసారి ఆలింగనం చేసుకోవాలనే పట్టుదలతో ఆమెను వెంబడించాడు. ఇద్దరూ లోకాలన్నీ తిరిగి, తిరిగి, అలసి చివరికి రత్నపుర ప్రాంతాన్ని చేరగానే మోహిని జడలోని ఒక పూవు రాలి

# జగన్మోహిని ఆలయం

— శ్రీ చేగిరెడ్డి సత్యనారాయణరెడ్డి




క్రిందపడేసింది. వెంటనే ఈశ్వరుడు ఆ పూవును అందుకొని, దాని సువాసనను పీల్చి, తన్మయుడై మోహినీ రూపాన్ని చూశాడు. ఎదురుగా విష్ణువు ప్రత్యక్ష మయ్యాడు. ఈశ్వరుడు సిగ్గుపడి, అవ మాన భారంతో తలవంచుకొని, కైలాసానికి పోవటానికి మనస్సు ఒప్పుకోక, అచ్చటనే లింగస్వరూపుడై అవిర్భవించబోయాడు. అపుడు బ్రహ్మ తన కమండలం ఆధారంగా 'ఉమా కమండలేశ్వర స్వామి' అను పేరుతో శివలింగాన్ని ప్రతిష్ఠింపజేశాడు. అదియే నేటి ర్యాలీ గ్రామంలోని శివా లయం.

## శ్రీ జగన్మోహిని, కేశవస్వామి ఆలయ వర్ణన

శ్రీ జగన్మోహిని, కేశవస్వామి దేవా లయం రాజగోపురమంతా. అంతరాల యంతో, గర్భగుడితో, చుట్టూ ప్రహరీ గోడతో అందంగా తీర్చిదిద్దబడివున్నది. రాజద్వారంనుండి లోనికి ప్రవేశించగానే ముఖమండపంలో ఎడమవైపున శ్రీదేవి ప్రతిమ. కుడివైపున భూదేవి ప్రతిమ వెండి తొడుగులతో పాటు మకరతోరణాలతో, ఉత్తరం వైపు శ్రీరమా సత్యనారాయణ స్వామి ప్రతిమలు చక్కగా అలంకరించబడి వున్నాయి. దక్షిణం వైపు ఖాళీగది వున్నది. దానిని 'స్టోర్‌రూమ్'గా ఉపయోగించు కొంటున్నారు. ముఖమండపం నుండి లోనికి పోయే ద్వారానికి అటువైపు, ఇటు వైపు జయ, విజయులు అనే ద్వారపాల కులు చూడముచ్చటగా వున్నారు. ఈ మంటపంలో నాలుగు భూగర్భ స్తంభాలు వుండటం గమనించదగ్గ విషయం. ముఖ మంటపద్వారానికి పైభాగాన శేషశాయిపై విష్ణువు, లక్ష్మి చెక్కబడి వున్నారు. అంత రాలయంనుండి లోనికి వెళ్ళగానే గర్భ గుడి సాక్షాత్కరిస్తుంది. ఇందులోనే శ్రీ జగన్మోహిని, కేశవస్వామి దివ్యమూర్తి ప్రతిష్ఠింపబడింది.

## విగ్రహ వర్ణన

ఈ దివ్యమూర్తి విగ్రహం 5 అడుగుల ఎత్తు, 3 అడుగుల వెడల్పుతో జీవకళ వుట్టి పడేలా వుంది. ఇది ఏకశిలా విగ్రహం. సాలగ్రామ శిల. ఇది ఒకరిచేత తయారు చేయబడినది కాదని కొందరు భావిస్తు న్నారు. ఈ విగ్రహం ముందుభాగాన పురుషరూపం, వెనుక స్త్రీరూపంతో ప్రకా శిస్తున్నవి. విష్ణువు శిరస్సుపై కిరీటము, నుదుట ఎరుపు, తెలుపుల నామము (ఇది మధ్యలో చేర్చబడినది), చెవులకు మకర కుండలములు, మెడలో కౌస్తుభమణిహారము, వనమాల, రత్నహారములు గలవు. విష్ణువు చతుర్బాహువులయందు శంఖము, చక్రము, గద, పద్మము వున్నాయి. అయితే ఎడమ చేతిలో వున్న చక్రము, అభయహస్తంలోని పద్మం ప్రస్తుతం లేవు. అలాగే విష్ణువు ముక్కుకూడా కొంచెం దెబ్బ తిన్నది. నాభిస్థానమున ధోవతికట్టు



ఉత్తరీయం, భుజముల యందు అంగద, కేయూర, కంకణ, రత్నాంగుళీయకములు, నిగ నిగలాడు పట్టుబట్టలపై చిరుగంటల మొలత్రాడు మనోహరంగా చెక్కబడి వున్నాయి. అభయహస్తంలో రేఖలు స్పష్టంగా వుండటం ఒక విశేషం. ఎడమ చెయ్యి క్రింది భాగంలో గద, నాలుగు వ్రేళ్లకు నాలుగు ఉంగరాలు, స్పష్టంగా మానవుని బోలిన గోళ్ళు అద్భుతంగా చెక్కబడినాయి. హస్తమందలి ప్రతిభాగం సజీవతతో ఉట్టిపడుతూ, విశ్వమందలి సర్వ లావణ్యం అందులో ఇముడుకొన్నదేమో నన్న సందేహం ప్రతి కళాకారుడికి కల్గుతుంది.

విష్ణువుకు కుడివైపు క్రిందిభాగంలో శ్రీదేవి, ఎడమవైపున భూదేవి, శ్రీదేవి ప్రక్కగా కుడివైపున రుక్మిణీదేవి, భూదేవి ప్రక్కన సత్యభామ, పాదముల దగ్గర గరుత్మంతుడు చేతులు జోడించి నమస్కరిస్తున్న భంగిమలో స్పష్టంగా కన్పిస్తారు. రెండు పాదముల మధ్యన ఎప్పుడూ నీరు స్రవించటం మహాద్భుతం. మరి ఈ నీరు ఎలా జనిస్తుందో, దాని మాహాత్మ్యమేమిటో ఎవరికీ అంతుపట్టడంలేదు. విష్ణువు పాదోద్భవగా గంగ పుట్టిందని ప్రతీతి. పాదముల క్రింది భాగంలో భక్తులు పాద సేవ చేయుచున్నట్లుగా, ఉభయ పార్శ్వములయందు దేవాలయం, శిఖరం, ఆలయంలో కేశవ స్వామి స్పష్టంగా చెక్కబడినారు. శ్రీకృష్ణుడు పొన్న వృక్షంమీద వున్నట్లుగా, గోవర్ధన పర్వతం ఎత్తుతున్నట్లుగా, వాటి పైభాగమున తోరణంవలె మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, పరశురామ, శ్రీరామ, బలరామ, బౌద్ధ, కల్కిమూర్తుల దశావతారములు అద్భుతంగా మలచబడ్డాయి. పైభాగాన తుంబురుడు, నారదుడు వీణాగానం చేయుచున్నట్లుగా, కిన్నర, కింపురుషులు స్వామికి పుష్పమాలను వేయుచున్నట్లుగా, ఆదిశేషుడు పడగవిప్పి స్వామిని సేవించుచున్నట్లుగా, అతిచక్కగా, ముద్దుగా, అందంగా మలచబడ్డాయి.

ఇక స్వామి వెనుక వైపున మోహినీ రూపంతో స్త్రీరూపం ఎంతో సహజంగా, సుందరంగా కనులు చెదిరే విధంగా వుంది. గోచిపోసి చీరకట్టు, రవిక కట్టుకున్నట్లుగా దాని అంచు, పమిటచెంగు వెనుక భాగాన వ్రేలాడటం, చేతులకు దండపట్టీలు, శిఖ చుట్టి పారిజాతపూవును అలంకరించుకొనటం ఈ ప్రతిమ యొక్క ప్రత్యేక అలంకారాలు. కుడికాలు తొడమీద పుట్టుమచ్చ స్పష్టంగా, చూపరులను కించిత్ సంభ్రమాశ్చర్యాల్లో ముంచెత్తే విధంగా వుంది. ఇది పద్మినీ జాతిస్త్రీల శుభలక్షణమని శాస్త్రాలు చెప్తున్నాయి. పాదములకు అందెలు, పావ గజ్జెలు అలంకారయుతంగా వున్నాయి.

ఏదినమైనా ఇందలి శిల్పచాతుర్యం అద్వితీయం. అతిరమ్యం; ఈ శిల్పాన్ని వర్ణించడం ఎవరికైనా శక్తికి మించిన పని అందలి కళారమ్యతను చూసి, ఆనందించవలసిందేగాని వర్ణనను మాత్రం ఎంత చెప్పినా కొంత కొరతగానే మిగిలిపోతుంది. సుందర పూరితమగు ఈ శిల్పకౌశల్యం ఒక్క ఆంధ్రదేశంలోనేగాక, భారతదేశ చరిత్రలోనే అపూర్వమైనదిగా భావించవచ్చు.

**శివాలయం :**

శ్రీ జగన్మోహిని - కేశవస్వామి దేవాలయానికి ఎదురుగా కొద్దిదూరంలో శివాలయం వుంది దీనినే ఉమాకమండలేశ్వర స్వామి ఆలయం అని కూడా అంటారు. ఈ ఆలయం గర్భగుడితో, అంతరాలయంలో, ముఖమండపంతో, రాజద్వారంతో చూడ చక్కగా వుంది. ద్వారముఖానికి అటువైపు ఇటువైపు ద్వారపాలకులు విజయేశ్వరుడు, భృంగీశ్వరుడు వున్నారు. అంతరాలయం కుడివైపున అర్ధనారీశ్వరుని శిల, గణపతి ప్రతిమ మనోహరంగా వున్నాయి. ఎడమ వైపున శంకరాచార్యుడు, కాలభైరవుడు, గణపతి, లక్ష్మీగణపతి విగ్రహాలు అమర్చబడివున్నాయి. గర్భగుడిలో 1 మీటరు ఎత్తుగల శివలింగం ప్రతిష్ఠించబడివుంది. దీనిపై భాగాన పొక్కులు వున్నాయి. అక్కడి పూజారుల కథనం ప్రకారం, చోళ రాజుల కాలంలో కందకం త్రవ్విస్తుండగా శివలింగం బైటపడిందని, అది గునపాల, పారల దెబ్బలకు పొక్కులు పోయిందని, తెలుస్తుంది. ఈ ఆలయానికి సోమసూత్రము లేదు. లింగాన్ని ఎంత అభిషేకించినా మునగదు. నీరంతా గర్భాలయంలోనికి ఇంకిపోతుంది. ఇలాంటి సోమసూత్రం లేని ఈశ్వరాలయం భారతదేశంలోనే మరెచ్చటనూ లేదు. అంతేగాకుండా జగన్మోహినీ దేవాలయం ఎదురుగా ఈశ్వరాలయం కూడా భారతదేశంలో ఎచ్చటనూ లేదు. గర్భగుడికి కుడివైపున నవగ్రహ ఆలయం, శనీశ్వర ఆలయం వున్నాయి. వీరికి ఎదురుగా కుమారస్వామి ఆలయం వుంది.

ఏమైనా, ఈ రెండు దేవాలయాలు చరిత్రలో ఎంతో ప్రసిద్ధిచెంది, వేలాది భక్తులకు సమస్తమైన కోరికలను అనుగ్రహిస్తూ, భక్తులకు ముక్తి దాయకమైన క్షేత్రంగా పేరుపొంది. ర్యాలీ గ్రామంలో వెలసియుండటం వారుచేసుకొన్న మహా పుణ్యం.



## శాలగ్రామ లక్షణమ్

[మూలము: సంస్కృతం: తెలుగు అనువాదం శ్రీ పి. హనుమంతరావు, ప్రాప్తిస్థానము: శ్రీ పి. హనుమంతరావు, పైరెడ్డిపల్లె, SO Pin 517 415, పలమనేరు తాలూకా, చిత్తూరు జిల్లా, ఆం. ప్ర. వెల : రూ. 10 పుటలు సుమారు 150]

'శాలగ్రామ లక్షణమ్' అనే ఈ సంస్కృత మూలగ్రంథం పురాణసంకలితం. ఇందులో శాలగ్రామముల ద్వారం, మానం, క్షేత్రం, మూర్తిలక్షణం, రూపం, అవయవాలు, రంగు, శాలగ్రామాల భేదాలు, వాటి గ్రాహ్యాగ్రాహ్యఫలాలు వగైరా వగైరా చెప్తానని గ్రంథకర్త ప్రతిజ్ఞ.

"హిమగిరికి దక్షిణంగా, గండకీనదికి ఉత్తర తీరంలో విష్ణుసాన్నిధ్యంగల క్షేత్రముంది. ఇది ఉత్తమోత్తమం. అతి విస్తృతం. అనేక తీర్థాల కూడలి. అక్కడ బ్రహ్మ నిర్మించిన బ్రహ్మనదీ తీర్థమందు, దానికి వుత్తరంగా మహాశృంగంలో విష్ణుప్రీతికరాలైన, చక్రాంకితాలైన శాలగ్రామ శిలలున్నయ్" అని ఆరంభించి శాలగ్రామ క్షేత్రం పుట్టుపూర్వోత్తరాలు తొడగి బహువిధాలైన శాలగ్రామశిలల్లోని మూర్తి భేదాలూ, వాటిపేర్లూ, రంగూ, ఆకారమూ మంచీచెడ్డా అంతా కూలంకషంగా నిరూపిస్తుంది గ్రంథం.

శాలగ్రామ శిలోత్పత్తిని గూర్చి పలు రకాల కథలున్నాయ్ 1. మోహినీ-శివుల కామక్రీడా సమయంలోని చెమట చుక్కల్నించి గండకీనది పుట్టింది. అందు వజ్రకీటాలు పుట్టాయి. ఈ కీటాలవల్ల ఏర్పడినవే శాలగ్రామశిలలు. (స్కాందపురాణము) 2. శాలగ్రామమంటే గండకీనది లోని విష్ణు స్వరూపమైనరాయి. సతీతులసిని, ఆమె భర్తరూపంతోవచ్చి, వంచించి, విష్ణువామెతో రమిస్తాడు. ఇది తెలిసిన తరువాత తులసి విష్ణువును శపిస్తుంది. తత్ఫలితంగా విష్ణువు శిల ఔతాడు. అతడు శివుణ్ణి వేడుకుంటాడు. అతడు 'తులసి గండకీనది ఔతుందనీ, అందులో విష్ణువు శాలగ్రామశిలారూపంగా తప్పక వెలిస్తావనీ చెప్తాడు. (శివపురాణము) 3. గండకి పూర్వజన్మలో వేశ్య. ఆనాటి వేశ్యాధర్మాన్ని చక్కగా పాటించడంవల్ల పతివ్రతగా పేరెన్నిక గన్నది. ఒకసారి ఒకవిధాన కారణంగా శ్రీ విష్ణువే ఆమె పాతివ్రత్యాన్ని పరీక్షించడానికి పూనుకొంటాడు. అంతట అతి సుందరాకారుడై విటుడై గండకి ఇంటికి పోయి, శరీర సుఖాన్ని అర్థిస్తాడు. ఆమె ఒడబడుతుంది. అది మొదలు ఆమె సీతాసుమిత్రాదులవలె పతినే దైవంగా ఆరాధిస్తుంది. కాని, విష్ణువు అతికురూపిగాను, రోగాల పుట్టగాను సంకల్పమాత్రంతో మారిపోతాడు. ఒంటినిండా వ్రణాలు రసికారుతుంటాయి. దుర్భర దుర్గంధం! ఆఖరికి భయంకర కుష్ఠురోగిగా మారుతాడు

## గ్రంథసమీక్ష

అయినా, ఆ గణికాలలామ పరమ సాధ్విగా, ఎంతమాత్రం చీదరించుకోకుండా తన ప్రియుడికి స్నానానులేపనాది సకలోపచారాలూ చేస్తుంది. చివరకు భోజనవేళ కుష్ఠువల్ల కుళ్ళిన వేళ్ళు ఊడి విస్తట్లో పడతాయి. అయినా ఆవిడ ఏవగించుకోకుండా వ్రేళ్ల ప్రక్కకు నెట్టి ఆ విస్తట్లోనే తాను భోజనం చేస్తుంది. ఆ రాత్రి సహశయ్యతో శరీరసుఖాన్ని కూడా అతని కిస్తుంది. అబ్బా ఎలాంటి అగ్నిపరీక్ష! ఈ విధంగా ఎంతమాత్రమూ జుగుప్స లేకుండా చేసిన ఆమె పరిచర్య అందుకొని, పరమ సంప్రీతుడౌతాడు శ్రీమన్నారాయణుడు. గండకి పరీక్షలో నెగ్గింది. అప్పుడు శ్రీహరి ఆమెను వరం కోరుకొమ్మంటాడు. ఆమె నీవు నా కడుపువంటగా నా కొడుకై పుట్టాలని కోరుకుంటుంది. అందుపై విష్ణువు 'ఈ జన్మలో కాదు. మరుజన్మలో నీవు గండకి నదిగా అవతరిస్తావు. అప్పుడు శాలగ్రామ రూపంలో నీ కడుపునిండా బిడ్డలుగా ఆవిర్భవిస్తాను'. అని ఆమెకు వరమిస్తాడు విష్ణువు. ఈ కథ ఒకటి ప్రచారంలో ఉంది. ఈ శిలలే పూజింపదగిన ఆరాధింపబడే శాలగ్రామాలు.

శాలగ్రామం అని ఒక గ్రామం ఉంది. దాని ప్రాంతంలో గండకీనది ప్రవహిస్తోంది. ఇది గంగానదిలోపోయి చేరుతుంది. ద్వారకలో దొరికే చక్రచిహ్నితాలైన శిలలు పూజకు అతి ప్రశస్తాలు. మొత్తంమీద అయిదు రకాల శిలలు పూజావిధానంలో కనిపిస్తాయి. 1. శివపూజకై నర్మదానదిలో దొరికే బాణలింగాలు, 2. విష్ణుపూజకై శాలగ్రామాలు, 3. దుర్గాదేవి పూజకై లోహసమ్మిశ్ర శిలలు 4. సూర్యార్చనకై స్ఫాటికలింగములు, 5. గణేశ పర్చింప రక్తవర్ణ శిలలు ఇలా శాలగ్రామ వృత్తాంతాలు లభిస్తాయి.

వృద్ధహారీతాది స్మృతుల ప్రకారం శాలగ్రామాలు ద్విజులు మాత్రమే పూజించాలి. కాని పూజాప్రకారం మాత్రం పురాణవచన ప్రామాణ్యంతో స్త్రీ-శూద్రులుకూడా వాటిని తాకకుండా పూజచేయవచ్చని అనుమతించింది. ఈ శాలగ్రామారాధన చాల ప్రాచీనం. లోహ నిర్మిత విగ్రహాలు పూజించాలంటే అది చాలా శ్రమసాధ్యం. పాటించవలసిన ఆచారం అతిహెచ్చు. ప్రాణప్రతిష్ఠాది తతంగం ఎంతో ఉంది. ధన-ప్రయాససాధ్యం. సాలగ్రామశిలకు ఆ అవసరంలేదు. ఆవాహన ప్రాణప్రతిష్ఠాది నిరపేక్షంగానే అందులో విష్ణుమూర్తి నిత్య సన్నిహితుడు. ఈ సంగతి శ్రీ శంకరాచార్యులవారు తమ భాష్యంలో పలుచోట్ల 'ఏవ మదీయస్త్వాది గుణగణోపేత ఈశ్వర స్తత్ర హృదయపుండరీకే నిచాయ్యోవ ద్రష్టవ్య ఉపదిశ్యతే యథా శాలగ్రామే హరిః (సూత్రభాష్యం) యథా శాలగ్రామే విష్ణుస్సన్నిహిత ఇతి తద్వత్ అనీ పేర్కొంటారు. ఒక్కవేళ ఏదైనా మైలతాకినా ఆవుపాలతో అభిషేకం చేస్తే శాలగ్రామానికి ఆదోషం పోతుంది. అల్పసంప్రోక్షణో, మహా సంప్రోక్షణో, అక్కరలేదు. ఇదీ ఇందులో సౌకర్యం, సౌలభ్యం. ప్రతి

గృహస్థూ ప్రతినిత్యం దేవతారాధన చేసుకొని శాలగ్రామతీర్థం పుచ్చుకొని తీరాలి. పెద్ద పెద్ద దేవాలయాలలోకూడా సాలగ్రామాలు ఉండితీరాలి. వాటికే నిత్యాభిషేకం. శాలగ్రామ శిలాస్పర్శాత్ కోటిజన్మాఘనాశనమ్ (బ్రహ్మవైవర్తం, ప్రకృతిఖండం, 19 అధ్యాయం) కోటిజన్మల్లో సంపాదించుకొన్న పాపపుంజాన్ని పటాపంచలుచేసి కడకు మోక్షం ప్రసాదించే శాలగ్రామ ప్రాముఖ్యం అందరికీ తెలిసిందే. కాబట్టి శాలగ్రామ వృత్తాంతం పాద్మ పురాణం పాతాళ ఖండంలో (2 అధ్యాయాల్లో) ఉత్తరఖండంలో (ఒక అధ్యాయంలో), మేరుతంత్రంలో (5వ పటలం) గరుడ పురాణంలో (3 అధ్యాయాలు) వామన పురాణంలో (5 అధ్యాయాలు) శివ పురాణంలో, స్కాందంలో, బ్రహ్మవైవర్తంలో, మహాభారతంలో ఇకా పలుతావుల ఉంది. అట్టి పరమాత్మ స్వరూపాలైన శాలగ్రామ శిలలూ పరమాత్మ స్వరూపం లాగే పలుతీరులు. వాటినిలక్షణయుక్తంగా తెలుసుకోవడం ఆస్తికులందరికీ కర్తవ్యం.

శాలగ్రామ లక్షణాలు ప్రత్యేకంగా తెలిపే సంస్కృత గ్రంథాలు కొన్ని ఉన్నా అవి ఇప్పుడు దుర్లభాలు. దొరికినా అవి సంస్కృతంలో ఉంటై. సంస్కృతం రాని తెలుగువారి కవి కొరకరాని కొయ్యలు. ఈ సంగతి బాగా పసికట్టిన శ్రీ వి. హనుమంతరావుగారు తెలుగు లిపిలో సంస్కృత శ్లోకాలూ, దానికి తెనుగు అనువాదమూ వ్రాసి ప్రచురించాలని సంకల్పించి నెరవేర్చారు. ఈ సంకల్పం దొడ్డది. దీనితో గ్రంథ దౌర్లభ్యమూ సంస్కృత భాషా దుర్బోధత్వమూ పరిహరించినట్లే. దీనికై తిరుమల తిరుపతి దేవస్థానమువారూ, ఇతరులు దాతలు కొందరూ ధన సాహాయ్యం చేశారు. ఇట్టి అనువాద గ్రంథం ఈ జాతిలో మొదటిదే. ఉపకర్తలైన పైవారందరూ అభినందనీయులు.

కాని, ఈ గ్రంథానువాద - ప్రకాశనాల విషయంలో కావలసినంత శ్రద్ధ చూపకపోవడం విచారకరం. ముందుగా సంస్కృత మూల గ్రంథాల్ని దొరికినన్ని సంపాదించి సంప్రదించాలి. ఆ ప్రకారంగా గుణదోష విచారపూర్వకంగాసాధుపాఠనిర్ణయం చేసుకోవాలి. మూలం అవగతం చేసుకోవాలి. సందేహం తీర్చుకోవాలి. ఆఖరున మంచి భాషలో అనువదించాలి. ఈ జాగ్రత్తలేవీ రచయిత తీసుకున్నట్లు కన్పించలేదు. శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం-ప్రాచ్య భాషాపరిశోధన - గ్రంథాలయంలో గూడా దీనికి సంబంధించినవి తొమ్మిది తాళపత్ర ప్రతులున్నాయి. సంస్కృతభాషా-సంప్రదాయం తెలిసినవారితో సంప్రదించియుండవలసింది. ఈ అనువాద గ్రంథం అనేక విధాలుగా తప్పుల తడకగా తయారైంది. అది రచయితకూ తెలుసు-అనడానికి గ్రంథం చివర ఉండే నాలుగుపేజీల తప్పొప్పులపట్టికే ప్రబలతార్కాణం. వారు దిద్దిచూపినవి చాలా స్వల్పం. ప్రతిపేజీలోనూ పదింటికి పైగానే స్ఖాలిత్యాలున్నాయి. ఒక పంక్తిలోనే ఐదారు తప్పులున్న సందర్భాలుకూడా ఉన్నాయి. తప్పొప్పులపట్టికే తప్పులకుప్ప. ఉదాహరణకు మొదటి పంక్తి చూడండి - ఇలా ఉంది. 'పుట (1), పంక్తి 6, తప్పు - పుతక, ఒప్పు - పలాక'. తప్పు, ఒప్పు రెండూ తప్పులే. గ్రంథంలో 'పులీక అని (తప్పుగా) ముద్రితం అయిందేకాని 'పుతక' అనికాదు. అలాగే ఒప్పైన రూపంగా 'పలాక' అని సూచింపబడింది. 'పులాక' అనే ఉండాలి. స్థాలీపులాక న్యాయం ప్రసిద్ధం.

దొర్లిన తప్పులు పలుతీరులు. ఇష్టదేవతా ప్రార్థన శ్లోకంలోని నృసింహః అనడానికి బదులు 'నృహః' అని ముద్రితం ఐంది. మొదటి శ్లోకం మొదటి పాదంలో తప్పు - 'శ్రీకృష్ణం గోపీనాథమ్' అని. ఇది ఎలా చదవడం? పాదానికి ఎనిమిది అక్షరాలు ఉండాలి. ఇందు ఏడే ఉన్నై. 'శ్రీకృష్ణం గోపికానాథమ్' అనో, 'శ్రీకృష్ణం గోపికానందమ్' అనో ఉండాలి. ఇక రెండో శ్లోకం నాలుగో పాదం, 'గ్రాహ్యాగ్రాహ్యఫలమ్' అని ఉంది. ఎందుకీ గ్రాహ్యాగ్రాహ్యఫలము అనే తద్ధుమా? శాలగ్రామ శిలల్లో కొన్ని గ్రాహ్యాలు, కొన్ని అగ్రాహ్యాలు. గ్రాహ్యశిలలవలని ఫలమూ, అగ్రాహ్యశిలలవలని (దుష్ట) ఫలమూ అని అర్థం. అఫలం కాదు. దానికి తగ్గట్టు మూలం 'గ్రాహ్యాగ్రాహ్యఫలమ్' అని, రెండవది 'గ్రాహ్య' అని హ్రస్వంగా ఉండాలి. 'గ్రాహ్యా' అని దీర్ఘం ఉండరాదు. అంటే అఫలం అని పదవిభాగం ఔతుంది. తరువాత మూడో శ్లోకం, మూడో పాదం చూద్దాం. 'రూపావయవవర్ణాదీన్' అని మూలం. రూపము, అవయవముల వర్ణములను.... అని అనువాదం - వర్ణములను అనడం అనుచితం. రూపము, అవయవములు, వర్ణములు (రంగులు) అని ఉండాలి. ఇలా చూచుకుంటూపోతే ఎంతైనా పెరుగుతుంది కాబట్టి కొన్ని లోపాలు మాత్రం ప్రదర్శిస్తా.

'పూజనీయాః ప్రయత్నేన చతుర్వర్గ ఫలాప్తయే' (పుట 2) - దీనికి అనువాదం 'నాలుగు వర్ణములవారు ఫలప్రాప్తికొరకు' అని. వర్గం అంటే వర్ణమా? ధర్మకామార్థాలకు త్రివర్గమనీ, మోక్షంతో చేరితే చతుర్వర్గమనీ ప్రసిద్ధ సంకేతం. 'త్రివర్గో ధర్మకామార్థైః చతుర్వర్గ సమోక్షకైః' - ఇది గమనించాలి. చతుర్విధపురుషార్థ సిద్ధికై అని వ్రాయాలి. 76వ పేజీలోకూడా 'చతుర్వర్గ ఫలప్రదః=చతుర్వర్గముల వారికి ఫలప్రదమనే ఉంది. వామనమూర్తి లక్షణంలో (పుట 28) "అతసీ పుష్పసంకాశో బిందు నా పరిభూషితః = నల్ల అవిసెపూవు వంటి వాడును, బిందువుచే అలంకరింపబడినవాడును" అనడం సబబు. 'స్పష్ట' అనే శబ్దం చాలాచోట్ల 'స్ఫష్ఠ' అని ముద్రితం. 'దూర్వా' (పుట 34) అంటే గరిక, పచ్చగడ్డి కాదు. 'శాద్వల' అంటే పచ్చిక, గరిక కాదు. (తారుమారైంది) 'రజత' అనే శబ్ద స్వరూపం, రజిత కాదు. పీతః అంటే పసుపు వన్నె, ఆకుపచ్చకాదు. మస్కరివర్ణి

(44 వ పేజీలో)




# ముండకోపనిషత్తు

## ద్వితీయ ముండకం

### ప్రథమ ఖండం

తదేతత్ సత్యం
యథా సుదీప్తాత్ పావకాత్
విస్ఫులింగా స్సహస్రశః ప్రభవంతే సరూపాః
తథాక్షరాత్ వివిధాః సోమ్య ! భావాః
ప్రజాయంతే తత్రచైవాపి యంతి.

సౌమ్యుడా! శౌనకా! బాగా మండుతూన్న అగ్నినుంచి ఒకే ఆకారముగల రవ్వలు వేలకొలదిగా పుట్టినట్టే నాశం లేని ఈశ్వరుని (సంకల్పము) నుంచి జీవపదార్థాలు పుట్టుతూవుంటాయి. మళ్లీ ఆ ఈశ్వరుని యందే కలిసిపోతాయి.

2

దివ్యో హ్యమూర్తః పురుషః
స బాహ్యాభ్యంతరో హ్యజః
అప్రాణో హ్యమనా శ్శుభ్రో
హ్యక్షరాత్పరతః పరః.

ఈశ్వరుడు తేజోమూర్తి. అతని కొక ఆకారం లేదు. తన ప్రకృతి నుంచి పుట్టిన పదార్థానికి పైనా లోపలా ఉంటాడు. పుట్టుకకు మూలం (తల్లీతండ్రీ) లేనివాడు. తనంతట తానే ఉదయిస్తాడు. ప్రాణం లేనివాడు. (అతనికి ప్రాణభయంలేదు) ఏది చెయ్యాలి? ఏది చెయ్యనక్కరలేదు? ఇదా? అదా? అనే సంశయాత్మకమైన మనస్సు లేనివాడు. నిత్యపరిశుద్ధుడు. సృష్టికి పైవాడు.

(సృష్టికి ఆధారమైన ప్రకృతికి అధిష్ఠాన దేవతగా ఈశ్వరుడు ఉంటాడు.)

3

ఏతస్మాజ్జాయతే ప్రాణో
మన స్సర్వేంద్రియాణి చ
ఖం వాయు ర్జ్యోతి రాపః
పృథివీ విశ్వస్యధారిణీ.

సృష్టి కదలికకు ఆధారమైన ప్రాణం ఆ ఈశ్వరుని నుంచే వస్తూంది. అలాగే జీవికి అవశ్యకములైన మనస్సు, ఇంద్రియాలు, భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశం అనే పంచభూతాలున్నూ ఆ ఈశ్వరుని నుంచే పుట్టుతూన్నాయి.

4

అగ్నిర్మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ
దిశశ్శ్రోత్రే వాగ్వివృతాశ్చ వేదాః
వాయుః ప్రాణో హృదయం విశ్వమస్య
పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతాంతరాత్మా.

ఈశ్వరునకు అగ్ని శిరస్సు. సూర్యచంద్రులు కన్నులు. దిక్కులు చెవులు. మనం వింటూన్న వేదాలన్నీ అతని మాటలు. వాయువు ప్రాణం. సృష్టిలో కదిలే- కదలని పదార్థం అంతా అతని హృదయం. ఆ యీశ్వరునిపాదాలు భూమి. ఈ విధంగా ఈశ్వరుడు తానే విశ్వమై వుంటున్నాడు.

5

తస్మాదగ్ని స్సమిధో యస్య సూర్యః
సోమాత్పర్జన్య ఓషధయః పృథివ్యాం
పుమాన్రేత స్సించతి యోషితాయాం
బహ్వీః ప్రజాః పురుషాత్తం ప్రసూతాః.

విశ్వాత్ముడైన యీశ్వరుని నుంచి రూపొందిన పంచభూతాలలో అగ్ని ఆహార పదార్థాల పాకానికి ఆధారమై వుంది. ఆ అగ్నిని కట్టెలువేసి మండించేట్టు సూర్యుడు పగలూ, రాత్రీ మండిస్తాడు.

అంటే ప్రాణి ఆరగించే పదార్థాన్ని ఉడకబెట్టే అగ్నీ, ఆరగించిన పదార్థాన్ని లోపల జీర్ణింపచేసే అగ్నీ ఒక్కటే. ఆ అగ్నికి మరింత ఉష్ణం కలిగించేవాడు సూర్యుడని భావం.

అలాగే చంద్రుని నుంచి వానకురిసి దానిచే ఓషధులు (ప్రాణుల వ్యాపారానికి ఆధారమైన సస్యాలు) పుట్టి పెరుగుతూన్నాయి. ఆ రసమయ పదార్థాలను ఆరగించి పురుషుడు పుష్టికలిగి సృష్టికి కుదురైన స్త్రీ ప్రకృతియందు వీర్యమును చేర్చగా వివిధ జీవుల పుత్పత్తి అవుతూన్నది.

6

తస్మాదృచ స్సామయజూంషి దీక్షా
యజ్ఞాశ్చ సర్వే క్రతవో దక్షిణాశ్చ
సంవత్సరం చ యజమానశ్చ లోకాః
సోమో యత్ర పవతే యత్ర సూర్యః.

ఆ ఈశ్వరునివల్లనే ఋగ్యజుస్సామములు, దీక్ష, సమస్త యజ్ఞాలూ, దక్షిణగా ఇయ్యవలసే పదార్థాలూ, సంవత్సర పరిమితమైనకాలం, యజమానుడు, లోకాలూ, పావనమూర్తులైన సూర్యచంద్రులూ ఆవిర్భవించారు.

(నియమానికే దీక్ష అని సంకేతం. తాను చెయ్యవలసే పనికి కర్మణా మనసా వాచా ఒకే నడత-దీక్ష. యజ్ఞం చేసేవాడు యజమానుడు. వేదాధ్యయనం, దీక్ష, యజ్ఞాలు చెయ్యడం, సంతృప్తిగా దక్షిణ నివ్వడం, సూర్యచంద్రులను ఉపాసించడం- మానవునకు అవశ్యకర్తవ్యములని ముని చెప్తున్నాడు.)

7

తస్మాచ్చ దేవా బహుధా సంప్రసూతాః
సాధ్యా మనుష్యాః పశవో వయాంసి
ప్రాణాపానౌ వ్రీహియవౌ తపశ్చ
శ్రద్ధా సత్యం బ్రహ్మచర్యం విధిశ్చ.

ఆ మూలప్రకృతి నుంచే వివిధ జాతుల దేవతలు, సాధ్యులు, మనుష్యులు, పశువులు, పక్షులు, ప్రాణ, అపానములు, ధాన్యం, యవలు, తపస్సు, శ్రద్ధ, సత్యం, బ్రహ్మచర్యం, శాసనం, సంభవించాయి.

8

సప్తప్రాణాః ప్రభవంతి తస్మాత్
సప్తార్చిష స్సమిధ స్సప్త హోమాః
సప్త ఇమేలోకా యేషు చరంతి ప్రాణాః
గుహాశయా నిహితా స్సప్త సప్త.

ఏడు విధముల విషయజ్ఞానముకలవై, ఏడు విధముల జ్ఞానబోధకములైన వెలు

గుణకలై, బాహ్యజగత్తునందలి విషయం గ్రహించే సప్తేంద్రియాలున్ను (రెండు కన్నులు, రెండు చెవులు, రెండు ముక్కు పుటాలు, నోరు) ఆ ప్రకృతి నుంచే వచ్చాయి.

వీటిని ఆయన ప్రాణినిద్రావస్థలో వున్న పుడు, హృదయమునందును జాగ్రదవస్థలో వున్నపుడు తమ తమ పనులు చెయ్యడము నందును వుంచుతూ వుంటాడు.

లోకములో ప్రతిజీవికి ఇవి జ్ఞానబోధ కములైన ఇంద్రియములై సప్త ప్రాణా లుగా శరీరానికి ఆధారాలై వుంటున్నాయి.

9

అతస్సముద్రా గిరయశ్చ సర్వే
అస్మాత్ స్యందంతే సింధవ స్సర్వరూపాః
అతశ్చ సర్వా ఓషధయో రసశ్చ
యేనైషభూతై స్తిష్ఠతేహ్యంతరాత్మా.

సముద్రాలూ, కొండలు, వివిధములైన నదులు, ఓషధులు, రసము (ఓషధులలో వుండే పోషకపదార్థం) ఆ ఈశ్వరునుంచే వస్తున్నాయి. ఆ రసముచే పెరిగే పాంచ భౌతిక శరీరాలలో ఆ ఈశ్వరుడు అంత రాత్మయై వుంటున్నాడు.

(ఈశ్వరుడే సృష్టికర్త. సృష్టికి కావలసే వస్తువులూ తానే. రూపొందినజీవికి నిత్య వ్యాపారం కలిగించి నడిపిస్తూవుండే యజ మానుడూ తానే. నిద్రావస్థలో యీ శరీ రాన్ని కాపాడే ఆత్మ తానే. ఈశ్వరునకు కానిది తృణమైనా లేదు.)

10

పురుష ఏవేదం విశ్వం కర్మ
తపో బ్రహ్మ పరామృతం
ఏతద్యో వేద నిహితం గుహాయాం
సోఽవిద్యాగ్రంథిం వికిరతీహ సోమ్య!

కంటికి కనిపించే యీ విశ్వము ప్రాణులుచేసే కర్మలు. తపస్సు, ఈశ్వరుణ్ణి చేరడానికి దివ్యసాధనమైన వేదాధ్యయనం ఇదంతా ఆ పూర్ణపురుషుడే. ఆ పురుషుడు నా హృదయములోవున్నాడు అని తెలుసు కున్నవాడు ఈ లోకంలోనే అజ్ఞానం అనే పీటముడిని విప్పుకునే అదృష్టవంతుడౌతాడు.

ఇది ద్వితీయ ముండకమునందు ప్రథమఖండం.

(సశేషము)

# గృహలక్ష్మి

# యశోదాకృష్ణ

శ్రీమతి శిష్ట్లా వసుంధరాదేవి

ఆనాడు ద్రేపల్లెవాడంతా కోలాహలంగా ఉంది. ప్రతి యిల్లు పచ్చని తోరణాలతో, రంగు రంగుల రంగవల్లులతో కలకలలాడుతోంది. ప్రతి ఒక్కరి మోములో ఆనందం తాండవిస్తోంది. కారణం ఆనాడు శ్రీకృష్ణ జయంతి. కంసాది దానవసంహారం కోసం శ్రీ మహావిష్ణువు కృష్ణుడుగా ద్రేపల్లెలో వెలసిన రోజు. తాపసుల తపస్సు ఫలించినరోజు. ధరణి పులకించినరోజు. జగతిలో నవచైతన్యం విరిసిన రోజు. గోపికల కలలు పండినరోజు. యశోద నోములు ఫలించిన రోజు.

అదిగో!! యశోద! తన చిన్నారి పట్టి శ్రీకృష్ణుని ఉయ్యాలలో పరుండబెట్టి తమిదీరని మమతతో జోలపాడుతోంది.

వేయరే ఉయ్యాలలూ
నా తండ్రి యదుకులోద్ధారుడగునూ
పూలమెత్తలు పరచరే ।
నాతండ్రి నందగోపాలునకూ ॥వే॥

పన్నీట జలక మార్చి ।
మేనిపై పట్టుపుట్టము గట్టబెట్టి
బుగ్గపై చుక్కపెట్టి ।
నుదుట సిందూరతిలకమ్ము దిద్ది ॥వే॥

చిరునవ్వు చిందులాడ ।
మోముపై వెన్నెలలు వెల్లివిరియా
నాతండ్రి తొట్టిలో పవళించునూ ।
గగనాన జాబిల్లి తలవంచునూ ॥వే॥

తేజమున రవిని మించు ।
నాతండ్రి చిన్ని మోమును గాంచుచూ
ముద్దులను మూటగట్టు ।
చెక్కిలిని నొక్కిముద్దిడుచుందునే ॥వే॥

ఊపరే ఉయ్యాలలా ।
కన్నుమిన్నకప్పులంబరమెప్పులరామా
జోలపాటలు పాడరే ।
నాతండ్రి ఆనంద శయనమునకూ ॥వే॥

పద్మాలను బోలు కనుదోయితో అందాల జాబిలిని మించు మోముతో, మనోహరమైన చిరునవ్వుతో, జగన్మోహనాకారుడైన చిన్నారి కృష్ణయ్యే యశోద ప్రాణం- అతడే ఆమెలోకం. చిన్నారి కృష్ణుడు ఆడింది ఆట: పాడిందిపాట. నందయశోదల ప్రేమానురాగాలలో అపురూపంగా పెరుగుతున్నాడు నందకిశోరుడు.

అతి పసితనంలోనే పూతనను, శకటాసురుని సంహరించిన పరాక్రమశాలి చిన్ని కృష్ణయ్య.

ఐనా, చిన్నారి కృష్ణుడు చేసే అల్లరి పనులకు అంతులేదు. కృష్ణుని అల్లరిపనులు కొండిచేష్టలు, భరించలేని గోపికలు యశోద దగ్గర మొరపెట్టుకునేవారు—కానీ యశోదకు తన చిన్నారి పాపడు ఇంతలేసి పనులు చేస్తాడా! అని సందేహంకలిగేది. అయిష్టంగానే కృష్ణునిపై కోపగించుకున్నట్లు నటించేది.

యశోద:

వెన్నపాలుపెరుగు ఆరగించే తండ్రీ
మన్నుతినగానేలా చిన్నికృష్ణయ్యా
॥వెన్న॥



కృష్ణుడు:

కమ్మనివెన్నలు మనయింట మెండుగ
మన్నుతినగా నాకు పనియేలనోయమ్మా
॥కమ్మ॥

యశోద:

కల్లలాడుదువేలా కన్నతండ్రీ నీదు
కొంటె కన్నులు నిజము దాచగలేవులే
॥వెన్న॥

కృష్ణుడు:

కల్ల లందువదేలా ఆలించునామాట
దండించబోకమ్మ ఏమి ఎరుగనునేను
॥కమ్మ॥

యశోద:

ఆగుము కన్నయ్యా సాగదునీఆట
మన్నున్నదేమో చూతును నీనోట

అంటూ, వలదు వలదని వారిస్తూ అంద కుండా పరుగెత్తే చిన్నారి కృష్ణుని పట్టి నోరు చూపమని గద్దించింది యశోద. ఇక తప్పు కోలేని కృష్ణుడు తన చిన్ని నోరు చూపిం చాడు. చిన్ని తనయుని నోటిలో పద్నా లుగు లోకాలను చూసిన యశోద దిగ్భ్రాంతి చెంది స్మృతి కోల్పోయింది. నెమ్మదిగా బాహ్యప్రపంచంలోకి వచ్చిన యశోదకు అమాయకంగా నోరు తెరచి నిలుచున్న కృష్ణయ్య కనిపించాడు. అతడు సామా న్యుడు కాడని సాక్షాత్తు ఆదిదేవుడైన శ్రీ మహావిష్ణువని గ్రహించిన యశోద, తన అదృష్టానికి ఆనందపరవశయై అమిత వాత్సల్యంతో కృష్ణుని అక్కున చేర్చు కుంది.

కృష్ణుడు నీలమేఘశ్యాముడు. ఆకాశం రంగు నీలం. ఆకాశం అనంతమైనది. శాశ్వ తమైనది. అలానే తానూ నిత్యుడను, శాశ్వ తుడను అని తెలియజెప్పడానికి ఆ నీలి వర్ణం కలిగి ఉంటాడు కృష్ణుడని పెద్దలం టారు.

శ్యామసుందరుడు దివ్యమోహనమూర్తి అతని అలంకారాలలో వేణువు ముఖ్యమై నది.

చల్లని సాయంత్రపు వేళ నల్లనయ్య గోపికలతో యమునాతీరంలో ఆటలాడే వాడు. తన మురళీగానం వినిపించేవాడు. బృందావనిలోని ప్రతితరువు, ప్రతికొమ్మ, ప్రతిరెమ్మ, ప్రతిపూవు, కాక, పశువులు పక్షులు – ఇంతెందుకు! సమస్త ప్రకృతి ఆ గానవాహినికై అర్రులు సాచేది.

గోపికలు కృష్ణుని వదలి ఒక్కక్షణం ఉండగలిగేవారుకాదు. అల్లరి కృష్ణుడు వారిని ఉడికించడానికి అందందు కన్పించ కుండా దాగేవాడు. గోపికలు తల్లడిల్లే వారు.

ఆపకురామురళీకృష్ణా ఆపకురా రవళీ
॥ఆప॥

పొన్నలుపూచెను పొగడలు విరిసెను
చల్లని తెమ్మెర మెల్లగవీచెను
వెన్నెలకురిసెను యమునయువీచెను
మనసులుపొంగే మధురవేళలో ॥ఆప॥

వేణుగానము విని హాయిహాయని
ఎండిన మోడులు చిగురులువేయును
వడలిన మనసులు సుడలను చిలుకును
ధాత్రీసదనము కలకలలాడును ॥ఆప॥

నిన్నుగానకను మనజాలమురా
నీవులేని మాబ్రతుకే లేదురా
మానసచోరా మము దయగనరా
నందకుమారా నవనీతచోరా ॥ఆప॥

అని గోపికలు కృష్ణుని వేడుకునేవారు. ఐనా కృష్ణుడు వారికి కన్పించేవాడు కాదు. కన్నయ్య జాడ తెలియని గోపికలు ప్రతి చెట్టులో, పుట్టలో వెదికేవారు. కట్టుపుట్టం జారినా జుట్టుముడివీడినా వారికి తెలియదు, వారికి కావలసింది మురళీధరుడు.

కృష్ణుని జత రాధ, రాధ ఆరాధ్యదైవం కృష్ణుడు. రాధే కృష్ణుడు కృష్ణుడే రాధ. రాధామాధవుల బంధం యుగయుగాలకూ చెరగని ప్రేమబంధం.

చిన్నికృష్ణుని బాల్యలీలలు మధుర సుధాభరితాలు. కృష్ణుని ఒక్కొక్క బాల్య చేష్టలో ఒక్కోపరమార్థం తప్పక ఉండి ఉంటుంది. కలవారి ఇండ్లలో పాలు, పెరుగు, వెన్న దొంగిలించి పేదబాలురకు పంచిపెట్టేవాడు చిన్నికృష్ణుడు. అందరితో సమంగా తానూ ఆలమందలు మేపేవాడు. అందరితోకలసి భుజించేవాడు. తనదృష్టిలో పేద గొప్ప తారతమ్యాలు లేవనీ, మానవు లందరూ సమంగా ఉండాలన్న భావం తాను వెన్నను దొంగిలించడంలో కనపర చాడు వెన్నదొంగ చిన్నికృష్ణయ్య.

ప్రాణాలను సైతం లెక్కచేయక కాళింది మడుగులో దూకి కాళీయుని మదమణచిన ధైర్యశాలి చిన్నికృష్ణుడు. గోవర్ధన గిరిని కొనగోటితో ఎత్తి ఇంద్రుడు కురిపించే శిలా వర్షాన్నించి యాదవులను కాపాడిన బలి శాలి బాలకృష్ణుడు.

నల్లనికన్నయ్య అందెలు మ్రోగంగ
గంతులిడుచు రారా మువ్వగోపాలా
॥నల్ల॥

విరిమంజరులు మెడనిండ వేసి
ముదమందెదరా గోపాలా
కాళియమర్దన కనులార నినుగాంచి
తరియింతునురా యదుబాల ॥నల్ల॥

వీనులవిందుగ వేణుగానము
వినిపించర చిన్నిగోపాలా
మందరగిరిధర మౌనమేలరా
రాధా హృదయానంద ముకుందా
॥నల్ల॥

మనసును చిలుకుచు మాటలాడరా
వీనులవిందుగ పాట పాడరా
కన్నులకింపుగ నాట్యము సలుపర
ముదమును కూర్చర ముద్దుగోపాలా
॥నల్ల॥

చిన్నికృష్ణుని చరితం దివ్యామృతం. ఆ అమృతాన్ని గ్రోలే ప్రతి జీవి జీవితం ధన్యం.

★

[13 వ పేజీ తరువాయి]

నారద మహర్షి భక్తుడగు పుండరీకుని యెదలోని వ్యథను, ఆవేదనను గుర్తించినాడు. అతని నుద్ధరింపనెంచినాడు. ఉప దేశింప దలచినాడు. కాని గురువు శిష్యు నకువలె కాదు. మిత్రునివలె బోధింప దలచినాడు. తన అనుభవము నెఱింగించి తద్వారా బోధింపనెంచినాడు. తోడనే పుండరీకు నుద్దేశించి ఇట్లనెను.

"నాయనా! పుండరీకా, నీ హృదయము లోని తపన నాకవగతమైనది. కర్మ బాహుళ్యమువల్లనే యీ సృష్టి వైవిధ్య వైలక్షణ్యములు సంభవించుచున్నవి. అహం కార మమకారములుత్పత్తిల్లుచున్నవి. వీట న్నిటికి కారణము కామమోహములు. వీని నుండి విడివడుటకై నేనును, నీవలెనే యత్నించి తత్తరణోపాయమును తెలుపు డని తొల్లి మా తండ్రిగారి నభ్యర్థించితిని. అంతట సర్వజ్ఞమూర్తియగు ఆ విధాత నాకిట్లుపదేశించిరి.

"బిడ్డా! నారదా! నారాయణుడు సర్వాంతర్యామి. అతడే పరతత్త్వము. జ్ఞానము, బ్రహ్మము, ధ్యేయము, ధ్యాత, సర్వమునాతడే. బాహ్యాంతర జగత్తం తయు నాతని చేతనే పరివ్యాప్తమై పరిఢ విల్లుచున్నయది.

"నారాయణః పరంబ్రహ్మ
తత్త్వం నారాయణః పరః
నారాయణః పరంజ్యోతి
రాత్మా నారాయణః పరః
పరాదపి పరశ్చాసౌ
తస్మాన్నాస్తి పరం మునే"
(నృసింహపురాణము 64/63-64)

ఇంకను—
'అన్తర్బహిశ్చ యత్సర్వం
వ్యాప్య నారాయణః స్థితః'
"ఈశా వాస్యమిదం సర్వం
యత్కిం చ జగత్యాం జగత్"
(ఈశావాస్యోపనిషత్తు.)

అని యీ విధముగా శ్రుతి స్మృతి పురాణములన్నియు నా పరాత్పరుని సర్వవ్యాపి త్వము నుపదేశించు చున్నవి. అట్టి పర మాత్మను జ్ఞానమార్గమున దెలియుట భవ సాగరతరణమునకు సులభోపాయము. కాని తదాచరణము కష్టసాధ్యము. యజ్ఞయాగా ద్యాచరణము, తీర్థయాత్రాది సేవనము మార్గాంతరములు. ఏ మార్గమునను సరించి నను తుదకు గమ్యము శ్రీమన్నారాయ ణుడే.

ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరమ్,
సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి ॥

నదీప్రవాహములన్నియు సముద్రమును చేరునట్లు, సర్వవిధములగు తత్తద్దేవ్య కములగు యజ్ఞయాగాది కర్మజాతమం తయు ఆ పరమ పురుషుని దరికే చేర్చును. అన్నియుర్చనలు నాతని చేరుటకొరకే యుద్దేశింపబడినవి. మఱియు సర్వశాస్త్ర ములును జ్ఞానాంబుధిని మథించి ధ్యేయ మగు నారాయణతత్త్వమునే ప్రబోధించు చున్నవి.

"ఆలోడ్య సర్వశాస్త్రాణి
విచార్య చ పునః పునః ।
ఇదమేకం సునిష్పన్నం
ధ్యేయో నారాయణః సదా ॥
(నృసింహపురాణము 18/31, 64/78)

ఇంకను వేద, రామాయణ, మహాభారతే త్యాదీతిహాసపురాణములన్నింటను ఆది మధ్యాంతములందు హరికీర్తనము చూప ట్టును.

వేదే రామాయణే చైవ పురాణే భారతే తథా.
ఆదావంతే చ మధ్యే చ హరిః సర్వత్ర గీయతే ॥

కావున, నారదా, ఈ సంసారబంధమునుండి ముక్తిని పొందుటకు, మనోవాక్కాయ కర్మలద్వారా నిరంతర నారాయణ స్మర ణముకన్న వేరొక మార్గములేదు.

పితృపాదుల యీ ఉపదేశామృతమును గ్రోలిన మరుక్షణమే నా హృదయ గ్రంథి భిన్నమైనది. నా సర్వసంశయములు పటాపంచలైనవి. నాటినుండి వీతరాగు డనై, నిరంతర నారాయణనామ పరాయ

## అఖిలమ్ మధురమ్

మధురమది యేదనిన అంతయూ మధురమే
మధురమే కృష్ణయ్య మధురమౌ నీ కథలు
మధురమే పాల్వెన్న మధుర మౌ మీగడలు
మదవతుల కనుగప్పి మరి యారగించగా ॥మ॥

మధురమే నీ నగవు మధురమౌ నీ పలుకు
మరులుగొలిపే రూపు మగువలకు విరితూపు ॥మ॥

మధురమే నీ మురళి మధురమౌ ఆ రవళి
మాధవా నీ నీడ రాధ అందెల రవళి ॥మ॥

మధురమే నినుబొగడ మధురమౌ నినుగనిన
మధురమే నిను తలచి మనసు తనువును మరువ ॥మ॥

— పి. యవ్. రంగస్వామి

ణుడై, తద్ద్వారా మా పరాత్పరుని యనుగ్రహమునకు పాత్రుడై, జీవన్ముక్తుడై, స్వేచ్ఛాచారియై ఇష్టానంద స్వరూపుడై యున్నవాడను. మఱియు "నారాయణా! నీవే తప్ప వేరొండు శరణము లేదు. నేను నీకు దాసుఁడను"– అన్న బుద్ధి యే జన్మమున నెవ్వనికుదయించినను వాడు తప్పక విష్ణుసాలోక్యమునందునని చెప్పఁబడినది

'జన్మాంతర సహస్రేషు
యస్య స్యాద్బుద్ధిరీదృశీ।
దాసోఽహం వాసుదేవస్య
దేవదేవస్య శార్ఙ్గిణః।
ప్రయాతి విష్ణుసాలోక్యం
పురుషో నాత్ర సంశయః॥'

ఇట్లు శరణాగతినంది ప్రహ్లాదాంబరీషాది భక్తవరేణ్యులెందరో తరించిరి. కావున ఓ పుండరీకా! నీవుకూడ నా దేవ దేవుని, భక్తవత్సలుని, ఆర్తత్రాణైక పరాయణుని, ఏ సంశయములేనివాడవై శరణు పొందుము. తప్పక తరింపగలవు–అని వచించి యచటి నుండి నిష్క్రమించెను.

తక్షణమే పుండరీకుని యజ్ఞాన ముడిగిపోయెను. జ్ఞానోదయ మయ్యెను.

'భిద్యతే హృదయగ్రంథిః
ఛిద్యన్తే సర్వసంశయాః'

అన్నట్లు ఆతని హృదయ గ్రంథి భేదనమై, సర్వసంశయములు తొలగిపోయినవి. ఇపుడాతనికి నారాయణుడు తప్ప మరెవ్వరును లేరు. సర్వమును విస్మరించి తన హృదయ పుండరీకమున, పుండరీకాక్షుని నిలిపి ధ్యాన సమాధినందెను. క్షేత్ర మాహాత్మ్యము సద్గురూపదేశ ప్రభావము సాధకునకు సత్వర సిద్ధిని సమకూర్చును. ఫలితముగా శ్రీమన్నారాయణుడు అనుగ్రహించినాడు. పుండరీకుని కట్టెదుట నిలచినాడు. కామ్యమును తెలుపుమనినాడు.

పుండరీకుని యవస్థయే వేఱు. అతడాతనిని స్మరించినంతమాత్రముననే పరవశించిపోవును. ఇప్పుడాతడాతని నేమని అడుగగలడు? ఆతని మనస్సు నారాయణుని మూర్తియందే లగ్నమైనది. అన్యమగు కామ్యమాతనికిప్పుడేమియును లేదు. అయినను కామ్యమును తెలుపుమని భగవంతు డాదేశించినాడు. అది యాతనికి పరీక్ష, దేవదేవునికి చిద్విలాసము. పుండరీకుఁ డెట్టకేలకు–

పాపరాధోస్మి శరణం
ప్రాప్తస్త్వాం జగదీశ్వర।
ఇదానీ మమ కంప్యోహం
యథేచ్ఛసి తథా కురు॥

'నారాయణా! నిన్నే శరణు జొచ్చితిని. నీవు నాకేమి సంకల్పింతువో, దానిని నాకనుగ్రహింపుము. నీ అనుగ్రహమే నాకు సర్వస్వము. అదియే నాకు ప్రకామ్యము' అనిమాత్రము అనగలిగినాడు.

ఈ సమాధానమునకు అతీతుడగు శ్రీమన్నారాయణుడు సైతమానందపడినాడు. అనుగ్రహించినాడు. వైకుంఠ పరంధామమున తన పరిషన్మధ్యమున ప్రహ్లాదాది పరమ భాగవతోత్తముల నడుమ నాతనికి శాశ్వతస్థానము నుపకల్పించినాడు. పుండరీకుడిపుడు 14 మంది పరమభాగవతోత్తములలో నొకడై, శ్రీ మహావిష్ణువుయొక్క పార్షదుడై * విష్ణు భక్తులెల్లరకును

ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక భీష్మదాల్భ్యాన్
రుక్మాంగదార్జున వసిష్ఠ విభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమ భాగవతాన్ స్మరామి॥

అని స్మరింపదగిన ప్రాతఃస్మరణీయుడైనాడు.

* (పార్షదుడనగా–'పరిషత్పరిచారకుడు' అని యర్థము)

## శ్రీ వేదనారాయణస్వామి ఆలయం. నాగలాపురం.

* సోమకాసురుని సంహరించి వేదములను బ్రహ్మకిచ్చిన పుణ్యదేశం.

### ఆలయ కార్యక్రమములు

#### ఉదయము

| | |
|---|---|
| సుప్రభాతము | 6-00 గం॥ నుండి |
| | 6-30 గం॥ వరకు |
| విశ్వరూపదర్శనము | 6-30 గం॥ నుండి |
| | 8-30 గం॥ వరకు |
| తోమాలసేవ | 8-30 గం॥ నుండి |
| | 9-00 గం॥ వరకు |
| సహస్రనామార్చన | 9-00 గం॥ నుండి |
| | 9-30 గం॥ వరకు |
| మొదటిగంట, బలి, | 9-30 గం॥ నుండి |
| శాత్తుమొర | 10-00 గం॥ వరకు |
| సర్వదర్శనము | 10-00 గం॥ నుండి |
| | 11-30 గం॥ వరకు |
| అష్టోత్తర నామార్చన | 11-30 గం॥ నుండి |
| రెండవగంట | 12-00 గం॥ వరకు |
| తీర్మానము | మ. 12-00 గంటలకు |

#### సాయంత్రము

| | |
|---|---|
| సర్వదర్శనము | 4-00 గం॥ నుండి |
| | 6-00 గం॥ వరకు |
| తోమాల, అర్చన | 6-00 గం॥ నుండి |
| రాత్రికైంకర్యములు | 7-00 గం॥ వరకు |
| సర్వదర్శనము | 7-00 గం॥ నుండి |
| | 8-45 గం॥ వరకు |
| ఏకాంతసేవ | 8-45 గం॥ నుండి |
| | 9-00 గం॥ వరకు |
| తీర్మానము | రాత్రి 9-00 గంటలకు |

#### ఆర్జిత సేవలు

అర్చన – రూ. 2-00
హారతి – రూ. 1-00

గమనిక: శ్రీ వేదనారాయణస్వామివారి అర్చన టిక్కెట్లు 1980 మే 23వ తేది నుండి మూడురూపాయల నుండి రెండురూపాయలకు తగ్గించడమైనది. భక్తులు గమనించగలరు.

పేష్కారు
స్థానికఆలయాలు

# తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణలు

# తెలుగు

ఆర్షధర్మ వైశిష్ట్యాన్ని వివరించే క్రింది గ్రంథాలను పాఠకులకు అందుబాటు ధరలతో
తిరుమల తిరుపతి దేవస్థాన ప్రచురణ విభాగం అందజేస్తున్నది.

| | | |
|---|---|---|
| ఆచారములు - ఆడంబరములు | శ్రీ కల్లూరి చంద్రమౌళి | 0-20 |
| ఆండాళ్ వైభవము | ,, | 0-20 |
| అహల్య | శ్రీ సాంప్రతి సురేంద్రనాథ్ | 0-50 |
| ఆళ్వారుల దివ్యవైభవము | శ్రీ టి. రాఘవయ్య | 2-50 |
| అన్నమాచార్యులవారి ఆధ్యాత్మ | | |
| శృంగారసంకీర్తనలు (స్వరసహితము) | స్వరరచన: శ్రీ మంచాళ జగన్నాథరావు | 35-00 |
| సంపుటి 1 | సంపాదకుడు: | 35-00 |
| సంపుటి 2 | శ్రీ వాడ్రేవు పురుషోత్తం | 35-00 |
| సంపుటి 3 | | |
| ఆర్షసంస్కృతి | శ్రీ కల్లూరి చంద్రమౌళి | 4-00 |
| అన్నమాచార్య సాహితీకౌముది | డా॥ ముట్నూరి సంగమేశం | 0-75 |
| అన్నమాచార్య చరితం (హరికథ) | విద్వాన్ కనుములూరి శివరామయ్య | 1-50 |
| భక్తపురందరదాసు | శ్రీ ఎస్. బి. ఎస్. భట్టాచార్య | 0-50 |
| భగవత్ స్తోత్రరత్నమాల | | 1-00 |
| భగీరథుడు | కరుణశ్రీ | 0-50 |
| ధ్రువుడు | శ్రీ డి. నాగసిద్ధారెడ్డి | 0-50 |
| దాక్షాయణి | శ్రీ ఆర్.ఎస్. సుందరం | 0-50 |
| దయాశతకము | శ్రీ కోశియాలం శఠకోపాచార్యులు | 9-00 |
| కల్యాణసంస్కృతి | డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్య | 1-75 |
| కోదండరామ సుప్రభాతం | డా॥ ఎస్. బి. రఘునాథాచార్య | 0-50 |
| ఉషశ్రీ భారతం | | |
| 1 వ భాగము | ఉషశ్రీ | 4-00 |
| 2 వ భాగము | ,, | 5-00 |
| భారతీయ తత్త్వశాస్త్రము | డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ గ్రంథానికి | 5-00 |
| | శ్రీ బులుసు వేంకటేశ్వర్లు అనువాదం | |
| హనుమంతుడు | డా॥ ప్రసాదరాయకులపతి | 0-50 |
| మదాలస | శ్రీ సముద్రాల లక్ష్మణయ్య | 0-50 |
| మన సమస్యలకు భగవద్గీత పరిష్కారములు | డా॥ ఎస్. బి. రఘునాథాచార్య | 1-25 |
| మన ఆలయముల చరిత్ర | శ్రీ గోపీకృష్ణ | 7-00 |
| మహర్షులచరిత్రలు | శ్రీ బులుసు వేంకటేశ్వర్లు | 3-50 |
| నమ్మాళ్వార్ | డా॥ పి. శౌరిరాజన్ | 0-50 |
| నాదయోగి త్యాగయ్య | శ్రీ తిరుమూరు సుధాకరరెడ్డి | 1-00 |
| పురుషసూక్తం | డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్య | 1-00 |
| పద్మావతీ శ్రీనివాసం | శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి | 0-20 |

| | | |
|---|---|---|
| పుష్కరవేది | సంకలనం: డా॥ ఎస్. బి. రఘునాథాచార్య | 0_50 |
| ఋగ్వేదం 1వ భాగము | శ్రీ నేమాని వెంకటనరసింహశాస్త్రి | 100_00 |
| 2వ భాగము | | 100_00 |
| శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం | శ్రీ పి. బాలకృష్ణమూర్తి | 0_50 |
| శృంగార సంకీర్తనలు సంపుటం 22 | పరిష్కర్తలు: రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ,గౌరిపెద్ది | 5_00 |
| ,, 23 | శ్రీ పి. టి. జగన్నాథరావు | 5_00 |
| ,, 24 | శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ | 5_00 |
| ,, 25 | ,, | 5_00 |
| ,, 26 | ,, | 5_00 |
| ,, 27 | ,, | 5_00 |
| ,, 28 | ,, | 5_00 |
| శ్రీరామచంద్రుడు | శ్రీ టి. నరసింహాచార్యులు | 1_00 |
| శ్రీ వేంకటేశ్వర శతకం | ముకుందదైవజ్ఞులు | 0_25 |
| స్తోత్రరత్నములు | | 2_00 |
| సువర్ణపుష్పమాల | డా॥ ఎస్. బి. రఘునాథాచార్య | 0_25 |
| శ్రీమద్భాగవత పురాణపరిశీలనము | శ్రీ డి. నాగసిద్ధారెడ్డి | 1_00 |
| శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యం (వచనం) | | 2_00 |
| ,, శ్లోకాలు 1 | | 5_00 |
| ,, శ్లోకాలు 2 | | 4_25 |
| శ్రీసూక్తం | డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్య | 0_70 |
| షోడశరామాయణ రహస్యాలు | శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ | 5_00 |
| శ్రీనివాస బాలభారతి కథామంజరి | | 4_00 |
| సుందరకాండ | ఉషశ్రీ | 4_25 |
| సావిత్రి | శ్రీ సముద్రాల లక్ష్మణయ్య | 0_50 |
| తత్త్వదీపిక | శ్రీ చిన్న శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామి | 0_75 |
| త్యాగరాజకీర్తనలు సంపుటి 1 | సంకలనం: | 35_00 |
| సంపుటి 2 | కళాప్రవీణ శ్రీ మంచాల జగన్నాథరావు | 35_00 |
| సంపుటి 3 | ,, | 35_00 |
| సంపుటి 4 | ,, | 35_00 |
| వేదములు | శ్రీ కల్లూరి చంద్రమౌళి | 0_50 |
| వ్యాసరాయలు | శ్రీ సుదర్శనభట్టర్ | 0_50 |
| వైరాగ్యశతకం | శ్రీ ఏనుగు లక్ష్మణకవి | 0_20 |
| వేదకల్పతరువు | శ్రీ మహావాది వేంకటరత్నము | 5_00 |
| విష్ణుసహస్రనామం | అర్గస్‌సెంట్రల్ ఎంటర్‌ప్రైజెస్ | 1_00 |
| శ్రీ వేంకటేశ్వరస్వామి | ,, | 1_00 |
| బుద్ధిశాలిమంత్రికథలు | ,, | 1_00 |
| హరిశ్చంద్ర | ,, | 1_00 |
| తాళ్ళపాకకవుల కృతులు | డా॥ వేటూరి ఆనందమూర్తి | 30_00 |
| ,, పదకవితలు | ,, | 45_00 |
| వేంకటేశ్వర సహస్రనమ్ | శ్రీ యామిజాల పద్మనాభస్వామి | 3_00 |
| బాలకృష్ణుడు | అమరచిత్రకథా ప్రచురణలు | 2_00 |
| భగవద్గీత | ,, | 2_00 |
| కృష్ణుడు – నరకాసురుడు | ,, | 2_00 |

(9 వ పేజీ తరువాయి)

— పత్ర, పుష్ప, ఫలాదులను భక్తితో ఆ దైవానికి సమర్పించి అనుగ్రహాన్ని పొందుతున్నాము. భగవన్నిర్మితాలైన ఫల పుష్పాదులను భగవంతుడికే అర్పించడాన్ని పూజగా పరిగణిస్తున్నాము.

మన అందరి అంతరంగాలలోను భక్తి నిండి ఉంటుంది. అయితే దాన్ని కామం ఆవహించి ఉంటుంది. దాన్ని నివారిస్తే భక్తి తనకు తానుగా వ్యక్తమవుతుందని వివేకానందస్వాములవారు ప్రవచించారు. ఈ భక్తియే క్రమంగా ఆరాధనా రూపంలోనూ, స్తోత్రరూపంలోనూ వ్యాప్తి చెందింది. భగవంతుడు అగమ్యగోచరుడు. అందువల్లనే ఆతని ప్రతీకలుగా ప్రతినిధులుగా విగ్రహాలను, ప్రతిమలను, చిత్రాలను ఆరాధిస్తున్నాము. సూర్యచంద్రుల్ని సాక్షాత్ దేవుళ్ళుగానే పరిగణిస్తున్నాము. ఏరులు, నదులు, చెట్లు, గుట్టలు, పుట్టలు, జంతువులను సైతం భగవంతుడి రూపాలుగానే భావించాము. ఇవి అన్నీ దృష్టిగోచరాలు. అంతేకాకుండా మన మనస్సుల్ని ఇతర ఇంద్రియ వస్తువులనుండి దూరం చేసి భగవంతుడిమీద మనస్సును కేంద్రీకరింప చేసే సాధనాలు. భగవంతుడి మీద పరాభక్తిని జనింపచేయడమే ప్రతిమాది ఆరాధనల ప్రయోజనం; ఇవి అన్నీ ఆయా అధిష్ఠాన దేవతల ఆవాస స్థానాలు కూడ.

పరమాత్ముని విగ్రహ సన్నిధిలో మంగళ హారతిని, ఉదకాన్ని, వస్త్రాన్ని, పుష్పాన్ని, చామరాన్ని పట్టడాన్ని గమనిస్తే ఇవి క్రమంగా పంచభూతాలైన అగ్ని, నీరు, ఆకాశం, భూమి, వాయువుల సంకేతాలుగా భావింపబడ్డాయి. వస్త్రంలో అనేక రంధ్రాలు ఉండడంవల్ల అది ఆకాశానికి సంకేతం. గంధం భూమియొక్క గుణం కావడంవల్ల పుష్పం భూమికి సంకేతం. భగవదారాధనలో పంచభూతాత్మకమైన విశ్వాన్నే భగవంతుడికి సాంకేతికంగా అర్పిస్తున్నామని శ్రీ వివేకానందుని భావన.

(మించునోటకె హిందూధర్మ (కన్నడము) శ్రీ రామకృష్ణాశ్రమం, మైసూరు).

చిత్తశుద్ధి ఆత్మసాక్షాత్కారానికి అత్యావశ్యకం. పూజా పురస్కారాది ఆచార పద్ధతులకు కూడా అదే ఆలంబనం. అందుకనే మహాయోగి వేమన

'ఆత్మశుద్ధిలేని యాచార మదియేల
భాండ శుద్ధిలేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజలేల'

అని ప్రశ్నించాడు.

(వేమన పద్యాలు - డాంభిక పద్ధతి)

'చిత్తశుద్ధి యొకటి శ్రేష్ఠ లాంఛనమగు
నిఖిలపుణ్య కార్య నిర్వహణము
నద్దిలేక చేయ ననువుగాదేరికి'

అని ప్రబోధించాడు.

(వేమన పద్యాలు - సజ్జనపద్ధతి)

'చేతులారంగ శివునిఁ బూజింపడేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
.....................................
.....................................'

అని పోతన ఆక్రోశించాడు.

భగవంతుని పూజించడం వల్ల సర్వ కార్యాలు సిద్ధిస్తాయనీ, రోగాలు దగ్గరికి రావనీ, దుఃఖాలు తొలగిపోతాయనీ, ఆపదలు ఒనగూడవనీ, సంతానప్రాప్తి, వైభవ ప్రాప్తి, యోగక్షేమప్రాప్తి కలుగుతాయనీ అనాదినుండీ మన పెద్దలు విశ్వసిస్తున్నారు. ఇష్టదేవతలకు పూజలు చేయక పోయినట్టయితే తమకేదో కీడు జరుగుతుందన్న దృఢవిశ్వాసం మన హృదయాంతరాళాల్లో నాటుకొని ఉంది. పరమాత్ముని అనుగ్రహం కోసం జరిపే క్రియాకలాపమే 'పూజ'.

భగవంతుడు ఒక్కడే అనీ, ఆతనిని పలునామాలతో పిలుస్తున్నామనీ అందరికీ తెలిసిన విషయమే. అన్నట్టుగా మనం చేసే పూజలు కూడా ఒక్కడికే చెందుతాయి. అయినా దేవుడి మీదున్న భక్తి ప్రపత్తులు ఆతనిని పలునామాలతోను, పలు రూపాలతోను కొలువడానికి దోహదం చేశాయి.

భక్తి సౌధానికి నామస్మరణమే ప్రథమ సోపానం. 'నామస్మరణా దన్యోపాయం నహి పశ్యామో భవతరణే' అని పెద్దలు వచించారు. అందుకనే పురుషులు తన్నామ స్మరణాన్ని మంత్రాలద్వారా ఉచ్చరిస్తుంటే స్త్రీలు "పూజ పాటల్లో" సంతరించుకొన్నారు. ఉదాహరణానికి 'నామ సంకీర్తనం' అనే పేరుగల పాటలో ఒక భక్తురాలు. (పాడినవారు శ్రీమతి సుశీలమ్మ, హైదరాబాదు).

'రామరామ అనవే రాత్రింబవళ్ళు
శ్రీరామ అంటే చింతలు లేవు
జయరామ అంటే జన్మే లేదు
కృష్ణా అంటే కష్టాలు లేవు
మాధవా అంటే మరుపే లేదు
గోవిందా అంటే కొరతలు లేవు
నారాయణా అంటే నరకం లేదు
అచ్యుతా అంటే అవస్థలు లేవు
భయం లేదు, బాధలు లేవు'

అని హరికీర్తన గావించింది. భక్తికి, పూజకు పరమప్రయోజనకరమైన ఇటువంటి విశిష్ట లక్షణాలు ఉండడంవల్ల, ప్రతి యొక్కరూ సర్వవ్యాపి అయిన ఆ భగవంతుని ధ్యానించి, తమ ఇష్టార్థాలను సిద్ధించుకోగలరని ఆశిద్దాం.





# శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం, తిరుచానూరు

## నిత్యపూజా నివేదనలు

సుప్రభాతం — ఉ. 5-00 గం॥ నుండి 5-30 గం॥ వరకు

సహస్రనామార్చన — ఉ. 5-30 గం॥ నుండి 6-00 గం॥ వరకు

(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు.)

నిత్యఅర్చన — ఉ. 6-00 గంటలకు

(ఏడాదికి రు 150/- లు చెల్లించిన గృహస్థులకు మాత్రమే.)

శుద్ధి, మొదటి గంట — ఉ. 6-15 గం॥ నుండి 6-45 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 6-45 గం॥ నుండి మధ్యాహ్నం 1-00 గం॥ వరకు

శుద్ధి, రెండవగంట — మ. 1-00 గం॥ నుండి 1-30 గం॥ వరకు

సర్వదర్శనం — మ. 1-30 గం॥ నుండి రాత్రి 7-00 గం॥ వరకు

శుద్ధి, రాత్రికైంకర్యము — రా. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు

సర్వదర్శనం — రా. 7-30 గం॥ నుండి 8-30 గం॥ వరకు

ఏకాంతసేవ — రా. 8-30 గం॥ నుండి 9-00 గం॥ వరకు

## శుక్రవారాలలో....

సుప్రభాతం — ఉ. 4-00 గం॥ నుండి 4-30 గం॥ వరకు

సహస్రనామార్చన — ఉ. 4-30 గం॥ నుండి 5-00 గం॥ వరకు

(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు)

నిత్యఅర్చన — ఉ. 5-00 గం॥ నుండి 5-15 గం॥ వరకు

శుద్ధి, మొదటిగంట — ఉ. 5-15గం॥ నుండి 5-45 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 5-45 గం॥ నుండి 7-00 గం॥ వరకు

పళ్ళింపు — ఉ. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు

మూలవర్లుకు అభిషేకం — ఉ. 9-00 గం॥ నుండి 10-00 గం॥ వరకు

(100 రూ. టిక్కెట్‌తో ఇద్దరు వ్యక్తులకు మాత్రమే.)

అలంకారము, రెండవగంట — ఉ.10-00 గం॥ నుండి 11-00 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ..11.00గం॥ నుండి రాత్రి 8-00గం॥ వరకు

ఊంజల్‌సేవ — రా. 7-00 గం॥ నుండి 8-00 గం॥ వరకు

(అద్దాలమండపంలో రు. 150 టిక్కెట్‌తో జరుపుకొనవచ్చును. గృహస్థుకు 5 గ్రాముల వెండి డాలర్ బహూకరిస్తారు.)

రాత్రిగంట — రా. 8-00 గం॥ నుండి 8-30 గం॥ వరకు

ఏకాంతసేవ — రా. 8-30 గం॥ నుండి 9-00 గం॥ వరకు

## ఆర్జితం వివరాలు :

ప్రత్యేక దర్శనం : రూ. 2-00

సహస్రనామార్చన : రూ 6-50

నిత్యఅర్చన : రూ. 150-00 (ఏడాదికి)

అర్చన : రూ. 1-00

హారతి రూ. 0-50

పూజాభిషేకం (శుక్రవారాలలో) రూ. 100-00

ఊంజల్‌సేవ (శుక్రవారాలలో) రూ. 150-00

తిరుచ్చి ఉత్సవం : రూ. 63-00

గజవాహనం : రూ. 32-00

( 12 వ పేజీ తరువాయి )

ఏమను చుంటివి? నీవు కర్మమును సన్యసించితివా? ఆహా! ఎక్కడ నేర్చితివీ యోగశాస్త్ర పాండిత్యము? గుడాకేశా, ఈ లోకము కర్మబద్ధము. కర్మము ప్రతిప్రాణికి నుచ్ఛ్వాస నిశ్వాసములవలె సహజము. కర్మము చేయక యెవ్వఁడు నొకక్షణమైన నుండలేడు. కర్మము నాచరింపకుండుట దేహధారులకు సాధ్యమగు పనికాదు. కర్మము నాచరింపకున్న, సన్యాసికైనను క్షణము గడువదు. ఎల్లకర్మములు ప్రకృతి చేష్టలు. కర్మమును త్యజించితిననుకొనుట తన్నుదాను మోసగించుకొనుటే! సన్యాసము నీవనుకొనినట్లు కర్మపరిత్యాగము కాదు, కర్మఫలత్యాగము. ఫలాపేక్షను విడిచి, యీశ్వరునిపైఁ గర్తృత్వముంచి స్వధర్మమును నిర్వహించువాఁడే నిజమగు కర్మయోగి. భక్తితోఁ గూడిన కర్మయోగము మరింత ఫలప్రదము. కర్మము వలని ఫలాపేక్షలేక, సమబుద్ధితోఁ బొలుచు వానిని బాపము అంటవు. రక్షించునదియు శిక్షించునదియు భగవంతుఁడేనని యెరింగి స్వార్థమునకై మోహమునఁ జిక్కుపడని వానికే వైరాగ్యమబ్బును. అతఁడే స్థితప్రజ్ఞుడు. ఇంద్రియ నిగ్రహము వలన నిశ్చలబుద్ధియు, దాని వలన భక్తియు, భక్తిచే శాంతియుఁ జేకూరును. ధనంజయా! నీవు కర్మత్యాగమును జేసితినని భ్రమపడుచున్నావు. నిఖిలేంద్రియములను గర్మముఁ జేయుట నుండి నిరోధించి, నీ చిత్తముచే మమతాది విషయ చింతనమను కర్మమును జేయించుచున్నావు. అది యుభయభ్రష్టత్వము. ఏ కోరికయు లేక నీ విధ్యుక్త ధర్మమును నిర్వహించుటే కర్మయోగము స్వపర భేదభావమును విసర్జించి యన్నిట సమబుద్ధిఁ గలిగి కర్మము నాచరించుటే కర్మసన్యాసయోగము కలుషములఁ ద్యజించి, సంశయముల వీడి, చిత్తము నిగ్రహించి, సర్వభూత హితమును గోరువాఁడే కర్మసన్యాసి పాండవ మధ్యమా! సమస్తమును భగవదర్పితముఁ జేసి యాశామమకార వర్జితుఁడవై సంతాపమునువీడి యాధ్యాత్మిక బుద్ధితో యుద్ధమును జేయుము నిష్కామసేవ దేహేంద్రియనిగ్రహము, సర్వభూతముల యెడ క్షేమముఁ గలవాఁడు కర్మమును జేయుచున్నను ఆ కర్మములచే నంటువడడు.

ధర్మమునకు గ్లాని కలిగినప్పుడు సాధు రక్షణమును దుష్ట శిక్షణమును జేయుటకై నేనవతరించుచుందును. అఖిల భూతాత్మల కాత్మ రూపుఁడును, నిఖిలభూతోత్పత్తికి కారకుఁడు నేనే! సర్వజగముల సృష్టించు బ్రహ్మయు, హరించు మృత్యువు నేనే! యాదవులందలి వాసుదేవుఁడును బాండవులందలి పార్థుఁడును నేనే! గర్వాంధులగు దుష్టులరూపు మాపుటకే యీ యుద్ధము సంభవమైనది. సుయోధనుని సోదరుఁడనుకొనుచున్నావు. అతఁడు తాను సగుణ ప్రధానుఁడగు అసుర సంపద గలవాఁడు. అతనికి సాహాయ్యమై వచ్చిన రాజులును నట్టివారే. అసురులను రూపు మాపుట దైవీ సంపదగలిగి సాత్త్వికగుణ ప్రధానుఁడవై పుట్టిన నీ కర్తవ్యము, సవ్యసాచీ! నీ వస్త్ర సన్యాస మొనర్చిన నీ యుద్ధమాగి పోవునని దలంచకుము. భీష్మ ద్రోణులను జంపుటకై శిఖండి ధృష్టద్యుమ్నులు జననమొందియున్నారు. దుర్యోధన దుశ్శాసనుల భీమసేనుఁడు కూల్చును. నే సారథినై యభిమన్యుని రథినిజేసి, యాతనిచే కర్ణుని జంపించెదను. ధర్మజుఁడు భూమిఁ బాలింప సంసిద్ధుడై యున్నాఁడు. నీ వెంటఁగానలకు వచ్చు వారెవ్వరును లేరు. నీ వొక్కఁడవే యేగ వలసి వచ్చును. [వినుట నభినయించి] అదిగో భీష్ముని శంఖారావము. బ్రహ్మాండ కటాహములు బీటలువారునట్లొక్కసారిగఁ బాంచజన్య దేవదత్తముల శ్రుతిఁ గలిపి ప్రళయ నినాదము గావింతము. గాండీవ ధారివి కమ్ము. నాపై గర్తృత్వముంచినీ విధ్యుక్తధర్మమును నెరవేర్పుము. కర్మ ఫలము నందిచ్ఛ లేకుండినఁ గర్మము బంధింపఁజాలదు. పాపములంటవు. ఏమీ! నీ మనో వైకల్యమింకను నమసిపోలేదా. సరియే! ఈ యల్పవ్యవధిలో నా విశ్వరూపమును జూపి నీ సంశయమును విచ్ఛేదము-గావించెదను. ఇదిగో! పరికింపుము నా విశ్వరూపమును.

[విశ్వరూపము నుపసంహరించిన తరువాత] పార్థా! చూచితివి కదా నా విశ్వరూపమును? యోగమాయచేఁ గప్పఁబడిన నన్నుఁ బరమాత్మయని యందరును గనుగొనలేకున్నారు ధార్తరాష్ట్రులు, భీష్మద్రోణ కర్ణాదులు, యుద్ధరంగమున నున్న యోధవరులు వికృతదంష్ట్రలచే వెరపుఁగొలుపు నా విశ్వరూపాస్యమునఁ జొచ్చి, యా పండ్ల నడుమబడి నలిగి నలిగి రాలిపోవుటను గాంచితివికదా! లోకవినాశన మొనర్చు కాలరూపుఁడను నేను కౌంతేయా, ద్రోణుడు ధనుర్విద్యా పారగుడనియు భీష్ముఁడు స్వచ్ఛందమరణ వరప్రసాదియనియు, సైంధవునికిఁ దండ్రి వరము కలదనియు అశ్వత్థామాదులు బలము కలవారనియు భయపడవలదు. వారి తేజోపరాక్రమము లీవరకే నాచే నాకర్షింపబడినవి. వారిప్పుడు శవప్రాయులు అందుచే నిందున్న యోధవరు లెవ్వరును బ్రతుకరు. నిమిత్తమే వారి నాశమున కిప్పుడవసరము. నీవు నిమిత్త మాత్రుఁడవై పగరగెల్చి రాజ్యసౌఖ్యముల ననుభవింపుము. సారథినై నేను రథము నడువగా ఫాలాక్షుఁడైనను నిన్నెదిరించి నిలువలేడు. నరుడుద్యమించిన యపజయమ్మేయుండదు.

[పాదముల బడిన యర్జునునితో] కిరీటీ! లెమ్ము. నీవు నాకు ప్రియమిత్రుండవగుటచేతను, నీ యెడనాకుఁ బ్రీతి కలిగిన కారణముచేతను, నీ క్షేమమును గోరి నా విశ్వరూపమును నీకుఁ జూపితిని. నీ యజ్ఞానసమ్మోహములు తొలఁగి నీకు సంశయము విచ్ఛేదమగుటచే నాకుఁ బరమానందము కలిగినది. శ్వేత

వాహనా! వేరుతలంపులు లేక నన్ను పాసించు నిత్యయోగుల యోగక్షేమముల నేను భరింతును. అన్ని ధర్మములను బరిత్యజించి నన్నే శరణు పొందుము. ఎల్ల పాపముల నుండి నిన్ను విడిపించెదను. ఆధ్యాత్మిక జీవనము చేయువాఁడు సన్యాసి కానక్కరలేదు. కర్మఫలము నాశింపక ప్రపంచ కార్యముల నొనర్చుచు సాయుజ్యమందవచ్చును.

అర్జునా! ఇంతవరకును నీలో నంతర్గతముగ హృదయదౌర్బల్యాహంకారాది దుర్గ్మతలుండినవి. వానిని యుద్ధారంభమునే మాన్ప సంకల్పించితిని. నీ హృదయదౌర్బల్యమును వెలికిదీయుటకై మీ బంధుత్వముల దడవితిని. కూడియున్న మీ కురువంశజుల జూడుమంటిని. బంధునాశమొనర్పఁజాలననుచుఁ గర్తృత్వమును నీ కాపాదించుకొని యహంభావ బుద్ధిని వ్యక్తీకరించితివి. మనకు జయము కలుగునో కలుగదోయనుచు కార్యఫలాపేక్షను వ్యక్తముఁజేసితివి. అందుకై గీతోపదేశమును విశ్వరూప ప్రదర్శనమును నీకీ తరుణమునఁజేయవలసి వచ్చినది. అంతయు నేనే యనుటను విస్మరించి నీవు నేను అనియెడి భేదభావంబును గల్పించుకొని యాత్మతత్త్వమును మరచుట చేతనే నీకీ విషాదము కలిగినది. భ్రాతృవధకు బాధపడితివి. కులక్షేమమునకంటె జాతిక్షేమము, దానికంటె లోకక్షేమము ముఖ్యమని యెరుంగుము. కులాభిమానముతో నధర్మవర్తనుల నుపేక్షించినను, సహాయమొనర్చినను బ్రపంచహితము బాధింపఁబడును- కోట్లాది ప్రజల క్షేమశాంతులు నాశమగును. కావున గాండీవము నందుకొని నీ కర్తవ్యమును నెరవేర్పుము. ఎచ్చోట మనమిరువురముందుమో యచ్చట సిరియు జయము నైశ్వర్యము. స్థిరమైన రాజ్యనీతియు ననితరజన లభ్యమగు సౌఖ్యములు నిలుచును.

[అర్జునుఁడు కార్యోన్ముఖుఁడగుటఁ గమనించి] ఆహా! నరుఁడు భుజాగ్రముల పొంగఁబరోగమించుచున్నాడు. శరమ్ములను వాల్చి పరిక్రమించుచున్నాఁడు. అపారము ననవద్యమునపూర్వము నఖండము నగు నాతని వీరవిజృంభణమునకు విశ్వమెల్ల విస్మయ మొందనున్నది. ప్రజాహితమునకై మమకార బంధుత్వములఁ దృణప్రాయముగఁద్రోసి దేవదత్తమును బూరించుచున్నాఁడు. నేనును నాగల గూర్చుండి పాంచజన్యమును దేవదత్తముతో శ్రుతిఁగలిపి పూరించి శుభము నాహ్వానింతును.

[నిష్క్రమించును]



## బాలప్రబోధం

# జలదానం

— శ్రీ చాగాపురం వాగేశ్వరరావు

మహాభారత యుద్ధం సమాప్తమైంది. ధర్మరాజు సింహాసన మధిష్ఠించాడు. శ్రీకృష్ణుడు తన సోదరి సుభద్రతో ద్వారకకు వెళుతూ ఓ మరుభూమినిచేరుకున్నారు.

ఆ ప్రదేశంలో ఓ గొప్ప తపః సంపన్నుడు ఉండేవాడు. ఆతడి పేరు ఉత్తంకుడు. శ్రీకృష్ణుడు ఆతనిని దర్శించాడు. ఋషి కూడా వారిని గొప్పగా ఆదరించాడు. ఆ తరువాత పాండవులు కౌరవులను గురించి అడిగాడు. ఉత్తంకుడు అలా అడుగుతూంటే సుభద్ర చాలా ఆశ్చర్యపోయింది. శ్రీకృష్ణుడు చిరునవ్వు నవ్వుతూ 'తపస్సులో ఇతడు లీనమై యుండటం వల్ల కౌరవ – పాండవ సంగ్రామ విషయం తెలియదు.' అన్నాడు సుభద్రతో. కౌరవులు నాశనమైన విషయం, పాండవుల్లో పెద్దవాడైన ధర్మరాజు, సింహాసనమెక్కిన విషయం చెప్పాడు గోపాలుడు, మునితో. అది విన్న ముని కోపంతో "కృష్ణా, మొదటి నుండి నీవు పాండవ పక్షపాతివి. కౌరవులను అన్యాయంగా చంపించావ్. నీవూ దుఃఖాన్ని అనుభవిస్తావ్" అని శాపమిచ్చాడు.

సుభద్ర ఆ మాటలకు భయపడింది. శ్రీహరి మాత్రం భయపడక "మునిపుంగవా! నా మాటలను ఆలకించి నా విషయంలో తప్పుంటే నన్ను శపించండి." అని అంటూ ఇలా అన్నాడు. "మునికులోత్తమా! మీరు తపోగుణ సంపన్నులు. మీకు క్రోధము రాకూడదు. శాంతం మీకు ఆభరణం. సావధానంగా నేను చెప్పే కౌరవపాండవుల కథను విని – వారిలో ఎవరిది న్యాయమో, ఎవరిది అన్యాయమో గ్రహించి, నేను చేసిన వాట్లో అన్యాయముంటే నాకు శిక్ష వేయండి." అని అంటూ క్లుప్తముగా 'ద్రౌపదిని కౌరవ సభలో అవమానించిన విషయము, పదమూడు సంవత్సరాలు పాండవులను అరణ్యంలో కష్టాలు పెట్టిన విషయమూ– పాచికలాటలో పాండవులకు జరిగిన అన్యాయమూ వివిస్తరంగా చెప్పాడు. అది విన్న ఉత్తంకుడు ఆలోచించి "యదునందనా, నిజమే! మీరు చెప్పిన దాంట్లో పాండవులకు ఘోర అన్యాయం జరిగిపోయింది. అభిమన్యుడిని అన్యాయంగా హత్యమార్చారు. ద్రౌపదిని అవమానించారు. వారికి అలా జరగవలసిందే." అని అన్నాడు.

శ్రీకృష్ణుడు వినయంగా చేతులు కట్టుకుని – "మునివర్యా! మీరు మరుభూమిలో తపస్సు చేసుకుంటున్నారు. మీకు నేను చేయవలసిన సేవ ఏమిటో తెలిపితే నాకు చేతనైనంత చేయడానికి ప్రయత్నిస్తాను." అన్నాడు.

"నందనందనా! నీ దయ వలన అంతా క్షేమంగా యున్నాను. కానీ నీటికిమాత్రం కొంచెం ఇబ్బందిగా ఉంటున్నది. నీటికి ఏర్పాట్లుచేస్తేబాగుంటుంది."దానికి గోపాలకృష్ణుడు "స్వామీ! చింతించకండి. మీకు దప్పికైనప్పుడు నన్ను స్మరించండి. వెంటనే మీకు నీరు లభిస్తుంది." అన్నాడు.

ఆ తరువాత వారు ద్వారకకు వెళ్ళారు ఒకరోజు ఉత్తంకుడు తపస్సు నుండి లేవగానే తీవ్రమైన దాహం వేసింది.

అతడు కనులు మూసుకున్నాడు. ధ్యానంలో మునిగిపోయాడు. శ్రీకృష్ణుని



ధ్యానించి కనులు తెరిచాడు. తెరవగానే అతని ఎదురుగా ఓ చండాలుడు కనుపించాడు. అతడు తన భుజం మీది నుండి నీటితో నిండిన తోలుతిత్తిని దించాడు. దించిన పిదప మునితో ఆ చండాలుడు ఇలా అన్నాడు. "తపసీ, మీకు దాహమైనట్లుంది. ఈ నా తోలుతిత్తిలో నాలుగైదుగ్రుక్కెళ్ళ నీరున్నాయి. కావాలంటే తీసుకుని మీ దాహం తీర్చుకోండి." అన్నాడు.

ఆ చండాలుణ్ణి చూస్తుంటె ఉత్తంకునకు విపరీతమైన అసహ్యం, కోపం కలిగింది. ఆ చండాలుని రూపం చాలా భయంకరంగా ఉంది. ఏదో జంతువును చంపి భుజంపై వేసుకున్నట్లు రక్తం మరకలు. జిడ్డు కారుతున్న నల్లని శరీరచ్ఛాయ. మురికి ఓడుతున్న దుస్తులు. చెమట కంపు వేస్తున్న దేహం. "మూర్ఖుడా! నన్ను ధర్మచ్యుతునిగా చేయ సంకల్పించావా? నేను నీ విచ్చే అపరిశుభ్రమైన నీటిని త్రాగుతానా?" అన్నాడు కోపంతో. చండాలుడు ఆ మాటలు విని మారు మాట్లాడకుండా వెళ్ళిపోయాడు. మరికొన్ని క్షణాలకు శ్రీకృష్ణుడు ప్రత్యక్షమయ్యాడు. వెంటనే ఉత్తంకుడిలా అన్నాడు. "కృష్ణా! నిన్ను స్మరించగానే నీటిని పంపిస్తానని, ఓ చండాలుని పంపావేమిటి?" అని అన్నాడు. శ్రీకృష్ణుడు నవ్వుతు "తాపసోత్తమా! క్రోధంలో మీరు త్రికాలజ్ఞానాన్నే మరచిపోయారు. ఆవచ్చిన చండాలుడెవరనుకున్నారు? సాక్షాత్తు ఇంద్రుడు. అమృతాన్ని త్రావించడానికి వస్తే మీరది తెలుసుకోలేక తిట్టి పంపారు. ఇక మీకు అమృతం లభించదు. కానీ మీరు కోరినపుడెల్లా ఈ మరుభూమిలో మేఘాలు పుట్టి మీకు నీరును ఇస్తాయి." అని చెప్పి మాయమయ్యాడు. ఉత్తంకుడు తనకు దాహం వేసినపుడల్లా మేఘాలను పిలిచి నీటిని ఇవ్వండి అని దాహం తీర్చుకునేవాడు. ఆ మేఘాలకే ఉత్తంకుని మేఘాలని పేరు.

★

# త్యాగఫలం

ఒకప్పుడు తప్తగిరిని హిమవంతుడనే మర్కటం పాలించేది. తాను ఆ కొండ లలో కోతులన్నిటిని అతిగా ప్రేమించేది. కేవలం చక్రవర్తిగా కాకుండా అందరిని సమదృష్టితో పాలన సాగించడం వల్ల అందరి మెప్పు పొందడం జరిగింది. హిమ వంతుడికి వైద్యంకూడ తెలుసు. అందు చేత తప్తగిరిలో కోతులన్నీ సుఖంగా ఉండేవి.

హిమవంతుడికి వయస్సు మీరింది. తాను బ్రహ్మచారి కావటంచేత తన తరువాత రాజ్యం ఎవరికి అప్పగించాలనే ఆలోచన కలిగింది. ఇంతలో అతని దగ్గర ఉన్న సైన్యాధికారి అయిన "చంపకుడు" అనే మర్కటానికి చక్రవర్తి కావాలనే కోరిక కలిగింది. చంపకుడు కొందరిని చేరదీసి చక్రవర్తిని చంపాలనే కుట్రపన్నాడు. ఈ విషయం హిమవంతుడికి తెలిసి పోయింది. వెంటనే చంపకుడిని బంధిం చడం జరిగింది. చక్రవర్తి సభచేసి, చంప కుడికి దేశబహిష్కరణ శిక్ష విధించడం జరిగింది. వెంటనే తప్తగిరిని విడిచి నల్ల మల కొండలలో చంపకుడిని విడిచి పెట్టారు.

అప్పటినుండి చంపకుడు, హిమవంతు డిపై ఎలాగైన పగసాధించాలనే ఉద్దేశ్యం దృఢపడింది. కొన్నాళ్ళకు అక్కడ ఉండే జంతువులను చంపకుడు చేరదీశాడు. వాటికి తానే రాజునన్నట్లు మెలగడం జరిగింది. ఏనాటికైనా తప్తగిరిని వశపరచుకొని తాను చక్రవర్తిని కావాలనే కోరికతో రోజు రోజుకు సైన్యం పెద్దది చేయడం జరిగింది. తన సైన్యాన్ని చూసి తానే మురిసిపోవడం జరిగింది. తన కోరిక త్వరలోనే నెరవేర బోతుందని సంబరపడడం జరిగింది.

కాని అకస్మాత్తుగా చంపకుడికి జబ్బు చేసింది. ఎన్ని మందులు వాడినా ప్రయో జనం కనిపించలేదు. అపుడు జంతువు లలో "సారంగుడు" అనే మర్కటం రాజు కావాలనే ప్రయత్నం చేయసాగింది. ఈ విషయం విన్న చంపకుడికి గుండెలో బాకు గుచ్చుకున్నట్లు అయింది. అంతేకాదు తన జబ్బు నయం అయ్యే అవకాశం కనిపించ లేదు. చేసేదిలేక జబ్బుతోనే బాధపడడం జరిగింది. అపుడు చంపకుడికి ఒక ఆలోచన కలిగింది. వెంటనే హిమవంతుడికి కబురు పంపించాడు. ఆపదలో ఉన్న తనను రక్షిం చమని కోరాడు.

హిమవంతుడు అంతా తెలుసుకున్న తరువాత చంపకుడిని రక్షించాలనే తలంపు కలిగింది. కొంత సైన్యంతో బయలుదేరి నల్లమల కొండలు చేరుకోవడం జరిగింది. ఆపదలో ఉన్న చంపకుడిని చేరి ముందుగా మందులు ఇవ్వడంతో జబ్బు నయమ యింది. తరువాత హిమమంతుడు చంప కుడిని తప్తగిరికి తోడ్కొనిపోయాడు. అది మొదలు చంపకుడు హిమవంతుని కను సన్నలలో మెలగడం జరిగింది.

కొన్నాళ్ళుపోయిన తరువాత హిమ వంతుడు తప్తగిరులలో ఉన్న కోతులన్ని టిని పిలిపించాడు. పెద్దసభ చేసాడు. ఆ సభలో, "ప్రజలారా, నేను హిమాలయా లకు తపస్సుచేసుకొని కాలం వెళ్ళబుచ్చా లనుకుంటున్నాను. మరి మీకు ఇకనుండి చంపకుడు చక్రవర్తి కాబోతున్నాడు." అని చెప్పాడు.

ఆ మాటలు విన్న మర్కటాలు చాల బాధ పడడం జరిగింది. ఇది గమనించిన హిమవంతుడు మరల "నాకు వయసు మళ్లింది. మీరు బాధపడవద్దు. నామాట అంగీకరించక తప్పదు". అన్నాడు.

అపుడు చంపకుడు నిల్చొని వినయంగా "ప్రభూ, నేను ప్రాణాపాయంలో ఉన్న ప్పుడు రక్షించిందిమీరు. మీ మాటకాదు అన్నందుకు నన్ను క్షమించండి. నాకు రాజ్యం వద్దు. మీతోపాటు హిమాలయా లకు వచ్చి నేను తపస్సు చేసుకుంటాను. మీ త్యాగం గొప్పది. నాకంటే అర్హుడికి రాజ్యం అప్పగించండి" అని ప్రాధేయ పడ్డాడు.

అపుడు హిమవంతుడు తన రాజ్యంలో బలవంతుడు, వివేకవంతుడు అయిన "సాధ కుడు" అనే మర్కటాన్ని చక్రవర్తిగా చేసాడు. తరువాతహిమవంతుడు, చంపకుడు కలసి హిమాలయాలకు చేరుకున్నారు. చూశారా! బాలలు! త్యాగధనులు తమ త్యాగంతో ఇతరులలో త్యాగగుణం కలిగి స్తారు. అదే "త్యాగఫలం".

.... శ్రీ ఉమామహేశ్వరరావు



# గ్రంథ పరీక్ష

## ( 28 వ పేజీ తరువాయి )

నామ్ (పుట 28) యతులకు అనుటచాలదు. యతులకును, బ్రహ్మచారులకును అని ఉండాలి. ప్రలంభఘ్నః (పుట 42) అనుట తప్పు. 'ప్రలంబఘ్నః' అనుండాలి, ప్రలం బాసురుని చంపినవాడని అర్థం. 'పంచ చక్రం........' అనే శ్లోకంలో (పుట 82) 'వర్ణంచ' అనే పదానికి భావం తెలియ లేదు. దానికి తెనిగింపులేదు. చాలాచోట్ల కొన్ని పదాలు తర్జుమా లేక వదలివేయ బడినై. 'భూగోపాలః' (పుట 44) అనే శ్లోకంలో 'పార్శ్విభాక్'కు తెనిగింపు లేదు. 'విషమాస్యం మనోరమం' (పుట 62) ఇక్కడ మనోరమం పదానికి అర్థం చెప్ప లేదు. 'అధోచక్రము' (పుట 62) వంటి అపశబ్దము లెన్నో! అధశ్చక్రమనిఉండాలి.

గరుడుని సంబోధించి చేసిన ఉపదేశమే ఈ గ్రంథ విషయం కాబట్టి, గరుడ, తార్క్ష్య, వైనతేయ, ఖగేశ్వర, ఖగ (పక్షి) వంటివి గరుత్మంతుని సంబోధించే పదాలు. అది గుర్తించలేదు. కనుక, 'ఖగనీలమ్' అని ఒకే పదంగా తీసుకొని 'ఆకాశరంగు' అని వివరించడం తప్పు. 'తార్క్ష్య' (పు. 42,43) ఇది సంబుద్ధి. గరుడ చిహ్నము గల అని అర్థం చెప్పడం సరికాదు 'నిమ్నోదరః' అనే శ్లోకంలో (పుట 60) శిరః పదాన్ని అన్వయించి అర్థం చెప్పడం లేదు. పక్క శ్లోకంలో 'ఉత్తరం' పదానికి వివరణలేదు. 'విష్ణుక్రాంత నిభాకారమ్' అనే పదానికి (పుట 56) 'విష్ణుక్రాంత వన్నె' అని అర్థం చెప్పి ఏమి సాధించినట్లు? 'చక్రం వా కేవలమ్' (పుట 55) దీని వివరణ ఒక చక్రము అని ఉంది. పద్మముతోకూడిగాని, అది లేక, చక్రము మాత్రమేగాని అనే తీరుగ వ్రాయాలి. 'వామచక్రం' అని ఆరంభం అయ్యే లక్షణంలో (పుట 5) నాలుగోపాదం 'ఆనందం స్వచ్ఛగహ్వరమ్' అని వుంది. దానికి అనువాదం స్వచ్ఛ బిలము గలది, ఆనందమునిచ్చును అని ఉండాలి. అలాలేదు. అదే పుటలో నాతి హ్రస్వం అనే పదానికి 'కృశించినదికానట్టి' అని కాక 'మిక్కిలి పొట్టిది కానట్టి' అని ఉండాలి. అదే శ్లోకంలో 'రాజ్యభోగాప వర్గదమ్' రాజ్యమును, భోగమునుఇచ్చును అని ఉంది. అపవర్గం ఏమైంది? అపవర్గం అంటే మోక్షం. కాగా, ఐహిక భోగాన్ని, ఆముష్మికమైన మోక్షాన్నీ ఇస్తుందని అర్థం 'మత్స్యాద్యాః' అని ఆరంభించి 'సాశీతి వివిధాస్మృతా' అని ఎనభై (?) భేదములు చెప్పబడినవి. లెక్క సరిగా చూపలేదు.

అసలు వచనరచన అబోధకంగానూ, భ్రామకంగానూ ఉంది.

దీని అనువాదం ఇలా ఉంది. "వర్ణ బంధముచేత లక్షణము, క్షేత్రము ఉదా హరింపబడినది. (ఈవాక్యమ సంగతము పునరుక్తము. అక్కరలేదు.) ఆయా లక్షణా లతోకూడిన అనేక మూర్తులు గలవు. విశే షించి భేదములను తెలిసికొనుట కష్టము. వర్ణరూపాద్యవయవములచే ప్రమాణబిల లాంఛనములచే ద్వార ప్రదేశభేదములచే కొన్నిటియొక్క భేదములను చెప్పబడు చున్నది" ఇదేమి వాక్యరచన? "ఆయా లక్షణములతో కూడిన పలుమూర్తులున్నవి. ఏదో ఒకదానిని బట్టి స్పష్టముగ భేదము తెలిసికొనుట సాధ్యము కాదు. కాబట్టి వర్ణము (వన్నె) రూపాదులు, అయవయ ములు, ప్రమాణము (కొలత), బిలము, గుర్తులు, ద్వారదేశపు భేదములను బట్టి కొన్నిటి భేదము చెప్పబడుచున్నది." అని యుండుట బాగు. 'వర్తుల స్నిగ్ధ అత్యంతం స్పష్టచక్రసమన్వితః (పుట 30) దీనికి అను వాదం "వర్తులమై నునుపై స్పష్టమగు చక్రములు గలిగి" అని! ఈ మూడును చక్రములకు విశేషణములని తోచదు. వర్తులమైనట్టిదియు, నునుపైనదియు, స్పష్టచక్రములు గల్గినట్టిదియు అగు (వామనమూర్తి) అని వ్రాస్తే, వర్తుల మైన, నునుపైన రెండు విశేషణాలకూ 'వామకః'తో అన్వయం తెలుస్తుంది.

లింగవిభక్తి వచనాల తారుమారు, విశే షణ, విశేష్యభావవ్యత్యయం పెక్కుతావుల్లో కన్పిస్తుంది. గ్రంథం చివర – 'సాలగ్రామ మూర్తి – భేదనిరూపణము' అనే శీర్షికకింద మూర్తి స్వరూప – భేదాన్ని సంగ్రహించి అకారాదిక్రమంతో చేర్చడం చాలా ఉప కారం. కాని దాన్ని కూర్చడంలో కూడా శ్రద్ధాలోపం కనిపిస్తోంది. ఆయా మూర్తుల లక్షణం వ్రాసినప్పుడు, అది గ్రంథంలో ఫలానా పేజీలో ఉందని పుటలు సూచించి ఉంటే సంప్రదించుకోడానికి బాగుండేది. మూలం అర్థంకాని చోట్ల వివరణలేదు. కలిగే సందేహాలకు సమాధానం లేదు. కాగా, అను వాదంవల్ల సాధింపవలసిన ప్రయోజనం నెరవేరలేదనే చెప్పాలి. పై పేర్కొన్న పొరపాట్లులేకుండా అనువాదమూ, ప్రచురణ సాగించిఉంటే చాలా ఉపయోగకారిగా ఉండేది.

అయినా, ఈ దుర్లభ సంస్కృత మూల గ్రంథాన్ని, మూలంతోబాటు అనువాదం కలిపి ఆస్తికులకు అందజేసిన శ్రీ వి. హను మంతరావుగారి కృషి, ప్రయత్నమూ శ్లాఘ్యం.

— ఎస్. సి. వి. నరసింహాచార్య



[ 8వ పేజీ తరువాయి ]

ఎక్కువ భోజనం తినే శక్తి ఉన్నా తక్కువ భోజనంతో తృప్తిచెందడం కమ్మగా నిద్రపోవడం, కాని ఏ చిన్న శబ్దమైనా మేల్కొనడం, తన యజమాని యెడల భక్తిశ్రద్ధలు ఉండడం- వీరత్వం చూపించడం ఈ ఆరుగుణాలు కుక్కనుండి నేర్చుకోవాలి.

సుశ్రాన్తో హి వహేద్భారం
శీతోష్ణే న చ పశ్యతి
సంతుష్టశ్చరతే నిత్యం
త్రీణిశిక్షేచ్చ గర్దభాత్

బాగా అలసిపోయినా గూడా బరువులు మోస్తూనే ఉండడం, ఇది చల్లనిది అది వేడిదని ఆలోచించక పోవడం, ఎల్లప్పుడూ సంతోషంగా తిరుగుతూ ఉండడం ఈ మూడూ గాడిద నుండి నేర్చుకోవాలి.

నాత్యన్త సరలైర్భావ్యం
గత్వా పశ్య వనస్థలీమ్
ఛిద్యన్తే సరలాస్తత్ర
కుబ్జాస్తిష్ఠన్తి పాదపాః ॥

అతి మంచితనం, అమాయకత్వం, ఉండడం మంచిదికాదు. అడవుల్లో తిన్నగా పొడుగ్గా ఉన్న వృక్షాల్నే ప్రజలు నరుకుతారు. వంకర-టింకరగా ఉన్న చెట్లన్నీ అలాగే ఉండిపోతాయి.

పుష్పేగంధ స్తిలే తైలం
కాష్ఠేం వహ్నిః పయోఘృతమ్
ఇక్షౌ గుడం తథా దేహే,
పశ్యాత్మానం వివేకతః ॥

పువ్వుల్లో పరిమళం, నువ్వుల్లో నూనె, కట్టెల్లో నిప్పు, పాలల్లోనెయ్యి, చెరకులో బెల్లం ఎలా ఉన్నాయో, అలాగే నీ శరీరంలో ఉన్న ఆత్మని దర్శించు.

న దేవో విద్యతే కాష్ఠే
న పాషాణే న మృణ్మయే
భావే హి విద్యతే దేవ
స్తస్మాత్ భావో హి కారణం

భగవంతుడు కర్రలలోగాని, శిలలో గాని, శేక మట్టి బొమ్మలలోగాని లేడు. నిశ్చయంగా ఆయన మన భావంలోనే ఉంటాడు. అందుకే భావమే అన్నిటికీ కారణం.

శాంతితుల్యం తపోనాస్తి
నసంతోషాత్పరం సుఖమ్
నతృష్ణాయాః పరోవ్యాధి
ర్నచ ధర్మోదయాపరః ॥

శాంతితో సమానమైన తపస్సు, తృప్తిని మించిన సుఖం, దురాశను మించిన పెద్ద రోగం, దయతో సమానమైన ధర్మంలేవు.

కింకులేన విశాలేన
విద్యాహీనేన దేహినామ్
దుష్కులం చాపి విదుషో
దేవైరపి సుపూజ్యతే

విద్యలేని వాడి కులం ఎంతగొప్పదైనా ఏం లాభం? (అంటే నిష్ప్రయోజనం) విద్వాంసుడైనవాడు తక్కువ కులానికి చెందినా దేవతలుగూడా అతణ్ణి గౌరవిస్తారు.

ముక్తి మిచ్ఛసి చేత్తాత
విషయాన్ విషవత్త్యజ
క్షమార్జవం దయాం శౌచం
సత్యం పీయూషవత్ పిబ.

ఓ ప్రియసోదరా! నువ్వుమోక్షం కావాలనుకుంటే విషయవాసనల్ని విషంలా వదలిపెట్టు. సహనాన్ని, నమ్రతని, దయను, పవిత్రతను సత్యాన్ని-అమృతంలా భావించి సేవించు.

విద్యార్థీ సేవకః పాంథః
క్షుధార్తో భయకాతరః
భాండారీ ప్రతిహారశ్చ
సప్త సుప్తాన్ ప్రబోధయేత్.

విద్యార్థి, నౌకరు, బాటసారి, ఆకలిగొన్నవాడు, భయపడ్డవాడు, కోశాధికారి, ద్వారపాలకుడు- ఈ ఏడుగురు పడుకుని ఉంటే మేలుకొలపాలి.

అహింనృపంచ శార్దూలం
కీటించ బాలకం తథా
పరశ్వానంచ మూర్ఖం చ
సప్త సుప్తాన్న బోధయేత్,

పాము, రాజు, పులి, బాలుడు, ఇతరుల కుక్క, మూర్ఖుడు- పై ఏడుగురు నిద్రిస్తున్నప్పుడు మేల్కొలుపరాదు.

దృష్టిపూతం న్యసేత్పాదం
వస్త్రపూతం పిబేజ్జలం
శాస్త్రపూతం వదేద్వాక్యం
మనఃపూతం సమాచరేత్.

చూచి నడవడం, వడబోసుకొని నీళ్ళు త్రాగడం, వ్యాకరణ సహాయంతో తప్పులు లేకుండా మాట్లాడడం, బాగా ఆలోచించి పనిచేయడం (మనిషికి) అవసరం. (మంచిది).

యేషాం న విద్యా న తపో న దానం
న చాపి శీలం నగుణో న ధర్మః।
తే మృత్యు లోకే భువి భారభూతా
మనుష్య రూపేణ మృగాశ్చరన్తి ॥

విద్య, తపస్సు, దానం, శీలము, మంచి గుణము ఇవి లేనివారు ఈ లోకంలో భూమికిభారం- వారు మానవరూపంలో ఉన్న జంతువుల్లాగా తిరుగుతున్నారు

మాతా చ కమలా దేవీ
పితా దేవో జనార్దనః
బాంధవా విష్ణు భక్తాశ్చ
స్వదేశే భువనత్రయమ్।

లక్ష్మీదేవిని తల్లిగా, శ్రీ మహావిష్ణువును తండ్రిగ, విష్ణుభక్తులందరినీ తన బంధువులుగా భావించేవారికి ఈ మూడు లోకాలు వారి స్వంతమే. అంటే వారు అందరినీ తమలాగే భావించుకుంటారు.

దాతృత్వం ప్రియవక్తృత్వం
ధీరత్వ ముచితజ్ఞతా
అభ్యాసేన న లభ్యన్తే
చత్వారః సహజగుణాః

దానగుణం, మృదు మధురమైన వాక్కు ధైర్యం- విచక్షణాజ్ఞానం- ఇవి అభ్యాసం వల్ల కాదు. స్వాభావికంగా కలిగే గుణాలు.

కామం, క్రోధం తథా లోభం
స్వాదం శృంగార కౌతుకే
అతి నిద్రాతిసేవాచ
విద్యార్థీ హ్యష్ట వర్జయేత్

(4 వ పేజీ తరువాయి)

అయితే ఇవన్నీ జరుపుతున్న దెవరు? ఒక తల్లికొడుకు, ఒక అక్కకుతమ్ముడు, ఒక చెల్లికిఅన్న. తమ ఇంటి బలిపశువు ఇలాంటి అనుబంధాల్లో దేనన్న కారుణ్యకిరణం ఏ మాత్రం తళుక్కుమన్నాచాలు, వీటికదే సమాధి! మార్పులేని బంధంగల ఈ మాతృమూర్తులు కట్నాలపేరిట జరిగే కల్లోలాలకు తోటి స్త్రీకి జరిగే అన్యాయాలకు పాక్షిక భాగస్వాములౌతున్నారు. తమకు గలిగిన చేదుఅనుభవాలతో ఇతరులకు నవనవంతాలు కూర్చవలసిందిపోయి అగ్నిలో ఆజ్యం పోస్తున్నారు. నిజానికి కన్యాశుల్కాలు కాలదోషంపట్టి కనుమరుగయ్యాయి. వధుని నారాయణస్వరూపంగా భావించి లౌకిక సాహాయంగా సాలంకృత కన్యాదానంతోపాటు వరదక్షిణగా యథాశక్తి ఆనందంతో ఇచ్చే వరకట్నం ఈనాడు ఒక వ్యాపారంగా, నవవధువుకు నరకంగా, పారాణి ఆరకముందే పరలోకమార్గంగా మారుతున్నది. దీనికి పురుషాహంకారంతోపాటు నారీసంకుచితత్వం కొంత కారణమంటే అసహజమనిపించినా అసత్యం మాత్రం కాదు. కేవలం చట్టాలవల్ల కట్నాలు పోవు. 'కట్నమెందుకు వద్దో'! అని కలతచెందే పెద్దలూ లేకపోలేదు! కనుక సరస సంసార వృక్షానికి వరకట్నం విషాహుతమన్న సత్యాన్ని అయినవారందరి మదికెక్కించి తమ కన్నవారిని తమకన్న చిన్నవారిని ఒప్పించి సమాజానికి ముప్పు తప్పించగల శక్తి ఆ శ్రీచక్ర సంచారిణికి ప్రాకృతిక ప్రతిరూపమైన ఈ నారీచక్రానికి వుంది.

మరి ఇది ప్రేమైకమూర్తి కృష్ణభగవానుని జన్మాష్టమి, మాంగల్య వృద్ధికిగాను సర్వమంగళను, సకల సంపత్ప్రదాయిని ఐన వరలక్ష్మిని కొలిచే శుభదిన సందోహంగల పవిత్రమైన మాసం. భౌతికస్వాతంత్ర్యం లభించినా, భావస్వాతంత్ర్యానికి కంకణం కట్టుకోవలసిన దీక్షాసమయం. మహిళలకు మంచి జరగాలంటే ఇంతకన్న మంచిరోజు లేదు. కలహకంఠులు కాని కలకంఠులందరూ మత్తగజాల అదుపుకు ముందడుగువేయాలి. పెద్దలు చెప్పనే చెప్పారు.

కలకంఠికంట కన్నీరొలికిన సిరియింట నుండనొల్లదు సుమతీ! అని.
మరి మనది ఏమతో కాలమే నిర్ణయిస్తుంది.

---



---


Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press, by M. Vijayakumar Reddy, L.P.T., Manager, T.T.D. Press, Tirupati.



యతో బుద్ధి రజ్ఞాన నాశో ముముక్షో
ర్యతః సంపదో భక్త సంతోషికాః స్యుః
యతో విఘ్ననాశో యతః కార్యసిద్ధిః
సదా తం గణేశం నమామో భజామః

# మీ మాట

## జూన్ సంచిక

జూన్‌నెల సప్తగిరి సకాలంలో అందక పోయినా ఎన్నో ప్రత్యేకతల్ని సంతరించు కొని మా ముందు నిలిచింది. బాలప్రబోధం లోని శ్రీరమణగారి యాత్రాఫలం కథ చాలా బాగుంది.

శ్రీరామవనవాసము ద్వాదశవర్షంతమా అనే వ్యాసం చర్చారీతిలో సాగింది. నిత్య జీవితంలో మనం పాటించే ఆచారాలకు ఎన్నో అంతరార్థాలుంటాయని శ్రీహనుమంతప్ప వ్యాసం తెలిపింది. ఈ రచయితలందరికీ నా అభినందనలు.

కొంతపి వాసుదేవమూర్తి — ఒంగోలు.

జూన్ సప్తగిరిలో "మనఆచారాలు–అంతరార్థాలు" చాలా బాగున్నది. ఇటువంటి రచనలు మనోవికాసానికి దోహదం చేస్తాయి,

కె: ఎల్. ప్రసాద్. — విజయవాడ.

జూన్‌నెల బాలప్రబోధంలో "యాత్రాఫలం" కథ మాకెంతో నచ్చింది. రచయిత శ్రీరమణగారికి ప్రచురించిన మీకు మా హృదయపూర్వక అభినందనలు. ఇటువంటి మంచి కథలను ఇతోధికంగా ప్రచురించ ప్రార్థన.

కస్తూరి వేంకటప్పయ్య బ్రహ్మాన్యాం—ముసలాపురం.

శ్రీరమణగారి 'యాత్రాఫలం' నాకు నచ్చలేదు. దీని ప్రభావంగా తీర్థయాత్రలపై మోజు తగ్గుతుంది. (అలాగని నాకు తీర్థయాత్రలపై మోజులేదు. ఇంతవరకూ ఏయాత్రా పోలేదు.)

ఎంతటి దుర్మార్గుడైనా తీర్థయాత్రల సందర్భంలో ఏదో ఒక దృశ్యం చూచి పరివర్తన చెందవచ్చును.

పి. వి. శంకరయ్య, — చిన్నచింతకుంట.

'చిత్త శుద్ధిలేని శివపూజలా' అన్నట్లు శ్రీరమణగారి యాత్రాఫలం హాస్యాత్మకంగానూ జ్ఞానదాయినిగానూ వుంది. "భక్త వరాధీనుడు" రచనలోని భావార్థం చాలా రమ్యంగావుంది. కాని సప్తగిరి ఇంత ఆలస్యంగా రావటం ఏమీబాగులేదు. శ్రీవారి సుప్రభాత తైలవర్ణ చిత్రాలు ప్రచురిస్తే అవి పత్రికకు ప్రత్యేకాకర్షణ కాగలవు.

మీ సూచనకు కృతజ్ఞులం. సం॥

పి. కామేశ్వరశర్మ. — హైదరాబాదు.

ఆధ్యాత్మిక రంగంలో సప్తగిరి ఎంతో ముందడుగు వేస్తున్నదనటానికి సందేహం లేదు. కాని హిందూధర్మ ప్రచార సాధనమైన సప్తగిరిలో విశిష్టాద్వైతానికే ప్రాధాన్యత ఇస్తూ హిందూమత శాఖలైన అద్వైత ద్వైతములకు గాని శైవానికి గాని స్థానమివ్వకపోవటం శోచనీయం.

అలాగే సాహిత్యరంగంలో అతి ముఖ్యమైన శతావధానానికి శ్రీ మేడసాని మోహన్‌కు తగిన ప్రాధాన్యత కల్పించక రెండు ఫోటోలతో సరిపెట్టడం భావ్యమా ?

బండారు కుమారస్వామి — వలమనేరు.

జూన్ సప్తగిరి ఆలస్యంగా వచ్చినందుకు బాధగా వుంది. ఇకపై సకాలంలో పత్రిక విడుదల అయ్యేలా చూడవలసింది.

బాలప్రబోధంలో మీరు ప్రచురించిన యాత్రాఫలం' కథ మధురమైన శైలిలో వుంది. శ్రీరమణగార్కి మా అభినందనలు.

దేవస్థానం వారు విక్రయిస్తున్న వివిధములైన ప్రీరికార్డెడ్ కేసెట్లు, వాటి ధరలు తదితర వివరాలను పత్రికా ముఖంగా ప్రకటించ ప్రార్థన.

తటవర్తి లక్ష్మీనారాయణ — సికిందరాబాదు.

*




# తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవం



| | | |
|---|---|---|
| 9-9-83 | శుక్ర | —<br>సేనాధిపతి ఉత్సవము<br>అంకురార్పణము (రాత్రి) |
| 10-9-83 | శని | వజ్రకవచాద్యాభరణములతో బంగారుతిరుచ్చి ఉత్సవము<br>ధ్వజారోహణము (పగలు)<br>పెద్దశేషవాహనము (రాత్రి) |
| 11-9-83 | ఆది | చిన్న శేషవాహనము (పగలు)<br>హంసవాహనము (రాత్రి) |
| 12-9-83 | సోమ | సింహవాహనము (పగలు)<br>ముత్యపువందిరి (రాత్రి) |
| 13-9-83 | మంగళ | కల్పవృక్షవాహనము (పగలు)<br>సర్వభూపాలవాహనము (రాత్రి) |
| 14-9-83 | బుధ | మోహినీఅవతారోత్సవం (పగలు)<br>గరుడోత్సవం (రాత్రి) |
| 15-9-83 | గురు | హనుమద్వాహనము<br>వసంతోత్సవం (సాయంకాలం)<br>గజవాహనము (రాత్రి) |
| 16-9-83 | శుక్ర | సూర్యప్రభవాహనము (పగలు)<br>చంద్రప్రభవాహనము (రాత్రి) |
| 17-9-83 | శని | రథోత్సవము (పగలు)<br>అశ్వవాహనము (రాత్రి) |
| 18-9-83 | ఆది | పల్లకీఉత్సవము, తిరుచ్చిఉత్సవము<br>అవభృథోత్సవము (పగలు)<br>ధ్వజావరోహణోత్సవము. (రాత్రి) |



# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాస పత్రిక...

గౌరవసంపాదకులు.

శ్రీ జి. కుమారస్వామిరెడ్డి,
ఐ. ఏ. ఎస్.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

ప్రచురణకర్త - సంపాదకుడు :
కాట్రపాటి సుబ్బారావు,
ఎమ్. ఎ.

ఉపసంపాదకుడు :
తిరుమూరు సుధాకర్ రెడ్డి,
ఎమ్. ఎ. బి. ఇడి.

ముద్రాపకుడు :
ఎమ్. విజయకుమార్ రెడ్డి.

విడిప్రతి-రు. 1-00
సం॥ చందా-రు. 12-00

ప్రతులకు :
వెల్ ఫేర్ ఆఫీసర్,
టి. టి. డి., తిరుపతి.

## ఈ సంచికలో....

సెప్టెంబర్ 1983
సంపుటి 14 సంచిక 4



సవరణ: గతసంచిక ముఖచిత్రం 'శ్రీవారి నవనీతకృష్ణ అలంకరణ' అని గమనింప ప్రార్థన.

# సంపాదకీయం

ప్రపంచంలో ఎవరికైనా గౌరవం ఎందువల్ల లభిస్తున్నది? ఆ వ్యక్తి సమాజంలో మిగిలిన వారికన్న గుణంలోనో, ధనంలోనో, అధికారంలోనో, విద్యలోనో ఆధిక్యత సంపాదించటం వల్ల అని స్థూలంగా చెప్పుకోవల్సివుంది. ఒక్కొక్కప్పుడు అందరికన్న అందగాడైనా ఆదరణ లభించవచ్చు. ఈ పరిగణనం వల్ల ఆ వ్యక్తికి ఒక స్థాయి దానివలన కొంత తృప్తి లభిస్తుంది. అతని కార్య సాధనలో ఈ వైశిష్ట్యం అనుయాయులను సమకూర్చి కొంతవరకు ఆత్మ ప్రత్యయాన్ని కల్గిస్తుంది. నేను, నాది అనే ఆకర్షణ కలిగించి, విశ్వాసంతో ముందుకు పోయేందుకు తోడ్పడుతుంది. దీన్ని మనం ఆత్మవిశ్వాసం అంటున్నాం. ఇది పూర్తిగా లోపిస్తే ప్రపంచపు అస్తిత్వానికే ప్రమాదం కనుక ఇది అవసరమే!

కాని మనస్సు మరీ పాపిష్ఠిది. ఇది ఇక్కడితో ఆగనీయదు. గోరంత విజయానికి కొండంత గౌరవ భ్రాంతి కల్పిస్తుంది. ఇక రూపం కూడా తోడైతే పాపం పెరిగినట్లే! నా ఎదుటి వాళ్ళందరూ నావలనే, నేనే వీరుణ్ణనీ అలమందలో ఆబోతు మాదిరి రంకెలు వేస్తూ ఎదుటివాడు ఎంతగొప్పవాడైనా, గోటికి కూడా తగడన్నట్లు అపహాస్యం అవహేళన చేస్తాడు, నిజానికి ఎదురుదెబ్బ తగిలితే ఎవరితో చెప్పుకోవాలో తెలియని అర్భకుడు. అంతటి పిరికి మరొకడుండడు. ఇదంతా 'నేను' చేసే మాయాలీల! మనసులోని ఆ తెర తొలిగితే గాని 'నేను' వ్యాధి నయంకాదు; వినయం రాదు. ఈ పైత్యమంతా ప్రకోపించబట్టే, కంఠేకాల జటామకుటమణి నని, తారాధిపతి నని, ఓషధీశ్వరుడనని, ఆదిపురుష హృదయాధి జాతుడ నని గర్వించిన శీతకిరణుడు విఘ్నేశ్వరుని చూచి హేళన చేయటం, వినాయకుడు శపిస్తే మళ్ళీ ఆ విఘ్నరాజునే శరణు వేడటం జరిగింది. నిజానికి బలిచక్రవర్తి కూడా దాతననే గర్వంతో ఏది అడిగినా ఇస్తాననటం, వామన త్రివిక్రమాటోపానికి తట్టుకొలేక శరణు వేడటం జరిగింది. ఆ వినాయకుడు గాని ఈ వామనుడు గాని సురూపులు కాకపోవటం గమనార్హం.

బహిరార్భాట మత్తులై నశ్వరమైన దాని భ్రాంతిలో అవహేళన చేయటం దోషమని బాహిర ప్రకృతికి భిన్నమైన శాశ్వతమైన ఆత్మ సౌందర్యం ప్రతి జీవిలోను నిక్షిప్తమై వుందని దాన్ని గ్రహించి మెలగాలని పై రెండు కథల సారాంశం. సుందర దేవతా కోటిలో ఈ విరూపేశ్వరుడు రూపొందటానికి చెప్పిన కారణాలేవైనా సమాజానికి చక్కని సందేశం మాత్రం వుంది.

నాయకత్వానికి కావలసింది, సుందరరూపం మాత్రమే కాదు. నిశ్చలత, కార్యదీక్ష, సూక్ష్మదృష్టి, విషయపరిజ్ఞానం. ఇవన్నీ ఆంతరికాలే! మన పురాణ సాహిత్యంలో, వినాయకునికి సంబంధించిన ఏ కథలోనూ ఆయనకు తడబాటు కాని ఆవేశం కాని ఉన్నట్లు కనిపించదు. సుందర రూపి, దేవసేనావల్లభుడైన షణ్ముఖుడు మయూరవాహనుడై బయల్దేరగా సూక్ష్మదర్శి ఐన వినాయకుడు జననీజనకులకు ప్రదక్షిణించి తగిన ఫలాన్ని ముందుగానే పొందాడు. పై లక్షణాలతోపాటు సమయజ్ఞత నాయకత్వానికి కలిసిరాయి. అహంకార రహితంగా ఈ బుద్ధులు సంతరించుకున్నవారికి సిద్ధి కరతలామలకం. దీనికి సంకేతంగానే బహుశః వినాయకునికి సిద్ధి, బుద్ధి భార్యలని వుండవచ్చు.

మిగిలిన వారి మీదకన్నా వైకల్య వైరూప్యాలున్న సంతానం మీదనే తలిదండ్రులకు మక్కువ ఎక్కువని కూడా వినాయకుని గణాధిపత్యపు కథ నిరూపిస్తున్నది. త్వరగా కదలలేని బిడ్డడనే మమకారంతో లోక జననీజనకులు ధర్మసూక్ష్మంతోపాటు పదవిని కూడా ఇప్పించారు.

అసలు గజాస్యం, మూషక వాహనం ఆ దేవుని సమరస భావానికి నిదర్శనం అని కూడా అనుకోవచ్చు. అతిపెద్ద ప్రాణిని తలగా, అతి చిన్న జీవిని వాహనంగా రూపొందించుకోవటం దేవుని సర్వజీవ సమభావాన్ని సర్వాంతర్యామిత్వాన్ని నిరూపిస్తాయి. ఏ రూపంలో వున్నా భగవంతు డొక్కడే కదా! పైగా ఈ గజమూషకాలు రెండూ సస్య శత్రువులు కావటం వల్ల వాటిని కైవసం చేసుకొన్న దేవుడు నిజంగా క్షేత్రపాలుడే కదా!

ఇన్ని విశేషాలున్న దేవుడు గణనాథుడు కావటంలో ఇంతటి బుద్ధి జీవి విఘ్ననాయకుడు కావటంలో ఆశ్చర్యం లేదు. సావ బెట్టని వజ్రానికి రాణింపు లేదనే అంటారు. దేవుని విఘ్నాలు మానవ సాధనకు పరీక్షలు. విఘ్నాన్ని ఊహించుకుని తట్టుకునే శక్తి లేని కలిజనులం కనుక విఘ్నాలె కలిగించవద్దని వేడుకుంటున్నాం. నేనున్నానని వస్తే భరించలేం గనుక నీ వున్నావని మనమే పిలిచి పండుగ చేసి ఇక అడ్డం రావొద్దని మొక్కుకుంటున్నా చాలా వ్రతాల క్రతువుల సందర్భంలో. నా సాయం కావాలా అని అని ఒకాయన అడిగితే అడ్డం రాకుంటే అదే చాలని సమాధానం వచ్చిందట. ఇదీ అంతే ననిపిస్తుంది బాహ్యదృష్టిలో:

"గణానాం త్వాగణపతిం హవామహే। కవిం కవీనాం ముపశ్రవస్తమమ్। జ్యేష్ఠరాజ బ్రహ్మణాం। బ్రహ్మణ స్పతిః ఆనశ్శృణ్వన్నూతి భిస్సీద సాదనం.



# లీలాశుకుడి వర్ణనలో బాలగోపాలుడు

— కరుణశ్రీ

ప్రతిభాచక్షువులైన మహాకవులు బృందావన విహారియైన నందనందనుని సౌందర్యమూర్తిని పెక్కుచందాలుగా సందర్శించారు. "గీతగోవిందం"లో జయదేవులవారూ, "శ్రీకృష్ణలీలాతరంగిణి"లో నారాయణ తీర్థులవారూ, "శ్రీకృష్ణకర్ణామృతం"లో లీలాశుకులవారూ, 'హరివంశం'లో ఎర్రన్నగారూ, 'భాగవతం'లో పోతన్నగారూ, అలాగే పురందరదాసూ, సూరదాసూ, మీరాబాయీ, రసఖాన్ మొదలైనవారు రసార్ద్రదృక్కులతో గోపాలకృష్ణుని అపురూపమైన రూపమాధుర్యాన్ని ఆస్వాదించి ఆనందించారు. ఆ భువనమోహనుని సౌందర్య సర్వస్వాన్ని మనసారా, తనివితీరా తిలకించి పులకించి తమ తమ కవితా విపంచికలపై పలికించారు.

ముద్దులు మూటగట్టే ఆ సరస్వతీదేవి ముంజేతి లీలాశుకమైన లీలాశుక మహాకవి లోకానికి అందించిన ఏకైక కృతి "శ్రీకృష్ణకర్ణామృతం." అందులో ఆయన దర్శించిన బాలకృష్ణుని లీలావిలాసాలను తనకమనీయ కవితలో ప్రదర్శించిన తీరు అవలోకించుదాం.

## ఎంత వింత! ఎంత వింత!

యశోద చిన్నకన్నయ్యను కాళ్ళమీద కూర్చోబెట్టుకుని నీళ్ళుపోస్తున్నది. బిడ్డ ఉద్దుగుడుచుకోకుండా చేతు లడ్డంపెట్టి పోస్తున్న చెంబెడు నీళ్ళలోనే మునిగి తేలుతున్నాడు ముద్దుకృష్ణుడు. ఆసుందర దృశ్యాన్ని సందర్శించిన లీలాశుకుని కన్నుల్లో ఆనందబాష్పాలు చిందాయి. ఆ చిందిన అశ్రుబిందువులే అక్షరరూపాన్ని దాల్చి సాక్షాత్కరించాయి. చిత్తగించండి.

యద్రోమరంధ్ర పరిపూర్తివిధా పదక్షా
వారాహ జన్మని బభూవు రమీ సముద్రాః
తం నామ నాథ మరవిందదృశం యశోదా
పాణిద్వయాంతరజలైః స్నపయాం బభూవ.

అలనాడు అపారపారావారంలో మునిగిపోయిన భూదేవిని ఉద్ధరించే నిమిత్తం ఆదివరాహావతారం ధరించిన ఏ స్వామి శరీరంమీది రోమకూపాలను ఏడు సముద్రాలూ ఏకమైకూడా పూరింపలేకపోయాయో, ఆస్వామిని ఆ పుండరీకాక్షుని ఈ నాడు ఈ యశోద ఈ విధంగా దోసెడు నీళ్ళతో స్నానమాడిస్తున్నదే! ఎంత వింత! ఎంత ఆశ్చర్యం!

నిజమే మరి; ఆ అవతారంలో సప్తసముద్రాలూ రోమకూపాల్లోకి సైతం చాలీచాలని ప్రభువు ఈ అవతారంలో ఇంత చిన్నవాడై కన్నతల్లి పోసే దోసెడు నీళ్ళలో కేరింతలు కొడుతూ జలకమాడటం వింతగా లేదూ! ఈ సందర్భాన్నే బమ్మెర పోతరాజుగారు భాగవతంలో ఇలా అభివర్ణించారు.

జలతోయంబుల జగముల్
బలతోయములందు ముంచి భాసిల్లెడి యా
జలతోయగాము వల్లవ
లలనా కరతోయములఁ జెలంగుచుఁ దడియున్.

## కన్నయ్య కలవరింతలు!

అమ్మ అబ్బాయిని జలకమాడించింది. అలికాన తిలకం దిద్దింది. ఉయ్యాలలో నిద్రపుచ్చి తను గృహకృత్యాలలో మునిగిపోయింది. ఇంతలో ఉయ్యాలలోనుంచి ఒక వింత కలవరింత వినిపించింది యశోదమ్మకు. చిన్నికృష్ణుడు నిద్రలో ఏమేమో కలవరిస్తున్నాడు.

"శంభో! స్వాగత మాస్యతాం!"
"ఇత ఇతో వామేన పద్మాసన!"

"క్రౌంచారే! కుశలం?" "సుఖం సురపతే!"
"విత్తేశ! నో దృశ్యసే!"

'మహాదేవా! స్వాగతం! రండి రండి కూర్చోండి! ఎవరు? చతుర్ముఖులా! రావయ్యా! రా! ఇదుగో ఈ ఎడమ ప్రక్క కూర్చో! ఏమయ్యా కుమారస్వామీ! కుశల మేనా! ఇదుగో చూడు సురపతీ! సుఖంగా ఉన్నావా? ఓహో కుబేరుడా! ఏమిటి కొత్తిగా కన్పించటం లేదే?"

అబ్బాయి నోటివెంట వినవస్తున్న వింత మాటలు విని యశోద ఆశ్చర్య చకితు రాలైంది. "ఏమిటీ పిచ్చిపలుకులు! పసి వాడి నోటివెంట రావలసినవేనా! మహా దేవు డెవరు? బ్రహ్మదేవు డెవరు? స్వాగత మంటాడు! రండి కూర్చోండంటాడు! క్షేమమా అంటాడు! అమ్మో! నా చిట్టితండ్రికి ఏదో అయింది. వేలెడంతలేడు; వెర్రివెర్రిగా మాట్లాడుతున్నాడు. ఏదయినా గాలి చేష్టేమో! ఇప్పుడేగా పాలిచ్చి పడుకో బెట్టాను. ఇంతలో ఈ వింత కలవరింత లేమిటి? కలలో ఎవరయినా కన్పించా రేమో!"

అంటూ ఆ ఇల్లాలు తల్లడిల్లిపోయింది. "థూ" "థూ" అని అబ్బాయికి దిష్టి తీసి రక్ష పెట్టింది. ఆ తల్లి పెట్టిన రక్ష "మమ్మల్నీ మిమ్మల్నీ రక్షించాలి" అంటాడు లీలా శుకుడు పై శ్లోకంలో.

ఇంతకూ జరిగిందేమంటే స్వామి శ్రీమహా విష్ణువై వైకుంఠంలో కొలువుతీర్చి ఉన్న ప్పుడు బ్రహ్మాదిదేవతలు దర్శనానికి రావటం శ్రీవారు వారందరినీ పేరుపేరునా పిలిచి ఆదరించటం ఆచారం. శ్రీమన్నారాయ ణుడే ఈనాడు చిన్నికృష్ణుడై ఉయ్యా లలో ఊగుతున్నాడు. వైకుంఠం వదలి గోకులంలో నందనందనుడుగా అవతరించిన అందాలబాలుణ్ణి దర్శించటంకోసం దేవత లంతా దివినుండి భువికి దిగివచ్చి ఉత్కం ఠతో ఉయ్యాలచుట్టూ నిలబడ్డారు. రస వెనుకటి అలవాటుప్రకారం బాలముకుం దుడు అందరినీ పేరుపేరునా ఆహ్వానిస్తు న్నాడు. ఈ దేవరహస్యం తెలియని అమా యికురాలు నందుని యిల్లాలు బంగారు తండ్రికి "ఏదో అయిం"దని కంగారు పడింది.



ఈ భావాన్నే కర్ణాటక కవిశేఖరుడైన పురందరదాసు ఇంకోవిధంగా చిత్రించాడు "బూచి బందిదే-రంగ-బూచి బందిదె" అన్న పాటలో అల్లరిచేస్తూ, అటూ యిటూ పరు గులుతీస్తూ, పక్కమీదికి వచ్చిపడుకోని బాలకృష్ణణ్ణి భయపెడుతూ యశోద ఇలా అంటుంది.

"నాన్నా! కృష్ణా! తొందరగా వచ్చి పడుకో! అల్లరి చెయ్యకు! ఊరంతా బూచి వాళ్లు తిరుగుతున్నారట. మనింటికి కూడ వస్తారుట! వాళ్ళు అల్లరిచేసే పిల్లల్ని పట్టుకెళ్లుతారుట!"

"ఒరేయ్ కన్నయ్యా! విన్నావో లేదో! అందులో ఒక బూచివాడికి నాలుగు తల లుంటాయట! ఇంకో బూచివాడికి ఆరు తలకాయలుట! మరో బూచికి మూడు కన్నులుట! ఇంకో బూచికి ఒళ్లంతా కళ్లే నుట! మరోబూచిటా! ఏనుగుతలకాయ పెట్టుకొని వస్తుందట! వాళ్లు అమాంతం నిన్ను ఎత్తుకుపోదామని మనింటిచుట్టూ పొంచి పొంచి తిరుగుతున్నారుట! రా నాన్నా! దబ్బున వచ్చి నిద్రపో!"

పురందరుని కల్పన "హూలివాన" అయితే
లీలాశుకుని కల్పన "తేనెసోన"

## అందని అరవిందం!

పాలరాళ్లు పరచిన ముంగిట్లో మోకాళ్ళ మీద పారాడుతున్నాడు బాలకృష్ణుడు. అచ్చటి స్ఫటిక శిలా ఫలకాలలో ముగ్ధ మోహనుని ముద్దుల ముఖం ప్రతిఫలిం

(41వ పేజీలో)

శ్రీమన్నారాయణుడు ఒకనాటి రాత్రి వేళ లక్ష్మీదేవిని వదలి బృందావనమునకు అరిగియుండి పోయెను. తిరిగి తెల్లవారు తుండగా లక్ష్మీదేవి [illegible] నేమా [illegible] తన నివాసమునకు చేరుకొనెను. అంతట లక్ష్మీదేవి రాత్రి తనను ఒంటరిగా వదలి పోయిన భగవానుని చూచి, కోపంతో తలుపులు బంధించివేసెను. స్వామి అనేక ప్రసన్నురాలిని చేయు లోపలి దానికి ప్రయత్నించి బంధించియున్న ద్వారం వద్దకు వచ్చి మృదు మధుర స్వరంతో తలుపుతట్టి లోపలనున్న లక్ష్మీదేవిని పిలిచెను.

శ్లో॥ అంగుళ్యాకః కవాటం ప్రహరతి
కుటిలే మాధవః, కిం వసన్తో?
నో చక్రీ కిం కులాలః? నహిధరణీధరః
కిం ద్విజిహ్వః ఫణీన్ద్రః?

# సంధానసేవ

**శ్రీ నడాదూరు జగన్నాథాచార్యులు**

నాహం ఘోరాహి మర్దకిమసి
స్వగమతిః నోహరిః కిం కపీన్ద్రః?
ఇత్యేవం గోపకన్యాప్రతివచనజడః
పాతునః పద్మనాభః॥

అంతట లక్ష్మీదేవి తన చెలికత్తెలద్వారా తలుపు కొట్టేదెవరు? అని స్వామిని ప్రశ్నించెను. అందుకు బయటనుండి "నేను మాధవుణ్ణి" అని స్వామి పలుకు. లక్ష్మీదేవి స్వామిని తన వాక్చాతుర్యముతో ఓడించదలచి మాధవ అను శబ్దమునకు వసంతుడు అని కూడ పేరు కలిగి యుండుటచే "వసంతుడివా" అని తిరిగి ప్రశ్నించెను. కాదు "నేను చక్రధారిని" అనిస్వామి బదులు బలికెను. చక్రి అంటే కుండలు చేయు కుమ్మరి అని కూడ అర్థము కలుగుట చేత "నీవు కుమ్మరివా" అని ప్రశ్నిస్తుంది. కాదు నేను భూమిని భరించువాడను (ధరణీధరుణ్ణి) అని భగవానుని జవాబు. భూమిని ఆదిశేషుడు కూడ తన పడగలపై భరించుట చేత లక్ష్మీదేవి నీవు రెండు నాలుకలు కల సర్పానివా? అని వ్యంగ్యంగా అడుగుతుంది. దానికి స్వామి కాదు నేను "హరి"ని అని బదులు చెప్పగా హరి అను శబ్దమునకు కోతి అని కూడ అర్థము కలుగుటచేత "అయితే నీవు కోతివా?" అని ప్రశ్నిస్తుంది. ఈ విధంగా జగన్నాటక సూత్రధారి అయిన భగవానునికి జగన్మాత అయిన లక్ష్మీదేవికి వాగ్వాదము జరుగుతుంది. ఇది లోకంలో ప్రణయ కలహం అని ప్రసిద్ధి



చెందినది. ఈ ప్రణయ కలహలీలను "సంధానసేవ" అను పేరుతో నవాహ్నిక బ్రహ్మోత్సవములలో 8వ రోజు అనగా అవభృధస్నానమురోజున జరుపుతారు. ఆ ప్రణయ కలహలీలా వృత్తాంతము పూర్తిగా ఇందు తెలుపబడినది. భక్తులు పఠించి, శ్రవణము చేసి తరింతురుగాక—

శ్లో॥ లక్ష్మీం లీలాశయననిలయే
వంచ్యయిత్వావశాంతే।
రాత్రౌగత్వానిశిచర మృగాన్
సం నిహత్యప్రభాతే॥
భూయోవేగాదుపగతస్యాంఘ్రి
ప్రాణేశ్చ దేవ్యాః।
సంవాదోయం భవుకనివహం
సర్వదా సంతనోతు॥

శ్రియః పతి అవాప్త సమస్తకాముడు, లీలావరవశుడు అయిన భగవానుడు ఒక రాత్రివేళ లక్ష్మీదేవితో నిద్రించుచూ, ఆమెను వదలి కపటపూర్వకముగా బయటకు వెడలెను. వనములోని నిశాచరులను, క్రూరమృగములను వేటాడి ఉదయకాలము సమీపిస్తూ ఉండగా త్వరత్వరగా స్వస్థానమునకు చేరుకొనెను. ఆ సమయమున లక్ష్మీదేవికి శ్రీమన్నారాయణునికి జరిగిన సంవాదము – "ప్రణయ కలహలీల" — ఇది సమస్త జనులకు కళ్యాణము కలుగ జేయును గాక.

శ్లో॥ శ్రీమాన్ విద్రుమ వర్ణతే
శరరిపోః కాంతామణేః కౌతుక।
వ్యాజేన ప్రణయాను బంధి
కలహో యక్షాదిభిః ప్రేక్షితః॥
జాతోదేవ శిఖామణేః స్మృతినిధేః
శ్రీభూమినీలాపతేః।
కారుణ్యాంబునిధేః కరోతు జగతాం
కళ్యాణపారం పరమ్॥

శ్రీమన్నారాయణ! దుష్టవినాశక! దేవాధిదేవా! ఆశ్రిత భక్తులను రక్షించు విధి స్వరూపము కలవాడా! శ్రీ భూ మి నీ లా నాయకా! కరుణామూర్తులయిన మీకు, మీ పట్టపురాణి లక్ష్మీదేవికి మధ్య జరిగిన ఈ ప్రణయ కలహము, యక్ష గంధర్వాది దేవతలు సేవించి తరించిన యీ సంవాదము సమస్త జగత్తునకు మంగళప్రదము అగును గాక!.

---

# బ్రహ్మోత్సవము

*

రండు రండు జనులారా! కన్నుల
పండువుగా బ్రహ్మోత్సవమట
ఏడుకొండల దేవునికి,
వేడుకలను వీక్షింపగ॥

మొదట ధ్వజారోహణమట,
ముదముగ నటుపై
ప్రతిదివసము పవలు రేయి
అతి వైభవముగ స్వామి
వివిధ వాహనముల
నవ మోహన రూపముతో
పురవీథుల నూరేగు నంట,
సురలు గూడ చూతురంట॥

ఎన్నెన్నో వేడుకలట,
కన్నులు రెండు చాలవట
తిరు వేంకట విభుని
తిరు నాళ్ళను జూడ!॥

హరి కథలట,
అరుదైన సంగీత సభలట,
వేదమంత్ర పఠనములట,
నాదస్వర ఝురులట,
మంగళ వాద్యములట – స్వామికి
శృంగార విశేషములట!
వేంకట నగమే
వైకుంఠంబై భాసిలునట॥

— వైవారుస్వామి అప్పాస్వామి

---

శ్లో॥ మృష్టాంగరాగ మవకీర్ణ
శిరోరుహాంతం దష్టాధరం
కరరుహక్షత మీక్షణంచ।
ప్రత్యగ్రి గంధమతితాస్త
మపాంగ శోణం
స్వినాన్యస్యమంగమభివీక్ష్య
రమా జగాద॥

శయన గృహములో లక్ష్మీదేవిని వదలి వనవిహారమునకు పోయి తిరిగివచ్చిన స్వామికి, జుట్టు రేగిపోయెను. చందనపు బొట్టు చెదరిపోయెను, పెదవులమీద వక్షఃస్థలంమీద అక్కడక్కడ గోరు మరియు దంతముల గాట్లు కనపడెను. ఆయన శరీరమునుండి సుగంధపు పరిమళము వచ్చుచుండెను. కళ్ళుఎఱ్ఱగామారెను. ముఖముపై స్వేదబిందువులు అలంకరించుకొన్నవి. స్వామియొక్క సుకోమలమయిన శరీరముపై కలిగిన ఇటువంటి చిహ్నములను లక్ష్మీదేవిచూసి కుపితురాలై భగవానునుద్దేశించి-

దేవ్యువాచ ;

శ్లో॥ నిద్రావశాంనిశి విహాయ విహార
తల్పే క్వ ప్రస్థితోఽసి వద వంచక
తత్వతో మాం।
అన్యాప్రదశింగతి మనంగ చరిత్ర
శంసి వేషస్తుతే పిశునయత్యరవింద
నేత్ర॥

ఓ కపట నాటక సూత్రధారీ! మీ చెంత విలాసముగా నిదురించుచున్న నన్ను విడిచి మీరు ఎక్కడికి వెళ్ళినారు. నిజం చెప్పండి. ఓ కమలనయనా! మన్మథకేళి జరిపిన సూచనలు మీ వేషమునుబట్టి మీయొక్క విలక్షణ చరిత్రనుబట్టి తెలుస్తున్నది,

భగవానువాచ :

భద్రేపయోధి తట కానన వాటికాసు
ధాటీవరస్పృహ భటైస్తురగాధిరూఢః।
గత్వా విహృత్యకతిచిత్ప్రమయాన్
పునశ్చప్రత్యాగతో మృగయు
రస్మి నకించిదన్యత్॥

[42 వ పేజీలో]

# వినాయకుడు - అగ్ని ఒకరేనా?

“వినాయక చవితి” పండుగ సందర్భ ముగా వినాయకునిగూర్చి అనేక కథలు, వ్యాసములు, వేరువేరుపత్రికలలో గల వినా యక చిత్రాలు అనేకములు!

ఎన్ని కథలు, వ్యాసములు చెప్పినను వినాయకుని గూర్చి తెలిసినది అసం పూర్ణముగనే యున్నది. ఎంత చెప్పినను చెప్పవలసినది మిగులుచునే యున్నది. అందుకే అతడు వినాయకుడైనాడు. వినాయకుడనగా “విశిష్టో నాయకః విశిష్ట నాయకః” అని విగ్రహము చెప్పినచో ఇతర నాయకుల కంటె ఈ నాయకునిలో విశిష్ట లక్షణములు, ప్రత్యేకత, (ఇతరులలో లేనివి) ఉన్నందున వినాయకుడని యొక యర్థము. “విగతో నాయకః యస్య సః వినాయకః” అని విగ్రహము చెప్పినచో ఈ నాయకునికంటే అధికుడైనవాడు వేరొ కడు లేడు, గాన దేవనాయకులలో నీతడే యగ్రగణ్యుడు గాన నీతడు వినాయకుడుగా పిలువబడుచున్నాడు.

ఇట్టి వినాయకుని గూర్చి యొకానొక కవి క్రింది విధముగా చమత్కరించు చున్నాడు.

“భూనాయకం వా ధననాయకం వా,
భజన్ భువం వా ధనమేవ లోకే,
తద్విఘ్ననాథం న భజామి,
కింతు సహస్రశస్త్వాం ప్రణమామి నిత్యమ్॥

లోకములో దరిద్రులుదరపోషణార్థము భూకామందులను సేవిస్తే వారు భూదా నము చేతురు. ధనవంతులను సేవించిన వారు ధనము నిత్తురు. అందుకొఱకు నేను విఘ్ననాథుని సేవింపను. సేవించిన విఘ్న ములుతప్ప వేరు వస్తువు వినాయకునినుండి లభ్యముకాదు. కాని విఘ్నములు కలుగ కుండుటకై వినాయకునికి వేనవేలు నమ స్కారములు చేయుచున్నాను అని చమ త్కరించెను.

[illegible] ప్రస్తుతమై [illegible] లో [illegible] ఆ యుక్త [illegible] భారతీయులు [illegible] గనే యున్నారు. అందేగాక [illegible] యున్నవి [illegible] పూజచేసినచో [illegible] కలుగును.

భారతీయులకు సందేహము కలిగిన సమాధానములు వైదిక వాఙ్మయమున లభ్యములగును. అందుచే వైదిక వాఙ్మ యము వైపునకు దృష్టి సారించి [illegible] యించుక పరిశీలింతము.

వైదిక వాఙ్మయమునందెక్కడను వినా యకుని పేరు రానరాదు. “గణపతి” పేరు మాత్రమే కలదు. తరువాతి కాలమున గణ పతియే వినాయక నామముతోకూడ ప్రసిద్ధి



వేణుగాన గణపతి (శ్రీశైల శిల్పం)

ఫోటో: శ్రీ వెల్లటూరి పూర్ణానందశర్మ.

చెంది యుండెనని [illegible] ఋగ్వేదమునందును యజు ర్వేదమునందుకూడ గణపతిని గూర్చి యీ క్రింది ఉక్తమంత్రము గలదు.

“గణానాం త్వా గణపతిం హవామహే
కవిం కవీనాముపమశ్రవస్తమమ్
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత
ఆ నః శృణ్వన్నూతిభిస్సీద సాదనమ్”

అర్థము: హే బ్రహ్మణస్పతే = ఓ అగ్ని యనెడి పాలకుడైనవాడా! గణానాం గణ పతిం = స్వీయదేవగణములకు, స్వీయ జన ములకు సంబంధించినట్టి, కవీనాం కవిం = జ్ఞానవంతులలోకెల్ల మేధావైనట్టి, ఉప మశ్రవస్తమమ్ = అన్ని అన్నములకు ఉప మానమైన, అమృతాన్నముగల, జ్యేష్ఠ రాజం = మిక్కిలి కొనియాడదగినవారిలో రాజించునట్టి, బ్రహ్మణాం పతిం = బ్రహ్మ పదార్థమునకు, లేక వేద విజ్ఞానమునకు, పరబ్రహ్మ స్వరూపమునకు, స్వామియైన, త్వా=నిన్ను, హవామహే = ఆహ్వానించు చున్నాము. నః=మాయొక్క స్తుతులను వినుచు, ఊతిభిః=ఉపకరణములతో, రక్షణ సాధనములతో, సాదనం=సదనమ్=యజ్ఞ గృహమును, ఆసీద=అధిష్ఠింపుము. ఇది అగ్నిస్తుతి. ఇందు వినాయకుని మాట లేదు. కాని జ్యేష్ఠరాజం గణపతిం అని రెండు పదములున్నవి. కావున అగ్ని గణపతి లేక, వినాయకుడు వీరు మువ్వురు భిన్నులుకారు ఒక్కరేయని గ్రహించిన తత్త్వమును గ్రహించిన వారల మగు దుము. ఇట్టి యీతడు దేవతలకు మూలము మానవులకు దేవతలకు అనకట్ట వంటివాడు, గాన, అగ్ని ప్రతిష్ఠాపనముతో వైదిక యజ్ఞారంభము, వినాయకునితో స్మార్త పూజ ప్రారంభమగుచున్నది.

దేవతలందరకు “అగ్ని” ముఖస్థా నీయుడని వేదమంత్రములు ఘోషించు

చున్నది. "అగ్నిముఖా వై దేవాః" ఇంద్రాది దేవతలకిచ్చు హవిర్భాగముఅగ్ని యందు వేల్చవలెను. అగ్ని వానిని మోసి కొని పోయి దేవతల కందించును- అన్నది శ్రుతి ప్రమాణము. "అగ్నిర్వై భరతః", సదేవేభ్యో హవ్యం భరతి. అగ్నిర్వా అర్వా" "అగ్నిర్వై దూతః" అగ్నిగుజ్జము, అగ్నిదేవమాత, అని హవ్యవాహనుని సంద ర్భము వచ్చినపుడెల్ల శ్రుతి చమత్కరించి నది. అంతియగాక అగ్నితో జ్యోతిశ్చక్రము ప్రారంభమగుచున్నది.

"అగ్నిర్నః పాతు"కృత్తికాః నక్షత్రం దేవ మింద్రియమ్. కృత్తికానక్షత్ర స్వరూపుడైన యగ్ని మమ్ములను రక్షించుగాక. అందు లకే నక్షత్ర పరిగణనము కృత్తికతో చేయ బడెను. ఇట్టి చరిత్రగల యగ్ని వినాయకుడధిరోహించిన ఎలుక ఒక రేనట. ఇది మరీ వింతగానున్నదిగదా! పరికింపుడు. అగ్ని దేవతలకు హవ్యము నందించుటలో మునిగి సెలవు కూడ పెట్టకుం డగ తన పనిని తాను విధ్యుక్త ప్రకారము నిర్వహించుచుండగా వానిని చూచి దేవ తలు హవ్యములను కడుపార మెక్కి బొజ్జలునిమురుకొనుచు,అగ్నినిహేళాకోళము చేసి వెక్కిరించిరి.అంత అగ్నికినుక వహించి దేవతలకు బుద్ధిచెప్పుటకై ఎలుకరూపమును గొని భూగర్భమున దాగియుండెను. అందు వలన భూలోకమున యజ్ఞకర్మ లాగిపోయి నవి. దేవలోకమున హవ్యము లేనందున దుర్భిక్షము తాండవించెను. భూమియందలి జనుల జఠరాగ్ని చల్లారినది. పచనపాచ నాదులు మూలపడినవి. ఈ కారణముగా దేవలోక భూలోక సంబంధములు తెగి పోయినవి. (ఈ రెండు లోకములకు సంబంధమును కల్పించువాడు అగ్నియని ఎఱుగవలయును.) ప్రజలు హా హా కార మొనర్చిరి. అప్పుడు జీవుల గోల విని జాలిచెంది వెలుగులకెల్ల వెలుగైన యాపరం జ్యోతి, చిత్ప్రకాశము, పరబ్రహ్మము, అద్వైతమూర్తి ఎలుక రూపుగొని యున్న యగ్ని నధిరోహించి గణపతి రూపముతో ప్రాణులకెల్ల దర్శనమొసంగి యభయ మొసైనెనట. ఈ కథకు క్రింది వేదమంత్రము ప్రమాణము. "అగ్నిర్దేవేభ్యోనిలాయత ఆఖూరూపం కృత్వాస పృథివీం ప్రావి శత్" (కృష్ణయజుర్బ్రాహ్మణము.)

ఇక్కడ ఒక శంక కలుగుట కవకాశ మున్నది. అగ్నిది వినాయకుడిది ఒక్కటే తత్త్వమన్నప్పుడు వారి వాహనములు గూడ ఒక్కటిగనే యుండవలయునుగదా! అట్లు లేదేమి! అగ్నికి వాహనము మేక. వినాయకుని వాహనము ఎలుక. ఈ రెంటికి సంబంధమెట్లు అన్నది ప్రశ్న. "మేషా రూఢం జటాబద్ధం" అని అగ్ని స్తుతి చేయుచున్నారము కదా!.

## ఖగోళరహస్యము

పై ప్రశ్నకు సమాధానము ఖగోళ శాస్త్రమును పరిశీలించిన తెలియగలదు. ఇంచుక తలయెత్తి చూడుడాకసము వంక, అగ్ని మేషారూఢుడై మనలకగుపింప గలడు. మేషారూఢుడనగా, అశ్వని 4 పాదములు, భరణి 4 పాదములు+కృత్తిక 1 పాదము. కలసి 9 పాదములు. ఇది మేషరాశి. ఈ నక్షత్రముల గుంపు ఆకాశ ములో మేకరూపముగనే యగుపడును. దీనికిమీదకృత్తిక యున్నది. గాన కృత్తికా నక్షత్ర అధివాసి అగ్నిగాన అగ్ని మేషా రూఢుడని వేదవాణి వక్కాణించుచున్నది. ఈ విజ్ఞానరహస్య మాధారముగా ఉపాసనా కల్పరూపమైన పూర్వమీమాంస అగ్ని ధ్యానమున కనువుగా "మేషారూఢం జటా బద్ధం "అని స్తుతించినది. దానినాధారముగా పరమదయాళురగు మహర్షులు, స్మృతు లందు పురాణములందు, అగ్నికి రూపకల్ప నము చేసిరి. పూజలలో గంధ, పుష్ప, నైవేద్య, రూపమున, ద్రవ్యసమర్పణ రూప త్యాగమునుమప్పి, ఆయా ద్రవ్యములం దున్న రాగమునువదలించి, విరాగమునేర్పి, మనోదర్పణమునందు, అనేక జన్మముల నుండి అట్టగట్టి యున్న విషయవాసనారూప మాలిన్యము, అనెడి అజ్ఞానమును, క్షాళన చేయుటద్వారా చిత్తశుద్ధిని సాధించిరి. వాని యందు "ఆత్మ" కేవలం సచ్చిదానంద స్ఫూర్తి గలిగి భాసించుటయే వారి పరమ లక్ష్యము- అని యుపనిషద్వాణి కథనము. అందుచే నిరాకార, నిరంజన, నిర్గుణ, నిర్వి కల్ప, అద్వైత పరబ్రహ్మమును సాకార, సగుణ బ్రహ్మనుజేసి, తద్విజ్ఞానమును మహర్షులు గూఢముగా నిక్షిప్తముచేసి మనలకందించిరి, అందువలననే గణపతి శబ్ద మున, గ=అనగా విజ్ఞానము, ణ=అనగా ముక్తి. ఈ రెండింటి సమన్వయమే గణపతి. అనగా జ్ఞానముద్వారా మోక్షము. దానికి అధిపతి గణపతి లేక వినాయకుడు. విశిష్ట నాయకుడు. వీనికంటె అధికుడైన నాయ కుడు లేనివాడు. అట్టి గణేశుడే పరబ్రహ్మము. "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" దీనియందు పాసనా సౌకర్యము కొఱకు అనేక నామ, రూప, గుణ, కల్పనము. భక్తుల ననుగ్ర హించుటకై, పరమాత్మ స్వరూపము నిరా కారమయ్యు, సాకారమయ్యెను. భూమి యందు పుట్టిన ప్రతిజీవికి గమ్యము చేరు టకు భక్తిమార్గముకంటె సులభమైనది వేరొకటి లేదని మహర్షుల కథనము. ఈ భావమునే క్రింది శ్లోకములు వివరించు చున్నవి.

జ్ఞానార్థవాచకో గశ్చ,
ణశ్చ నిర్వాణవాచకః ।
తయోస్సిద్ధం పరంబ్రహ్మ,
గణేశం ప్రణమామ్యహమ్ ॥
చిన్మయస్యాద్వితీయస్య
నిష్కలస్యాశరీరిణః ।
ఉపాసకానాం కార్యార్థం
బ్రహ్మణో రూపకల్పనా ॥
భక్తార్థం సగుణో జాతు
నిరాకారోఽపి చిన్మయః ॥

— రాణి హయగ్రీవశర్మ





# శ్రీమద్భగవద్గీత

(సీరియల్)

వ్యాఖ్యాత :

శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి

(గతసంచిక తరువాయి)

## చతుర్థ అధ్యాయం

గతసఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః ।
యజ్ఞా యాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥ 23

దేనిమీదా ఆసక్తి లేకుండా, విముక్తి పొంది, మనస్సును ఆత్మజ్ఞానంమీదే నిలిపినవాడు భగవంతుడి ప్రీతికోసం కాని, లోకకళ్యాణార్థంకాని చేసే కర్మలన్నీ పూర్తిగా నశించిపోతాయి.

బ్రహ్మార్పణం బ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ ।
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మ సమాధినా ॥ 24

యజ్ఞంలోని హోమసాధనాలు, హోమద్రవ్యాలు, హోమాగ్ని, హోమం చేసేవాడు, హోమం చేయబడింది, హోమకర్మ పరబ్రహ్మ స్వరూపాలే అని భావించి యజ్ఞకర్మలు ఆచరించేవాడు పరబ్రహ్మనే పొందుతాడు.

దైవ మే వాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే ।
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞే నైవోపజుహ్వతి ॥ 25

దేవతలను ఉద్దేశించి కొంతమంది యోగులు యజ్ఞం చేస్తారు. మరి కొంతమంది బ్రహ్మమనే అగ్నిలో ఆత్మచేత తమ ఆత్మనే ఆహుతి చేస్తున్నారు.

శ్రోత్రాదీ నీన్ద్రియా ణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి ।
శబ్దాదీ న్విషయా నన్య ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి ॥ 26

కొంతమంది చెవిలాంటి ఇంద్రియాలను నిగ్రహం అనే అగ్నిలోనూ, మరికొంతమంది శబ్దాది విషయాలను ఇంద్రియాలనే అగ్నిలోనూ హోమం చేస్తున్నారు.

సర్వాణీన్ద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే ।
ఆత్మ సంయమ యోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే ॥ 27

కొందరు ఇంద్రియాలన్నిటి వ్యాపారాలూ, ప్రాణ వ్యాపారాలూ జ్ఞానంతో ప్రకాశించే మనోనిగ్రహమనే అగ్నికి అర్పిస్తున్నారు.

ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాఽపరే ।
స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయ స్సంశితవ్రతాః ॥

దానధర్మాలే యజ్ఞంగా కొంతమంది, తపస్సే యజ్ఞంగా కొంతమంది, యోగసాధనే యజ్ఞంగా కొంతమంది ఆచరిస్తున్నారు. కార్యదీక్ష, కఠోరవ్రతం కలిగిన మరికొంతమంది వేదాధ్యయనమే యజ్ఞమని భావించి స్వాధ్యాయ యజ్ఞమూ, జ్ఞానయజ్ఞమూ చేస్తున్నారు.

అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే ।
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః ॥ 29

అలాగే ప్రాణాయామపరులు కొంతమంది ప్రాణవాయువు, అపానవాయువుల గతులను నిరోధించి అపానంలో ప్రాణమూ, ప్రాణంలో అపానమూ హోమం చేస్తున్నారు.

అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి ।
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞ క్షపిత కల్మషాః ॥ 30

మరికొంతమంది ఆహారనియమంతో ప్రాణవాయువు లను ప్రాణాలతోనే అర్పిస్తారు. యజ్ఞాలు తెలిసిన వీళ్లంతా యజ్ఞాలవల్ల పాపపంకిలాన్ని క్షాళనం చేసుకొంటున్నారు.

యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్ ।
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ! ॥

కురుకులభూషణా! యజ్ఞాలలో మిగిలిన అన్నమనే అమృతాన్ని భుజించేవారు శాశ్వత పరబ్రహ్మం పొందుతారు. యజ్ఞం ఒకటీ చేయనివాడికి ఇహలోకసుఖం లేదు; పరలోక సుఖం అసలే లేదు.

ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే ।
కర్మజాన్విద్ధి తాన్ సర్వాన్ ఏవం జ్ఞాత్వా విమోక్ష్యసే ॥

ఈ విధంగా వివిధయజ్ఞాలూ వేదంలో విశదీకరించబడ్డాయి. అవన్నీ కర్మలనుంచి ఏర్పడ్డాయని తెలుసుకుంటే నీవు సంసారబంధంనుంచి విముక్తి పొందుతావు.

శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరన్తప ।
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే ॥ 33

అర్జునా! ద్రవ్యంవల్ల సాధించబడే యజ్ఞంకంటే జ్ఞానయజ్ఞం శ్రేష్ఠం. సమస్త కర్మలూ జ్ఞానంలోనే పరిసమాప్తం కావడం దీనికి కారణం.

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥ 34

తత్త్వవేత్తలైన జ్ఞానులు అలాంటి జ్ఞానం నీకు ఉపదేశిస్తారు. వారివద్దకు వెళ్లినప్పుడు వినయవిధేయతలతో నమస్కరించి, సమయం సందర్భం చూసి ప్రశ్నించి, సేవలు చేసి తెలుసుకో.

యద్ జ్ఞాత్వా న పునర్మోహమ్ ఏవం యాస్యసి పాణ్డవ! ।
యేన భూతాన్యశేషేణ ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి ॥ 35

ఆ జ్ఞానం తెలుసుకుంటే నీవు మళ్లీ ఇలాంటి మోసం పొందవు. సమస్తప్రాణులనూ నీలోనూ, నాలోనూ కూడా చూడగలవు.

అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సన్తరిష్యసి ॥ 36

పాపాత్ములందరిలో మహాపాపివైనా సరే, జ్ఞానమనే తెప్పతోనే పాపసాగరాన్ని దాటివేస్తావు.

యథైధాంసి సమిద్ధోఽగ్నిః భస్మసా త్కురుతేఽర్జున! ।
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥ 37

అర్జునా! బాగా మండుతున్న అగ్ని కట్టెలను ఎలా భస్మం చేస్తుందో అలాగే జ్ఞానమనే అగ్ని సర్వకర్మలనూ భస్మం చేస్తుంది.

న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే ।
తత్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విన్దతి ॥ 38

ఈ ప్రపంచంలో జ్ఞానంతో సరితూగే పవిత్రమైన వస్తువు మరొకటి లేదు. కర్మయోగసిద్ధి పొందినవాడికి కాలక్రమేణ అలాంటి జ్ఞానం ఆత్మలోనే కలుగుతుంది.

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేన్ద్రియః ।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిం అచిరేణాధిగచ్ఛతి ॥ 39

శ్రద్ధాసక్తులూ, ఇంద్రియనిగ్రహమూ కలిగినవాడు బ్రహ్మజ్ఞానం పొందుతాడు. జ్ఞానం కలిగిన వెంటనే పరమశాంతి లభిస్తుంది.

అజ్ఞ శ్చాశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః ॥

అజ్ఞానం, అశ్రద్ధ, అనుమానం మనిషిని పాడుచేస్తాయి. అడుగడుగునా సందేహించే వాడికి ఇహలోకంలో కూడా సుఖశాంతులుండవు.

యోగసంన్యస్త కర్మాణం జ్ఞానసఞ్ఛిన్న సంశయమ్ ।
ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ! ॥ 41

అర్జునా! నిష్కామకర్మయోగంవల్ల కర్మఫలాలు విడిచిపెట్టి, జ్ఞానంతో సంశయాలు పోగొట్టుకున్న ఆత్మజ్ఞానిని కర్మలు బంధించలేవు.

తస్మా దజ్ఞానసమ్భూతం హృత్స్థం జ్ఞానాసినాఽత్మనః ।
ఛిత్త్వైనం సంశయం యోగం ఆతిష్ఠోత్తిష్ఠ భారత ॥ 42

అర్జునా! అందువల్ల అజ్ఞానం మూలంగా నీ హృదయంలో కలిగిన ఈ సందేహాన్ని జ్ఞానమనే కత్తితో నరికివేసి, నిష్కామ కర్మయోగం ఆచరించు. లేచి యుద్ధం చెయ్యి.

ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం,

శ్రీకృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని

"జ్ఞానయోగం" అనే నాల్గవ అధ్యాయం సమాప్తం.

( సశేషము )

# ముండకోపనిషత్తు

## ద్వితీయముండకం

## ద్వితీయఖండం

ఆవిః సన్నిహితం గుహాచరన్నామ
మహత్పద మత్రైతత్సమర్పితం
ఏజత్ప్రాణన్నిమిషచ్చ యదేతజ్జానథ
సదసద్వరేణ్యం పరం
యద్విజ్ఞానాద్వరిష్ఠమ్.

బ్రహ్మపదార్థం నిశ్చలమైన ధ్యానయోగంవల్ల స్పష్టమవుతుంది. ప్రతి వ్యక్తి హృదయములో తేజోరూపముతో వున్నది. దానిని మించిన గొప్ప వస్తువులేదు. కంటికి కనిపించేవీ కనిపించనివిన్నీ అయిన పదార్థ సముదాయం అంతా దానియందు అణగి వుంది. దాని సంకల్పాన్నిబట్టి అది కదులుతుంది. కదిలిస్తుంది. నాశమనే వికారం బ్రహ్మపదార్థానికి లేదు. ఉన్నది అనేవారికి వుంది. లేదనేవారికి లేదు. వివేకాన్ని కలిగించే గురువని చెప్పవచ్చు. ఆ బ్రహ్మపదమును మించి కోరవలసేది లేదు.

బ్రహ్మతత్త్వం ఇది-అని తెలుసుకోండి.

2

యదర్చిమద్యదణుభ్యోఽణు
యస్మిన్‌లోకా నిహితా లోకినశ్చ
తదేత దక్షరం బ్రహ్మ స ప్రాణస్తదు వాఙ్మనః
తదేతత్సత్యం తదమృతం
తద్వేద్ధవ్యం సోమ్య! విద్ధి.

బ్రహ్మపదార్థం జ్యోతిస్స్వరూపం. అణువుకన్నా సూక్ష్మం. అన్నిటికన్నా ఉన్నతం. లోకాలకూ లోకాలయందున్న ప్రాణులకూ కుదురు. జీవికి బ్రతుకుతెరువై ఎన్నటూ నాశములేనిదై వుంటుంది. మాటా మనస్సూ తానే. ఎప్పుడూ స్థిరంగా వుండేది అదే. సౌమ్యుడా! బ్రహ్మ అంటే ఈలాటి లక్షణాలు కలది. ఇదే సత్యం. ఈ రహస్యం తెలుసుకో! ఇది తెలిస్తే అన్నీ తెలుసుకున్నట్టే.

3

ధనుర్గృహీత్వౌపనిషదం మహాస్త్రం
శరం హ్యుపాసానిశితం సంధయీత
ఆయమ్య తద్భావగతేన చేతసా
లక్ష్యం తదేవాక్షరం సోమ్య విద్ధి.

ఉపనిషత్తు చెప్పిన విషయమే మహాస్త్రముగా చెప్పబడిన విల్లుకు ఆధారం చేసుకుని ధ్యానం అనే పదునైన బాణం ఆ వింటికి కూర్చి చిత్తమును బ్రహ్మభావము నందే నిలిపి చలించని ఆ బ్రహ్మపదార్థము నందు విడిచిపెట్టు. అలాగు తెలుసుకో ఆ పదార్థాన్ని.

4

ప్రణవో ధనుః శరో హ్యాత్మా
బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే
అప్రమత్తేన వేద్ధవ్యం
శరవత్తన్మయో భవేత్.

బ్రహ్మమే లక్ష్యం. ఓంకారం విల్లు. జీవుడు అమ్ము (బాణం). లక్ష్యము (గురి) నందు బాణాన్ని జాగ్రత్తగా ప్రయోగించినట్లు నిశ్చలమైన ప్రణవజపమనే సాధనతో మనసును పదునుబట్టి అభ్యాసంచేత నిలుకడ కలిగేట్టు చేసుకుని ఆ బ్రహ్మపదార్థాన్ని కనిపెట్టాలి.

(విలువిద్య నేర్చుకునేవానికి గురి తప్పకుండా కొట్టాలంటే మనసుతోసహా చెదరని దృష్టి అవసరం. అలాగే బ్రహ్మపదార్థాన్ని తెలుసుకోవాలంటే ప్రణవోపాసనతో చిత్తస్థైర్యం కలిగి బ్రహ్మధ్యానముతోనే వుండాలి. అదే యోగసాధన.

ఈ వస్తువును ఆ వస్తువుతో కలపడమే యోగం. నాశసహితమైన జీవుణ్ణి నాశరహితమైన బ్రహ్మమునందు చేర్చడమే యోగం.)

5

అస్మిన్ ద్యౌః పృథివీ చాంతరిక్షం
ఓతం మన సహ ప్రాణైశ్చ సర్వైః
తమేవైకం జానథ ఆత్మాన మన్యా
వాచో విముంచథ అమృత స్యైష సేతుః.

ఈ బ్రహ్మమునందే సూర్యాదిగ్రహాలూ నక్షత్రాలూ తిరిగే ద్యులోకం, భూలోకం,




అంతరిక్షమూ వున్నాయి. పంచప్రాణాలతో పది ఇంద్రియాలలో పనిచేసే మనస్సు యీ బ్రహ్మమునందే త్రాడిలో కూర్చిన రత్నంలాగా కలిసివుంది. పరమపదం పొందడానికి యీ ఈశ్వరుడే నదిని దాటించే వంతెనలాగా సహాయంచేస్తాడు. కనుక అన్నిటికీ ఆధారం మూలం అయిన ఈశ్వరుడే అని తెలుసుకోండి. పనికిరాని వాదోపవాదాలు విడిచిపెట్టండి.

(జానథ! గుర్తించండి. జ్ఞానం అనే శక్తిని చక్కగా సరియైన మార్గాన వుపయోగించండి.)

6

అరా ఇవ రథనాభౌ సంహతా యత్ర నాడ్యః
స ఏషోఽన్తశ్చరతే బహుధా జాయమానః
ఓమిత్యేవం ధ్యాయథ ఆత్మానం
స్వస్తి వః పారాయ తమసః పరస్తాత్.

రథచక్రం నడుమ రేకుల్లాగా కూర్చిన నాడులుగల హృదయచక్రమునందు తేజోమూర్తియై ఈశ్వరుడుంటాడు. మీకు అజ్ఞానాంధకారం నుంచి వెలుగు చూపించి ఉత్తమ పదానికి పంపించేవాడు ఆ ఈశ్వరుడే. ఓమ్ - అనేది ఈశ్వరమయమైన దివ్యసూత్రం. అదే ఆత్మ అనుకుని ధ్యానించండి. అదే ప్రణవోపాసనం. దానివల్ల మీకు తరుగూ విరుగూలేని మేలు కలుగుతుంది.

7

యస్సర్వజ్ఞ స్సర్వవిద్ యస్యైషమహిమా భువి
దివ్యే బ్రహ్మపురే హ్యేష వ్యోమ్న్యాత్మా ప్రతిష్ఠితః
మనోమయః ప్రాణశరీర నేతా
ప్రతిష్ఠితోఽన్నే హృదయం సన్నిధాయ
తద్విజ్ఞానేన పరిపశ్యంతి ధీరాః
ఆనందరూపమమృతం యద్విభాతి.

మనసునందు కలిసి ప్రాణాలనూ శరీరాన్ని నడుపుతూ హృదయాన్ని ఆశ్రయించి అన్నమునందు ఆధారపడి జీవు

దుంటాడు. ఆ జీవునకు సంబంధించే వివేక ముతో యోగులు ధ్యానదృష్టితో తమలోనే ఆ ఈశ్వరుడ్ని చూస్తూవుంటారు.

ఈ విశ్వమంతా ఆ పరాత్పరుని మహిమ గానే భావించు. ఈశ్వరుడు సర్వజ్ఞుడు, అంతటా వ్యాపించి ఆత్మరూపముగా వుంటాడు. అతడే ఆనందం. నాశంలేని తేజోమూర్తి. ఎక్కడ వుంటాడని భ్రమ పడకు. ఆ ఈశ్వరుడు నీ శిరస్సునందున్న బ్రహ్మరంధ్రములోనే వున్నాడు. సంకల్ప వికల్పాలులేని స్వచ్ఛమైన నీ హృదయా కాశమందున్నాడు.

8

భిద్యతే హృదయగ్రంథిః
ఛిద్యంతే సర్వసంశయాః
క్షీయంతే చాస్య కర్మాణి
తస్మిన్ దృష్టే పరావరే.

సర్వశక్తి సంపన్నుడైన ఈశ్వరుడ్ని ధ్యానయోగమూలంగా చూసినవానికి సంక ల్పాలూ వికల్పాలూ మరి వుండవు. అదా? ఇదా? అనే సందేహం వుండదు. వాని కర్మ కాండ నశిస్తుంది. (ఇంతకుముందు చేసిన వాటి ఫలితం మరి నిలవ వుండదు. ఆ తరువాత ఆ వ్యక్తి ఏ కర్మ చెయ్యనక్కర లేదు.)

9

హిరణ్మయే పరే కోశే
విరజం బ్రహ్మ నిష్కలం
తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతిః
తత్: యదాత్మవిదో విదుః.

దహరాకాశమునందున్న బ్రహ్మపదార్థం మాయ, అజ్ఞానం అనే వాటికి లొంగక నిష్కల్మషమై వెలుగును కలిగించేవాటికి తాను వెలుగును యిస్తూవుంటుంది. ఆత్మ తత్త్వాన్ని తెలుసుకున్నవారే ఆ బ్రహ్మ పదార్థాన్ని తెలుసుకుంటారు.

10

న తత్ర సూర్యోభాతి న చంద్రతారకం
నేమా విద్యుతో భాంతి కుతోఽయ మగ్నిః
తమేవ భాంత మనుభాతి సర్వం
తస్య భాసా సర్వమిదం విభాతి.

ఈశ్వరునికి ముందు యింత వెలుగు నిచ్చే సూర్యచంద్రులూ, నక్షత్రాలూ, మెరుపులూ కాసింతైనా వెలగవు. మనమీదే వీటి వెలుగంతా. వీటినన్నిటినీ మించి వెలిగే దివ్యజ్యోతిర్మూర్తి ఆయన. అతని వెలుగు యీ సూర్యచంద్రాదులకు వెలుగు నిచ్చి తద్ద్వారా విశ్వానికి వెలుగు కలిగిస్తూంది.

11

బ్రహ్మైవేదమమృతం పురస్తాత్
బ్రహ్మ పశ్చాత్ బ్రహ్మ దక్షిణత శ్చోత్తరేణ
అధశ్చోర్ధ్వం చ ప్రసృతం
బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్.

శౌనకా! ఒక్కమాట విను:

ప్రాణికి ముందు, వెనుక, నలుదిక్కులా క్రిందా పైనా భూమ్యాకాశాలలో బ్రహ్మ పదార్థం వ్యాపించి వున్నది. విశ్వమంతా బ్రహ్మమయం.

(నీ కంటికి కనిపించేదీ, కనిపించక హృదయములో వెలుగుతూ నీ బ్రతుకుకి వెలుగునిచ్చేదీ ఆ ఈశ్వరుడే.)

'ఇందుగలడందులేడని - అని పోతనా మాత్యులవారు ప్రహ్లాదుని నోట యీమాటే అనిపించారు. అలాటి విషయమంతా అర్థం చేసుకుంటూ చదవాలి. అది గ్రహించాలి.(

ఇది ద్వితీయముండకమందు
ద్వితీయఖండం

(సశేషము)

## గుంటూరు ప్రకాశం జిల్లాలలో సప్తగిరి విక్రేతలు

శ్రీ వి. నరసింహాచార్య
సత్యదేవ న్యూస్ ఏజెన్సీ
బాపట్ల - 522101 గుంటూరుజిల్లా

పి. పద్మావతి
W/o పి. వి. ఆర్. అప్పారావు
హిందూ ఏజెంట్
పొన్నూరు - 522124 గుంటూరుజిల్లా

శ్రీ జి. గంగాధరరావు
24-9-1 అగ్రహారం (కోనేరుదగ్గర)
గుంటూరు - 522003

శ్రీ ఇ. వి. రమణమూర్తి
C/o శ్రీ విద్యాబుక్‌హౌస్ గాంధీచోక్
ప్రభుత్వ ఆస్పత్రిదగ్గర
తెనాలి - 52.201 గుంటూరుజిల్లా

శ్రీ వి. రామమోహనశర్మ
న్యూస్ ఏజెంట్
ఆర్. టి. సి. బుక్‌స్టాల్
రేపల్లె, గుంటూరుజిల్లా

శ్రీమతి యస్. విజయలక్ష్మి
విజయలక్ష్మి బుక్‌స్టోర్స్
చిలకలూరిపేట (పోస్టు) గుంటూరుజిల్లా

శ్రీ అనుమోలు జగన్నాథరావు
అధ్యక్షులు, కార్యదర్శి, శ్రీవేంకటేశ్వర భక్త
సంఘం, నకరికల్లు - 522615
నరసారావుపేట తాలుకా గుంటూరుజిల్లా

శ్రీ పువ్వాడ కోటేశ్వరవిఠల్‌గుప్త
గుప్తాజనరల్ స్టోర్స్
మంగళగిరి (పోస్టు) గుంటూరుజిల్లా

శ్రీమతి కె. దేవసేన
న్యూస్ ఏజెంట్
11-17-19 రామిరెడ్డిపేట
నరసరావుపేట - 522601 గుంటూరుజిల్లా

శ్రీ వల్లూరి దత్తాత్రేయ ఉమాశంకర్
S/o శ్రీ వల్లూరి ఆంజనేయులు

మారుతి న్యూస్ సర్వీసెస్ 6-16-24
61/1, అరండల్‌పేట గుంటూరు-522002

శ్రీ దిట్టకవి వేంకటరామానుజాచార్యులు
S/o డి. తిరుమలాచార్యులు
శ్రీవాసవీ కన్యకా పరమేశ్వరి దేవాలయం
పిడుగురాళ్ళ - 522413 గుంటూరుజిల్లా

# శ్రావణ పూర్ణిమ

— శ్రీ జి. ఆర్. నరసయ్య

శ్రావణపూర్ణిమను శ్రావణీయని సంస్కృతంలో, ఆంధ్రులు - జంధ్యాల పూర్ణిమ యని, అరవలు-పూనూల్ పున్నమియని - మహారాష్ట్రులు నార్లీ పూర్ణిమయని - గుజరాతులు, మాళవదేశీయులు రాఖీపున్నమ యనియు. ఆయారాష్ట్రములలో ఆచరింపబడే తీరును బట్టి విభిన్న నామాలతో వ్యవహరిస్తుంటారు.

ఉపాకర్మ అంటే ప్రారంభమని యర్థము. వేదాధ్యయన ప్రారంభమని రూఢ్యర్థము. ఉపాకర్మ అత్యంత ప్రాధాన్యమైన వైదికకర్మ. తొలిసారిగా జరిగే యజ్ఞోపవీత సంస్కారానికి ఉపనయనం అనిపేరు. వేదాధ్యయనం గాయత్రీ జపంతో ప్రారంభమౌతుంది. ఆ గాయత్రి సమస్త వేదముల సారమని చెప్పబడు తున్నది.

ఈనాడు యజ్ఞోపవీతధారులు క్రొత్త జందెము ధరింతురు కావున ఈ పండుగ యజ్ఞోపవీతధారులలో ప్రాముఖ్యముగ నున్నది. ఉపాకర్మమందు ధరించియున్న జందెము పాతదిగాని కొత్తదిగాని దానిని పురాతనమైనదిగానే భావించి త్యజించి క్రొత్త యజ్ఞోపవీతము ధరించాలని శాస్త్రములు ఉద్ఘాటించుచున్నవి.

ఉపవీతముయొక్క మూడు పోగులు ఈ విశ్వము త్రిగుణ - త్రికాల - త్ర్యవస్థా - త్రిలోక - త్రిమూర్తి - త్రివర్గ - సృష్టి స్థితి లయ - ఇత్యాది త్ర్యాత్మకముగ, నుండు నని సూచించు చున్నవి. ఉపవీతములో తొమ్మిది తంతువులుండును. అట్టివానిని గృహస్థుడు మూడు - వానప్రస్థుడు రెండు బ్రహ్మచారి, యతి, యొకటి చొప్పున ధరించవలెను.

"ఓం యజ్ఞోపవీతం పరమం పవిత్రమ్
ప్రజాపతేర్యత్ సహజం పురస్తాత్
ఆయుష్యమగ్ర్యం ప్రతిముంచశుభ్రం
యజ్ఞోపవీతం బలమస్తుతేజః !! "

ఈ ధారణమంత్రము అర్థము ఇది. యజ్ఞోపవీతము పరమ పవిత్రమైనది. ప్రజాపతితో కూడ తొలినుండి సహజముగనున్నది. దీని ధారణ ఆయుష్షు, బలము, తేజము శ్రేష్ఠత ఇచ్చి, మనిషిని పరిశుద్ధంచేసి - ధర్మాచరణ సామర్థ్యం కలుగజేయును. పై మంత్రమును ఉచ్చరించి జందెమును ధరింపవలెను. ఆతరువాత గాయత్రీ మంత్రమును జపించి పాతజందెమును తీసి వేయవలెను.

"ఓం భూర్భువస్సువః, తత్సవితుర్వరేణ్యం
భర్గోదేవస్య ధీమహి, ధియోయోనః
ప్రచోదయాత్ !!

శరీరము తొమ్మిది ద్వారాలు గలదని జందెంలో తొమ్మిది పోగులుగల మూడు దారాలుంటాయి. అంటే మనుష్యుడు దైవ-ఋషి-పితృ అనే మూడు ఋణాలతో పుట్టుతున్నాడు. యజ్ఞారాధనలు చేసి దేవఋణం, వేదశాస్త్రాధ్యయనం చేసి ఋషిఋణం. జీవమాతా పితరులకు సేవలు-అంత్యమున శ్రాద్ధాది కర్మలు ఒనర్చుచూ సంతానం పొంది పితృఋణమును, ఈ మూడింటి నుండి ముక్తిని పొందాలనే ఆదేశమిస్తుంది జందెము.

రక్షాబంధన పూర్ణిమయనికూడ శ్రావణ పూర్ణిమకు పేరున్నది. రక్షాబంధనం శుభ దాయకమైన పరమ పవిత్రపర్వం. ఇది భారతీయ పర్వాలన్నిటిలోను కాక విదేశీయ పర్వాలలోనూ సాటిలేనిది. ఇది శివరాత్రి. జన్మాష్టమి, రామనవమివంటి ఆధ్యాత్మిక పర్వాలవలెగాక మానవతా మూల్యాలకు భారతీయ సంస్కృతికి గీటురాయి. రక్షాబంధన అని ఔత్తరాహులు, శ్రావణపూర్ణిమ అని దాక్షిణాత్యులు వ్యవహరిస్తారు. ఇరుగు పొరుగుల అన్యోన్య ప్రేమను సోదర సోదరీ పవిత్రబంధాన్ని విశ్వానికి చాటిచెప్పే దివ్య పర్వమిది.

సోదర సోదరీ పవిత్ర ప్రేమకు రక్షా బంధనం రమణీయ చిహ్నం. అన్నాచెల్లెళ్ళ అనుబంధం. అన్నాతమ్ముళ్ళ అనురాగ బంధం అది ఏనాటికీ తెగనిది. కాలంనా, దూరమైనా, విడదీసినా కలకాలమూ ఉంటుంది ప్రేమబంధం. ఈ పండుగకు సాంఘిక ఆధ్యాత్మిక విశిష్టత ఉన్నది. ఈరోజు సోదరీమణులు తమ అన్నతమ్ముళ్ళకు రాఖీ(రక్ష)కట్టి వారిని తమ సంరక్షణా నిర్వాహకులుగా భావిస్తారు. ఇంతేకాక ఈనాడు బంధువులును స్నేహితులును ఒకరి నొకరు ముంజేతిపై పట్టుదారమైన వెండితీగనైన బంగారుతీగనైననను, ఇంకను రత్నమౌక్తికములతో జేసిన కంకణముల నైన కట్టుకొందురు. దీనినే "రక్షాబంధన" అని యందురు. ఈ రక్షాబంధన శ్రేయో దాయకమైన బంధం. పరస్పర అనుబంధాన్ని పెంచేబంధం. అందువల్లనే దీని కింత ప్రాముఖ్యం. ఇది ప్రతి ఏటా శ్రావణపూర్ణిమనాడు జరుపుకొనే పండుగ. రాఖీనిగురించి కొన్ని పురాణగాథలుకూడ కలవు.

రాఖీకట్టించుకొని రక్షాధర్మం పాటించే వారలకు యమదూతల భయముండ దనియు యముడు తనసోదరి"యమున"తో చెప్పెనట.

ఈ పండుగ విషయము భవిష్యోత్తర పురాణమందిట్లున్నది.

పూర్వము దేవతలకు రాక్షసులకు యుద్ధము జరిగినదట. అప్పుడు ఇంద్రుడు ఓడిపోవునేమోయని బృహస్పతి ఆలోచించి రక్షణోపాయముగ శ్రావణియందు రక్ష కట్టినాడట. శచీదేవికూడ ఇంద్రునకు రక్షకట్టినదట. ఆ రక్షాతోరణ ప్రభావము

( 33వ పేజీలో)

# లయ విన్యాస చక్రవర్తి

# శ్యామశాస్త్రి

—శ్రీ ఇలపావులూరి కామేశ్వరరావు

ఆంధ్రప్రదేశంలోని రాయలసీమను రత్నాలసీమ అనే ప్రసిద్ధి ఉంది. రత్నాలు ఒకవేళ లభ్యమైనా అవి సామాన్యులకు అందుబాటులో ఉండవు. రత్నాలను పార్థివాలు అంటారు. ఈ విధంగా లభ్యమయ్యే రత్నాలపై రాజుల సంపూర్ణహక్కు అనాది నుండి ఉంటూనే ఉంది. ప్రజలకు సుఖ శాంతులిచ్చి సంస్కారాన్ని అందవేసి సంఘంలో ప్రశాంతి, హాయి, [illegible]డానికి ఈ పార్థివరత్నాలు దోహదం చేయకపోగా అశాంతి, అసూయ, పోటీ మొదలైన ఒడుదుడుకులు కలిగించడం తథ్యం. ఎంతమంది అనుభవించినా తరగకుండా అసూయాద్వేషాలకు తావివ్వకుండా ఉండే రత్నాలు, కొన్ని ఉన్నాయి. అవి సాహిత్య రత్నాలు, సంగీతరత్నాలు. ఉత్తమకావ్యాలు ఎంతమంది చదివి ఆనందించినా వాటికి తరుగు లేదు. కాగా, రుచి పెరుగుతూ ఉంటుంది. అట్లే ఉత్తమ సంగీత రచనలు ఎంతమంది పాడుకొని ఆనందించినా ఎవరికి ఏమీ హానిలేదు. అలా ఈ విధమైన సంపత్తిని కూర్చిపెట్టిన మహనీయులు రాయలసీమలో ఎందరో పూర్వం ఉండిరి. ఇప్పుడూ ఉన్నారు. ఇకమీదా ఉండగలరు. కర్ణాటక సంగీతప్రపంచంలో స్వర్ణయుగం అనుకునే 18, 19 శతాబ్దాలలో విలసిల్లిన సంగీత త్రిమూర్తులలో ఇద్దరు, రాయలసీమకు చెందినవారే. వారిలో 1762 లో జన్మించిన శ్రీశ్యామశాస్త్రి పూర్వీకులు కంభం గ్రామానికి చెందినవారే. ఇది పూర్వపు కర్నూలు జిల్లాలోనిదే. రెండవ మహనీయుడైన శ్రీ త్యాగరాజు పూర్వీకులు కూడా కంభం తాలూకాలోని కాకర్ల గ్రామానికి చెందినవారే. ఈ రెండు రత్నాలు రెండు శతాబ్దాలుగా యావత్ దక్షిణ భారత దేశానికి సంగీత సాహిత్యమైన వెలుగును ప్రసాదిస్తూ నివాళులందుకొంటున్నవి. ప్రస్తుతం శ్రీశ్యామశాస్త్రి జీవితం, సంగీత రచనలను గురించి సంక్షిప్తంగా పరిచయం చేయడం జరుగుతుంది.

శ్రీ శ్యామశాస్త్రి తండ్రి విశ్వనాథ అయ్యర్. తల్లిపేరుతెలియదు. పదహారవ శతాబ్దంలో వీరి పూర్వీకులు తమిళనాడు లోని కంచికి వలసపోయారు. అప్పుడు శ్రీ కామాక్షి అమ్మవారిని బంగారు కామాక్షి విగ్రహానికి అర్చకులుగా నియమితులైరి. కాలక్రమాన మహమ్మదీయుల దండయాత్రలవల్ల అనేక విగ్రహాలకు జరుగుతున్న ఉపద్రవాలనుండి ఆ కామాక్షి విగ్రహాన్ని రక్షించడానికి ఆ కుటుంబంవారు తంజావూరుజిల్లా తిరువారూరుచేరి అక్కడి శ్రీత్యాగరాజస్వామి ఆలయంలోని ఒక మంటపంలో ఉంచి పూజిస్తుండేవారు. ఈ తిరువారూరులోనే 1762 సం॥ ఏప్రిల్ 26వ తేదీ శ్యామశాస్త్రి జన్మించారు. తంజావూర్ పరిపాలిస్తున్న తులజాజీ రాజు ఆశ్రయం లభించగా 1781 లో ఈ కుటుంబం తంజా



వూరు చేరింది. వీరితోపాటు బంగారు కామాక్షి విగ్రహం కూడా తంజావూరు చేరింది. తంజావూరులోని నేటి శ్రీకామాక్షి అమ్మన్ కోవెల ఇలా రూపుదిద్దుకొంది.

శ్యామశాస్త్రి పూర్వీకులలో సంగీత సంప్రదాయంలేదు. ఆలయంలో అర్చనే వారి వంశాచారము. తల్లిదండ్రుల సంకల్పం ప్రోత్సాహం లేకపోయినప్పటికి జగజ్జననీ జనకుల సంకల్పం వల్ల శ్రీ శ్యామశాస్త్రిలో బాల్యం నుండి సంగీత సౌరభాలు గుబాళించాయి. సంగీతంలో పరిమిత ప్రవేశం ఉన్న తన మేనమామవద్ద శ్యామశాస్త్రి ప్రాథమిక సంగీతము నభ్యసించాడు. తరాలుగడుస్తున్నా తమ మాతృభాషను వదలకుండా ఈ కుటుంబం తమిళదేశంలో జీవయాత్ర కొనసాగించింది. బాల్యంలో సంస్కృతం, తెలుగు, భాషలలో తగినంత పాండిత్యం గడించిన శ్యామశాస్త్రికి సంగీత స్వామియను ఒక సన్యాసి కొన్ని నెలల పాటు సంగీతశాస్త్ర రహస్యాలను బోధించాడు. రాగ, తాళ, స్వరకల్పనల మర్మాలన్నీ ఇట్టే గ్రహించిన శాస్త్రికి ఆస్వామి అపూర్వ తాళపత్ర గ్రంథములనిచ్చి "శ్యామా! నీవు గాయకుడుగా గొప్ప కీర్తి గడించగలవు. అప్పుడప్పుడు తంజావూరు ఆస్థాన విద్వాంసుడైన పచ్చిమిరియం ఆది అప్పయ్యగారి గానం వింటూ ఉండు." అని సలహా చెప్పి దీవించి కాశీకి వెళ్ళిపోయాడు. పచ్చిమిరియం ఆది అప్పయ్య మహా విద్వాంసుడు. ఆయనతో శ్యామశాస్త్రి పరిచయం మైత్రిగా మారింది.

శ్యామశాస్త్రి వయసులో చిన్నవాడైనా ఆది అప్పయ్య మాత్రం వీరిని ఒక మహానుభావుడుగా చూస్తూ ఉండేవాడు.

ఆ రోజులలో ఆంధ్రదేశంలో బొబ్బిలి కేశవయ్య అనే కొమ్ములు దిరిగిన గాయకుడుండేవాడు. అనేక రాజాస్థానాలకు వెళ్ళి అక్కడి గాయకులను పోటీకి కవ్వించి వారి నోడించి వారి బిరుదులను లాక్కుంటూ ఉండేవాడు. శ్యామశాస్త్రి సంగీత ప్రతిభ

[19 వ పేజీలో]

# రాయలసీమలో సప్తగిరి విక్రేతలు

## కర్నూలు జిల్లా

M/S పాణ్యం సిమెంట్ కో-ఆపరేటివ్
స్టోర్స్ లిమిటెడ్ సిమెంట్‌నగర్ పోస్టు
బుగ్గన్నపల్లి ఆర్. ఎస్. - 518 206.

శ్రీ ఏ. సుబ్రహ్మణ్యం
నెం. 25-244 సంజీవనగర్
నంద్యాల-518 501

శ్రీ ఎస్. లక్ష్మీనారాయణ
M/s శ్రీ సాయిరామ్ స్టోర్స్
ఆదోని-518 301

శ్రీ డి. శ్రీనివాసమూర్తి
రిటైర్డు డిప్యూటీ తాసీల్దారు
11-49, కృష్ణనగర్
ఎంప్లాయీస్ హౌసింగ్ కాలనీ
బిహైండ్ బిర్లా కంపెనీ, కర్నూలు

శ్రీ బి. రఘునాథరెడ్డి
S/o బి. సి. సుబ్బారెడ్డి
తిరుమల ఎంపోరియం కాలేజిరోడ్
ఆత్మకూరు-518 422

శ్రీ పి. చంద్రశేఖర్
S/o పి. కృష్ణమూర్తిశాస్త్రి
రిటైర్డు తెలుగు పండిట్
17-67, కాలేజిరోడ్
నందికొట్కూరు-518 401

## అనంతపురం జిల్లా

శ్రీ. కె. ఆర్. భాస్కరచెట్టి
22-110 మెయిన్‌రోడ్, గుంతకల్లు-515 603

శ్రీ సి. ఆర్. రామచంద్రారావు
అమర్ న్యూస్ ఏజెన్సీ
అమాదగురు-515 556

శ్రీ ఎం. నాగరాజ్
న్యూస్ ఏజెంట్ వాడియంపేట-515 731
గార్లదిన్నె

శ్రీ కె. నారాయణమూర్తి
జర్నలిస్టు పామిడి-515 775

శ్రీ పి. వి. జగన్నాధగుప్త
జనరల్‌మర్చంట్ అగలి-515 311

శ్రీ వి. చంద్రశేఖర్
C/o జె. జాతప్ప
సోడాషాపు న్యూ బస్టాండ్
తాడిపత్రి-515 411

శ్రీ గురికుల నారాయణ
ఆంధ్రజ్యోతి ఏజెంట్
14 వ, వార్డు, ఉరవకొండ-పోస్టు

శ్రీ కె. ఎస్. కుమారస్వామి
ఏ. పి. ఎస్. ఆర్. టి. సి. బుక్‌స్టాల్
పెనుకొండ-515 110

శ్రీ మరాఠిజాధవ్ ప్రకాశరావు
C/o ఎం. జె. నాగోజీరావ్
దుర్గమ్మ టెంపుల్ స్ట్రీట్
ధర్మవరం (పోస్టు)

## చిత్తూరు జిల్లా

శ్రీ ఏ. కె. సుబ్రహ్మణ్యం
న్యూస్ ఏజెంట్ పాకాల (పోస్టు)

శ్రీ కె. దొరస్వామి చెట్టి
C/o ఆర్. డి. కన్నయ్యనాయుడు
అడ్వొకేట్ ఎం. బి. రోడ్
పుత్తూరు-517 583

శ్రీ టి. పి. ఉమాపతి
మెయిన్‌రోడ్ నారాయణవనం (పోస్టు)
పుత్తూరు తాలూకా

శ్రీమతి వి. వసుమతి
C/o వి. శ్రీనివాసాచార్యులు
బ్లాక్ ఎక్స్‌టన్షన్ ఎడ్యుకేషన్
పి. టి. ఎం. పోస్టు-517 319

శ్రీ ఐ. జయచంద్రప్రకాష్
C/o డి. జగన్నాధం
స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా
వలమనేరు-517 408

శ్రీ సి. వేంకటరెడ్డి
3/90, బజార్‌వీధి వాయల్పాడు (పోస్టు)

శ్రీ టి. సి. ఉమాపతి
మెయిన్‌రోడ్ నారాయణవనం (పోస్టు)
పుత్తూరు తాలూకా

శ్రీమతి వి. వసుమతి
C/o వి. శ్రీనివాసాచార్యులు
బ్లాక్ ఎక్స్‌టన్షన్ ఎడ్యుకేషన్
పి. టి. ఎం. పోస్టు-517 319

శ్రీ ఐ. జయచంద్రప్రకాష్
C/o డి. జయానందం
భారతీయ స్టేట్ బ్యాంకు
వలమనేరు (పోస్టు)

శ్రీ సి. వెంకటరెడ్డి
3-90, బజార్‌వీధి వాయల్పాడు (పోస్టు)

శ్రీ జి. ఆర్. పాండురంగయ్యశెట్టి
S/o శ్రీ జి. రామయ్యశెట్టి
విజయరంగ న్యూస్ ఏజెన్సీ
కీల్‌పట్ల (పోస్టు) - 517 408

శ్రీ కె. సుబ్బారావు
న్యూస్ ఏజెంట్ బైరెడ్డిపల్లె-517 419

శ్రీ బి. కె. శ్రీనివాసగుప్త
లాంగ్‌బజార్ వి. కోట (పోస్టు)

శ్రీ వి. ఎస్. కృష్ణమూర్తి
C/o వి. శ్రీకాంతయ్య న్యూస్ ఏజెంట్
నేతాజీరోడ్ కుప్పం-517 425

శ్రీమతి ఎస్. డి. సులోచన
మేనేజింగ్ పార్టనర్ ప్రతిభాప్రియదర్శిని
రైల్వేస్టేషన్ బుక్‌స్టాల్ తిరుపతి-517 501

(17 వ పేజీ తరువాయి)

వికసించిన రోజులలో కేశవయ్య తంజావూరు ఆస్థానానికి వచ్చి అక్కడి గాయకులను సవాలుచేశాడు. ఉద్దండుడైన కేశవయ్యను ఎదుర్కొనే ధైర్యం లేక విద్వాంసులు కట్టగట్టుకొనివచ్చి శ్యామశాస్త్రి శరణు వేడారు. నీవుతప్ప ఈ ఇక్కట్టు నుండి బయటపడవేసే వారులేరని ప్రార్థించారు. శ్రీ శ్యామశాస్త్రి దేవిమీద భారంవేసి రాజాస్థానానికి వెళ్లి బొబ్బిలి కేశవయ్యకు ఒక పల్లవి వినిపించి దానిని మరల పాడమన్నాడు. అతడు నోరు మెదపలేకపోయినాడు. కేశవయ్య పాడినదానిని తాను అవలీలగా పాడి వినిపించాడు. కేశవయ్యకు శృంగభంగమైనది. కాని శ్యామశాస్త్రి గర్వపడకుండా కేశవయ్యను స్నేహపూర్వకముగా ఆదరించాడు.

శ్యామశాస్త్రి రచనలన్నీ దేవీపరమైనవే శ్రీ కామాక్షీ మీనాక్షీ పరమైన రచనలే. రాముడు, శివుడు, కృష్ణుడు, మొదలైన దైవములను గురించి ఒక్క రచనైనా చేయలేదు. ఇది వీరి ప్రత్యేకత. రచనలు స్తోత్రప్రాయములుగా వుండి, లయకు సంబంధించిన విశేషాలు అనేకం ఇముడ్చుకొని గాయకులకు పెన్నిధి సంతరించి పెట్టినవి. త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితార్- వీరిద్దరు అనేక దేవతలను దేవుళ్ళను స్తుతిస్తూ కృతులు రచించారు. సంస్కృతాంధ్రాలలో త్యాగరాజు రచనలు సాగినట్లే శ్యామశాస్త్రి కూడా సంస్కృతాంధ్ర భాషలలో రచలు చేశారు. కాని అన్నీ దేవీపరమైనవి. దీక్షితార్ రచనలు అన్నీ సంస్కృత భాషలోనే నడిచాయి. ముగ్గురిలో జ్యేష్ఠుడైన శ్యామశాస్త్రి రచనలు రాశిలో స్వల్పంగా కనబడుతూ వున్నా వాసిలో మాత్రం సంగీత ప్రమాణాలను అత్యున్నత స్థాయికి తీసుకొని పోయినట్లు కనిపిస్తుంది. రాగంలోను, భావంలోను మిగిలిన ఇద్దరు ప్రత్యేక కృషిచేయగా లయలో రసస్పష్టి గావించడం శ్యామశాస్త్రి ప్రత్యేకత అనులోమ విలోమ- ఎత్తుగడలలోని భావ ప్రకర్షత, సంస్కృత-విద్వాంసులు పాడినప్పుడు విందుగాని అనుభవానికిరాదు.

శ్యామశాస్త్రి, త్యాగరాజు, దీక్షితార్ - ముగ్గురూ తిరువారూరులోనే జన్మించడం ఆశ్చర్యకరమైన విషయం. శ్రుతి, స్వర, లయ లక్ష్యరూపాలుగా వీరి ముగ్గురిని భావించవచ్చు. శ్రుతి సుభగంగా అపాత మధురంగా త్యాగయ్య కృతులుంటాయి. స్వర విస్తారం, రాగవిస్తారం దీక్షితార్ రచనల్లో కనిపిస్తాయి. లయమాధురి, విలక్షణ విన్యాసం శ్యామశాస్త్రిలో ప్రత్యేకత. నిజానికి మూడూకలియనిదే, సంగీతం లేనేలేదు. కాగా అన్నీ సంతరించుకొంటూనే పై అంశాలు వీరిలో ప్రత్యేకంగా రాణింపుకు వచ్చాయని చెప్పవచ్చు.

శ్యామశాస్త్రి స్ఫురద్రూపి. బంగారు ఛాయతో ఆజానుబాహువై వీరిని చూచే వాండ్ల హృదయాలలో భక్తిగౌరవం ఆహ్లాదం కలుగుతుండేవని ప్రతీతి. వీరికి జ్యోతిషం వేదాంతం ఇంకా అనేక విషయాల్లో పాండిత్యం ఉండేదట. వీరి కుమారుడు శ్రీ సుబ్బరాయశాస్త్రి గొప్ప సంగీత విద్వాంసుడు. శ్రీ త్యాగరాజస్వామి వద్ద ఇతడు సంగీతాభ్యాసం చేసినట్లు చరిత్ర చెబుతుంది. తాను గొప్ప గాయకుడై కూడా తన కుమారుణ్ణి త్యాగయ్య కడకు శిష్యునిగా పంపించాడంటే శ్యామశాస్త్రి వినయ సంపద ఎలాంటిదో ఊహింపవచ్చు.

శ్రీ శ్యామశాస్త్రి ఏ రాజునూ ఆశ్రయించలేదు. ఎవరి మీద కృతులు రచింపలేదు, వృత్తిలో అర్చకుడుగా ఉండి ప్రవృత్తిని అమ్ముకోకుండా, నమ్ముకొని పారమార్థిక సాధనకై సంగీతాన్ని ఉపాసించి ధన్యుడై సంగీత సాధకులకు పెన్నిధిని ప్రసాదించాడు నేడు వీరి కృతులు కేవలం నూటికి మించకుండా ప్రచారంలో ఉన్నవి. అయినా శ్యామశాస్త్రి కృతి ఒకటైనా లేకుంటే సంగీత కచ్చేరీ వెలితిగా ఉంటుంది. వీరి కీర్తనల చివర శ్యామకృష్ణ అనే ముద్ర తప్పకుండా కనిపిస్తుంది. తల్లిదండ్రులు ముద్దుగా వీరిని శైశవంలో పిల్చినపేరే ఇది. అసలు పేరు సుబ్రహ్మణ్యం. కృత్తికా నక్షత్రంలో జన్మించడం చేత సుబ్రహ్మణ్యం అని పేరు పెట్టినా ముద్దుపేరుగా స్థిరపడిన శ్యామకృష్ణ నామమే అంకితంగా నిలిచింది. శ్యామకృష్ణ అనే మాట పాటలో వినబడగానే ఇది శ్యామశాస్త్రి కృతి అని కొంద గుర్తుగా ఉండిపోయింది.

అపూర్వరాగాలైన తలగడ, మాంజి, చింతామణి, రాగాలలో వీరి కృతులు రచించి లక్షణాలను లక్ష్యాలను చూపించారు.

వీరి ప్రసిద్ధ కృతుల మొదళ్లు కొన్ని ఇలా ఉంటాయి.

1. నిన్నే నమ్మినాను - తోడి - త్రిపుట
2. దురుసుగా కృపజూచి - సావేరి - ఆది
3. సరోజదళనేత్రి - శంకరాభరణము - ఆది
4. హిమాద్రి సుతే పాహిమాం - కల్యాణి రూపకం.
5. బ్రోవవమ్మా - మాంజి - చాపు
6. పాలించు కామాక్షి - మధ్యమావతి - ఆది
7. పరియెవ్వరమ్మ - భైరవి - ఝంపజంప
8. నిను వినాగామణి - పూరికల్యాణి - చాపు
9. దేవిబ్రోవ సమయమిదే-చింతామణి-ఆది
10. కామాక్షి స్వరజతి - భైరవి - చాపు

శ్రీ శ్యామశాస్త్రి కృతులన్నీ విద్వదౌషధములని చెప్పవచ్చును. సంగీతకళలో ప్రావీణ్యం రావాలంటే శ్యామశాస్త్రి రచనలు కొన్నింటినైనా తప్పనిసరిగా పాఠంచేయక తప్పదు. ఇటువంటి వాగ్గేయకారత్నం తెలుగువాడు కావడం ఆంధ్రులకు గర్వకారణం మాత్రమే కాకూడదు. కనువిప్పు కలగాలి. తమిళులు సాధిస్తున్న ఈ తెలుగు కీర్తనలను ఎందరు తెలుగువారెరుగుదురని ప్రశ్నిస్తే సమాధానం నిరుత్సాహం కలిగిస్తుంది. ఈ నేతి బీరకాయ స్థితి మారడానికి కృషి జరగాలి.

జయంతి సుకృతినః తే
స్వరసిద్ధాశ్చ గాయకాః

*

# దేవతా మూర్తులు

— శ్రీ కాశీభట్ట సుబ్బరామశాస్త్రి

దేవాలయాల్లో భగవంతునికి ప్రతి రూపంగా విగ్రహాలను ప్రతిష్ఠించి పూజిస్తున్నారు. ఈ విగ్రహాలకు భగవంతునికి ఏమాత్రం భేదం లేదనడానికి "నాభక్తులు భక్తితో ప్రీతితో వస్త్రాభరణాలను బెట్టి చందనముపూసి పూలమాలతో నన్నలంకరించు తుంటారు' 'వస్త్రోపవీతాభరణ పత్ర స్రగ్గంధలేపనైః అలంకుర్వీత సప్రేమ మద్భక్తో మాం యథోచితం' అను భాగవత వాక్యమే ప్రమాణమవుతుంది. భగవంతుడు మాం(నన్ను) అని చెప్పడంవల్ల అతనికి అతని విగ్రహానికి ఎటువంటి భేదం లేదని తెలుస్తున్నది. స్వయంవ్యక్త ప్రతిమ లందువలెనే శిల్పి చెక్కిన మూర్తులందు ప్రతిష్ఠించిన విగ్రహములందును మహిమ ఉంటుంది.

భగవద్విగ్రహాన్ని శిలగా భావించడం మహాపరాధం. ఈ విషయం రామాయణంలో శ్రవణకుమార ఘట్టంలో తెలుస్తుంది. దశరథమహారాజు వేటకుబోయి మృగమనే భ్రమలో శ్రవణకుమారుణ్ణి చంపి మృత శరీరాన్ని పితరులకడకు తీసుకొని పోయినపుడు అతని తండ్రి విలపిస్తు-నేనెప్పుడైన శ్రీహరి విగ్రహంలో పాషాణబుద్ధిని గలిగియుంటినా? దానివల్లనే నాకీ పుత్ర శోకం గలిగిందా. 'శిలాబుద్ధిఃకృతా కిం వా ప్రతిమాయాం హరేర్మయా!' అని అంటాడు.

వస్తుతః భగవంతునికి భగవన్నామానికి భగవద్విగ్రహానికి కొంచెమైన భేదంలేదు. అజామీళుడు మరణించేటప్పుడు తన పుత్రునికి బెట్టిన నారాయణ అన్న పదం పలకడం వల్ల నారాయణునికి నారాయణ నామానికి భేదం లేనందునకే మోక్షం లభించింది. అట్లెవ్వడైన స్వరూపాన్ని స్వభావాన్ని గుర్తింపలేక సేవించినంతమాత్రాన ముక్తి లభిస్తుంది. బోయవాని బాణంతో గొట్టబడి కపోతం పరుగెత్తుతూఉంటే ఒక కుక్క పట్టుకుంటుంది. దానినోట గరచుకొని పరుగెడుతూ ఒక ఆలయంలో దూరి ప్రదక్షిణంగా పలుమారు పరుగెత్తింది. ఆ కపోతానికి భగవద్విగ్రహానికి ప్రదక్షిణంచేసిన భాగ్యం లభించినందున ముక్తిగలిగింది. ఈ కథ బృహన్నారదీయంలో చెప్పబడింది. భగవంతునికి విగ్రహానికి భేదమున్నట్లైతే కపోతానికి భగవత్సేవాభాగ్యం లభించేది గాదుగదా:-

విగ్రహరూపంలో భగవంతునికృప:-

భగవన్మూర్తి జీవులయెడ భగవంతునికి గల కరుణా విశేషానికి ప్రతీకమవుతుంది. ప్రాపంచిక జీవుడు భగవంతుని పూజించి సేవించియే భవసాగరాన్ని దాటగలుగుతాడు. కావున భగవంతుడు మూర్తి రూపంలో భక్తునిసేవను గ్రహిస్తున్నాడు. అయినా భక్తుని పరీక్షించడానికి అతని



ఉత్కంఠను ఇనుమడింప చేయడానికి మౌనంగా ఉంటాడు. భగవంతుని సేవించుతూ రాగా అతని దృష్టిదోషం దూరమవుతుంది. అంతః కరణం పరిశుద్ధమై విశ్వాసాన్ని దృఢపరుస్తుంది. అప్పటికి భగవంతుడు ఒకప్పుడు స్వప్నంలో ఇంకొకప్పుడు ప్రత్యక్షంగా తన దివ్యరూపాన్ని ఏదో విధంగా చూపుతూఉంటాడు.

భక్తుని హృదయంలో ఎప్పుడైన భగవంతుని స్వరూప స్వభావ విషయాల్లో సందేహం గలిగితే పరీక్షించి తీర్చుకునే అధికారంకూడ ఉంది. దీనికి కొన్ని నిదర్శనాలుకూడ ఉన్నాయి.

కలకత్తాలో లాలాబాబు అనే రాధాకృష్ణుల మహాభక్తుడుండేవాడు. అతడు మహా ధనవంతుడుగూడ. లాలాబాబు బృందావనంలో చాలాధనం వెచ్చించి ఆలయంగట్టించి రాధాకృష్ణుల విగ్రహాలు ప్రతిష్ఠ చేయించాడు. ప్రతిష్ఠా కలాపం ముగిసిన తరువాత ఈమూర్తులలో నిజంగా ప్రాణం ఉందా లేదా అనే సందేహం గలిగింది, పరీక్షింప బూనినాడు. అది శీతాకాలం. కృష్ణవిగ్రహం తలపైన వెన్నముద్ద పెట్టినాడు. శిరస్సులోని తాపంతో వెన్నముద్ద కరిగింది. ఇంకొకసారి నాసారంధ్రాల్లో ప్రత్తిదూర్చి పరీక్షించినాడు. ప్రత్తి శ్వాసతోబాటు బయటికి వచ్చింది.

భగవంతుడు మూర్తిరూపంలో అవతరించి భక్తులసేవను అంగీకరిస్తు పలువిధములైన మానసిక ప్రవృత్తుల కనుకూలంగా వ్యవహరించి వారినిసుఖపెడుతూఉంటాడు. భగవంతుడు విగ్రహరూపంలో ఉండడం ఒకవిధంగా భక్తునియెడ ఆత్మసమర్పణం చేయడమే. భగవంతుడు తన అనంతైశ్వర్యాన్ని విడచిపెట్టి స్వాతంత్ర్యాన్ని పరిత్యజించి భక్తుని చేతిలో బందీ అవుతాడు. ఆడించే బొమ్మఅవుతాడు. భక్తుడెట్లు ఉంచితే అట్లేఉంటాడు. ఏది తినిపిస్తే దానినేతింటాడు. ధరింపచేసిన దాన్ని

(29 వ పేజీలో)

# యువ వాణి

# విద్యాంసులు; నాడు-నేడు

— శ్రీ యనమదాల కామేశ్వరరావు

ఉ॥ "విద్య నిగూఢ గుప్తమగు విత్తము
రూపము పూరుషాళికిఁ
విద్య యశస్సు భోగకరి విద్య గురుండు
విదేశ బంధుఁడుఁ
విద్య విశిష్ట దైవతము విద్యకు సాటి
ధనంబులేదిలఁ
విద్య నృపాల పూజితము విద్య నెఱుంగని
వాఁడు మర్త్యుఁడే"

అన్నాడు భర్తృహరి విద్యను గురించి వివరిస్తూ. ఈ విషయమే చిన్నయ సూరి 'విద్యవలన వినయంబు ..........ఐహికా ముష్మికముల బొందు నరుడు' అన్నాడు. కాన విద్య యువశ్య పఠనీయము.

'విద్' అను ధాతువు నుండి ఏర్పడిన 'విద్య' అనే పదానికి 'తెలిసికొనుట' అను అర్థము వచ్చును. 'తెలిసికొనుట' అనగా దేనిని గూర్చి? అను సంశయము రాక మానదు. అది పెక్కు రకములు. మొదట చదువులుగా పేర్కొనబడినవి వేదములే. అవి భగవత్ప్రసాదములని మన నమ్మకము. వీనికి పాశ్చాత్యులను వ్యవహారము కూడా కలదు. 'చదువులు కోలుపోయి యొక జాడయుగానక బమ్మరించు నమ్ముదునలి వేల్పు....' (ఎఱ్ఱన నృసింహ పురాణము) దీనిని బట్టి పరిశీలింపగా మొదటి పాఠకుడు బ్రహ్మయేనని చెప్పవచ్చును.

చదువులనగా వేదములకే పరిమితమై యున్నను కాలక్రమేణ దీనికి పెక్కు రూప ములు కల్గినవి. చతుర్విధ పురుషార్థము లనబడు ధర్మార్థ కామ మోక్షములుగ మానవ జీవితాశయము కలిగిన పిదప ఒక్కటిగ నున్న వేదము నాల్గు భాగములుగా విభ జింపబడినది. ఈ విభజనము చేసినవాడు సాత్యవతేయుడు. ఇతడే భారత గ్రంథ రచయిత. వేదమును విభజించి, వేద వ్యాసుడుగా ప్రసిద్ధికెక్కినాడు. వేదములను మథించి సారభూతమగు భగవద్గీతను ప్రసా దించినాడు.

పై విధముగా వేదములందు ధర్మార్థ కామములను పురుషార్థ ప్రధానములుగా గ్రంథరచనలు జరిగినవి. అవి కూడ విద్య లుగా మారినవి. అందువలన విద్యలు నాలుగు భాగములైనవి. అవి (1) ధర్మ విద్య (2) అర్థవిద్య (3) కామవిద్య (4) మోక్షవిద్యలుగా వ్యవహరింపబడినవి.

(1) ధర్మవిద్య: ధర్మవిద్యయనగా లౌకిక ధర్మములు, జీవనవిధానపు పద్ధతులు, విద్య కాండలు మొదలగునవి.

(2) అర్థవిద్య: అర్జనమునకు సంబంధిం చిన విషయములు. అందుకు సంబంధించిన గ్రంథములు, వృత్తి విద్యలు, వ్రతములు, పూజలు మొదలగునవి.

(3) కామవిద్య: ఇది మనస్సునకు ఆహ్లా దము కలిగించునట్టి విషయము. ఇందు కామశాస్త్రము, శిల్పశాస్త్రము, నృత్య సాహిత్య సంగీతములు, నాటకములు మొద లగునవి ఇచ్చట వర్తించును.

(4) మోక్షవిద్య: ఇందు బ్రహ్మజ్ఞానము, ఆత్మ - ప్రత్యగాత్మల సంబంధము ద్వైతా ద్వైత సిద్ధాంతములు మతములు మొద లగు విషయములను తెలుపునది.

ఇట్లు విద్యలు నాలుగు విధములుగా విభజింపబడినప్పటికి మోక్షమునకు సంబం ధించిన విద్యయే విద్యయనియు, మిగిలిన వన్నియు అవిద్యలనియు కొందరి భావము. అందుచే ప్రజాబాహుళ్యమున 'కోటి విద్యలు కూటి కొరకే' అను సామెత కూడ వచ్చినది. అప్పటినుండి రాజులు, ధనవంతులు వీరికంటె మేము ఘనులమను భావము కల్గినది. 'యోగభ్రష్టో ధనశ్రేష్ఠః' 'నా విష్ణుః పృథివీపతిః' అను నార్యోక్తి ననుసరించి వీరు మదాంధులగుటకు కారణ మైనది.

భర్తృహరి దృష్టిలో విద్యయనగా చతు ర్విధ పురుషార్థదాయకమైనదే యనియు, అందును తురీయ పురుషార్థమే ప్రధాన మనియు భావము.

చం॥ తెలివి యొకింత లేనియెడఁ దృప్తుఁడనై
కరి భంగి సర్వమున్
దెలిసితినంచు గర్వితమతిన్ విహరించితిఁ
దొల్లి, యిప్పుడు
జ్ఞులమగువైన పండితుల సన్నిధినించుక
బోధశాలినై
తెలియనివాఁడనై మెలఁగితిన్ గతమయ్యెని
కాంత గర్వము౯

ఈ విషయమున భర్తృహరి రాజ్య మును, భోగములనువీడి సన్యసించిన పిదప పల్కిన పల్కా తానంతకు ముందు చదివిన పురుషార్థత్రయాత్మక విద్యా పాండిత్యము అజ్ఞానము గాసంగినదనియు, దాని వలన నాకు తెలిసినది (తనకు తెలిసినది) అల్పమే ననియు, భావించి పండితులచే సద్విద్యా బోధను పొంది గర్వమును విడిచితిననియు పల్కినాడు.

ఈ విషయమే భాగవతమున ప్రహ్లాద హిరణ్యకశ్యపుల సంవాదమునుబట్టి విచా రింపగా '..... నే జదివినవి, పెక్కు కలవు చదువులలో సారమెల్ల చదివితి తండ్రీ' అనియు, ఇనుమయస్కాంతమునవెటులో నా మది హృషీకేశుని జెందెనను. ఇదియే విద్యయని భావము. 'నారాయణుడను దాని కర్థము జ్ఞాన నివాసియని! నార శబ్దమునకు నీరనునది లౌకికార్థము. అందుకే 'నానృషిః కురుతే కావ్య' మనియు (అనగా ఋషికానివాడు కావ్యరచన చేయలేడు) 'విశ్వ శ్రేయః కావ్యమ్' అట్టి కావ్యము ప్రపంచ మునకు శ్రేయస్సు కలిగించవలయు ననియు నర్థము. శ్రేయస్సనగా భగవం తునిమీద భక్తిని పొందజేయుట యని

యర్థము కావచ్చును. కాగా విద్యయనగా పారమార్థిక విద్యయే యనుట గ్రహించ వలసినది.

వెనుకటి చరిత్రనుబట్టి పరిశీలిస్తే విద్వాంసులకు విద్యావంతులకు గొప్ప గొప్ప మర్యాదలు కల్గుచుండెడివి. వీరు ఎదురైనచో మదకరీంద్రముడిగ్గి కేలూత యొసంగుట, గండపెండెరము ధరింపజేయుట, వీరి పల్లకీ మోయుట, శాలువలు బహూకరించుట గ్రామగ్రాసాదులొసంగుట, కనకాభిషేకము చేయుట, రాజులు చేయుచుండెడివారు. భోజుడు కాళిదాసు చెప్పిన నాల్గు శ్లోకములు విని చతుర్దిక్కులనున్న రాజ్యములను ఇచ్చివేసినాడు అన్నది లోక ప్రసిద్ధము. వీరు నిరుపహతి స్థలము నభిలషింతురు. మఱి కొందఱు తూగుటుయ్యెల రమణీయ ప్రియదూతిక యిచ్చుకప్పురపు వీడియము కోరుకొందురు. ఇంకా కొంత మంది బెదిరింపుగా .... నాపేరెరుగం జెప్పితి ఘనసారాది సుగంధ లేపముల వేగం దెచ్చి లాలింపరా' యని పల్కెడివారు. వీరికి ఆగ్రహము కల్గినచో 'పోతరక్కసుని చావు ఏడవనాడు చూడుడీ, అనియో' పదవీభ్రష్టుడవు కమ్మనియో అందురు. ఆగ్రహము పోయి అనుగ్రహము కల్గినచో 'పందిరి గుంజను పారిజాతము చేయుట, చచ్చిన వానిని బ్రదికించుట, వేయియేనుగులు పదివేల గుఱ్ఱములుండగా రాజును (శత్రు రాజును) గెల్చి నగరమును పట్టము కట్టు కొమ్మనియు వరము లిత్తురు. ఈ విధముగా పురాణచారిత్రక యుగములు గడిచినవి.

ఆ కాలమున కులపతులు, విద్యావంతులు, ఆచార్యులు విద్యాలయములు స్థాపించి విద్యాపోషణము గావించుచుండిరి. గురువు పరమాత్మ స్వరూపుడనియు, గురుని యాగ్రహమునకు తిరుగులేదనియు గురుశిష్యులను గూర్చి పెక్కు కథలు ప్రచారములో కలవు. భారతమున శుక్రుని కోపనివృత్తి గావించుటకై రాక్షసరాజగు వృషపర్వుడు తన కన్నకు మాత్రెను సైతము దానిన నొనర్చినాడు. పండిత లక్షణములను గూర్చి భగవద్గీతయందు చాల విషయములు చెప్పినారు. అవియన్ని పరిశీలింప దలచినచో నదియొక గ్రంథమే అగును.

ఆ కాలమున తక్షశిల, నలందా, ఉజ్జయిని, కాశీ మొదలగు చోట్ల వెలసిన విద్యాలయములు విశ్వవిఖ్యాతములై యుండెడివి. ఈ విద్యావిషయములో రాజులు, ఉద్యోగులు, ఉదారులగు ధనవంతులు భూధన గృహధాన్యాదికముల నొసంగి పోషించెడివారు. మనుచరిత్రయందలి యిందీవరాక్షుని శాపవృత్తాంతమున 'నటవిటగాయక గణికాకుటిల పచశ్శీధురసము గ్రోలెడి చెవికి కటువీ శాస్త్రము నిను చదివింపకున్న జరుగదె' మాకు అని నిర్భీతిగా మాట్లాడినట్లు చెప్పినారు. ఇట్లు వీరు రాజులను సైతము తిరస్కరించ గలవారని చెప్పవచ్చును.

ఎంత గొప్పవారికైనను నన్నిదినము లొకేవిధముగా నుండవు కదా! ఈ కాలముననే రాజాగ్రహమునకు గురియై జైళ్ల పాలయి కఠిన శిక్షలు పొందిన పోతన శ్రీనాథుల వంటి వారు లేక పోలేదు. ఏకోహి దోషో గుణ సన్నిపాతే-' అన్నట్లు దీనిని గూర్చి ఆలోచించు నవసరము లేదను కొంటాను.

'బ్రాహ్మణో న హంతవ్య' అనియు బ్రాహ్మణోఽస్య అను వేదోక్తి ననుసరించి బ్రాహ్మణులు శిక్షార్హులు కారనియు, వారు భగవంతుని ముఖముతో సమానులనియు మనవారి విశ్వాసము. బ్రహ్మజ్ఞాతు బ్రాహ్మణః అనువాక్యమునుబట్టి బ్రహ్మ జ్ఞానము కలవారే బ్రాహ్మణులని తెలియవలెను. సుకుమారుడు, నిగమశర్మ వంటివారు జాతిమాత్రోపజీవులనియు, నిగమశర్మాభిధానంబు నేతిబీరకాయ వంటి దనియు (పాండురంగ మాహాత్మ్యము) చెప్పిన దానినిబట్టి ఇట్టివారు కూడ ఉన్నారనుట విశేషముకాదు. వీరితో పని లేదు.

రాజులు రాజ్యములు అంతరించిన పిదప కవిపండితుల గతి అధోగతి యైనది. మహమ్మదీయుల కాలమున కీడులో మేలన్నట్లు హుమయూన్, అక్బరులాంటివారు భాషా సేవ చేయిక పోలేదు.

ఇంగ్లీషు వారి పుణ్యమా యని ప్రాచీన విద్యలు, శాస్త్రములు అధ్వాన్నమైనవి. అందుచే విద్యకు పవిత్రతనమునకు విలువ లేకుండా చేసినారు. ఈ కాలమునకూడ భారతీయులు లొకపోయినను భారతీయతను పొంది సాహిత్యమును, వైదుష్యమును, కళలను, పెంపొందించిన వారిలో విక్టోరియా రాణీ, సి.పి. బ్రౌను, థామస్ మున్రో మున్నగు వారిని చెప్ప వచ్చును. ఈ కాలమునం దోసమటం చెఱంగియును దుందుడు కొప్పగ మీసములు పెంచి కవి రాజులుగా విలసిల్లిన వారు లేక పోలేదు.

ప్రస్తుతము విద్వాంసులకు బ్రతుకు అధ్వాన్నమైనది. ప్రజలలో పాశ్చాత్య నాగరికతావ్యామోహము మితిమీరుట చేత ప్రాచ్య విద్యలపై భక్తి విశ్వాసములు నశించినవి. విద్వాన్ సర్వత్ర పూజ్యతే అను ఆర్యోక్తి బదులు సరిక్రొత్త మాట పుట్టినది. రాష్ట్రములు ప్రాంతీయభాషా పోషకములని చాటిచెప్పుకొను చున్నను రాష్ట్రీయ భాషా పండితులకు విలువలేదు. సభలలోను, గోడలమీదను గౌరవతనము కనిపించుటయే కానీ సహజముగా కానిపించుటలేదు.

నేడు తెలుగు పండితులు దుర్భరమైన దారిద్ర్యం అనుభవించుచున్నారు. 'విద్వత్సు దారిద్ర్యతా' అనునార్యోక్తి సర్వత్ర ప్రతిఫలించుచున్నది: వీరిలో ఏ కొద్ది మందికో ఉపాధ్యాయ వృత్తి లభించు చున్నది. ఈ చదువు చదివిన వారికి తెలుగు సంస్కృత పండిత వృత్తికాక వేఱు విధానము లేదు. 'ఈ చదువెందుకు చదివినామురా నాయనా' అని వాపోవుచున్నారు. దుర్భరమైన జీవితము అనుభవింపలేకున్నారు వీరు. ఈ పరిస్థితి మారాలి.



# వెలుగుబాట

డా॥ నండూరి రామకృష్ణమాచార్య

## శాంతము లేక....

ఉత్తమే క్షణకోపస్స్యాత్ !
మధ్యమే ఘటికాద్వయమ్,
అధమే స్యాదహోరాత్రం !
పాపిష్ఠే మరణాంతకమ్ !!

పై శ్లోకానికి ఆంధ్రీకృతి

అణగు ఉత్తమునకు క్షణములో కోపమ్ము!
ఉండు మధ్యమునకు రెండుఘటికలు !
అధముకోపముండు అహము రాత్రియు గూడ
పాపి చచ్చువరకు పగవహించు !!

ఈ శ్లోక తాత్పర్యం వింగడిస్తే ఈ క్రింది అంశాలు తేలగలవు,

1. కోపం మంచిదిగాదు.
2. మంచివారికి కోపవస్తే అది తాటాకుల మంటవలె చప్పున చల్లారి పోతుంది.
3. ఏదో రెండుఘటికలవరకు మధ్యములకు కోపం చల్లారిపోవచ్చు. అది క్షంతవ్యమే.
4. అధములకోపం ఒకరాత్రివగలు వరకు ఉంటుంది.
5. ఇక కోపం తాను మరణించేవరకు "కసిగా" పెంపొందించుకోటం పాపాత్మునికే చెల్లుతుంది.

కోపం అంతసేపు ఉండటం మానవత్వం కాదు. అది అధమ మానవుల లక్షణం.

"మరణాంతాని వైరాని" అనే సూక్తి చొప్పున శతృమరణాలతో కోపం తీరాలి, శతృవు మరణించని పక్షంలో పాపాత్ముడు తాను మరణించే వరకు క్రోధం పెంచుకుంటాడు. అది క్షమింపరాని దోషం.

"తామసం తా మసి" అని తెలుగులో ఒక సామెత ఉంది.

క్రోధాన్నిగూర్చి ఒక విద్వాంసుని ప్రవచనం. "నీకు కోపం తెప్పించునది నీ శత్రువు నీకంటె బలవంతుడా? యోచించు; బలవంతునిపై తన్నకోపం నిరర్థకం. బలవంతునిపై ఆగ్రహం నీకు చేటు. అందుచే అట్టికోపం తగ్గించుకోవటం అంటే నిన్ను నీవు రక్షించుకోటమే. ఇక నీకు కోపం తెప్పించిన శత్రువు నీకంటె బలహీనుడే అయితే అట్టివానిపై కసితీర్చుకోటం అనవసరం. ఆ పక్షంలో అతనిని నీవు క్షమించటమే నీ యోగ్యతకు నిదర్శనం. నీ బలానికి సార్థక్యం. ఏవిధంగా చూచినా కోపం మంచిదిగాదు. సోదరా! కోపం మంచిది గాదు."

మనిషిని కోపం ఆవహించటం కొయ్యకు నిప్పు అంటుకోవటం వంటిది. ముందు ఆ కొయ్య బొగ్గు అవుతుంది. ఆ నిప్పు ఎదుటి వానిని దహించవచ్చు; దహించక పోవచ్చు. అది అపై మాట. కోపం ముందు కోపిష్ఠిని దహిస్తుంది.

కోపం వచ్చినపుడు మనిషి శరీరంలో వచ్చే మార్పులు గురించి ఒక ప్రఖ్యాత శరీర శాస్త్రజ్ఞుడు అన్న మాటలు ఉదాహరింపదగినవి.

"కోపం వచ్చినపుడు మనిషి శరీరంలో ఉద్వేగం ఏర్పడుతుంది. రక్తప్రవాహం ఎక్కువ వేగం పుంజుకుంటుంది. నాడిలో దూకుడు ఏర్పడుతుంది. కన్నులు ఎఱ్ఱబారుతాయి. కంటిలో ఉష్ణద్రవం ఏర్పడుతుంది. రక్తంలో కొన్ని ఆమ్లాలు ద్రావకాలు ఉద్భవిస్తాయి. శరీరం అనిర్వచనీయమైన వ్యాయప్రయాసలకు లోనవుతుంది. ఒక్కవాక్యంలో చెప్పాలంటే మనిషికి కోపం వచ్చినపుడల్లా కొంత ఆయుస్సు క్షీణిస్తుంది. ఆరోగ్యం తగ్గుతుంది."

ఆధ్యాత్మిక పురోగతికోసం కాకుండా కేవలం ఆయురారోగ్యము కాపాడుకోవాలి అనే స్వార్థ చింతతోనైనా మనిషి "కోపం" తెచ్చుకోకుండా ప్రశాంత చిత్తత అలవరచుకోక తప్పదు.

"క్రోధ మోహ నామకులైన ఘోర శత్రులిరువు రెరియించు చుండుదు రెపుడు అంతరంగ మయ్యుభయంబు నడంగకున్న
ఊరకగలదె బ్రాహ్మణ్య గౌరవంబు."

ఇది మహాభారత ప్రబోధం.

"కోపం తాత్కాలికమైన ఉన్మాదం" అని చీనా సామెత.

సరే! మానవులం అనగా కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్య వివశులం. అప్పుడప్పుడు కోపం వస్తుంది. ఏం చెయ్యాలి అని ఎదురు ప్రశ్న ఎవరైనా వేయవచ్చు. దీనికి సులువైన విరుగుడు సూచించాడు ఒకపెద్దమనిషి. కోపం రాగానే ఒకటి రెండు మూడు అని పది అంకెల వరకు నీలోలోపల గుణించు. కోపం తగ్గుతుంది. తగ్గకపోతే ఇంకో పదివరకు లెక్క పెట్టు. అప్పటికీ తగ్గకపోతే వందవరకు లెక్కించు. పరిహాస విజల్పితమైన యీ పరిష్కారంలో కొంత పరమార్థంగూడ లేకపోలేదు.

తెలుగులో "అసమర్థుడికి కోపం ఎక్కువ" అనే సామెత ఏర్పడింది. ఎందుచేతనో సమర్థత, మౌన గాంభీర్యం సహజీవనం కొనసాగిస్తాయి. అట్లాగే అసమర్థత-కోపం ఒకేచోట ఉంటాయి.

"పేదవాని కోపం పెదవులకు చేటు" అనే సామెత తెలుగులోఉంది. అయితే ఆ సామెతకు మెలమెల్లగా కాలదోషం పడుతోంది. ధనికుల కోపం వారి పెదవులకే గాక పదవులకుగూడ నేడు చేటు తేవచ్చు.

నిజం చెప్పాలంటే కోపం ఏ సమస్యనూ పరిష్కరించ లేదు సరిగదా ప్రాయికంగా క్రొత్త చిక్కులు తెచ్చిపెట్టవచ్చు.

కోపం ఎవరికీ మంచిదిగాదు. పేదవారికి కోపం చెడుపే. ధనికులకూ చేటే.

కోపం ఏవ్యక్తికైనా ఎంత చెరపు చేస్తుందో ప్రత్యేకంగా చూడాలంటే కోపం వచ్చినవాడు తన మొగం అద్దంలో చూచుకోవటం మంచిది. కోపం వచ్చినప్పుడు ఎంత అందమైన ముఖం అయినాసరే. వికృతంగా మారుతుంది.

కోపాన్ని నిగ్రహించగలుగుతే ఆత్మ చైతన్య స్రవంతికి "ఆనకట్ట" కట్టినట్లే. అప్పుడు జీవితం సస్యశామలం అవుతుంది.

కాంచీపుర వాస్తవ్యుడైన శ్రీ వేంకటాధ్వరి 17 వ శతాబ్దికి చెందిన గొప్ప సంస్కృత విద్వత్కవి. తన పాండిత్యముతో శ్లేషయమక చక్రవర్తియను బిరుదును సంపాదించెను.

లక్ష్మీ సహస్రము. యాదవరాఘవాభ్యుదయము (30 శ్లోకములు) విశ్వగుణాదర్శము. వరదాభ్యుదయము. ఉత్తర చంపు. శ్రీనివాసచంపు అను నాలుగు చంపూప్రబంధములను రచించెను.

ప్రస్తుత వ్యాసము విశ్వగుణాదర్శములోని శేషాచల వర్ణనము.



శ్రీవారి బ్రహ్మోత్సవ ప్రత్యేక వ్యాసం



# వేంకటాధ్వరి దృష్టిలో శ్రీ వేంకటేశ్వరుడు

— శ్రీ తట్టా నరసింహాచార్యులు

కృశానువు, విశ్వావసువు అనుగంధర్వులిద్దరు దేశాటనమునకయి బయలుదేరిరి. వారిలో కృశానువనువాడు, అసూయాగ్రస్తుడు. లోకములోని ప్రతి వస్తువులోని లోపమును వ్రేలితో నెత్తి చూపును. వారిలో విశ్వావసువనువాడు గుణగ్రహణపారీణుడు. ప్రపంచములోనున్న ప్రతివస్తువులోని గుణములను మాత్రమే గ్రహించును. వారిద్దరు నొకనాడు, విమానము నధిరోహించి ప్రపంచయాత్ర చేయసాగిరి. వారిద్దరు శేషశైలము దగ్గరగా విమానమును పోనిచ్చిరి. దక్షిణ భారతములో తిరుపతి క్షేత్రము-సుప్రసిద్ధము. దానికి దగ్గరలో తిరుమల గలదు. తిరుమలలో శ్రీ వేంకటేశ్వరస్వామివారు నివసించుచున్నారు. వారి నివాస స్థలమునకు శేషశైలమనియు వేంకటాచలమనియు వృషభాచలమనియు పేర్లు గలవు. విమానమునందుండియే విశ్వావసువు శేషశైలము నీక్షించి - ఇట్లు వర్ణింప దొడగెను.

పరిమళిత తమాల స్తోమపుష్యద్రసాల
ప్రకర తిలకసాల ప్రస్ఫుటద్రుజాలః,
శ్రిత సముపనశీల శ్రీశలీలానుకూలః
శిథిలిత యమమూలః సేవ్యతాం శేషశైలః.

పరిమళించుచున్న తమాల వృక్షములు, పూతతో నిండిన రసాల వృక్షములు, తిన్నగానున్న తిలక వృక్షములు, సన్నగానున్న సర్జవృక్షములు, మున్నగు మనోహర వృక్షములతో నీ కొండ నిండియున్నది. ఆశ్రిత రక్షాదీక్షా తత్పరుడగు రమారమణుని లీలా విలాసములకిది యనువగు ప్రదేశము. ఆధివ్యాధి జరామరణములతో యమయాత

నలననుభవించు సంసారుల సంతాపమును బాపగలదు. కనుక నీ శేషశైలమును సేవించుట సముచితము, సమంజసము.

సన్నగేషు ఏ నగేషు ఖగేషు
స్వీకరాశిషు వృషత్సు వృషత్సు,
వల్లికేషు ఏ వటేషు కుటేషు
ప్రార్థయంతి జనిమత్ర మునీంద్రాః.

మునీంద్రులందఱును నచ్చటి పుట్టలలోని పాములుగానీ, యచ్చటి నిట్టనిలువుగానున్న కొండలుగా గానీ, గగనాంగణమున నెగురు పక్షులుగాగానీ, పొదలలో తిరుగు పెద్దపులులుగాగానీ, ఇటునటు పరుగెత్తు ముచ్చట గొలుపు మచ్చలలేళ్లుగాగానీ, పువ్వులతో నిండిన తీగెలుగాగానీ, చిమ్మచీకటితో నిండిన కొండగుహలుగా గానీ, వీనుల విందగు సవ్వడులతో ప్రవహించు సెలయేళ్ళుగాగానీ పుట్టినచో బాగుండునని తలంచుచుందురు. కరచరణాది కర్మేంద్రియములతోను, త్వక్చక్షురాది జ్ఞానేంద్రియములతోను, భగవన్మాన్య శీలమగు మనముతోను కూడియున్న మానవులుగా జన్మింపవలెనని కోరుకొనియుందురని వేఱే చెప్పనేల? జ్ఞానవంతులగు మానవులుగానే కాక జడపదార్థములుగనైన నిచ్చట నివాస భాగ్యము లభించినచో సకల-కల్యాణగుణ సంపన్నుడగు భగవంతుని సేవాభాగ్యమబ్బునని మననశీలులగు మునుల తలంపు.

"అహో? మహోన్నతా ఖల్వస్య శైలస్య ధన్యతా"

ఆశ్చర్య మాశ్చర్యము! ఈ కొండయొక్క గొప్పతనము నెవ్వరును వర్ణింపజాలరు. ఏలయన —

వైకుంఠేఽపి నిరతశ్చంర
మసంరవిభవం మహః,
తదత్ర చిత్ర చారిత్రం
రమతే రమయా సమమ్.

భగవానుని నివాసస్థానములలో వైకుంఠపురము ఉత్తమోత్తమమని యెఱుగని వారుండరు. అట్టి వైకుంఠమును కూడ వీడివచ్చి, అపరిచ్ఛిన్నైశ్వర్యమును కలిగియుండి, అతి విచిత్రమైన నడవడికల శ్రీమహావిష్ణువు- అలర్మేల్మంగ యను శ్రీమహాలక్ష్మితోగూడి ఈ కొండయందే విహారము సలుపుచున్నాడు.

ఏవిధ ...హారే ...వైక ...
...విహారే ...,
...ధర్మ...
...వాన్...నే.

భగవంతుడు, ఋగ్యజుస్సామాథర్వ వేదములచే ప్రతిపాద్యుడు. సకల జగదవన దీక్షాదక్షుడు. రమారమణిని యురమున దాల్చినవాడు. వృషభాచలమున విహ



రించువాడు. భక్తుల యుల్లములలో నివసించువాడు. దాన గుణమున కేకైకాశ్రయమైనవాడు. ఏట్టి వికారములులేనివాడు. అట్టి భగవంతునియందు-అనగా శ్రీకృష్ణభగవానుని యందు నా చిత్త మెల్లప్పుడును లగ్నమగుగాక" అని విశ్వావసువు హర్ష ప్రకర్షముతో ధ్యానము గావించెను.

అప్పుడతని ప్రియమిత్రుడగు కృశాను విట్లు పలికెను. "హంత! వ్యాపేత విషయాంతర వ్యాసంగం స్వాంతరంగం దేవ ఏవా స్మిన్నను భవతి వృషసంగమ్."

అబ్బ! విషయాంతర వ్యాసంగము తెఱుగని నీయంతరంగము, శ్రీమంతుడగు భగవంతునియందు నేఱువేఱు వీలులేని సంబంధమును గలిగియున్నది.

విశ్వాత్మకునియందు విశ్వాసము కలిగియున్న విశ్వావసువు కృశానువుతో నిట్లనెను-

"సఖే సత్యమేవ విదితం భవతాం"
దధతీ చిరాయ సుదతీమురస్థలే
తవపేతసీమ వదతీ సుఖం సతామ్,
రసికస్య చిత్తమిహ కస్య దేవతా
ప్రతిపన్న వన్నగ నగా ప గాహతే.

శ్రీనివాస శ్రీ పరబ్రహ్మమని పేరుగాంచిన ఈ పరదేవత, ఈ రమారమణిని యురమున దాల్చుచున్నది. హద్దులులేని ఆనందమునందఱకు నందజేయుచున్నది. పాపములనన్నిటిని పటాపంచలు జేయు నీ వేంకటాచలమునందు నిత్యనివాస మొనరించు చున్నది. ఇట్టి ఈ పరదేవత- పరబ్రహ్మమును తెలియగోరు, ఎవ్వరియుల్లములను రంజింపజేయుదు? పాపములను భంజింపజేయుదు?

విశ్వాసశాలియగు విశ్వావసువుతో, విశ్వాసహీనుడగు కృశాను విట్లు పలికెను.

కిమరే! కేవల మర్థపరమముం దేవ మనుసంధత్సే.

ఓరీ! విత్తమును దప్ప, చిత్తమును మఱియొక దానిని గోరని ఉత్తమ దేవ

సత్తముని చిత్తమున దలంచుటకు నుత్తల పడుచున్నావా ?

ఇష్టప్రాప్తిమనిష్టభంగ
మపి వా సంప్రార్థ్య భక్త్యా జనైః
యద్దాతవ్యమితి ప్రతిశ్రుత
మభూద్ద్రవ్యం తదాప్తే ఫలే,
తే దాస్యంతి, న చేత్స్వయం
భయమపావృత్యాద్య తేషాం పునః
కృత్స్నం సార్థహిరణ్యవృత్త్యపద
మిదం గృహ్ణాతి వృద్ధ్యా సమమ్.

తమ మనస్సులో కోరుకొన్న కోరికలు నెఱవేరిన వారుగానీ, కొండలవలె వచ్చి మీదపడి, మబ్బులవలె విడిపోయిన ఆపదలు గలవారు గానీ, అగు నీ స్వామివారి భక్తులు, ఏదియోకొంత ద్రవ్యమును, శ్రీ స్వామివారికి సమర్పించుటకు మనములో నిశ్చయించుకొందురు. కోరికలు నెఱవేరిన తరువాత గానీ, ఆపదలు తొలగిపోయిన తరువాతగానీ, మఱపు చేతనో, అవకాశము లభింపమిచేతనో - కొందఱు భక్తులు మ్రొక్కుబడులను సరియైన సమయములో తీర్చుకొనరు. మ్రొక్కుబడులను తీర్చుకొనని మ్రుక్కడులను ఈ దైవసత్తముడు-ఆపదలపాలు జేయును. చేసి ఊరుకొనునా ? ఊరుకొనడు. చక్రవడ్డీకట్టి, ఆ మ్రొక్కుబడి సొమ్మును రాబట్టుకొనును. మఱియు నీతని హీన కృత్యములను నీ వెఱుగవు.లెక్కకు మిక్కుటమయియున్నవి.

తాతేత్యామంత్ర్య కంచిద్వనభువి తృషిత
స్తోయ బిందుం యయాచే
కస్మాద్వ్యచై స్తటాకం ఖనత ఇహ గిరా
హంత మృద్భారమూహే,
దత్తాం కేనాపి సూనావళి మధిమకుటం
మృణ్మయీమేవ దధ్రే
సోఽయంభూయస్త్రుతిశ్చైర్భువనపతి
రితి స్తూయతే ధ్యాయతే చ.

ఒకానొకప్పుడితడు మెండుగా గాయుచున్న యెండలో- వెంకటాచలారణ్యములో తిరిగి దప్పికతో బాధపడుచుండెను. అచ్చట నీటి కడవను మోసికొని పోవుచున్న బాటసారిని జూచి ఒక్క నీటి బొట్టును నాకిచ్చి పొమ్మని బ్రతిమాలెనట. బాటసారియు ఒక్క బొట్టును మాత్రమే నాలుకమీద వేసెనట. దప్పికకొన్నవాడు దప్పిక తీర్చుమని యాచింపవలెనా ? ఒక్కబొట్టిచ్చిన చాలులే యని గర్వమును చూపవలెనా ? లోకములో కోరికను మించి యిచ్చువారెవరుందురు ? వస్తువు పుష్కలముగా నున్నను కోరుకొనుటచేతగాని మ్రుక్కడులుందురుగదా ?

ఒకడు తన తోటలోని చెట్లకు నీటికొఱకై చిన్న చెరువును త్రవ్వుకొనుచుండగా- ఆ త్రోవన పోవుచు వాని మట్టితట్టలను తాను మోసెనట. మన స్వంత పనులను మనము చూచుకొనవలెను గానీ, పరాయి పనులను నెత్తిన వేసికొనుట యేమిమంచిదని ? ఇట్టి పనులచే "పరోపకారపు పాపన్న" యను బిరుదును పొందుటకంటె స్వార్థమేమి నెఱవేఱును ?

ఒకడు మట్టి పూలదండను తయారుజేసి ఇవ్వగా ఆ దండను- తన శీర్షమునందలి, నవరత్న ఖచితకిరీటమున దాల్చెనట. తగిన పనియేనా ? విలువలను గుర్తింపవలదా ? అర్హులకివ్వవలసిన స్థానము ననర్హుల కిచ్చుటకూడ వివేకమేనా ? వివేక విహీనములగు పనులనుచేయు నీ హీనాతిహీనుని, కేవలము పామరులేగాదు, దాంతులై, వేదాంతులై, వేదవేత్తలైన వారే, ముల్లోకములకు ప్రభువని మాటి మాటికి స్తుతించుచున్నారు-నిర్మలము నిశ్చలమునగు చిత్తముతో ధ్యానించుచున్నారు. ఇది ఉచితమా ? ఆగండి, ఆలోచించండి. -కిమరే ! కరుణా నీరధయే వేంకటపతయేఽ వ్యసూయసి ? శృణు తావత్.

నియంతా జంతూనాం నిఖిల
జగదుత్పత్తివిభవ
ప్రతిక్షేపైః క్రీడన్ పరమ
పురుషః పన్నగ నగే,
పరత్వే సౌలభ్య ప్రకటన
కృతే వేంకటపతిః
కృపా సింధుః కాం కా
మిహ మనుజలీలాం న తనుతే.

ఓయీ ! దయార్ద్రహృదయుడగు వేంకటనాథుని విషయములో నీ వసూయ పడుట సముచితముగాదు. వినుము.

సమస్త జంతువులలో నంతర్యామియై, సృష్టి, స్థితి, లయహేతువై, ఈ శేషాద్రియందు పరమపురుషుడు క్రీడించుచున్నాడు సర్వోత్తమత్వమును సర్వోన్నతత్త్వమును కలిగియుండి కూడ, "సర్వసులభుడ" ను బిరుదును సార్థకము చేసికొనుటకు కరుణాసాగరుడగు నీ క్షీరసాగరశయనుడు మానవ లీలల నెన్నింటిని ప్రదర్శించెనో చెప్ప నలవిగాదు. మఱియు,

కిమప్యుపాదాయ దిశన్నభీష్టం
కృత్స్నం జనేభ్యః పతిరంజనాద్రేః,
కృష్ణావతారీయ కుచేల సంపత్
ప్రదానరీతిం వివరీవరీతి.

పూర్వము కుచేలుడను భక్తుడుండెను. అతడు చాల దరిద్రుడు. అతనికి సంతానము మిన్న. దానిని పోషించుటకు తగిన రాబడి సున్న. ఒకప్పుడతడు తన భార్య మాట చెవిని బెట్టి అటుకులు మూటగట్టుకొని ద్వారకానాథుని ప్రధాన ద్వారమున నిలిచెను. ద్వారకానాథుడును ద్వారపాలకుల వలన బాల్యమిత్రుడగు కుచేలుని రాకను తెలిసికొని, వెంటనే అంతిపురమునకు రావించి - ఉచితాసనమున సుఖాసీనుని గావించి-సముచిత సపర్యల నొనరించి గారవించి కుశలప్రశ్నల నడిగెను. కుచేలుడును చినిగిన తనయుత్తరీయము కొంగున నున్న మూటనువిప్పి, అటుకులను, కానుకగా శ్రీకృష్ణునకు సమర్పించెను. తన సతీ మణి రుక్మిణి వలదని వారించినను, వినక, ఆయటుకులను అపరిమితానందముతో భక్షించెను. చేసిన యుపచారములకు మెచ్చుకొని, వచ్చిన పని మరచి ఏమియునడుగక, కొన్ని దినములు గడిపి, ఇంటికి చేరుకొనగా తన యిల్లు సిరిసంపదలతో నిండి యుండెను. ఇది జూచి కుచేలుడాశ్చర్యచకితుడాయెను. ఇదియే కుచేలోపాఖ్యానము.

ఈ రీతిగనే, శ్రీ వేంకటేశ్వరస్వామియు భక్తులనుండి ఏ కొద్దియో గ్రహించి, వారికి సకలైశ్వర్యములను, పుత్రపౌత్రాభివృద్ధిని కలిగించుచుండును.

(ముగింపు వచ్చే సంచికలో)

## గ్రంథసమీక్ష

## అద్వైతశాంకరి

రచన : శ్రీ వంగర కాశీవిశ్వేశ్వర వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి. పుటలు: 16 + 28, మూల్యము: 4 రూపాయలు, ప్రాప్తి స్థానము: వంగర కాశీ విశ్వేశ్వర వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి, ఇ. డి. సి., లిమిటెడ్ – ఐ. ఎల్ టి. డి. డివిజన్, పి. బి. నెం. 20, రాజమండ్రి – 533 101.

"అద్వైత శాంకరి" ఎంత అందమైన పేరు! శ్రీశ్రీశ్రీ కంచికామకోటి పీఠాధిపతులూ శ్రీ శ్రీ శ్రీ శృంగేరి శారదా పీఠాధిపతులూ అనుగ్రహించిన శుభాశీస్సులతో శ్రీతిరుమల తిరుపతి దేవస్థానమువారి ద్రవ్యసహాయంతో రూపుదిద్దుకొన్న ఈ పుస్తకంలో పరమేశ్వరీ సంస్తుతి రూపములైన 108 పద్యాలున్నవి. అన్ని పద్యాల చివర "శాంకరీ" అనే మకుటం జోడించటంవల్ల ఈ కృతిని 'శతక' రూప సాహిత్య ప్రక్రియగా సంభావింప వచ్చును.

అద్వైతమత స్థాపకులైన ఆదిశంకరుల వారి మీది అత్యంత భక్తి తాత్పర్యముల వల్లనో, పార్వతీ పరమేశ్వరుల అద్వైత భావనవల్లనో, వాగర్థములకుగల అద్వైత సంబంధంవల్లనో, ఆత్మకూ పరమాత్మకూకల అద్వైతాను సంధానాన్ని అనుసరించియో "అద్వైత" శబ్దం ఈ కవికి మిక్కిలి ప్రీతి పాత్రమైనది. అందువల్ల ఈయన తన కృతికి "అద్వైత శాంకరి" అని చక్కని నామము ఉంచారు.

శాస్త్రిగారికి లలితాసహస్రనామావళి మీద ఆసక్తి అధికం. ఆ నామాలతో జగన్మాతను సంబోధించటం ఆయనకెంతో యిష్టం. "శ్రీ మాతా! పరదేవతా! ద్యుతిధరా! చిద్రూపిణీ! చిత్కళా?" అంటూ ఒక చోట దేవిని సంబోధిస్తారు. మరొకచోట "బ్రహ్మాణీ! భువనేశ్వరీ! భగవతీ! బ్రహ్మాండ భాండోదరీ" అని స్తుతిస్తారు. ఇంకోచోట "కామాక్షీ! ఘనకామకోటి నిలయా! కామేశ్వరీ!" అంటూ నమస్కరిస్తారు. వేరొక చోట "శ్రీచక్రస్థిత బిందుమధ్య నిలయా! శ్రీరాజరాజేశ్వరీ!" అంటూ పారవశ్యంతో ప్రార్థిస్తారు. అద్వైతశాంకరి సర్వమంత్రాత్మికగా, సర్వ యంత్రాత్మికగా, సర్వ తంత్రాత్మికగా వీరికి ప్రాధాన్యమిచ్చింది. ఆ సర్వ దేవతా స్వరూపిణిని —

"సిద్ధంగాన్ని యుండవని, పెన్నిధులిచ్చు
లక్ష్మివంచు, పే
ర్కొన్న మనాదిశక్తివని, పల్కుల తల్లివంచు,
నెన్నియో
పొద్దికతంపులూహలను పోరెడి నిన్ను భజింతు
రొక్కొ"

అని స్తోత్రం చేశారు.

వీరి కవితలో చిన్న చిన్న పదాలతో తెలుగుదనం ఉట్టిపడుతూ ఉంటుంది.

పట్టినపట్టు వీడనిక;
పంతము కాదిది; నాదు జీవితం
బట్టిటు మాగసాగెను; వయః
పరిమాణము తగ్గుచుండె; నే
నెట్టు తరింతునో యెరుగ
నింత భవాంబుధి: నెట్లు త్రోతువో
గట్టిగ నిన్నె కొల్చెదను
కష్టము బాపెదవంచు శాంకరీ!

అక్షిసామ్యాన్ని పురస్కరించుకొని కంచికామాక్షిని ఒకే పద్యంలో చెప్పటం హృదయంగమంగా ఉంది.

అక్షిస్ఫూర్తి దలంచి పేరిడిరి నీ
కత్యంతర క్తిన్ విశా
లాక్షీనామము కాశికాపురిని:
లోలాక్షీ; యదేరీతి మీ
నాక్షీనామము బెట్టిరా మధురలో;
జ్ఞానేశ్వరీ: నీకు కా
మాక్షీనామము కంచిలోన:
బహూనామంబుల్ గదా! శాంకరీ!

ఈ "సర్వసృష్టికీ మూలకారణం ఆది శక్తివైన నీవేనమ్మా!" అంటూ "విత్తున నంకురమ్మువలె విశ్వము మున్నుగ నిర్వికల్పు, విత్తునుండి కాలమున చిత్రగతిన్ దనరారు నెంతో గమ్మత్తుగన్" అని ఉదాహరణంగా పలుకుతారు.

విశ్వానికీ పరమాత్మకూ అభేదాన్ని ఉగ్గడిస్తూ "ఉన్నది యొక్కటే యుగుళ హోహలు చేసిన రెండు నందునే, కన్ను ప్రపంచమంతయును గన్పడు నద్దములోని బింబమే" అంటారు. బ్రహ్మాన్నీ, విశ్వాన్నీ వేరువేరు — చూడటం అజ్ఞానమూలకమని భావిస్తారు. బ్రహ్మజ్ఞానం లేనివారు పైపై వేషాలతో మోక్షం సాధించలేరని ఈ క్రింది పద్యంలో నొక్కి వక్కాణించారు —

జటలం బెంచిన, ముండిపై వదిన,
కాషాయంబులన్ గట్టినన్,
గటింగౌపీనము దాల్చినన్, విపిని
తాఁ గాంతారమందుండినన్,
ఘటికుండై హఠయోగ సిద్ధులను
దిగ్భ్రాంతిన్ ప్రదర్శించినన్,
పటుసుజ్ఞాన విహీనతన్ బరము
సంపాదింపనే శాంకరీ!

పరమేశ్వరునికీ, పరాశక్తికీ అవినాభావ సంబంధాన్ని నిరూపిస్తూ "ఆయన శివుడైతే నీవు "శివవు". ఆయన రుద్రుడైతే నీవు "రుద్రాణి"వి. ఆయన భవుడైతే నీవు "భవాని"వి. ఆయన శర్వుడైతే నీవు "శర్వాణి"వి. ఆయన శంకరుడైతే నీవు "శాంకరి"వి అంటారు. మాయ శబ్దానికి పరాశక్తి అని అర్థం చెప్పి "అంతా మాయ" అంటే "ఈ ప్రపంచమంతా పరాశక్తి స్వరూప"మని అనటం చమత్కారంగా ఉన్నది. అట్లాగే శివపార్వతులకు అద్వైతం భావిస్తూ "పల్కరే, నీ పేరెన్ని" శివా! "యటంచు బిలువన్ మీరిద్దరున్ శాంకరీ!" అంటారు. నిజమే. "శివా!" అన్న సంబోధన శివకూ శివునకూ ఇద్దరికీ వర్తిస్తుంది. ఇదొక చమత్కారం.

శాస్త్రిగారి శబ్దసౌభాగ్యానికి ఉదాహరణ యోగ్యమైన దీ క్రింది పద్యం.

దివ్యము నీదు విగ్రహము
దేవుని చైతము మోహపెట్టు, మం

తవ్యము నీదు నామమది
తారకమంత్రము నొటజేసి, వ
క్తవ్యము నీదులీల, నిర
గారణ కార్యములెన్న నీవెగా!
భావ్యము కీర్తితవ్యమును
భవ్యము నీ చరితంబు శాంకరీ!

ఆచార్య శంకరులన్నా, ఆయన రచన అన్నా శాస్త్రిగారికి ఎంతో గౌరవం. సౌందర్య లహరిలోని "ధనుః పౌష్పం మౌర్వీ మధుకరమయీ పంచవిశిఖాః" అన్న శ్లోకానికి ఈ క్రింది అనువాదం అనురూపంగా ఉంది.

మృదువౌ పూవిలు! నమ్ములన్నను యిదే;
మిత్రుండు వాసంతుడౌ;
కుదురుం గుంపటి లేని తుమ్మెదలచే
కూడెన్ గదా నారియున్;
ముదమౌ యశరీరి మారుడు
మహామోహంబు పుట్టించుట
న్నది నీ పంచదశాక్షరీ జప
మహీయస్ఫూర్తియే శాంకరీ!

అదే విధంగా "సౌందర్యలహరి" లోని "తనీయాంసం పాంసుం తవ చరణ పంకేరుహభవం" అన్న శ్లోకానికి —

వ్యష్టి సమష్టిరూపమున
వ్యక్తమునయ్యెడి సర్వవిశ్వమున్
సృష్టినిజేయు స్రష్ట; యది
శ్రీపతి మోయు సహస్రశీర్షుడై;
నష్టముజేయు దానిని
పినాకధరుండు; యథార్థమింతకున్
స్పష్టము నీపదాబ్జ గతపాంసువె
సాధనమయ్యె శాంకరీ!

అన్న పద్యం చక్కని అనువాదం.

ఈ విధంగా శతకమంతా అద్వైత సిద్ధాంతాలతో, ఆచార్య శంకరుల అడుగు జాడలలో నడిచింది. అందుకనే ఈ కృతికి "అద్వైతశాంకరి" అనేనామం అన్వర్థమౌతున్నది. ఒక పద్యంలో హంసగాయత్రిని విశ్లేషించారు. మరొక పద్యంలో "తత్త్వమసి" మహావాక్యాన్ని వ్యాఖ్యానించారు. "పిల్చిన పల్కు దేవత" "అభీష్టమొసంగెడి కామదాయిని" అయిన ఆ జగజ్జనని అనుగ్రహంవల్లనే తానీ కృతి రచింపగలిగానంటాడు కవి "తలవఁగ దోచనివాడ" అన్న పద్యంలో.

పుస్తకం చివరిపేజీలో "అష్టాదశ శక్తి పీఠాలను" ప్రత్యేకించి పేర్కొనటం కవి గారి సూక్ష్మ బుద్ధికీ, మనశ్శుద్ధికీ తార్కాణం. అట్టమీది శివపార్వతుల చిత్రం ఆకర్షణీయంగా ఉన్నది.

దిగ్దంతులవంటి ఐదారుగురు పండిత వరేణ్యుల అభిప్రాయాలతోనూ, ఆది శంకరులు, శ్రీచక్రము, రాజరాజేశ్వరి, గాయత్రి, దుర్గ, అన్నపూర్ణ ఇత్యాది వర్ణచిత్రాలతోనూ ఈ కృతి మరింత సౌభాగ్యాన్ని సంపాదించుకొన్నది.

"అద్వైతశాంకరి" లో కవిత్వం కంటె భక్తివేదాంతాలు ఎక్కువగా ఉన్నాయనటంలో సందేహంలేదు. భక్తులకూ, ముముక్షువులకూ అవశ్యం చదువదగ్గ పుస్తకమిది.

—కరుణశ్రీ

# సప్తగిరి విక్రేతలు

శ్రీ బి. రామమోహన్‌మూర్తి
28-88 రామేశ్వర అగ్రహారం
ప్రొద్దుటూరు-516 360

శ్రీ పి. సూర్యప్రకాష్‌బాబు
S/o శ్రీ పి. వి. రామప్ప
విజయాస్టోర్సు పులివెందుల-516 390

శ్రీ సి. సుబ్రహ్మణ్యం
పద్మావతి ఏజెన్సీస్
10-277, బెల్లంమండి వీధి, కడప-516 001

శ్రీ సి. పి. వరలక్ష్మి
C/o పి. సుబ్బారావుగుప్త
న్యూస్‌ఏజెంట్ రాజంపేట-516 115

శ్రీ సి. శంకరగుప్త
C/o మంచిర్యాలగూడ్స్‌ట్రాన్స్‌పోర్ట్‌బ్రాంచి
లక్షెట్టిపేట - 504215
(వయా) మంచిర్యాల, ఆదిలాబాద్‌జిల్లా

శ్రీ పి. జె. వి. రామానుజాచార్య
శ్రీ కృష్ణ లోకో రైల్వే స్టేషన్ రోడ్
తాడేపల్లిగూడెం - 534101

శ్రీ బి. శివరామకుమార్
కుమార్ న్యూస్ ఏజెన్సీ
రామమహల్ ఎదురుగా
ఏలూరు - 534002

శ్రీ టి. వెంకటగిరి నరసింహమూర్తి
మోర్త - 534 227 తణుకుతాలూకా
శ్రీ సి. గోపాలాచార్యులు
మల్లవరంపోస్టు, వయా నరసాపూర్

శ్రీ కర్రి గంగాధరరెడ్డి
అర్జునుడుపాళెంపోస్టు, వయా ఇరగవరం

శ్రీ కొండా వేంకటేశ్వరరావు
కన్నూరు-534 328
శ్రీ వేముల ఆనంద్
న్యూస్‌పేపర్ ఏజెంట్
భీమవరం - 504204 ఆదిలాబాద్ జిల్లా

శ్రీ ఎస్. అంజయ్య వి.పి.ఓ.
S/o ఎస్. నారాయణ
ఇర్కోడ్ పోస్టు
సిద్ధిపేట తాలూకా. మెదక్ జిల్లా

శ్రీ ఏ. బాలరాజేషన్
C/o రాజేశ్వర మోడరన్ రైస్‌మిల్
4-7-20 న్యూమార్కెట్‌రోడ్
సిద్ధిపేట - 502 103, మెదక్ జిల్లా

శ్రీ ఏ. కృష్ణయ్య
ఆయుర్వేద వైద్యులు, బాలాజీవాడ
నిర్మల్ - 504 106 ఆదిలాబాద్ జిల్లా

శ్రీ బి. శ్రీనివాస్
శ్రీరామబుక్‌హౌస్
బస్టాండు ఆదిలాబాద్ 504001

శ్రీ వడ్లూరి లక్ష్మీనరసయ్య
డి-161 బి.జోన్ రామకృష్ణాపురం-504301
ఆదిలాబాద్ జిల్లా

(20వ పేజీ తరువాయి)

ధరిస్తాడు. నిద్ర వచ్చినప్పుడు నిద్రిస్తాడు. మేలుకొలుపులు పాడితే మేలుకుంటాడు. భక్తుని యిష్టాన్నిబట్టి లేస్తాడు. కూర్చుంటాడు. ఇట్లు చేయడంలో బ్రహ్మానందాన్ని అనుభవిస్తాడు. బృందావనంలో గోపాల భట్టస్వామి సాలగ్రామ రూపంలో ఉండే రాధారమణుని ఆరాధిస్తూండేవారు. "ఈ సాలగ్రామమూర్తికిని హస్తపాదాలు నాసికవర్గము మొదలగు అవయవాలుండే ఇతరదేవతామూర్తులను అలంకరించువారి వలె వస్త్రాలు, నగలు అలంకరింపచేసి పలు పలు విధాలుగా శృంగారింతునుగదా! అని ఒకనాడనుకున్నారు. ఆనాటి రాత్రి భక్తుని యిష్టానుసారమే హస్తపాదాది అంగాలతో అతి మనోహరమైన త్రిభంగ ముద్రలో లేచి నిలువబడినాడు. ఈనాటికిని భక్తులామూర్తిని దర్శింపవచ్చును.

శ్రీధాంపురిలో టోటాగోపీనాథ విగ్రహం నిలబడిఉండే పెద్దమూర్తి. గదాధర పండితుడా ప్రతిమను పూజించేవాడు. కాలక్రమంగా అతడు ముసలివాడై అంతపెద్ద విగ్రహాన్ని నిలబడి పూజించడానికి చాల కష్టపడేవాడు. అప్పుడు భగవంతుడు భక్తుని కష్టాన్ని గుర్తించి హఠాత్తుగా కూర్చున్నాడు. భగవంతుడు తనపై కరుణించినందుకు గదాధరుడు సంతోషించి అట్లే పూజిస్తుండేవాడు. ఒకప్పుడు నిలువబడి ఉండిన విగ్రహం హఠాత్తుగా కూర్చొనడం అత్యాశ్చర్యం గలిగిస్తుందిగదా! భక్తులా మూర్తిని ఈనాటికిని సందర్శించి ధన్యులవుతున్నారు.

భక్తవత్సలుడైన భగవంతుడు భక్తుల అభీష్టాన్ని నెరవేర్చడానికి పూనుకుంటాడు. పూరీకి సమీపంలో సుప్రసిద్ధమైన సాక్షి గోపాలమందిరముంది. ఆమూర్తినిసేవించు ఒకరాణిదగ్గర ఎంతోవిలువగల ఒక ముత్యముండేది. ఆముత్యాన్ని పొదిగి ఒక బులాకి చేయించి సాక్షి గోపాలునికి పెడితే అతని ముగ్ధ మనోహరరూపాన్నిచూచి అందరు ఎంతగానో ఆనందపడతారోగదా



అని మనసులో అనుకుంది. కాని సాక్షి గోపాలమూర్తి ముక్కుకు రంధ్రము ఉంటే గదా ధరించేది? దీనికై రాణి హృదయం మిక్కిలి పరితపిస్తూండేది. ఒకనాటిరాత్రి సాక్షి గోపాలుడు స్వప్నమందు గనుపించి నీవెందుకు పరితపిస్తున్నావు? నాముక్కు కుట్టలేదనుకున్నావో మాయమ్మ చిన్నప్పుడు బులాకి పెట్టించడానికి కుట్టించింది. అని పలికినాడు. మరునాడు రాణిచూస్తే నిజంగానే బులాకి పెట్టడానికే ముక్కుకుట్టినట్లుంది. భగవంతుడు భక్తురాలికొఱకు ముక్కు కూడ కుట్టుకున్నాడు. ఎంత భక్త వాత్సల్యమో! రాణి బులాకిచేయించి అలంకరించి ఆనందించింది. దాన్ని యీనాటికి చూడవచ్చు.

భగవంతుడు విగ్రహరూపంలో భక్తుల సేవలను పొందడమే కాకుండ స్వయంగా భక్తులకు సేవలుకూడ చేస్తాడు. సేవలు చేయడంలో పరవశించేటట్లు సేవలు పొందడంలో పరవశింపడట.



గోవర్ధనంలోని ఒక లతాకుంజంలో దాగియుండే గోపాలమూర్తి అయాచిత వ్రతుడైన మాధవేంద్రపురికి పాలను దెచ్చియిచ్చేవాడట. ఒకసారి నీవెవరయ్యా అని అడిగితే సమీపగ్రామంలో వుండేవాణ్ణి. మీవంటి అయాచిత వృత్తి లోపంకే మహానుభావులకు ఆహారం తెచ్చియిస్తూ సేవిస్తూ ఉంటానన్నాడట. రేముణాలోని గోపీనాథమూర్తి మాధవేంద్రపురికి పాయసాన్ని దొంగలించి పాయసచోర గోపీనాదుడైనాడు. బృందావనంలోని గోపాలమూర్తి తన భక్తునితోబాటు నడచిపోయి చెప్పవలసిన చోట సాక్ష్యము చెప్పి సాక్షి గోపాలుడైనాడట.

జగన్నాథపురిలోని జగన్నాథుడు విరేచనాలతో బాధపడు తనభక్తుడైన మాధవదాసు పరిస్థితిని గుర్తించి శౌచకానికి నీటిని దెచ్చి మలమూత్రమయమైన శరీరాన్ని తన కరకమలాలతో స్వయంగాగడిగి తన్ను ధన్యునిగా భావించివాడట. ఇటువంటివెన్నో !!

భగవంతుని విగ్రహాలు అచలములు చలములు అని రెండు విధాలు. అచల మూర్తులకు ప్రతిష్ఠాసమయంలో మంత్ర శక్తితో ఆవాహనాదులుచేస్తారు. చలప్రతిమలకు ఆవాహనవిసర్జనలుంటాయి. సాలగ్రామ శిలకు ప్రతిష్ఠయే లేదు. భగవంతుడచ్చట సహజంగా ఉండడంవల్ల ఆ మూర్తికావాహన విసర్జనలుండవు. సాలగ్రామ శిలాయత్ర తత్ర సంనిహితో హరిః అని ప్రమాణము.

ఆలయాల్లో విగ్రహాలను పూజించే అధికారం అందరికి లేదు. దీక్షపొందినవారికే ఉంది. మంత్రదీక్ష పొందినవారు మంత్ర దేవతను పూజింపకుంటే వారుచేసే కర్మలన్నీ నిష్ఫలములవుతాయని ఆ దేవత అతని కనిష్టాన్ని గలిగిస్తుందని స్కాందాది పురాణాల్లో ఆగమాల్లో గనుపిస్తుంది. మంత్ర దీక్షనుపొంది ప్రతినిత్యం విధిగా భగవంతుని ఆరాధింపవలెనని నారదముని అభిప్రాయంకూడ. గృహస్థుల కర్చావద్ధతి అతిముఖ్యమని భగవన్మూర్తిలేని - భగవత్పూజలేని గృహంలోని భోజనం భోక్తవ్యంగాదని అది అభక్ష్యసమానమని ప్రహ్లాదుని వచనం స్కాందంలో గనుపిస్తుంది.

కేశవార్చాగృహేయస్య
నతిష్ఠతి మహీపతే ।
తస్యాన్నంనైవ భోక్తవ్యమ
భక్ష్యేణ సమం హితత్ ॥

ధనవంతుల గృహాల్లో భగవంతుని విగ్రహాలుంటాయి. కాని పూజమాత్రం వరులతో చేయిస్తారు. ఇది అలసత్వాది అశ్రద్ధకు నిదర్శనం. భగవదారాధన భగవత్సేవలో ప్రధానమైన అంగం. కాన భక్తితో శ్రద్ధతో తమకై తామే పూజించుకోవాలి.

గృహములోని పూజా విధానంవేరు. ఆలయాల్లోని అర్చనా విధానంవేరు. దేవాలయాల్లో ఏయే వేళల్లో ఏయేసేవలు చేయవలయునో ఏయే సంప్రదాయాలను పాటించి తీరవలయునో అన్నిచేసి తీరాలి. పాటించితీరాలి. సేవాపరాధాల కచ్చట చోటుండగూడదు. ఇండ్లలో జరిగినంత వరకు సేవలు జరుపుకొనవచ్చు. వీలుండి జరుపకుండుటయు అపరాధమే యగుచున్నది.

బంధు మిత్రులకు సేవచేయునట్లే భగవంతునికి సేవచేయాలని, బంధుమిత్రులకిష్టపదార్థముల పెట్టినట్లే పదార్థముల భగవంతునికి సమర్పించవలెనని మహాత్ముల అభిప్రాయము. భగవంతునికి నైవేద్యం పెట్టునపుడు భక్తి ప్రీతి శ్రద్ధ ఆదరం ఇవి అవసరములు. భగవంతుడు భక్తికి ప్రీతికి ఆకలిగొని యుండువేగాని ద్రవ్యమునకు గాదు. భావశుద్ధితో ప్రీతితో సమర్పించిన దానిని స్వీకరించితీరును. ప్రేమతో నివేదించిన దానిని ఆస్వాదించును గూడ.

పత్రం పుష్పం ఫలం తోయం
యో మే భక్త్యాప్రయచ్ఛతి ।
తదహం భక్త్యుపహృత
మశ్నామి ప్రయతాత్మనః ॥



మల్లియలారా ! మీ పొదలమాటున లేడుగదమ్మ చెప్పరే....

చిత్రం : మారేమండ శ్రీనివాసరావు, శ్రీశైలం.

# విద్యాదానం ఎవరికి?

**సరస్వతీదేవి అనుశాసనం**

— శ్రీ కె. హయగ్రీవశర్మ

"వేదోఖిలో ధర్మమూలమ్"-'వేద్యన్తే జ్ఞాప్యన్తే ధర్మార్థ కామమోక్షా' - అను వ్యుత్పత్తి నాధారముగా గొని చతుర్వర్గ జ్ఞానములకు సాధనభూతమైన వేదశబ్దము నిష్పన్నమైనది. "అపౌరుషేయం వాక్యం వేదః" అని సాయణాచార్యులు వక్కాణించిరి. "ఇష్టప్రాప్త్యనిష్ట పరిహారయోః అలౌకికముపాయం యో వేదయతి సవేదః వేదములు భారతీయులకు ఇహపరలోక వస్తువుల యొక్క జ్ఞానమునకు సాధన భూతములుగా నున్నవి.

"భూతం భవ్యం భవిష్యం చ సర్వం వేదాత్ ప్రసిద్ధ్యతి!" అని మనువు వివరించెను. ఎట్లనిన పరలోక జ్ఞానము ప్రత్యక్షముగా గాని, యప్రత్యక్షముగా గాని బ్రాహ్మణములలోను మరియు ఉపనిషత్తులలోను లభ్యమగుచున్నదో యది యంతయు వేదముల నుండే లభించుచున్నది.

"చతుర్వర్గప్రాప్తిహి వేదశాస్త్రేభ్యో నీరసతయా దుఃఖాదేవ సుకుమార బుద్ధీనామపి పునః కావ్యాదేవ ఇత్యుక్తం పరం వేదాఏవ కావ్యరసానా ముపమాదీనాంవాలంకారాణాం స్రోతాంసి"- 'చతుర్వర్గప్రాప్తి వేదశాస్త్రముల నుండి నీరసముగను మరియు దుఃఖ భూయిష్ఠముగను లభించుచున్నది. ఈ చతుర్వర్గప్రాప్తి పండితేతరులకు కావ్యముల నుండి లభించుచున్నది. వేదములు కావ్యరసములకు, ఉపమాద్యలంకారములకు ఆధారములై యున్నవి'- అని విశ్వనాథుడు సాహిత్య దర్పణమునందు పేర్కొని యున్నాడు.

"జగ్రాహ పాఠ్యమృగ్వేదాత్
సామభ్యో గీతమేవ చ ।
యజుర్వేదాదభినయాన్
రసానాథర్వణాదపి ॥"

భరతుడు నాట్యశాస్త్రములో వక్కాణించి యున్నాడు. వేదములు విశేషముగా అశేష విశ్వవిజ్ఞానార్జనమునకు కారణభూతములై యున్నవి. అంతేగాక వేదములు శాశ్వతికములుగను, అపౌరుషేయ శాస్త్రములుగను నున్నవి. వేదములు సకల విద్యలకు, కళలకు ఉత్పత్తిస్థానముగ నున్నవి.

ఇటువంటి వేదమునకు ఆరు అంగములు ఉన్నవి. అవి- శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము కల్పము. భగవత్తుల్యుడగు యాస్కుని కృతమగు నిరుక్త శాస్త్రములో ద్వితీయాధ్యాయము నందు "సరస్వతీ బ్రాహ్మణ సంవాదము" రమ్యముగా ప్రతిపాదింపబడెను. విద్యాధిదేవతయగు సరస్వతి



వేదవేదాంగములలో నిష్ణాతుఁడు మరియు సకల శాస్త్రములలో పండితుఁడు నగు ఆచార్యుని గురించి చెప్పెను.

"విద్యా హ వై బ్రాహ్మణమాజగామ
గోపాయ మా శేవధిష్టేఽహమస్మి।
అసూయకాయానృజవేఽయతాయ
న మా బ్రూయా వీర్యవతీ తథాస్యామ్"॥

సరస్వతి కామరూపిణిగా మారి వేద వేదాంగములలో ప్రవీణుఁడగు బ్రాహ్మణుని సమీపించి ఇవ్విధముగ పల్కెను. "హే బ్రాహ్మణ మాం రక్ష" - ఓ బ్రాహ్మణుడా! నన్ను రక్షింపుము. నేను గోప్యముగ నుండి నీకు సుఖనిధిని గాగలను. ఎటువంటి లక్షణములతో నున్న బ్రహ్మచారియగు విద్యార్థికి విద్యాబోధ చేయవలెనో, ఎటువంటి లక్షణములతో నున్న విద్యార్థికి విద్యాబోధ చేయకూడదో- అను విషయమును సవిస్తరముగా పేర్కొనెను. 'పరాపవాద శీలునకు, 'అనృజవే'- మనోవాగ్దేహము లందు విషమప్రవృత్తి గల్గినవారికి, ఇంద్రియ నిగ్రహములేనివానికి. (పై లక్షణములు నిండిన శిష్యునకు) నీవు నన్ను (విద్యను) బోధించకుము'- అని ఆజ్ఞాపించెను. నా ఆజ్ఞను నీవు పాటించిన యెడల నీ యందు నేను వీర్యవతి గాగలను.

"య ఆతృణత్త్యవితథేన కర్ణావ
దుఃఖం కుర్వన్నమృతం సంప్రయచ్ఛన్।
తం మన్యేత పితరం మాతరంచ
తస్మైనద్రుహ్యేత్ కతమచ్చనాహ"॥

ఈ మంత్రమున భగవత్తుల్యుఁడగు యాస్కుఁడు శిష్యులు గురుసన్నిధియందు ఎవ్విధముగ ప్రవర్తించవలెనో యుపదేశించెను. ఏ గురువు శిష్యునియొక్క అవిహితములుగ నున్న కర్ణముల యందు సుఖము నిచ్చుచు, అమృతత్వప్రాప్తికి

# సప్తగిరి విక్రేతలు

## తూర్పుగోదావరి జిల్లా

శ్రీ బాదం ప్రభాకరరావు
మెయిన్‌రోడ్ కాకినాడ-533 001

శ్రీ కె. శ్రీరాములు
శ్రీసత్యవీరభద్ర ఏజెన్సీ
జామ్‌పేట, పెద్దవీధి రాజమండ్రి-3.

శ్రీ ఎన్. ఆర్. బ్రహ్మానంద
ముక్తిలింగంవారి వీధి తుని-533 401

## కృష్ణాజిల్లా

శ్రీ కె. వీరేశ్వరరావు
బుక్‌షాప్, కైకలూరు-521 333

శ్రీ కొండూరు పార్థసారథి
రామానుజ కూటం, బచ్చుపేట
మచిలీపట్నం-521 001

శ్రీ ఆర్. శ్రీనివాసన్
C/o ఎన్. శ్రీనివాసన్
16-6-1 గుంటువారివీధి, పూర్ణానందంపేట
విజయవాడ-520 016

శ్రీ వి. రామాచార్యులు
గాయత్రీగురుకుల్ సాయిమహల్‌దగ్గర
ఉయ్యూరు-521 165

శ్రీ కపిలవాయి కేశవరావు
ఏజెంట్ ఆంధ్రపత్రిక, కొండపల్లి (పోష్టు)

## నెల్లూరు జిల్లా

శ్రీ ఏ. సాయిబాబా
C/o వేంకటకృష్ణయ్య
న్యూస్ ఏజెంట్ అల్లూరు-524 315

## విజయనగరం జిల్లా

శ్రీ జి. వెంకటరాజు
శ్రీ వేంకటేశ్వర క్లాత్ ఎంపోరియం
ఎం. జి. రోడ్, క్లాక్‌టవర్ దగ్గర
విజయనగరం-531 201

శ్రీ రాధాగోవిందపతి
న్యూస్ ఏజెంట్, పార్వతీపురం (పోష్టు)

## ప్రకాశం జిల్లా

శ్రీ సి. సుబ్బరాయలు
శ్రీ సత్యనారాయణ ఏజెన్సీ
4-8-96 గిద్దలూరు

శ్రీ జి. వి. సుబ్బారావు
రావ్ అండ్ రావ్ ఏజెన్సీ
కొవ్వూరు-523 105, కందుకూరుతాలూకా

శ్రీ కోడూరి వెంకటసుబ్బారావు
ఎల్. ఐ. సి. ఏజెంట్, ఉప్పుగుండూరు

శ్రీ ఎస్. వి. రమణయ్య, సాకలబుక్‌షాప్
మార్కాపురం-523 316

శ్రీ అడపాహరి శ్రీపసన్న న్యూస్‌ఏజెన్సీ
లింగసముద్రం-523 114
కందుకూరుతాలూకా

ఎం. వి. చలం సులేఖ న్యూస్ ఏజెన్సీ
చీరాల

శ్రీ పి. వి. సుబ్రమణ్యం
ప్రభుత్వ ఆస్పత్రి దగ్గర, అద్దంకి

శ్రీ రాచపూడి వెంకటసుబ్బారావు
లాయర్‌పేట, ఒంగోలు-523 003

శ్రీ జి. మాలకొండయ్య
C/o పెద్దనరసింహులు ఎల్.ఐ.సి. ఏజెంట్
బీమకుర్తి-523 226

## విశాఖపట్నం జిల్లా

శ్రీ. పి. వీరునాయుడు
శ్రీ సాయివారి బుక్ హౌస్
అనకాపల్లి-531 001

శ్రీ వి. వీరభద్రరావు
ఏజెంట్ ఏటికొప్పాక - 531 082

శ్రీమతి దొడ్డా పద్మాజయంతి
W/o ఐ. డి. వి. భాస్కరరావు
శ్రీ భాస్కర్ మెడికల్స్ పాడేరు (పోష్టు)

హేతుభూతమైన జ్ఞానమును సత్యముగ వివరించునో, శిష్యుని యొక్క అభ్యుదయము నాశించునో అట్టి గురువును శిష్యుఁడు తల్లిదండ్రులుగా భావించవలెను. అనగా ఇతరులగు దల్లిదండ్రులు కేవలము జన్మనిచ్చిన వారలే యగుదురు. నిజమైన శిష్యుఁడు మాతాపితృభూతులైన గురువు ఎడల ద్రోహచింతతో ఆపత్కాలమునందు గూడ ప్రవర్తించకూడదు.

> "అధ్యాపితా యే గురుం నాద్రియన్తే
> విప్రా వాచా మనసా కర్మణావా ।
> యథైవ తే న గురోర్భోజనీయా
> స్తథైవ తాన్నభునక్తి శ్రుతం తత్ ॥"

సరస్వతి ఇతరులగు దుష్టశిష్యులను శపించుచు నీ విధముగఁ బల్కెను. 'ఏ శిష్యులు బుద్ధిమంతులుగను, గ్రహించిన విద్య గలవారలుగనుండి గురుసమక్షమున అధ్యయనము చేసినవారు గురువు ఎడల ఆదరభావమును మనోవాక్కాయకర్మలచే ప్రదర్శించరో వారు గురువుచేత పాలించ బడరు. పాలనకు అర్హులుగారు. వారు పొందిన విద్య కూడ వారిని రక్షించదు. చదివిన విద్యకూడ అట్టి శిష్యుల యెడల ఫలవంతము గాదు.

> "యమేవ విద్యాః శుచిమప్రమత్తం
> మేధావినం బ్రహ్మచర్యోపపన్నమ్ ।
> యస్తే న ద్రుహ్యేత్ కతమచ్చనాహ
> తస్మై మా బ్రూయా నిధిపాయ బ్రహ్మన్నితి"

శిష్టుడగు శిష్యునకు విద్యాదానము చేయవలెనని వాగ్దేవత చెప్పెను. "ఓ బ్రహ్మ ! నీవు ఎప్పుడైతే శిష్యుని యమ నియమముల యందు పరిశుద్ధునిగను, మేధావిగను, బ్రహ్మచర్యతోఁ గూడినివానిగను, మఱియు ఏ శిష్యుఁడు నీ యందు ఆపత్కాలముల యందు కూడ ద్రోహమును ప్రదర్శించఁడో, అట్టి లక్షణములతో గూడిన శిష్యునకు నన్ను (విద్యను) బోధించుము" అని పల్కెను.

పై పేర్కొనిన రీతిగ 'విద్యాబ్రాహ్మణ సంవాదము' మనోహరముగ భగవత్తుల్యుఁడైన యాస్కునిచే రచించబడినది.

[15 వ పేజీ తరువాయి]

వలె ఇంద్రుడు రాక్షసులను జయించాడని ప్రతీతి. ఇది అసలు శ్రీ ఎవరిశక్తికి సంబంధించిన ఐతిహ్యం. లక్ష్మీదేవి బలిచక్రవర్తి చేతికి రక్షాబంధనం కట్టినరోజు శ్రావణ పూర్ణిమ. శకుంతల తన కుమారుడగు భరతునకు శత్రువు భయంలేకుండా రక్షకట్టింది. శ్రీకృష్ణుని హితవు ప్రకారము ధర్మరాజు రక్షధరించివుండేవాడని భారతకథ.

ఈవిధంగా రక్షాబంధన ఉత్సవం శత్రుజయానికి, సోదర సోదరీ భావబంధానికి ప్రతీకగా నిలచింది. త్యాగభావనకు సంకేతం కాషాయవర్ణం. అందుకే రాఖీలో కాషాయరంగుదారం వాడతారు. ఇది మహోజ్జ్వల వారసత్వానికి చిహ్నం. ఆత్మీయతాభావాన్ని సోదరసోదరీవాత్సల్యబంధాన్ని గుర్తుకుతెచ్చి కర్తవ్యబోధచేసే పండుగ "రక్షాబంధన్"

కొన్ని చారిత్రక గాథల ఆధారముగా గ్రీసుస్త్రీ రాణీ రుక్సానా పురుషోత్తమునికి సోదరభావంతో రాఖీకట్టి అని రక్షించమని చెప్పుట గలదు. ప్రపంచ విజేతను కావాలని కలగన్న అలెగ్జాండర్ జీలం నది ఒడ్డున పురుషోత్తమునితో యుద్ధానికి దిగాడు. అలెగ్జాండర్ ప్రేయసి "రుక్సానా" పురుషోత్తమునికి రక్షకట్టింది. ఆమెను చక్రవర్తి తనసోదరిగా మన్నించాడు. అందుకే యుద్ధంలో చేతికి చిక్కినా అలెగ్జాండర్‌ను వధించక వదలిపెట్టాడు పురుషోత్తముడు. ఇచ్చట రక్షాబంధనం మతాతీత ప్రభావాన్నికూడా ప్రసరించినదని గమనించవచ్చు. ఇలా రాఖీని గురించి కోకొల్లలు కథలు ప్రచారంలో కలవు.

హిందూధర్మప్రతిష్ఠాత శ్రీశివాజీ భవానీ ప్రాప్త ఖడ్గాన్ని ధరిస్తూ, వేదధర్మదేశ రక్షణకు ప్రతీకగానూ, రాఖీధరించాడని చరిత్ర చెబుతున్నది.

విభిన్నమతాలుగల భారతదేశ ప్రజల మధ్య రాఖీ ఒక స్నేహబంధంగా ఉంటున్నది. మరియు హిందువులలో ఐక్యతకిది ఒక ముఖ్యసోపానముగా ఉండగలదు.

శ్రావణమాసములో జరుపుకునే ఈ పండుగ అతిపుణ్యప్రదమయినది. దీనినే పురుషోత్తమమాసముగా పరిగణిస్తూ సత్సంగ గోష్ఠులనుకూడా నిర్వహిస్తారు.

రక్షాబంధనం నేడికి సమస్త భారతంలో ఏదో ఒక రూపంలో ఆచరింపబడుచున్నది. మనము ఈపండుగను సమాజములో తిరిగి భ్రాతృభావనను, ఐక్యతను ఏకీకృత శక్తిని పెంచడానికి ఆచరించవలెను.



## అక్షర ముముక్షువు

పరిణామంలో
శబ్దాలు మాటలుగా సాహసిస్తే
మాటలు అక్షరాలుగా వికసిస్తాయి
అందుకే
అక్షరాలు
మాటలు దాల్చిన మౌనరూపాలు

మౌనం లోంచే శబ్దాలు పుట్టుకొస్తాయి
తొమ్మిది నెలల తన మౌనానికి
కెవ్వుమనే పాపాయి ఏడ్పుసాక్ష్య
మిస్తుంది
శబ్దాలన్నీ మౌనంలోకి ఉరుకు
తుంటాయి
మాటల మజిలి గమ్యం రెండూ
చివరికి మౌనంగా మిగులుతుంటాయి

భోరుమని గుండెలు బాదుకునేద్వ్ర
బంధం
సమాధిలోని మౌనాన్ని కదలించలేక
నీరింకిన కళ్లలో
ఎరుపు జీరలు చిక్కినంతమేరా
సాక్ష్యమిస్తుంది.

మౌనానికి మౌనానికి మధ్య
మనుషులంతా శబ్దరూపాలు
మౌనంలోంచి మౌనంలోకి
శబ్ద ప్రయాణం ఒక జీవిత కాలం
చావు పుట్టకల రథ్యలో
నలిగి పగిలి నిలిచిన
అక్షర నశ్వరరూపం పరిణామం

అక్షరమంటే శబ్దం
అక్షరమంటే జ్ఞానం
అక్షరమంటే ప్రకృతి

అక్షరం మౌనంలో స్నానించటం
దాని స్వాభావిక లక్షణం
మౌనం లోంచి అనుస్వారం విడివడటం
దాని ఆనువంశిక లక్షణం
శబ్దం కళ్లలో
మౌనం గూడుగట్టుకుని గుండెలార్పితే
గుండెలయలోని శబ్దం
అపేక్షణీయంగా
మౌనం నుంచి విముక్తమవుతుంది

అక్షరం మౌనపరిణామం
మౌనం శబ్దాక్షర గానం

– పూలికుంట పార్థసారథిరెడ్డి

# భగవదాశ్రయం

— శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి

ఓ యాత్రికుడు ఉన్నాడు. తన స్వామి నివాసస్థానానికి పోయే అతనికి మధ్య మార్గంలో ఓ భయంకరమైన అడవి అడ్డం వచ్చింది. పులులతో, సింహాలతో, భయంకర విషాన్ని కక్కే పాములతో, మదించిన ఏనుగులతో ఆ అడవి చూడ భయావహంగా ఉంది. ఆ క్రూరమృగాలలో దేని బారి పడకుండ ఆ యాత్రికుడు ముందడుగు వేయగలిగిననాడే తనస్వామిని ఆనందంగా కలుసుకోగలుగుతాడు.

ఆ ఘోరారణ్యంలో ప్రవేశించి అతడు దానిని దాటడం ఆరంభించాడు. కొంత దూరం సాగేసరికి అతనికి ఓ సింహం కనిపించింది. దానిని చూచి, అతడు బలం కొద్దీ పారిపోసాగాడు. సింహంకూడా వాణ్ణి వెంబడించింది. అది తనమీదపడి తిని వేస్తుందన్న భయంతో ప్రక్కనే ఉన్న ఓ పెద్ద మర్రిచెట్టు ఎక్కసాగాడు. సింహం కూడ ఆ చెట్టుక్రిందనే కాచుకు కూర్చున్నది. ఆ యాత్రికుడు పైన కూర్చున్నాడు. అంతకుముందే యాత్రికుడు కూర్చున్న చెట్టుకొమ్మకు పై కొమ్మమీద ఓ ఎలుగుబంటి ఉంది. అలికిడికి అది లేచి యాత్రికుడున్న కొమ్మమీదకు రాసాగింది. దానితో అతడు హడలిపోతూ భల్లూకం బారినుండి రక్షించబడాలని క్రిందకు వ్రేలాడుతున్న రెండు ఊడలద్వారా దూకెయ్యాలని వాటిని ఆధారంగా చేసుకుని వ్రేలాడసాగాడు. తీరా క్రిందకుదిగబోతూండగా-క్రింద అగాధమైన ఓ దిగుడుబావి కనిపించింది. అందులో కోపంతో బుసలుకొడుతున్న ఓ సర్పం కంటబడింది. "ఇక్కడనుండి దూకితే యీ దిగుడుబావిలో పడీపడగానే క్రూరసర్పం నన్ను కాటువేసితీరుతుంది" అని గ్రహించి ఆ రెండువూడలనూ పట్టుకొని వేలాడసాగాడు. అతడు క్రిందకు చూడలేక పైకిచూచేసరికి తాను పట్టుకు వ్రేలాడుతున్న రెండువూడలనూ ఓ తెల్ల ఎలుకా, ఓ నల్ల ఎలుకా రెండూ కొరికేయడం గమనించాడు, "ఊడలను ఎలుకలు కొరికి వేయడం పూర్తిఅయితే నేను కూపంలోకి పడడమూ, పాముకాటుకు గురికావడమూ తప్పదు" అనుకున్నాడు.

ఎలుగుబంటికి భయపడి మరల చెట్టు మీదికి రాలేక పోతున్నాడు. క్రిందకు వద్దామంటే సింహాన్ని చూసి భయపడి పోతూన్నాడు. అనేక భయాలకులోనై ప్రాణభయంతో వణికిపోతూ అలాగే వ్రేలాడుతున్నాడు. ఆ మర్రిచెట్టుకు పై కొమ్మమీద ఓ తేనెపట్టు ఉంది. ఆ పట్టులోనుంచి అప్పుడప్పుడు తేనెచుక్కలు పడుతున్నాయి. అవి సరాసరి నోరుతెరచుకొని వ్రేలాడుతూన్న యాత్రికుని నోటిలోనే పడుతున్నాయి. దానితో అతనికి క్షణకాలం ఆనందం కలుగుతున్నది. కాని ఏవైపు చూసినా మృత్యుదేవతయే తాండవమాడుతున్నట్లు కనిపించడంతో సుఖంకూడ అంటే తేనె తియ్యదనంకూడ పరిణామముగా చెడుగానే కనిపిస్తున్నది. అట్టిస్థితిలో ఏ దిక్కూతోచక అతడు ఏకాగ్ర చిత్తంతో నిర్మలమైన ఆర్త భావంతో తన స్వామిని పేరుపెట్టి పిలవసాగాడు. నిరంతరాయమానంగా అనన్యాయత్త చిత్తంతో ఆర్తనాదంతో పిలవడంవల్ల 'స్వామి'కి అతని పిలుపు వినిపించింది. "నా సేవకుడు విపత్సాగరంలో మునిగి ఉన్నాడే?" అని ఆస్వామి ఉత్తర క్షణంలో గ్రహించి, దివ్యశక్తి సంపన్నుడైన తనమనిషిని ఒకణ్ణి పంపుతూ రక్షించి రమ్మన్నాడు.. ధనుర్బాణ ధారియై వచ్చిన ఆ మహావ్యక్తి నిశితశరాన్ని ఆకర్ణాంతం సంధించి,భల్లూకాన్ని కొట్టాడు. దెబ్బతిన్న భల్లూకం చెట్టుమీదనుండి క్రిందకు దూకింది. దానితో సింహం ఆ ఎలుగుబంటి మీదపడి దానిని చంపి పారిపోయింది. సింహ భల్లూకాలమధ్య జరిగిన పోరాటంలో వాటి గర్జనలకు ఊడలను కొరికివేస్తూన్న ఎలుకలు రెండూ దిగుడుబావిలో పడీ పడటంతో కోపంతో,ఆకలితో ఉన్న ఆసర్పం ఆ రెండింటినీ భక్షించి వెళ్ళిపోయింది. అంత ఆ యాత్రికుడు సురక్షితంగా క్రిందకు దిగివచ్చాడు. ధనుర్ధారియైన మహాపురుషుడు యాత్రికుని జాగ్రత్తగా తనస్వామి దగ్గరకు చేర్చాడు.

ఇది కేవలం కథ కాదు. దాని తాత్పర్యాన్ని సావధానంగా గ్రహించి సంచరించండి:-

ఆ యాత్రికుడు ఎవరోకాదు; మనమే ఈ ప్రపంచమే భవారణ్యము. దీనికి అవతల మన ప్రభువైన భగవంతుని మందిరం ఉంది. మనం ఏనాటికైనా భగవంతుని సన్నిధిని చేరవలసినదే. యాత్ర సాగుతూండగా మనకు భయరూపమైన సింహం ఎదురవుతుంది. అప్పుడు గృహస్థరూపమైన వటవృక్షాన్ని ఆశ్రయిస్తాము. ఈగృహస్థరూపమైనమహావృక్షాన్ని 'చింత' అనే భల్లూకం ఎక్కుతూంది. అప్పుడు దాని బారినుండి బయటపడటానికి మనం 'ఆశ నిరాశ' అనే రెండు ఊడలను పట్టుకు వేలాడుతుంటాము. ఆయురూపమైన ఆశ మనకు లభించింది. ఈ ఆయు మూలాన్ని అహోరాత్రులనే ఎలుకలు రెండు కొరికివేస్తున్నాయి. రాత్రింబగళ్ళు గడచిపోవడంతో మన ఆయుర్దాయం క్షీణించి పోతూంటుంది. పైనవున్న తేనెపట్టు భార్యాపుత్ర బంధు బాంధవాదుల సమూహమే. అందుండి పడుతూవున్న తేనెచుక్కలేవిటి? స్త్రీవలన పురుషునికీ, పురుషునివల్ల స్త్రీకీ లభించే ఇంద్రియసుఖము. ఈ విషయ సుఖం క్షణికమైనది. దశదిశలా చింతలు ఆవరింపబడి ఉండటంవల్ల ఈ సుఖం కూడ దుఃఖంగానే ప్రతీతమవుతుంటుంది.

అస్థితిలో స్వామిరూపుడైన ఏ భగవంతుడైతే ఉన్నాడో అతడ్ని అనన్యాయుక్త చిత్తంతో పిలిస్తే అసహాయులకు ధనుర్బాణపాణి అయిన తన వాడ్ని అంటే సద్గురువును పంపుతాడు. గురుదేవుని సదుపదేశంవల్ల భల్లాక సింహరూపమైన చింతాభయాదులు నాశనమైపోతాయి. మూషికరూపమైన అహోరాత్రులను భక్షించి సర్పరూపుడైన కాలుడు వెళ్ళిపోతాడు. ధనుర్బాణధారి అయిన గురుదేవుడు మనలను భగవత్సన్నిధికి సుగమంగా చేరుస్తాడు.

జీవులన్నీ మరణధర్మం కలవియే. ఇవి అవశ్యం మరణిస్తాయి. కనుకనే మృత్యురూప సర్పానికి అందరూ భయపడి పారిపోతున్నారు. ఎన్ని లోకాలు తిరిగినా యీ జీవుడు నిర్భయుడుగా ఉండలేడు. ఏ లోకానికి పోయినా భయం తప్పదు. అనన్యాయత్త చిత్తంతో శ్రద్ధ భక్తి ప్రేమ భావాలు కలిగి - కరుణాసాగరుడైన భగవంతుని పాదారవిందాలను ఆశ్రయించగలిగిన నాడే యీ జీవుడు నిర్భయుడై చరించగలుగుతాడు. కనుక యీ సంసారసాగరాన్ని చూసి భీతిచెందే వారందరూ నిశ్చలమనస్కులై భగవన్నామ సంకీర్తనం చెయ్యండి. భగవద్గుణాను కీర్తనంవల్లనే సద్గురువు లభిస్తాడు. ఆ మహనీయుడే మిమ్మల్ని భగవత్సాన్నిధ్యానికి చేరుస్తాడు. మీరు భయభీతులు కాకుంటే దారాపుత్ర సుఖానుభూతులు పొందుతూ, చతురశీతి లక్షాత్మకమైన జీవజాలంలోపడి తిరుగుతూండండి.

భవభయమే మీకుంటే అనుక్షణం భగవంతుని ఆశ్రయించి, నామస్మరణ చేసుకుంటూ ధన్యులవండి.





## శ్రీ చరణాలు

ఒక నేతచరణాలు
గంగ జన్మకు సెలవు
ఒక ప్రభువు చరణాలు
రాతిరూపుకు సెలవు.

ఒక మూర్తి చరణాలు
మరుభూమి సరిగమలు
ఒక పుణ్య చరణాలు
సీత ఎడ మధురిమలు.

ఒక గురువు చరణాలు
గీతార్థ సారాలు
ఒక యోగిచరణాలు
జ్ఞాన కాసారాలు.

ఒక శక్తి చరణాలు
మహిష ప్రాణహరణాలు

ఒక స్వామిచరణాలు
దుష్టదూర ప్రహరణాలు.

ఒక రాజు చరణాలు
అవనిపై కిరణాలు
ఒక ఱేడు చరణాలు
నాగి ఆభరణాలు.

ఒక దేవి చరణాలు
సిరుల దీపికలు
ఒక మాత చరణాలు
సుజ్ఞాన చంద్రికలు.

సప్తగిరి వెలిగేటి
కళ్యాణ చరణాలు
నిఖిల లోకాలకు
నిత్యశరణాలు.

— పోగుల శ్రీనివాసరావు



★ ★

# శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం, తిరుచానూరు

## నిత్యపూజా నివేదనలు

సుప్రభాతం — ఉ. 5-00 గం॥ నుండి 5-30 గం॥ వరకు

సహస్రనామార్చన — ఉ. 5-30 గం॥ నుండి 6-00 గం॥ వరకు

(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు.)

నిత్యఅర్చన — ఉ. 6-00 గంటలకు

(ఏడాదికి రు 150/- లు చెల్లించిన గృహస్థులకు మాత్రమే.)

శుద్ధి, మొదటి గంట — ఉ. 6-00 గం॥ నుండి 6-30 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 6-30 గం॥ నుండి మధ్యాహ్నం 1-00 గం॥ వరకు

శుద్ధి, రెండవగంట — మ. 1-00 గం॥ నుండి 1-30 గం॥ వరకు

సర్వదర్శనం — మ. 1-30 గం॥ నుండి రాత్రి 7-00 గం॥ వరకు

శుద్ధి, రాత్రికైంకర్యము — రా. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు

సర్వదర్శనం — రా. 7-30 గం॥ నుండి 8-45 గం॥ వరకు

శుద్ధి — రా. 8-45 గం॥ నుండి 9-00 గం॥ వరకు

ఏకాంతసేవ — రా. 9-00 గం॥ నుండి 9-15 గం॥ వరకు

## శుక్రవారాలలో....

సుప్రభాతం — ఉ. 4-00 గం॥ నుండి 4-30 గం॥ వరకు

సహస్రనామార్చన — ఉ. 4-30 గం॥ నుండి 5-00 గం॥ వరకు

(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు)

నిత్యఅర్చన — ఉ. 5-00 గం॥ నుండి 5-15 గం॥ వరకు

శుద్ధి, మొదటిగంట — ఉ. 5-15 గం॥ నుండి 5-45 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 5-45 గం॥ నుండి 7-00 గం॥ వరకు

నళింపు — ఉ. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు

మూలవర్లకు అభిషేకం—ఉ. 9-00 గం॥ నుండి 10-00 గం॥ వరకు

(100 రూ. టిక్కెట్‌తో ఇద్దరు వ్యక్తులకు మాత్రమే.)

అలంకారము, రెండవగంట — ఉ 10-00 గం॥ నుండి 11-00 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 11-00 గం॥ నుండి రాత్రి 8-00 గం॥ వరకు

ఊంజల్ సేవ — రా. 7-00 గం॥ నుండి 8-00 గం॥ వరకు

(అద్దాలమండపంలో రు. 150 టిక్కెట్‌తో జరుపుకోవవచ్చును. గృహస్థుకు 5 గ్రాముల వెండి డాలర్ బహూకరిస్తారు.)

రాత్రిగంట — రా. 8-45 గం॥ నుండి 9-00 గం॥ వరకు

ఏకాంతసేవ — రా. 9-00 గం॥ నుండి 9-15 గం॥ వరకు

## ఆర్జితం వివరాలు :

ప్రత్యేక దర్శనం: రూ. 2_00

సహస్రనామార్చన: రూ. 6_50

నిత్యఅర్చన: రూ. 150_00 (ఏడాదికి)

అర్చన: రూ. 1_00

హారతి: రూ. 0_50

పూలాభిషేకం (శుక్రవారాలలో) రూ. 100_00

ఊంజల్ సేవ (శుక్రవారాలలో) రూ. 150_00

తిరుచ్చి ఉత్సవం: రూ. 63_00

గజవాహనం: రూ. 32_00.

# వరాహావతారం

— శ్రీ ఎస్. శ్రీపతినాయుడు

దేవుని అవతారాలను మూడురకాలుగా విభజించవచ్చు. సంపూర్ణ అవతారాన్ని అవతారమని, తాత్కాలిక అవతారాన్ని ఆవేశమని పార్శ్వఅవతారాన్ని అంశమని అంటారు. కృష్ణ రామావతారాలు సంపూర్ణ అవతార రూపాలు. క్షత్రియులను సంహరించే ఉద్దేశ్యంతో శ్రీమహావిష్ణువు పరశురామ అవతారాన్ని తాత్కాలికంగా ధరించినాడు. విష్ణుమూర్తి ఆయుధాలైన శంఖు, చక్రాలు అంశంగా పేర్కొనబడినాయి. విష్ణుమూర్తి ఎత్తిన పది అవతారాల్లో తొమ్మిదవది బుద్ధావతారం. కొంతమంది ఈ అవతారం కాదని బలరామ అవతారాన్ని చేర్చినారు. మత్స్యపురాణంలో ఈ దశావతార వివరాలు ఇవ్వబడినాయి. భృగు మహర్షి శాపఫలితంగా శ్రీమహావిష్ణువు ఈ అవతారాలను ధరించి, అసురులను సంహరించాడని కథనం. భాగవత పురాణంలో ఇరవై రెండు అవతారాలు వర్ణించ బడినాయి. పురుష, నారద, నరనారాయణ, కపిల, దత్తాత్రేయ, యజ్ఞ, వృషభ, ధన్వంతరి, వేదవ్యాస రూపాలు అవతారాలుగా పేర్కొనబడినాయి. ప్రాచీన హిందూ సారస్వతంలో దశావతారాల ప్రసక్తి ఉంది. శతపథబ్రాహ్మణంలో కూర్మావతారం, తైత్తిరీయ ఆరణ్యకంలో వరాహావతారం ప్రస్తావించ బడినాయి. రామాయణ, భారత, భాగవత, విష్ణుపురాణాల్లో అవతారాల ప్రసక్తి ఉంది.

వరాహ అవతార విధానం శతపథ బ్రాహ్మణంలో ఉంది. ఏమూష అనే వరాహం పృథ్విని పెకలించిందట. తైత్తిరీయ ఆరణ్యకంలో శతబాహు వరాహం భూమిని ఎత్తినట్లు చెప్పబడింది.

"వరాహేన కృష్ణేన శతబాహునాన ఉధృత" రామాయణంలో భూమిపుట్టుక వివరణ సందర్భంలో ఈ అవతార ప్రశస్తి చేయబడింది. వశిష్ఠమహాముని నీటిలో దాగిన భూమిని బ్రహ్మ ఎత్తినట్లుగా చెప్పినాడు. ఈ భావాన్ని విష్ణుపురాణం, లింగ పురాణం, గరుడపురాణం సమర్థిస్తున్నాయి. కాని ఈ గ్రంథాలలో బ్రహ్మ విష్ణుమూర్తులు ఒక్కరే అన్నభావం స్ఫురింపబడింది. అగ్నిపురాణంలో ఈ కథ చెప్పబడింది. హిరణ్యాక్షుడనే రాక్షసుని చంపడానికి విష్ణుమూర్తి ఈ అవతారాన్ని ధరించినాడు.

వరాహ అవతారమూర్తి శిల్పం మూడు విధాలుగా తీర్చబడింది. మొదటిది భూవరాహం. ఈ మూర్తినే ఆదివరాహం అని కూడా అంటారు. ఈ అవతారంలో విష్ణుమూర్తి మానవ ఆకారంలో ఉంటాడు. నాలుగు చేతులుంటాయి. పై రెండు చేతుల్లో శంఖం, చక్రం ధరించి ఉంటాడు. క్రింది ఎడమచేతిలో భూదేవిని పట్టుకొని క్రింది కుడిచేయి ఆమె నడుముమీద ఉంటుంది. ఆదిశేషుని శిరస్సుపై ఒక కాలు ఉంచబడుతుంది. వరాహరూపంలో ఉన్న శిరస్సు కొద్దిగా పైకెత్తబడి ఉంటుంది. భూదేవి చేతులు అంజలి హస్త ముద్రలో ఉంటాయి. ఈ అవతారాన్ని నృవరాహమూర్తి అవతారమని శిల్పరత్నం పేర్కొంటున్నది. ఈ అవతారంలో విష్ణుమూర్తి రంగు నలుపుగా ఉంటుంది.

సింహాసనంపై కూర్చొని, తెలుపువర్ణం కలిగిన మూర్తిని యజ్ఞ వరాహ అవతార



మని పిలుస్తారు. అనేక ఆభరణాలను ధరించి ఉంటాడు. కుడివైపు బంగారు రంగు కలిగిన దుస్తులు ధరించి, లక్ష్మీదేవి ఆసీను రాలై ఉంటుంది. దేవి కుడిచేతిలో పద్మం ఉంటుంది. యజ్ఞ వరాహమూర్తికి ఎడమ వైపు, నలుపువర్ణంలో ఆసీన భూదేవి ఉంటుంది. కుడిచేతిలో నీలోత్పలం ఉంటుంది.

ప్రళయ వరాహమూర్తి అవతారంలో విష్ణువు సింహాసనంమీదఆసీనుడై ఉంటాడు. శంఖం చక్రం ధరించి, క్రింది కుడిచేయి అభయముద్రలో ఉంటుంది. ప్రళయ వరాహమూర్తి వర్ణం నీలిరంగు. కుడివైపు భూదేవి, కూర్చొని ఎడమచేతిలో ఉత్పల పుష్పాన్ని ధరించి ఉంటుంది. వరాహ అవతారం చాలించి శ్రీమహావిష్ణువు వైకుంఠం చేరిన తరువాత పరమశివుడు వరాహపుముక్కును ఆయుధంగా స్వీకరించాడు.

వరాహమూర్తికి ప్రత్యేక ఆలయం ఉండటం అరుదు. శ్రీవేంకటేశ్వరునికి ఆశ్రయమిచ్చిన వరాహాన్ని మొదట పూజించి తిరుమల ఆలయంలోని విష్ణు మూర్తిని పూజించడం సంప్రదాయం. పల్లవ రేవుపట్టణమైన మహాబలిపురంలో వరాహగుహాలయం ఉంది. లోపలఉన్న వరాహశిల్పం అద్భుతంగా మలచబడింది. చాళుక్యరాజధాని బాదామిలోని వరాహ శిల్పంలో విష్ణుమూర్తి భూదేవిని ఎడమ చేతితో ఎత్తుకున్నట్లు చూపబడింది. ఈ అవతార విజృంభణను బ్రహ్మ మహేశ్వరులుచూస్తున్నట్లుగా చిత్రీకరింపబడింది. ఈ అద్భుత శిల్పం బాదామి మూడవ గుహాలయంలో ఉంది. నాగలాపురంలో వరాహముఖం వేరుగా ఉన్నట్లు చూపబడింది. మద్రాసు మ్యూజియంలో ఇత్తడితో చేసిన వరాహ విగ్రహంలో దేవి ఎడమ తొడపై కూర్చున్నట్లుగా చూపబడింది. బేలూర్ హొయసళ శిలాశిల్పంపై అలంకారం ఆకర్షణీయంగాఉంది. చెన్నకేశవస్వామి ఆలయంలో లభ్యమయ్యే శిల్పంలో వరాహమూర్తికి పన్నెండు చేతులున్నాయి. కుడి ఆరుచేతుల్లో శూలం, అంకుశం, గంట, ఖడ్గం, బాణం, చక్రాన్ని ధరించినాడు. ఉదయగిరి వరాహ గుహలోని శిల్పం అతి రమణీయంగా మలచబడింది. వరాహ అవతారానికి ప్రాధాన్యతను ఇచ్చి విజయనగరరాయల వంశం వారు వరాహాన్ని రాజలాంఛనంగా ఎన్నుకున్నారు. *

---

వరాహ జయంతి సందర్భంగా ప్రత్యేక సమర్పణ. సం॥

---

# సౌపర్ణాఖ్యానం

— శ్రీ ఆర్. ఎస్. వాసన్

గరుత్మంతుడు తన తల్లి దాస్యమును బాపుటకు అమృతాపహరణము చేసిన కథ భారతమునందున్నది. ప్రస్తుతం ఈ కథ మరియొక విధముగా నుండి అర్థవంతముగా నున్నది. గాయత్రీ త్రిష్టుప్ జగతీ ఛందము లందుత్తరోత్తరోత్కర్ష కలిగియుండగా గాయత్రీ ఛందమునకుత్కృష్టత ఏల? అని బ్రహ్మవాదుల కొక సందేహము. ఇది కృష్ణయజుర్వేదము షష్ఠకాండ ప్రథమ ప్రశ్నములోనిది. అందు-

'బ్రహ్మవాదినో వదన్తి కస్మాత్సత్యా ద్గాయత్రీ కనిష్ఠా ఛందసాగ్ం సతీ యజ్ఞ ముఖం పరియాయేతి।'

మూడు ఛందస్సులలోను చిన్నదైన గాయత్రిని ప్రాతస్సవనమందు వినియోగించుట సమంజసమా అను విచారణ జరిగి అసలు మూలకథ ప్రారంభమయింది.

కద్రూశ్చ వై సుపర్ణీ చాత్మరూప యోరస్పర్ధేతామ్. సా కద్రూస్సుపర్ణీమజయ త్సాబ్రవీత్ తృతీయ స్యామితో దివిసోమ స్త మాహర తేనాత్మానం నిష్క్రీణీష్వేతీయం వై కద్రూ అసౌ సుపర్ణీ। ఛందాగ్ంసి సౌ పర్ణే యా స్సాఽబ్రవీదస్మై వై పితరౌ పుత్రాన్ బిభృత స్తృతీయ స్యామితో దివి సోమస్త మాహర తేనాత్మానం నిష్క్రీణీష్వ।

ఈ మంత్రము గాయత్రీ ఛందో యుక్తము. ఇందు కద్రువ, సుపర్ణి అనే యిద్దరు సౌందర్యవతులకు వారిలో వారికి రూపవిషయమై స్పర్ధ కలిగింది. ఈ వివాద మందు కద్రువ సుపర్ణిని జయించినది. ఈ విషయమై వారింతకు పూర్వమే ఒక నియ మమునేర్పాటు చేసికొన్నట్లున్నది. ఆ నియ మము గెలిచినవారికి ఓడినవారు దాసీత్వము చేయుట. అయితే దీనిని పోగొట్టుకునే ఉపాయంకూడ ఆలోచించి పెట్టింది ఆ కద్రువ-

'సాబ్రవీత్ తృతీయ స్యామితో దివి సోమస్తమాహర తేనాత్మానం నిష్క్రీణీష్వ ఇతి."

ఇతః పరిగణనారభ్య - భూమి నుండి లెక్కపెట్టి మూడవ లోకమైన ద్యులోక మందు అక్కడ సోమమనే లత ఉన్నది. అది ఎప్పుడూ ధిష్ణి నామక దేవతలచేత పరివృతమై అపహరణకు సాధ్యముకాని స్థితిలో నుంటుంది. ధిష్ణియావా అముష్మిన్ లోకే సోమరక్షన్' అనే మంత్ర వాక్యమీ విషయమును వ్యక్త పరచును. అహర హము అప్రమత్తంగా రక్షింపబడే సోమ మును తెచ్చి దాస్యవిముక్తిని పొందు అంటే 'ఆత్మానం నిష్క్రీణీష్వ' నిన్ను నీవే కొనుక్కొన్నట్లై దాస్యవిముక్తిని పొందగల వని తాత్పర్యము. దీనిని తానే సాధింప వచ్చును గదా అని భావించుచో- 'ఇయం వై కద్రూ, అసౌ సుపర్ణీ, ఈ లోకమునకు సంబంధించిన కద్రువ, ద్యులోక సంబంధి యైన సుపర్ణితో సోమాహరణ విషయమై స్పర్ధవహించలేదు. ఇక సుపర్ణి ఏమిచేసిందో తెలిసికొందము- 'ఛందాగ్ంసి సౌపర్ణేయాః' అన్నట్లు సుపర్ణికి సంతానము ఛందస్సులు. కష్టకాలంలో ఆ తల్లి పుత్రుల వద్దకు వెళ్ళింది. ఇక్కడ వేదము చక్కటి లోక విషయాన్ని పేర్కొన్నది. ఉపద్రవాలు ఏమైనను కలుగననే దూరదృష్టితో వాటి నుండి తమ్ము రక్షింతురన్న ఆశతో తల్లులు, తండ్రులు గర్భధారణ నుండి పెంచి పోషించి తమ బిడ్డలను పెద్దవారినిగా చేయుట లోక న్యాయము. కనుకనే ఛందస్సంతానము నకు తమ పందెము, నియమము, దాస్య విముక్తికి గానున్న యుపాయము చెప్పి దాస్యవిముక్తిని గావింపగా పుత్రులను కోరినది. ఈ కాలములోని వారి వలె తల్లిది అవివేకచర్య అనిగాని, మేము చేయమని గాని వారనలేదు. సుపర్ణ కుమారులతో 'మాకద్రూరవోచదితి' అని చెప్పింది.అప్పుడు అందరిలో పెద్దవాడు జగతీ ఛందస్సు.

ఆ ఛందస్సు బయలుదేరి-జగత్యుత్పతత్- చతుర్దశాక్షరా సతీ - సాప్రాప్య న్యవర్తత, పదునాలుగు అక్షరములచేత ప్రతిపాద్య మైన జగతీ ఛందోయుక్తమైనట్టి ఆ దేవత సోమలతను తీసికొని వచ్చుటకు పోగా, 'తత్ర విద్యమానం సోమం అప్రాప్య- తాను పొందలేక న్యవర్తత తిరిగి వచ్చినది. కాని జరిగినదేమనగా జగతీ ఛందస్సు యొక్క రెండక్షరములు 'తస్యై ద్వే అక్షరే అమీ యే తామ్' ధిష్ణినామక దేవతలచే నపహరింప బడి పది రెండక్షరముల ఛందమైనది." కాని ఈ ఛందస్సు అక్షరాల్ని పోగొట్టుకొని కూడ పశుయాగమునకు కావలసిన పశువును యాగదీక్షను తెచ్చినది. కనుకనే పశుకామన గల యజమాని జగతీ ఛందోయుక్తమైన మంత్ర వినియోగముచేయుట కర్తవ్యము ఇక రెండవదియైన త్రిష్టుప్ ఛందస్సు. 'త్రిష్టు బుదపతత్, త్రయోదశాక్షరా సతీ సా ప్రాప్య న్యవర్తత, తస్యై ద్వే అక్షరే అమీ యే తాగ్ం సా దక్షిణాభిశ్చ,- త్రిష్టుప్ వెళ్ళి కూడ సోమమును పొందలేక తిరిగి వచ్చే సందర్భమున రెండు అక్షరాలు పోగొట్టు కొని యాగ ప్రయోజనమైన దక్షిణలు, తపోరూప నియమ విశేషమును గ్రహించి వచ్చింది. తత్కారణముననే త్రిష్టుప్ ఛందస్సుయొక్క సమయమైన మాధ్యం దిన సవన కాలమందు దక్షిణల నిచ్చుట సంభవించుచున్నది. అనంతరము గాయత్రీ ఛందస్సుయొక్క సమయం. ఈ ఛందస్సు కూడ ప్రయత్నించుచూ నాలుగు అక్షరా లతో బయలుదేరి ఒక మేకను వెంటతీసి కొని వెళ్ళింది- గాయత్ర్యుదపతతు, చతు రక్షరాసతీ, అజయా జ్యోతిషా తమస్యా అజాభ్యరుంధ" తదజాయ అజత్వమ్. ఈ మేకతోటి ఉన్న జ్యోతిస్స్వరూపముతో




## ప్రకటన రేట్లు

మామూలు పేజీలకు :

| | |
|---|---|
| పూర్తి పేజీ: | 500 రూ |
| అర్ధ పేజీ: | 300 రూ |
| పావు పేజీ: | 150 రూ |
| ఒక కాలమ్: | 200 రూ |

### సాంకేతిక సమాచారం

| | |
|---|---|
| పేజీవైశాల్యం; | 27.5 సెం మీ × 21.5 సెం. మీ |
| ముద్రణస్థలం: | 24″ × 19 సెం. మీ |
| కాలమ్‌లు : | 3 |
| స్క్రీన్ కవరు | 100 |
| లోపల : | 65 |

గమనిక :

1. ప్రకటన సమాచారం, బ్లాకులు ప్రకటన దారులే ఇవ్వాలి.
2. ఆరునెలలకు ముందుగా ప్రకటనస్థలం కేటాయించు కొనదలచిన వారికి 10 శాతం, సంవత్సరానికి ప్రకటనస్థలం కేటాయించుకొనే వారికి 15 శాతం, పై రేట్ల పై తగ్గింపు ఇవ్వబడుతుంది.
3. ఏవిధమైన నోటీసుగాని లేదా ఏకారణంగాని తెలుపకనే ప్రకటనలను తిరస్కరించే హక్కు సంపాదకుడికి వుంటుంది.
4. కవరుపేజీలకు ప్రకటనలు స్వీకరింపబడవు.

ఇతర వివరాలకు :

సంపాదకుడు.

అక్కడ ఉన్న పరివారమును చిమ్మివేసిన దట. అజ అనే ధాతువునకు క్షేపణమని తాత్పర్యము, వెదజల్లినట్లు చేసినదని అర్థము. అనంతరము గాయత్రీ కొఱకు "అజ" ఈ మేక సోమలతను 'అభ్యారుంధ స్వాధీనం కృతవతీ.' స్వాధీనము చేసినది అని సారాంశము. 'సా సోమంచాహరతు చత్వారి చాక్షరాణి, సాఽష్టాక్షరా సమపద్యత।' సోమముతో జగతీ ఛందస్సు వదలిన రెండక్షరములు, త్రిష్టుపు వదలిన రెండక్షరములు కలిపికొని ఎనిమిదక్షరములతో, సోమలతతో తిరిగి బయులుదేరినదట. కనుక గాయత్రికి యదేవాద స్సోమమాహరతు, తస్మాద్యజ్ఞ ముఖం పర్యైతు। యస్మాత్ కారణాత్ అదః ద్యులోకాత్ సోమం ఆహరతు తస్మాత్కారణాత్ యజ్ఞముఖం గాయత్రీ కనిష్ఠా ఛందసా సతీ ఛందసాం మధ్యేపరియాయ. శ్రేష్ఠో భవతీ త్యర్థః. తస్మాత్తేజస్వినీతవ, ఈ కారణముచేత గాయత్రీనామకఛందస్సు అత్యంత తేజోయుక్తమై మిగిలిన ఛందస్సుల కంటె కాంతివంతమై యుండును. ఈ కారణముననే మిగిలిన ఛందస్సులకంటె గాయత్రి వరీయమైనది. "తేజోనామ శారీరస్య కాంతిః" శరీరకాంతికి తేజస్సని పేరు. దీనికింకా వివరణము వేదశాస్త్ర ప్రయుక్తమ్ 'అనుష్ఠాన జన్యంయత్ వర్చః తేజః। తదేవ వర్చ ఇతుచ్యతే.'

ఇది గాయత్రీ వైశిష్ట్యము. గాయత్రీ అనుష్ఠాత అట్టి తేజమును పొందగలడు. దీనిని తెలుపుటకు వేదమున నీ యుపాఖ్యానము ప్రసక్తమైనది.



(కిద పేజీ తరువాయి)

చింది. అలా ప్రతిబింబించిన తన ముఖం ఆ బాలగోపాలుడికి ఏదో "నీల కమలం" లాగున కన్పించింది. వెంటనే దాన్ని అందుకోవాలి అన్పించింది. చెయ్యి చాచాడు. అది అందలేదు. పట్టుకోబోయాడు. సాధ్యం కాలేదు. ఎంత ప్రయత్నించినా ఆ చక్కని కమలం చేతికి చిక్కందే! అందని అరవిందాన్ని అందుకోవటం చేతకాక ఏమీ చెయ్యలేక - ఎటూ పాలుపోక - ఎదురుగా ఉన్న దాదివైపు చూస్తూ ఏడవటం మొదలు పెట్టాడు చిన్నారికన్నయ్య.

పరమ మనోహరమైన ఆ బాల ప్రకృతికి అక్షరాకృతి కల్పించాడు మహాకవి.

రత్నస్థలే జానుచరః కుమారః
సంక్రాంత మాత్మీయ ముఖారవిందమ్
ఆదాతుకామ స్తదలాభఖేదాత్
విలోక్య ధాత్రీవదనం రురోద.

## రాత్రి రానే వచ్చింది!

ఆడి ఆడి అలసి వచ్చిన అందాల కృష్ణుడికి ఆకలివేసింది. అటూ ఇటూ చూచాడు. తింటానికి ఏమీ కన్పించలేదు. వెంటనే అమ్మదగ్గరికి పరుగెత్తాడు.

"మాతః!" అమ్మా! అన్నాడు.

"కిం యదునాథ!" ఏమిట్రా నాన్నా! అన్నది యశోద.

"దేహి చషకం" గిన్నె ఇవ్వవే అన్నాడు అబ్బాయి.

"కిం తేన?" ఇప్పుడు గిన్నెందుకు? అన్నది తల్లి.

"పాతుం పయః" పాలు తాగటానికమ్మా అన్నాడు చిన్ని కృష్ణుడు.

"తన్నాస్తి అద్య" పాలుతాగేది ఇప్పుడు కాదురా.

"కదాస్తి వా!" మరెప్పు డంటావు?

"నిశి" రాత్రికిరా పాలు తాగేది.

"నిశా కా వా?" రాత్రి అంటే ఎట్లా ఉంటుందే?

"అంధకారోదయః" అంతా చీకటై పోతుందిరా! అదే రాత్రంటే! తెలిసిందా!

వెంటనే కొంటె గోపాలుడు తన రెండు కళ్ళూ గట్టిగా మూసుకున్నాడు, "అమ్మా! అంతా చీకటయింది. రాత్రి వచ్చింది. ఇక ఆలస్యం చెయ్యకుండా పాలగిన్నె ఇవ్వు" అంటూ పట్టినపట్టు వదలిపెట్టకుండా అమ్మ పై టకొంగు గట్టిగా లాగసాగాడు. అటువంటి నందకిశోరుని 'కరం' మీకు 'శుభకరం' కావాలంటాడు కవి.

ఆ చక్కదనాల శ్లోకాన్ని సమగ్రంగా మరొక్కమాటు అవధరించండి-

"మాతః!" "కిం యదునాథ" "దేహి చషకం"
"కింతేన" "పాతుం పయః"
"తన్నాస్త్యద్య" "కదాస్తి వా?" "నిశి"
"నిశా కావా?" "అంధకారోదయః"
ఆమీల్యాక్షియుగం నిశాప్యుపగతా
దేహీతి మాతుర్ముహు
ర్వక్షోజాంశుక కర్షణోద్యతకరః
కృష్ణస్య పుష్ణాతు నః

## ఇంకా ఎదగదేమే?

అన్నయ్య బలరాముడి జడ ఎంత బాగుందో! గాలికి తూగుతూ సాగుతూ నాగుబాము లాగా నాట్యంచేస్తుంది. మరి తన జడో! పొట్టిగా వేలెడంత కూడా లేదు. కదలదు. మెదలదు. ఇదే పెద్ద దిగులై



పోయింది కృష్ణుడికి. "అమ్మా అమ్మా! నా జుత్తు ఒత్తుగా పొత్తుగా ఎప్పుడు ఎదుగుతుందే" అంటూ అడిగాడు యశోదమ్మను. యశోద చెప్పింది కదా "ఒరే కన్నయ్యా! అన్నయ్య ఆడుకోవానికి యమునానది ఇసుకతిన్నెల మీదికి వెళ్ళాడు. వాడు వచ్చే లోగా మన కపిలగోవుపాలు కడుపునిండా త్రాగావంటే నీజుట్టు కూడా అంతపొడుగున దుబ్బులా దబ్బు దబ్బున పెరుగుతుంది" అని మాయమాటలు చెప్పి గిన్నెనిండా పాలుపోసి యిచ్చింది. చిన్నికృష్ణుడు ఒక చేత్తో పాలగిన్నె పట్టుకొని సగం పాలు త్రాగి మధ్యలో ఆగి రెండోచేత్తో తనజుట్టు తడుముకో సాగాడుట.

ఈ చమత్కారాన్ని లీలాశుకుడు తన కవిత్వంలో ఇలా దిద్ది తీర్చాడు.

కాళిందీపులినోదరేషు ముసలీ
యావద్గతః ఖేలితుం
తావత్ కార్పరికం పయః పిబ హఠే
వర్ధిష్యతే తే శిఖా
ఇత్థం బాలతయా ప్రతారణపరాః
శ్రుత్వా యశోదాగిరః
పాయాన్నస్స్వశిఖాం స్పృశన్ ప్రముదితః
క్షీరేర్ధపీతే హరిః

ఈ సుందర భావాన్ని సూరదాసుగారు అందుకుని తన హిందీ కవితలో అందంగా పొందు పరచాడు.

మైయా కబహి బఢైగీ చోటీ?
కితై బార కాఫీపయు పీహో
అజ హూహై ఛోటీ

## మా దూడ తప్పిపోయిందండోయ్

మరో సన్నివేశం చిత్తగించండి.

"ఒరే పిల్లవాడా! ఎవరురా నువ్వు?"

"ఎవరినా! సయానా బలరాముడి తమ్ముణ్ణి." బలరాము డంటే ఆ వూళ్లో అందరికీ భయం.

"అయితే మా యింటి కెందుకు వచ్చావ్"

"మాయిల్లే అనుకొని పొరపాటుపడ్డాను"

"సరే కాని ఆ వెన్నకుండలో చెయ్యి పెట్టా వెందుకూ?"

"ఇదుగో చెబుతున్నా విను. మా ఆవు దూడ తప్పించుకు పోయింది. అమ్మేమో బుజ్జాయిని వెతుక్కు రమ్మంది. నేను అన్ని చోట్లా వెదికాను. అది కనుపడలేదు. ఇదిగో ఈ కుండలోకి వచ్చి దాక్కుందేమో నని చూస్తున్నా నంతే. ఉంటే వెంటతీసుకెళ్లుతా; లేకపోతే ఊరికే చేతులూపుకుంటూ వెళ్లుతా. అంతే! నువ్వు మాత్రం కంగారు పడకు"

పై విధంగా ప్రేవల్లెలో గొల్లభామకూ గోపాలకృష్ణుడికీ జరిగిన సంభాషణాన్ని మహాకవి ఛందోబద్ధం చేసిన తీరు తిలకించండి—

కస్త్వం బాల! బలానుజః, కిమిహ తే?
మన్మందిరాశంకయా
యుక్తం తన్నవనీత పాత్ర వివరే
హస్తం కిమర్థం న్యసేః

మాతః కించన పక్ష్మికం మృగయుతం
మాగా విషాదం క్షణా,
ఇత్యేవం పరిపల్లవే ప్రలపతః
కృష్ణస్య పుష్ణాతు నః.

## లక్ష్మణా! విల్లు! విల్లు!

"ముద్దు కృష్ణా! పొద్దు పోయింది. నిద్దుర పో!" అంది యశోదమ్మ.

"అమ్మా నిద్ర రావడం లేదు, ఏదన్నా మంచి కథ చెప్పవే!" అన్నాడు అమ్మ పక్కలో పడుకున్న కన్నయ్య. యశోద కథ చెప్పటం ప్రారంభించింది. కృష్ణుడు వింటూ ఊఁకొడుతున్నాడు—

"అనగా అనగా పూర్వం "రాముడు" అనే రాజకుమారు డుండేవాడు."

"ఊఁ"

"ఆ రాముడి భార్యపేరు సీత"

"ఊఁ"

"తండ్రిగారి మాట తల మీద ధరించి శ్రీరాముడు సీతతో అరణ్యాలకు వెళ్లాడు"

.... .... .... .... .... .... ...."

అబ్బాయికి నిద్దురపడుతున్నది. తల్లి కథ చెప్పుకు పోతున్నది.

"అక్కడ—ఆ అరణ్యంలో "పంచవటి" అనే ప్రదేశంలో - వాళ్లు ఉంటుండగా ఏం జరిగిందంటే—వింటున్నావా! రావణాసురుడు దొంగవేషంతో వచ్చి రాముడిభార్య సీతను ఎత్తుకొని వెళ్లాడురా!"

కలతనిద్దురలో కథ వింటున్న కన్నయ్య గభీలున లేచి "సౌమిత్రీ! విల్లు! విల్లు! అంటూ పెద్దకేక పెట్టాడు.

ఆనాటి రాముడే ఈనాటి కృష్ణుడు కనుక "రావణాసురుడు సీతను అపహరించాడు" అన్నమాట చెవిని పడగానే పరమాత్మ ఆత్మ వ్యగ్ర మయింది. ఉగ్ర మయింది. ఆగ్రహోదగ్ర మయింది.

ఈ అందమైన సన్నివేశం మన మహాకవి ఛందంలో ఇలా రూపందింది.

రామో నామ బభూవ హుం తదబలా
సీతేతి హుం తౌ పితు
ర్వాచా పంచవటీతటే విహరతః
తస్యాహర ద్రావణః
నిద్రార్థం జననీకథా మితి హరేః
హుంకారతః శ్రుణ్వతః
సౌమిత్రే! క్వ ధను ర్ధను ర్ధను? రితి
వ్యగ్రా గిరః పాతు వః.

## చీకటింట్లో నల్లపిల్లి

పెరుగు తరుస్తూ తరుస్తూ ఒక గొల్లి ఇల్లాలు ఏదో పనిమీద లోపలికి వెళ్లింది. సమయం కనిపెట్టి బాలకృష్ణుడు లోపల జొరబడ్డాడు. పైపై వెన్నంతా తిన్నాడు. మూతి తుడుచు కుంటుండగా గోపెమ్మ వచ్చింది. "కుండలో వెన్నంతా ఏదీ?" అన్నది. "నల్ల పిల్లి తిని పోయింది." అన్నాడు నల్లనయ్య. నోరు తెరవగానే వెన్నవాసన గుప్పుమంది. గొల్లభామ



ప ప్పగిరి

"అవు నవును ! చీకటింట్లో నల్లపిల్లి కదూ!" అంటూ గట్టిగా ఒక్కటి అంటించ పోయింది అబ్బాయి చెంప మీద. కన్నయ్య కన్నుల్లో నీళ్లు గిర్రున తిరిగాయి. గొల్లభామమ జాలి వేసింది. "చిన్నికృష్ణా ! ఇంకొంచెం వెన్న పెడతా గాని కొంచెంసేపు నాట్యం చెయ్యి" అని ఆశ పెట్టింది. నల్లనయ్య కాళ్ల గజ్జెలు గల్లు గల్లు మనేట్లు ఆడి వెన్న ముద్ద అందు కున్నాడు బహుమానంగా. ఈ భావాన్ని ఈ క్రింది శ్లోకంలో స్ఫురింప చేశాడు మహా కవి లీలాశుకుడు—

పవనే నవసీతగంధవాహం
వచనే తస్కర చాతురీధురీణం
నయనే కుహనాశ్రు ముద్రయేదాః
చరణే కోమలతాండవం కుమారమ్.

ఇదే భావం ఎఱ్ఱన్న గారి హరివంశంలో కూడా కనిపించుతుంది.

వెన్న కొట్టెద మాకుమా యన్న"యన్న
మువ్వలను మొలగంటలు మొరయనాడు
నచ్చుటుడు, గోపికలు తమయాళ్ళ బ్రమసి
పెరుగుచను వను మరలి సంప్రీతి బూజ.

నడుముకు తళ తళ మెరిసే బంగారు గజ్జెల మొలతాడు సింగారించుకుని, మెడలో మిల మిల మెరిసే మేలి పులిగోరు అలం కరించుకుని దిసమొలతో తిరుగుతున్న నల్లనిపేరుని వానికి, నందుని పిల్లవానికి, సకలసేకరోపునికి నమస్తే అంటున్నాడు లీలాశుకుడు—

[illegible]
[illegible]
[illegible]
[illegible]

"ఆ కటుపీసు కిశోర మూర్తి, ఆ రమణీయ గోపాల మూర్తి, ఆ మహనీయ మురళీ మోహనుడు, ఆ నెమలి పింఛ లాంఛ నుడు నా వాంఛితం తీర్చాలి అంటాడు."

అభినవనీల స్నిగ్ధమూ అసిత ముగ్ధమూ దధి రజ పరిదిగ్ధమూ అయిన ఆ ముగ్ధ మోహనుని మూర్తి నా కన్నులలో కదలు తున్నట్లంటాడు.

"మేము శైవులం. నిత్యం పంచాక్షరీ మంత్రం జపిస్తాము. ఇందులో సందేహం లేదు. అయినా నా మనస్సు మాత్రం ఆ చిరునవ్వులు చిందే చిన్నారి నల్లనయ్యనే సదా స్మరిస్తున్నదంటాడు."

లీలాశుకుని అమరకృతి శ్రీకృష్ణ కర్ణా మృతం. ఇందులో మూడు ఆశ్వాసాలు ఉన్నాయి. ప్రతి ఆశ్వాసంలో నూట పద కొండు శ్లోకాలుంటాయి. గ్రంథమంతా శ్రీకృష్ణలీలా సుగంధంతో గుమగుమలాడు తుంటుంది.

"కస్తూరీ తిలకం లలాటఫలకే" "[illegible]" [illegible] ఇత్యాది శ్లోకాలన్నీ ఈ పాట[illegible]! లీలాశుక కవి [illegible]!

"చింతామణి" [illegible] కాలం [illegible] ఈ లీలాశుక భావాం [illegible] [illegible] కొందరు. కాబట్టే ఆ శృంగార లీలలూ ఆ సౌందర్య హేలలూ ఎక్కువయిపోయి వచ్చాయి!

జయదేవుని మధుర మంజుల గీతాలతో శ్రోతలకు ఉత్సాహాన బూస్తే నారాయణ తీర్థుల తరంగాల అంతరంగాలను రసతరం గాలలో ఓలలాడిస్తే, జగన్మోహిని అయిన లీలాశుకుని వాణీ కర్ణప్రియముల కర్ణాలలో అమృతం పంపించి మైమరపించింది.

సరస కోమలకాంతపదావళికి జయదేవుడు "మారుపేరు" అయితే, రసమయ రమణీయ శిల్పానికి లీలాశుకుడు "పెట్టిందిపేరు." ఇద్దరూ శ్రీకృష్ణ భక్తులే! ఇద్దరూ శృంగార గంగా భగీరథులే! ఇద్దరూ సౌందర్య సమా రాధకులే! అయితే జయదేవుని కవిత్వం ఇక్షురసం! లీలాశుకుని కవిత్వం ద్రాక్షరసం!

★

---

[ 8వ పేజీ తరువాయి ]

ఓ దేవీ నేను గుర్రముపై సవారిచేస్తూ సముద్రతీరమునందుగల ఉపవనమును ప్రవేశించితిని. ఇప్పటివరకు అక్కడి మృగ ములను వేటాడి తిరిగి వచ్చినాను. మరో విధంగా నా గురించి భావించకు. ఓ ప్రాణ సఖీ! ఎటువంటి అనుమానము వద్దు.

భగవానువాచ : (అధికపాఠము)

శ్లో॥ యాతోస్మిదేవి మృగరాజ
మృగాశనాద్యైః
దృష్టైర్మృగైరపి సదాక్షణదాచరైశ్చ
శృత్వార్ధి ఘోషమటవీం నిశి
బాధితానాం
క్లేశోపశాంతి కరణాయ తపో
ధనానాం॥

ఓ దేవి! సింహవ్యాఘ్రాది దుష్టమృగ ములచేతను మరియు రాక్షసులచేతను పీడింపబడుచున్న మహర్షుల ఆర్తనాదము లను విని వారిని కాపాడి, వారి దుఃఖం పోగొట్టుటకు గతరాత్రి అరణ్యమునకు పోయి తిని.

దేవ్యువాచ :

కృతాస్తి లోకే మృగయావరాణాం
తానేక్షణం పంత్రనఖక్షతంచ।
కిర్ణాలకం స్విన్నముఖం నితాంతం
సమీక్షతాంగం కితవస్య సఖ్యః॥

లక్ష్మీదేవి తన సఖులనుద్దేశించి ఓ సఖు లారా! ఈ మోసగాని శరీరమును చూడండి లోకంలో వేటకొరకై వెళ్ళినవారికెవరికైనా పెదవులు, వక్షస్థలములపై అక్కడక్కడ గోరుల మరియు దంతముల గాట్లు ఉంటాయా? జుట్టు చెదరిపోయి, ముఖం అంతా స్వేద బిందువులతో అలంకరించు కొనుట ఇటువంటి గుర్తులు ఉంటాయా?

దేవ్యువాచ :

శ్లో॥ జలజ నయనజాలం వీక్షకై
ద్రీక్షుకృత్వా
ప్రముషిత నిజవేషః పల్లవాకార ధారీ!
మృగయారసి నిశాయాం మానమేదీ
దళికాంత్వం
హృదయ హరిణ వృందం మంద
మందం గృహిత్వా॥

హే! ప్రాణనాథ! నిజం చెప్పండి. రాత్రి సమస్త దిక్కులకు మీ కమలములవంటి నయనములతో మీ సుందరమైన విగ్రహ కాంతితో లేడికన్నులుగల సుందరాంగుల కోసం వలపన్ని వారి మనస్సనేటి మృగ సమూహమును పట్టుకొనుటకు వెళ్ళినారు కదా!

భగవానువాచ :


కిం మాం విశంకయసి పంకజవాసిని
త్వం, హంతుం నిశాచర గణానటవీం
గతోఽస్మి।
విశ్వాసహేతుర భవద్యది మేన
వాక్యం
పృచ్ఛస్వమే పరిజనం శపథం
విధాయ॥

హే కమల నయని! నీవు నా గురించి ఎందుకు అనుమానము పడుచుంటివి? నేను నిశాచరులైన రాక్షసులను సంహరించుటకు అరణ్యమునకు పోయితిని. ఈ నా వచన ములయందు విశ్వాసములేనిచో ఈ పరిజను లందరి ముందుగ ప్రమాణపూర్వకముగా నిజం చెప్పెదను. (సశేషం)

# శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవస్థానము, తిరుమల
## వివిధ ఆర్జిత ఉత్సవముల దరల వివరములు.

| | |
|---|---|
| 1. స్పెషల్ దర్శనము | రు. 25 |

ఈ టికెట్టు తిరుమలలోను, దేశంలో ఆంధ్రా బ్యాంకువారి వివిధశాఖలలోను లభించును.

### సేవలు

| | |
|---|---|
| 1. ఆమంత్రణోత్సవము | రు. 400 |
| 2. అభిషేకము (పులికాపుసేవ) | రు. 500 |
| 3. పునుగుగిన్నె | రు. 200 |
| 4 జాఫ్రాగిన్నె | రు. 100 |
| 5. కస్తూరిగిన్నె | రు. 100 |
| 6. సహస్రకలశాభిషేకము | రు. 3500 |
| 7. తిరుప్పావడ * | రు. 5000 |
| 8. కోవిల్ ఆళ్వారు తిరుమంజనం | రు. 3000 |
| 9. ఐనా మహల్లో డోలోత్సవం * | రు. 1500 |
| 10. సహస్ర దీపాలంకారసేవ | రు. 2000 |
| 11. పవిత్రోత్సవం | రు. 5000 |
| 12. ఊంజల్ సేవ | రు. 1500 |
| 13 నూతన ఊంజల్ సేవ | రు. 3000 |

### తిరుమల, తిరుపతిలో వసతి సౌకర్య వివరాలు

తిరుమలలో

| | |
|---|---|
| (1) ప్రత్యేకపు కాటేజీలు | రు. 75 |
| (2) టి. బి. లోపల కాటేజీలు | రు. 50 |
| (3) యస్. వి. గెస్టుహౌస్ పెద్దగదులు | రు. 50 |
| మూలగదులు | రు. 40 |
| ఒక్కగదికి | రు. 35 |
| (4) హెచ్. ఆర్. జి. కాటేజీలు కల్యాణమంటపాలు | రు. 150 |
| రూయాకాటేజి, గోగినేని కాటేజి | రు. 80 |
| సి. పి. కాటేజీలు | రు. 100 |
| కంతమిట్ట తూర్పు నెం॥ 9 | రు. 50 |
| ఆళ్వారుల టాంక్ కాటేజి నెం॥ 39 | రు. 80 |

తిరుపతిలో

శ్రీనివాస చౌల్ట్రి: 15, 12, 10. రూ.

పద్మావతి గెస్టుహౌస్ (ఏ సి) రెండుపడకలకి: 40 రూ.

ఒక్కపడకకి: 30 రూ,

శ్రీవేంకటేశ్వర గెస్టుహౌస్: రెండుపడకలకి: 16 రూ.

### ఉత్సవములు

| | |
|---|---|
| 1. వసంతోత్సవము | రు. 3000 |
| * 2. తెప్ప ఉత్సవం | రు. 2500 |
| 3. కల్యాణోత్సవము | రు. 2000 |
| 4. బ్రహ్మోత్సవము | రు. 1000 |
| 5. పుష్పయాగం | రు. 3500 |

### వాహనములు

| | |
|---|---|
| 1. బంగారుగరుడ కల్పవృక్ష, సర్వభూపాల, సూర్యప్రభ ఒక్కొక్కదానికి | రు. 125 |
| 2. వెండిగరుడ, చిన్న శేష, ఏనుగు, గుఱ్ఱం, హంస, హనుమంత వాహన సేవ ఒక్కొక్కదానికి | రు. 100 |

షరా: - సహస్ర కలశాభిషేకము ప్రతి బుధవారమునను, తిరుప్పావడ ప్రతి గురువారమునను జరుగును.

1. ఆమంత్రణోత్సవమునకు ఇద్దరికి మాత్రమే అనుమతి 2,3,4, 5,6, సేవలకు ఒక్కొక్కరికి మాత్రమే అనుమతి.
2. ప్రతిదినం మధ్యాహ్నం 1-00 గం॥ 7-00 గం॥ లోపల సర్కారు లేదా ఆర్జిత కల్యాణోత్సవం, బ్రహ్మోత్సవం, వాహనసేవలు, సర్కారు డోలోత్సవం (ఉయ్యాల) (సర్కారు లేక ఆర్జిత ప్లవోత్సవం, మంగళవారంనాడు) జరుగుతవి.

* ఈ ఉత్సవముల వారికి 5 గ్రా. బంగారు పతకం బహూకరింతురు.

### * నిబంధనలు *

కాటేజీలు కావలసినవారు ఆ ప్రాంతపు రిసెప్షన్ ఆఫీసర్ పేరిట కనీసం పదిరోజులు ముందుగా డిమాండ్ డ్రాఫ్టు మూలకంగా డబ్బుపంపాలి. ఒక కాటేజీ కొరకు పంపి వేరొక వసతి ఏర్పాటైతే జమచేయగా మిగిలిన డబ్బు వాపసు ఇవ్వబడుతుంది. ఉదయం 8 గంటలనుండి మరునాడు ఉదయం 8 గంటలవరకు ఒకరోజుగా లెక్కించబడుతుంది. డబ్బు కట్టినవారు మొదటి రోజున రానిపక్షంలో అంతకు ముందు చెల్లించిన డబ్బు తిరిగి ఇవ్వబడదు. తరువాత ఛార్జీలకు లెక్క కట్టబడదు.

ఈ రిజర్వేషను 2 రోజులకు మాత్రమే: పరిస్థితులను బట్టి పొడిగింపు వుంటుంది. ఏ వసతి దొరకని పక్షంలో డబ్బు తిరిగి ఇవ్వబడును.

డబ్బు కట్టినవారు తమకు ముందుగా పంపబడిన రిజర్వేషను కార్డును లేదా మనియార్డరు రశీదును లేదా నగదు రశీదును ఆయా రిజర్వేషన్ కేంద్రాలలో చూపవలసి వుంటుంది. లేనిచో రిజర్వేషన్ రద్దుకాగలదు.

తిరుమల తిరుపతి దేవస్థానం.

ఓ బొజ్జ గణపయ్య
నీ బంటు నేనయ్య!
ఉండ్రాళ్ళమీదికి దండు పంపు.

.....................................

# విఘ్నేశ పూజ

అర్తుడూ, అర్థార్థీ, జ్ఞానీ....ఇలా భక్తుల్లో రకరకాలు వున్నట్లే – ప్రార్థనల్లోకూడా పలు రకాలు! పైన పేర్కొన్న పాటకూడ ఒక ప్రార్థనే! ఒక తిండిపోతు దేవుడికి ఓ పసరు బోతు చేసిన ఈ 'ఆకలి' ప్రార్థనలో ప్రత్యక్షరం హాస్యభరితం!

మన దేవుళ్ళవన్నీ దివ్యమంగళరూపాలే! మరి ఇందుకపవాదంగా బానకడుపుతో చీమంత కళ్ళతో చేటల్లాంటి చెవులతో తొండంలాంటి ముక్కుతో సదా భుక్తాయాసంతో ప్రత్యక్షమయ్యే 'గణపతి' హాస్యరసాధి దేవతగా మన కవులకు కనిపించడం వింతకాదు. అందుకే ఆంధ్ర కవితాపితామహుడు 'అల్లసాని పెద్దన' అంతటి వాడే ఓ వంక వినాయకుడికి చెయ్యెత్తి దండం పెడుతూనే 'తొండమున నవ్వలి చన్ కబళింపబోయి ఆ వంక కుచంబుగానకహి వల్లభహారముగాంచి వే మృణాళాంకురశంక నంటెడు గజాస్యుని—అంటూ మెల్లగా ఓ విసురు విసిరాడు!

ఐతే మెరిసేదంతా బంగారం కానట్లే, కంటికి కనబడేదంతా సత్యం కానక్కరలేదు! మనిషి రూపం వేరు; అతని మేధాశక్తి వేరు–ఈ రెంటికీ మధ్య ఎంతెంతో దూరం! ఇందుకు గణపతితత్త్వం ప్రథమోదాహరణం! ఆయన శరీరం ఎంత స్థూలమో బుద్ధి అంత సూక్ష్మం. మాతా పితరులకు ముమ్మారు ప్రదక్షిణంచేసి ముల్లోకసంచార ఫలం సాధించే 'ధర్మసూక్ష్మం' బాల్యంలోనే కనిపెట్టినందువల్లనే ఆయన గణాధిపతీ, వినాయకుడూ కాగలిగాడేమో? ఆదర్శ నాయకుడు అనిపించుకోవాలనుకున్నవాడు భవబంధాలకతీతుడై వుండాలన్నది ఈనాడు మనం అనుకొనేమాట. అందులో వినాయకుడే మనకు ఆదర్శం! వినాయకుడు బ్రహ్మచారి! అయినప్పటికీ సిద్ధి, బుద్ధి అనే దేవేరులు ఆయన [illegible] కార్యసిద్ధి, సూక్ష్మబుద్ధి నాయకత్వ లక్షణాలని చెప్పటానికే కావచ్చును—

గణపతి వైరూప్యం వెనకవున్న మరో సందేశంకూడా గమనార్హమైందే! శారీరక సౌందర్యం క్షణికమైంది. (Beauty is skin deep అని ఆంగ్లంలో ఓ సామెత) ఇందుకు భిన్నమైంది ఆత్మసౌందర్యం. దానికి వృద్ధి గాని క్షయముండదు. రూప యౌవన ధన మద గర్వాలు మనిషిలో అహంకారాన్ని అంకురింపజేస్తే ఆత్మసౌందర్యం అతణ్ణి వినయశీలిని చేస్తుంది. అందం లేనివారిపట్ల సౌందర్యవంతుల మిడిసిపాటు చివరికి వారికి భంగపాటుగా పరిణమిస్తుంది. పాపం! అందాల చందమామ అహంకారంతో బొజ్జ గణపతిని అవహాస్యం చేసిన నేరానికేగదా వినాయకచవితినాడు నెలవంకను చూడకుండా మనం తల త్రిప్పుకొంటున్నది.

మూలాధార చక్రానికి అధిష్ఠాత అయిన వినాయకుడు జ్ఞాని మాత్రమేగాక బ్రహ్మజ్ఞానికూడా! నేటి మన గణపతి ఉపాసన వేదాంతపరంగా ఎంతో గాంభీర్యాన్ని సంతరించుకొంది. మట్టితో చేసిన గణపతి బొమ్మను పూజాసంభారం సాలంకారంగా పీటలో పెట్టి [illegible]–పాంచభౌతిక మైన [illegible] దీనిపై [illegible] సుమా అనే హెచ్చరిక వినిపించటం లేదూ? అలాగే ఎందుకూ కొరగానివిగా లోకులు ఎంచే జిల్లేడుపూలూ, ఉమ్మెత్తపూలూ గణపతి పూజలో పీట ఎక్కి కూచోటంలో 'హీనంగా చూడకు నన్ను!' అనే ఒక ఆదేశం వుంది! ఆ స్వామి ముందు మొట్టికాయలు వేసుకోటం, గుంజీళ్ళు తీయటం మానసికంగా శారీరకంగా మన [illegible] కోసమే. తాను [illegible] తలిస్తే దైవం [illegible]–అన్నట్లు కాకుండా తలచిన పని తలచిన రీతిలో జరగాలంటే దైవానుగ్రహం వుండి తీరాలంటారు. ఏ పనైనా అవిఘ్నమస్తు అని ఆశీర్వదించ గలిగిన దైవం విఘ్నేశ్వరుడే! ఆయన విఘ్నకారకుడూ వినాయకుడూ కూడా! అందుకే ఆయన పూజతోనే మనం ఏపనైనా ప్రారంభిస్తాం! చివరికి దైవకార్యం కూడా!



ఒక మంచిపనికి ఎదురయ్యే ఆటంకాలు ఎన్నెన్నో! పదిమందీ కలిస్తేనే ఒక పుణ్యకార్యం! విఘ్నేశ్వరుడిసంగతటుంచితే పనిగట్టుకొని ఒక మంచి పనిని చెడగొట్టే వారు మనలోనే ఎంతో మంది వున్నారు. స్వార్థంతో ప్రతిదానికీ అడ్డం పడటమే వారు చేసే ఘనకార్యం! ఇలాంటి వారివల్లే మన ప్రగతి కుంటుపడుతోంది. పుణ్యకార్యాలకు 'విఘ్నం' కల్గించక పోవటమే మనం చేసే నిజమైన 'విఘ్నేశపూజ' అనే తలంపు వీరిలో కలిగేదెప్పుడో?

— కృష్ణచైతన్య



# ప్రమద్వర

భృగుమహాముని మనుమడు ప్రమతి. అతడు చాల మంచివాడు. అతడి కుమారుడు రురుడు. గొప్ప తపశ్శాలి. సత్య నిష్ఠా గరిష్ఠుడు. అనుకున్నది సాధించిగాని నిద్రపోని రకం.

అతడు ఒక రోజున ఆశ్రమానికి కొద్ది దూరంలో ఉన్న స్థూలకేశ ముని ఆశ్రమానికి వెళ్ళాడు. అక్కడ అతడు ఆశ్రమంలో ఉన్న ఒక యువతిని చూసి, ఆమె అందానికి ఆశ్చర్యపోయాడు. అప్సరస లను తలదన్నే రూపం ఆమెది. ఆమెను చూసిన మరుక్షణం మనస్సులో ప్రేమ పుట్టుకొచ్చింది. ఆ విషయం స్థూలకేశుడితో కాని, తండ్రితో కాని చెప్పలేదు. చెబితే ఏమయినా అంటారేమోనని అతడి భయం.

రురుడు విచారంగా ఉండడం గమనించారు అతడి తల్లిదండ్రులు. కారణం అడిగారు. దానికి రురుడు చాలాసేపటి వరకు ఏమీ చెప్పలేదు. కాని చెప్పకపోతే తనకే నష్టం అని తెలుసుకుని "తండ్రీ! నేను స్థూలకేశముని ఆశ్రమంలో ఉన్న ఒక యువతినిచూసి మోహించాను. ఆమెను పెళ్ళి చేసుకోవాలని ఉంది. అదే నా విచారానికి మూలకారణం" అని చెప్పాడు.

అతడి తండ్రి కుమారుడి నిర్ణయం విని 'అలాగే! నాయనా! నేను వెళ్ళి స్థూలకేశుడితో మాట్లాడి వస్తాను, అని చెప్పాడు. తండ్రి తన మాట కాదనకపోవడం సంతోషంగా ఉంది రురుడికి.

ఇంతకీ ఆ యువతి ఎవరో తెలుసుకుందాం. అప్సరస మేనక ఒకసారి విశ్వావసువు అనే గంధర్వుడిని కామించింది. ఫలితంగా గర్భం ధరించింది. మేనక స్థూలకేశుడి ఆశ్రమానికి దగ్గరలో ఉన్న నది దగ్గర ప్రసవించగా ఒక బాలిక జన్మించింది. ఆ బాలికను అక్కడే విడిచి వెళ్ళిపోయింది. ఆ బాలికే ప్రమద్వర. ఆ బాలిక ఏడుపు విని స్థూలకేశుడు దగ్గరకు వెళ్ళి చూసాడు. ఎవరో వదలివేసారనే నిర్ణయానికి వచ్చి తన ఆశ్రమానికి తెచ్చి పెంచాడు. ఆమే రురుడు మోహించిన ప్రమద్వర. అప్సరస మేనకకు జన్మించిన ఆమె, అపూర్వమైన అందంతో చూసే వారిని భ్రాంతుల్ని చేసేది.

ప్రమతి వెళ్ళి స్థూలకేశుడిని కలుసుకుని 'ప్రమద్వరను రురుడికి ఇచ్చి వివాహం చేయమని' చెప్పాడు. స్థూలకేశుడు ఎంతో సంతోషం పొంది 'తప్పక వివాహం చేసేద్దాం' అని ఒప్పుకున్నాడు. ఇరుపక్షాల వారి నిర్ణయం జరిగిపోయింది.






ముహూర్త నిర్ణయం జరిగిపోయింది. అప్పటికి కొద్దిరోజులే ఉంది వివాహ దినం.

ఒకరోజు ప్రమద్వర ఆశ్రమం వాకిట నిదురిస్తున్న పామును చూడకుండ తొక్కింది.దాంతో ఆ సర్పానికి నిద్రాభంగం జరిగింది. ఆ సర్పం కోపంతో 'బుస్సు' మని ప్రమద్వరను కాటువేసింది. ఆ పాము విషం తిరుగులేనిది కావడంతో ప్రమద్వర వెంటనే మరణించింది. ఆమె అకాల మరణానికి స్థూలకేశుడితో సహా, అక్కడఉన్న మునులు అందరూ దుఃఖించసాగారు. బిగ్గరగా ఏడ్వ సాగారు.

ఆ ఏడ్పుల ఘోష విని రురుడు అక్కడకు వచ్చాడు. ప్రమద్వర మరణవార్తవిని నిలువునా కూలిపోయాడు. తన భార్యగా

రురుడు తాను పెళ్ళాడవలసిన ప్రమద్వర కోసం సగం ఆయువు ధారపోశాడు. కానీ ఈనాడు మనం పెళ్ళయిన వెంటనే అర్ధాంగుల ఆయువు సగం తీస్తున్నాం. ఇదే వింత! సం॥

ఆమెను ఊహించుకుంటూ స్వప్నాలలో తేలిన అతడు ఆమె అకాల మరణ వార్తను భరించలేక పోయాడు. ఆమెను చూసే అంత ఆనందం పొందిన రురుడు, తాకితే ఎలా ఉంటుందో అని గొప్పగా ఊహించుకున్నాడు. అటువంటి అతడి ఆశలు ఒక్కసారిగా నిరాశలుగా మారడంతో భరించలేని శోకం అనుభవించాడు. తాను కూడా ఆమెతో పాటుగా చనిపోవాలనుకున్నాడు. కాని తాను చనిపోతే ఆమె బ్రతకదు కదా! లేక తాను ఆమెను చేరలేడు కదా! ఇలా ఆలోచించి చివరకు ఆ నిర్ణయం వదలి మనస్సులో పట్టుదలగా ఆలోచిస్తూ నది వైపు కదిలాడు.

అతడు ఒక నిర్ణయానికి వచ్చి నది దగ్గరకు వెళ్ళాడు. స్నానంచేసాడు. ఆచమనం కూడా చేసి కూర్చుని, చేతిలో నీరు పట్టుకొని దేవతలను స్మరిస్తూ ఇలా అన్నాడు. 'నేను దేవార్చన మొదలగు పుణ్యకార్యాలు చేసి ఉంటే, గురువుల్ని పూజించి ఉంటే, వేదాలు అధ్యయనం చేసి ఉంటే, నా ప్రియురాలు ప్రమద్వర బ్రతకాలి. లేకపోతే నేను చనిపోతాను' అంటూ చేతిలో ఉన్న నీరు నేల మీద పోసాడు.

అంతే! మరుక్షణం అక్కడ ఒక దేవదూత ప్రత్యక్షమయ్యాడు. అతడు "ముని కుమారా! నీ విచారం అర్థం లేనిది. ప్రమం

చంలో ప్రతివాడికీ చావు పుట్టుకలు సహజం. అలాగే ఆమె ఆయువు నిండడంతో మరణిం చింది. ఆమె మరణానికి నువ్వు వ్యథ చెందకు. నీ కింకా వివాహం జరుగలేదు కనుక నీవు వెళ్ళి మరొక కన్యను శాస్త్రోక్తంగా వివాహం చేసుకుని సుఖవంతంగా జీవించు' అని చెప్పాడు.

కాని ఆమెను భార్య కన్నా ఎక్కువగా ఊహించుకున్న రురుడికి దేవదూత మాటలు రుచించలేదు. "ఆర్యా! మీరు చెప్పినంత సులభంగా నేను మరొక కన్యను చేపట్ట లేను. దయ ఉంచి వేరే ఏదైనా మార్గం ద్వారా నా ప్రమద్వరను బ్రతికించండి. లేకపోతే చనిపోతాను" అన్నాడు రురుడు.

దేవదూత రురుడి పట్టుదలలో మార్పు లేకపోవడం గమనించాడు. అన్నంతపనీ చేసే రకం అనుకుని చివరకు ఇలా అన్నాడు "ముని కుమారా! నేనొక ఉపాయం చెబుతాను. ఇది ఇంతవరకు ముందు లేని తలా ఉపదేశించని ఉపాయం. నీవు నీ ఆయువులో సగం ఆమెకు ధారపోస్తే ఆమె తప్పక బ్రతుకుతుంది. ఆలోచించి నిర్ణయం తీసుకో!"

రురుడు ఆ మాటలకు సంతోషిస్తూ "దేవా! మీరు చెప్పిన పద్ధతికి నేను అంగీకరించాను" అన్నాడు. ప్రాణానికి ప్రాణం అనుకుంటున్న ప్రమద్వర బ్రతకడమే తనకు చాలునని అనుకున్నాడు.

ఆ దేవదూత యమధర్మరాజు వద్దకు వెళ్ళి విషయం వివరించి చెప్పాడు. యముడు అందుకు అంగీకరించాడు.

ప్రమద్వర వద్దకు వెళ్ళి రురుడు తన నిర్ణయం చెప్పాడు. అంతే! మరుక్షణం ఆమె నిద్రనుండి లేచినట్లు లేచింది. అతడి సంతోషం అంతులేనిదైంది.

ఆ తరువాత వివాహం చేసుకొని సుఖ సౌఖ్యాలనుభవించారు. ఇలా పూర్వపు చరిత్రలు. ఆమెను వివాహం చేసుకోక ముందే ఆమెను భార్యగా భావించి సగం ఆయువు ధారపోసి ప్రాణ ప్రతిష్ఠ చేశాడు రురుడు.

కాని ఇప్పుడో? కోరినవన్నీ ఇచ్చి పెళ్ళి చేసినప్పటికీ, ఏదో ఒకటి రెండు వస్తువులు ఇవ్వలేదని ఎంతో మంది తమ భార్యలను చంపి, చంపించిన సంఘటనలు ఉన్నాయి.

హిందూ ధర్మం అతి పవిత్రమైనది. ఆ ధర్మాలను మంటగలుపుతున్న వారిని మీరు మార్చడానికి ప్రయత్నించండి. భగవంతుని కృప ఎల్లవేళలా మీకు తోడుగా ఉంటుంది.

—శ్రీ ఎస్. ఉమామహేశ్వరరావు

## అగజానందన




శ్రీ గణ నాయక
సిద్ధి వినాయక
చేతుము నీ స్తుతి
చేకొనుమా.
పార్వతి తనయా
పరమ కృపామయ
ప్రణతుల గొను
శ్రీ గజాధిపా
ప్రతివర్షము నిను
భాద్ర పదంబున
శుద్ధ చవితిని
శ్రద్ధాన క్తిని.
పుట్టమన్నుతో
ముద్దుగ నీదు
బొమ్మనుచేసి
బొజ్జగణపతీ.
వచ్చని కొమ్మల
పందిరి వేసి
దానినడుమ నుచి
ఆసన మేసి
పొలికి ఆకుల
పూల పాన్పువయి
నిన్ను సుఖాసీ
నుని గా జేసి
వేల్పులలో తొలి
వేల్పువు నీవని
చదువుల కెల్లా
స్వామివి నీవని
పప్పు బెల్లములు
చప్పటుంద్రాళ్ళు
పాలు చక్కెరలు
పండ్లు ఫలములు
నీ కర్పించీ
నిన్నర్చింతుము
అది పాడుచూ
హారతి నిత్తుము
మూషక వాహన
ఏకదంత మా
దోషములను
తొలగించి కావుమా

— గాధిరాజు పాలమూరు



విశాఖపట్నంలో అన్నమాచార్యసంకీర్తనలు గానంచేస్తున్న
అన్నమాచార్య ప్రాజెక్టు గాయకుడు శ్రీ జి. నాగేశ్వరరావునాయుడు.

## ధార్మిక ప్రచారం

తిరుమల తిరుపతి దేవస్థానముల హిందూ ధర్మరక్షణ సంస్థవారు గత జూన్ నెల 21 వ తేది నుండి జులై 1 వ తేది వరకు విశాఖ పట్నం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలలో విస్తృత ధార్మిక ప్రచారోద్యమం నిర్వహించారు. శ్రీ సముద్రాల లక్ష్మణయ్య శ్రీ ఇ. కరుణాకరన్ గార్ల సారథ్యంలో దేవస్థాన పురోహితులు, శ్రీ అన్నమాచార్య ప్రాజెక్టు కళాకారులు, తదితరులు ఇందులో కృషి చేశారు. వీరు వెళ్ళిన అన్నిచోట్లా వీరి కార్యక్రమాలకు ప్రజానీకం నుండి విశేషాదరణ లభించింది.



## పురాణప్రబోధ పరీక్షలు
### జనవరి 1984.

తిరుమల తిరుపతి దేవస్థానముల హిందూధర్మ రక్షణసంస్థ ఆధ్వర్యవంలో ఐదవ పురాణ ప్రబోధ పరీక్షలు 1984 సం॥ జనవరి 29 వ తేది, ఆదివారం జరుగనున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లోని పాఠశాలలలో 8,9,10వ తరగతులు చదివే బాలబాలికలు వీటిలో పాల్గొనవచ్చును. అభ్యర్థులు తమ దరఖాస్తులను తే 31-10-1983 ది లోగా తమ పాఠశాలల ప్రధానోపాధ్యాయుల ద్వారా పంపవలసి వుంటుంది. ఇతర వివరాలను స్పెషలాఫీసర్, పురాణప్రబోధ పరీక్షా విభాగము, హిందూధర్మ రక్షణ సంస్థ, తిరుపతి 517 501 అనే చిరునామాకు వ్రాసి తెలుసుకోవచ్చును.

## ఉత్తమ విక్రేత

1982 సంవత్సరానికి సప్తగిరి మాసపత్రిక (తెలుగు) ఉత్తమ విక్రేతగా వరంగల్ ఏజంట్ శ్రీ ఏ. రంగాచార్యగారు ఎన్నికయ్యారు—వీరు ఈ గౌరవం పొందటం ఇది మూడోసారి—ఒక సంవత్సరంలో నెలకు 500 సప్తగిరి ప్రతులను విక్రయించే ఏజెంట్లకందరికీ 10 గ్రాముల తూకంగల శ్రీవారి వెండి డాలర్‌ను టి.టి.డి. యాజమాన్యం బహుకరిస్తూ వస్తోంది. శ్రీ రంగాచార్యగారు నెలకు 1082 సప్తగిరి ప్రతుల్ని విక్రయిస్తూ అందరు ఏజెంట్లలోకి అగ్రస్థానంలో వున్నారు. తమిళంలో ఈ ఏడాది ఉత్తమ విక్రేతగా మద్రాసు ఏజెంటు శ్రీ ఏ. టి. కృష్ణన్ ఎన్నికయ్యారు.

వీరిద్దరికీ మా అభినందనలు.

సప్తగిరి.

Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press.



# సప్తగిరి

వెల: 1-00

అక్టోబరు 1983

తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాసపత్రిక



మిన్నునేలా నొక్కటైన మేటి తేరు
కన్నులపండువయిన శ్రీకాంతుని తేరు

జలధుల మీదను చక్కగానేగెను తేరు
బలిమిఁగులాద్రులపైఁబారెను తేరు
వెలుచలంక ముంగిట పేరెలు వారెను తేరు
చెలగె దిగ్విజయపు శ్రీహరి తేరు

రమణిఁ గుండిన నగరము చుట్టుకొన్న తేరు
తిమురుచు రుకుమిణిఁదెచ్చిన తేరు
సమరములో జరాసంధునిఁదోలిన తేరు
అమరుల వెనుబలమగు శౌరి తేరు

వొట్టి సృగాలవాసుదేవుని భంగించిన తేరు
బెట్టు పౌండ్రకునిపై దాడివెట్టిన తేరు
అట్టి శ్రీ వేంకటేశుఁడలమేలుమంగ గూడి
వట్టమేలుచునెక్కిన పరమాత్మ తేరు



(శ్రీవారి రథోత్సవంపై అన్నమాచార్య సంకీర్తన)

# మీమాట

## పక్షపత్రిక కావాలి!

జూలై సంచికలో బాల ప్రబోధం కథలు చాలా చక్కగా ఉన్నాయి. మానవుడు సృష్టిలో దేనినైనా సాధించ గలడు గాని, మృత్యువును మాత్రం జయించ లేడని దామోదర శాస్త్రి గారు 'మృత్యుర్ధావతి పంచమః' అన్న దాంట్లో మనస్సును హత్తు కొనేలా వివరించారు.

ఈ పత్రికను పక్షపత్రికగా, నెలకు రెండు పార్లు ప్రచురిస్తే బాగుంటుంది.

కొండపి వామదేవమూర్తి, ఒంగోలు.

"శ్రీ రసికావతంసు బుధ సేవిత, మంజు పదాఢ్య భారత క్షీర పయోధి వీచి కల చెన్నలరారు నవీనదివ్య శయ్యారతు సుప్రసన్న కవితా కలితార్థ కథాధురీణు సారెరు వచో విలాసుం" డైన నన్నయ్య భట్టారకుని ధర్మోపదేశమును డా. సముద్రాల వేంకటాచార్యుల వారు సోదాహరణ ముగా వివరించిన తీరు అక్షరలక్షలీయ మనసగు చున్నది. జూలై నెల సప్తగిరికి అలంకార ప్రాయమైనదీ రచన.

సప్తగిరి ఆధ్యాత్మిక విషయము లందే గాక సారస్వతవిషయమందును అగ్రగామిగ వెలుగొంద గలదని ఆశించుచున్నాను.

కొమాండూరిరామానుజాచార్యులు, కందుకూరు.

జూలై ముఖచిత్రం అద్భుతంగా వుంది. ఏ నెల సంచికలను ఆ సమయానికి విడుదల చేస్తూ ఆధ్యాత్మిక పత్రికలలో అగ్రగామిగా వున్న సప్తగిరికి మరింత శోభ చేకూర్చాలని ప్రార్థిస్తున్నాను.

వల్లూరి. ద. ఉమాశంకర్. గుంటూరు.

## ఏం జరుగుతున్నది!

మీరు మీ పత్రికలో వెనుక అట్టమీద హిందువులైనందుకు గర్వించండి, మీ ఆచార ప్రకారము బొట్టు పెట్టుకోండి. వారానికి ఒక సారైనా కుటుంబంతో కలిసి దేవాలయానికి వెళ్ళండి అని ప్రచారము చేస్తున్నారు.

కాని, అన్నిటికీ డబ్బు కావాలి. అసలు దేవుని దర్శనానికి కూడా నియమించిన సొమ్ముచెల్లించే దర్శనంచేసుకోవాలి. ఇతర మతాల వారు బీదలకు బట్టలు, మందులు, ఆహారపదార్థాలు ఇచ్చి వారిని తమవైపు త్రిప్పుకుంటున్నారు. వారికి నైవేద్యం, టిక్కెట్టు, దక్షిణా అక్కర్లేదు.

మరి మన దేవాలయాలలో దర్శనానికి టిక్కెట్టు, స్పెషల్ దర్శనానికి స్పెషల్ టిక్కెట్టు! ఇతర మతాల ప్రచారము అన్ని వేళలలో, అన్ని భాషలలో, అన్ని ప్రాంతాలలో జరుగుతున్నది. మరి మన మతాన్ని గురించి ఏమి జరుగుతున్నట్లు, ఎలా జరుగు తున్నట్లు?

ఎ. రాజారావు. బరంపురం, ఒరిస్సా.

## పాతాళంలో వద్దాం

తిరుపతికి లోగడ వేద్దామనుకున్న రైళ్లు వేయటం లేదని, రైల్వే వారు ప్రకటించ డంతో, యాత్రికులకు పాతాళానికి క్రుంగి నట్లనిపించింది.

సి. యస్. రాఘవేంద్ర వర్మ. చిత్రగుంట.

చెవిటికి శంఖారావం అనే సామెత చాలా మంది వినే వుంటారు. కాని అనుభవంలో ఎలా వుంటుందో రైల్వేశాఖను చూస్తే తెలుస్తుంది. తమకు మాత్రం మెత్తల, మెత్తని ప్రయాణాలు కావాలి. సుఖంగా దర్శనం కావాలి. జనంతో మనకేం పని అనే మన తత్వంమారదేమో. లేకపోతే చాలాకాలంగా ప్రజలు కోరుతున్న కనీస సౌకర్యాలను ఇంత తేలికగా తోసివేయడం జరగదు. మన కన్న మానవత్వం మిన్న అనుకొనే అధికారులు కొందరున్నా తిరుపతి యాత్రికులకు ఈ క్రింది ప్రయాణ సౌకర్యాలను గూర్చి విధిగా ఆలోచించ వలసి వుంది.

1. సర్కార్ ఎక్స్‌ప్రెస్‌ను-తిరుపతి-వాల్తేరు ఎక్స్‌ప్రెస్‌గా ఇప్పటి తిరుమల ఎక్స్‌ప్రెస్ వేళకు బయలు దేరేటట్లు మార్చటం.

2. తిరుమల ఎక్స్‌ప్రెస్ సమయం మార్చి విజయవాడలో గోల్కొండతో కలిపి హైదరాబాద్ తిరుపతి ఎక్స్‌ప్రెస్‌గా నడపటం.

3. తిరుపతి నుండి హైదరాబాద్‌కు పగలు ఎక్స్‌ప్రెస్ లేదు కనుక కృష్ణా ఎక్స్‌ప్రెస్‌తో కలిసి నడిచేవిధంగా ఒక రైలును నడపటం.

4. జయంతి జనతాకు వేస్తున్న-రేణిగుంట-నిజాముద్దీన్-పెట్టెను ఇంకొకఅదనపు పెట్టెతో ఈ రెండు చోట్ల-తిరుపతి నుండి బయల్దేరే టట్లు చేయడం.

5. ఇప్పుడు-ఒంగోలు రేణిగుంటల మధ్య నడిచే ప్యాసింజరును పొడిగించి తిరుపతి-విజయవాడల మధ్య నడపటం. గంగా కావేరి ఎక్స్‌ప్రెస్‌ను మద్రాసు నుండి కాక తిరుపతి నుండి ప్రారంభిస్తే న్యాయంగా వుంటుంది.

6. తిరుపతి మధుర ఎక్స్‌ప్రెస్‌ను తిరుపతి రామేశ్వరం ఎక్స్‌ప్రెస్‌గా మార్చి కొన్ని పెట్టెలను మధురకు కేటాయించడం. వివరమైన ప్రతిపాదనలు మే సప్తగిరి మీమాటలో ప్రచురితమైనవి. గనుక ఇతర వివరాలు మళ్ళీ చెప్పటం చర్వితచర్వణమౌతుంది.

టర్మినల్ సౌకర్యాలు లేవన్న మిషతో యాత్రికులను నిర్లక్ష్యం చేయటం న్యాయం కాదు. నిజానికి ఈ పెట్టెలకు తిరుపతి గుంటూరుల మధ్య ఖాళీ వేళలలో అదనపు సౌకర్యాన్ని కలిగించేందుకు వుపయోగించ వచ్చు కదా! ఇంతకీ మార్గముంటే ఏం లాభం? చేసేందుకు మనసుండాలి గదా!

నాగరాజ్

## పామరుడు - పరమాత్మ

శ్రీ సముద్రాల రామానుజాచార్య (జూనియర్ సముద్రాల)

వ్యాసపరంపర!

తొలిసమర్పణ:

నవంబర్ సంచిక నుండి ప్రారంభం!



# సప్తగిరి

## తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాస పత్రిక...


గౌరవసంపాదకులు

శ్రీ జి. కుమారస్వామిరెడ్డి,
ఐ. ఏ. ఎస్.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి

ప్రచురణకర్త - సంపాదకుడు :
కాట్రపాటి సుబ్బారావు,
ఎమ్. ఎ

ఉపసంపాదకుడు :
తిరుమూరు సుధాకర్ రెడ్డి,
ఎమ్. ఎ. బి. ఇడి.

ముద్రాపకుడు :
ఎమ్. విజయకుమార్ రెడ్డి.

విడిప్రతి-రు. 1-00

సం॥ చందా-రు. 12-00

ప్రతులకు :
వెల్ ఫేర్ ఆఫీసర్,
టి. టి. డి., తిరుపతి


## ఈ సంచికలో....


అక్టోబర్ 1983

సంపుటి 14 సంచిక 5




గమనిక : బాలాజీ అర్చన పథకం క్రింద గృహస్థులు చెల్లించవలసిన విరాళం రు 5000/- లు మాత్రమే. ఆగష్టు సంచికలో ప్రకటించినట్లు రు 5,000/- లు కాదు. సం॥

# సంపాదకీయం

మంత్రాలెందుకు అన్నది ప్రశ్న. మననుద్ధరించటానికి—అని సమాధానం. మననుద్ధరించటమే కాదు; ధరించటానికీ, భరించటానికీ అని వ్యాఖ్యానం. హరించటానికి కూడా—అనే భయంతో కూడిన హెచ్చరిక. మంత్రాలపై సమాజంలోని అభిప్రాయాలు చూస్తే ఇవి నిజమేననిపిస్తుంది.

అసలు మంత్రమంటే ఏమిటి? 'మననాత్త్రాయతే ఇతి మంత్రః' మననంవల్ల మనల్ని రక్షిస్తుంది కనుక అది మంత్రమైందని విజ్ఞులవాక్కు. దేనినుంచి రక్షిస్తుంది? మానవుడు ఎంత వికసనశీలియైనా, జన్మజరామృత్యుభయం అతణ్ణి అనాదిగా వెన్నాడుతూనేవుంది. 'జాతస్యహి ధ్రువోమృత్యుః ధ్రువం జన్మ మృతస్యచ' అని గానుగెద్దులాగ జీవుడు ఈ చక్రభ్రమణం చేస్తూనే వున్నాడు. మంత్రం అనేది మననశీలంగల జీవి తాత్కాలిక శాశ్వతావస్థాభేదాలను నిరూపించి ఈషణత్రయాన్ని క్రమంగా దూరం చేసి, పునరావృత్తి రహితమైన, త్రికాలాతీత శాశ్వత బ్రహ్మలోకాన్ని పొందేందుకు తోడ్పడుతుంది. తాత్కాలిక ప్రయోజనాలుగల అష్టసిద్ధులను లాంటి వాటి అనర్థాన్ని సుస్థిరంగా నిరూపించి పరతత్త్వావగాహనకు, తురీయపురుషార్థ ప్రాప్తికి మంత్రాలు మార్గదర్శకాలౌతాయి.

మంత్రానుష్ఠానానికి ముందు ఆ మంత్రాధిదేవతను మన ఆత్మతత్త్వంలో ఆవాహనం చేసుకొని ముందుకు సాగుతాం. దీనివల్ల అనుష్ఠాతకు అవధుల కనుగుణంగా కొంత ఉద్దిష్టప్రయోజనం సిద్ధిస్తుంది. దేహధర్మాల ననుసరించి ఈ సాధన సాగుతుంది కనుక, అంతవరకు మననిని ధరిస్తాయన్నమాట.

కాని ఆదర్శాలెంత గొప్పగావున్నా సాధించిన విజయాలలో ఒక్కొక్కప్పుడు మనస్సు మదంతో కదనుత్రొక్కి సమాజమారక కారణమౌతుంది. దైవదత్తమైన మేధాసంపత్తిని మేదోఽస్థి రక్తసంవృద్ధికీ, సమాజపీడాకారకంగా దురుపయోగం చేసేవారిని మంత్రాధిదేవతలు తీవ్రవైకల్యానికి గురిచేసి శిక్షించటం జరుగుతుంది. ఈ రీతి ప్రయోగవేత్తలలో ఇది అనుభవంలోని మాట. కనుక ఇలా మంత్రాలు మానవోద్ధరణ, ధారణ, భరణ సంహరణ కార్యక్రమాలు నిర్వహిస్తుంటాయనుకోవచ్చును.

మంత్రద్రష్టలు తమకవగతమైన శక్తిని గూర్చి పరిపూర్ణమైన అనుభవం పొంది తరువాతి తరాలవారికి ఎలా ఆచరించాలో వివరణ పూర్వంగా అందించారు. కాని ఇందులోగల చిక్కులన్ని గమనించిన పెద్దలు మంత్రశాస్త్రాన్నంతటినీ, సాత్త్విక, రాజస, తామసార్చనా విధాలుగా విభజించి, మానసిక పూజను సాత్త్వికమనీ, అది అందరికీ అందుబాటులో లేనిదిగనుక అర్చామూర్తి పూజ రాజసమనీ, జీవహింస మోహకప్రవృత్తులుగల్గిన పూజావిధానం తామసికమని విభజించి, దేహబుద్ధిధర్మానుగుణంగా ఎవరెవరు ఏ ప్రక్రియల ననుసరించవచ్చునో నిరూపించారు.

ఇంకొక స్థూల పరిగణన తీసుకొంటే స్త్రీరూప దేవతారాధనమంతా వామమనీ, పురుష దేవతారాధకమైనవన్నీ దక్షస్థాపితాలు గనుక దక్షిణారాధనలనీ గీటుగీసి తేల్చటమేకాక, వామతామసిక, తామసిక విధానాలన్నిటిని క్షుద్రవిద్యలుగా భావించారు. వీటిలో ప్రాపంచిక భోగ్యవస్తువులకుగల ప్రాధాన్యాన్ని చూచిన పెద్దలు పరమ లౌకిక ప్రయోజనాలుగల యీ తామసిక విద్యలను 'క్షుత్' విద్యలుగా (ఆకలివిద్యలు) నిర్ణయించివుంటారు. అవి కాలక్రమాన నానార్థాలను నామధేయాలను సంతరించుకొన్నవి. కనుక వామమంతా తామసికం కాదన్నమాట.

అనాదిగా సృష్టిధర్మాన్ని గూర్చి వస్తూన్న తాత్త్వికభావన కనుగుణంగానే ఈ మంత్ర విభజన కూడా జరిగిందా అనిపిస్తుంది. అనంతనాముడైన ఆ పురుషోత్తముని పురుషతత్త్వ ప్రతీకగాను, సకల జీవజాల హేతుభూతమైన ప్రకృతి సంతతిని స్త్రీరూప దేవతగాను ఆరాధించారన్నమాట.

మంత్రశాస్త్రం మరొక సత్యాన్నికూడా చాటుతున్నదేమో! సరససమరస శోభనసృష్టిలో ఆ జగజ్జననీ జనకులు అవిభాజ్యభాగధేయులనేది— ఆ సత్యం.

(48 వ పేజీలో)

# మహిషాసురమర్ధిని

బి. యల్. యన్. ఆచార్య

(పూర్వరంగం: స్వాయంభువ కల్పమున, దేవదానవులకు నూరు దివ్యవర్షములు యుద్ధము జరిగింది. అసురులు జయించారు. అసుర నాయకుడు మహిషాసురుడు స్వర్గాధిపతి అయినాడు. శాసనములను మార్చేశాడు. అగ్నిదేవుని తప్ప, తక్కిన దిక్పాలురందరినీ తన అరదానికి తురగాలుగా చేసికొని. దిక్పాలుర భార్యలను చెరపట్టి తన అంతఃపురానికి జేర్చుకొన్నాడు. మహిషాసుర ప్రాసాదము ముందు రథ తురగములుగా సప్త దిక్పాలురున్నారు. ఆ సమయంలో.)

రంగము - 1 పాట స్థలం - మహిషుని ప్రాసాదపు ముందు భాగము

నారద: అసురనాయక వినాశక–సుర
రక్షకప్రభో నమోనమో ॥ ॥అసుర॥

భాసించుచు మా హృదయకమలముల
శాసించెద వీ త్రిలోకంబులను
ఆశీస్సులిమ్మీ కలహభోజనుని
చేతలు జగతికి క్షేమము గూర్చగ ॥అసుర॥

యముడు: నమోవాకములు నారదమహర్షీ!

నార: శుభం భూయాత్! ఆఁ! ఎవరూ? యమధర్మరాజా? ఓహో! సురనాథులును ఇక్కడేవున్నారే? ఇదేమిటి? మీ దిక్పాలురందరూ అరదానికి తురగాలయ్యారు?

ఇంద్ర: ఏమి చెప్పను నారదా! ఇది మా పురాకృత కర్మ!

నార: కర్మమేమిటి ఇంద్రా! అదృష్టమను. అది సరే! పరమ పురుషుని రథమును భక్తిశ్రద్ధలతో లాగుతున్నట్లున్నారు? ఏ ఫలాన్ని ఆశించి, ఏ పదవి నాశించి?

యమ: గ్రహచారము వక్రించి. మా పట్టమహిషులను........

నార: ఈ రథములో కూర్చొనబెట్టి లాగుతున్నారా? బాగుంది. చాలాబాగుంది. స్త్రీమూర్తుల నారాధించు త్రిమూర్తులకుగూడ తోచని ఉత్సవ సంరంభమును కనిపెట్టారే! నిజంగా మీ పట్టమహిషుల పట్ల మీకు గల ప్రేమాభిమానములకు నింతకన్న నిదర్శన మేమికావాలి? ఇక ముందు కాలాల భర్తలకు మీరే ఆదర్శమవుతారు. సందేహము లేదు.

ఇంద్ర: అదికాదు నారదా! మా పట్టమహిషులను చెరబట్టి, మేము లాగుతున్న ఈ రథములోనే తన అంతఃపురానికి చేర్చుకున్నాడు మహిషాసురుడు.

నార: ఏమిటి? ఏమంటున్నారు? అష్టదిక్కుల కధిపతులైన మీరు, మహిషాసురుని శాసనమును మన్నిస్తున్నారా? అదేమిటి ఇంద్రా?

ఇంద్ర: ఏమి చేయుగలము స్వామీ! ఉన్న పదవులు పూడి, మాకీ గతి పట్టింది.

నార: నీకు పదవి పూడిందా? నీపదవికి భంగమేర్పడినప్పుడు బృందారకసందోహముతో వెళ్లి శ్రీనివాసునికి మొరపెట్టుకొనడము, భూదేవీపితామహశంకరులు పురుషకారము సల్పడము, ఆ నారాయణుడు ఏదో విధముగా నీ విరోధినంత మొందించి నీ పదవిని నిల్పడము, పరిపాటిగా వస్తున్న అలవాటే కదా? అయితే ఈసారి, ఆ శేషశయనుని శరణు వేడలేదా?

ఇంద్ర: ఎందుకు లేదు? దేవసేనాని కుమారస్వామి నాయకత్వమున త్రిమూర్తులు మాకు తోడై యుండగా, మహిషునిపై తలపడ్డాము. కాని వాడు శాంబరీమాయా ప్రభావముతో, అనేక రూపములలో మాకు గోచరించి మమ్ము పరాభూతులను జేశాడు. దిక్పాలురమందరము



మహిమునకు బందీలమయ్యాము. అగ్నిని చెరలో నుంచి, మమ్ము యిలా ఉపయోగించుకుంటున్నాడు.

నార : అదేమి పాపం ? అగ్నికి మీ ఉద్యోగమెందుకివ్వ లేదూ ?

యమ : తన తండ్రి రంభునికి అగ్ని వరమిచ్చినాడని.

నార : ఏమంటున్నావు పరేతనాథా ? అగ్ని దేవుడు, మీ విరోధికి తండ్రియైన రంభునికి వరమిచ్చాడా ?

యమ : రంభ కరంభులు సంతతిని గోరి పంచనదీ ప్రాంతమున తపస్సు చేస్తుండగా.

రంగము-2 స్థలము-పంచనదీ ప్రాంతము

(రంభుడు చెట్టుపై నుండి, కరంభుడు జలమగ్నుడై తపస్సు చేయుచుందురు.)

రంభ : ఓం బ్రహ్మ........ఓం బ్రహ్మ........ఓం బ్రహ్మ.......

కరంభ : ఓం బ్రహ్మ........ఓం బ్రహ్మ........ఓం బ్రహ్మ........

[ఇంద్రుడు, యమధర్మరాజు ప్రవేశిస్తారు]

ఇంద్ర : యమధర్మరాజా ! మనము పంచనదీ ప్రాంతానికి చేరివట్లున్నామే ?

యమ : అవును దేవేంద్రా ! అదుగో రంభుడు. చెట్టుపై కూర్చొని తపస్సు చేస్తున్నాడు. మరి కరంభుడేడీ ?

ఇంద్ర : అదిగో ! కరంభుడు జలమగ్నుడై తపస్సు చేస్తున్నాడు. ముందు కరంభుని తపమును పరీక్షిస్తాను. మొసలి రూపము ధరించి కరంభుని యేకాగ్రతను పరీక్షిస్తాను. నిశ్చల సమాధి నిష్ఠుడైతే పరమేష్ఠికి నివేదిస్తాను.

యమ : రంభకరంభులు రాక్షసులు. ఎంత తపోనిష్ఠులైనా తామసగుణ ప్రధానులు. నీ పరీక్షను అపార్థము చేసుకొని............

ఇంద్ర : వీరేనా ? సర్వులు నన్ను అపార్థము చేసుకొంటూనే వున్నారు. తపోపరీక్ష నా విధివిహితవృత్తియని గుర్తించిన వారెవరు ? నా పదవి నిలుపుకొనుటకై అచ్చరలనంపియో వేరు విధముగనో తపస్సుల చెరుస్తున్నాననేగా అనుకొంటున్నారు.

యమ : నేను చెప్పేది – నీవు వారి తపస్సు చెరుస్తున్నావని రంభకరంభులు ఆగ్రహించి నీపై........

ఇంద్ర : అందుకేగా నిన్ను వెంట దీసికొనివచ్చినది. వారు నాపై అత్యాచారమునకు పూనుకొంటే వారిని నీ సదనానికి దీసుకొని వెళ్లి నీ విధ్యుక్త ధర్మము నెరవేర్చు. ఇప్పుడే మొసలినై.

(నీటిలో మొసలి కరంభుని సమీపిస్తుంటుంది.)

కరంభ : ఓం బ్రహ్మ........ఓం బ్రహ్మ........ఆఁ ! ఎక్కడిదీ మకరము ? నా కాలు పట్టి లాగుచున్నదే ? నాకు తపోభంగమును గూర్చు ఈ మకరమును మననీయరాదు.

(కరంభుడు మొసలి పోరాడుతుంటారు.)

కరంభ : అన్నా రంభా ! నన్నొక మొసలి మింగివేస్తున్నది. నీ తపస్సు చాలించి వచ్చి నన్ను రక్షించు.

రంభ : ఆఁ! మా కరంభుని కంఠమువలె నున్నదే ? కరంభా ! ఇదిగో వస్తున్నాను (లేచి పోవును.)

కరంభ : (చావుకేక) ఆ ! అన్నా ! రంభా ! ఆ !

రంభ : ఆఁ ! ఏమిటిది ? ఈ పంచనద జలమంతా రక్తవర్ణంగా మారుతున్నది. మా కరంభుడెక్కడ ? ఆఁ ! మొసలి మ్రింగినట్లున్నదే ! కరంభా ! సోదరా కరంభా ! అయ్యో ! మరణించితివా సోదరా ? (దుఃఖించును) ఛీ ! నా సోదరుడు మృతినొందిన పిదప నేనేల బ్రతికివుండవలె. నా కరవాలముతో నా శిరస్సును ఖండించుకొని ఈ అగ్నికుండమున బడి దగ్ధమవుతాను (అగ్నికుండమువద్దకు పోయి కత్తితో తలను ఖండించుకొన ప్రయత్నిస్తాడు. అగ్నికుండమునుండి అగ్ని బయట పడి రంభుని చేయిబట్టి యాపుచు)

అగ్ని : రంభా ! ఆగు ! ఏమిటీ సాహసము ?

రంభ : నన్నాపకండి. నన్ను వదలండి. ఎవరు మీరు ?

అగ్ని : నేను అగ్నిదేవుడను. ఇలా ఆత్మహత్యకు పాల్పడితివేమి నాయనా ?

రంభ : నా సోదరుని కలుసుకొనేందుకు. నన్ను మరణించనివ్వండి.

అగ్ని : చచ్చి నీవు సాధించునదేమున్నది రంభా ?

రంభ : బ్రతికి నే సాధించునదేమున్నది ? పుత్రార్థినై తపస్సు చేశాను. పుత్రుడు కలిగే వరము లభించలేదు గాని, సోదరుని పోగొట్టుకున్నాను.

అగ్ని : నీకు పుత్రుడు కలిగే వరము నేను ప్రసాదిస్తాను ! ఈ పాపకార్యమును విసర్జించు.

రంభ : ఆఁ ! అగ్నిదేవా ! నాకు పుత్రుడు కలిగే వరము నీవు ప్రసాదిస్తావా ! అయితే – కామరూపి, సర్వలోక విజయుడు, అమర దానవమానవాది వీరులకును నజేయుడునగు పుత్రుడ్ని ప్రసాదిస్తావా ? అయితే అనుగ్రహించు.

అగ్ని : తథాస్తు – నీవు మొదటిసారిగా ఏ స్త్రీని పొందుతావో ఆమె వలన నీవు కోరిన పుత్రుడు జన్మిస్తాడు.

రంభ : ధన్యోఽస్మి.

రంగము-3 స్థలము - మహిషుని ప్రాసాదము ముందు భాగము

(అందరూ ఒకటవ రంగమునందువలె మిన్నుంటారు)

యమ: అటనుండి కదిలి పాతాళానికి వెళ్ళుతున్న రంభునికి, దారిలో ఒక ఎనుము కనిపించింది. విధివశాన దానిని కామించాడు రంభుడు. ఆ మహిషి వలన మహిషముఖుడైన మహిషాసురుడు జన్మించాడు.

నార: ఓహో! అగ్నిదేవునిపై మహిషాసురునికి గల మధి మానమునకు కారణము అదన్నమాట.

ఇంద్ర: అవునుస్వామీ! అగ్ని తనతో యుద్ధము చేసినందుకై యాగ్రహించి స్వాహాదేవితోబాటు అగ్నిని చెరసాల యందుంచాడు. మా భార్యలను చెరబట్టాడు.

నార: అదివరే! మీ భార్యలనే మోసుకొని వచ్చే నీచ కృత్యానికి పశువులై ఎలా పాలు పడగలిగారు?

యమ: ఏమి చెయ్యగలము నారదా! మహిషుడు కనకగిరి పైన అనేక వేల సంవత్సరాలు తపస్సుచేసి, దేవ దానవమనుష్యవర్గాలలో పురుషులవల్ల మృత్యువు రాని వరము పొందాడు. ఆ కారణము వల్ల మాలోని తేజశ్శక్తి వానిముందు మరుగుపడిపోతున్నది. ఇపుడు మేము కేవలులమయ్యాము. స్వర్గాధిపత్యము మహిషాసురునికి దక్కింది.

నార: ఏమిటీ! ఇప్పుడు స్వర్గాధిపతి అసురనాయకుడు మహిషాసురుడా? సురనాథుడు కాడా? మీరు దిక్పాలురు కారుగా? అయితే మీతో నాకు పనిలేదు. నేను స్వర్గాధిపతిని వెళ్ళి దర్శిస్తాను.

పాట

అసురనాయక। వినాశక సుర
రక్షకప్రభో నమోనమో ॥ ॥అసుర॥

ఇంద్ర: ఇంతవరకూ హరిని పొగడిన నోటితో అరిని పొగడుతున్నావా కలహప్రియా? హుం! కాలవైపరీత్యము.

నార: మరి కాలానికి తగినట్లు నడుచుకోవడమేగా వివేకవంతుని లక్షణము? ఆ ముగురమ్మల వాత్సల్యాన్ని సంపాదించుకొన్న మహిషాసురుని తెగడి, నన్ను, రథములాగే గుఱ్ఱాన్ని కమ్మనా మీరనేది?

ఇంద్ర: నారదా! శూలాలవంటి మాటలతో మమ్మల్ని అవమానిస్తున్నావా?

నార: ఉన్నమాట చెప్పడము అవమానించటమా దేవేంద్రా! సరస్వతీదేవి యభిమానించనిచో నింతటి వివేకము, లక్ష్మీదేవిని సేవించనిచో నింతటి ఐశ్వర్యము, పరమేశ్వరి వాత్సల్యమే లేకపోతే మిమ్మందరినీ పరాభూతులను చేయగల శక్తి మహిషాసురునికి ఎలా లభ్యమైనా యనుకొన్నారు? మీరు అహంకారులై, శరత్‌నవరాత్రులలో నా తల్లుల పూజింపక, ఆ తల్లుల అభిమానాన్ని పోగొట్టుకున్నారు. ఇపుడు మానము కంటే ముఖ్యం ప్రాణమే యని మహిషుని చెప్పుచేతలకు తల యొగ్గుచు ఎంతటి నీచకార్యమునయినా చెయ్యడానికి వెనుకాడక బ్రతుకుతున్నారు. మీకు అవమానమంటేకూడా తెలుసా?

యమ: (కోపంగా) మాటలు మిగులుతున్నావు ముళ్ళమునీ!

నార: మిగిలితే ఏమి చేస్తావేమిటి?

యమ: ఏమి చేస్తానా? నీ అంతు చూస్తాను.

నార: (హేళనగా) ఆఁ! అంతటి శక్తిమంతుడవా యమధర్మరాజా? అయితే ఆ శక్తిని మహిషాసురునిపై చూపలేక పోయినావా? మీ భార్యల చెరలు మీ బంధాలు వదలిపోయేవి?

యమ: అది తెలియక కాదు. మహిషాసురుని భార్య పరమేశ్వరిని మెప్పించి వైధవ్యము లేని వరము సంపాదించుకొన్నది. మహేశ్వరి వరము పొందిన పతివ్రతను ఏమీ చేయలేక మహిషునికి తలయొగ్గుతున్నాము.

నార: (యోచనగా) అయితే మహిషపత్ని మరణించనిదే మహిషునకు చావు లేదన్నమాట.

ఇంద్ర: భవానీప్రేమపాత్రురాలగు ఆ మహాపతివ్రతకు ఎగ్గు కూర్చడము ఎవరితరము స్వామీ?

నార: అదే ఇంద్రా! మహిషపత్ని జీవించియున్నంతవరకు మహిషునకు చావులేదు. మీకీ గతులు తప్పవు. నాకు బాధలేదు. ఇంతవరకు, అసురనాయక వినాశక, సుర రక్షకప్రభో నమో నమో అని పాడేవాడ్ని. ఇంక అసురనాయక, వినాశక సుర, రక్షకప్రభో నమో నమో అని మార్చి పాడుకుంటే సరిపోతుంది. మహిషాసురుని ప్రేమకు పాత్రుడనౌతాను. వస్తాను.

పాట

అసురనాయకా। – వినాశక సుర।
రక్షకప్రభో – నమోనమో ॥ ॥అసుర॥

(పాడుకొనుచు లోనికి పోవును)

రంగము 4 స్థలము-మహిషుని ప్రాసాదము)

(మహిషుడు, శచీదేవి మొదలగు వారుందురు)

నార: (ప్రవేశిస్తూ) అసురనాయకా! వినాశకసుర
రక్షకప్రభో! నమోనమో ॥

మహిషాసుర: అభివందనములు నారదా! దయచెయ్యండి. చూశారా? వీరు............

నార: ఇప్పుడు చూడటమేమిటి మహిషాసురా! నీ వింత వాడవౌతావని నేను ఎప్పుడో అనుకొన్నాను. దిక్పాలపాలకుడవు. వారి సర్వస్వాన్నీ నీ స్వంతము చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నట్లున్నావే? మంచి పని చేస్తున్నావు. (41వ పేజీలో)

# క్రొత్త పాతల మేలికూర్పు

"పురాణ మిత్యేవ న సాధు సర్వం
న చాపి కావ్యం నవ మిత్యవద్యమ్
సంతః పరీక్ష్యాన్యతరత్ భజంతే
మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః ॥

ఇది మాళవికాగ్నిమిత్రనాటక ప్రస్తావనలో కాళిదాస మహాకవి వ్రాసిన శ్లోకం. దీని తాత్పర్యం...."పాతది అయినంత మాత్రాన మంచిదే అనుకోరాదు. క్రొత్తదైనంత మాత్రాన ఆ కార్యం చెడ్డది అనుకోరాదు. ప్రాజ్ఞులు పరీక్షించిన మీదట దేనినైనా అంగీకరిస్తారు. మూఢుడు మాత్రం స్వబుద్ధి మీద ఆధారపడక, ఇతరులు చెప్పిన మాట నమ్ముతాడు."

కాళిదాస మహాకవి ప్రతిపాదించిన ఈ సిద్ధాంతం ఎవరు కాదంటారు? అయితే ఇందులో ఒక "అంతర్యం" ఉంది. కాళిదాసు ఈనాడు మన దృష్టిలో మహాకవి గాని ఆనాడు అతని సమకాలీనుల దృష్టిలో క్రొత్తవాడే కదా. కాళిదాసు లబ్ధప్రతిష్ఠుడు కానప్పుడు-అతని బ్రతుకు తొలిఉషస్సులలో చెప్పిన శ్లోకం అది. కాళిదాసు ఆత్మప్రత్యయంతో అన్న మాటలు ఆ శ్లోకం. కానీ, ఆ క్రొత్తకావ్యం గొప్పది అని సమకాలీనులు అంగీకరించాలి గదా.

చరిత్రలో క్రొత్తకు-పాతకు ఈ సంఘర్షణ ఉండటం సహజం. భవభూతి మహాకవి గూడ, కాళిదాసు కవికంటె ప్రస్ఫుటంగా కంట తడి పెట్టుతూ, గుండె దడ దడ కొట్టుకుంటూ ఈ విషయం ఉద్ఘోషించాడు.

"కాలం అనంతమైనది.
భూ మండలం సువిశాలమైనది.
ఈ అనంతమైన కాలంలో విపులమైన
పృథివిలో నా కవిత్వం మెచ్చుకునే
సమానధర్ముడు-సహృదయుడు
ఉద్భవించక పోడు-అతని కోసమే
నేనీ రచన చేస్తున్నాను."

దీనినిబట్టి భవభూతిమహాకవికి గూడ సమకాలీనుల మన్నన లభించలేదనడం సుస్పష్టం.

తెలుగులో చేమకూరి వేంకటకవి గూడ అప్రస్తుతప్రశంసగా విజయ విలాస కావ్యం మధ్య,

"ఏగతి రచియించి రేని
సమకాలము వారలు మెచ్చరే గదా"

అని విలపించాడు.

ఇది కేవలం మనదేశంలో పుట్టిన మహాకవులకు పట్టిన దుర్గతి కాదు.

"Seven cities claimed Homer Dead
Where the living Homer begged for Food"

గ్రీసు దేశంలో అపర వ్యాసుడు అని చెప్పదగిన కవి పురస్తకములో పొట్ట చేత పట్టుకొని బ్రతికినంత కాలము తిండికోసం బిచ్చమెత్తుకొని తిరిగాడు. అతడు చచ్చిపోయిన పిమ్మట అతడు మావాడు అంటే

## వెలుగుబాట

డా॥ నండూరి రామకృష్ణమాచార్య

మావాడని అతని శవాన్ని ఖననం చేసే గౌరవం దక్కించుకోవాలని ఏడు నగర రాజ్యాలూ పోరాడాయట! బ్రతికి వున్నంత కాలం, ప్రతిరోజూ చచ్చి, చచ్చిపోయిన పిమ్మట చిరస్థాయిగా బ్రతకడం ప్రపంచ చరిత్రలో కవులందరుకూ వచ్చే విచిత్రవిధివిలాసం కాబోలు. ఏమైనా-ఒక్క సాహితీ జగత్తులోనే కాదు-ప్రపంచ చరిత్రలో అన్ని శాఖలలో క్రొత్త పాతలకు సంఘర్షణ సహజసిద్ధం అనిపిస్తుంది.

క్రొత్తదనమును కనలేక కుమిలి క్రుంగి
ప్రసవవేదన పడుచుండు ప్రాతదనము
క్రొత్తపాతలమేలి కూర్పులు ఘటిల్లి
ఉద్భవించుత నూత్నయుగోదయమ్ము

అని సమన్వయతీర్మానం ప్రతిపాదింపవచ్చు.

అయితే-ప్రాతదనాన్ని మాత్రమే ఆరాధించే శ్రోత్రియ ఛాందసులు ఉంటారు. క్రొత్తదనమే జగద్విమోచనానికి ఏకైక శరణ్యం అని వాదించే విప్లవ వీరులూ ఉంటారు. లోకంలో ఇరు పక్షాలకు రాజీ కుదరడం కష్టసాధ్యం. సమన్వయ వాదిని ఉభయపక్షాలు తిరస్కరిస్తాయి. ఎదుటివాడు చెప్పేది-అర్థం చేసుకోకుండా అసలు వీనులొగ్గి వినకుండా కలహానికి నడుము కట్టే వారుంటారు.

అర్థపాత్ర శూన్యమంచు పల్కెనొకండు
ఒకడు సగము నీరు ఉన్నదనెను;
బద్ధలయ్యె తలలు వాదభేదము చేత
విశ్వదాభిరామ వినుర వేమ!

అనవలసి వస్తుంది అప్పుడప్పుడు. కొందరకు సమన్వయప్రతిభ ఉంటుంది,

వీరశైవం-వీరవైష్ణవం కొట్లాటల మధ్య నిలిచి "హరిహరనాథోపాసన" ప్రతిపాదించాడు తిక్కన మహాకవి. చరిత్ర గమనం-అధికారుల చేతుల్లోనే ఉన్నప్పటికీ సత్యం సమన్వయసంధాతల పక్షాన్నే ఉంటుంది.

నవయుగ వైతాళికుడుగా, ఐదం యుగీన సాహితీ ద్రష్టగా ఆధునికులు ప్రస్తుతించే అప్పారావుగారు కోరుకున్నది

"క్రొత్త పాతల మేలి కలయిక"

మాత్రమే. శ్రీ గురజాడ కూడ తిక్కన కాళిదాస మహాకవుల వలెనే—సమన్వయ సంధాత.

ఆధ్యాత్మికరంగంలో కూడ సమన్వయ వాదులు ఉన్నారు. తిక్కన హరిహరోపాసన వంటిదే కబీరు ఏకేశ్వరోపాసన కబీరు

"ఈశ్వర అల్లా తేరే నామ్"

అని ప్రతిపాదించాడు. సంస్కృతంలో వసుధైక కుటుంబులు ఏనాడో

"ఆకాశాత్ పతితం తోయం
యథా గచ్ఛతి సాగరమ్,
సర్వదేవ నమస్కారః
కేశవం ప్రతిగచ్ఛతి."

"ప్రపంచ మంతటా ఆకాశం నుండీ కురిసే వాన నీరు ఒకే సముద్రాన్ని ఏ విధంగా చేరుతున్నదో అదే విధంగా సమస్త దేవతలకు పెట్టే నమస్కారాలు ఒకే దేవునకు చేరుతాయి" అన్నారు సమన్వయ వేదాంతులై.

ఇక సింహావలోకనప్రాయంగా కాళిదాస మహాకవి తీర్పును అంగీకరించవచ్చు.

"ప్రాతదైన దెల్ల బంగారమా? ఏమి?
క్రొత్తదైన దెల్ల చెత్తగాదు!
మంచి యెచట నున్న ఎంచి గైకొదగు
మందబుద్ధి పరుల మాట నమ్ము"*

# ముండకోపనిషత్తు

## తృతీయముండకం

### ప్రథమఖండం

ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే
తయోరన్యః పిప్పలం స్వాద్వ
త్త్యనశ్నన్నన్యోఽభి చాకశీతి.

అందమైన రెక్కలుగలవి, ఎన్నడూ ఒక దాని నొకటి ఎడబాసి వుండనివి. స్నేహ భావముతో వుండేవిన్నీ అయిన రెండు పక్షులు ఒక చెట్టును ఆశ్రయించి వున్నాయి. వాటిలో ఒకటి ఆ చెట్టునపుట్టిన తియ్యని పండు తింటూంది. ఇంకొకటి తినకుండా చూస్తూవుంది. (ఫలాపేక్ష లేకపోయినా దాని మెరుగు తరగలేదు. అంతటా తన ప్రభ చిమ్ముతూ వుంది.)

(శరీరం ఒక చెట్టు. దానినాశ్రయించిన పక్షులు జీవాత్మ పరమాత్మ. జీవుడు చేసే వాడు. పరమాత్మ చేయించేవాడు. కనుకనే శరీరం సాధనంగా చేసే కర్మలఫలం జీవుడు అనుభవిస్తూవుంటాడు. యజమానిగా వుంటాడు. కాబట్టి ఈశ్వరుడుగా చెప్పదగిన ఆత్మ ఆ ఫలాలను అనుభవించడు.

కర్మలూ వాటి ఫలాలూ మాయ అనే తెరకి కట్టుపడివున్న జీవునకేగాని, ఆ తెరకి అవలవున్న ఈశ్వరునకు లేవు.)

2

సమానే వృక్షే పురుషో నిమగ్నోఽ
నీశయా శోచతి ముహ్యమానః
జుష్టం యదా పశ్యత్యన్య మీశం
అస్య మహిమాన మితి వీతశోకః

ఈశ్వరుడూ తానూ ఒకే చెట్టునంటిపెట్టుకునివున్నా జీవుడు కామక్రోధాదులకు లొంగిపోయి ఏదో భ్రాంతిలోపడి కొట్టుకుంటూ వుంటాడు. ఆ బంధాలనుంచి తప్పించుకొడానికి సామర్థ్యంలేక విచారిస్తూ వుంటాడు.

యోగుల ధ్యానశక్తితో ఉపవాసాది నియమాలతో క్రమక్రమంగా జ్ఞానంవచ్చి ఆపైనున్న ఈశ్వరుణ్ణీ, అతని గొప్పతనాన్నీ కనుగొన్నంతనే తనను చుట్టుకున్న శ్రాళ్లను (క్రామక్రోధాదులను) పుటుక్కున తెంచుకుని ఆ తేజశ్చక్రమును చేరుకుంటాడు.

3

యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం
కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిం
తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ
నిరంజనః పరమం సామ్యముపైతి.

పచ్చిబంగారు ముద్దలాటి శరీరచ్ఛాయ గలవాడు, జగాలను పుట్టించేవాడు, వేదాలకు ఆది, పరబ్రహ్మానికి గాదె అయిన ఈశ్వరుణ్ణి యోగాదిసాధనలచే చూచినవాడు సృష్టిరహస్యం తెలిసిన బుద్ధిమంతుడౌతున్నాడు. తరువాత పాపపుణ్యాలను అల్పకాలములో అనుభవించి బంధాలను తెంచుకుని అంతరాత్మలో కలిసిపోతాడు.




(నిజానికి పాపపుణ్యాలూ, కష్టసుఖాలూ అనే ద్వంద్వాలు మాయతెరకి ఈవలవున్న జీవునకుగాని, అవలవున్న ఆత్మకు వుండవు

సృష్టి, పుష్టి, నష్టి- అనేవి ఆ ఈశ్వరుడు సంకల్పించి ఆడే నాటకం. ఆయనికి అదొక వినోదం. ఒక్కడూ మూగదేవుడుగా ఎన్నాళ్లని కూర్చోగలడు. దానికోసం కల్పించిన తెర అవిద్య. దీనికే అజ్ఞానం అనీ, మాయఅనీ ఒక్కొక్క వ్యాఖ్యాత ఒక్కొక్క విధంగా చెప్పారు.

ఈ మాయను అడ్డుచేసికొని ఆ ఆత్మ అనిపించుకునే ఈశ్వరుడు తనలాటి బొమ్మని తయారుచేసి దానికి 'జీవుడు' అని పేరు పెట్టాడు. విశ్వజీవన నాటకానికి ఆ జీవుడు నాయక పాత్రధారి.

నడిపించే సూత్రధారుడు ఈశ్వరుడు. కనుక పాపపుణ్యాలూ కష్టసుఖాలూ ఇలాటివి పాత్రధారి అనుభవిస్తున్నాడు. తెర చాటుగావున్న సూత్రధారుడు పాత్రధారుల నటనాకౌశలానికి వినోదిస్తున్నాడు.

వినికిడి అయిపోయిన తరువాత అంతా ఒకటే.)

4

ప్రాణో హ్యేష యః సర్వభూతైర్విభాతి
విజానన్ విద్వాన్ భవతే నాతివాదీ
ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియావాన్
ఏష బ్రహ్మవిదాం వరిష్ఠః.

ఈశ్వరుడు అన్ని ప్రాణులకు ప్రాణమై వున్నాడు. అలాటి ఈశ్వరుణ్ణి తెలుసుకున్న బుద్ధిమంతుడు వాదోపవాదాలకు రాడు. ఈశ్వర ధ్యానయోగముతో ఆనందిస్తూ ఈశ్వరుడంటే ఎంతో ఇష్టంగా జీవితం గడుపుతూ వుంటాడు. ధ్యానయోగమందులేని సమయములో వేదం చెప్పిన తాను చెయ్యవలసిన కర్మలను చేస్తూ వుంటాడు. అలాటివాడే బ్రహ్మను తెలుసుకున్నవారిలో ముఖ్యెన్నదగినవాడు.

(అశాశ్వతమైన యీ శరీరం నాకిచ్చి తాను ప్రాణమై లోపలవుండి నాచే ఏవేవో చేయిస్తూ ఆ ప్రభువు వినోదిస్తూ వుంటాడు అనే భావముతో ఈశ్వరాధీనమైన బుద్ధితో ప్రవర్తించాలి. నేను చేస్తున్నాను, ఇదంతా నాచేతుల్లో వుంది - అనుకునేవాడు యీ చీకటి నూతిలో గింజుకుంటూ గట్టెక్కలేక ముక్కుతూ మూలుగుతూవుంటాడు. అలాటి అహంకార మమకారాలకు మనస్సులో చోటివ్వక తానూ తన బ్రతుకూ ప్రాణరూపానవున్న ఈశ్వరుని చేతిలో వున్నాయని అనుకోవాలి.)

5

సత్యేన లభ్య స్తపసా హ్యేష ఆత్మా
సమ్యగ్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్
అంతశ్శరీరే జ్యోతిర్మయో హి శుభ్రో
పశ్యంతి యం యతయః క్షీణదోషాః.

ప్రేమ, పగ - యీలాటి దోషాలను మనసులోంచి సమూలంగా తుడిచిపెట్టిన నియమశీలురే ఆత్మరూపముతోవున్న ఈశ్వరుణ్ణి చూస్తారు. ఆయన లోపల జ్యోతీరూపముతో శుద్ధ స్ఫటికంలాగా వున్నాడు.

నిత్యసత్యపాలన సుఖదుఃఖాదులను సమంగా అనుభవించే సహనగుణం, వున్నదానిని సరిగా తెలుసుకునే తెలివి ఇంద్రియనిగ్రహశక్తి అనే వాటితోనే ఆ ఆత్మ స్వరూపుణ్ణి చూడడమవుతుంది.

# సప్తగిరి విక్రేతలు

## గుంటూరు

శ్రీ వి. నరసింహాచార్య
సత్యదేవ న్యూస్ ఏజెన్సీ
బాపట్ల - 522101 గుంటూరుజిల్లా

పి. పద్మావతి
W/o పి. వి. ఆర్. అప్పారావు
హిందూ ఏజెంట్
పొన్నూరు - 522124 గుంటూరుజిల్లా

శ్రీ జి. గంగాధరరావు
24-8-1 అగ్రహారం (కోనేరుదగ్గర)
గుంటూరు - 522003

శ్రీ ఇ. వి. రమణమూర్తి
C/o శ్రీ విద్యాబుక్‌హౌస్ గాంధీచౌక్
ప్రభుత్వ ఆస్పత్రిదగ్గర
తెనాలి - 52.201 గుంటూరుజిల్లా

శ్రీ వి. రామమోహనశర్మ
న్యూస్ ఏజెంట్
ఆర్. టి. సి. బుక్‌స్టాల్
రేపల్లె, గుంటూరుజిల్లా

శ్రీమతి యస్. విజయలక్ష్మి
విజయలక్ష్మి బుక్‌స్టోర్స్
చిలకలూరిపేట ( పోస్టు ) గుంటూరుజిల్లా

శ్రీ అనుమోలు జగన్నాధరావు
అధ్యక్షులు, కార్యదర్శి. శ్రీవేంకటేశ్వర భక్త
సంఘం, నకరికల్లు - 522615
నరసారావుపేట తాలుకా గుంటూరుజిల్లా

శ్రీ పువ్వాడ కోటేశ్వరవిఠల్‌గుప్త
గుప్తాజనరల్ స్టోర్స్
మంగళగిరి (పోస్టు) గుంటూరుజిల్లా

శ్రీమతి కె. దేవసేవ
న్యూస్ ఏజెంట్
11-17-19 రామిరెడ్డిపేట
నరసరావుపేట - 522601 గుంటూరుజిల్లా

శ్రీ వల్లూరి దత్తాత్రేయ ఉమాశంకర్
S/o శ్రీ వల్లూరి ఆంజనేయులు

మారుతి న్యూస్ సర్వీసెస్ 6-16-24
61/1, అరండల్‌పేట గుంటూరు-522002

శ్రీ దిట్టకవి వేంకటరామానుజాచార్యులు
S/o డి. తిరుమలాచార్యులు
శ్రీవాసవీ కన్యకా పరమేశ్వరి దేవాలయం
పిడుగురాళ్ళ - 522413 గుంటూరుజిల్లా

## కృష్ణాజిల్లా

శ్రీ కె. వీరేశ్వరరావు
బుక్‌షాప్, కైకలూరు-521 333

శ్రీ కొండూరు పార్థసారథి
రామానుజ కూటం, బచ్చుపేట
మచిలీపట్నం-521 001

శ్రీ ఆర్. శ్రీనివాసన్
C/o ఎన్. శ్రీనివాసన్
16-6-1 గుంటువారివీధి, పూర్ణానందంపేట
విజయవాడ-520 016

శ్రీ వి. రామాచార్యులు
గాయత్రీగురుకుల్ సాయిమహల్‌దగ్గర
ఉయ్యూరు-521 165

శ్రీ కపిలవాయి కేశవరావు
ఏజెంట్ ఆంధ్రపత్రిక, కొండపల్లి (పోష్టు)



సత్యమేవ జయతే నానృతం
సత్యేన పంథా వితతో దేవయానః
యేనాక్రమంతి ఋషయో హ్యాప్తకామా
యత్ర తత్సత్యస్య పరమం నిధానమ్.

ఋషులు సత్యపాలనచేతనే ఈ లోకము నందు తాము చెయ్యవలసిన పనులను సక్రమంగాచేసి కృతకృత్యులై శాశ్వతమైన ఈశ్వరపదమును పొందుతున్నారు. సత్యముచేతనే వైదికమార్గం సువిశాలం అవుతూంది. మోక్షమార్గం తెలుస్తుంది. ఏనాటికైనా మానవుణ్ణి ఏలాటి చిక్కుల్లోంచి మంచి త్రోవకుతెచ్చేది సత్యమే కాబట్టి సత్యమే జయిస్తుంది. ఎన్నడూ అసత్యం జయించదు.

(సత్యవ్రతుడు మిక్కిలి కష్టాలనుభవించ వలసి వస్తుంది. అనుభవించాలి. చివరకు శాశ్వతమైన మహోత్తమమయిన కీర్తినీ స్థానాన్నీ పొందుతాడు. అబద్ధాలాడేవాడు మొదట చాలా హాయిగా వుంటాడు. కాల క్రమేణ వాడు పడేపాట్లు ఎవ్వడూ పడడు.

సత్యం గురించి తెలుగులో సామెత కూడా వుంది. మనిషికి సత్యం - రోగికి పథ్యం వుండాలి - అని)

7

బృహచ్చ తద్దివ్యమచింత్యరూపం
సూక్ష్మాచ్చ తత్ సూక్ష్మతరం విభాతి
దూరాత్సుదూరే తదిహాంతికే చ
పశ్యత్సు ఇహైవ నిహితం గుహాయామ్.

బ్రహ్మపదార్థం సువిశాలమూ మహోన్నతమూ అయిన అంతరిక్షం (ఆకాశం) కన్నా గొప్పది. అలాగే అంత సూక్ష్మమై వుంటుంది. స్వయంప్రకాశమానమైన రూపం కలది. ఆ రూపం ఆలోచనకి అందదు. మాయపొరకప్పిన వారికి ఎంతో దూరానవుంటుంది. తనకోసం ధ్యానం, యోగం, చిత్తశుద్ధి, సాత్వికబుద్ధి కలవారై ఉపాసిస్తూ చూడగలిగే వారికి దగ్గరగానే వుంటుంది. అలాటి బ్రహ్మపదార్థం ఎక్కడో వుందని భ్రాంతిపడనక్కరలేదు. ప్రతి జీవికి హృదయంలోనే వుంది.

( 38వ పేజీలో )

# ఇంద్రియాలు

మన శరీరగతమైన ఇంద్రియాలు కర్మేంద్రియాలు జ్ఞానేంద్రియాలు అని రెండు రకాలుగా ఉన్నాయి. వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థ అనేవి కర్మేంద్రియాలు, త్వక్, చక్షు, శ్రోత్ర, జిహ్వ, ఘ్రాణము అనేవి జ్ఞానేంద్రియాలు. చుక్కాని నావను వలసినట్లు త్రిప్పినట్లు, మానవుని మనస్సు ఇంద్రియాలను ఇచ్చవచ్చినట్లు త్రిప్పుతుంది. ఈ విషయాన్నే గీత— "ఇంద్రియాలు గుర్రాలవంటివనీ, మనస్సు పగ్గం (కళ్ళెం) వంటిదనీ వర్ణించింది. దీనిని బట్టి ఇంద్రియాల సంచారవేగం, నిరోధం అనే రెండుకూడా మనస్సుచేతిలో ఉన్నట్లు స్పష్టమయింది.

మనస్సునకూ ఇంద్రియాలకూ ఇంతటి సంబంధం ఉంది కనుకనే శరీర శాస్త్రజ్ఞులు పది ఇంద్రియాలలో మనస్సును 11వ యింద్రియంగా నిర్ణయించారు.

"బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి"

ఇంద్రియసముదాయం ఎంతటి విద్వాంసుడైనా తనవైపు ఆకర్షిస్తుంది. మనస్సులో కలిసి నప్పుడే ఆ యింద్రియాలకు అంతటి శక్తి అబ్బుతుంది. మనస్సు ఏయింద్రియంలో కలుస్తే ఆ యింద్రియమే తనపనిని చేయకలుగుతుంది. మనస్సు ఆలోచనా నిమగ్నమైనపుడు, కన్ను, చెవి మున్నగు ఇంద్రియాలు స్పష్టంగాచూడలేవు; వినలేవు. కనుక ఇంద్రియాలు తమ బలం చూపాలంటే వాటికి మనస్సు సహాయం ముఖ్యం. ఈ విషయాన్నే గీత ఇలా విశదం చేసింది.

"ఇంద్రియాణాం హి చరతాం
యన్మనోఽనువిధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం
వాయుర్నావమివాంభసి॥ (2-67)

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము అనే విషయ పంచకంతో కూడిన పంచజ్ఞానేంద్రియాలు మనస్సుతో కూడినపుడు బలవంతమై అవి మానవుని వివేక బుద్ధిని, పెనుగాలి నీటిలోని ఓడను వలె పడవేస్తాయి. "ఈ గీతాసూక్తిభావమే "బలవానింద్రియగ్రామః ———" అనే సూక్తిలో ప్రతిబింబించింది.

"పరమార్థదృష్టిలో భౌతికభోగాలు (పరిణామంలో) దుఃఖమే ఫలంగా కలవి కనుకనే పండితుడైనవాడు వానిపొంతపోడు"

"యే హి సంస్పర్శజా భోగాః
దుఃఖయోనయ ఏవ తే।
ఆద్యంతవంతః కౌంతేయ
న తేషు రమతే బుధః॥ (5-22)




అని గీతామాత ప్రబోధిస్తుంది. గీతావచనాలు త్రికాలాఽబాధ్యాలు కదా! ఈ ప్రబోధాన్ని బట్టి సామాన్యులకు తాత్కాలికంగా సుఖభ్రాంతిని కలిగించేవి కనుకనే యివి దుఃఖఫలకాలౌతున్నాయి. ఈ సత్యాన్ని తెలిసిన వివేకవంతులు స్వతః వీటికై మక్కువ చూపరు "........ చెప్పకు మిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపై తేనియల్" అన్న ప్రవరాఖ్యుని నిర్ణయం మీది సత్యాన్ని ఋజువుచేస్తోంది. దీనిని బట్టి భౌతిక విషయాలమీదికి విడిచిన మనస్సు మానవులకు దుఃఖఫలద మౌతుందనీ, దీనికి వ్యతిరేకంగా పారమార్థిక విషయాలతో కూడిన మనస్సు మానవులకు నిత్యసుఖానంద ఫలకమౌతుందనీ తేలినది. ఈ సత్యాన్ని ఋజువు చేసేసూక్తి ఇది.

"మన ఏవ మనుష్యాణాం
కారణం బంధమోక్షయోః।"

భౌతికవిషయ లంపటమైనమనస్సు(కర్తకు) బంధకారకము కాగా పరమార్థ విషయ విలసితమైన మనస్సు (కర్తకు) మోక్ష కారకమౌతుంది. కనుక మానవుని బంధమోక్షాలు రెండూ మానవుని మనః ప్రవృత్తిమీదనే ఆధారపడి ఉన్నవన్నమాట. భౌతిక విషయ లగ్నమైన మనస్సు వలన జీవులకు కలిగే అనర్థాలను అవలోకింపుదాం.

లోకంలో తమ యింద్రియాలను వానికి సంబంధించిన విషయాలకు వశంచేసిన జీవులు బంధాలలో చిక్కుకొని క్రమంగా ఎలా నశిస్తున్నాయో గమనించండి.

పుట్టలో ఉన్న పాము నాదస్వర శబ్దానికి తన చెవిని వశంచేయడంచేతనే అది ఆ స్వరంచే ఆకర్షింపబడి పుట్టబయటనున్న పాములవాని చేతిలోబడి క్రమంగా చస్తుంది. ఆడ ఏనుగుయొక్క స్పర్శ సుఖానికి తన మనస్సును లగ్నం చేసిన మగయేనుగు అరణ్యంలో ఆడదాని వెంట బడిపోవటం చేతనే దీనికై యేర్పాటుచేసిన గోతిలో బడి బంధింపబడుతుంది. ఇల్లే మంటనుచూసి ఫలమని భ్రమపడిన మిడుత రూపానికి తన నేత్రేంద్రియాన్ని వశంచేయడం చేతనే మంటలోపడి మ్రగ్గిపోతుంది. ఇక గాలంకి గ్రుచ్చిన మాంసానికి తన జిహ్వేంద్రియాన్ని (నాలుక) వశంచేయడంచేతనే చేప ఆ గాలం పొడుచుకొని చస్తుంది. ఇక పద్మపరిమళానికి తన నాసికను వశంచేసి తుమ్మెద ఆపద్మంలో బంధింపబడి చనిపోతుంది. ఇట్లు తమ పంచేంద్రియాలలో ఒక్కొక్క ఇంద్రియాన్ని ఒక్కొక్క విషయానికి మనస్సుతో సహా వశం చేయుడం చేతనే అవి నశిస్తూండం మనం చూస్తున్నదే కదా! తమ మనస్సును (భౌతికంగా) ఇంద్రియాలకు వశంచేసినపుడు మానవులకుకూడా అటువంటి దుర్గతి పట్టే అవకాశం లేకపోలేదు. మానవులకు వారి మనస్సు భౌతిక విషయాలలో లగ్నమైనపుడు అదివారికి బంధకారకమే ఔతూన్న సన్నివేశాన్ని వినే ఉన్నాం కదా! ఈ సత్యాన్ని "మథ్నాతీతి మనః" అనే మనశ్శబ్దవ్యుత్పత్త్యర్థం కూడా ఋజువు చేస్తుంది. సర్వసాధారణంగా మానవుల

[37 వ పేజీలో]

శ్రీ ఖండవల్లి సూర్యనారాయణశాస్త్రి

# సప్తగిరి విక్రేతలు

## గుంటూరు

శ్రీ వి. నరసింహాచార్య
సత్యదేవ న్యూస్ ఏజెన్సీ
బాపట్ల - 522101 గుంటూరుజిల్లా

పి. పద్మావతి
W/o పి. వి. ఆర్. అప్పారావు
హిందూ ఏజెంట్
పొన్నూరు - 522124 గుంటూరుజిల్లా

శ్రీ జి. గంగాధరరావు
24-9-1 అగ్రహారం (కోనేరుదగ్గర)
గుంటూరు - 522003

శ్రీ ఇ. వి. రమణమూర్తి
C/o శ్రీ విద్యాబుక్‌హౌస్ గాంధీచౌక్
ప్రభుత్వ ఆస్పత్రిదగ్గర
తెనాలి - 52.201 గుంటూరుజిల్లా

శ్రీ వి. రామమోహనశర్మ
న్యూస్ ఏజెంట్
ఆర్. టి. సి. బుక్‌స్టాల్
రేపల్లె, గుంటూరుజిల్లా

శ్రీమతి యస్. విజయలక్ష్మి
విజయలక్ష్మి బుక్‌స్టోర్స్
చిలకలూరిపేట (పోస్టు) గుంటూరుజిల్లా

శ్రీ అనుమోలు జగన్నాథరావు
అధ్యక్షులు, కార్యదర్శి. శ్రీవేంకటేశ్వర భక్త
సంఘం, నకరికల్లు - 522615
నరసారావుపేట తాలుకా గుంటూరుజిల్లా

శ్రీ పువ్వాడ కోటేశ్వరవిఠల్‌గుప్త
గుప్తాజనరల్ స్టోర్స్
మంగళగిరి (పోస్టు) గుంటూరుజిల్లా

శ్రీమతి కె. దేవసేన
న్యూస్ ఏజెంట్
11-17-19 రామిరెడ్డిపేట
నరసరావుపేట - 522601 గుంటూరుజిల్లా

శ్రీ వల్లూరి దత్తాత్రేయ ఉమాశంకర్
S/o శ్రీ వల్లూరి ఆంజనేయులు

మారుతి న్యూస్ సర్వీసెస్ 6-16-24
61/1, అరండల్‌పేట గుంటూరు-522002

శ్రీ దిట్టకవి వేంకటరామానుజాచార్యులు
S/o డి. తిరుమలాచార్యులు
శ్రీవాసవీ కన్యకా పరమేశ్వరి దేవాలయం
పిడుగురాళ్ళ - 522413 గుంటూరుజిల్లా

## కృష్ణాజిల్లా

శ్రీ కె. వీరేశ్వరరావు
బుక్‌షాప్, కైకలూరు-521 333

శ్రీ కొండూరు పార్థసారథి
రామానుజ కూటం, బచ్చుపేట
మచిలీపట్నం-521 001

శ్రీ ఆర్. శ్రీనివాసన్
C/o ఎన్. శ్రీనివాసన్
16-6-1 గుంటువారివీధి, పూర్ణానందంపేట
విజయవాడ-520 016

శ్రీ వి. రామాచార్యులు
గాయత్రీగురుకుల్ సాయిమహల్‌దగ్గర
ఉయ్యూరు-521 165

శ్రీ కపిలవాయి కేశవరావు
ఏజెంట్ ఆంధ్రపత్రిక, కొండపల్లి (పోస్టు)



సత్యమేవ జయతే నానృతం
సత్యేన పంథా వితతో దేవయానః
యేనాక్రమంతి ఋషయో హ్యాప్తకామా
యత్ర తత్సత్యస్య పరమం నిధానమ్.

ఋషులు సత్యపాలనచేతనే ఈ లోకమునందు తాము చెయ్యవలసిన పనులను సక్రమంగాచేసి కృతకృత్యులై శాశ్వతమైన ఈశ్వరపదమును పొందుతున్నారు. సత్యముచేతనే వైదికమార్గం సువిశాలం అవుతూంది. మోక్షమార్గం తెలుస్తుంది. ఏనాటికైనా మానవుణ్ణి ఏలాటి చిక్కుల్లోంచి మంచి త్రోవకుతెచ్చేది సత్యమే కాబట్టి సత్యమే జయిస్తుంది. ఎన్నడూ అసత్యం జయించదు.

(సత్యవ్రతుడు మిక్కిలి కష్టాలనుభవించవలసి వస్తుంది. అనుభవించాలి. చివరకు శాశ్వతమైన మహోత్తమమయిన కీర్తినీ స్థానాన్నీ పొందుతాడు. అబద్ధాలాడేవాడు మొదట చాలా హాయిగా వుంటాడు. కాలక్రమేణ వాడు పడేపాట్లు ఎవ్వడూ పడడు.

సత్యం గురించి తెలుగులో సామెత కూడా వుంది. మనిషికి సత్యం - రోగికి పథ్యం వుండాలి - అని)

7

బృహచ్చ తద్దివ్యమచింత్యరూపం
సూక్ష్మాచ్చ తత్ సూక్ష్మతరం విభాతి
దూరాత్సుదూరే తదిహాంతికే చ
పశ్యత్సు ఇహైవ నిహితం గుహాయామ్.

బ్రహ్మపదార్థం సువిశాలమూ మహోన్నతమూ అయిన అంతరిక్షం (ఆకాశం) కన్నా గొప్పది. అలాగే అంత సూక్ష్మమై వుంటుంది. స్వయం ప్రకాశమానమైన రూపం కలది. ఆ రూపం ఆలోచనకి అందదు. మాయపొరకప్పిన వారికి ఎంతో దూరానవుంటుంది. తనకోసం ధ్యానం, యోగం, చిత్తశుద్ధి, సాత్వికబుద్ధి కలవారై ఉపాసిస్తూ చూడగలిగే వారికి దగ్గరగానే వుంటుంది. అలాటి బ్రహ్మపదార్థం ఎక్కడో వుందని భ్రాంతిపడనక్కరలేదు. ప్రతి జీవికి హృదయంలోనే వుంది.

(38వ పేజీలో)

# వేంకటాధ్వరిదృష్టిలో వేంకటేశ్వరుడు

(గతసంచిక తరువాయి)

ప్రియః సహాయో లక్ష్మీః
స్థానం వసూ[illegible]
పదలమవతిస్స్యలో,
రత్నాకరః శ్వశురో హసౌ.
తదపి హరతి ద్రవ్యం
పూర్ణో జగత్పతిరేవ యః
తదిహ దాసానాం కర్తుం
స్వనామానుగ్రహమనుగ్రహమ్.

వినుము. మఱియొక విషయమును వివరించెదను. శేషగిరి నాథుడు నిత్య శ్రీమంతుడు. వానికి సిరిసంపదలకు లోటు లేదు. వాని ప్రియురాలు రత్నాకరుని కుమార్తెయగు లక్ష్మీదేవి. అతని నివాస స్థలము ధనములకు (వసువులకు) నెలవగు సూర్యమండలము. వాని బావమఱది కువలయపతి (భూపతి) యగు చంద్రుడు. వాని మామగారు రత్నాకరుడు. తాను స్వయముగా ముల్లోకములకు ప్రభువు. అయినను, తన సేవకుల కోరికలను నెఱవేర్చుటకే, సేవకులనుండి, విత్తమును స్వీకరించుచున్నాడు. ఇందు సందియమేమియును లేదు. "యస్యానుగ్రహమిచ్ఛామి, తస్య విత్తం హరామ్యహమ్" నేనెవరిని అనుగ్రహింపగోరెదనో వారినుండి కొంత విత్తమును స్వీకరించెదనను నానుడిని వినియుండలేదా ?

అఖిల హేయప్రత్యనీక, అనంత కల్యాణ గుణైకతానస్య విశ్వనిదానస్య, శ్రీనివాసాభిధానస్య పరబ్రహ్మణో గుణార్ణవామృత కణానాం వర్ణనే అనిపుణధిషణా ధిషణాదయోఽపి.

ఈ శ్రీనివాస పరబ్రహ్మము, నిర్దుష్టములు, అవినశ్వరములు అనంతములునగు గుణములకు నెలవు. ఈ స్థావర జంగమాత్మక ప్రపంచమునకు మూలకారణము. బృహస్పతి మున్నగు దేవతలు గూడ ఈ పరబ్రహ్మముయొక్క గుణార్ణవములోని కొన్ని అమృతకణములనుగూడ లెక్కింపజాలరనుట-అత్యుక్తిగాదు, అతిశయోక్తి గాదు. మఱియు స్వభావోక్తియే.

...శైలావని గరిమ
[illegible]
కల్యాణావళకల్పే [illegible]
కథనానాదక్షోనాః,
[illegible]
[illegible]
[illegible]
[illegible]

ఈ స్వామి సుఖమునకుగాని, దుఃఖమునకుగాని, లొంగని చిత్తము గలవాడు. అనగా అతి గంభీరుడు. గాంభీర్యమునకు నెలవగువాడు; శాంతిప్రవాహమునకాశ్రయమైనవాడు. మంగళములను తామరపువ్వులకు ప్రాతఃకాలము. అపార కృపారసమునకు సముద్రుడు. చాతుర్యాతిశయమునకు చరమసీమ. ఔదార్యాతిశయమునకు ఆటపట్టు. అట్టి శ్రీస్వామివారి గుణగణములను గణనజేయ మొదలిడిన వారెవ్వరును, ఇంతవఱకు కృతార్థులుగాలేదు. అందఱును విసిగివేసారి, (శాంతులై) విశ్రాంతిని గైకొన్నవారే.

సమగ్రా హి హరే ర్వేదైః
సమగ్రాహి గుణావళిః
ప్రత్యక్షేఽపి పరత్వేఽస్య
ప్రత్యక్షేఽపి చ సంశయః.

శ్రీ స్వామివారి అనంత కల్యాణ గుణగణములు, సమగ్రముగా నాలుగు వేదములచేత వేనోళ్ళ చాటబడినవి. వైకుంఠమును వీడివచ్చి శ్రీ స్వామివారి కొండమీద-నిజస్వరూపముతో ప్రత్యక్షమగుటవలన భక్తులందఱకు నాస్తిక్యబుద్ధి అభివృద్ధి నొందుచున్నది.

అహో మహోన్నతస్యాప్యస్య సౌలభ్యం కనకకుసుమస్య సౌరభ్యమివ రసికేభ్య ఏవ స్వదతే.

ఆశ్చర్యమాశ్చర్యము. అందఱికన్న మిన్నయైన ఈ వేంకటేశ్వరస్వామివారి సౌలభ్యము (అందఱకు నందుబాటులో నుండుట)! బంగారు పువ్వునకు గల సౌరభ్యము వలె (సువాసనవలె) బ్రహ్మానందమును అనుభవింపగల రసికులకుమాత్రమే తెలియవచ్చును.

శ్లో॥
[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]
ప్రశాంతమంతనాయతే.

శ్రీ స్వామివారిని గుఱించి మఱికొంత విపులముగా చెప్పెద. సావధాన చిత్తముతో నాకర్ణింపుము. శ్రీస్వామివారు, లోకమునందలి లోకకంటకులగు దుష్టులను శిక్షించుటకు ప్రతిన బూనియున్నారు. వీరు పాండుభూపాలుని కుమారుల యందెక్కువ మక్కువగలవారు. సూర్యమండలమధ్య భాగమునందు వీరు నిజ స్వరూపముతో నెల్లవేళలా ప్రకాశించుచుందురు. వీరి వడవడి తీరు జనుల కందఱకు నాచరణీయమై రమణీయమై యొప్పుచుండును. వీరి కన్నుల సౌరు వికసించిన తెల్లతామరలను పోలియుండును. శ్రీ స్వామివారు, ఈ శేషాచలమునకు సాటిలేని మేటి విభూషణమై యలరారుచున్నారు,

అవలోకయ తావ దురగవర ధరణీధర శిరోమదేశ్ప్రకపాదే రనితర సుకర వరని కర వితరణ కౌశలమతిపేశలమ్.

(33 వ పేజీలో)

# కళావని

సంగీత త్రిమూర్తులలో నొకరుగా పేరొంది తన అపూర్వ పాండిత్య ప్రతిభచే సంస్కృతభాషను, గానామృతంగా అమర్చురాని కృతులను రచించి, సంగీత లోకానికి ఎనలేని సేవచేసిన ముద్దుస్వామి దీక్షితులు క్రీ॥శ॥ 1775 మార్చి 24వ తేది తిరువారూర్‌లో జన్మించిరి. కర్నాటక సంగీత చరిత్రలో దీక్షితుల కుటుంబమునకు ప్రత్యేకస్థానము గలదు. గొప్ప వాగ్గేయ కారుడైన రామస్వామిదీక్షితులకు 40 సం॥ల వరకు సంతతి లేనందున ఆయన భార్య యగు సుబ్బలక్ష్మితో కలసి తంజావూరు జిల్లాలో గల వైద్యనాథక్షేత్రమునందు వెలసిన ముద్దు కుమారస్వామిని ప్రార్థించగా, ఆ స్వామి వరప్రసాదమున జన్మించిన దీక్షితులకు ముద్దుస్వామి దీక్షితులని నామకరణము చేసి తలిదండ్రులు ధన్యులైరి.

వీరి గురువు పేరు వేంకటవైద్యనాథ దీక్షితులు. బాల్యములోనే విద్యాభ్యాసము ప్రారంభించి కావ్య, నాటకాలంకార శాస్త్రములలోను, మంత్రయోగ, జ్యోతిష, వ్యాకరణ చ్ఛందశ్శాస్త్రములలోను పరిపూర్ణమైన కృషిచేసి విశేషమైన పాండిత్యమును సంపాదించిరి. వివాహానంతరము మణలి వచ్చి చిన్నయ్య మొదలియార్‌చే ఆదరింపబడియుండగా, కాశీకి చెందిన చిదంబర నాథయోగి అను యతడు ఒక పర్యాయం మణలివచ్చియుండెను. చిదంబరనాథ యోగి దీక్షితుల ప్రజ్ఞ పాండిత్యమును, వినయవిధేయతను, దైవధ్యానతత్పరతను గుర్తించి మహామంత్రోపదేశము చేసిరి. దీక్షితులు చిదంబరనాథయోగితోకలసి కాశీకి వెళ్ళిరి. అచ్చట ఐదేండ్లపాటు మంత్రావృత్తి చేసుకొనుటయేగాక అష్టమహా సిద్ధులను సంపాదించి, వేదాంత శాస్త్రోపదేశ మొంది గురువుగారి అనుజ్ఞతో తిరిగి మణలివచ్చి దేవతా తృప్తికై యాగాలను నిర్వర్తించెను.

తదుపరి తిరుత్తణి వెళ్ళి సుబ్రహ్మణ్యేశ్వరస్వామి సన్నిధిలో పంచాక్షరీ మంత్ర జపములో నిమగ్నుడై యుండగా ఒక నాడు సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఒక మహాపురుషుని రూపములో దర్శనమిచ్చి దీక్షితుల నోటనిండా చక్కెరను వేసి అదృశ్యులైరి. ఆ రీతిగా సుబ్రహ్మణ్యేశ్వరస్వామి సాక్షాత్కారము దీక్షితులవారికి ప్రాప్తించినది. తత్ఫలితముగా దీక్షితులు సంగీత రచనకు శ్రీకారము చుట్టిరి.

“రాగో మాళవ గౌళస్య రాగానాం ఉత్తమోత్తమః,” అని రామామాత్యులచే శ్లాఘింపబడిన మాయా మాళవగౌళ రాగముతో “శ్రీనాదాది గురుగుహోజయతి” అని ప్రథమావిభక్త్యంతముగా సంస్కృతములో మొదటి రచన ప్రారంభించిరి. తరువాత “మానసగురుగుహ” అను కృతిని రచించిరి. తరువాత క్రమముగా సంబోధన ప్రథమ మొదలగు ఏడు విభక్తులలో ఏడు కీర్తనలు రచించిరి. ఇవి గురుగుహాంకితముగా నుండును.

సోదరులగు చిన్నస్వామి, బాలస్వామితో కలసి దీక్షితులు నాలుగు సంవత్సరముల పాటు కంచిలో నివాసమేర్పరచుకొని, కామాక్షీదేవి సన్నిధిలో శ్రీ విద్యోపాసన చేసుకొనుచు, “కంజదళాయతాక్షి కామాక్షి” అని కమలా మనోహరి రాగకృతిని రచించిరి. కంచిలో ఉపనిషద్బ్రహ్మస్వాములతో వేదాంత విచారణ చేసిన సందర్భమున వారు రచించిన రామాష్టపదులకు వర్ణక్రమములో రాగతాళముల నేర్పరచిరి. తరువాత దీక్షితుల కుటుంబము కాంచీపురము వదలి తిరువారూరు వచ్చి యుండునపుడు అందు వెలసిన షోడశగణపతులపైనను గురుగుహ ముద్రతో కృతులను రచించిరి.

**ఉదాహరణ:** “వాతాపిగణపతిం భజేఽహం” “శ్రీమహాగణపతిం” “పంచమాతంగముఖ” మున్నగు కృతులను రచించిరి. తరువాత క్రీ॥శ॥ 1817లో దీక్షితుల తల్లి పరమపదించిరి. తరువాత రెండు నెలలకు వారితండ్రియును స్వర్గస్థులైరి.

దీక్షితులవారికి బాల్యమునందే వివాహము జరిగెను. కాని ప్రాపంచిక సుఖములు వారిని ఆకర్షింపలేదు. నిరంతర ధ్యానములో నిమగ్నుడైన దీక్షితుల స్వభావమునకు తలిదండ్రులు ఆశ్చర్యపడిరి. మరియొక్క అందమైన కన్యను అతనికిచ్చి వివాహము చేసిన అతని మనసు



# ముత్తుస్వామి దీక్షితర్



మారుననని వివాహము జరిపిరి. అయినను దీక్షితులు యథాప్రకారమే ఉండిరి. వీరికి సంతానము లేదు.

తత్త్వజ్ఞాన సంపన్నులైన దీక్షితులు నాదోపాసనలో నిమగ్నులై ప్రసిద్ధవాగ్గేయ కారులనిపించుకొనిరి. పెక్కుమంది శిష్యులను చేరదీసి వారికి సంగీతము నేర్పిరి.

ఒకనాడు మధుర నుండి కొంతమంది తిరువారూరువచ్చిరి. వారు దీక్షితుల గానమును విని ముగ్ధులైరి. వారికి సంగీతము నేర్పవలెనని దీక్షితులకు విన్నవించుకొనిరి. దీక్షితులు అంగీకరించిరి. తమ్ములైన చిన్నస్వామి, బాలస్వామి వారితోకలసి మధురకు వెళ్ళిరి. మధురకు వెళ్ళిన కొంతకాలమునకు దీక్షితులలో ఒకరైన చిన్నస్వామిదీక్షితులు మరణించిరి. బాలస్వామి దీక్షితులు తిరువారూర్ వెళ్ళి ఈ వార్త అన్నకు దెల్పుటకు గుండె దిటవు లేక మధుర వదలి యాత్రప్రారంభించిరి. రామేశ్వరము చేరునాటికి ఎట్టయాపురం మహారాజు బాలస్వామి గానమును, వయోలిన్ వాద్యములో అతనికిగల నైపుణ్యమును గుర్తించి ఎట్టయాపురం ఆస్థాన విద్వాంసునిగా రావలెనని కోరిరి. క్రీ॥ శ॥ 1824 లో బాలస్వామి ఎట్టయాపురం సంస్థానములో విద్వాంసుడుగా నియమింపబడెను. అది మొదలు బాలస్వామి ఎట్టయాపురములోనే స్థిరపడిరి. ఈ సంఘటన దీక్షితుల కుటుంబ చరిత్రలో ఒక ప్రముఖ ఘట్టము.

ముద్దుస్వామి దీక్షితులవారు బాలక్రమేణా తమ్ముని మరణవార్తయు, బాలస్వామి దీక్షితులు ఎట్టయాపురముచేరుకొనిన విషయములు తెలిసికొనిరి. తమ్ముని జూచుటకై కుటుంబ సమేతముగా, శిష్యులతో గూడి ఎట్టయాపురమునకు బయలుదేరిరి. మార్గమధ్యమున అనావృష్టిచే పాడయిన పంటభూములను చూచి, దీక్షితుల హృదయము పరితపించి వెంటనే అమృతవర్షిణి రాగముతో "ఆనందామృత కర్షిణి, అమృత వర్షిణి" అను కృతిని రచించి గానము చేయగా దైవానుగ్రహముచే మేఘావృత్తమై కుండపోతగా వర్షము కురిసెనట. వర్షము వలన దారి పాడయినప్పటికిని కష్టపడి ఎట్టయాపురము చేరుకొనిరి.

ఎట్టయాపురము ప్రభువు బాలస్వామి దీక్షితుల వివాహమునకు అన్ని ఏర్పాట్లు చేసిరి. అదే సమయమున దీక్షితులు ఎట్టయాపురము చేరుకొనిరి. తమ్ముని వివాహము వైభవోపేతముగా జరిగినందుకు ఎంతయో ఆనందపడిరి. కొన్ని నెలలు ఎట్టయాపురమునందుండి దీక్షితులు తిరువారూరు చేరుకొనిరి. క్రీ॥ శ॥ 1835 లో ఎట్టయాపురము రాజపుత్రుని వివాహ సందర్భముగా దీక్షితులవారిని రమ్మని మహారాజు ఆహ్వానము పంపెను. కొలది నెలలు కాలము మాత్రమే తాను జీవించియుండగలనని తెలుసుకొనిన దీక్షితులు అందరివద్ద శలవు తీసుకొని ఎట్టయాపురము చేరుకొని రాజపుత్రుని వివాహమును తిలకించి అచ్చటనే ఉన్న సమయమున ఒకనాడు పట్టపుటేనుగు మతిభ్రమించి శ్మశానము వైపునకు పరుగెత్తెను. ఆ విధముగా జరుగుట అశుభసూచకముగా భావించి రాజు కంగారుపడిరి. రాజకుటుంబమున కెటువంటి ప్రమాదము జరగదనియు, ఆ ఏనుగు ఆ విధముగా పరుగెత్తుట దీక్షితులవారి అవసాన కాలము సూచన అని చెప్పిరి. క్రీ॥ శ॥ 1835 తులామాస, కృష్ణ చతుర్దశినాడు తన 60వ ఏట ముద్దుస్వామి దీక్షితులు దివంగతులయిరి.

దీక్షితులవారికి సంస్కృత భాషయందు గల అభిమానము అపారమైనది. సంస్కృత భాషలో అసంఖ్యాకములయిన కృతులను రచించిరి. వీరి కృతులలోగల యతిప్రాసలు సహజ సుందరములు. దీక్షితుల కృతులలో భాష చాలా ప్రౌఢమైనది. వీరి రచనలు విలంబకాలములో రసపుష్టికల రాగభావములలో నుండి పల్లవి అనుపల్లవి చరణములను మూడు విభాగములతో గూడియుండు పద్ధతికి నొకదాని దాతువు ననుసరించి నింగొంది యుండదు. సాహిత్యమును మధ్యమకాల సాహిత్యముగా నడుపు ప్రత్యేకత వీరి రచనలలో చూడగలము. దీక్షితుల రచనలలో గోపుచ్ఛయతి, స్రోతోవహయతులు సంస్కృత భాషలో వీరికి గల అసామాన్య ప్రజ్ఞను విశదీకరించును.

ఉదాహరణ: "శ్రీ వరలక్ష్మినమస్తుభ్యం" (శ్రీరాగం)లో కృతిదీక్షితులవారి గోపుచ్ఛ యతికి చక్కని ఉదాహరణ. "శ్రీ సారసపదే, రసపదే, సపదే, పదే, పదే"

దీక్షితులవారి కృతులలో రాగముద్ర మరియొక ప్రత్యేకము. వీరు సాముదాయిక కృతులను రచించిరి. ఈ కృతులు ఒకే

(36 వ పేజీలో)

# ప్రణయకలహలీల

(గతసంచిక తరువాయి)

**దేవ్యువాచ :**

వక్త్రం శ్రమాంబు నికరైస్తుకరమ్బితం తే
బింబాధరాంబక యుగం ధవలారుణం తే
వ్యక్తత్వమావహతి ఫాలతలే విలాసః
కస్తూరికాసుతిలకం న విలోకయామి ॥

ప్రభో! మీ యొక్క ముఖంచూడగా రతి కేళియందు ఉత్పన్నమయిన స్వేదబిందువులు అలంకరించుకొన్నవి. పెదవులు తెల్లబడినవి. రెండు నేత్రములు ఎఱ్ఱగా మారినవి. మీ శరీరము విలాసమునందు తేలియాడినట్లు స్పష్టముగా తెలియుచున్నది. కస్తూరి తిలకము కూడ మరుగునపడినది.

భగవానువాచ:

వేగాదుపాగత వతో
వదనే శ్రమాంబుజాతం
శనైస్తిలక మాకులితం చ తేన ।
నైసర్గికం నయనయోర్న వినారుణత్వం
త్వద్వక్త్రశీధు మపిబన్
ధవలోఽధరో మే ॥

దేవి! అతిశీఘ్రముగా వచ్చుటచేత ముఖముమీద స్వేదబిందువులు ఏర్పడినవి. ఆ కారణముగా కస్తూరి తిలకము చెఱిగి పోయినది (మాయమైనది). నా రెండు కనులు ఎప్పుడూ కమలములవంటి ఎఱుపుతోనే ఉంటాయి. నీ అధరామృతపానము లేక నా పెదవులు తెల్లబడినవి.

దేవ్యువాచ :

వివిధ నఖ పదాంకై రంకితం చాపి
వక్షోరుహ సరస హరిద్రా
ముద్రితోరః స్థలం తే ।
వపురిదముపభుక్తం భాగ్య
కృత్వాంసులాభిః
మమ నయనపథాగ్రాద్
గచ్ఛ గోవింద శీఘ్రమ్ ॥

ఓ గోవిందా! మీవక్షం మీద అక్కడక్కడ గోటితో గీరినట్లున్న గాయములున్నవి. సుందరాంగుల దేహములందలి చందనము మీ వక్షస్థలం అంతా వ్యాపించియున్నది. ఈ గుర్తులను బట్టి రాత్రి అంతా మీరు వేరొక స్త్రీతో ఉపభోగము అనుభవించినట్లు తెలియుచున్నది. అందుచేత నీవు నా ఎదుట నుండి శీఘ్రముగా పొమ్ము గత రాత్రి ఎచ్చట గడిపితివో అచ్చటికే పొమ్ము.

భగవానువాచ :

సత్యం వదామి కమలే శృణు కాననాన్తే
మత్వా భ్రమాత్ స్తబక
సన్నత వల్లరీం త్వామ్ ।
ఆశ్లిష్య తత్ర్పనవ పాంశుభిరంకితోఽస్మి
వక్షఃస్థలే క్షతి రభవద్వనకంటకైశ్చ ॥

హే లక్ష్మీ! విను! సత్యంచెపుతున్నాను. నేను అరణ్యములో విహరిస్తూ ఒక పుష్ప గుచ్ఛమునందు నిన్నే ధ్యానిస్తూ హృదయేశ్వరివి నీవే అని భావించి మరచిపోయి ఆ పుష్పగుచ్ఛమును ఆలింగనము చేసుకొన్నాను. అంతే ఆ పుష్పములోని పుప్పొడి నా వక్షస్థలముపై వ్యాపించినది. దాని యొక్క ముళ్ళు నా వక్షమునకు తగిలి గాయమైనది. అంతేగాని ఇంకో స్త్రీతో విహరించలేదు.

దేవ్యువాచ :

సర్వాణి పంచశర సంగర సంచితాని
చిహ్నాని వంచక కథంచిత్
పట్టనుతాని ।
శక్యాని చాటువచనైః పరిహృత్యమధ్య
బింబాధరక్షతిరియం
జయమాతనోతి ॥

మీ శరీరముపై గల ఇతర గుర్తులను బట్టి మీరు వేరొక స్త్రీతో విహరించినట్లు స్పష్టముగ తెలియుచున్నది. ఆపెదవులపై ఆ ప్రకాశము చూడ ఆ కేళియందు మీరు విజయము పొందినట్లు స్పష్టమగుచున్నది.

దేవ్యువాచ :

పీతాంబరం కనక భూషణమన్యనార్యై
దత్వా తదీయ వసనాభరణాని ధృత్వా।
వేషంప్రగృహ్యబహుదోష విదూషి తస్త్వం
ఖేదం కరోషిపురుషోత్తమమానసే మే॥

ఓ పురుషోత్తమా! మీరు ఏస్త్రీ పొందు కొరకో పోయి మీ వస్త్రాభరణాదులను ఆమెకిచ్చి ఆమె వస్త్రాభరణాదులను ధరించివచ్చియున్నారు. ఇటువంటి శృంగార వేషముతో నా ఎదురుగానిలబడిన మిమ్ములను చూడగా నాకు దుఃఖం వచ్చుచున్నది.

భగవానువాచ :

దేవి! ప్రసీదసి నచేన్మయి కా గతిర్మే
త్వత్ప్రత్యయార్థమధునా
పురతస్తవాహమ్ ॥
వహ్నిం ప్రవిశ్య పునరేవ విషం పిబామి
మజ్జామి వాఽమ్బుని తులాం
ప్రవిశామివాఽథ ॥

(34 వ పేజీలో)

(గతసంచిక తరువాయి)

## ఐదవ అధ్యాయం — కర్మసన్న్యాసయోగం

అర్జున ఉవాచ:

సన్న్యాసం కర్మణాం కృష్ణ! పునర్యోగం చ శంససి ।
యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్ ॥

అర్జునుడు: కృష్ణా! ఒకసారి కర్మసన్న్యాసం చేయమనీ, మరోసారి కర్మయోగం ఆచరించమనీ ఉపదేశిస్తున్నావు. ఈ రెండింటిలో ఏది మంచిదో నాకు తేల్చి చెప్పు.

శ్రీ భగవానువాచ:

సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ ।
తయోస్తు కర్మసన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే ॥

శ్రీభగవానుడు: (చెప్పారు) కర్మత్యాగమూ, కర్మయోగమూ కూడా మోక్షం కలుగ జేస్తాయి. అయితే ఈ రెండింటిలో నిష్కామ కర్మయోగం మేలు.

జ్ఞేయస్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి ।
నిర్ద్వన్ద్వో హి మహాబాహో! సుఖం బన్ధాత్ప్రముచ్యతే ॥

జ్ఞానయోగులు పొందే ఫలమే కర్మయోగులూ పొందుతారు. జ్ఞానయోగం, కర్మయోగం ఒకటే అని గ్రహించినవాడే నిజమైన జ్ఞాని.

సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః ।
యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి ॥

అర్జునా! కర్మయోగం అవలంబించకుండా సన్యాసం పొందడం సాధ్యపడేదికాదు. నిష్కామకర్మచేసే ముని అచిరకాలంలో బ్రహ్మసాక్షాత్కారం పొందుతాడు.

యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః ।
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే ॥

నిష్కామకర్మాచరణం, నిర్మలహృదయం, మనోజయం ఇంద్రియ నిగ్రహం కలిగి, సమస్త జీవులలో వుండే ఆత్మ, తన ఆత్మ ఒకటే అని తెలుసుకున్నవాడు కర్మలు చేసినా ఎలాంటి దోషమూ అంటదు.



# శ్రీమద్భగవద్గీత

(సీరియల్)

వ్యాఖ్యాత :

శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి

అర్జునా! దేనిమీదా ద్వేషం, కోరిక లేనివాడు నిత్య సన్యాసి, సుఖదుఃఖాది ద్వంద్వాలు లేకుండా అలాంటివాడు సులభంగా భవ బంధాల నుంచి విముక్తి పొందుతున్నాడు.

సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః ।
ఏకమప్యాస్థితస్సమ్యక్ ఉభయోర్విన్దతే ఫలమ్ ॥

జ్ఞానం వేరూ, కర్మయోగం వేరూ అని అవివేకులే తప్ప వివేకులు చెప్పరు. ఈ రెండింటిలో చక్కగా ఏ ఒక్కదాన్ని ఆచరించినా మోక్షఫలం దక్కుతుంది.

యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగై రపి గమ్యతే ।
ఏకం సాఙ్ఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి ॥

నైవ కిఞ్చిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ ।
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్ ॥

ప్రలపన్ విసృజన్ గృహ్ణన్ ఉన్మిషన్ నిమిషన్నపి ।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్ ॥

పరమార్థ తత్త్వం తెలిసిన కర్మయోగి తానేమీ చేయడం లేదనే తలుస్తాడు. చూడడంలో, వినడంలో, తాకడంలో, వాసన చూడడంలో, తినడంలో, నడవడంలో, నిద్రపోవడంలో, ఊపిరి పీల్చడంలో, మాట్లాడటంలో, గ్రహించడంలో, కళ్లు తెరవడంలో, మూయడంలో ఆ యా ఇంద్రియాలే వాటి వాటి

విషయాలలో ప్రవర్తిస్తున్నాయని అతను తెలుసుకోవడమే దీనికి కారణం.

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః ।
లిప్యతే న స పాపేన పద్మపత్రమివామ్భసా ॥

నీరు తామరాకును అంటదు. అలాగే పరమేశ్వరార్పణ బుద్ధితో ఫలాపేక్షలేకుండా కర్మలు చేసేవాడిని పాపాలు అంటవు.

కాయేన మనసా బుద్ధ్యా కేవలై రిన్ద్రియై రపి ।
యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాఽఽత్మశుద్ధయే ॥

కర్మయోగులు ఆసక్తి, అభిమానం విడిచిపెట్టి తమ శరీరంతో మనస్సుతో, బుద్ధితో, పట్టి ఇంద్రియాలతో కర్మలు చిత్తశుద్ధి కోసమే చేస్తుంటారు.

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తి మాప్నోతి నైష్ఠికీమ్ ।
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే ॥

నిష్కామకర్మయోగి కర్మఫలాన్ని విడిచిపెట్టి, ఆత్మ జ్ఞానంవల్ల కలిగే శాశ్వతమైన శాంతి పొందుతాడు. అలా కాకుండా ఫలాపేక్షతో కర్మలు చేసేవాడు కర్మబంధంలో చిక్కుకుంటాడు.

సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ ।
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్నకారయన్ ॥

ఇంద్రియ నిగ్రహం కలిగినవాడు మనస్సుతో కర్మలన్నిటినీ వదలిపెట్టి తాను ఏమీ చేయకుండా, ఇతరుల చేత చేయించకుండా, తొమ్మిదిద్వారాలుండే శరీరమనే పట్టణంలో హాయిగా వుంటాడు.

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే ॥

పరమేశ్వరుడు జీవులకు కర్తృత్వంకాని, కర్మలు కాని కర్మఫలాపేక్షకాని కలగజేయడంలేదు. ప్రకృతులూ, ప్రారబ్ధాలు కర్తృత్వాదులకు కారణాలు.

నాదత్తే కస్యచి త్పాపం న చైవ సుకృతం విభుః ।
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః ॥

భగవంతుడికి ఎవరి పాపపుణ్యాలతోనూ ప్రమేయం లేదు. కాని, జ్ఞానాన్ని అజ్ఞానం ఆవరించడంవల్ల జీవులకు అలాంటి భ్రమ కలుగుతున్నది.

జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః ।
తేషామాదిత్యవద్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥

ఆత్మజ్ఞానంతో అజ్ఞానాన్ని రూపుమాపుకున్నవాళ్లు సూర్యుడి కాంతిలాంటి తమ జ్ఞానంతో పరబ్రహ్మ స్వరూపాన్ని సాక్షాత్కరింపచేసుకొంటారు.

తద్బుద్ధయ స్తదాత్మానః తన్నిష్ఠా స్తత్పరాయణాః ।
గచ్ఛన్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూత కల్మషాః ॥

ఆ పరమాత్మమీదే బుద్ధినీ, మనస్సునూ నిలిపినవాళ్లూ, ఆ పరాత్పరుడిమీదే నిష్ఠ, ఆసక్తి కలిగినవాళ్లూ జ్ఞానంతో పాపాలను పోగొట్టుకుని పునర్జన్మలేని మోక్షం పొందుతారు.

విద్యా వినయ సమ్పన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకే చ పణ్డితా స్సమదర్శినః ॥

విద్యా వినయాలు కలిగిన బ్రాహ్మణుడిని, గోవును, ఏనుగును, కుక్కను, చండాలుడిని ఆత్మజ్ఞానులు సమదృష్టితో చూస్తారు.

ఇహైవ తైర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మా ద్బ్రహ్మణి తే స్థితాః ॥

సర్వభూతాలనూ నిశ్చలమనస్సుతో, సమభావంతో సందర్శించిన వాళ్లు సంసార బంధాన్ని ఈ జన్మలోనే జయిస్తారు. పరబ్రహ్మ దోషం లేకుండా సర్వత్రా సమంగా ఉంటుంది కనుక అలాంటి సమదృష్టి కలిగినవాళ్లు ముక్తి పొందుతారు.

నప్రహృష్యే త్ప్రియంప్రాప్యనోద్విజేత్ప్రాప్య చాప్రియమ్।
స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః ॥

మోహంలేకుండా నిశ్చలమైన బుద్ధివున్న బ్రహ్మవేత్త ఇష్టమైనది సంప్రాప్తించినప్పుడు సంతోషించడు; ఇష్టంలేనిది సంభవించినప్పుడు విచారించడు. బ్రహ్మలోనే నిరంతరం లీనమై వుంటాడు.

బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్ ।
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయ మశ్నుతే ॥

ప్రపంచ సుఖాల మీద ఆసక్తిలేనివాడు ఆత్మానందం అనుభవిస్తాడు. అలాంటి బ్రహ్మనిష్ఠ కలిగినవాడు శాశ్వతమైన ఆనందం పొందుతాడు.

యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।
ఆద్యన్తవన్తః కౌన్తేయ ! న తేషు రమతే బుధః ॥

కౌంతేయా ! ఇంద్రియలోలత్వం అనుభవించే బాహ్య సుఖాలు దుఃఖ హేతువులు; క్షణికాలు. అందువల్ల నిర్మలబుద్ధి కలవాడు వాటిని ఆశించడు.

శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః ॥

కామ క్రోధాలవల్ల కలిగే ఉద్రేకాన్ని జీవితకాలంలో అణగద్రొక్కినవాడే యోగి; సుఖవంతుడు.

(32 వ పేజీలో)




## కట్నములు
## శుల్కములు
# శాస్త్రసమ్మతములా?

శ్రీ రాంపల్లి శ్రీరామచంద్రమూర్తి

ఈనాడు ఆడపిల్లలవివాహములు చేయ లేక తల్లి దండ్రులు పడుతున్నబాధలు ఆవేదన వర్ణనాతీతములు. ఏదోరీతిగా పెండ్లి చేసి పిల్లల నత్తవారింటికి పంపిన తరువాత కూడ చాలినంత కట్నము తేలేదనియో చీరలు సారెలు చాలినన్ని తేలేదనియో తమ పిల్లలను అత్తలు ఆడుబిడ్డలు పెట్టు ఆరడులు కన్న తల్లిదండ్రులను క్రుంగదీయు చున్నవి. అత్తవారింట బాధలు సహింప లేక నిండు ప్రాణములు తీసుకొన్న "అబలల"ను గూర్చి కూడా నిత్యము వార్తా పత్రికలలో చదువుచున్నాము. ఈ దుఃస్థితికి కారణమేమి? దీనికి బాధ్యులెవరు?

మనమందరము హిందువులమని గర్వింతుము! మనవేదములు, మనశాస్త్ర ములు, మనపురాణాదులు ప్రపంచమునకే సందేశమీయగల యపూర్వ వాఙ్మయమని మురిసిపోదుము! కాని వేదములు, శాస్త్ర ములు, పురాణాదులు ఏమిచెప్పినవో గమ నింపము. గమనించినను ఆచరింపము. వేదాదులందు నిష్ణాతులైనవారును వక్ర మార్గములనే యవలంబించుచున్నారు. నవ నాగరికులమని విర్రవీగువారుకూడ అదే దారిని పోవుచున్నారు.

ఇట్టి స్థితిలో మన సమాజ వ్యవస్థ నావ రించియున్న చీడనెట్లు తొలగింపవల యును? సమస్త ధర్మములకు మూలము వేదము. భారతము పంచమ వేదము. భారతమున వివాహవ్యవస్థ యేరీతిగా నుండవలెనని శాసించినారో తెలిసికొన్న యెడల వేదశాస్త్రాదులు పరమప్రమాణ మనియు మన హిందువులు ఆస్తికు లనియు భావించుచున్న మనము ఆచర ణలో ఎంతగా దిగజారిపోయినామో తెలిసి కొని సిగ్గుతో తలలు వంచుకొన వలసి వచ్చును.

అంపశయ్యపై పరుండియున్న భీష్ముని కడకు ధర్మరాజు సోదరులతో వచ్చి తన సందేహములు తీర్చుకొనుటకు ఎన్నియో ప్రశ్నలడుగును. ఆ ప్రశ్నలకు సమాధాన ముగా భీష్ముడు చెప్పిన విషయములు సర్వదా, సర్వథా, సర్వులకు శిరోధార్య ములు.

అనుశాసనిక పర్వమున భీష్మునిచూచి ధర్మరాజు వివాహ సంబంధమైన ప్రశ్న లడుగుటయు ఆ ప్రశ్నలకు భీష్ముడు సమా ధానము చెప్పుటయు పరిశీలించిన నేటి వివాహ వ్యవస్థకు పట్టిన జాడ్యము నిర్మూ లము చేయవచ్చును.

ధర్మరాజు భీష్మునిచూచి తాతా! సమస్త ధర్మములకు కుటుంబ జీవనమునకు గృహ మునకు దేవతలకు పితృదేవతలకు అతిథు లకు మూలాధారమైన కన్యాదానమును గూర్చి చెప్పుమని యడుగును. ఎట్టివరునకు కన్యనీయవలెనని ప్రశ్నించును. దానికి సమాధానముగా భీష్ముడు పలికిన పలుకులు గమనింపుడు.

శీలవృత్తే సమాజ్ఞాయ
విద్యాం యోనిం చ కర్మ చ,
సద్భిరేవం ప్రదాతవ్యా
కన్యా గుణయుతే వరే.

వరునకుండవలసిన లక్షణములలో శీలము నకు ప్రాధాన్యమిచ్చి మొదట పేర్కొ న్నారు. తరువాత చదువది గమనింప వలెను. శీలవృత్తములు గమనించిన పిదపనే చదువును పరిశీలింపవలెను. ఆ తరువాత చూడవలసినవి వరుని తల్లి దండ్రుల మంచిచెడ్డలు. ఆ తరువాత మాత్రమే వరుని ఉద్యోగము, హోదా చూడవలయును. ఇవియన్నియు చూచి వరుని గుణగణములు గ్రహించి కన్యా దానముచేయవలయును. వరుని పరిశీల నలో ధనవిషయము మాట మాత్రము పేర్కొనకుండుట ఇచట మనము ప్రత్యే కముగా గమనింప వలయును.

నవనాగరకులమైన మనము ఇప్పుడు దేనికి ప్రాధాన్యమిచ్చుచున్నాము? ఆస్తికి హోదాకు ప్రాధాన్యమిచ్చి శీలవృత్తము లను గాలికి విడిచిపెట్టుచున్నాము. ఇట్టి స్థితిలో ఆడపిల్లలు కష్టనష్టములకు గురి యగుటలో నాశ్చర్య మేమున్నది?

మనము వధూవరుల యిష్టానిష్టముల నెక్కువగా గమనింపక మన యిష్టాను సారము వివాహము చేయరాదని భీష్ముడు ఖండితముగా చెప్పుచున్నాడు. చూడుడు!

ఆత్మాభిప్రేతముత్సృజ్య
కన్యాభిప్రేత ఏవ యః,
అభిప్రేతా చ యా యస్య
తస్మై దేయా యుధిష్ఠిర.

కన్న తల్లిదండ్రులు తమ కిష్టమైన వరునకు కాక కన్య యిష్టపడువానికి, కుమార్తె నీయవలెనని ఆడపిల్లల తల్లి దండ్రులకు హితవుగ పలికినాడు.

ఇంక వివాహమున ధనమునకు ప్రాధా

## సప్తగిరి

### చిత్తూరు జిల్లా

శ్రీ ఏ. కె. సుబ్రహ్మణ్యం
న్యూస్ ఏజెంట్ పాకాల (పోస్టు)

శ్రీ కె. దొరస్వామి చెట్టి
C/o ఆర్. డి. కన్నయ్యనాయుడు
అడ్వొకేట్ ఎం. బి. రోడ్
పుత్తూరు–517 503

శ్రీ టి. పి. ఉమాపతి
మెయిన్‌రోడ్ నారాయణవనం (పోస్టు)
పుత్తూరు తాలూకా

శ్రీమతి వి. వసుమతి
C/o వి. శ్రీనివాసాచార్యులు
బ్లాక్ ఎక్స్‌టన్షన్ ఎడ్యుకేషన్
పి. టి. ఎం. పోస్టు–517 319

శ్రీ బి. జయచంద్రప్రకాష్
C/o డి. జగన్నాథం
స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా
వలమనేరు–517 408

శ్రీ సి. వేంకటరెడ్డి
3/90, బజార్‌వీధి వాయల్పాడు (పోస్టు)

శ్రీ టి. సి. ఉమాపతి
మెయిన్‌రోడ్ నారాయణవనం (పోస్టు)
పుత్తూరు తాలూకా

శ్రీమతి వి. వసుమతి
C/o వి. శ్రీనివాసాచార్యులు
బ్లాక్ ఎక్స్‌టన్షన్ ఎడ్యుకేషన్
పి. టి. ఎం. పోస్టు–517 319

శ్రీ బి. జయచంద్రప్రకాష్
C/o డి. జయానందం
భారతీయ స్టేట్ బ్యాంకు
వలమనేరు (పోస్టు)

శ్రీ సి. వెంకటరెడ్డి
3-90, బజార్‌వీధి వాయల్పాడు (పోస్టు)

న్యమీయరాదని చెప్పిన మాట నెల్లరు గమనించి తీరవలయును.

ధనేన బహుధా క్రీత్వా
సంప్రలోభ్య చ బాంధవాన్,
అసురాణాం నృపైతం వై
ధర్మమాహుర్మనీషిణః.

బంధువులను ప్రలోభపెట్టి శుల్కమిచ్చి వధువును కాని, కట్నమిచ్చి వరుని కాని కొన్న యెడల అది అసురుల (రాక్షసుల) వివాహము అనబడును. అనగా మనము రాక్షస ప్రవృత్తిలో నున్నామని కూడ గమనింపలేని దుఃస్థితిలో నున్నాము.

ఈనాడు కన్నబిడ్డలకు వివాహములు చేయలేక చాలమంది ఆడపిల్లల తండ్రులు నిస్సహాయ స్థితిలోనున్నారు. రజస్వలయై యెన్ని యేండ్లు గడచినను కట్నములు కానుకలు ఇవ్వలేక పిల్లలను గూర్చి తల్లిదండ్రులు పడు వేదనకు వ్యాసమహర్షియే చక్కని పరిష్కారము చూపినాడు. గమనింపుడు.

త్రీణి వర్షాణ్యుదీక్షేత
కన్యా ఋతుమతీ సతీ,
చతుర్థే త్వథ సంప్రాప్తే
స్వయం భర్తారమర్జయేత్.

రజస్వలయైన పిదప మూడు సంవత్సరముల వరకు స్త్రీ తన తలిదండ్రులు వివాహము చేయుదురేమో వేచి చూచి నాల్గవ సంవత్సరమున తన భర్తను తానే సంపాదించుకొనవచ్చును.

ఆ విధముగా భర్తను సంపాదించుకొన్న స్త్రీని కాని ఆ స్త్రీ తలిదండ్రులనుకాని సమాజము చిన్నచూపు చూచుట యెంత మాత్రము తగదు. అది శాస్త్ర విరుద్ధము కాదు కదా!.

కన్యాశుల్కమును కోరుట పరమనీచమని యెట్లు గర్హింపబడెనో చూడుడు.

అన్యైర్గుణై రుపేతం తు
శుల్కం యాచన్తి బాన్ధవాః.

ముసలితనము, రోగము మున్నగునవి కల వరులే శుల్కము కోరుదురు. కావున అది శాస్త్ర నిషిద్ధము. యోగ్యుడయిన వరునకే కన్య నీయవలయును. అది దేశ క్షేమమునకు మూలము అనుచున్నాడు భీష్ముడు. గమనింపుడు.

నానిష్టాయ ప్రదాతవ్యా
కన్యా ఇత్యృషిచోదితమ్,
తన్మూలం కామమూలస్య
ప్రజనస్యేతి మే మతిః.

కన్య నిష్టములేని వరున కీయరాదు. అట్లిచ్చిన సంసార సుఖము లేకుండుటయేకాక మంచి సంతానము కలుగదు. కన్యనిష్టపడు వరునకిచ్చిన సంసార సుఖము లనుభవించుటయే కాక సత్సంతానము బడసి దేశమునకు మేలు కూర్చును.

న హ్యేవ భార్యా క్రేతవ్యా
న విక్రయ్యా కథంచన.

భార్య కొనదగు వస్తువుకాని అమ్మదగు వస్తువు కాని కాదు.

యే చ క్రీణన్తి దాసీం చ
విక్రీణన్తి తథైవ చ,
భవేత్తేషాం తథా నిష్ఠా
లుబ్ధానాం పాపచేతసామ్.

దాసీలను కొను వారు అమ్ము వారు లోభులు, పాపులు అనబడుదురు. అట్టి పాపులు, లోభులు మాత్రమే భార్యలనమ్ముట కొనుట చేయుదురు. అనగా శుల్కము కట్నము మహాపాపము. క్రయవిక్రయము లతో కూడిన ఆసుర వివాహము వలన కల్గు ఫలమును వ్యాసుడు నిస్సంకోచముగా చెప్పుచున్నాడు.

అసూయవస్త్వధర్మిష్ఠాః
పరస్వాదాయినశ్శఠాః,
ఆసురాదధిసమ్భూతా
ధర్మా ద్విషమవృత్తయః.

క్రయవిక్రయములతో గూడిన అసుర వివాహము చేసికొన్న దంపతులకు జనించిన బిడ్డలు అసూయాపరులు అధర్మపరులు పరుల సొత్తు నాశించువారు మూర్ఖులు ధర్మ విరుద్ధమైన నడవడి కలవారు కాగలరు.

(32 వ పేజీలో)


శ్రీవెంకటేశ్వరస్వామి
బ్రహ్మోత్సవవైభవం

ధర్మా విరుద్ధములగు సర్వశ్రేయములను ఏమ్మటపునరావృత్తి లేని పరమపదమును లభించును. "తద్విష్ణోః పరమం పదం గచ్ఛతీతి విజ్ఞాయతే" (వై.సూ.) కాబట్టి యాగములలో నీ భగవద్యాగముఉత్కృష్ట మైనదియయి 'ఉత్సవ'మని వ్యవహరింప బడుచున్నది.

బ్రహ్మోత్సవ పదమును బ్రహ్మయనగా పరమాత్మయగు వేంకటాచలపతి ఆయనకు

విద్యాప్రవీణ

## శ్రీ వాడపల్లి జనార్దనాచార్యులు

గావించు నుత్సవము బ్రహ్మోత్సవము అని వ్యాఖ్యానింపవచ్చును. అట్లు చెప్పిన యెడల శ్రీవారి సన్నిధిలో జరిగెడి నిత్య కల్యాణాదులేకాక పవిత్రోత్సవాదులగునన్ని యుత్సవములును బ్రహ్మోత్సవము లే అయ్యెడిని. కాని యట్టి వ్యవహారము లేదు.



శ్రీనివాసుడు లీలావిభూతితో తాను సృష్టించి విస్తరిలజేసిన జీవులకు వారి సుకృతదుష్కృతములంబట్టి కొందఱకు ఇహమున సుఖశాంతులను పరమున స్వర్గ స్వారాజ్యాదులను, మఱికొందఱకు ఇహ మున దుఃఖమును పరమున రౌరవాది నరక ములను గలుగజేయుచు వినోదించును. వేఱొక కొందఱను వారి సుకృతవిశేష మును బట్టి తనతో నాడుకొనువారిగ జేయును. వారిచే ఆలయ గోపురాదులను నిర్మింపజేయును. అందు తాను ప్రతిష్ఠితు డగును. వారుచేయు దాస్యమును అనుమ తించును. వారిచే ఉత్సవములను ఊరే గింపులను జేయించుకొనును. ఈ క్రీడలలో అర్చారూపమున తాను అనుప్రవిష్టుడయి క్రీడాకారులకు పరమపదము నొసంగును. ఈ విధమగు భగవత్క్రీడలలో బ్రహ్మోత్స వము ప్రముఖమైనది.

'సవ' అను పదమునకు యాగమర్థము. యాగమనగా దేవపూజ. (ఉత్+సవ) ఉత్సవమనగా ఉత్కృష్టమైన యాగము. యాగము రెండు విధములు. అగ్నిష్టో మాదులు అమూర్తయాగములు. శ్రీహరి యొక్క ప్రతిష్ఠ, అర్చనము, ఉత్సవము మొదలగు కైంకర్యములు సమూర్త యాగ ములు. అందమూర్తయాగములు యజ మాన, తత్పత్నీ మాత్రనిర్వాహ్యములు క్వాచిత్కముగ జీవహింసతో గూడినవి. వాని వలన లభించు ఫలము "అపూర్వము." తద్ద్వారా పత్నీయజమానులకు స్వర్గస్వారా జ్యాదులు లభించునందురు. అవియు నశ్వరములయినవి. ఇక అర్చారూప ప్రతిష్ఠ, తదర్చనము, ఉత్సవము మొదలగు సమూర్తయాగములలో ఆచార్యునితోబాటు భక్తులును యథార్హముగ దీక్షితులు గావచ్చును. తత్తత్కైంకర్యరూపయాగ ములలో బాల్గొనవచ్చును. అట్లు పాల్గొనుట శ్రీనివాసుని సన్నిధిలోను, సర్వభగవదాల యములలోను జూచుచున్నాము. ఈయాగ మున సాత్త్వికములగు పుష్పఫల హవి రాజ్యాదులుపయోగింపబడును. హింసకు తావులేదు. భగవద్ధ్యానపరీవాహముతో నిండిన యీ సమూర్తయాగము వలన అందన్వయించిన సర్వులకు ఇహలోకమున





బ్రహ్మయనగా విఖనోముని; ఆయనచే రూపకల్పన చేయబడిన శ్రీనివాసునుత్సవ ముగాన బ్రహ్మోత్సవమనబడుచున్నదని వ్యాఖ్యానింపవలయును. విఖనోబ్రహ్మపద ములు పర్యాయపదములని తర్వాత వివ రింపబడును. ఈ రెండవ వ్యాఖ్యయే సర్వ ప్రసిద్ధమైయున్నది. శ్రీవేంకటేశ్వరాష్టో త్తర శతనామములోని "బ్రహ్మకోత్సవ" మను శ్రీనివాసుని నామము ఈ యర్థ మును బలపరచుచున్నది. శ్రీవారి బ్రహ్మో త్సవములలో జరిగెడి స్వామివారి యూరే గింపునకు ముందు బయలుదేరెడి చిన్న రథము ఉత్సవ వ్యవస్థాపకుడగు బ్రహ్మ యొక్క రథమనియు, అందాయన తిర స్కరిణీవిద్యతో మనకగపడకుండగ వేంచేసి యుండి యుత్సవమున నన్నిరంగములను పర్యవేక్షింతురనియు నున్న బహుళమైన జనశ్రుతి యిందుకు తార్కాణముగనున్నది.

ఆశ్వయుజమాసమందలి శ్రవణనక్షత్ర ముగల దినము బ్రహ్మోత్సవమునకు అవ భృథ(తీర్థ)దినము. అంతకు పూర్వము తొమ్మిదవ దినమున దీక్షితుడగు వైఖా ససుడు ఉత్సవమునకు అంకురార్పణము గావించును. నూతన వస్త్రమున గరుత్మం తుని చిత్రించును. గరుడప్రతిష్ఠకు ముందు అగ్నిప్రణయనమును తత్తద్దేవతల యా వాహన జుష్టాకారములతో గావించును. గరుత్మంతునకు ప్రాణప్రతిష్ఠ గావించును. సకల దేవతలనాహ్వానించుటకై భేరీపూజ గావించును. భేర్యాదిమంగళవాద్యములతో, గరుత్మంతునితో బయలుదేరి విమానప్రధాన ద్వారమునుండి యాలయమును ప్రదక్షిం చుచు - ఆయా దిక్కులలోనిలిచి మంత్రము లతో, పద్యములతో, గద్యములతో బ్రహ్మేం ద్రాది దేవతలను, ఋషి-పితృ-నాగ-యక్ష గరుడ-గంధర్వాది గణములను వారి వారి పత్నీపార్షదములతో విచ్చేసి వారివారి కుద్దే శింపబడిన స్థానములందు సన్నిహితులు కావలయుననియు భగవన్నియమాను సారము రక్షణకార్యమున జాగరూకులయి ధ్వజారోహణము నారంభించి ధ్వజావరోహ ణము వరకు భగవదుత్సవములను సేవిం చుచు భగవన్నివేదిత హవిస్సును, తాని చ్చెడి దానిని గ్రహించితృప్తులుగావలయు ననియు నాహ్వానించును. భగవన్నివేదిత హవిస్సును అష్టోపచారములతో వారి వారి స్థానములందుంచును. దానినే బలిహరణ మందురు. అదియైన పిమ్మట వేదమంత్ర ములతో గద్యపద్యములతో హెచ్చరింపుచు గరుత్మంతుని దీక్షితుడు ధ్వజదండాగ్రమున నారోహింపజేయును. అది ధ్వజారోహణము. ధ్వజారూఢుడగు గరుత్మంతునకు నివేదిం చిన ముద్గాన్నమును భక్తులు ముఖ్యముగ సంతానమును గోరువారు భక్తివిశ్వాసా లతో పరిగ్రహింతురు.

ఈ యుత్సవము తొమ్మిది దినములలో శ్రీనివాసుని దివ్యగుణముల నారాధింపవల యుననియు, నవకలశములలో నవ మూర్తుల నారాధింపవలయుననియు వివిధ ములగు సమిధలతో, ఆజ్యముతో అన్న ముతో, ధాన్యముతో విశేషముగ హోమ ములు చేయవలయుననియు, వేదపురా ణాదుల పారాయణము గావింపవలయు ననియు,భగవన్నామ సంకీర్తనల గావింప వలయుననియు, అపూర్వములగు నలం కారములతో గైసేసి యుత్సవమూర్తులను, శేష-గరుడాది వాహనములపై నుదయ మునకొక వాహనముపైనను రాత్రి మరొక వాహనముపైనను వేంచేపుచేసి స్వస్తి వచన మంగళ తూర్యఘోషములతో గ్రామో త్సవములను గావింపవలయుననియు, భగవచ్ఛాస్త్రముద్ఘోషించుచున్నది. తొమ్మి దవ దినమున అవభృథము. పిమ్మట ధ్వజావ రోహణము గావింతురు.

ఆయా వాహనముల నధిరోహించి వేంచేయుచున్న అర్చారూపుని సేవించు చున్న భక్తులు శ్రీనివాసుడు తన పరస్వరూప ముతో దర్శనమిచ్చుచున్నాడను అను భూతి నందుదురు. నేత్రములనానందా శ్రువులుగ్రమ్మగా సంతోషాతిశయముతో కంఠము రుద్ధముకాగా, అప్రయత్నముగ "గోవిందా" అని కీర్తించుచు బ్రహ్మానంద పరవశులగుదురు. పరిపూర్ణశేషత్వవృత్తితో భగవద్దాస్యమును నెఱపుచు భగవద్వాహన ములుగ సాక్షాత్కరించుచున్న శేష-గరుడ హనుమదాదుల నాదర్శముగగొని, భగవ త్కైంకర్యముగావింపనుద్యుక్తులగుదురు.

**శేషవాహనము :**

శ్రీహరి పరిచారకులగు నిత్యసూరులలో శేషుడొకరు. వీరు "భగవానునుద్దేశమును





గ్రహించి తమ శరీరమును, ఆల్లగ, శయ్యగ, ఆసనముగ, తలగడగ, పాదములదిండుగ, పాదుకలుగ, ఛత్రముగ మలచి శ్రియఃపతికి అంకిత మొనర్చి సేవించుచు, శేషుడు — భగవంతుని సొత్తు అను సార్థకనామముతో పిలువబడుచున్నారు- అని స్తోత్రరత్నము వర్ణించుచున్నది.

శేషుడు తనవలె సర్వావయవములను భగవానునకంకితము గావింపవలయునని భక్తులను ప్రబోధించుచున్నారు. "విచిత్రా దేహసంపత్తి రీశ్వరాయ నివేదితుం, పూర్వ మేవకృతా బ్రహ్మన్ హస్తపాదాదిసంయుతా (విష్ణుతంత్ర) కరచరణాదులతో గూడి విచిత్రమయిన యీ దేహసంపద భగవాను నకంకితముచేయుటకే యేనాడో రూప కల్పన చేయబడినది. భక్తిప్రభేదములలో భక్తుని సర్వదేహము భగవన్నివేదితము చేయుటకనువయినది అర్చన మొక్కటియే.

## హంస వాహనము :

భగవచ్ఛాస్త్రము "యస్తు గరుడరథ" ఇత్యాదిగా శ్రీనివాసుని, "యా పద్మాసనా పద్మహస్తా హంసవాహనా" ఇత్యాదిగా లక్ష్మీ మాతను ఆహ్వానించుచున్నది. శ్రీ, శ్రీని వాసుల సంబంధము ప్రభా, ప్రభావంతుల సంబంధముతో సర్వవిధముల తుల్యమైనది. ఒకరిని విడిచి యొకరుండరు. (చూ. పురుషకారవ్యవస్థాపకుడు - సప్తగిరి-అక్టో బరు, 81) లక్ష్మికి వాహనమయిన హంస శ్రీనివాసునకును వాహనమయి లక్ష్మీ విశిష్టు డగు నారాయణునే యర్చింపవలయునను ప్రబోధము నీయుచున్నది. శుభ్రతకు ప్రసిద్ధమయిన హంస, శుచిర్భూతుడయి నిర్మలమవస్త్రుతో భగవాను నర్చింప హెచ్చరించుచున్నది. నీరక్షీరముల మిశ్ర మమునుండి తాను క్షీరమును గ్రహించి నీరమును విడచినట్లు శాస్త్రవిహిత కర్మలలో భగవత్కర్మల నాచరించుచు, నితరకర్మలను విడనాడవలెనని ప్రబోధించుచున్నది.

## సింహ వాహనము :

శ్రీకృష్ణ పరమాత్మ "యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జిత మేవవా తత్తదేవావ గచ్ఛ త్వం మమ తేజోంశసంభవమ్" ఏది యైశ్వర్యవంతము, కాంతివంతము, బల వంతమునయియుండునో ఆ వస్తువు నా తేజోంశము వలన బుట్టినది- అనుటయేకాక "మృగాణాం చ మృగేంద్రోఽహం" మ్మని సింహము తనతేజోంశము వలన బుట్టినదని యానతిచ్చినవారు. కావున సింహము శ్రియః పతికి వాహనమగుట సమంజసమే. కాని హింసించునది గాన సింహమయినది. హింసాకర్మభగవత్ప్రతికూలము. భగవద్వా హనమయిన యీ సింహము హింసా ఘాతుక కృత్యములను విడనాడి "భగవ దనుగ్రహముంగోరువారు హింసను (క్రికర ణములచేతను) విడనాడవలె" నని బోధించు చున్నది.

## ముత్యాల పందిరి :

ముత్యాలపందిరి లోని స్వచ్ఛమయిన ముత్యములు జీవులు; ఆ ముత్యములలో ప్రతిఫలించు శ్రీనివాసుని ప్రతిబింబము జీవులందు అంతర్యామిగ నున్న పరమాత్మ "సుసూక్ష్మస్సారసర్వేషామంతరాత్మా" "అంతఃప్రవిష్టశ్శాస్తా జనానాం సర్వాత్మా" అను మొదలగు ఉపనిషద్వాక్యములకు ఉదాహరణముగా నున్న ముత్యాల పందిరి "శ్రీనివాసుడు మీలో అంతః ప్రవిష్టుడై యుండి మీ చేయు సుకృత దుష్కృతము లను గమనించుచునే యుండును. మీరు ఆయన కన్నుగప్పి యేమియు చేయ లేరు. సత్య ప్రవర్తనము నలవరచు కొనుడు" అనుచు బోధించుచున్నది.

## కల్పవృక్షవాహనము :

చింతామణి, కామధేనువులవలెనే కల్ప వృక్షము అర్థితార్థములనీయునది యని చెప్పుదురు. వాంఛితములను నెరవేర్చు నది కల్పము. కల్పమనెడి వృక్షము కల్ప వృక్షము. కల్పవృక్షము తీర్చెడి కోరికలు ఒండు రెండు పురుషార్థములకు మాత్రమే పరిమితములు. అవియైనను అస్థిరములు. అనశ్వరములగు సర్వార్థముల నీయువాడు శ్రీహరి యొక్కడే.

"యో దోషాంశ్చతురశ్చతుర్థః చతురః పదార్థాన్ సర్వగ్‌లోకస్య సందధానః" (పారమాత్మిక)

వరప్రదానమందు నిపుణమైన శ్రీని వాసుని వరహస్తశాఖ యొకటియే సర్వ



లకు సర్వార్థముల నీయుచుండగా పెక్కు శాఖలు గల్గియు తాను చతుర్థ పురుషార్థము నీయులేక సిగ్గిలి సకలార్థప్రదుడగు భగవానుని దాస్యముంజేయుటకు నిల్చినది కల్పతరువు; పరమాత్మకు వాహనమైనది.

దానినధిరోహించిన స్వామియు "సంసార మరుభూమిలోబడి యెండమావుల ను బోలిన విషయములకై భ్రాంతి పడవల దనియు, తనను ఆశ్రయించి ఆధ్యాత్మికము, ఆధిదైవికము, ఆధి భౌతికమునెడి తాపముల నుండి కోలుకొని తన వలన అనశ్వరములగు అభయవరములనందుడనియు హెచ్చరించుచున్నారు.

### సర్వభూపాలవాహనము :

ఇది సర్వభూమిని రక్షించువానికి చిహ్నమైనది. "పతిం పతీనాం పరమం పరస్తాత్ విధామ దేవం భువనేశమీడ్యం" రక్షకులకును పరమ రక్షకుడు, అన్ని భువనములకు ప్రభువు విష్ణువే. "విష్ణుస్సర్వేషామధిపతిః" బ్రహ్మరుద్రేంద్రాది దేవతలకు, నిత్య-ముక్తబద్ధులగు సమస్త జీవులకును విష్ణువే అధిపతి, అని యుపనిషత్తులు వక్కాణించుచున్నవి. కనుకనే ఆయన మనకువలె బ్రహ్మేంద్రాదులకును "అవస్య మ్రొక్కుల వాడే" "యం దేవాః పరమం పవిత్రం భజిష్యన్త్యర్చిషు ప్రణతాః ప్రధానాః" [పౌర] బ్రహ్మేంద్రాదిప్రధాన దేవతలుగూడ తమకు సంభవించిన కష్టములనుండి గట్టెక్కించుమని వినమ్రులయి ఆయనకు మొక్కుచుందురు. అదేవిధముగ శ్రీనివాసుని దర్శనమునకై పడిగాపు పడియుండు యోగము మనకేకాదు, దేవతలకును గలుగునదియే. "దేవాః సర్వే పశ్యే విచరన్తి" (పౌర) సర్వభూపాలురగు ఆయన యొక్క దర్శనముంగోరి దేవతలు విరామములేకుండ తిరుగుచుందురు. అనగా ఆయన దర్శనమునకై వచ్చి-పడిగాపు పడియుండి అప్పటికిని లభ్యముగానిచో భగవన్నియమిత కార్యములనట్టే చూచుకొనుచు ఇట్టే వచ్చుచుందురు.



ఆ ప్రభువు ఆ వాహనమునుండి "మీ కభయవరముల నిచ్చి రక్షించుటకయి సిద్ధముగ నున్న నన్నాశ్రయింపుడు. ప్రాదేశమాత్రప్రభుత్వముతో సార్వభౌములమని విఱ్ఱవీగు వారిని జూచి, చేరి మోసపోకుడని మనలను హెచ్చరించుచున్నారు.

### వల్లకిలో మోహినీ అవతారము :

"ఇసుప కచ్చడాల్ బిగించుకొన్న మునులు సైతము యువతుల కాళ్లకు బందీలగుట" ను వినుచున్నాము. చూచుచున్నాము. స్త్రీరూపము అట్టిది. మన్మథ మన్మథుడయిన శ్రీనివాసుడు పురుషులయ్యును తన సౌందర్యముచే "పుంసాం మోహనరూపు" డని ప్రసిద్ధి గాంచినాడు. ఆయనయే స్త్రీ రూపమును ధరించుట ప్రళయముగాదా! అమృతమునకై దేవదానవుల మధ్య చెలరేగిన వివాదమును బరిష్కరింప దలచి మోహినీరూపముతో వారిమధ్య తళుక్కుమన్నాడు శ్రీహరి. ఆ రూపమును జూచినాడు పరమశివుడు. ఒకప్పుడు మన్మథుని మసిజేసి



తన యింద్రియవిజయమును చాటుకొన్నవాడును "శంకరాత్ జ్ఞానమన్విచ్ఛేత్" జ్ఞానప్రదాతగా ప్రసిద్ధుడునగు ఆ సర్వజ్ఞుడు మోహిని వెంటబడినాడు. "బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి" అను సూక్తికి ఉదాహరణమైనాడు. ఎంతవానికైనను స్త్రీ వ్యామోహము అధః పతన హేతువగునని యీ యవతారము బోధించుచున్నది.

### గరుడ వాహనము :

"గరుడో వాహనాధీశః" "వాహనానాం వరేణ్యః" భగవానుని వాహనములలో వరేణ్యుడు, సర్వ వాహనములకునధీశుడు గరుత్మంతుడు. నిత్యసూరులలోనొకడు. భగవానునంగు శేషభూతుడును. బ్రహ్మోత్సవము నందాయనకు ఇంతింతనరాని ప్రాముఖ్యమున్నది. ఆయన ధ్వజాగ్రము నారోహించుటయే బ్రహ్మోత్సవమున కారంభము. ధ్వజమునుండి అవరోహించుట బ్రహ్మోత్సవమునకు పరిసమాప్తి. 'అప్రతిమ వీర్యవంతుడు' "విష్ణుసమ తేజస్కుడు" నయిన గరుత్మంతుడు సకల జగదాధారుడగు శ్రీహరికి వాహనముగా గలిగి "విష్ణురథము" అను అర్థవంతమగు బిరుదముబడయ గలిగెను. శ్రుతులచే, శ్రుతిశిరస్సులగు ఉపనిషత్తులచే ప్రతిపాద్యుడగు శ్రియఃపతికి వాహనముగ

నుండు నర్వత వేదమయుడయిన గరుత్మంతునకే కలదనుట అతిశయోక్తి గాదు. వినతానుత శ్రీనివాసుల కున్న శేషశేషి భావ మనితర సాధారణమయినది.

వేదమయుడు వేదరవ్రుడునగు ఈయన తన మూపును శ్రీ శ్రీనివాసులకు పీఠము గను, హస్తములను పాదములగను, ఱెక్కలను ఆలవట్టముగను వినియోగించుచు, భగవదుపచారములు వేదపఠనమునతో గావింప వలయుననియు, నైచ్యద్యోతకమగునుపచారమే భగవన్ముఖోల్లాస హేతువగుననియు నుద్బోధించుచున్నారు. వేదపఠనమునకొక విశేషమున్నది. "వేదాక్షరాణి యావన్తి పఠితాని ద్విజాతిభిః తావన్తి హరినామాని కీర్తితాని న సంశయః" వేదాక్షరములెన్ని పఠింపబడునో అన్ని భగవన్నామములు కీర్తింపినట్లగును.

కొనుటకు అంజలి ఘటించుటయే యుత్తమోత్తమోపాయమని తమ అంజలి ముద్రతో సందేశమిచ్చుచున్నారు.

గజ వాహనము :

కరిని శ్రీహరిని నొక్క చో జూడగనే శ్రీహరియొక్క భక్తరక్షణత్వరయు, అందులకు ఒక తార్కాణమైన గజేంద్రమోక్ష వృత్తాంతము స్మరణకు వచ్చును. గజేంద్రుడు మొసలిచే పట్టువడినాడు. దిక్కు తోచలేదు. కనులు మూసికొనినాడు. "మూల మూల" అని కుయ్యిడినాడు." "నాహం, నాహం, నచాహం, న చ భవతి పునస్తాదృశో మాదృశేషు" అని దేవతలు చేతులు ముడిచి కూర్చున్నారు. గజేంద్రునికి సంభవించిన యాపద తనకే కల్గినట్లు బాధపడినాడు శ్రీహరి. లక్ష్మితో నైన తెల్పక, వాహనాయుధములను

వ్యూహరూపమున నున్నాడు. అట్టి సూర్యుని ప్రభ వాహనము నుండి "తనయందు వేంచేసియున్న శ్రీమన్నారాయణు నెల్లప్పుడు ధ్యానింపవలయునని గుర్తుకు దెచ్చుచున్నది.

చంద్రప్రభ :

భగవచ్ఛాస్త్రము హృదయాకాశమున వైశ్వానరజ్యోతిని దాని మధ్యలో చంద్రమండలమును అందు శుద్ధ స్ఫటికకాన్తితో దేజరిల్లెడి నారాయణుని ధ్యానింపవలయునని చెప్పుచున్నది. ఈ విధముగ సగుణధ్యానములో ద్వారముగ నున్న చంద్రప్రభయు అట్టి సూర్యప్రభ వలెనే తనలో భగవద్ధ్యానమును ప్రబోధించు చున్నది.

రథము :

కృష్ణ పరమాత్మ రథస్థుడయి "మన్న







హనుమద్వాహనము :

"దూతో రామస్య ధీమతః" అనియు, "దాసోఽహం కోసలేంద్రస్య" అనియు సగర్వముగ జెప్పికొనినవాడు హనుమంతుడు. ఆయన దౌత్యవైభవమును శ్రీమద్రామాయణ సుందరకాండము చక్కగ వర్ణించుచున్నది. ఆయనయందలి యనన్య దాసభావమే ఆయన యందు సీతమ్మకు అరమరికలేని విశ్వాసమును గలుగ జేసినది. ప్రతిఫలాపేక్ష లేకుండగ ఇతరులకు సేవ చేయుయోగ్యతదాస్యము. స్వల్పభేదముతో దాసత్వ శేషత్వము లొకటియే. శ్రీరామ లక్ష్మణులకు వాహనభూతుడైన మారుతియు పరిపూర్ణ శేషత్వవృత్తితో భగవానునుపాసింపవలయునని ప్రబోధించుటయే కాక శీఘ్రముగ భగవానుని ప్రసన్నుని జేసి

తలపెట్టక గభాలున లేచి పరువెత్తి వచ్చి గజేంద్రు నాదుకొని యాతని యార్తిబాపినాడు.

ఆర్తులను సకాలములోనాదుకొనువాడు శ్రీహరి యొక్కడే. రక్షకాభాసములగు దేవతాంతరములనాశ్రయించి ప్రయోజనములేదని యీ గజేంద్రవృత్తాంతము ప్రబోధించుచున్నది.

సూర్య ప్రభ :

"యోవా తేజస్తేజసాం తేజస్తేజు ఆదధానః" (పారమాత్మిక) తేజస్సులకును తేజోరూపుడగు శ్రియఃపతియే నక్షత్రములకు, అగ్నికి, చంద్రునకు, సూర్యునకును తేజస్సునొసంగుచున్నాడు. "వ్యూహాత్మనార్కాదికే" సూర్యునియందాయన

నాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు" అని తన భక్తుడగు అర్జునునకు ఉపదేశించు వ్యాజమున మన కందఱకు కర్తవ్య బోధ గావించినారు. ఆనాటి ప్రబోధన సన్నివేశమును మనమీనాడు రథోత్సవమున కార్యరూపములో కన్నారజూచుచున్నాము.

ప్రజలు తమకు సంభవించిన యాపదలను ఏడుకొండల వానికి ఎరుక పరచుకొనుటకో, ఆ పరమాత్మ విలాసములను గమనించుటకో, తమ కోరికలు పండుటకో, శ్రీ వేంకటరమణుని మనంబున దలంచుకొనుచు దేశ దేశముల నుండి బ్రహ్మోత్సవమునకు వత్తురు. శ్రీవారి కైంకర్యములో పాల్గొందురు. గోవిందా అని కేకలిడుచు అపరాధములను క్షమింపుమని విన్నవించుకొందురు. అలనాటి కృష్ణసందేశము



నీ విధముగ కార్యరూపములో బెట్టుటయే ఈ బ్రహ్మోత్సవము యొక్క ఆంతర్య మేమో !

> పత్రకోస్కృతోఽపి గోవిందో
> నృణాం జన్మశతైశ్చితమ్,
> పాపరాశిం దహత్యాశు
> తూలరాశిమివానలః.

గోవిందునొక్కమారు స్మరించినను స్మరించినవారు వందలకొలది జన్మలలో జేసిన పాపముల సమూహమును శ్రియఃపతి దూదిపింజను అగ్ని దహించినట్లు దహించును.

**అశ్వవాహనము :**

శ్రీనివాసుడశ్వము నారోహించుట ఆయన ధర్మరక్షణ సంసిద్ధతకు చిహ్నము. ప్రజలచే ధర్మము నాచరింపజేయుటయే ధర్మరక్షణము. "ధర్మో రక్షతి రక్షితః" మనచే రక్షింపబడిన అనగా శాస్త్రమును అనుసరించి చేసిన ధర్మము మనను రక్షించును. ధర్మము భగవానుని స్వరూపము. మనమెంతటి భగవత్ప్రపన్నులమయినను భగవానునే విశ్వసించియున్నను భగవదాజ్ఞారూపమగు ధర్మమును విడచిన యెడల మనము భగవన్ముఖోల్లాసమునందలేము.

ధర్మరక్షణమనునది క్లేశసాధ్యము. ఎంత జాగరూకులమై యున్నను, ఈ యుగ ప్రభావము వలన కలిదోషావిష్టులమగుచునే యుందుము. కలిపురుషుని బారిపడకుండగ రక్షింపగల సమర్థుడు శ్రీ వేంకటేశ్వరు డొక్కడే.

> కలిదోషపరీతానాం
> నరాణాం పాపకర్మిణాం.
> వేంకటేశాత్పరో దేవో
> నాస్త్యన్యశ్శరణం భువి. (స్కాం)

పరులను హింసించుట. అసత్యము బలుకుట, పరదారలను, పరుల ద్రవ్యము నపహరించుట, ఓర్మిలేకుండుట. దేహ ఆహార మనశ్శుద్ధి లేకుండుట, శౌచమును విడనాడుట మొదలగునవి కలిదోషములు అవి పండితులయి మేధావులము అనుకొను వారికైనను వారివైనందిన కృత్యములలో తరచుగ దొరలుచునేయుండును. వానికి లోనగుటయే కాక పాపకర్మలందే దృష్టిగలిగిన మానవులను ఆ కలి దోషములనుండి విముక్తులగుటకు దగిన బుద్ధినిచ్చి వానిబొంతకు పోకుండగ రక్షించు సమర్థుడు శ్రీ వేంకటేశ్వరుడొక్కడే !

భక్తవరులారా ! శ్రీనివాసు ననుగ్రహమును సంపాదించి మొట్టమొదట కలి విముక్తులుకండు. భగవదాజ్ఞారూపములగు శ్రుతి స్మృతులు విధించిన ధర్మముల నాచరించుట మరువకుడు. పరిపూర్ణ శేషత్వమలర శ్రీనివాసునారాధింపుడు. ధ్యానించుడు, కీర్తించుడు. ఆయన క్రీడావిశేషమగు బ్రహ్మోత్సవమును సేవింపుడు "ఉత్సవే దేవేశం యే సేవన్తే తే పర్వే పదే పదే యజ్ఞ యజ్ఞఫలం లభేరన్" (మరీచి) అని మహర్షులానతిచ్చిన ఫలమును బొందుడు !

ఇక చివరిగ విఖనోబ్రహ్మపదములు పర్యాయములనుటను వివరించుచున్నాను. శ్రీ మహావిష్ణువు తనను అర్చించు విధానమును స్వయముగ విఖనోమునికి వచియించియున్నారు. "పూర్వం విఖనసే విష్ణుః ప్రోక్తవాన్ స్వయమచ్యుతః" (వృ. హా. స్మృ) శ్రుతిమయమగు ఆ విధానమును శ్రుతులతోబాటు సోమకాసురుడపహరించెను. విష్ణువు సోమకునిజంపి వేదములను చతుర్ముఖునకు మరల కటాక్షించెను. చతుర్ముఖుడు కోరగా పూర్వము తాను విఖనసునకు జెప్పిన తనయర్చనా విధానమును సూచన ప్రాయముగ బ్రహ్మకుజెప్పెను. పదంపడి చతుర్ముఖుడు మునివేషధారియై నైమిశారణ్యమున శుద్ధసత్త్వనిష్ఠతో శ్రీహరింగూర్చి తపముగావించి సంక్షిప్తముగా తనకు జెప్పబడిన యర్చా విధానమును సాకల్యముగ నెరుగావగలిగెను. శుద్ధసత్త్వనిష్ఠతో భగవానుని ధ్యానించిన బ్రహ్మకు విఖనసాభిఖ్యలభించినట్లు మహాభారతము వక్కాణించుచున్నది. ఈ విధముగ ఆ యర్చనా విధానము మొదటి దశలో విఖనసునిచే ప్రోక్తమయియు రెండవ దశలో విఖనసాభిఖ్యంగాంచిన బ్రహ్మచే వ్యక్తమయియు వైఖానస భగవచ్ఛాస్త్రము అనుపేర ప్రసిద్ధికెక్కినది. దానింబట్టియే తిరుమలలో శ్రీనివాసునకు అర్చనాదులు. పవిత్రోత్సవాదులు జరుపబడుచున్నవి. శుద్ధసత్త్వనిష్ఠుడగు బ్రహ్మచే కనుగొనబడి ఆచరణలో పెట్టబడినట్టి యీ యుత్సవము బ్రహ్మోత్సవమని ప్రఖ్యాతి నందినది. ఈ బ్రహ్మోత్సవము శ్రీ వేంకటాద్రియందే శ్రీనివాసుని నుండియే యారంభమయినదని శ్రీ వేంకటేశ్వర సహస్రనామములందలి "వైఖానస మఖారంభ" అను నామము వ్యక్తీకరించుచున్నది. బ్రహ్మయే గలిగిన విఖనసాభిఖ్యం బట్టి విఖనో బ్రహ్మపదములు పర్యాయపదములుగా స్మృతి పురాణేతిహాసములలో వ్యవహరింపబడుచున్నవి. •





# వాగ్దేవి వైశిష్ట్యం

## శ్రీ కోదండ రామాచార్యులు

ప్రాణులకు మధ్య పరస్పర భావ ప్రకటనమున కుపయోగపడునట్టిది వాక్కు. అట్టి వాక్కు మనుజులకు మాత్రమే కలదు. తిర్యక్కులకులేదు. ప్రాణి కోటిలో మానవునకు విశిష్టస్థానమును కల్గించు వాక్కునకు ఆది దేవత సరస్వతి.

సరః—అంటె సరణం-వ్యాప్తి. అట్టివ్యాప్తి కల్గినది కాన సరస్వతి. ఒకరినుండింకొకరికి ఒక స్థలమునుండింకొక స్థలమునకు వ్యాప్తి చెందు స్వభావము కలది అని అర్థమగుచున్నది. వ్యాప్తికలది ప్రవాహముకూడా అగును. కాన సరస్వతి సప్త స్రోతస్వినులలో నొకటియనిఋగ్వేదములో పేర్కొన్న విషయము యథార్థమేయని తోచుచున్నది. 'చత్వారి వాక్పరిమి తా పదాని,' దేవీంవాచమజనయంత దేవాః; ప్రణోదేవీ సరస్వతీ,' త్యాది ఋక్కులందు సరస్వతీ పదము వాక్పర్యాయముగనే తోచుచున్నది. నదీ పర్యాయముగ ఉపయోగించిన స్థలములు స్వల్పము. సరస్వతీ పదమును వాక్కు అనే అర్థమున, వాగధిష్ఠాతృదేవతార్థమునను కాళిదాస, జయదేవ, మురారి, మల్లినాథాది కవులు తమతమ గ్రంథములందు ప్రయోగించిరి. సరస్వతికి పర్యాయ పదములు "బ్రాహ్మీ తు భారతీ భాషా గీర్వాగ్వాణీ సరస్వతీ" అని అనేకములున్నవి. కాని లౌకికముగా ప్రసిద్ధిచెందిన "శారద" పదము అమరసింహుని నిఘంటువున కనపడదు.

శరత్ శబ్దంనుండి నిష్పన్నమైనది శారద. శరత్‌వెన్నెల, ఆ ఋతువున నదీ తీరములందు విశేషముగానుండు కాశకుసుమములు, శరన్మేఘశకలములు, శరత్తులో మానససరస్సు నుండి క్రిందికి దిగి గంగా నదిలో విహారముకోరి దేశభాగమునకు వచ్చెడి రాజహంసలు, అన్నీ తెల్లనివే. సరస్వతీ రూపం తెల్లనిదే, అంతేకాక ఆమె ఆరాధన శరన్నవరాత్రములందు జరుగుచుండును. కాన శరదృతువునకు ఆమెకు ఉన్న దృఢతమ సంబంధము ననుసరించి "శారద" అను వ్యవహారము ఏర్పడియుండ వచ్చునని నా అభిప్రాయము.

"సరస్వతి నమస్తుభ్యం" "శరదిందు వికాసమందహాసాం" "తల్లీ నిన్ను దలంచి" మున్నగు స్తోత్రములను. విద్యార్థులు తమ విద్యా సంసిద్ధి కొరకు పఠించుట ఆచారమై యున్నది. "క్షోణీతలంబు నెన్నుదురు సోకగ", "అంబ నవాంబుజోజ్జ్వల కరాంబుజ," "సింహాసనము చారు సిత పుండరీకంబు" అంటూ కవులు తమ కావ్యారంభమున సరస్వతిని స్తుతించుట కనుపట్టుచున్నది. అక్షరాభ్యాస సమయము నను, శ్రీమన్నారాయణుని బ్రహ్మోత్సవ (కల్యాణోత్సవ)మందు జరుగు మహదాశీర్వచన సమయముననను, సరస్వతిని పూజించుటయేకాక ఆశ్వయుజ శుద్ధనవమి

## శ్రీనివాస



శ్రీనివాస నీ చిద్విలాసము
తొలగించునులే మనఃక్లేశము
నీ శుభరూపము సోకనాశము
నింపెను మాలో మధురహాసము

వేంకటేశ నీ వామహస్తము
సంకటముల బోపు సత్యము
నీ శుభనామము పరమపావనము
నీ కౌస్తుభము మా కాశ్రయము

ఏడుకొండలను ఏకధాటిగా
ఎక్కగ శక్తిలేని దొనరు
వేగముగ నినుచేరు భాగ్యమును
వేడుచుంటిరో వేంకటేశ్వరా !

— "శారద"

నాడైనను, మాఘకృష్ణ పంచమినాడైనను ఆ వాగధిదేవతను పూజించుట సంప్రదాయమై యున్నది.

"మూలేనావాహయేద్దేవీం శ్రవణేన వివర్జయేత్" అను కారిక ననుసరించిశరన్నవరాత్రములందు మూలా నక్షత్రమున సరస్వత్యావాహనము గావించి పూజచేసి శ్రవణమున ఉద్వాసన చేయింతురు. ఈ సందర్భమున పూజించబడు అమ్మవారిని మహాకాళీ, మహాలక్ష్మి మహా సరస్వతీ అనే దేవతా త్రయ సమ్మేళనాత్మకముగ గ్రహించుట జరుగుచున్నది.

త్రిమూర్తులు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు. రజస్సత్త్వతమః ప్రధానులయినట్లు ఈ త్రిశక్తులును తత్తత్ప్రధానులు. మహాకాళి తమఃప్రధాన రౌద్ర రూపమున దుష్టసంహారకారిణి. మహాలక్ష్మి సత్వ ప్రధాన వైష్ణవీ రూపమున జగత్పాలనకారిణి. మహాసరస్వతి రజః ప్రధాన బ్రాహ్మ రూపమున జగదుత్పత్తిని జగమున జ్ఞాన సంచారమును చేయును. వీరి యుత్పత్తి, లీలలు, దుర్గాసప్తశతియందు చక్కగా నిరూపితములైనవి.

దేవీ సంకల్ప ప్రాభవమున పంచవిధ సృష్టి కలిగినది. భక్తానురోధమున దేవి భక్తానుగ్రహవిగ్రహయైదుర్గ-లక్ష్మి-సరస్వతి సావిత్రి-రాధ యను పంచ ప్రకృతులుగా రూపొందిన విషయము ప్రసిద్ధము. కాన సరస్వతి ఆదిశక్తియొక్క అపరావతారమని చెప్పుదురు. ఇట్లు చెప్పుటకు ఆ యా సందర్భములందు చేయబడిన ప్రార్థనా శ్లోకములు హేతువులగుచున్నవి.

"ఘంటాశూలహలాని శంఖముసలే చక్రం
ధనుస్సాయకమ్
హస్తాబ్జైర్దధతీం ఘనాంత విలసచ్ఛీతాంశు
తుల్యప్రభామ్
గౌరీదేహసముద్భవాం త్రిజగతా మాధార
భూతాం మహా
పూర్వామత్ర సరస్వతీమను భజే శుంభాది
దైత్యార్దినీమ్॥

ఈ శ్లోకము దేవీభాగవతములోనిది ఇందు వర్ణించబడిన సరస్వతీ రూపము దుష్టశిక్షణాదక్షముగ తోచుచున్నది.

కాశీఖండమునను, గాయత్ర్యుపనిషత్తుననుగల శ్లోకమును చూడ సరస్వతి వైష్ణవిగా చదువుల తల్లిగ శాంతమూర్తిగ కనుపట్టును.

సంధ్యాసాత్ర సరస్వతీ భగవతీ పీతాంబరాడంబరా
సంధ్యా సామవపుర్నుతా పరిణమత్ గాత్రాంచితా
వైష్ణవీ।
తార్క్ష్యస్థా మణి నూపురాంగద మణిగ్రైవేయ
భూషోజ్జ్వలా
హస్తాలంబిత శంఖచక్రసగదా శూలిశ్రియై
చాస్తు నః॥

సరస్వతి భాషకు, విద్యాబుద్ధి, వాక్ప్రతిభలకు ప్రతీక. అవి నిర్మల స్వరూపము కలవై యుండవలెనను సూచన చేయుటకో యన్నట్లు అందరు సరస్వతిని సర్వశుక్లవర్ణ స్వరూపిణిగనే భావించియుండిరి, ఒకరు సరస్వతిని కుందేందు తుషార హారధవళ, శుభవస్త్రాన్విత, వీణావరదండ మండితకర, శ్వేతపద్మాసన, యని స్తుతించిరి. ఇంకొకరు ఒకచేత కమండలువు, మరొకచేత అక్షమాల ధరించిన దేవతగను, వీణాపుస్తకధారిణిగ, వేరొకరు పాశపుస్తక ధారిణి, అక్షసూత్రాంకుశధర, యని, మరియొకరు, మనసున భావించి భజించిరి. చిత్రముల విషయమునకు వచ్చినపుడు అనేక చిత్రములందు ముఖ్యముగ రాజా రవివర్మ చిత్రములందు స్ఫటికాక్షమాలతో కూడ వాహనముగా మయూరవాహనమున్నట్లు కన్పట్టుచున్నది. "హంసవాహన సమాయుక్తా విద్యాదానకరీ భవ" అని అందరిచే సరస్వతి పొగడబడుచున్నపుడు ప్రక్కన మయూర ముండుట కొంత విచిత్రమే యనిపించును.

వాహనవిషయమున, చేతధరించు వస్తుతతి విషయమున, భేదములున్నను వర్ణము విషయమున అందరు సరస్వతిని శ్వేతవర్ణగనే వర్ణించిరి. "అక్షదామ శుకవారిజ పుస్తకరమ్యపాణి"గా సరస్వతిని భావించిన పోతన

"శారద నీరదేందు, ఘనసారపటీర, మరాళ,
మల్లికా,
హార, తుషార, ఫేన, రజతాచల, కాశ, ఫణీశ,
కుంద, మం
దార, సుధా, పయోధి, సితతామర, సామర
వాహినీ, శుభాకారత నొప్పు"

భారతిని మదిగాంచు టెన్నడని తపించెను. ఎన్నియో తెలుపులు కూడి స్వచ్ఛమై పరిశుద్ధమైన సరస్వతీ స్వరూపమును భావించినవాడు కావుననే పోతనయు స్వచ్ఛమైన, నిష్కల్మషమైన భావముకలవాడై సహజ పాండితీమండితుడై నాడు.

తెల్లని వర్ణము శుభ్రతకు, శాంతికి, చిరునవ్వునకు, కీర్తికి చిహ్నము. మనసున కల్మషము లేనపుడే ప్రశాంతి. అదియున్నపుడే పెదవులపై చిరునవ్వు. నిష్కల్మషమైన ప్రశాంతమైన మనసుతో ఆలోచించి మంచి కార్యము చేసినపుడే కీర్తియబ్బును. కీర్తికరమైన కార్యము చేయవలెనన్న మంచి ఆలోచన అవసరము, అది విజ్ఞానమువలన, విజ్ఞానము విద్యవలన ప్రాప్తించును. అట్టి విద్యకు అధిదేవత సరస్వతి. కావుననే వాగ్దేవి శ్వేతవర్ణయైనది. ఏది ఏమైనను ఆమె సంగీత సాహిత్యములకు అధిష్ఠాత్రి. ఆ రెండు లలిత కళలు లౌకిక ప్రవృత్తి యందు మానవునకు విశ్రాంతి ధామములు.

సరస్వతీ చతుర్ముఖులు దంపతులు. ప్రభు సమ్మితమైన వైదిక వాఙ్మయమునకు బ్రహ్మప్రతీక అయిన, సరస్వతి కాన్తా సమ్మితమై సుకుమారమైన లౌకిక వాక్కునకు, కవిత్వ నృత్య సంగీతాది లలిత కళలకు ప్రతీక ఐనది. లౌకిక ప్రవృత్తికి, ఆనందమునకు, లౌకిక వాఙ్మయము, పారలౌకిక సుఖప్రాప్తికి, ధర్మాచరణమునకు వైదిక వాఙ్మయము అత్యంతావశ్యకములు. వైదిక వాఙ్మయము ప్రాచీనమైనది. లౌకిక వాఙ్మయము అర్వాచీనమైనది. అయినను వాని అనుబంధము విడదీయరానిది. అందుకే కాబోలు లౌకిక వైదిక వాఙ్మయములకు సంకేతముగా నిల్చిన సరస్వతీ చతుర్ముఖులు దంపతులైనారు. వారిరువురికి వాహనమైన హంసయును సంకేత పరమైనదే.

పాణిని వ్యాకరణమున ప్రత్యాహార విధానము కలదు. దాని ననుసరించి మాహేశ్వర సూత్రములందు మొదటిదైన "అ ఇ ఉ ణ్" అను సూత్రములోని "అ" "ఐ ఔ చ్" అను సూత్రములోని చివరి "చ్" కలిపి "అచ్" అను ప్రత్యాహారము. ఉచ్చరించ స్వరములన్నియు అని అర్థమగును. అట్లే "హయవరట్" సూత్రములోని "హ" "హల్" సూత్రములోని "ల్" రెంటిని కలిపి ఉచ్చరించిన "హల్" అను ప్రత్యాహార మేర్పడును. దీని వలన మధ్యనున్న హల్లులన్ని గణించినట్లగును. వేదమున ఒకచోట "గౌరా" అను పదము 'గౌతమదారా' అనువిషయమునుసూచించు చున్నది. అట్లే మాతృకాపాఠములోని "హ" తో ఆరంభించి హ, క్ష, అయిన తర్వాత అ, ఆ, మొదలైన అక్షరముల చదువుచురాగా చివరి అక్షరం "స" అగును. ఈ రెంటిని కలపిన "హస" ఉచ్చారణ సౌకర్యమునకై అనుస్వారము చేర్చ "హంస" అను పదమేర్పడును. పై ప్రత్యాహార పద్ధతి ననుసరించి ఈ "హంస" పదము మాతృకాపాఠములోని అన్ని వర్ణము లను చెప్పుచున్నది. వైదిక లౌకిక వాఙ్మయమున కంతటికిని ఈ వర్ణముతో మూలము అందుకే సరస్వతీ బ్రహ్మలు హంసవాహనులు. ఇందుకు ప్రమాణము.

"నిరంతరమజపా హంస ఇత్యేవ మాతృకా
పంచాశద్వర్ణ విగ్రహేణాకారాది క్షకారాన్తేన
వ్యాప్తాని భువనాని శాస్త్రాణి ఛందాంసీత్యేవం
భగవతీ సర్వం వ్యాప్నోత్యేవ"

అని త్రిపురాతాపిన్యుపనిషత్

"సర్వదేహస్య మధ్యస్థో హంస ఏవ మహేశ్వరః
పృథివ్యాది శివాన్తం తు అకారాద్యాశ్చ వర్ణకాః
కూటాన్తా హంస ఏవ స్యాత్ మాతృకేతి వ్యవస్థితాః
మాతృకారహితం మంత్రం ఆదిశ్యేతేన కుత్రచిత్"

అని బ్రహ్మవిద్యోపనిషత్

"హంస హంసేత్యముం మంత్రం జీవో జపతి సర్వదా." అని కూడ ఒక కారిక కలదు. ఈ రీతి చూచిన హంస పదము సర్వ వాఙ్మయమునకు ప్రతీక. కావుననే సరస్వతీ చతుర్ముఖులు హంసవాహను లయిరి.

ఆర్ష సంప్రదాయమున గాయత్ర్యుపాసనకు విశిష్ట స్థానముకలదు. సంధ్యావందనమున ముఖ్యభాగము గాయత్రీ మంత్ర జపము. రెండవది సూర్యోపస్థానము. గాయత్రి మంత్రార్థము విచారించిన సూర్యతేజస్సును మనలోనికి ఆవాహన చేసుకొనుటయే ప్రధానమని తెలియు చున్నది.

"యో దేవస్సవితాస్మాకం ధియో ధర్మాది గోచరాః
ప్రేరయేత్తస్యయద్భర్గ స్తద్వరేణ్య ముపాస్మహే"

సూర్యోపస్థానముకూడ ఇదే విషయమును తెలియజేయుచున్నది. అఖిలమును భాసింపచేయు ఆదిత్యగతమైన తేజస్సు మనదేహముపై ప్రసరించిన కలుగు ఫలితములను ఛాందోగ్యోపనిషత్తు ఇట్లు చెప్పియున్నది భుజింపబడిన తేజస్సు జీర్ణమై మూడు విధములగుచున్నది. స్థూలాంశము ఎముక, మధ్యాంశము మజ్జ, సూక్ష్మాంశము వాక్కు అగుచున్నది. అందువలన వాక్శుద్ధి కొరకు గాయత్ర్యనుష్ఠానము, సూర్యోపస్థానము చేయవలెను. సూర్యతేజస్సునుండి అస్థివృద్ధి జరుగునను విషయము వైజ్ఞానికులు పరిశోధనచేసి ఈనాడు కనుగొనిరి. కాని ఈ విషయమును ఆర్యఋషులు ఆనాడే మనకు తెలిపి దానితో వాక్శుద్ధికి సంబంధించిన మరొక విషయమునుకూడ అందించిరి.

వాక్కుయొక్క విరాడ్రూపమే సమస్త వైదిక లౌకిక వాఙ్మయము. వాక్కే గాయత్రి. "వాగ్వై గాయత్రీ" అని శ్రుతి.

(సశేషము)

( 18వ పేజీ తరువాయి)

యోఽన్తస్సుఖోఽన్తరారామః తథాఽన్తర్జ్యోతి రేవ యః ।
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి ॥

ఆత్మలోనే ఆనందిస్తూ, ఆత్మలోనే క్రీడిస్తూ, ఆత్మలోనే ప్రకాశిస్తూ వుండే యోగి బ్రహ్మస్వరూపుడై బ్రహ్మానందం పొందుతాడు.

లభన్తే బ్రహ్మనిర్వాణం ఋషయః క్షీణ కల్మషాః ।
ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః ॥

సంశయాలను తొలగించుకుని, మనోనిగ్రహంతో సకల ప్రాణులకూ మేలుచేయడంలో ఆసక్తి కలిగిన ఋషులు పాపాలన్నిటినీ పోగొట్టుకుని బ్రహ్మ సాక్షాత్కారం పొందుతారు.

కామక్రోధ వియుక్తానాం యతీనాం యతచేతసామ్ ।
అభితో బ్రహ్మ నిర్వాణం వర్తతే విదితాత్మనామ్ ॥

కామక్రోధాలను విడిచిపెట్టి, మనస్సును జయించి, ఆత్మజ్ఞాన సంపన్నులైన సన్యాసులకు సర్వత్రా మోక్షం కలుగుతుంది.

స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాన్ చక్షుశ్చైవాన్తరే భ్రువోః ।
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తర చారిణౌ ॥

యతేంద్రియ మనోబుద్ధిః మునిర్మోక్షపరాయణః ।
విగతేచ్ఛాభయక్రోధో యః సదా ముక్త ఏవ సః ॥

బాహ్య విషయాలమీద ఆలోచనలు లేకుండా, దృష్టిని కనుబొమలమధ్య నిలిపి, ముక్కులోపలసంచరించే ప్రాణాపాన వాయువులను సమానం చేసి, ఇంద్రియాలనూ, మనస్సునూ బుద్ధినీ వశపరచుకుని, మోక్షమే పరమ లక్ష్యంగా ఆశ, క్రోధం, భయంవిడిచిపెట్టిన ముని నిరంతరమూ ముక్తుడై వుంటాడు.

భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరమ్ ।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తిమృచ్ఛతి॥

యజ్ఞాలకూ, తపస్సులకూ భోక్తననీ, సర్వలోకాలకూ ప్రభువుననీ, సమస్త ప్రాణులకూ మిత్రుడనీ నన్ను తెలుసుకున్నవాడు పరమశాంతి పొందుతాడు.

ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం శ్రీకృష్ణార్జున సంవాదం అయిన శ్రీ మద్భగవద్గీతలోని కర్మసన్యాస యోగం అనే ఐదవ అధ్యాయం సమాప్తం. •

## సప్తగిరి

### చిత్తూరు జిల్లా

**శ్రీ జి. ఆర్. పాండురంగయ్యశెట్టి**
**S/o శ్రీ జి. రామయ్యశెట్టి**
**విజయరంగ న్యూస్ ఏజెన్సీ**
**కీల్‌పట్ల (పోస్టు) - 517 408**

**శ్రీ కె. సుబ్బారావు**
**న్యూస్ ఏజెంట్ బైరెడ్డిపల్లె-517 418**

**శ్రీ బి. కె. శ్రీనివాసగుప్త**
**లాంగ్‌బజార్ వి. కోట (పోస్టు)**

**శ్రీ వి. ఎస్. కృష్ణమూర్తి**
**C/o వి. శ్రీ కాంతయ్య న్యూస్ ఏజెంట్**
**నేతాజీరోడ్ కుప్పం-517 425**

**శ్రీమతి ఎన్. డి. సులోచన**
**మేనేజింగ్ పార్టనర్ ప్రతిభాప్రియదర్శిని**
**రైల్వేస్టేషన్ బుక్‌స్టాల్ తిరుపతి-517 501**

[ 20వ పేజీ తరువాయి ]

మనమందర మట్టి ఆసుర వివాహముల కలవాటుపడి సిగ్గు బిడియములు విడిచి పనికిమాలిన సంతానమును నీతిరహితమైన సంతానమును కని మన గృహజీవితమును కలుషితము చేయుటయేకాక దేశమునుకూడ కలుషితముచేసి దేశద్రోహ మొనరించుచున్నాము.

యో మనుష్యః స్వకం పుత్రం
విక్రీయ ధనమిచ్ఛతి,
కన్యాం వా జీవితార్థాయ
యః శుల్కేన ప్రయచ్ఛతి.
సప్తావరే మహాఘోరే
నిరయే కాలసాహ్వయే,
స్వేదం మూత్రం పురీషం చ
తస్మిన్ మూఢ స్సమశ్నుతే.

కట్నము నిమిత్తమై కొడుకును విక్రయించువాడు, శుల్కము నిమిత్తమై పుత్రికను విక్రయించువాడు, కుంభీపాకాది నరకము లేదంటి కంటెను నికృష్టమయిన కాలసూత్రమను నరకమునపడి తన మలమూత్రములను తానే భక్షించును.

అన్యాప్యథ న విక్రేయో
మనుష్యః కిం పునః ప్రజాః,
అధర్మమూలైర్హి ధనై
స్తైర్న ధర్మోఽథ కశ్చన.

శాస్త్ర దృష్టితో చూచిన, జీవింపదలచిన నిజమునకు జంతువునుకూడ విక్రయింపరాదు. ఇక బిడ్డల నమ్ముకొనుట యెట్లుచితమగును? అధర్మ మూలకమైన ధనముతో చేసిన ధర్మము విఫలమగునే కాని సఫలము కాజాలదు.

ఇహమునకును పరమునకును పనికిరాని కన్యాశుల్కమును వరకట్నమును పట్టుకొని వ్రేలాడుచున్న మనకు హిందువులమనియు భగవద్భక్తులమనియు దేశభక్తులమనియు చెప్పుకొను అర్హత ఎంత?



[ 13 వ పేజీ తరువాయి]

శేషశైలశిరోమణియును చక్రపాణియు నగు, నీ స్వామి, ఇతర సురవరులకు సుకరములుగాని వరనికరములను తన భక్తబృందముల కిచ్చుటలో తన నేర్పరి తనమును చూపుచుండును. వినుము వినుము.

మూకాపద్ధం కమపి బధిరా శ్లోకమాకర్ణయంతి
శ్రద్ధాహస్తం విలిఖతికుణి శ్లాఘయా వీక్షతేఽంధః,
అప్యారోహత్యహహ! సహసా పంగురప్యద్రిశృంగం
పాంద్రాలస్యాశిశుభరణలో మందమాయాతి వంధ్యా.

శ్రీ స్వామివారి యనుగ్రహము వలన, మూగవాడు చదువుచున్న శ్లోకమును చెవిటి వారు వినుచున్నారు. మొండిచేతులవాడా శ్లోకమును వ్రాయుచున్నాడు. అవ్రాయుచున్న వానిని గ్రుడ్డివాడు "ఆశ్చర్యమాశ్చర్యము" బాగుగా వ్రాయుచున్నావని కొనియాడుచు చూచుచున్నాడు. శ్రీవారి దయ వలన కుంటివాడు కూడ మెట్లమీదుగా వేంకటాచలము నధిరోహింపగలుగుచున్నాడు. శ్రీవారి యపార కృపారసము వలన గొడ్రాలుకూడ ముద్దుబిడ్డను, ఎత్తుకొని మురిపెమును జూపుచు, మెల్ల మెల్లగా నడుచుచున్నది. చూచావా, ఆ మహామహుని గురుతర వరనికర వితరణ చాతుర్యాన్ని.

సర్వోత్తుంగ శ్ఫురితశిఖరగుహాస్వాద్వబిభ్యాతసీతః
భాస్వద్వంశోపచయజనకస్వామఙస్ఫూర్తికో యః,
పిశంసూపం కిరిత్యంటియం గాపిరి గాపిగం
శిగ్రైరే కలము గరిశిపర్కరి పర్పతి.

ఈ శేషశైలముమీద సంపులుహాసి, కోతులెందుకు, చెట్లమీద కొమ్మనుండి మఱి యొక కొమ్మమీదకు దుముకుచు, గంతులు వేయుచు, కిచకిచ లాడుచున్నవో తెలిసి కొన్నావా? అన్నిటికంటె ఎత్తైన శేషశైలమే శ్రీరాముడని వాటి యభిప్రాయము. శ్రీరాముడు గుహుడను నిషాదాధిపతి యందు ప్రేమజూపినాడు. ఈ కొండలో అనేక గుహలు గలవు. పెద్దలందఱు శ్రీరాముని భార్యయగు సీతమ్మను పొగడినారు. ఈ కొండమీద సీతమును శబ్దముతో పిలువబడు లతలెన్నియో! శ్రీరాముడు సూర్య వంశమునకు పేరు ప్రతిష్ఠలను పెంపొందించెను. ఈ శైలము పెరుగుచున్న వెదుళ్ళకు నెలవు. శ్రీరాముడు భరత లక్ష్మణ శత్రుఘ్నులను తమ్ములయొక్క ప్రకాశముతో నిండినవాడు. ఈ శైలము చరియలవలన గలిగిన ప్రకాశముతో నిండినది. ఇట్టి విశేషణజాత చాతుర్యముతో-శ్లేషభిత్తికాభేదాధ్యవసాయముతో ఈ కొండను, జానకీవల్లభునిగా (శ్రీరామునిగా) భావించుచున్న కోతిమూక, తమయునికికి నెలవుగా చేసికొన్నదై శరణు వేడుచున్నదియై ఆవరించి యున్నది.

ప్రకాశబహూపాపవత్యపి పటికమాళ్యత్వరః
ప్రకామమవలోక్యతే పరమమన్యదత్యద్భుతమ్,
పిహోకపి పయోధర భ్రమచంచలా విద్యుతం
పయోధరమహస్స్ఫూరతి దీప్తి నిత్యం దిశే.

స్ఫుటమైన, అనేక పాదములుగల పాములవలె, అనేక ప్రత్యంత పర్వములతో నిండిన యీ కొండమీద నావే ఒక యత్యద్భుతమైన విషయము కనుగొనబడుచున్నది. లోకములో మేఘమునందు మెఱుపుండునుగాని, అది స్థిరముగానుండక చంచలమై యుండును. ఈ కొండమీద ఒక నీలమేఘమున్నది. ఈ నీలమేఘమునందు చాంచల్యములేని స్థిరమైన మెఱుపొకటిగలదు. ఆ మెఱుపునందు మఱియొక మేఘము = (పయోధరము = స్తనము) గలదు. ఈ విచిత్ర విషయమును గమనించినావా?

కొండలమీద మేఘములుండుట సామాన్యమైన విషయము. మేఘములో మెఱుపుండుట ఎల్లరకు తెల్లమైన విషయమే. ఆ మెఱుపు చంచలమైయుండును. ఈ కొండమీదనున్న శ్రీస్వామివారిని నీలమేఘముగాను శ్రీవారియురమున నున్న లక్ష్మీ అమ్మవారిని చాంచల్యములేని మెఱుపుగాను అమ్మవారి స్తన మండలమును-మేఘముగాను కవీశ్వరుడా రోపించినట్లు పాఠకులు భావింపవలెను.

మిత్రులిద్దఱు - శేషశైలమును - విడిచి మఱియొక చోటికి విమానములో వెడలి పోయిరి. *

(16వ పేజీ తరువాయి)

ఓ దేవి! నీవు నా యందు ప్రసన్నము కాకున్నచో నాకింక వేరేగతి ఏ మున్నది. నా ఈ మాటలన్నీ వ్యర్థము. నీకు విశ్వాసము కలిగించుటకు శపథపూర్వకముగా అగ్నిప్రవేశము చేయనా? లేక కాలకూట విషమును త్రాగనా? లేక సముద్రమునందు దూకనా? తులారోహణము చేయనా? (చెప్పు దేవీ! ఏమి చేస్తే నీ మనస్సుకు విశ్వాసము కలుగుతుంది).

(పాఠాంతరము-అధికపాఠము)

భగవానువాచ:

జ్వలన మధివసేయం
భోగిభోగం స్పృశేయం
విషమపి చ పిబేయం
వారిధౌ వా పతేయమ్।
సుతను తవ విశేయం
ప్రత్యయార్థం తులాయాం
త్వదభి మతవిధేయం
మాం భజస్వాప్రమేయమ్



ఓ దేవి! చెప్పుము నీ మనస్సుకు విశ్వాసము కలుగుటకై అగ్నిలో ప్రవేశించనా? సర్పమును తాకనా? విషమును త్రాగనా? సముద్రములో మునగనా? లేక తులా ప్రవేశం చేయనా? నా ప్రియసఖీ! నీ ఆజ్ఞ శిరసా వహిస్తాను. కృపతో ప్రసన్నురాలివి కమ్ము.

దేవ్యువాచ:

రోషస్తవైష దహనో వదనాత్ ప్రసూతః।
స్తన్యంబభూవగరలం శయనంఫణీన్ద్రః॥
అబ్ధిర్నికేతన మభూత్ ప్రథమావతారే।
కుక్షౌద్విపస్తభువనాని కథం తులా తే॥

హే భగవాన్, నీ యీ ప్రతిజ్ఞ మాటలన్నీ వ్యర్థము. ఎందుచేతనగా "ముఖాదింద్రశ్చాగ్నిశ్చ" ఇత్యాది శ్రుతులను బట్టి అగ్ని నీ ముఖం నుండే ప్రకాశిస్తున్నాడు. (ఇక అగ్ని నిన్నేమి చేయగలడు). విషమనగా పూతనయొక్క స్తనమునుండి లిప్తకాలములో విషమును పీల్చివేశావు, పైగా నీవు పయనించు తల్పము ఆదిశేషుడు. (కాలకూట విషము మాత్రము నిన్నేమిచేయగలదు) నీ మొదటి మత్స్యావతారము (అలాగే కూర్మావతారముతో) సాగరమునే గృహముగా మార్చుకొన్నావు. ఇంక నీ కడుపులో 14 లోకాలుఉన్నాయి. అందుచేత తులా రోహణముచేసినా నీకు నిశ్చయంగా విజయమే కలుగుతుంది. కాబట్టి ఇటువంటి శపథములవల్ల (పాఠాంతర-అధికపాఠము) ఏమిలాభము.

దేవ్యువాచ:

కల్పాంతవారి శయనస్య జలేన కిం తే।
శయ్యాత వోరగపతిః గరుడధ్వజస్య॥
సంక్రందనాది మరుతస్తవ సేవకాస్తే।
కః కృష్ణవర్త్మని కరిష్యతి మానశుద్ధిమ్॥

ప్రళయ కాలమునందు జలముపై శయనించావు జలము నిన్నేమి చేయగలదు. నీవు గరుడధ్వజుడవు. ఆదిశేషుడు నీ శయన తల్పము. (కాలకూట విషము మాత్రం (నిన్నేమిచెయగలదు). ఇంద్రాది దేవతలు నీ సేవకులు, అందువల్ల నీ అగ్ని పరీక్షవల్ల నమ్మకము కలుగునా?

భగవానువాచ:

భూత్వారఘూద్వహ
కులేభువనేశ్వరోఽహం
త్వామేవ దేవి! జనకేంద్ర
సుతామవాప్య।
ప్రత్యన్తరే వృత్తి రశేషలోకే
ప్రఖ్యాతశుద్ధ చరితః ఖలు తే వియోగే॥

ఓ దేవి! నేను రఘుకులము నందు అవతరించాను. నీవు జనకరాజ సుతగా జన్మించి నాపత్నివైనావు. అప్పుడు నేను శుద్ధ చరిత్రునిగా ఏకపత్నీ వ్రతుడనుగా లోకప్రసిద్ధి చెందినాను. నీ వియోగం సంభవించినా వేరొక స్త్రీని తలంచలేదు (అనగా అటువంటి శుద్ధమైన చరిత్రగలిగిన నాపై అనుమానము పడుట తగునా? అని అర్థము)

దేవ్యువాచ:

కృత్వాహి జన్మ వసుదేవకులే నిగూఢం
గోపాలభూపతనయత్వమవాప్య
భూయః
జానామి షోడశ సహస్రవరాంగనాభిః
ఆలింగితస్య తవ కంసరిపో
శ్చరిత్రమ్॥

ఆహా! ప్రభో: మీరు గోపాలకృష్ణునిగా అవతరించి కంసాది శత్రువులను సంహరించిన చరిత్రయును నాకు తెలుసు. అప్పుడు మీరు యదువంశములో వసుదేవుని పుత్రునిగా అవతరించారు. జన్మస్థలమును విడిచి గోకులములో నందుని పుత్రునిగా మారి సహస్రగోప కన్యలను ఆలింగనము చేసుకొన్నారు. మరియు నరకాసురునిచే అపహరింపబడిన 16,000 మంది వనితలతో ఉపభోగము అనుభవించినారు. (అందుచేత మీరు ఇవి చేయరని నమ్మకము ఏమున్నది)

భగవానువాచ:

సంభూత దివ్యమణినా చ సహ త్వయా
తే రంభోరు।

పీనకుచ పంథయుగేన పక్ష్మాః।
గంభీరభావమవహన్ శపథం కరోమి
పంథావయాతు పరిరంభణ
పాత్రమేనమ్ ॥

ఓదేవీ, నీతోపాటు క్షీరసాగరంలో ఉద్భ వించిన ఈ కౌస్తుభమణిమీద ప్రమాణము చేస్తున్నాను. అంతేగాక నాకు అత్యంత వ్యామోహము కలిగించే నీ శరీరముమీద (నీ మీద) ప్రమాణము చేస్తున్నాను. నీ సఖులందరిమీద ప్రమాణము చేస్తున్నాను. ఇప్పటికైనా నాయందు ప్రసన్నురాలివై స్వాగత పూర్వకంగా నన్ను ఆలింగనము చేసుకో-

దేవ్యువాచ :

విలాసవిపినాంతరే విగలితం సఖి
హస్తతో
గృహీతమతులం త్వయా దయిత కన్దు
కమ్ మామకం
ప్రదాయపునరేహి మే మణిగృహం
ప్రవిష్టే స్థితిం
కరోతు సుచరిత్రతా త్వయి దయా
హి మాం బాధతే ॥

ఓ నాథా! నేను క్రీడోద్యానవనంలో సఖులతో కూడి ఆడుకొనుచుండగా నా సఖిచేతి నుండి పూలచెండు క్రిందపడినది. అది నీకు దక్కినది. ఆ పూలచెండును తీసుకొని వచ్చి నాకు ఇచ్చి మణిమయ అంతఃపురంలో ప్రవేశించి సచ్చరిత్రులుగా మెలగండి. నేనేమి చేయగలను. మిమ్ములను వెడలగొట్టవలయుననేయున్నది. కాని దయాగుణమువల్ల ఆ పని చేయలేక పోవుచున్నాను.

భగవానువాచ :

అలంక్రియాం యాతు సుకందు
కోఒయం
కరారవిన్దే విధృతో భవత్యాః।
అయం జనోఒవ్యమ్బుధిరాజకన్యే
విలాసవీక్షోత్పలదామభిస్తే ॥

ఓ సముద్రరాజపుత్రీ! ఇదిగో నీపూలచెండు. నా చేతినుండి ఈ చెండును తీసుకొని, నీ చల్లని నేత్రవములతో నన్ను కటాక్షించి, అనుగ్రహించు (అని భగవానుడు ఒక పూలచెండును లక్ష్మికి ఇచ్చెను).

దేవ్యువాచ :

హా హస్త! హస్త! మణికందుక
మస్మదీయం
రంతుం ప్రవాయ కితవః కుటిలాల
కానామ్।
అన్యం మ మాత్రమచ్యుతి సంప్రతి
నిస్త్రపోఒసా
కౌటిల్యమేవ భజతే కతినః
కృతోఒపి ॥

లక్ష్మీదేవి తన సఖుల నుద్దేశించి, ఓ సఖులారా! చూడండి! ఈ ధూర్తుడు నా మణిమయపు పూలచెండుతో రాత్రి వేరొక స్త్రీతో క్రీడించి, ఇపుడు సిగ్గు విడచి నాకు వేరొక పూలచెండును ఇస్తున్నాడు. ధూర్తులు ఎంతటి ఆపత్కర పరిస్థితివచ్చినా తమ కుటిల స్వభావమును విడువరు కదా!

దేవ్యువాచ :

సఖ్యశ్శృణుత మమ గిరా
కరుణాం విహాయ
స్వైరం ప్రహత్య పరి
వార జనం చ తస్య
గోహాదితః వరభసం
చ నిరాపయధ్వం
ద్వారం కపాట పిహితం
కురుత ప్రగల్భాః ॥

ఓ సఖులారా! నేను ఆజ్ఞాపిస్తున్నాను. యీ ధూర్తుని ఇతని అనుచరులను ఏ మాత్రం దయచూపక కొట్టి యీ మందిరం నుండి బయటకు వెడలగొట్టి తలుపుల వేయండి.

భగవానువాచ :

మధ్యస్థ ఏవ కుసుమద్యుతి!
తేషు యోగిష్వజ్వాలయే
ప్రణయ రోషవతీమసౌ త్వామ్।
శ్రుత్వా త్వదీయ పదయోః ప్రణతిం
విధాయ కర్తుం
సమాం భగవతి స్వయ మాగతోఒత్ర ॥

ఓ కుసుమకాంతీ! దివ్యసూరి గోష్ఠిలో ప్రధానులయిన శఠగోపసూరి నీ ప్రణయ రోషవృత్తాంతము విని నీ పాదలముమీద సాష్టాంగప్రణామముచేయుటకు స్వయంగా వచ్చియున్నారు. ప్రసన్నురాలివికమ్ము.

భగవానువాచ :

త్యజ హృది ఛల
మావమేనం నిరీక్ష్య-

# సప్తగిరి విక్రేతలు

**అనంతపురం జిల్లా**

శ్రీ కె. ఆర్. భాస్కరరెడ్డి
22-110 మెయిన్‌రోడ్, గుంతకల్లు-515 803

శ్రీ పి. ఆర్. రామచంద్రారావు
అమర్ న్యూస్ ఏజెన్సీ
అమాదగుర-515 558

శ్రీ ఎం. నాగరాజ్
న్యూస్ ఏజెంట్ వాడియంపేట-515 731
గార్లదిన్నె

శ్రీ కె. నారాయణమూర్తి
జర్నలిస్టు పామిడి-515 775

శ్రీ పి. వి. జగన్నాథగుప్త
జనరల్‌మర్చంట్ అగలి-515 311

శ్రీ వి. చంద్రశేఖర్
C/o కె. జాతప్ప
సోడాషాపు న్యూ బస్టాండ్
తాడిపత్రి-515 411

శ్రీ గురికుల నారాయణ
ఆంధ్రజ్యోతి ఏజెంట్
14వ, వార్డు, ఉరవకొండ-పోస్టు

శ్రీ కె. ఎస్. కుమారస్వామి
ఏ. పి. ఎస్. ఆర్. టి. సి. బుక్‌స్టాల్
పెనుకొండ-515 110

శ్రీ మరారిజాధవ్ ప్రకాశరావు
C/o ఎం. కె. నాగోజీరావ్
దుర్గమ్మ టెంపుల్ స్ట్రీట్
ధర్మవరం (పోస్టు)

ప్రాణిపతన పరోఽస్మి
ప్రాప్తసాంద్రాపరాధః।
సుతను జనకపుత్రి।
కోమలాభ్యాం కరాభ్యాం-
అనితర శరణేఽస్మి
న్నంగపాలిం విధేహి॥

ఓ జనకరాజపుత్రీ! యీ మహాత్ముని చూసి నీ కోపం ఉపసంహరించుకో, అప రాధిని నేను. నేను కూడ నీకు ప్రణామము చేస్తున్నాను. నీ యొక్క అనన్యశరణాగతి ద్వారా కృపచూపితివేని నీ సుకోమలమైన హస్తములతో నన్ను ఆలింగనముచేసుకో.

దేవ్యువాచ:

ఆద్యేమ భక్తకవిమ
ప్రథమశ్చ సోఽయమ్
అద్యాగతః కవివరో
మమ సన్నిధానమ్।
అస్మిన్ప్రసాద కలనయా
శమితా రుషా మే
మత్పార్శ్వభాగమపలం
బయ మాధవేహి॥

ఓ మాధవా! దివ్యసూరిగోష్ఠిలో ప్రధాను అయిన శఠగోపసూరి నా వద్దకు వచ్చి సాష్టాంగప్రణామ పూర్వకముగా నిన్ను అనుగ్రహించమని ప్రార్థించినారు. అందు చేత నా కోపం పోయినది. ఇపుడు మీరు నా వద్దకు వచ్చి మీ మాధవ (లక్ష్మీపతి) అనే పేరును సార్థకము చేసుకోండి.

భగవానువాచ:

నామ్నాం సహస్రమితి మే
నళినాక్షి లోకే
శంసన్తి సాత్త్వికజనాః
పునర న్యదేతత్
లక్ష్మీపదామ్బుజయుగాం
చితమ స్తకేతి
సంకీర్త్యతాం త్రిజగత్యపి
డిండిమో మే॥

ఓ కమలాక్షీ! ఈ లోకంలో గొప్ప గొప్ప మహాత్ములు,సాత్త్వికజనులు,అందరూ కూడ నన్ను సహస్రనామాలతో పిలుస్తారు. కాని అవి నాకు సంతోషమును కలిగించలేక పోతున్నవి. నాకు ప్రియమైనది ఏది అనగా "లక్ష్మీచరణములవద్ద అలంకరించు కొన్న శిరస్సు గలవాడ"నని పేరు గల్గి యుండుట. (అనగా నా శిరస్సును నీ రెండు పాదారవిందములపై వంచి ప్రణ మిల్లుతున్నాను. ఈ చరిత్ర వల్ల నన్ను జనులు లక్ష్మీవిధేయుడుగా గుర్తించితే నాకు ప్రీతిని కలిగిస్తుంది) అది భేరీమృదంగ వాద్యఘోష పురస్సరంగా మూడులోకాల యందును ప్రసిద్ధి చెందియుండును.

దేవ్యువాచ:

రోషం విహాయ జగతాం
జననీ కథంచిత్
ప్రాణేశ్వరం ప్రణత మౌళి
మతీవహర్షాత్।
ఉత్థాప్య బాహులతయా
పరిరభ్య గాఢం।

ఆనన్ద సాగర నిమ
గ్నముముం చకార॥

ఈ విధంగా జగజ్జనని అయిన లక్ష్మీ దేవి తన వద్దకు వచ్చి ప్రణామము చేయు చున్న ప్రాణనాథుని విషయమును తెలుసు కొని, రోషమును వదలి తన సుకోమల మయిన బాహువులతో ఆయనను లేపి గాఢంగా ఆలింగనము చేసుకొనెను. వారి రువురు ఆనందసాగరమున మునిగిరి.

అంగీకృత్య ముదం తథా
విటకథాభిర్భో భృశం కాన్తయా
సార్థం మంగళమజ్జనార్థ
మవిశత్పుణ్యాపగాం సత్వరః
సర్వాభీష్ట ఫలప్రదాన
నిరతః సేవాగతానాం ముహుః
పాయాద్వయో భృగుణార్చి
తానస పదః శ్రీవిద్రుమాభః ప్రభుః

ఈ విధముగా భగవానుడు లక్ష్మీదేవి ఒకరినొకరు కలుసుకొని అత్యంత ఆనంద మనుభవించిన అనంతరం అవభృథమహో త్సవమను పేరుతో పుణ్యనదీ ప్రాంతము నకు వెడలిరి. ఆ సమయమున దివ్యమైన శరీరకాంతి గలిగినవాడు, భృగుమహర్షి సేవలందు కొనుచున్న దివ్యమైన పాదార విందములు కలవాడు అయిన భగవానుడు తన దర్శనార్థము వచ్చిన భక్తజనులందరి కోర్కెలు తీర్చు సకల పురుషార్థములను అనుగ్రహించి, (యీ దివ్య చరిత్ర విన్న వారికి) మన కందరకును కల్యాణ ప్రదము కలుగచేయునుగాక. *

---

(15 వ పేజి తరువాయి)

ప్రత్యేకమైన భావమును ప్రధానముగా ఆశ్రయించి యుండును. వీరి సాముదాయక కృతులలో నవగ్రహ కృతులు, (నవగ్రహ ములను స్తుతించుచూ రచించినవి. ఇవి సూళాదిసప్త తాళములలో రచింపబడినవి.) పంచలింగ స్థలకృతులు, నవావరణ కృతుల (కమలాంబానవావర్ణ పూజాక్రమముగా తొమ్మిది కృతులు) ను రచించిరి. దీక్షితుల సాముదాయకకృతులలో నవావరణకృతుల ముఖ్యమైనవి. ఇందు ఉదాత్తమైన భావం నిండియుండును. ఈ కృతులు వీరి పాండి త్యమునకును, సంగీతములో వారికిగల వైదుష్యమునకును ప్రబల తార్కాణములు. రూపవరమున వెలసిన అభయాంబమీద కూడా కృతులను రచించిరి. వీరు వెంకట మఖివంశస్థులగుటచే వారి మేళరాగ పద్ధతి ననుసరించి కృతులను రచించిరి.

దీక్షితులు దశగమక సిద్ధాంతమునకు అనుకూలమను విషయము వారి కృతి "మీనాక్షి మే ముదం దేహి" అను కృతి యందు చరణమున "దశగమకప్రియ" అను ప్రయోగమును బట్టి వ్యక్తమగుచున్నది. వీరి రచనలలో సమష్టి చరణము ప్రధానం. సమష్టి చరణమునకు ప్రాస, యతిమధ్యమ కాలసాహిత్యముగలదు.

ఆరభిరాగములో "శ్రీసరస్వతి నమోస్తుతే" నాటరాగములో "స్వామినాథ పరిపాలయాశుమాం"

అను కృతులు సమష్టి చరణమునకు కొన్ని కృతులకే చక్కని ఉదాహరణ. వీరి రచనలు నారికేళపాకములో నుండును.

దీక్షితులవారికి హిందూస్థాన సంగీతంలో కూడా పాండిత్యము గలదను విషయము ద్విజావంతి, మున్నగు రాగములలో వీరి రచనల ద్వారా స్పష్టమగును.

కర్ణాటక సంగీత సంప్రదాయాణుగుణ ముగా సంస్కృతములోను, పెక్కు భాషల యందుకూడా కృతులను రచించిన ముద్దు స్వామి దీక్షితులవారికి సంగీత ప్రపంచ మున ప్రత్యేక స్థానము గలదు. వీరు చిర స్మరణీయులు. దీక్షితులు సంగీతపరమైన ప్రామాణికతతోబాటు భాషాపరమైన పాండి త్యమునుకూడా సాధించిరి. కనుకనే నాద ప్రపంచములో సప్తస్వరములున్నంత కాలము దీక్షితుల కృతులు సంగీత ప్రియు లను మురిపింప చేయగలవు.

( 11వ పేజీ తరువాయి )

మానసం భౌతిక విషయాలంపటమే పొతుంది కనుక అట్టి మానసమే మథన పెడుతుందని మథన పెట్టేది కనుకనే 'మనస్సు' అనే సార్థక నామం కలిగించనని భావం. కనుకనే అర్జునుడు శ్రీ కృష్ణునితో బావా! చంచలమైన నా మనస్సు నన్ను గట్టిగా మథన పెడుతూ నా స్వాధీనంలో లేకున్నది. దీనిని నిగ్రహించడం, గుప్పెట్లో వాయువును బంధించడం వలె దుస్సాధ్యంగా ఉంది. (6-34) అర్జునుడంతటి వీరుడూకూడా ఇలా అనడానికి కారణం ఉంది. అతడు ఉభయ సేనలను తేరి పార చూచి తన మనస్సును అచ్చట లగ్నం చేయడంతో అహంకార మమకారాలు (ఆసేనలవిషయంలో) ఆతడిని ఆవహించాయి. వీనితో శోకమోహాలు ఆవేశించాయి. దానితో యుద్ధమే చేయనని క్షత్రియధర్మాన్ని విడిచాడు. లోకంలో స్వధర్మ భ్రష్టుడైన మానవుణ్ణి అనేక అనర్థాలు చుట్టుముట్టి అర్జునుడివలె శోకవివశుణ్ణి చేస్తాయి. ఇవి మన అనుభవంలోనివే. ఇన్ని అనర్థాలకు మూలం, శోకదాయకమైన సైన్యాన్ని చూస్తున్న అర్జునుని చక్షురింద్రియంలో అతడి మనస్సు కలియడమే. ఇక్లే ప్రవరాఖ్యుని అందచందాలకు అధీనమైన (దేవకాంత) వరూధిని చక్షురింద్రియంతో ఆమె మనస్సు లగ్నమై ఆకను వేమరు, ఆ దేవకాంతను సాధారణ మానవ కాంతగా మార్చేసి ఆమెను ఇడుముల పాలుచేసింది. ఇక ప్రవరాఖ్యుని నేత్రం ఆమె అందానికి వశం కాకపోవడం అనగా అతడి మనస్సు అతడి నేత్రేంద్రియంలో లగ్నం కాకపోవడంచేత తనను తానే కాపాడుకొన గలిగాడు. మీదిసన్నివేశాలన్నీ ఇంద్రియాలతో కలసిన మనస్సుయొక్క దుష్ట ప్రభావాన్ని ప్రకటిస్తూనే ఉన్నాయికదా!

మీకీవిధంగా ఇంద్రియాలను భౌతిక విషయాలమీదకు పోనీక పరమార్థ విషయాలతో లగ్నం చేసిననాడు అట్టి మానవులకు పరమేశ్వరానుగ్రహం లభిస్తుందని అట్టివాడు సంసారంలో ఉన్నా యోగివంటివాడే అని వైరాగని శ్రీ త్యాగరాజస్వామి—

"మనసు స్వాధీనమైన మనుజునికి మరి మంత్ర తంత్రము లేలా?"

"సంసారులైతే నేమయ్యా శిఖిపింఛావతంసు డెదుర నుండగ" వంటి తన కీర్తనలలో చక్కగా చాటాడు.

మీదిచర్చను బట్టి వివేకియైన మానవుడు తన ఇంద్రియాలను భౌతికవిషయలంపటాలు కానీయక పరమార్థ విషయచింతనతో అనాసక్త భావంతో తమలౌకికకృత్యాలు నెరవేర్చుకుంటూ, ముఖ్యంగా ఉదారభావనా భాసితమైన మహాపురుషుల ప్రవర్తనను భావిస్తూ, నిష్కామ కర్మాచరణతో పరమేశ్వరునికి ప్రీతికరముగా తన కృత్యాలను పరమేశ్వరార్పణంగా చేస్తూ జీవించిన మానవునికే ఇహపర సౌఖ్యాలు, శాంతి, నిత్యానందం చేకూరుతాయి.




## ప్రకటన రేట్లు

మామూలు పేజీలకు :

| | |
|---|---|
| పూర్తిపేజీ: | 5 0 రూ |
| అర్ధ పేజీ: | 300 రూ |
| పావు పేజీ: | 150 రూ |
| ఒక కాలమ్: | 200 రూ |

### సాంకేతిక సమాచారం

| | |
|---|---|
| పేజీవైశాల్యం; | 27.5 సెం మీ × 21.5 సెం మీ |
| ముద్రణస్థలం: | 24" × 19 సెం. మీ |
| కాలమ్‌లు: | 3 |
| స్క్రీన్ కవరు | 100 |
| లోపల: | 65 |

గమనిక :

1. ప్రకటన సమాచారం, బ్లాకులు ప్రకటన దారులే ఇవ్వాలి.
2. ఆరు నెలలకు ముందుగా ప్రకటనస్థలం కేటాయించు కొనదలచిన వారికి 10 శాతం, సంవత్సరానికి ప్రకటనస్థలం కేటాయించుకొనే వారికి 15 శాతం, పై రేట్ల ప తగ్గింపు ఇవ్వబడుతుంది.
3. ఏవిధమైన నోటీసుగాని లేదా ఏకారణంగాని తెలుపకనే ప్రకటనలను తిరస్కరించే హక్కు సంపాదకుడికి వుంటుంది.
4. కవరు పేజీలకు ప్రకటనలు స్వీకరించబడవు.

ఇతర వివరాలకు :

సంపాదకుడు.

(1[illegible] వ పేజీ తరువాయి)

8

న చక్షుషా గృహ్యతే నాపి వాచా
నాన్యైర్దేవై స్తపసా కర్మణా వా
జ్ఞానప్రసాదేన విశుద్ధ సత్త్వః
తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః.

పరమాత్మ అని చెప్పదగిన ఆ ఈశ్వరుడు కంటికి కనిపించడు. మాటకి అందడు. ఇంకే పూజలకి పురస్కారాలకి లొంగడు. తపస్సుకి యజ్ఞయాగాది కర్మలకి దర్శనం ఇవ్వడు.

కామక్రోధాదులను చంపుకుని ప్రశాంతమూ నిర్మలమూ అయిన మనస్సు కలవాడై జ్ఞానయోగముతో ధ్యానిస్తూవుంటే శుద్ధస్ఫటికంలాగునవుంటే ఆ ఈశ్వరుడు కనిపిస్తాడు.

9

ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యః
యస్మిన్ప్రాణః పంచధా సంవివేశ
ప్రాణై శ్చిత్తం సర్వమోతం ప్రజానాం
యస్మిన్ విశుద్ధే విభవత్యేష ఆత్మా.

భూతకోటిలోపల అయిదు విధాల ప్రాణమైవున్నవాడున్ను, ఆ ప్రాణాలతో చిత్తమును కూర్చి ప్రాణిచే యావత్కర్మ కాండా చేయిస్తూన్న వాడున్ను, నిర్మలమైన ఆ చిత్తమునందు ప్రకాశించేవాడున్ను అయిన ఆ ఈశ్వరుడు బొటనవ్రేలిలో వాల్గవ భాగంగా శరీరములో ఆత్మ అనే పేరుతో వుంటున్నాడు. ఆ ఈశ్వరుడు పరిశుద్ధమైన మానసిక ధ్యానదృష్టికే తెలుస్తాడు.

(వేదాలు చెప్పిన కర్మలుచేస్తూ మనస్సు నిర్మలమైతే ఆలాటి మనస్సుతో ధ్యానించే అభ్యాసం చెయ్యాలి. అది కొన్నాళ్లకి యోగం అవుతుంది. ఆలాటి యోగానికే ఈశ్వర దర్శనం అవుతుంది.)

10

యం యం లోకం మనసా సంవిభాతి
విశుద్ధ సత్త్వః కామయతే యాంశ్చ కామాన్
తం తం లోకం జాయతే తాంశ్చ కామాన్
తస్మా దాత్మజ్ఞం హ్యర్చయే ద్భూతి కామః.

స్వచ్ఛమైన సంకల్పమూ ధ్యాన యోగమూ సత్వగుణమూగల యోగి నిర్మలమైన మనసుతో కోరే లోకం వస్తుంది. కోరికలు తీరుతాయి. ఐశ్వర్యం కోరేవారు ఆత్మజ్ఞానం కలవానిని ఆరాధిస్తూవుండాలి.

(గురువును సేవిస్తేనే చదువు వస్తుంది. ఆత్మతత్త్వం తెలుసుకున్నవానిని సేవిస్తే మానవుడు చరితార్థుడవుతాడు.)

[ తృతీయ ముండకంలో ప్రథమఖండం ]

# గ్రంథసమీక్ష

## "దీనబాంధవుడు దత్తాత్రేయుడు"

[శ్రీ గురు చరిత్ర : దత్తావతారలీల
వెల రు 9/- పుటలు 178
సాయి మాస్టర్ పబ్లికేషన్స్
సంతపేట, ఒంగోలు.]

సర్వత్రా నిండియున్నదైవం అనేక రూపాలలో అనుభవంలోకి రావడం కద్దు. అవతారాల లీలలు అలాంటివి.

పరబ్రహ్మ కృతయుగంలో అత్రి అనసూయ పుత్రుడైన దత్తాత్రేయుడుగా అవతరించాడు. బ్రహ్మ విష్ణు శివాత్మకుడాయన. దత్తాత్రేయులు కలియుగంలో దీన జన రక్షణార్థం రెండు అవతారాలు ధరించాడు. శ్రీ పాదస్వామి, శ్రీ నృసింహ సరస్వతి. ఈ రెండు అవతారముల లీలలు ప్రస్తుత గ్రంథస్థ విషయం. "త్రిమూర్తు లెచటి నుండి వచ్చారో ఆ పరబ్రహ్మ స్థితికే గురువు అని పేరు... శ్రీగురుడంటే దత్తాత్రేయుడే." అని గ్రంథ పీఠికలో చెప్పబడింది. అందుకు తగ్గట్లుగా "శ్రీ గురుచరిత్ర: దత్తావతారలీల" అని గ్రంథానికి పేరు పెట్టబడింది.

హైందవ సంప్రదాయములో గురువున కున్నస్థానం అద్వితీయం. దత్తాత్రేయుడొక అద్భుత గురువు. అంతకు మించి అద్భుతమైన శిష్యుడాయన. నిజానికి ఆయనకు గురువు లేడు. విశాల విశ్వంలోని భూమి, పర్వతం, వాయువు, ఆకాశం అగ్ని, సూర్యుడు, పావురం, కొండచిలువ, పాము, ఏనుగ, మిడుత, చీమ, చేప ఇలా 24 గురువులు తన కున్నారంటాడు దత్తాత్రేయుడు. ఆయన వాని నుండి ఏ మేలు గ్రహించాడో, ఎలా మనోజ్ఞాని, ఆనంద స్వరూపుడు అయినాడో వివరించే రమ్యమైన ఉదంతం గ్రంథం ఆరంభము లోనే చెప్పబడింది.

శ్రీ గురు చరిత్రమనే గ్రంథం మొదట మహారాష్ట్ర భాషలో గంగాధర సరస్వతీ స్వామి వారు రచించారు. శ్రీ వాసుదేవానంద సరస్వతీ స్వామి వారు (క్రీ. శ. 1854–1914 సం.) సంస్కృతంలోకి అనువదించారు. తెలుగు పాఠకుల పుణ్యవశాన "విచిత్రంగా" అది శ్రీ ఏక్కిరాల భరద్వాజ గారికి అందింది. పేరు గుప్తంగా ఉంచుకున్న ఒక అజ్ఞాతకర్త ద్వారా తెలుగు పాఠకులకు అందింది.

ఇది ఒక పారాయణ గ్రంథం, పారాయణం వల్ల పరిణతి వస్తుంది. ఆ స్థితిలో దైవం అనుభవానికి వస్తుంది. దైవ చింతనలో కొన్ని క్షేత్రాలు ప్రత్యేకం దోహదం చేయడం కద్దు. ఆవుకు పాలు సర్వత్రా ఉన్నా అది లభించేది పొదుగు నుండే. అలాగే దైవం సర్వత్రా ఉన్న క్షేత్రాల్లో విశేషంగా లభిస్తుంది అంటారు విశ్వనాథ వారు. ఆ ప్రకారమే మహారాష్ట్రలోని కొన్ని క్షేత్రాల్లో ఈ గ్రంథం దీక్షగా పారాయణం చేయబడుతుంది. క్షుద్ర విద్యలు నేర్చిన కుశాభావు అనే వ్యక్తి చేత శ్రీ శిరిడి సాయిబాబా ఈ గ్రంథాన్ని 108సార్లు పారాయణం చేయించి ఫలసిద్ధి కల్గించారని చెప్పబడింది.

అవతారాల లీలలు అనేవి పురాణ సంబంధంగా కనిపించినా వాస్తవానికి ఇది చారిత్రక గ్రంథం. శ్రీ పాదస్వామి ఆంధ్రలోని పిఠాపురంలో సుమతి, రాజు, అనే దంపతులకు జన్మించినట్లు చెప్పబడింది. శ్రీ నృసింహ సరస్వతి ఉత్తరప్రదేశ్ ప్రాంతంలో క్రీ. శ. 1458 లో కార్యపురం అనే గ్రామంలో జన్మించి నట్లు చెప్ప బడింది. వీరు చరించిన ప్రాంతాలు కూడా వివరింపబడ్డాయి. ఈ విధంగా అది ఇటీవలి చరిత్ర.

ఇది మంచి సైన్సు పుస్తకం. జగత్తుకు సంబంధించిన హేతువాద విజ్ఞాన గ్రంథం. ఆధ్యాత్మిక విజ్ఞాన స్పర్శలేని భౌతిక వాదులకు, నాస్తికులకు ఇందలి సైన్సు హేతువాద విజ్ఞానం అర్థం కాకపోవచ్చు. అనుభవానికి రాక పోవచ్చు. కాని శ్రద్ధ, భక్తి సంస్కారము, నిష్కాపట్యం, ఇచ్ఛా, జిజ్ఞాస ఆత్మ విశ్వాసములతో సాధన చేసే వారికి కలిగే విజ్ఞానం, సౌఖ్యం, ఆనందం ఇందు పుష్కలంగా చెప్ప బడింది.

గ్రంథ మీవిధంగా చారిత్రకము, వైజ్ఞానికము అయినా పురాణ ఫక్కీలో చెప్పబడింది. ఒక పారాయణ గ్రంథానికి అనువాదం కనుక అది అనివార్య మయి ఉండవచ్చు. కాని పరిచయ భాగాలలో నయినా ఆధునిక యువతీ యువకుల అవగాహన, ఆలోచనా సరళికి వీలుగా ఈ చారిత్రక వైజ్ఞానిక విశేషాలను అందించే పద్ధతులు వస్తే బాగుండుననిపించింది.

గ్రంథమంతా కథలు కథలుగా సాగించి, రమ్యమైన కథల మధ్య ఎన్నెన్నో అమూల్య విషయాలు అందించ బడ్డాయి. నామధారకుడను జిజ్ఞాసువుకు సిద్ధుడొకడు చెప్పినట్లుగా—దత్తాత్రేయుని గురించి, శ్రీ పాదస్వామి, శ్రీ నృసింహ సరస్వతీ స్వామి వార్లను గురించి ఇందు చెప్పబడింది.

గ్రంథంలో చెప్పబడిన ధర్మసూక్ష్మాలు, ఆశ్రమధర్మాలు, వైజ్ఞానిక విశేషాలు, గీత బోధలు–కర్మయోగం, భక్తియోగం, గురుసేవ — విగ్రహారాధన అశ్వత్థ మహిమ, రుద్రాక్ష, త్రిపుండ్రధారణ, భస్మధారణ, అన్న నియమం–సోమవారవ్రతం, సుమతి కథ, ఘటోద పూర్వజన్మ, సావిత్రికి జ్ఞాన బోధ, బృహస్పతి లోపా ముద్రకు చెప్పిన ధర్మాలు–శ్రీ పాదప్రభువు అదృశ్యలీలలు కుష్ఠు మున్నగు వ్యాధి నివారణలు, హరిజనుని (మాదిగ) చే వేదం చదివించడం, విద్వాంసుల గర్వభంగం, చండాలుని పూర్వ జన్మ స్మృతి, శవానికి ప్రాణం, గొడ్రాలికి సంతానం, ఒకేసారి 8 రూపాలు ఇలా ఎన్నెన్నో అంశాలు కొద్ది కొద్దిగా ఇందు స్పృశింప బడ్డాయి. దత్తాత్రేయుడెట్లు దీన బంధువుడో తెలుపబడింది.

శ్రీ పాదస్వామినే నిత్యం
నృసింహ గురుయోగినే

దత్తాత్రేయ నాథాయ
మంగళం దీనబంధవే ॥

ఇన్ని లీలలు, అద్భుతాల మధ్యనున్న ప్రబోధం నాడు, నేడు, రేపు కూడా ఎల్లరికి శిరోధార్యం.

"పరమేశ్వరుడు భక్తిని బట్టి మాత్రమే సంతోషిస్తాడు గాని జాత్యాచార వయోరూప విద్య అర్థ గుణ పౌరుషాల నపేక్షింపడు" అని స్పష్టం చేయబడింది.

అయితే ఆ నాటి విధవానియమములు, సహగమనముల వంటి ప్రస్తావనలు ఈనాడు చెల్లి జాలవు. కొన్ని ఇలాంటి అంశాలను మినహాయిస్తే ఈ గ్రంథం చాలా సంస్కార దాయకం అనాలి. విషయ గాంభీర్యాన్ని బట్టి భాషా గాంభీర్యం, శైలి గాంభీర్యం ఉన్నది. కాని గంభీర ధార్మిక ఆధ్యాత్మిక విశేషములకు సరళంగా అందించే భాషా శైలులు ఇంకను రావాల్సి ఉంది.

తెలుగు పాఠకులకు ఇట్టి విశేష గ్రంథం అందడానికి బాధ్యులైన వారందరు అభినందనీయులు.

— లక్ష్మీనారాయణ.

## సుందర మందారము

[రచయిత: శ్రీ జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి. పేజీలు: 179. వెల: అమూల్యం. ప్రాప్తిస్థానము: ? ]

కావ్యం చదువబోయే ముందు కవిని గూర్చి తెల్సుకోవడం సహృదయులయిన పాఠకులకు ఒక రివాజు. ఆత్రంతో పేజీల్లోకి తొంగి చూసేముందు కవిని ఒక్కసారిగా పరామర్శించడం తెలుగుదనాన్కి చక్కని నిదర్శనం.

శ్రీ జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రిగార్ని కవిగా నేను పరిచయం చేయవలసిన అవసరం లేదనుకొంటాను. తన కావ్యముల ద్వారా తనే ఒక విశిష్ట స్థానాన్ని అలంకరించుకొని ఆంధ్ర సాహిత్య చరిత్రలో 'ఉదాహరణ త్రయి' అనే కావ్యం ద్వారా కవిగా స్థిరపడ్డారు. ప్రస్తుతం వీరు వ్రాసిన 'సుందర మందారము' అనే ఈ గేయకావ్యంలో తన బలమైన భావాన్ని యింకాస్త గట్టిగా రూపుదిద్దుకొని ఒక ఉత్తమ కవిగా స్థిరపడ్డారు.

వీరి 'సుందర మందారము' సాహితీ వనంలో ఎప్పుడూ, వాడని, వీడని పారిజాత పుష్పంలా నాల్గుకాలాల పాటు గుబాళించగలదని నా ఆశ.

"కావ్యస్యాత్మాధ్వని రితి బుధైః
యస్సమా మ్నాతపూర్వః–

అని ధ్వని కావ్యాత్మ యని అందు రస ధ్వని శ్రేష్ఠమని ఆనందవర్ధనుడు చెప్పాడు. అలాగే యీ కవి భక్తిరసము చేతనే యీ కావ్యానికి జీవంబోసి, యీ నిఖిల జగతికి తిర్గి సరిక్రొత్త కల్పన చేశాడన్పిస్తుంది.

"దేవాలయ గోపుర శిఖరాగ్రమునుండి మంత్రజలం వెదజల్లితే భక్తులంతా ముగ్ధులౌతారన్నట్లుగా" ఈ గేయ కవితా కదంబము చదువరులను మంత్ర ముగ్ధుల్ని చేస్తుందనుటలో అతిశయోక్తి కానేరదు.

వీరు వ్రాసిన ఈ కావ్యంలోని సుస్వప్నము చదువుతుంటే, నాకు గురుజాడవారి 'కన్యక' గుర్తుకొచ్చినది. ఒక రకంగా చూస్తే కవితా వస్తువులు వేరయినా వీరిరువురి నడక ఒక తీరులోనే వుంది.

రాక్షస కాంతలు సీతను అవహేళనము చేయుచున్న విధమును భయమునుగొల్పిన విధమును కవి వివరించిన తీరు, ఉపమానమూ రమ్యముగా వున్నవి. ఈ కవికి బడబానలవంటి భావన, దావానలంలాంటి ఉద్వేగం నిండుగా సంతరించుకొన్నాయి అనేందుకు ఉదాహరణముగా 'మనో నిశ్చయము' అనే గీతంలో

"గో మాత చుట్టును భయద
క్రూర మృగములు ఆడినట్లు

వికటమ్ముగా నవ్వినారు"–అని అంటారు. అలాగే వీరు భాషా, కవితా ప్రాగల్భ్యము రచనాదక్షతలు ప్రధానాంశములుగా ఎన్నుకొని రచనచేశారని వీటిలోని కొన్ని అంశాల ద్వారా స్పష్టమవుతుంది. ఈ కవి ఔచిత్య రసమే ప్రధానంగా ఎన్నుకొని రచనచేశాడు.

"ఔచిత్యం రస సిద్ధస్య
స్థిరం కావ్యస్య జీవితం"

అని క్షేమేంద్రుడు ఔచిత్యమే కావ్యాత్మగా సిద్ధాంతీకరించెను. (ఔచిత్యమనగా పద, వాక్య, ప్రబంధ, గుణ, అలంకార, ఉపసర్గ నిపాత, కాల, దేశాదులు మొదలగునవి) ఈ పుస్తకములోని ప్రతిగేయానికి, ప్రతి పద్యానికి వివరణ చెప్పక్కర్లేదనుకొంటాను. ఆవివరణరామకౌండిన్యగారు చక్కగాచేశారు కనుక నేను కవితాపరంగా చర్చిస్తాను.

కవి తన కవితద్వారా తాను చైతన్యం పొందడం గాక, కవి తన కవిత ద్వారా పండిత పామరుల హృదయాల్ని రంజింపజేసి, తన కున్న విషయ పరిజ్ఞానాన్ని పది మందికి పంచి, చైతన్యం కల్గించ గల్గితేనే ఆ కవి వ్రాసే కవితకు సరియైన అర్థం ఏర్పడుతుంది. సార్థకత లభిస్తుంది. ఈ పుస్తకం చదువుతున్నంతసేపు, మనస్సుకు ప్రశాంతత, నిండయిన తృప్తి, కలిగింపజేసి, పుస్తకం ఆసాంతం చదవాలన్పించేంతగా వ్రాసి కవి మెప్పించారు.

'ఉదాహరణత్రయి' కన్నా యీ పుస్తకం చాలా బాగుంది.

"సహజంగా కవిలోనే విమర్శకుడుంటాడు" తన కవితలు తనే చదువుకొని, తర్కించుకొని వ్రాస్తే మంచి కవిత్వం అలవడుతుంది. ఈ కవి బహుశా ప్రతి అంశం తనకుతానుగా తర్కించుకొని, సాధనచేసి, వ్రాశారన్పిస్తున్నది. అందుకే కవి సాధన వలన ప్రతి అంశం నిండుగా వున్నాయి.

ఉన్నంతలో బాగా వ్రాసిన వారు 'సామవేదం జానకిరామశర్మ.' కవితా చర్చతోపాటు విషయ పరిజ్ఞానాన్ని సమగ్రంగా చర్చించి అమూల్య అభిప్రాయాన్ని చక్కగా వివరించారు.

అలాగే 'రామకౌండిన్య'గారు వ్రాసిన అభిప్రాయంకూడా చాలా బాగుంది. ముఖ్యంగా చెప్పుకోదగింది. వీరు వ్రాసిన అభిప్రాయం – పుస్తకాన్కి సమగ్ర సమీక్ష లాగా పనిచేస్తుంది.

ఇకపోతే 'శాస్త్రి'గారి ప్రతి కవితలోను హుందాతనం గోచరిస్తుంది. పద గుంఫన కవి గీతల్లో ప్రత్యేక ప్రతిభగా కన్పిస్తుంది. నా దృష్టిలో నిజమైన కవిత్వం, నిర్మాణము కల్పనకు, అతీతంగా వుండి, క్రియాశక్తిలో పించకుండా వుండాలి! శ్రీ శాస్త్రిగారి కవిత్వం అలాంటిది.

శ్రీ జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రిగారి కలం నుండి మరిన్ని మంచి కావ్యాలు రావాలని ఆశిస్తున్నాను.

— చంద్రభాను

(7వ పేజీ తరువాయి)

మహి: (విజయగర్వంతో నవ్వి) వారు దిక్పాలుర భార్యలు. వారిని నా దాసీలుగా, భోగస్త్రీలుగా చేసుకోదలచుకొన్నాను.

శచీదేవి: ఛీ! పాషండుడా! పరస్త్రీల పొందుగోరిన పాపాత్ముడెవ్వడూ ప్రాణాలతో నిలువలేడురా!

మహి: ఛీ! ఈ బుద్ధులను ఆనాడు నీ కాంతుడు గౌతమునికొంపగూల్చుటకు పోయినపుడు చెప్పలేదేమే శచీదేవి!

నార: జయ మహిషాసురా! ఆహా హా! ఎంత చక్కని సమాధానమిచ్చావయ్యా.

శచీ: (కోపముతో) నారదా!

నార: నిజమాడితే నిష్ఠురముగాని, ఈ చేతచేసిన పాప ఫలం ఆ చేత అనుభవింపవలసినదే. అది త్రిమూర్తులకైనా తప్పదు తల్లీ. నీ భర్త గౌతమునికి చేసిన ద్రోహానికి ఇది ఫలితమేనమ్మా.

మహి: అలా చెప్పండి స్వామీ.

నార: నేను చెపుతాను సరే! ఇంత చక్కని సమాధానాలిస్తున్న సూక్ష్మబుద్ధివే! ఇలాటి అల్పయోచన ఎందుకుచేశావా అని...............

మహి: అల్పయోచనా? నాదా నారదా?

నార: మరి కాదా మహిషాసురా! నీ వంటి జగదేకవీరుడు ఏ పనిచేసినా ముల్లోకాలవారు ముక్కుమీద వ్రేలు వేసుకొనేటట్లుండొద్దూ? త్రిజగన్మోహనాకారుడవు. త్రిలోక సుందరివంటి కాంతను చేపట్టాలి. అఖండభుజబల పరాక్రమసంపన్నుడవు. అనన్యవీరశృంగారరసాధి దేవతను వశం చేసుకోవాలి. అంతేగాని-బలాత్కరించుటకు తగని పతివ్రతలనాశించడం............

మహి: మంచిది కాదంటారు. అంతేగా? పోనీ అలాటి అందగత్తె ఎక్కడయినా ఉన్నదా?

నార: లేకేమి? ఆమె మహాతిశయసౌందర్యలావణ్యరాశి, లసన్మరకతస్వచ్ఛవిగ్రహ, సుపక్వదాడిమీబీజరదన, కంబుపూగసమచ్ఛాయ కంధర, త్రిపురసుందరి, నారాయణీ నామధేయ. ఆమెకు నీవు చిక్కితే........ అఁవాఁ! ఆమె నీకు చిక్కితే నీ బ్రతుకు పండినట్లే.

మహి: ఆమె అంత సౌందర్యవతియా స్వామీ! అయితే ఇపుడే వెళ్లి తీసుకొస్తాను.

నార: వద్దు మహిషా! ఆమె ఉగ్రమూర్తి. పైగా సింహవాహన. ఆమెను నీవు తేలేవు. ఎందుకొచ్చిన బాధ. ఈ దిక్పాలుర భార్యలతోనే సంతోషించు. కాని నీవా శక్తిని సంపాదించగలిగావా? నిన్ను మించిన వాడు ఈరేడు జగాల్లో ఉండడనుకో.

మహి: (నవ్వి) ఇప్పుడు మాత్రము? – నన్ను మించినవాడు ఈ చతుర్దశభువనాలలో ఎవడున్నాడు నారదా? అంతేగాక, నేను జయించలేనిదేమున్నది. ఆమె ఎక్కడున్నదో చెప్పండి. ఇప్పుడే తెస్తాను.

నార: ఇంతవరకు మలయపర్వతము మీద తపస్సు చేస్తూ వుండేది. ఇప్పుడూ...........

మహి: ఆఁ! ఇప్పుడెక్కడున్నది?

నార: ఆ కొమారి కైలాసములో ముక్కుమూసుకొని తపస్సు చేసుకొంటూ కూర్చుంటే ఆ కొమారి, విరహవేదనతో ఆ కైలాస సానువుపైనే....

మహి: దుఃఖిస్తూ ఉన్నదా? అయ్యో పాపం!

నార: ఇక్కడేవుండి అయ్యోపాపమంటే ప్రయోజనమేమిటి?

మహి: నిజమే! అయితే నేను వెళ్ళి.... ఏమి నారదా! నేను వెళ్ళి........

నార: వెళ్ళి వెళ్ళి అంటున్నావు మళ్ళీ తిరిగిరావా ఏమిటి?

మహి: రాను. కార్యము సాధించువరకూ తిరిగిరాను. కడకు నా ప్రాణాలైనా విడుస్తాను గాని.

నార: శుభస్య శీఘ్రం! అయితే త్వరగా వెళ్లు – నీవు తలచిన కార్యానికి అడ్డు చెప్పడము ఎవరితరము?

మహి: చిక్షురా! ఈ దిక్పాలురను, వారి భార్యలను విడిచిపెట్టు. ఉత్తమ మహిషాలతో నా రథము వాయత్తము చేయించు.

నార: మహిషాసురా! అయితే నీకు కైలాసయాత్ర తప్పదన్నమాట.

మహి: (నవ్వి) మీరూ రావాలి స్వామీ నాతో!

నార: ఎందుకురానూ? దగ్గరుండి నీ పని పూర్తి చేయించాలిగా! నాకు కావలసింది కయ్యాలు కాదయ్యా! లోక కల్యాణం. నీ కైలాసయాత్రకు కావలసిన సన్నాహాలు చేసుకొంటూ వుండు. నీ పట్టమహిషిని చూచివచ్చేస్తాను.

రంగము-5 స్థలము-మహిషపత్ని పూజామందిరం

(మహిష పత్ని దేవి విగ్రహము ముందు హారతినిచ్చి పాడుతుంటుంది.)

పాట

మ.వ.: ఎవరని నిను వర్ణింతును జననీ
భవమును బాపు భవాని కల్యాణీ ॥ఎవ॥
కలుములపల్లివొ – చదువులతల్లివో
చలిమల చూలివో – జగముల తల్లివో
పతులకు గతియౌ – పతివరమేశ్వరి
నతు లివె మాతా – జయ జగదీశ్వరి ॥ఎవ॥
(పోతము)

# జ్ఞాన సరస్వతి

— శ్రీ మునుగోటి యాదయ్య




భారత దేశములో గల దేవాలయము లన్నింటిలో సరస్వతి దేవాలయములు రెండే రెండు కలవు. అవి ఒకటి అతి ప్రాచీన మైనది హిమాలయ పర్వతాలలో గల కాశ్మీర రాష్ట్రములోను మరొకటి మన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములో కలదు. అదియే బాసర జ్ఞాన సరస్వతి దేవాలయము. ఇదియే "వాసర వాణి." ఇది అంతగా ప్రచారములో లేదు.

జ్ఞాన సరస్వతి ఆంధ్రప్రదేశ్‌లో అదిలా బాద్ జిల్లా ముధోల్ తాలూకాలోని బాసర గ్రామములో పవిత్ర గోదావరి నదీ తీర మున 2 కి. మీ. దూరమున యున్నది. దీనిని "బాసర క్షేత్రం" అని పిలుస్తారు.

సాక్షాన్నారాయణాంశ సంభూతుడగు శ్రీ వేదవ్యాసుడు వేదాలను నాలుగు భాగ ములు విభజించి, వేదాంత సూత్రములను అష్టాదశపురాణములను, మహాభారత, భాగ వతాది గ్రంథములను రచించెను. కాని మనశ్శాంతి కలుగలేదు. అందుకై సమస్త తీర్థాటనము గావించుటకై సకలముని బృంద సమేతుడై ఉత్తర భారత తీర్థ యాత్రలను పూర్తిచేసి దండకారణ్యంలో ప్రవేశించి అచ్చట గౌతమీ నదిలో స్నాన మాచరించి అనుష్ఠానాదులు పూర్తిచేసుకొని "కుమారాచల" పర్వతమను ప్రాంతమున శ్రీ శారద అవ్యక్తరూపమున ఆవిర్భవించి యున్నదను పరమరహస్యమును తెలుసు కొని ముగ్ధుడై శ్రీ సరస్వతి సరస్సునందు స్నానమాచరించి వాగ్దేవిని భక్తితో ప్రార్థన గావించెను. అప్పుడు హంస వాహన దేవీ దర్శనము లభించగా ఓ జననీ! అజ్ఞాన జనుల హితము కొఱకు సాకారరూపము ధరించి సమస్త భక్తకోటికి సగుణోపాసనను గ్రహింపుమని ప్రార్థించెను. అప్పుడు భారతి వ్యాసమహర్షితో వత్సా! నీవు ప్రతి దినము గౌతమీనదిలో స్నానముచేసి మూడు పిడికిళ్ల ఇసుకను తెచ్చి మూడు చోట్ల పోయుము. అప్పుడు ఆ మూడు స్థలము లలో నేను శ్రీ మహా సరస్వతి, శ్రీ మహా లక్ష్మి, శ్రీ మహాకాళీ రూపములలో వ్యాపింప బడుదునని అంతా నేనే నని అదృశ్య మయ్యెను. అప్పుడు మహర్షి వ్యాసుడు శారదాదేవి చెప్పిన ప్రకారము ప్రతిదినము స్నానము చేసి ఇసుకను తెచ్చి మూడు చోట్ల పోసెను. ఆ మూడు స్థలములలో మూడు రూపములు ఆవిర్భవించినవి.



వ్యాసుడు ముఖ్య దేవతయగు శ్రీ సరస్వతిని ఆది దేవతగా స్థాపన గావించెను. సమస్త ఋషి మండల సహితముగా నీ క్షేత్రముననే తపశ్చర్యగావించుకొనుచు కాలము గడి పెను. ఈ పవిత్ర స్థలమునకే "వ్యాసపుర" మని పేరు వచ్చెను. దానినే వాసరయని, రైలు మార్గముండుటచే, మహరాష్ట్రులు ఉచ్చారణలో "బాసర్" అని పిలుచుటచే 'వాసర' యే "బాసర్" గా ప్రసిద్ధి గాంచినది.

అహమ్మద్‌షాహి, కుతుబ్ షాహి అని సుల్తానులు ఈ దేవాలయమును ధ్వంసం గావించిరి. శ్రీ మహాలక్ష్మిని ఖండించిరి. కొన్ని సంవత్సరముల తరువాత సుల్తానులు చేయు పనులకు స్వస్తి చెప్పవలెనని రేణుకా పురవాసి వీరశైవ భక్తుడు, శూరవీరుడగు మక్కాజీ పటేలు కొందరు యువకుల సహాయ ముచే పగవారిని తరిమివేసిరి. ఆ తరువాత క్రీ.శ. 18వ శ. లో మందిర నిర్మాణంగావించి పునః ప్రతిష్ఠ జరిగినది. జగద్గురు శృంగేరి మఠాధిపతి శ్రీ విద్యారణ్య భారతీస్వాముల వారికి విషయమును తెలియజేయగా వారు వచ్చి మహాలక్ష్మి విగ్రహము పూజకు యోగ్యముగ లేనందున జైపూరు నుండి క్రొత్త విగ్రహమును తెప్పించిరి. ఆ తరు వాత ముగ్గురు మూర్తులకు యథా విధిగా పూజలు జరుగుచుండెను. భక్తుడు మక్కాజి కాపాడిన శ్రీ సరస్వతి విగ్రహము (ఇసు కతో నిర్మించినది) దేవి ద్వారము వద్ద ఇప్పటికిని చేతులు జోడించుకొని నిలబడి యున్నది.

దేవాలయమునకు కొంత దూరములో చిత్రవిచిత్ర ధ్వనిచేయు ఒక శిలయున్నది. ఈ శిలను వేదవతి యందురు. చిన్న రాతితో కొట్టిన ఒక్కొక్క చోట శబ్ద ములు సప్తస్వరములవలె వినిపించును. గణేశ మందిరము, ఆంజనేయమందిరము, కుమార, ఇంద్ర, సూర్య నారాయణ, పాప నాశేశ్వర, వ్యాస మున్నగు దేవాలయ ములు అన్ని కలిసియు శ్రీ వాణీ ఆలయ మొక కేంద్రముగ నేర్పడిన మహా క్షేత్ర మని చెప్పవచ్చును. ఔదుంబర వృక్షము క్రింద దత్త పాదుకలు కలవు. సంతాన ప్రాప్తికై వీటిని ముట్టుకొని యాత్రికులు వెళ్ళుదురు.

ఈ జ్ఞాన సరస్వతి దేవీ చరిత్ర పూర్వపు మందిర చరిత్రను అచ్చటి పెద్దపూజారి శ్రీ శేశువ హరిదాసు తెలియ జేసినారు. అతనికి తెలిసినన్ని విషయములు ఇంకెవ్వ రికి తెలియవని చెప్పుచుందురు. భక్తులు వారి వారి అనుభవాలను యీ హరిదాసుకు తెలియ జేయుదురు.

దేవేంద్రునికి దుర్వాసుని శాపముచే కుష్టువ్యాధి రాగానే ఇచ్చటకు వచ్చి మైలు దూరమున తపస్సు చేసి సరస్వతిని ఆరాధించెనట. సూర్య భగవానునికి కాంతి విహీన మగుటచే సరోవరములో స్నానము చేసి దేవిని ప్రార్థించి పూర్వ రూపము దాల్చెనట. వాల్మీకి మహర్షి వాగ్దేవిని ఆరాధించి శ్రీమద్రామాయణమను మహాకావ్యమును రచించి ఆదికవియయ్యెను. దేవతలు రాక్షసులు అమృతమునకు పోరాడుట విష్ణుమూర్తి చూచి సరస్వతీ మాతను ధ్యానించి మోహినీ రూపములో రాక్షసుల నుండి అమృతమును గైకొని దేవతలకు పంచెను. సమస్త దేవతలలో అగ్రపూజ అందుకొనుటకై వినాయకుడు వాసర క్షేత్రమునకేతెంచి వాగ్దేవిని ప్రార్థించి ఆమె వరముచే అగ్ర పూజకు దేవుడయ్యెను.

పూర్వము ఒకరాజు సంతానము లేక వాసర క్షేత్రమునకేతెంచి "వాసర వాణి"ని జపము చేయగా సంతానము లభించెను. శ్రీరాముడు రావణుని సంహరించుటకు భారతి అనుగ్రహమును పొందెను.

ఇంకొకరాజు సతీ వియోగ దుఃఖము భరించలేక యీ బాసర క్షేత్రమునకు వచ్చి సరస్వతి తీర్థమున స్నానమాచరించి (ఈశాన్య దిశయందు) జ్ఞాన సరస్వతిని ధ్యానించుటచే దేవి అనుగ్రహముచే మరల వివాహమాడి కుమారుని గనెను.

జీర్ణావస్థలో నున్న యీ క్షేత్రము దేవాదాయశాఖ అధీనములోనికి వచ్చినది. దేవాలయ అభివృద్ధికి ముఖ్యకారకులు, కృషి చేసినవారు శాసన సభ్యులు శ్రీ జి. గడ్డెన్న గారు. ఈయన దేవాలయము ధర్మకర్తల సంఘం అధ్యక్షులు. వీరి వలననే ఎంతో అభివృద్ధి లోనికి వచ్చిన దనుటలో సందేహము లేదు.

బాసర క్షేత్రములో యాత్రికుల సౌకర్యము కొరకు తిరుపతి దేవస్థానము వారు ఒక అతిథి గృహమును అధునాతన సౌకర్యాలతో నిర్మించారు. 10 ఎకరముల భూమిని రివెన్యూ బోర్డు ఇచ్చినది. దాదాపు (2) రెండు లక్షల రూపాయలతో దేవాలయానికి ప్రాకారము, మంటపాలు నిర్మించారు. దేవస్థానము వారు యాత్రికులకు ఒక భోజన ఫలహారశాలను ఏర్పాటు చేశారు. ఎన్నో ఏండ్ల క్రింద నిర్మించబడి ఇరుకుగా ఉన్న బాసర జ్ఞాన సరస్వతి దేవాలయాన్ని దేవాదాయశాఖవారు పునర్నిర్మిస్తున్నారు. ఒక లక్ష 50 వేల రూపాయలతో సరస్వతి దేవి గర్భగుడి 80 వేల వ్యయముతో సింహ ద్వార నిర్మాణము పని చురుకుగా సాగుచున్నది. 50 వేల ధనముతో మహాకాళి మందిరము పూర్తి అయినది.

ఈ వాసర క్షేత్రము హైదరాబాదు నుండి మన్మాడ్‌కు వెళ్ళు రైలు మార్గములో కలదు. ఇతర దిశలనుండి బస్సు సౌకర్యము కలదు. సరస్వతి దర్శనమునకు ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, మధ్య ప్రదేశ్, ఒరిస్సా మొదలగు స్థలములనుండి భక్తులు అధిక సంఖ్యలో వచ్చి దేవిని పూజించెదరు. ఆంధ్రప్రదేశ్‌కు మహారాష్ట్రమునకు సరిహద్దులో నుండుటచే తెలుగువారికి కోడలు, మహారాష్ట్రులకు ఆడపడుచు అని అక్కడివారు అనుకొందురు.

ఇచ్చట ఎక్కువగా మహాశివరాత్రి మరియు దేవీ నవరాత్రులు, దత్తాత్రేయ జయంతి, దీపావళి మొదలగు పర్వ దినములలో జనులు వచ్చుదురు. యాత్రికులు జ్ఞాన సరస్వతి దేవి దగ్గర విద్యారంభము గావించెదరు. సర్వరోగ నివారిణి యని అందురు. ముఖ్యముగా మూగ వాండ్లను పలికించు మాతయని నమ్మకము కలదు. అంతేకాక మూర్ఛరోగులకు దేవీ అనుగ్రహముచే మూర్ఛ తొలగి పోవునని చెప్పుచున్నారు.

ఎట్టకేలకు బాసర సరస్వతి మోక్షప్రదాయిని యని గోదావరి వంతెన పూర్తి అయిన నాడు ఇతోధికంగా భక్తులు అచటికి వెళ్ళుదురని చెప్పక తప్పదు.



## సప్తగిరి
## ఏజెంట్ల చిరునామాలు.
### కర్నూలు జిల్లా

M/S పాణ్యం సిమెంట్ కో-ఆపరేటివ్ స్టోర్స్ లిమిటెడ్ సిమెంట్‌నగర్ పోస్టు బుగ్గన్నపల్లి ఆర్. ఎస్. - 518 206.

శ్రీ ఏ. సుబ్రహ్మణ్యం.
నెం. 25-244 సంజీవనగర్
నంద్యాల-518 501

శ్రీ ఎస్. లక్ష్మినారాయణ
M/s శ్రీ సాయిరామ్ స్టోర్స్
ఆదోని-518 301

శ్రీ డి. శ్రీనివాసమూర్తి
రిటైర్డు డిప్యూటీ తాసీల్దారు
11-49, కృష్ణనగర్
ఎంప్లాయీస్ హౌసింగ్ కాలనీ
బిహైండ్ బిర్లా కంపెనీ, కర్నూలు

శ్రీ బి. రఘునాథరెడ్డి
S/o బి. సి. సుబ్బారెడ్డి
తిరుమల ఎంపోరియం కాలేజిరోడ్
ఆత్మకూరు-518 422

శ్రీ పి. చంద్రశేఖర్
S/o పి. కృష్ణమూర్తిశాస్త్రి
రిటైర్డు తెలుగు పండిట్
17-67, కాలేజిరోడ్
నందికొట్కూరు-518 401

### శ్రీకాకుళంజిల్లా

శ్రీమతి ఎం. వి. సరస్వతీదేవి
ఏజెంట్
C/o ఎస్. మిన్నారావు
సోంపేట - 532 284

శ్రీ కె. రామారావు
C/o బ్రూక్‌బాండ్ ఏజెంట్
పాలకొండ - 532 440

# జిల్లాలలో సప్తగిరి విక్రేతలు

శ్రీ ఎం. వెంకటాచార్యులు
అందోలు పోస్టు. మెదక్‌జిల్లా

శ్రీ ఎన్. అంజయ్య వి.పి.ఓ.
S/o ఎన్. నారాయణ
ఇర్కోడ్ పోస్టు
సిద్ధిపేట తాలూకా. మెదక్ జిల్లా

శ్రీ ఏ. బాలరాజేషన్
C/o రాజేశ్వర మోడరన్ రైస్‌మిల్
4-7-20 న్యూమార్కెట్‌రోడ్
సిద్ధిపేట - 502 103, మెదక్ జిల్లా

శ్రీ ఏ. కృష్ణయ్య
ఆయుర్వేద వైద్యులు, బాలాజీవాడ
నిర్మల్ - 504 106 ఆదిలాబాద్ జిల్లా

శ్రీ బి. శ్రీనివాస్
శ్రీరామబుక్‌హౌస్
బస్టాండు ఆదిలాబాద్ 504001

శ్రీ వద్లూరి లక్ష్మీనరసయ్య
డి-161 బి.జోన్ రామకృష్ణాపురం-504301
ఆదిలాబాద్ జిల్లా

శ్రీ సి. శంకరగుప్త
C/o మంచిర్యాలగూడ్స్‌ట్రాన్స్‌పోర్ట్స్‌బ్రాంచి
లక్సెట్టిపేట - 504215
(వయా) మంచిర్యాల, ఆదిలాద్‌బాద్‌జిల్లా

శ్రీ వేముల ఆనంద్
న్యూస్‌పేపర్ ఏజెంట్
భీమవరం - 504204 ఆదిలాబాద్ జిల్లా

## ప్రకాశం జిల్లా

శ్రీ సి. సుబ్బరాయలు
శ్రీ సత్యనారాయణ ఏజెన్సీ
4-8-96 గిద్దలూరు

శ్రీ జి. వి. సుబ్బారావు
రావ్ అండ్ రావ్ ఏజెన్సీ
కొవ్వూరు-523 105, కందుకూరుతాలూకా

శ్రీ కోడూరి వెంకటసుబ్బారావు
ఎల్. ఐ. సి. ఏజెంట్, ఉప్పుగుండూరు

శ్రీ ఎస్. వి. రమణయ్య, సాకలబుక్‌షాప్
మార్కాపురం-523 316

శ్రీ అడపాహరి శ్రీ పసన్న న్యూస్‌ఏజెన్సీ
లింగసముద్రం-523 114
కందుకూరుతాలూకా

ఎం. వి. చలం సులేఖ న్యూస్ ఏజెన్సీ
చీరాల

శ్రీ పి. వి. సుబ్రమణ్యం
ప్రభుత్వ ఆస్పత్రి దగ్గర, అద్దంకి

శ్రీ రాచపూడి వెంకటసుబ్బారావు
లాయర్‌పేట, ఒంగోలు-523 003

శ్రీ జి. మాలకొండయ్య
C/o పెద్దనరసింహులు ఎల్.ఐ.సి. ఏజెంట్
భీమకుర్తి-523 226

## పశ్చిమ గోదావరి జిల్లా

శ్రీ పి. జె. వి. రామానుజాచార్య
శ్రీ కృష్ణ లోకోరైల్వే స్టేషన్ రోడ్
తాడేపల్లిగూడెం - 534101

శ్రీ బి. శివరామకుమార్
కుమార్ న్యూస్ ఏజెన్సీ
రామమహల్ ఎదురుగా
ఏలూరు - 534002

శ్రీ టి. వెంకటగిరి నరసింహమూర్తి
మోర్త - 534 227 తణుకుతాలూకా

శ్రీ సి. గోపాలాచార్యులు
మల్లవరంపోస్టు, వయా నరసాపూర్

శ్రీ కర్రి గంగాధరరెడ్డి
అర్జునుడుపాలెంపోస్టు, వయా ఇరగవరం

శ్రీ కొండా వేంకటేశ్వరరావు
కన్నూరు-534 329

శ్రీ బొడ్డు వెంకటరత్నం
న్యూస్ ఏజెంట్ మైన్‌రోడ్
పెనుగొండ-534 320

శ్రీ బంగారుసీతా రామాంజనేయగుప్త
S/o బి. రామకృష్ణారావు, మెయిన్‌రోడ్
పాలకొల్లు-534 260

## కడప జిల్లా

శ్రీ బి. రామమోహన్‌మూర్తి
28-88 రామేశ్వర అగ్రహారం
ప్రొద్దుటూరు-516 360

శ్రీ పి. సూర్యప్రకాష్‌బాబు
S/o శ్రీ పి. వి. రామప్ప
విజయాస్టోర్సు పులివెందుల-516 390

శ్రీ సి. సుబ్రహ్మణ్యం
పద్మావతి ఏజెన్సీస్
10-277, బెల్లంమండి వీధి, కడప-516 001

శ్రీ సి. పి. వరలక్ష్మి
C/o పి. సుబ్బారావుగుప్త
న్యూస్‌ఏజెంట్ రాజంపేట-516 115

శ్రీ బి. రామమోహన్‌మూర్తి
28-88 రామేశ్వర అగ్రహారం
ప్రొద్దుటూరు-516 360

శ్రీ పి. సూర్యప్రకాష్‌బాబు
S/o శ్రీ పి. వి. రామప్ప
విజయాస్టోర్సు పులివెందుల-516 390

శ్రీ సి. సుబ్రహ్మణ్యం
పద్మావతి ఏజెన్సీస్
10-277, బెల్లంమండి వీధి, కడప-516 001

శ్రీ సి. పి. వరలక్ష్మి
C/o పి. సుబ్బారావుగుప్త
న్యూస్‌ఏజెంట్ రాజంపేట-516 115

శ్రీమతి ఎం. పద్మావతి
W/o ఏ. ఎన్. ఎన్. స్వామి
హెడ్‌మాస్టర్
మత్స్యలేశం
కళింగపట్నం బి.పి.ఓ.

ఎవరో రమ్మన్నారంటే, ఎందుకో చూద్దామని బయల్దేరాను. తీరావెళ్తే ఎన్నో మెట్లు ఎక్కాలిట! ఎన్నో జ్ఞాపకం లేదు కాని, ఎలాగా అని ఆలోచిస్తూనే అన్ని మెట్లూ ఎక్కాను.

అక్కడ కోవెలలాటి లోగిలి ఒకటుంది. లోపలికి వెళ్ళాలంటే గుమ్మం దగ్గర ఇద్దరు ఆడవాళ్ళు కావలావున్నారు. ఎందుకో రమ్మన్నార్ట అని అడిగా. మేమెందుకు రమ్మన్నాం? నువ్వే వచ్చి వుంటావు. అన్నట్లు ముఖాలు చూచుకొని, ముఖం చిట్లించి లోపలకు పొమ్మన్నట్లు దారి వదిలారు. ఏడుగడపలు దాటితేగాని అనుకొన్న చోటురాదని ఎవరో అనుకోవటం

ఎదురుగా ఒక ఎత్తయిన అరుగువుంది. దాని వెనకగా ఒకపెద్ద నీలిరంగు తెర వేశారు. అబ్బ! ఎంతపొడవో! ఎంతవెడల్పో చెప్పటం కష్టం. ఆ తెర అంతటాకూడా పెద్దవి, చిన్నవి, ఎర్రటివి, ఏమిటో చుక్కల్లాగా తళుక్కు మంటున్నాయి. ఎర్రగా కనుపిస్తూ రంగులు మార్చే దీపం ఒకటి, పిండారబోసినంత తెల్లగావుండే దీపం ఒక్కటీ, ఆ చివరా ఈ చివరా ఏర్పాటు చేశారు. వాటితోటి ఆ యిల్లంతా వెలిగి పోతూంది.

తెరముందు పెద్ద అరుగుమీద గుట్టలు గుట్టలుగా బొమ్మలు పోసివున్నై. ఎన్ని బొమ్మలో, ఎన్నిరకాలో! చిన్నబొమ్మలు

దాకా అనుకొన్నా! అడుగుదాం అనుకొనే లోపున ఎవరో గంట మ్రోగించారు. అందరి మాదిరే నా కళ్ళు కూడా అరుగుమీదికి వెళ్ళాయి.

ఈ గంటమ్రోగటంతోటే ఆ అరుగుమీద అలజడి మొదలయింది. అంతవరకు పడి వున్న బొమ్మలన్నీ ప్రాణాలు వచ్చినట్లు ఎగరటం, మాట్లాడటం మొదలు పెట్టాయి. కొన్ని రాజ్యం కోసంట కొన్ని ఆస్తి కోసంట-పోట్లాడటం ప్రారంభించాయి.

కొన్ని పాటలు పాడాయి. కొన్ని ఆటలాడాయి. శివం కొన్నిటికి ఎక్కితే కొన్ని చిందులు వేశాయి. ఈ ముచ్చటలన్నీ చూచి దూరంగా నిలబడ్డ ముగ్గురు దేవుళ్ళ బొమ్మలు ముసిముసిగా నవ్వుకొన్నాయి.



విన్నా! సరే ఏడోగడపదగ్గరకు చేరా, లోపలకు వెళ్లాలో వద్దో తెలియదు. ఇంతలో అందరూ నీలాంటివాళ్ళే! లోపలకు రావచ్చు అన్నమాట వినిపించింది. ఇక భయంలేదు అనుకొని లోపలకు అడుగుపెట్టానో లేదో మరో లోకంలో వున్నట్లు అనిపించింది.

గుర్తులయితే తెలియలేదు కాని లోపల అంతా చాలామంది కన్పించారు. చిన్నవాళ్ళున్నారు, పెద్దవాళ్ళున్నారు, ఆడవాళ్ళు, మగవాళ్ళువున్నారు. కాని ఏ ఒక్కరిలోను ఆధర్మాలు కన్పించటంలేదు. అందరూ ఇష్టంలేనివి ధరించి కష్టపడుతున్నట్లు కనిపించారు. మొత్తంమీద అంతా చుట్టూ కూర్చుని దేన్నో చూస్తున్నారు? నేను కూడా ఇంకొంచెం ముందుకు నాల్గడుగులు వేశా! ఒళ్ళు పులకరించింది.

పెద్దబొమ్మలు రంగుబొమ్మలు, రంగు రంగుల బొమ్మలు, రాజుల బొమ్మలు, దేవతల బొమ్మలు, మర బొమ్మలు ఆడేవి పాడేవి వున్నవి.

ఈ అరుగుకు ఎదురుగా ఒకావిడ కూర్చొని వుంది. ఏడురంగుల చీరె, ఏడు వారాలసొమ్ములు-అచ్చు అమ్మతల్లి మాదిరిగా వుంది. ఆ రంగేమిటో తెలియడం లేదుకాని ఆ ముఖంలో వెలుగు అమ్మా అని దణ్ణంపెట్ట బుద్ధయ్యేంత ముచ్చటగావుంది. తలమీద ఏదోవుంది కాబోలు. చుట్టు ప్రదేశమంతా కళకళలాడుతూన్నది.

ఓహో! ఇదేదో బొమ్మలకొలువులాగ వుంది. అయినా మగవాళ్ళ నెందుకు పిలి

నాగరాజ్

అల్లంత దూరాన అరుగులాంటి గద్దె నెక్కిన ఆ అమ్మలోమాత్రం ఏ మార్పూ రాలేదు. ఏ బొమ్మకాబొమ్మని ఎంతో పరీక్షగా చూస్తోంది. అప్పుడప్పుడు నవ్వూ, చిరుకోపంలాంటివి వచ్చినా బయటికి కన్పడనీయటంలేదు.

మళ్ళీ గంటకొట్టారు. ఆవిడ లేచివచ్చి అరుగుమీద బొమ్మలకు హారతి ఇచ్చింది. అంతే. కేరింతలు, వికవికలు పకపకలు. ఏవీ లేవు. రంగులుకూడాపోయి మట్టిముద్దలుగా మారిపోయాయి! ప్రక్కనవున్న వాళ్ళు మట్టిముద్దలను గంపల్లోకి వేసి,మళ్ళీ అందులోనుంచే కొత్తబొమ్మలువేసి అరుగు మీదవేస్తున్నారు. ఏముంది? మళ్ళీ గంట! రభస, హారతి, మళ్ళీ మట్టి....ఇలా ఎంతసేపు

(48 వ పేజీలో)



తిరుమలలో శ్రీవారి బ్రహ్మోత్సవాల సందర్భంగా రాష్ట్రప్రభుత్వపక్షాన ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు తే 11-9-83 దిన శ్రీవారికి పట్టువస్త్రాలు సమర్పించారు.

## పదిరూపాయలకే మహాప్రసాదం

శ్రీ వేంకటేశ్వరస్వామి వారి భక్తులు అత్యంత పవిత్రమైనదిగా మహిమోపేత మైనదిగా భావించే శ్రీవారి మహాప్రసాదం పొట్లాలు ఇప్పుడు కేవలం పదిరూపాయలు చెల్లించిన భక్తులకు కూడా లభిస్తున్నవి. ఇదివరకు మహాప్రసాదం పొట్లాలను శ్రీవారి ఆలయ సందర్శనానికి వచ్చే కొద్దిమంది ప్రముఖులకు మాత్రమే బంగారువాకిలివద్ద అందజేసేవారు. శ్రీవారికి కానుకగా రూ. 50/లు గానీ అంతకు మించిగాని విరాళాలు సమర్పించిన వారికి కూడా వీటిని ఇచ్చే వారు. ఇటీవలి కాలంలో శ్రీవారి మహాప్రసాదం అందరికీ అందుబాటులో వుండాలని అనేక విజ్ఞప్తులు దేవస్థానానికి అందుతూ వచ్చాయి. వాటి ఫలితంగా పదిరూపాయలకే వీటిని అందించాలని నిర్ణయం తీసుకొన్నట్లు దేవస్థాన కార్యనిర్వహణాధికారి తెలియజేశారు. వీటిని పొందదలచినవారు దేవస్థాన కార్యనిర్వహణాధికారి పేరిట పది రూపాయలను పోస్టల్ ఆర్డర్ద్వారాగాని డిమాండ్ డ్రాఫ్ట్ మూలంగా గానీ చెల్లించవలసి వుంటుంది.



శ్రీనివాసభారతి నిర్వహణలో భీమవరంలో జరిగిన అన్న విజ్ఞానము గ్రంథావిష్కరణ. గ్రంథరచయిత శ్రీ ఎస్. టి. వి. రాజగోపాలాచార్యులను మాజీమంత్రి శ్రీ ఐ. రామకృష్ణంరాజు సత్కరిస్తున్న దృశ్యం.

# వార్తాలహరి

### రాఘవేంద్ర నీతిసుధ కావ్యావిష్కరణ :

తిరుపతి రామచంద్ర కవి రచించిన "రాఘవేంద్రనీతి సుధ, కావ్యావిష్కరణ మహోత్సవసభ 12-8-83 బాలాజీ భవనము కల్యాణ మండపములో జరిగినది. ఈ సమావేశానికి శ్రీ తిరుమల తిరుపతి దేవస్థాన ప్రజా సంబంధ శాఖాధికారి శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి అధ్యక్షత వహించి దేవస్థానం రచయితలకు చేస్తున్న ఆర్థిక సహాయము గురించి ప్రస్తావించారు. శ్రీ ముదివర్తి కొండమాచార్యులు "రాఘవేంద్ర నీతి సుధను" ఆవిష్కరించారు. బాలాజీ భవనము ప్రొప్రైటర్ మునిరెడ్డి కవిని దుశ్శాలువతో సన్మానించారు. వీరభద్ర నాట్యమండలి కార్యదర్శి మురకంబట్టు రామచంద్రారెడ్డి సభా సదుల్ని ఆహ్వానించారు. ఈ సందర్భములో కవి వ్యక్తిత్వం గురించి, కావ్య వైశిష్ట్యము గురించి సర్వశ్రీ కనుమలూరి శివరామయ్య, పూడి వెంకటరామయ్య, పి. వి. అరుణాచలం, జి. వి. నరసింహారావు, మామిళ్ల నరసింహారెడ్డి, షేక్ మాసూం సాహేబు, ముచ్చెలి శ్రీరాములరెడ్డి, కందసామి రెడ్డి ప్రభృతులు ప్రసంగించారు. ఈ సమావేశానికి ముఖ్య అతిథిగా తిరుపతి పురపాలక సంఘ ఉపాధ్యక్షులు రమణగారు విచ్చేసి కవి కృషిని శ్లాఘించారు. తిరుపతి రామచంద్ర కవి ఉచిత రీతిని కృతజ్ఞతాంజలు అర్పించారు.

# గోపూజ

కృష్ణాష్టమి సందర్భంగా ప్రతి సం॥రం 'గోపూజ' ఉత్సవం జరపడం తిరుమల తిరుపతి దేవస్థానం ఆధ్వర్యంలోగల గోశాలలో ఒక సంప్రదాయం. ఈ ఏడాది ఆగష్టు 31వ తేదీన జరిగిన గోపూజకు దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామి రెడ్డి విచ్చేసి దేవస్థాన గోశాల ప్రగతిని పరిశీలించారు. గోశాల సూపరింటెండెంట్ డా॥ కొండారెడ్డి తమ నివేదికలో తమసంస్థకు గల 200 ఎకరాల క్షేత్రంలో ప్రస్తుతం 350 పైగా గోవులు, నాలుగు గుర్రాలు వున్నాయని, పద్మావతీ కళాశాల అవసరాల నిమిత్తం కొత్తగా మూడవ బయోగ్యాస్ ప్లాంట్‌ను స్థాపిస్తున్నామనీ చెప్పారు. — ఈ క్షేత్ర ప్రగతిపై తమ సంతృప్తి తెలియజేస్తూ త్వరలో మరికొన్ని సంకరజాతి గోవుల్ని కొనుగోలు చేయనున్నామని ఒక పశుదాణా మిశ్రమీకరణ కర్మాగారం కూడా నెలకొల్పనున్నామని కార్యనిర్వహణాధికారి వెల్లడించారు.

ఈ సందర్భంగా జరిగిన సమావేశానికి తిరుపతి పశువైద్యకళాశాల ప్రిన్సిపాల్ డా॥ డి. ఆంజనేయప్రసాద్ అధ్యక్షత వహించారు. టి. టి. డి. పౌరసంబంధశాఖాధికారి శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి సభకు స్వాగతం పలికారు.

సభానంతరం అన్నమాచార్యప్రాజెక్టు గాయకుడు శ్రీ జి. బాలకృష్ణప్రసాద్ గాత్ర కచేరీ చేశారు.





## భరతకోశము

విద్వత్కవి, సాహిత్య పరిశోధకులు స్వర్గీయ మానవల్లి రామకృష్ణ కవిగారి సంపాదకత్వంలో తయారై గతంలో తిరుమల తిరుపతి దేవస్థానంవారి ప్రచురణగా విడుదలైన 'భరతకోశం' మరల ఇంత కాలానికి వెలుగు చూడబోతున్నది. తిరుమల తిరుపతి దేవస్థానం ఆఫ్‌సెట్ ప్రెస్‌లో పునర్ముద్రణ పొందిన ఈ గ్రంథం ప్రస్తుతం విడుదలకు సిద్ధంగావుంది. తగ్గింపు వెలతో దీనిని పాఠకులకు అందజేయాలని దేవస్థానం సంకల్పించింది.

## వసతిగృహాలలో ధర్మప్రచారం

పురాణప్రబోధ పరీక్షల నిర్వహణ ద్వారా, విద్యార్థిలోకంలో మన పవిత్ర గ్రంథాలపట్లా, ధార్మిక విలువలపట్ల చక్కని అవగాహన కల్పిస్తూ వారిలో సచ్ఛీలాన్ని పెంపొందించేందుకు తిరుమల తిరుపతి దేవస్థానముల హిందూధర్మ రక్షణ సంస్థ చేసే కృషి సర్వులకూ విదితమే. ఇటీవల ఈ సంస్థవారు తమ కార్యకలాపాలను సాంఘిక సంక్షేమశాఖవారి వసతి గృహాలలో ప్రవేశ పెట్టాలని సంకల్పించారు. మన సనాతన ధర్మప్రచారం ధ్యేయంగా వసతి గృహాలలోని విద్యార్థులకోసం భజనకార్యక్రమాలు, ఆధ్యాత్మికోపన్యాసాలు ప్రత్యేకంగా రూపొందించబడుతాయని దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి గారువెల్లడించారు. మనధార్మికసంస్కృతికి సంబంధించిన అనేక విషయాలపై చిన్న చిన్న పుస్తకాలు, కరపత్రాలు ఉచితంగా విద్యార్థులకు అందించడం జరుగుతుంది.

హిందూధర్మ ప్రచారాన్ని ఉద్ధృతం చేయటానికి ఇటీవల దేవస్థానం చేపట్టిన పథకాలలో ఇదొక సరికొత్త ప్రయోగం.

## మథనం

( 45 వ పేజీ తరువాయి )

జరిగిందో తెలియదు. అక్కడ ఎవరూ కాలాన్ని పట్టించుకొన్నట్లులేదు. అసలి దంతా నాకు బాగాలేదు. బయటకు వచ్చేం దుకు లేచి నిలబడ్డాను. ఆవిడ చూడకుండా బయటపడాలని నా తపనకాని, ఆవిడ చూడనే చూసింది, ఏం నచ్చలేదా! లేస్తు న్నావ్ అంది.

'అసలీవరసే బాలేదు, అన్నాను నేను. ఏ వరస? అందావిడ. అదే! ఈ బొమ్మలు చేయటం ఆడించటం మళ్ళీ మట్టిలో కల పటం. మట్టిలో కలిపేటందుకు అసలు తయారు చేయక పోతేనేం? అన్నాను, కోపం దాచుకొంటూ. అందరూ ఆడుతూన్న ఆటేగా ఇది? అందావిడ. ఏమో నాకేం నచ్చలేదు అన్నాను నేను. అందరూ ఇదే ఆట ఆడుతున్నారు. నాఆట ఇంతే. ఆమాట కొస్తే నీ ఆటకూడా నేను ఆడుతున్నదే, అందావిడ. నాకు మతి పోయినంత పని అయింది. ఇక చిన్నగా బైట పడాలను కొన్నా.

నాకు నా 'సెనగ లివ్వండి' నేపోతా అన్నా! అంతటి కోపం లోనూ ఆవిడ పక్కున నవ్వింది. నీ కెందు కివ్వాలి? అసలు మీరు తింటున్నదంతా మాదే! చూచింది చాలు, వెళ్ళమంది.

నాకేదో చిన్నతనం! పిల్చి అవమా నించినట్లనిపించింది. అంత మాత్రానికి అసలు పిలవక పోతేనేం! అనకూడదను కుంటూనే అన్నాను. – ఇంకెప్పుడూ చస్తే రాను. నేను పోతున్నాను. అన్నాను.

ఆవిడ కొట్టిందో లేక ఏదన్నా తగిలిందో! ఎందుకో కాని వళ్ళంతా కదిలింది. వెళ్ళు. ఎక్కడికీ పోలేవు. పిచ్చి తండ్రి! ఈ మాట అన్నాదో విన్నానో లేదో – దూకానో దిగానో చెప్పడం కష్టం.

మనస్సుకు మైకం కమ్మింది. ఆ తెలివికి తెల్లవారింది. మన తెలివితో చూస్తే ఏముంది?

మంచంకోడు వెక్కిరిస్తూంది. ముఖాన్న కట్టాల్సిన బొడిపె మాడున కట్టింది. అంతే!



---

## సంపాదకీయం (4వ పేజీ తరువాయి)

శ్రీ చండీసప్తశతి మంత్రద్రష్టలు బ్రహ్మ విష్ణురుద్రులనీ, శ్రీ మహాకాళీ, శ్రీ మహాలక్ష్మీ మహాసరస్వతులు మంత్రదేవత లనీ, త్రిదేవ్యతీతయైన ఆ మహాశక్తికి మధుకైటభప్రశమని, మధుకైటభఘ్ని, మాహిషోన్మూలినీ అనే ప్రశస్తులున్నవనీ ఆ మంత్రం చెపుతూంది. ఇక శ్రీవిద్యాపరాషోడశాక్షరి పరాదేవతను తార్క్ష్యారూఢహరిహృదయసరోజంలో వెలుగొందే పరమ చిత్స్వరూపిణిగా వర్ణిస్తోంది.

పురుషసూక్తమంత్రాలలో సాత్త్వికతంత్రాలలోకూడా సవితాదేవతా, ఆదిత్యహృదయ రూపీ నారాయణో దేవతా, శనైశ్చరో దేవతా అని స్త్రీలింగ ప్రత్యయాన్ని వాడటం కూడా మాతృార్థాలను కల్పిస్తున్నది. ఇది ఆదిశంకరుల చెప్పిన: 'శివః శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం' అన్నదానికి లక్ష్యభూతంగావున్నది.

అంటే ఈ విశాలచరాచర ప్రకృతి అంతా పరమపురుష పరాకృతుల లీలాజాలమన్న మాట. ఏ పేరుతో పిలిచినా, ఆ సమస్త పరమపురుష హృదయాంతరాళంలో, అనంత చైతన్యం అతిగోప్యంగావుండి, తత్సంకల్పమాత్రాన ప్రబుద్ధమై, ప్రకృతి రూపధారిణియై విశాలసృష్టికి కారణభూతమౌతున్నదన్నమాట. ఒకే సూర్యుడు వస్తుభేదాన్నిబట్టి వివిధాకృతులలో గోచరిస్తున్నట్లుగానే పరమాత్మ ధరించే అవస్థాభేదాల కనుగుణంగా పరాశక్తి కూడా తన రూపాలను ఐశ్వర్య, జ్ఞాన, శక్తిప్రదాత్రిగా మార్చుకుంటూ విశ్వ చాలన కార్యక్రమంలో తన కర్తవ్యాన్ని నిర్వహిస్తూ వుంటుందన్నమాట. మరి ఇది పరమపురుషుడైన వేంకటేశ్వరునకు బ్రహ్మో త్సవంగాను, పరాత్పరియైన అనంతచైతన్య శక్తికి నవరాత్రి మహోత్సవంగాను మనం తరించేందుకేర్పాటైన మహత్తర సమయం.

మానవ మనోమాలిన్యాలను మాని, దైవీసంపదను సాధించుకోవలసిన దీక్షాసమయం. వీధి వాదనే వాదాల కతీతంగా తిరుమల శిఖరాల వెలసిన, పుంజీభూత అనంతచైతన్యాన్ని సేవించి, ఆ జ్ఞానగంగలో మునకలిడి, మన కలిదోషాలను కడుగు కొందాం. మహేశ్వరధ్యాన తత్పరుడై కృష్ణకథను శ్రీరామునికంకితంచేసిన పోతనమహాకవి అనుసరించినదికూడా ఈ అఖండ చైతన్యారాధనమే మరి!

"అమ్మలగన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ, చాలఁబె
ద్దమ్మ, సురారులమ్మ, కడుపాఱడి పుచ్చినయమ్మ దన్ను లో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడియమ్మ దుర్గ మా
యమ్మ, కృపాబ్ధి, యిచ్చుత మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్"

Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press,
by M. Vijayakumar Reddy, L.P.T., Manager, T.T.D. Press, Tirupati.



SOME IMPORTANT VAHANAMS OF ANNUAL BRAHMOTSAVAM
CONDUCTED FROM 10-9-'83 TO 18-9-'83 AT TIRUMALA.





అలుగకువమ్మ నీ వాతనితో నెన్నఁడును
వలువేడుకలతోనే పాయకుండరమ్మ ॥

జలధిఁదవముసేసె సాధించెఁ బాతాళము
నెలత నీరమణుఁడు నీకుఁగానె
యిలవెల్లా హరించె నెనసెఁ గొండగుహల
యెలమి నిన్నుఁ గోరి నీ కితవుగానె ॥

బాలబొమ్మచారై యుండె వగలెల్లా సాధించె
నీ లీలలు దలచి నీకుఁగానె
తాలిమివ్రతము వట్టి ధర్మముతోఁ గూడుండె
పాలించి నీవు చెప్పిన పనికిఁగానె ॥

యెగ్గు సిగ్గుఁజూడఁడాయె యెక్కెఁ శిలాతలము
నిగ్గుల నన్నిటామించె నీకుఁగానె
అగ్గలపు శ్రీ వేంకటాద్రీశుఁడై నిలిచె
వొగ్గి నిన్నురాన మోచివుండుటకు గానె ॥

— శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యుల శృంగార సంకీర్తన.



# మీ మాట

## సెప్టెంబర్ సంచిక

సెప్టెంబర్ సప్తగిరి శోభాయమానమైన ముఖచిత్రంతో విలసిల్లుతోంది. లోపలి పేజీలలో కూడ వర్ణచిత్రాలు వేస్తే పత్రిక మరింత బాగుంటుంది. తిరుమలలోని శ్రీవారి ఉద్యానవనాలు, ఆభరణాలు, వాహనాలు తదితరమైన వాటిని ఒకటొకటిగా ముఖచిత్రంగా వేస్తూవుంటే వాటిని ప్రత్యక్షంగా చూడలేని భక్తులకు ప్రయోజనం కలుగుతుందని మనవి.

'గృహలక్ష్మి' లో ప్రచురించిన ప్రమద్వర రురువుల ప్రణయం నేటికాలానికి ఆదర్శప్రాయం.

ఎన్. లక్ష్మీతాయారు. — నరసాపురం

## సప్తగిరితో ముఖాముఖి

సెప్టెంబర్ సంచిక సకాలానికి అందినందుకు చాలాసంతోషం! సప్తగిరిలో 'సప్తగిరితో ముఖాముఖి' అనే శీర్షిక ప్రవేశపెట్టి పాఠకుల ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వవలసింది. బమ్మెర పోతనామాత్యుని భాగవతం తాత్పర్యంతో సహ సీరియల్‌గా ప్రచురిస్తే బాగుంటుంది.

సెప్టెంబర్ సంచికలోని 'లయవిన్యాస చక్రవర్తి శ్యామశాస్త్రి' రచన బాగుంది. రచయిత శ్రీ ఇలపావులూరి కామేశ్వరరావుకు అభినందనలు.

ఎం. వి. ఆర్. గుప్త — తెనాలి

* పోతన భాగవతాన్ని తాత్పర్య సహితంగా ప్రచురించే పథకాన్ని దేవస్థానం చేపట్టింది. ప్రథమస్కంధం విడుదలయింది కూడా. సం॥

## వింతజబ్బు

మీ పత్రిక పద్యగద్య విభాగాలతో ఒక పాఠ్యపుస్తకంలా వుంటున్నది. ఒక రచనలో కొంతభాగం ఫలానా పేజీలో అనీ, రెండవభాగం మొదట్లో ఫలానాపేజీ తరువాయి అని విడదీస్తున్నారు. ఈ వింత జబ్బు మరి ఏ ఇతర పత్రికల్లోనూలేదు. మేము ఆసక్తితో వ్యాసాలు చదివే వేళలో ఫలాన పేజీలో అని చూచి నిరుత్సాహం చెందుతున్నాము. దయచేసి ఈవింతజబ్బు మాన్పించండి.

చిప్ప సుధాకర్ — గరికపర్రు

సప్తగిరిలో వివిధ శీర్షికల రచనల్ని విభజించి ప్రచురిస్తూ కొన్నింటిని అసంపూర్తిగా ముద్రిస్తూ నిరవధిక పఠనానికి అసౌకర్యాన్ని కలిగిస్తున్నారు.

పోకం వైకుంఠం — వెంకటాపురం.

వ్యాసాల నిడివినిబట్టి ఇలాంటి నిర్ణయాలు తప్పనిసరి ॥ సం

## శృంగార శిల్పాలు

డా॥ దేవరకొండ శేషగిరిరావుగారి దేవాలయాలపై శృంగార చిత్రాలు చదివాను. ఆయనసేకరించిన అభిప్రాయ మాలా తోరణం మీగ్రంథానికి (సంచిక) అలంకారమే. కాని ఒక సందేహం. నిజానికి ఆ శృంగార శిల్పాలెందుకో ఆయనకూ సందేహమేనా! తనసందేహాన్ని పాఠకుల మీదికి వదలివేసి రచయిత నిశ్చింతు అయ్యారా? ఏ ఒక్క అభిప్రాయాన్ని మన్నించడంగాని, తెగడటంకాని చేయని రచయిత పక్షపాతరహితబుద్ధికి సంతోషించాలా! లేదా తన నిర్ణయాన్ని తెలియజేయని ఆయన లౌక్యానికి విస్తుపోవాలా!

ఆ వ్యాసం చదివితే పాఠకునిగా నాకు కల్గిన అభిప్రాయమిది.

డా॥ ఆర్. శ్రీనివాసాచార్య — తెనాలి

డిసెంబర్ సంచిక నుండి ప్రారంభం!

### అన్నమయ్య చెన్నకేశవ శతకం!

విద్వాన్ మైనంపాటి వేంకట సుబ్రహ్మణ్యకవిగారి

వినూత్న పరిశోధన!

ప్రత్యక్షసాక్ష్యాలతో ఫోటోస్టాట్ ఆధారాలతో!

## శుభాకాంక్షలు!

దీపావళి శుభసందర్భంగా మా పాఠకులు, రచయితలు, విక్రేతలు తదితర శ్రేయోభిలాషులకు మా శుభాకాంక్షలు.

॥ సం ॥

సెప్టెంబర్ సప్తగిరిలో కరుణశ్రీగారి "లీలాశుకుని వర్ణనలో బాల గోపాలుడు" వ్యాసం చాలా బాగుంది. లీలాశుకుని కవిత బంగారం. దానికి కరుణశ్రీగారు శ్రమ వ్యాఖ్యతో సువాసన కల్గించారు.

ఆ సంచికలోనే శ్రీ శ్యామశాస్త్రి జీవిత చరిత్రను వ్రాసిన శ్రీ ఇలపావులూరి కామేశ్వరరావుగారికి మా అభినందనలు.

కాని 17 వ పేజీలో రెండవ కాలమ్‌లో శ్రీ శ్యామశాస్త్రి తండ్రి శ్రీ విశ్వనాథ అయ్యర్ కంచినుండి తిరువారూరు చేరి కామాక్షి బంగారు విగ్రహాన్ని శ్రీ త్యాగరాజ స్వామివారి ఆలయంలో ఉంచి పూజిస్తుండేవారు" అని వ్రాశారు. దీనిని బట్టి శ్రీ త్యాగరాజు శ్రీ విశ్వనాథ అయ్యర్ కంటే పూర్వీకుడని తెలుస్తోంది. కాని 19 వ పేజీ మొదటి కాలమ్‌లో "ముగ్గురులో జ్యేష్ఠుడైన శ్యామశాస్త్రి" అని ఉటంకించారు. ఈరెండును పరస్పర విరుద్ధముగావున్నవి. 19 వ పేజీలో రెండవ కాలమ్‌లో "వీరి కుమారుడు శ్రీ సుబ్బరాయశాస్త్రి శ్రీ త్యాగరాజ స్వామి వద్ద సంగీతాభ్యాసం చేసినట్లు చరిత్ర చెబుతోంది" అని కూడా వ్రాశారు. కనుక వీరిద్దరిలో ఎవరు పెద్ద అన్నది తెలియటం లేదు. వివరింప ప్రార్థన.

పమ్మి సత్యనారాయణశాస్త్రి — విజయవాడ.

(తిరువారూరులో శ్రీ త్యాగరాజ స్వామివారి ఆలయం వుంది. ఆ దేవుని వరప్రసాదంగా జన్మించటంవల్లనే కాకర్ల రామబ్రహ్మంగారు తమ కుమారుడికి "త్యాగరాజు" అని నామకరణం చేశారు—17 వ పేజీ రెండో కాలమ్‌లో పేర్కొన్న త్యాగరాజస్వామి ఆలయం వాగ్గేయకారచక్రవర్తి త్యాగరాజుది కాదని తెలుసుకొంటే మీ సందేహాలు తీరిపోతాయి సం ॥)



# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాస పత్రిక...

నవంబర్ 1983

సంపుటి 14 సంచిక 6

ఈ సంచికలో....



ముఖచిత్రం: శ్రీవారి పుష్పయాగం.

గౌరవసంపాదకులు.

శ్రీ జి. కుమారస్వామిరెడ్డి,
ఐ. ఏ. ఎస్.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి

ప్రచురణకర్త - సంపాదకుడు:
కాట్రపాటి సుబ్బారావు,
ఎమ్. ఎ.

ఉపసంపాదకుడు.
తిరుమూరు సుధాకర్ రెడ్డి,
ఎమ్. ఎ. బి. ఇడి.

ముద్రాపకుడు.
ఎమ్. విజయకుమార్ రెడ్డి.

విడిప్రతి-రు. 1-00
సం॥ చందా-రు. 12-00

ప్రతులకు:
వెల్ ఫేర్ ఆఫీసర్,
టి. టి. డి., తిరుపతి

# సంపాదకీయం

దీపావళి అనగానే మనకు మొదటగా జ్ఞాపకం వచ్చేది సత్యభామా విజయం అనే నరకాసురవధ కథ. దీపావళికీ ఈ కథకీ సంబంధం లేదనేవారు చాలామందివున్నా, ఈ రెంటినీ కలిపి పండుగ చేసుకోవటమే ఆసేతుహిమాచలం అనవాయితీగా వస్తున్నది. పైగా దీపావళి ముందురోజుకు నరకచతుర్దశి పేరుండటం కూడా ఈ వాదానికి బలం కల్గిస్తున్నది.

చారిత్రకంగా ఈ రెంటికీ సంబంధం ఎలావున్నా, సమాజానికి కథవల్ల లభించే సందేశం ఎంతో విలువైనదే అనిపిస్తుంది.

జీవుని నరుడుగా మార్చేది మనస్సునే చెప్పాలి. 'మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః' అన్నట్లు మాధవాంశజుడు మానవుడు కావటానికి కూడా కారణం ఈ మనస్సే. దేవునితో శాశ్వతంగా ఉండాల్సిన బుద్ధిజీవి సంతత బద్ధజీవి కావటానికి హేతువు మనస్సు మరిగే లౌకికసుఖాలు. మనస్సు మార్గం చూపగా బుద్ధి నడిచే ఈ మాయదారిలో, బీజరూపంలోవున్న విషయవాసనలు విస్తృతి పొంది ఇంద్రియోన్మాదంగా తయారౌతాయి. దేవుని నుండి జీవుడువేరై నరుడుకాగా బుద్ధి అత్యంతం విషయబద్ధమై, ఆసురీప్రకృతిని పొందిపంచముఖ మురాసుర రూపంపొందుతుంది. అంతః శత్రువులనదగ్గ ఆర్గురినీ ఆప్తమిత్రులను కొంటుంది! అతిబలసంపన్నులు అను మేఘాలమీద అన్నిలోకాలు తిరిగిరాగల వీరి తాత్కాలిక మైత్రిలో వెనుకరూపు ముందుచూపులేక నాటి వర్తమానంలో అదే లోకంగా నరుడు క్రిందుమీదౌతూ దివికి భువికి నడుమనున్న వాళ్ళందరికి పీడాకరుడౌతూ చేయని అత్యాచారం ఉండదు. సమాజాని కింతటి సంక్షోభం కలిగిస్తూ జ్ఞాన తేజోఽతీత (ప్రాగ్జ్యోతిష) పురంలో కాపురం వెలగబెట్టే నరరూప నరకుణ్ణి, సర్వంసహా అని పించుకొన్న కన్నతల్లిగూడా క్షమించక తగిన పాఠం నేర్పే అవకాశంకోసం కాచుకొని వుంటుంది. ఇదీ-దేవ-జీవ-నర-నరకపరిణామ చరిత్ర.

నరకవధలో మనకు కన్పడేది దేవ జీవైక్య యత్నం. ఈ మానవమాయానగరంలో తెలియనితనంతో, తనకు తెలిసిందే తెలివనే భ్రమలో తొమ్మిది తలుపులు మూసుకొని కూర్చున్నాడు గనుక జీవుడు రాలేదని దేవుడే దిగివచ్చాడు. మనోగ్రవాంఛా మహోగ్ర సర్పప్రశమనుడైన గరుడునిమీద, సర్వంసహా రూపిణి సత్యభామా సహితుడై ఆ పరమాత్మే వచ్చినా ఆత్మను నొక్కిపట్టే కోతిబుద్ధికి కుదురెక్కడ మరి? నరకుడైన నరుడికి ఏదీ లెక్కలేదు. పైగా ఇన్నాళ్లు తన సొమ్ము తింటూవున్నందుకు ఆరుగురు ఆపన్మిత్రులు, పంచముఖుడు తోడురాకపోరనే ధీమా. అందువల్ల పోరు ప్రారంభం కాక తప్పదు.

ఈ యుద్ధంలో పరమాత్మ చేసిన మొదటి పని పంచేంద్రియ ముఖుడైన మురాసురుని అంతం చేయటం. తరువాత ఈ నవ ద్వారపురంలోని ఏడుగురు కావలివాళ్ళతో యుద్ధం. ఆ కృష్ణుడే యుద్ధంచేశాడు. కాని వీరిని మించింది జీవుని దేవుని నుంచి వేరుచేసిన బలీయమైన పాంచభౌతికశక్తి ఒకటుంది. అదే ప్రారబ్ధం. ఈ మాయదారిలోనే జీవుడు ఎన్ని మాయలు, మాటలు నేర్చినా! ఆత్మకు చివరి ఆవరణగా అంటివుండే ఈ ప్రారబ్ధాన్ని పార్థివశక్తే సంహరించాలి. అందువల్లనే పంచభూతాత్మకమైన యోగభోగాలకు ఆశ్రయ కారకమైన పృథివీతత్త్వం తగిన సమయం కోసం వేచివుండి సర్వేశ్వరుని అండతో సత్యభామా రూపంలో ప్రారబ్ధ పరిహారానికి ప్రయత్నిస్తుంది. అయినా కలుషిత బుద్ధికి బుద్ధి ఎక్కడొస్తుంది? చివరికి కృష్ణపరమాత్మ తన జ్ఞానచక్రంతో జీవప్రారబ్ధాన్ని నాశనం చేస్తాడు. అప్పుడు అహంలేని ఆత్మ అనంత తేజోరూపంగా భాసిస్తుంది.

ఇది ఒక జీవి కథ కాదు, ప్రతి నరునిలోని నరకుని గాథ. కనుకనే ఈ దీపావళి నరకానికి దూరంగా బ్రతికే ఈ నరుల జ్ఞాపక గాథావళి. అందుకు కారకుడైన ఆ పరమాత్మకు నరులిచ్చే కృతజ్ఞతా భావకళికావళి.

మానవుడు ముక్తి పొందుటకు అనువుగా మనదేశములో ఎన్నో పుణ్యక్షేత్రాలు పుణ్యతీర్థాలు వెలిశాయి. అదే విధముగా కొన్ని పుణ్యకాలాలు కూడా పూర్వులచే వ్రతోపవాస దేవతార్చనాదులకని ప్రత్యేకంగా పేర్కొనబడ్డాయి. అనాదిగా మన దేశంలో క్షేత్రసందర్శనం, తీర్థయాత్ర, వ్రతాచరణ వంటివి ఆస్తికులైనవారందరి చేత అనుసరింపబడుతూ వస్తున్నాయి. దేశభాషా విభేదాలతో నిమిత్తం లేకుండా భారత దేశమంతటా యీ ధార్మికాచరణ మనేది ఒకే విధంగా జరుగుతూంది. ఈ ఆధారాలు కొన్ని వేదవిహితమైన మంత్ర తంత్రాలతోకూడి ఉంటాయి, కొన్ని లౌకికమైన ఉత్సవాలతో సరితూగుతాయి. మరి కొన్ని ఈ రెండు పద్ధతులను లయలో జీర్ణించుకొని పండుగ, పర్వం మేళవించి నట్లుంటాయి. దీపావళి అమావాస్య యీ చివరి రకానికి చెందుతుంది. ఇది పుణ్య కాలం. ఉత్తమమైన పండుగ దినం. ఆ బాలవృద్ధులూ ఆనందోత్సాహాలతో జరుపుకొనే పండుగ.

వైదిక యుగంలో ఆశ్వయుజి, ఆగ్రహాయణి వంటి పర్వోత్సవాలు ఆశ్వయుజ పూర్ణిమనాడు జరిపేవారు. దీపావళి గురించి అనాడు ఏ విధమైన పండుగ జరిపేవారో స్పష్టంగా తెలియదు. కాని భారతం అను శాసనిక పర్వంలో "దీప ప్రదః స్వర్గలోకే దీపమాలేవ రాజతే" అన్న శ్లోకాంశాన్నిబట్టి మహాభారత కాలానికి ఈ పండుగ ఆచరణలో ఉండి ఉంటుందని చెప్పవచ్చును. దీపావళితో సంబంధించే నరక చతుర్దశి, బలిప్రతిపత్, యమ ద్వితీయ, నాగచతుర్థివంటివి ఎన్నో ధర్మశాస్త్రాలలో పేర్కొబడ్డాయి. ఇవన్నీ కలిపిచూస్తే దీపావళి పండుగ నాలుగు, ఐదు రోజుల పండుగగా రూపిస్తుంది. అయినా నరక చతుర్దశి, దీపావళి అమావాస్య అనేవి రెండూ వీటిలో చాలా ముఖ్యమైనవిగా భావింపబడి దేశమంతటా ఆచరింపబడుతూ వస్తున్నాయి. మిగిలినవి దేశంలో కొన్ని భాగాలలో ఎక్కువ ఆసక్తి




తోను మరికొన్ని భాగాలలో యథానుకూలం గాను ఆచరింపబడుతున్నాయి.

దక్షిణదేశంలో ఈ పండుగ నరకచతుర్దశితో ప్రారంభమౌతుంది. అన్ని చోట్లా అందరూ ఆ రోజున నరకచతుర్దశీస్నానం అనే ఆచారాన్ని శ్రద్ధగా పాటిస్తారు. పంచాంగాల్లో ఈ స్నానాన్ని గూర్చి విస్పష్టంగా వ్రాసి స్నానకాలాదికంలోగల సందేహాలన్నీ ముందే పరిహరించారు. ఆచారవంతులైన వారు త్రయోదశినాడు సంధ్యాకాలంలో గృహబహిర్ద్వారంలో యమదీపం వెలిగిస్తారు.

కార్తికస్యాసితే పక్షే
త్రయోదశ్యాం నిశాముఖే
యమ దీపం బహిర్దద్యా
దపమృత్యుర్వినశ్యతి ''



అని చెప్పిన వానినిబట్టి యీ దీపం అపమృత్యునివారకమైనదని భావన. ఇదే విధిననుసరించి ఈ దీపం వెలిగించినప్పుడు

మృత్యునా పాశదండాభ్యాం
కాలేన శ్యామయా సహ
త్రయోదశ్యాం దీపదానాత్
సూర్యజః ప్రీయతాం మమ ''

అనే మంత్రాన్ని చదివి యమునికి నమస్కరిస్తారు. ఆ రాత్రి వేగిన పిదప తెల్లవారు ఝామున పిన్నపెద్దలందరూ నరకచతుర్దశీ స్నానం చేస్తారు, ఇది శాస్త్రీయమైన విధి, నరక నివారకం. నరకాసురవధ ఈ రోజున జరిగినదని పురాణ గాథ.

కార్తికే కృష్ణ పక్షేచ
చతుర్దశ్యాం దినోదయే
అవశ్యమేవ కర్తవ్యం
స్నానం నరకభీరుభిః ''

స్కాందపురాణం వైష్ణవ ఖండంలో ఈ రోజున తైలములో లక్ష్మీదేవి, జలములో గంగాదేవి ఆవహించి ఉందురని, కనుక చతుర్దశీ తైలాభ్యంజనం వల్ల ఆ దేవీ ద్వయానుగ్రహం సిద్ధిస్తుందనీ, ఈ స్నానం నరకాపనోదకమనీ వ్రాయబడింది.

తైలే లక్ష్మీర్జలే గంగా
దీపావళ్యాశ్చతుర్దశీం
ప్రాతఃస్నానం హి యః కుర్యాత్
యమలోకం న పశ్యతి

పెద్దలీరోజున చిన్నవారిని చిరంజీవులు కమ్మని దీవిస్తూ తలమీద నూనె వేసి స్నానము చేయిస్తారు. ఆ సందర్భములో

అశ్వత్థామా బలి ర్వ్యాసో
హనుమాంశ్చ విభీషణః
కృపః పరశురామశ్చ
సప్తైతే చిరజీవినః

అని చిరంజీవులైన అశ్వత్థామాదులను స్మరిస్తారు. స్నాన సమయంలో మట్టితో



కూడిన అపామార్గ (ఉత్తరేణి) శాఖను తలచుట్టూ త్రిప్పుతూ,

హర పాప మపామార్గ
భ్రామ్యమాణః పునః పునః
ఆపదం కిల్బిషం చాపి
మమాపహర సర్వశః

అని అపామార్గ స్తోత్రం చదువుతారు. ఆ పైన కొందరింకా ఆస్తికులైన వాళ్లు, ఆచార వంతులు, నైష్ఠికులు అయినవాళ్లు యమప్రీత్యర్థం తర్పణాలు విడుస్తారు. ఈ సందర్భంలో యమునికి పధ్నాలుగు పేర్లు చెప్పబడ్డాయి. ఆ పేర్లన్నీ చెప్పి తర్పణాలు విడుస్తారు. కొందరీరోజున 14 రకాల కూరలు తింటారు. స్నానానంతరం "కారీత ఫలాన్ని కాలితో త్రొక్కడం కూడా కొందరిళ్ళల్లో ఆచారంగా కనిపిస్తుంది "ధర్మ సింధు"లో తర్పణ స్నానం యతీశ్వరులకి కూడా విధేయమని వ్రాయబడింది. దానిని బట్టి గృహస్థుల విషయంలో దీని కెంత ప్రాధాన్యమో ఊహించుకోవచ్చును. మరునాడు అమావాస్య రోజునకూడ స్నానం విధేయం. అశ్వత్థ (రావి) ఉదుంబర (మేడి), ప్లక్ష (జువ్వి), ఆమ్ర (మామిడి), వట (మర్రి) పల్లవాలు (చిగురులు) నానవేసిన నీళ్ళతో ఈ స్నానం చేస్తారు.

ఇషాసిత చతుర్దశ్యా
మిందుక్షయ తిథావపి
ఊర్ధ్వాదేస్వాతి సంయుక్తే
తదా దీపావళీ భవేత్

— అని చెప్పిన దానిని బట్టి బలి శ్రీమహావిష్ణువులను శాసనాన్ననుసరించి ఈ దీపోత్సవం చతుర్దశి, అమావాస్య. పాడ్యమి అనే మూడు రోజులు రాత్రిలందు జరుపుతారు.

దీపావళికి "సుఖసుప్తిక" అని, "సుఖరాత్రి" అని, "యక్షరాత్రి" అనికూడా పేర్లు కలవు. దీపాలిక అని కూడా కొందరు పిలుస్తారు. జైనులుకూడా తమ ఆలయాలలో ఈ రోజున వృక్షపూజ చేసి దీపారాధన చేస్తారు. మార్వాడీలు లక్ష్మీపూజ చేస్తారు.

అమా వాస్యా యదా రాత్రౌ
దివాభాగే చతుర్దశీ
పూజనీయా తదా లక్ష్మీ
ర్విజ్ఞేయా సుఖరాత్రికా॥

అనే శాస్త్రవచనాన్ననుసరించి, ఉదయానికి చతుర్దశి ఘడియలుండి, రాత్రికి అమావాస్య సంక్రమించిన దీపావళిరోజున లక్ష్మీపూజ అవశ్యాచరణీయమని తెలుస్తుంది. కాగా లక్ష్మీ సంపన్నులైన వైశ్యుల కిది విశేష విధి. కొందరీ రోజున లక్ష్మీపూజతో పాటు కుబేర యక్షపూజ కూడా చేస్తారు. వంగదేశంలో ఈ రోజున కాళీపూజ చేయుదురు. గుజరాత్‌లో ఈ పండుగకు ధనతేరస్ అని పేరు. వర్తకులీ రోజుతో పాత సంవత్సరపు లెక్కలు ముగించి, మరునాటి నుండి క్రొత్త సంవత్సరపులెక్కలు ప్రారంభిస్తారు. విక్రమశకాబ్దం ఈ రోజుతో ప్రారంభిస్తుంది.

దీపావళినాడు టపాకాయలు కాల్చడం అంతా ఎరిగినదే. సంజవేళ దీపాలు వెలిగించి, ఆముదపు కాడతో "దిబ్బు దిబ్బు దీపావళి, మళ్ళీ వచ్చే నాగులచవితి" అని పాడుతూ వత్తులు వెలిగించి నేలమీదకొట్టి ఆర్పడం ఆంధ్రదేశంలో ఆచారం. ఇంటి-ఇంటిలో దీపారాధన జరుగుతుంది. ఈ సందర్భంలో ఉల్కా దర్శనం అనే ఆచారం పేర్కొదగింది. ఇది మహాలయ పక్షంలో భూలోకానికి వచ్చిన పితృదేవతలను తిరిగి వారి లోకానికి అంపకం పెడుతూ, దారిలో

వారికి వెలుగు చూపడమనే ఉద్దేశ్యంతో ఏర్పడిన ఆచారం. దీపం మన అజ్ఞానాంధకారాన్ని తొలగించి జ్ఞానప్రకాశాన్ని కలిగించే వస్తువు. అదే భావనతో

త్వం జ్యోతిః శ్రీరవిః వహ్ని
విద్యుత్సౌవర్ణ తారకః
సర్వేషాం జ్యోతిషాం జ్యోతిః
దీప జ్యోతిః స్థితే నమః॥

అని దీపాలు వెలిగించి నమస్కరిస్తారు. ఆలయాలు, చైత్యాలు వగైరాలలో కూడా ఈ రోజున దీపారాధన జరుగుతుంది. అటు ఆకాశంలో కూడా ఈ ఋతువులో కాంతివంతమైన నక్షత్రాలెన్నో పెద్ద పెద్ద దీపాలు వెలిగించినట్లు బారులు దీర్చి కనిపిస్తాయి. క్రిందనూ మీదనూ ఉజ్వలంగా మెరుస్తూ ఈ దీపాలతోపాటు, టపాకాయలు కాలుస్తున్న ఆనందంతో పిల్లల ముఖాలు కానుకలందుకొని అత్తవారింట్లో ఆనందించే అల్లుళ్ల ముఖాలు, పండుగంతా మాదే అని కలకలలాడే ఆడవాళ్ల ముఖాలు అన్నీ ఒకే విధంగా వికసించి మెరుస్తున్నట్లుంటాయి. కొందరిండ్లలో ఈ రోజున 'కేదారవ్రతం' అనే వ్రతం ఆచరిస్తారు. ఇట్లనేక విధాలుగా ఈ దీపావళి పండుగ ఖండఖండాంతరాల్లో కూడా జరుపుతారని తెలుస్తూంది.

మరునాడు పాడ్యమికి "బలిపాడ్యమి" అని పేరు. "వామనావతార"కథ ఈరోజున జరిగినదని చెప్తారు. వామనుని ఆదేశాన్ననుసరించి పాతాళానికి పోయిన బలి ఈ రోజున తిరిగి భూలోకానికి వచ్చి సంచరిస్తాడని, ఇంటింటా అతనికి స్వాగతసత్కారాలాచరించాలని పూర్వులు నిర్ణయించారు. అందుకని చాలమంది ఈ రోజున బలిపూజ జరుపుతారు. ఇంట్లో వేర్వేరు రంగుల ముగ్గులతో బలిచిత్రం రచించడానికి యథావిధిగా షోడశోపచార పూజలు చేస్తారు. దీని వలన బలి సంతోషించి ఆశీర్వదిస్తాడని విశ్వాసం. కొందరీరోజున వీరపూజచేస్తారు. అది కారణంగా దీనికి వీరప్రతిపత్ అనికూడ పేరు. ఈ రాత్రి కొందరు ద్యూతక్రీడ జరుపుతారు. శివుడు పార్వతితో జూదమాడినాడనీ, ఈ రోజున జూదంలో గెల్చినవారికి ఈ సంవత్సరమంతా లాభదాయకంగా ఉంటుందనీ చెపుతారు. నేపాల్ ప్రాంతంలో ఈ ఆట ఈనాటికీ గొప్ప ఆచారంగా వ్యవహరిస్తారు. గోవర్ధన ప్రాంతంలో ఈ రోజు గోపూజ, గోవర్ధనపూజ జరుపుతారు. దేశములో మరికొన్ని చోట్లకూడా ఈ గోపూజ జరుగుతుంది. భూతలాన లక్ష్మి ఈ నాడు గోవులలో ఆవహించి నిలుస్తుందని అందుకని గోరూప లక్ష్మీపూజ చేయమని ధర్మశాస్త్రాలు చెప్తాయి. లక్ష్మీగోరూపంలో నిల్చి దేవతలకి యజ్ఞార్థం ఘృతాన్నిచ్చే దని విశ్వాసం. అందుకని

యా లక్ష్మీర్దివి వసే పుణ్యే
దీపావల్యాం చ భూతలే
గవాం గోష్ఠే తు కార్తిక్యాం
స లక్ష్మీ ర్వరదా మమ॥
యా లక్ష్మీర్లోకపాలానాం
ధేనురూపేణ సంస్థితా
ఘృతం వహతి యజ్ఞార్థే
మమ పాపం వ్యపోహతు॥

అని ఈ రోజున గోష్ఠాగారాల్లోని గోధనాన్ని పూజించి నమస్కరిస్తారు. ఆ మరునాడు విదియ. దీనికి యమద్వితీయ అని పేరు. యముడీ రోజున తన సోదరి యమున ఇంట విందారగించినాడనీ, ఈ రోజున తమ సోదరి ఇంట భోజనం చేసి ఆమెకు కట్న కానుక లంపజేసిన వారికి అమితమైన ఆయురారోగ్యాది సత్ఫలాలు కలుగుతాయని పెద్దలు చెప్తారు. పంచాంగంలో "భగినీ హస్తభోజనం"అని వ్రాస్తారు ఇది సాంఘికమైన చక్కని ఆచారం ఆస్తికులయినవారు ఈ రోజున యమునికి అతని పరివారానికి అర్ఘ్యపాద్యాదులు విడుస్తారు.

యమం చ యమునాం చైవ
చిత్రగుప్తం చ పూజయేత్
అర్ఘ్యంచాత్ర ప్రదాతవ్యమ్
యమాయ సహజద్వయైః॥

అని హేమాద్రి చెప్పిన దానిని బట్టి యముడు, యమున, చిత్రగుప్తుడు మొ॥ వారిందరూ ఈరోజున పూజించదగినవారు. యమునాతీరంలో ఈ పూజ నేటికీ విశేషమైన శ్రద్ధాభక్తులతో ఆచరిస్తారు. ఇట్లు జాతి మత ప్రాంత విభేదములు లేక, అన్ని ప్రాంతాల ప్రజావళిచే జరుపుకొనబడుచున్న ఈ దీపావళి భారతీయుల సంస్కృతీసంప్రదాయములకు చిహ్నము. •

## దీపాలు వెలిగించు

నీవు మృత్యుంజయుడివి;
నేను మృత్యుభయ గయుడిని;
నీవు మృగయా వినోదివి;
నేను ఒక కాంచన మృగాన్ని.

నా మనస్సు ఇంద్ర ధనుస్సు;
నా వయస్సు ఒక నవ ఉషస్సు;
గుండె గుసగుసలు పండనివ్వు;
జీవన మధుపాత్ర నిండనివ్వు.

ఇప్పుడు నీ చిత్ర రంగవల్లికి;
నా కోర్కెల చితాభస్మంకోరకు;
ఈ ఆశల జిలుగు జాబిల్లి ఎదలో;
నీ జ్ఞానాగ్ని జ్వాల రగిలించకు.

నీ దివ్యచరణ ధూళికి;
నా భవ్యమలిన మౌళి తగదు;
ఈ మేడలోని చీకటి గది;
నీ వెలుగు రేక తాక నివ్వదు.

ఇప్పు డిప్పుడే;
నా గుండె లోతుల్లో;
శ్రీవడలయుగతులు;
తీయగ మోగుతున్నాయి.

నా కంటి తెరపై
నవరత్న కిరీట రుచి
శుభ కౌస్తుభ మణిద్యుతి;
హాయిగా సాగుతున్నవి.

నీ సృష్టి-దృష్టికి
ఒక వింత కార్యాలయం;
ఈ జగత్తు-దృక్కుకు
ఒక ప్రాకృత కర్మాగారం.

కనిపించే ఈ పెనుమాయ వెనుక
కనిపించని పరమాత్మ ఉనికి;
నమ్మని నామోహాంధమనోతిమిరావళిలో
కమ్మగ వెలిగించు నీ విశ్వరూప దీపావళి.

— ఉప్పు రాఘవేంద్రరావు

# తిరుమల తిరుపతి దేవస్థానముల బోర్డు

ఈ క్రింది వారు సభ్యులుగా, అధ్యక్షుడుగా నూతన టి.టి.డి బోర్డును ఆంధ్రప్రదేశ్ గవర్నర్ ఏర్పాటు చేయడం జరిగింది.

శ్రీ వి. కనకదుర్గా వెంకట సత్యనారాయణ రాజు (కనకరాజు),
అత్తిలి. ఎం.ఎల్.ఏ – అధ్యక్షులు.

శ్రీమతి నన్నపనేని రాజకుమారి, ------------ " — సభ్యులు.
తెనాలి.

శ్రీ తలారి రుద్రయ్య, ------------ " — "
పెనుమూరు.

శ్రీ గుత్తం మాధవ రెడ్డి, ------------ " — "
మద్దులపల్లి.

శ్రీ కొల్లా అప్పలనాయుడు, ------------ " — "
విజయనగరం.

శ్రీ ఎల్. నర్సింగ్ నాయక్, ------------ — "
హైదరాబాదు.

శ్రీ పి. యాదగిరి, ------------ — "
మంచిరియాల్.

శ్రీ నందగోపాల్, ------------ — "
మద్రాసు.

శ్రీ హెచ్. ఆర్. బసవరాజు, ------------ — "
బెంగుళూరు.

శ్రీ పి. వెంకటేశ్వర్లు, ------------ — "
హైదరాబాదు.

శ్రీ బొబ్బా సత్యనారాయణ, ------------ — "
చిలకలూరిపేట.

కమీషనర్, దేవాదాయశాఖ, ------------ — "
హైదరాబాదు.

కార్యనిర్వహణాధికారి, ------------ — "
తి.తి.దే. – తిరుపతి.

* * * *

# నిర్వాహకమండలి

శ్రీ వి. కనకదుర్గా వెంకట సత్యనారాయణ రాజు, (ఎక్స్ అఫిషియో ఛైర్మన్).

కమీషనర్, దేవాదాయ శాఖ, (ఎక్స్ అఫిషియో సభ్యులు)
హైదరాబాదు.

కార్యనిర్వహణాధికారి – తి. తి. దే., తిరుపతి. "

శ్రీమతి నన్నపనేని రాజకుమారి, ఎం.ఎల్.ఏ --- " సభ్యులు
తెనాలి.

శ్రీ ఎల్. నర్సింగ్ నాయక్, ------------ "
హైదరాబాదు.



# శ్రీమద్భగవద్గీత

(సీరియల్)

వ్యాఖ్యాత :

శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి

(గతసంచిక తరువాయి)

## ఆరవ అధ్యాయం

## ఆత్మసంయమయోగం

శ్రీ భగవానువాచ;

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః ।
స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాఽక్రియః ॥

శ్రీ భగవానుడు: కర్మఫలాపేక్ష లేకుండా కర్తవ్యాలను ఆచరించే వాడే నిజమైన సన్యాసి, యోగి అవుతాడు. అంతే కాని అగ్నిహోత్రాది కర్మలు మానివేసినంత మాత్రాన కాదు.

యం సన్న్యాస మితి ప్రాహుః యోగం తం విద్ధి పాణ్డవ ।
నహ్యసన్న్యస్త సఙ్కల్పో యోగీ భవతి కశ్చన ॥

పాండునందనా! సన్యాసమూ, కర్మయోగమూ ఒకటే అని తెలుసుకో. ఎందువల్లనంటే సంకల్పాలను వదలి పెట్టని వాడెవడూ యోగి కాలేడు.

ఆరురుక్షో ర్మునేర్యోగం కర్మ కారణ ముచ్యతే ।
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే ॥

ధ్యాన యోగాన్ని సాధించదలచిన మునికి నిష్కామ కర్మయోగమే మార్గం. యోగ సిద్ధి పొందినవాడికి కర్మ త్యాగమే సాధనం.

యదా హి నేన్ద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే ।
సర్వసఙ్కల్ప సన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే ॥

ఇంద్రియవిషయాలమీద కాని, కర్మల మీద కాని ఆసక్తిలేకుండా సంకల్పాలన్నీ విడిచి పెట్టినవాడిని యోగారూఢుడంటారు.

ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మాన మవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బన్ధుః ఆత్మైవ రిపు రాత్మనః ॥

తన మనస్సే తనకు బంధువూ, శత్రువూ కూడా. కనుక మానవుడు తనకు తానే ఉద్ధరించుకోవాలి. తన ఆత్మను అధోగతి పాలు చేసుకోకూడదు.

బన్ధురాత్మాఽఽత్మన స్తస్య యేనాత్మై వాత్మనా జితః ।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్ ॥

మనస్సును స్వాధీనపరచుకున్నవాడికి తన మనస్సే బంధువు. మనస్సును జయించని వాడికి మనస్సే ప్రబల శత్రువులాగ ప్రవర్తిస్తుంది.

జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః ।
శీతోష్ణ సుఖదుఃఖేషు తథా మానావమానయోః ॥

ఆత్మను జయించిన ప్రశాంతచిత్తుడు పరమాత్మ సాక్షాత్కారం నిరంతరం పొందుతూ శీతోష్ణాలు, సుఖ దుఃఖాలు, మానావమానాలపట్ల సమభావం కలిగివుంటాడు.

జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః ।
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాఞ్చనః ॥

శాస్త్ర జ్ఞానంవల్ల, అనుభవజ్ఞానంవల్ల సంతృప్తి చెందినవాడు, నిర్వికారుడు, ఇంద్రియాలను జయించిన వాడు, మట్టినీ రాతినీ బంగారాన్నీ సమదృష్టితో చూచేవాడూ యోగి అని చెప్పబడుతాడు.

సుహృన్మిత్రా ర్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బన్ధుష ।
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే ॥

శ్రేయోభిలాషి, స్నేహితుడు, శత్రువు, ఉదాసీనుడు, మధ్యస్థుడు, విరోధి, బంధువు, సాధువు, దురాచారి–వీళ్లందరి పట్ల సమబుద్ధి కలిగినవాడే సర్వోత్తముడు.

యోగీ యుంజీత సతతం ఆత్మానం రహసి స్థితః ।
ఏకాకీ యత చిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః ॥

యోగి ఏకాంత స్థలంలో ఒంటరిగా వుండి, ఆశలను వదలి, ఇంద్రియాలనూ మనస్సునూ వశపరచుకుని, ఏమీ పరిగ్రహించకుండా చిత్తాన్ని ఆత్మమీదే నిరంతరం నిలపాలి.

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః ।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజిన కుశోత్తరమ్ ॥

ఎక్కువ ఎత్తూ పల్లమూ కాని పరిశుద్ధమైన ప్రదేశంలో దర్భలు పరచి. దానిమీద చర్మమూ, ఆపైన వస్త్రమూ వేసి తన స్థిరమైన ఆసనాన్ని ఏర్పరచుకోవాలి.

తత్రైకాగ్రం మనః కృత్వా యత చిత్తేన్ద్రియ క్రియః ।
ఉపవిశ్యాసనే యుఞ్జ్యాత్ ! యోగ మాత్మ విశుద్ధయే ॥

ఆ ఆసనం మీద కూర్చుని, ఇంద్రియాలను మనస్సును స్వాధీన పరచుకుని, ఏకాగ్రచిత్తంతో ఆత్మశుద్ధికోసం యోగాభ్యాసం చేయాలి.

సమం కాయ శిరో గ్రీవం ధారయ న్నచలం స్థిరః ।
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చాऽనవలోకయన్ ॥
ప్రశాన్తాత్మా విగతభీః బ్రహ్మచారివ్రతే స్థితః ।
మన స్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః ॥

శరీరమూ, శిరస్సూ, కంఠమూ కదలకుండా సమంగా, స్థిరంగా వుంచి, దిక్కులు చూడకుండా ముక్కుచివర దృష్టి నిలిపి, ప్రశాంతచిత్తంతో, భయం విడిచి పెట్టి, బ్రహ్మచర్య వ్రతం అవలంబించి, మనోనిగ్రహం కలిగి, బుద్ధిని నామీదే లగ్నంచేసి, నన్నే పతిగా, గతిగా భావించి ధ్యానం చేయాలి.

యుఞ్జన్నేవం సదాऽऽత్మానం యోగీ నియత మానసః ।
శాన్తిం నిర్వాణ పరమాం మత్సంస్థామధిగచ్ఛతి ॥

అలాంటి యోగి ఆత్మానుభవం మీద మనస్సును నిరంతరం నిలిపి, నా అధీనంలో వున్న మోక్షప్రదమైన శాంతిని పొందుతున్నాడు.

నాత్యశ్నతస్తు యోగోऽస్తి న చైకాన్త మనశ్నతః ।
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున ! ॥

అర్జునా ! అమితంగా భుజించేవాళ్లకీ, బొత్తిగా తినని వాళ్లకీ, అత్యధికంగా నిద్రపోయే వాళ్లకీ, అసలు నిద్ర పోని వాళ్లకీ యోగం సిద్ధించదు.

యుక్తాహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు ।
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా ॥

ఆహారవిహారాలలో, కర్మలలో, నిద్రలో, మేల్కొవడంలో పరిమితి పాటించే యోగికి సర్వదుఃఖాలు పోగొట్టే యోగసిద్ధి కలుగుతుంది.

యదావినియతం చిత్తం ఆత్మన్యేవాऽవతిష్ఠతే ।
నిస్పృహస్సర్వ కామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా ॥

మనస్సును వశపరచుకుని ఆత్మమీదే నిశ్చలంగా నిలిపి, సర్వవాంఛలూ విసర్జించినప్పుడు యోగసిద్ధి పొందాడని చెబుతారు.

యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా ।
యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగ మాత్మనః ॥

ఆత్మయోగం అభ్యసించేవాడి మనస్సు గాలిలేనిచోట వుండే దీపంలాగ నిలకడగా వుంటుంది.

యత్రో పరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా ।
యత్ర చైవాత్మనాऽऽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి ॥
సుఖ మాత్యన్తికం యత్తత్ బుద్ధిగ్రాహ్య మతీన్ద్రియమ్ ।
వేత్తి యత్ర న చైవాऽయం స్థిత శ్చలతి తత్త్వతః ॥
యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాऽపి విచాల్యతే ॥
తం విద్యా ద్దుఃఖసంయోగ వియోగం యోగ సంజ్ఞితమ్ ।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోऽనిర్విణ్ణ చేతసా ॥

ఏ స్థితిలో మనస్సు యోగాభ్యాసంవల్ల నిగ్రహించబడి శాంతిని పొందుతుందో, యోగి ఎప్పుడు పరిశుద్ధమైన మనస్సుతో పరమాత్మను తనలోనే సందర్శిస్తూ సంతోషిస్తున్నాడో ఇంద్రియాలకు గోచరించకుండా బుద్ధివల్లనే గ్రహించబడే అనంతసుఖాన్ని అనుభవిస్తున్నాడో, ఆత్మతత్వం నుంచి ఏ మాత్రం చలించడో, దేనిని పొంది, దానికి మించిన లాభం మరొకటి లేదని భావిస్తాడో, ఏ స్థితిలో స్థిరంగా వుండి దుర్భరదుస్సహదుఃఖానికయినా కలత చెందడో; దుఃఖాలకు దూరమైన అలాంటి దానినే యోగమంటారు. దిగులు పడకుండా దీక్షతో ఆ యోగాన్ని అభ్యసించాలి.

సఙ్కల్పప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వానశేషతః ।
మనసైవేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః ॥
శనై శ్శనై రుపరమేత్ బుద్ధ్యా ధృతిగృహీతయా ।
ఆత్మసంస్థం మనః కృత్వా న కిఞ్చిదపి చిన్తయేత్ ॥

సంకల్పం వల్ల కలిగే సకల వాంఛలనూ సంపూర్ణంగా విడిచిపెట్టి ఇంద్రియాలన్నిటినీ సమస్త విషయాల నుంచి

(37వ పేజీలో)




# ముండకోపనిషత్తు

గతసంచిక తరువాయి)

## తృతీయముండకం

## ద్వితీయఖండం

స వేదైతత్పరమం బ్రహ్మధామ
యత్ర విశ్వం నిహితం భాతి శుభ్రమ్
ఉపాసతే పురుషం యే హ్యకామాః
తే శుక్రమేతదతివర్తంతి ధీరాః

తనలో విశ్వమునంతను ఉంచుకుని ఏలాటి మాలిన్యం లేనివాడై అన్ని భూతా లకూ ఆధారమై పరాత్పరుడై భాసించే యీశ్వరుణ్ణి ధ్యానయోగంచే సాత్వికుడై నిశ్చలమూ నిర్మలమూ అయిన మనసు కలవాడే తెలుసుకోగలడు. ఏలాటి కోరికా లేనివారై ఈశ్వరుణ్ణి ఉపాసించేవారు మళ్ళీ ఇక్కడ పుట్టరు.

2

కామాన్యః కామయతే మన్యమానః
స కామభిర్జాయతే తత్ర తత్ర
పర్యాప్త కామస్య కృతాత్మనస్తు
ఇహైవ సర్వే ప్రవిలీయంతి కామాః

అది కావాలి, ఇది కావాలి అని కోరిక లలో కూరుకుపోయేవాడు వాటికి తగినట్లు పుట్టి వాటి ననుభవిస్తూ చస్తూ మళ్ళీ ఏ తల్లి కడుపునందో పుట్టుతూ ఉంటాడు. ఆ చక్రం అలాగు తిరుగుతూ ఉండ వలసిందే.

మానవుడై పుట్టినందుకు అనుభవించ వలసి నంతవరకు కోరికలనుభవించి ఇక చాలుననే నిర్ణయానికి వచ్చి మనస్సును వశపరచుకున్నవాడి కోరికలన్ని ఇక్కడే ముగిసిపోతాయి. వాడికి మళ్ళీ పుట్టడం అనేది ఉండదు.

3

నాయమాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన
యమేవైష వృణుతే తేన లభ్యః
తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్

వేదశాస్త్రాలు పఠించడం, చెప్పడం, వాటి విషయాన్ని సంపూర్ణంగా తెలుసు కోవడం మంచిదే. కాని వాటివల్ల ఈశ్వర సాయుజ్యం లభించదు. నిశ్చలమైన భక్తి యోగములో తన ప్రభువును ఈశ్వరార్పణ చేసిన వానికి ఆ ప్రభువు తన శరీరములో ప్రవేశం ఇస్తాడు. (తనలో చేర్చుకుంటాడు)

4

నాయమాత్మా బలహీనేన లభ్యః
న చ ప్రమాదాత్తపసో వాప్యలింగాత్
ఏతైరుపాయైర్యతతే యస్తు విద్వాన్
తస్యైష ఆత్మా విశతే బ్రహ్మధామ

కామానికి లొంగి మితిమీరి స్వేచ్ఛగా తిరిగి వీర్యశక్తి పోగొట్టుకొన్నవాడు, భ్రమ ప్రమాదాలకు అలవాటై దోయినవాడు, విధివిరుద్ధమైన తపస్సు చేసేవాడున్నూ ఈశ్వరుణ్ణి చేరలేరు.

తాను కులాచారం ప్రకారం చెయ్యవలసే పనులు చేస్తూ చిత్తశుద్ధి కలిగి ఇంద్రి యాలను అదుపులో పెట్టుకుని చెరగని, తరగని భక్తిముద్రతో తనలో ఉన్న యీశ్వరుణ్ణి వెదికేవాడు ఈశ్వరుణ్ణి చేర గలడు. విద్వాంసుడంటే అతడే.

5

సంప్రాప్యైనం ఋషయోజ్ఞానతృప్తాః
కృతాత్మానో వీతరాగాః ప్రశాంతాః
తే సర్వగం సర్వతః ప్రాప్య ధీరాః
యుక్తాత్మానః సర్వమేవావిశంతి

ఋషులు ఈశ్వరుణ్ణి తమలోనూ అంత టనూ చూసేజ్ఞానమును ధ్యానయోగ సాధ నచే సంపాదించి తృప్తులై, ఏ కోర్కెలూ లేనివారై కామక్రోధాదులకు లొంగని ప్రశాంత చిత్తులై అంతటనూ వ్యాపించి ఉన్న యీశ్వరుణ్ణి మనసారా చూసి ధన్యు లమయా మని సంతోషిస్తారు. ఆ యీశ్వ రుణ్ణి విడువక అతనితోనే తిరుగుతూ ఉంటారు.

(అంతదాకా బ్రహ్మ లోకంలో సంచ రిస్తూ ఉంటారు)

6

వేదాంత విజ్ఞానసునిశ్చితార్థాః
సన్న్యాసయోగాద్యతయః శుద్ధసత్త్వాః
తే బ్రహ్మలోకేషు పరాంతకాలే
పరామృతాః పరిముచ్యంతి సర్వే

అన్నిటి సంబంధం వదులుకుని, [illegible] మాలకు కట్టుబడి, ఉపనిషత్తుల చెప్పినది అర్థం చేసుకుని నిర్మలమైన మనసుగల బుద్ధిమంతులు ముక్తిపొంది పరమానందాన్ని పొందుతూ ఉంటారు. మహాప్రళయం కాగానే మళ్ళీ తమకు తగిన వంశాలలో ఇక్కడ (నేలపై) జన్మిస్తారు.

లెక్కప్రకారం వచ్చే ప్రళయాలలో మోక్షంపొందినవారికి తిరిగి పుట్టడం ఉండదు.

మహాప్రళయం వచ్చాక-మళ్ళీ బ్రహ్మ సృష్టిని ఆరంభించేటప్పుడు అంతవరకు అక్కడ ఆనందంగా ఉన్నవారు ఇక్కడకు వస్తారు.)

7

గతాఃకలాః పంచదశ ప్రతిష్ఠాః
దేవాశ్చసర్వే ప్రతిదేవతాసు
కర్మాణి విజ్ఞాన మయశ్చ ఆత్మా
పరేఽవ్యయే సర్వఏకీభవంతి

ఆ విధంగా మోక్షంపొందినవాని శరీర మందున్న అవయవాలు ప్రాణం మొద లైనవి పదునైదున్ను తను ఆధారస్థానాన్ని చేరిపోతాయి. ఈ అవయవాలను నడిపే దేవతలు వారి మూలదేవతలను చేరుతారు. కర్మలు పటాపంచలవుతాయి. జ్ఞానమయు డైన జీవుడు, అజీవునకు సంబంధించిన అన్ని విషయాలూ శాశ్వత తేజోమూర్తి యైన పరమాత్మయందు లీనమౌతాయి.

8

యథా నద్యస్స్యందమానాస్సముద్రే
అస్తంగచ్ఛంతి నామరూపే విహాయ
తథా విద్వాన్నామరూపాద్విముక్తః
పరాత్పరం పురుషము పైతి దివ్యమ్

నదులు కాలాన్ని అనుసరించి ప్రవహించి సముద్రములో కలిసిపోయినట్లు విద్వాం

## గుంటూరు, ప్రకాశం జిల్లాల సప్తగిరి విక్రేతలు.

శ్రీ వి. నరసింహాచార్యులు
సత్యదేవ న్యూస్ ఏజన్సీ
బాపట్ల.

పి. పద్మావతి
W/o పి.వి.ఆర్. అప్పారావు.
హిందూ ఏజెంట్
పొన్నూరు.

శ్రీ జి. గంగాధరరావు.
24-9-1. అగ్రహారం.

శ్రీ ఇ.వి. రమణమూర్తి
c/o శ్రీ విద్యాబుక్ హౌస్, గాంధీచౌక్
ప్రభుత్వ ఆసుపత్రి దగ్గర
తెనాలి.

శ్రీ వి. రామమోహన శర్మ
న్యూస్ ఏజెంట్
ఆర్.టి.సి. బుక్ స్టాల్
రేపల్లె.

శ్రీమతి యస్. విజయలక్ష్మి
విజయలక్ష్మి బుక్ స్టోర్స్
చిలకలూరిపేట.

శ్రీ అనుమోలు జగన్నాధరావు
అధ్యక్షులు, కార్యదర్శి,
వెంకటేశ్వర భక్త సంఘం
నరికల్లు.

శ్రీ పువ్వాడ కోటేశ్వర విఠల్ గుప్త
గుప్తా జనరల్ స్టోర్స్
మంగళగిరి.

శ్రీమతి కె. దేవసేన
న్యూస్ ఏజెంట్
11-17-19 రామిరెడ్డిపేట
నరసరావుపేట.

శ్రీ వల్లూరి దత్తాత్రేయ ఉమా-
శంకర్, s/o వల్లూరి ఆంజనేయులు
మారుతి న్యూస్ సర్వీసెస్
6-16-24 161/1 అరండల్ పేట.

శ్రీ దిట్టకవి వెంకట రామానుజా-
చార్యులు,
వాసవి కన్యకాపరమేశ్వరి -
దేవాలయం, పిడుగురాళ్ల.

శ్రీ సి. సుబ్బరాయులు
శ్రీ సత్యనారాయణ ఏజెన్సీ
4-8-96 గిద్దలూరు.

శ్రీ జి.వి. సుబ్బారావు
రావ్ అండ్ రావ్ ఏజన్సీ
కొవ్వూరు- కందుకూరు.

శ్రీ కోడూరి వెంకటసుబ్బారావు
ఎల్.ఐ.సి. ఏజెంట్,
ఉప్పుగుండూరు.

శ్రీ యస్.వి. రమణయ్య
సాకల బుక్ షాప్.
మార్కాపురం.

శ్రీ ఉడుపాహరి,
ప్రసన్న న్యూస్ ఏజెన్సీ,
లింగసముద్రం, కందుకూరు.

ఎం.వి. చలం, సురేఖ న్యూస్
ఏజెన్సీ, చీరాల.

శ్రీ పి.వి. సుబ్రమణ్యం,
ప్రభుత్వ ఆసుపత్రి వద్ద
అద్దంకి.

శ్రీ రాచపూడి వెంకటసుబ్బారావు
లాయర్ పేట- ఒంగోలు.

శ్రీ జి. మాలకొండయ్య,
c/o పెద్ది నరసింహులు
ఎల్.ఐ.సి. ఏజెంట్,
చీమకుర్తి.

## విశాఖపట్నం జిల్లా

శ్రీ పి. వీరునాయుడు
శ్రీ సాయివారి బుక్ హౌస్.
అనకాపల్లి.

శ్రీ వి. వీరభద్రరావు
ఏజెంట్ ఏటికొప్పాక

శ్రీమతి దాడ్లా పద్మజయంతి
W/o ఐ.డి.వి. భాస్కరరావు
శ్రీ భాస్కర్ మెడికల్స్, పాడేరు.

## నెల్లూరు జిల్లా

శ్రీ ఏ. సాయిబాబా,
c/o వెంకటకృష్ణయ్య.
న్యూస్ ఏజెంట్- అల్లూరు.

సుడు కర్మవాసనలు అనుభవించ వలసి నంతకాలం అనుభవించి చివరకు ఆ నదుల్లాగే నామరూపాలు లేనివాడై పరమేశ్వరుని యందు చేరుతాడు.

(విద్వాంసుడు-అంటే ఆత్మజ్ఞాని-అనిఅర్థం)

9

స యో హ వై తత్ పరమం బ్రహ్మ వేద
బ్రహ్మైవ భవతి, నాస్యాబ్రహ్మవిత్ కులే భవతి
తరతి శోకం తరతి పాప్మానం
గుహాగ్రంథిభ్యో విముక్తోఽమృతో భవతి

పరాత్పరుడైన ఈశ్వరుణ్ణి తెలుసుకున్నవాడు శరీరానికి సంసార జీవితానికి సంబంధించి కలిగే కష్టాలను, పాపాలను, హృదయానికి సంబంధించిన అరిష్టాలను అధిగమించి (దాటి) విముక్తుడై, అమృత స్వరూపుడై ఈశ్వరునిలో కలిసిపోతాడు. అలాటి మోక్షపురుషుని కులంలో మూర్ఖుడు (అజ్ఞాని) పుట్టడు.

10

తదేతదృచాభ్యుక్తం క్రియావంతః శ్రోత్రియాః
బ్రహ్మనిష్ఠా స్వయం జుహ్వత ఏకర్షిం
శ్రద్ధావంత స్తేషామేవైతాం బ్రహ్మవిద్యాం
వదేత శిరోవ్రతం విధివద్యైస్తు చీర్ణమ్

ఇంతవరకు నేను చెప్పిన విషయం ఋగ్వేదం చెప్పినది. వేదం చెప్పిన కర్మలను ఫలాపేక్షలేకుండా చేసేవారున్నూ వేదార్థం క్షుణ్ణంగా తెలుసుకున్నవారున్నూ, బ్రహ్మనిష్ఠావరులున్నూ శ్రద్ధతో వేదం చెప్పినట్లుగా నిత్యాగ్నిహోత్రం మొదలైన శ్రౌతకర్మలను (యజ్ఞాలను) చేసేవారున్నూ అయిన బుద్ధిమంతులకున్నూ, బ్రహ్మచర్య మొదలైన నియమాలను సక్రమంగా పాటించే వారికిన్నీ యీ బ్రహ్మవిద్యను ఉపదేశించవలె (తదన్యులకు చెప్పరాదు.)

11

తదేతత్సత్యం
ఋషిరంగిరాః పురోవాచ
నైతదచీర్ణవ్రతోఽధీతే
నమః పరమఋషిభ్యః
నమః పరమఋషిభ్యః

ఈ బ్రహ్మవిద్యను బ్రహ్మచర్య వంటి కఠిన నియమాలు గలవాడే నేర్చుకోవాలి ఈ తొల్లి అంగిరసుడు చెప్పినది ముమ్మాటికినిజం.

ఆత్మజ్ఞాన సంపన్నులైన ఋషులకు నమస్కారం.

ఇది ముండకోపనిషత్తు సమాప్తం •

# మహిషాసురమర్దిని

బి.యల్.యస్. ఆచార్య

[గతసంచిక తరువాయి]

నార : మహిషపత్నీ ! మహిషపత్నీ ! మంచిదానివేనమ్మా ! భర్త కైలాసయాత్రకు బయలుదేరుతుంటే భార్యవు సహగమనము చేయక ఇక్కడే పూజ చేస్తూ కూర్చున్నావా ?

మ.వ. : శివ శివా ! జననీ సర్వమంగళా ! నా మాంగల్యాన్ని కాపాడు తల్లీ !

నార : నీవు వరము కోరే తల్లినే వరించబోతున్నాడు నీ పతి.

మ.వ. : దేవర్షీ ! ఏమిటీమాటలు ?

నార : నిజమేనమ్మా ! పరమేశ్వరిని చెరపట్టి పరిణయమాడు తాడట నీ భర్త. అందుకై సర్వసైన్యాలతో కైలాస యాత్రకు సన్నాహాలు చేస్తున్నాడు.

మ.వ. : ఆఁ ! వారికి మీరైనా హితవు చెప్పలేదా స్వామీ ?

నార : హితవే చెప్పానమ్మా ! అయినా నేను చెబితే వింటాడా నీ మగడు, తనకు నచ్చనిది ?

మ.వ. : పరమేశ్వరీ ! నా పతిని క్షమించి రక్షించు తల్లీ !

నార : పాపకార్యాలను చేసేవారిని శిక్షిస్తుందే కాని రక్షించదు దుర్గ. నాకు కావలసింది కయ్యాలు కాదమ్మా ! లోక కల్యాణం. అందుకే నీ దగ్గరకు పరుగెత్తుకొనివచ్చాను, పరమేశ్వరిపై పాపభావాన్ని పెంచుకొంటున్న నీ పతి ప్రయత్నాన్ని సాగనివ్వకు. కపర్దినీ కోపానికి నీ పతి భస్మమైపోతాడు. ధర్మపత్ని ధర్మము పతిని ధర్మ పథమున నడపటమే. ఆ చండాసురసంహారిణిని కోర డం, బ్రతుకు ముగించుకోవడమేనని నీ భర్తకు బాగా నచ్చచెప్పు. నీ ప్రాణాలను పణముగ పెట్టిఅయినా నీ నాథుని ప్రయాణాన్ని నిరోధించు. వెళ్లు. ఈ పరికే ప్రయాణమై వుంటాడు నీ ప్రాణేశ్వరుడు.

మ.వ. : అట్లాగే ! స్వామీ నన్ను దీవించండి (నమస్కరించును)

నార : సుమంగళీ, భవ ! వెళ్ళమ్మా !.... త్వరగావెళ్లు.

మ.వ. (పోవుచు) నాథా !....నాథా....ప్రభూ ! ప్రభూ !....

నార : నారాయణ !

అసురనాయక వినాశక – సురరక్షకప్రభో నమోనమో ॥

అహమునొంచి విజ్ఞానము పెంచెడి – పరికరమ్ముగానను గావించి

పరితపించు జీవాళి గాతువు – పరమేశ్వరియాజ్ఞాను వర్తివై ॥అసుర॥

రంగము-8 స్థలం-మహిషాసురుని ప్రాసాదపు ముందు భాగము

చిక్షు : జయ మహిషాసుర చక్రవర్తికి

రాక్షసులు : జయం

చిక్షు : జయమహిషాసుర చక్రవర్తికి

రాక్ష : జయం !

మహి : చిక్షురా !

చిక్షు : ప్రభూ !

మహి : సైనికులను కైలాసానికి తరలించు.

చిక్షు : ఆజ్ఞ – సైనికులారా ! కదలండి కైలాసానికి

రాక్ష : జయ మహిషాసుర చక్రవర్తికి. జయం.

(సైన్యము కదలి పోవుచున్న కోలాహలము)

మ.వ. : ప్రభూ ! ప్రభూ ! ఎక్కడికి ప్రయాణము ? మీ ప్రయత్నమును మానండి.

మహి : మహారాణీ ! ఏమిటిది ?



మ.వ. పరమేశ్వరిని వాంఛించడం మహాపాపం! ఆమె నాకు, మీకు సర్వజగత్తుకు మాత. పునీత! మీ పదము లంటి ప్రార్థిస్తాను. ఈ పాపకార్య ప్రయత్నమును మానండి. ఆ మహామాతకు ఆగ్రహము కలిగితే....

మహి: (నవ్వి) ఆమెను అనుగ్రహించాలని వెడుతున్న నాపై ఆమెకు ఆగ్రహము కలుగుతుందా? ఆమె జీవితాన్ని హరించాలని కాదు దేవీ ఆమెను వరించి వివాహము చేసుకొందామనే వెళ్లుతున్నాను.

మ.వ.: ఎంతటి అపచారం స్వామీ? మీ మనస్సు మార్చు కోండి. ఆ త్రిపురసుందరి యాగ్రహమునకుగురికాకండి.

మహి: (పెద్దపెట్టున నవ్వి) మహారాణీ! నీకు సవతిని తెస్తా ననా ఈ విధంగా బెదరించి నన్ను ఆపుటకు ప్రయత్ని స్తున్నావు? పిచ్చిదానా! త్రిమూర్తులనే పరాభూతు లను జేసిన అజేయుణ్ణి! శాంబరీ విద్యాకుశలుణ్ణి! అబలయైన త్రిపురసుందరి నన్నేమి చేయగలదు?

మ.వ.: ఆమె అబల కాదు ప్రభూ! అపరాజిత! ఆ మహా మాయ యే రూపమునైనా ధరించగలదు. ఆ మహా కాళి అలిగినచో ఆమె విలయతాండవమున మనమంద రము లయమైపోగలము. నా మాట వినండి.

మహి: నీవే నా మాట వినుము మహారాణీ! ఈనాటి వరకూ ఈ మహిషుని ప్రయత్నాలకు అడ్డు తగిలి బ్రతికి పోయినవారు లేరు. నా పత్నివని యింతవరకూ సహించాను. తొలగిపో!

మ.వ.: తొలగను. నేను బ్రతికివుండగా మిమ్మి అత్యాచార మును చేయనివ్వను. చేయలేరు.

మహి: (కోపమున) రాణీ!

మ.వ.: మీరు రథమును దిగండి!

మహి: (కోపమున గట్టిగా) రాణీ! నీకు జీవించాలని వుంటే తక్షణము నా దారినుండి వైదొలగు ఊ! తొలగవేమే నీచురాలా (ఆమెను చెరకోలతో కొట్టును).

మ.వ.: (బాధతో) అమ్మా....కశతో కొట్టడమే కాదు. నన్ను మీరు చిత్రహింస పెట్టినా నేను బ్రతికి ఉండగా మిమ్మి అక్రమ కార్యానికి పోనివ్వను. చేయనివ్వను.

మహి: రాణీ! మహిషాలకు అడ్డునిలువకు వెళ్లు. లేకుంటే నీ రక్తంతో నారథచక్రాలు తడిసిపోగలవు. - తొలగిపో రాణీ!

మహి: తొలగను. మీ ప్రయత్నము మానేనరకూ నేను వైదొలగను. నేను బ్రతికి వుండగా మీకు వినాశము రానివ్వను.

మహి: అయితే చావు! [మహిషుడు కొరడాతో మహిషాలను కొట్టి అదలిస్తాడు. మహిషాలు అరచి కదులుతాయి. మహిషపత్ని చావుకేక]

మప: [చావుకేక]

దేవతలు: అయ్యో! అయ్యో! ఎంత అన్యాయం!

ఇంద్ర: మహిషపత్ని మహిషాసురుని రథచక్రాలక్రిందపడిందే!

యముడు: అయ్యో! మహాపతివ్రతయైన మహిషపత్నికా యింతటి ఘోరమరణము?

నారద: [ప్రవేశించుచూ] జయమహిషాసురా! జయ!

మహి: నారదా! రథాన్ని అధిరోహించండి.

నారద: నీవు నీ సైన్యాలతో వెళ్లుతూవుండు. మృత్యుముఖంలో వున్న నీ ధర్మపత్నికి అంత్యేష్టి జరిపించి, ఆకాశ గమనమున వచ్చి నిన్ను కలుసుకొంటాను. భళా మహిషా సురా! నీ కైలాసయాత్రకు ముఖ్యమైన అడ్డంకిని తొలగించుకొన్నావు. ఇంక భయములేదు. నీ కైలాస యాత్రతో లోకకల్యాణము తప్పక చేకూరగలదు.

మహి: లోకకల్యాణమనగా!

నారద: ఇప్పుడు నీవు త్రిలోకాధిపతివి. కదటయ్యా! నీ విప్పుడు కైలాసయాత్ర చేయుట దేనికి?

మహి: [పెద్దగనవ్వి] ఓహో అదా! మా కల్యాణము లోక కల్యాణమనియా? సరి నేను కైలాసం పోతున్నాను. మీరు త్వరగా రండి. [రథము కదలిపోతుంది]

ఇంద్ర: చూచావా! ముళ్ళమునీ! నీ మూలంగా ఆ మహా సాధ్వి ఎంతటి దుర్మరణాన్ని పొందిందో! తీరిందా ఇప్పటికైనా నీ కలహక్షుధ?

నారద: నాకు కావలసింది కలహాలు కాదయ్యా లోకకల్యాణము! అయినా కట్టుకున్న భార్యలను మహిషుడు చెరబెట్టితే గుట్టుచప్పుడుగాకుండా నోరుమూసుకొని పడివుండి ఏదో నారాయణస్మరణ చేసుకొనే నాపైకి దూకుతారేమిటి?

యమ: మరి యీ మహాసాధ్వికిలాటి దుర్మరణమును కలిగిం చటం, నారాయణస్మరణముచేసుకొనే మీరు చెయ్య వలసిన పనేనా?

నారద: అవును ఇది నేను చెయ్యవలసినపనే! త్రిమూర్తుల ఆదేశమూ యిదే. నేనే యీ నాటకము ఆడకపోతే మీ సతులగతులు ఏమయ్యేవో ఆలోచించారా? మహిష పత్ని మరణించనిది మహిషాసురునికి చావులేదుకదా! అంతకుడని పెద్దబిరుదాన్ని తగిలించుకొన్న నీవే మహిషపత్ని జీవితానికి అంతము చేకూర్పలేకపోయావు కదా?

యమ: పరమేశ్వరీవరప్రసాదినియైన యీ మహా పతివ్రతకు మరణము చేకూర్చడము నా తరమా నారదా?

నారద: అందుకే నేనీ మార్గముత్రొక్కవలసివచ్చింది. ఇక నీ లోకకంటకుడగు మహిషాసురుడు ఆ భువనేశ్వరి కంటిమంటలతో భస్మమౌతాడు. మహిషాసురమర్దని అనే మరియొక నామమాత్రల్లికి చేరుతుంది.

(33 వ పేజీలో)

(గతసంచిక తరువాయి)

సవితా అంటె సూర్యుడు. సవితకు సంబంధించినది సావిత్రి. సంధ్యాదేవికి కాలభేదము ననుసరించి

"గాయత్రీ నామ పూర్వాహ్ణే సావిత్రీ మధ్యమే దినే
సరస్వతీచైవ సాయాహ్నే సైవ సంధ్యా త్రయే స్మృతా"

అంటూ నామభేదములను వ్యాసుడు రచించెను. అంతియేకాక "అర్కబింబాభివ్యక్తా ఆదిత్యశబ్దవాచ్యా పరబ్రహ్మరూపా చిచ్ఛక్తిరేవ సంధ్యాదేవతా, ఆదిత్యరూపా చిచ్ఛక్తిరేవ గాయత్ర్యాభా భవతి" అని యుండుటచే ఆదిత్యాంతర్గతమైన ఒకానొక శక్తియే గాయత్రివలె ప్రకాశించుచున్నదని స్పష్టమైనది. ఆ గాయత్రికి సూర్యునకు సంబంధించిన సావిత్రికి అభేదము. గాయత్రి ననుసరించి సావిత్రికి వాక్కునకు అభేదము కాన వాగధిష్ఠాత్రి సరస్వతి సావిత్రి-గాయత్రి ముగ్గురు అభిన్నులని తెలియుచున్నది. ఈ విషయమునే శ్రీనాథుడు తన కాశీ ఖండమున

" అనఘ సావిత్రి యనగ గాయత్రి యనగ
విశ్వజననీత్రి యనగ చతుర్వేద మాత
యన బరావర బ్రహ్మద్వయం బనంగ
నమ్మహాదేవికి సమాహ్వయాంతరములు"

అని చెప్పియుండెను. సరస్వతిని స్తోత్రము చేయుటవలన ఒక విధముగ గాయత్రీ, సావిత్రీ దేవతలనుకూడ నుపాసించినట్లే యగును.

వేదఋక్కులందు ప్రతిపాదింపబడిన సరస్వతి సత్యచైతన్యము నుండి యవతరించు ప్రబోధనా స్రోతస్సునకు సంకేతముగా నిలచి యున్నది.

పావకా నస్సరస్వతీ వాజేభిర్వాజినీవతీ।
యజ్ఞం వష్టుధియా వసుః॥
చోదయిత్రీ సూనృతానాం చేతంతీ సుమతీనాం।
యజ్ఞం దధే సరస్వతీ॥
మహో అర్ణస్సరస్వతీ ప్రచేతయతి కేతునా।
ధియో విశ్వా విరాజతి॥ 6

"పునీతము గావించు సరస్వతి తన సంపూర్ణ సమృద్ధ రూపములతో మేధస్సం

# వాగ్దేవి వైశిష్ట్యం

శ్రీ కోదండ రామాచార్యులు

పన్నమైన మాయజ్ఞము నభిలషించును గాక. సమృద్ధ సత్యములను ప్రబోధించునది చైతన్యమునందు సద్బోధములను త్తేజపరచునదియునగు నా సరస్వతి మా యజ్ఞము నుద్ధరించుచున్నది. సరస్వతి యాగమనముతో చైతన్యమునందు మహార్ణవమును అనగా శాశ్వతత్వము నుద్బుద్ధము గావించి భావనలను సంపూర్ణముగా ప్రకాశింపజేయును." ఇదిపై ఋక్కులయొక్క సారాంశము. ఇందు సరస్వతీ స్వరూపము ప్రచోదనా దేవతగా శ్రుతిమూర్తిగా సాక్షాత్కరించి వైదిక స్రోతస్వినులకును బుద్ధియొక్క మానసిక తత్త్వార్థములకును స్థిర సమన్వయము గావించుచున్నది.

" ఇడా సరస్వతీ మహీ తిస్రో దేవీర్మయోభువః। బర్హిః
సీదం త్వస్రిధః॥ ఆ నో యజ్ఞం భారతీ తూయ
మేత్విడా
మనుష్వ దిహ చేతయంతీ। తిస్రో దేవీర్బర్హిరేదం
స్యోనం
సరస్వతీ స్వపస స్సదంతు॥" 6



భారతి సర్వజ్ఞమునకు సర్వాధారము గావున గాక, చైతన్యమును (అనగా ప్రాణమును లేక మనసూ బుద్ధి) [illegible] సుద్బుద్ధము గావించుచు ఇక యజ్ఞమునకు వచ్చునుగాక. సరస్వతియు సేవించుటకై వీరు ముగ్గురు వారి ధర్మములను నిర్వర్తించుచు నా యానందమయమైన యాగాసనములందాసీనులగుదురుగాక." అని పై వాక్యముల భావము.

సరస్వతి-ఇళా భారతులు. విజ్ఞానమునకు రూపాంతరములు. సరస్వతి వాక్ప్రబోధన గావించు శ్రుతిమైనట్లే ఇళ సత్యదృష్టి నొసంగు దివ్యదృష్టి. దృష్టి శ్రుతి రెండును సత్యద్రష్టమైన ఋషియొక్క శక్తిద్వయము మగుటచే ఇళా సరస్వతుల పరస్పర గాఢ సంబంధము మనకు విదితమగుచున్నది. భారతి సత్యచైతన్యము యొక్క బృహద్రూపము. మానవుని పరిమిత బుద్ధి యందు నా భారతీదేవి యుదయించినపుడు వెంటనే తన తోటి శక్తులగు ఇళాసరస్వతుల గొంపు కొని వచ్చును. ఇట్లు భేదము స్పష్టముగా తెలియుచున్నను కాలాంతరమున వీరి మధ్యనున్న సునిశితమైన భేదము విస్మరింపబడి ముగ్గురొక్కటేయని ఇళా, భారతీ పదములు సరస్వతికి నామాంతరములని పేర్కొనుట జరిగినది.

మేధా దేవీ జుషమాణా న ఆగా ద్విశ్వాచీ భద్రా
సుమనస్యమానా। త్వయా జుష్టా నుదమానా దురుక్తా
న్బృహ ద్వదేమ విదథే సువీరాః। త్వయా జుష్ట ఋషి
ర్భవతి దేవి త్వయా బ్రహ్మా గతశ్రీరుత త్వయా।
త్వయా జుష్టశ్చిత్రం విందతే వసు సా నో జుషస్వ
ద్రవిణో న మేధే॥ 7
మేధాం మ ఇంద్రో దదాతు మేధాం దేవీ సరస్వతీ
మేధాం మే అశ్వినావుభావాధత్తాం పుష్కరస్రజా
అప్సరాసు చ యా మేధా గంధర్వేషు చ యన్మనః
దైవీం మేధా సరస్వతీ సా మాం మేధా సురభిర్జుష
తాగ్ంస్వాహా 8
ఆ మాం మేధా సురభిర్విశ్వరూపా హిరణ్యవర్ణా
జగతీ జగమ్యా ఊర్జస్వతీ పయసా
పిన్వమానా సా మాం మేధా సుప్రతీకా జుషంతామ్॥

మేధయనగా గ్రంథమునందుగల విషయమును గ్రహించి ఆ గ్రహించిన విషయ

మును మరువకుండా ఉండునటుల ధారణముచేసి కొనుశక్తి. అట్టి మేధాదేవి మాకడకు వచ్చునుగాక. ఆ దేవత సకలమును గ్రహించు సామర్థ్యము కలది. కల్యాణమైనది. మాయందనుగ్రహబుద్ధి కలది. ఓ మేధా! నీచే అనుగ్రహింపబడి నిరుపయోగములైన పదములను త్రోసిపుచ్చినవారగుదుముగాక. ఓ దేవీ! నీచే అనుగ్రహించబడినవాడు ఋషియు సర్వసంపదలు కలవాడును అగుచున్నాడు కాన మమ్ము కరుణించు.

ఇంద్రుడు, సరస్వతి, అశ్వినీదేవతలు నాకు మేధను కలుగజేయుదురుగాక. అప్సరసలయందు గంధర్వులయందు దేవతలయందు ఎట్టి మేధగలదో అట్టి మేధ నన్ను పొందుగాక. సకల శాస్త్రరూపమైన పురుషార్థ కాలముచే పొందదగిన మేధ నన్ను పొందుగాక"అని మంత్రముల సారాంశము. ఇట్టివే మంత్రములు మేధాసూక్తమనుపేర ఋగ్వేదమునను కనుపట్టుచున్నవి.[10] పైన పేర్కొనినవానిని పరిశీలించినపుడు మేధాస్వరూపిణియైన సరస్వతి ఎంతటి ప్రాభవ ప్రాశస్త్యములను పొందియున్నదో తెలియుచున్నది.

సరస్వతీ దేవాలయములు దేశమునకు బహుతక్కువ. సరస్వతి కాశ్మీర్‌లో శ్రీనగర్ యందు, అజ్మీరుకు దగ్గరగానున్న పుష్కర క్షేత్రమందు, తెలంగాణములోని అదిలాబాద్‌జిల్లా బాసర క్షేత్రమునందు స్వయం ప్రకాశమూర్తియై వెలసినది. "కాపూజాపుర వాసినీ" అను సరస్వతీ స్తుతి ననుసరించి పైమూడు క్షేత్రములు కామరూప, పూర్ణగిరి జాలంధర పీఠములుగా ప్రసిద్ధిగాంచినవని తదుపాసకుల యభిమతము. ఇవికాక శంకరాచార్యులవారు స్థాపించిన శృంగేరి పీఠమునందు దాని ఉపపీఠములందును శారదామూర్తి నిలచియున్నది.

సరస్వతిని గూర్చిన కథలు, శతపథ బ్రాహ్మణములోను, బ్రహ్మవైవర్త పురాణములోను బ్రహ్మఖండమునందు, గణేశ ఖండమునందునుకలవు. సరస్వతీ రహస్యోపనిషత్తు సరస్వతీగీత అను ప్రత్యేక గ్రంథములు ఆమె పేర వెలసినవి. "విశ్వవిజయము" అను పేరుగల సరస్వతీ కవచము కాణ్వశాఖ ఋషి ప్రోక్తమైన దొకటి లోకమున ప్రచారమున నున్నది. అష్టోత్తర శతోపనిషత్తులలో చేరిన సరస్వతీ రహస్యోపనిషత్తును మునుల కోరికపై అశ్వలాయన మహర్షి చెప్పినట్లు కలదు. ఇందలి ఋక్కులు వాక్తత్త్వ వివేచనముతో కూడుకొని యున్నవి. గ్రంథములేకాక ఆమెకు సంబంధించిన మంత్రములును అనేకములు కలవు. బాలా-వీణా-వేణు. శారికా-శుక-ప్రౌఢా వాగీశ్వరీ నీలా మహాదినామములతో సరస్వతీ మంత్రములు, మహా సరస్వతీ భేదములైన వాగీశ్వరీ వాగ్వాదినీ మంత్రములచటచట మంత్రశాస్త్రపరులచే అనుష్ఠించ బడుచునేయున్నవి.

విద్యాసంసిద్ధిని, సువాక్కును ఆశించి సరస్వతీ ప్రార్థన చేయుట మన దేశములోనేకాదు పాశ్చాత్యదేశములందును చాలా ప్రాచీన కాలమునుండియే ఆచారమై యున్నది. పాశ్చాత్యుల దృష్టిలో "మ్యూజెస్" అనబడు తొమ్మండుగురు కన్యలే విద్యాధిదేవతలు. ఒక్కొక్కరిని ఒక్కొక విధమైన కావ్యమునందు వర్ణించుట వారి సంప్రదాయము. "క్యారియోప్" అను దేవతను మహాకావ్యేతిహాసములందు "క్ల్యాయో" అను దేవతను చరిత్రకావ్యాదులందును, "ఇరాటో" అను విద్యాదేవతను ప్రణయ కవితకుముందు పొగడుట కానవచ్చుచున్నది.

గ్రీకు ల్యాటిన్ సాహిత్యములందు "మినర్వా-మ్యూచ్" మొదలైన రూపములలో విద్యాబుద్ధి కవితాసంగీతములకు ఆదిదేవతగా సరస్వతిని ప్రార్థించుట వరిపాటిగా యున్నట్లు తోచుచున్నది. కొందరు "వీనస్, డ్రైడన్" అను దేవతలను సంగీత సాహిత్యాధి దేవతలుగా వర్ణించిన, మరి కొందరు "అపోలో" అను దేవత సంగీత సాహిత్య నిలయమని వివరించి. "అపోలో" అను నామమున నుండు మూర్తి వీణ పట్టుకొని తెల్లని వర్ణముతో భారతీయ సరస్వతీ మూర్తికి కొంచెము దగ్గరిపోలికలను కలిగియున్నట్లు ఈ దేవతకు ప్రత్యేకముగ ఆలయమునుకూడ కట్టించిరన్నట్లు చెప్పగా వినియుంటిని అది ఎంతవరకు నిజమో విదేశములకు వెళ్ళివచ్చిన వారికే తెలియవలసియున్నది.

పాశ్చాత్యరచయితల కావ్యములందును విద్యాదేవత ప్రార్థన కనుపించును. అంధుడగు "హోమర్" కవి జూపిటర్ బిడ్డ మౌజౌనా [illegible] కన్యను తనకు వాక్కు ఇవ్వమని కోరెను. షేక్స్పియర్ ఒకానొక నాటకమున వాగ్దేవతను సువాక్కుకై అభ్యర్థించెను. ల్యాటిన్ మహాకవి అయిన వర్జిత తన ఏనీడ్ అను కావ్యప్రారంభమున మ్యూజాను స్తోత్రముచేసి యుండెను. ఆంగ్ల మహాకవి మిల్టన్ తాను రచించిన ప్యారడైజ్ లాస్టు కావ్యము మొదట మ్యూజ్‌ను స్తుతించుచు ఆమె శక్తి సామర్థ్యములను వర్ణించుచు, ఇలా వేడుకొనెను.

Whit in is me dlark.
Illumine what is low raise and support
That, to the night of this great argument
I may assert Eternal Providence
And justify the way's of God to men.

ఇంకా ఇలా అంటాడు

Heaven hides nothing from thy view.
Nor the deep tract of Hell.

"నీకు తెలియనిదేమియులేదు. నాలో నున్న అజ్ఞానాంధకారమును తొలగించి విజ్ఞానజ్యోతిని వెలిగించి దానిని అభివృద్ధి పరచు. అందుకు తగిన ఆధారమును కల్పించు." అని పై పంక్తులలోని విషయము ఇట్లు వాగ్దేవతను స్తుతించి ఆమెకు తమ కావ్యములందు స్థానము కల్పించిన పాశ్చాత్యులనేకులు కలరు.

ఆర్ష సమ్మతమైన ప్రతిభ లేక దర్శనము సరస్వతీ వరప్రసాదము. విశ్వవ్యాప్తమైన మహాశక్తి తద్వ్యక్తి కరణమున కనుగుణమైన మనస్సునుండి దేశకాలా బద్ధమై బహిర్గతమగుచున్నది. అందు కుదాహరణ

(35వ పేజీలో)

## కొత్తశీర్షిక

రాజయ్యకు అరవై నిండినై. బాధ్యత లన్నీ ఒకవిధంగా తీర్చేసుకున్నాడు. ఏదో కృష్ణా రామా అనుకుంటూ కాలక్షేపం చేస్తున్నాడు-మనిషి వంగిపోయాడు-మనిషితో బాటు మనసుగూడ వండిపోయింది. రాజయ్య పండితుడుగాడు - సంస్కృతం అసలేరాదు. వచ్చిన తెలుగుగూడ అంతంత మాత్రమే. ఏదైనా చెబితే తెలుసుకోగల తెలివితేటలున్నై. సగటుమనిషి-ఒక విధంగా ఆలోచిస్తే కేవలం పామరుడు—

పసివయసునుంచే, రాజయ్య ఒక పద్ధతి వ్యక్తి. ఉయ్యాలలో పడివుండే వాడట, మేలుకుని ఉన్నా ఏడ్చేవాడు గాడట! 'కై,కుయ్' అనకుండా పడుకున్న పాపనుచూచి. పిచ్చివెధవ - ఎప్పుడనగా పాలిచ్చానో....అని తల్లి వచ్చి పాలు ఇవ్వ వలసిందేగానీ, ఏడిచి, ఏడిపించీ, నోటీసులు జారిచేసేవాడు గాడట! రెండు మూడేళ్ళు వచ్చిన తర్వాతకూడ, ఒక మూల కూచొని, ఇంటికప్పో ఆకాశమో తేలకళ్ళతో చూస్తూ వుండేవాడట! వీడోమట్టిముద్ద, పప్పుముద్ద, అనుకునే వాళ్ళుట. (ఇవన్నీ వాళ్ళమ్మ ఉన్న రోజుల్లో చెప్పిన మాటలు)-

రాజయ్యని బళ్ళోవేశారు. ఆరోజుల్లో చదువులువేరు. రెండోక్లాసులో కృష్ణశతకం, మూడోక్లాసులో, సుమతీశతకం, వేమన పద్యాలు, నాలుగోక్లాసులో దాశరధీశతకం భర్తృహరి నీతిశతకం, ఐదోక్లాసులో, భాస్కరశతకం. కాళహస్తీశ్వర శతకం, చదివించేవాళ్ళు. ఆ శతకాలన్నీ పిల్లలకు కంఠోపాఠం. రాజయ్యకు పది పన్నెండేళ్లు వచ్చేసరికి ఇవన్నీ మనసులో జీర్ణించి పోయినై.

రాజయ్య కాలేజీ చూడలేదు. క్రికెట్. హాకీ ఆడలేదు. కనీసం చెడుగుడు, కోతి కొమ్మచ్చులుకూడ ఆడలేదు. బడినుంచి ఇంటికి వచ్చాక, అమ్మకు అయ్యకు ఏదైనా చేతనైన సాయం చేసేవాడు. S S L.C. అయిపోయిన తర్వాత అమ్మకు సాయంగా వ్యవసాయంలో పడిపోయాడు. పేరుకేం అని చెప్పినప్పుడే పెళ్ళిచేశారు. పదిరిలోపడ్డ ఎలుకలాగా, కుటుంబ నిర్వహణ చేశాడు పిల్లలు చేతికి అందివచ్చే వరకూ.

రాజయ్యకి 'హాబీలు' లేకపోలేదు! కప్పలదగ్గర రావిలి పడుకునేరోజుల్లో, చిన్నప్పటి కృష్ణశతకం, దాశరథీశతకం, తన పద్ధతిలో ఎలుగెత్తి పాడుకునేవాడు. వాళ్ళ ఊరిలో ఒక కృష్ణమందిరముంది. ఊళ్లో ఉత్సాహవంతులైన కుర్రాళ్ళ భజన బృందం వుంది. వాళ్ళతోబాటు, "చల్లలమ్మే గొల్లలమురా, గోపాలకృష్ణ చలమదేల చెరగువిడువరా" అనిచెక్కభజన చేసే




వాడు. మరికొంతకాలం వయసు ముదిరిన తర్వాత పురాణాలు కాలక్షేపాలకు వెళ్ళే వాడు.

పల్లెటూళ్ళలోగూడ ఇప్పుడు పద్ధతులు మారిపోయినై. రేడియోలు వీడియోలు వచ్చేసినై, వచనభాగవత రామా



చిత్తూరు జిల్లాలో
సప్తగిరి.

శ్రీ ఐ. ఉదయచంద్ర ప్రకాశ్
C/o డి. జగన్నాథం
స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా
పలమనేరు.

శ్రీమతి ఎస్. డి. సులోచన
మేనేజింగ్ పార్ట్‌నర్,
ప్రతిభా ప్రియదర్శిని
త్రివేణి స్టేషనరీ బుక్ స్టాల్
తిరుపతి.

శ్రీ ఐ. ఉదయచంద్రప్రకాశ్
C/o డి. ఉదయానందం
భారతీయ స్టేట్ బ్యాంక్
పలమనేరు.

శ్రీ జి. ఆర్. పాండురంగయ్యశెట్టి
S/o శ్రీ జి. రామయ్యశెట్టి,
విజయ నగరం న్యూస్ పేపర్స్
కోటపట్ల (పోస్ట్)

శ్రీ కె. సుబ్బారావు
న్యూస్ ఏజెంట్
త్రిరెడ్డిపల్లి

శ్రీ బి. కె. శ్రీనివాస్ గుప్త
లాంగ్ బజార్, వి. కోట (పోస్ట్)

శ్రీ. వి. యస్. కృష్ణమూర్తి,
C/o వి. శ్రీకాంతయ్య
న్యూస్ ఏజెంట్, స్టేషన్ రోడ్,
కుప్పం.

శ్రీ. కె. సుబ్రహ్మణ్యం
న్యూస్ ఏజెంట్, పాకాల.

శ్రీ కె. దొరస్వామి చెట్టి.
C/o ఆర్. డి. కన్నయ్యనాయుడు
అడ్వకేట్, ఎం. బి. రోడ్
చిత్తూరు.

శ్రీ. టి. పి. ఉమాపతి,
మెయిన్ రోడ్, నారాయణవనం
పుత్తూరు.

శ్రీమతి వి. వసుమతి
C/o. వి. శ్రీనివాసాచార్యులు.
బ్లాక్ ఎక్స్‌టెన్షన్ ఎడ్యుకేషన్,
సి. టి. ఎం, పోస్టు.

యదాలు వచ్చి, రాజయ్యను కొంత కాపా డినై. దేవుడిదగ్గర కూచున్నంతసేపు కూచుని, ఊబుసుపోకపోతే అవి ముందు వేసుకుని కాలం వెళ్ళపుచ్చుతున్నాడు.— రాజయ్య పూజ పుస్తకాలు చాలా కొన్నాడు, వెంకటేశ్వరసుప్రభాతం, సహస్రనామం, గద్య వగైరా. రాముడిమీద కొన్ని పుస్త కాలు. అలాగేకృష్ణుడిమీద–కృష్ణాష్టకం, కృష్ణ అష్టోత్తరశతం. వేణుగోపాల సహస్ర నామం, విష్ణుసహస్రనామం, లక్ష్మీసహస్రం చాలావున్నై. అనాటి మానసిక స్థితినిబట్టి అంటే శనివారం, వెంకటేశుని పుస్తకాలు తీస్తాడు. శ్రీరామోత్సవాలలో, రాముడి పుస్తకాలు తీస్తాడు–కానీ అతనికి కృష్ణుడి మీద ఒక పిసరుప్రీతి ఎక్కువ అనే చెప్పాలి. ఎందుకయ్యా అని అడగితే పరమాత్మ బిరుదు శ్రీకృష్ణుడికే వుందట.

విజయదశమినాడు మహాలక్ష్మీపూజగా, లక్ష్మీసహస్రం చేసి నీరాజనం ఇస్తున్నాడు రాజయ్య–అమ్మవారికి వేసిన మల్లెదండల మాటు నుండీ

'నల్లనివాడు పద్మనయ న
మ్ములవాడు, సుధారసంబుపై
జల్లెడువాడు, మౌళి
పరిసర్పిత పింఛమువాడు,
నవ్వురాజిల్లెడు మోమువాడు"

తొంగి చూస్తున్నాడు. రాజయ్యకి మతి పోయింది–కళ్ళజోడు సవరించుకుని తదేక దృష్టిగా చూస్తూవుంటే–"ఏం రాజయ్యా అన్న పిలుపు వినిపించింది–"ఓం నమో భగవతే వాసుదేవాయ" అంటూ నమస్క రించాడు రాజయ్య తత్తరపాటుతో. పర మాత్మ తలపంకించి ఆశీర్వదించాడు........

"స్వామీ ఇవి దేవీనవరాత్రులు, తాము దయచేశారేమిటి" అన్నట్టు ఇంకా ఆశ్చ ర్యంగానే చూస్తున్నాడు రాజయ్య– రాజయ్య ఆత్మలో విచికిత్స, పరమాత్మకి అర్థమైంది. "చెల్లెలి ఇంట్లో విశేషమైతే, నువ్వువెళ్ళవా?"అన్నాడు పరమాత్మ! 'దేవి' అమ్మవారు..... .. మీ చెల్లెలా!...

"నిస్పందేహంగా! దేవీ సహస్రాలు కొన్ని తిరగేసి చూడు మాటవరసకి పార్వతీ సహస్రం, మీనాక్షిసహస్రం ఇలాం టివి చదివితే, సదాశివపతివ్రత, మహేశ్వర మనోహరితోబాటు, పద్మనాభ సహోదరి, శ్రీనివాస సహోదరిలాంటి ముక్కలుగూడ తగులుతై. అందాకాఎందుకు? నువ్వు క్షుణ్ణంగా చదివిన భాగవతంవుంది. అందులో, మన అవతార ఘట్టం ఒకసారి జ్ఞాపకం తెచ్చుకో! దేవకి ఏడోకడుపులో బిడ్డను, రోహిణి కడుపులోకిమార్చి. దేవకి గర్భవిలీనం అయిందీ అనిపించింది ఎవరు? నేను దేవకి కడుపున పుట్టినప్పుడు యశోద కడుపున పుట్టిన ఆడపిల్ల ఎవరూ? వసుదేవుడు, బిడ్డలమార్పిడిచేసి. కంసుని ముందు పెట్టినది ఎవర్ని? కంసుడు ఆబిడ్డనునేలమీదపడేసి నరకబోతే, ఆకాశానికి ఎగిరి ఎనిమిది చేతులతో, గదాశంఖచక్ర చాపములతో నిలిచి, నిన్ను చంపేవాడు పుట్టి పెరుగుతున్నాడని, కంసుడి గుండెల్లో ఆటంబాంబు వేసినవాడెవరు? అదే, దేవి. శక్తి. దానికే దుర్గ, భద్ర కాళీ, వైష్ణవీ వగైరా పద్నాలుగు పేర్లు అని భాగవతములో చదివావా లేదా! . అదే యోగమాయ, విష్ణుమాయ!........ నా తోబుట్టువు" అని పరమాత్మ తేల్చేశాడు! రాజయ్యకు ధర్మసందేహం వచ్చింది.

"స్వామీ, దేవి. ప్రకృతి స్వరూపిణి, సదాశివపతివ్రత! తమకు సోదరి బాగానే వుంది కానీ ఆపార్టీవేరూ, మనపార్టీ వేరు గదా"అన్నాడు. నీళ్లు నములుతూ! రాజయ్య!

మీ పామరులతో వచ్చిన పేకులాట ఇదే రాజయ్యా! మాలో మాకు ఏ భేదాభిప్రా యాలు లేవయ్యా శివకేశవులకభేదమని, శివుడే విష్ణువు; విష్ణువే శివుడు; శివుడి హృదయమే విష్ణువు. అని ఎన్నోసార్లు 'ఎన్నో చోట్ల మేము సంయుక్త ప్రకట నలు చేశాం! బలవంతులైన రాక్షసులతో యుద్ధాలు చేయవలసినప్పుడు మేమిద్ద రమూ కూడబలుక్కుంటాం! హనుమంతుడు

శివాంశ అని చదివావుగదా! రామాయణంలో హనుమంతుడు మనకోసం ఎన్నికంకాలు పడ్డాడు. మైరావణుడి బారినించి అతనే గదా రక్షించాడు; అలాగే త్రిపురాసుర సంహారం వగైరా సన్నివేశాల్లో మనం అతన్ని ఆదుకున్నామా లేదా? పరగిర్భితులు మహాభయంకరులైన దైత్యసంహారం చేయవలసి వచ్చినపుడు, పరబ్రహ్మ, పర మేశ్వరుడు, ఇంద్రాది దిక్పాలకులు అందరూ కలసి, వైకుంఠంలో, సర్వదేవతా సమావేశం పెట్టి, నేను చెప్పిన తీర్మానం ఆమోదించి, కార్యక్రమం అమలు చేస్తు న్నారా లేదా! అప్పుడు శంకరుడు మనకే ఓటు వేస్తున్నాడు కదా! ఇంకో చిన్న విషయం చెప్పమంటావా?

'శివుడిచేతిలో ఆయుధం ఏమిటి?'

'త్రిశూలం'

"త్రిశూలం చివర ఏముంది-తిరునామం మనగుర్తేగదా" అన్నాడు పరమాత్మ. పరమాత్మ తన సందేహాన్ని ఇలా తిరగేసి కొడతాడనుకోలేదు రాజయ్య! "స్వామీ! తాము రాజకీయ దురంధరులు! కాకపోతే పద్నాలుగు లోకములు ఎలాసంబాళించి ఏలగలుగుతారు" అన్నాడు రాజయ్య!

'ప్రశంసకు అభివాదాలు' అన్నట్టుపర మాత్మ నవ్వేశాడు!

'శివుడికి మనకీవున్న సంబంధ బాంధ వ్యాలు అర్థమైనై గదా! .... చెల్లెమ్మంటే శివుడికి చెడ్డప్రేమ!"

"అందుకేగదా అర్ధశరీరం ఇచ్చా డన్నారు!"

"అర్ధశరీరం అంటే మీరేదో అనుకుంటు న్నారు. స్త్రీ పురుషులు సమానం. ఆలుమగల మధ్య అధికారం సమానం. స్త్రీలకూ, పురుషులతోబాటు సమాన హక్కులు కావా లని పోరాడిన మొదటిస్త్రీ మాచెల్లెమ్మ! ఒప్పుకున్న పురుషుడు, శివుడు! ఆ పరస్పర మైన అవగాహన వల్లే వాళ్ళమధ్య అంత అన్యోన్యం ఏర్పడింది! ఆదర్శ దంపతులు కాగలిగారు" అన్నాడు కృష్ణపరమాత్మ ....

రాజయ్యకిదేదో కొత్తపాయింటు అని పించింది! అర్ధనారీశ్వరతత్వమంటే, సగం మొగ సగం ఆడగా బొమ్మలుచూశాడు నాట్యాలు చూశాడున్నీ, సంసారంలో, సమాజంలో స్త్రీపురుష సంబంధంలో సరి సమానం అని దీని అంతరార్థమా అని ఆశ్చర్యపోయాడు — "శివుడికీ నేనంటే ఎంతో గౌరవం! పల్లమారిన ప్రేమకూడ, మాచెల్లెలికి నాకూ చాలా పోలికలున్నా యట .. నన్ను చూస్తుందే .."

'స్వామి అన్నాడు రాజయ్య పరమాత్మ మాటకు అడ్డంవస్తూ - పరమాత్మ ఆగి పోయాడు. "క్షీరసాగరమథన కాలంలో, తమరు మోహినీ వేషం కట్టినప్పుడు, హాలా హలం బిర్రులో వున్న శివుడు తమవెంటపడి పట్టుకున్నాడని, అప్పుడే అయ్యప్ప పుట్టా డని అంటారు నిజమేనా?" అని అడిగాడు రాజయ్య—

పరమాత్మ ప్రశ్నదాటేసి చెప్పడం ప్రారంభించాడు నవ్వుతూ!—

"ఇంతకీ అసలు విషయం ఏమిటంటే మీరు దేవీ నవరాత్రులని ఉత్సవాలు పండు గలు చేసే ఈ అమ్మవారు, మా ఇద్దరికీ వరమాపుత్రాలు—కైలాసంలో ఆవిడ భాగ స్వామిని, వైకుంఠంలో ఆడపడుచు-అటు కైలాసం వెళ్ళాలన్నా ఇటు వైకుంఠానికి రావాలన్నా, అమ్మడు అంగీకరిస్తేనే ఏ జీవికైనా ఏ లోకప్రవేశమైనా. ముందు ఆవిడను వొప్పించి మెప్పించి మంచి చేసుకోవాలి!...."

"దానికి మార్గంగూడ మీరే సెలవివ్వాలి పరమాత్మా" అన్నాడు రాజయ్య!

"ఏనాడో చెప్పాను—"

"ఏమిటి స్వామీ అది!"

"కాళీయమర్దనే —"

"కాళీయ మర్దనా! తమలాంటివారు చేయవలసిందేగాని. మావల్లే మౌతుంది!"

"కాళీయసర్పం అంటే ఏదోగాదయ్యా-నీ వెన్నుపామే!....అదే కుండలినీ-కుండ

తెలంగాణాలో సప్తగిరి

శ్రీ ప. రంగాచార్య
12-5-5. యస్.వి. యస్ రోడ్
పాపయ్యపేట - చమాన్
వరంగల్.

శ్రీ ప. శ్రీనివాసాచార్య
5-5-34. శివాలయంవీధి
కరీంనగర్.

శ్రీ. పి. హెచ్. నాగేశ్వరరావు
శ్రీనివాస వస్త్రాలయం
మెయిన్ రోడ్
మధిర - ఖమ్మం జిల్లా.

శ్రీ. బి. యతిరాజు,
1-7-37 గిరునిగడ్డ,
జనగామ - వరంగల్

శ్రీ. కె. వెంకటస్వామి
6-2-20- సుభాష్ నగర్
నిజామాబాదు.

శ్రీ. ఓటూరి రాజేశ్వర్
4-760, లాలీటవర్
అజంతా టూర్స్ పోర్ట్స్
జగిత్యాల.

శ్రీ యలసూరి భీమదయాళ్
తిరుమలగిరి
నల్గొండ జిల్లా.

శ్రీమతి పి. లక్ష్మీకామేశ్వరి
23-5-577 చావల గల్లీ
లాల్ దర్వాజ
హైదరాబాదు-2

శ్రీమతి పి. లక్ష్మీకామేశ్వరి
C/o శ్రీ పి. ఎ. వి. ప్రసాద్
హైదరాబాదు-4

శ్రీమతి పి. లక్ష్మీకామేశ్వరి
C/o శ్రీమతి జై. ప్రమీల
ఇ.నెం: 19/65 మల్కాజ్‌గిరి
హైదరాబాదు

పి. గోవర్ధనాచార్-
ని కొత్తూడ - వరంగల్

లినీ యోగం .. మన దేవుళ్ళందరిని ఒక సారి జ్ఞాపకం చేసుకో....మహావిష్ణువు పాము మీదే పడుకుని యోగనిద్రలో ఉంటాడా? పరమశివుడికి ఒంటినిండా పాములేగదా! వినాయకుడికి నాగయజ్ఞోపవీతం! కుమార స్వామికి కాళ్ళదగ్గరపాము.... సరస్వతి. లక్ష్మి, పార్వతి. వీళ్ళందరూ, నాగాభరణ భూషితలే!.... అంటే ఏమిటి ... వీళ్ళం దరూ ఆ కుండలినిని జయించినవాళ్లే అన్న మాట!.... "శేషాచలవాసా! శ్రీనివాసా" అంటున్నావుగదా! ఏమిటా 'అచలశేషం' ఆ పామును కదలనివ్వకుండా దానిమీదే నివాసమున్నవాడా అనేగదా.... అన్నాడు పరమాత్మ!....

రాజయ్యకి ఈ భావన కొంచెం నచ్చి వట్టుంది!....

స్వామీ ఈ కుండలిని గురించి కొంచెం విశదంగా చెప్పండి అన్నాడు!

"టూకీగా విషయం చెబుతాను. వివ రాలు దొరికేచోటు చెబుతాను. తర్వాత మవ్వే తంటాలు పడమ"న్నాడు పరమాత్మ!

"అలాగే కానివ్వండి"అన్నాడురాజయ్య.

"ఈ కుండలినీ శక్తి, మూలాధారం దగ్గర నిద్ర పోతూవుంటుంది! అక్కడే, ఇళా పింగళా, సుషుమ్నా అని మూడు నాడు లుంటై. ప్రాణాయామంతో ఈ కుండలిని నిద్రలేపాలి – ప్రాణవాయువును సుషుమ్న నాడిద్వారా, ఊర్ధ్వముఖంచేసి షట్చక్ర భేదనంచేసి, తలలోవున్న సహస్రా రానికి తీసుకువెళ్ళి అక్కడ నిలబెట్టాలి"– ఏవో షట్చక్రాలన్నారు? .... అన్నాడు రాజయ్య గొణుగుతూ.

వాటినే మూలాధారం, స్వాధిష్ఠానం, మణిపూరం, అనాహతం, విశుద్ధం, ఆజ్ఞా చక్రాలంటారు. ఈ ఆరుచక్రాలపైన సహ స్రారం....ఈ ఆరుచక్రాలు ఆరు ఇనుప గొడ్డళ్లలాంటివనుకో, ఉత్థానంచేసిన చిత్ ప్రకాశాన్ని ఈ ఇనుప తెరలలోనుంచే పైకి పంపించడం చాలాకష్టసాధ్యమైన విషయం కొన్నివేల డిగ్రీల ఉష్ణోగ్రతలోవున్న 'ఆర్క్' ఇనుమును కరిగించి ముందుకు వెళ్తున్నట్టు, నీ చిత్ ప్రకాశాన్నికూడా, ఈ చక్రాలగుండా అలా పంపించగలగాలి, దీన్నే లయయోగం అనికూడ అంటారు. హఠయోగం, రాజయోగం, కుండలినీ యోగం అని యోగశాస్త్రంమీద ఎన్నో పుస్తకాలున్నై. వీటి జోలికి పోయేముందు ప్రవేశికలాగా, ఒకసారి లలితా సహస్రం చదువు....సౌగంధిక వ్యాఖ్యానంతో.... నీకు చాలా వివరాలు తెలుస్తై, అలాగే ఒకసారి సౌందర్యలహరి, చదువు, లొల్ల లక్ష్మీనాథం సంస్కృతవ్యాఖ్యకు తెలుగుగూడ వచ్చింది నీలాటివాళ్ళకోసం ....విషయం బాగా బోధ పడుతుంది–

సౌందర్యలహరి....శంకరాచార్యుడు .... అద్వైతం .... మనది విశిష్టాద్వైతం .... అంటూ గొణుక్కుంటున్నాడు రాజయ్య—

శంకరాచార్యులుగూడ మనవాడే .... అన్నాడు పరమాత్మ!

రాజయ్యకి మతిపోతొంది—

"రామానుజయతీంద్రులు ఎంత మన వాడో, శంకరుడుగూడా అంతమనవాడు," అని రెట్టించాడు పరమాత్మ! రాజయ్య కళ్లు తేలేసి వింటున్నాడు! పరమాత్మ తన ధోరణిలో చెప్పుకుంటూ వెళ్తున్నాడు....

శంకరుడు మన మహాలక్ష్మిమీద కనక ధారాస్తవం రాశాడా? లక్ష్మీనృసింహ కరావ లంబ స్తోత్రం రాశాడా! విష్ణుసహస్రనామం మీద లోకోత్తరమైన వ్యాఖ్యరాశాడా? నా భగవద్గీతమీద ఎంతమంచి వ్యాఖ్యానం రాశాడు! మనకోసం ఇన్ని చేసిన వాణ్ణి మనవాడు కాదంటే ఎలాచెప్పు....కొన్ని చిల్లర విషయాలమీద మనకు ఏకాభి ప్రాయం లేకపోవచ్చు. అంతమాత్రాన, మనకు కానివాడవుతాడా!.... ఒక చిన్న విషయం ఆలోచించు, ఒక సంఘంలో ఒక సమస్యనుగురించి సర్వతోముఖంగా చర్చిస్తోంది అనుకో..... ఎవరికి తోచింది వాళ్లు చెబుతారు. ఒకరు చెప్పింది మరి కొందరికి నచ్చలేదుఅంతమాత్రానవాడు అందులో సభ్యుడు కాకపోతాడా? రాజయ్య గొంతులో పచ్చివెలక్కాయ పడింది—

కలకత్తా, ఢిల్లీ, బొంబాయినుంచీ రైళ్లు బయలుదేరినై. అన్నీ మదరాసు సెంట్రల్ స్టేషన్‌కే వస్తున్నై–పథమేదైనా పరమావధి అదేగదా"అన్నాడు పరమాత్మ!

"శంకరుడిమీదకూడ ఈ నల్లవాడికి వల్లమాలిన అభిమానం....లేకపోతే కాలి పోయే శరీరాన్ని కాపాడతాడా!....అందుకే తన జగద్గురు బిరుదు, శంకర భగవత్పాదు లకు ఇప్పించి వుంటాడనుకున్నాడు!

"కృష్ణం వందే జగద్గురుం" అంటూ శిరసానమస్కరించాడు!.... తల ఎత్తి స్వామీ నాకు ఒకటి రెండు ధర్మ సందేహాలు అన్నాడు!

అడుగు రాజయ్యా అంటూ నవ్వుతున్న పరమాత్మ, తటాలున అదృశ్యమయ్యాడు! "చెప్పకుండా పోవడం గొప్పవాళ్ళ లక్షణం" కాకపోతే ఎవడో "కావుకావు"మని కేకలిడి వుంటాడు, గజేంద్రమోక్షం లాంటిది కావ చ్చని, రాజయ్య గమ్మని వుండిపోయాడు.

★

# యువ వాణి

ఒకడు తన అవసరం కొరకు మరొకని వద్ద మూడువేల రూపాయలు అప్పు తీసుకున్నాడు. ప్రామిసరీ నోటు వ్రాశాడు. సాక్షులు సంతకాలు పెట్టారు.

మూడేండ్లు గడిచాయి. అప్పుతీసుకున్న వాడు చెల్లువేయలేదు. ఋణదాత ప్రో నోటును కోర్టుకు తీసుకుపోతే "గడువుదాటి పోయింది. ఇది చెల్లదు. నీకు డబ్బురాదు అన్నారు".

అప్పు పుచ్చుకున్న వాడు చట్టం ప్రకారం ఋణం తీర్చనవసరం లేదు. కాని అతనిలో ఒక సందేహం కలిగింది. "నేను డబ్బులు తీసుకున్న మాట నిజమే. దీన్ని నేను తీర్చకపోతే మరొక జన్మలో కుక్కగానైనా పుట్టి తీర్చవలసి వస్తుంది. మన ధర్మం అలా చెపుతున్నది" అని మంచిబుద్ధితో ఆలోచించి ఆ ఋణం తీర్చాడు.

చట్టం ఇవ్వలేని న్యాయాన్ని ధర్మం ఇస్తుంది. చట్టంకంటె ధర్మం ఎన్నో రెట్లు గొప్పది.

మన దేశంలో 'ధర్మము' అనే మాట చాల శక్తివంతమైనది. మనుషులను ఋజువర్తనులనుగా చేసి అపమార్గంలోపోకుండా కాపాడగల శక్తి దానికున్నది.

ఒక యువకుడు ఒక ముసలమ్మ దగ్గర బత్తాయికాయలు కొంటున్నాడు. "జత ఎంతకిస్తావు?" అని అడిగాడు.

'జత రూపాయి' అన్నదామె. పండ్లు వచ్చుగా కాస్త బరువుగా వున్నాయి.

"ఇంకోధర చెప్పు" అన్నాడు.

"జత ఎనభై పైసలిచ్చి తీసుకోండి" అన్నది.

"జత అర్థరూపాయికి యివ్వు"అన్నాడు.

'నీకుధర్మమైతే అలాగేతీసుకోనాయనా' అన్నది.

ఈ మాటలో ఎంతో అర్థం అతనికి కనిపించింది. తను ఏదో అడిగాడు గాని ఆమె ధర్మమైతే అలాగే తీసుకోమనేసరికి ఎంతో ఆలోచించాడు. ఆమెకు గిట్టుబాటు కాదని, కాసు పావలా కిస్తే ఆమె నష్టపడుతుందనీ అలా అడగడం తనకు ధర్మంగాదనీ అతనికి తోచింది. వెంటనే కాసు 40 పైసలు ఇచ్చి తీసుకున్నాడు. ఆమె ఉపయోగించిన 'ధర్మం' అనేమాట అతన్ని మారుపలుకకుండా చేసింది!

ఒక పెద్దమనిషి డాక్టరేటు డిగ్రీ పొందినాడు. పెద్ద ఉద్యోగంలోనే వున్నాడు. మంచి రూపవంతుడు. ఇష్టమైన కన్యను వివాహమాడాడు. ముగ్గురు పిల్లలు కలిగారు. నలభై ఏండ్లు వచ్చిన పిదప ఎవరినో ప్రేమించాడు. ఆమెను వివాహమాడి మొదటి భార్యను వదిలివేస్తానన్నాడు.

గది అద్దెకు తీసుకుంటాడు. సెక్రటేరియట్‌లోనో మరెక్కడనో ఉద్యోగముంటాడు. పనిచేసి పోయి ఇంటికి వస్తుంటాడు. స్కూటరు మీద విహరిస్తుంటాడు. నిజమే ననుకొని ఎవరో తన కూతురిని పెద్ద కట్నమిచ్చి పెండ్లి చేస్తారు. ఒకనెల అక్కడుండి రెండో నెలలో ఆమెకు తెలియకుండా ఏ పాట్నాకో బొంబాయికో మకాం మారుస్తాడు అక్కడా ఇదేకథ నడిపిస్తాడు. ఉద్యోగము వద్దిదే! జీతమూ వద్దిదే. ఇలా పది మందిని పదిహేనుమందిని పోషించి లక్షలు దోచుకున్న వ్యక్తిని గురించి పత్రికల్లో వచ్చింది.

చట్టం నుండి తప్పించుకున్నప్పటికీ అంతరాత్మ ఆదేశాలనుండి అతడు తప్పించుకోలేడు. కాని అతనికి 'ధర్మం' అనే భావన చదువుకున్న విద్యలోను పెరిగిన వాతావరణంలోను ఎక్కడాకనిపించలేదు. ధర్మం అనే మాటకు దూరం కావడం వలన అంతరాత్మ నుండి గూడ వేరయినాడు. అందుకే ఈ దురాగతాలు దుర్మార్గాలు చేస్తున్నాడు.

## చట్టంకంటె ధర్మం గొప్పది

"అబ్బాయీ! నీవు అన్నీ తెలిసినవాడివి. ఇపుడు భార్యకు విడాకులిస్తానంటున్నావు. నీవంటే బతకగలవు. ఆమె ఏమీ చదువుకో లేదు. ఆమెకు జీవనోపాధి ఎట్లా? నీసుఖం నువ్వు చూసుకుంటున్నావు సరే, నీ పిల్లల గతి ఏమిటి? వాళ్ళు నీ గురించి ఏమను కుంటారు? ధర్మం ఆలోచించు" అని పెద్దలు చెప్పినారు.

'ధర్మం' అనగానే అతని మనస్సులో మార్పు వచ్చింది. తన ఆలోచనలు విరమించాడు. మొదటి భార్యతోనే జీవితం కొనసాగించాడు.

దేశంలో అనేక విపరీతాలు జరుగుతున్నాయి. ఒక అందమైన యువకుడు, బాగా ఉన్నత విద్యను అభ్యసించినవాడు తన సౌందర్యాన్ని విద్యను తెలివితేటలను వినియోగించి అవివాహితలైన యువతులను వలలోవేసుకొని మోసగిస్తున్నాడు. ఏ నాగపూర్‌లోనో లక్నోలోనో ఒకపేటలో

ధర్మం అనేది మహాపండితులకు మహర్షులకూ అర్థమయ్యే పదం అనీ, సామాన్యులకు అది అనుభవంలోకి వచ్చే సంగతి కాదనీ కొందరు అపోహపడుతుంటారు.

బిచ్చగాళ్ళు "ధర్మం చెయ్యండిబాబూ" అంటూవస్తారు. వాళ్ళకు పదిపైసలు దానం చేయడమే ధర్మంయొక్క ప్రయోజనమని పలువురనుకుంటారు.

కాలక్రమేణా మరికొన్ని అర్థాలుగూడ వాడుకలో వున్నాయి. అతడు "ధర్మాత్ముడు" అని గనక అంటే, మంచిగాని చెడు గాని చెయ్యలేని ఒక అసమర్థుడనే భావం కొందరిలో వున్నది.

ధర్మం అనగా కుల ధర్మం అని, ఎవరూ తన కులవృత్తిని తప్ప మరొకటి చేపట

గూడదనీ కొందరు అర్థం తీస్తారు. వర్ణాశ్రమానికి సంబంధించిన విధినిషేధాలను అనుసరించడమే ధర్మమని ఇంకా కొందరి భావం. ఇలాంటి విపరీతార్థాల వలన అసలు అర్థం మరుగున పడిపోయింది. ఎంతో శక్తిమంతమైన, మనుష్యులను మానవోత్తములుగా చేయగల పదం నిరుపయోగంగా మిగిలిపోతున్నది.

"ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తన మనంబున
కగుఁ దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమ ధర్మ పదముల
కెల్లన్"

అని భారతములో విదురుడు పలికిన పలుకు ధర్మానికి పునాదిరాయి. ఇతరులు నీయెడ ఎలా వ్యవహరిస్తే నీకు అయిష్టము కలుగుతుందో నీవు ఇతరుల ఎడ అలా ప్రవర్తించవద్దు. అదే పరమ ధర్మము" అన్నాడు.

ఇదే సంగతి ఏసుక్రీస్తు మరొక విధంగా చెప్పాడు. "ఇతరులు నీ ఎడ ఎలా ప్రవర్తించాలని నీవు కోరుకుంటావో, నీవు ఇతరుల ఎడ అలా ప్రవర్తించు" అన్నాడు.

ఈ రెండు భావాలను జతపరిస్తే ధర్మం అనే దానికి రూపకల్పన జరుగుతుంది. మనుష్యులు పరస్పరం ఎలా మెలగాలో గ్రహిస్తారు. కలహాలకు కీచులాటలకు అవసరం వుండదు.

ఐతే, మంచిచేసి మంచిని ప్రతిఫలంగా పొందమన్నారు. బాగానేవున్నది. కాని మరొకడికి అపకారంచేసి, కీడు కలిగించి ఏదో ప్రయోజనం పొందుతున్న వాళ్లు, పొందగలమనుకునేవారు ఉన్నారు. వాళ్ల మాటేమిటి? వాళ్లకు ఎలాంటి శిక్ష కనిపించడం లేదే? వాళ్లు లోకంలో అన్నిసుఖాలు పొందుతున్నట్లు కనిపిస్తున్నారే?

దీనికి సమాధానం డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్యగారి మాటల్లో వున్నది. "ధర్మము అద్దము వంటిది. అది మన కర్తవ్యము మనకు ప్రబోధించును. అది మన ప్రవర్తన మనకు చూపించును. తండ్రికెదురుతిరిగినవాడు తన కొడుకుచే అవమానింపబడును. మిత్రులను మోసగించిన వాడు మిత్రులను కోల్పోయి తన్ను తాను మోసగించుకొనును" అన్నారాయన.

ఇదే ధర్మానికి సిసలైన వర్ణన. గోడకు కొట్టిన బంతివలె చెడుచేసినా మంచిచేసినా మన చేతుల్లోకి తిరిగివస్తుంది. మనం చేసే పనులు ఫలితాలను మనమే తప్పనిసరిగా అనుభవిస్తాం. అందుకే మంచిని, న్యాయాన్ని, కర్తవ్యాన్ని, సత్యాన్ని అంటిపెట్టుకొని వ్యవహరించాలి. దాని పేరే ధర్మం!

— శ్రీ మన్నవ గిరిధరరావు

## శ్రీకాకుళం జిల్లాలో సప్తగిరి

శ్రీమతి సరస్వతిదేవి,
సప్తగిరి ఏజెంట్,
సోంపేట,
శ్రీకాకుళం.

శ్రీమతి ఉప్పలపాటి
కృష్ణమ్మ-
40 నారాయణమూర్తి,
తెలుగుపండిట,
మందూరు.
శ్రీకాకుళం.

శ్రీమతి.యం. పద్మావతి,
W/o. ఎ.యస్.యస్. స్వామి.
హెడ్‌మాస్టర్-
కాళింగపట్నం
శ్రీకాకుళం.

యస్.బి.రామారావు.
టీచర్-
నర్సారావుపేట,
శ్రీకాకుళం.

శ్రీ కె. రామ్‌ప్రసాద్‌రావు,
కిరాణా అంగడి,
కోర్టువీధి
టెక్కలి.
శ్రీకాకుళం.

## విశాఖపట్నంజిల్లాలో సప్తగిరి.

శ్రీ. వీరునాయుడు.
శ్రీసాయివారి బుక్‌హౌస్,
అనకాపల్లి.
విశాఖపట్నం.

శ్రీ. వీరభద్రరావు,
ఆంధ్రప్రభ ఏజెంట్,
విశాఖపట్నం.

శ్రీమతి దాడా పద్మ
జయంతి.
శ్రీ భాస్కర్ మెడికల్స్,
పాండేరు పోస్టు
విశాఖపట్నం.

## విజయనగరం

శ్రీ. డి. వెంకటరాజు.
శ్రీ. వెంకటేశ్వర క్లాత్
ఎంపోరియం. ఎం.జి. రోడ్
విజయనగరం.

శ్రీ రాధాగోవిందపతి,
న్యూస్ ఏజెంట్.
పార్వతీపురం.



" ఆంగికం భువనం యస్య
వాచికం సర్వవాఙ్మయం।
ఆహార్యం చంద్రతారాది
తం వందే సాత్త్వికం శివమ్॥

పై శ్లోకం నటరాజు లీలాతాండవ స్తవం. భారత దేశంలో నృత్యప్రదర్శనాలకు పై శ్లోకం ప్రార్థనా గీతిగ వెల్లివిరిసింది. ఈ శ్లోకానికి ఆంధ్రీకరణం

ఎవని కాంగికమ్ము భువనసర్వస్వమ్ము!
వాచికమ్ము సర్వవాఙ్మయమ్ము!
అభ్రచంద్ర తార లాహార్య మెవనికౌ!
అట్టి సాత్త్వికు శివు నభినుతింతు.

లీలాతాండవలోలుడైన నటరాజును ఆరాధ్య దైవంగా ఉపాసించిన గౌరవం భారతదేశానికి దక్కింది.

కేవలం లౌకికదృష్టిలో చూచినా, సమస్త కళలకు ఆర్యప్రకృతి ఆదిమానవుని ఆటవికతాండవం. అడవిలో శాఖామృగంగా సంచరించే ప్రాక్తనమానవుని హృదయం రసతరంగితమైనప్పుడు అతడు పట్టలేని ఆనందంతో చిందులు త్రొక్కుతూ గంతులు వేశాడు. ఆ ఆటవికతాండవాన్ని ప్రస్తరిస్తే

1. విన్యాస విక్షేపాత్మకమైన నృత్తం.
2. తాళలయాన్వితమైన నాదం
౩. భావ సమన్వితమైన శబ్దం

అభివ్యక్తమౌతాయి. పై మూడు యుగయుగాంతరాలలో క్రమపరిణామ వికాసబద్ధాలై 1. నృత్యం 2. గానం ౩. కవిత్వం అనే లలిత కళలుగా వికసించాయి. సంగీతం అంటే కేవలం గానం కాదు ఆలంకారికుల దృష్టిలో

"గీతం చ నృత్తం చ వాద్యం చ
సంగీతం"

కేళీతాండవలోలుడైన నటరాజు చేతిలో డమరుకం ఉంటుంది.

ప్రతిసాయంసంధ్యానమయంలో సహ్యాద్రిపై పరమశివుడు నృత్యం చేస్తాడని భారతీయ సనాతన సంప్రదాయం అభివర్ణిస్తూంది.

జలధి మిన్నంటి తుంబురుల్ చదల చెదర
సహ్యగిరి-మరిసంజ వెంజామ
రెరి
నిండుమందున నిక్షేప నిత్యనృత్య
కేళినాపీ బ్రహ్మాండగోళ మెల్ల॥

అనేది నటరాజ స్తుతి.

లలిత కళలకు పెద్దపీట వేసింది. ఆలంకారికులు ప్రతిపాదించిన రససిద్ధాంత ప్రోక్త భరతముని-దానిని నాట్యపరంగానే ఉద్దేశించాడు. అయితే తరువాత ఆ సిద్ధాంతం లలిత కళలు అన్నిటికీ విస్తరించింది.

"రసానుభూతి అంటే సహృదయుడు లలిత కళోపాసన వల్ల పొందే ఆనంద తన్మయత్వం"

అని స్థూలంగా నిర్వచించవచ్చు. ఆనందం, మాటలలో చెప్పలేనిది. " వాచామగోచరమ్", అనిర్వచనీయము. బ్రహ్మానంద సహోదరం అని ఆలంకారికుల అభిభాషణ.

## వెలుగుబాట

డా॥ నండూరి రామకృష్ణమాచార్య

" A thing of Beauty
is a Joy for ever "

"సుందరవస్తు సందర్శనం సంతతానంద సంధాయకం" అన్నాడు ఆంగ్ల కవి కీట్సు.

కాళిదాస మహాకవి, ఈ భావాన్నే మనోహరతరంగా అభివర్ణించాడు.

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ
నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్ సుఖితోపి జంతుః
తచ్చేతసా స్మరతి నూనమబోధపూర్వం
భావస్థిరాణి జననాంతరసౌహృదాని॥"

సౌందర్య సందర్శనంతోపాటు మాధుర్య శ్రవణం గూడ సంతతానంద సంధాయకం అన్నాడు కాళిదాసు. పై శ్లోకానికి తెలుగులో స్వేచ్ఛానువాదం

ఉ॥ "సుందరవస్తు కనుంగొనిన చో
మృదుగానము నాలకించినన్

వెంపము గొండవాగయి పడిన్
ప్రవహించును పొంగులెత్తి, అ
నంపము మేలు గొల్చును మనః
మహాంతర సుప్తవాసనా
బృందము-కందళించు వరియుం
పెగ
రాని ఘనానుభూతులన్."

ఈ రసానంద మొహా ప్రవాహ కేళీతాండవ లోలుడైన "నటరాజు".

అతని నాట్యానికి సమస్తసృష్టి రంగభూమియే. అభినయం చతుర్విధాలు 1) ఆంగికం 2) వాచికం 3) ఆహార్యం 4) సాత్త్వికం ఆ పైన రసానుభూతియే. ఈ భువనం అంతా నటరాజుకు ఆంగికమే. సర్వవాఙ్మయం వాచికాభినయానికి ఉపకరిస్తుంది. ఇందులో సెలయేటి సవ్వడులు కోకిలాలాపాలు-తుమ్మెదల ఝుంకారాలు-సింహగర్జనలు-ఏనుగుల ఘీంకారాలు చిరుగాలి కెరటాల రొదలు అన్నీ కలుస్తాయి. ఆహార్యంగా సూర్యచంద్ర తారకాది సమస్త సృష్టి ఏర్పడుతుంది. ఇక ఆలంకారికులు స్థాయి భావం-పరిపుష్టి చెందేందుకు ముందు ఎన్నో విభావాలు ఆలంబన ఉద్దీపన విభావాదులతోపాటు సంచారీభావాలను పేర్కొన్నారు. సాత్త్వికభావానుభూతి ఈ ఉత్తుంగ తరంగాలు అన్నీ సమసిపోయిన నిశ్చల నిర్మలానందసాగరం. దానికి ప్రతీక నటరాజు సాత్త్వికాభినయం.

నటరాజు మృత్యుంజయుడు.

మృత్యుదేవత హృదయ విదారక వికటాట్టహాసంకూడ నృత్యరంగభూమిలో ఆనంద పర్యవసాయియే.

నటరాజుకు బాలశశిపీఠము అమృత నిరతిశయానంద నిర్ఝరికి ప్రతీకము.

అతని డమరుకం నుండి ఉద్భవించిన నాద ప్రస్తారంనుంచి అయిఉణ్ ఋలుక్‌ల నుండి వ్యాకరణ శాస్త్రం ఉద్భవించింది!!

సమస్త భువన సృష్టి అతనికి ఆంగికం
సమస్త వాఙ్మయాలు అతనికి వాచకం.
సర్వప్రకృతి అతనికి ఆహార్యం.
అతడు మూర్తీభవించిన సాత్త్వికాను
భూతి!

అతడు రస స్వరూపుడు
"రసో వై సః" •

'అత్తలేని కోడలు ఉత్తమురాలు;
కోడలులేని అత్త గుణవంతురాలు-'

ఇది అనాదిగా విన్పిస్తున్న దంపుళ్లపాట కావచ్చు. ఊకదంపుళ్లపాటా కావచ్చు. మొత్తంమీద అత్తాకోడళ్ల 'గొప్ప' తనాన్ని ఎత్తిచూపేపాట. ఆధునిక సాహిత్యభాషలో చెప్పాలంటే ఒక దెబ్బకి రెండుపక్షులు. అంటే అత్తలోనూ కోడలులోనూగల నెమ్మదితనం ఎంత కన్పడుతుందో ఎత్తిచూపిస్తూ ఒకే దెబ్బతో ఇద్దర్ని చిత్తుచేసిన అపూర్వధ్వని ప్రయోగం ఇది. ఆచార్య ఆనందవర్ధనులకు ఇది అందకపోవటం మన అదృష్టం. మొత్తం మీద అత్తల అఘాయిత్యాన్ని, కోడళ్లకొరివితనాన్ని మన సాహిత్యం ఎప్పటినుంచో చాటుతూనేవుంది. ఈ చెవిటి 'మాలోకం'లో ఆ శంఖారావం ఎంత ఎందరికి వినిపిస్తుంది? పాటదోవ పాటదీ మనదోవ మనదీ! మారాలనుకోకపోవటం వల్లనే యీనాటి కోడళ్లకు అత్తలు కాళికాస్వరూపాల్లాగ కన్పిస్తూంటే, కోడళ్లను అత్తలు కొరవిదెయ్యాలనుకొంటున్నారు. నిప్పులేకుండానే సంసారాలు గుప్పున అంటుకుంటున్నాయి.

నిజానికి యింతటి కీచులాట అవసరమా? ఎప్పుడూ అత్తాకోడళ్లమధ్య అగాథం ఇలానే వుందా, అంటే కాదనేందుకు ఎక్కువ ఆధారాలున్నాయి ముఖ్యంగా మన గుణమణిదీపాలైన రామాయణ మహాభారతాల్లో! పైగా ఆనవాయితీకి అతిభిన్నంగా కూడా వున్నాయి.

రామం దశరథం విద్ధి
మాం విద్ధి జనకాత్మజాం
అయోధ్యామటవీం విద్ధి
గచ్ఛ తాత యథాసుఖం-

'రాముణ్ణి దశరథుని ప్రతీకగా భావించు, జనకాత్మజను (సీతను) నన్నుగా చూచుకో, అయోధ్యను (రాముడు లేనందువల్ల)అడవే అనుకో, ఇహ(క) సుఖంగావద'ఈ మాటలు రామాయణంలో సుమిత్రాదేవి రాముని వెంట లక్ష్మణుని అడవికి పంపిస్తూ, అన్న మాటలు - పై శ్లోకంలో రెండు, నాల్గు పాదాలు అన్వయించుకొంటే చాలు. ఒక తల్లి తన సవతి (కౌసల్య) కోడలి మీద ఎంతటి భరవస, గౌరవం పెంచుకున్నదో, ఆ సీతారాములులేని అయోధ్య అడవిలాంటిదని ఎందుకన్నదో మనకు అర్థమవుతుంది. అత్త కోడలిని అభిమానించటమో అవమానించటమో సహజమైన విషయం. కాని సవతుల మధ్య ఈర్ష్యాగ్నులు ఇంధనం లేకుండామండే ఈ సమాజంలో,సవతికొడుకు భార్యమీద (వచ్చీగా నిక్కచ్చిగా చెబితే) ఇంతటి గౌరవం నమ్మకం పెంచుకోవటం విచిత్రంగానే కన్పిస్తుంది. నిజానికి రాముణ్ణి నారచీరలు కట్టుకొని అడవికి పొమ్మన్న కైక కూడా, సీతను వల్లెత్తుమాట అన్నట్లుగాని, దశరథుడు సీతకు ఆభరణాలు ఇస్తే అభ్యంతరం పెట్టినట్లుగాని రామాయణంలో కన్పడదు. ఇంకొకచోట రామునికి కలిగిన దురవస్థకు అందరూ బాధపడుతూ కైకను నిందిస్తుంటే, సీతాదేవి మాత్రం భర్తను చూచి బాధపడిందే తప్ప ఆ 'అత్తగారి అఘాయిత్యం' పట్ల పల్లెత్తి పలకలేదని ఆదికవి వివరణ. ఇది ఆ సీతా సాధ్వికి అత్తమామల పైనగల అత్యంత గౌరవానికి, ఆమెకుగల నిగ్రహానికి అద్దం పట్టిందంటే అతిశయోక్తి మాత్రం కాదు.

ఆదికావ్యం సంస్కృతంలోవుంది కనుక అందరికి అర్థమైవుండక పోవచ్చు. తేట తెలుగులో, మనసు కదిలించే మాటలలో, కవిబ్రహ్మ మరొక అత్తగారి మనస్సు నెలా వ్యక్తం చేశారో చిత్తగించండి. ఈ సన్నివేశం కూడా చిత్రమైందే.

కడుపసిబిడ్డ, వీడొకటి గాదవునా
నెరుగండు ముందరె
య్యెడ నొకపాటెరుంగ డెద యెంతయు
కోమల మెప్పుడైననే
గుడువగ బిల్చుగాని తనకుంగల
యాకటి ప్రొద్దెరుంగడీ
కొడుకిటు పోకకున్ మనము గుందెడు,
నిన్నని యూరడిల్లెడున్.

ఈ మాటలు అన్నది అత్తకాదు. అను ద్యూతం తరువాత పాండవుల వనవాస ప్రారంభంలో కుంతీదేవి తన సవతి కొడుకు, (మన తెలుగులో ఇలాగ చెప్పుకోవాలి మరి) పాండవ కనిష్ఠుడైన సహదేవుణ్ణి, అప్పగిస్తూ ఇలా అన్నదని ద్రౌపది భీమసేనునితో పలికిన మాటలు. సవతి కొడుకుపైన తను పెంచుకొన్న కారుణ్యమమతాబంధాలతో పాటు, కోడలి సౌమనస్యాన్ని, సౌహార్దాన్ని గుర్తించిన అత్తగారి గొప్పగుణాన్ని చెప్పుకొని తృప్తిపడ్డ ఒక కోడలి కథ ఇది.

అంతరంగాన్ని ఆవేదనా హాలాహలం దహిస్తున్నా, తన మనస్సును సరిపెట్టుకొని ఎదుటి మనస్సున కింత సానుభూతిని చూపిన అత్తాకోడళ్ళ అతిచిత్రమైన కథ కూడా ఈ 'భారతంలోనే వుంది. కురుసభలో తన కొడుకులు రభసతో రగిలించిన నిప్పు,



అశేష రాజకాంతాదవానలంగా మారగా, తన కొడుకులను నూర్గురిని పోగొట్టుకున్న గాంధారి, ఆ దావానలానికి తన అవమానాన్ని ఆజ్యంచేసి, ఉపపాండవు లైదుగురిని సమిధలుగా అర్పించి కారుచిచ్చు కడుపున దాచుకొన్న ద్రౌపదిని చూచి: "నిను నే నిట్టూరార్చెద! నను నీ వూరార్పవలదె నీనాతెఱగుల్! విను మొక్కరూప"....అన్నదంటే, ఆ అత్తకు తోటికోడలి కోడలిపై గల అనుకంపతోపాటు గల అభిమానం ఆ అత్తపై ఈ కోడలికిగల గౌరవం - వీటి ముందు మేమంటే మేమని గొప్పలుచెప్పుకొనే మన గర్వమెంత? మన సంసార నిర్వాహక మెంత?

కాలు నెదిరించి మగనాలిగా పసుపు కుంకుమ కాపాడుకొని అత్తమామలనుకూడ

అదుకొన్న కొత్తకోడలు కథకూడా ఈ భారతంలోనే వుంది. సత్యవంతుని ప్రాణాలు తిరిగి పొందే ప్రయత్నములో రాలు నొప్పించి మెప్పించి అత్తమామలకు చూపు తెప్పించిన సావిత్రి కథ మన మెరిగిందే. ఐనా ఈనాటి ముందడుగుకు అది నత్తనడక అనిపించదూ!

ఇవన్నీ మనకు తెలియునివా ఏమిటి? చిన్నప్పుడు విన్నాం. పిన్నలప్పుడు విని పించాం. పెద్దయినతర్వాతనే బుద్ధి మొద్దుబారింది. అంతేకాదు మనకున్న ఈ లోకపు లక్షణాలన్నింటిని మన కవిత్వంతో పై లోకాలకి కూడా ప్రాకించేశాం. అందుకే ఆ 'ఆది' అత్తాకోడళ్లు లక్ష్మీసరస్వతులు ఒకళ్ళ నొకళ్ళు చీరేసుకుంటారని, వీరిద్దరు



ఒకచోట వుండరనీ, ఇక మనుష్యులం మనమెంత? అనీ వెన్ను తట్టుకుంటూవుంటాం.

వాళ్ళ సంగతెలా వున్నా ఇది మనుషులలో మరింత బాగా ఖాయం కావటానికి కావలసినన్ని కారణాలు మనలోనే వున్నవి. కొత్త కోడలు అత్తగా మారేనాటికి అదుపులేని స్థితి, ఆయన ఆస్తి కలసి లక్ష్మీదేవే అవుతుంది. చదువుల తల్లే సరాసరి అడుగు పెట్టినా కాలక్రమంలో కొత్త సిరి కనిపించే సరికి, ఉన్న చదువు సున్నాకు చేరి, అత్తల వరుసలో పెద్ద పీటమీద వుంటుంది. ఇక ఈ లక్ష్మి, ఆ సరస్వతి కలవాలంటే సాధ్యమా? అందుకే, మనకు లేదు కనుక వాళ్ళకెందుకుండాలని, మన తగాదాలు వాళ్లకూ అంటగట్టాం. ఊరికే అన్నారా! 'చేతులగొప్ప గోడలుచూస్తే తెలుస్తుందని!

అత్తాకోడళ్ళ మధ్య అసలీ తిరుగుడు ఎలా వచ్చిందీ అని! కోడళ్లు— తాముసహించిన ప్రతి క్షణ నరకాన్ని తమ కోడళ్లు కూడా అనుభవించటమే అనివాయితీగా భావించే అత్తలుండటం ముఖ్యకారణం. తమకు కష్టం తీసుకొన్నారు కనుక తాము కూడా కష్టం తీసుకోవాలి. తాము ఏదో తిన్నారు కనుక తమ కోడళ్లకు కూడా ఆ అదృష్టం అందివ్వాలి. కష్టం 'ఈనని' కోడలు కొరివిదెయ్యం- ఇదీ అత్తల మనస్తత్వం. అది అందిస్తున్న వారసత్వం!

అత్తమామలులేని కాపురం ఎంతో మెత్తగా వుంటుందనో, వాళ్లున్నా ఆ పనికీ ఈ పనికీ కాస్త తోడుమాత్రమే - అనే కలవరింతలు, కోడళ్లు కాబోయే కలకంఠులలో ఏర్పడటం. 'అత్తమామలుంటార్ల! అమ్మా యేం కాపురం చేస్తుంది' అనే వాత్సల్యసముద్రులు వేల సంఖ్యలో తయారుకావటంతో ఈ భావతరంగాల నడుమ పెరిగిన పిల్లలకు ఏ మాత్రం అనుకొన్నది జరిగించుకోలేకపోయినా అహం దెబ్బతినటం జరిగి చిన్నగా వంటరుచుల దగ్గర రగిలిన చిచ్చు, కిరోసిన్‌తో మండి, కూడిన సంసారాలు కాలిపోవటంతో ఆరిపోతున్నది.

కనుక ఈనాటి సమస్యలకు ముఖ్యకారణాలు అహంకారంగల అత్తలు, అత్తింట అడుగు పెట్టకముందే అత్తతో ఎలావుండాలో ఎత్తులునేర్పే- అమ్మాయిల అమ్మలు, తాళి కట్టించక ముందే, అత్తమామలకు పాత బొచ్చెలు ఎలా ఇప్పించాలో, ఆలోచించే తండ్రులూ. అవకాశాన్ని మించి కోరి, కోరినకట్నం పుచ్చుకొని, అంపకాల వేళ, 'పుత్రవత్పాలితా మయా' (కొడుకు మాదిరి చూచుకొన్నా) అంటూవుంటే, అవునవును, మేం సర్దుకుంటాం, దిద్దుకొంటాం అని, తీసుకువెళ్లి, పదిరోజుల్లోనే, పారాణి ఆరకముందే, పదో రోజుకో పెద్దకర్మకో రమ్మనిచెప్పే సమాజానికి, ఏదైనా ఎప్పుడొస్తుంది! కడుపులో పెట్టుకోవలసింది పోయి, కడుపున పెట్టుకుంటున్నాం మరి!

అసలీ అత్తలకు కోడళ్లకు అర్థంకాని విషయం ఇంకొకటివుంది. వాళ్లకా స్థాయి కల్పించిన కొడుకు-భర్త అనే 'లింకు' జీవి ఒకడున్నాడనేది ఇద్దరూ గమనించరు. పంతాలు, పట్టింపులు, వేధింపులు, సాధింపులు, పెడబొబ్బలు, ఏడుపులు వీటితో జీ కాలం గడుస్తున్నది తప్ప ఆ జీవికీ కొన్ని ఆశలు ఆశయాలూ వుంటాయనీ, ఈ రభసలోని అసంతృప్తితో పండంటి కాపురాన్ని కొండెక్కించుకొంటున్నాడన్న దృష్టే లేదు. ఈ మధనానికి తట్టుకోలేక అమ్మమీది గౌరవంతో ఆలికి అన్యాయం చేసి చట్టాల కష్టాల పాలవటమో, ఆలిమీది ప్రేమతో అమ్మను ఆవేదన పాలుచేయటమో జరుగుతూంది. అంటే కిరోసిన్ డబ్బాతో, రోకటి బండతో తేల్చుకోవాలన్న మాట. ఏమైనా అత్యాచారాల విషయంలో అత్తల స్థాయికి కోడళ్లు రాకపోవటం ఈ జాతి చేసుకొన్న అదృష్టం. అది గమనించని అత్తలుంటే అది వారికే (అంటే అత్తలకు) నష్టం, మరింత కష్టం.

"కొడుకుల కంటె నయ్యమగు కోడలి
కెక్కుడు కూర్తు గోడలుం
గొడుకుల పేయుభక్తి కటుకోటి
మడుంగులు భక్తి నాకు నె
ప్పుడు దగసేయుచుండు"

అని అత్తాకోడళ్ల మధ్య ఉండవలసిన రీతి కుంతీదేవే చెప్పింది.

మారుతున్న విలువలెలావున్నా ఈ మానవతావాదాన్ని గుర్తించికూడా మార్చుకోని మన స్తత్వాన్ని, మార్చవలసిన బాధ్యత సమాజంమీద వుంది. అందరూ అభిమానానికైన వాళ్లేనని, కష్టాలకయిన వాళ్ళెవరూలేరని, ప్రతీ అత్తా ఒక కోడలేనని గుర్తించగలిగితే ఆనాడు, ఆనాట, ఆయింట 'కలుముల తల్లి' 'చదువుల మల్లి' కలసి విలసిల్లి, ఆనంద జ్యోతులే నీరాజనాలిస్తాయి.




# మాత స్సమస్త జగతామ్....

— శ్రీ సాంబశివరావు

మాత స్సమస్త జగతాం మధుకైటభారేః
వక్షో విహారిణి మనోహర దివ్యమూర్తే ః
శ్రీస్వామిని శ్రితజన ప్రియదాన శీలే
శ్రీ వేంకటేశదయితే తవ సుప్రభాతమ్॥

శ్రీవేంకటేశ్వరస్వామి కలియుగదేవుడు. ఆయన హృదయ పీఠమందలంకరించిన ఆ మహాలక్ష్మి వక్షోవిహారిణియై తదనంతరము మనోహరమైన రమ్యమైన మంగళదాయకమైన దివ్యసుందరమూర్తి సుప్రతిష్ఠతము. జగతి కంతటికీ మాతయై మహాలక్ష్మి విలసిల్లు చుండును. ఆ విధముగ జగన్మాత ఆ స్వామి అత్యంత ప్రియదాన శీలవతియై సమస్త జనమునకు సన్నిహితమైనది. మరియు దయాస్వరూపిణియై నెలవుచేసియున్నది.



ఆ తల్లియైన జగన్మాత సమస్త జగతికి మాత. ఆ అమ్మ దయతో ఆ వేంకటేశ్వర స్వామి దయకుగూడ సన్నిహితులౌతారు. అమ్మ అనుగ్రహము, అయ్యగారిఆశీర్వచన బలప్రభావము మనలకు మంగళప్రదము. మన సంస్కృతీ సాంప్రదాయ సంబంధములైన గీతములందు గూడియున్న భావములు మిక్కిలి గమనార్హములు. అమ్మగారికి వప్పుబెల్లాలు అయ్యగారికి ఐదు వరహాలు.

ఈ ప్రకృతీపురుషుల సంబంధానుబంధమే యీ సర్వవిశ్వజనీనమైన సృష్టికి మూలకారణమని మన ధృఢమైన విశ్వాసము. ఆ విధముగా మానవ జీవుల సృష్టిలోను స్త్రీ పురుషుల సృష్టి ప్రకృతీ పురుషుల ప్రతిబింబ స్వరూపములుగా భావించబడినది. ఆ విధముగా స్త్రీ,ప్రకృతి స్వరూపమనియు పురుషుడు ఈశ్వరాంశమైన పురుషాంశము అనియు మనము భావించుచున్నారము. ఈ సత్యమును, సత్యాన్వేషణలో మనము ఆ ప్రకృతీపురుషులను మనము సాదృశ్యముతో తెలిసికొనగల్గుచున్నాము. అట్లు తెలిసికొనుటకు కృషి, పట్టుదల, సహనగుణశీలత మనకు అభ్యాసక్రియలో నిర్దేశించబడియుండుట చదువరులకు సువిదితము.

అర్ధనారీశ్వరీయములో వామభాగము ప్రకృతియైన ఆ పార్వతీదేవి యనియు దక్షిణభాగము ఈశ్వరుడనియు మనకు తెలిసిన విషయము. ఆ విధముగానే ఆ శ్రీమహావిష్ణుడైన శ్రీ వేంకటేశ్వరస్వామి హృదయపీఠమునందు మహాలక్ష్మిని అలంకరించుకొనియున్నారు. వీరిద్దరు ప్రకృతి మాతలే. చైతన్యశక్తి స్వరూపిణులు. ఈ చైతన్యశక్తులు లేనపుడు శివకేశవులిద్దరు అచేతనులై నిలిచియుందురు. అచేతనమందు వారిద్దరు చైతన్యరహితులై నిరామయులై యుందురు. శక్తి (చైతన్య) లేకున్న చలనము లేదు. శక్తి చైతన్య ప్రవృత్తితో చలనమును గలిగించుచున్నది.

ఆ చలనగతి మన ప్రవృత్తికి మూలకారణమై, కార్యోన్నతికి సహాయమగుచున్నది. దానినే గీతయందు గీతాభాష్యకారుడైన శ్రీకృష్ణభగవానులు కార్యం కర్మయని చెప్పియుండుట గమనార్హము.

కర్తవ్యాచరణ మనకు ఆదేవదేవుడిచ్చిన వరప్రసాదము. కర్తవ్యమును ఎప్పుడూ, ఎలాంటి పరిస్థితులు తప్పన్నమైనను, మనం విస్మరించరాదు. కురు కర్తవ్యం. సంసారులై గృహస్థాశ్రమ జీవితమున యున్నవారు కర్మాచరణ చేయుట యభిలషణీయము గాక శ్రేయోభిదాయకమని అర్జునునకు బోధించియున్నారు. ఆ విధముగా ఆ నర నారాయణ సంబంధము కారణ కార్యసంబంధమై విశ్వజనీనమై యున్నది. కార్యాచరణలో మనకు అందమున్నది. అద్దాని వలన మనకు ఆనందము లభించును.

మనము ఎట్టి పరిస్థితులలోను సోమరిపోతులము కారాదు. మన మనస్సులను తగిన సుసంపన్నమయిన కార్య కర్మ కరోన్నతులయందు నిమగ్నము చేసియుంచుట యెంతయో యానందదాయకము. అలసట నిద్రను కలిగించును. ఆ అలసట శారీరకము,నిద్ర శారీరకము. శరీర

సంబంధము కావున అన్నది జడము. ఈ జడనిద్రను మనము భ్రాంతి సంజనితము చేసుకొనరాదు. ఆ నిద్ర నాది యను బంధమును పొందరాదు. అట్టి నిద్రవలన మరుపుగలుగుచున్నది. మరియు ఆబంధం దుఃఖహేతువు. అందుచేత నిద్రను జయించవలెనన్నారు. నిద్రను జయించటం అంటే తెల్లవారు మస్తుగా పుచ్చుకొని బలవంతంగా నిద్రనుండి మేల్కొను నట్లు గాదు. నిద్రను జయించడం అంటే నిద్ర యను మత్తు నుండి విముక్తులమై మేల్కొని నిత్యము జాగ్రదావస్థను పొంది యుండుట యన బడును. అట్టి నిద్ర "నిద్రా సమాధిస్థితిః" అన్నారు. బ్రహ్మజ్ఞానులైన పండితులు.

మధుకైటభులయిన దుష్టశక్తులు మనలో ఎందరున్నారో! అట్టి దుష్టశక్తులను ఆ హృదయ పీఠము నలంకరించిన ఆ మహాలక్ష్మి వీరవిహారము జేసి పరిమార్చి శిష్ట జన సంరక్షణ జరుపునని భావము. ఆ వీర విహారము మనోహరము. కాని భీభత్సము. భయమునుగూడ కలిగిస్తుంది. కాని ఆమాత సాన్నిధ్యం భయ రహితము. ఆ మాత భయ దుఃఖ నివారిణి. యోగి హృద్యానుగమ్యం. ఆ విధముగా వక్షో పీఠమునందు దుష్టశక్తుల పరిమార్చుటలో వీర విహారము చేయుచు ఆ యోగి యొక్క హృద్యాను గమ్యమును జూపిస్తుంది. ఈ ప్రక్రియనే శ్రీ అరవిందులు తన పూర్ణ యోగము నందు 'అమ్మకృషి' (Mother's labour) యని యభివర్ణించి యుండుట పాఠకులకు తేటతెల్లము. సంసారఛాయ లైన నీలభావ రోగములను తిమిరవ్యాధులను రూపు మాసి పోతాయి. శ్రీకృష్ణ భగవానులకు వెన్న చాలప్రీతి దాయకమైనది. దీనికి కారణము లేక పోలేదు. వెన్న ఎంత మృదు మధురమైనదో అంతకంత చల్లనిది, స్వచ్ఛమైనది. అట్టి వెన్నను దొంగలిస్తూ తన బాల్యము నంతను గడిపిన ఆ భగవానుని వెన్నదొంగయని ముద్దుగా ఆ నీలమేఘశ్యాముని పిలుచు కొన్నారు. ఆ వెన్న యెట్టిదనిన ఆయన సమాధానము నీలభావ రోగములను పారద్రోలజాల్చి వెన్న ఇది పరమార్థ భావము. కావున మానవు మనము అప్రమత్తులమై ఎల్లవేళల జాగ్రత్తగా యుండుట యోగాభ్యాసమును నిరూపించు కొనుటకు.

కర్మాచరణ ఫల సంకల్ప రహితముగా చేయు చుండ వలెను. అహం కరోతి యను మను ఫల సంజ్ఞ భావమును పొందరాదు. నేను చేయుట లేదు. నాలో ఏదో ఎవరో చేయుచున్నారు యను భావస్థితిని పొంద వలెను. అట్టి దానిని 'అనాశ్రితం కర్మ ఫలం" యని యభివర్ణించి యున్నారు. ఈ విధంగా కార్యం కర్మ కరోతి యను చేయుచున్న గృహస్థులైనను కర్మసన్యాసులైన వారికి సమానతుల్యముగా యున్న ఫలసిద్ధికి యోగ్యులు అర్హులు యని గీత మనకు ప్రబోధించి యుండుట గమనార్హం. చెప్పటం తేలిక యని వ్యాఖ్యానించుట హాస్యాస్పదము. ఏలనన, శ్రీకృష్ణభగవానుల విధి అర్జునునకు బోధించుటకు మాత్రమే గదా! అపైన కృషి, శ్రద్ధ, పట్టుదల, క్షమా, ధృతి అర్జునునివే గదా! ఆచరణ అభ్యాస క్రియతో ప్రారంభమై శ్రద్ధతో ద్విగుణీ కృతోత్సాహమై, పట్టుదలతో ఆపదలను అడ్డంకులను ఎదుర్కొని, క్షమాధృతితో కష్ట సుఖములను, లాభ నష్టములను ద్వంద్వములైన మానావమానములను సహించి, సమాధాన పరచుకొనుట యను నవన్నియు ఆచరణీయులు పొందియుండవలసిన లక్షణములు.

అమ్మ అడిగిన గాని పెట్టదన్నారని పెద్దలయిన తరువాత బుద్ధి జాడ్యంతో నా పేదరికమును, దారిద్ర్యము నుండి నన్ను విముక్తుని చేయుమని అడిగినంత మాత్రాన చేస్తుందా! బాల్యంలో మాతృ గర్భము నుండి కెవ్వుమంటూ యీ భూగడ్డ మీద పడినపుడు తన స్తన్యమును అడగక పుండగనే కుడపటం నేర్పుతుంది. నీవు నేర్చుకుంటావు. ఆ విధముగా ఆ పాలతో పెరిగి బాలుడవై పెద్దవాడ వౌతావు. కాని నీవు బాలుడవయ్యాక స్తన్య మీయమంటే చెంప

తెలంగాణాలో సప్తగిరి

శ్రీ డి. కిష్టయ్య
జమ్మికుంట
హుస్నాబాదు తాలూకా
కరీంనగర్.

శ్రీ కె. రాజేంద్ర ప్రసాద్
c/o డి. రాజారాం
1-2-5 హాబ్సిగూడ
హైదరాబాదు-7

శ్రీ వై. రాజలింగం పంతులు
బద్దం ఎల్లారెడ్డి నగర్
సిరిసిల్లా, కరీంనగర్ జిల్లా.

శ్రీ యస్. రాజేశ్వర్
ముప్కల్
ఆర్మూరు తాలూకా
నిజామాబాదు.

శ్రీ యం. వెంకటాచార్యులు
అందోలు, మెదక్

శ్రీ. బి. శ్రీనివాస్
శ్రీ రామా బుక్ హౌస్
ఆదిలాబాదు.

యస్. అంజయ్య
ఇరోర్ ట్
సిద్దిపేట తాలూకా
మెదక్ జిల్లా.

పి. విశ్వనాథం
మురళీ పాన్ షాపు
అండ్ బుక్ స్టాల్
షాబజారు,
మెహబూబ్ నగర్.

శ్రీ. బి. యస్. ఆర్. సి. హెచ్. గుప్త
న్యూస్ ఏజెంట్
కల్లూరు - ఖమ్మం జిల్లా.

శ్రీ వై. రాజలింగం హరిదాస్
స్టేషన్ రోడ్
కామారెడ్డి.
నిజామాబాదు జిల్లా.

## గోదావరి జిల్లాలలో సప్తగిరి.

శ్రీ.బాదం ప్రభాకరరావు,
మెయిన్‌రోడ్-కాకినాడ.

శ్రీ.కె.శ్రీరాములు,
శ్రీ సత్య వీరభద్ర ఏజెన్సీ,
సోమేపేట-పెద్దవీధి
రాజమండ్రి.తూ॥గో॥

శ్రీ.యస్.ఆర్.బ్రహ్మానంద
ముక్తిలింగం వారి వీధి
తుని-తూర్పుగోదావరి.

## వెస్ట్ గోదావరి

శ్రీ.టి.వెంకటగిరి నర్సింహా
మారుతి: 534227 .మార్టి,
తణుకు.
వెస్ట్ గోదావరి జిల్లా.

శ్రీ.సి.గోపాలాచార్యులు,
మల్లవరం.
నరసాపూర్
వెస్ట్ గోదావరి జిల్లా.

శ్రీ.కర్రి.గంగాధర రెడ్డి,
అర్జునుడు పాలెం,
ఇరగవరం,
వెస్ట్ గోదావరి జిల్లా.

శ్రీ.కొండా వెంకటేశ్వరరావు
కన్నూరు,
వెస్ట్ గోదావరి జిల్లా.

శ్రీ.బాబూ వెంకటరత్నం,
న్యూస్ ఏజెంట్,
మెయిన్ రోడ్,
వెస్ట్ గోదావరి జిల్లా.

శ్రీ బంగారు సీతారామాం
[illegible],
మెయిన్ రోడ్,
పాలకొల్,
వెస్ట్ గోదావరి జిల్లా.

దెబ్బ నిస్తుంది. స్తన్యమిస్తుంది. ఎప్పుడు? అట్టి శిశు స్వభావము నీవు పెద్దవైనపుడు గూడ నీలో యుండి యుండాలి. అమ్మగా అనగా అమ్మ భావంతోను, నీవు ఆ తల్లికి యనుంగుపుత్రుడుగాను నీ మనో దృక్కు నందు నీ జీవాత్మస్వభావమునందు స్వచ్ఛమైన భావ సంజనితమై యుండి యుండవలెను. మాట పౌరుషము కాదు ప్రధానం, మాట సంయమనము, వాగ్ధాటి కాదు. నిర్మల భావము, వాక్చాతుర్యము గాదు వాగ్భూషణము. త్యాగ నిరతి కాదు. మద శాంతిని పొందాలి. దానము కాదు ప్రధానము. అందలి శౌచగుణముప్రధానం.

అమ్మకు నైవేద్యము గాదు,ముఖ్యం. అమ్మ సాన్నిధ్యమునకు మూలకారణము నీవు అర్పించు ముద్దలో స్వచ్ఛత మరియు ప్రేమ నిర్మలత యనునవి. మన పిల్లలు ఏదైనా మన నోటి కందిస్తే మనమెంతో ఆనంద పరవశులవుతాం. ఈ విధముగా ఆ అమ్మ కూడ మనం తినుదానిలో అలా అర్పిస్తే సంతృప్తినొంది తీరుతుంది. అద్దానినే 'తృప్తాత్మ' యందురు. యస్త్వాత్మ రతిరేవ స్యాదాత్మ తృప్తశ్చ మానవః యని గీత. నిత్య తృప్తో నిరాశ్రయః. అప్పుడు నీవు భయ దుఃఖానుబంధముల నుండి దూరమై ఆత్మానుసంధానుఁడవై ఆత్మానుభూతిని పొంద గలుగుదువు. బంధవిముక్తుడవుగా గలవు. అప్పుడు నీకు ఆనందానుభూతి నీ కనులముందు దృశ్యము కాగలదు.

అప్పుడప్పుడు కొన్ని ప్రశ్నలు కూడ వస్తుంటాయ్. అమ్మా, అయ్యా యిద్దరు వారి కుమారునితో యిలా ముద్దుగా అడుగుతుంటారు.

నేను కావాలా! అమ్మ కావాలా! నీకు.
నేనే కావాలి కదూ-అంటుంది అమ్మ.
అమ్మ కూఁబీదిరా! నేనే కావాలి కదూ!

ఊహు? నాకు మీ రిద్దరు కావాలి. అమ్మ కావాలి. నీవు కావాలి. అన్నప్పుడు వారి ఆనందము నిర్వచనీయం.

అప్పుడు ఆ తనయుడు యిద్దరినీ కలిపి 'అమ్మయ్య' అనుకుంటాడు.

ఈ ఆనందము మన ప్రజ్ఞకు ఆపైవ వరార్థ సులభతకు కారణకారి యగుతుంది.

ఆయన నిర్వికారుడు. నిరామయుడు. ఆపైన అనిర్వచనీయుడు. నిరంజనుడు.

అనగా నిరామయ స్థానము శూన్యము. అప్పుడు ఆకారము నిరాకారము. సాదృశ్యత అగోచరము. కేవలము అది ఎండమావి లోని జల వంటిది.

దీనికి సృష్టికర్తయైన బ్రహ్మ, శ్రీ మహా విష్ణువు నాభి గర్భమున జనించిన తామర తూడు ద్వారా గర్భము నుండి బయల్వెడలి బయటి ప్రపంచమును జూచి సంభ్రమాశ్చర్యము నొంది యిచ్చట నిరామయమైన నిశ్శబ్దముగా యున్నదేమియని విభ్రమ నొందినవాడై తిరిగి మరల గర్భమున ప్రవేశించి అచటి కోలాహలమును జూచినాడు. ఆవిధముగా ఆయన నిరామయుడు నిర్వికారుడుగ యున్నారు.

ఆకాశము రెండు లక్షణములు. ఒకటి శబ్ద సహిత ఆకాశము. రెండవది శబ్దరహిత ఆకాశము. మొదటిది క్రిందది. రెండవది ఉపరితలమున యున్నది.

1. సవికల్పసమాధి స్థితి-ఆకారము-ఆకాశముశబ్ద సహితము శబ్దములు విన దగును.

2. నిర్వికల్ప సమాధి స్థితి – ఆకాశము–శబ్ద రహితము. శబ్దములు నిర్వర్తితములు అనగా శబ్దములన్నియు అడంగును. శబ్దములు వినబడవు.

3. మౌనముద్ర-మనోఆకాశము-సంకల్ప రహితములు. అసలు సంకల్పమే యుండదు సావధానము ఇంకేమియు యుండదు. విశ్వవ్యాపకమైన ప్రకాశ వ్యాపకము.



# సుబ్రహ్మణ్యషష్ఠి

కార్తీకమాసమున కుమారస్వామిని అర్చించుట ఆచారము. కార్తీకమాసమన్న పేరే కార్తికేయుని పూజించుటకు తగిన సమయమని సూచించుచున్నది. భారతీయులు కార్తీక శుద్ధ షష్ఠిని సుబ్రహ్మణ్య షష్ఠిగా కడు భక్తిశ్రద్ధలతో జరుపుకొందురు. స్కందుడు, కుమారస్వామి, కార్తికేయుడు, సుబ్రహ్మణ్యస్వామి, షణ్ముఖుడు అని పలు పేరులతో శివుని రెండవ కుమారుని పిలుతురు. కుమారస్వామి మహత్తరమైన శక్తికి, దివ్యమైన జ్ఞానమునకు ప్రతీక. స్కాందపురాణంలోని "శివ రహస్యఖండ" ఇతని జన్మవృత్తాంతము మరియు లీలను గూర్చి వర్ణించుచున్నది. బ్రహ్మవైవర్త పురాణం; రామాయణ భారతాలు; కాళిదాసు కుమారసంభవం మరియు నన్నెచోడుని కుమార సంభవం ఇతనిని గూర్చి చిత్రించుచున్నవి. ఇతని జన్మ మతి విచిత్రమైంది. తారకాసురాది రాక్షసుల బాధలకు తాళలేక ఇంద్రాది దేవతలు బ్రహ్మకు మొరపెట్టుకొనిరి. బ్రహ్మ ఆలోచించి పార్వతీపరమేశ్వరులకు ఉదయించు పుత్రుడు వీనిని చంపుటకు సమర్థుడు. మీరు వారి మధ్య ప్రణయమును పుట్టించుటకు మన్మథుని పంపుడని ఆనతిచ్చెను. మన్మథుడు పోవడం - విజయం సాధించడం - భస్మం కావడం పార్వతీపరమేశ్వరుల కళ్యాణం జరగడం ముగిసాయి.

ఒకరోజున శివపార్వతుల సమాగమవేళ అగ్ని వచ్చాడు. కేళీవిహార విఘ్నమునకు శివుడు మహోగ్రకోపమున తన వీర్యమును అగ్నిని భరించమని ఆజ్ఞాపించాడు. అగ్ని దాని వేడిమిని ఓర్వలేక గంగకిచ్చాడు. గంగాప్రవాహంలో ఆ శివతేజస్సు కొట్టుకు వచ్చి రెల్లుపొదలవద్ద ఆగిపోయి కుమారస్వామిగా వ్యక్తిత్వం పొందింది. అప్పుడు సప్తర్షుల భార్యలలో అరుంధతితప్ప తక్కిన ఆరుమంది కృత్తికలు ఆ బాలునికి తల్లులై స్తన్యమిచ్చి పోషించారు. అలా పెరిగి పెద్దవాడై కుమారస్వామి దేవసేనను, వల్లిని పెళ్ళాడి, తారకాసురాది రాక్షసులను సంహరించాడు. ఇదీ కథ!

ఈ కథ అసంబద్ధంగా అసహ్యంగా తోచకమానదు. ఇది వివిధాధ్యాత్మిక విషయాలకు ప్రతీకగా చెప్పబడింది. కుమారస్వామి జననం సృష్టి పరిణామ వికాసంలోని క్రమాన్ని తెలుపుతుందనిపిస్తుంది. శివుడు చిదంబరుడు. ఆకాశతత్త్వానికి సంకేతం. వ్యోమమును (ఆకాశమును) కేశములు (జుట్టు) గా గలవాడు. కనుకనే శివునికి వ్యోమకేశుడని పేరు. పార్వతీదేవి వాయువునకు ప్రతీక. లలితాసహస్రనామంలో ప్రాణదా-ప్రాణరూపిణీ-ప్రాణేశ్వరీ - ప్రాణదాత్రీ అని చెప్పబడింది. మనలోని ప్రాణము వాయుస్వరూపం. ఉదాహరణకు అక్కడ ఓ శవం పడివుందనుకొందాం ఏమి లోపించడంవల్ల అది చైతన్య విరహితమైపోయింది? నిన్నటివరకు పెద్ద అధికారి హోదా వెలగబెట్టిన ఆ శరీరము అలాగే వుందికదా! మరి ఇప్పుడు ఏమి దాంట్లోంచి నిష్క్రమించడంవల్ల శవమైంది? "ప్రాణము" శరీరంలో నుండి నిష్క్రమించడంతో శరీరం కాస్త శవమైంది. అతని ప్రాణవాయువులు అనంతవాయువుల్లో



కలిసిపోయాయి అని సాధారణంగా అంటుంటారు కదా! అనంతాకాశంలోని వాయువుల్లో కొంత భాగం ఈ శరీరంలో ప్రవేశించి చైతన్యవంతం చేసింది మొనరించింది. తిరిగి ఈ కొంత వాయువు ఆ అనంతవాయువుల్లో కలిసిపోయింది.

కామం అగ్ని స్వరూపం. శివపార్వతుల మధ్య అగ్ని వచ్చాడు అంటే ఆదిదంపతుల మధ్య కామాగ్ని ప్రజ్వరిల్లింది అని భావం. అట్లు వారి మనస్సులో పుట్టిన కామాగ్ని వలన వెలువడిన శివతేజస్సును భరించలేక గంగకు సమర్పించాడు. ఈ తేజస్సు గంగా (జలం) స్వరూపమని భావించవలెను. శివతేజస్సు గంగాప్రవాహంలో కొట్టుకుంటూవచ్చి రెల్లుగడ్డివద్ద ఆగిపోయింది- రెల్లుగడ్డి పృథ్వీతత్త్వానికి చిహ్నం. అక్కడ దేహ నిర్మాణం జరిగి కుమారస్వామి వ్యక్తిత్వం పొందాడు.

ఈ విధంగా పంచభూతాలేర్పడి జీవ నిర్మాణం జరిగిన విధం వివరింపబడింది. శివుడు (ఆకాశం); పార్వతి (వాయువు) లకు, కలిగిన కామం (అగ్ని) వలన వీర్యం (అపస్) ఘనీభవించి శరవనం (పృథ్వీ గోళాలు) ఏర్పడ్డాయి. ఈ భావనకు ఉపబలకంగా ఈ క్రింది విషయం చెప్పవచ్చును. ఆకాశాద్వాయుః-వాయోరగ్నిః-అగ్నేరాపః-అపోపృథ్వీ ఈ విధంగా ఆకాశం నుండి వాయువు-వాయువు నుండి అగ్ని-అగ్ని నుండి జలం - జలం నుండి పృథ్వి ఏర్పడిందని కుమారస్వామి జన్మరూపకంగా చెప్పారనిపిస్తుంది, పృథ్వి అంటే ఇక్కడ కేవలం భూగోళం మీది మట్టికాదు. అన్ని గోళాలయొక్క భౌతికపదార్థం అని భావం. అట్లు నిర్మాణమైన జీవము వికాసం చెంది అభివృద్ధి నొందవలెనంటే దానికి 'పోషణ' జరగవలెనుగదా! కుమారస్వామికి కృత్తికలు స్తన్యమిచ్చి పోషించాయి. భూగోళంలోని జీవులు ఆత్మవికాసం చెందవలెనంటే కేవలం సూర్యచంద్రుల నుండి వెలువడే కిరణాలేగాక సప్తర్షిమండలం నుండి వెలువడే కిరణాలుకూడ తోడ్పడతాయి. వీని

ప్రభావం భూమిమీద పుట్టే జీవరాసులలోని జ్ఞానవికాసంగా ప్రస్ఫుటమవుతుంది. ఈ విధంగా అరుంధతి తప్ప తక్కిన కృత్తికా నక్షత్రాల కిరణప్రసారం భూమిమీద పడడాన్నే కృత్తికలు యిచ్చిన పాలుగా చెప్పబడింది. ఇట్లు కిరణాల వెలుగులలో పుట్టి పెరుగుతున్న జీవుడే కార్తికేయుడుగా వర్ణింపబడినాడు. భూమిలోని సారాన్ని గ్రహించి కుమారస్వామి (జీవప్రకృతి) పెరిగాడు అని చెప్పారు. అలా ఆరుమంది తల్లులవటంతో షాణ్మాతురుడయ్యాడు.

ఈ ప్రకృతికి అంతంలేదుగదా! అది ఎంత పెరిగినా ఇంకా ఉండనే ఉంటుంది. దానికి వార్ధక్యం లేదు. ఇట్లు ఒక పరిధిని మించి ప్రకృతి పెరగదు. కనుక దాన్ని సూచించుటకే "కుమారస్వామి" అన్న పేరు.

ప్రతి గోళానికి నాలుగు దిక్కులు. ఊర్ధ్వ అధో భాగములున్నై. ఇదియే కుమారస్వామిని "షణ్ముఖుడు" గా వర్ణించువట్ల సంకేతించారు. జీవుడు పంచేంద్రియములు మనస్సు కల్గివుండడాన్నే "షణ్ముఖు" డని ప్రతీకాత్మకంగా చెప్పారని కూడ చెప్పవచ్చును. దీనినే మరో తీరుగా కూడా సమన్వయించుకోవచ్చు. అతని షణ్ముఖములు; కాలవిభాగ సూచితములు. ఎందుకంటే కాలపరిగణనంలోని ముఖ్యమైన కొలత సంవత్సరము. ఆ సంవత్సరాన్ని ఆరు ఋతువులుగా విభాగించి కొలుస్తారు.

ప్రతి బ్రహ్మాండగోళము నుండి శుద్ధమైన బ్రహ్మజ్ఞానం అభివ్యక్తిమవుతుంది. కనుక సుబ్రహ్మణ్యస్వామి అయ్యాడు. అతని చేతిలోని ఆయుధం పేరు "శక్తి," ఇది బ్రహ్మజ్ఞానం వలన జనించెడి మహాశక్తికి ప్రతీక. జ్ఞానంతో మానవుడు తనలోని అసురీశక్తులను లయంచేసుకోవలె. కుమారస్వామిచేత హతమైన శూర-పద్మ, సింహ-ముఖాసుర మరియు తారకాసురులు అను రాక్షసులు అరిషడ్వర్గాలైన కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యాలకు ప్రతీకలు. కుమారస్వామి వారిని చంపాడంటే కేవలం ధార్మికశక్తివల్లనే అసురీశక్తులు హతమారి తీరుతాయని చెప్పడానికే. నిజానికి మన దసరా, దీపావళి మున్నగు పండుగ లన్నింటియొక్క సందేశం అసురీశక్తులపై ధార్మికశక్తుల విజయ శంఖారావమేనని చెప్పవచ్చును.

కుమారస్వామికి దేవసేన మరియు వల్లి అని ఇరువురు భార్యలు. వారు ఇచ్ఛాశక్తికి, జ్ఞానశక్తికి చిహ్నములుగా చెప్పుకొన్నట్లే దేవసేనను 'సాత్వికత' కు, వల్లి (లత - అల్లుకొని ప్రాకునది)ని కుండలినీ శక్తికి ప్రతీకగా చెప్పుకోవచ్చును. కుండలిని సుషుమ్నా నాడి ద్వార వెన్నెముక నుండి ఊర్ధ్వముఖంగా ప్రవహించును గదా! మహాయోగులకు మాత్రమే ఈ కుండలిని సాహస్రారం చేరడం అనుభవమైన విషయం.

కుమారస్వామి మయూర వాహనుడు, నెమలి ప్రణవానికి ప్రతీక. ప్రణవాన్ని అధిష్ఠించినవాడు కనుక స్కందుడు ఓంకార స్వరూపుడు. తండ్రి అయిన శివునకే ఒక పర్యాయం కుమారస్వామి ప్రణవంయొక్క అంతరార్థాలను బోధించినట్లుగా చెప్తారు.

కార్తికేయుని ధ్వజచిహ్నం కుక్కుటం. కోడికూతను ప్రణవశబ్దానికి ప్రతీకగా అన్వయించుకున్నట్లే, కోడికూతను జ్ఞాన సూర్యోదయానికి గుర్తుగా కూడ సమన్వయించుకోవచ్చును.

కార్తికేయుని మరొక ప్రసిద్ధనామం "గుహుడు" జీవుని హృదయకుహరంలో వెలుగు అంతస్సాక్షి రూపమైన భగవంతునికి సూచన. స్కందనామం శివుని నుండి కుమారస్వామి ఆవిర్భావాన్ని సూచించుచున్నను, శుద్ధమైన బ్రహ్మజ్ఞానాన్ని ప్రసాదించువాడని స్ఫురించును.

స్కందషష్ఠి ఆంధ్రులకన్న తమిళనాడులో బాగా జరుపుకుంటారు. అక్కడ భక్తులు దేవాలయాది పుణ్యస్థలాలలో నెమలి ఈకలతోను, వెదురుదబ్బలతోను "కవాడి"ని నిర్మిస్తారు. ఇది తమిళపదం. 'కవాడి' అంటే "నీ పాదముల క్రోమల నన్ను రక్షించు" అని భావం. ఈ "కవాడి" ని ఇంకో తీరుగా వ్యాఖ్యానించాలంటే దేవుని పాదాలచెంత అహంకారమును విసర్జించి జీవుడు శరణాగతి పొందవలెనని భావం.

కుమారస్వామి కరుణ సకల జీవజాలంపై అవ్యాజంగా వర్షించుగాక అని ఆశిస్తూ శ్రీ మచ్ఛంకర భగవత్పాదుల ప్రార్థనా శ్లోకంతో ఈ వ్యాసం ముగిస్తాను.

కార్తికేయం మహాభాగం
మయూరోపరి సంస్థితమ్
తప్తకాంచన వర్ణాభం
శక్తిహస్తం వరప్రదం
ద్విషడ్భుజం శత్రుహంతారం
నానాలంకార భూషితమ్
ప్రసన్నవదనం దేవం
సర్వసేనా సమావృతం.

— వెలుదండ నిత్యానందరావు.



# గర్వభంగం

హిమాలయాల ప్రాంతములో వున్న దొక పెద్ద బూరుగువృక్షం. ఎంతో కాలంగా శాఖోపశాఖలతో ఆకాశాన్నితాకే ఎత్తుతో అతి దృఢంగా పాతుకుపోయి వుందాచెట్టు.

ఒకరోజు నారదమహర్షి లోకసంచారం చేస్తూ ఆ బూరుగువృక్షం దగ్గరకువచ్చి కుశల ప్రశ్నలు వేస్తూ ఇలా అన్నాడు.

"ఓ బూరుగువృక్షమా! నువ్వు ఇంత ఏపుగా ఎత్తుగా ఎదిగి పక్షులకూ, జంతువులకూ ఆశ్రయం కలిగిస్తూ వుండటం చూసి నాకెంతో ఆనందంగావుంది. అయితే ఒక చిన్న సందేహం. మహావృక్షాలు సైతం పెనుగాలికి నేలవాలిపోతున్నాయే! మరి ఇంతకాలం నువ్వెలా నిలిచి వుండగలిగావు? వాయుదేవుడికి నీకూ ఏదైనా చుట్టరికమా? ఆయన కాపాడుతూవుంటే విధేయుడవై వుంటున్నావా? నిజం చెబుదూ! నేనెక్కడా మాట జారనుగా!"

నారదుడు ఇలా పొగిడేసరికి బూరుగు వృక్షంకు కన్నూమిన్నూ కానక అహంకరించి ఇలా పలికింది.





బాలప్రబోధం

"వాయుదేవుడి దయాదాక్షిణ్యాలు నాకెందుకు? నాతో సరితూగే బలం గాలికెక్కడిది? అసలు నాలో పద్దెనిమిదోవంతు శక్తి అయినా దానికివుందా అని."

ఆ మాటలకు నొచ్చుకున్నాడు నారదుడు. "అమ్మమ్మ! అంతమాట అనొద్దు! కొండల్ని పిండి చెయ్యగలవాడు వాయుదేవుడు! మనం వూపిరితో ఉన్నామంటే అదంతా ఆయన చలువవల్లనే.'

అయినా బూరుగుచెట్టు ఊరుకొంటేనా? "ఏది, నన్నుతాకి చూడమను! ప్రభంజనుడన్న ఆయన అసలు పేరుకే ఎసరువస్తుంది" అంటూ హేళనగా పలికింది.

దాని గర్వంచూసి ఓర్చుకోలేకపోయాడు దేవముని. ఇదిగో ఆ మాటపైనే నిలబడి వుండు. వాయుదేవుడికెలాగూ నీ పొగరుమాట తెలియకపోదులే! అంటూ వెళ్ళి వాయుదేవుడికి ఈసంగతికాస్త అందించాడు. ఆయన మండిపడ్డాడు బూరుగు వృక్షంపైన.

"నువ్వు పెద్ద మొనగాడివా? నిన్ను తాకితే నా పేరుపోతుందా? నీకు చేటు తప్పదు చూసుకో" అన్నాడు.

అయినా బూరుగ వృక్షం బింకం వదల లేదు. "తేలిగ్గా మాట్లాడటానికి నేనంత తక్కువవాణ్ణి అనుకొన్నావా? అన్నిచెట్లలాంటిదే ఈ బూరగచెట్టు అనుకోకు అమాయకుడా" అంది.

ఆ బూరగచెట్టు తెంపరితనానికి కినుక వహించి అలవోకగా నవ్వుతూ అన్నాడు వాయుదేవుడు!

"ఒకరోజు మండుటెండలో బ్రహ్మదేవుడికి నువ్వు నీడనివ్వటం చూసి ఇంతకాలం నిన్ను మన్నించాను. అది తెలుసుకోక నువ్వు తలపొగరుతో ప్రవర్తించావు. రేపు నీ వంగతేమిటో చూస్తాను. అపుడుకూడా ఇలాగే మాట్లాడుదువుగాని"

అంటూ వాయుదేవుడు విసురుగా వెళ్ళిపోయాడు; ఆయన విసురు చూసేసరికి బూరగచెట్టుకు దిగులు ముసురుకొంది ఒక్కసారిగా.

"నాకు చేటుకాలం దాపురించినట్లేవుంది! నారదమహర్షి మాటలు వినకపోతిని. ఆ ప్రభంజనుడి బలంముందు నా బలమెంత? ఆ తాకిడికి తట్టుకోవడమెలా?"

అంటూ ఆలోచించసాగింది. చివరికి ఒక ఉపాయంతో వాయుదేవుణ్ణి గెలవాలనుకుంది. రాత్రికాగానే ఆ బూరుగుచెట్టు ఆకులన్నింటినీ జలజలారాల్చేసింది. కొమ్మలన్నింటిని ఫెళఫెళ విరిచేసుకొంది. చివరికి ఉత్తమోడులా మిగిలిపోయింది.

తెల్లవారగానే ఆ చెట్టును పడగొట్టాలని చండప్రచండ వేగంతో దూసుక వచ్చాడు వాయుదేవుడు.

తీరాచూస్తే ఏముంది! మోడులా మిగిలి వున్న బూరుగ వృక్షాన్నిచూసి నవ్వాగలేదాయనికి.

"ఛీఛీ" ఇదేమిటి! నేను చెయ్యవలసిన పని నువ్వేచేసుకొన్నావే! నీ తెలివికి నువ్వే సంతసించు – మిగతా చెట్లుకుకూడా ఈ చిట్కాచెప్పి పుణ్యం కట్టుకో"! అని ఎగతాళిచేసి చక్కాపోయాడు వాయుదేవుడు

బలవంతుడితో బలహీనుడు కలహించబోతే పరాభవం తప్పదనడానికి భీష్మాచార్యులు ధర్మరాజుకి యీ ఉపాఖ్యానం చెప్పారు. • – శ్రీరమణ

# తిరుమల బ్రహ్మోత్సవ సంగీతస్రవంతి....

తిరుమలలో శ్రీవారి బ్రహ్మోత్సవాల సందర్భంగా తే 10-9-83 ది నుండి తే 18-9-83 ది వరకు ప్రత్యేక సంగీత, హరికథ, భజన ఉపన్యాసాది కార్యక్రమాలు ఆర్షసదస్సు హాలులో జరిగాయి- వాటికి సంబంధించిన కొన్ని ఛాయాచిత్రాలు ఇవి.





శ్రీ లాల్‌గుడి జి. జయరామన్ వయొలిన్



శ్రీ నేదునూరి కృష్ణమూర్తి బృందం గాత్రం





శ్రీమతి మణి కృష్ణస్వామి గాత్రం



డా॥ ప్రపంచం సీతారామ్ వేణుగానం



( 14వ పేజీ తరువాయి )

ఉ॥ కాముదాపురించి, కులకాంతను దుష్కృతిపాలుసేసి యా
దాలిక దేగుచుంటె కులపావని పిశ్చరి గోరి. శ్రద్ధయై
వైళవ ద్రుంచు వీని. తనవాక్కు వికల్పముగామి మెచ్చి, శో
కాంకు శాంతి చేకుడ వికస్- కృతకృత్యుడనౌదు నింతటన్.

మీ ధర్మసూత్రాల నువింటూ కూర్చునే తీరికలేదు. నేను మహిషాసురుణ్ణి కలుసుకొంటాను. వస్తాను [పోవును]

రంగము-7 స్థలము-కైలాస పర్వతప్రాంతము

మహి: చిక్షురా! మనమిప్పుడు కైలాస ప్రాంతమునకు వచ్చి చేరినట్లున్నామే?

చిక్షుర: అవును ప్రభూ!

మహి: ఇంకనూ నారదమహర్షి రాలేదే?

నారద: ఇదిగో-వచ్చేశాను. ఇంతటి మహోత్కృష్టకార్యాన్ని తలపై వేసుకొని సగములో విడిచివెళ్ళిపోతానా మహిషాసురా! అదిగో! ఆ కైలాససానువువంకచూడు ఆమే....ఆమే త్రిపురసుందరి.

మహి: ఆహా! ఎంత సౌందర్యవతి-ఆమె దర్శనంతో నాజన్మ తరించిపోతున్నది స్వామీ!

నారద: నీ జన్మమును తరింపజేయటానికే కదటయ్యా నిన్నిక్కడికి తెచ్చింది?

మహి: ఆహా! ఏమి అందం, ఏమి తేజస్సు, నా హృదయాన్నే హరిస్తున్నది స్వామీ!

నారద: ఒక్క హృదయమేనా? కళ్ళుతెరిచిందా? నిన్నే హరిస్తుంది?

మహి: ఆఁ! ఏమిటన్నావు నారదా?

నారద: అదేనయ్యా! నీత్రిజగన్మోహనాకారాన్ని చూచిందంటే నిన్ను తన సహస్రబాహువుల్లో ఇముడ్చుకొంటుందీ అంటున్నాను.

మహి: అంటే ఆలింగనం చేసుకొంటుందనా నీవుద్దేశం?

నారద: [నవ్వి] అంతటితో లోకకల్యాణమేర్పడుతుంది.

మహి: నారదా! ఆమెకీ సౌందర్యము, తేజస్సు ఎక్కడనుండి వచ్చాయో?

నారద: అదొకపెద్దగాథ-సదాశివుని తేజము ముఖములోను, మహావిష్ణువు తేజము భుజములలోను,చంద్రుని తేజము నాలుకలోను, ఇంద్రుని తేజము నడుములోను, వరుణుని తేజము జంఘోరువులలోను, భూమితేజము పిరుదులలోను, బ్రహ్మతేజము పాదములోను, సూర్యుని తేజము పాదముల వేళ్ళలోను చేరినవి.

మహి: [పెద్దగా నవ్వుతాడు]

నారద: అంతేకాదయ్యా-ప్రజాపతుల తేజముచే దంతాలు, అగ్ని తేజమున నేత్రాలు, సంధ్యతేజమున భృకుటీ ద్వయము, వాయుతేజమున కర్ణములు ఉద్భవించాయి. ఇట్లా బ్రహ్మాది త్రింశత్కోటి దేవతల తేజము చేతనే ఆమె రూపొందింది.

మహి: [నవ్వి] ఏమయినా మీకు దేవపక్షపాతం పూర్తిగా పోలేదు నారదా! ఆమె తేజస్సుచేతనే మీ దేవతలందరూ ఉద్భవించివుంటారు. మీ గొప్పతనాన్ని తగ్గించుకోవడానికి మనసురాక ఇట్లా త్రిప్పిచెబుతున్నావా? ఆమె ధరించిన ఆయుధాలు చూచావా?

నారద: చెప్పానుకదయ్యా! ఆమె అనన్యవీరరసాధిదేవతయని. ఆశూలము చూచావా? - త్రిశూలము నుండి సృష్టించి శివుడిచ్చాడు. అట్లాగే ఆ చక్రాన్ని వరుణుడు, ఆ వజ్రాన్ని ఇంద్రుడు, ఆ శక్తిని అగ్నిహోత్రుడు, ఆ ధనుర్బాణాలను వాయువు సృష్టించి యిచ్చారు. ఆ గంటను చూచావా? అది ఐరావతాన్ని అలంకరించిన గంట. యముడు కాలదండాన్ని, వరుణుడు ఆ పాశాన్ని, ప్రజాపతి ఆ స్ఫటికమాలను, బ్రహ్మ కమండలాన్ని సమర్పించారు. కాలుడు కన్నులు మిరుమిట్లు గొలుపుతున్న ఆ డాలును, ఖడ్గాన్ని యిచ్చాడు. విశ్వకర్మ చేసియిచ్చినదే ఆ పరశువు. ఆ పంకజమాలిక ఎన్నడూ వాడదు, వాసనవీడదు. కుబేరుడు యిచ్చినదే మధువుతోగూడిన మధుపాత్ర. ఆ నాగహారము శేషుడిచ్చాడు. ఆ సింహవాహనమును హిమవంతుడిచ్చాడు.

మహి: స్వామీ! ఆమెనుండి వేడిసెగలు వెలికివస్తున్నయ్యేమిటి? [నవ్వి]అవిమీరుయిచ్చినవికాదుకదా[నవ్వు]

నారద: అవి నేను యిచ్చినవి కావయ్యా! నీవు తెప్పించుతున్నవి. నీకొరకై ఆమె వేచి వేచి విడుస్తున్న నిట్టూర్పులవి. నిన్ను చూచిందా రూపే మారిపోతుంది. ఆమె కళ్ళు విప్పేవరకే నీ ప్రయత్నము కావలసింది. ఆ తరువాత నిన్ను వదలదు. వెళ్ళు....ఏం ఆమెను సమీపించడానికి భయమా? [నవ్వి] ఆడదానికి వెనుకనే మగవాని వీరాలాపాలు, ప్రగల్భాలు. ఆమె ఎదుట పడిందా? చప్పచల్లారిపోతాడు. సరే! వెను దిరుగు. భయపడుతున్నట్లున్నావు.

మహి: నాకు భయమా! ఈ మహిషునికి మృత్యుభయము కూడా లేదు మునీంద్రా!

నారద: అవునులే ఇంతవరకు. కానీ ఇప్పుడు కాలుకదపలేక పోతున్నావుగా.

మహి: ఇప్పుడే వెళ్ళుతున్నాను స్వామీ!

నారద: ఇదిగో మహిషాసురా! ఒకవేళ ఆమె రోషముతో దూషించినా కథ కదతేరేవరకు అక్కడ నుండి కదలకు.

మహి: నాకు తెలియదా స్వామీ స్త్రీ తత్త్వము. నా ప్రాణములైనా వదులుతానుగాని విఫలుణ్ణై తిరిగివస్తానా?

నారద: అయితే వెళ్ళు

రంగము - 8 స్థలము: కైలాససానువు

మహి: దేవీ! త్రిపురసుందరీ! ఈ మహిషుడు నిన్ను వరించి వచ్చాడు. కనులు తెరచి కటాక్షించు.

దేవి: ఏమిటీ తపోభంగము - ఎవరునీవు?

మహి: ఇది తపోభంగముకాదు నారాయణీ! నీ తపఃఫలం. అందుకే నిన్ను కరుణించి యా కపర్దిబారినుండి రక్షింప వచ్చాను. వీరశృంగార రసాధిదేవతవు. రా! నీ సౌందర్యమును నాపందిట సార్థకము చేసుకో!

దేవి: ఛీ! పశుబుద్ధీ! నీ అవివేకమును కట్టిపెట్టి వెంటనే వెళ్ళిపో.

మహి: నేనా కామారి ననుకొన్నావా కామాక్షీ! అంతకోపముగా మాట్లాడుతున్నావు? నీ దీనస్థితిని విని జాలిపడి నిన్నుద్ధరింపవచ్చినజగదేకవీరుణ్ణి. మహిషాసురచక్రవర్తిని, రా!

దేవి: కామాంధుడా! జగన్మాతనైన నన్ను కోరెదవురా?

మహి: సర్వలోకముల జయించిన జగత్పతిని, జగత్పితను. జగన్మాతవైన నిన్ను కోరటంలో అనౌచిత్యమేమున్నది దేవీ! వియ్యమునకు కయ్యమునకు సమానులను కోరటం తప్పుకాదుకదా?

దేవి: ఓరీ ఎనుబోతా! దూరంగా పో! లేకుంటే నాకోపానల జ్వాలలలో భస్మముకాగలవు! చూచితివా హస్తములను!

మహి: నీ పదునెన్మిది చేతులూ వానిలోని ఆయుధాలుచూచిన తరువాత నీవే నాకు తగిన దానివనే నిశ్చయము బలపడినది. ఇంతవరకు, బలాత్కరింపవీలులేని పడతులను కోరి విసిగివేసారినాను - నాకు సరియుజ్జీవై యని పేయగల యంగనవు దొరకడం మహానందంగా వున్నది, రా! కరుణించు.

దేవి: మూర్ఖుడా! కరుణించే ఇంతవరకూ చెప్పాను. నీకు బ్రతుకుపై ఆశయున్న పాతాళమునకు పారిపొమ్ము. నీ భార్యకు నేనిచ్చినవరమే నీప్రాణములనింతవరకూ కాపాడింది.

మహి: [నవ్వి] నారాయణీ! ఈ యాగ్రహపు నటనను మాని నన్ననుగ్రహించు!

నారద: ఔను జగదంబా! నీయనుగ్రహమునకై, కట్టుకొనిన భార్యనే కడతేర్చివచ్చాడీ మహిషాసురుడు. నీ కర్తవ్యమును నెరవేర్చి లోకకల్యాణమును ప్రసాదించు తల్లీ!

దేవి: ఆఁ! ఆ మహాసాధ్విని అంత మొందించి వచ్చాడా యీ మహిషాధముడు?

నారద: అవును తల్లీ! ఆమె సుమంగళిగానే మరణించింది.

మహి: మంచిదే కదా దేవీ! సవతిపోరులేకుండా నాయర్థాంగివై హాయిగా మనవచ్చునుగదా?

ఉ॥ ఓ నలినాయతాక్షి! విను మొక్కటి చెప్పెద సావధానవై
మానవరూపమంది నిను మన్ననసేతు రహస్యమందు స
మ్మానితరాజ్ఞివై యసురమండలినెల్లను నేలుకొమ్ము, దు
ర్మానముతో ననిం బెనగి మానము ప్రాణము వీడ నేటికే!

దేవి: ఓరీ! దురాత్ముడా! పరమపతివ్రత, పావనచరిత యగు నీ ధర్మపత్నిని యంత మొందించి నీ యంత్యమునకు నీవే మార్గమేర్పరుచుకొన్నావు. నీ దురంతాలకు, కారుకూతలకు అంతిమఘట్టమాసన్నమైనది. అనుభవించు.

[మహాకాళిగా యావిర్భవించును]

మహి: ఆఁ! ఏమి టీ రూపం? ఎంత భయంకరస్వరూపం?

దేవి: [వికటాట్టహాసము]

నారద: మహాకాళీ! నీ బిడ్డల యార్తానాదముల నాలించు తల్లీ, లోకకల్యాణము ప్రసాదించు జననీ! మహాశక్తీ! నీ శక్తిని అన్నిలోకములకుచాటు! మహాసతీ! తోడిసతీమతల్లుల మానమర్యాదలను కాపాడు. జయజగన్మాతా! జయజయ మహాకాళీ!

దేవి: [మరల వికటాట్టహాసము చేస్తుంది]

మహి: ఏమీ! కామరూపధారిణివా? కాళీనామధేయవా? కాళీ! నీకాలం తీరింది. నేనూ కామరూపము ధరించి నిన్ను ఢీకొంటాను.

రంగము: 9 స్థలము: ఆకసము

[నారదుడు యముడు క్రిందికిచూచుచు ప్రవేశింతురు]

యముడు: కలహభోజనా! నీ కడుపునిండినదా? ఎంతరాక్షససైన్యం నాశమైనదో చూచావా? చిక్షురుడు, చామరుడు ఉగ్రమూర్తి, ఉగ్రుడు బిడాలుడు మొదలైన సేనానులందరూ జగన్మాత చేతిలో మడిశారు.

నారద: ఇన్నాళ్ళూ మహిషాసురుని రథమును నలుగురితో నారాయణాయని లాగుతూ సోమరితనము పెంచుకున్న నీకు చేతినిండా పని కలిపించాననా నామీద కోపము యమధర్మరాజా! ఇంకా అసిలోముడు, కాలుడు మహాహనుతామ్రఉదర్కాది సేనాపతులు వారి సైన్యాలు ఉన్నాయి. నీకు ఊపిరాడనంతపని రా! రా! మహిషాసురుడూ దేవీ ఆకాశములో యుద్ధము చేస్తూ యిటే వస్తున్నారు. మనము తప్పుకోవటము మంచిది. [వెడలుదురు]

మహి: [ప్రవేశించి] ఆఁ! నేను సజీవుడనై యుండగానే నా యసురబలము సర్వనాశనమౌతున్నదే? ఇంక

ఉపేక్షింపరాదు. నా సర్వశక్తులను వినియోగిస్తాను. జయించానా, స్వర్గాధిపత్యాన్ని శాశ్వతము చేసుకొంటాను. మరణించానా, చిచ్ఛక్తిలో కలిసిపోతాను. ఇంక మహిష రూపము ధరించి యామెను శిక్షింతాను [పోవును]

దేవి: [వికటాట్టహాసము చేయుచు ప్రవేశించి] మహిషా! నీవు పర్వతాలను బంతులుగా ఆకసములోనికి ఎగురగొట్టుటచూచి నేను భీతిచెందుతాననుకొన్నావా? నీ క్షుద్రమాయలతో మహామాయనగు నన్ను జయించాలని ప్రయత్నిస్తున్నావా? దైవద్వేషివి. నిన్ను సంహరింపకమానను.

మహి: [ప్రవేశించి] చూస్తాను. ఈ దెబ్బతో ఉంటే నేను లేకుంటే నీవు [వికటాట్టహాసము] ఇదిగో యీ ఖడ్గ ప్రహారంతో....ఆఁ! నేను ఖడ్గమెత్తితే నీవు మధువును సేవిస్తున్నావా? ఎంత నిర్భయం?

దేవి: ఓరీ మహిషాసురా! నేను మధుపానం చేస్తున్నానురా! ఇప్పుడే నీ శక్తి కొలది గర్జించు. ఇదే నీ కడసారి గర్జన. త్వరగా ముగించు. నీ సంహారానంతరం నేను గర్జిస్తాను.

మహి: ఈ ఖడ్గ ప్రహారానికి కాచుకో [వికటాట్టహాసం-దేవి వికటాట్టహాసంతో త్రిశూలమును ఎత్తుతుంది. ఇరువురు యుద్ధము చేయుచు పోవుదురు. యముడు నారదుడు ప్రవేశింతురు]

నారద: ఆహా! ఆహా! అంతకా! ఆమె ముఖము చూడవయ్యా! మధుపానంతో ఎర్రవారింది. నేత్రాలనుండి యగ్ని కణాలు రాలుతున్నాయి. ఆఁ! మహిషునిపై కురికింది పాదముతో మహిషుణ్ణి అణచివేస్తున్నది. శూలంతో పొడుస్తున్నది.

యముడు: దేవమునీ! ఆ మహిషాసురుని దేహమునుండి మరొక ఘోరరూపము వెలికి వస్తున్నదేమిటి?

నారద: ఆఁ! అదిగో! ఆ మహాఖడ్గముతో మహిషాసురుని శిరస్సును ఖండించివేసింది మహామాత!

యముడు: ఆఁ! దేవర్షి! అదేమిటి? మహిషుని నుండి ఏదో మహాతేజము వెలువడి ఆ మహిషమర్దినిలో ప్రవేశిస్తున్నదే?

నారద: అన్ని తేజాలకు మూలమామెయే కదా పరేతనాథా! అన్ని శక్తులూ ఆమెనుండియే వెలువడి తుదకు ఆమెయందే లీనమౌతాయి. జయ మహిషాసురమర్దనికి

ఇంద్రుడు: [ప్రవేశిస్తూ] జయ.

దేవి: బిడ్డలారా! లోకకంటకుడగు మహిషాసురుడు మరణించాడు. ఇక మీ కెల్లరకు శుభమగుగాక. ఈ శరన్నవరాత్రులలో నన్ను ఆరాధించేవారు, సర్వశుభములను పొందుతారు. నన్ను నియమబద్ధంగా ఆరాధించలేనివారు నా యవతార చరిత్రను విన్నా, పఠించినా వారికి సమస్తసౌఖ్యాలు లభిస్తాయి. [అందరు జయ సర్వమంగళా - జయ - జయ మహిషాసురమర్దనీ - జయ మహిషాసురమర్దని శ్లోకాలు పాడుతుండగా దేవి అభయహస్తముపట్టును.

దేవి: శుభం



---

[16వ పేజి తరువాయి]

వాల్మీకి-తన నోటినుండి అప్రయత్నముగా వెలువడిన "మా నిషాద" అను శ్లోకరూప సరస్వతిని చూచి 'కిమిదం వ్యాహృతం మయా (నాచే పలుకబడినదేమి)' అని ఆశ్చర్యపడెను. అతనికి తెలియకుండగనే శ్లోకము వెలువడుటకు హేతువు సరస్వతీ తత్త్వము. ఆవిడ అనుగ్రహించిన ప్రతిభ అన్న సంగతి మనము గుర్తుంచుకొనవలెను.

వాల్మీకి వలెనే ఆశ్చర్యపడిన ఆధునికులును కలరు. అతడు "పికాసో" అను ఆధునిక చిత్రకళా బ్రహ్మ. ఇతడు La Famme Fleur అన్న బొమ్మను గని I had been wondering how I could get across the idea? It is strange, is it not ?అని ఆశ్చర్యపోయెను. అతనికి తెలియకుండగనే విచిత్రమైన చిత్రమును చిత్రించినాడనిన అందుకు ప్రతిభయే కారణమనవచ్చును. అట్టి ప్రతిభను ప్రసాదించునది సరస్వతి.

సరస్వతీ స్వాదు తదర్థవస్తు
నిష్యందమానా మహతాం కవీనాం
అలోకసామాన్యమభివ్యనక్తి
పరిస్ఫురంతం ప్రతిభావిశేషమ్॥

లౌకిక మనోగోచరముకాని వస్తుతత్త్వములను గోచరింపచేయు ప్రతిభ సరస్వతీ ప్రసాదదత్తమై కవి మనస్సున స్ఫురించుచున్నది. దానిచే తత్త్వ ముద్ద్యోతితమై బహిర్గత మగుచున్నది. అని ఆనందవర్ధనుడు చెప్పినమాట యథార్థమేనని తోచక మానదు.

అవ్యాజ కరుణాకటాక్షముచే ప్రతిభను ప్రసాదించి నరులను వ్యుత్పన్నులను చేయుమని శ్రీ సరస్వతీదేవి నిట్లు స్తుతించుచు ముగింతును.

అక్రాంతం సముపస్కరోతు వదనం స్వాంతం
పరాం భావనాం
ప్రజ్ఞామ్ప్రత్తిముదాత్తభావసరణిం వాచం
తదర్థశ్రియమ్.
ఉక్తిం నీతి మలంక్రియాంచ కవితా
సర్వస్వమస్వమ్మమ
బ్రహ్మాణీ పరదేవతాగమముఖా హాతా
మహార్హిస్తుతా॥



# తిరుమల యాత్రికులకు సదుపాయములు

* * *

- అన్నివర్గాలవారికి అందుబాటులో ఉండేటట్లు ఉచిత, పరిశుభ్రమైన సత్రాలు, లేదా సరసమైన రేట్లకు కాటేజీలలో ఆవాస సౌకర్యం.
- శ్రీవారిని దర్శించు యాత్రికుల క్యూషెడ్లలో గాలి, వెలుతురుగల విశాలమైన ఏర్పాటులు.
- క్యూ షెడ్లలోనే కాఫీబోర్డువారి అల్పాహార సదుపాయం.
- సరసమైన ధరలకు అన్నపుపొట్లాల అమ్మకం.
- యాత్రికులు వెలుపలకు రానక్కరలేకుండా క్యూలదగ్గరే మరుగుదొడ్డి సౌకర్యం.
- ఆంధ్రప్రదేశ్ పాలసరఫరా సంస్థచే స్వచ్ఛమైన పాలవిక్రయం.
- యాత్రికులు చదువుకునేందుకు దేవస్థాన ముద్రిత గ్రంథాలు. స్వామివారి, అమ్మవారి చిత్రపటాల అమ్మకం.
- క్యూలోని యాత్రికులకు విసుగులేకుండా ఉండేందుకు టెలివిజన్ ప్రదర్శనం, భక్తిసంగీత ప్రసారం.
- క్యూలైన్లలోను, తిరుమలకుపోవు కాలిబాట 7 వ మైలువద్ద వైద్యసదుపాయం.
- సామానులు, పాదరక్షలు భద్రపరచుకొనేందుకు ప్రత్యేక సౌకర్యం.
- తిరుమలలో సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసునుండి వివిధప్రాంతాలకు ఆటో సౌకర్యం.

## ఉచిత బస్సుసదుపాయం

- దళారీలనుండి వంచకులనుండి తప్పించేందుకు ముఖద్వారంలో పేష్కారుస్థాయి అధికారి సిబ్బంది.
- క్యూషెడ్లలోని యాత్రికుల ఫిర్యాదులు విచారించేందుకు కావలసిన సౌకర్యములకుగాను పేష్కారు స్థాయిలో మరొక అధికారి, సిబ్బంది.
- యాత్రికుల సామానులను భద్రంగా తిరుమలకుచేర్చే సౌకర్యం ఏర్పాటైంది. తిరుపతిలో ఏ సత్రములో నైనాగాని, టోల్ గేట్ వద్దగాని తమసామాగ్రి అప్పగించి రసీదుపొంది ఆ రసీదు తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీస్ దగ్గర కౌంటర్ లో ఇచ్చి సామాగ్రి పొందవచ్చును.
- దుండగులనుండి యాత్రికులను కాపాడేందుకు, తిరుమలకు వెళ్ళే దోవపొడుగునా రాత్రింబవళ్ళూ పోలీసు గస్తీ ఏర్పాటుచేయబడింది.
- దారిపొడుగునా మంచినీటి సదుపాయం ఉన్నది.
- రాత్రిపూటగాని, తెల్లవారుఝామునగాని కొండకు వెళ్ళదల్చుకొన్నవారికి వీలుగా మంచికాంతి శక్తిగల దీపాలు ఏర్పాటైనవి.
- వివిధప్రాంతాలనుండి వచ్చేయాత్రికులకు బోధపడేందుకుగాను తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసులో, దేశంలోని ముఖ్యభాషలలో విచారణ కార్యాలయాలు.
- ప్రత్యేక కాటేజీలలోని అదనపు సౌకర్యాలు అంజనాద్రినగర్, శేషాద్రి, గరుడాద్రి, శంకుమిట్ట కాటేజీలలో కూడ ఏర్పాటైనవి.

(18వ పేజీ తరువాయి)
మనస్సుతోనే మళ్ళించి, బుద్ధి ధైర్యంతో మనస్సును ఆత్మ మీదే నెమ్మదిగా నిలిపి చిత్తశాంతి పొందాలి. ఏ మాత్రమూ ఇతర చింతనలు చేయకూడదు.

యతో యతో నిశ్చరతి మనశ్చఞ్చల మస్థిరమ్ ।
తత స్తతో నియమ్యైతత్ ఆత్మన్యేవ వశం నయేత్ ॥

చంచలమూ అస్థిరమూ అయిన మనస్సు ఏయే విషయాల మీదకు వెడుతుందో ఆయావిషయాల నుంచి దానిని మళ్ళించి ఆత్మమీదే నిలకడగా వుంచాలి.

ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్ ।
ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూత మకల్మషమ్ ॥

ప్రశాంతమైన మనస్సు కలిగినవాడు, కామక్రోధాది ఉద్రేకకారణాలకు అతీతుడు, పాపరహితుడు, బ్రహ్మ స్వరూపుడు అయిన యోగపురుషుడికి పరమ సుఖం లభిస్తుంది.

యుఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీ విగత కల్మషః ।
సుఖేన బ్రహ్మసంస్పర్శం అత్యన్తం సుఖ మశ్నుతే ॥

ఇలాగ మనస్సు నెప్పుడూ ఆత్మమీద లగ్నం చేసి పాప రహితుడైన యోగి అతి సులభంగా సర్వోత్కృష్టమైన సుఖం పొందుతాడు.

సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥

యోగసిద్ధి పొందినవాడు సమస్తభూతాల పట్ల సమ భావం కలిగి సర్వభూతాలలో తన ఆత్మనూ, తన ఆత్మలో సర్వభూతాలను సందర్శిస్తాడు.

యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ,
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥

అన్ని భూతాలలో నన్నూ, నాలో అన్ని భూతాలను చూసే వాడికి నేను లేకుండా పోను; నాకు వాడు లేకుండా పోడు.

సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వ మాస్థితః ।
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే॥

సమస్త భూతాలలో వున్న నన్ను భేదభావం లేకుండా సేవించే యోగి ఎలా జీవిస్తున్నప్పటికీ నాలోనే వుంటాడు.

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ! ।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ॥

అర్జునా! సమస్త జీవుల సుఖ దుఃఖాలను తనవిగా తలచేవాడు యోగులలో శ్రేష్ఠుడని నా అభిప్రాయం.

అర్జున ఉవాచ:

యోఽయం యోగ స్త్వయా ప్రోక్తః సామ్యేన మధు
సూదన ! ।
ఏతస్యాహం న పశ్యామి చఞ్చలత్వాత్ స్థితిం స్థిరామ్ ॥

అర్జునుడు : మధుసూదనా! నిలకడలేనిది కావడంవల్ల, నీవు ఉపదేశించిన ఈ జీవాత్మపరమాత్మల సమత్వయోగాన్ని స్థిరమైన స్థితిలో చూడలేకపోతున్నాను.

చఞ్చలం హి మనః కృష్ణ! ప్రమాథి బలవద్దృఢమ్ ।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్ ॥

కృష్ణా! మనస్సు చాలా చంచలం బలవత్తరం, సంక్షోభకరం. అలాంటి మనస్సును నిగ్రహించడం వాయువును నిరోధించడంలాగ దుష్కరమని భావిస్తున్నాను.

అసంశయం మహాబాహో ! మనో దుర్నిగ్రహం చలమ్ ।
అభ్యాసేన తు కౌన్తేయ ! వైరాగ్యేణ చ గృహ్యతే ॥

శ్రీ భగవానుడు: అర్జునా! మనస్సు చంచల స్వభావం కలిగింది, నిగ్రహించడానికి శక్యం కానిదీ అనడంలో సందేహం లేదు. అయితే దానిని అభ్యాసం వల్ల, వైరాగ్యం వల్ల వశపరచుకోవచ్చు.

అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః ॥

ఆత్మనిగ్రహం లేనివాడికి యోగం సిద్ధించదని నా వుద్దేశం. ఆత్మ నిగ్రహం వుంటే అభ్యాసం, వైరాగ్యం అనే ఉపాయాలతో యోగం పొందవచ్చు.

అర్జున ఉవాచ :

అయతి శ్శ్రద్ధయోపేతో యోగాచ్చలిత మానసః ।
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ ! గచ్ఛతి ॥

అర్జునుడు: శ్రద్ధ వున్నప్పటికీ మనోనిగ్రహం లోపించిన కారణంగా యోగంలో చిత్తం చలించినవాడు యోగసంసిద్ధి పొందకుండా ఏ గతి పొందుతాడు ?

కచ్చిన్నోభయ విభ్రష్టః ఛిన్నాభ్ర మివ నశ్యతి ।
అప్రతిష్ఠో మహాబాహో ! విమూఢో బ్రహ్మణః పథి ॥

కృష్ణా ! మోక్ష సంపాదన మార్గంలో నిలకడ లేనివాడు ఇహపర సౌఖ్యాల రెండింటికీ భ్రష్టుడై చెదరిన మేఘాలలాగ చెడిపోడు కదా !

ఏతం మే సంశయం కృష్ణ ! ఛేత్తు మర్హ స్యశేషతః ।
త్వదన్యస్సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే ॥

కృష్ణా ! నా సందేహాన్ని సంపూర్ణంగా నివారించడానికి నీవే సమర్థుడవు. ఈ సంశయాన్ని తీర్చడానికి నిన్ను మించినవాడు మరొక డెవ్వడూ లేడు.

శ్రీ భగవానువాచ :

పార్థ ! నై వేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే ।
న హి కల్యాణకృత్కశ్చిత్ దుర్గతిం తాత ! గచ్ఛతి ॥

శ్రీ భగవానుడు: అర్జునా! యోగభ్రష్టుడికి ఈ లోకంలో కాని పరలోకంలోకాని ఎలాంటి హానీ కలుగదు. నాయనా! మంచిపనులుచేసిన మానవుడెవడూ దుర్గతి పొందడు.

ప్రాప్య పుణ్య కృతాం లోకాన్ ఉషిత్వా శాశ్వతీ స్సమాః ।
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే ॥

యోగభ్రష్టుడు పుణ్యకర్మలు చేసేవాడు పొందే ఉత్తమ లోకాలు చేరి, చిరకాలం అక్కడ భోగాలు అనుభవించిన అనంతరం సదాచార సంపన్నులైన భాగ్యవంతుల యింట్లో జన్మిస్తాడు.

అథవా యోగినా మేవ కులే భవతి ధీమతామ్ ।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్ ॥

లేకపోతే బుద్ధిమంతులైన యోగుల వంశంలోనే పుడుతాడు. అయితే అలాంటి జన్మ ఈ లోకంలో పొందడం ఎంతో దుర్లభం.

తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్ ।
యతతే చ తతో భూయస్సంసిద్ధౌ కురునన్దన! ॥

అర్జునా! అలా యోగుల కులంలో పుట్టినవాడు పూర్వ జన్మ సంస్కార విశేషం వల్ల సంపూర్ణయోగసిద్ధికోసం గతంలో కంటే ఎక్కువగా ప్రయత్నం కొనసాగిస్తాడు.

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ।
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే ॥

పూర్వజన్మలోని అభ్యాసబలం మూలంగా ఆ యోగభ్రష్టుడు తాను తలపెట్టకపోయినా మళ్ళీ యోగసాధనవైపు లాగబడుతాడు. యోగస్వరూపాన్ని తెలుసుకోదలచినవాడు కూడా వేదాలలో వివరించబడ్డ కర్మలు ఆచరించేవాడిని మించిపోతాడు.

ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః ।
అనేకజన్మ సంసిద్ధః తతో యాతి పరాంగతిమ్ ॥

పట్టుదలతో ప్రయత్నించే యోగి పాపవిముక్తుడై అనేక జన్మలకు సంబంధించిన సాధనా సంపర్కం వల్ల యోగసిద్ధి, తరువాత మోక్షఫలం పొందుతాడు.

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥

అర్జునా! తపస్సు చేసే వాళ్ళకంటే, శాస్త్రజ్ఞానం కలవాళ్ళకంటే, యోగుల కంటే ధ్యానయోగి గొప్పవాడు. కనుక నీవు ధ్యానయోగం సాధించాలి.

యోగినామపి సర్వేషాం మద్గతేనాన్తరాత్మనా ।
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః ॥

యోగులందరిలోనూ మనస్సు నా మీదే నిలిపి, శ్రద్ధాభక్తులతో నన్ను సేవించేవాడే ఉత్తముడని నా ఉద్దేశం.

ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య. యోగశాస్త్రం శ్రీకృష్ణార్జునసంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని "ఆత్మసంయమ యోగం" అనే ఆరవ అధ్యాయం సమాప్తం.

*

## గ్రంథసమీక్ష

### మతత్రివేణి

(మతత్రివేణి అను స్తోత్ర సంచయము. సంకలనము చేసినవారు ఆచార్య విద్వాన్, కళాప్రపూర్ణ, శ్రీ గంటిజోగి సోమయాజిగారు. ప్రాప్తిస్థానము: 16-2-8 ఆఫిషియల్ కాలనీ, విశాఖపట్టణము-2. వెల: రు. 2/-)

దేవతలను స్తుతించి, వారిని ప్రసన్నులను కావించుకొని, ఆరోగ్యభాగ్యములను, అమంగళక్షతిని పొందు సంప్రదాయము భారతదేశమున ఋగ్వేదకాలము నుండియు కలదు. సంస్కృతమున పురాణాదులందలి కథాసంబంధములైన స్తోత్రములతోపాటు ప్రత్యేకముగా వివిధ దేవతలను గూర్చి వ్రాయబడిన స్తోత్రములు, పంచకాష్టక శతసహస్రాది సంఖ్యాసూచకములైన, వెన్నోకలవు. వానిలో కొన్నిటిని భక్తుల ఉపయోగార్థమై పండితులు సంకలనము చేసి ముద్రించియుండిరి. మతత్రివేణి అను ఈ స్తోత్రసంకలనము కూడ అట్టిదే. త్రివేణి అనగా, మూడు వేణుల (ప్రవాహముల) సమాహారము. భారతదేశమున మతము లనేకములున్నను వానిలో అద్వైత ద్వైత విశిష్టాద్వైతములు మూడును ముఖ్యములైనవి. వానికిక్రమముగా శంకర మధ్వ, రామానుజులు ఆచార్యులు. ఆ త్రిమతాచార్యులును వారి అనుయాయులును రచించిన స్తోత్రము లిందుకూర్చబడుటచేదీనికి మతత్రివేణి యనునామము సార్థకమగుచున్నది. చివర సాంబునిముందు నభఃస్థలమునుండిపడిన సూర్యార్యాద్వాదశమును, ఋగ్వేదమునందలి సూర్యస్తుతి మంత్రమును చేర్చబడినవి. ఈసూర్యస్థానకమంత్రము మహాసౌరమునందలి మంత్రములలో నొకటి. ఇది హృద్రోగమును, పాండురోగమును, ఇతర రోగములను హరించును. మతత్రయమునకును సంబంధించిన స్తోత్రముల నొక్కచో కూర్చుట ఈసంకలనము నందలి ప్రత్యేకత.

ఈ స్తోత్రములను సంకలనముచేసిన ఆచార్య శ్రీ గంటి సోమయాజిగారు బహుభాషా మహాపండితులు.అస్మదాదులకు గురుపుంగవులు. వృద్ధులయ్యువారు, భక్తజనోపయోగార్థమై వివిధ గ్రంథములనుండి వివిధ దేవతలకు వివిధ విధానములకు సంబంధించిన స్తోత్రములను సేకరించి ఈ గ్రంథరత్నమును శ్రీ తిరుపతి దేవస్థానమువారి ఆర్థికసాహాయ్యముతో ముద్రించియుండిరి. ఇందాది శంకరులు శ్రీ మద్రామానుజులు, శ్రీ మదానంద తీర్థులు రచించిన స్తోత్రములతోపాటు శ్రీ తిరుకచ్చినంబి, వాదభి' గౌతముడు మున్నగువారు రచించిన స్తోత్రములును, శ్రీ కృష్ణకర్ణామృతము, ముకుందమాల మున్నగు భక్తిగ్రంథముల నుండి గ్రహింపబడిన స్తోత్రములునుకూడ కలవు. వీనిలో జగద్గురు శంకరాచార్య కృతములైనవాని సంఖ్యయే హెచ్చు. అన్యత్ర సులభములుకాని స్తుతులుకూడ నిందుకొన్ని కలవు. నిర్వాణషట్కము, జీవన్ముక్తానందలహరి, గజేంద్రమోక్షము, అనాత్మ శ్రీ విగర్హణము, స్వరూపానుసంధానాష్టకము' భగవత్సేవాఫల నిరూపణము. నిర్గుణమానసపూజ మున్నగునవి పేర్కొనదగినవి. శ్రీ మద్రామానుజుల శ్రీ రంగగద్యమునుకూడ నిందు చేర్చుట ప్రశంసనీయము. వారు రచించిన గద్యత్రయము వైష్ణవ స్తోత్రములలో శిఖరప్రాయము. శ్రీ రంగగద్యము మూడుగద్యములలోచిన్నది. ఇందు శ్రీ రంగశాయి మనోహరమైన వర్ణనముకలదు. శంకరాచార్యకృత నిర్గుణమానసపూజ సులభమును సుందరమునై మానసపూజా విధానమును లెస్సగానిరూపించుచున్నది. ఈ స్తోత్రకదంబమును గణేశపంచరత్నముతో నారంభించి భగవత్సేవాఫల నిరూపణములో ముగించుట ఔచిత్యశోభితమైయున్నది. దాశరథీ కృత ధాటీ పంచకమునందలి "చారిత్రోద్ధార దండ" మిత్యాదిశ్లోకము దండి దశకుమార చరితమందలి మంగళశ్లోకమును తలపించుచున్నది.

శ్రీ మదాచార్యులవారు స్తోత్రములన్నిటిని తెలుగున విశదమైన తాత్పర్యము వ్రాసి భక్తులయు జిజ్ఞాసువులయు కృతజ్ఞతకు పాత్రులగుచున్నారు. గ్రంథాంతమున వారుచేర్చిన త్రిమతాచార్యుల జీవిత చరిత్రలును, వారిమతముల సారాంశమును ప్రమతసమన్వయమును గ్రంథమున కలంకారభూతములుగానున్నవి. సామాన్యులు కూడ వానిని పఠించి మతత్రయ సారము నెఱుంగవచ్చును. ఆచార్యులవారు శాంకరము దురవగాహమనియు, రామానుజ సిద్ధాంతము రమ్యమనియు, మాధ్వము నవనీతమనియు తెల్పి మాధ్వమువైపే యించుక మొగ్గుచూపియున్నారు. వర్ణాశ్రమ ధర్మములను శీర్షికక్రింద వారుచేసిన సమన్వయము ప్రశంసాపాత్రము.

భారతప్రభుత్వ విదేశవ్యవహార శాఖామాత్యులు, సాహిత్యకళానిష్ణాతులు శ్రీ పి. వి. నరసింహరావుగారి గ్రంథము నావిష్కరించుట ముదావహమైన విషయము. వారినిగూర్చి శ్రీమదాచార్యుల వారు వ్రాసిన పద్యములు సత్యపరములుగా నున్నవి.

గ్రంథమున ముద్రణస్ఖాలిత్యములు కొన్ని దొరలినవి. హత్యష్టకమ్, ధాటీపంచకము మున్నగునవిందుకు నిదర్శనములు. శ్రీ గణేశ పంచరత్నమున కలాధరావతంసకమ్మనుదాని కర్థములేదు. విలాసి అనగా నిశ్చలు శివుడు. అందుచేవిలాసి లోకరక్షకమ్మనుదానికి శివలోకవాసులను రక్షించువాడని అర్థముచెప్పబడినది. యశస్కరమ్మనుదానికి కీర్తికలవాడని కాక కీర్తికలిగించువాడని చెప్పుటమేలు. ధనంజయాదిభూషణమ్మను విశేషణమునకు ధనంజయాదుల కలంకారమైనవాడని మరల ధనంజయ శబ్దమే వాడక కొంత వివరించిన లెస్సగా నుండెడిది. ఇట్టి చిఱుదొసగులచ్చటచ్చటనున్నను వానిని సులభముగా సరిచేసికొనవచ్చును. బహుదేవతాస్తోత్రములతో కూడిన యిట్టి గ్రంథరత్నమును సంకలనమొనరించి ముముక్షువులగు భక్తులకు తరణోపాయము చూపినారు.

— డా॥ దివాకర్ల వేంకటావధాని

## రామాయణ_ఉపన్యాసములు

ఆంగ్ల మూలము: రైటానరబుల్ వి. యస్. శ్రీనివాసశాస్త్రి. అనువాదము శ్రీ వెలంపాటి లక్ష్మి నరసయ్య రెండవ సంపుటము. డెమ్మీ 278_560 285 పుటలు. వెల రూ. 15 తొలిసంపుటము 1_278 ప్రతులకు: శ్రీ వెలంపాటి లక్ష్మినరసయ్య. బి.ఏ., బి.ఇ.డి. రిటైర్డు హెడ్మాస్టరు. మాళవ్యానగర్, గూడూరు, నెల్లూరుజిల్లా. అని వ్రాయనగును.

గొప్పమేధావి, మహావక్త, ప్రసిద్ధరాజకీయవేత్త ఆంగ్లవిద్యా పారంగతుడు సునిశిత విమర్శకుడు అని పేరుగాంచిన రైటానరబుల్ వి. యస్. శ్రీనివాసశాస్త్రి 1944లో మైలపూర్ మద్రాసులో ఇచ్చిన ఆంగ్లోపన్యాసములు గ్రంథరూపము ధరించి విఖ్యాతి నందినవి. వానిని శ్రీ వెలంపూడి లక్ష్మినరసయ్య రెండు సంపుటములుగా ఆంధ్రీకరించి 1-12 ఉపన్యాసముల తొలి సంపుటము 1981 లోను 13-30 ఉపన్యాసముల మలి సంపుటము 1982 లోను ప్రకటించినారు. రెండు సంపుటములకు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల ఆర్థిక సాహాయ్యము లభించినది. పుస్తకముల కూర్పు, తీర్పు చక్కగా ఉన్నవి. ఈ గ్రంథానువాదమునకు శ్రీ నరసయ్యగారు తమ యర్హతను చక్కగా నిరూపించుకొన్నారు. వారికి శ్రీరామునియెడ గల శ్రద్ధాభయ భక్తి విధేయతలు శ్లాఘ్యములు అవియే వారి రచనకు చక్కని చిక్కని బల మిచ్చినవి. శైలి ధారాళము. గ్రాంథికము. అనువాదమువలె కనబడదు. స్వతంత్ర గ్రంథమువలె సహజ సౌందర్యము నిది సంతరించుకొన్నది. సుమారేబది పర్యాయములు రామాయణమును పారాయణచేసి దైవభక్తి గురుభక్తి గలిగిన శ్రోత్రియరచయిత కృతకృత్యు లగుటలో ఆశ్చర్యము లేదు. అది ముదావహము. "ప్రతివారును దుఃఖించెను" "ఆ షట్పాలిషీక సుగ్రీవుని ప్రక్కన తార కూర్చొనెనా? లేక రుమయా?" "శంబారుసురు" ఉదహరించు "ఎందుకు యెదుర్కొనడు" "అధికసాయము" "శరణుజొచ్చవలెను" "సుమిత్ర యొకటియే" మున్నగు స్వల్ప దోషములు తప్ప, గ్రంథమంతయు మంచి శైలిలో నడచుట విశేషము.

కీ. శే. శ్రీనివాసశాస్త్రిగారివి పెక్కు భావములు చక్కనివి. కొన్ని భావములు వింతలు. కొన్ని ప్రమాదకరములు, కొన్ని బాధాకరములు. వాల్మీకిని గుఱించి, రాముని గుఱించి వారి కొన్ని వాక్యములు విపరీతములు. ఖండనార్హములు. అనువాదకులే ఫుట్‌నోట్‌లో అట్టివి కొన్నిటిని ఖండించి యుండవలసినది. ఎవరైనా పెద్దలు ఆ పని చేయనియెడల అవియే ప్రామాణిక వాక్యాలగు ప్రమాదము లేకపోలేదు. కొన్ని కొన్ని వాక్యము లుదాహరింతును. ప్రాజ్ఞులగు పాఠకులు వానిని పరిశీలింపగోరుదును.

"భరతుని విషయములో నది క్షమింపరాని లోపము. తల్లి యెంత నీచురాలైనను కుమారు డావిధముగ మాటాడరాదు." పుట (297) "శత్రుఘ్నుడు చాల అనాగరికముగ ప్రవర్తించెను (298) హనుమంతుడు తన అంతస్థునుండి చాల దిగజారి ఔచిత్య భాగముగ ప్రవర్తించెను. (36-) సుమిత్ర యందు గల సుగుణములు కౌసల్యయందు లేవాయెను....సుమిత్ర అంతస్థు గొప్పది. ఆమె ఆధ్యాత్మికముగ కౌసల్య కన్న ఎక్కువ అభివృద్ధి గాంచినది. (526) సీతాదేవికి కౌసల్య చేసిన ఉపదేశము "అనవసరము". "సీతారాములయందు పరిపక్వస్థితి ఆదినుండియు లేదు. అది దశలవారీగా నభివృద్ధి చెందెను." (554)

"వాల్మీకి మతానుసారముగ అహల్యా యోగిని కాదు. ఆమె తన జీవితమునే గాక భర్త యగు గౌతమ మహర్షి జీవితము కూడ నాశము గావించెను. వాల్మీకి యామె వృత్తాంతము నంతయు నతిశయోక్తిగ వచించెను. (277) "శ్రీరాము డసూయచే సీతను రాజ్యమునుండి వెడలనడచెను. (270) శ్రీరాముడు సీతను పరిత్యజించుట అంత సమర్థనీయము కాదు." (263) "శ్రీరాముడు ఇతర మానవులవలె నడచుకొనె ననియే వాల్మీకి మనకు బోధింపనెంచెను." (260) "శ్రీరాముడు కపటముతో కఠినముగ మాడాడినట్లు నటించినందుల కతడు శిక్షార్హుడగును.... చెడు భావమాతని పైకొనెను (259) శ్రీరాముడు కోపావిష్టుడై నపుడు అసంబద్ధపుమాట లాడెను (257) శ్రీరాముడు వాలితో చేసినది "చాల ఘోరమైన అధర్మ యుద్ధము. (226) "వాలికి మరణ దండన విధించుటలో శ్రీరాము డపరాధమున కొడిగట్టెను."(228) "శ్రీరాముడు తన యంతస్థు నుండి పతన మొందెను." (130) "మహాత్ములు సైతము మనఃస్తిమితము గోల్పోయి ఆడరానిమాటలాడి చాల శోచనీయమైన స్థితికి వత్తురు. శ్రీరాముడు దీని కతీతుడు కాడు. (124) శ్రీరాముడు తన అధమ ప్రకృతిని స్వార్థపరత్వమును నితరుల కగోచరముగ దాచి యుంచినందుల కతనిని నింద్యులైన వంచకుల తరగతిలో చేర్పవచ్చును. (107) దుర్వాసుడు "ఎంత బుద్ధిమాలినవాడో చూడుడు. "(75) పునస్సమాగమమును గల్పింపకయే ఈ గాథనుండి విశ్వామిత్రుని నిష్క్రమింప జేసినందులకు నేను వాల్మీకి మహర్షిని దూరుటకు వెనుకాడను. (15) శ్రీరాముని దైవత్వము నొక క్షణమైనను సంశయింప బనిలేదని నేను విశ్వసింతును. కాని, ఆ గాథ నవగాహన చేసికొనుటకు, దానివలన నుత్తేజము నొందుటకు ఆ విశ్వాసమనావశ్యకము."

శ్రీరాముని శ్రీవాల్మీకిని, సంస్కరింప దలచినవారెంత మేధావులో!

_విద్వాన్ బులుసు వేంకటేశ్వరులు






### ప్రథమా విభక్తి

శ్రీ శతపత్రనేత్ర విలసిల్లు తటిల్లతగా, దరస్మిత
శ్రీ శశిరేఖగా, సుధలు చిందెడు చూడ్కులు పూలవానగా,
ఆసలు పండు శేషగిరి యందు వసించిన నీలమేఘ సం
కాశుడు వేంకటేశుడు జగమ్ముల నేలు స్వయంప్రకాశుడై.

### ద్వితీయా విభక్తి

నల్లనివాని, మేలి చిఱునవ్వులవాని, సురారి గొంతుకల్
గిల్లెడివాని, కాంతు లొలికించు కనుంగవ వాని, చూడ్కికిం
జల్లనివాని గండి విలసన్నవ రత్నకిరీట సుప్రభా
వేల్లిత మౌళివాని, ప్రభవిష్ణువిలాసుని, శ్రీనివాసునిన్.

### తృతీయా విభక్తి

చనుడీ కొండకు, స్వామి పుష్కరిణిలో స్నానమ్ము గావింపుడీ
జనులారా! కనులారగాంచుడివిభున్, సాష్టాంగముల్ సల్పి వ
చ్చిన యిక్కట్టుల విన్నవించుకొనుడీ: శ్రీ శేషశైలేశుతో,
ఘన తేజోనిధితో, జగత్ప్రభువుతో, కారుణ్యవారాశితో.

### చతుర్థీ విభక్తి

విరికై తుమ్మెదలీల. నా హృదయ మువ్విళ్లూరు నెల్లప్పుడున్
హరికై, సత్కరుణా సుధాలహరికై, ఆనంద మందాకినీ
ఝరికై, నిత్యనివాస శేషగిరికై, సందృప్త దైత్యేభ కే
సరికై, సుందర మందహాససుషమా సౌభాగ్య సంచారికై.

### పంచమీ విభక్తి

నవనళినాయతాక్షు వలనన్ జయముల్ సమకూరు మాకు, మా
నవ నవకల్పకమ్ము వలనన్ ప్రియముల్ చెలువొందు మాకు, దా
నవదళ దర్పహారి వలనన్ భయముల్ లయమౌను మాకు, ఈ
ఫవరస చక్రవర్తి వలనన్ ఫలియించును మా కభీష్టముల్ ॥

### షష్ఠీ విభక్తి

ధిక్కారం బొనరించు ఖేదము, ప్రసాదించున్ ప్రమోదమ్ము, పే
రెక్కెన్ స్వామి "ప్రపన్నకల్పతరు"వై యాఱేడు లోకాలలో,
దక్కెన్ నాకిఁక, మ్రొక్కుకొందు జగదంతర్యామికిన్, పెక్కు లౌ
చిక్కుల్ దీర్చు విహంగగామికి, మహాశేషాచల స్వామికిన్.

### సప్తమీ విభక్తి

ఈ హృదయంబు నవ్యనళినేక్షణ వీక్షణ దివ్యదీప్తి స
మ్మోహితమై నిమగ్నమగుచున్నది నా ప్రభునందు, నా జగ
న్మోహనునందు, నా మధుర ముగ్ధకపోలునియందు, నా చతు
ర్బాహునియందు, నా పతితపావనమంగళమూర్తియందునన్.

### సంబోధన ప్రథమ

వేదోద్ధారణ! మందరాభరణ! పృథ్వీధర్మ నిర్మాణ! ప్ర
హ్లాదత్రాణ! బలిప్రతారణ! నృపాహంకార నిర్వాపణా!
వైదేహీరమణా! ధనంజయు జయ వ్యాపార పారీణ! క్షో
ణీ దివ్యత్కరుణా! తమోహరణ! తండ్రీ! శ్రీనివాసప్రభూ!

### సార్వ విభక్తికము

నీ వానందరసైకమూర్తివి! శ్రుతుల్ నిన్నుం బ్రశంసించు! నీ
చే వెల్గున్ జగమెల్ల! నీ కొఱకె పుష్పించున్ త్రయీవల్లికల్!
నీ వల్లన్ సిరులబ్బు! నీకు సరి లేనేలేరు! నీయందె నా
భావం బైక్యమునందె! భక్తసులభా! పద్మావతీవల్లభా!

( నా 'శ్రీనివాసోదాహరణము' నుండి)




"దీని భావమేమి తిరుమలేశ" అని ఏడుకొండల వాణ్ని కవి ప్రశ్నించాడు. ఎందుకీ ప్రశ్న! కవికి తెలియకనా-లేక ఆ పరమాత్ముడ్నే పరీక్షిద్దామనా! రెండూ కావు. చెప్పేది రాసేది మనిషి కొరకే. ప్రశ్న అడిగేది కూడా మనిషినే. అయితే ఒక్కోసారి మనిషి బుద్ధి కందదు. మనిషి బుద్ధి కంద నిది మనీషి బుద్ధి కందుతుంది. ఆ మనీషి ప్రజ్ఞను బట్టి మనుష్యుల్లో ప్రత్యేకార్హత పొందుతుంటాడు. ఆ అర్హత అతనినోట సమాధానం పలికిస్తుంది. సమస్యను పరి ష్కరిస్తుంది. మరి అలాంటి మనుష్యుణ్ని మనీషి అన్నా మాధవుడన్నా ఒక్కటే.

ఆ కారణాన్నే "దీని భావమేమి తిరుమలేశా" అనే పద్యాలు వెంకటరమణుణ్ణి అడిగిన పైనా మనుష్యుల్ని అడిగి నట్లుగానే భావించాలి. ఈ పద్యాల్నే పొడుపు పద్యాలంటారు. ఈ మకుటంతో తెలుగు సాహిత్యంలో శతకాలే ప్రాదుర్భవించాయి. అలాపుట్టిన శతకాల్లో భక్తి కన్నా సామాజిక విషయాలేఅధికం. అయితే పొడుపుపద్యాల్లో భక్తికేం కొదువలేదు.

భగవన్నామ స్మరణ గావించి-పౌరాణిక గాథా పరిచయం చేసే పొడుపు పద్యాలు సర్వజన హృదయానందకరంగా తెలుగు సాహిత్యంలో జ్ఞానదీపాల్లావెలుగుతున్నాయి మరి ఆ వెలుగుల్లో ఓ పర్యాయం మునిగి తేలుదాం.

దిక్కెవ్వడు ప్రహ్లాదుకు!
దిక్కెవ్వరు పాండు సుతుల దీనుల
కెపుడున్!
దిక్కెవ్వ రయ్యహల్యకు
దిక్కెవ్వరు, నీవె నాకు దిక్కువు కృష్ణా॥

ఇది పొడుపు పద్యం కాదు. కృష్ణ శతకం లోనిది. చివరి పాదంలో నీవె నాకు దిక్కువు కృష్ణా అనే పాదాంశం విడుపుగా భావిస్తే పైదంతా పొడుపె అవుతుంది. ప్రహ్లాదునికి పాండుసుతులకు, దీనులకు, అహల్యకు దిక్కెవ్వరు అనేది పొడుపు. కృష్ణుడు అనేది విడుపు. కవి తనను తానే ప్రశ్నించుకొని తనకు తానే సమాధానం చెప్పు కున్నాడు. కృష్ణశతకం భక్తి శతకం. ఎవరు, ఎవరు అంటూనే ఆ పరబ్రహ్మను పట్టుకొన్న కవి అందరినీ అందుకొమ్మంటున్నాడు. ఇక వేమన్న రెండు పద్యాల్లో త్రిమూర్తుల్ని స్మరించాడు. మొదటి పద్యం పొడుపు లాగుంటుంది. రెండో పద్యం విడుపు లాగుంటుంది.

పడతి మోసె నొకడు, పడతి మేసె నొకడు
పడతి నెదను బెట్టి బ్రతికె నొకడు
పడతి కొరకు నిట్లు పలుపాట్లు పడిరయా
విశ్వదాభిరామ వినురవేమ!

స్త్రీ నెత్తిన రుద్రునకు
స్త్రీ నోటను బ్రహ్మకెపుడు సిరిగుల్కంగా
స్త్రీ నెదిరి రొమ్మున హరికి
స్త్రీ నెడపగ గురుడవీవు దేవర వేమా!

శివుడు గంగను మోశాడు, బ్రహ్మ వాణిని మోశాడు, విష్ణువు లక్ష్మిని యెద పై నుంచాడు. త్రిమూర్తుల్ని వారి భార్యల్ని స్మరించే ఈ పద్యాలు శతకాల్లోవే అయినా ఉత్కంఠ రేకెత్తించె ప్రశ్న పరంపర లాంటి పొడుపు, సమస్యను పరిష్కరించి ఆనందం కలిగించే విడుపు గమనింప దగింది. శతక సాహిత్యంలో ఈ విధంగా భగవన్నామ స్మరణం గావించే పొడుపుపద్యాలు ఆతర్వాత ప్రత్యేకమైన పొడుపు పద్యాల ఆవిర్భావానికి మార్గదర్శనం చేశాయి. అలాంటి వాటిల్లో ఈ క్రిందిపొడుపు పద్యం.

అర్చకుండొకడు దివ్యాబ్జముల్ గొనివచ్చి
మూడచ్యుత స్థానమునకు జేర్చి
తొలి దేవళంబు ముంగలి కొలంకున దోగ
చేతి పువ్వులు యథాస్థితి దలిర్ప
నందు కొన్నిటిని దైత్యారికి నర్పించి
శేషమాగుడి తటాకమున ముంప
తత్సూనమున రెట్టదనర పూర్వపు రీతి
నర్పించి యవలి కోశంబు వలన
త్రిగుణమైన మొదలి తీరున పరమేశు
పూజ సేసి మిగులు పూలు గుళ్ల
మూట రెంట నొకట మొగి వృద్ధిగా నుంచె
తొలుత నెన్ని దెచ్చె తోయజములు.

పద్యంలో పుష్పాల అంకెలగారడీ ఉన్నా ఆ దివ్యాబ్జాలతో అర్చన కొన సాగించాడు. అర్చకుడు మొత్తం 111 పుష్పాలు తెచ్చాడు. తటాకాల్లో మునిగాడు. అన్ని గుళ్ళలో పుష్పార్చన గావించాడు. భక్తి ద్వారా మెదడుకు మేత అందించే గుణం ఈ విధమైన పొడుపు పద్యాలకు మాత్రమే ఉంది. ఆశీర్వాద రూపకాలైన ఈ క్రింది మూడు పద్యాల్ని గమనిస్తే పొడుపుకథాకారుడు పురాగాథా సముద్రానికి సేతువు గట్టి మనల్ని ఆ సేతువు మీద నడిపిస్తూపోతున్నట్లనిపిస్తుంది.

మనసిజు మామమామ యభిమాన మడంచిన
వానిమామ నం
దనుని విరోధి నందనుని నందను సుందరి
మేనమామ జం
పిన జగజెట్టి పొడిచేసిన శూరుని తండ్రి
కన్నుగన్
గొనిన సురాధి నాథుని తనుభవు నాయువు
మీకు నయ్యెడున్.

మనసిజు డంటే మన్మథుడు. మన్మథుని మామ చంద్రుడు. చంద్రుని మామ దక్షుడు దక్షుని అభిమానాన్ని అణచినవాడు ఈశ్వరుడు. ఈశ్వరుని మామ హిమవంతుడు. హిమవంతుని కొడుకు మైనాకుడు. మైనాకుని విరోధి ఇంద్రుడు. ఇంద్రుని కొడుకు అర్జునుడు. అర్జునుని కొడుకు అభిమన్యుడు. అభిమన్యుని భార్య ఉత్తర. ఉత్తర మేనమామ కీచకుడు. కీచకుని చంపినవాడు భీముడు. భీముని కొడుకు ఘటోత్కచుడు.

ఘటోత్కచుని చంపినవాడు కర్ణుడు. కర్ణుని తండ్రి సూర్యుడు. సూర్యుని కన్నుగా కొన్నవాడు విష్ణువు. విష్ణువు కొడుకు బ్రహ్మ. ఆ బ్రహ్మ ఆయుస్సు మీకు కలగాలని ఆశీర్వాదం.

మామను సంహరించి, యొక మామను
గర్వమడంచి, యన్నిశా
మామను రాజు జేసి, యొకమామ తనూజున
కాత్మబంధువై
మామకు కన్నులిచ్చి, సుతుమన్మథు నింతకి
తానె మామయై-
మామకు మామయైన పరమాత్ముడు మీకు
ప్రసన్ను డయ్యెడున్

కంసుడ్ని చంపాడు. సేతువు కట్టి సముద్రం గర్వ మణచాడు. చంద్రుడ్ని రాజు చేశాడు. అర్జునున కాత్మ బంధు వయ్యాడు. ధృతరాష్ట్రునకు కన్ను లిచ్చాడు. కొడుకైన మన్మథుని భార్య రతికి మామ అయ్యాడు. తనకు మామ యైన సముద్రునికి గంగ నివ్వడం వల్ల తాను మామ అయ్యాడు. మరి అలాంటి శ్రీ మన్నారాయణుడు మిమ్మల్ని అనుగ్రహించు గాక!

ఆలి నొల్లక యున్నవానమ్మ మగని
నందు లోపల నున్నవానక్క మగని
నమ్మినాతని జెరుచు దానమ్మ సవతి
సిరులు మీకిచ్చు నెప్పట్ల కరుణతోడ

ఆలి నొల్లనివాడు భీష్ముడు. భీష్ముని అమ్మ గంగ. గంగ భర్త సముద్రుడు. సముద్రంలో ఉన్నవాడు మైనాకుడు. మైనాకుని అక్క పార్వతి. పార్వతి మగడు శివుడు. శివుని నమ్మినవాడు రావణుడు. రావణుని చెరచినది సీతాదేవి. సీతాదేవి తల్లి భూమి. భూమి సవతి లక్ష్మి. ఆ లక్ష్మీదేవి మీకు సంపద లిచ్చు గాక!

ఇవి పొడుపు పద్యాలే అయినా మన పురా సంస్కృతిని భద్ర పరచిన పేటికలు. భారత భాగవత రామాయణ గ్రంథాల పరిచయం లేకుండా ఈ పొడుపు పద్యాలకు విడుపులు చెప్పడం అసాధ్యం. కేవల పరిచయం కూడా సమస్య పరిష్కారానికి దోహదకారి కాదు. అపారమైన ప్రజ్ఞ ఉంటేనే ఈ పద్యాలముడులు విప్పడం సాధ్యం అవుతుంది. ముడులు విడివడ్డ తర్వాత వెల్లడ్డ పౌరాణిక గాథ విజ్ఞానం వల్ల భక్తి భావాలు వ్యక్తుల్లో చోటు చేసుకుంటాయని చెప్పలేం. భక్తి పరిపుష్టికి కొంత మానసిక సంసిద్ధత అవసరం. అందుకే ఈ పొడుపు పద్యాల వల్ల పౌరాణిక గాథా పరిచయం మాత్రమే కలుగుతుందని చెప్పాల్సి వస్తుంది.

పొడుపు పద్యాల విడుపుల్లో భగవన్నామాన్ని పొందించి పాపిశెట్టి సీతారామకవి కొన్ని పద్యాలు రాశాడు. పద్యంలోని ప్రశ్న యేదైనా విడుపులో మాత్రం దైవ నామం వస్తుంది. ఆయన ఆదిలోనే గణేశునకు వంద మన్నాడు.

పార్వతీ రమణు డే పడతిని తలనుంచె
పరమ యోగుల గట్టు పట్టె యేది
విద్యా విహీనుని విజ్ఞులేమందురు
వేల్పులందున తొలివేలు పెవరు

## గమనిక:-

సప్తగిరి ఏజెంట్లకు దేవస్థానం బహూకరించే రజత పతకం ఆయా భాషలలో 500 కాపీలకు తక్కువ కాకుండా అందరికన్నా ఎక్కువ అమ్మిన వారికేగాని లోగడ ప్రచురించినట్లు 500 కాపీలు అమ్మినవారందరికీ కాదు. ఈ పొరబాటుకు చింతిస్తున్నాము. సం||

| తెలంగాణలో సప్తగిరి | |
|---|---|
| శ్రీ. వై. తులసీదాస్, గుడి వీధి, c/o. ఉమామహేశ్వర వస్త్రాలయం, వేములవాడ, కరీంనగర్. | శ్రీ. పి. చక్రయ్య, దారపల్లి, నిజామాబాదు. |
| శ్రీ. వేముల ఆనంద్, భీమవరం, ఆదిలాబాద్ జిల్లా. | శ్రీ. జి. నరశింహాచార్యులు s/o. జి. కృష్ణమాచార్యులు వర్ధన్నపేట. వరంగల్ జిల్లా. |
| శ్రీ. సి. శంకర గుప్తా, c/o మంచిర్యాల గూడ్సుట్రాన్స్‌పోర్టు (బ్రాంచి) లక్సెట్టిపేట. (వయా) మంచిర్యాల ఆదిలాబాదు జిల్లా. | శ్రీ. ఎ. బాలరాజేషన్. c/o రాజేశ్వర మోడరన్ డ్రెస్ మిల్- 4-7-20, న్యూమార్కెట్ రోడ్ మెదక్ జిల్లా. |
| | శ్రీ. సి. వెంకటరెడ్డి. 30/90, బజారువీధి, రాయ రాయల్పాడు. చిత్తూరు జిల్లా |

## తెలంగాణాలో సప్తగిరి

శ్రీ.ఏ. హరి
1-5-118 కందాజి బజార్
సికిందరాబాదు.

శ్రీ.వి.టి. బద్రీనాథ్
1-1-710/2 శ్రీవాణీ కుటీర్.
గాంధీనగర్.
హైదరాబాదు.

శ్రీ.గోవర్ధనగిరి వెంకటాచార్య,
పెద్దపల్లి,
కరీంనగర్ జిల్లా.

శ్రీ డి.జగన్నాధం
యశోధ కృష్ణ ఏజెన్సీ
2-158 - శ్రీనగర్
డౌన్ వీధి - సంగారెడ్డి.

శ్రీ యస్.జనార్ధనాచార్యులు
రంగనాయకుల గుట్ట.
భద్రాచలం.
ఖమ్మం జిల్లా.

శ్రీ ఏ. కృష్ణయ్య
ఆయురేవద డాక్టరు.
బాలాజీ వాడ
ఆదిలాబాదు.

శ్రీ.బి.నారాయణ,
మహబూబ్ నగర్
వరంగల్.

శ్రీ. పి.బాబూరావ్.
కొబ్బరికాయల వ్యాపారం,
యాదగిరి దేవస్థానం,
యాదగిరిగుట్ట.
నల్గొండ జిల్లా.

శ్రీ అయితాలక్ష్మినర్సయ్య.
లక్ష్మి మెడికల్స్ అండ్
జనరల్ స్టోర్సు.
ఇం.నెం: 9-70 నర్సన్ పేట
వరంగల్ జిల్లా.

జూదమందున ధర్మసుతు నెప్పుడోడించె
చంద్రజాటుకు సాక్షి చతుర ఎవరు
బాలకృష్ణుండాడు భంగిమ పేరేమి
శూలి చూపుల చేత సోలె నెవడు

అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన నయము గాను
ఆలరు గణనాధునకు మేము ననుదినంబు
వందనము చేసెదము లోక వందితముగ

గంగను-ఏడేయం-పశువు-జనని-శకుని-గేదంగి-తాండవం-కాముడు. ఈ పొడుపుల్లోను విడుపుల్లోను కవి వ్యావహారికాన్నే పాటించాడు. అందు వల్లనే ఏడేయం-తాండవం అనే పదాలున్నాయి. పద్యం లోని ప్రశ్న వాచకాలు కూడా చాలా వరకు పౌరాణిక విజ్ఞాన పరిచయాన్ని కలిగిస్తాయి. విడుపుల్లోని మధ్యాక్షరాలు "గణేశునకు దండము" అంటున్నాయి. విద్యల దేవుడు విఘ్న వినాయకుడు అయిన గణేశునకు భక్తితో పొడుపు పద్యం ద్వారా దండం పెట్టించాడీ కవి. ఆ తర్వాత ఇదే విధంగా శారదాలక్ష్మీ పార్వతుల్ని, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల్ని, వ్యాస, వాల్మీకి, కాళిదాసుల్ని, శ్రీ కాశీ విశ్వనాథుణ్ని, రక్షక రామేశ్వరుణ్ని, కంచి వరదరాజుల్ని, కాళహస్తి రామలింగణ్ని, తిర్మలవెంకట్రమణను శ్రీ రంగనాయకస్వామి, భద్రాచల రామస్వామిని, శిరుసున గంగ రాముణ్ని, కందూరు రామలింగమును, భారి గద్వాల నృసింహుణ్ని, ధర్మపురి నార సింహమును జీడికంటి రామచంద్రుని, దామ గుండము రాముణ్ని, గంగపురి చెన్నరాయుల్ని, యండచెట్ట నారసింహమును, గుండాల రామలింగమును, గద్వాల చెన్న కేశవుని. శ్రీశైల భ్రమరాంబను, గోవిందరాజుల స్వామిని, బొల్లిగట్టు తిర్మలయ్యను, ఒంటిమిట్ట రామస్వామిని, మట్టికంటి రామచంద్రమును, చెల్లపిల్లరాయ స్వామిని, పాండురంగ విఠలేశుణ్ని, జటప్రోలు గోపాలుణ్ని, శ్రీ జగన్నాథ స్వామిని, తిమ్మాజీ పేట చెన్నన్న, చివరగా తనను (పాపిసెట్టి సీతారామ కవిని) పొడుపు పద్యాల విడుపుల్లో బంధించి స్థల దేవతల నెందరినో పరిచయం చేశాడు. ఆ భగవంతుని శతకోటి నామాల్ని శతకోటి పొడుపు పద్యాల్లోనూ, విడుపుల్లోనూ బంధించ వచ్చునేమో!

ఈ బంధం మానవ మానసిక వికాసానికే గాని లేకపోతే ఆయనకు బంధ మెక్కడిది. ఆటవెలదులెన్నో దీని భావమేమి అని ఆ తిరుమలేశుణ్ని ప్రశ్నిస్తే ఆయన ముఖాముఖంగా ఉన్నాడనో యేమో పాపిసెట్టి కవి ఆయన్నే తన విడుపులో బిగించాడు. చివరగా ఆ పద్యాన్ని చూద్దాం.

పొంచుండి రాముడు త్రుంచెను దేనిని
శంభుడు గప్పిన శాలువేది
పూతనయై వచ్చి పొలియించె నెవ్వరి
పెద్దరాతికి మారు పేరునేది
చందురుడేతీరు ముందుగా కనిపించు
జలజాక్షు చక్రమే చలువ నుండు
పాలాక్షు తనయుని పక్షి వాహనమేది
హరి యేమియై పురా లవని గూల్చె
అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన నలరు నట్టి
తిరుమలేశుండు నెప్పుడు స్థిరముతోడ
మనల కరుణావిధేయుడై మనుచుచుండు

కోతిని-చర్మము-బాలల-గ్రావేంద్రం-వంకర-వట్రము-నెమలి-బాణము. మొత్తం మీద తిర్మల వెంకట్రమణుడు ఈ విడుపుల మధ్యాక్షరాల్లోకి వచ్చాడు. సర్వత్రా ఉన్న ఆ పరమాత్ముడు ఈ విధంగా పొడుపు పద్యాల్లోకూడా ప్రవేశించి మానవుల్ని భక్తి భావ భరితుల్ని చేస్తున్నాడు. ఆంధ్ర సాహిత్యంలో పొడుపుపద్యం స్థానం చిన్నదే అయినా తనవంతు భక్తినీ, భారతీయ పురాణ సంస్కృతినీ తానెంత అందించాలో అంతా అందించింది.



# శ్రీ మణవాళ మహామునులు

(అక్టోబర్ 30వ తేది నుండి నవంబర్ 8వ తేది వరకు జరుగుచున్న మణవాళ మహాముని ఉత్సవాల సందర్భంగా)

శ్రీ వైష్ణవ సంప్రదాయమున పలువురు ఆళ్వారులు. ఆచార్యులు వెలసియున్నను వారిలో ముఖ్యులు ముగ్గురు. వారు నమ్మాళ్వారులు. రామానుజులు, మణవాళ మహామునులు. కావుననే వైష్ణవ లోకము నందలి భక్తులు "ఆళ్వార్, ఎంబెరుమానార్ జీయర్ తిరువడిగళె శరణం" అని అనుసంధాన మొనర్చుచున్నారు.

మణవాళమామునులకు పెరియజీయర్, యతీంద్రప్రవణులు, రమ్యజామాతా, వరవరముని, అళహియ మణవాళనాయనార్ అను నామాంతరములు కలవు. వీరు "నాగచతుర్థి" యందు జన్మించుట వలన వీరిని ఆదిశేషుల అంశముగా భావించుచున్నారు.

నమ్మాళారులు అవతరించిన "ఆళ్వార్ తిరునగరి" అను పుణ్యస్థలమునందు "శ్రీ జిహ్వావదీశ దాసుడు" (తిరునావీరుడయ పిరాన్ దాసరణ్ణర్) "శ్రీ రంగనాయకి" అను దివ్యదంపతులకు వీరు సాధారణ సంవత్సరమున, ఆశ్వయుజ మాస మూలా నక్షత్రమున (క్రీ. శ. 1370) జన్మించిరి. ఈ దివ్యమూర్తికి వీరి తల్లిదండ్రులు శ్రీ రంగనాథుల దివ్య నామము నుంచదలచి "రమ్యజామాతా" (అళహియ మణవాళన్) అని నామకరణము చేసిరి. ఈ ఆచార్య సార్వభౌములకు ధర్మశాస్త్ర ప్రకారముగ అన్ని సంస్కారములు వీరి తండ్రిగారు జరిపించిరి. వీరు తమ తండ్రి వద్దను, సదాచార్యుల వద్దను వేదవేదాంగ, ఇతిహాస పురాణాది సకల శాస్త్రములను అభ్యసించిరి. తరువాతగృహస్థాశ్రమమును స్వీకరించిరి.

శ్రీ వైష్ణవ సదాచార్య పరంపరలో "లోకాచార్యులు" చాల ప్రసిద్ధులు. వీరు అష్టాదశ రహస్యములు అనుగ్రహించిరి. వీరి పాదపద్మములందు చాలాకాలము పరిచర్యలొనర్చుచు, సకల శాస్త్ర రహస్యములను చక్కగా నెరిగిన వారును అగు "శ్రీశైలనాథుడు" (తిరువాయ్ మొళిపిళ్లై) అను ఆచార్యులపాదములను వీరు (మణవాళమహాముని) ఆశ్రయించి తమ పూర్వాచార్యుల సత్సంప్రదాయ విధులను స్వీకరించిరి.

ఆళ్వార్ తిరునగరి యందు "తిరువాయ్ మొళిపిళ్లై" గారిచే ప్రతిష్ఠింపబడిన "రామానుజాచార్యుల" సన్నిధిలో మామునులు తమ ఆచార్య నియమములతో తగిన కైంకర్యము లన్నియు కొదువలేక జరుపుచుండుటను చూచి, సంతసించి, వీరి ఆచార్యులు వీరిని "యతీంద్రప్రవణులు" అని పిలచిరి. పిదప ఆచార్యనియమనముతో శ్రీ రామానుజ స్వామి విషయముగ "యతిరాజవింశతి" అని ఒక స్తోత్రమును మామునుల వారు విరచించిరి.



ఫోటో: శ్రీ ఎస్. వి. కె. ఎస్. శ్రీనివాసన్.

పిదప తన ఆచార్యులగు "తిరువాయ్ మొళిపిళ్లై" నియమనాను సారముగ శ్రీరంగమును చేరుకొనిరి. శ్రీరంగనాథుని అనుగ్రహము చేత సత్కథా కాలక్షేపములు. ఉపదేశములు చేయుచు, సకల వైష్ణవుల చేతను కొనియాడబడిరి.

అపరిమిత బంధుజనములగల ఈస్వామి వారికి అడుగడుగున అశౌచము వచ్చి కాలక్షేపాది ప్రవచనములకు, భగవత్సేవకు విఘ్నము కలుగుచుండుటచే, స్వామివారు సన్యాసము స్వీకరించి "మణవాళ మహామునులు" అను తిరునామముతో వెలసిరి. ఇట్లు వీరు ఉత్తమాశ్రమమును స్వీకరించి ఒక మఠమును ఏర్పరచి. కాలక్షేపగోష్ఠులను నిర్వహించుచుండిరి.

మామునులు సన్యాసాశ్రమమును స్వీకరించుటకు మునుపే వానమామలై (తోతాద్రి)లో వెలసియుండిన "అళహియ వరదన్" అనువారు మామునుల ప్రభావము విని, పరమవైరాగ్యముతో సన్యసించి "శ్రీ రామానుజ జీయర్" అని తిరునామమును బూని "మణవాళ మహామునులను" ఆశ్రయించిరి. వీరేమామునులకు ప్రథమ శిష్యులు. వీరిని "పాదరేఖస్వాములు" అనియు, "పొన్నడిక్కాల్ జీయర్" అనియు అందురు. తరువాత "కోయిలణ్ణన్" "ప్రతివాద భయంకరమణ్ణన్" ఎఱుంబి యప్పా మున్నగు పలువురు మహనీయులు వీరిని (మణవాళమామునులను) ఆశ్రయించి వీరి మాహాత్మ్యమును ద్రావిడ, సంస్కృత భాషలలో గ్రంథరూపమున వెలయించిరి. అట్టి శిష్యవర్గమున ఎనిమిది మంది అగ్రగణ్యులై "అష్టదిగ్గజములు"గా ప్రసిద్ధిహొందిరి. వారల తిరునామములు 1) వానమామలై జీయర్ 2) పట్టర్ పిరాన్ జీయర్ 3) తిరువేంగడ రామానుజ జీయర్ 4) కోయిలణ్ణన్ 5) ప్రతివాది భయంకరమణ్ణన్ 6) ఎఱుంబిఅప్పా 7) అప్పిళ్లై 8) అప్పిళ్లార్. అని వీరు ముగ్గురు యతీశ్వరులు, ఐదుగురు గృహస్థులు.

శ్రీరంగనాథుడు మామునులద్వారా తిరువాయ్ మొళి అర్థమును వినగోరి, ఒకనాడు అర్చక ముఖేన ఆహ్వానించి "స్వామీ! రేపు మొదలు మనపెద్ద మంటపమునందు. నమ్మాళ్వార్ సాయించిన సామవేదసారమగు తిరువాయ్ మొళిని "ఈడు ముప్పత్తారాయిరమ్" అనే వ్యాఖ్యానముతో ప్రవచనము చేయుమని" నియమించెను. మామునులు మహాప్రసాదమని మరునాటి నుంచి గంగా ప్రవాహము వలె సకలవేద, ఇతిహాస, పురాణ, కావ్య నాటక, అలంకార, దివ్యప్రబంధ శ్రీ సూక్తులతో నిండిన ఈడు కాలక్షేపము చేయుచుండిరి. భగవంతుడు శ్రీ భూదేవులతో కూడి సింహాసనము నలంకరించి ఒక సంవత్సర కాలము ఆలకించెను. కాలక్షేపము ముగియునాడు శ్రీరంగనాథుడు ఐదేండ్ల ప్రాయంపు అర్చక కుమారునివేషము ధరించి అతివేగముగ గోష్ఠినడుమవచ్చి ఇతరులు అడ్డుకొనుచు చున్నను లక్ష్యము చేయక చేతులు మోడ్చి

"శ్రీశైలేశ దయాపాత్రం ధీభక్త్యాది
గుణార్ణవమ్ ।
యతీన్ద్రప్రవణం వన్దే రమ్యజామాతరమ్
మునిమ్ ॥

అను 32 అక్షరములు కల మహా మంత్రమగు తనియను శ్లోకమును విన్నవించి అదృశ్యు డయ్యెను. ఈ అతిశయమును చూచి అందరు ఆశ్చర్యపడిరి.

ఈ తనియను భగవదాజ్ఞానుసారముగ శిష్యవర్గము తాళ పత్రముపై వ్రాసి, పసుపుచే నలంకరించి శ్రీరంగనాథుల తిరువడిలో సమర్పించి తీసుకొని ఒక తట్టలో నుంచి మిక్కిలి వైభవముతో కొనియాడిరి. వేదాధ్యయనము యొక్క ఆద్యంతములలో "హరిః ఓం" వలె ద్రావిడ వేదాను సంధానమునకు ఈతనియనే ఆద్యంతములలో అనుసంధింప వలయునని భగవన్నియమము ఏర్పడెను. పిదప రంగనాథుని ఆజ్ఞప్రకారము శిష్యులచే "వాళి తిరుమొళి పిళ్లై మాదగ వాళ్ వాళుమ్ అని ప్రారంభించి "మనవాళ మామునియే యిన్నమొరా నూత్తాండిరు" అని ముగింపబడిన వాళి తిరునామము సాయించిరి. దీనిని కూడా అను సంధానము చేయుచు దివ్య ప్రబంధమును ముగింప వలయును అను నియమము కూడా ఏర్పడినది.

మా మునులు శిష్య వర్గము యొక్క ప్రార్థనానుసారముగ పలు దివ్యగ్రంథములు, వ్యాఖ్యానములు ప్రసాదించిరి. అవి పిళ్లైలోకాచార్యులు అనుగ్రహించిన అష్టాదశ రహస్యములలో ముఖ్యమైన "శ్రీ వచన భూషణము, తత్వత్రయము, ముముక్షుప్పడి" అను మూడు రహస్యములకు వ్యాఖ్యానము వ్రాసిరి. పిళ్లైలోకాచార్యుల తమ్ముడగు "అళహియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్" రచించిన "ఆచార్యహృదయము" అను రహస్య రత్నమునకు వ్యాఖ్యానమును వ్రాసిరి. నాలాయిర దివ్య ప్రబంధములోని "పెరియాళ్వార్ తిరుమొళి" కి పెరియవాచ్చాన్ పిళ్ళై అనువారు రచించిన వ్యాఖ్యానము చెదలు పాలైనందున దానిని పూర్తి చేసిరి. ప్రపన్న గాయత్రి అనే రామానుజ నూత్రం దాది ప్రబంధమునకు వ్యాఖ్యానమును వ్రాసిరి. అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమాన్లు'' (దయాపాలముని) రచించిన "జ్ఞానసారము, ప్రమేయసారము" అను గ్రంథములకు వ్యాఖ్యానమును వ్రాసిరి. భగవద్గీతకు "తాత్పర్యదీపము" అను ఒక వ్యాఖ్యానమును వ్రాసిరి. "ప్రమాణ సంగ్రహము (ప్రమాణ తిరట్టు) ఆరాధన ప్రయోగము (తిరువారాధనము) లను రచించిరి. ఉపదేశ రత్తినమాలై, తిరువాయ్ మొళి నూత్తందాది, ఆర్తి ప్రబంధము అను మూడు తమిళ ప్రబంధములను రచించిరి. యతిరాజ వింశతి, దేవరాజ మంగళమ్ అను రెండు సంస్కృత స్తోత్రములను రచించిరి.

మణవాళ మహామునులు దివ్యదేశ యాత్రలు చేయుచు క్రమముగ తిరుమల, కాంచీపురము, ఆళ్వార్ తిరునగరి, తిరునారాయణ పురము, శ్రీరంగము మొదలగు పలు దివ్యక్షేత్రములు దర్శించి అచ్చట మంగళాశాసనములు చేసిరి. మా మునుల వారు తిరుమల,తిరుపతికి వచ్చి తిరువేంగడనాథుని దర్శించి సత్కరింపబడిరి. తిరుపతి-తిరుమలలో వేంచేసి యుండు పెద్ద జియ్యంగారు మామునులతో, మీరు తిరుమలలో వేంచేసి యుండి మమ్ములను కృతకృత్యులను చేయవలయునని ప్రార్థించిరి. మా మునులు తాము దివ్య దేశ యాత్రలు చేయు చున్నామని, తమకు బదులు ప్రతినిధిని నియమింతుమని చెప్పిరి. దానికి పెద్ద జియ్యంగార్ ఒప్పుకొనగా, తమకు బదులు ఒకరిని నియమించి వారికి "చిన్న జియ్యంగార్'' అని తిరునామము నుంచి, తమకు బదులు వారు కైంకర్యములు నిర్వహింతురనియు, పెద్ద జియ్యంగార్‌కు కైంకర్యములలో సహాయపడుదురనియు చెప్పిరి. అదిమొదలు తిరుమల-తిరుపతిలో పెద్ద జియ్యంగార్ "ఉడయవర్" (రామానుజాచార్యులు) ల ప్రతినిధి అనియు, చిన్న జీయంగార్ 'మణవాళ మహామునుల' ప్రతినిధి యనియు వాడుకలోవచ్చిరి.

ఈ విధముగ ఈ ఆచార్య శిఖామణులు అనేక రహస్య గ్రంథములకు వ్యాఖ్యానములు చేసి, శ్రీ సూక్తులను అనుగ్రహించి తమ 73వ సంవత్సరము, (క్రీ.శ. 1444) రుధిరోద్గారి నామ సంవత్సరము, మాఘమాసము, కృష్ణపక్ష ద్వాదశి యందు పరమ పదించిరి.

శ్రీరంగనాథులు, మణవాళ మామునుల వద్ద "ఈడు" (భగవద్విషయము) కాలక్షేపము విని శిష్యులైనందున, మణవాళ మామునుల తీర్థము రోజు (మాఘమాసము, కృష్ణపక్ష ద్వాదశి), మా మునులకు ఆరగింపు అయిన తరువాత, శ్రీరంగనాథులకు ఆరగింపు జరుగును. ఇది ఈ దినము వరకు పరంపరగా జరుగుచున్నది. ఇది ఒక్కటియే కాక ప్రతి దినము ఆరగింపు తరువాత తీసుకొను తమలపాకులు కూడ ఆ రోజు శ్రీరంగనాథుల వారు గురుభక్తిచే త్యజించిరి.

మామునులకు పిదపను పలు ఆచార్యులు అవతరించి యున్నను "పూర్వాచార్యులు" అనునది మామునుల వరకే పరిమితమని పెద్దలు చెప్పి యున్నారు.

— శ్రీ కె. తిరువేంగడం

## లక్ష పుష్పార్చన

తే 3-9-83 ది శనివారం శ్రావణ బ॥ ఏకాదశి ప్రాతః కాలమున మంగళ తూర్యా రవముల ఘోషతో గోక్షీరముతో గుంటూరు లోవెలసివున్న శ్రీ రమా సత్యనారాయణ స్వామి వారికి అభిషేకము పురుషసూక్తము 11 ఆవృత్తులలో జరిగినది. ఏకకాలమున శ్రీ ప్రసన్నాంజనేయ స్వామివారికి మన్యు సూక్త అభిషేకము జరిగినది. అభిషేకానంత రము శ్రీ రమా సత్యనారాయణ స్వామి వారలకు. శ్రీ ప్రసన్నాంజనేయ స్వామికి విశేషముగా అలంకారమును తీర్చిదిద్దగా 11 గం॥ సమయమున విచ్చేసిన భక్తజన సందోహముదై వదర్శనము గావించుకొనిరి. సాయంత్రం 4 గం॥లకు మంగళవాద్య సభ ముగిసినపిదప బ్రహ్మగా విచ్చేసిన శ్రీమాన్ పరాశరం వీరరాఘవాచార్యులుగారు విష్వక్సేనపూజ, పుణ్యాహవచనము. నిర్వ హించినారు. తదనంతరము శ్రీ రమాసత్య నారాయణ స్వామివారల దివ్యతేజో విరాజ మానార్థం కన్నులపండువగా ప్రతిఏటా

# ధర్మరక్షణ కార్యక్రమాలు

జరిగే "లక్షపుష్పార్చన" ఉత్సవ కార్య క్రమము దేవాలయ ప్రధాన ధర్మకర్త శ్రీ పేరాల శ్రీరామ వేంకటేశ్వర రావు గారి పర్యవేక్షణలో ప్రారంభమైనది. వందలాది భక్తులు ఈ ఉత్సవమును కన్నులారా వీక్షించుటకు తగిన అన్ని ఏర్పాట్లు కావింప బడినవి. పదిమంది ఋత్విక్‌లు గర్భాలయ ములో శ్రీవారిపై మల్లె, విరజాజి, చామంతి గులాబి పుష్పములు ఉంచుతుండగా వెలుపల పదిమంది శ్రీవారిసహస్రనామావళి పఠించిరి. ఈవిధముగా పది ఆవృత్తులలో శ్రీవారికి లక్ష పుష్పార్చన జరుపబడినది.

అదే విధముగా అమ్మవారివద్ద ఒకరు కుంకుమ పూజ చేయుచుండగా వెలుపల ఒకరు లక్ష్మీసహస్రనామావళి పఠించిరి. శ్రీ ప్రసన్నాంజనేయస్వామి వారివద్ద నాగ వల్లీదళములతో ఒకరు పూజచేయుచుండగా వెలుపల మరొకరు ఆంజనేయసహస్రము



తిరుమల తిరుపతి దేవస్థానముల హిందూధర్మ రక్షణ సంస్థ తే 28-8-83 ది నుండి తే 8-9-83 ది వరకు చిత్తూరు కడప జిల్లాలలో ప్రత్యేక ధార్మిక కార్యక్రమాలు నిర్వహించింది. సెప్టెంబర్ 8 వ తేదిన ప్రొద్దుటూరులో ధర్మరక్షణ సంస్థ శాఖకు ప్రారంభోత్సవం జరిగిన సందర్భంలోని దృశ్యం. వేదికపై శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి, శ్రీ సముద్రాల లక్ష్మణయ్య తదితరులు.



గుంటూరు శ్రీరమా సత్యనారాయణస్వామి ఆలయంలో సుందరకాండ పారాయణం జరిపిన శ్రీ మల్లాది చంద్రశేఖరశాస్త్రిగారిని తే 15-8-83 దిన ఆలయపక్షాన సన్మానిస్తున్న సినీనటులు శ్రీ ధూళిపాళ.

పఠించిరి. ఈ విధముగా ఇవికూడ 10 ఆవృత్తులుగా నిర్వహింపబడినది. శ్రీ వారికి ఈ విధముగా పూజ జరిగిన అనంతరము మన్త్రపుష్పము సమర్పించి మంగళనీరాజనముల నందించిరి.

తిరుమల తిరుపతి దేవస్థానముల వేదపండితులు బ్రహ్మశ్రీ అన్నదానం అన్నేశ్వర సోమయాజులు గారిచే ఉదయ సాయంసమయములందు జరుపబడిన వేద పఠనము, కార్యక్రమము నంతటికి ఒక నూతన శోభను చేకూర్చి పెట్టినది.

### సామూహిక గోపూజ

ప్రకాశం జిల్లా, ఈతముక్కల గ్రామంలో శ్రీవెంకటేశ్వర భక్త సంఘ ప్రథమ వార్షికోత్సవము, సర్వసభ్య సమావేశము, మరియు సామూహిక గోపూజ 8-8-83 తేది సోమవారం వైభవముగా జరిగినవి.

ముందురోజు మాసశివరాత్రి సందర్భమున స్థానిక, శివాలయములో సామూహిక గోపూజ జరిగినది. దీనిలో స్థానిక ప్రేమీమండలి విద్యార్థినులు, గ్రామీణ స్త్రీలు పాల్గొన్నారు. పూజలో పాల్గొన్న వారికి. తి. తి. దేవస్థానముల. ధర్మరక్షణ సంస్థ సౌజన్యంతో శ్రీనివాసకళ్యాణం, రాజమండ్రి, బోధానంద ఆశ్రమంవారిచే హనుమాన్‌చాలీసా గ్రంథములు ఉచితంగా పంచబడినవి.

తే 8-8-83 దిన స్థానిక భావనాఋషి దేవాలయములో సాయంత్రం 8. గంటలకు భక్త సంఘ సర్వసభ్య సమావేశము, శ్రీ పి. శ్రీరామమూర్తి మరియు శ్రీ వి. నాగేశ్వరరావు అధ్యక్షతన జరిగినది. సంఘకార్యదర్శి శ్రీ వీరభద్రరావు గతసంవత్సర కార్యక్రమములు, ఆదాయ-వ్యయ వివరాలు సభకు వినిపించి 83-84 సంవత్సరమునకు జరుపు కార్యక్రమముల పట్టిక ప్రవేశపెట్టిరి. తరువాత గత సంవత్సర కార్యవర్గమును (మూడు) సంవత్సరముల వరకు ఏకగ్రీవముగా పొడిగించిరి. తరువాత శ్రీపి. శ్రీరామమూర్తిగారు ప్రజలకు ఆధ్యాత్మిక విషయమై. వేదములను గురించి మన ఆచారము, సంప్రదాయంపై, ఉపన్యాసము చేసి భక్తులను అలరించిరి

తరువాత రాత్రి 10-00 గం॥ నుండి 1-0 వరకు శ్రీ లొల్లా-పాండు రంగారావు, భాగవతార్ గారిచే "లవకుశకళ్యాణం" హరి కథకాలక్షేపము తి. తి. దేవస్థానము, హిందూ ధర్మరక్షణ సంస్థ వారిచేనిర్వహించబడినది.

రాత్రి 1-00 లకు మంగళహారతి అనంతరము, శ్రీ. వి. నాగేశ్వరరావు; శ్రీ కె. వీరభద్రరావు గార్లు వందన సమర్పణచేసిరి. •




Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press, by M. Vijayakumar Reddy, L.P.T., Manager, T.T.D. Press, Tirupati.








THE VISIT OF ANDHRA PRADESH CHIEF MINISTER
TO TIRUMALA ON 11-9-'83.

డిశంబరు 1983 వెల: రూ. 1/-

# తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాసపత్రిక





పార్థాయ ప్రతిబోధితాం భగవతా
నారాయణేన స్వయం
వ్యాసేన గ్రథితాం పురాణమునినా
మధ్యేమహాభారతమ్
అద్వైతామృత వర్షిణీం భగవతీ
మష్టాదశాధ్యాయినీమ్
అంబ ! త్వామనుసంధధామి భగవద్గీతే
భవద్వేషిణీమ్

( డిసెంబరు 16 తేదీ 'గీతాజయంతి సందర్భంగా )

# మీ మాట

## ప్రకటనలు

సప్తగిరి లాంటి మహోన్నత పత్రికలో 'నవశక్తి నిలయం' వంటి ప్రకటనలు వేయకండి. ఆ ప్రకటనలలోని ఫలితాలు నిజమూ కావచ్చు; కాకపోవచ్చు! ఇటువంటివి ప్రచురించి ప్రజలను మభ్య పెట్టవద్దు! లేదా వాటిశక్తుల్ని మీరు పరిశీలించి నిరూపణ అయితేనే ప్రకటించండి. 'సప్తగిరి' వ్యాపారపత్రిక కాదుగదా!

పి. శ్రీదేవి — కడప

సప్తగిరిలో వ్యాపార ప్రకటనలపై నిషేధంలేదు. సం॥

## పూర్ణకుంభం

తిరుమల శ్రీవారి ఆలయంలో పూర్ణ కుంభంతో ప్రముఖ పీఠాధిపతులకూ, రాజకీయనాయకులకూ స్వాగతం పలికే ఆచారం ఎప్పటినుండి వస్తున్నదో తెలుపుతూ ఈ సంప్రదాయ విశేష ఫలితాలను పాఠకుల ముందువుంచ కోరుతున్నాను.

బి. సింహాద్రి — అచ్చంపేట

## అక్షర ముముక్షువు

సెప్టెంబర్ సంచికలో వెలువడిన "అక్షర ముముక్షువు" వచన కవిత అక్షరాలా ఆలోచనామృతం.

మాటలను మౌనాన్ని పడుగు పేకగా పేర్చి అల్లిన గిజిగాని గూడుగా దివికి భువికి మధ్య ఊగుతూ సహృదయుల హృదయాలను ఉర్రూతలూగించింది.

రచయిత శ్రీ పూలికుంట పార్థసారధి రెడ్డిగారికి నా సహృదభివందనలు.

డా॥ నంబూరి రామకృష్ణమాచార్య—సికిందరాబాద్.

## మహిషాసుర మర్దిని

అక్టోబర్ సప్తగిరిలో "మహిషాసుర మర్దిని" చాలా బాగుంది. రచయిత శ్రీ బి. ఎల్. ఎన్. ఆచార్యగార్కి మా ధన్యవాదాలు. "సప్తగిరి"ని పక్ష పత్రికగా ప్రచురింప కోరుతున్నాము.

చిలవేరి మహేశ్వర్, రాపుల విఠల్, రామకృష్ణయ్య — ఆదిలాబాద్.

ప్రతిసారి "మహిషాసుర మర్దిని" ని గురించి కథలు, వ్యాసాలు చదివే మాకు 'మహిషాసుర మర్దిని'ని నూతన రూపంలో నాటకంగా అందించిన ఘనత సప్తగిరికి దక్కింది. రచయిత శ్రీ బి. ఎల్. ఎన్. ఆచార్యగార్కి ప్రచురించిన మీకు అభినందనలు.

కొండపి వాసుదేవ మూర్తి — ఒంగోలు.

## గృహలక్ష్మి

అక్టోబర్ సప్తగిరిలో 'కట్నములు, శుల్కములు శాస్త్ర సమ్మతములా?' వ్యాసం అనేక మంచి విషయాలను వెల్లడి చేసింది. రచయితకు మా ధన్యవాదాలు.

ఏ. రామసుబ్బారెడ్డి — కడప.

సెప్టెంబర్ సంచికలో "ప్రమద్వర" కథ వరకట్న పిశాచి ఆవహించిన నేటి సమాజానికి కనువిప్పు కలిగించేలా వుంది. ఇటువంటి కథలు ముమ్ముందు కూడా ప్రచురింప ప్రార్థన.

ఆర్. సుబ్బరామప్ప శెట్టి — వంకరకుంట.

## శ్రీవారి ప్రసాదం

భక్తులకు ప్రియమైన శ్రీవారి లడ్డు ప్రసాదాన్ని ఆంధ్రాబ్యాంకు లేదా మరే యితర శాఖల ద్వారా సైనా దేశమంతటా కనీసం వారాని కొక రోజైనా (ప్రతి శనివారం) అమ్మేలా ఏర్పాటు చేస్తే ఆనందించగలం.

ఎం. వెంకటరమణ — గుంటూరు.



## తిరుచానూరు శ్రీ పద్మావతీ అమ్మవారి బ్రహ్మోత్సవ కార్యక్రమము

| తేది | వారం | పగలు ఉత్సవములు | రాత్రి ఉత్సవములు |
|---|---|---|---|
| 30-11-83 | బుధవారం | — | సేనాధిపతి ఉత్సవము. అంకురార్పణము |
| 1-12-83 | గురువారం | తిరుచ్చి, ధ్వజారోహణము | చిన్న శేషవాహనము |
| 2-12-83 | శుక్రవారం | టాంజాన్ ఉత్సవము | హంసవాహనము |
| 3-12-83 | శనివారం | సింహవాహనము | ముత్యపుపందిరివాహనము |
| 4-12-83 | ఆదివారం | కల్పవృక్షవాహనము | సర్వభూపాలవాహనము |
| 5-12-83 | సోమవారం | పల్లకి ఉత్సవము | గజవాహనము |
| 6-12-83 | మంగళవారం | హనుమద్వాహనము (సాయంకాలం వసంతోత్సవము) | గరుడవాహనము |
| 7-12-83 | బుధవారం | సూర్యప్రభవాహనము | చంద్రప్రభవాహనము |
| 8-12-83 | గురువారం | రథోత్సవము | అశ్వవాహనము |
| 9-12-83 | శుక్రవారం | పల్లకి ఉత్సవము, తిరుచ్చి ఉత్సవము, చక్రస్నానం, తీర్థవారి అవభృథోత్సవం | ధ్వజావరోహణోత్సవము |



# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాస పత్రిక...


## ఈ సంచికలో ....


డిసెంబర్ 1983

సంపుటి 14 సంచిక 7




రెండవ కవరుపేజి: తిరుమల తిరుపతి దేవస్థాన నూతన బోర్డుసభ్యులతో ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు.

మూడవ కవరుపేజి: తిరుమలలో నీటికరువును తొలగించిన పాపవినాశనం ప్రాజెక్టు.

నాల్గవ కవరుపేజి: నారాయణగిరి నుంచి కనిపించే తిరుమల దృశ్యం.


గౌరవసంపాదకులు.

శ్రీ జి. కుమారస్వామి రెడ్డి,
ఐ. ఏ. ఎస్.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి

ప్రచురణకర్త - సంపాదకుడు.

కాట్రపాటి సుబ్బారావు,
ఎమ్. ఎ.

ఉపసంపాదకుడు.

తిరుమూరు సుధాకర్ రెడ్డి,
ఎమ్. ఎ. బి. ఇడి.

ముద్రాపకుడు

ఎమ్. విజయకుమార్ రెడ్డి.

విడిప్రతి-రు. 1-00

సం॥ చందా-రు. 12-00

ప్రతులకు:

వెల్ ఫేర్ ఆఫీసర్,
టి. టి. డి., తిరుపతి


ముఖచిత్రం: శ్రీ పద్మావతీ అమ్మవారు.

# సంపాదకీయం

మతం మనిషికి మత్తుమందులాంటిదన్నాడో మహనీయుడు. మతం సంగతలావుంచి మత్తుప్రభావం ఎలాంటిదో చూద్దాం. ఆరంభంలో అందరి మాదిరివున్న మనిషే, కైపు తలకెక్కేటప్పటికి చాలా విచిత్రంగా ప్రవర్తిస్తాడు. ఆ కాసేపు ఈ విశాలవిశ్వంలో తానే మగరాజు, మహారాజుననే భావం అతణ్ణి ఆక్రమిస్తుంది. ఎదుటివాడు ఎందుకూ పనికిరాని చవట అని, తానే సర్వజ్ఞుణ్ణనే దర్పం నిలువెల్లా నిండిపోతుంది. తన పై చేయి, నిరూపించుకోవటానికి. అందరికన్న పెద్దగా మాట్లాడటం, పోట్లాడటం, దారినపోయే ప్రతి దానయ్యమీద చేయిచేసుకోవటం, ఎదుటివాడు ఎదురుతిరిగి రెండంటిస్తే కైపు క్రిందికి దిగి, 'నువ్వా? ఎవరో అనుకొన్నా' అని దులపరించుకు లేచిపోవటం - ఇదీ సంతత సమస్యా వలయంలో తిరిగే సామాన్యుని కించిత్సరస విలాసప్రహసనం. నిజానికేది మితి మించి తలకెక్కినా అందరి స్థితి ఇదే. వాటి మదం అలాంటిది. అయితే ఈ గుణాలన్నిటిలోను 'మాకుందేటికు మూడేకాళ్ళనే తత్వం మతాభిమానులలో కాస్త మోతాదు మించి వుంటటంతో, తార్కికబుద్ధి తనకు తగదన్నట్లు ప్రవర్తిస్తుండటంవల్ల, మతం మనిషికి మత్తు మందని బుద్ధిమంతులు అనుకొని వుంటారు.

కాని భరతఖండమనిపేరుబడ్డ ఈ భూఖండం మాత్రం మొదటినుంచి ఈ ప్రవృత్తులకు దూరంగానే వున్నది. కారణం ఇక్కడిది ఒక మతం కాకపోవటమే. పరిణత బుద్ధులు, త్రికాలవేదులైన మహర్షులు సామాన్యమానవ జీవనంలోని సమాన విశేషాలన్నింటినీ క్రోడీకరించి, ఆ ఒరవడిలో ప్రవహింప జేసిన సంతత జీవనస్రవంతిలో ఆపాదమస్తకం మునకలిడిన దివ్యదేశం ఇది. కనుకనే గ్రీకులు, రోమనులు, హూణులు, శకులు, యవనులు ఇంకా ఎందరెందరో తమ బలదర్పాలతో ఈ అమృత వాహినికి అడ్డు గోడలు వేయాలని ప్రయత్నించినా, ఈనాటిదాకా నిశ్చల గంభీర నిర్ఝరిగా సాగివస్తున్నదంటే, అందుకు కారణం మహామనీషుల అంతర్మథనావిర్భూతమైన సుసంఘటిత జీవన విధానమనే చెప్పాలి. సర్వమానవ సమతాధర్మాలు సర్వత్రా పరివ్యాప్తమైనవన్న సత్యాన్ని గుర్తించారు కనుకనే విదేశీయులు దాదాపు అందరూ తమప్రత్యేకతను కాపాడుకుంటూకూడా భారతజనతాస్రవంతిలో అంతర్భాగాలుగా విలీనమయ్యారు. చీమలోని ప్రాణాన్ని చాటిచెప్పిన మహావీరుడు, అహింసే పరమధర్మంగా బోధించిన గౌతమబుద్ధుడు వెలసిన దివ్యదేశంగా మారింది ఈ దేశం.

మతవ్యాప్తికి కత్తిపదునే ఆదనుకొన్నవారి పరిపాలనలోకూడా చాలావరకు మానవత్వమే మనుగడ సాగించిందని చెప్పాలి. తాన్‌సేన్, బీర్‌బల్, గురునానక్, కబీర్. రాష్ఖాన్, జగన్నాథపండితరాయలవంటి మహామనీషులెంతమందో తమ ప్రతిభావిశేషాలతో జాతిని ఉత్తేజపరిచారు సార్వకాలిక సమాధాన సర్వస్వమైన భగవద్గీతను ఉపనిషత్తులను అరబ్బీలోనికి అనువదించాడా మొగల్ షహజాదా దారా! ఇంకా 50 ఉర్దూ అనువాదాలుకూడా భగవద్గీతకు వున్నాయంటే అందుకుకారణం రాజకీయపు రాజసపు తెరలు తొలగించుకొని ఈ జాతిమానవతా మాతృమూర్తిని తర్శించి తరించాలనుకునే తపనే! మాక్సుముల్లర్, అనిబిసెంటు, నివేదిత, గుండర్ట్. కిట్టెల్, కాల్డ్వెల్, బ్రౌన్ ఇంకా ఎందరో భారత ధర్మానికితోధికంగా సేవచేసి, జాతిచరిత్రలో చెరగని స్థానాన్ని సంపాదించుకున్నారు, ఈ నాటికికూడా భారతీయ శాస్త్ర నిధులమీద, విధులమీద ప్రామాణిక పరిశోధనలు జరుగుతున్నదికూడా, ఇక్కడికన్న అక్కడే ఎక్కువ.

కాని ఈ నాడు జరుగుతున్నదేమిటి? ఆ విశ్వమానవ సౌభ్రాతృసూత్రాలకు తీరని ఆఘాతం కలుగుతోంది. ఇంటా బయటాకూడా ఏదో ఒక రూపంలో విద్వేషానలం రగిలి మానవత్వానికే మారణం జరుగుతోంది. బుద్ధధర్మామృతాన్ని పానంచేసిన దేశంలో ఆ ధర్మాలకే కాలదోషంపట్టి, అనుకోలేని అత్యాచారాలు జరిగాయి. ఇంట భాషారోషాలకు కొందరు బలైతే, మతకల్లోలాల పేరిట మరికొందరు మరణిస్తున్నారు. సర్దుకొనిపోదగ్గ చిన్నసంఘటనలుకూడా చిలికి గాలివానగామారి ఎందరినో బలిగొంటున్నవి. నిజానికవన్నీమత కల్లోలాలా? ఇంత కల్లోలపూరితంగా ప్రతిరోజూ భయంతో చస్తూ బ్రతకమని ఏ మతమన్నా సిద్ధాంతీకరించిందా?

(48 వ పేజీలో)

# ధనుర్మాసం విశేషాలు

శ్రీ వి. కృష్ణమూర్తి

ధనుర్మాసమందు ప్రతిపల్లె, పట్టణము లందు గ్రామస్థులు ప్రతి ఉదయం భజనలు చేయుట ఆచారము. ముఖ్యంగా తిరుమల వంటి పెద్ద పెద్ద ఆలయాల్లో 'ఆండాళ్' ఉత్సవాలు మహావైభవంగా జరుపుతారు. దీనిని 'మార్గశిరోత్సవం' అంటారు. ఆండాళ్ లేదా గోదాదేవి శ్రీవిల్లిపుత్తూరు నందు పెరియాళ్వారు కుమార్తె. అతడొక రోజు తులసివనంలో పాదుచేయుచుండగా భూమి నుండి లభించినదట! ఆమెకు తండ్రి చిన్ననాటినుండి విష్ణువుయొక్క మహిమలను గురించేకాక, దేశములోని ప్రముఖ వైష్ణవదేవాలయాలు, వాటి ప్రాముఖ్యతను గురించి బోధించుటచే ఆమెకూడా మహాభక్తురాలై, తనను గోపికగాను, విల్లిపుత్తూరును వ్రేపల్లెగాను, [illegible] శ్రీరంగని శ్రీకృష్ణుడుగా భావించి పూజించెడిది. అంతేకాక ఈమె 'తిరుప్పావై' అనే ముప్పది పాశురములుగల కావ్యాన్ని వ్రాసింది. ఇది క్రీ. శ. 8వ శతాబ్దమునాటి రచన. ధనుర్మాసమునందు వైష్ణవ ఆలయములందు రోజుకొకటి చొప్పున ఈ పాశురములను 30 రోజులు అధ్యయనము చేస్తారు. ఈ పాశురములన్నియు వేమన పద్యములందు చివర 'వినురవేమ' అని ముగియుచున్నట్లే 'ఎలోరెంబావాయ్' అను పదముతో అంతమవుతాయి. ఈ పాశురములందలి చిట్టచివరి దానియందు రచయిత పేరుతోపాటు 'తిరుప్పావై' పఠించినచో కలిగెడి ఫలితములను గురించి కూడా తెలుపబడినది. ప్రముఖ వైష్ణవాచార్యులైన రామానుజాచార్యుల వారికి ఈ పాశురములన్నచో ఎంతో మక్కువట! అందుచేతనే ఇతడిని 'తిరుప్పావై జియ్యర్' అంటున్నారు. ఈ రచనకు ప్రసిద్ధ శైవాచార్యుడైన 'మాణిక్యవాచకర్' 'తిరువెంబావై' రచనకు పోలికలున్నవని పండితుల భావన.

గోదాదేవి (ఆండాళ్) చరిత్ర పాశురము లందును, ఆమె తండ్రి రచనయైన 'తిరుప్పాళం' మరియు శ్రీకృష్ణదేవరాయల 'ఆముక్తమాల్యద'లోను ఎంతగానో ముచ్చటించబడినది. గోదాదేవి చిన్ననాటి నుండి తండ్రి తోటనుండి తెచ్చిన పూలను మాల కట్టి, శ్రీరంగనాథునికి పంపెడిది. ఆమెకు వయస్సుతోపాటు స్వామిమీద ప్రేమకూడా పెరగసాగినది. ఆమె కట్టినమాలను మొదట తాను మెడలో ధరించి అందముగావున్నచో స్వామికి పంపెడిది. ఒకరోజు అలా పంపిన మాలలో పూజారులకు ఒక వెంట్రుక కనబడుటచే పూజారులు, పెరియాళ్వారును కేకలువేసి, దేవునికి సమర్పించెడి మాలను మొదట, మానవులు ధరించుట అశుద్ధముగా ఎంచికేకలేసి కుమార్తెను మందలించలేక ఆమరుసటిరోజు స్వామికి పూలహారము తీసుకెళ్ళలేదట! ఆరాత్రి స్వామి అతడి కలలో కనపడి, ఆండాలు ధరించిన మాలే నాకు అమిత ప్రీతిపాత్రమైనదని తెలుపగా, తిరిగి మునుపటివలెనే గోదాదేవిచేత మాలను కట్టించి శ్రీరంగనాథునికి సమర్పించెడివాడు.

పెరియాళ్వారు గొప్ప విష్ణుభక్తుడు. సాక్షాత్తు మహావిష్ణువే అతడికి ప్రత్యక్షమయ్యెడివాడట!

విష్ణుచిత్తుడు (పెరియాళ్వారు) రోజురోజుకు పెద్దగా ఎదుగుచున్న తన కుమార్తెకు వివాహము చేయుతలంచి, తగిన వరుని కొరకై వెదుకుచుండగా 'ఆండాళ్' స్వామినే భర్తగా భావించి, ధనుర్మాసమందు వేకువజాముననే లేచి తోడిచెలికత్తెలతో వెళ్ళి నదిలో స్నానమాడి ఒంటిపూట ఆహారముతో 'కాత్యాయని' వ్రతమాచరించగా, ఆమె చేసెడి పూజకు, భక్తితో పఠించెడి పాశురములకు మెచ్చి, ఆమె కోరిన

[47వ పేజీలో]



# తిరుమలలో తోట ఉత్సవం

శ్రీ గోపికృష్ణ



తోట ఉత్సవానికి వేంచేసిన ఉత్సవమూర్తులు.

తిరుమలలో 23-9-83 తారీఖున జరిగిన తోటఉత్సవము మునుపు జరుగుతూవచ్చి, మధ్యలో ఆగిపోయిన తోటవుత్సవ పునరుద్ధరణమే.

దేవస్థాన శాసనాలలో తోట తిరుణాళ్, తోపు తిరుణాల్ అని వ్యవహరింపబడిన ఈ వుత్సవము మొట్టమొదట సాళువ నరసింహుని కాలములో (సంపుటము 2, శాసనము 113) 17-2-1494 తారీఖునాటి శాసనములో కనిపిస్తుంది. చంద్రగిరి నివాసుడయిన, హారీతగోత్ర, అశ్వలాయనసూత్ర, నియోగి-తిమ్మన దండనాయకుడిదయిన యీ శాసనములో, తోటవుత్సవము 20 రోజులు జరిగేట్టు ఉత్సవము ప్రారంభమయిన రోజు తదుపరి పదునొకండవ రోజు తిమ్మన దండనాయకుడు శ్రీవారికి కైంకర్యము ఏర్పాటు చేసినట్టు పేర్కొనబడింది.



తోట ఉత్సవం జరిగిన చంద్రగిరిలోయ ప్రాంతంలోని నాగయ్యాన్ రాతితేరు మండపం.

శ్రీకృష్ణదేవరాయల కాలమునాటి అనగా 15-9-1512 తారీఖు శాసనములో (సంపుటము 3, శాసనము 28) తిరుపతి సమీపము నరసింగాపుర నివాసి పండయారం శెన్నము శెట్టియార్ కుమారుడు పప్పుశెట్టి అయ్యాన్ తిరుపతి శ్రీ గోవిందరాజస్వామి, తిరుమల శ్రీవారు తన తోటలలోని మండపములకు విచ్చేసినపుడు తిరుమల తిరుపతులలో జరుగవలసిన మర్యాదలను విడివిడిగా పేర్కొన్నారు. శాసనాలలో పేర్కొనబడిన రెండవ తోటవుత్సవము యిది.

అచ్యుతదేవరాయల కాలములో 6-3-1536 తారీఖునాటి శాసనములో (సంపుటము 4, శాసనము 73) శ్రీ పరాశర భట్టాచార్య శిష్యుడయిన మట్ల మల్లయ్యార్ కుమారుడు రామయ్యాన్, రామభట్ట తోటవుత్సవము - రామచంద్రదీక్షిత తోటోత్సవము - అప్పాపిళ్లై తోటవుత్సవములకు ఉభయములు ఏర్పాటుచేసినట్టు వ్రాయబడివున్నది.

ఐదవ సంపుటములోని 18 నంబరు శాసనములో బయ్యప్పనాయకర్ తోటవుత్సవము, 19 శాసనములో కుమారపల్లికి చెందిన కట్ల కొండమనాయకర్ కుమారుడు మూర్తి నాయకర్‌కు చెందిన కట్ల కొండమనాయకర్ కుమారుడు సదాశివ రాయల కాలమునకు చెందిన (తారీఖు 7-8-1954) యీ శాసనము తోట ఉత్సవమునకు చెందిన ఒకే ఒక సంపూర్ణ శాసనము.

తిరుమల తోట ఉత్సవము జరుగు వంసిన క్రమము, శ్రీ మలయప్ప స్వామికి, నాచ్చార్లకు (శ్రీదేవి, భూదేవి), కృష్ణస్వామికి విష్వక్సేనుల వారికి, భాష్యకారుల వారికి, (శ్రీ రామానుజ స్వామికి) జరుగ వలసిన ఉభయములు, మర్యాదలు, సమర్పించ వలసిన పదులు—పడి దిట్టములు, మొదలగు కైంకర్యము లన్నియు సవివరముగా పేర్కొన బడినది.

ఈ ఉత్సవము ఖర్చులకు గాను మూర్తి నాయకర్, రాజేంద్రసింగ్ నెల్లూరులో 50 సువర్ణ రేఖై పన్‌లు, పుదిపట్ల కోనేటి కాల్వలో 25 రేఖై పన్‌లు మొత్తం 75 రేఖై పన్‌ల ఆదాయము వచ్చు భూమిని కొని తిరుమల శ్రీ భాండారమునకు సమర్పించినాడు. ఆ 75 రేఖై పన్‌లు దేని కొరకు ఎంత ఖర్చు పెట్టవలయునో కూడ శాసనములో తెలియ జేయ బడినది.

మూర్తి నాయకర్‌చే కొనుగోలు చేయ బడి, సాగు చేయబడుతున్న పూదోటలో, నిర్మించిన మంటపంలో శ్రీవారు, ఉభయ నాంచార్లు, శ్రీకృష్ణుడు, సేనాధిపతులవారు, శ్రీ రామానుజుల వారు–తాళ్లపాకం తిరుమలయ్యంగారు ఏర్పాటు చేసిన ఆని బ్రహ్మోత్సవము (జూన్–జూలై) అంకురార్పణం నాడు, శ్రవణ నక్షత్రయుక్త ముహూర్తంలో ఆసీనులు అవుతారు. తదుపరి పునుగు చందనాదులతో వారికి తిరుమంజనం జరుగుతుంది. తదుపరి అలంకారం, అవతల నైవేద్యం, హారతులు, శకారి యీ క్రమం–యిప్పటికి యీ క్రమంలోనే అన్ని జరుగుతాయి. ఇటీవల జరిగిన తోటోత్సవం కూడ యీ విధంగానే జరిగింది.

తోట ఉత్సవము ఆ పేరిట జరగడం చివరిసారిగా వేంకటపతి రాయల కాలంలో 31–3–1606 తారీఖు శాసనంలో చూడవచ్చు. (6–వ 13–వసం॥ శాసనము). విజయనగర కోశాధిపతి అయిన బొక్కసం కృష్ణయ్య తన తండ్రి అయిన బొక్కసం నరసయ్య పేరిటనున్న పూదోటమండపములో దానిని




జరిపించినాడుగాని అవతల అది నవాబుల కాలంలోగానీ, కంపెనీవారి పాలనలోగానీ, మహంతుల ఆధ్వర్యంలోగానీ జరిగినట్టు దాఖలాలులేవు, దాదాపు 400 సంవత్సరాల తరువాత 1983 లోనే జరగడం.

తోటఉత్సవం ఆ పేరుతో జరుగక పోయినా, తిరుమల శ్రీవారు తిరుమలలోని కొన్ని ముఖ్య ప్రదేశాలను దర్శించడం; వనభోజనం వంటి ఉత్సవాలన్నీ తోట ఉత్సవాల క్రిందికే వస్తాయి.

తిరుచానూరు పద్మావతి అమ్మవారు శుక్రవారపు తోట విచ్చేయుటం, తిరుపతి గోవిందరాజస్వామివారి పాన్నుకాలవ మహోత్సవం. తిరుమల శ్రీవారు పురిశవారి తోటకు, మైసూరుమహారాజావారితోటకు, విచ్చేయుడం వంటి ఉత్సవాలన్నీ తోట ఉత్సవాల క్రిందనే లెక్క.

గతరెండు సంవత్సరాలనుంచీ ఆలోచించి యీ ఉత్సవాన్ని యిప్పుడు పునరుద్ధరించారు. మూడు సంవత్సరాలకు ముందు శ్రీపుష్పయాగమహోత్సవం అదే విధంగా పునరుద్ధరించబడింది. ఈసారి యీ ఉత్సవం క్రీ. శ. 1527 నాటి దయిన తిరుమల రాతితేరుమండపంలో నిర్వహించ బడింది. (ఆనాటి ఆ మంటప అలంకరణలు ఫోటోలలో చూడవచ్చు.)

## పూదోట!

కనువుల పండువుగాగ!
కల్పతరువులు నాటి!
వెంకన్న వేసెనొక!
వెలలేని పూదోట!!

వేదాలు మూలాలు!
వెంకన్న పాదాలు!
వెలసినవి యాతోట।
వెలిగినవిపూదోట!!

కమ్మకమ్మని కథలు!
గద్యాలు! పద్యాలు!
గీతాలు! గేయాలు!
గిరుల విరిసినపూలు!!

పంచవిధముల పూలు:
అలరారు నాతోట!
ముక్తికాంతను గూడ!
మురిపించు ప్రతిపూట!!

ఆ పూల గమగమలు!
పూదోట ఘుమ ఘుమలు!
పర్వినవి ప్రతిచోట!
ప్రాకినవి ప్రతివీట!!

అకలంకమగు భక్తి!
సకల జనులగూర్చి!
సాయుజ్య మందించు!
“సప్తగిరి” యాతోట!!

— శ్రీ జి. నాగశేషయ్య

# హిందూత్వమే భారతీయత

— శ్రీ కెప్టన్ షేక్ మౌలాలి

ఒక జాతి యుగయుగాల అనుభవాల సమ్మేళనంతో ఒక సమ్యక్ దృక్పథం ఏర్పరచుకుంటుంది. కాలగమనంలో ఆ దృక్పథం ఆ జాతి సంస్కృతిగా మారుతుంది. సంస్కృతి పునాదుల మీదనే జాతి జీవనసౌధం ఆధారపడి ఉంటుంది.

భారత సంస్కృతికి మూలం వేదాలు. 'వేద' శబ్దానికి అర్థం "జ్ఞానం" ఋగ్వేదములో "ఆ నో భద్రాః క్రతవో యంతు విశ్వతః" అన్న సూక్తి చాల ప్రసిద్ధిచెందింది. విశ్వంలో అన్ని వైపులనుండి మాకు ఉదాత్తభావాలు కలుగుగాక అని అర్థం. అంటే భారతీయులు ఆదినుండి జ్ఞానపిపాసులు అని మనకు స్ఫురిస్తుంది. అంతేగాక ప్రకృతి తత్త్వాలను ఆవాహన చేసినది మొదటగా భారతీయులు. సూర్య, వరుణ, ఇంద్ర, బృహస్పతి, విష్ణు, బ్రహ్మ, రుద్ర, వాయు తత్త్వాలను ఆరాధించారు. విశ్వానికి ఆధారతత్త్వమైన విరాట్‌స్వరూపాన్ని "పురుషుడన్నారు-" 'విశ్వమేవేదః' పురుష స్తద్విశ్వ ముపజీవతి!

శాశ్వత అమృత స్వరూపుడు—
పురుష ఏవేదగ్‌ం సర్వం
యద్భూతం యచ్చ భవ్యం।
ఉతామృతత్వ స్యేశానః
యదన్నే నాతి రోహతి ॥

ఆ పురుషుని- స బ్రహ్మ స శివస్సహరి స్సేన్ద్రః పరమ స్వరాట్' అని వివిధనామాల తో కీర్తించారు.

అయితే వేదవాఙ్మయంలో 'ధ్యానం' తో పాటు "ఆచరణ"కు ప్రాధాన్యత యివ్వబడింది. ఋతము, సత్యము, తపము మున్నగు వాని ఆచరణకు ఎంతగానో ఉగ్గడించటం జరిగింది.

"సత్యాన్న ప్రమదితవ్యం
ధర్మాన్న ప్రమదితవ్యం."

అంటూ జీవన పరమావధి చెప్పబడింది.

జ్ఞాన పిపాసత్వంలో ఆనాడు ఎవ్వరూ కూడ మతాన్ని గురించి ఎక్కువగా ఆలోచించలేదు. "ధర్మ" శబ్దం బహుళప్రచారంలో ఉండేది. 'వేద' 'భారత' అనే పదాలు జాతీయంగా వాడబడుతుండేవి. "గుణకర్మ" లను బట్టి అన్నివృత్తులకు గౌరవస్థానమివ్వబడింది—

"బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్
బాహూ రాజన్యః కృతః।
ఊరూ తదస్య యద్వైశ్యః
పద్భ్యాగం శూద్రో అజాయత ॥"

పురాణ యుగం వచ్చేసరికి వృత్తిని బట్టి కులాలు చోటుచేసుకున్నాయి. 'భారత' శబ్దం ఎక్కువగా వ్యాప్తిచెందింది. ప్రజలలో భక్తి ప్రవృత్తులు వ్యాప్తిచేసే నిమిత్తం అవతార హేతువులు చెప్పబడ్డాయి. విశ్వవ్యాప్తంగా భారత సంస్కృతికి ఆదరణ లభించింది.

కాల గమనంలో మనదేశం కొన్ని శతాబ్దాలు బానిసత్వం అనుభవించాల్సివచ్చింది. 'భారతీయత,' 'హిందూత్వం' గా మారింది. ఉచ్చారణ సౌలభ్యం కొరకు" "సింధు" ప్రాంతం వారిని "హిందువులని మొదటగా అన్నది ముస్లిములు. పర్షియన్ భాషలో 'హిందూ' శబ్దానికి- భారతదేశంలో ఇస్లాము మతేతరులు—అని అర్థం. తర్వాత వచ్చిన ఆంగ్లేయులు 'ఇండియా' 'ఇండియన్స్' అని సంబోధించారు.

రాజకీయ, సాంఘిక పరిణామాలు తప్పక సంస్కృతి మీదపని చేస్తాయి. కాని అది కొంతవరకు మాత్రమే! ఆసియాలోని అనేక దేశాల్లో వ్యాప్తిచెందిన 'బౌద్ధమతము' 'హిందూధర్మంలో' ఒకభాగంగా గుర్తించబడింది. మన దేశంలో జైన, శిక్కు, ముస్లిము, క్రైస్తవ మొదలైన ధర్మావలంబులుకూడ చాలవరకు హిందూధర్మ విధానాలు అవలంబిస్తారు. కారణం వీరందరూ భారతీయులు కావటమే! భారత లేక 'హిందూ' తత్త్వం ఏ ఒక్క నిర్దిష్ట సమయంలో కాని, ఏ ఒక సంప్రదాయంనుండి కాని లేక ఒక్క ప్రవక్తనుండీ గాని రాలేదు. పృథివ్యాపస్తేజో వాయురాకాశాల్లాగ ప్రకృతి సిద్ధంగా వచ్చింది.

అద్వైతారాధనకు ఆచారాల ఆర్భాటాలు అడ్డురావు. అందుకిదే నిదర్శనం సం॥

మహాసముద్రంలో సుడిగుండాల్లాగ కొన్ని బలవత్తర కారణాల మూలాన భారత సంస్కృతిలో సందర్భాను సారంగా కొన్ని ఒడుదుడుకులు వచ్చాయి. కాని అవి అతి స్వల్పం, నామమాత్రము. మనదేశంనుండి ఒకవ్యక్తి విదేశాలకు వెళితే అతని మతానికి భాషకు, ప్రాంతానికి ప్రాధాన్యం ఉండదు. అతడు మొదట 'భారతీయుడు,' 'హిందూదేశీయుడు' గానే గుర్తింపబడతాడు. అతనికి తెలీకుండనే "భారతీయత" బహిర్గతమౌతుంది.

భారతీయత లేక హిందూత్వం ఒక సాంస్కృతిక మహావృక్షం. మతాలుదాని ప్రధాన శాఖలు. కులాలు, జాతులు, ఉపజాతులు- దాని కొమ్మలు, రెమ్మలు అనుకోవచ్చును. ఋతుక్రమాన్ననుసరించి ఆ మహావృక్షం కొన్ని అల్పమైన మార్పులకు లోనైనప్పటికి. విశ్వవ్యాప్తంగా దాని సుగంధాన్ని వెదజల్లుతూ ఉంటుంది అందుకే ప్రతి "హిందువు" నిత్యం—

ఓం సహనా వవతు
సహనౌ భునక్తు
సహ వీర్యం కరవావహై
తేజస్వినావధీత మస్తు
మా విద్విషావహై

ఓం శ్శాంతి శ్శాంతి శ్శాంతిః ॥

అని ధ్యానిస్తుంటాడు. ఇట్టి ఉదాత్తభావాలు విశ్వసాహిత్యంలో మరెక్కడా కనుపించవు. అయినా మనకు తృప్తిలేదు. ఇంకా ముందుకు వెళ్ళాలి అనే భావంతో —

అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతం గమయ ॥

అని సత్యం, జ్ఞానం, అనంత స్వరూపుడైన పరబ్రహ్మతత్త్వాన్ని సర్వదా ప్రార్థిస్తుంటారు ఇదే మన....సంస్కృతి.



# శ్రీమద్భగవద్గీత

(సీరియల్)

వ్యాఖ్యాత :

శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి

## ఏడవ అధ్యాయం - విజ్ఞానయోగం

శ్రీ భగవానువాచ :

మయ్యాసక్తమనా: పార్థ ! యోగం యుఞ్జన్మదాశ్రయః ।
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు ॥

శ్రీ భగవానుడు : అర్జునా ! మనస్సు నా మీదే నిలిపి నన్నే ఆశ్రయించి, ధ్యానయోగాన్ని ఆచరిస్తూ సంశయం లేకుండా, సమగ్రంగా నన్ను ఎలా తెలుసుకోగలవో వివరిస్తాను విను.

జ్ఞానం తేఽహం సవిజ్ఞానం ఇదం వక్ష్యామ్యశేషతః ।
యద్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్యమవశిష్యతే ॥

బ్రహ్మజ్ఞానాన్ని గురించి నేను నీకు (స్వానుభవంతో) సంపూర్ణంగా చెబుతాను. దీనిని గ్రహిస్తే ఈ లోకంలో నీవు మళ్లీ తెలుసుకోదగిందేమీ వుండదు.

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥

ఎన్నో వేలమందిలో ఏ ఒక్కడో యోగసిద్ధి కోసం ప్రయత్నిస్తాడు. అలా ప్రయత్నించి సాధకులైన వాళ్లలో కూడా నన్ను నిజంగా తెలుసుకున్న వాడు ఏ ఒక్కడో వుంటాడు.

భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా ॥

నా మాయాశక్తి ఎనిమిది విధాలుగా విభజించబడింది. అవి: భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశం, మనస్సు, బుద్ధి, అహంకారం.

అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్ ।
జీవభూతాం మహాబాహో ! యయేదం ధార్యతే జగత్ ॥

అర్జునా ! ఇప్పుడు చెప్పింది అపర ప్రకృతి. జీవరూపమై ఈ జగత్తునంతటినీ ధరిస్తున్న నా మరో ప్రకృతి ఇంతకంటే మేలైనదని తెలుసుకో.

ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా ॥

నా ఈ రెండు ప్రకృతులనుంచే సమస్త భూతాలూ పుడుతున్నాయని గ్రహించు. అందువల్ల సర్వజగత్తూ ఆవిర్భవించడానికి, అంతం కావడానికి కారణం నేనే.

మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ ! ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥

ధనంజయా ! నా కంటె ఉత్కృష్టమైన దేదీ లేదు. దారం మణులను హారంగా కలిపి నిలిపినట్లు నేనే ఈ సమస్త జగత్తుని ధరిస్తున్నాను.

రసోఽహమప్సు కౌంతేయ ! ప్రభాఽస్మి శశి సూర్యయోః ।
ప్రణవస్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥

కౌంతేయా ! నేనే నీటిలో రుచిగా, సూర్యచంద్రులలో కాంతిగా, సర్వవేదాలలో ఓంకారంగా, ఆకాశంలో శబ్దంగా, నరులలో పురుషకారంగా వున్నాను.

పుణ్యో గంధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ ।
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు ॥

నేలలోని సుగంధం, నిప్పులోని తేజస్సు, సర్వభూతాలలోని ఆయుస్సు, తపోధనులలోని తపస్సు నేనే.

బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ ! సనాతనమ్ ।
బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినామహమ్ ॥

పార్థా ! సమస్తజీవులకూ మూలకారణం నేనే అని తెలుసుకో. బుద్ధిమంతులలోని బుద్ధీ, తేజోవంతులలోని తేజస్సూ నేనే.

బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్ ।
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ ! ॥

బలవంతులలోని ఆశ, అనురాగం లేని బలాన్ని నేను. ప్రాణులలోని ధర్మ విరుద్ధం కాని కామాన్ని నేనే.

యే చైవ సాత్త్వికా భావా రాజసాస్తామసాశ్చ యే ।
మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి ॥

సాత్త్విక, రాజసిక, తామసిక భావాలన్నీ నా వల్లనే కలిగాయని తెలుసుకో. వాటిలో నేను లేను; నాలో అవి వున్నాయి.

([illegible] వ పేజీలో)

# గోపికావస్త్రాపహరణం

రాత్రి పదకొండు గంటలైంది. చదివే భగవద్గీత మూసేసి, కళ్లజోడు ప్రక్కన పెట్టాడు – రాజయ్య.

బాలాయ నీలవపుషే నవకింకిణీక
జాలాయ రమ్యజఘనాయ దిగంబరాయ,
శార్దూల దివ్యనఖ భూషణ భూషితాయ
నందాత్మజాయ నవనీతముషే నమస్తే.

అని నమస్కారం చేసి కళ్లుమూసుకున్నాడు. ఇంకా కునుకు పట్టలేదు- నవనీత విలిప్తాంగో నవనీతనటోఽనఘః, నవనీత నవాహార ముచికుందప్రసాదకః .... .... అలాఅలా....జలక్రీడా సమాసక్త గోపీవస్త్రాపహారకః దాకా వచ్చాడు! ఒకదాటిదాని వేళ కామోసు. తనకు తెలియకుండానే మనసు నవ్వేసింది. రాజయ్య మాగన్నుగా పడుకున్నాడు.... ఇటునుంచి అటు దొర్లబోతే, జుత్తుముడి వూడి, నులకమంచం కోడుదగ్గర ఇరుక్కుపోయిందేమో, రాజయ్యకుమెలకువ వచ్చింది- ఆశ్చర్యమేసింది .... ఇంతలో ఏదో నవ్వు వినిపించింది తలవైపున రాజయ్య వెనక్కితిరిగిచూశాడు........ "చేత వెన్నముద్ద చెంగల్వ పూదండ, బంగారు మొలతాడు, పట్టుదట్టి, సందెతాయితులును, సరిమువ్వగజ్జల"తో చిన్నికృష్ణమ్మ, చిరునవ్వులు చిందుతూ, చిందులు వేస్తున్నాడు. జుత్తుముడి, ఊడిపోవడం, నులకలో ఇరుక్కుపోవడం, రాజయ్య ఎన్నడూ ఎరగడు! ఇదాకొంటె గోపాలునిపనే, అనుకుని సాభిప్రాయంగా. కృష్ణుడి వంక చూశాడు, నమస్కరిస్తూ! వెన్నకృష్ణుడు చేయి జాపాడు........ వెన్నతిను అన్నట్టు నాకోసం తెచ్చావా నందగోపాలా అన్నాడు- కళ్లజోడుపెట్టుకుంటూ:

"ఈ వెన్న నీదే"–అన్నాడు పరమాత్మ

'మా ఇంట్లో ఇప్పుడు పాడి లేదే'- అన్నాడు రాజయ్య.

"నీ మనసు పాడిలోనే వుందే" అన్నాడు పరమాత్మ–

రాజయ్యకి పాడి అంటే, ఆవుపాడి, గేదెపాడి తెలుసు....అంతిమయాత్ర చేయించే రెండు కర్రల సాధనం తెలుసు. రాజయ్య శబ్దరత్నాకరం చదవలేదు– అమాయికంగా అనేశాడు!- పరమాత్మ అభిప్రాయం అర్థం గాని అయోమయంలో........

స్వామీ! తాము అక్షర పరబ్రహ్మయోగం ఉపదేశించినవారు. నేను అక్షరజ్ఞానంలేని పామరుణ్ణి- నానార్థాలు నాకు తెలియవు. తెలిసేట్టు చెప్పమన్నాడు.

పాడి అంటే, న్యాయం, ధర్మం అన్నాడు పరమాత్మ.

'అమ్మదొంగా' అన్నాడు కొంచెం ఉప్పు అందిన రాజయ్య-

'నేను దొంగను కాదు'

'పాల దొంగవు........'

'కాదు పాపాల దొంగను-'

"నందబాలా! బాలగోపాలా! భక్త పరిపాలా! .... అన్నాడు రాజయ్య........ అతని గొంతుగాద్గదికమైంది. శరీరం పులకాంకితమైంది, కళ్లవెంట ఆనంద బాష్పాలు స్రవిస్తున్నై. తలవంచి నమస్కరించాడు. కన్నీళ్లన్నీ కళ్లజోడుమీద అలుముకున్నై. అతనికళ్ళకు, వినీలశూన్యం.... కళ్లుమిరుమిట్లుగొల్పే, ఒకమహాప్రకాశం మాత్రం కనిపిస్తోంది- శ్రుతితో కొన్ని వేణువులు, శ్రుతిభేదంచేసి కొన్ని వేణులు - (Melody, Discord, Concordలో,మరి కొన్ని వేణులు) వినిపిస్తున్నై.... ఒకవ్యక్తావ్యక్త అతిలోక ఆనంద రసానుభూతిలో, అవస్థాత్రయ నిర్ముక్తమైన ఒక మాధురీమయ, వినూత నానుభూతిలో వున్న అతని మనస్సుకు, ఏనుగంత బరువు తనప్రక్కన దూకినట్టు అనిపించింది.... చివాలున మంచంమీద నుంచి ఇవతలకివచ్చాడు. కళ్లజోడుతీసి,తడి అద్ది, తనకళ్ళుగూడ తుడుచుకుని చూశాడు- మంచంమీద వంశీకృష్ణుడు కూచుని వున్నాడు- తననుకూడా ప్రక్కన కూర్చోమన్నాడు........ "నీ సమీపంలో నిలవడానికైనా అర్హతలేనివాణ్ణి" అన్నట్టు చూశాడు రాజయ్య. 'పరవాలేదులే కూచో' అని మురళీ కృష్ణుడు చోటుచూపించాడు- రాజయ్య అల్లంత దూరాన కూచున్నాడు– కాళ్ళదగ్గర........

"నన్ను చీరల దొంగ అన్నావుగదూ!....

రాజయ్య లెంపలు వేసుకున్నాడు—

'తెలియక....' అంటూ—

"తెలిసో, తెలియకో అన్నావుగదా—"

'అన్నాను' అన్నట్టు తల ఆడించాడు బిక్కమొహంవేసి!....

"వెన్నల దొంగవు, చీరలదొంగ"వని, నీమీద ఎన్నో నేరాలు నమోదై ఉన్నాయి."

"అవన్నీ అబద్ధం"........

"అయితే అసలు విషయం మీరే చెప్పండి."

"వెన్న అంటే ఆనందం- రాజయ్యా- నన్ను ఆశ్రయించిన భక్తులు, తమ భక్తి పారవశ్యంలో, అనుభవించే పరమానందం........

పరమాత్మ ఎక్కడ తేలుస్తాడో అర్థం గాని రాజయ్య, తీవ్రమైన ఆసక్తితో వింటున్నాడు— "మనసనేది పాలకుండ లాటిది. దానిని భక్తి అనే కవ్వంతో చిలికినప్పుడు, ఆనందమనే వెన్న లభిస్తుంది- ఆ వెన్నే నేను నేస్తాలకు తినిపించాను, గోపికల మూతులకు రాశాను.... నా నేస్తులందరూ నా భక్తులు, గోపికలందరూ నామీద అనురక్తులు! రక్తిముదిరితే భక్తి భక్తి కుదిరితే - విముక్తి........ అన్నాడు పరమాత్మ!........

కృష్ణుడి కళ్లు భగవద్గీత వైపువెళ్లినై. మురళితో ఆపుస్తకంచూపిస్తూ........

ఇది చదివావా?.... ఇందులో 'వాసాంసి' గుర్తుందా?.... అన్నాడు పరమాత్మ!.... అసలే సంస్కృతం రాని రాజయ్య, కొన్ని వందల శ్లోకాల పుస్తకంలో, వాసాంసి అంటే, ఏం చెబుతాడు. కళ్లు తేలేశాడు! .... "తెలిసేట్టు,తెలుగులో సెలవివ్వండి" అన్నాడు.... "ఏముందయ్యా, చిరిగిపోయిన బట్టలు అవతలపారేసి, కొత్త బట్టలు కట్టుకుంటాడు మానవుడు. అలాగే, కొరమాలిన బడుగు దేహాన్ని వదలివేసి, కొత్త శరీరం ధరిస్తాడు జీవాత్మ ........ అంటే - బట్టలు. శరీరానికి ఒక సంకేతం - తెలిసిందా?" తల ఆడించాడు. రాజయ్య—

"చెట్టు, కాలానికి ఒక సంకేతం........ అయనాలు, ఋతువులు- మాసాలు పక్షాలు లాటివి కొమ్మలు, రెమ్మలు, ఆకులు, చివుళ్లు మొదలైనవి. ఈసారి భారతం చదివినప్పుడు, మాడు శాంతి అనుశాసనిక పర్వాల్లో దొరుకుతుంది........

బట్టలు చెట్టెక్కి పోయినై అంటే, శరీరం కాలధర్మం చెందుతుంది అని సంకేతం. తెలిసిందా?"

'అలాగా' అన్నట్టు తల వూపాడు రాజయ్య—

'సంసారాఖ్యే-మహతి జలధౌ"-చదివావుగా!

"తృష్ణాతోయే, మదనపవనోద్ధూత మోహోర్మిమాలే"

"ఆ! అదే అదే".... మాయాసంసారమనే మహాసముద్రంలో లోతుకుపోయిన కొద్ది మునిగిపోవడమే-జలధి అయినా,యమునా జలప్రవాహమైనా. జలాశయమైనా. నీళ్లు, మాయకు సంకేతం- అందులోనుంచీ బైట పడాలి........

"గోపికలు జీవాత్మలకు సంకేతం- వాళ్లను మాయలోనుంచీ బైట పడమన్నాను.... పదిమందిలో పలుచనై పోతామని భయపడ్డారు- ఎవరీ పదిమంది? పంచ కర్మేంద్రియాలు, పంచజ్ఞానేంద్రియాలే!.... కొందరు నలుగురిముందు నవ్వులపాలై పోతామనుకున్నారు – ఎవరీ నలుగురు? మనోబుద్ధి చిత్త అహంకారాలే! .... ఇవన్నీ దేహానికి సంబంధించినవే! .... ఈ దేహాభిమానం వదులుకోండి! బైటపడండి అని చెప్పాను—

రాజయ్య ఏకాగ్రచిత్తుడై వింటున్నాడు.

కొందరు మాయలోనుంచి బైట పడతామని ముందుకు వచ్చారు. కాని దేహాభిమానం పూర్తిగా వదలక పోవడం వల్ల, కుచాలు ఒక చేత కప్పుకుని, మానాన్ని ఒకచేత దాచుకుని వస్తున్నారు....

"అదేం లాభం లేదు, మానాభిమానాలు మమతలు పూర్తిగా మరచి పోవాలి, రెండు చేతులెత్తి నమస్కరిస్తూ రండి. మనస్సు నామీదే లగ్నంచేసి, నా పాదాలు ఆశ్రయించిన వాళ్లను నేను రక్షిస్తాను. వాళ్ల యోగక్షేమాలు చూస్తాను అని చెప్పాను...."

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే" .... అన్నాడు రాజయ్య.

"అక్షరాలా అదే-అదే నేను చేసిన వాగ్దానం ఇదే నేను చేసిన గోపీ వస్త్రాపహరణ నేరం" ....అన్నాడు పరమాత్మ....

"అపార్థం చేసుకున్నాం" అన్నాడు రాజయ్య....

"తప్పు నీది కాదులే!....మీ పౌరాణికుడు కొంచెం చతురుడు! .... పురాణంలో ఆపాటి శృంగార దృశ్యాలు లేకపోతే, ఎవరూ వినరు అనుకుని వుంటాడు."

రాజయ్యకు కూడ చిన్న నవ్వు వచ్చింది. శ్రీకృష్ణుడు 'సినిమా'లను గురించి మాట్లాడుతుంటే-"ఇంకో చిన్న విషయంకూడ వుందిలే రాజయ్యా—"

ఏమిటి స్వామీ!....

మూడేండ్ల పిల్లవాడికి...."సొంత లాభం కొంత మానుకు, పొరుగు వాడికి పాటు పడవోయ్" అని చెప్పావనుకో.... వాడికేం బుర్ర కెక్కుతుంది....అందువల్ల తాత్తయ్య మనమణ్ణి ఒళ్ళో కూచో పెట్టుకుని కాకమ్మ పిట్టమ్మ కథ చెబుతాడు....

పిట్టమ్మా పిట్టమ్మా తలుపు తియ్ అంటుంది కాకమ్మ....నా మొగుడికి అన్నం పెడుతున్నా—నా పాపకు నీళ్లు పోస్తున్నా, నిద్ర పుచ్చుతున్నా అని ఎగర కొడుతుంది.... పాపం కాకమ్మ వానలో తడిసి పోతుంది. చలిలో వణికి పోతుంది అని కాకి బాధ చెబుతాడు తాతయ్య....

"గాలి వాన ఇంకా పెద్దదై పోయింది. కొమ్మ విరిగింది-పిట్టమ్మ గూడు పడిపోయింది .... కొమ్మల మధ్య పిట్టమ్మ గూడు చితికి పిట్టమ్మ చచ్చి పోయింది కాకమ్మ "రివ్వున" ఎగిరిపోయింది అని నొక్కి చెబుతాడు. .... కథ అక్కడ ఆగినా విషయం అయి పోలేదు. "ఎంతసేపు నువ్వూ నీ సంగతే గాదు, చెల్లెమ్మ సంగతి" కూడా చూడాలి. నీ చాక్లెట్టు అంతానువ్వే తినకూడదు. చెల్లెమ్మకు కూడ కొంచెం పెట్టాలి....లేకపోతే".... అంటాడు తాత. "కాకి తన్నుకు పోతుంది" అంటాడు మనవడు! "మనవడికి విషయం బోధ పడింది" అని సంతోషిస్తాడు తాతయ్య....ఇలా పిట్ట కథలుగా చెబితే, సులభంగా బుర్ర కెక్కుతుంది. కాస్త శృంగారంకూడ జోడిస్తే ఆసక్తితో వింటారని వాళ్ళ నమ్మకం"-అన్నాడు పరమాత్మ....

గంగిరెద్దు లాగా తల ఊగించాడు రాజయ్య....

"ఇక మీద భారత భాగవతాల్లో, పిట్ట కథలు వచ్చినపుడు ఈ దృష్టితో చదువు ... కొన్ని ద్రాక్షా పాకంగా తెలిసిపోతే, కొన్ని నారికేళ పాకంలాగా, పెచ్చు వలిచి, కాయ కొడితే గానీ విషయం అందదు...." అన్నాడు పరమాత్మ....

"భాగవతంలోదే, ఒక పిట్ట కథ చెప్పి ఎలా అన్వయించుకోవాలో చెబితే ఇకమీద అలా ప్రయత్నిస్తా" అన్నాడు వినమ్రుడై వింటున్న రాజయ్య....

'రాజయ్యా, గజేంద్ర మోక్షం నీకు తెలుసుగా' అన్నాడు పరమాత్మ....

'కొన్ని పద్యాలు కంఠఃపాఠం'

"ఏ మర్థమైంది"

'పామరుణ్ణి' అని ఒక్క ముక్కలో చెప్పేశాడు రాజయ్య!—

'జలధి, జలాశయం, ఏదైనా ఈ మాయా ప్రపంచానికి ఒక సంకేతం అని చెప్పాను గదా'

(37 వ పేజీలో)

# వెలుగుబాట

డా॥ వంశూరి రామకృష్ణమాచార్యు

## విశ్వజనీన మతం

ఆధునిక వైజ్ఞానికయుగంలో మానవుడు కన్ను తెరచిచూచేసరికి కనిపించేది పగలైతే సూర్యుడు, రాత్రి అయితే నక్షత్రాలు. నిజానికి పగలుకూడా ఆకాశంనిండా నక్షత్రాలు ఉంటాయి. దృగ్విధీ యంత్రంలో చూస్తే కనిపిస్తాయి. ఆకాశంలో ఉండే అనంతకోటి తారామండలాలలో సూర్యుడు ఒకానొక చిన్ని నక్షత్రం! ఆ నక్షత్రంచుట్టూ కోటానుకోట్ల సంవత్సరాలనుండి పరిభ్రమిస్తున్న ఒక చిన్న మట్టిగోళీ మానవులు ఉండే ఈ భూమి! మన సౌరకుటుంబం ఉన్న "పాలపుంత"లో కోటానుకోట్ల నక్షత్రాలు ఉన్నాయి! పాలపుంత కేంద్రం నుండి బయలుదేరిన ఒక నక్షత్రకాంతి కిరణం పరిధిని చేరేందుకు–సెకనుకు కొన్ని వేల మైళ్ళ వేగంతో పయనిస్తున్నప్పటికి-36 లక్షల కోట్ల సంవత్సరాలు పడుతుందట॥ సృష్టివైశాల్యం ఊహాతీతం! భూమి ఒక నిమ్మకాయ అనుకుంటే- సూర్యుడు ఒకపెద్ద గంప అనుకుంటే- ఆ గంపలో కొన్ని లక్షల నిమ్మకాయలు పడతాయి! సూర్యుడు పుట్టి ఒక గంట అయినదని భావిస్తే-భూమిపుట్టి ఒక లిప్తకాలేదు. భూమి ఏర్పడి ఒక గంట అయినదనుకుంటే, భూమిపై ప్రాణికోటి ఉదయించి ఒక సెకను కాలేదు! ప్రాణి ఉద్భవించి ఒక గంట అయినట్లు ఎంచుతే "మనిషి" యేర్పడి ఒక సెకను కాలేదు!!

మానవావతరణ- మానవోదంతమ్ము
చిత్రమైన విశ్వశిల్పమందు
పరిహరింప దగిన ప్రక్షిప్తమా ఏమి?!
అసలు కథకు అంతరార్థమేమి?.

విజ్ఞాన శాస్త్రాలు అన్నీ ఏకగ్రీవంగా ఎప్పుడో ఒకప్పుడు-సుదూర భవిష్యత్తులోనే అనుకోండి-మానవుడు ఈ పుడమిపై అంతరించటతప్పదని నిష్కర్షగా చాటుతున్నాయి. అయితే - యీలోగానే మానవుడు మారణ యుద్ధాలను పెంపొందించుకొని- "అకాల ప్రళయం" -సృష్టించుకుంటాడా?

"ఏసురు మానవుండు గగనాన విహంగమై:
గండు చేపకీలి గడలిలోను:
మనిషివోలె భువిని మసలాడదేలకో
వింతలందు గొప్ప వింతవాదె!"

అని, హృదయాళువైన ఒక మేధావి వాపోయాడు.

నేడు ప్రపంచంలో అగ్రరాజ్యాల వద్దనున్న అణ్వాయుధాలు- ఉదజని బాంబులు ఈ భూలోకంలోవున్న మానవులను సుమారు ఇరువది పర్యాయాలు సంహరింపగల శక్తి గలవి అంటున్నారు అభిజ్ఞులు. ఇవిగాక అద్యతన భవిష్యత్తులో "మరణకిరణాలు"- "కృత్రిమ భూకంపమారుతాలు" సృష్టింపగల వాయవ్యాస్త్రాలు - వారుణాస్త్రాలు సృష్టింపబడవచ్చు.

ఈ అకాల విశ్వమానవ ప్రళయాన్ని తప్పించగల శక్తి భూగోళంలో ఏ శాస్త్రానికి గాని ఏవిద్యకుగాని ఏకళకు గానీ మరి యే "రాజకీయింద్రజాలకు" గాని లేదు. ఆ మహనీయశక్తి మతానికి మాత్రమే ఉంది.

మతం మానవునిలో నిద్రాణమైయున్న మంచితనాన్ని దివ్యత్వాన్ని మేలుకొల్ప గలదని వివేకానంద మహర్షి అభిభాషణ.

"ప్రపంచచరిత్రలో యుగయుగాంతరాలనుండి ఎన్నియుద్ధాలు జరుగలేదు? భూలోకంలో ఎన్నిమతాలు లేవు! ఎందరు యోగీశ్వరులు అవతరించ లేదు! ఏ మతమైనా ఒక్క యుద్ధాన్ని అయినా ఆపగలిగిందా? అని ప్రశ్నించేవారు ఉన్నారు. "కుడిచెంపమీద కొడితే-శత్రువును ద్వేషింపకుండా- నీ యెడమ చెంప చూపించు"అని ప్రబోధించిన ఏసుక్రీస్తు మతానికి చెందిన వారమని చెప్పుకునేవారే యెన్నియుద్ధాలు చేయలేదు?" అనిమూతిముడిచే మేధావులూ ఉన్నారు. నిజమే. అది క్రైస్తవ మతం తప్పుకాదు గద, మనిషి తప్పుగాని.

అణోర్వ్యత్వసప్తశక్తి-ఆవిర్భావ యుద్ధానంతరం ఇష్షకరాలన్ని ప్రబోధం చేసినవాళ్ళ, తిరుపతి యుద్ధాలను నిరోధించు గలిగే విశ్వశాంతిని చేకూర్చే శక్తి యావత్భువిలో ఏ వ్యవస్థకైనా వుందా? - మతవ్యవస్థకు మాత్రమే అందుబాటులో వుంటుంది. అందుచేత, విజ్ఞాన శాస్త్రం పురోగమించిన కొద్దీ- క్రొంగొత్త మారణోపకరణాలు- సృతకవాతావరణ కారకాలు ఆవిర్భవించిన కొద్దీ మానవసమాజంలో మతం ఆవశ్యకత అధిక మౌతున్నదనే చెప్పాలి.

ఈ ఇరవయ్యోశతాబ్దె ప్రథమ ఖండంలో రెండు ప్రపంచయుద్ధాలు జరిగాయి. ద్వితీయఖండంలో మరో ప్రపంచ యుద్ధం వస్తే! అది "తృతీయ ప్రపంచ సంగ్రామం" కాదు- క్షమించాలి- అంతిమ ప్రపంచ సంగ్రామమే" కావచ్చు!! అటుపిమ్మట భూగోళంలో మానవుడేఅంతరించిపోవచ్చు. 1345 లో నాగసాకి హిరోషిమా నగరాలపై అటంబాంబులు ప్రయోగించినప్పుడు అచట బ్రతికినవి కొన్ని చీమలు మాత్రమేనట! అంతిమ ప్రపంచ సంగ్రామానంతరం-చలి చీమలు తమభాషలో అప్పుడు అంతరించి పోయిన మానవజాతిపై కరుణాగీతికలు ఆలపిస్తాయేమో అన్నాడు కీర్తిశేషుడైన టాయిన్ బీ మహాశయుడు

" ఈ పెనుమంటిదిబ్బ వసియించి రొకానొకనాడు మానవుల్!
పాపము- శేముషీ విభవ పారగులై -
ప్రకృతిన్ జయించి-వి
శ్వాపర సృష్టి సల్పి- ప్రళయాంతక
బుద్ధిని; గుండెలేక-ఆ
త్మోపహతిన్ వినాశనము నొందిరి
అందరు జ్ఞాన హీనులై

అనుచు- హతశేషమై అవని మిగులు
ఏ పిపీలికలో రచియించు కొనును
కరుణాగీతికల్ వాటి వాఙ్మయములోన!!
ఇయ్యది అవశ్య భవితవ్య మేమొ మనకు

ఇట్టి- "అకాల ప్రళయం"-"ఘోర నర మేధం" తప్పించగలవారు ఎవరు? ఈ

మహత్తర కర్తవ్యం కేవలం అంతర్జాతీయ రాజకీయ వేత్తలకు వదలిపెట్టి దగినద్దిదా? వారికి ఇది చేతనైన పని కాదు.

మతంకల్పించే భవ్యకవితావేశంతో- విశ్వమానవ సౌభ్రాత్రభావంతోముందడుగు వేసే మహనుభావులు మాత్రమే ఈ పవిత్ర బాధ్యత నిర్వహించటానికి సమర్థులు. 'మామతం గొప్పదంటే మామతంగొప్పదని కీచులాడుకునే యుగాలు గతించాయి'. అన్ని మతాలు బోధించేది విశ్వమానవ కల్యాణం. సకలమానవ సౌభ్రాత్రం.

ప్రపంచ చరిత్రలో మతయుద్ధాలు జరిగినమాట నిజమే. నిజానికి అవి మత సిద్ధాంతాల పోరాటాలు కావు. విభిన్న వేదాంతాల వివాదాలూ కావు. అవి స్వార్థ పరుల ఆరాటాలు. అజ్ఞానుల ఉబలాటాలు. ఇట ఒక విద్వాంసుని చమత్కార భాషణం ఉదాహరించ వచ్చు —

మిథ్య- మతములన్ని మేధావి దృష్టిలో!
తరచ-తాత్త్వికునకు తథ్యమన్ని!
లాభదాయకములు రాజకీయున కన్ని!!
మతము- అసలు జగతి హితము కొరకె.

మతం అనే శబ్దాన్ని సువిశాలమైన అర్థంలో స్వీకరిస్తే- స్వార్థత్యాగమే మతానికి అంతరాత్మ. మతం ఏకైక ధ్యేయం విశ్వ శ్రేయస్సు.

అందుచేత- నేటిమానవుడు- ఏమతానికి చెందినవాడైనా- తాను విశ్వజనీన చరిత్రుడు కావచ్చు. మానవజాతి మనుగడయే శంకాస్పదమై పోతున్న సమయంలో- నిరుపమానమైన మానవమేధ, విజ్ఞానశాస్త్ర వికారవికాస పరిణామం అకాల ప్రళయాన్ని సృష్టించే మార్గంలో ఎండమావులను వెంబడించి వెఱ్ఱి పరుగులు పెడుతున్న కాలంలో- మతంపై- విశ్వ మానవ సౌభ్రాత్ర భావాన్ని ప్రబోధించ వలసిన పవిత్ర బాధ్యత పడింది. ఇప్పుడు సంకుచిత తత్త్వాలకు తావులేదు. అన్యోన్య వైషమ్యాలకు ఇది అదను కాదు. విశ్వజనీన మతం అవతరించ వలసిన ముహూర్తం ఆసన్నమైనది.

"వెలుగు" వచ్చుగాక వివిధ దిక్కులనుండి
వివిధ సౌరభాలు విరియ జేసి:
మసలుగాక మనిషి వసుధైక పౌరుడై
మతము- సర్వమనుజ హితము కొరకె.

భారత భూమిపై మానవజాతి చరిత్ర ప్రాగుషస్సులలో ప్రాక్తన ఋషులు ఆలపించిన ఈ ప్రార్థనాగీతం- పునశ్చరణ చేయదగింది.



# కులం-గుణం

పండిత విద్యానిధి
సకలశాస్త్ర పెన్నిధి
సజ్జనుల చెలిమిచేయ
ఉజ్జయిని చేరనెంచె

ఒకరోజున ఒంటరిగా
నడచుచును పయనమాయె
మార్గమందు వనము దాటగ
తోడుకొరకు వేచియుండె

అంతలోన మనిషి ఒకడు
తన చెంతగ వచ్చుచుండె
అతడితోడి పయనము
తనకెంతో సుఖమని దలచె

అతని పేరు రాముడు
చదువులేని పామరుడు
ఇరువురును నడచిరి
మును ముందుకు సాగిరి.

వనమునపుడు దాటిరి
మాట మీద మాటతో
వృత్తినీది ఏదియని
పండితుడు అడిగెను

ఊరుగాచు వృత్తినాది
ఊరి చివరి ఇల్లునాది
రాముడంత మనసు విప్పి
విషయమంత పూసగ్రుచ్చె

గర్వముతో విద్యానిధి
ఛీ!... ఛీ!....అల్పుడా!....
అటు జరుగుము, అటు జరుగుమని
మదముతోడ కసరికొట్టెను

చెంతనున్న చెరువు జూచి
స్నానమపుడు చేయనెంచె
చెరువు కాదు బురదగుంట
అందులోన కూరబడుచు

చెరువు కాదు ఇది మరి!
బురదగుంట ఇది సరి!
ఎలుగెత్తి కేకలిడుచు
పరుల సాయంకోర బిలచె

దాపునున్న వారు ఎల్లరు
అయ్యయ్యో పాపమనిరి
దరికి ఎవరు చేరరైరి
కలత చెంది రాముడు

నెమ్మదిగా చెంతచేరి
తన చేతులతో సాయమిచ్చి
ఆపదనుండి అడ్డుపడి
ఒడ్డుకపుడు చేర్చివేసె

సిగ్గుతోడ పండితుడు
తన తప్పును తెలుసుకొని
రాము నపుడు పలకరింప
తన ఎదలో పులకరింప

ప్రాణదాత మిత్రమా!
చదువుకున్న మూర్ఖుడను!
కులంకన్న గుణం మిన్న
నన్నిపుడు మన్నింపు మనియె

జనులారా! వినుడు మీరు
సమదృష్టి దేవునిది
వలదు, వలదు, మనకు వలదు
కుల భేదం మనకు వలదు

— బెహరా ఉమామహేశ్వరరావు

# పంచనదీక్షేత్రం పుష్పగిరి

— శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

'దక్షిణకాశి' గా ప్రసిద్ధి చెందిన పుష్పగిరి కడపకు వాయువ్యంగా పదిమైళ్ళలో వుంది. ఉరకలు వేస్తూ పరుగులు తీసే పెన్నానది, కనులపండువ జేసే ప్రకృతి యాత్రికులను ఎంతగానో ఆకర్షిస్తాయి. అలరిస్తాయి. శివకేశవుల అభేద ప్రతిపత్తికి ప్రత్యక్ష సాక్ష్యం పుష్పగిరి క్షేత్రం. ఆంధ్రప్రదేశంలోని ఏకైక అద్వైతపీఠంగా ప్రశస్తి నందుకొన్నది. ఆదిశంకరులచే పూజలందుకొన్న చంద్రమౌళీశ్వర లింగం తరతరాలుగ పూజలందుకొంటున్నది. ప్రస్తుత పీఠాధిపతి శ్రీ నృసింహ భారతీ స్వామి ఆధ్వర్యంలో పుష్పగిరి ప్రముఖ యాత్రా కేంద్రంగా పెంపొందే అవకాశా లున్నాయి.

పుష్పగిరి గ్రామానికి, పుష్పగిరి కొండకు మధ్య పెన్నానది ప్రవహిస్తున్నది. కొండపై ఒకే ఆవరణంలో చెన్నకేశవాలయం, సంతాన మల్లేశ్వరాలయం వున్నాయి. ఈ కేశవాలయాలు రెండూ ఒకే మందిరంలో (మధ్యన గోడ వుండి) వుండటం విశేషం. ఈ ఆవరణలో శ్రీదేవి, సాక్షి మల్లేశ్వర యోగాంజనేయ ఆలయాలున్నాయి. శివకేశవాలయం చుట్టూ వున్న పెద్ద శిల్పాలు కళాఖండాలు, ఏనుగుల వరుసలు, అశ్వారోహకులైన వీరుల విన్యాసాలు, రమ్యాతి రమ్యంగా వున్నాయి. భారత రామాయణ ఇతిహాసాలలోని ముఖ్య ఘట్టాలు మనోజ్ఞంగా చిత్రించబడ్డాయి. కిరాతార్జునీయ గాథ, నటరాజ నృత్యము పరమాద్భుత శిల్పాలు. శిల్పుల కళాకౌశలం మనలను చకితులను చేస్తుంది. ఈ సుందర శిల్పాలను అపహరించుటకు ప్రయత్నాలు జరిగాయి. కొన్ని చోట్ల ఆకృతి వికృతి గావింప బడినది. ఒక దివ్యసుందరశిల్పం అపహరించబడింది. తెలుగు శిల్పుల ఉలులు చక్కలింతలాడిన శిల్ప సౌందర్యం పుష్పగిరి ఆలయ కుడ్యాలలో అణువణువునా కాన వస్తున్నది. ఈ శిల్ప సౌందర్యాన్ని తిలకించి పరవశించిన [illegible] ఫలభరితమని హృదయం పులకిస్తుంది.

ఈ పుష్పగిరిలోనే పాపవినాశేశ్వర, దుంది వినాయక, పుష్పనాథేశ్వర, కమల సంభవేశ్వర, దుర్గాంబ ఆలయాలున్నాయి. చెన్నకేశవాలయానికి దక్షిణ దిశలో [illegible] ప్రవహిస్తున్నది. పితృకార్యములు చేయువారికి యిది పవిత్ర స్థలంగా వుంది. పుష్పగిరికి ఒక మైలు దూరంలోని [illegible] గట్టు చివర విష్ణు పాదముంది. శివకేశవులిద్దరి పాదములున్న ప్రాంతంగా ప్రతీతి.



పుష్పగిరికి సమీపంలో పాపఘ్ని, కుముద్వతి, వక్కిలి, మాండవి నదులు పెన్నలో కలిసి పోవుటచేత పుష్పగిరిని పంచనదీ క్షేత్రమని కూడా అంటారు.

కొండ దిగి పెన్నదాటి పుష్పగిరి ప్రవేశించి నంతనే అభినవ చెన్నకేశవాలయం కాన వస్తుంది. చెన్నకేశవస్వామి ఉత్సవ మూర్తులిక్కడ వున్నాయి. పెన్నలో వరదలు వచ్చి చెన్నకేశవాలయానికి వెళ్ళడానికి వీలుకానపుడు అభినవ చెన్నకేశవునకే పూజలు జరుగును. వైద్యనాథేశ్వర, భీమేశ్వర, త్రికూటేశ్వరాలయాలు ప్రసిద్ధమైనవి. వైద్యనాథేశ్వరాలయ ప్రాంగణం లోనే శ్రీ కామాక్షి మందిరం, అమ్మవారి ముందు శ్రీచక్రం ప్రతిష్ఠింప బడ్డాయి. త్రికూటేశ్వరాలయమందలి శిలాస్తంభాలు అద్దాలవలె ప్రతిబింబిస్తూ వుంటాయి. స్తంభాల శిల్ప సౌందర్యం మనోహరంగా వుంది. పుష్పగిరి అనే పేరు వచ్చుటకు కారణం సూచించే కథ ఒకటి ప్రచారంలో వున్నది.



ఒకప్పుడు యీ ప్రాంతంలో కాంపల్లె అను పల్లె వుండేదట. చుట్టూ కొండలు అడవులు వున్న ఆ ప్రాంతంలో తూర్పున ఒక కొలను వుండేదట. ఒకనాడు కాంపల్లెకు చెందిన ముసలి కాపు ఒకడు, తన ముసలి ఎద్దులతో వ్యవసాయం చేయుటకు వెళ్ళాడు. మధ్యాహ్నం ఎండ తీవ్రంగా వుంది. దగ్గర లోని కొలను వద్దకు వచ్చి నీరు త్రాగుటకై కొలనులో వద్దాడు. నీటిలో మునిగి ఉక్కిరి బిక్కిరైన ఆ ముసలి రైతు గట్టు చేరే సరికి అమాంతంగా యువకుడై పోయాడు. పట్ట రాని ఆనందంతో గంతు లేశాడు. గట్టున వున్న ముసలి ఎద్దులను కూడ కొలను లోనికి లాక్కొని వెళ్ళి మునకలు వేయించాడు. రెండెద్దులూ కోడెలుగా మారాయి. రైతు ఆనందానికి అవధులు లేవు. అంతలోనే రైతు భార్య అన్నం మూట తీసుకొని వచ్చింది. ఆమె భర్తను గుర్తించ లేదు. రైతు ఆమెను బలవంతంగా తీసికొనివెళ్ళి కొలనులో మునకలు వేయించాడు. ఆమె యౌవనంతో తొణికిసలాడ సాగింది. దంప తులు కోడెలతో సహా యిల్లు చేరటం గ్రామస్థులనందరినీ ఆశ్చర్య చకితులను చేసింది. ఈ వార్త గ్రామ గ్రామాలకు వ్యాపించింది. కొలనులో మునకలు వేసిన పల్లెప్రజలు, పశువులు నవయౌవనంతో తిరిగి రావటం జరిగిందట. ఇందుకు కారణం కాంపల్లెకొలనులో అమృత బిందువులు పడటమే అని పురాణ గాథ. గరుత్మంతుడు తల్లి దాస్యాన్ని నివారించేందుకై ఇంద్రుని అమృత భాండాన్ని తీసికొని వస్తున్నాడట. ఇంద్రుడు అడ్డగించడం దేవేంద్రునితో తల పడటం జరిగింది. ఆ పోరాటంలో అమృత భాండం నుండి కొన్ని బిందువులు క్రింద వున్న కాంపల్లె కొలనులో పడినవి. అమృత బిందువుల ప్రభావంతో కాంపల్లె కొలనుకు అంత ప్రభావం అబ్బింది. భూలోక వాసు లందరూ యీ కొలనులో మునకలు వేసి అమరత్వం పొందటంతో దేవతలు భయపడి శివుని ఆశ్రయించారట. పరమశివుడు వాయు దేవుని పిలిచి కైలాస పర్వత పాదం ఒక దానిని కాంపల్లెకాసారంలో వేయమన్నాడట. వాయుదేవుడు కొండను కొలనులోనికి విసి రాడు. ఆ కొండ పుష్పంవలె తేలిందనీ అదే పుష్పగిరి అనీ వాడుకలో వున్న కథ.

ఇంద్రుడు పరకాంతా రతిదోష నివారణకై వైద్యనాథ స్వామిని ఆరాధించి పాప విముక్తుడైనాడని పురాణ గాథ.

చారిత్రకంగా పుష్పగిరి ప్రసిద్ధ మైనది. ఒకనాడు ఇది గొప్ప విద్యా కేంద్రం. కరి కాలచోళుడు ఇచటి వైద్యనాథస్వామి ఆల యాన్ని కట్టించాడని చరిత్రకారులు పేర్కొ న్నారు. చాళుక్య చక్రవర్తి త్రైలోక్య మల్లుడు పుష్పగిరిలోని శివకేశవాలయాలను కట్టించాడు. సమీపంలోనే త్రైలోక్యవల్లభ పురాన్ని నిర్మించాడు. ఆ త్రైలోక్య వల్లభ పురమే నేటి వల్లూరు. వల్లూరులో శిథిల మైన కోట గోడలు కానవస్తున్నాయి. గంగయ సేనాపతి శాసనం (క్రీ. శ. 1254) ప్రకారం వల్లూరును వడ్డెరాజులు పాలించు చుండగా ప్రతాపరుద్ర దేవుడు వారిని ఓడించి వల్లూరును వశపరచుకున్నాడు.

పుష్పగిరి గొప్ప శైవ పీఠమని యిది వరకే చెప్పడం జరిగింది. పుష్పగిరి మఠాధిపతులైన శివయోగీంద్రులను గణ పతి దేవ మహారాజు గురువుగా చేసికొన్నట్లు ఆంధ్రుల చరిత్ర తెలుపుతున్నది. ప్రతాప రుద్రుని కుమారుడగు జుట్టయ లెంక వేయించిన శాసనమున్నది. అంబయదేవ మహారాజు గండికోటను పాలిస్తూ ములికి నాడులో కడప దగ్గర అఘోర శివాచార్యు లకు సంతాదిగొట్టు గ్రామాన్ని, రాజకుమారు డైన త్రిపురాంతక మహారాజు గోదానాన్ని చేసినట్లు పాత కడప వద్ద నున్న శాసనం (క్రీ. శ. 1298) తెలుపుతున్నది.

సంతాన మల్లేశ్వరాలయంలోను ఇంద్ర నాథేశ్వరాలయంలోను వున్న శాసనాల వల్ల యీ ఆలయాలకు పెక్కు మడి మాన్యాలున్నట్లు తెలుస్తున్నది. కమల నాథేశ్వరునికి సర్వ సామాన్యముగ కట్టించి దానమివ్వబడినదే నేటి తాలూకా కేంద్రమైన కమలా పురం.

ప్రతి సంవత్సరం చైత్ర బహుళ త్రయో దశి వైశాఖ శుద్ధ సప్తమీ వరకు జరుగు బ్రహ్మోత్సవములు వేలాది భక్తులను ఆక ర్షిస్తున్నవి.

శివుడనో మాధవుడనో  
భవుడనో పరబ్రహ్మమనో  
ఎవరని నిర్ణయించెదిరా, ని  
న్నెట్లారాధించిరిరావరవరు ॥లెవరని॥  
— త్యాగరాజస్వామి.



# వ్రతాలు - నోములు



వ్రతాలు, నోములు అనేవి నీతినియమములను, ప్రాచీనాచారాలను, పురాతన సంప్రదాయాలను, నాగరికతా సంస్కృతులను, భక్తివిశ్వాసాలను ప్రతిబింబించే సాంప్రదాయిక విజ్ఞానం. 'వ్రతము' అనే పదానికి నియమం, నోము, పుణ్యకం అనే అర్థాలు వ్యవహారంలో ఉన్నాయి. కాబట్టి ఈ రెండింటి అర్థం ఒక్కటే. దశవిధ నియమాలలో వ్రతం ఒకటి (దశవిధనియమాలు: 1. తపం 2. సంతోషం 3. ఆస్తిక్యం 4. దానం 5. భగవదర్చన 6. వేదాంత శ్రవణం 7. లజ్జ 8. మతి 9. జపం 10. వ్రతం)

ఋగ్వేదంలో పలుమార్లు కన్పించే అవ్రతల, అపవ్రత, అన్యావ్రత, దైవ్రత, శుచివ్రత, మహివ్రత, ప్రియవ్రత, ధునివ్రత, ధృతవ్రత, తపవ్రతే అనే పదాలను పేర్కొని వాటి వివరణ సైరం కాణేగారు గావించారు. ఋగ్వేదంలోనే కాకుండా వైదిక సాహిత్యంలోను, సూత్రాలు, స్మృతులు, బ్రాహ్మణాలు, నిరుక్తాలలోను 'వ్రతం' దాని ఆవశ్యకత పేర్కొనబడిందని ఉదాహరణ పూర్వకంగా వివరించారు.

వ్రతప్రకాశంలో వ్రతాన్ని గురించి ఇలా చెప్పబడింది. 'తత్ర వ్రతం నామ అభియుక్త వ్రత ప్రసిద్ధివిషయః సంకల్ప విశేషః అభియుక్త మంత్ర ప్రసిద్ధివిషయ మంత్రవత్'

(హిస్టరీ ఆఫ్ ధర్మశాస్త్రాస్, పుట 30 నుండి) వ్రతమంటే ఉద్దేశించిన వ్రతాచరణ విషయమైన సంకల్పవిశేషం. ఉద్దిష్టమైన మంత్రం. ప్రసిద్ధమైన మంత్రం. అగ్ని పురాణంలో ఇలా చెప్పబడింది.

" శాస్త్రోంతో హి నియమో
వ్రతం తచ్చ తపో మతమ్ ।
నియమాస్తు విశేషాస్తు
వ్రతస్యైవ దమా దయః ॥
వశిత్వం హి కర్మణాస్త్రాహి
త్రివ ఇత్యభి ధీయతే,
ఇంద్రియాణి గ్రామ నియమా
న్నియమాః వ్యాపినాంతే ॥"

— డా॥ జి. ఎస్. మోహన్

అని చెప్పబడింది. దీనిఅర్థమిది. శాస్త్రంలోచెప్పబడ్డ నియమమే వ్రతం. అదేతపము బడుతుంది. వ్రతి వ్రతానికి దమం మొదలు గాగల నియమాలుంటాయి. వ్రతాన్ని ఆచరించేవారు లోనయ్యేశరీర క్లేశంవల్ల వ్రతం తపమని పిలువబడుతుంది. ఇంద్రియ సమూహ నిగ్రహంచేత నియమమని పిలువ బడుతోంది.

అమరకోశంలో "నియమో వ్రతమస్త్రీ తచ్చోపవాసాది పుణ్యకమ్" అనిచెప్ప బడింది. అంటే ఉపవాసాది పుణ్యసంపాదక మైన నియమమే వ్రతం. ఈ విషయాన్నే తారానాథతర్కవాచస్పతి 'పుణ్యసాధనా నికై ఉపవాసాది నియమాలచే చేసే కార్యం" వ్రతం అని పేర్కొన్నాడు. (ప్రజాపుజస్మృతిః భక్షణభేదే ఉపాది పుణ్య సాధనే ఉపవాసాది నియమ భేదే చ'- 'హిందువుల పండుగలు' నుండి ఉద్ధరింప బడింది). ఇంకా వివరంగా అర్థంచెప్తూ 'వ్రతమంటే సంకల్ప పూర్వకంగా సమ్యగనుష్ఠానం చేయడం. ఈ వ్రతం ప్రవృత్తి, నివృత్తి రూపాలని ద్వివిధం. విశిష్టపదార్థ

గృహలక్ష్మి

భోజనాదికములతో కూడినది ప్రవృత్తి రూపం, ఉపవాసాదికమైనది నివృత్తి రూపం. వ్రతం మూడువిధాలు. అవి నిత్యాలు, నైమిత్తికాలు, కామ్యాలు అని. ఏకాదశి మొదలైన వ్రతాలు ఎల్లకాలాల్లోనూ చేయదగ్గవి కావడంవల్ల అవి నిత్యవ్రతాలు. చాంద్రాయణాది వ్రతాలు నైమిత్తికాలు. ఆ యా తిథుల్లో ఉపవాసం ఉండి చేసేవి కామ్యవ్రతాలు. ('వ్రతం చ సమ్యక్సంకల్ప జనితానుష్ఠేయ క్రియావిశేషరూపం, తచ్చ ప్రవృత్తి నివృత్త్యుభయరూపం: తత్రద్రవ్య విశేషభోజన పూజాదికం ప్రవృత్తిరూపం: ఉపవాసాదికం చ నివృత్తిరూపం: తచ్చ నిత్యం, నైమిత్తికం, కామ్యం చ, నిత్యమే కాదశ్యాది వ్రతం, నైమిత్తికం చాంద్రాయ ణాది వ్రతం, కామ్యం తత్తత్తిథ్యుపవాస రూపం,- హిందువుల పండుగల నుండి పునరుద్ధరింపబడింది).

పైనచెప్పబడ్డ మూడు విధాలైన వ్రతాలే కాకుండా మానసిక వ్రతాలు, కాయక వ్రతాలు ఉన్నాయి. అహింస, సత్యం, దొంగతనం చేయకుండడం, బ్రహ్మచర్యం, అకల్మషత్వం,ఇత్యాదులు మానసికవ్రతాలు. ఏకభుక్తం, రాత్రిసమయాల్లో ఉపవాస ముండడం ఇత్యాదులు కాయిక వ్రతాలు

"అహింసా సత్యమస్తేయం
బ్రహ్మచర్య మకల్మషం
ఏతాని మానసాన్యాహు
ర్వ్రతాని వ్రతధారిణాం
ఏకభుక్తం తథానక్త
ముపవాసాదికం చ యత్
తత్సర్వం కాయికం పుంసాం
వ్రతం భవతి నాన్యథా,

— వరాహపురాణం

మానసిక వ్రతాలు, కాయికవ్రతాలకు తోడు మౌఖిక వ్రతాలుకూడా ఉన్నాయని పద్మపురాణంలో చెప్పబడింది. మానసిక వ్రతాలు హరియనుగ్రహాన్ని పొందునట్టివి. వేదాధ్యయనం, విష్ణుకీర్తనం, సత్య భాషణం ఇత్యాదులు మౌఖికవ్రతాలు.

"అహింసా సత్యమస్తేయం
బ్రహ్మచర్య మకల్కతా।
ఏతాని మానసాన్యాహుః
వ్రతాని హరి తుష్టయే॥

ఏకభుక్తం తథానక్త
ముపవాస మయాచితమ్
ఇత్యేవం కాయికం పుంసాం
వ్రతముక్తం నరేశ్వర॥

వేదస్యాధ్యయనం విష్ణోః
కీర్తనం సత్యభాషణమ్।
అపైశున్యమిదం రాజన్
వాచికం వ్రతముచ్యతే॥

—పద్మపురాణం.

పక్షం, మాసం, ఋతువు, అయనం, సంవత్సరాలని కాలం ఆధారంగా చేసికొని వ్రతాలు నిర్ణయింపబడ్డాయి. వారవ్రతాలు, నక్షత్రవ్రతాలు కూడ ఉన్నాయి. సంవత్సర కాలం ఆచరింపబడేవి ఏకవార్షికాలని, అనేక సంవత్సరాలు ఆచరింపబడేవి బహు వార్షికాలని పిలువబడుతాయి. బహువార్షికాలు ప్రతిసంవత్సరంలో ఒక మాసంకానీ, ఒక రోజుకానీ ఆచరింపబడుతాయి. చాలవరకు వ్రతాలన్నీ తిథుల నాధారంగా చేసికొని చేయబడేవిగా ఉన్నాయి.

వ్రతాన్ని ఆచరించబోయే వాళ్ళను ఆధారంగాచేసికొని వ్రతాలు స్త్రీసంబంధాలు పురుష సంబంధాలు, స్త్రీపురుష ఉభయ సంబంధాలుగా ఉన్నాయి. మరికొన్ని రాజులు, క్షత్రియులు, వైశ్యులు, మొద లైన ప్రత్యేక వర్ణాల వారు చేయదగినటు వంటివి.

వ్రతాలను ఆచరించడానికి శుభ సమ యాలుఉన్నాయి. "రత్నమాల"లో సోమ. బుధ, గురు, శుక్రవారాలు అన్నిపనులకు ఉత్తమ దినాలుగా చెప్పబడ్డాయి. ఆది, మంగళ, శని వారాలలో ఆ యా దినాలకు చెప్పబడ్డ కార్యాలు మాత్రమే సిద్ధిస్తాయి.

'సోమ, సౌమ్య, గురు, శుక్రవాసరాః సర్వకర్మసు భవన్తి సిద్ధిదాః, భాను, భౌమ. శని వాసరేషు చ ప్రోక్తమేవ ఖలు కర్మవిధ్యతి॥'

— రత్నమాల 3 పుట 15

దేవీపురాణంలో 'సింహస్థం చ గురుం శుక్రం సర్వారంభేషు వర్జయేత్' అని చెప్ప బడింది. అంటే సింహరాశిలో ఉన్న గురు వును, శుక్రుడిని సర్వకార్యాలలో పరిత్య జించాలి. ఇది వ్రతానికి కూడా అన్వయి స్తుంది.

వ్రతానికి తగిన ఉత్తమ గుణాలు ఉన్న వారు వ్రతాలను ఆచరిస్తే సత్ఫలితాలను

పొందుతారని స్కాందపురాణం పేర్కొన్నది. నిజకులాచారాలను విడువనివాడు; శుద్ధమానసుడూ లోభి కానివాడు, సత్య వ్రతుడు, సర్వభూతముల హితముకోరే వాడూ, న్యాయశీలుడూ, మదదంభాది దుర్గుణరహితుడూ, దైవభక్తి కలవాడు, జితేంద్రియుడూ అయిన వాడే వ్రతాలను ఆచరించడానికి అర్హుడనీ, అన్యుడొనరిస్తే అది విఫలమవుతుందనీ వివరించింది.

వ్రతమాచరించడానికి కావలసిన ధర్మాలు (గుణాలు) ఉన్నాయి. అగ్నిపురాణంలో పది వ్రతధర్మాలు చెప్పబడ్డాయి. అవి క్షమ, సత్య, దయ, దానం, శౌచం, ఇంద్రియనిగ్రహం, దేవపూజ, అగ్నిహవనం, సంతోషం, అస్తేయం, అనేవి.

'క్షమా సత్యం దయా దానం
శౌచమింద్రియ నిగ్రహః ।
దేవపూజాగ్ని హవనం
సంతోషోஉస్తేయ మేవ చ ।
సర్వవ్రతేష్వయం ధర్మః
సామాన్యో దశధా స్మృతః ॥

—అగ్నిపురాణం.

దేవలుడు నాలుగు వ్రతధర్మాలను పేర్కొన్నాడు. అవి బ్రహ్మచర్యం, శౌచం, సత్యం, మాంసభక్షణ చేయకుండడం అనేవి. నారదీయపురాణంలో ఇలా చెప్పబడింది.

"వ్రతేష్వేతేషు సర్వేషు
బ్రహ్మచర్యం విధీయతే ।
భోజనేషు హవిష్యాన్నం
సామాన్యత ఉదాహృతమ్ ॥

—నారదీయ పురాణం, పూర్వార్ధం.

అంటే ఈ వ్రతాలన్నిటిలోను బ్రహ్మచర్యం విధింపబడింది. భోజనంలో సామాన్యంగా హవిష్యాన్నం పేర్కొనబడింది.

వ్రతాన్ని ఆరంభించేవారు ఎలాంటి ఆటంకాలను రానీయకుండ తప్పక ముగించాలనేది నియమం ఉంది.

"యో గృహీత్వా వ్రతం మోహాన్నాచరేత్
కామమోహితః । జీవన్ భవతి చాండాలో
మృతః శ్వానో హి జాయతే"

అని పురాణాలు పేర్కొన్నాయి. అంటే వ్రతం ఆచరించి కామమోహితుడై ఎవ్వరు దాన్ని సంపూర్ణంగావించడో, అట్టివాడు బ్రతికి ఉండగానే చండాలుడవుతాడు. మరణించిన తర్వాత శునకమై జనిస్తాడు. అందుకనే వ్రతగ్రంథకారులు 'ఏ లోపమైనను వ్రతలోపం కారా' దని పేర్కొన్నారు. అంతే కాకుండా ఆ వ్రతంతో సమానమైన మరియే వ్రతం కూడాలేదనీ, అదే ఉత్తమ వ్రతమనీ శ్లాఘించి, వ్రతఫలశ్రుతిని పేర్కొన్నారు.

జననమరణాలచే కల్గిన అశౌచసమయాల్లోనూ వ్రతం ఆచరించకూడదనే నియమం కూడా ఉంది. వ్రతంఆచరించి రోగపీడితుడు కావడంవల్లనో లేక ప్రమాదవశంగానో లేక మరియేయితర ప్రగాఢమైనకారణాలచేతనో వ్రతాన్ని కొనసాగించక పోయినట్లయితే తనకు బదులుగా ఒక ప్రతినిధి ద్వారా వ్రతాన్ని పూర్తి చేసుకోవచ్చును.

స్త్రీలు యజ్ఞయాగాదులను కాని, వ్రతాలను కాని, ఉపవాసాదులను కాని చేయాల్సిన అవసరం లేదని, భర్త శుశ్రూషయే వారికి ముఖ్య వ్రతమనీ, దానివల్ల వారు ఇష్టమైన లోకాలను పొందగలరని మార్కండేయ పురాణం పేర్కొన్నది.

"నాస్తి స్త్రీణాం పృథగ్యజ్ఞో
న వ్రతం నాప్యుపోషణం,
భర్తృశుశ్రూషయైవైతా
లోకానిష్టాన్ వ్రజంతి హి."

— మార్కండేయ పురాణం.

భర్త బ్రతికి ఉండగా ఏ స్త్రీ ఉపవసించి వ్రత మాచరిస్తుందో, ఆమె భర్త ఆయుస్సును క్షీణింప చేస్తుందనీ, ఆమెకు నరక ప్రాప్తి కలుగుతుందనీ, భర్త అనుజ్ఞ లేక వ్రతమాచరించిన స్త్రీ వ్రతఫలమంతా రాక్షసుల పాలవుతుందనీ పరాశరస్మృతి ఘోషించింది.

పత్యౌ జీవతి యా నారీ
ఉపోష్య వ్రత మాచరేత్,
ఆయుష్యం హరతే భర్తు
స్సా నారీ నరకం వ్రజేత్.
అపృష్ట్వా చైవ భర్తారం
యా నారీ కురుతే వ్రతం,
సర్వం తద్రాక్షసాన్ గచ్ఛే
దిత్యేవం మను రబ్రవీత్.

[32 వ పేజీలో]

## కనిపించెడి దేవుడు

కనుపించని ఆ దేవుడు
కనుపించును తిరుమలలో
కనుడు కనులార-అతడు
శ్రీశుడు, శ్రీనివాసుడు

అందు ఇందు కలడంచురంపరు
అందు ఇందు వెదకి వేసరి —

అవతారాంతము నందు రాముడు
అర్చారూపము నవతరించెనట
అభయహస్తము ధనుర్బాహువుతో
వెలసె వేంకటేశ్వరుడై తిరుమల —
విశాలఫాలము రోదసి బింబము
కన్నులై వెలుగు సూర్యసోములు
అండపిండబ్రహ్మాండమంతయు
తానెయై తనరు విశ్వ విరాట్టుగ —

త్రిమూర్తిరూపుడు తిరుమలేశుడు
త్రికాలాతీతుడా చిన్మయుడు
రాముడు, కృష్ణుడు కల్కి మూర్తిగా
కలి నుదయించె కలిజనావనుడై
సప్తఋషులచట సప్తగిరులైరి
సప్తసాగరము పుష్కరిణాయెను
సప్త సంతానము సత్కృపయై
సాక్షాత్కరించెను, స్వామి సర్వమై —
శ్రీపాదములవి శ్రీ చక్రమున
శ్రీ పాదములవి సిరి చక్రములు
శ్రీ పాదముల శిరమునుంచి, వే
శరణాగతి యన, కరుణగాచు ప్రభు —

- శ్రీ ఏడిద వాగేశ్వరరావు

# తిరుమల యాత్రికులకు సదుపాయములు

* * *

* అన్ని వర్గాలవారికి అందుబాటులో ఉండేటట్లు ఉచిత, పరిశుభ్రమైన సత్రాలు, లేదా సరసమైన రేట్లకు కాటేజీలలో ఆవాస సౌకర్యం.
* శ్రీవారిని దర్శించు యాత్రికుల క్యూషెడ్లలో గాలి, వెలుతురుగల విశాలమైన ఏర్పాటులు.
* క్యూ షెడ్లలోనే కాఫీబోర్డువారి అల్పాహార సదుపాయం.
* సరసమైన ధరలకు అన్నపుపొట్లాల అమ్మకం.
* యాత్రికులు వెలుపలకు రానక్కరలేకుండా క్యూలదగ్గరే మరుగుదొడ్డి సౌకర్యం.
* ఆంధ్రప్రదేశ్ పాలసరఫరా సంస్థచే స్వచ్ఛమైన పాలవిక్రయం.
* యాత్రికులు చదువుకునేందుకు దేవస్థాన ముద్రిత గ్రంథాలు. స్వామివారి, అమ్మవారి చిత్రపటాల అమ్మకం.
* క్యూలోని యాత్రికులకు విసుగులేకుండా ఉండేందుకు టెలివిజన్ ప్రదర్శనం, భక్తిసంగీత ప్రసారం.
* క్యూషెడ్లలోను, తిరుమలకుపోవు కాలిబాట 7 వ మైలువద్ద వైద్యసదుపాయం.
* సామానులు, పాదరక్షలు భద్రపరచుకొనేందుకు ప్రత్యేక సౌకర్యం.
* తిరుమలలో సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసునుండి వివిధప్రాంతాలకు ఆటో సౌకర్యం.

## ఉచిత బస్సుసదుపాయం

* దళారీలనుండి వంచకులనుండి తప్పించేందుకు ముఖద్వారంలో పేష్కారుస్థాయి అధికారి సిబ్బంది.
* క్యూషెడ్లలోని యాత్రికుల ఫిర్యాదులు విచారించేందుకు కావలసిన సౌకర్యములకుగాను పేష్కారు స్థాయిలో మరొక అధికారి, సిబ్బంది.
* యాత్రికుల సామానులను భద్రంగా తిరుమలకుచేర్చే సౌకర్యం ఏర్పాటైంది. తిరుపతిలో ఏ సత్రములో నైనాగాని, టోల్ గేట్ వద్దగాని తమసామాగ్రి అప్పగించి రసీదుపొంది ఆ రసీదు తిరుమలసెంట్రల్ రిసెప్షన్ ఆఫీస్ దగ్గర కౌంటర్ లో ఇచ్చి సామాగ్రి పొందవచ్చును.
* దుండగులనుండి యాత్రికులను కాపాడేందుకు, తిరుమలకు వెళ్ళే దోవపొడుగునా రాత్రింబవళ్ళూ పోలీసు గస్తీ ఏర్పాటుచేయబడింది.
* దారిపొడుగునా మంచినీటి సదుపాయం ఉన్నది.
* రాత్రిపూటగాని, తెల్లవారుఝామునగాని కొండకు వెళ్ళదల్చుకొన్నవారికి వీలుగా మంచికాంతి శక్తిగల దీపాలు ఏర్పాటైనవి.
* వివిధప్రాంతాలనుండి వచ్చేయాత్రికులకు బోధపడేందుకుగాను తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసులో, దేశంలోని ముఖ్యభాషలలో విచారణ కార్యాలయాలు.
* ప్రత్యేక కాటేజీలలోని అదనపు సౌకర్యాలు అంజనాద్రినగర్, శేషాద్రి, గరుడాద్రి, శంకుమిట్ట కాటేజీలలో కూడ ఏర్పాటైనవి.

## యువవాణి

# శాంతి మంత్రము

కళాప్రపూర్ణ
డా॥ కొండవీటి వేంకటకవి

ఓమ్ సహనావవతు-సహ నౌ భునక్తు
సహ వీర్యం కరవావహై
తేజస్వి నావధీతమస్తు
మా విద్విషావహై

వేదములకు, వేదశిఖలగు ఉపనిషత్తులకు శ్రుతి, స్మృతులు మొదలగు వానికెల్ల ప్రవచనము పూర్వరూపముగా నుండవలె. లేనిచో వానికి జీవము లేదని పెద్దల కట్టడి.

బ్రహ్మ విద్యా ప్రబోధకులే గురువులని పరిగణింప పనిలేదు. శాస్త్రాది సకల విద్యలు నేర్పునపుడు సామాన్య గురుశిష్యులీ మంత్రమునే చెప్పుకొందురు. కనుక సంప్రదాయాను సారముగ ఎవరేది నేర్చుకొన్నను నేర్చుకొనువారు శిష్యులని – నేర్పువారు గురువులని గ్రహింప దగును. ఈ లోకములో సర్వజ్ఞులైన వారెవరు లేరు గాన ఎవరిదగ్గరనైన ఏ మాత్రమైన నేర్వవలసిన



ప్రతిపదార్థము :

నౌ సహ–మన యిరువురను గూడ, అవతు–రక్షించుగాక–నౌ–మన యుభయులను, సహ భునక్తు–కలిసి భుజించునట్లు చేయు గాక– వీర్యం–ధైర్యస్థైర్యములంది నౌ సహ–మన ముభయులము కలిసి మెలసి, కరవావహై–కర్తవ్యము నెరవేర్తుము గాక.

నౌ–మనజంట యొక్క, అధీతం–చదువబడినవిద్య, తేజస్వి–దీప్తిమంతము, అస్తు–అగుగాక – మా విద్విషావహై – మనయుభయులము పరస్పరము ద్వేషించుకొనకుందముగాక.

వివరణము :

ఇచ్చట ఇరువురమనుటచే గురుశిష్యులమని భావము. గురువులు పెక్కురున్నను శిష్యగణమంతయు నొకటే యనియు పిండితార్థము.

అవసరము లేని వారుండరు. కావున ఈ మంత్రరాజము సర్వథా సర్వదా సర్వుల మధ్య సంస్మరింపదగినదే.

పూజ్య బాపూజీయగు గాంధీ మహాత్ముడు తన ఆశ్రమములలోను, తదితర స్థలములకు యాత్ర చేసినపుడును, భోజనావశ్యక కార్యసమయములందును ఈ శాంతి మంత్రమును తప్పక పఠించునట్లు నియమము చేసిరి. ఈ పఠన పాఠనక్రమము యోగ్యమైనదని వినోబాభావే సమర్థించి యనుసరించెను.

సామాన్య గృహస్థుల యింట అతిథులు, అభ్యాగతులు భుజించువేళ ఇతరేతరము తెలిసికొను విషయము లనేకము లుండును గాన అపుడును ఈ మంత్ర పఠన మావశ్యకమే యగును.

కర్మాగారములలో పనిచేయు కార్మికులెల్లరు పరస్పరము సదవగాహనముతో నుండవలెగాన పనికాలములో దీని పఠన మవసరమగును.

మన విద్యాబుద్ధులు లోకోపకారకములు కావలెనన్న అవి ముందుగా శక్తిమంతములు గావలె గదా! చదివిన చదువులు చచ్చు పుచ్చులై, నిర్వీర్యములై, నిష్ప్రయోజనములై, పరుల హానికి పనికి వచ్చునవియై, లోకాపకారకములు కారాదని పటుతరములై ప్రపంచోపయోగములు కావలెనని దీని భావము.

మన మెప్పుడు ద్వేషించుకొన కుందుము గాక అని ఇతరేతరము మానవజాతి సర్వదా సంస్మరింపదగిన విషయము. పరస్పర ద్వేషములే ఈ భరత ఖండమును పరియలు వాఱ చేసినవి, తోడి మానవుల నీడ గూడ త్రొక్కకుండ చేసినవి.

ఆ యీ కారణముల వలన ఈ మంత్రము ప్రతి గృహములోను, ప్రతి కార్యారంభమందును అన్ని వేళల అనుసరింపదగినదై యున్నది.

### క్రియాపద విచారణ :

**అవతు :**

రక్షించుగాక–రక్షించువాడు పరమాత్మ యని పరమాత్మనధ్యాహారము చేసికొన వచ్చునేమో కాని అంతకంటె విచారింపదగినది మఱియొకటి కలదు. మా ఐక

మత్యమే మమ్ము రక్షించు గాక అను నర్థమును "సహ". అను పదము సమర్థించును.

**భునక్తు :**

భుజించునట్లు చేయు గాక– ఈపదమునకు పాలించు గాక యని కొందరర్థమును చెప్పి యున్నారు. పాలనలో పోషణ మంతర్భాగమే గనుక పట్టెడు మెతుకులు పెట్టకుండా పని చేయించు కొనుట మన సంప్రదాయము కాదు గనుక దానికి వేరుగా చెప్పనక్కర లేదు.

మనమిరువురము కలిసి తిందుము గాక అనుదానిలో నొక స్వారస్యము గూడ గలదు. ఇరువురు తిను తిండిలో భేదము రవంత లేకుండ సమానముగా భుజింతుమని యర్థము. పంక్తి భేదము చేయుట మహాపాపమని శంకరభగవత్పాదులు, రంగరామానుజులు, ఉపనిషద్భాష్యములందు నొక్కి వక్కాణించిరి. అందుచే శిష్యుల కంటె గురువుల కెక్కువ పదార్థము లభించెడిది కాదు.

శిష్యుడు మధుకరము చేసి తెచ్చిన యన్నముతోనే గురువు, గురుపత్నిని కూడ పోషింపవలెనని గౌతమ ధర్మ సూత్రము వక్కాణించు చున్నది. మానవుడు, హితభుక్కు, మితభుక్కు కావలెనని యున్నది. అనగా హితమైన వస్తువును మితముగా భుజింప వలయునని యర్థము. ఈ విషయమున ద్వైతమత స్థాపకులగు మధ్వాచార్యుల వారు తినుట కొఱకే సంపాదింపవలెనే కాని తరతరములు దాచుకొనుట తగదని పాపమూలకమని పలికిరి. ఇట్లే యేసు ప్రభువు కూడ తనయనుయాయులకు సంచిలో సంచితముంచుట సర్వానర్థములకు మూల మనిరి.

"సహ భునక్తు" అనుటచే సర్వులు ఒకే సమయమున ఒకే పంక్తిని అవరోధ రహితముగా తినవలెనని స్పష్టము. నేటికీ వేదాంత గోష్ఠి జరుగు సమయములలో ఆసంఘీయులెల్లరు భేద రహితముగా భుజింతురు. భారత యుద్ధకాలము వఱకు కులభేదము పాటింపబడ లేదు. ఇటీవల విలయ తాండవ మాడిన ఈ కులభేద, దృష్టిదోష, పంక్తిభేదములను, సంఘ సంస్కర్తలెల్లరు సడలింప జేయుచునే వచ్చు చుండిరి. ప్రత్యేకించి మన గాంధీజీ హరిజన వాడలలో సర్వులకు సహ పంక్తి భోజన మేర్పాటు గావించెను. దీని ననుసరించి రాజకీయ వాదు లెల్లరు నడుచు కొనుచున్నారు. ఇప్పటికి అంటు వ్యాధివలె ఈ అంటుదోషము చాటుమాటుగా స[illegible]గా సాగుచునే యున్నది. ఈ అన్న ద్వేషము భయంకరమగు వ్యాధి కంటె భయంకరము.

**కరవావహై :**

ఇరువురము పని చేయవలెను. ఈ పని గూడ లాంఛన ప్రాయముగా నేడు పెద్దలు చేయునట్లుగాక జవసత్వముల నెల్ల నుపయోగించి చేయవలెనని "సహ వీర్యం" అన్న పదమును వాడిరి. తిండి దొంగలకు తిరుగులేని క్రియగా నున్నదీ క్రియా పదము.

**తేజస్వినావధీతమస్తు :**

'మా చదువు తేజోవంత మగుగాక.' ఇచట పాఠకులూహింప దగినదెంతో కలదు. "ఉపయోగంబునం దాఖ్యాతకుండోడ వర్ణకంబగు" అను చిన్నయసూరిగారి సూత్రానుసారం సాందీపనితో రామకృష్ణులు వేదంబులం జదివిరి–అనుటచే వేదము శిష్యులకు వచ్చువఱకు గురువు కూడ వారితోపాటు చదువుచుండవలె; కనుక గురు శిష్యులు సమానులని భావము.

ఇహపర సాధకములు గాని విద్యలు చదువరాదని విశ్వకవివేమన హెచ్చరించెను. నేటి చదువులు నిరర్థకములై మానవ మస్తిష్కములకు మాలిన్యమును గూర్చుచున్నవే కాని, సేవకావృత్తి కంకితములగుచున్నవే కాని మనుగడ కివి యుపయోగపడుట లేదు. యువకశక్తిని నిర్వీర్యమొనర్చి నైరాశ్యమునకు గుఱిచేయు

చున్నవి. సోమరి తనమును హెచ్చించు చున్నవి. స్వయంపోషకములు కావుట లేదు. అందువలన చదువెప్పుడు శక్తి మంతమై తనంత తాను స్వచ్ఛందముగా జీవించుట కనుకూలించవలెను. ముందుగా జాతి మత ద్వేష సాహిత్యము నంతను ఏరి పారవేయ వలెను.

మా విద్విషావహై :

గురు శిష్యులిరువురు ఒకరి నొకరు ద్వేషింపరాదని సామాన్యార్థము. గూఢము, గాఢమయిన రహస్యముల నెన్నింటినో గురువు శిష్యులకు బోధింపవలసియుండును. ప్రేమ పాత్రుడు, ప్రశాంతచిత్తుడు, భక్తి తాత్పర్యములు గలవాడే ఈ తత్త్వబోధ నకు ముఖ్యుడు. ఈ విషయముననే

వేదాంతే పరమం గుహ్యం
పురాకల్పే ప్రచోదితమ్ ।
నా ప్రశాంతాయ దాతవ్యం
నా పుత్రాయశిష్యాయ వా ॥
(శ్వేతాశ్వతరోపనిషత్ 6. 22.)

పూర్వకాలమందు రహస్యముగా నుంచ బడిన పరమార్థతత్త్వము నేడు బాగుగా బోధింపబడుచున్నది.అయినను దీనిని శాంత చిత్తము లేనివారికి పుత్రుడు గాని-శిష్యుడు గాని కాని వారికి బోధింప రాదు, అని తుది వాక్యముగా దీనిని తెలిపిరి. ఇట్లే భాగవత మున "బ్రూయుః స్నిగ్ధస్య శిష్యస్య గురవో గుహ్యమప్యుత" (1-1-8) గురువు ప్రేమించిన శిష్యునకు గూడ తమ విషయ ములను గూడ తెలుపునని యున్నది.

"అవిరోధేన బ్రహ్మకర్మ సమారభే" విరోధ రహితముగా శుభ కర్మల నాచరింప వలెనను ధర్మమునకు దారుకాణగా ఏసు నాథుడు గూడ "దేవాలయము వద్ద దైవ నైవేద్యము పెట్టునపుడు శత్రుత్వము జ్ఞాప కము వచ్చిన యెడల ఆ పూజనాపి యింటికి వెళ్ళి శాంతి పడి రమ్ము. రహస్య ముగా నుంచబడిన దెల్ల దాపరికము లేకుండ మీకు విప్పి చెప్పబడును అని చెప్పెను. గురు శిష్యులలో ద్వేషము లేక పోవుటయే కాదు. పరుల విషయమున విరోధము పనికి రాదు. రాగద్వేషాదు లతి ప్రమాదములు.

ఇంద్రియస్యేంద్రియస్యార్థే
రాగద్వేషౌ వ్యవస్థితౌ ।
తయోర్న వశ మాగచ్ఛేత్
తౌ హ్యస్య పరిపంథినౌ ॥
(భగవద్గీత. కర్మయోగము. 34. శ్లో)

కర్మేంద్రియ జ్ఞానేంద్రియములయందు రాగద్వేషములు వ్యవస్థితములై యున్నవి. ఆ రాగ ద్వేషములకు నీవు స్వాధీనము కాగూడదు. అవి జ్ఞానాభ్యాస విరోధులు; కనుక ఒకరినొకరు ద్వేషించు కొనరాదని భావము.

ఈ మంత్రములో అయిదు వాక్యములు గలవు. 1. పరులకు భారవహము కాకుండ స్వసంరక్షణాశక్తిని గురు శిష్యులు సంపా దించవలెను. 2. నిషిద్ధముగాని ఆహారమును లభ్యమైనంత వఱకు దాచుకొనకుండ పంక్తి భేద, దృష్టి దోషములు లేకుండ భుజించ వలెను. 3. జవసత్వములు పెరుగునట్లు కాయ కష్టము చేయవలెను. 4. బుద్ధి వికసించి భావ వికాసము గలుగునట్లు విద్యా భ్యాసము చేయవలెను. 5. గురు శిష్యుల మధ్యగాని, యితరుల యెడ గాని ద్వేష బుద్ధి పనికి రాదు. ఈ పంచ సూత్ర ప్రణాళిక ప్రపంచమున కంతటికి, మానవ జాతి కెల్ల నుపయుక్తమైనదే. వివిధ దేశీయులు సకల సంఘములు, అన్ని జాతులు ఆచరణ పూర్వకంగా అనదగినదీ మంత్రము.

మొత్తంమీద శిష్యుని కంటె గురువేవిధ మైన ఆధిక్యమును గోర లేదు. ఈ నాటి గురుశిష్యుల కిది గుణపాఠ మగుగాక.



శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం
శ్రీ వేంకటేశ్వర కల్యాణ ప్రదేశం
నారాయణవనం.

•

నిత్యకార్యక్రమ వివరాలు

| | | | |
|---|---|---|---|
| సుప్రభాతం ఉ॥ | 6-00 నుండి | 6-30 | |
| విశ్వరూపదర్శనం | 6-30 | ,, | 8-30 |
| తోమాలసేవ | 8-30 | ,, | 9-00 |
| కొలువు, అర్చన | 9-00 | ,, | 9-30 |
| శాత్తుమొర & గంట | 9-30 | ,, | 10-00 |
| సర్వదర్శనం | 10-00 | ,, | 11-30 |
| 2-గంట, అష్టోత్తరం (ఏకాంతం) | 11-30 | .. | 12-00 |
| తిర్వాణం | 12-00 | | |
| సర్వదర్శనం సా॥ | 4-00 | ,, | 6-00 |
| తోమాలసేవ, అర్చన (ఏకాంతం) | 6-00 | ,, | 7-00 |
| రాత్రి కైంకర్యం | | | |
| శాత్తుమొర | | | 7-00 |
| సర్వదర్శనం | 7-00 | . | 8-45 |
| ఏకాంత సేవ | 8-45 | ,, | 9-00 |

ఆర్జితాదుల వివరాలు

| | | |
|---|---|---|
| అర్చన, అష్టోత్తరం | .... రు. | 3-00 |
| హారతి | .... రు. | 1-00 |
| కొబ్బరికాయకు | .... రు. | 0-50 |
| సహస్రనామార్చన | .... రు. | 5-00 |
| పూలంగి (గురువారం మాత్రం) | .... రు. | 1-00 |
| అభిషేకానంతర దర్శనం (శుక్రవారం) | రు. | 1-00 |

# "అచ్చన్న వరదాళ్ళు బంచ్చి కేశవులం"

## — అసలురూపమేమి తిరుమలేశ?

శ్రీ వేంకటేశ్వరుని భక్తుడైన తాళ్ళపాక అన్నమాచార్యుల కవితా సామ్రాజ్య విశేషా లనుగూర్చి తిరుమల తిరుపతి దేవస్థానము వారి ధర్మమా అని నేడు విరివిగా పరిశోధన ప్రచారము సాగుచున్నది. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయములో అన్నమాచార్య సాహిత్య పరిశోధన విభాగము ప్రారంభింప బడి కొందరు విద్యార్థులు కృషిచేయుటం ముదావహము.

ఈ పరిశోధకులలో 1973 క్రితం వరకు అన్నమాచార్యులవారి జన్మస్థానము తాళ్ళపాక గ్రామమును-అందువెలసిన తాళ్ళపాక వారి ఇలవేల్పును దర్శించిన వారు లేరు. అంతకు పూర్వ మెవరు చూచిరో: తాళ్ళపాక వాఙ్మయాన్ని వెలుగునకు తెచ్చిన పెద్దలే దాన్ని సందర్శింప లేదన్న వింతకదా! వారి కృషి తిరుమల తిరుపతి దేవస్థానమువారి ప్రాచ్య పరిశోధనాలయంలో, మద్రాసు ప్రాచ్య పరిశోధనాలయంలో సాగింది. శాసన సంపుటాల్లో, రాగిరేకుల్లో వాటిని సందర్శించారు. శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరించిన 'అన్నమాచార్యచరిత్ర' (చిన్నన్న కృతము) పీఠికలో ప్రకటించిన ఛాయా చిత్రాలు మున్నగునవన్నీ తిరుమలలోనివి. తాళ్ళపాకవారి ఇలువేల్పయిన శ్రీ చెన్న కేశవుని ఛాయాచిత్రము, ఆ దేవుని ఆలయ మున్న తీరుతెన్నులు చూపే దృశ్యా లందు లేకపోవడము పెద్ద లా ప్రాంతాన్ని దర్శించలేదన్న దానికి నిదర్శనం. 1973 లో నేను రచించి యిచ్చిన అన్నమాచార్యుల తైలవర్ణ చిత్రము ఆవిష్కరణానంతర్ణం ఈ ప్రాంతము దేవస్థానము, ప్రభుత్వము వారి దృష్టిలోకి వచ్చినదనుట జగమెరిగిన సత్యం.

అన్నమాచార్య చరిత్రము, అన్నమాచార్య వర్ధంతుల వెలుగునకు కృషిచేసిన మహనీయుడు మా గురువర్యులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారని అక్టోబరు 'భారతి'పత్రిక 1980 'ఎవరు అన్నమాచార్యులు?' అను వ్యాసమున మనవి చేశాను. వారికి అన్నివిధాల చేదోడు వాదోడుగా నున్నవారు మాన్యులు శ్రీ చెలికాని అన్నారావుగారు, శ్రీమాన్ ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారు (శాస్త్రిగారి శిష్యులు).

ఆనాటి పెద్దలాశించినట్లే వారి ప్రణాళికతో నేడు తాళ్ళపాకవారి వాఙ్మయ పరిశోధనము, ప్రచురణ, ప్రచారము జరుగుచుండుట శ్రీ శ్రీనివాసునికృప, అన్నమయ్య అదృష్టము. మన మహద్భాగ్యము.

తాళ్ళపాక అన్నమాచార్యులు పద కవిత్వరచనా విలాసుడే గాక పద్యగద్య రచనాశోభితుడు. అష్టభాషా విశారదుడు. ద్విపద రామాయణము (తెలుగు), వేంకటాచలమాహాత్మ్యము (సంస్కృతము) వ్రాసెనట. (చూ. 1978 ముద్రణ. అ. చ. పీఠిక. 70 పుట) ఆతడు పద్యకావ్యములేమి వ్రాసెనో? కాని, శతకములు పంద్రెండు రచించెనట. (చూ. అ. చ. పీఠిక 73) "సకల భాషలందు ప్రతిలేని నానాప్రబంధములు రచించెనట. అన్నమాచార్యుని వేంకటేశ్వర శతకమొకటి నేను ప్రకటించిన ప్రబంధరత్నావళిలో నుదాహృతమైనది. దేవస్థానపు రాగిరేకులలో కానరాదు. అలమేల్మంగాంబ మీద నీతడు రచించిన శతకమిదే "(చూ. అ. చ. పీఠిక పుట 18) మఱి మిగిలిన పది శతకములు నే యే వేల్పుల మీద రచితములయ్యెనో వాని పేళ్ళేమో! తెలియరాదు'' అని శ్రీవేటూరి ప్రభాకర శాస్త్రిగారు తెలిపినారు.

శ్రీశాస్త్రిగారు ప్రబంధరత్నావళిలో నుదహరించిన వేంకటేశ్వర శతక పద్యములు అలమేలుమంగాంబ మీద వ్రాసిన 'వేంకటేశ్వరా' అను మకుటములుగల శతక పద్యములు ఒకటే-వేరుగావు. రెండు వేంకటేశ్వర శతకములు కావు. దీనివల్ల ఇక అన్నమాచార్యుని శతకాలు మనకు పదకొండు లభింప వలసియున్నది. ఈ విషయాన్ని అన్నమాచార్య చరిత్ర తృతీయ ముద్రణ పరిష్కర్తయగు శ్రీగౌరిపెద్ది రామ సుబ్బశర్మగారు పాద పీఠికలో "పదకొండు శతకములుకావలెగదా" అని సూచించినారు.

ఆ వేంకటేశ్వర శతకమును అన్నమాచార్యులవారు ఆశువుగాచెప్పినట్లు తాళ్ళపాక చిన్నన్న అన్నమాచార్యుల చరిత్రలో నున్నది, చూ!-

సరసకవిత్వవాచాప్రౌఢి మెఱసి
అలమేలుమంగకు నాశుమార్గమున
సలలితంబుగ నొక్క శతకంబుసెప్పె"
(అ. చ. పుట. 16)

అన్న

చెన్న కేశవ

అన్నమయ్య తెలియక చెప్పుకాళ్ళతో గొండ నెక్కుచుండగా మోకాళ్ళ ముడుపు దగ్గర అన్నమయ్య వెదురుపొదక్రింద నొక బండపై మైమఱచి నిద్రించినాడు. అంత అలమేలుమంగాంబ దర్శనమిచ్చి యూరడించి చెప్పులను విడిచి కొండ నెక్కుమని తెలిపి దివ్యప్రసాదమిచ్చి ఆకలిదీర్చి యరుగుటచే, మెలకువగొని కళవళమంది నిజమో కాదో యని యనుమానించి, కడకు నిజమని నమ్మి ఆశుకవితగా నమ్మవారిమీద ఈ శతకము చెప్పుట జరిగినదట! అవి నాలుగు పద్యాలు అన్నమాచార్య చరిత్ర పీఠికలో శ్రీ ప్రభాకరశాస్త్రిగారుదాహరించారు. అవి ఇవి-

అరిసెలు నూనె బూరియలు నౌగులు,
జక్కెర మండెగల్ వడల్
బురుడలు పాలమండెగలపూపము
లయ్యలమేలుమంగ నీ

## ౦య్య
# శతకము
**—విద్వాన్ శ్రీ మైనంపాటి సుబ్రహ్మణ్యం**

కరుదుగ విందు వెట్టఁ బరమాన్న
శతంబుల సూపకోట్లతో
నిరత వినిర్మలాన్నముల నేతుల సోనల
వేంకటేశ్వరా!

'చొచ్చితిఁ దల్లి నీ మఱుఁగు సొంపుగ
నీ కరుణా కటాక్షమె
ట్లిచ్చెదొ? నాకు నేఁడు పరమేశ్వరి!
యో యలమేలుమంగ! నీ
మచ్చిక నందు నీ తరుణి మన్నన నే
నిను(ఁ)గంటి నీకు నా
బచ్చెన మాటలేమిటికి? బ్రాతిలి
చూడఁగ వేంకటేశ్వరా"

'యోగ్యతలేని కష్టుఁడ నయోగ్యుఁడ
నన్నిటఁ జూడగర్భని
ర్భాగ్యుఁడ నీ కృపామతికిఁ బ్రాప్తుడ నో
యలమేలుమంగ! నా
భాగ్యము నీకృపాగరిమ
మప్రాప్యము కావుమటంచు సారె నీన్
భాగ్యవతీ శిరోమణిని బ్రస్తుతి చేసెద
వేంకటేశ్వరా!

'అమ్మకు దాళ్ళపాక ఘనుడన్నడు
పద్యశతంబు సెప్పెగో
కొమ్మని వాక్ప్రసూనముల గూరిమితో
నలమేలుమంగకున్
నెమ్మది నీవు చేకొని యనేక
యుగంబులు బ్రహ్మకల్పముల్
సమ్మదమంది వర్ధిలుము
జవ్వని లీలల వేంకటేశ్వరా!

ఈ పద్యాంతముల 'వేంకటేశ్వరా' అను సంబోధన మకుటమున్నను, పద్యమధ్యమున రెండవ పాదమున 'అలమేలుమంగా' అని అలమేలుమంగాంబ ప్రశంసయున్నది. కావున 'అమ్మకు అలమేలు మంగకున్ బద్య శతంబు సెప్పి' అనుటచేత నీశతకమల మేల్మంగాంబ స్తుతిపరమే, అని శ్రీ శాస్త్రి గారు తెలిపియున్నారు. వేంకటేశ్వరా! మకుటముచే వేంకటేశ్వర శతకమైనదేమో!

అన్నమయ్యా స్వామి సన్నిధిని తన కట్టువస్త్రమారెడులోపున స్వామి వారి పై నొక శతకము చెప్పినట్లున్నది. చూ:—
అ. చరిత్ర:

'అవగాహనముచేసి యాతేటనీట
ధవళంబుగా మును దాఁగట్టుచీర
నుదికి యారఁగవైచి యొకరాతిడెంద
నది యెండసాగెడు నంతలోపలనె
వితతవృత్తంబులు వేంకటపతికి
శతకంబు కుతుకంబు సమకూరఁజేసి'

పై అల్మేలుమంగాంబ ప్రశంసయున్న వేంకటేశ్వర శతకమే తాను మరల చెప్పెనా? లేక మరొకటి ఆమె ప్రశంస లేకనే వేంకటేశ్వరా మకుటంగల శతకము చెప్పెనా? ఈ చెప్పిన శతకమునే వైఖానసోత్తముండైన నంబి చెంగట స్వామి నర్చించు సమయమున మరల చెప్పి నట్లున్నది. చూ!— అ. చరిత్ర,

'గరమొప్పుచున్న వైఖానసోత్తముఁడు
నంబిచెంగట, బూజనను సేయుతఱిని
నంబిన భక్తినబ్బాలుండు మఱియు
వెంకటప్పకు విన్నవించిన తొంటి
వేంకటేశశతకంబు విన్నవించుటయు'

పద్యాంతమున మకుటపదముండినదై శతపద్యరచననే శతకమనుట తెలుగు సాహితీ లక్షణ సంప్రదాయం. పద్య మధ్య మున సంబోధన పదము ప్రతిపద్యమందు నియమముగ వచ్చినను, అది శతక లక్షణ మైన మకుటముకాదుకదా! సంస్కృత శతకవాఙ్మయమున నీ మకుట నియ మము లేదు. చిన్నన్న అలమేలుమంగ కున్ బద్యశతంబు' అన నేల? ఏమైన తెలుగు శతక వాఙ్మయమున నపూర్వమైన నీ పద్ధతికి నార్యుడన్నమాచార్యుడే! కానీ, ముక్కుపచ్చలారని బాలుని నోట శ్రీ శ్రీపతుల రహః క్రీడా విలాస పరమైన నీ శతకము వెలువడునా?

మా గురువర్యులైన శ్రీ వేదం వేంకటకృష్ణ శర్మగారు శతక వాఙ్మయము పరిశోధిం చుచు కొంత ప్రకటించి పుణ్యప్రాప్తినొందగా దానిని గురుసేవగా స్వీకరించి నేను పరి శీలించుచు నొకనాడు మా పెద్దల వ్రాత పుస్తకాలు (కవిలెకట్ట) తిరుగవేయు చుంటిని. శిథిలదశనున్న కాగితాల చిన్న నోటు బుక్కులోని వ్రాతలు చదువుచుండగ అందులో ఏవేవో పద్యాలు! భారత భాగ వతాదులలోనివి, నృసింహశతకం లోనివి, మరేవో పద్యాలు పాటలు కలగా పులగంగా నున్నవి గ్రహించాను. పెన్సిలు వ్రాతలో కొన్ని. కరక్కాయసిరాతో వ్రాసేవికొన్ని. సాధారణ సిరాతో వ్రాసినవి కొన్ని కాన వచ్చినవి.

వానిని పరిశీలింపగా రచనాలోపము లున్నవి. అసంపూర్ణములని తెలిసినది. జాగ్రత్తగా ఎత్తి వ్రాసికొన్నాను. ఉన్నవి ఉన్నట్లుకొన్నిటిని 'ఫోటోస్టెట్'తీసియుంచి నాను. పద్యముల కడపట ఎత్తుగీతములతో "అన్నయ వరదాల్లుండు బుచ్చిన్న కేశాలు అనీ, 'అన్న తలపకన్నన వరదాళ్లుండు బుచ్చినకొశాలు' అనీ, ఉండుట గమనిం చాను. 'అచ్చన్న వరదాళ్ళు బుచ్చి కేశవులు' అను మకుట భాగంతో నాచిన్ననాడు నా అమ్మానాన్నలు, పెద్దలు చెప్పగా నేర్చు కొన్న పద్యము జ్ఞాపకం వచ్చింది. ఆపద్యం చూడండి. 'చిన్నచెంబుతో నీళ్లు సికాయ యుదకంబు అల్లంబు బెల్లంబు అరటిపండు తేనెతో మాగిన తియ్యమామిడిపండు 'అచ్చన్న వరదాళ్లు బుచ్చి కేశవులు'— పద్యంలో 'అచ్చన్న, పదంలోనడుమనున్న 'చ్చ'-'న్న' కావచ్చు. అట్లయిన అచ్చన్న అన్నన. అన్నయగమారుట కవకాశ మున్నది. పలుకులోనో వ్రాతలోనో ఈ మార్పుకాలక్రమంలో కల్గియుండవచ్చు ననుకొంటాను.

అట్లే 'తలపకన్నన' అనుపదంలో తాళ్ళ పాక, తాలపాక. తలపక, అయినదికాబోలు! ఈ పదము వ్యవహారంలో మార్పు నొంద డమేకాక దొరికిన పద్యాల్లో పద్యలక్షణాని కనువుగా మార్పునొంది యుండవచ్చు. ఒక పద్యంలో 'అన్నయ వరదాళ్లుండు' అని స్పష్టంగావుంది. సందియమేల! ఈ శతక పద్యాలు అన్నమయ్యవే అను కొన్నాను. ఈ ఊహ నాల్గైదేండ్లుగా నా హృదయంలో ఆడుతూనేవుంది. *

(ఇంకావుంది)




అప్పారావు నిజంగా గొప్పవాడు. అసలు వాడెప్పుడూ అంతే. చిన్నప్పట్నుంచి కూడ పద్యాలు కంఠపాఠంచెయ్యటం భలేసరదా! తెలుగు అంటేచాలు చెవితెగకోసుకొనేవాడు. సుమతీశతకంనుంచి చౌడప్పశతకం దాకా, అప్పకవీయంనుంచి గురజాడ అప్పారావు గారి పుస్తకాలదాకా కనపడినవెల్లా కంఠతః పట్టేశాడు. ప్రతిపరీక్షలోనూ జవాబుపత్రాలు ఎక్కువతీసుకొన్న వాళ్ళల్లోనూ, అతితక్కువ మార్కులు వచ్చిన వాళ్లల్లోనూ కూడా వీడికే ప్రథమస్థానం. నాకు మాత్రం ఏదో అనుమానంగా వుండేది, వీడికి ఎక్కడో లోపం వుందని!

ఒకనాటి మధ్యాహ్నం నిద్రపోతున్న వాడల్లా లేచి 'రాకానిశారాజశ్రీసఖమైన' అంటూ అరిగిపోయిన గ్రామఫోన్ ప్లేటు మాదిరి అరుస్తూండడంతో అందరూచేరి నిమ్మకాయ వైద్యంతో ప్రారంభించి, చివరకు పెళ్లికుదిరితేగాని ఇదికుదరదని తేల్చేసుకొని, ఓ అమ్మడ్ని కట్టబెట్టి ఓ ఉద్యోగం కూడ అంటగట్టారు. అప్పటినుండే ఇంటిపట్టు, పెట్టు, బాగావంటబట్టాయనీ ఉద్యోగంకూడా బాగానే చేసుకొంటున్నాడనీ అంటే కావోసు అని నేను సంతోషించా.

ఒకరోజు మాఅప్పారావు వేళకానివేళలో, వేసవిమధ్యాహ్నం, ఇంటితలుపు తట్టాడు. మనిషి బాగాకోపంగా వున్నాడు. కూర్చోరా అని, ఈ వేళప్పుడొచ్చావేమిటి? ఉద్యోగం లేదా? అన్నా. మానేశా అన్నాడు కాలు మీదకాలు ఊపుకొంటూ. 'ఎందుకనీ?' అన్నా..... వీడేదోపాడుపని చేసుంటాడని. 'ఏముంది? వాళ్లుమూడువందలిస్తున్నారు,నేను అయిదడిగా,వాళ్ళు నాలుగిస్తామన్నారు. కోపంవచ్చి లేచొచ్చా. అలాంటి వాళ్ళ ముఖం చూడగూడదు. మన వాళ్లు చెప్పలా అంటూ ఏదో ఉండ నామొహాన పారేశాడు. నేను భయంతో కళ్లు మూసుకొన్నానో ఏమో- కళ్లుతెరిచే సరికి అప్పారావు లేడు. ఉండమాత్రం నా ఒళ్ళోవుంది. ఏం ప్రమాదం జరుగలేదులే అనుకొని తీరా విప్పి చూద్దునుగదా అదిసుమతీశతకంలోది ఒక పేజీ! ఒక పద్యానికి నాలుగు పాదాల కింద ఎర్రసిరాతో గీతలుగీసివుంది.

అడిగిన జీతం బీయని
మిడిమేలపు దొరనుగొల్చి మిడుకుటకంటెన్
వడిగల ఎద్దులు గట్టుక
మడిదున్నుక బ్రతకవచ్చు మహిలో
సుమతీ!

అతిగా చదివి అప్పారావు తెచ్చుకొన్న అనర్థమేమిటో నాకిప్పటికి అర్థమైంది. ఒక నికృష్టపు పిసినిగొట్టును గూర్చి చెప్పిన పద్యం తనకన్వయించుకొని అప్పారావు పప్పులో కాలేశాడనిపించింది. గడపలెక్కి దిగేవాళ్ళ లెక్కలో ఇంకొకడు చేరాడే అనిపించింది. మనసెందుకో మథనపడసాగింది. అన్నారే కాని, నిజానికి మడిదున్నటం మాత్రం తక్కువైందా? మనస్సు మరొక సంఘటనమీదకి పరుగెత్తింది.

* *

"అయ్యా! కూలి'
"రేపు రా"—
ఆ మర్నాడు....
"అయ్యా కూలీ"
"ఇప్పుడు లేదు, రేపురా!
....ఆ తరువాత రోజున
"అయ్యాలన్నా మా డబ్బులిస్తారా?"
"లేవు! ఉన్నప్పుడిస్తా! ఫో"
"మాకష్టం డబ్బులు మాకియ్యటాని కేందండి!-
"ఒరే! వీడు చట్టాలు మాట్లాడుతున్నాడు పట్టుకు తన్నండిరా!"

అంతే! ఆ కడుపుకాలినవాణ్ణి, కడుపులో చల్లకదలని వారి బలగాలు పాతేసినంత పని చేసి బయటపారేశాయి. తరువాత పదిరోజులకు ఈ కడుపుకాలిన వాళ్ళంతా ఒకరోజున ఆకలవారిలోగిలి కలియబెట్టి వెళ్లారనీ, అంతకుముందు పట్టుకుతన్నమన్నాయనకు కట్లు, పట్లు, వేస్తున్నారని పత్రికల్లో పడ్డట్టు జ్ఞాపకం!

* *

అసలీ సంఘటనలు రెండూ ఒకే సమతాధర్మ స్రవంతికి అవలి, ఈవలి ఒడ్డులు. సామాజిక ప్రాథమిక సూత్రానికి అతివ్యాప్తి-అవ్యాప్తి దోషాలున్నాయను కోకపోవటం వల్ల జరిగే అనర్థాలు.

నిజానికి మనిషి సంఘజీవి అనీ సంఘానికి వ్యక్తికీ, వ్యక్తికి వ్యక్తికీ నడుమ వివిధ ధర్మాలు, కర్మలు ఉన్నాయనీ, వాటికి వ్యత్యయం ఏర్పడినప్పుడు సమాజంలో ఉద్రిక్తతనెలకొని, అనర్థానికి, అశాంతికి దారితీస్తుందని ఎందరికి తెలుసు? సమాజంలోని అక్రమాలు ఈనాటి 'ఇజాల' దాకా వస్తాయను కోకపోయినా, సమాజం సంక్షు

నాగరాజ్

భిత మౌతుందన్న నిజంమాత్రం, రామాయణ కాలంనాడికే తెలుసు.

అందుకే రాముడు, చిత్రకూటంలో, తనను వెనుకకు పిల్చుకు వెళ్ళటానికి వచ్చిన భరతునితో రాజధర్మాన్ని ఉపదేశిస్తున్నట్లుగా అడుగుతాడు.

కచ్చిద్బలస్య భక్తం చ
వేతనం చ యథోచితమ్
సంప్రాప్తకాలం దాతవ్యం
దదాసిన విలమ్బసే ?

"నీ సైన్యానికి, భృత్యులకు ఆ యా సమయములలో ఈయవలసిన వేతనం వారి వారి పనులకు తగినట్లు ఆలస్యంలేకుండా ఇస్తున్నావు కదా !"

"కాలాతిక్రమణాచ్చైవ
భక్తవేతనయోర్భృతాః ।
భర్తుః కుప్యంతి. దుష్యంతి
సోఽనర్థః సుమహాన్ స్మృతః ॥"

"ఈయవలసిన సమయానికి ఆలస్యమైన పక్షంలో, వాటిమీదనే ఆధారపడే భృత్యాదులు ప్రభువును కోపగిస్తారు. అది చాలా అనర్థానికి దారితీస్తుందని పెద్దలంటారు." అలాగే భారతంలో కూడా ఈసమస్యను మరింత స్పష్టంగా వివరించారు నారద మహర్షి ధర్మరాజుకు :

"భృత్యకోటికి ననూనముగా దగు జీవితం బులాయత్తముసేసి యిత్తె దయ నయ్యాయి కాలము దప్పకుండగన్" - అందే ఇయ్యవలసినదానిని కూడా తగ్గింపు లేకుండా. ఆదరంతో సకాలంలో ఇవ్వాలట.

తమతమ కనియెడు తరి జీ
తముగానక నవయుభటుల దౌర్గత్యవిషా
దములేలినవాని కవ
శ్యము సెగ్గొనరించు నతడు శక్రుండైనన్

ఈయవలసినది ఈయకపోతే ఆ భటుల విషాదం దేవేంద్ర సముణ్ణయినా దించేస్తుందట! ఇంతేకాదు. తనకోసం మరణించిన వారిపై ఆధారపడిన వారిని అన్న వస్త్రాదులిచ్చి కాపాడాలని కూడ ధర్మం బోధిస్తుంటే అన్ని ధర్మాలూ వదలిన వాళ్ళపై తిరుగుబాటుకు అవకాశం ఏర్పడిందంటే ఆశ్చర్యమేముంది?

నిజానికి భారతయుద్ధానికి కారణం, దుర్యోధనుడు నియమాన్ని సమయ భంగం చెయటం కాదా ?

కనుక మహారాజుకైనా, మామూలు మనిషికైనా, కొన్ని నియమాలు,సమయాలు తప్పవు. వాటినిపాటించనప్పుడే సమస్యలు తలెత్తేది. ఈవిషయాన్నే సుమతిశతకం చెప్పింది. స్థూలంగా వాన్ని ఇలా అన్వయించుకోవచ్చు మరి.

ఒప్పుకున్న జీతాన్ని ఎదటివాడు అడిగే అవసరంలేకుండాఇచ్చి ఆదుకోవటం, మంచితనం, మానవత్వమేకాదు, కుశాగ్రబుద్ధి కలవాడిపని. ఉత్తమపద్ధతి.

ఒకవేళ అలా ఇవ్వలేని పక్షంలో ఎదుటవాడు తనను అడిగినప్పుడైనా వెంటనే ఇచ్చివేయటం- అడిగితేగాని ఇవ్వలేదనే అసంతృప్తివున్నా, అడిగినా ఆలస్యం కాకుండా ఇచ్చాడనే తృప్తి కలుగుతుంది కనుక- ఇది మధ్యమ పద్ధతి.

అడిగినా జీతం ఇవ్వక పోవటం వల్ల పరపతి చెడిపోయి ముందు ముందు సహాయం దొరకక పోవచ్చు. కనుక ఇది అధమపద్ధతి.

తానుఇవ్వలేక, ఇవ్వక, అడిగాడనే ఆక్రోశంతో అవహేళనచేసి అత్యాచారం జరపటం ఏనీతిలోనైనా అధమాధమమైనపద్ధతి. ద్రోణాచార్యులు ద్రుపదునిమీద తీర్చుకున్న ప్రతీకారం ఈలాంటి అవమానంవల్లనే. దీనివల్ల పరపతి సంగతి దేవుడెరుగు. అడుగడుగున పోరాటమే ఎదురౌతుంది.

ఆ సుమతి చెప్పింది ఈ నడమంత్రపు సిరిగల మిడిమేలపు దొరలగురించే అనాలి. ఇది గ్రహించని అప్పారావు బోర్లబడ్డా, ఆ రెండో ఆయన కట్లు, పట్లు, వేసుకొన్నా అదెవరితప్పు ? మొత్తంమీద మనం బ్రతికున్నా లేకున్నా మనగగ్గే శాశ్వతసత్యం ఈ పద్యం—

## శ్రీ తత్వాలు

వేదాల స్వరధుని
కవ్వపు రసధ్వని
ఆ జంటతత్వం
సుజ్ఞాన వికసని

విశ్వంభరత్వం
వనితా విలాసం
ఆజంటతత్వం
విశ్వవిహారం

ఢమరుకనాదం
నారీప్రమోదం
ఆ జంటతత్వం
సమధర్మ భావం.

అగ్ని బాణం
అతివకు ప్రాణం
ఆ జంటతత్వం
ధర్మానుసరణం

రాగాల మురళి
మోహాల సరళి
ఆ జంటతత్వం
వేమ నివాళి.

ద్వారక యానం
నాయిక ధ్యానం
ఆ జంటతత్వం
సద్భక్తి శీలం.

సత్య సరాగం
యోగ వియోగం
ఆ జంటతత్వం
అజ్ఞాన మథనం.

తృష్ణా సాగరం
వ్యథా సాగరం
ఆ జంటతత్వం
సుఖ నిష్క్రమణం.

యోగారూఢం
జ్ఞాన ప్రసాదం
ఆ జంటతత్వం
సుజన పాలనం.

తామస దోషం
తరుణికి రోషం
ఆ జంటతత్వం
కలి జనోద్ధరణం.

_ పోగుల శ్రీనివాసరావు




తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# ఉదయాస్తమాన సర్వసేవాపథకం

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి వారిని సంపూర్ణంగా అర్చించడానికి భక్తులకొక సదవకాశం!

తలుపులు తెరచినప్పటి నుండి తిరిగి తలుపులు మూసేవరకు ఒక దినంలో తిరుమల శ్రీవారి ఆలయంలో జరిగే సమస్త పూజావిధులను అనగా సుప్రభాతం, తోమాల, అర్చన (మూడు పర్యాయాలు) నైవేద్యం ఇంకా ఇతర ప్రత్యేక సేవలను ఉదయాస్తమాన సర్వసేవానిధి పథకం క్రింద భక్తులు తమ పేరిట స్వంత ఖర్చులతో స్వామివారికి జరిపించవచ్చును.

పథకంలోని ముఖ్యాంశాలు :

* కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం పేరిట ఒక లక్షరూపాయల విరాళాన్ని క్రాస్ చేసిన డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా చెల్లించాలి. శుక్రవారం సేవలకు మాత్రం మూడులక్షల విరాళం (అభిషేక నిమిత్తం) ఇవ్వవలసి వుంటుంది.
* భక్తులు తమ కైంకర్యములు జరిపే రోజున ఆరుమంది సభ్యులకు శ్రీవారి దర్శనం వుంటుంది. అనివార్య కారణాలవల్ల కొన్ని సేవలు రద్దుకాని పక్షంలో సుప్రభాతం, తోమాలసేవ, సహస్రనామార్చన, ఏకాంతసేవల వంటి అన్ని పూజావేళలలో శ్రీవారిని దర్శించవచ్చును. (శుక్రవారం తప్పించి)
* కైంకర్యదినాన ఆలయంలోపల దాత పేరు ప్రదర్శింపబడుతుంది. గోత్రాదులతో సహా దాత పేరును శ్రీవారి కొలువులో ప్రకటిస్తారు.
* ఆ దినాన జరిగే ఆర్జితసేవలన్నింటిని కైంకర్యదాత తన వారితోసహా తిలకించవచ్చును.
* కల్యాణోత్సవంలో శ్రీవారి ఉత్సవమూర్తులకు సమర్పించే శేషవస్త్రాలు మూడింటిలో ఒకదానిని గృహస్థుకు బహూకరిస్తారు. ఉచితప్రసాదంగా 25 లడ్డులను, 5 వడలను ఇస్తారు.
* వస్తువుల ధరలు గణనీయంగా పెరిగిపోయిన పక్షంలో పూజాకార్యక్రమాల అదనపు వ్యయాన్ని దాతలే భరించవలసి వుంటుంది. అందుకు సిద్ధంకానపుడు ఆనాటి అదనపు వ్యయం భర్తీ చేసేందుకు దేవస్థానం మరొకరి విరాళాన్ని స్వీకరించవలసి వస్తుంది. అటువంటి సందర్భాలలో ఒకరు లేదా అంతకు మించిన దాతల పేర్లతో ఆనాటి పూజలు జరుపబడుతవి.
* కైంకర్యములు జరిగే తేదిని గురించిన వివరాలను దేవస్థానం ఆయా దాతలకు తెలియజేయగలదు.

ఈ పథకం గురించిన ఇతర వివరాలకు - వివరణలకు కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి అనే చిరునామాకు వ్రాయండి.



# మధుర భక్తి ప్రబంధం

# 'ఏకాంతసేవ'

ఆధునికయుగంలో మొట్టమొదటగా ఆంగ్లభాషా ప్రభావం వలన నూతన భావ కవిత్వం ఆవిర్భవించింది. ప్రకృతి వర్ణనలకు బదులు సుకుమారమైన సౌందర్య తత్త్వం ఆ కవిత్వంలో చోటు చేసుకొన్నది. కవులు బాహ్యసౌందర్యాన్ని పరిత్యజించి అంత స్సౌందర్యానికి ప్రాధాన్యం ఇచ్చినారు. వీరు స్త్రీని కామైక దృష్టితోగాక ఆరాధ్య దైవంగా భావించి అమలిన శృంగార తత్త్వాన్ని కవిత్వంలో ప్రవేశపెట్టినారు. భావకవిత్వంలో ముఖ్యంగా ఆత్మాశ్రయ తత్త్వాన్ని; ఆరాధనతత్త్వాన్ని చూడ వచ్చును. ఈ కవులకు ప్రకృతిలోని ప్రతి వస్తువు రమ్యంగానే గోచరించింది. ప్రకృతి వీరికి మోహినీరూపంలో దర్శన మిచ్చింది. కవి ప్రకృతితో తన అంత రంగాన్ని విప్పిచెప్పుకొని ఆమె ఒడిలో సేదదీర్చుకొంటాడు.

ఈ విధమైన లక్షణాలతో వెలువడిన భావ కవిత్వంలో భక్తితత్త్వం ప్రధానమైనదిగా గోచరిస్తుంది. భావకవులకు భగవంతుడు మానవుడు సృష్టించుకొన్న కల్పనా మయ మూర్తి. అట్టి భగవంతుని సన్నిధికోసం వీరు పదే పదే పలవరిస్తారు. రక్తితోపాటు భక్తినికూడా చేరదీసి భగవంతునిలో ఐక్య మవటానికి ఎల్లప్పుడూ సేవకులుగా వుంటారు. భగవంతునిపట్ల పరిశుద్ధమైన ప్రేమ ఉండటమే భక్తి అని వీరి నమ్మకం.

భగవంతుని సన్నిధి చేరడానికి భక్తులు పూజలు చేస్తూవుంటారు. ఈ ఆరాధనలో అనేక విధాలైన భక్తిభావాలు నెలకొని ఉంటాయి. అందులో మధురభక్తి ఒకటి. ప్రేమవిషయంలోనూ, శృంగార విష యాలలోనూ లౌకికంగా తనివితీరని ప్రేమి కుడు తన్నుతాను నాయికగా సంభావించు కొని భగవంతునికి తనలోనున్న వలపును ప్రకటించడమే మధురభక్తి, అంటే భగ వంతుని సాన్నిధ్యాన్ని పొందడానికి అతి సులభమైన మార్గం ఈ మధురభక్తి వలన లభిస్తుంది. భగవంతునికి సర్వాత్మ సమ ర్పణం గావించడం ఈ భక్తియొక్క ప్రధానలక్షణం. భగవంతునిపైనున్న భక్తి భావంతో స్త్రీపురుషులెవ్వరైననూ తమని స్త్రీగనే భావించి భగవంతునిపై వలపును వ్యక్తం చేయవచ్చును. ఇటువంటి కోవకు చెందిన భక్తి రూపంలో వలపు ప్రకటిత మైనాగాని తప్పుగా భావింపబడదు. ఆ ప్రక టితమయ్యే వలపునకు నోచుకునే వ్యక్తి ఆ భగవంతుడే. కావున మధుర భక్తిలో కొంతవరకు శృంగారం చోటుచేసుకొని ఉంటుందనడంలో ఆశ్చర్యమేమీ లేదు.

ఆధునిక యుగంలో భావకవితోద్యమ కాలంలో వెలువడిన కావ్యాలలో "ఏకాంత సేవ" మధురభక్తి పారమ్యమైన కావ్యం. దీన్ని రచించినవారు బాలాంత్రపు వేంకట రావు (1881-), ఓలేటి పార్వతీశం (1882-1955). వీరు ఆధునిక తెలుగు జంటకవు లుగా (వేంకట పార్వతీశ్వరులు) ప్రసిద్ధి పొందినారు. వీరిరువురు ఏకోన్ముఖంగా రచించిన కావ్యమే ఏకాంతసేవ. వీరు భక్తి పట్టున మహాపరవశులు. వీరి వాణి కొండ యేరువలే మంజుగానంతో అతి త్వరితంగా ప్రవహిస్తూ వుంటుంది. వైష్ణవగీతాలలోని ప్రేమోన్మాదం వీరి భావోద్రేకాన్ని ఎక్కు వగా రగిల్చింది.

ఏకాంతసేవలో మధురభక్తియుతమైన అద్వైత ప్రణయ సిద్ధాంతం ప్రతిపాదింప బడింది. ప్రకృతి పురుషుల ప్రణయగాథ ఇందు ప్రధానంగా చెప్పబడింది. ప్రకృతి వనలక్ష్మి. పురుషుడు త్రిమూర్త్యాత్మక స్వరూపుడైన సూర్యుడు. అహస్కరుడు

అపర దిక్కాంతను చేరడం చేత రాత్రి అంతా విరహంతో విసిగి వేసారిన ప్రకృతి కాంతకు ప్రాతఃకాల సూచనలు దృగ్గోచరమైనాయి. అప్పుడు సర్వసన్నద్ధంగా ప్రియుని దరిచేరడానికి ఆమె బయలుదేరింది. ఇంతలో ఇతడే తనకు తారసపడినాడు. ఆమె ప్రేమ సఫలీకృతమైంది.

ఈ కథా కథనంలో ఎక్కడా వాచ్యం చెయ్యకుండా ప్రగాఢమైన ఒక ప్రణయేచ్ఛగా ఒక భక్తురాలు తన ఆరాధ్య దైవాన్ని భర్తగా సంభావించి ఒనర్చినటువంటి మధురభక్తి సంబంధమైన ఆరాధనా తత్త్వంగా మలచి ధ్వని గర్భితంగా కావ్యరచన గావించినారు వేంకట పార్వతీశ్వరకవులు. ఈ కవులిద్దరైననూ ఏకరూపులై ప్రకృతి సంబంధమైన వన లక్ష్మిలో విలీనమై కాంతునిపై ఆ కాంత చేసిన 'ఏకాంత సేవ"లో అవతరించిన పురుషోత్తముని తమను తాము (కవులు) సమర్పించుకొని ధన్యులయినారు.

కావ్యారంభంలో—

"శ్రీవిలాసంబుతో జిద్విలాసమున
కర్థ తాత్పర్య సమాశ్లేషమయ్యె"—

అనే విధంగా మొదటిపద్యం నాందీ లక్షణ ప్రయుక్తమై కావ్యాన్నంతటిని దృశ్యాత్మకం చేసింది. ఇందు కవులు ఏకోన్ముఖంగా ప్రేయసియై భగవంతుని సన్నిధి చేరడానికి ఏ విధంగా మధుర భక్తిని ప్రదర్శించినారో పరిశీలించవలసి వుంటుంది.

ఏకాంతసేవకై ఎదురు చూస్తున్న ప్రియురాలు ప్రభాతసమయంలో హృదయేశ్వరునిగూర్చి కోయిలయై గొంతెత్తి పాడింది. ఆ పాటలో మనోహరమైన పంచమస్వరాన్ని వినిపింపసాగింది. మధురం, మార్దవం, మంజులం, మానసానందకరం, మంగళం చేకూరునట్లుగా తన తియ్యటిగొంతుతో ప్రియుని పలకరించింది.

విభుని శ్రీపాదములగొల్చు వేళయేమొ?
రమణునేకాంత సేవకు సమయమేమొ?

ఏకాంతసేవ. పుట. 2

అని తలచుకొంటూ వనమంతా వెదకసాగింది.

అంతలో తళుక్కుమని కన్పించిన కళ్యాణమూర్తి కనుమరుగవుటచే దుర్భర విరహానలంతో ప్రణయాధినాథుని సందర్శనానికై పరితపించింది. అతని సన్నిధికై దిక్కులు వెదుకసాగింది.

కల్యాణగీతిలో గలకంఠి చొక్కి
ప్రణయ గానంబులో భ్రమరిక చిక్కె
నానంద వార్ధి నే వివశనై యుంటి
గరుణింపవే యిక గళ్యాణమూర్తి,

ఏకాంతసేవ. పుట. 8

అని తన దీనావస్థను వ్యక్తపరచింది. నీ మనోహరమూర్తిని చూడడానికి నేను నిశ్చలమైన భక్తితో ధ్యానంచేస్తూ తన్మయత్వంలో, ఏకాగ్రదృష్టిలో, నీవేలోకాలుగానున్న వేళ నీ విలాసాలు, వయ్యారాలు, వర్తనాలు చూపి నన్ను విసిగించడం పాడియా? అని వాపోయింది.

అప్పుడే తను చేసిన పొరపాటును జ్ఞప్తి తెచ్చుకొంటుంది. స్వామిపూజాసమయంలో తన ప్రాణనాథుని రూపాన్ని దర్శించక పోయినందుకు తన ముగ్ధత్వాన్ని తలచుకొని కారణమేదై ఉండవచ్చునని ఆలోచించింది.

విరిదండ మెడలోన వేయుటేకాని
కన్నార నీమూర్తి గాంచనేలేదు.
ప్రణమిల్లి యడుగుల బడుటయేగాని
చేతులారగ సేవచేయనేలేదు.
నినుగాంచి ముగ్ధనై నిల్చుటేగాని
ప్రేమదీరగ బల్కరింపనే లేదు.
ఏమేమొ మనసులో నెంచుటేగాని
తిన్నగా నాకోర్కె దెలుపనే లేదు.

ఏకాంతసేవ. పుట. 14

అనుకొని తాను సంతోషించడం, పారవశ్యం చెందడం అపచారమని భావించింది. మరుక్షణమే 'లేనిచో ఎందుకా విధంగా చేస్తాడని' ప్రశ్నిస్తూ మనసులోనే ఎంచుకునే విధంగా మాయలు చేయడం నీకు భావ్యంగావుందా ప్రాణేశా? అంటూ భగవంతుణ్ణి ప్రశ్నించింది.



నిన్నువీడి ఒక్కక్షణమైనా నిలువజాల నని తన అశక్తతను తెలియజేస్తూ ప్రాణ నాధుని దర్శనభాగ్యం కోసం అతనికి రకరకాలైన పదార్థాలను సమకూర్చింది. అతనిరాక కోసం ఎదురుచూసింది.

నెలవంక దొన్నెలో నిర్మలామృతము
తెలితమ్మిగిన్నెలో దేవెపానకము
చిగురు పళ్ళెములోక్షీరోదనంబు
అలరు దోయింట దీమని దోరపండ్లు.

ఏకాంతసేవ. పుట. 17

మొదలైన పదార్థాలన్నీ సిద్ధంచేసి చాలాసేపయింది. కరుణించి వచ్చి విందార గించి నా మనోరథాన్ని తీర్చుస్వామీ! అంటుంది.

భగవంతుని మీది (ప్రియుని) ప్రణయ భావంతో ఆమెమనసంతా మహదానం దంతో పులకించిపోగా ఆమెలో వింత భావాలు పొడచూపినాయి. దీనికంతటికి ప్రాణ నాయకుడైన భగవంతునిచేయి స్పృశించడమే కారణమని గమనించింది. అందుకే ఆమె—

నిరవధికానంద నిలయమైయున్న
నీమోముదమ్మిపై నిలిచినచూపు
నీపాదయుగములపై నిలిచినమనసు
నీ దివ్యసన్నిధి నిలిచినమేను
నినువీడి పోవంగ నేర్చునటయ్యా?

ఏకాంత సేవ. పుట. 13

అని ప్రశ్నిస్తూ సాలభంజిక, పుష్పవల్లిక. బాలశారిక, కనకపీరిక అయిన తనను తన ప్రాణనాయకుని కేళీగృహంలోనూ, పూల తోటలోనూ. పంజరంలోనూ, పాదాల చెంతనూ నిలువనిమ్మని కోరుకున్నది. అంతేగాదు తరంగిణులు ప్రవహించేచోట, ప్రణయలతావళులు ప్రాకేచోట, ప్రణయ పల్లవా లుద్భవించేచోట ప్రణయకోరకాలు ప్రభవించేచోట, ప్రణయపుష్పాలు ప్రస వించేచోట, ప్రణయ ఫలాలు ఫలించేచోట, ప్రణయమే లోకమై మసలేచోట మనమిద్ద రమే ప్రణయశకుంతదంపతులవలే ప్రణయ సామ్రాజ్యాన్ని ఏలుదామని ప్రణయ మూర్తిని ఆహ్వానించినది. వెంటనే—

ఆత్మేశుఁలో నైక్యమందకయున్న
నాకిప్పుడింత సేవైన నోపనిసేను
కొంగుబంగారమై కోరికలొసగు
జీవితేశునిజూచి జీవింపగలనె?

ఏకాంతసేవ. పుట. 37

అని తన ముగ్ధత్వాన్ని తెలియజేసింది. తనకు దర్శనభాగ్యం కల్గించకుండ తప్పించుకు తిరుగుతున్న ప్రణయ స్వరూ పుని పట్టితేవడానికి ప్రణయవనంలోని పుష్పరథంలో భ్రమరమే బాసటగా నిలి చింది. తర్వాత—

వరనందనోద్యానవరలక్ష్మి నేను
తరుణ శృంగార మాధవుడవు నీవు
.... .... ....
ఏలదాగెదవింక హృదయాధినాథ

ఏకాంతసేవ పుట. 18

అని అద్వైత ప్రణయ తత్త్వాన్ని తెలి పింది. తుట్టతుదకు తనశ్రమ ఫలించింది. అభీష్టం నెరవేరింది. మధురమైన మాటలతో భక్తియుక్తులతో, మంజులగానంతో, మనో హరమూర్తి అయిన ప్రియుని (భగ వంతుని) దరి చేరడానికి సమయం ఆసన్న మైంది. ప్రియుని వేణుగానం ఆమెకు వినిపించింది. అది ఆమెను ఆహ్వానించి నట్లుందని తృప్తిపడింది.

ప్రణయపురంబులో ప్రాసాదవీథి
వేణుగానరవంబు వినవచ్చుచుండె

ఏకాంతసేవ పుట. 55

వేణుగానం వినిపించు నంతలో తన ప్రియుడు ఎప్పుడైననూ ఏ సమయంలో నైననూ ప్రేమతో మనసిచ్చి పిలిచినా, ఆనందమూర్తియై ఆడినా "చిత్తమా! బెదర బోకమ్మా!" అని తన చిత్తమునే దండించు కొన్నది.

అనంతరం ప్రియుని ఏకాంతసేవకు పదిలమైన పాణిద్వయంతో, నిశ్చలమైన నేత్రద్వయంతో స్వామినర్చించు పూజాద్ర వ్యసమితితో ఆమె ఆయత్తయై ఉండడం "శ్రీపుష్ప సంయోగ సిద్ధి" చేకూరడం, యుగయుగాలనుండి మ్రోగు అనంతవిశ్వ గానం, నిత్యనూతనగానం మరల మరల పాడిందే పాటగా ఆమె పాడుకుంటూ వుండడం జరుగుతుంది.

ఏకాంత సేవలో నీవేళవార
పద్మాసనంబున్న పదపీఠికలె
శ్రీ పుష్ప యోగసంసిద్ధి చేకూర
దేవికి పాడినదే పాట యమ్మో.

ఏకాంతసేవ పుట. 63

ఈవిధంగా ఏకాంతసేవలో ఒక భక్తు రాలు ప్రయాణమయస్వరూపుడైన భగ వంతునే ప్రియునిగాఎంచి అతని సన్నిధి చేరడానికి పడే తాపత్రయం మధురభక్తి ప్రధానంగా ప్రకటితమైంది. భక్తుడు భగ వంతునిలో ఐక్యమవడానికి జరిపే కృషి ఇందు ధ్వనిగర్భితంగావుంది. తెలుగు సాహిత్యంలో పోతన గోపికల విషయం లోనూ; పదకర్తలు, సంకీర్తనాచార్యులు తమతమ విషయాలలోనూ పైవిధమైన మధురభక్తి భావాన్ని ప్రదర్శించినారు. ఆధునికకాలంలోనూ భావకవుల్లో చాల మంది మధురభక్తి ప్రధానాలైన కావ్యా లను వెలయించినారు. కానీ వేంకట పార్వతీ శ్వర కవులచే రచింపబడిన ఏకాంతసేవ "శ్రీ పుష్పయోగసంసిద్ధి" చేకూరడానికి అత్యుత్తమ మార్గదర్శి అనడంలో అతిశ యోక్తిలేదు.

చివరగా దేవులపల్లి కృష్ణశాస్త్రి మాటల్ని జ్ఞప్తికి తెచ్చుకోవలసి వుంటుంది. "నెమ్మి నెఱజాణలాటకత్తెలుగా, కోయిలలు తోడి గాయకులుగా, తేటిరొదశ్రుతిగా నందన వనమునను, మందాకినీ తీరమునను, ప్రభాత సమయమునను, చంద్రికా (పులకిత) యామినులను, నింగిపై నీలాల పేరు ప్రేలాడునట్లు, విశ్వమంతయు వెన్నెలతీగ ప్రాకునట్లు, దిక్కులన్నియు విశ్వగానముతో నిండునట్లు, ప్రకృతి అంతయు పరవశమగునట్లు" ప్రవిమల భక్తియుక్తుడైన భక్తుడు పరమేశ్వరుని గూర్చి పాడు ప్రణయగీతం యీ ఏకాంత సేవ. ఇంతటి రసవత్తర కావ్యాన్ని మన కందించిన వేంకట పార్వతీశ్వర కవులు ధన్యులు, చిరస్మరణీయులు.

— డా॥ జి. శంకరరెడ్డి

---

ఈ ఏకాంత సేవనే డా॥ బాలాంత్రపు రజనీకాంతరావుగారి ఆంగ్లానువాదం 'Spouse Divine' గా దేవస్థానం ప్రచురిం చింది. సం॥

---

(19 వ పేజీ తరువాయి)
మన్వాది ధర్మ శాస్త్రాలు కూడ స్త్రీలకు వ్రతాధికారాలు లేవని పేర్కొన్నాయి. ఇలా పేర్కొనడానికి కారణం స్త్రీ అస్వతంత్ర, అబల కావడమే. అయితే వ్రతం ఆచరించాలని వాంఛ కల్గిన స్త్రీ తాను కన్యగా ఉన్నప్పుడు తండ్రి అనుజ్ఞను భార్యగా ఉన్న భర్త ఆజ్ఞను, వితంతువుగా ఉన్న పుత్రుని అనుమతి పొంది వ్రతాలను ఆచరించవచ్చును. (హిందువుల పండుగలు. పుట 7 సురవరం ప్రతాపరెడ్డి)

వైదిక సంప్రదాయంలో స్త్రీలు, అగ్రేతర వర్ణాల వారు మంత్ర పూజార్హతను కోల్పోయారు. వీరశైవ మత ప్రచారంలోనే సంతానాపేక్షలైన స్త్రీలు వ్రతాలు చేయడానికి ఆరంభించారు. అందు వల్లనే వీరశైవుల ఆరాధ్యదేవత అయిన 'గౌరి' కి సంబంధించిన వ్రతాలే ఎక్కువగా కన్పడుతున్నాయి. అలాగే అర్ధనారీశ్వరునకు సంబంధించినవి కూడా ఉన్నాయి. భక్తి ముక్తి ప్రతిపాదకాలైన వ్రతకథలు ప్రభు సమ్మితాలై స్త్రీల సారస్వతానికే ఒక విశిష్టత్వాన్ని చేకూరుస్తున్నాయి. సంస్కృత సారస్వతంలో మున్నూట అరవై వ్రతాలు ఉన్నాయని ప్రతీతి. శ్రీ పి. వి. కాణేగారు పేయిన్నూరు వ్రతాలు, పూజలు. ఉత్సవాలను పేర్కొన్నారు. (హిస్టరీ ఆఫ్ ధర్మ శాస్త్రాస్, సంపుటం 5, భాగం. 1 పుటలు 253-462) ఆంధ్రులలో సుమారు రెండు వందల వ్రతాలు నోములు ఉన్నా, అందులో ఏ పదవ వంతో నేడు మిగిలి ఉన్నాయి.

వ్రతాలు, నోములు, కర్మమార్గానికి సంబంధించిన ఆచారాలు, పారమార్థిక చింతన, అష్టైశ్వర్యసిద్ధి, పుణ్యప్రాప్తి, సదాచార సంపద, వీటి వల్ల కలిగే ప్రయోజనాలు, ఆంధ్ర దేశంలో అనాదిగా స్త్రీలు వ్రతాలను ఆచరించడం, నోములు నోచడం అనేవి అనూచానంగా వస్తున్న సంప్రదాయాలు. బాల్యంలోనే స్త్రీలు కోరుకొనే ఆనంద సౌఖ్యాలు మొదలుకొని వార్ధక్యంలో వాంఛించే కైవల్య ప్రాప్తి వరకూ ఆచరించదగ్గ వ్రతాలు నేటికీ నిలిచియున్నాయంటే మనలో ఉన్న భక్తిభావం విదిత మవుతుంది. వ్రత కథల్లో వివాహమైన స్త్రీ క్రొత్త ఇంట్లో మెలగాల్సిన విధానం, గృహ మర్యాదలు జొప్పించ బడడం వల్ల ఇవి స్త్రీలకు సకలార్థ సాధకాలనవచ్చు. చిన్న తనంలోనే స్త్రీలకు సదాచారాలను, సద్గుణాలను, సుశిక్షణను అలవర్చడానికి మన పూర్వులు ఇలాంటి వ్రతాలు, నోములను ఏర్పరచినట్లుగా మనం గ్రహించవచ్చు.

వ్రతాచారాల వెనుక మనకు తెలియని ఆరోగ్యసూత్రాలెన్నో ఇమిడి ఉన్నాయి. ముత్తైదువులకు పసుపు పూయడం వల్ల తడిచేత ఒరసిపోయిన పాదాలు నయమవుతాయి. పసుపులో "ఇనుము" ఉండటమే దీనికి కారణం. పాదాలు తడివల్ల చల్లబడకుండా పసుపు వెచ్చదనాన్ని ఇస్తుంది. కుంకుమలో కూడ పసుపు ఉండటం వల్ల నొసలు చల్లబడకుండా రక్షింప బడుతుంది. పప్పు ధాన్యాలలో మాంసకృత్తులు ఉన్నాయి. మొలకెత్తిన సెనగలు, పెసలు ఇత్యాదుల్లో "బి" మరియు "సి" విటమిన్లు ఉన్నాయి. అందుకనే వ్రతదినాల్లో సెనగలు, పెసలు వాయనాలుగా ఇస్తారు.

ఇలా వ్రతాలు, నోములు మన సంస్కృతిలో విడదీయరాని అంశాలుగా వైశిష్ట్యాన్ని పొందాయి. పొందుతూ ఉన్నాయి. కాబట్టే వీటిని ముందు తరాల వారికి అందించాల్సిన బాధ్యత, కర్తవ్యం మన మీద ఎంతైనా ఉంది.

*

---

## అన్నమయ్య పదకవితల్లో రామకథ:

రచయిత : జానకంటి బాలసుబ్రహ్మణ్యమ్ ఎం.ఏ. 13-7-1928 బి. కొర్లగుంట తిరుపతి-517501.

మూల్యము: రూ. 3-50.

ఈ గ్రంథ రచనకు కారణము రచయిత తమ ముందుమాటలో ఇట్లు తెలుపుకొన్నారు. "అన్నమయ్య దృష్టిలో "వినా వేంకటేశం న నాథో న నాథః" అందుకే ఏకత్వంలో భిన్నత్వాన్ని భిన్నత్వంలో ఏకత్వాన్ని నిరూపించినాడు. అన్నమయ్య చూపిన ఈ అభేద తత్త్వాన్ని స్థాలీపులాక న్యాయంగా విమర్శించి చూపడమే" అని. ఇది అక్షరాల నిజమే.

అన్ని అవతారాలు, అన్ని పేర్లు శ్రీ వేంకటేశ్వరునివే అంటున్నాడు అన్నమయ్య. ఈ కారణం చేతనే అన్నమయ్య తన కీర్తనలలో ఇతర దేవుళ్ళకు తిరుమలేశుడికి భేదము లేదని కీర్తించాడు.

ఈ రచయిత అన్నమయ్య కీర్తనల్లోని రామకథను నాలుగు శీర్షికలుగా ఎన్నుకొని వాటికి పండితులకే గాక సామాన్యులైన వారికిని ఎక్కువ ఉపయోగించు లాగున భావ వివరణములు వ్రాసి, భక్తులైనవారు అన్నమయ్య కీర్తనలను పాడుకొని ఆనందించడమేగాక, అందలి తత్త్వ రహస్యములను గ్రహించి ధన్యులగుటకు వెలుగుబాట జూపినారు. రచయిత అన్నమయ్య కీర్తనలను లోతుగా పరిశీలించిన వారగుటచే వాటిలో దాగియున్న నిజతత్త్వాన్ని వివరించి యున్నారు. అన్నమయ్య కీర్తనల్లోని రామకథను సామాన్యులు గ్రహించుటకు వీలుగా నుండవలె ననుటయే రచయిత అభిలాష.

ఈ చిన్న పుస్తకంలో ఎన్నుకొనిన మొదటి వ్యాసము "రామకథ". రెండవది "దశావతారములు". "తానెకాకెవ్వరు మాకు దాతయు దైవము" అన్న కీర్తన సామాన్యులకది దశావతారములను గుఱించిన దన్న భావము స్ఫురింపదు. రచయిత ఆ కీర్తనలోని పదములకు తగిన భావమును వివరించి దశావతారములకు పోల్చి చూపి యుండుట పొగడదగినది. అదియును గాక పై పాటలో ఉత్తమదాత లక్షణములనుకూడా చెప్పి యున్నట్లు వివరించారు. "పుడమి నిండరిబట్టి భూతము" అన్న కీర్తనకు వీరు వ్రాసిన వివరణలు సామాన్యులకు ఎంతో ఉపయోగకరమైనవి.

మూడవది "పవనసుతుడు" అనునది. ఇది అన్నమయ్య పాడిన పాటలలోని హనుమంతుని మహిమాతిశయాలను, అతని స్వామి భక్తిని గుఱించినది.

నాల్గవది "శ్రీ లక్ష్మీ నృసింహావతార వైభవము" అన్నమయ్య దశావతారములలో ఒకటైన నరసింహావతారమును గుఱించి పాటలుగా పాడటమే గాక "నవ నారసింహా నమో నమో" అను కీర్తనలో ఆ దేవుని నవ నారసింహునిగా పేర్కొని అతని పేర్లను అతడు వెలసిన క్షేత్రములను వాటి మహిమలను తెలిపియున్నారు. రచయిత దానిని ఎన్నుకొని పాఠకులకు అర్థమగు రీతిగా వివరములు తెలిపి యున్నారు.

అన్నమయ్య కీర్తనలలోని వివిధ విషయములకు సంబంధించిన కీర్తనలను ఎన్నుకొని వాటికి సులభ వివరణలు రచియించి ఇట్టి చిన్న చిన్న పుస్తకములుగా ప్రచురించినచో ఎంతో ఉపయోగ పడగలదు.

— కారువల్లి కల్యాణరామ్

## గ్రంథసమీక్ష

## వేదమా-ఆధునిక విజ్ఞానమా?

రచన : శ్రీ ఎక్కిరాల విక్రమాదిత్య. పుటలు : 80. మూల్యము : రు. 3-50. ప్రతులకు : సాయిమాస్టర్ పబ్లికేషన్స్, 58-7-32 సంతపేట, ఒంగోలు-523001.

"విజ్ఞాన శాస్త్రజ్ఞులు, సిద్ధపురుషులు పరస్పర వ్యతిరేక దిశలలో వర్తులాకారపు బాట మీద పడుతున్నట్లు వాదివలె నున్నారు" అని ప్రొఫెసర్ జయంత్‌పోషి రేడియోలో ప్రసంగిస్తూ అన్నారు.

సైన్సుకూ ఆధ్యాత్మికతకూ వైరుధ్యమున్నట్లు పైకి కనిపించినా, రెండూ ఒకే సత్యాన్ని అందుకుంటున్నాయనే అంశాన్ని పలువురు రచయితలు వెల్లడిస్తున్నారు. శ్రీ ఎక్కిరాల విక్రమాదిత్య "వేదమా - ఆధునిక విజ్ఞానమా?" అను పుస్తకంలో ఇట్టి ప్రయత్నమే చేశారు. పురుషసూక్తమును వైజ్ఞానిక దృక్కోణం నుండి పరిశీలించారు.

మనం జరిపే దైవపూజలు పురుషసూక్తంతో మొదలవుతాయి. ఇందు ఆధ్యాత్మికానుభూతికి ఆధారమైన భగవద్భావన వివరంగా వర్ణించబడినది. సకలచరాచర జగత్తు ఆదిపురుషునిలోనుంచి ఉద్భవించడం వివరించబడింది. అందులోని అంతరార్థాన్ని మననం చేసుకుంటూ పఠిస్తే సర్వమూ భగవన్మయమన్న భావం పెంపొంది సర్వజీవులలోను భగవత్స్వరూపాన్ని చూడగలుగుతాము.

ఈ పుస్తకంలో పురుషసూక్తమును మంత్రార్థ వివరణలతోసహా పేర్కొన్నారు. వాటిని విజ్ఞానశాస్త్రవేత్తలు కనుగొన్న సత్యములతో పోల్చి చూపారు. కొన్ని ఆధ్యాత్మిక చింతనలకు అర్థాలను వివరించి పాఠకులకు సుబోధకమగునట్లు వ్రాశారు.

"మన మనస్సు ఊహల రూపం ధరించినపుడు మన చైతన్యంలో ఒక భాగం మాత్రమే ఆ ఊహల రూపం ధరించి, ఒక భాగం మాత్రం ఆ ఊహలను ఊహిస్తూ చూడడమనే క్రియతప్ప మరేమీ చేయక 'సాక్షి' గా వుండిపోతుంది. అలాగే భగవంతుడనే మహాచైతన్యంలో, కొంతభాగమే సృష్టిరూపం ధరించి, కొంత సాక్షీభూతంగా వుండి ఈ సృష్టినంతటినీ చూచి అనుభవిస్తూ వుంటుంది. అందుకే భగవంతుణ్ణి "సాక్షి" అనీ, 'సకలభూత హృదయాంతరస్థుడు' అనీ, 'విరూపాక్షుడు' అనీ చెపుతారు.

ఈ విషయం పురుషసూక్తంలో "పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి" అని చెప్పబడింది. అంటే, సృష్టియొక్క ఈ మహిమ అంతయు పురుషునిలో నాల్గవ భాగము మాత్రమే. మిగిలిన మూడు భాగములు నిత్యములై ఆత్మ స్వరూపమున పై లోకములలో ప్రకాశించుచున్నవి."

ఇలా మనస్సుతో భగవానుని పోల్చి చెప్పడంవలన పరమేశ్వరుని లక్షణము సుబోధకమగుచున్నది. ఇట్లే పురుష సూక్తంలో అంతర్లీనమైన అంశములను రచయిత పేర్కొన్నారు.

ఆధునిక విజ్ఞానశాస్త్రవేత్తల ఆలోచనల నెన్నిటినో రచయిత ఇందు పేర్కొన్నారు. ఒకచోట ఇలా అంటారు. "ఒక జీవకణంలో షుమారు 200 ట్రిలియన్ల అణువులున్నాయనీ, అందులో ప్రతిఒక్కటీ. కొన్ని వేల ప్రతిక్రియలను వెంట్రుకవాసి తేడాలేకుండా సకాలంలో తగుమాత్రంగా నిర్వహిస్తుందనీ అంచనావేయబడినది. ఆ ప్రక్రియలను తారుమారుచేసే విధంగా అవి పనిచేసే అవకాశమున్నా అలా చెయ్యక నియమబద్ధంగా పనిచేస్తాయి."

వాటిని అలా పనిచేయించేది ఎవరు? అణువుల స్థాయిలోగూడ ఇలా సచేతనమైన క్రియలను నడిపించగల రసాయనిక సూత్రాలేమిటి– ఈ విషయం గురించి శాస్త్రవేత్తల అభిప్రాయాలు పేర్కొంటూ ఒక చైతన్య పదార్థాన్ని వాళ్లు భావిస్తున్నట్లుగా వివరించారు.

పరమార్థాన్ని పొందడానికి నేటి విజ్ఞాన శాస్త్రాన్ని త్రోసిపుచ్చనక్కరలేదు. నేటి విజ్ఞాన శాస్త్రాన్ని ఆర్జించి వినియోగించుకోడానికి పరమార్థాన్ని మూఢవిశ్వాసంగా, అభూతకల్పనగా త్రోసిపుచ్చనక్కరలేదు– అని రచయిత చేసిన ముగింపు సమంజసంగా వున్నది.

— మన్నవ గిరిధరరావు

## "జానపదగేయ రామాయణం"

[సంకలనం: డా॥ ఎస్. గంగప్ప, పుటలు 48, వెల: రు 5–00, ప్రాప్తిస్థానములు: 1) శశీ ప్రచురణలు. 6–7ఐ, శ్రీనివాసనగర్, గుంటూరు–522006 2) నవోదయ పబ్లికేషన్స్, ఏలూరు రోడ్. విజయవాడ–2.]

విమర్శనరంగంలో ప్రస్తుతం కృషి చేస్తున్న కొద్దిమంది సాహితీవేత్తల్లో డా॥ ఎస్. గంగప్పగారు ప్రముఖులు. నేదునూరి గంగాధరం, డా॥ బి. రామరాజు గార్లను తలపిస్తున్నది వీరి జానపద వాఙ్మయ సంపాదన తత్పరత.

రాయలసీమలోని పెనుకొండ ప్రాంతపు పల్లీయులు, వరినాట్లు కలుపు తీతలు మున్నగు వ్యావసాయిక కార్యకలాపాల్లో నిమగ్నులై సరదాగా పాడుకొనే పాటల్లో దొర్లిన రామాయణ కథాంశాలను ఓ పదింటిని ఎన్నుకొని కథాక్రమ నిబద్ధం చేసి శ్రీ గంగప్పగారు "జానపద రామాయణం" అనే యీ చిన్నగ్రంథాన్ని ముచ్చటగా ముద్రింపించారు. శ్రీరామజననం దగ్గర నుండీ, ఉత్తరకాండలో కుశలవులు యజ్ఞాశ్వాన్ని పట్టుకొని రామునికి తమ తల్లిదండ్రులెవ్వరో తెలుపుకునేవఱకు ఉన్న కథ–ఈ పదిగేయాల్లో నడిచింది. ఇదీ ఇతివృత్త వృత్తాంతం.

ఇది జానపదుల జిహ్వాగ్రాల మీద బ్రతుకుతున్న సాహిత్యం కావడంవల్ల ఎడనెడ విరిగిన పదాలూ అరిగిన శబ్దాలూ వింత వింత రూపాల్లో సాక్షాత్కరిస్తూ వుంటాయి.

"పట్టు పుట్టములే" అనే పదం "పొట్టు పుట్టాములే?" గాను, "శాపములు పెట్టినది" అనే వాక్యం "సాపినులు బెట్టినాదీ" గాను రూపాంతరం చెందాయి. ఇల్లాటి అరిగిన శబ్దాలకు గంగప్పగారు లఘువివరణలు కూడ వ్రాసి చదువరికి సహాయపడ్డారు. కొన్ని ఘట్టాలు మిక్కిలి సహజంగా హృద్యంగా కన్పిస్తాయి.

అరణ్యవాసానికి రామునితోపాటు సీతమ్మ కదిలే సందర్భంలో–

"పొట్టు పుట్టాములే కట్టేటి తల్లీ!
నార సీరా లెట్లు కట్టేద వమ్మా?
పాలును అన్నమూ భోంచేసే తల్లీ!
పండు బాలాలేట్లు భుజింతువమ్మా?"–

అన్నగేయం, (ఆ సందర్భంలోనే) లక్ష్మణునితో రాముడు

"హొయ్యేది అడవులకి పొట్టుమంచము
పరుపు లేపులు కోరితే అందాడ తెస్తునప్పా?
హొయ్యేది అడవులకి అన్నములు కోరితే
అందాడ తెస్తునప్పా?"– అంటాడు.

ఈ సందర్భంలో సున్నితమైన హృదయం యొక్క ఆవేదన సహజసుందరంగా వ్యక్తీకరింపబడింది.

ఇంద్రజిత్తూ లక్ష్మణుడూ యుద్ధం చేస్తున్నారు. ఇంద్రజిత్తు నాగబాణం వేస్తే లక్ష్మణుడు దానిని ప్రతిహతం చేసే గరుడ బాణం వేశాడు. ఇంతవఱకు పూర్వకావ్యాల్లో బాగా కన్పించే యుద్ధమే. ఆ తర్వాత వారిద్దరు వేసుకున్న బాణాలు జానపదుల సహజబుద్ధికి మాత్రమే స్ఫురించేవి.

"మేఘాల మొరుగునా ఆ యింద్రజిత్తుడూ
తేళ్లబాణము తొడిగెనో!
లక్ష్మన్నని ఏటి ఆ దారి తెలుసుకుని
కోళ్లబాణము తొడిగెనో!"

ఈ తేళ్లబాణాలూ కోళ్లబాణాలూ నాగరక కవుల ఊహలకు – అందనివి.

"లక్ష్మణ మూర్ఛ" సందర్భంగా శ్రీరాముడు విలపిస్తాడు. ఆ విలాపం

"రంగైన ముత్యాలపేరు తెగినట్టులూ
రాలె కన్నుల ఉదకమూ...."

అని వర్ణింపబడింది. ఇందులో "అచ్ఛమైన ప్రబంధ వర్ణన" తొణికిసలాడుతున్నది.

లక్ష్మణుడు కుశలవుల్ని ఎత్తుకుంటే, "పాలుపుచ్చుకుని బాలురూ వుచ్చలూ పోసినారూ లక్ష్మణుమీదే." అని పాడుతూవుంటే స్మితం నర్తింపని ముఖం వుండదుగదా!

ఈ పుస్తక సంకలన విషయంలో గంగప్పగారు చేసిన సేకరణ కృషి అభినంద్యము. సాహితీ రసపిపాసువులు చదువదగ్గ మంచి గ్రంథం ఇది.

"వెల" కొంచెం తగ్గించివుంటే బాగుండేదేమో!

— గాదేపల్లి

# మతసామరస్య ప్రతీక

# భక్తకబీరు

అది క్రీ॥శ॥ 15వ శతాబ్దం. హిందూ మహమ్మదీయ మతాల మధ్య సంఘర్షణ విలయనృత్యం చేస్తున్న దినాలవి. ఉభయ మతాల్లోనూ అర్థరహితమైన బాహ్యాచారాలూ, కర్మకాండలూ, మూఢవిశ్వాసాలూ, వెర్రితలలు వేస్తున్నాయి. అలాంటి దశలో కబీరు జన్మించి హిందూమహమ్మదీయ మతాల తుది గమ్యం ఒక్కటేనని, ప్రబోధించి రెంటినీ సన్నిహితం చేయడానికి ప్రయత్నించాడు. సమాజంలోని కుళ్లును, జీవితంలోని కాఠిన్యాన్ని చూచి కంపించిన నామదేవుడు, గురునానక్, వేమన, బసవేశ్వరుడు మున్నగు మహనీయుల కోవకు చెందిన కబీరు సార్వజనీనత, మానవతా దృక్పథం, హృదయవైశాల్యం గల యోగిపుంగవుడు. ప్రజల మనోభావాలపై సంప్రదాయము, పూర్వాచార పరాయణత్వము పూర్తి అధికారాన్ని చలాయిస్తున్న ఆ దినాల్లో పాతను నిరసించి నూతన మార్గాన్ని త్రొక్కడం సామాన్యుల కసాధ్యమైన పని. "ఎవని నీతి సరియైనదో వాడే హిందువు, వాడే మహమ్మదీయుడు. ఎవడు బ్రహ్మనెరుగునో వాడే బ్రాహ్మణుడు, ఎవడు రహమాన్‌ను ఎరుగునో వాడే కాజీ. రాముడను, రహీమను, ఏదైనను అతని స్మరణయే కదా-" అని యీ మహనీయుడు హిందూ మహమ్మదీయులకు కనువిప్పు కల్గించాడు. అంతే గాదు-

"ఆహా! ఉభయులు దారి తప్పినారు
హిందువులు తాము గొప్పవారిమని
అందురు
ఇతరులను తమ కడవ తాకనీయరు
వెలయాండ్రతల్పముల శయనింతురు.
ఇదీ హిందువుల గొప్పతనము.
ముసల్మానులలో పీరులు, ఔలియాలు
కోళ్ళను చంపి తిందురు-"

"స్వామి యెట్టివాడో ఎరుగను
మసీదులో ముల్లా అరచును
మా స్వామి చెవిటివాడా?
మీరు జపమాల త్రిప్పవచ్చు
లలాటమునకు రంగులు పూయవచ్చు
పొడవైన జటలు ధరింపవచ్చు
కాని మీ హృదయంలో అవిశ్వాసమనే
చురకత్తి వున్నది
ఈ విధముగా స్వామిని చేరలేరు."
(కబీరు గ్రంథావళి)



అని తీవ్రంగా విమర్శించాడు. సజీవుల్ని ద్వేషిస్తూ నిర్జీవుల్ని పూజించే మన అజ్ఞానాన్ని మరి కబీరు యేమంటాడో చూడండి. "శ్మశానములో శవానికి దహనసంస్కారం జరిపిన తరువాత మరణించిన వ్యక్తియెడ ఎక్కడలేని ప్రేమానురాగాలు ఒలకపోస్తారు. కాని జీవించివున్న పెద్దలకు బడితెపూజ చేస్తారు. వ్యక్తి చనిపోయిన పిమ్మట అతని నోటిలో గంగాజలం పోస్తారు. కాని బ్రతికివున్న ముసలి ముతక వారిని ఆకలితో అలమటింపచేస్తారు. పరలోకగతులైన పూర్వీకులకు పిండం పెడతారు. పెద్దలు బ్రతికివున్నంతవరకూ తిట్లూ శాపనార్థాలూ పెడతారు. చచ్చినతరువాత శ్రాద్ధముపెట్టి వారియెడ తమ భక్తిప్రపత్తులను ప్రదర్శిస్తారు. కబీరు అంటాడు - కాకులకు వేసింది చచ్చి స్వర్గానవున్న వారికి ఎల్లా చేరుతుంది?" (కబీరు గ్రంథావళి.) ఇలాంటి ఆచారవ్యవహారాల్ని తీక్షమైన పదజాలంతో గుండెల్లో నాటుకుపోయేటట్లు విమర్శించడంలో కబీరు మన వేమన్నకు సరిజోడు.

క్రీ॥శ॥ 15వ శతాబ్దంలో జీవించిన కబీరు జన్మస్థానము కాశీ. ఇతని తల్లిదండ్రులెవరో స్పష్టముగ తెలియదుకాని ఒక బ్రాహ్మణ వితంతువు కని (లోకాపవాదానికి భయపడి) పారవైచిన యీ కబీరును నీమా నీరూ అనే మహమ్మదీయ దంపతులు పెంచినట్లు మాత్రం తెలుస్తూవుంది. మహాత్ముల పుట్టుకలకు సంబంధించి కల్పనలెన్నో ప్రచారమునందున్నట్లే కబీరు జననాన్ని గూర్చి కూడ అనేక అద్భుత గాథలు ప్రచారంలో వున్నాయి.

కబీరు అనగా గొప్పవాడని అర్థం. సుప్రసిద్ధ వేదాంతులైన రామానందుడు, షేక్ తఖీ అనువారితని గురువులని జనశ్రుతి. కబీరుకు లోయీ, రామజానియా అనే ఇద్దరు భార్యలు; కమన్, కమలి అనే ఇరువురు బిడ్డలూ వుండేవారనీ, కౌటుంబికమైన అశాంతి సదా అతనిని వెన్నాడేదనీ డా॥ రామకుమారవర్మ వ్రాస్తున్నాడు. ఆయీనె అక్బరీ, ఎ హిస్టరీ ఆఫ్ ది మరాఠా పీపుల్, కబీర్ మన్సూర్ వగైరా గ్రంథాలవల్ల కబీరు మక్కాయాత్ర చేయడమేగాక యావదుత్తర భారతం తిరిగినట్లు తెలుస్తూవుంది.

కబీరు బ్రతికి వున్నంతకాలం గౌరవ సన్మానాల్ని పొందలేదు సరికదా ప్రజల తృణీకారానికి, సికిందర్‌లోడీ అనే నాటి మహమ్మదీయ ప్రభునికోపానికీ గురై ఎన్నో బాధలనుభవించాడు. ఉన్నదున్నట్లు చెప్పడంవల్లను, సమాజంలోని మర్యాదల్ని సంప్రదాయాల్ని అలక్ష్యం చేయడంవల్లను కబీరు చుట్టూవున్న వారంతా అతనికి శత్రువులయ్యారని 'కబీర్ అండ్ కబీర్ పంథా'

అనే గ్రంథం సాక్ష్యమిస్తూవుంది. అయితే అతడు చెప్పిన కవిత్వం, తాత్త్వికచింతన హిందీ సాహిత్యం మీదనేగాక ఉత్తరభారత దేశంలోని సామాన్యమానవుని మీదకూడ అసామాన్యమైన ముద్రవేయడం జరిగింది. అతని తత్త్వవిచారం సహజసిద్ధమైన జ్ఞానం వల్లను, లోకానుభవంవల్లను, స్వయం సాధనవల్లను కలిగినదే. హిందూ మహమ్మదీయ మతాల్లోని సర్వోత్తమ గుణాల్ని స్వీకరించి మిశ్రమ భావుకతను రూపొందించడానికి ప్రయత్నించిన కబీరు గొప్ప గాయకుడు, వాగ్గేయకారుడున్నూ. అతని బోధనలకు ఉపనిషత్తులలోని ఏకేశ్వరోపాసన, ఇస్లాం మతంలోని ఈశ్వరుడొక్కడే అను సిద్ధాంతం ప్రాతిపదికలైనట్లు చెప్పవచ్చు. "అతనికి ముఖములేదు. శిరస్సులేదు. సంకేతప్రాయమైన రూపములేదు. పూల వాసనలకన్న సూక్ష్మమైనవాడతడు." అనే కబీరు మాట యిందుకు దృష్టాంతం. ఈ తత్త్వవేత్త శ్రీరామ భక్తుడు. అయితే అతని రాముడు విష్ణుని అవతారంకాదు. రాముడు నిర్గుణుడనీ, నిరాకారుడనీ, రాముడు - రహీము ఇద్దరూ ఒక్కడేననీ అతని విశ్వాసం.

"ఏకం సత్ విప్రా బహుధా వదంతి"
(ఋగ్వేదము)

(సత్యము ఒక్కటే. దీన్ని జ్ఞానులు పలు విధాలుగా నిర్వచించివున్నారు.)

"తిలేషు తైలం, దధినీవ సర్పిః, ఆపః స్రోతస్సు, అరణీషు చాగ్నిః, ఏవమాత్మని మనసా గృహ్యతేఽసౌ, సత్యే నయనం తపసా యోఽను పశ్యతి-" (శ్వేతాశ్వేతరోపనిషత్తు) (నువ్వుల్లో నూనెలాగా, మీగడలో వెన్నలాగా, నదీగర్భంలో నీటిలాగా, కట్టెలో నిప్పులాగా, నిజవ్యక్తిత్వం ఆత్మలో వుంటుంది. కనుక ఆ వ్యక్తిత్వాన్ని సత్య సంధతతో ధ్యానంతో కనుగొనుము.) అనే ప్రాచీనమహర్షుల తత్త్వజ్ఞానాన్ని కబీరు ఆలోచనా విధానంలో గమనింపవచ్చు. చూడండి.

"ఆ నిగూఢ పదమును నేనెట్లా వ్యక్తం చేసేను?
'అతను' ఇట్టివాడుకాదు, ఇట్టివాడు
అని ఎట్లా వివరించేను?
ఆయన నాలోవున్నాడని చెప్పుదునా
జగత్తు సిగ్గిలుతుంది.
లేక, ఆయన నాకు బాహ్యంగా వున్నాడని అంటే

అది అబద్ధమౌతుంది.
ఆయన ఆంతరంగిక బాహ్యజగత్తులను
అవిభాజ్యమైన ఏక జగత్తుగా చేస్తాడు.
ఎరుక, ఎరుగమి రెండూ ఆయన పాద పీఠములు

ఆయన ప్రత్యక్షుడుకాడు. దాగిలేడు
వెల్లడిచేయబడినవాడుకాడు
గూఢముగావున్న వాడుకాడు
అతను ఏమిటో, ఎవరో"
(వన్ హండ్రెడ్ పోయమ్స్ ఆఫ్ కబీరు)

మానవుడు నిరాడంబరంగా, తృప్తిగా జీవించాలని కబీరు ప్రబోధం. ప్రతి వ్యక్తి కాయకష్టంచేయాలనీ, సోమరితనం పనికి రాదనీ, ఇతరుల సొత్తును అపహరింపరాదనీ, స్వాతిశయంతగదనీ, పాక్షికాలు, సంకుచితాలు అయిన మతాలు ఉచితములు కావనీ, బాహ్యసంస్కారములు అర్థంలేనివనీ, కులతత్త్వంతో పరస్పరం ద్వేషించుకోవడం వినాశహేతువనీ కబీరు ఉద్ఘోషించాడు.

— శ్రీ డి. నాగసిద్ధారెడ్డి





( 12 వ పేజి తరువాయి )

'చిత్తం' అన్నాడు రాజయ్య—

"మదోన్మత్తుడైన మానవుడే మత్తగజం—మాయా ప్రపంచమే ఒక కాసారం. అందులో ప్రవేశించాడు, తన శక్తి కొలది, జలాశయాన్ని, అల్లకల్లోలం చేశాడు. తామర తూడులన్నీ పెకలించాడు. ఈ మత్త గజం ధాటికి జనం గజ గజ లాడి పోయారు— అలా కొంత కాలం విహరించాడు. మరణమనే మకరం సమీపించింది—కాలు పట్టుకుంది—మోకులాగే ఆట ప్రారంభమైంది. జుత్తు నెరిసింది. రంగు వేశాడు. కళ్ళచూపు పాడైంది. కళ్ళజోడు పెట్టాడు. పళ్లు కూడా రాలి పోయినై. కొత్త పళ్లు కట్టించుకొని పోరాడుతున్నాడు. మొసలి పళ్ళు కాలులో దిగ బడినై. మొసలికి మంచి పట్టు దొరికింది. తనవైపు లాగుతోంది. ఏనుగు జవసత్వాలుడిగి పోతున్నాయి. వైద్యులు ఇక మందు బిళ్లలు, టానిక్కులు పని చెయ్యవు ఇంతే సంగతులని చేతులెత్తేశారు! బాగా వార్ధక్యం వచ్చేసింది. ఒకప్పుడు ఈ ప్రపంచాన్నే గడ గడ లాడించిన తాను, ఇప్పుడు గడ గడ వణికి పోతున్నాడు.

"ఇదం శరీరం పరిణామపేశలం, పతత్యవశ్యం శ్లథ సంధి జర్ఝరం"....

"తెలుగు తెలుగు" అన్నట్లు కళ్లు తేలేశాడు రాజయ్య!

ముసలి తనంతో మెత్తబడిన ఈ శరీరం, కీళ్ళు సడలిపోయి రాలిపోవడం ఖాయం— జన్మ దుఃఖమూ, జరా దుఃఖమూ, జాయా దుఃఖం మళ్ళీ మళ్ళీ వస్తూనే వుంటై? దీనికేమిటి విమోచన మార్గం అని ఆలోచనలో పడ్డాడు!....దిన దినానికి, తన బలం సన్నగిల్లి పోతుంది. అప్పుడు శ్రియఃపతి గుర్తుకొచ్చాడు, "శ్రియః కాంతాయ కల్యాణ నిధయే నిధయేఽర్థినాం" అన్నాడు. అందాక అండపిండ బ్రహ్మాండాధి నాయకుడైన శ్రీవారి గద్య జ్ఞాపకం రాలేదు!....శ్రీ మదఖిల మహీ మండల మండన అని ప్రారంభించాడు. లావొక్కింతయు లేదు.... నీవే తప్ప ఇతఃపరంబెరుగ అని కర మెత్తి మొక్కాడు. శ్రీవారు, మొరాలించారు. శ్రీ సతికైనా చెప్పకుండా బయలు దేరి, మకరాన్ని ఛేదించారు. గజేంద్రుడికి మోక్షం ప్రసాదించారు....

ఇక్కడ పౌరాణికుడు ఏం చెప్పాలని ప్రయత్నిస్తున్నాడు? ఎంతటి పుడ్ధండ పిండమైనా, చండశాసనుడైనా, ఏదో నాటికి, ముసలితనము మృత్యువు అనే మొసలి వాత పడక తప్పదు. దీనికి తరణోపాయ మేమిటి? నీవే తప్ప ఇతఃపరం బెరుగనని, ఆ సర్వేశ్వరునికి శరణాగతి చెయ్యడమే—గోపికా వస్త్రాపహరణం కూడ, శరణాగతే చెబుతుంది!....ఒకటి కరుణరస భరితం. ఒకటి శృంగార రసమయం. అంతే తేడా....అన్నాడు పరమాత్మ....చెవులు రిక్కించుకుని పాదాలపై రాజయ్య అలాగే పరమాత్ముని పాదవీధిలో వ్రాలాడు. అన్యథా శరణం నాస్తి, త్వమేవ శరణం మమ! తస్మాత్ కారుణ్య భావేన, రక్ష రక్ష జనార్దన అంటూ నమస్కరించాడు....

రాజయ్య తల ఎత్తేసరికి పరమాత్మ అదృశ్యమై పోయాడు. విశ్వ విమోహకమైన వేణునాదం, విదూరంగా వినిపిస్తోంది ఆ మధుర మనోహర గానమే, ఒక జోలపాటగా, రాజయ్య చిన్నారి పావ మనస్సు ఆదమరచి హాయిగా నిదురపోయింది—



# ఉపనిషద్వాణి

శ్రీ యామిజాల పద్మనాభస్వామి

## మాండూక్యోపనిషత్తు

### శాంతిపాఠం

ఓం భద్రం కర్ణేభి శ్శృణుయామ దేవాః
భద్రం పశ్యేమా-క్షభి ర్యజత్రాః
స్థిరైరంగై స్తుష్టువాగ్ం సస్తనూభిః
వ్యశేమ దేవహితం యదాయుః.

వేల్పులారా! మా చెవులు మంచి మాటలనే వినుగాక! మా కన్నులు మంచి దినుసునే చూచుగాక! ఏలాటి వికారము లేని అవయవాలుగలవై పుష్టిగా వుంటూ మా శరీరాలు దేవుడిచ్చిన పూర్ణాయువు అనుభవిస్తూ మిమ్ము సేవించుగాక!

(వినేది మంచినే వింటూ, చూచేది మంచినే చూస్తూ, చేసేది దేవతలకు తృప్తిని కలిగించేదై వుంటే మానవుడు పూర్ణాయువుతో పుష్టిగా ఈ లోకములో పెరిగి సుఖజీవి అవుతాడని భావం.)

స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవాః
స్వస్తి నః పూషా విశ్వవేదాః
స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః
స్వస్తినో బృహస్పతి ర్దధాతు.

పరమార్థమును గురువులవల్ల క్షుణ్ణంగా తెలిసిన విద్వాంసుడు ఇంద్రుడు మాకు మేలు కలిగించుగాక! విశ్వవంద్యుడైన సూర్యుడు మాకు సేమము చేకూర్చుగాక! అశుభములను తన రెక్కలగాలితో చెదరగొట్టే గరుడుడు మాకు మంచిని ఘటించుగాక!

సర్వశాస్త్ర విశారదుడైన బృహస్పతి మాకు మేలు చేయుగాక!

### మంత్రము-1

హరిః ఓమ్, ఓమిత్యే తదక్షరమిదగ్ం సర్వం
తస్యోప వ్యాఖ్యానం
భూతం, భవ, ద్భవిష్యమితి సర్వ మోంకార ఏవ
యచ్చాన్య త్త్రికాలాతీతం తదప్యోంకార ఏవ.

ఇదంతా 'ఓం' అనే అక్షరముయొక్క స్వరూపమే. నిన్నటిది, నేటిది, రేపటిది-అంతా ఆ ఓంకారమే. మూడు కాలాలకు మించినది ఏదైనావుంటే అదీ ఓంకారమే.

దానినే యీ ఉపనిషత్తుద్వారా వివరించడమైనది.

(ఓంకారం కాలానికి ప్రతిబింబం. కాలం ఈశ్వర రూపం. ప్రాణి మనుగడకి మేలైన దీపం. అది తెలుసుకోలేక జీవులు గిజగిజలాడుతూన్నారు. ఆలాటి వారికి తరణోపాయముగా ఈ ఉపనిషత్తు ఈశ్వరబోధ చేస్తూంది.

కాలమూ, కాలాతీతమయిన వస్తువూ ఓంకారమే అనిన్నీ, ఆ హేతువుచే కాలాన్ని వ్యర్థం చెయ్యకూడదనిన్నీ హెచ్చరించడం కూడా దీనివల్ల తెలుసుకోవలెను.)

౨

సర్వం హ్యేతద్బ్రహ్మాయమాత్మా
బ్రహ్మ సోఽయమాత్మా చతుష్పాత్.

కంటికి కనిపిస్తూన్న యీ ప్రపంచమంతా బ్రహ్మమే. ప్రాణికి లోపల జీవరూపముగా వున్నదిన్నీ, ఆత్మగా దహరాకాశమునందు (హృదయగుహలో) తేజోమూర్తియై వెలిగేదిన్నీ ఆ బ్రహ్మమే. ఆలాటి బ్రహ్మకు నాలుగుపాదాలు.

(శరీరమును ఆశ్రయించి కష్టసుఖాలు అనుభవించేది జీవాత్మ. కష్టసుఖాలను అంటక స్వతంత్రముగా హృదయకోశమందు వెలుగుతూవుండే దివ్యజ్యోతిమూర్తి ఆత్మ.

మాయ, లేక అజ్ఞానం, అవిద్య అడ్డుగా తెరలాగా వుంటూ జీవుడికీ ఆత్మకూ భేదం కల్పిస్తూవుంటుంది. ఆ అజ్ఞానమును పోగొట్టుకుని ఆత్మను దర్శించి కృతార్థుడు అవడానికే యీ బోధలన్నీ.)

౩

జాగరితస్థానో బహిష్ప్రజ్ఞః సప్తాంగః
ఏకోనవింశతిముఖః స్థూలభుక్
వైశ్వానరః ప్రథమః పాదః

జాగరూకత కలిగించేవాడు, వెలుపలి పదార్థములను తెలుసుకునే తెలివికలిగించేవాడున్నూ, ఏడు అంగములు, పందొమ్మిది ముఖాలూ, కలవాడై స్థూలపదార్థాలను స్వానుభవానికి తెచ్చుకుంటూ విశ్వమునందలి నరులను తమ తమ కర్మాచరణమునందు నడిపేవాడై 'వైశ్వానరుడు' అనే పేరుతో భాసించే అనిరుద్ధమూర్తి ప్రణవస్వరూపియైన బ్రహ్మపదార్థముయొక్క ప్రథమ పాదం-

వివరణ:

ఆకాశం, సూర్యుడు, వాయువు, అగ్ని, జలం, భూమి, జీవుడు - అనేవి ఏడున్నూ పరమాత్ముని అంగాలు.

కర్మేంద్రియాలు అయిదు, జ్ఞానేంద్రియాలు అయిదు, మనస్సు, బుద్ధి, అహంకారం, చిత్తం - కలిసి పందొమ్మిది. ఇవి బ్రహ్మకు ముఖాలు.

4

స్వప్నస్థానోఽంతఃప్రజ్ఞః సప్తాంగః
ఏకోనవింశతిముఖః
ప్రవివిక్తభుక్తైజసో ద్వితీయః పాదః

స్వప్నావస్థకు కారకుడై, ఆంతరజ్ఞానము కలిగించేవాడై ఏడు అంగములు, పందొమ్మిది ముఖాలు కలవాడై స్వప్నావస్థలో పలువిధములైన అనుభవాలను కలిగిస్తూ వుండే తేజోమయమూర్తి పరబ్రహ్మయొక్క (ఓంకారముయొక్క) రెండవ పాదం.

'ప్రద్యుమ్నమూర్తి' అని గ్రహించేది.

(స్వప్నావస్థ అనేది దేహాన్ని ఆశ్రయించివున్న జీవునకుగాని ఆత్మకు లేదు. ఆ జీవుడు మేల్కొనివున్న సమయములోలాగే స్వప్నావస్థలో కూడా ఏవో అనుభవాలు కలవాడౌతాడు. ఆ అనుభవాలు ఆత్మకు వుండవు. కనుక ఆ సమయములో కూడా లోపలవుండే ఆత్మ సహజమైన తేజస్సుతోనే వెలుగుతూ జీవునిచే అవన్నీ అనుభవింపచేస్తూ వుంటుంది.)

5

యత్ర సుప్తో న కంచన కామం కామయతే
న కంచన స్వప్నం పశ్యతి తత్సుషుప్తం,
సుషుప్తస్థాన ఏకీభూతః ప్రజ్ఞానఘన ఏవ
ఆనందమయో హ్యానందభుక్చేతోముఖః ప్రాజ్ఞః
తృతీయః పాదః,

జీవుడు గాఢంగా నిద్రిస్తూన్నపుడు, దేనినీ కోరనివాడై దేనినీ చూడనివాడై వుంటాడు. ఆ అవస్థకే 'సుషుప్తి' అని పేరు.

ఆలాటి సుషుప్తస్థానమునందు ఏకాకిగా వుంటూ ప్రజ్ఞానమూ ఆనందమూ తానే అయి ఆనందం అనుభవిస్తూ జీవునిచే ఆనందం అనుభవింపచేస్తూ నిర్మలమైన చైతన్య జ్ఞానముచేతనే తెలుసుకోదగినవాడై సర్వమూ తెలిసినవాడైన పరమాత్మని మూడవ పాదం 'సంకర్షణమూర్తి.'

(గాఢనిద్ర అన్నిటినీ మించిన ఉత్తమ దశ. ఆ దశలో అనుభవించేది ప్రశాంతి. దానిని 'సుషుప్తి' అని లోకంలో అందరూ అనేదే. అదే ఆనందమయమైన పరబ్రహ్మ యొక్క ఉత్తమస్థాయి. ఆ దశలో జీవుడు పరమాత్మను చేరుతాడు. కనుక దైహిక మైన అనుభవం అంతా మరచిపోయి తానూ ఆనందభోక్త అవుతాడు. ఆలాటి ఆనంద మయమైన ఆత్మతత్త్వాన్ని విషయవాసన లకు దూరమైన చిత్తమే తెలుసుకుంటుంది. ఆ తెలివికే ప్రజ్ఞానం అని వైదికసంకేతం.)

6

ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞః
ఏషోఽంతర్యామ్యే షయోని స్సర్వస్య
ప్రభవాప్యయౌ హి భూతానామ్,

ఆలాటి యీ పరమాత్మయే సర్వేశ్వరుడు. సర్వజ్ఞుడు. భూతరాశికి ఆత్మగా లోపల వుంటున్నాడు. భూతకోటి పుట్టుకకూ, జీవించుటకూ, లయమునకూ ఉపాధియయి వున్నాడు.

7

నాంతఃప్రజ్ఞం న బహిఃప్రజ్ఞం
నోభయతఃప్రజ్ఞం. న ప్రజ్ఞానఘనం
న ప్రజ్ఞం నా ప్రజ్ఞం. అదృష్టమవ్యవహార్యం
అగ్రాహ్య మలక్షణ మచింత్యం అవ్యపదేశ్యం
ఏకాత్మప్రత్యయసారం ప్రపంచోపశమం
శాంతం శివ మద్వైతం చతుర్థం మన్యంతే
స ఆత్మా స విజ్ఞేయః.

ఓంకార స్వరూపుడైన ఈశ్వరుని నాల్గవ పాదం వాసుదేవమూర్తి. ఆ మూర్తి జ్ఞానేంద్రియానికి కనిపించదు. బాహ్యప్రజ్ఞకి అందదు. ఆ మూర్తికి జాగ్రదవస్థ లేదు. స్వప్నావస్థలేదు. సుషుప్తి అనే అవస్థలేదు. ప్రజ్ఞ వుందా, లేదా? వుందని చెప్పలేము, లేదని చెప్పలేము. జీవలోక వ్యవహారముతో సంబంధం ఉండదు. కర్మేంద్రియాలకు పట్టుపడదు. ఇలాటిది అని చెప్పడానికిగాని నిర్ణయించడానికిగాని సాధ్యపడదు. ఆలోచనకి అందదు. ధ్వనిరహితం, నామ రహితం. అన్ని అవస్థలకు మించి ఆత్మ ఒక్కటే అని చెప్పదగినది. ప్రపంచనాశానికి కారణము. పగ, వగ ఇలాటి ద్వంద్వాలు లేని శాంతమూర్తి. శుభస్వరూపం గలది. అదా ఇదా అని వేరుచేసి చెప్పదగని ఏక శబ్దవాచ్యుడుగా వుండేది ...

అదే అంతరాత్మ పరమాత్మ అని తత్త్వజ్ఞులు భావిస్తారు.

(పైన చెప్పిన నాలుగు మూర్తులున్నూ వాసుదేవ వ్యూహం అని భాగవతం వివరించి చెప్పింది.)

ఆ ఆత్మనే తెలుసుకోవాలి....

8

సోఽయ మాత్మాఽధ్యక్షర మోంకారోఽధిమాత్రం
పాదా మాత్రా మాత్రాశ్చ పాదా అకార ఉకారో
మకార ఇతి.

అక్షరాలలో అధికమై మాత్రలుకలదై వున్న ఓంకారమే ఆ ఆత్మ అని గ్రహించేది.

అ,ఉ,మ అనే మాత్రలు పరమాత్మకు పాదములని చెప్పుకోవాలి.

అనిరుద్ధ, ప్రద్యుమ్న, సంకర్షణ, వాసుదేవ రూపాలు నాలుగున్నూ ప్రణవానికి (ఓంకారానికి) మాత్రలైన అకారాదులుగా చెప్పదగినవి. కాబట్టి ప్రణవమే పరమాత్మగా తెలుసుకుని ఉపాసించాలి.

9

జాగరితస్థానో వైశ్వానరోఽకారః
ప్రథమా మాత్రా, ఆప్తే రాదిమత్వాద్వా
ఆప్నోతి హ వై సర్వాన్ కామానాదిశ్చ భవతి
య ఏవం వేద.

ఓంకారము నందలి ప్రథమమాత్ర అయిన అకారం జాగ్రదవస్థకు సంబంధించిన వైశ్వానరుడు (వైశ్వానరుడని చెప్పదగిన పరబ్రహ్మ) సమస్త విశ్వమునూ వ్యాపించి వుండే ఆదిమూర్తి. ఈ తత్త్వం తెలుసుకున్నవాడు ఐహికానికీ ఆముష్మికానికీ సంబంధించిన కోర్కెలన్నిటినీ పొందుతాడు. తత్త్వవేత్తలలో అగ్రగణ్యుడవుతాడు.

10

స్వప్నస్థాన స్తైజస ఉకారో ద్వితీయామాత్రా
ఉత్కర్షాదుభయత్వాద్వోత్కర్షతి హ వై జ్ఞాన
సంతతిం సమానశ్చ భవతి నాస్యాబ్రహ్మ
విత్కులే భవతి య ఏవం వేద.

ఓంకారమునందలి ద్వితీయ మాత్ర అయిన ఉకారం స్వప్నావస్థకి సంబంధించిన తేజోమూర్తి (ప్రద్యుమ్నమూర్తి). ఈ మూర్తి వైశ్వానరుని రూపమైన అనిరుద్ధమూర్తికన్నా ఉత్కృష్టమైనది. ప్రాజ్ఞమూర్తికన్నా సూక్ష్మమై గొప్పదవుతూంది. ఈ తత్త్వం తెలుసుకున్నవాడు తన సంతతిని (శిష్యులను) జ్ఞానులుగా తీర్చి దిద్దుతాడు. అతని వంశములో బ్రహ్మవేత్త కానివాడు (అజ్ఞాని) పుట్టడు. అతడు పరమాత్మకి సమానుడవుతాడు.

11

సుషుప్తస్థానః ప్రాజ్ఞో మకార స్తృతీయా
మాత్రా మితేరపీతేర్వా మినోతి హ వా
ఇదం సర్వమపీతిశ్చ భవతి య ఏవం వేద.

సుషుప్తి స్థానమందున్న ప్రాజ్ఞుడు (సంకర్షణ స్వరూపుడు) ప్రణవము యొక్క మూడవమాత్ర అయిన మకారం.

ఈ మకారం అకార-ఉకారాలకు చివరది అవడం వల్లనూ ఆ రెంటినీ కలిపి రూపం మార్చినది అయినందువల్లనూ ప్రణవం యొక్క స్వరూపాన్ని గ్రహించి అర్థం చేసుకుని ఉపాసించదగినదై వుంది. ఈ తత్త్వం తెలుసుకుని ఉపాసించేవాడు విశ్వస్వరూపమును తెలిసినవాడవుతాడు. జన్మాంతమందు పరబ్రహ్మమునందు చేరిపోతాడు.

12

అమాత్రశ్చతుర్థోఽ వ్యవహార్యః
ప్రపంచోపశమః శివోఽద్వైత ఏవం
ఓంకార ఆత్మైవ.
సంవిశత్యాత్మ నాత్మానం య ఏవం వేద.

మాత్రలెక్కకురాని నాల్గవపాదం 'ఇలాటిది' అని చెప్పడానికి సాధ్యం కానిది. ప్రపంచాన్ని అదే తనలోకి తీసుకునేది. శుభంకరము. తనతో సమానంగా చెప్పదగినది వేరొకటి లేనిది. ఈ విధంగా ఓంకారమే ఆత్మ (పరబ్రహ్మ) అవుతూంది. ఈ తత్త్వం తెలుసుకున్నవాడు ఈ ఆత్మోపాసనచే ఆత్మయందు (ఈశ్వరునియందు) చేరగలడు.

(ప్రణవోపాసనచే బ్రహ్మసాయుజ్యం ప్రాప్తిస్తుంది.)

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

ఇది మాండూక్యోపనిషత్తు- సమాప్తం.

(9 వ పేజీ తరువాయి)

త్రిభిర్గుణమయై ర్భావై రేభిస్సర్వమిదం జగత్ ।
మోహితం నాభిజానాతి మామేభ్యః పర మవ్యయమ్ ॥

ఈ మూడు గుణాల ప్రభావం వల్ల ప్రపంచమంతా భ్రమచెందింది, వాటికంటే విలక్షణుడిగా, వినాశం లేనివాడిగా నన్ను గ్రహించలేక పోతున్నది.

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే ॥

త్రిగుణ స్వరూపమైన ఈ నా దైవమాయను దాటడం సామాన్యులకు సాధ్యపడదు. అయితే నన్నే ఆశ్రయించిన వాళ్లు దానిని అతిక్రమిస్తారు.

న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః ।
మాయయాఽపహృతజ్ఞానాః ఆసురం భావ మాశ్రితాః ॥

పాపాత్ములు, మూఢులు, మానవాధములు, మాయలో పడి వివేకం కోల్పోయిన వాళ్లు, రాక్షస భావాలను ఆశ్రయించిన వాళ్లు నన్ను పొందలేరు.

చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినోఽర్జున ! ।
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ! ॥

అర్జునా ! నన్ను సేవించే పుణ్యపురుషులు నాలుగు రకాలు–ఆపదలో వున్నవాడు, ఆత్మతత్త్వం తెలుసుకో గోరే వాడు, సిరిసంపదలు కోరేవాడు, ఆత్మజ్ఞానం కలిగినవాడు.

తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏకభక్తిర్విశిష్యతే ।
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థం అహం స చ మమ ప్రియః ॥

ఈ నలుగురిలో నిత్యమూ భగవంతుణ్ణి భక్తితో భజించే ఆత్మజ్ఞాని అత్యుత్తముడు. అలాంటి జ్ఞానికి నేనూ, నాకు అతనూ ఎంతో ప్రియులం కావడమే దీనికి కారణం.

ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ।
ఆస్థితస్స హి యుక్తాత్మా మామేవాను త్తమాం గతిమ్ ॥

వీళ్లంతా గొప్పవాళ్ళే అయినప్పటికి జ్ఞానిమాత్రం నా ఆత్మస్వరూపుడే అని నా అభిప్రాయం. ఎందువల్ల నంటే అతను నన్నే పరమగతిగా భావించి సేవిస్తాడు.

బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే ।
వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥

అనేక జన్మలలో ఆచరించిన పుణ్యకర్మల ఫలితంగా జ్ఞాని చివరజగత్తు సర్వమూవాసుదేవమయం అనే జ్ఞానంతో నన్నాశ్రయిస్తాడు. ఈ లోకంలో అలాంటి మహానుభావులు చాలాఅరుదు.

కామై స్తై స్తైర్హృత జ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః ।
తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతా స్స్వయా ॥

తమ తమ పూర్వ జన్మ సంస్కారాలకు సంబంధించిన కోరికల మూలంగా వివేకం కోల్పోయిన కొందరు, ఇతర దేవతలను వాళ్లకు తగిన నియమాలతో ఉపాసిస్తున్నారు.

యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి ।
తస్య తస్యాఽచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్ ॥

ఏ భక్తుడు ఏ దేవతామూర్తిని పూజించ కోరుతున్నాడో, అతనికి ఆ దేవతామూర్తి పట్ల అచంచల మైన శ్రద్ధ నేను కలగజేస్తాను.

స తయా శ్రద్ధయా యుక్తః తస్యారాధన మీహతే ।
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్హితాన్ ॥

అలాంటి శ్రద్ధాభక్తులతో ఆ దేవతామూర్తిని ఆరాధించిన వాడు నేను కలగ జేసే కామితార్థాలనే ఆ దేవతద్వారా పొందుతున్నాడు.

అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్ ।
దేవాన్దేవయజో యాంతి మద్భక్తా యాంతి మామపి ॥

మందబుద్ధులైన ఈ మానవులు పొందే ఫలితాలు అశాశ్వతాలు. దేవతలను అర్చించేవాళ్లు దేవతలనే పొందుతారు; నా భక్తులు మాత్రం నన్ను పొందుతారు.

అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామబుద్ధయః ।
పరం భావమజానంతో మమావ్యయ మను త్తమమ్ ॥

అవివేకులు శాశ్వతం, సర్వోత్తమం అయిన నాస్వరూపాన్ని గుర్తించలేక నన్ను మానవ మాత్రుడిగాతలుస్తారు.

నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయా సమావృతః ।
మూఢోఽయం నాభిజానాతి లోకో మామజ మవ్యయమ్ ॥

యోగమాయచేత కప్పబడివున్న నేను అందరికీ కనబడడం లేదు. మూఢ ప్రపంచం నన్ను పుట్టుక, నాశనం లేనివాడిగా తెలుసుకోలేక పోతున్నది.

వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున !
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన ॥

అర్జునా ! భూత భవిష్యద్వర్తమాన కాలాలకు సంబంధించిన జీవులందరు నాకు తెలుసు. అయితే నేను ఏ ఒక్కడికీ తెలియను.

ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత ! ।
సర్వభూతాని సమ్మోహం సర్గే యాంతి పరంతప ! ॥

పరంతపా ! సమస్త భూతాలు పుట్టుకతోనే అనురాగ ద్వేషాల మూలంగా కలిగే సుఖదుఃఖాదులవల్ల మోహంలో మునిగి, అజ్ఞానంలో పడుతున్నాయి.

యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్య కర్మణామ్ ।
తే ద్వంద్వమోహ నిర్ముక్తాః భజంతే మాం దృఢవ్రతాః ॥

పుణ్య కర్మలు చేసి సకల పాపాలనూ పోగొట్టుకున్న మహానుభావులు సుఖదుఃఖరూపమైన మోహాలనుంచి విముక్తులై గట్టి పట్టుదలతో నన్ను భజిస్తారు.

జరామరణ మోక్షాయ మామాశ్రిత్య యతంతి యే ।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్నం అధ్యాత్మం కర్మ చాఖిలమ్ ॥

ముసలితనం, మృత్యువులనుంచి ముక్తి పొందడానికి నన్ను ఆశ్రయించి, ప్రయత్నించేవాళ్లు పరబ్రహ్మతత్త్వాన్ని, ఆత్మస్వరూపాన్నీ, సమస్త కర్మలనూ గ్రహించ గలుగుతారు.

సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః ।
ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్త చేతసః ॥

అధిభూతమూ, అధిదైవమూ, అధియజ్ఞాలతో కూడిన నా రూపాన్ని తెలిసిన వాళ్లు మరణకాలంలో కూడా నన్ను మరచి పోరు.

ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం, శ్రీకృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని "విజ్ఞాన యోగం" అనే ఏడవ అధ్యాయం సమాప్తం.

(5వ పేజీ తరువాయి)

ప్రకారము భార్యగా స్వీకరించి తనలో లీనం చేసుకొన్నాడు. ఆమె జ్ఞాపకార్థమే నేటికి ధనుర్మాసమందు వైష్ణవ ఆలయాల యందు తిరుప్పావై పఠనము కొనసాగు తున్నది.

## మకరసంక్రాంతి :

భారతదేశంలో దీపావళి, వినాయక చవితి, హోళి, దసరా పండుగల తర్వాత ప్రజలు విశేషంగా జరుపుకొనే పండుగలలో సంక్రాంతి ఒకటి. దీనిని ఆంధ్రదేశంలో పెద్దపండుగయని, అరవదేశంలో 'పొంగల్' అని, బెంగాలు, గుజరాతు, మహారాష్ట్రము లందు 'తిలసంక్రాంతి' అని వ్యవహరిస్తారు. ఈ పండుగ పంటలు పుష్కలంగా పండి ప్రజలు సుఖశాంతులతో వర్ధిల్లేసమయంలో వస్తుంది. బెంగాలురాష్ట్రంలో స్త్రీలుధాన్యపు రాశి చుట్టు సాంప్రదాయపద్ధతిన పచ్చటి గడ్డి పరకలు చేతపట్టి 'బావన్‌పూరి' అని పాడుతూ నాట్యం చేస్తారట! పంజాబులో మకర సంక్రాంతి రోజున సంతానగోపాల స్వామిని పూజచేస్తారు.

ఆంధ్ర దేశమందు ఈ పండుగను పెద్ద పండుగని వ్యవహరిస్తారు. ఈ రోజుపితృదేవ తల ఆత్మశాంతికై తర్పణం వదలి, బ్రాహ్మ ణులకు, నూతన వస్త్రాలు, ధాన్యము, గుమ్మడికాయ దానమిస్తారు. సంక్రాంతి మూడు రోజుల పండుగ. మొదటిరోజున 'భోగి' అని రెండవరోజును సంక్రాంతి, మూడవరోజును కనుమ అంటారు. భోగి పండుగరోజు తెల్లవారు జామున ఇంటిలోని పాతవస్తువులనన్నింటిని కుప్పవేసి పెద్ద పెద్ద మంటలు వేస్తారు. పురాణకాల ప్రకారం ప్రహ్లాదుడు అతడి మేనత్త (హిరణ్యకశిపుని చెల్లెలు) అగ్నికి ఆహుతి కాగ వారి జ్ఞాప కార్థమీ మంటలు వేస్తారని, మరి కొందరు రావణాసురుని కాష్ఠమని చెపుతారు. భోగి రోజున పల్లెలలో కోడి పందెములు మహాసర దాగా జరుగుతాయి.

రెండవరోజు సంక్రాంతి. ఈ పుణ్యదినాన సూర్య భగవానుడు ఉత్తరాయణ సంక్ర మణం చేస్తాడు. ఈ రోజు పితృదేవతలకు తర్పణం వదిలితే వారి ఆత్మ శాంతిస్తుందని పురాణములు పేర్కొంటున్నాయి. ఈ రోజు తెల్లవారి జామునే లేచి తలంటుస్నానమాచ రించి, నూతన వస్త్రములు ధరించి, పితృ దేవతలకు తర్పణం వదులుతారు. గ్రామాల్లో జంగమదేవర్లు, గంగిరెద్దులవాళ్లు, బుడబుడ కలవాళ్ళు, దాసర్లు సాంప్రదాయ పద్ధతిలో భిక్షమెత్తుతారు. ఈ రోజు ప్రతివారు తమ కున్నంతలో లేదనకుండా దానం చేయవలె నని నియమము. ఈ పండుగ మహాభారత కాలంనుండి వాడుకలోనున్నట్లు తెలుస్తూంది మహాభారత యుద్ధంలో గాయపడిన కౌరవ పితామహుడైన భీష్మాచార్యుడు అంపశ య్యపై పరుండి ఉత్తరాయణకాలం ప్రారం భమైన తర్వాతే ప్రాణత్యాగం చేసుకొ న్నాడు. ఈ సంక్రాంతి రోజుననే శ్రీ హరి వామనావతారమెత్తి బలిచక్రవర్తిని నిర్జిం చినది. అలాగే శ్రీకృష్ణుడు గోవర్ధనగిరిని గోటితో పైకెత్తి యాదవులను రాళ్ళ వర్షము నుండి కాపాడినాడు.

కనుమ. దీనిని పశువుల పండుగ యని, పలకలు పెరికే పండుగ యని కూడా అంటారు. ఈరోజు గోవులకు స్నానము చేయించి వాటికి చెక్కు ఆహారముగా తిని పించి, కొమ్ములకు రంగురంగుల కాగిత ములతోను కురివిగింజలతోను తయారు చేసిన ప్రభలుకట్టి గ్రామాలచుట్టూ మేళ తాళాలతో మెరవణి త్రిప్పుతారు. కొన్ని గ్రామాల్లో పశువుల కొమ్ములను క్రొత్త వస్త్రాలు డబ్బులేక ప్రభలుకట్టి డప్పులు వాయించి వాటిని బెదరించి తరుముతారు. (అర్లి) సరిహద్దులో పౌరుషవంతులైన యువకులు ఆ పశువుల కొమ్ములు పట్టి నిల వేసి వాటికున్న వస్తువులను స్వాధీనము చేసుకొని యుద్ధంలో శత్రు సైన్యాన్ని జయించినట్లు విఱ్ఱవీగిపోతారు. అందుచేతనే పలకలు పెరికే పండుగ అంటారు. ఈ పండుగ చిత్తూరు జిల్లా చంద్రగిరి తాలూ కాలో విశేషంగాను, తమిళనాడు రాష్ట్రంలోని ఉత్తర ఆర్కాడు చెంగల్పట్టు జిల్లాలలో మాట్టుపొంగల్ పేరుతోను జరుపుతారు. ఈ రోజు సాయంత్రము గోవులను గ్రామాలకు దూరంగా తీసుకెళ్ళి అచ్చట పోతులరాజు అనే దేవతలకు పూజచేసి 'చిల్లాకుకుప్ప' అనే పెద్దమంటవేసి గోవులను మంటల చుట్టూ త్రిప్పి రాత్రి ఇల్లు చేరుకొంటారు. కొన్ని గ్రామాల్లో పారువేటలు కూడా జరుగుతాయి,

ఈ సంక్రాంతిధనుర్మాసంలో (డిసెంబరు 15వ తేదినుండి జనవరి 15 వ తేది)వస్తుంది. ఈ మాసం మొదటిరోజు నుండి స్త్రీలు ఇండ్లముంగిట కళ్లాపిచల్లి రంగవల్లులువేసి మధ్యలో గుమ్మడిపూలుపెట్టి రంగవల్లుల చుట్టూ తంగేడిపూలు చల్లుతారు. సాయం కాలం పసుపుముద్దలో గౌరమ్మలు చేసి, ఒక పాత్రలో పాలుపోసి మధ్యన గౌరమ్మనుపెట్టి క్రమిప ముట్టించి ప్రతి ఇంటివాకిట ముందుకువెళ్ళి, రకరకాలైన గొబ్బిపాటలు పాడుతూ చందాలు వసూలు చేస్తారు. అలావసూలైన, డబ్బు, ధాన్యంతో కనుమ మరుసటిరోజు పిండివంటలు పఠ్యో దనం తయారుచేసి, ఊరిబెలుపల కాలువ గట్టుకో చెరువుకోవెళ్ళి గౌరమ్మను నీటిలో నిమజ్జనం చేసి చేసిన వంటలు భోంచేసి తమ ఇళ్ళకు చేరుకొంటారు. ఈ నెలరోజులు ముఖ్యంగా పండుగ మూడురోజులు స్త్రీలు ఒకరితో ఒకరు పోటీపడి తమఇండ్ల ముంగిట ముగ్గులు వేస్తారు. అందుకే స్త్రీ లీ పండు గను ముగ్గుల పండుగ అంటారు. కనుమ మరుసటి రోజు గ్రామస్థులందరు ఏకమై ఉదయమే గ్రామ సమీపములోని ఒక వనము లోనికివెళ్ళి వంటలుచేసి సహ పంక్తి భోజనము చేస్తారు. దీనినే వన భోజనమంటారు. అలా సంక్రాంతి ఒక మాసం రోజులు ప్రజల కెంతో ఉత్సాహాన్ని గ్రామాలకు కాంతిని ఐకమత్యాన్ని కలుగ చేస్తుంది.

ఈ ధనుర్మాసంలోనే స్వామి అయ్యప్ప పూజలు కూడా విశేషంగా జరుగుతాయి. సంక్రాంతి రోజున అయ్యప్ప స్వామి ఆల యానికి వెళ్ళి స్వామిని నిష్ఠతో కొలిచి ధ్యానించితే వారి కష్టాలన్ని తొలగి పోతాయి. ఈ రోజే శబరిమలై భక్తులకు ఆకాశంలో 'ఒకకాంతి' జ్యోతి కనపడు తుంది. దానినే భక్తులు 'మకరవిళక్కు' అంటారు.

ధనుర్మాసము ఇంత పవిత్రతను సంత రించుకొన్నది కాబట్టే వేల సంవత్సరాలు గడచినా హిందువులు ఆచారం తప్పకుండా ఈ మాసంలో సాంప్రదాయంగా జరిపెడి పూజలను క్రమము తప్పకుండా జరిపించు చున్నారు. ఈ మాసంలోనే వైకుంఠఏకాదశి కూడా వస్తుంది.



# మన మరో జన్మ ఎలా వుంటుంది?

శ్రీ చిట్టా దామోదరశాస్త్రి

పునర్జన్మ, కర్మ సిద్ధాంతాలు పరస్పరం ముడిపడి ఉన్నాయి. పురాతనకాలంలో ఓ తెలివిగలవాడు స్వార్థపరుడై ఈ రెంటినీ కనిపెట్టాడనీ, ఫలితంగా సమాజంలో అసమానతల్ని సమర్థిస్తున్నామనీ ఈ కాలంలో దేవుడు లేడనేవారు చెప్పేమాటలు.

మార్క్సుమహాశయుడు అర్థికశాస్త్రాన్ని వడబోసి సమాజంలో అసమానతలు తొలగాలంటే వ్యక్తి పెట్టుబడిదారీవిధానం కాక ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానం కావాలన్నాడు. ఇదిపాటిస్తున్న ప్రముఖదేశం రష్యా. ఆదేశంలో ప్రభుత్వం నడిపే వ్యవసాయక్షేత్రంలో కంటే వ్యక్తి సొంత ఇంటి పెరడులో పంటలు బాగాపండుతున్నాయని ఎప్పుడో ఋజువైంది. నేడు మాస్కోలో ప్రైవేటు టాక్సీలను ప్రభుత్వ టాక్సీలకు పోటీగా నడిపితే బాగుంటుందని అక్కడి మేధావులు అభిప్రాయ పడ్డారు.

తుంటికొడితే పళ్లురాలాయన్నట్లు పునర్జన్మకు మార్క్సు సిద్ధాంతానికి సంబంధం ఏమి టంటారా? మనవిచేస్తా. మార్క్సు సిద్ధాంతంలో దేవుడు లేడుగదా! దాన్ని పాటిస్తున్నరష్యాలో చర్చిలున్నాయి. మసీదులూఉన్నాయి. అడపాదడపా ప్రభుత్వ ఖర్చుతో వాటిని బాగుచేయిస్తూంటారు కూడా. అట్టి రష్యాలో ఇప్పుడు ప్రైవేటు టాక్సీలు అనధికారకంగా నడుస్తున్నాయ్. శంఖంలో పోస్తేగాని తీర్థం కాదన్నట్లు ప్రైవేటు టాక్సీలను అధికారికంగా అనుమతిస్తారు. ఇట్లా పోగాపోగా కొన్నాళ్ళకు వాళ్లు పునర్జన్మమీద పరిశోధన చేయక పోతారా? అని నా ఆకాంక్ష.

హిందూమతంలో మోక్షం అంటే జన్మ రాహిత్యం. సులభంగా చెప్పాలంటే మనం సొంత ఇంట్లో ప్రవేశించడం. అంతవరకు ఇళ్ళు మారుతూ ఉండవలసిందేగదా! మారే ప్రతివాడూ, అద్దె ఎక్కువైనా, యేదైనా ఇంటిలో ప్రవేశిస్తాడుగాని నాసిరకం ఇల్లు కోరడు. అద్దె సుతరామూ చెల్లించలేనివాడు ధర్మసత్రాలలోనో పాడుబడిన మఠాలలోనో ఉంటాడు.

ఈ పునర్జన్మ ఎట్లా వస్తుంది? సూక్ష్మంలో చెప్పాలంటే లావాదేవీలు తేల్చుకోటానికే పునర్జన్మ వస్తుంది. నులకమంచం సొంతంగా అల్లుకొనేవాడు నిన్న సగంలో ఆపాడనుకోండి, ఈ రోజునిద్రలేచి నిన్నఎక్కడ వదిలాడో అక్కడ పనిఎత్తుకొంటాడు. అంతే కాని మళ్ళీ మొదటికిరాడు, మానవుడు.

మా చిన్నప్పుడు ఓ స్నేహితుడు ఈ జన్మలో నాకు లెక్కలు రావురా అనేవాడు. ఎంత సత్యం! ఫర్వాలేదు. వచ్చే జన్మలోనైనా వస్తాయని నమ్మాడు. ఈ పునర్జన్మ లేక పోతే అన్నీ అందరికి రావద్దా? అందునా సమానంగా రావద్దా?

పూర్వజన్మ విషయాలు మనం మర్చిపోతున్నాంగానీ, జ్ఞాపకంఉంటేగొప్పచిక్కే. చిక్కేమిటంటే ఈ జన్మలో సుఖపడలేం. ఐదేళ్లలోపు పిల్లలు క్రిందటి జన్మ విశేషాలు చెప్పటం: నమ్మిన పెద్దలు ఆ పిల్లల పూర్వ జన్మస్థలాలకు తీసుకొని పోగా ఆపిల్లలు తమ పూర్వపరిచయాలను గుర్తుపట్టటం: ఆ పెద్దలు 'ఆహా!' అనుకోపటం వార్తాపత్రికల్లో వస్తున్నవే.

సరే, పునర్జన్మ వస్తుంది. అది ఏపునాది మీద వస్తుంది? దానికేమైనా నియమ నిబంధనలున్నాయా? లేక డబ్బున్నవాడికో నియమం డబ్బులేని వాడికి మరోనియమంగా సాగుతుందా? అంటే మన పూర్వులు ఈ విషయం చక్కగావిశ్లేషించారు. భగవద్గీత ఎనిమిదవ అధ్యాయం లోని ఆరవశ్లోకం ఈవిషయాన్నే చెప్తుంది.

యం యం వాపి స్మరన్ భావం
త్యజత్యంతే కళేబరం
తం తమేవైతి కౌంతేయ!
సదా తద్భావభావితః

ఓ కుంతీ పుత్రా! ఎవడే యే భావాన్ని స్మరిస్తూ తుదకు దేహత్యాగం చేస్తాడో అతడాయా భావాన్నే పొందుతాడు. అంటే ఉత్తర జన్మ మరణకాలమందు కలిగే కట్టకడపటి భావంమీద ఆధార పడి ఉంటుంది.

ఈ మాట సాక్షాత్తు కృష్ణుడు చెప్పింది. అందునా అర్జునుడికి చెప్పింది, అర్జునుడు వట్టి శిష్యుడు కాడు. కుంతీ పుత్రుడు, శ్రీకృష్ణుని మేనత్త కొడుకు.

కృష్ణుడు అబద్ధంచెప్పడా? చెప్పమనడా? ఒక్క భార్యతో రోజువెళ్ళబుచ్చే వాళ్ళకే అబద్ధం ఆడకుండా గడవటం లేదే! అంత మంది భార్యలతో అంతా నిజమే చెప్పి కాలక్షేపం చేశాడా? నేను సత్యమే పలుకుతానని గౌరవంగా కాలక్షేపం చేస్తున్న ధర్మరాజుచేత. 'అశ్వత్థామా హతః' అని బిగ్గ

---

## ఎరుక

ఈ చిలుక
ఎన్ని గూళ్ళు మార్చిందో!
ఈ హంస
ఏ ఏ లోకాల విహరించిందో?!
నా కేమెరుక-?.
ఆది మధ్యాంతాల్లేని
ఈ మహాసృష్టి మగ్గంలో
నేనూ ఓ పోగైనందుకు
కలిగే తృప్తి మాత్రమే ఎరుక

—కె. బి. కైలాస్‌నాథ్

కథ చెప్పించి లోగొంతులో "మంచిది" అనిపించలేదా? అటువంటి మహానుభావుడు అర్జునుడితో నిజంచెప్తాడా? చెప్తాడు. వాళ్ల సంబంధం అటువంటిది. అందుకే కృష్ణుడు మరీ ముఖ్యమైన ఘట్టాలలో కౌంతేయ, కుంతీపుత్ర అంటాడు— మేనత్త కొడుకువి కాబట్టి నీకే మంచి విషయం చెప్తున్నా నన్నట్లు.

ఈ పునర్జన్మ సిద్ధాంతానికి ఉదాహరణ లున్నాయా? కొల్లలు!! జయ విజయుల కథ ప్రసిద్ధమే గదా! అందులో హిరణ్య కశిపుడి జన్మ చూడండి. చచ్చేముందు ఆతడు నరసింహ మూర్తిని చూచాడు. అంతకు ముందు నరుల్ని చూచాడు. సింహాల్ని చూచాడు. ఈ వింత ఆకారం, తల్లీ తండ్రీ లేకుండా, తాను నిర్దేశించిన స్తంభము నుండి విరుచుకు పడ్డాడు. మతి పోయింది, "ఇదేమిటీ భూతం"? అన్నాడు ఇదే వాని ఉత్తర జన్మకు–రావణ జన్మకు పునాది. ఆ రావణుడు దశ కంఠాలు వింశతి హస్తాలు గలవాడు. వింతగా లేదూ? అందుకే వాలి రావణుని పట్టుకొని పోయి తనకొడుకు అంగదుని ఉయ్యాలలో వ్రేలాడ గట్టాడట! అట్టి రావణుడు రామునితో తల పడి చచ్చేముందు రాజకుమారుడు రాముడను కొన్నాడు. అందుకే ఉత్తర జన్మలో రాజకుమారుడైన శిశుపాలుడైనాడు.

ఈ పునర్జన్మ మహా మహా మహర్షులకే తప్ప లేదు. జడ భరతుడన్న మహర్షిసృష్టి అంతా బ్రహ్మమయంగా చూచినవాడు. మరి మోక్షం రావాల్సిందే. రాలేదు సరిగదా జింక జన్మ వచ్చింది. ఎందుకూ? ముందుకు పోతున్న బండి వెనక్కి తిరిగినట్లు లేదూ? ఆ జడ భరతుడు తపస్సుచేసుకొంటున్నాడు. నిండు చూలాలైన లేడి పులి గాండ్రింపు విని ఉరికింది. జారి పడిన లేడి పిల్లను జడ భరతుడు సాకాడు. పెరిగి పెద్దదైన ఆ లేడి మరో "లేడి" కోసం పోయింది. కన్న పిల్లలే కడదాకా తల్లి దండ్రుల దగ్గర ఉండరే! లేడి పిల్ల ఉంటుందా? చరమ కాలంలో ఆ జడ భరతుడు తన్ను విడిచి పోయిన ఆ జింక పిల్లనే స్మరించాడు— జింకగానే పుట్టాడు మరు జన్మలో.

ఆడవాళ్లు సహితం మహా మహావీరుల్ని మట్టి కరిపించ గలరనేది అంబ కథ సూచిస్తుంది. కాశీరాజు ముగ్గురు కూతుళ్లలో అంబ పెద్దది. నేటి పిల్లల్లాగే సాళ్వరాజును ప్రేమించింది. తండ్రి స్వయంవరం చాటించాడు. ఏ అడ్డం తగలకపోతే సాళ్వ రాజును పెళ్లాడేదే. కాని భీష్ముడు ఆ ముగ్గురినీ తన తమ్ముడు కోసం తీసుకొని పోతూ ఉండగా – అంబ తన ప్రేమగాథ విని పించింది. నీవు కోరిన చోటికే పొమ్మని భీష్ముడు అంబను వదిలేశాడు. కాని సాళ్వ రాజు అంబను నిరాకరించాడు. ప్రవాహంలో ఒక ఒడ్డుకు కొట్టుకొని మరల రెండో ఒడ్డుకు చేరే పడవలాగా అంబ భీష్ముణ్ణి చేరింది. ఆయననే పెళ్లిచేసికొమ్మంది. దీనికి ప్రోద్బలంగా భీష్ముని గురువు పరశురాముణ్ణే పట్టుకు వచ్చింది. ఆ గురు శిష్యులకు ఘోర యుద్ధ మైంది. గురువే ఓడి పోయాడు. ఇక అంబ భీష్ముణ్ణి చంపే శక్తి కోసం శివుని గూర్చి తపస్సు చేసింది. శివుడు సరే నన్నాడు. నేను భీష్ముణ్ణి చంపాలి అని కోరుతూ అగ్గిలో ఉరికింది. స్త్రీగానే శిఖండి జన్మించింది. ఆలాగున అంబకు ఉత్తర జన్మ దేహ త్యాగ సమయమందలి ఆమె కోర్కె కారణంగా కలిగింది. ఆ శిఖండిని అడ్డం పెట్టుకొని అర్జునుడు యుద్ధమాడాడు. భీష్ముడు అస్త్ర సన్యాసం చేశాడు. ఒళ్లంతా బాణాలే ఐనా భీష్ముడప్పుడు చావలేదు. అది వేరే కథ.

నిజానికి భీష్ముడప్పుడు చావనే లేడు. తండ్రి శంతనుడు అతనికి స్వచ్ఛంద మరణం వరంగా ఇచ్చాడు. అంటే కోరి నప్పుడు చనిపోతా నన్నమాట. ఆ భీష్ముడు ఉత్తరాయణ పుణ్యకాలం దాకా ఆగాడు. ఐనా భీష్ముడికి మోక్షం రాలేదు.

ఆ భీష్ముడు సామాన్యుడా? మన్మథుణ్ణి ఎవరు గెలవ గలరు? అనే ప్రశ్న వస్తే మొదట చెప్పదగిన వాడు భీష్ముడు. ఆ బ్రహ్మచర్య దీక్ష వలననే శ్రీకృష్ణుడు చెప్పిన గీతను అల్లంత దూరంలో ఉండిన్నీ ఆల కించు కొన్నాడు. అర్జునుని జెండా మీద ఉన్న కపిరాజున్నూ విన్నా డనుకోండి. ఎంతో కష్టపడి ఆర్జించిన జ్ఞానాన్ని తగిన వాడికి ఈ లాగున బోధించాలి సుమా అన్నట్లు ధర్మరాజు మనస్సు శాంతపడేట్లు నీతి ప్రవాహంతో అభిషేకించాడు. దానికి వ్యాసుడు, కృష్ణుడు సాక్షులు.

ఇంతా చేసి అంత్యకాలంలో మనసు నిండా శ్రీకృష్ణుడికి తప్ప ఇతరానికి చోటు లేకుండా చేసి ముప్ఫయి శ్లోకాలలో కృష్ణుణ్ణి స్తుతించాడు భీష్ముడు. ఐనా ప్రాణోత్క్రమణ వేళ చిన్న పిల్లవాడి గుప్పిలిలోని చేపలాగా జారి పోయాడా కృష్ణుడు. అందుకే భీష్ముడు అష్ట వసువుల్లో జేరిపోయాడు.

జడ భరతుడికీ భీష్ముడికీ అందని ఆ పరమాత్ముడు మన కందుతాడా అని నిరాశ పడకండి—"కృషితో నాస్తి దుర్భిక్షం" అన్నారు. ఒక్కపూట కడుపు నిండటానికి ఎంతో కష్ట పడతామే! శాశ్వతానందానికి ఎంత కృషి చేయాలో అని భయపడకండి. ఆ భగవంతుడు భక్తవశుడు పరమసులభుడు.

అట్లా అని ఉద్యోగాలు మానేస్తారా? ఆ పని చేసే కాసేపూ దానిలో మనసు పెట్టడం నేర్చుకోండి. మిగిలిన కాలంలో కూడా మనసునిండా మన్మథుణ్ణి కాదు– మాధవుణ్ణి నిలపండి. ఆ ప్రాణోత్క్రమణ వేళ ఎప్పుడొస్తుందో భీష్ముడు లాంటి వాళ్ళకే తెలియ వచ్చు. అందుకే మనలాంటివాళ్లు నిత్యమూ భగవత్స్మరణ చేయాలి. *

## నివేదనము

కొండపై నీవు నిలుచుండ నేల
గుండెలున్నవి నావి కూర్చుండరాద!
ఆ నా కథుని నీరు తేలేను
నాకన్నీటి పాదాలు కడిగేను స్వామి:
దీప ధూప నైవేద్యముల నర్పింపగా లేను
పాపపంకిల కాయంబు నీచెంత
దహియింతు స్వామి:
నారదాదుల వోలె నే పాడ లేను
తీరని శోకాలాపనమె వినిపింతు స్వామి
కాపాడు మాదేవ! ఓ శ్రీనివాస!
నీ పాదమే గతి తిరువేంకటేశ!

– నైవారు అప్పాస్వామి

రగా చెప్పించి భోగాంతులో "దుంఖః" అనిపించలేదా? అటువంటి మహానుభావుడు అర్జునుడితో నిజంచెప్తాడా? చెప్పాడు. వాళ్ల సంబంధం అటువంటిది. అందుకే కృష్ణుడు మరీ ముఖ్యమైన ఘట్టాలలో కౌంతేయ, కుంతీపుత్రి అంటాడు—మేనత్త కొడుకువి కాబట్టి నీకే మంచి విషయం చెప్తున్నా నన్నట్లు.

ఈ పునర్జన్మ సిద్ధాంతానికి ఉదాహరణ లున్నాయా? కొల్లలు!! జయ విజయుల కథ ప్రసిద్ధమే గదా! అందులో హిరణ్య కశిపుడి జన్మ చూడండి. చచ్చేముందు అతడు నరసింహమూర్తిని చూచాడు. అంతకు ముందు నరుల్ని చూచాడు. సింహాల్ని చూచాడు. ఈ వింత ఆకారం, తల్లీ తండ్రీ లేకుండా, తాను నిర్దేశించిన స్తంభము నుండి విరుచుకు పడ్డాడు. మతి పోయింది, "ఇదేమిటీ భూతం"? అన్నాడు ఇదే వాని ఉత్తర జన్మకు–రావణ జన్మకు పునాది. ఆ రావణుడు దశ కంఠాలు వింశతి హస్తాలు గలవాడు. వింతగా లేదూ? అందుకే వాలి రావణుని పట్టుకొని పోయి తనకొడుకు అంగదుని ఉయ్యాలలో వ్రేలాడ గట్టాడట! అట్టి రావణుడు రామునితో తల పడి చచ్చేముందు రాజకుమారుడు రాముడను కొన్నాడు. అందుకే ఉత్తర జన్మలో రాజకుమారుడైన శిశుపాలుడైనాడు.

ఈ పునర్జన్మ మహా మహా మహర్షులకే తప్ప లేదు. జడ భరతుడన్న మహర్షి సృష్టి అంతా బ్రహ్మమయంగా చూచినవాడు. మరి మోక్షం రావాల్సిందే. రాలేదు సరిగదా జింక జన్మ వచ్చింది. ఎందుకూ? ముందుకు పోతున్న బండి వెనక్కి తిరిగినట్లు లేదూ? ఆ జడ భరతుడు తపస్సుచేసుకొంటున్నాడు. నిండు.చూలాలైన లేడి పులి గాండ్రింపు విని ఉరికింది. జారి పడిన లేడి పిల్లను జడ భరతుడు సాకాడు. పెరిగి పెద్దదైన ఆ లేడి మరో "లేడి" కోసం పోయింది. కన్న పిల్లలే కడదాకా తల్లి దండ్రుల దగ్గర ఉండరే! లేడి పిల్ల ఉంటుందా? చరమ కాలంలో ఆ జడ భరతుడు తన్ను విడిచి పోయిన ఆ జింక పిల్లనే స్మరించాడు—జింకగానే పుట్టాడు మరు జన్మలో.

ఆడవాళ్లు సహితం మహ మహావీరుల్ని మట్టి కరిపించ గలరనేది అంబ కథ సూచిస్తుంది. కాశీరాజు ముగ్గురు కూతుళ్లలో అంబ పెద్దది. నేటి పిల్లల్లాగే సాళ్వరాజును ప్రేమించింది. తండ్రి స్వయంవరం చాటించాడు. కథ అడ్డం తిరక్కపోతే సాళ్వ రాజును పెళ్లాడేదే. కాని భీష్ముడు ఆ ముగ్గురినీ తన తమ్ముడు కోసం తీసుకొని పోతూ ఉండగా – అంబ తన ప్రేమగాథ విని పించింది. నీవు కోరిన చోటికే పొమ్మని భీష్ముడు అంబను వదిలేశాడు. కాని సాళ్వ రాజు అంబను నిరాకరించాడు. ప్రవాహంలో ఒక ఒడ్డుకు కొట్టుకొని మరల రెండో ఒడ్డుకు చేరే పడవలాగా అంబ భీష్ముణ్ణి చేరింది. ఆయననే పెళ్లిచేసికొమ్మంది. దీనికి ప్రోద్బలంగా భీష్ముని గురువు పరశురాముణ్ణే పట్టుకు వచ్చింది. ఆ గురు శిష్యులకు ఘోర యుద్ధమైంది. గురువే ఓడి పోయాడు. ఇక అంబ భీష్ముణ్ణి చంపే శక్తి కోసం శివుని గూర్చి తపస్సు చేసింది. శివుడు సరే నన్నాడు. నేను భీష్ముణ్ణి చంపాలి అని కోరుతూ అగ్గిలో ఉరికింది. స్త్రీగానే శిఖండి జన్మించింది. ఆలాగున అంబకు ఉత్తర జన్మ దేహ త్యాగ సమయమందలి ఆమె కోర్కె కారణంగా కలిగింది. ఆ శిఖండిని అడ్డం పెట్టుకొని అర్జునుడు యుద్ధ మాడాడు. భీష్ముడు అస్త్ర సన్యాసం చేశాడు. ఒళ్లంతా

## నివేదనము

కొండపై నీవు నిలుచుండ నేల
గుండెలున్నవి నావి కూర్చుండరాద!
ఆ నా కథని నీరు తేలేను
నాకన్నీటి పాదాలు కడిగేను స్వామి:
దీప ధూప నైవేద్యముల నర్పింపగా లేను
పాపపంకిల కాయంబు నీచెంత
దహియింతు స్వామి:
నారదాదుల.వోలె నే పాడ లేను
తీరని శోకాలాపనమె వినిపింతు స్వామి
కాపాడు మాదేవ! ఓ శ్రీనివాస!
నీ పాదమే గతి తిరువేంకటేశ!

– నైవారు అప్పాస్వామి

చావాలే ఐనా భీష్ముడప్పుడు చావలేదు. అది వేరే కథ.

నిజానికి భీష్ముడప్పుడు చావనే లేదు. తండ్రి శంతనుడు అతనికి స్వచ్ఛంద మరణం వరంగా ఇచ్చాడు. అంటే కోరి నప్పుడు చనిపోతానన్న మాట. ఆ భీష్ముడు ఉత్తరాయణ పుణ్యకాలం దాకా ఆగాడు. ఐనా భీష్ముడికి మోక్షం రాలేదు.

ఆ భీష్ముడు సామాన్యుడా? మన్మథుణ్ణి ఎవరు గెలవగలరు? అనే ప్రశ్న వస్తే మొదట చెప్పదగిన వాడు భీష్ముడు. ఆ బ్రహ్మచర్య దీక్ష వలననే శ్రీకృష్ణుడు చెప్పిన గీతను అల్లంత దూరంలో ఉండిన్నీ ఆక ళించు కొన్నాడు. అర్జునుని జెండా మీద ఉన్న కపిరాజున్నూ విన్నా డనుకోండి. ఎంతో కష్టపడి ఆర్జించిన జ్ఞానాన్ని తగిన వాడికి ఈ లాగున బోధించాలి సుమా అన్నట్లు ధర్మరాజు మనస్సు శాంతపడేట్లు నీతి ప్రవాహంతో అభిషేకించాడు. దానికి వ్యాసుడు, కృష్ణుడు సాక్షులు.

ఇంతా చేసి అంత్యకాలంలో మనసు నిండా శ్రీకృష్ణుడికి తప్ప ఇతరానికి చోటు లేకుండా చేసి ముప్ఫయి శ్లోకాలలో కృష్ణుణ్ణి స్తుతించాడు భీష్ముడు.ఐనా ప్రాణోత్క్రమణ వేళ చిన్న పిల్లవాడి గుప్పిలిలోని చేపలాగా జారి పోయాడాకృష్ణుడు. అందుకే భీష్ముడు అష్ట వసువుల్లో జేరిపోయాడు.

జడ భరతుడికీ భీష్ముడికీ అందని ఆ పరమాత్ముడు మన కందుతాడా అని నిరాశ పడకండి—"కృషితో నాస్తి దుర్భిక్షం" అన్నారు. ఒక్కపూట కడుపు నిండటానికి ఎంతో కష్ట పడతామే! శాశ్వతానందానికి ఎంత కృషి చేయాలో అని భయపడకండి. ఆ భగవంతుడు భక్తవశుడు పరమసులభుడు.

అట్లా అని ఉద్యోగాలు మానేస్తారా? ఆ పని చేసే కాసేపూ దానిలో మనసు పెట్టడం నేర్చుకోండి. మిగిలిన కాలంలో కూడా మనసునిండా మన్మథుణ్ణి కాదు—మాధవుణ్ణి నిలపండి. ఆ ప్రాణోత్క్రమణ వేళ ఎప్పుడొస్తుందో భీష్ముడు లాంటి వాళ్ళకే తెలియ వచ్చు. అందుకే మనలాంటివాళ్లు నిత్యమూ భగవత్స్మరణ చేయాలి. *



శ్రీ నందగోపాల్



ఛైర్మన్ శ్రీ కనకదుర్గా వెంకట సత్యనారాయణరాజుగారి ప్రమాణస్వీకారం



శ్రీమతి యస్. రాజకుమారి

# ప్రమాణస్వీకారోత్సవం



శ్రీ హెచ్. ఆర్. బసవరాజు



శ్రీ జి. మాధవరెడ్డి

తిరుమల తిరుపతి దేవస్థానముల నూతన బోర్డునిర్వాహక మండలి సభ్యుల పదవీ స్వీకారోత్సవం అక్టోబర్ 17వ తేదిన తిరుమల శ్రీవారి ఆలయం పరకామణి మండపంలో విశిష్ట రీతిలో జరిగింది. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారక రామారావు ఈ కార్యక్రమానికి విచ్చేయటం, ఆద్యంతం సంచాలకత్వం వహించటం దీనికి ప్రత్యేక ప్రాధాన్యతను సంతరించి పెట్టింది. దేవస్థాన కార్యనిర్వాహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి ప్రమాణపత్రం చదువుతుండగా తొలుత మండలి అధ్యక్షులు శ్రీ కనకరాజు ఆ తరువాత ఇతర సభ్యులు తెలుగులో ప్రమాణస్వీకారం చేశారు– కార్యక్రమం చివరన ముఖ్యమంత్రి సభ్యులందరిని శ్రీవారి సన్నిధిలో నుంచివారిని స్వామిసేవకు అంకితం కావలసిందిగా కోరారు



శ్రీ యల్. నర్శింగ్‌నాయక్



శ్రీ పి. వెంకటేశ్వర్లు

శ్రీ పి. యాదగిరి



శ్రీ బి. సత్యనారాయణ



శ్రీ టి. రుద్రయ్య



శ్రీ కె. అప్పలనాయుడు



# నల్లని అక్షతలు

— శ్రీ కంకరగంటి రంగాచార్యులు

మంత్రాలయం ఆంధ్రదేశంలోని దివ్య స్థలాలలో ఒకటి. ఇది కర్నూలు జిల్లాలో ఉంది. తుంగభద్రానదీ తీరాన కట్టబడి వుంది. గొప్ప సన్యాసియైన రాఘవేంద్ర స్వాములవారి బృందావనం ఇక్కడ వుంది. ప్రతిరోజూ వేలాదిమంది మంత్రాలయం సందర్శిస్తారు;

రాఘవేంద్రస్వామి వారు సుమారు మూడువందల ఏళ్ళ క్రితం జీవించినవారు. వీరు దేశంలోని అన్ని స్థలాలకూవెళ్ళి, ప్రజలను కలుసుకొని, వారికి సత్యపథాన్ని గురించి ప్రబోధిస్తూ వుండేవారు. వారు పలుమార్లు ప్రజలకు ఈ విధంగా చెబుతూ వుండేవారు. "దైవమంటే భక్తికలిగి ఉండండి, మీ మనస్సులను పరిశుభ్రంగా ఉంచుకోండి. ఇతరుల మనస్సులను గాయపరచకండి"

ఒకసారి వీరు దేశపర్యటన చేస్తూ చేస్తూ ఒక కుగ్రామానికివెళ్లారు. అక్కడ ఒక ఆంజనేయస్వామి దేవస్థానంలో విడిదిచేశారు. వారిని దర్శించుకోవడానికి ప్రతిరోజూ వందలాది మంది వస్తూవుండేవారు. వారు అక్కడున్న స్వాములవారితో వారి సమస్యలనూ, కష్టాలనూ, రోగాలనూ చెప్పుకొంటూ వుండేవారు. ఆ స్వాములవారు ప్రార్థనలతో వారి బాధలను పోగొడుతూండేవారు.

ఒకరోజు ఒక అంటరానివాడు స్వాముల వారిని చూడడానికి వచ్చాడు. ఆ అంటరానివాడు స్వామివారి సన్నిధికి వెళ్ళడానికి భయపడ్డాడు.

స్వామివారికి వాడెవరో తెలుసు. వారు ఆ అంటరానివానిని తన దగ్గరికి పిలుచుకున్నారు. వానితో ఇలా అన్నారు. "నీవెవరో నాకు తెలుసు. నా దగ్గరకు వచ్చేందుకు నీ వెందుకు అలా భయపడుతున్నావ్? నీవు ఇతర మానవులలాగే ఉన్నావు. శ్రీస్వామికి నైవేద్యం పెట్టడానికై నీవేంతెచ్చావు?"

అంటరానివాని ఆశ్చర్యానికి అంతు లేకుండా పోయింది. స్వామీజీ వానిని పలకరించారని వానికి అమందమైన ఆనందం కలిగింది. అయితే అతనికి వెంటనే దుఃఖం కూడా ముంచుకొచ్చింది. స్వామిజీ కిచ్చేందుకు వాని వద్ద ఏమీలేదు.

వాడిలా చెప్పాడు. "స్వామీజీ, ఇంట్లో నావద్ద కొన్ని అవగింజలు తప్ప మరేమీ లేవు. మీకు వాటిని నేనెలా ఇవ్వడం? నాకు చాలా సిగ్గేస్తోంది". స్వామీజీ నవ్వుతూ ఇలా అన్నారు. "వెళ్లి వాటిని తీసుకురా. వాటినే నేను భగవంతునికి నైవేద్యంగా

(48 వ పేజీలో)





తిరుమలలో నెలకొల్పిన తి. తి. దే. ఉద్యానవన విభాగకార్యాలయానికి తే 17-10-83 దిన దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి ప్రారంభోత్సవం చేశారు. ఈ చిత్రంలో తి. తి. దే. సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ డి. సుబ్బరాయులు ఉద్యానవన విభాగాధికారి శ్రీ తమ్మణ్ణ తదితరులున్నారు.

# గ్రంథావిష్కరణ

తిరుమల తిరుపతి దేవస్థానములవారి ధార్మిక గ్రంథప్రచురణల ఆర్థికసహాయం పథకం క్రింద ప్రచురింపబడిన 'అన్నమాచార్య సంకీర్తనామృతము' 'ప్రబోధ చంద్రోదయము ఒక తులనాత్మక విమర్శ' అనే రెండు గ్రంథాల ఆవిష్కరణోత్సవం నవంబర్ 1 వ తేదిన తిరుపతి శ్రీ అన్నమాచార్య కళామందిరంలో జరిగింది-'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు అధ్యక్షత వహించగా ప్రముఖ పౌరాణికులు తి. తి. దే. పౌరాణిక పాఠశాల ప్రధానాధ్యాపకులు శ్రీ మల్లాది చంద్రశేఖరశాస్త్రిగారు 'అన్నమాచార్య సంకీర్తనామృతము'ను ఆవిష్కరించారు. హిందూధర్మ రక్షణ సంస్థ కార్యదర్శి శ్రీ సముద్రాల లక్ష్మణయ్య దీని రచయిత- శ్రీ మల్లెల గురవయ్యగారి 'ప్రబోధ చంద్రోదయ విమర్శను శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి (దేవస్థాన ప్రజాసంబంధ శాఖ) ఆవిష్కరించారు - సభాధ్యక్షులు 'కరుణశ్రీ' గారు ఈ రెండు గ్రంథాల విశిష్టతను గురించి వివరించారు-తెలుగులో వెలసిన పదసాహిత్యానికంతా అన్నమయ్య పాటలే పెట్టుబడిఅనీ, వాటిలోని ఆధ్యాత్మికతను వెలికితీయుటానికి శ్రీ సముద్రాల లక్ష్మణయ్య శృతిస్మృతి పురాణేతిహాసాలను బాగా శోధించారని కరుణశ్రీగారు పేర్కొన్నారు. ప్రబోధ చంద్రోదయం పి. హెచ్‌డి. పట్టం పొందిన గ్రంథమని ఇంతటి గహనమైన తాత్త్వికవిషయాన్ని పరిశోధనకు ఎన్నుకొన్న శ్రీ మల్లెల గురవయ్య అభినందీయుడని ఆచార్య జాస్తి సూర్యనారాయణ పేర్కొన్నారు. శ్రీయుతులు ముదివర్తి కొండమాచార్యులు, కె. సర్వోత్తమన్, తదితరులు గ్రంథకర్తల్ని అభినందిస్తూ ప్రసంగించారు.

# వార్తాలహరి

## కోటి రూపాయల విరాళం

దేవస్థాన నూతన మండలి తన తొలి నిర్ణయంగా ఆంధ్రప్రదేశ్ కోస్తా తెలంగాణా జిల్లాలలో జల ప్రళయానికి గురైన బాధితుల సహాయార్థం శ్రీవారి విరాళంగా ఒక కోటి రూపాయలను ముఖ్యమంత్రి సహాయ నిధికి అంద జేస్తున్నట్లు ప్రకటించింది. వరద భీభత్సానికి గురైన ప్రజానీకం దుర వస్థలపట్ల మండలి తన సానుభూతి సంతాపాలను వ్యక్తంచేసింది. తి. తి. దే. ధర్మకర్తల మండలి అధ్యక్షులు శ్రీ సత్యనారాయణ రాజు దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి ముఖ్యమంత్రిని కలిసి 30-10-83 తేదిన ఈ చెక్కును అందజేశారు.

## వికలాంగుల శిక్షణ

వికలాంగుల సంక్షేమం పట్ల ప్రభుత్వ పరంగానే కాకుండా సామాన్య ప్రజానీకం సైతం శ్రద్ధాసక్తులు చూపించ వలసిన తరుణం ఆసన్నమైనదని తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామి రెడ్డి పేర్కొన్నారు. అక్టోబర్ 3 వ తేదిన తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర వికలాంగుల శిక్షణ కేంద్రంలో జరిగిన ఒక సమావేశంలో వికలాంగులకు శిక్షణ సర్టిఫికెట్లను అందజేస్తూ ఆయన పై విధంగా అన్నారు.

ఈ ఏడాది ఉగాదినాడు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారక రామారావు చేతుల మీదుగా ప్రారంభింప బడిన తిరుమల తిరుపతి దేవస్థానముల వికలాంగ శిక్షణ కేంద్రంలో తొలిజట్టుగా ఇప్పటికి 50 మంది వికలాంగులకు (మూగ, బధిర, అంధులకు) వివిధ సాంకేతిక వృత్తులలో శిక్షణ ఇవ్వడం జరిగిందని కేంద్ర డైరెక్టర్ శ్రీమతి పై. ఆర్. ధనలక్ష్మి వెల్లడించారు. గత 5 నెలల కాలంలో వారు రు 12 వేల విలువ చేసే వస్తుసామాగ్రిని ఉత్పత్తి చేయడం జరిగిందని కూడ ఆమె చెప్పారు.

ఆనాటి సభకు దేవస్థాన పౌరసంబంధ శాఖాధి కారి శ్రీ రావుల సూర్యనారాయణ మూర్తి స్వాగతం పలుకగా వికలాంగుల సంస్థ ప్రాజెక్టు ఆఫీసర్ శ్రీ జుఝూరీ మలి పలుకులు పలికారు.



# ధర్మరక్షణ కార్యక్రమాలు



## గ్రామం గ్రామానికి గంగామాత

హిందూ సమాజం అఖండం, అవిభాజ్యం ధర్మం మన ఆత్మ. దేశం మన దేహం. ఈ ఏకాత్మతా భావాన్ని మరచి పోయింది నేటి మన సమాజం. వర్ణ, వర్గ, భాషా, ప్రాంతాభి వైవిధ్యంలో ఐక్యతా భావాన్నే కోల్పోయింది.

ఈ ఐక్యతను పునరుద్ధరించడానికి విశ్వ హిందూ పరిషత్ చేపడుతున్న పెక్కు పథ కాలు కార్యక్రమాలలో "ఏకాత్మక యజ్ఞం" ఒక చారిత్రక విశేషం.

ఉత్తరాన గంగోత్రి నుండి గంగా జలాన్ని, భారతమాత చిత్ర సహితమైన సుందర రథంలో తీసుకొని దక్షిణాన రామే శ్వరం లోను, తూర్పున పరశురామ గుండం నుండి బ్రహ్మపుత్రా నదీ జలాన్ని తీసికొని పశ్చిమాన సోమనాథంలోను అభిషేకం చేసే ఒక మహత్తర తీర్థయాత్ర ఇది. నెల రోజుల పాటు జరిగే ఈ యాత్రలో మార్గ మధ్యంలో సమస్త ప్రాంతాలను సంద ర్శిస్తూ, ఆయా ప్రదేశములందలి పవిత్ర నదీ జలాలను స్వీకరిస్తూ సాగి, వెళ్ళాలని యోచన. ఈరెండు యాత్రలు 1983 నవంబర్ 16న ఆరంభమై డిసెంబర్ 16 న ముగుస్తాయి రెండు రథాలు నవంబరు 29 న నాగపూర్‌లో కలుస్తాయి. మార్గమధ్యంలో వివిధ ప్రాంతా లలో అనేక ఉపయాత్రా రథాలు ఈ ప్రధాన యాత్రలో కలుస్తాయి.

50 వేల కిలోమీటర్ల పొడువున సాగే ఈ అద్భుత యావద్దేశీయ యాత్రలో 1700 ప్రదేశాలలో రథాలు ఆగుతాయి. అక్కడ పరిసర ప్రదేశముల 3 లక్షల గ్రామాలనుండి జన వాహినులు వచ్చే ఆ కేంద్రాల ఉత్సవాలలో పాల్గొంటారు. ఈ విధంగా 10 కోట్ల మంది ఈ మహోత్సవంలో పాల్గొ నాలని లక్ష్యం. ఆయా కేంద్రాలలో సభలు, సమావేశాలు, కీర్తనలు, ప్రవచనలు ధార్మిక వస్తు విక్రయాలు జరుగుతాయి. అంతేకాదు యాత్రా తీర్థమును కోట్లాది లకు చిన్న చిన్న కలశములలో ప్రసాదంగా ఇచ్చి, లక్షలాది గ్రామాలకు అందించాలని సంకల్పం.

కుంభమేళా వంటి మహోత్సవములలో లక్షలాది గ్రామాలనుండి ప్రజ గంగా మాత వద్దకు వెళ్ళితే, ఈ మహాయజ్ఞంలో గంగామాత లక్షలాది గ్రామాలు చేరు తుంది. గ్రామం గ్రామానికి గంగామాత చేరాలని సంకల్పం.

దైవం, ధర్మం, దేశం, సమాజం పట్ల ఏకాత్మకమైన పవిత్ర భక్తిభావాన్ని నూతన దేశంలోను ఉద్దీపింపజేసే మహాయజ్ఞమిది.

ఆంధ్రప్రదేశ్‌లో వివిధజిల్లాలలో డిసెంబర్ 3-10 తేదీల మధ్య మొత్తం నాలుగు ఉప యాత్రలలో నాలుగు ఉప రథాలు వచ్చి మహా యాత్రలో పాల్గొంటాయి. మొత్తం షుమారు 80 కేంద్రాలలో కార్యక్రమాలు యోజింపబడ్డాయి.

ఈ చారిత్రక ధార్మిక మహాయజ్ఞములో ఎల్లరు పాల్గొని గంగాజల ప్రసాదమును గ్రామ గ్రామానికి అంద జేయవలసినది గాను, హిందూ సమాజ ధార్మిక ఏకాత్మతా చరిత్రలో ఒక అద్భుత అధ్యాయమును ఆరం భించుటలో సహకరించవలసిందిగాను విశ్వ హిందూ పరిషత్ విజ్ఞప్తి చేస్తున్నది.

## నెల్లూరులో శరన్నవరాత్రులు

దసరా పర్వదిన సందర్భంగా, తిరుమల తిరుపతి దేవస్థానముల, హిందూధర్మ రక్షణ సంస్థ, నెల్లూరుజిల్లా శాఖ నిర్వాహకులు శ్రీ ఎస్. ఎస్. శివశంకర్ ఆధ్వర్యములో ధార్మిక సమ్మేళన కార్యక్రమాలను నెల్లూరు గూడూరు నగరములందు వైభవోపేతముగ నిర్వహించినది. వందలాది భక్తులు, భక్త సంఘ సభ్యులు ఈ కార్యక్రమములలో ఆనందోత్సాహములతో పాల్గొన్నారు.

శ్రీ వేంకటేశ్వర స్వామి భక్త సేవా సంఘము వారిచే దేవీశరన్నవరాత్ర దేవీ పూజ మంగళవాయిద్యములతో ధూపదీప నైవేద్యములతో వైభవోపేతముగా నిర్వ హింపబడినది. సాయంత్రము "ఋషి ప్రోక్త దేవీ భాగవత" పురాణ ప్రవచనము శ్రీమాన్ పి. యమ్. కృష్ణస్వామి గారిచే మృదు మధురముగా ప్రవచింపబడినది.

ఈ మాసపు ప్రత్యేక ఆకర్షణ కుమారి శ్రీదేవి 12 సంవత్సరముల బాల భాగవ తారిణిచే "శ్రీనివాస కళ్యాణము" హరికథా పన్యాసము. ఇతరులచే భజన, కార్యక్రమ ములు శ్రావ్యముగా గానము చేయబడినవి.

"సీతరూపచిత్రణ" గూర్చి శ్రీ యమ్. శ్రీనివాసులు గారు చక్కని శైలిలోను, శ్రీ టి. నారసింహారెడ్డి గారిచే "వేదాంతో పన్యాసము" చక్కని కథల రూపేణ సరళ శైలిలో గావింపబడినవి.



[ 4వ పెజి తరువాయి ]

మతమే విభిన్నతకు కారణమైతే, ఒకేమతంలోని వారిలో ఎన్నోదేశాలలో ఘర్షణ ఎందుకు ఏర్పడుతున్నది? పాలుగారే పిల్లలను, పొంగుల యువతరాన్ని సమిధలుచేసి, సంబరపడే మతం ఏదీ లేదు. ఏమతంవారైనా ఈ జాతీయజీవన విధానంతో అల్లుకుపోయినవా అందరూ ఈ పుణ్యభూమికి పసిపాపలే! అందువల్లనే, జరుగుతున్నవి మతోన్మాదచర్యలుకావు మదోన్మాద చర్యలు-అంతే! సాటి మాన సంఘర్షణలాధారంగా బ్రతికే పరాన్న జీవులు కొంతమంది ఎప్పుడూ ఉంటారు. ఎదురింటిమంటతో మనచుట్ట వెలిగించుకొందా మతమేతప్పు, వేరేమతం, ధర్మం, జాతి భేదాలేవీ వీరికి ప్రత్యేకంగా వుండవు. కాని, ఈ మందే కొరవుల్ని పక్కనుంచుకొని సమ నిద్రపోతూ, మతోన్మాదమని కలవరిస్తోంది. మతం ఒక నియమకం మాత్రమే. అది మానవత్వపు విలువలకు అడ్డురాకూడదు. మనుష ప్రవర్తించాలన్న విషయం భారతంలో స్పష్టంగావుంది.

ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తనమనంబున కగు, దా
నొరులకవి సేయకునికి య
పరాయణము పరమధర్మపథముల కెల్లన్.

దీన్నే ఇంకోవిధంగా ఎదటివారి కంటి నలుసుగూర్చి చెప్పే ముందు నీకంటిదూలం తొలగించుకోమని అన్నారు. ఈ లని కాదన్న మతం ఇంతవరకూ రాలేదు. కనుక అన్నిమతాలవారూ ఈ మదోన్మాదాన్ని ఎదుర్కొని బుద్ధిచెప్పాలి. అప్పుడే మతాలలోని సమతాధర్మం మరింత జాగృత మౌతుంది. అంతవరకు....?

సబ్‌కో సన్మతి దే భగవాన్! అని ప్రార్థించటమే.

( 45వ పెజి తరువాయి )

అర్పిస్తాను. భగవంతుడు ప్రేమతో దేనిని ఇచ్చినా ప్రీతితో గ్రహిస్తాడు".

అంటరానివాడు ఇంటికి వెళ్లి ఆవగింజలను తెచ్చాడు. వాటిని వాడు స్వామీజీకి గౌరవపురస్సరంగా సమర్పించాడు. స్వామివారు వాటిని శ్రీరామునికి నైవేద్యంగా పెట్టారు. వారు వంటవాళ్ళను పిలిచి, వాళ్ళకు ఆ ఆవగింజలనిచ్చి, వాటిని ఆనాటి వంటలో ఉపయోగించండని చెప్పారు.

స్వామీజీ శిష్యులూ, అనుయాయులూ అందుకిష్టపడలేదు. వారిలా చెప్పారు. "స్వామీజీ, మీరెలా ఈ ఆవగింజల నంగీకరించారు? పైగా, వాడు అంటరానివాడాయె ఆషాఢమాసంలో ఆవాలను వంటలో వాడకూడదు కూడా".

స్వామీజీ నవ్వి, ఇలా అన్నారు. "మీకు ఈ అంటరాని వాడెవరో తెలియదు. ఇతడు పరమభాగవతోత్తముడు. వీనికి మీకన్నా పరిశుద్ధమైన హృదయముంది. అంటరాని వాడూ పుట్టటమే పాపమా? భగవంతుడు మానవుల్లో ఒకరికీ ఇంకొకరికి నడుమ భేదాన్ని కల్పించలేదు. మనం తెలివి తక్కువ వాళ్లం. మనమే మనిషికీ మనిషికీ మధ్య భేదాన్ని సృష్టిస్తున్నాం. ఈ రోజు వంటలో ఈ ఆవగింజలను తప్పకుండా మీరు వాడాలి. అంతే".

స్వామీజీ శిష్యుల్లో ఒకనికి ఇది సరిపడలేదు. అతడిలా విజ్ఞప్తి చేసుకొన్నాడు. "స్వామీజీ, ఈ రోజు నేను ఇక్కడ భోజనం చెయ్యను. నాకు వేరేపని ఉంది. దయచేసి నాకు ఇక్కడినుండి వెళ్లిపోవడానికి అనుమతి ఇవ్వండి".

స్వాములవారు అతనికి అనుమతి ఇచ్చారు కానీ వెళ్లిపోయేందుకు ముందు తీర్థమూ, అక్షతలూ తీసుకొని వెళ్లి పొమ్మన్నారు.

ఎఱ్ఱని అక్షతలు స్వామీజీ శిష్యుని చేతుల్లోకి వేశారు. శిష్యుని చేతులకు తగిలిన వెంటనే అక్షతలు నల్లగా మారాయి, శిష్యుడు ఆశ్చర్యభయాలతో స్వామీజీని ఇలా అడిగాడు. "స్వామీజీ, ఎఱ్ఱ ల్లాగా నిగనిగలాడుతున్న అక్షత కిలా బొగ్గుముక్కల్లా నల్లబారాయి మైనా అపరాధం చేశానా?"

స్వామీజీ నవ్వుతూ అన్నారు. మనశ్శుద్ధిలేదు. నీ మనస్సులోన తలపులే ఎఱ్ఱని అక్షతలను మార్చాయి. అంటరానివాడుకూ గానూ, నాలాగానూ ఒక మానవు వానిపట్ల చెడ్డగా ప్రవర్తించరాదు అంటరానివాడనటం ఒకపాపం, దేవుడు అతనిని అంటరానివాడన మలా అంటాము. నీకు అలా తలంపు లుండరాదు. ఉంటె దేవు క్షమించడు".

శిష్యుడు స్వాములవారిని వేడాడు. స్వాములవారు అతని చారు. ఇంకెప్పుడూ అలాంటి భావాలకు మనస్సులో చోటీ అతనికి బోధించారు.

Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press by M. Vijayakumar Reddy, L.P.T., Manager. T.T.D. Press, Tirupati.

